# పాతికేళ్ళ ఆంధ్రప్రదేశ్

**(1956 - 1980)**


నిర్వాహక సంపాదకుడు

శ్రీ ఎస్. వెంకటస్వామి, ఎం.ఏ., ఎం.ఎడ్.

పూర్వపు డైరెక్టర్, తెలుగు అకాడమి, హైదరాబాదు

సంపాదకుడు

శ్రీ తాళ్లూరు నాగేశ్వరరావు, ఎం.కాం., ఎల్.ఎల్.బి.

హెడ్, పబ్లికేషన్స్ తెలుగు అకాడమి, హైదరాబాదు





తెలుగు అకాడమి

హైదరాబాదు

1981

paathikella aandhra pradeesh, 1956-80 (Twentyfive Years of Andhra Pradesh, 1956-80) Managing Editor : Sri N. Venkataswamy, Editor · Sri Talluri Nageswara Rao; First Edition 1981; pp 16 + 724.



First Edition 1981
Copies ; 10,000



**Price : Rs. 28-25**

---

*Printed in India*
Text at Jyothi Press, Mushirabad, Hyderabad-500 380
Cover at Anupama Printers, Hyderabad,
Andhra Pradesh

# భూమిక

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నవంబరు 1, 1956 న అప్పటి భారత దేశపు ప్రధానమంత్రి పండిత జవహర్ లాల్ నెహ్రూ ప్రారంభోత్సవంతో ఏర్పడింది. 1980 నవంబరు 1 నుంచి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ రజతోత్సవ కార్యక్రమాలు ప్రారంభమై 25 రోజులపాటు 25 దినోత్సవాలుగా ప్రజలు, ప్రభుత్వం అధికోత్సాహంతో జరుపుకోవడం జరిగింది. ఈ 25 రోజుల ఉత్సవాలలో విద్య; కార్మిక; బలహీనవర్గాల; జాతీయ సమైక్యతా మత సామరస్య; విద్యుచ్ఛక్తి; రవాణా; చలనచిత్ర; సాంఘిక అసమానతల నిర్మూలన; కుటుంబ సంక్షేమ; బాలల; సహకార; స్థానికసంస్థల; మహిళల; లలితకళల; వినియోగదార్ల; రైతుల మొదలైన దినోత్సవాలు ముఖ్యమైనవి. గత 24 సంవత్సరాలను ప్రగతిపథంలో పూర్తిచేసుకొని రజతోత్సవ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ అడుగుపెడుతున్న ఈ చారిత్రాత్మక శుభసమయంలో తెలుగు అకాడమి " పాతికేళ్ళ ఆంధ్రప్రదేశ్ " అనే గ్రంథాన్ని తెలుగునాడుకు రజతోత్సవ కానుకగా అందిస్తున్నది.

తెలుగుభాషను అభివృద్ధిపరచడానికి, ఆధునికీకృతం చేయడానికి, సుసంపన్నం చేయడానికి, పాలనాసౌలభ్యంకోసం తెలుగును అధికారభాషగా ప్రవేశపెట్టే యజ్ఞంలో ప్రభుత్వానికి సహకరించడానికి; ఉన్నత విద్యలో తెలుగును బోధనామాధ్యంగా విజయవంతం చేయడానికి అవిరళ కృషితో పాటుబడుతున్న తెలుగు అకాడమి తన సామాజిక బాధ్యతను గుర్తించి, ఈ గ్రంథాన్ని మూడు మాసాలకాలంలో వ్రాయించి ప్రచురించిందని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం. ఈ గ్రంథరచనకు, ప్రచురణకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రజతోత్సవాల సంఘంవారు మాకు సముచితమైన సూచనలను, సలహాలను ఇచ్చారు. వాటి ప్రాతిపదికగా తెలుగు అకాడమి ప్రచురణశాఖ సిబ్బంది సమధికోత్సాహంతో ఈ పుస్తకానికి రచన, సంకలనం చేసింది.

ఆంధ్రప్రదేశ్ అవతరణ నుంచి ఈనాటివరకు రాష్ట్రంలో జరిగిన అనేక రంగాల అభివృద్ధి దశలకు ఈ గ్రంథం అద్దంలాంటిదని చదువరులు గ్రహించగలరు. ఈగ్రంథంలో ఆంధ్రప్రదేశ్ నైసర్గికస్వరూపంనుంచి అవతరణకుముందు ఆ తరవాతి చరిత్రను; సంస్కృతి, భాష, సాహిత్యం, కళలు; వ్యవసాయం;

వనరులు; విద్యుచ్ఛక్తి; పరిశ్రమలు; విద్య; రాష్ట్రప్రణాళికలు-ప్రగతి; రవాణా కమ్యూనికేషన్లు; సాంఘికసంక్షేమం; కార్మికులు; ఉపాధికల్పన; వర్తక, వాణిజ్య, వ్యాపారాలు; సినిమాలు మొదలైన రంగాలలో 1956 నుంచి నేటి వరకు జరిగిన ప్రగతిని, సాధించిన విజయాలను వివిధ అధ్యాయాల ద్వారా ప్రస్తావించాం. ప్రధానమంత్రి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని ఇనుమడించిన ఉత్సాహంతో అమలు జరపడానికి, ఆంధ్రప్రదేశ్ సర్వతోముఖాభివృద్ధి చెందడానికి మన ప్రస్తుతప్రభుత్వం తీసుకొన్నచర్యలను, బలహీనవర్గాల, వెనకబడిన తరగతుల ఆర్థికాభ్యున్నతికి చేసిన కృషిని పేర్కొన్నాం. అప్పటి ఆంధ్రప్రదేశ్‌కూ, ఇప్పటి ఆంధ్రప్రదేశ్‌కూ గల వ్యత్యాస స్వరూపాన్ని సత్యాలు, సంఖ్యలద్వారా పాఠకుల ముందు ఉంచడానికి సర్వవిధాలా ప్రయత్నించాం.

దాదాపు ఆరుకోట్లజనాభాగల, 2.8 లక్షల చదరపు కి.మీ. విస్తీర్ణంగల ఆంధ్రప్రదేశ్‌ను గురించిన సమగ్రమైన సమాచారాన్ని, ప్రగతి కార్యకలాపాల తీరుతెన్నుల్ని తెలియజేయడంలో ఈ గ్రంథం ఎంతో ఉపయోగ పడగలదని భావిస్తున్నాం. ఆ ఉద్దేశంతోనే అన్నితరహాల చదువరుల అభిరుచుల మేరకు ఆంధ్రప్రదేశ్ ప్రగతిని, ప్రస్తుత పరిస్థితిని గురించి స్థూలంగా, సూక్ష్మంగా, సవిస్తరంగా వివరించడానికి కృషిచేశాం. ఏ జిల్లాగురించి ఆ జిల్లావారికి తెలియజేయడానికి జిల్లాల సమాచారాన్ని కూడా పొందుపరచాం. ఆంధ్రప్రదేశ్ వికాసానికి తోడ్పడిన, తోడ్పడుతున్న ఎందరో ప్రముఖవ్యక్తుల సంగ్రహ లేఖినీ చిత్రాలనుకూడా అకారాదిక్రమంలో ఇచ్చాం. ఇది ఆంధ్రప్రదేశ్ ను గురించి తెల్సుకోదలచిన విద్యావంతులకూ, విద్యార్థులకూ, పోటీ పరీక్షలు వ్రాసే అభ్యర్థులకూ, కళాశాలలకూ, గ్రంథాలయాలకూ, స్థానికసంస్థలకూ, పారిశ్రామిక,వాణిజ్య సంస్థలకూ, ప్రభుత్వ,ప్రభుత్వేతర సంస్థలకూ, ఇతరత్రా పాఠకులకూ ఎన్నో విధాలుగా సమగ్ర సమాచార సంప్రదింపు గ్రంథంగా తోడ్పడగలదని విశ్వసిస్తున్నాం. ముందు ముందు ఈ గ్రంథాన్ని తాజా సమాచారంతో సవరించి, 'ఆంధ్రప్రదేశ్ సమాచారదర్శిని' గా నియతికాలికంగా వెలువరించాలని తెలుగుఅకాడమి సంకల్పం. మనం, మనప్రజలు,మనరాష్ట్రం, మన ప్రగతి కార్యకలాపాలను గురించి ఎప్పటికప్పుడు తెల్సుకోవాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

ఈ గ్రంథ రచన ప్రారంభానికీ, పూర్తిచేయడానికీ గల కాలవ్యవధి మూడు మాసాలే కావడంవల్ల - రచనలో, సంకలనంలో, సమాచార సమర్పణలో, అచ్చులో ఏవైన పొరపాట్లు దొర్లి ఉండవచ్చు. అందుకు మన్నించ

మని పాఠకుల్ని కోరుతున్నాం. ఈ గ్రంథాన్ని మెరుగుపర్చడానికి, మరింత సమగ్రం చేయడానికి సహృదయులైన పాఠకులు సలహాలు, సూచనలు ఇస్తే మలి ముద్రణలో వాటిని చేర్చగలం. ఈ గ్రంథ రచనలో ఎన్నో గ్రంథాలను, ప్రభుత్వ ప్రభుత్వేతర సంస్థల వార్షిక నివేదికలను సంప్రదించాం. ఆ గ్రంథ కర్తలకు, మాకు సమాచారాన్ని సప్లయ్ చేసిన అధికార, అనధికారపెద్దలకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

ఈ గ్రంథ రచన ఆశయానికి అక్షరరూపకల్పనచేసి, ఈగ్రంథం వెలుగు చూడటానికి అన్నివిధాలా తోడ్పడిన శ్రీ ఎన్. వెంకటస్వామి, సెక్రటరీ, బోర్డ్ ఆఫ్ ఇంటర్ మీడియట్ ఎడ్యుకేషన్ ( పూర్వపు తెలుగు అకాడమి డైరెక్టర్ ) గారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు.

హైదరాబాదు
22-1-1981

—— జి.మనోహర రావు
డైరెక్టర్, తెలుగు అకాడమి

——తాళ్లూరు నాగేశ్వరరావు
హెడ్ పబ్లికేషన్స్, తెలుగు అకాడమి



*Rashtrapathi Bhavan, New Delhi, India*

September 28, 1980

I am glad to know that the Telugu Academy is bringing out a special publication entitled "25 years of Andhra Pradesh" to mark the Silver Jubilee Celebrations of the State.

Andhra Pradesh occupies a significant place in India with its distinct character in economic, social and cultural fields. The State has made considerable progress over the last 25 years and strengthened the base of its economy. A number of projects like Nagarjuna Sagar, Sri Sailam, Pochampadu, Tungabhadra High Level Canal, Upper Sileru and Lower Sileru were taken up. Road bridges on all rivers were constructed. Though completed earlier, the Prakasam Barrage on river Krishna stands as a shining example of the State's endeavours.

Andhra Pradesh has still to develop further industrially which is essential for increasing employment opportunities. There are bright prospects for this. The State is richly endowed with natural resources. Coal, for example, can contribute towards increase in power generation, which in turn would provide the thrust for industrial growth.

I am confident that Andhra Pradesh will make alround progress in the years to come and contribute to the progress and prosperity of the nation.

N. SANJEEVA REDDY



VICE PRESIDENT
INDIA
NEW DELHI

September 16, 1980

I am glad to learn that on the completion of 25th year of the existence of Andhra Pradesh, the Telugu Akademi ( A. P. State Institute of Telugu ) is bringing out an authentic publication entitled "Twenty Five Years of Andhra Pradesh" which wil contain the facts and figures of Andhra Pradesh development in all aspects. I wish the publication all success.

M. Hidayatullah



Information Advisor
to the
Prime Minister

PRIME MINISTER'S OFFICE
New Delhi-110011.

11th September, 1980

*Dear Sir,*

The Prime Minister is glad to know that the Telugu Akademi is bringing out a publication to make the silver jubilee of the formation of Andhra Pradesh and sends her good wishes for the volume.

*Yours faithfully,*
H. Y. Sharada Prasad




**RAJ BHAVAN**
HYDERABAD-500041

9th October'80

The Post– Independent era has given birth to many linguistic States, of which Andhra Pradesh is one that has woven for itself the pride of place in the beautiful tapestry of this country. Almost starting from scratch, in a matter of just a quarter century, Andhra Pradesh, the fifth most populour State in India, known for its glorious past and potential, with its rich traditions and culture has emerged as a prosperous State.

2. Often lauded as the River State of India, this agriculturally pre–eminent land of Telugu people with rich soils, irrigated by the sacred waters of Krishna and Godavari and other perennial rivers, continues to retain its status as 'Annapurna'. On the industrial scenario, the State has blazed a new trial with many a heavy, medium and large–scale industry and has come to stay as an industrial hub of activity. The development of the backward areas, amelioration of the conditions of weaker sections, rural and cottage industries, rural electrification, communications and transport are a few of the many gigantic strides made by the State in recent years on the socio–cultural front, not to speak of the socio–cultural advancements including the expansion of educational infrastructure.

3. It is rather difficult to outline the accomplishments in a few words, but the fact remains that Andhra Pradesh has proved its mettle in many ways in contributing to the total progress and welfare of the nation and with its rich human and material resources it will endeavour to do so in future. In the history of a nation, the part played by the people of different States, no doubt has a great significance and relevance to the progress of the nation; nevertheless, it is the continued enthusiasm, co operation and sustained effort of the people and people alone that can put the State on a firm footing by consolidating the gains of a new economic order.

4. At this auspicious moment it is the bounden duty of all the Telugu speaking people to rededicate themselves to the cause of the State and the country. On this happy occasion when Andhra Pradesh is heralding the 25th year of its existence, I have great pleasure in extending my cordial greetings to the people and in wishing the State many more pinnacles of success.

K.C. ABRAHAM




# ముఖ్యమంత్రి సందేశం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ రజతోత్సవాల సందర్భంగా తెలుగు అకాడమి "పాతికేళ్ళ ఆంధ్రప్రదేశ్" అనే గ్రంథాన్ని ప్రచురించి తెలుగు ప్రజలకు అందించడం నాకెంతో ఆనందంగా ఉంది. గత పాతికేళ్ళలో ఆంధ్రప్రదేశ్ అన్నిరంగాలలో అభిలషణీయమైన అభివృద్ధిని సాధించింది. వ్యవసాయం, విద్యుచ్ఛక్తి, నీటిపారుదల, పరిశ్రమలు మొదలైన రంగాల్లోనే కాకుండా కార్మికులు, ఉపాధికల్పన, ఆరోగ్యం, నిత్యావసర వస్తువుల పంపిణీ, హరిజన గిరిజన సంక్షేమం మొదలైన వాటిలో కూడా గణనీయమైన ప్రగతిని పొందింది. అయితే ఇంకా మనం సాధించాల్సిన అభివృద్ధి ఎంతో ఉంది. మన ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని, అమరజీవి సంజయ్‌గాంధి అయిదు సూత్రాల ప్రణాళికలను అక్షరశః ఆచరణలో పెట్టినప్పుడే, బలహీనవర్గాల, వెనకబడినజాతుల ఆర్థికాభ్యున్నతిని ప్రత్యక్షంగా సాధించినప్పుడే ఆంధ్రప్రదేశ్ సర్వతోముఖాభివృద్ధిని పొంది భారతదేశంలో అగ్రస్థానం వహించగలదని నా దృఢ విశ్వాసం. అందుకు తెలుగునాడు అండగా ఉండగలదని ఆశిస్తున్నాను.

టి. అంజయ్య



MINISTER OF
EDUCATION & SOCIAL WELFARE
Government of India
New Delhi-110001

# M E S S A G E

I am glad to know that the Telugu Akademi is bringing out a special publication entitled 'Twenty Five Years of Andhra Pradesh' to celebrate the Silver Jubilee of the formation of the State of Andhra Pradesh. I am sure the achievements of the State during the last 25 years will inspire the people of Andhra Pradesh to re-dedicate themselves to march forward to raise the quality of life.

I wish every success to the celebrations.

S. B. Chavan



# విద్యామంత్రి సందేశం

రాష్ట్ర భాషాసంస్థ అయిన తెలుగు అకాడమి రాష్ట్రం రజతోత్సవాలను జరుపుకుంటూన్న ఈ శుభసమయంలో "పాతికేళ్ళ ఆంధ్రప్రదేశ్" గ్రంథాన్ని వెలువరించడం ఎంతో సముచితంగా ఉంది. ఆంధ్రప్రదేశ్ అడుగుజాడల్లో అభివృద్ధి సాధిస్తున్న అకాడమి ఇట్లాంటి సామాజిక బాధ్యతగల ప్రాజెక్టులను, పథకాలను చేపట్టి, సకాలంలో నిర్వహించటం నాకు సంతోషంగా ఉంది. ఈ గ్రంథంలో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన దగ్గర్నుంచీ ఇప్పటిదాకా ఏ యే రంగాల్లో ఎంతెంత ప్రగతిని సాధించింది, 1956 నాటి ఆంధ్రప్రదేశ్‌కూ, 1980 నాటి ఆంధ్రప్రదేశ్‌కూ ఏమాత్రం వ్యత్యాసమున్నదీ, దేశకాల పాత్రోచితంగా ఏ యే మార్పులు వచ్చిందీ సత్యాలూ, సంఖ్యలతో సవిస్తరంగా తెలియజేయడమైంది. మనం, మనరాష్ట్రం, మనప్రజలు, మన ప్రణాళికలు, మనప్రగతి, మనభవిష్యత్తు - గ్రహించడానికి ఈ గ్రంథం ముంజేతి కంకణం వంటిదని భావిస్తున్నాను. గత పాతికేళ్ళలో మనం సాధించింది అంతస్వల్పం కాదు. రానున్న కాలంలో మనంసాధించాల్సింది ఎంతోఎక్కువగాఉంది. గమ్యం ఎంతదూరమైనా చిత్తశుద్ధితో, అకుంఠితదీక్షతో సమష్టిగా కృషి చేస్తే, ఆ గమ్యానికి సత్వరంగా సన్నిహితమవుతాం. ఆంధ్రప్రదేశ్‌ను అన్నిరంగాల్లో అగ్రశ్రేణిగా తీర్చిదిద్దుకోవాల్సిన కర్తవ్యం మనందరిపైనా ఉంది.

శవనం వెంకటరామ్



Dy. MINISTER OF LABOUR
INDIA
NEW DELHI-110001

27-10-1980

# సందేశము

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి 25 సంవత్సరము లవుతున్న శుభ సమయమున ప్రభుత్వ తెలుగు సంస్థ 'తెలుగు అకాడమి' వారు "పాతికేళ్ళ ఆంధ్రప్రదేశ్" అనే గ్రంథ ప్రచురణ చేయుట చాల సంతోషకరమైన విషయము.

ఆంధ్రప్రదేశ్ అవతరణ దేశంలో నూతనోధ్యాయం వెలువరించుటయేగాక ఆంధ్రప్రదేశ ప్రజలకు ఆత్మ గౌరవము పెంపొందించినది. గడచిన 25 సంవత్సరములలో ఆంధ్రప్రదేశ్ వివిధ రంగాలలో చెప్పుకోదగ్గ ప్రగతి సాధించింది. మున్ముందుగూడ ప్రజల సహాకారముతో మరింత అభివృద్ధి సాధించగలదని ఆశిస్తున్నాను. ఈ శుభ సందర్భములో నలువాడల సాధించిన ప్రగతి ప్రచారము చేయ అవసరమున్నది. ఈ "పాతికేళ్ళ ఆంధ్రప్రదేశ్" అనే గ్రంథం భావి ప్రజలకు మార్గదర్శిగా ఉపయోగపడగలదని ఆశిస్తున్నాను.

భావి చరిత్రలో ప్రజలు సుఖశాంతులతో వెలుగొందెదరని నా ఆకాంక్ష.

పులి వెంకటరెడ్డి

## రచన-సంకలనం

**శ్రీ తాళ్లూరు నాగేశ్వరరావు,** ఎం.కాం.,ఎల్ఎల్.బి.
హెడ్, పబ్లికేషన్స్, తెలుగు అకాడమి
(అధ్యాయాలు 3, 10, 13, 17, 22, 24, 25, 37, 38)

**డా. ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి,** ఎం.ఎస్‌సి.,డి.ఎస్‌సి.
రిసెర్చ్ ఆఫీసర్, తెలుగు అకాడమి
(అధ్యాయాలు 15, 16, 20, 23)

**డా. ఏ. ఆర్. కె. మూర్తి,** ఎం.ఎ.,పిహెచ్.డి.
రిసెర్చ్ ఆఫీసర్, తెలుగు అకాడమి
(అధ్యాయాలు 19 26, 33, 34)

**శ్రీ ఎన్. మధుసూదన్ రెడ్డి,** ఎం.ఏ.,ఎం.ఎడ్.
రిసెర్చ్ ఆఫీసర్, తెలుగు అకాడమి
(అధ్యాయాలు 14, 18, 21, 28, 36)

**శ్రీ వి. శంకరలాల్,** ఎం.ఏ.,ఎల్ఎల్.బి.
రిసెర్చ్ అసిస్టెంట్, తెలుగు అకాడమి
(అధ్యాయాలు 8, 9, 11, 12)

**శ్రీ ఎన్. కె. శాస్త్రి** ఎం.ఏ.
రిసెర్చ్ అసిస్టెంట్, తెలుగు అకాడమి
(అధ్యాయాలు 32, 36)

**శ్రీమతి ఏ. మంజులత,** ఎం.ఏ.,ఎం.ఫిల్.
రిసెర్చ్ అసిస్టెంట్, తెలుగు అకాడమి
(అధ్యాయాలు 4, 5, 6, 7, 27, 29, 30, 31, 36, 38)

**శ్రీ వి. రామకృష్ణారెడ్డి,** ఎం.ఏ., ఎల్ఎల్.బి., బి.ఎల్.ఎస్‌సి.
రిసెర్చ్ అసిస్టెంట్, తెలుగు అకాడమి
(అధ్యాయాలు 1, 2)

**శ్రీ డి. వి నారాయణరావు,** ఎం.ఏ.,బి.ఎడ్.,ఎల్.ఎల్.బి,
రిసెర్చ్ అసిస్టెంట్, తెలుగు అకాడమి
(అధ్యాయం 35)

**శ్రీమతి కె. జ్యోతిర్మయి,** ఎం.ఏ.,ఎం.ఫిల్.
పబ్లికేషన్ అసిస్టెంట్, తెలుగు అకాడమి
(అధ్యాయం 7)

# విషయసూచిక

# 1

# ఆంధ్రప్రదేశ్ - నైసర్గిక స్వరూపం

ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రం భారతదేశంలో ఆగ్నేయంగా 12°14' - 19°54' ఉత్తర అక్షాంశాల మధ్య, 76 50' 84°50' తులాంశాల మధ్య విస్తరించి ఉంది. దేశంమొత్తంలో ఈ రాష్ట్రం విస్తీర్ణంలోను, జనాభాలోను ఐదోస్థానం ఆక్రమించి ఉంది. భారతదేశ విస్తీర్ణం 32,87,782 చ. కి. మీ. ( 1971 ). ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం 2,76,914 చ. కి. మీ. మధ్యప్రదేశ్, రాజస్థాన్, మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్‌ల తర్వాత ఇదే పెద్ద రాష్ట్రం. జనాభా 4,35,02,708 (1971). ఉత్తరప్రదేశ్, బీహార్, మహారాష్ట్ర, పశ్చిమబెంగాల్ తర్వాత జనాభాలో పెద్దది. ఈ రాష్ట్రానికి తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన తమిళనాడు, పశ్చిమాన కర్నాటకరాష్ట్రం, ఉత్తరాన మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా సరిహద్దు రాష్ట్రాలుగా ఉన్నాయి. ఇక్కడ సగటు జనాభా సాంద్రత చ. కి. మీ. కు 157. మొత్తం 23 జిల్లాలు ఉన్నాయి.

### భూమిస్వరూపం

ఆంధ్రప్రదేశ్ ప్రాంతం దక్కన్ పీఠభూమికి సంబంధించిన భాగం కావడంవల్ల ముఖ్యంగా అతి ప్రాచీన ధార్వార్ వ్యవస్థకు చెందిన నైసెస్ (gneisses), గ్రానైట్ (granite) శిలల ఆధారంపై మొదట భూమి ఏర్పడింది. దానిపైన కడపవ్యవస్థకు చెందిన 6,100 మీ. మందం గల క్వార్ట్జైట్‌లు (quartzites), సున్నపురాళ్లు (Limestone) ఏర్పడినాయి. ఇవి ముఖ్యంగా కృష్ణా, పెన్నేరు నదుల మధ్య బాగా వ్యాపించినాయి. ఈ శిలలు నల్లమల వెలికొండలలో కొద్దిగా సంక్షోభాలకు గురైనాయి. ఈ శిలల పైన వింధ్య వ్యవస్థకు చెందిన శిలలు ఏర్పడినాయి. ఈ కాలంలోనే నల్లమల, వెలికొండలు పైకిరావడం జరిగింది. వాటి తర్వాత గోండ్వానా శిలలు ఏర్పడినాయి. గోండ్వానా శిలలలో ఇసకరాయి (Sandstone) పాలు ఎక్కువయినా షేల్, బంకమన్ను రాళ్ళు కూడా ఉన్నాయి. తర్వాత దక్కన్ లావా ప్రవాహం వల్ల 610-1525 మీ. ల మందంలో లావా శిలలు ఏర్పడినాయి. తూర్పు తీరంలో ఉండే శిలా నిర్మాణం, సముద్ర నిక్షేపాల స్తర అమరికలు తీరపుటంచు పురాజీవయుగం నుంచి ఇప్పుడున్న చోటే ఉంటూ దానికి సమాంతరంగాను, వెనుకగా భూభాగం లోపలవైపు ఉన్నట్లు సూచిస్తున్నాయి.

### సహజమండలాలు

ఆంధ్రప్రదేశ్‌ను మూడు సహజ మండలాలుగా విభజించవచ్చు. 1. పడమటి పీఠభూమి 2. తూర్పుకనుమలు 3. తీరమైదానం.

**పీఠభూమి:** పీఠభూమి ప్రాంతం ప్రధానంగా ఆర్కియన్ నైస్ (Archean gneises) శిలల మీద ఏర్పడింది. ఉత్తరభాగంలో మాత్రం గోదావరి ద్రోణిలో గోండ్వానా శిలలు ఒక మేఖలగా పరిరక్షితమై ఉన్నాయి. ఈ భాగం మాత్రమే ఎత్తులో 150 మీ.లకు తక్కువగా ఉంది. ఆకురాలే అరణ్యాలతో నిండిఉంది. ఈ గోండ్వానా శిలలలోనే ఆంధ్రప్రదేశ్‌లో బొగ్గు దొరుకుతుంది. ఈ ఉత్తరభాగం మినహాయిస్తే పీఠభూమి సగటుఎత్తు 480-600 మీ. మధ్య ఉంటుంది. నైరుతి దిశలో కృష్ణా, తుంగభద్ర నదులమధ్య ఎత్తు 305-455 మీ. మధ్య ఉంది. స్థూలంగా ప్రస్తుత పీఠభూమి నైసర్గిక స్వరూపం కొండలు తరిగిపోయి ఏర్పడిన మైదానం మాదిరిగా ఉందని చెప్పవచ్చు.

ఈ పీఠభూమి వాయుస్థితి కారకాల మూలంగా యుగ యుగాల తరబడి ఘర్షణ, అపఘర్షణ, క్రమ క్షయ చర్యలవల్ల ఏర్పడినదే అయినా అక్కడక్కడ విశాలంగాఉండే పరిపూర్ణమైన లోయలు, రాతిగుట్టలు, గండశిలలు, రాళ్లకుప్పలు కూడా ప్రబలి ఉన్నాయి. హైదరాబాదు నగర పరిసరాల్లో ఇటు వంటి గోళ శిలలు, బండరాళ్లు బాగా గోచరిస్తాయి.

పీఠభూమి ప్రాంతంలో గ్రానైట్, నైస్ శిలల శైథిల్యంతో తయారైన సారవంతం కాని వాలుకామృత్తికలు (Sandy soils) ఎక్కువ భాగంలో ఉన్నాయి. ఇక్కడ వర్షపాతం 63-100 సె. మీ. ఉష్ణోగ్రత 35° సె. గ్రేడ్. ఈ సహజ కారణాలవల్ల పీఠభూమిపై జీవనం కఠినంగా ఉంటుంది. అరుదుగా కనబడే సారవంతమైన ద్రోణులు, చెరువులు ఉన్న ప్రదేశాలలో మంచిజీవనం, అభివృద్ధి కనబడుతుంది.

స్థూలంగా పీఠభూమి ప్రాంతపు దృశ్యం చెట్లు చేమలు లేని గుట్టలు చెదురు మదురుగా కనిపించే పొదలతోను, ముండ్లతోను, సంవత్సరంలో ఎక్కువకాలం పాయలుగా పారే నదులతోను లోయలకు అడ్డంగా నిర్మించుకొన్న చెరువులతోను, జనాకీర్ణంకాని చెదురుమదురు పల్లెలతోను గోచరిస్తుంది. దక్షిణంగాఉన్న పీఠభూమి ప్రాంతంలో ఇంతకంటే దృశ్యం అధ్వాన్నంగా ఉంటుంది.

ఉత్తరదిశలో ఉన్న ఆకురాల్చే అడవులను మినహాయిస్తే పీఠభూమి ప్రాంతపు వృక్షజాలం నాసిరకపు సవన్నారకానికి చెందినది. దక్షిణానికి పోయేకొద్దీ దూర దూరంగా అక్కడక్కడా తుమ్మచెట్లు కొన్ని కనిపిస్తాయి. బోడిగాఉన్న గుట్టలు, సానువులలో ముండ్లపొదలు, తడిలభించే నిమ్నప్రదేశాలలో పెరిగే ఈత, తాటిచెట్లు మేకలు, గొర్రెలు నాశనంచేయగా మిగిలిపోయి నిలబడిఉన్న చిన్న పొదలు కంటికి కనబడే దృశ్యాలు.

**తూర్పు కనుమలు :** తూర్పు కనుమలు పీఠభూమి తూర్పు సరిహద్దులో ఉన్నాయి. ఇవి పశ్చిమ కనుమలవలె అవిచ్ఛిన్నంగాలేవు. అందువల్ల తూర్పు కనుమలను తూర్పుకొండలంటే బాగుంటుంది. అదిగాక ఈ కొండలన్నీ స్థలాకృతిలోగాని, నిర్మాణంలోగాని ఒకే మాదిరిగా లేవు. ఉత్తరంగా ఉన్న కొండలు భారీగాను, ఎత్తుగాను ఉంటూ బాగా ఛేదితమై ఉన్నాయి. గోదావరి లోయలతో ఖండింపబడికూడా ఉన్నాయి. కృష్ణా నదికి దక్షిణంగా ఉన్న నలమల వెలికొండలు, పాలకొండలు, శేషాచలం, ఎర్రమల కొండలు అవశిష్ట పర్వతాలుగా ఉన్నాయి.

అందువల్ల ఉత్తరంలో ఉన్న తూర్పు కనుమలను ''తూర్పు శ్రేణుల''ని, దక్షిణంగా ఉన్న వాటిని "కడపశ్రేణుల''ని పిలవడం సమంజసంగా ఉంటుంది.

***తూర్పు శ్రేణులు :*** వీటి సగటు ఎత్తు 1066 మీ. వీటిలో ఒకశాఖ శ్రీకాకుళం జిల్లాలో అనంతగిరి నుంచి పాతపట్నంతాలూకా ద్వారా గూడెంవరకు పోతుంది. ఈ శ్రేణి కొండలలో అత్యంత ఎత్తైన మహేంద్రగిరి ఎత్తు 1524 మీ. పాలకొండలు, గోలకొండలు ఎత్తులో 1200 మీ. ఉన్నవి. విశాఖపట్నం వద్ద సముద్రంలోకి చొచ్చుకొని వచ్చిన''డాల్ఫిన్స్‌నోస్'' అనే కొండ ఎత్తు 335 మీ. విశాఖపట్టణం ఉత్తరం కైలసకొండ, దక్షిణం యరాడకొండల మధ్యఉంది. ఉభయ గోదావరి జిల్లాలలో ఉన్న పాపికొండలు, దూమకొండల ఎత్తు 914 మీ. గోదావరినది పాపికొండల మధ్య అత్యంత సన్నని లోయలో ప్రవహిస్తుంది.

***కడప శ్రేణులు:*** కృష్ణా, పెన్నేరులు వాటి ఉపనదులు ఈ శ్రేణులకు అడ్డంగా ప్రవహిస్తున్నాయి. కడప శ్రేణులు రెండువరసలుగా నంద్యాలలోయకు ఇరువైపులా పోతున్నాయి. తూర్పువైపు నల్లమల కొండలు, వెలికొండలున్నాయి. వెలికొండలు తూర్పుతీరం వెంబడి పోతాయి. పశ్చిమాన ఎర్రమలకొండలు, శేషాచలం కొండలున్నాయి. శేషాచలం కొండలకు దక్షిణంగా పాలకొండలు వ్యాపించి రేణిగుంటకు సమీపాన పాలకొండలను కలుసుకొంటాయి.

వెలికొండలు సువర్ణముఖీనదీ లోయనుంచి ఉత్తర దిశగా నెల్లూరు, ప్రకాశంజిల్లా, గుంటూరు జిల్లాల ద్వారా వ్యాపించి తీరాన్ననుసరించి ఉన్నాయి. ఈకొండలమధ్య నిడుపాటి లోయలు చక్కగా ఏర్పడి ఉన్నాయి. వీటికి అడ్డంగా పెన్నేరు, చెయ్యేరు, గుండ్లకమ్మ, మన్నేరు నదులు ప్రవహించి సముద్రాన్ని చేరుతున్నాయి.

నల్లమలకొండలు వెలికొండలకు పశ్చిమంగా ఆనుకొనిఉన్నాయి. ఇవి కడప, నెల్లూరు; సరిహద్దులనుండి పెన్నానదికి ఉత్తరంగా కర్నూలు జిల్లాలో వ్యాపించి కృష్ణానదిని దాటి మహబూబ్‌నగరు జిల్లాలోని అమరాబాద్ కొండలలో కలిసిపోతున్నాయి. నల్లమలకొండలలో మంచి అడవులున్నాయి.

పాలకొండలు కడప దగ్గరనుంచి దక్షిణంగా బొంబాయి-మద్రాసు రైలుమార్గానికి పశ్చిమంగా వ్యాపించి తిరుపతి కొండలద్వారా మదనపల్లి దగ్గర ఉన్న హార్సలీకొండల వరకు విస్తరించి ఉన్నాయి.

శేషాచలం కొండలు కడపకు పశ్చిమంనుంచి ఉత్తరంగావ్యాపించి ఎర్రమలకొండలలో కలిసిపోతున్నాయి. నల్లమలకొండలు, శేషాచల ఎర్రమలకొండలమధ్య నంద్యాల లోయఉంది.

***తీర మైదానం:*** తీరమైదానం తూర్పుకనుమల నుంచి బంగాళాఖాతం వరకు వ్యాపించి ఉంది. దీని ఎత్తు 5 మీ. నుంచి 50 మీ. మాత్రమే ఉంది. ఇది పూర్తిగా నదులు తెచ్చిన ఒండ్రువల్ల ఏర్పడింది. ఇది ఉత్తరాన మహేంద్రగిరి నుంచి దక్షిణాన పులికాట్ సరస్సు వరకు దాదాపు 950 కి. మీ. పొడవున వ్యాపించింది. ఉత్తరాన మహేంద్రగిరి వద్ద 19 కి. మీ. వెడల్పుతో లాంగుల్య, వంశధార నదుల మైదానాలతో ప్రారంభమై మధ్య భాగంలో గోదావరి, కృష్ణా నదుల డెల్టాల ప్రాంతంలో 160 కి. మీ. కు పెరిగి దక్షిణంగా

పోను పోను సన్నమై నెల్లూరుకు దక్షిణంగా 22.5 కి. మీ. కు తగ్గి పులికాట్ సరస్సుదగ్గర ఆగిపోతుంది. గోదావరి డెల్టా ధవళేశ్వరం వద్ద ప్రారంభమై 70 కి. మీ. దూరం సముద్ర తీరంవరకు ఉంది. గౌతమి, వశిష్ట, వైనతేయ పాయలుగా చీలి గోదావరినది డెల్టాను విస్తరింప చేస్తూ ఉంది.

కృష్ణాడెల్టా విజయవాడ దగ్గర ప్రారంభమై సముద్రతీరం వరకు 70 కి. మీ. వ్యాపిస్తుంది. మంచి వరదల్లో ఉన్నపుడు కృష్ణానది ఒక రోజులో 13 చ. మీ. వైశాల్యంలో 30 సెం. మీ. లోతును నింపే ఒండలిని తీసుకొస్తుందని అంచనా.

గోదావరి, కృష్ణానదుల మధ్య ఉన్న పల్లంలో కొల్లేరు సరస్సు ఆక్రమించింది. దీని వైశాల్యం దాదాపు 260 చ. కి. మీ. ఇక్కడ ఒండలి వచ్చిపడడంవల్ల రానురాను విస్తీర్ణం తగ్గి సరస్సు ఎండిపోయి మైదానంగా మారవచ్చు. సముద్రతీరం వెంబడి కొన్ని కిలోమీటర్ల వరకు భూమి చిత్తడి అడవులతోను, ఇసుక దిబ్బలతోను నిండి ఉంది.

# 2

# శీతోష్ణస్థితి

అక్షాంశాల ఉనికిదృష్ట్యా అయనరేఖామండలంలో ఉండటంవల్ల ఆంధ్రప్రదేశ్ అంతటా వేడి శీతోష్ణస్థితి ఉంటుంది. భారతదేశం అంతటా మాదిరే ఇక్కడకూడా శీతోష్ణస్థితి ఋతు పవనాల మీద ఆధారపడి ఉంది. ఇక్కడి శీతోష్ణస్థితిని అయనరేఖా ఋతుపవన శీతోష్ణస్థితి అంటారు. భారత వాతావరణశాస్త్ర శాఖవారు సంవత్సరాన్ని నాలుగు ఋతువుల కింద విభ జించినారు. అవి 1. శీతాకాలం (జనవరి-ఫిబ్రవరి) 2. వేసవికాలం (మార్చి-జూన్) 3. వర్షాకాలం (జూన్-సెప్టెంబర్) 4. ఉత్తర వర్షాకాలం : ఈశాన్య ఋతుపవనాల కాలం, (అక్టోబర్-డిశంబర్). ఈ విభజన ఆంధ్రప్రదేశ్‌కు కూడా వర్తిస్తుంది.

## వేసవికాలం

సాధారణంగా వేసవికాలం మార్చిప్రారంభం నుంచి జూన్ మొదటి వారంవరకు ఉంటుంది. సూర్యుని ఉత్తరగమనాన్ని అనుసరించి ఆంధ్రప్రదేశ్‌లో మార్చి ప్రారంభం నుంచి ఉష్ణోగ్రతలు ఎక్కువవుతూవచ్చి మే నెల మూడోవారానికి పరాకాష్ఠనందుకొంటాయి. మే నెలలో అత్యధిక ఉష్ణోగ్రతలు ఆంధ్రప్రదేశ్ అంతటా ఉంటాయి. ఇక్కడ అత్యధిక సగటు ఉష్ణోగ్రత 31.5° సె. గ్రే. (88.7° ఫా), అత్యల్ప సగటు ఉష్ణోగ్రత 22° సె. గ్రే. (71.6° ఫా). సగటు ఉష్ణోగ్రత 27.1° సె. గ్రే. (80.8° ఫా) సగటు అత్య ధిక ఉష్ణోగ్రత రామగుండంలో 34.5° సె. గ్రే (94.1° ఫా). ఒక్కొక్కప్పుడు ఇక్కడ 44°-45° సె. గ్రే వరకు ఉష్ణోగ్రత పెరుగుతుంది. నిజామాబాద్, ఖమ్మం, రెంటచింతల, విజయవాడ, కడప, కర్నూలు ప్రాంతాలలో కూడా ఈ కాలం పగటి ఉష్ణోగ్రత 41°-45° సె. గ్రే ల మధ్య ఉంటుంది. మే నెలతో పగటి ఉష్ణోగ్రతలు పై పట్టణాలలో 49° సె.గ్రే (120° ఫా) అప్పుడప్పుడు పెరగడం పరిపాటి.

మైసూరు పీఠభూమికి ఆనుకొని ఉన్న చిత్తూరు, అనంతపురం జిల్లాలు ఆంధ్రప్రదేశ్ లోని ఇతర ప్రాంతాల కంటె చల్లగా ఉంటాయి. హైదరాబాదు నగరం ఎత్తులో ఉండడం వల్ల దాని వేసవి వాతావరణం సదృశంగా చల్లగా ఉంటుంది. విశాఖపట్టణం, కాకినాడ, మచిలీ పట్నాల పగటి ఉష్ణోగ్రతలు వేసవిలో 33.3 సె.గ్రే (92° ఫా) నుంచి 37.8° సె.గ్రే వరకు సముద్ర ప్రభావంవల్ల తక్కువగా ఉంటాయి. కోస్తా ప్రాంతాలకు, పీఠభూమి ప్రాంతా లకు శీతోష్ణస్థితిలో వ్యత్యాసముంది. రాయలసీమ, తెలంగాణాలలో పగటిపూట అతివేడిగా

ఉన్నా రాత్రిళ్లు చల్లగా ఉంటుంది. రాత్రింబవళ్ల ఉష్ణోగ్రతల తేడా ఇక్కడ హెచ్చుగా ఉంటుంది. తీరప్రాంతాలలో సముద్ర ప్రభావంవల్ల రాత్రింబవళ్ల ఉష్ణోగ్రతల వ్యత్యాసం తక్కువగా ఉంటుంది.

**వార్షిక సగటు ఉష్ణోగ్రత**




వేసవికాలంలో వర్షాలు అంతగా లేకపోయినా అప్పుడప్పుడూ వాయు సంవహనం వల్ల కొద్దిపాటి వర్షం పడుతుంది. అప్పుడప్పుడు బంగాళాఖాతంలో ఏర్పడే చక్రవాతాలవల్ల తీర ప్రాంతాలలో అధిక వర్షం పడుతుంది. ఉదా 1969 మే, 1971 ఏప్రిలో 1979 మే నేలలో పడిన భారీ వర్షాలు.

**కొన్ని కేంద్రాల అత్యధిక, అత్యల్ప ఉష్ణోగ్రతలు (సెం.గ్రే. డిగ్రీలలో)**

| కేంద్రం | 1977 | | 1978 | |
|---|---|---|---|---|
| | అత్యధిక ఉష్ణోగ్రత | అత్యల్ప ఉష్ణోగ్రత | అత్యధిక ఉష్ణోగ్రత | అత్యల్ప ఉష్ణోగ్రత |
| 1 అనంతపూర్ | 40.9 | 13.2 | 39.0 | 18.0 |
| 2 ఆరోగ్యవరం | 37.6 | 12.3 | 36.0 | 15.8 |

| 1 | 3 | | 3 | |
|---|---|---|---|---|
| 3 భద్రాచలం | 43.4 | 10.8 | 45.7 | 16.5 |
| 4 కళింగపట్టణం | 38.1 | 14.3 | 36.2 | 17.9 |
| 5 కడప | 42.6 | 15.2 | 40.5 | 19.6 |
| 6 గన్నవరం | 44.2 | 15.2 | 41.2 | 19.2 |
| 7 హనుమకొండ | 43.6 | 11.6 | 41.8 | 17.4 |
| 8 హైద్రాబాదు | 40.7 | 10.9 | 39.9 | 16.5 |
| 9 కాకినాడ | 42.1 | 16.5 | 40.2 | 20.0 |
| 10 ఖమ్మం | 46.0 | 13.4 | 42.1 | 19.0 |
| 11 కర్నూలు | 42.7 | 9.6 | 39.0 | 18.4 |
| 12 మచిలీపట్నం | 43.3 | 14.2 | 38.5 | 20.5 |
| 13 మహబూబ్‌నగర్ | 42.1 | 12.9 | 39.2 | 17.5 |
| 14 నంద్యాల | 43.4 | 11.8 | 40.6 | 18.5 |
| 15 నెల్లూరు | 43.2 | 17.5 | 40.1 | 20.4 |
| 16 నిడదవోలు | 42.6 | 15.0 | 40.4 | 18.7 |
| 17 నిజామాబాదు | 43.6 | 9.4 | 43.0 | 15.1 |
| 18 ఒంగోలు | 44.4 | 17.6 | 40.1 | 20.4 |
| 19 రామగుండం | 44.8 | 8.8 | 43.8 | 15.3 |
| 20 రెంటచింతల | 44.5 | 13.2 | 41.8 | 18.9 |
| 21 తిరుపతి | లేదు | లేదు | 38.9 | 19.1 |
| 22 విశాఖపట్టణం | 37.8 | 14.2 | 37.8 | 19.0 |

(మూలం - భారత ప్రభుత్వ వాతావరణ కేంద్రం, హైద్రాబాదు)

## వర్షాకాలం

సాధారణంగా జూన్‌నెల రెండోవారంలో ఆంధ్రప్రదేశ్‌లో నైరుతి ఋతుపవనాల ప్రవేశంతో వర్షాలు ప్రారంభమయి, ఆ నెలాఖరుకు రాష్ట్రమంతటా విస్తరిస్తాయి. నైరుతి ఋతుపవనాలవల్ల ఆంధ్రప్రదేశ్ ఉత్తర ప్రాంతంలో 80 సె. మీ. దక్షిణ ప్రాంతంలో 40 సె. మీ.ల వర్షం పడుతుంది. తెలంగాణాలో తక్కిన ప్రాంతాల కంటె అధిక శాతం వర్షం నైరుతి పవనాలవల్ల పడుతుంది. నైరుతి ఋతుపవనాలవల్ల మొత్తం వర్షంలో 82 శాతం తెలంగాణాలోను, 54 శాతం రాయలసీమలోను. 57 శాతం కోస్తా ప్రాంతంలోను వస్తుంది. కింది పట్టిక వల్ల ఇది విశదమవుతుంది.

## సగటు వర్షపాతం




### సగటు వర్షపాతం సెం. మీలలో

| | ప్రాంతం | మార్చి-మే<br>వేసవికాలం | జూన్-సెప్టెంబర్<br>వర్షాకాలం | అక్టోబరు-డిశంబరు<br>ఈశాన్యఋతు పవనకాలం | జనవరి-ఫిబ్రవరి<br>శీతాకాలం | సంవత్సరంలో మొత్తంవర్షం |
|---|---|---|---|---|---|---|
| 1 | తెలంగాణా | 5 సెం.మీ. | 75 సెం.మీ. | 8 సెం. మీ. | 3 సె. మీ. | 91 సెం. మీ. |
| 2 | రాయలసీమ | 8 ” | 37 ” | 21 ” | 2 ” | 68 ” |
| 3 | కోస్తాప్రాంతం | 8 ” | 57 ” | 33 ” | 2 ” | 100 ” |

( మూలం : భారత వాతావరణ కేంద్రం, హైదరాబాదు )

ఆగష్టు, సెప్టెంబరు మాసాలలో ఎక్కువ జిల్లాంలో అధికంగా వర్షంపడుతుంది. ఈ రెండు నెలలలోనే మొత్తం వర్షపాతంలో తెలంగాణా 48%, కోస్తా. రాయలసీమ ప్రాంతాలలో 50% వర్షం పడుతుంది. నైరుతి ఋతుపవనకాలంలో నెలకు తెలంగాణాలో 11 రోజులు, ఉత్తర కోస్తాజిల్లాలలో 8 రోజులు, రాయలసీమలో 8 రోజులు, దక్షిణ కోస్తా జిల్లాలలో 5 రోజులు వర్షం కురుస్తుంది.

## ఈశాన్య ఋతుపవనకాలం

అక్టోబరు మాసంలో నైఋతిఋతుపవనాల తిరోగమనం,ఈశాన్యఋతుపవనాల ప్రవేశం జరుగుతుంది. వీటివల్ల వర్షంకూడా పడుతుంది. నవంబరు, డిశంబరు మాసాలలో ఈశాన్య ఋతుపవన ప్రభావం ఎక్కువవుతుంది. వీటివల్ల ఉత్తర ప్రాంతాల కంటే దక్షిణ ప్రాంతాలలో ఎక్కువ వర్షం పడుతుంది. ఈ కాలంలో బంగాళాఖాతంలో వాయుగుండాలు ఏర్పడి దక్షిణ కోస్తా జిల్లాలకు ఎక్కువ వర్షం ఇస్తాయి. ఈ వాయుగుండాలు కాకినాడ, మచిలీపట్నం మధ్య తరచుగా భూమిని దాటుతాయి. ఒక్కొక్కప్పుడు దక్షిణ కోస్తాజిల్లాలు పెను తుఫానులకు గురయి విపరీత నష్టం సంభవిస్తూ ఉంటుంది.

### జిల్లా వారీ సగటు సంవత్సర వర్షపాతం
### మిల్లీమీటర్లలో

| జిల్లా | 1973 - 74 | 1977 - 1978 |
|---|---|---|
| 1 శ్రీకాకుళం | 938 | 1062 |
| 2 విశాఖపట్టణం | 798 | 1157 |
| 3 తూర్పుగోదావరిజిల్లా | 888 | 1158 |
| 4 పశ్చిమగోదావరిజిల్లా | 883 | 985 |
| 5 కృష్ణాజిల్లా | 842 | 892 |
| 6 గుంటూరు | 750 | 941 |
| 7 ప్రకాశం | 766 | 713 |
| 8 నెల్లూరు | 826 | 986 |
| కోస్తాప్రాంతం సగటు | 836 | 987 |
| 9 కర్నూలు | 753 | 735 |
| 10 అనంతపూర్ | 702 | 599 |
| 11 కడప | 724 | 768 |

| జిల్లా | 1973 - 74 | 1977 - 1978 |
|---|---|---|
| 12 చిత్తూరు | 728 | 966 |
| రాయలసీమ సగటు | 726 | 767 |
| 13 హైదరాబాదు | 952 | 702 |
| 14 నిజామాబాదు | 1250 | 917 |
| 15 మెదక్ జిల్లా | 1168 | 766 |
| 16 మహబూబునగరు | 771 | 760 |
| 17 నల్గొండ | 796 | 712 |
| 18 వరంగల్ | 930 | 778 |
| 19 ఖమ్మం | 989 | 867 |
| 20 కరీంనగర్ | 1178 | 788 |
| 21 ఆదిలాబాద్ | 1147 | 1086 |
| తెలంగాణా సగటు | 1020 | 820 |
| ఆంధ్రప్రదేశ్ సగటు వర్షపాతం | 894 | 873 |

(మూలం : ఆంధ్రప్రదేశ్ అర్థగణాంక శాఖ)

వర్షపాతంలో తేడాలు ప్రతి సంవత్సరంలోను, ఋతువులోను, మాసాంలోను మొత్తంలో తేడాలు బాగా ఉంటాయి. తెలంగాణా ప్రాంతంలో సెప్టెంబరులో రికార్డు వర్షా లెక్కువ. రాయలసీమలో అక్టోబరు - నవంబరులో రికార్డు వర్షాలెక్కువ. ఈ తేడాలేకాక ఒక్క రోజులో పడే వర్షపాతంలో కూడా తేడాలు ఉన్నాయి. ఉదాహరణకు 23-5-1952 తేదీన నంద్యాలలో 388.6 మి.మీ. 14-10-1931 తేదీన గజపతినగరంలో 510.5 మి.మీ కాకినాడలో 2-6-1941 తేదీన 501.4 మి. మీ వర్షం పడింది.

**శీతాకాలం**

ఈశాన్య ఋతుపవనాలు మార్చి వరకు వీస్తుంటాయి. కాని వర్షాలు మాత్రం పడవు. వాతావరణం డిశంబరులోనే చల్లబడి ఫిబ్రవరి అంతం వరకు చల్లగానే ఉంటుంది. అనంత పూర్, చిత్తూర్ , హైదరాబాద్, నిజామాబాద్, జిల్లాలు తక్కిన వాటికంటె బాగా చల్లగా ఉంటాయి. పీఠభూమి ప్రాంతాలైన రాయలసీమ, తెలంగాణాలలో కోస్తా ప్రాంతం కంటె చలి ఎక్కువ ఉంటుంది. రాత్రులలో మంచు కూడా పడుతుంది. మార్చిరాగానే చలితగ్గి ఎండలు కాయడం మొదలు పెడతాయి.

# 3
# జనాభా

1971 జనాభా లెక్కలనుబట్టి భారతదేశపు జనాభా సంఖ్య 54.8 కోట్లు. 1978 అంచనాలనుబట్టి ఈసంఖ్య 63 కోట్ల వరకు పెరిగిందని తెలుస్తోంది. ఈలెక్కలనుబట్టి భారత దేశపు జనాభా ప్రపంచ జనాభాలో ఏడోవంతు. అంటే ప్రపంచంలోని ప్రతి ఏడోవ్యక్తి భారతీయుడు.

భారత దేశంలో అత్యధిక జనాభాగల రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ అయిదవది. భారత దేశం మొత్తం జనాభాలో ఆంధ్రప్రదేశ్ జనాభా 7.9 శాతం ఉంది. 1901 నుంచి ఆంధ్ర ప్రదేశ్ జనాభా పెరుగుదల లేదా తరుగుదల (1921 లో మాత్రం) క్రింది విధంగా ఉంది.

| సంవత్సరం | జనాభా |
|---|---|
| 1901 | 1,90,65,921 |
| 1911 | 2,14,47,412 |
| 1921 | 2,14,20,448 |
| 1931 | 2,42,03,573 |
| 1941 | 2,72,89,340 |
| 1951 | 3,11,15,259 |
| 1961 | 3,59,83,447 |
| 1971 | 4,35,02,708 |
| 1976 (జులై 1 వ తేది) | 4,79,00,000 (సుమారు) |

అంటే 1901 లో 1.9 కోట్లు ఉన్న ఆంధ్రప్రదేశ్ జనాభా 1976 నాటికి 4.8 కోట్లు అయింది. అంటే 2 1/4 రెట్లు పెరిగింది.

ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం 2,76,814 చ.కి.మీ. 1971 నాటికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ప్రతి చ.కి.మీ. కి 157 మంది ఉన్నారన్నమాట,

**ఆంధ్రప్రదేశ్‌లోని వివిధజిల్లాలలో జనాభా వివరాలు**

| జిల్లా | 1971 నాటి జనాభా |
|---|---|
| అనంతపురం | 21.15.321 |

| జిల్లా | 1971 నాటి జనాభా |
|---|---|
| ఆదిలాబాదు | 12,88,348 |
| కరీంనగర్ | 19,63,928 |
| కడప | 15,77,267 |
| కర్నూలు | 19,82,090 |
| కృష్ణా | 24,93,574 |
| ఖమ్మం | 13,69,792 |
| గుంటూరు | 28,44,488 |
| చిత్తూరు | 22,87,536 |
| తూర్పుగోదావరి | 30,87,262 |
| నల్లగొండ | 18,19,396 |
| నిజామాబాదు | 13,13,268 |
| నెల్లూరు | 16,09,617 |
| పశ్చిమ గోదావరి | 23,74,306 |
| ప్రకాశం | 19,19,995 |
| మహబూబ్‌నగర్ | 19,32,082 |
| మెదక్ | 14,67,944 |
| వరంగల్ | 18,70,938 |
| విశాఖపట్నం | 28,05,366 |
| శ్రీకాకుళం | 25,90,000 |
| హైదరాబాదు | 27,91,762 |

**1971 లెక్కల ప్రకారం వివిధ వయస్సు గ్రూపులకు చెందిన జనాభా వివరాలు**

| వయస్సు | జనాభా (వేలలో) |
|---|---|
| 0-14 | 7609 |
| 15-19 | 3671 |
| 20-24 | 3237 |
| 25-29 | 3329 |
| 30-39 | 5569 |
| 40-49 | 4295 |
| 50-59 | 2822 |
| 60-ఆపైన | 2769 |

| | |
|---|---|
| మొత్తం జనాభా | 43,503 |

వీరిలో 0-14 సం॥ వారు, 60 సం॥పైబడినవారు కలిసి రాష్ట్ర జనాభాలో 44.6 శాతం ఉన్నారు. వీరు ఇతరులపై సాధారణంగా ఆధారపడిఉంటారు.

**జనాభాలో 1,000 మంది పురుషులకు స్త్రీల సంఖ్య**

| సంవత్సరం | స్త్రీల జనాభా |
|---|---|
| 1901 | 985 |
| 1911 | 992 |
| 1921 | 993 |
| 1931 | 987 |
| 1941 | 980 |
| 1951 | 986 |
| 1061 | 981 |
| 1971 | 977 |

అంటే అనేక వర్ధమాన దేశాలలో లాగానే భారతదేశంలో కూడా, దేశంలో తక్కిన ఇతర రాష్ట్రాలలో లాగానే ( కేరళలో తప్ప ) ఆంధ్రప్రదేశ్‌లో కూడా స్త్రీ జనాభా తక్కువ.

రాష్ట్ర జనాభాలో 19.31 శాతం పట్టణ వాసులు. రాష్ట్రంలో నగరీకరణ స్థాయిలో కూడా చాలా తేడాలున్నాయి. ఉదాహరణకు, హైదరాబాదుజిల్లా జనాభాలో 65.88 శాతం పట్టణవాసులుకాగా, నల్గొండజిల్లా జనాభాలో 6.69 శాతం మాత్రమే పట్టణవాసులు.

**గ్రామీణ, పట్టణ జనాభా**

| సంవత్సరం | గ్రామీణులశాతం | పట్టణవాసుల శాతం |
|---|---|---|
| 1961 | 82.46 | 17.44 |
| 1971 | 80.69 | 19.31 |

**ప్రాంతాలవారీగా గ్రామీణ, పట్టణ జనాభా 1971 నాటికి**

| ప్రాంతం | మొత్తంజనాభా | గ్రామీణజనాభా | పట్టణజనాభా |
|---|---|---|---|
| కోస్తాఆంధ్ర | 1,97,24,599 | 1,59,51,787 | 37,71,812 |
| రాయలసీమ | 79,60,214 | 66,50,878 | 13,09,336 |
| తెలంగాణా | 1,58,17,895 | 1,24,96,516 | 33,21,379 |

1971 లో జనసాంద్రత కోస్తా ఆంధ్రలో ( చ. కి. మీ. కి. ) 212, రాయలసీమలో 115, తెలంగాణాలో 138 మంది.

ఆంధ్రప్రదేశ్‌లో చ. కి. మీ. కి. జనసాంద్రత

| | |
|---|---|
| 1901 | 69 |
| 1911 | 78 |
| 1921 | 77 |
| 1931 | 83 |
| 1941 | 99 |
| 1951 | 113 |
| 1961 | 131 |
| 1971 | 157 |

రాష్ట్రంలో అన్ని జిల్లాలలో జనసాంద్రతలో తేడాలున్నాయి. హైదరాబాదు లో చ. కి. మీ. కి 362 మంది ఉండగా, ఆదిలాబాదుజిల్లాలో 80 మంది మాత్రమే ఉన్నారు.

రాష్ట్రం మొత్తంమీద జీవన సదుపాయాలు అధికంగా ఉన్న సర్కారుజిల్లాలోని డెల్టా ప్రాంతాలలో జనసాంద్రత అధికంగా ఉంది, త్వరితంగా పెరుగుతోంది. రాష్ట్రమంతటిలోను తూర్పుగోదావరిజిల్లాలోని డెల్టా ప్రాంతంలోని జనసాంద్రత అధికము. అది చ. కి. మీ. కి 522. ఏజన్సీ ప్రాంతాలలో అత్యల్ప జనసాంద్రత ఉంది. గ్రామీణ ప్రాంతాలలో రాష్ట్రం మొత్తంమీద జనసాంద్రత చ. కి. మీ. 128. పశ్చిమ గోదావరిజిల్లా గ్రామీణ జనసాంద్రత 256. అతి తక్కువ గ్రామీణ జనసాంద్రత ఆదిలాబాదు జిల్లాలో చ. కి. మీ. కి 80 మంది. అత్యధిక జనసాంద్రత హైదరాబాదు చ. కి. మీ. కి 5,510 మంది.

1971 లో జనాభాలెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లోని గ్రామాల సంఖ్య

| | |
|---|---|
| 10,000 పైగా జనాభాగలవి | 80 గ్రామాలు |
| 9,999 మంది నుంచి 5,000 వరకు జనాభా గలవి | 724 గ్రామాలు |
| 4,999 నుంచి 2,000 వరకు జనాభాగలవి | 4,833 గ్రామాలు |
| 1,999 నుంచి 1,000 వరకు జనాభా గలవి | 6,411 గ్రామాలు |
| 999 నుంచి 500 వరకు జనాభాగలవి | 5,438 గ్రామాలు |
| 500 మందిలోపు జనాభా ఉన్నవి | 9,735 గ్రామాలు |

మొత్తం రాష్ట్రంలో గ్రామాల సంఖ్య 27,221.

### 1971 లో రాష్ట్రంలో జనాభావారీగా నగరాల సంఖ్య

| జనాభా | నగరాలసంఖ్య |
|---|---|
| 1,00,000 - అంతకన్న ఎక్కువ | 13 |
| 99,999 నుంచి 50,000 వరకు | 17 |
| 49,999 నుంచి 20,000 వరకు | 59 |
| 19,999 నుంచి 10,000 వరకు | 76 |
| 9,999 నుంచి 5,000 వరకు | 38 |
| 5,000 కన్న తక్కువ | 4 |

మొత్తం నగరాల సంఖ్య 207.

రాష్ట్రంలో మతాలవారీగా జనాభా (1971 లో)

| | |
|---|---|
| హిందువులు | 3,81,19,279 |
| ముస్లిములు | 35,20,166 |
| క్రిస్టియన్‌లు | 18,23,436 |
| జైనులు | 16,108 |
| సిక్కులు | 12,591 |
| బౌద్ధులు | 10,035 |
| ఇతర మతస్థులు | 995 |
| మతంతెలియనివారు | 98 |

### వివాహవయస్సు

పట్టణ ప్రాంతాల ప్రజలకంటె తక్కువ వయస్సులోనే గ్రామీణులు పెళ్ళిళ్లు చేస్తారు. పురుషులకంటె స్త్రీలే ఎక్కువమంది గార్హస్థ్యజీవితాన్ని గడపలేక ఒంటరిగాఉండిపోతున్నారు.

**వివాహాలు చేసుకునే యువతీయువకుల సగటు వయసు వివరాలు**

| | |
|---|---|
| పట్టణ పురుషులు | 23.6 సం॥ |
| పట్టణ స్త్రీలు | 16.5 సం॥ |
| గ్రామీణ పురుషులు | 21.9 సం॥ |
| గ్రామీణ స్త్రీలు | 14.8 సం॥ |

మొత్తంమీద పురుషులు 22.2 సంవత్సరాల వయస్సులోను, స్త్రీలు 15 సం॥ వయస్సులోను వివాహం చేసుకొంటున్నారు.

### జనన మరణాల రేటు

1973 లో కోస్తాఆంధ్ర, తెలంగాణా కంటె రాయలసీమలో జననరేటు ఎక్కువ. 1973 లో రాయమసీమ, తెలంగాణాలో కంటె కోస్తా ఆంధ్రలో మరణ స్థాయి తక్కువ.

### గ్రామీణుల జనన మరణ రేటు (వెయ్యిమందికి)

| సంవత్సరం | జననరేటు | మరణరేటు |
|---|---|---|
| 1971 | 35.70 | 15.9 |
| 1973 | 32.93 | 18.38 |
| 1976 | 34.7 | 15.7 |
| 1977 | 33.4 | 15.6 |

### పట్టణవాసుల జనన మరణ రేటు (వెయ్యిమందికి)

| సంవత్సరం | జననరేటు | మరణరేటు |
|---|---|---|
| 1971 | 31.3 | 9.1 |
| 1972 | 31.2 | 10.1 |
| 1976 | 29.8 | 9.5 |
| 1977 | 27.7 | 8.0 |

### షెడ్యూల్డుకులాలు, షెడ్యూల్డు తెగలవారు (1971 నాటికి)

| ప్రాంతం | షెడ్యూల్డుకులాలవారు | షెడ్యూల్డుతెగలవారు |
|---|---|---|
| కోస్తా ఆంధ్ర | 22,01,171 | 10,24,787 |
| రాయలసీమ | 10,71,905 | 1,90,697 |
| తెలంగాణా | 25,01,472 | 4,42,173 |

అంటే రాష్ట్రం మొత్తం మీద 1971 నాటికి 57,74,548 మంది షెడ్యూల్డు కులాల వారు, 16,57,657 మంది షెడ్యూల్డు తెగలవారు ఉన్నారు. మొత్తం రాష్ట్ర జనాభాలో షెడ్యూల్డు కులాల వారి శాతం 13.27, షెడ్యూల్డు తెగలవారి శాతం 3.81. ***కుటుంబనియంత్రణ:*** 1966-67 నుంచి కుటుంబనియంత్రణ సేవాకార్యక్రమాలు ప్రాముఖ్యం వహించి కార్యరూపం దాల్చాయి. 1979-80 లో 1,75,708 కుటుంబనియంత్రణ ఆపరేషన్లు రాష్ట్రంలో జరిగాయి.

### రాష్ట్రంలో ముఖ్యనగరాల జనాభా (1971)

| | |
|---|---|
| హైదరాబాదు | 17,96,339 |
| విశాఖపట్టణం | 3,52,504 |
| విజయవాడ | 3,17,258 |
| గుంటూరు | 2,69,991 |
| వరంగల్ | 2,07,520 |
| రాజమండ్రి | 1,65,912 |

| నగరము | జనాభా |
|---|---|
| కాకినాడ | 1,64,200 |
| కర్నూలు | 1,36,710 |
| నెల్లూరు | 1,33,590 |
| ఏలూరు | 1,27,023 |
| నిజామాబాదు | 1,15,640 |
| మచిలీపట్నం | 1,12,612 |
| తెనాలి | 1,02,937 |
| విజయనగరం | 86,608 |
| ఆదోని | 85,311 |
| అనంతపురం | 80,069 |
| కొత్తగూడెం | 75,542 |
| ప్రొద్దుటూరు | 70,822 |
| గుంతకల్ | 66,320 |
| కడప | 66,195 |
| తిరుపతి | 65,843 |
| భీమవరం | 63,762 |
| నంద్యాల | 63,192 |
| చిత్తూరు | 63,035 |
| గుడివాడ | 61,068 |
| అనకాపల్లి | 57,273 |
| ఖమ్మం | 56,919 |
| చీరాల | 54,487 |
| ఒంగోలు | 53,330 |
| మహబూబ్‌నగర్ | 51,756 |
| కరీంనగర్ | 48,918 |
| శ్రీకాకుళం | 45,179 |
| తాడేపల్లిగూడెం | 43,610 |
| నరసరావుపేట | 43,467 |
| హిందూపూర్ | 42,959 |
| బాపట్ల | 41,947 |
| చిలకలూరిపేట | 41,543 |
| బోధన్ | 37,589 |
| మదనపల్లి | 36,458 |
| పాలకొల్లు | 36,196 |
| నరసాపూర్ | 36,147 |
| కాళహస్తి | 34,735 |
| సామర్లకోట | 34,607 |
| తణుకు | 34,197 |
| కదిరి | 33,810 |

| నగరము | జనాభా |
|---|---|
| గూడూరు | 33,778 |
| నల్లగొండ | 33,126 |
| మంగళగిరి | 32,850 |
| తాడిపత్రి | 31,618 |
| పొన్నూరు | 31,463 |
| పిఠాపురం | 31,391 |
| సాలూరు | 30,929 |
| జగిత్యాల | 30,900 |
| ధర్మవరం | 30,876 |
| బొబ్బిలి | 30,649 |
| అమలాపురం | 30,518 |
| ఆదిలాబాద్ | 30,368 |
| బెల్లంపల్లి | 30,290 |
| ఎమ్మిగనూరు | 30,265 |
| పార్వతీపురం | 30,025 |

1971 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ కార్మికులు 1,26,23,386 మందీ, వ్యవసాయేతర కార్మికులు 53,82,613 మందీ, వ్యవసాయదారులు 57,94,701 మందీ ఉన్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో 1971 జనాభా లెక్కల ప్రకారం హరిజనులు 57.75 లక్షలమంది (13.27 శాతం) గిరిజనులు 16.58 లక్షలు (3.81 శాతం) ఉన్నారు.

| ప్రాంతము | హరిజనులు | గిరిజనులు |
|---|---|---|
| కోస్తా ఆంధ్ర | 22.01 లక్షలు | 10.24 లక్షలు |
| రాయలసీమ | 10.72 లక్షలు | 1.91 లక్షలు |
| తెలంగాణా | 25.02 లక్షలు | 4.43 లక్షలు |
| మొత్తం | 57.75 | 16.58 |

ఆంధ్రప్రదేశ్‌లో గల జనాభాలో దాదాపు 40 శాతం బలహీన వర్గాలకు చెందిన వారున్నారు.

1980 ఆఖరుకు ఆంధ్రప్రదేశ్‌లో 5,43,00,000 మంది జనాభా ఉండవచ్చునని జనసంఖ్యా శాస్త్రజ్ఞులు అంచనా వేయడమైంది.

# 4

# ఆంధ్రప్రదేశ్ ప్రాచీన చరిత్ర

కొందరి పరిశోధకుల అభిప్రాయం ప్రకారం భారతదేశంలో తొలిమానవుడు ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌గా వ్యవహరింపబడే భూభాగంలో కోస్తా ప్రాంతంలో జీవించినట్లు తెలుస్తున్నది. హిమాలయాలకంటే ప్రాచీనమైన శిలాఖండాలు దక్కను భూమిలో ఉన్నట్లు తెలియవచ్చింది. పాతరాతి యుగంలో ఆంధ్రప్రదేశ్‌లో నివసించిన మానవులు పాలారె నదీలోయ (నెల్లూరు జిల్లా) కు ఉత్తర భాగంలో క్వార్ట్‌జైట్ రాతితోను, కృష్ణాలోయ ఎగువన షంగిన్ రాతితోను బళ్ళారి, కడప జిల్లాలోను హెమటైట్ రాతితోను పనిముట్లు తయారు చేసుకొనేవారు. క్రీ. పూ. 5000 నాటి పనిముట్లు గిద్దలూరు, కంభంపద్దలభించాయి. కర్నూలుజిల్లాలో బిల్లసర్గం గుహలలోను,కడప,అనంతపురంజిల్లాలలోను కారెంపూడి,నందిగామ,ఆదిలాబాదులలోను పాత రాతియుగపుపనిముట్లులభించాయి. ఇంతేకాక,మహబూబ్‌నగర్,ఖమ్మంజిల్లాలలోను,కృష్ణాతీరం లోని ఏలేశ్వరం, నాగార్జున కొండలవద్ద జరిపిన త్రవ్వకాలలో తొలి మానవుల గురించిన సమాచారం చాలా లభించింది. నాగార్జున కొండ త్రవ్వకాలలో పాతరాతియుగానికి, కొత్తరాతి యుగానికి, ఇనుపయుగానికి, చారిత్రక దశకు చెందిన అవశేషాలు కనబడ్డాయి.

ఆంధ్రులను గురించిన మొట్టమొదటి ప్రసక్తి ఐతరేయ బ్రాహ్మణంలో కనబడుతుంది దీని కథనం ప్రకారం ఆంధ్రులు విశ్వామిత్రుని సంతతివారనీ, వారు పుండ్ర, పుళింద, శబర, మూతి బులతో కలిపి దస్యులుగా వ్యవహరింపబడేవారనీ, విశ్వామిత్రముని శాప కారణంగా వింధ్యకు దక్షిణంగా తరలివెళ్ళారనీ తెలుస్తున్నది.

దక్షిణాన ఆంధ్రులను గురించి, ఆంధ్ర పాలకులను గురించిన లిఖిత వివరాలు ప్రధానంగా మెగస్తనీసు గ్రంథంలోను, అశోకుని శాసనాలలోను లభిస్తాయి. మెగస్తనీసు క్రీ. పూ. 300 సం॥లో మౌర్యుల ఆస్థానానికి గ్రీకు రాయబారిగా భారతదేశం సందర్శించి నప్పుడు ఆంధ్రులకు ప్రాకారావృతమైన 30 నగరాలు, 20 వేల పదాతిసైన్యం, 2 వేల అశ్వబలం, ఒక వెయ్యి గజబలం ఉన్నట్లు తెలుస్తున్నది. అప్పటికి ఆంధ్రుల మౌర్య సామ్రాజ్యానికి సామంతులు. అశోకుని తర్వాత ఆంధ్రపాలకులు శాతవాహనుల పేరు ధరించి స్వతంత్రులయ్యారు. పశ్చిమాన పైథాన్ నుంచి గోదావరీతీరం వెంబడి తూర్పున కళింగ దేశంవరకూ, దక్షిణాన రాయలసీమ, దక్షిణాంధ్ర వరకూ శాతవాహన సామ్రాజ్యం విస్తరించింది. వీరు క్రీ. పూ. 220 సం॥ నుంచి క్రీ. శ. 200 సం॥ వరకు సుమారు 400 సం॥ రాజ్యపాలన చేశారు. వీరిలో అమరావతి రాజధానిగా ఏలిన శ్రీముఖ శాతవాహ

సుడు మొదటిరాజు. అతని తరవాత అత్యంత సమర్ధవంతమైన పాలకుడు క్రీ.శ. 102 సం॥ వరకు ఏలిన గౌతమీపుత్ర శాతకర్ణి. శాతవాహనుల కాలంలో ప్రముఖ నగరాలు ఇప్పటి తెలంగాణాలోని కదంబపూర్, గాజులబండ, ఫణిగిరి, కొండాపురం మొదలైనవి, కోస్తా ప్రాంతంలోని ధరణికోట, వేగి, భట్టిప్రోలు, విజయపురి మొదలైనవి.

శాతవాహనుల తరువాత ఆంధ్రదేశం చిన్న భాగాలుగా చీలిపోయింది. క్రీ. శ. 200 సం॥ నుంచి క్రీ. శ. 620 సం॥ వరకు ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, పల్లవులు, శాలంకాయనులు, బృహత్ఫలాయనులు, వాకాటకులు, ఆనంద గోత్రీకులు వంటి రాజులు చిన్న చిన్న రాజ్యాలు స్థాపించారు.

క్రీ. శ. 600 నుంచి కోస్తాజిల్లాలను తూర్పుచాళుక్యులు, ఉత్తరాంధ్రాన్ని కాళింగులు దక్షిణాంధ్రాన్ని చోళులు, తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలను పశ్చిమచాళుక్యులు, రాష్ట్ర కూటులు, కదంబులు, నోళంబులు పరిపాలించారు.

శాతవాహనుల తరువాత యావదాంధ్రను పాలించినవారు కాకతీయులే. క్రీ. శ. 1000 నుంచి క్రీ. శ. 1300 వరకు రాజ్యమేలారు. కాకతీయ పాలకులలో ముఖ్యులు క్రీ. శ. 1198 నుంచి 1262 వరకు పాలించిన గణపతి దేవుడు, క్రీ. శ. 1262 నుంచి 1292 వరకు పాలించిన ఆయన కుమార్తె రుద్రమదేవి, క్రీ. శ. 1296 నుంచి 1323 వరకు పాలించిన ఆమెదౌహిత్రుడు ప్రతాపరుద్రుడు. ప్రతాపరుద్రుని కాలంలో అనేకసార్లు మహమ్మ దీయుల దండయాత్రలు జరిగాయి. చివరగా 1322 ఢిల్లీ చక్రవర్తి తుగ్లక్ పంపిన సైన్యానికి ప్రతాపరుద్రుడు లోబడిపోయాడు ఈయనే చివరి కాకతీయ ప్రభువు. అన్నదమ్ముల మధ్య రాజ్యకాంక్ష కారణంగా 1176-1182 లలో చరిత్ర ప్రసిద్ధమైన పల్నాటి యుద్ధం జరిగింది.

కాకతీయ సామ్రాజ్యం అంతరించిన తరువాత, కాకతీయ ప్రభువులకు సామంతులుగా, దండనాథులుగా ఉన్న రెడ్డిరాజులు, పద్మనాయక ప్రభువులు సుమారొక శతాబ్దం పాటు తెలుగు దేశంలో చాలా భాగాన్ని పరిపాలించారు. కాకతీయ రాజ్యాన్ని మహమ్మదీయులు కూలద్రోసిన తరువాత తెలుగువారికి మహమ్మదీయప్రభుత్వాన్ని అంతమొందించాలనే దృఢ నిశ్చయం కలిగింది. ముసునూరి వంశజుడైన ప్రోలయనాయకునితో ఇది ఉద్యమ రూపం దాల్చి 1325-29 మధ్య తూర్పున, పశ్చిమాన మహమ్మదీయుల అధికారాన్ని ధిక్కరించి, స్వతంత్రత స్థాపించే స్థితికి వచ్చింది. ప్రోలయ తరువాత అతని పినతండ్రి కుమారుడు కాపయనాయకుడు తెలంగాణం నుండి మహమ్మదీయులను పారదోలే ప్రయత్నాలు ప్రారం భించి ఓరుగల్లు వశపరచుకొన్నాడు. ఢిల్లీ చక్రవర్తికి ప్రతికూలంగా స్థాపనమవుతున్న బహ మనీ రాజ్యస్థాపన యత్నాన్ని ఈయన దూరదృష్టితో, ఓరుగల్లు, గుల్బర్గా రాజ్యాలు సహ జీవనం చెయ్యగలవన్న ఆశతో బలపరిచాడు. కాని ఆ ఆశ భగ్నమై ఓరుగల్లు బహమ నీయుల వశమయింది.

రెడ్డి ప్రభువులు స్థాపించిన కోరుకొండ, రాజమహేంద్రవరం, కందుకూరు, అద్దంకి రాజ్యాలలో అదంకి ముఖ్యమైనది. అద్దంకి పాలకులు కొంత కాలం తరువాత అద్దంకిని

విడిచి కొండవీడు రాజధాని చేసుకొన్నారు. ఈ రాజ్యం క్రీ. శ. 1324 నుంచి 1424 వరకు వర్ధిల్లింది.

బహమనీ రాజ్యం, విజయనగర రాజ్యం - ఈ రెండూ ఢిల్లీ నవాబుల తత్త్వానికి ప్రతికూలంగా ఏర్పడిన స్వతంత్ర రాజ్యాలు. పరమతస్థులు ఆక్రమించుకొంటున్న భారత దేశంలో తిరిగి హిందూమత రాజ్య పునరుద్ధరణ చేయడానికి విరూపాక్ష స్వామిపేర, విద్యారణ్యస్వామి ప్రోత్సాహంతో తుంగభద్రనదికి దక్షిణాన హరిహర దేవరాయలకు 1336లో జరిగినపట్టాభిషేకంతో విజయనగర చరిత్ర ప్రారంభమైంది. ఆ సమయంలోనే విరూపాక్షస్వామి ఆలయంవద్ద విజయనగర సామ్రాజ్యానికి నూతన రాజధాని అయిన విద్యానగర నిర్మాణం ప్రారంభమైంది. ఈ విధంగా స్థాపితమైన విజయనగర రాజ్యాన్ని సంగమం, సాళువ, తుళువ, ఆరవీడు వంశ చక్రవర్తులు పాలించారు. హరిహర రాయల పట్టాభిషేక కాలంలో కర్నాటకలోని అయిదు జిల్లాలతోపాటు రాయచూరు, కర్నూలు, అనంతపురం, కడప జిల్లాలూ, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో చాలాభాగమూ విజయనగర సామ్రాజ్యంగా రూపొందాయి.

> శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్ర గ్రంథాన్ని రచించినది క్రీ. శ. 1400 సంవత్సరంలో.

విజయనగర సామ్రాజ్య చరిత్రలో స్వర్ణయుగం క్రీ. శ. 1509 నుంచి 1529 వరకు పాలించిన శ్రీకృష్ణదేవరాయలపాలనకాలం. ఈయన తుళువ వంశపురాజు. రాజ్యతంత్రంలోను రణరంగంలోను ప్రతిభాశాలి. ఈయన 1513 లో జరిపిన ఒక జైత్రయాత్ర ఉదయగిరి ముట్టడితో ప్రారంభమై కొండవీడు, బెల్లంకొండ, నాగార్జునకొండ, అద్దంకి వశపరచుకొన్న తరవాత, విజయవాడ, విశాఖపట్నం మీదగా కటక్ చేరి దానిని స్వాధీన పరచుకోవడంతో ఆయాత్ర ముగిసిందని భావిస్తున్నారు. ఇటీవల కొందరు పరిశోధకులు ఈ జైత్రయాత్ర గయ, నావాడ, ఢిల్లీ వరకు జరిగిందనే అభిప్రాయం వెలిబుచ్చుతున్నారు. శ్రీకృష్ణదేవరాయలు తన ఆస్థానంలో సాహిత్యగోష్ఠి జరపడానికి భువన విజయమనే భవనం నిర్మించి అష్టదిగ్గజాలనే కవులను ఆదరించి పోషించాడు. రాయలకాలంలో తెలుగు జాతికే కాక, తెలుగు భాషా సాహిత్యాలకు కూడా ఆదరణ లభించింది. 'దేశ భాషలందు తెలుగు లెస్స' అన్న ప్రసిద్ధోక్తి శ్రీకృష్ణ దేవరాయలదే.

> బమ్మెరపోతన ఆంధ్రమహాభాగవతాన్ని క్రీ.శ.1438లోరచించాడు.

తుళువ వంశపు రాజులలో చివరివాడు సదాశివరాయలు. పేరుకు ఈయన రాజైనా, రాజ్యభారం వహించినది శ్రీకృష్ణదేవరాయల అల్లుడు (అళియ) రామరాయలు. అళియ రామరాయలుకూ, బహమనీ సుల్తానుకూ మధ్య జరిగిన తళ్ళికోట యుద్ధంలోనే విజయనగర సామ్రాజ్యం తన ప్రతిభ కోల్పోయింది. సదాశివరాయలును బందీచేసి, ఆరవీడు వంశపు తిరుమలరాయలు కొంత కాలం రాజ్యపాలన చేశాడు. 1642 నుంచి 1664 వరకు రాజ్యం చేసిన ఆరవీడు వంశపు శ్రీరంగరాయల తరవాత విజయనగర సామ్రాజ్యం మొగలు చక్రవర్తుల లన కిందికి వచ్చింది.

సా

విజయనగర పాలకులు తమ ఆధీనంలో ఉన్న మధురను పాలించడానికిగాను విశ్వనాధనాయకునితో బాటు అసంఖ్యాకమైన తెలుగు కుటుంబాలు మధుర తరలి వెళ్ళాయి. కృష్ణదేవరాయలి తరువాత రాజ్యమేలిన అచ్యుత దేవరాయలి కాలంలో చెవ్వప్పనాయకుడు తంజావూరు పాలకునిగా నియమితుడయ్యాడు. ఈ చెవ్వప్పనాయకుడే తంజావూరు నాయక వంశానికి మూలపురుషుడు. ఈ విధంగా మధుర, తంజావూర్లకు తెలుగు సంస్కృతి వ్యాపించింది.

తంజావూరు నాయకరాజులు గణనీయంగా తెలుగు భాషాసేవ చేశారు. వీరిలో ముఖ్యుడు 1614 నుంచి 1633 వరకు ఉన్న రఘునాథరాయలు. తంజావూరు ఆస్థానంలో అనేకమంది కవయిత్రులు ఉండటం ఒక విశేషం. మధుర రాజులుకూడా తెలుగు భాషా సేవచేసిన వారే. చెంజి, పుదుక్కోట సంస్థానాలలో కూడా తెలుగు భాష పోషింపబడింది.

| యోగివేమన నిర్యాణం క్రీ.శ.1480 లో |
|---|

బహమనీరాజ్యం 1347 నుంచి 1538 వరకు రెండు వందల సంవత్సరాలపాటు దక్కను పీఠభూమిలో వర్ధిల్లింది. ఢిల్లీ పాలకుడైన తుగ్లక్ దారుణ చర్యలకు రోసిన దక్కన్ అమీర్లు ఇద్దరు అల్లాఉద్దీన్ హసన్, బహమనిషా అనేవారు గుల్బర్గాలో బహమనీరాజ్యం స్థాపించారు. తూర్పున రాజమండ్రి, ఉత్తరాన ఖాండేష్, దక్షిణాన కృష్ణానది, పశ్చిమాన నాశిక్ రాజ్యపురి సరిహద్దులు. 1535 లో బహమనీరాజ్యం అయిదు భాగాలయింది. అవి బీజపూర్, అహమ్మద్‌నగర్, బీదర్, బీరార్, గోల్కొండ. వీటిలో 1512, లో స్థాపితమైన గోల్కొండ రాజ్యాన్ని కుతుబ్‌షాహీలు 1687 వరకు పరిపాలించారు. గోల్కొండ రాజులలో 1580 నుంచి 1611 వరకు రాజ్యంచేసిన సుల్తాన్ కులీకాలంలో గోల్కొండ పొలిమేరలలో వజ్రాన్వేషణ ప్రారంభమైంది. ఈయన కాలంలోనే నేటి హైదరాబాదు పట్టణం స్థాపితమైంది. మక్కామసీదు చార్‌మినార్ వంటి గొప్ప కట్టడాలు ఈయన కాలంలోనే నిర్మితమయ్యాయి. ప్రపంచ ప్రసిద్ధి చెందిన కోహినూర్ వజ్రం 1611 నుంచి 1659 వరకు ఉన్న అబ్దుల్లాకుతుబ్‌షా కిరీటంలో అలంకృతమైగాని, ఇంగ్లీషు సామ్రాజ్యాధిపతుల కిరీటంలోకి వెళ్ళలేదు. ఈ గోల్కొండ రాజ్యమే తరువాత నిజాంరాజ్యమయింది. కుతుబ్‌షాహీలలో చివరివాడైన తానీషా ( 1672 - 1687 ) కు మంత్రి దండనాధులుగా అక్కన్న, మాదన్న పనిచేశారు. 1687 లో ఔరంగజేబు గోల్కొండపై దాడిచేసి తానీషాను ఓడించి ఖైదు చేశాడు. ఆతరవాత ఔరంగజేబు సుబేదారు నిజామ్ ఉల్‌ముల్క్ అసఫ్‌జా 1724లో స్వతంత్రుడై అసఫ్‌జాహీ వంశ మూలపురుషుడయ్యాడు. అతని రాజ్యమే ఆనాటి హైదరాబాదు రాష్ట్రం. నెల్లూరుజిల్లా, చిత్తూరు జిల్లాలో కొంత భాగంతప్ప నేటి ఆంధ్రప్రదేశ్ అంతా నిజాంనవాబు పరిపాలనలో హైదరాబాదు రాష్ట్రంలో ఉండేది.

బ్రిటిష్‌వారు క్రీ. శ. 1600 లో భారతదేశానికి వ్యాపారంకోసం వచ్చారు. 1611లో వారు మచిలీపట్నం, నిజాం పట్నాలలో స్థావరాలేర్పరచు కొన్నారు. 1639 లో ఫ్రాన్సిస్‌డే అనే ఉద్యోగి చంద్రగిరి రాజునడిగి ఇప్పుడు మద్రాసు ఉన్న ప్రాంతాన్ని సంపాదించి, 'ఫోర్ట్ సెయింట్ జార్జి అనే కోటను నిర్మించాడు. అప్పటి నుంచి బ్రిటిష్ వారు ఆంధ్ర ప్రాంతాన్ని

మూడు దశలుగా సాధించుకో గలిగారు. 1759లో సంధి ననుసరించి ఎనిమిది జిల్లాలతో సహా మచిలీపట్నం సర్కారుమొత్తం, నిజాంపట్నం సర్కారు బ్రిటిష్‌వారికి సంక్రమించాయి 1766 - 68 లో ఒప్పందాల ననుసరించి ఏలూరు, శ్రీకాకుళం, రాజమండ్రి, కొండపల్లి, గుంటూరు వారి పరిపాలన కిందికి వచ్చాయి.

1800 లో సంధిననుసరించి నిజాంపట్నంతో రాయలసీమ ప్రాంతం బ్రిటిష్ వారికి నిజాం ఇచ్చివేశాడు. 1810 లో ఆర్కాడు నవాబుతో జరిగిన సంధివల్ల నెల్లూరుజిల్లా, చిత్తూరులోని ఇతర తాలూకాలూ బ్రిటిష్‌వారి వశమయ్యాయి. తెలంగాణా ప్రాంతం మాత్రం నిజాం క్రింద మిగిలిపోయింది. ఈ విధంగా ఆంధ్రప్రజల మధ్య కృత్రిమ విభజన జరిగింది.

| |
|---|
| మొదటి తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు ప్రచురణ క్రీ.శ. 1835లో |

1760 నుంచి 1800 వరకు బ్రిటిష్ వారికి నైజాం కర్ణాటక నవాబులతో జరిగిన నిరంతర యుద్ధాలవల్ల, తిరుగుబాట్లవల్ల ఆంధ్ర ప్రాంతం చాలా వెనుకబడి, క్షామం ఏర్పడింది. ఆ క్షామం నివారణ కోసమే బ్రిటిష్‌వారు, ముఖ్యంగా సర్‌ఆర్థర్‌కాటన్ పట్టుదలవల్ల 1851 లో గోదావరి ఆనకట్ట, 1855 లో కృష్ణ ఆనకట్ట నిర్మించారు.

బ్రిటిష్ పరిపాలనతో భారతదేశం పారిశ్రామిక యుగంలో అడుగుపెట్టింది. కాని భారతదేశ సంప్రదాయ వ్యవస్థ ధ్వంసం కాసాగింది. గ్రామవ్యవస్థ, చేతి వృత్తులు ధ్వంసమయ్యాయి. పన్నులభారం హెచ్చింది. కరువు కాటకాలు - ముఖ్యంగా రాయలసీమలో - సాధారణ మయ్యాయి. ఇంకా అనేక కారణాలుగా రాజకీయ స్వాతంత్ర్యం కోసం పోరాటం ప్రారంభమైంది. 1922 లో అల్లూరి సీతారామరాజు మన్యం రైతులతో తిరుగుబాటు చేశాడు.

హైదరాబాదులో 1842 లోను, 1855 లోను సైన్యంలో తిరుగుబాటు వచ్చింది. హైదరాబాదు సంస్థానం అన్ని ప్రాంతాలకన్న వెనకబడిఉంది. హైదరాబాదు నవాబు మీద, అతనికి అండగాఉన్న బ్రిటిష్‌వారిమీద ప్రజలలో వ్యతిరేకత ఏర్పడింది. పత్రికలలో కూడా విమర్శలు ప్రారంభమైనాయి. హైదరాబాదులో ఉన్న రెసిడెంటు ప్రోద్బలంవల్ల హైదరాబాదు ప్రభుత్వం పత్రికలమీద నిర్బంధాలు పెట్టింది. 1892 లో హైదరాబాదు ఆర్య సమాజం ఏర్పడింది. దాని కార్యక్రమాలు తమకు వ్యతిరేకంగా ఉన్నాయని ప్రభుత్వం 1894 లో ఆ ప్రచారకులను సంస్థానం నుంచి బహిష్కరించింది. 1900 - 1912 లో కొమర్రాజు లక్ష్మణ రావుగారు మొదలైనవారు నిర్వహించిన గ్రంథాలయోద్యమం పరోక్షంగా ప్రజలు తమ హక్కులను గుర్తించే దశకు చేర్చింది. 1921 లో తెలంగాణాలో ఆంధ్ర మహాసభ ఏర్పాటయింది. సంస్థానాధీశుల నుంచి, బ్రిటిష్ ఆధిపత్యం నుంచి విముక్తి పొందడానికి అది ప్రచారం చేసింది. ఆ తరువాత సంస్థాన కాంగ్రెసు ఏర్పడి స్వాతంత్ర్యోద్యమాన్ని నిర్వహించింది.

1920 నుంచి దేశంలో గాంధీ యుగం ప్రారంభమైంది. 1920, 30, 32, 42 లలో జరిగిన ఉద్యమాలలో ఆంధ్ర ప్రజలలో పట్టణ, గ్రామీణ, మధ్యతరగతి వారందరూ

పాల్గొన్నారు. తత్ఫలితంగా 1947 లో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. కాని హైదరాబాదు సంస్థాన ప్రజలకు స్వాతంత్ర్యం రాలేదు. 1948 లో సర్దార్ వల్లభాయిపటేల్ పట్టుదలతో, కేంద్ర ప్రభుత్వం జరిపిన పోలీసు చర్య తరువాత హైదరాబాదు సంస్థాన ప్రజలకు కూడా స్వాతంత్ర్యం లభ్యమైంది.

## ఆంధ్రప్రదేశ్ ప్రాచీన చరిత్రలో కొన్ని ప్రధాన ఘట్టాలు

| | | |
|---|---|---|
| క్రీ. పూ. | 322 | మెగస్తనీస్ కళింగ దేశానికి రావడం |
| ,, | 220 | శాతవాహన రాజ్యస్థాపన |
| ,, | 184 | మౌర్య రాజ్య పతనం |
| క్రీ. శ. | 78 | శాతవాహన యుగం ప్రారంభం |
| ,, | 225 | శాతవాహన పాలన అంతమొందడం |
| ,, | 234 | పల్లవరాజ్య స్థాపన |
| ,, | 300-420 | శాలంకాయన వంశ పరిపాలన |
| ,, | 336 | సముద్రగుప్తుడు సింహాసనమెక్కడం |
| ,, | 450-611 | వేంగి దేశంలో విష్ణుకుండినుల వంశ పాలనాకాలం |
| ,, | 550 | పశ్చిమ చాళుక్యరాజ్య స్థాపన |
| ,, | 625 | పల్లవరాజ్య పతనం |
| ,, | 640 | హుయాన్‌సాంగ్ ఆంధ్రదేశాన్ని పర్యటించడం |
| ,, | 973 | కళ్యాణి చాళుక్య రాజ్యస్థాపన |
| ,, | 1022 | రాజరాజనరేంద్రుని పరిపాలనారంభం |
| ,, | 1040 | నన్నయ మహాభారత రచన |
| ,, | 1117 | ఓరుగల్లు రాజధానిగా కాకతీయ భేతరాజు పరిపాలనారంభం |
| ,, | 1176-82 | పల్నాటియుద్ధం |
| ,, | 1198 | కాకతీయ గణపతిదేవుని పరిపాలనారంభం |
| ,, | 1212-13 | కోస్తా ఆంధ్ర కాకతీయుల స్వాధీనం |
| ,, | 1262 | వీరరుద్రమదేవి సింహాసనమెక్కడం |
| ,, | 1294 | కాకతీయ ప్రతాపరుద్రుని పరిపాలనారంభం |
| ,, | 1303 | దక్కన్‌పై అల్లాఉద్దీన్ మొదటి దండయాత్ర |
| ,, | 1323 | కాకతీయరాజ్య పతనం |
| ,, | 1324 | కొండవీటి రెడ్డిరాజ్యస్థాపన |
| ,, | 1326 | విజయనగర రాజ్యస్థాపన |
| ,, | 1347 | బహమనీ రాజ్యస్థాపన |
| ,, | 1424 | కొండవీటి రెడ్డిరాజ్య పతనం |
| ,, | 1510 | కృష్ణదేవరాయల పట్టాభిషేకం |

| | | |
|---|---|---|
| క్రీ. శ. | 1512 | గోల్కొండ రాజ్యస్థాపన |
| ,, | 1514-15 | కృష్ణదేవరాయల ఆంధ్రదేశ జైత్రయాత్ర |
| ,, | 1535 | తంజావూరులో విజయనగర రాజ్య స్థాపన |
| ,, | 1539 | మధురలో విజయనగరరాజ్య స్థాపన |
| ,, | 1565 | విజయనగర రాజ్య పతనం |
| ,, | 1572 | గోల్కొండ నవాబులు సర్కారుజిల్లాలను ఆక్రమించుకోవడం |
| ,, | 1611 | మచిలీపట్టణంలో ఇంగ్లీషువారు ఫ్యాక్టరీని నెలకొల్పడం |
| ,, | 1628 | భీమునిపట్నం, కాకినాడలలో డచ్చి ఫ్యాక్టరీల నిర్మాణం |
| ,, | 1682 | విశాఖపట్టణంలో ఇంగ్లీషు ఫ్యాక్టరీ స్థాపన |
| ,, | 1687 | గోల్కొండ రాజ్యాన్ని ఔరంగజేబు ఆక్రమించడం |
| ,, | 1724 | నైజాం నవాబుల పరిపాలనా ప్రారంభం |
| ,, | 1757 | బొబ్బిలియుద్ధం |
| ,, | 1788 | గుంటూరుజిల్లాను ఇంగ్లీషువారికి నైజాంనవాబు ఇచ్చివేయడం |
| ,, | 1806 | బందరులో సిపాయిల తిరుగుబాటు |
| ,, | 1851 | గోదావరి ఆనకట్ట నిర్మాణం |
| ,, | 1855 | కృష్ణా ఆనకట్ట నిర్మాణం |
| ,, | 1877 | బకింగ్‌హాం కెనాల్ నిర్మాణం |
| ,, | 1908 | బందరులో ఆంధ్రమహాసభ |
| ,, | 1921 | భారతదేశంలో మొట్టమొదటిగా పలనాడులో పన్నుల నిరాకరణోద్యమం |
| ,, | 1921 | పలనాడు వీరహనుమంతు హత్య |
| ,, | 1922 | అల్లూరిసీతారామరాజు నాయకత్వాన మన్యంప్రజలతిరుగుబాటు |
| ,, | 1923 | కాకినాడలో అఖిలభారత కాంగ్రెస్ సమావేశం |
| ,, | 1930 | హెచ్. ఎం. రెడ్డి గారిచేత తొలి తెలుగుచిత్రనిర్మాణం |
| ,, | 1933 | విశాఖపట్టణం హార్బరు నిర్మాణ ప్రారంభం |
| ,, | 1946 | తెలంగాణా సాయుధ పోరాటం ప్రారంభం |
| ,, | 1947 | స్వతంత్ర భారతావతరణ |
| ,, | 1952 | డిసెంబరు 15, పొట్టి శ్రీరాములు ఉపవాసదీక్ష-మరణం |
| ,, | 1953 | అక్టోబరు 1, ఆంధ్ర రాష్ట్ర అవతరణ |
| ,, | 1955 | డిసెంబరు 29, నాగార్జున ప్రాజెక్టుకు శంఖుస్థాపన |
| ,, | 1956 | నవంబరు 1, ఆంధ్రప్రదేశ్ అవతరణ. |

# 5

# ఆంధ్రప్రదేశ్ అవతరణ

1903 లో గుంటూరు యువజన సాహితీసమితి చర్చల సందర్భంగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రానికి పునాది ఏర్పడింది. 1928 లో అఖిలపక్ష మహాసభలవారు నియమించిన మోతీలాల్ కమిటీ భాషాప్రయుక్త రాష్ట్ర సూత్రాన్ని ఆమోదించింది. 1938లో ప్రతిపాదింపబడిన ఆంధ్ర రాష్ట్ర తీర్మానాన్ని రాష్ట్ర శాసనసభ ఆమోదించింది. ఆ సంవత్సరమే జరిగిన ఆంధ్ర మహా సభలో మద్రాసు నగరం రాజధానిగా ఉండాలని తీర్మానించడమైంది కాని తమిళులలో వ్యతిరేకత కలిగించింది.

1947 ఆగష్టు 15న దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. 1947 నవంబరు 27న అప్పటి ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని అంగీకరిస్తున్నట్లుగాను, దానిని భారత రాజ్యాంగంలో సమోదు చేయవచ్చుననీ ప్రకటించారు. కాని అది కొన్ని కారణాంతరాలవల్ల కార్యరూపం ధరించలేదు.

1952 లో శ్రీ పొట్టి శ్రీరాములుగారు 58 రోజులపాటు మదరాసులో ఆమరణ నిరాహార దీక్ష చేశారు. అనంతరం 1953 అక్టోబరు 1 వ తేదీన ఆంధ్రరాష్ట్రం కర్నూలు రాజధానిగా ఏర్పడింది. శ్రీ సి. ఎమ్. త్రివేదీ ప్రథమ గవర్నరు. శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రి, శ్రీ నీలం సంజీవరెడ్డి ఉప ముఖ్యమంత్రి. దేశ స్వాతంత్ర్యం లభించిన తరువాత మనదేశంలో ఏర్పడిన మొట్టమొదటి భాషా ప్రయుక్త రాష్ట్రం ఆంధ్ర రాష్ట్రమే.

భారత దేశానికి 1947 ఆగష్టులో స్వాతంత్ర్యం వచ్చినా, తెలంగాణా ప్రాంతం నిజాం నవాబు పాలన క్రిందనే ఉంది. నిజాం నవాబు తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు. కాని నిరంకుశ పాలనలో నలిగిపోయిన ప్రజలు సాయుధ పోరాటం ఆరంభించారు. జాగీర్దారీ విధానాన్ని, నిజాం పాలననూ అంతం చెయ్యడమే ఈ పోరాటం ప్రధాన లక్ష్యాలు. కాని 'మజ్లీస్ - ఎ - ఇత్తెహాదుల్ ముసల్మీన్' అనే మత సంస్థ ముస్లిం రాజ్యాన్ని నిలబెట్టుకొనే ఉద్దేశంతో ఖాసిం రజ్వీ నాయకత్వంలో నిజాం నవాబుకు మద్దతు ప్రకటించింది, వేలాది ముస్లింలు రజాకార్లుగా చేరి నిజాం సైన్యాలను బలపరచారు. భారతసైన్యాలు 1948 , 14 సెప్టెంబరు నాడు హైదరాబాదుపై పోలీసు చర్యను అమలు జరిపిన ఫలితంగా తెలంగాణ ప్రాంతం భారత రాజ్యాంగ పరిధిలో చేరింది.

1946 నుంచి 'విశాలాంధ్ర' కై కృషి జరిగింది. 1949 ప్రాంతంలో అయ్యదేవర కాళేశ్వరరావుగారు 'విశాలాంధ్ర మహాసభ' నెలకొల్పారు. 1953లో నెహ్రూ గారు రాష్ట్ర పునర్నిర్మాణ సమస్య పరిష్కరించేందుకు 'రాష్ట్ర పునర్విభజన కమిషన్' ఏర్పాటుచేశారు. కాని ఈ సంఘం 1955 లో తన నివేదికలో ప్రత్యేక తెలంగాణా ఏర్పాటు చేయాలనీ, 1961 లో తెలంగాణా రాష్ట్ర శాసనసభ్యులు విలీనం అవుతామంటే 2/3 వంతు మెజారిటీతో విశాలాంధ్రను ఏర్పరచ వచ్చుననీ తెలియ జేసింది. కాని అప్పటి ఆంధ్ర, తెలంగాణాల ముఖ్య మంత్రులు బెజవాడ గోపాలరెడ్డిగారు, బూర్గుల రామకృష్ణరావు గారు 'విశాలాంధ్ర' ను కోరారు. 1955 నవంబరులో జాతీయ కాంగ్రెసు ఈ విషయమై ఒక సబ్‌కమిటీని నియమించింది. దీనిలో సభ్యులయిన నెహ్రూగారు హైదరాబాదు పర్యటన చేయగా, ఆయనకు 'విశాలాంధ్ర' నినాదాలే ఎక్కువగా వినిపించాయి. అయినా ఇతర సభ్యులయిన మౌలానా ఆజాద్ వంటివారు విశాలాంధ్ర నిర్మాణాన్ని వ్యతిరేకించడం వల్ల ఆంధ్ర రాష్ట్ర శాసనసభ తిరిగి విశాలాంధ్రను కోరుతూ తీర్మానం చేసింది. 1956 ఫిబ్రవరి 20 వ తేదీన ఆంధ్రనుంచి బెజవాడ గోపాలరెడ్డి ప్రభృతులు, తెలంగాణా నుంచి కె. వి. రంగారెడ్డి ప్రభృతులతో ఒక 'పెద్దమనుషుల ఒప్పందం' జరిగింది. ఈ ఒప్పందంలో తెలంగాణాకు ఎన్నో రక్షణలు కల్పించడమైంది. ముల్కీ నిబంధనలు అమలు పరచాలనీ, తెలంగాణా మిగులు ఆదాయాన్ని తెలంగాణా ప్రాంతాభివృద్ధికే ఖర్చు చేయడం, రాష్ట్రంలోని మొత్తం విద్యా సంస్థలలో మూడో వంతు స్థానాలు తెలంగాణాకు కేటాయించడం, జరిపే నియామకాలన్నీ జనాభా నిష్పత్తి ప్రకారం ఇవ్వాలనీ, తెలంగాణా ప్రాంతం అభివృద్ధికై ప్రాంతీయ మండలి ఏర్పరచాలనీ షరతులు వీటిలో ముఖ్యమైనవి. ఈ షరతులలో 1956 ఆగష్టు 10 వ తేదీన 'విశాలాంధ్ర' అన్నదానికి బదులుగా 'ఆంధ్రప్రదేశ్' గా రాజ్యాంగ చట్టపు 7 వ సవరణ బిల్లును లోక్‌సభలో ప్రవేశ పెట్టడం జరిగింది. 1956 నవంబరు 1 వ తేదీన హైదరాబాదు రాజధాని నగరంగా ఆంధ్రప్రదేశ్ అవతరించింది.

ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవాన్ని అప్పటి భారతదేశపు ప్రధానమంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూ ప్రారంభించారు. శ్రీ నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి 1956లో గట్టి పునాదులు పడినాయి. దేశకాలపరిస్థితుల దృష్ట్యా 1960 జనవరిలో శ్రీ దామోదరం సంజీవయ్య, 1962 మార్చిలో శ్రీ నీలం సంజీవరెడ్డి, 1964 ఫిబ్రవరిలో శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి, 1971 సెప్టెంబరులో శ్రీ పి.వి. నరసింహా రావు, 1973 డిసెంబరులో శ్రీ జలగం వెంగళరావు, 1978 మార్చిలో డాక్టరు ఎం. చెన్నారెడ్డి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ముఖ్యమంత్రి పదవులను స్వీకరించి రాష్ట్రం సర్వతోముఖాభివృద్ధికి, అనేకరంగాలలో సత్వర ప్రగతికి తోడ్పడినారు. 1956 నవంబరు నాటి ఆంధ్రప్రదేశ్‌కు 1980 నవంబరు నాటి ఆంధ్రప్రదేశ్‌కు వ్యవసాయక, పారిశ్రామిక, సహకార, రవాణా-కమ్యూనికేషన్లు, విద్యుచ్ఛక్తి, వర్తక, వాణిజ్య, విద్య, వైద్య, మార్కెటింగ్, ఉపాధికల్పన మొదలైన రంగాలలో ఎంతో వ్యత్యాసముంది. గత ఇరవై అయిదు సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ బలమైన మంత్రి వర్గాల పటిష్టమైన పరిపాలనా సామర్థ్యం కింద ఎంతో ముందంజ వేసింది. లక్ష్యాల

మేరను పలు రంగాలలో ప్రగతిని సాధించడం జరిగింది. ఖనిజ, అటవీ సంపదల పెంపుదలకు చర్యలు తీసుకోవడమైంది. మత్స్య సంపద పెరిగింది. నదీ జలాల వనరులను అభిలషణీయమైన పరిమాణంలో వినియోగించుకోవడమైంది. రవాణా, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి, కార్మికులు - సాంఘిక సంక్షేమం, విద్య, వైద్యం, సహకారం మొదలైన మౌలిక సౌకర్యాలను ప్రజలకు అందించడంలో మనరాష్ట్రం ఏ రాష్ట్రానికీ తీసిపోలేదు. కొన్ని అంశాలలో బాగా ముందంజ వేసిందని చెప్పవచ్చు. వ్యవసాయం, పరిశ్రమ, పశుగణాభివృద్ధి, ప్రణాళికల అమలు, వెనకబడిన వర్గాలకు తోడ్పాటు, ఆర్థికాభివృద్ధి మొదలైన విషయాలలో మన రాష్ట్రం లక్ష్యాలమేరకు ప్రగతిని సాధించింది. అంతేకాకుండా ఈ పాతికేళ్ళలో భాష, సాహిత్యం, లలితకళలు, సాంస్కృతిక కార్యకలాపాలలో కూడా ఆంధ్రప్రదేశ్ గణనీయమైన వికాసాన్ని పొందింది. 1955-56 తో ఆంధ్రప్రదేశ్ మొత్తం ఆదాయం (1960-61 ధరల ప్రకారం) రూ 873 కోట్లుఉండగా, 1978 - 79లో 1,800 కోట్లు ఉంది. తలసరి ఆదాయం (1960-61 ధరల ప్రకారం) 1955-56 తో రూ 260 ఉండగా 1978-79 లో రూ 349 ఉంది. కింద పేర్కొన్న పట్టిక ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటికీ, ఇప్పటికీ వివిధ రంగాలలో జరిగిన అభివృద్ధిని తేటతెల్లం చేయగలదు.

| అంశాలు | యూనిట్ | 1955-56 | 1978-79 |
|---|---|---|---|
| రాష్ట్ర ఆదాయం(1961-61 ధరలలో) | (రూ కోట్లు) | 873 | 1,800 |
| తలసరిఆదాయం(1960-61ధరలలో) | (రూ) | 260 | 349 |
| జనాభా | (మిలియన్లు) | 33 | 49 |
| నీటిపారుదలకింద ఉన్న భూమి | (లక్షల హెక్టార్లు) | 33.9 | 47 |
| వ్యావసాయక ఉత్పత్తుల సూచీ | (ఆధారం:1956-57 =100) | 93.6 | 180 |
| ఆహారధాన్యాల ఉత్పత్తి | (లక్షల టన్నులు) | 56.2 | 106.7 |
| విద్యుచ్ఛక్తి - స్థాపితశక్తి | (మెగావాట్లు) | 131.9 | 1,677.9 |
| విద్యుచ్ఛక్తి - ఉత్పత్తి అయినది | (మిలియన్ KWH) | 239.2 | 6,055.6 |
| బొగ్గుఉత్పత్తి | (లక్షల టన్నులు) | 16.4 | 90.4 |
| రోడ్లు | ('000 కి మీటర్లు) | 18.2 | 32.6 |
| రిజిస్టరైన మోటారు వాహనాలు | ('000) | 25 | 236 |
| ప్రాథమిక తరగతులలో పిల్లల నమోదు (I నుంచి V) | (లక్షలు) | 23.3 | 49.2 |
| ప్రభుత్వ ఆస్పత్రుల పడకలు | (సంఖ్య) | 12,340 | 24,018 |

మూలం: అర్థగణాంకశాఖ, ఎ.పి. 1978-79

పైన స్థూలంగా ఇచ్చిన పట్టిక చూస్తే ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత ఎంత అభివృద్ధిని సాధించిందో ఎవరికైనా స్పష్టంగా అవగాహన కాగలదు.

రానున్న సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్‌కు ఎంతో భవిష్యత్తున్నది. మనభారత ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధి అన్నట్లు "ఆంధ్రప్రదేశ్ ప్రజలు దృఢ కార్యదీక్షాపరాయణులుగానూ, ఉత్సాహవంతులుగానూ ఖ్యాతి గడించారు. ఈ సుగుణాలను సమాయత్తం చేసి భారతజాతి మహోన్నత శిఖరాలను అందుకోగల పునాదులను రూపొందించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రజలను కార్యోన్ముఖులను చేద్దాం." కోస్తా ఆంధ్రా ధాన్యలక్ష్మి; రాయలసీమ రత్నాలసీమ; తెలంగాణా పారిశ్రామిక నిలయం. ఈ మూడు ప్రాంతాల సంతులిత, సమగ్రాభివృద్ధివల్ల ఆంధ్రప్రదేశ్ భారతదేశానికి శిరోమణిగా అచిర కాలంలోనే రాణించగలదు. ఆంధ్రప్రదేశ్‌లో వనరులకు కొదువ లేదు. వాటిని వెలికితీసి, అభిలషణీయంగా ఉపయోగించుకోవడమే మన కర్తవ్యం. ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికంగా కాస్త వెనకబడి ఉంది. పథకాలలో, ప్రాజెక్టులలో ఉన్న పరిశ్రమలు అవతరించి, అభివృద్ధి చెందితే ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికీకరణ మహోన్నత దశకు చేరుకోగలదు. ప్రజలు, ప్రభుత్వం, సమష్టి కృషితో ఆంధ్రప్రదేశ్ ఇంకా ఎంతో ప్రగతిని సాధించి, భారతదేశంలోని ఇతర రాష్ట్రాలకు ఆదర్శప్రాయంగా నిలుస్తుందని ఆశిద్దాం.

## ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత జరిగిన ముఖ్య సంఘటనలు

| | | | |
|---|---|---|---|
| 1956 | నవంబరు | 1 | ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఆంధ్రప్రదేశ్ అవతరణకు ప్రారంభోత్సవం చేయడం<br>నీలం సంజీవరెడ్డి మంత్రివర్గం ప్రమాణస్వీకారం |
| ,, | డిసెంబరు | 4 | విధానసభ మొదటి స్పీకరుగా శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావు ఎన్నిక |
| 1957 | మే | 20 | హైదరాబాద్‌లో ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులు నిర్యాణం |
| ,, | ఆగష్టు | 7 | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీని రాష్ట్రపతి డా. రాజేంద్ర ప్రసాద్ ప్రారంభోత్సవం చేయడం |
| ,, | నవంబరు | 30 | కాల్‌టెక్స్ పెట్రోల్ శుద్ధి కర్మాగారానికి విశాఖపట్నంలో ప్రారంభోత్సవం |
| ,, | డిసెంబరు | 23 | ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రారంభోత్సవం |
| ,, | ,, | 24 | విజయవాడలో కృష్ణ ( ప్రకాశం ) బ్యారేజి పని మొదలు |
| 1958 | ఏప్రిల్ | 1 | రోడ్డు రవాణా జాతీయకరణ పథకానికి కృష్ణా జిల్లాలో ప్రారంభోత్సవం |
| ,, | జూలై | 8 | ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కమతాల పరిమితి బిల్లు ప్రకటన |
| 1959 | అక్టోబరు | 11 | ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ షాద్‌నగర్ పంచాయతీ సమితికి ప్రారంభోత్సవం చేయడం |

| | | | |
|---|---|---|---|
| 1959 | డిసెంబరు | 1 | 20 జిల్లాపరిషత్తుల ఏర్పాటు |
| ,, | ,, | 3 | కాంగ్రెస్ అధ్యక్షునిగా శ్రీ నీలం సంజీవరెడ్డి ఎన్నిక |
| ,, | ,, | 7 | డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్య మరణం |
| 1960 | జనవరి | 11 | రాష్ట్రముఖ్యమంత్రిగా శ్రీ డి. సంజీవయ్య ప్రమాణ స్వీకారం |
| ,, | మే | 6 | తొలి అఖిల భారత తెలుగు రచయితల మహాసభను ఉపరాష్ట్రపతి డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ ప్రారంభోత్సవం |
| ,, | జూలై | 1 | ఆంధ్రప్రదేశ్ గృహ నిర్మాణ బోర్డు అవతరణ |
| 1961 | జనవరి | 2 | యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ చైర్మన్‌గా డా. వి. యస్. కృష్ణ నియామకం |
| ,, | ,, | 16 | ఢిల్లీలో డా. వి. యస్. కృష్ణ అస్తమయం |
| ,, | మే | 1 | ఆస్థాన కవిగా శ్రీ కాశీ కృష్ణమాచార్య నియామకం |
| ,, | జూన్ | 14 | సుప్రసిద్ధ పత్రికా రచయిత శ్రీ ఖాసా సుబ్బారావు (మద్రాసులో) అస్తమయం |
| ,, | సెప్టెంబరు | 18 | రాష్ట్ర లలితకళా అకాడమీ ప్రారంభోత్సవం |
| ,, | ,, | 22 | లఘుపరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్ ఏర్పాటు |
| ,, | డిసెంబరు | 6 | సోవియట్ వ్యోమగామి శ్రీ యూరిగగారిన్‌కు, ఆయన సతీమణికి హైదరాబాద్‌లో స్వాగతం |
| 1962 | ఫిబ్రవరి | 19 | మూడో సాధారణ ఎన్నికల పోలింగ్ |
| ,, | ,, | 16 | శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు కాలధర్మం |
| ,, | మార్చి | 12 | శ్రీ నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా మంత్రివర్గం ప్రమాణ స్వీకారం |
| ,, | జూన్ | 4 | శ్రీ డి. సంజీవయ్య కాంగ్రెస్ అధ్యక్ష పదవిని స్వీకరించడం |
| ,, | జూలై | 3 | మెదక్‌జిల్లా నర్సాపూర్‌లో పాఠశాల విద్యార్థులకు కేర్ సంస్థ యొక్క మధ్యాహ్న భోజన పథకానికి అమెరికా రాయబారి ప్రొఫెసర్ గాల్‌బ్రెత్ ప్రారంభోత్సవం చేయడం |
| ,, | సెప్టెంబరు | 7 | ఆంధ్రప్రదేశ్ గవర్నరుగా జనరల్ శ్రీ నగేష్ ప్రమాణస్వీకారం |
| ,, | నవంబరు | 2 | సుప్రసిద్ధ రచయిత శ్రీ త్రిపురనేని గోపీచంద్ అస్తమయం |
| 1963 | జూలై | 4 | జాతీయ పతాకనిర్మాత శ్రీ పింగళి వెంకయ్య విజయవాడలో అస్తమయం |
| ,, | ,, | 24 | శ్రీశైలం జలవిద్యుత్పథకానికి ప్రధాని శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూ శంఖుస్థాపన |

| | | | |
|---|---|---|---|
| 1963 | జూలై | 26 | పోచంపాడు ప్రాజెక్టుకు ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ శంఖుస్థాపన |
| ,, | అక్టోబరు | 6 | హైదరాబాదులో నెహ్రూ జూలాజికల్ పార్కు ప్రారంభం |
| ,, | డిసెంబరు | 23 | ఆంధ్రప్రదేశ్ సైన్స్ అకాడమి స్థాపన |
| 1964 | ఫిబ్రవరి | 29 | శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గం ప్రమాణ స్వీకారం |
| ,, | ఏప్రిల్ | 4 | విజయవాడ మునిసిపాలిటీ షష్ఠ్యబ్దోత్సవాంకు శ్రీ కె. కామరాజ్ ప్రారంభోత్సవం. |
| ,, | మే | 4 | గవర్నరుగా శ్రీ పట్టంథాను పిళ్లె ప్రమాణస్వీకారం. |
| ,, | నవంబరు | 25 | ఆస్థాన సంగీత విద్వాంసులు శ్రీద్వారం వెంకటస్వామినాయుడు అస్తమయం. |
| 1965 | మార్చి | 20 | ప్రధానిలాల్ బహదూర్‌శాస్త్రి హైదరాబాదులోని వ్యవసాయ విశ్వవిద్యాలయానికి ప్రారంభోత్సవం చేయడం. |
| ,, | మే | 5 | రాజమండ్రి దగ్గర గోదావరిపై రెండో రైలు వంతెనకు శంకుస్థాపన. |
| ,, | జూలై | 13 | భద్రాచలంవద్ద గోదావరిపై వంతెనకు రాష్ట్రపతి డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ ప్రారంభోత్సవం |
| ,, | డిసెంబరు | 11 | రామచంద్రా పురంలోని భారత హెవీ ఎలక్ట్రికల్స్ ఫ్యాక్టరీకి ప్రధాని శ్రీ లాల్ బహదూర్‌శాస్త్రి ప్రారంభోత్సవం చేశారు. |
| 1966 | జూన్ | 23 | హైదరాబాదులోని జవహర్ బాలభవన్‌కు, కమలానెహ్రూ బాలికల పాలిటెక్నిక్‌కు ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ప్రారంభోత్సవం చేశారు. |
| 1967 | జనవరి | 19 | తుంగభద్రా హైలెవెల్ కాలువకు ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ప్రారంభోత్సవం చేశారు. |
| | ,, | 10 | హైదరాబాదులో హిందూస్తాన్ కేబిల్స్ ఫ్యాక్టరీకి శంఖుస్థాపన |
| ,, | మార్చి | 6 | శ్రీ బ్రహ్మానందరెడ్డి ముఖ్య మంత్రిగా నూతన మంత్రి వర్గం ప్రమాణస్వీకారం. |
| ,, | ఏప్రిల్ | 19 | ఆస్థానకవి శ్రీ కాశీ కృష్ణమాచార్యు కాలధర్మం. |
| ,, | ఆగష్టు | 4 | ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి నాగార్జున సాగర్ జలాల విడుదలకు ప్రారంభోత్సవం చేయడం. |
| ,, | సెప్టెంబరు | 15 | రాష్ట్ర మాజీ ముఖ్య మంత్రి డా. బూర్గుల రామకృష్ణరావు అస్తమయం. |
| ,, | డిసెంబరు | 10 | విశాఖపట్నంలో కోరమాండల్ ఫెర్టిలైజర్ ఫాక్టరీ ప్రారంభం |

| | | | |
|---|---|---|---|
| 1968 | ఏప్రిల్ | 11 | శ్రీ ఖండూబాయి దేశాయ్ రాష్ట్రగవర్నరుగా ప్రమాణ స్వీకారం |
| ,, | ఆగష్టు | 6 | తెలుగు అకాడమి అవతరణ |
| 1969 | ఆగష్టు | 24 | రాష్ట్రపతిగా శ్రీ వి. వి. గిరి ఎన్నిక |
| 1970 | ఫిబ్రవరి | 2 | ఒంగోలు ( ప్రకాశం ) జిల్లా అవతరణ |
| 1971 | జనవరి | 20 | విశాఖపట్నంలో ఉక్కు కర్మాగారానికి ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి శంకుస్థాపన చేయడం |
| ,, | మార్చి | 5 | పార్లమెంటు ఎన్నికలకు పోలింగు |
| ,, | ,, | 10 | జనాభా లెక్కల సేకరణ ప్రారంభం |
| ,, | జూలై | 3 | శ్రీ విశ్వనాధ సత్యనారాయణకు జ్ఞాన్‌పీఠ్ బహుమతి లభించడం |
| ,, | సెప్టెంబరు | 13 | ఒంగోలు జిల్లా పేరును ప్రకాశం జిల్లాగా మార్చడానికి రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకోవడం |
| | ,, | 30 | ముఖ్య మంత్రిగా శ్రీ పి. వి. నరసింహారావు ప్రమాణ స్వీకారం |
| | అక్టోబరు | 9 | శ్రీహరి కోటనుంచి మొదటిరాకెట్ ప్రయోగం |
| 1972 | మార్చి | 5 | విధానసభ ఎన్నికల పోలింగ్ |
| | ,, | 17 | కాంగ్రెస్ లెజిస్లేటర్ పార్టీ నాయకునిగా శ్రీ పి. వి. నరసింహారావు ఎన్నిక |
| | మే | 2 | భూమి గరిష్ఠ పరిమితిపై ఆర్డినెన్స్ జారీ |
| | ,, | 7 | ఢిల్లీలో శ్రీ దామోదరం సంజీవయ్య అస్తమయం |
| | జూన్ | 5 | పట్టణ భూముల గరిష్ఠ పరిమితిపై ఆర్డినెన్స్ జారీ |
| 1973 | జనవరి | 17 | శ్రీ పి. వి. నరసింహారావు రాజీనామా |
| | ,, | 18 | ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన విధింపు |
| | సెప్టెంబరు | 10 | ముఖ్య మంత్రిగా శ్రీ జలగం వెంగళరావు ప్రమాణస్వీకారం |
| 1974 | మార్చి | 7 | బీబీనగర్ - నడికూడి రైలు మార్గానికి ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ శంకుస్థాపన. |
| | ,, | 8 | విజయవాడ సమీపంలోని ఇబ్రహీం పట్నం థర్మల్ ప్రాజెక్టుకు ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ శంకుస్థాపన చేయడం |
| ,, | అక్టోబరు | 2 | కృష్ణా ఎక్స్‌ప్రెస్‌కు ప్రారంభోత్సవం |
| 1975 | ఏప్రిల్ | 10 | హైదరాబాదులో ప్రపంచ తెలుగు మహాసభలకు ఉప రాష్ట్రపతి శ్రీ జట్టి ప్రారంభోత్సవం చేయడం |
| | ,, | 17 | డా. సర్వేపల్లి రాధాకృష్ణ కాలధర్మం |

| | | | |
|---|---|---|---|
| 1975 | జూన్ | 28 | దేశంలో అత్యవసర పరిస్థితి ప్రకటన |
| | సెప్టెంబరు | 8 | హైదరాబాదులో అంతర్జాతీయ తెలుగు సంస్థ ప్రారంభం |
| | అక్టోబరు | 4 | హైదరాబాదులో ఫిలిం అభివృద్ధి కార్పొరేషన్ ప్రారంభం |
| | నవంబరు | 1 | హైదరాబాదులో పట్టణాభివృద్ధి సంస్థ ( Urban Development Authority) ప్రారంభం |
| 1976 | జనవరి | 3 | విశాఖపట్నంలో సైన్స్ కాంగ్రెసుకు ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధి ప్రారంభోత్సవం చేయడం |
| | ,, | 10 | గవర్నరుగా శ్రీమోహన్‌లాల్ సుఖాడియా ప్రమాణ స్వీకారం |
| | ఏప్రిల్ | 1 | జిల్లాస్థాయిలో అధికార భాషగా తెలుగు అమలు |
| | జూన్ | 15 | గవర్నరుగా శ్రీ ఆర్. డి. భండారే ప్రమాణ స్వీకారం |
| | ఆగష్టు | 8 | రాయలసీమ గ్రామీణ బ్యాంకుకు కడపలో ప్రారంభోత్సవం |
| | ,, | 20 | కాకతీయ విశ్వ విద్యాలయం ప్రారంభం |
| | సెప్టెంబరు | 9 | నాగార్జున విశ్వ విద్యాలయం ప్రారంభం |
| | ,, | 13 | జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వ విద్యాలయానికి రాష్ట్రపతి ప్రారంభోత్సవం |
| | ,, | 14 | బాలల అకాడమి స్థాపన |
| | అక్టోబరు | 18 | శ్రీ విశ్వనాధ సత్యనారాయణ కాలధర్మం |
| 1977 | ఏప్రిల్ | 19 | గవర్నరుగా శ్రీమతి శారదా ముఖర్జీ నియామకం |
| ,, | ఆగష్టు | 15 | ఆస్థాన కవిగా శ్రీ దాశరథి కృష్ణమాచార్యుల నియామకం |
| ,, | నవంబరు | 8 | ప్రముఖ చలనచిత్ర నిర్మాత, దర్శకుడు శ్రీ బి. యన్. రెడ్డి అస్తమయం |
| ,, | ,, | 20,21 | కోస్తా ప్రాంతాలలో ( ప్రకాశం, కృష్ణ, గుంటూరు, తూర్పు గోదావరి, నెల్లూరు జిల్లాలలో ) 113 సంవత్సరాలలో కనీ వినీ ఎరుగని భీకరమైన తుఫాను. కొన్ని వేల ప్రాణనష్టం, కొన్ని కోట్ల రూపాయల ఆస్తినష్టం. |
| 1978 | జనవరి | 25 | విధాన సభ్యుల ఎన్నికలకు పోలింగు |
| | మార్చి | 6 | ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రిగా డా. ఎం. చెన్నారెడ్డి ప్రమాణ స్వీకారం |
| | మే | 1 | భూసంస్కరణల తగాదాల పరిష్కారం నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం అయిదు అప్పిలేట్ ట్రిబ్యునళ్లను నియమించింది. |
| | జూలై | 7 | హైదరాబాదు జిల్లా విభజనకు గెజిట్‌లో ప్రకటన |

| | | | |
|---|---|---|---|
| 1978 | జూలై | 23 | రాష్ట్రంలో 25 వేల జనాభాగల నగరాలన్నీ మున్సిపాలిటీలుగా పరిగణించబడతాయని ప్రభుత్వ ప్రకటన |
| | ఆగష్టు | 14 | ఆంధ్రప్రదేశ్ గవర్నరుగా శ్రీ కె. సి. అబ్రహాం ప్రమాణ స్వీకారం |
| | నవంబరు | 5 | పోచంపాడు ప్రాజెక్టుకు శ్రీరాంసాగర్ అనిపేరు మార్చడమైంది. ఉత్తరపు కాలువకు సరస్వతీ కాలువఅనీ, హైలెవల్ కాలువకు లక్ష్మి కాలువఅనీ పేరు మార్పుచేయడమైంది. |
| | ,, | 14 | రామగుండం వద్ద 2100 మెగావాట్ల సూపర్ థర్మల్ స్టేషనుకు ప్రధాని శ్రీ మొరార్జీదేశాయి ప్రారంభోత్సవం |
| | ,, | 25 | అయిదెకరాల మెట్ట లేదా రెండు ఎకరాల మాగాణి ఉన్న పట్టాదార్లకు భూమిశిస్తుచెల్లింపు గురించి మినహాయిస్తూ రాష్ట్ర గవర్నరు ఆర్డినెన్సు |
| ,, | నవంబరు | 7 | ఏడవ ఆర్థిక కమీషన్ సిఫార్సుల ఫలితంగా రాష్ట్రానికి కేంద్రం గురించి ఆర్థిక సహాయం రూ 776 కోట్ల నుంచి రూ 1,552 కోట్లకు పెరుగుదల |
| 1979 | జనవరి | 1 | సిమెంటు పంపకాన్ని రాష్ట్ర ప్రభుత్వం చేపట్టింది. |
| | మే | 4 | గుడిపాటి వెంకటచలం కాలధర్మం |
| | ,, | 18 | తిరుమల తిరుపతి దేవస్థానంను స్వయం నిర్ణయాధికార సంస్థగా చేస్తూ ఆర్డినెన్స్ జారీ |
| | జూన్ | 1 | విజయనగరం జిల్లా ఏర్పాటు |
| | ,, | 4 | ప్రభుత్వ కార్యాలయాలలో కొత్త పనివేళలు ప్రారంభం. ఉదయం 7-30 నుంచి మధ్యాహ్నం 2-15 వరకు పనివేళలు. వారానికి అయిదు రోజులే పని దినాలు. |
| | జూలై | 22 | రాజమండ్రివద్ద గోదావరి పుష్కరాలు ప్రారంభం |
| | ,, | 30 | ప్రధాని శ్రీ చరణ్‌సింగ్ హైదరాబాదులోని పట్టం చెర్వు దగ్గర ఇక్రిసాట్ నూతన భవనాలకు ప్రారంభోత్సవం |
| | సెప్టెంబరు | 2 | శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం రజతోత్సవం |
| | నవంబరు | 10 | శ్రీ తెన్నేటి విశ్వనాధం కాలధర్మం |

# 6

# సంస్కృతి, భాష, సాహిత్యం, కళలు

ఆయా చారిత్రక యుగాలలో భిన్న భిన్న ప్రజలు ఆంధ్ర దేశంలో ప్రవేశించి, అంతకు ముందు ఇక్కడ ఉన్న ప్రజలతో కలిసిపోయి నేటి తెలుగు జాతిగా రూపొందారు. వర్తమాన ఆంధ్రప్రజల శారీరకాన్ని, ఆచార వ్యవహారాలను, భాషను పరిశీలిస్తే, ఈ అంశం ధ్రువపడుతుంది. తెలుగువారిలో ఆజానుబాహువులూ, పొట్టివారు, నల్లనివారు భిన్న ప్రాంతాలలోనే గాక, ఒకే ప్రాంతంలోను, ఒకే కుటుంబంలోను కూడా కనబడతారు. అట్లాగే మన ఆచార వ్యవహారాలు కూడా విభిన్న సంప్రదాయాలు సమన్వయం పొందినట్లు తెలుస్తుంది. ఉదాహరణకు, వివాహ కాండను పరిశీలిస్తే ఆర్య, అనార్యాచారాలు రెండూ కనబడతాయి. పాణిగ్రహణం, సప్తపది వంటివి ఆర్య పద్ధతులు. మంగళ సూత్ర ధారణ, ఐరేణి కుండలు, క్రంత వంటివి అనార్య పద్ధతులు. అట్లాగే సంస్కృత, ప్రాకృత, దేశ భాషలు కలిసి ఆంధ్ర భాషగా రూపొందింది.

ఆంధ్ర దేశంలో వైదిక మతం, బౌద్ధం, జైనం, వీరశైవం, విశిష్టాద్వైతం, ఇస్లాం, క్రైస్తవ మతం. నాస్తికమతం, బ్రహ్మసమాజ, ఆర్య సమాజాలు, సిక్కుల మతం వర్ధిల్లాయి. మొట్టమొదట క్రీ. పూ. 800 ప్రాంతంలో ఉత్తర భారతం నుంచి కదలివచ్చిన ఆంధ్రులనే తెగ, అప్పటికి స్థానికంగా రూపొందింది. ఆవిధంగా మొదట వైదిక సంస్కృతి దక్షిణాన అడుగుపెట్టింది. బౌద్ధం క్రీ. పూ. 300 నాటికి ఆంధ్ర దేశంలో వ్యాపించింది. బౌద్ధం వెనకడుగు పట్టిన కాలంలో ఆంధ్రదేశంలో జైనం వ్యాపించింది. 1303 లో మాలిక్ కాఫర్ దండయాత్రలో ఆంధ్రదేశంలో ప్రారంభమైన ఇస్లాం నేటికీ ఆంధ్ర దేశంలోనే సజీవంగా ఉంది. క్రీ.శ. 18వ శతాబ్ది ప్రారంభంలో క్రైస్తవం ఆంధ్ర దేశంలో వ్యాపించింది.

అన్ని మతాలు కలిసిఉన్న ఆంధ్రప్రదేశ్‌లో, అన్ని మతాలకు సమానమైన గౌరవం గుర్తింపు ప్రభుత్వం కల్పించింది. ఆయా మతాలవారు తమ తమ పండుగలను, మత సంబంధ ఉత్సవాలను జరుపుకోవడానికి పూర్తి స్వేచ్ఛ ఉంది. ఇన్ని మతాలవారు కలిసి ఉండటం వల్ల, ఒకరి పండుగలపై, మరొక మతంవారి పండుగల ప్రభావం పడటం కూడా ఉంది. ఒక మతం వారు మరొక మతంవారి పండుగలు జరుపుకోవడం కూడా జరుగుతుంది.

తెలుగువారికి కళలపట్ల ఉన్న నైపుణ్యానికి నిదర్శనం బందరు కలంకారీ, నిర్మల్ పెయింటింగ్‌లు, కొండపల్లి బొమ్మలు, పోచంపల్లి, గద్వాల, వెంకటగిరి, గుంటూరు, పట్టు, నూలు వస్త్రాలు, కూచిపూడినాట్యం మొదలైనవి. ఇవన్నీ స్థానికమైన కళలు. అంతర్జాతీ

యంగా గుర్తింపు పొందినవి. వీటి పోషణకు, ప్రోత్సాహానికి ప్రభుత్వం అకాడమీలు నెల కొల్పి, కృషిచేస్తున్నది.

## భాష

1971 జనాభా లెక్కల ప్రకారం తెలుగు మాతృభాషగా గలవారు 4,47,07,697 మంది. అందులో పురుషులు 2,26,20,902 మంది. స్త్రీలు 2,20,86,795 మంది. ఈనాడు తెలుగు ఆంధ్రప్రదేశ్‌లోనేకాక, ప్రపంచంలో అనేక ప్రాంతాలలో అక్కడి తెలుగువారి చేత వ్యవహరింపబడుతోంది. వారందరినీ - అంటే ఇతర రాష్ట్రాలలోను, దేశాలలోను ఉన్న తెలుగు వారందరినీ కలుపుకొంటే సుమారు 6 కోట్లమంది కావచ్చు. భారతదేశంలో హిందీ తరవాత తెలుగు మాట్లాడే వారిదే అధిక సంఖ్య.

తెలుగు భాషకు దాదాపు రెండువేల సంవత్సరాల చరిత్ర ఉంది. క్రీ. శ. 6 వ శతాబ్ది నుంచి సాహిత్య రచనలు లభ్యమవుతున్నాయి. మనకు లభ్యమయినంత వరకు 1050 నాటి నన్నయ భారతం ఆదికావ్యం. కాని అంతకుపూర్వం కొన్ని శతాబ్దాల నుంచి తెలుగు భాష, సాహిత్యాలు వర్ధిల్లినాయి. ఇది ద్రావిడ భాషా కుటుంబానికి చెందినది. అజంతము అంటే అచ్చులతో అంతమయ్యే భాష కావడం మూలంగా వినడానికి లలితంగా, సొంపుగా ఉంటుంది.

తెలుగు భాషలో ప్రాచీన కాలంనుంచి అన్యభాషా పదాలు ఆయా పరిస్థితులకు, అవ సరాలకు అనుగుణంగా వచ్చి చేరి, భాషను సుసంపన్నం చేశాయి. సమకాలీన వ్యవహార భాషా ప్రభావం కావ్యభాషపైన 15 వ శతాబ్ది వరకు తక్కువగాను, ఆ తరవాత అధికం గాను కనిపిస్తుంది. ఆధునిక వ్యవహార భాషా రూపాలు కొన్ని 11-14 శతాబ్దుల కాలంలోనే వ్యవహారంలో ఉన్నట్లు శాసనాల వల్ల తెలుస్తోంది.

19 వ శతాబ్ది వరకు తెలుగు భాషలో వచనసాహిత్యం పెరగలేదు. 1853 లో చిన్నయసూరి నీతి చంద్రిక, 1858 లో బాలవ్యాకరణం అచ్చయిన తర్వాత కావ్య భాషా వ్యాకరణాన్ని వచన భాషకి కూడా వర్తింపజేయాలని పండితులు శిష్ట వ్యావహారిక భాషను గ్రంథాలలో వ్రాయడానికి అంగీకరించలేదు. ఆధునిక విజ్ఞాన వ్యాప్తి సమకాలీన భాషలోనే తప్ప ప్రాచీన కావ్య భాషలో సాధ్యం కాదని గురజాడ అప్పారావుగారు, గిడుగు రామ్మూర్తి పంతులుగారు వ్యవహార భాషోద్యమం నడిపారు. విద్యావిధానంలో అప్పటికి గ్రాంథిక భాషే నిలిచింది.

19 వ శతాబ్ది చివరినుంచే పత్రికలు, రేడియో, సినిమాలవల్ల మాండలికాలకు అతీత మైన ఒక ప్రామాణిక శిష్ట వ్యావహారిక భాష సర్దిష్ట రూపం దాల్చి బహుళ ప్రచారంలోకి వచ్చింది.

తత్ఫలితంగా 1966లో తెలుగు అధికార భాష అయింది. 1969 నుంచి కళాశాలవిద్య తెలుగులో కూడా బోధింపబడుతోంది. 1968 లో ఏర్పడిన తెలుగు అకాడమి వ్రాయించిన గ్రంథాలు ఆధునిక భాషలోనే ఉన్నాయి. కొన్ని విశ్వవిద్యాలయాలలో తెలుగు సాహిత్యం

ప్రధానాంశంగా తీసుకొని చదివే విద్యార్థులు పరిశోధన వ్యాసాలు, పరీక్షాపత్రాలకు సమాధానాలు ఆధునిక భాషలో వ్రాయడానికి అంగీకరించడమైంది.

## సాహిత్యం

### తెలుగువారు సృష్టించిన ఆంధ్రేతర సాహిత్యం

భారతీయ సాహిత్యంలో ఆంధ్రుల పాత్ర గణనీయమైనది. ఆంధ్ర చక్రవర్తి హాల శాతవాహనుడు సంకలనం చేసిన గాథాసప్తశతి, ఆయన మంత్రి గుణాఢ్యుడు రచించిన బృహత్కథ ప్రాకృత సాహిత్యంలో మణిపూసల వంటివి.

ఆంధ్ర లాక్షణికులు, పండితులు చేసిన సంస్కృత రచనలు అనేకమున్నాయి. వాటికి విష్ణుకుండిన మాధవ వర్మ రచించిన జనాశ్రయి ఛందాలు, కాకతి ప్రతాపరుద్రదేవుని ఆస్థానంలోని విద్యానాథుడు రచించిన ప్రతాపరుద్రయశోభూషణం, అన్నంభట్టు రచించిన తర్కసంగ్రహం, జగన్నాథ పండితుడు రచించిన రసావర్ణన సుధాకరం కొన్ని ఉదాహరణలు. అట్లాగే సంస్కృతంలో వసంత రాజీయం రచించిన కుమారగిరి, కాళిదాసు మూడు నాటకాలకు సంస్కృతంలో వ్యాఖ్యానం వ్రాసిన కాటయవేముడు, సాహిత్య రత్నాకరం, సంగీత రత్నాకరం అనే గ్రంథాలు సంస్కృతంలో రచించిన పెద కోమటివేముడు, రసార్ణవ సుధాకరం సంస్కృతంలో రచించిన సర్వజ్ఞ సింగభూపాలుడు ఆంధ్రరాజులే. వీరు రచించిన సంస్కృత గ్రంథాలకు సంస్కృత సాహిత్యంలో ఉన్నతస్థానముంది.

పదో శతాబ్దికే కన్నడంలో కావ్యరచన చేసిన పొన్నడు, ఆదిపంపడు ఆంధ్రదేశపు వారే. కృష్ణ, గోదావరి మధ్యనున్న ఆంధ్రదేశాన్ని ఆనాడు పాలించిన వారు వేంగి అనేవారు. వీరిద్దరూ వేంగి ప్రాంతపు వారే.

### తెలుగు సాహిత్యం

తెలుగుసాహిత్య చరిత్రను సౌలభ్యం కోసం అయిదుయుగాలుగా విభజించి చెబుతారు.

***ప్రాఙ్నన్నయయుగం :*** తెలుగు సాహిత్యంలో ఇంతవరకు మనకు లభించిన మొదటి గ్రంథం వేంగీచాళుక్యుల కాలంలో 11వ శతాబ్దిలో నన్నయ రచించిన 'ఆంధ్రమహాభారత' భాగం. అందువల్ల అంతకు పూర్వపు వాఙ్మయ చరిత్రను ప్రాఙ్నన్నయయుగం అంటారు. అప్పటి సాహిత్యాన్ని గురించి తెలుసుకోవాలంటే శాసనాలే ప్రధానాధారం.

ఆంధ్ర దేశాన్ని ఏలిన తొలిరాజులయిన సాతవాహనుల కాలంలో ప్రాకృతం రాజభాష. శాలంకాయనుల కాలంనాటికి తెలుగుభాష జన సామాన్యంలో వాడుకలో ఉండేదని కొందరు ఊహిస్తున్నారు. క్రీ. శ. 7వ శతాబ్ది పల్లవరాజు మొదటి మహేంద్రవర్మ కాలం నాటికి తెలుగు సర్వసామాన్యంగా వాడుకలో ఉండేదని స్పష్టంగా తెలుస్తోంది.

క్రీ. శ. 848-49 లో రాజ్యాభిషేకంచేసుకొన్న గుణగ విజయాదిత్యుని కాలంనుంచో అంతకు కొంత పూర్వం నుంచో తెలుగులో పద్య రచన ప్రారంభమయింది. క్రీ. శ. 892-921 నాటి చాళుక్య భీమరాజు ఒంగోలు తాలూకా ధర్మవరంలో వేయించిన శాసనంలోని సీస పద్యానికీ, నన్నయ సీస పద్యానికీ దగ్గర పోలికలుండటం గమనించదగ్గ విషయం.

చాళుక్యుల కాలంనుండే తెలుగు భాషకు రాజాదరణ బాగా లభించింది. నన్నయకు పూర్వం దేశీయ ఛందస్సులే ఉండేవి. నన్నయ తెలుగు భాషను సంస్కరించి, సంస్కృత చందస్సులను కూడా తెలుగుకు తెచ్చి, తెలుగులో మహాభారతం వంటి ఉద్గ్రంథం వ్రాయ డానికి చాలిన సర్వసంపన్నమయిన భాషగా తెలుగును తీర్చి దిద్దాడు.

నన్నయకు పూర్వమే తెలుగునాట తుమ్మెదపదాలు, గొబ్బిపదాలు, నివాళిపదాలు, ఆనందపదాలు వంటి పద సాహిత్యం ప్రచారంలో ఉండేదనటానికి బలమైన సాక్ష్యాధారాలు న్నాయి. శాసనాలు, పదకవితలే కాక నన్నయకు పూర్వం గ్రంథరచన కూడా జరిగిం దని కొందరి వాదన.

కుమారసంభవమనే కావ్యాన్ని రచించిన నన్నెచోడుడు నన్నయకుపూర్వుడని కొందరి వాదం. కాని అనేకమందివిమర్శకులు ఆయన 12వ శతాబ్దిఆరంభంలోని వాడని, నన్నయకు తరవాతి వాడని అంటున్నారు.

***భాషాంతరీకరణయుగం :*** ( క్రీ. శ. 1030-క్రీ. శ. 1400 ) ఈ యుగానికి ఇది స్థూల నిర్వచనం మాత్రమే. ఎందువల్లనంటే ఈ కాలంలో భారత రామాయణాదుల అను వాదాలే ప్రధాన వాఙ్మయప్రక్రియ అయింది. ఇవి పేరుకు అనువాదాలే అయినా, శుద్ధ స్వతంత్ర గ్రంథాలు.

ఈ యుగానికి, తెలుగు వాఙ్మయానికి ఆద్యుడు నన్నయ. ఈయన భారతంలో రెండు న్నర పర్వాలు రచించాడు. భారత రచన ముఖ్యంగా వైదికమత పునరుద్ధరణకే ప్రారంభ మైందంటారు. నన్నయ కవితధారాశుద్ధికి, నాదసౌందర్యానికి ప్రసిద్ధి. ఆయనకవిత్వదృష్టి ప్రధా నంగా పౌరాణికం. అనుషంగికంగా కావ్యసంబంధి. త్రిలింగ శబ్దాను శాసనం, కారికావళి అనే రెండు వ్యాకరణగ్రంథాలు రచించిన అథర్వణుడు, కవిజనాశ్రయం రచించిన వేములవాడ భీమకవి నన్నయకు సమకాలికులని ప్రతీతి. నన్నయను పోషించిన రాజరాజనరేంద్రుని తర వాత ఆంధ్ర సారస్వత పోషణ అడుగంటింది.

ఆ తరవాత 12 వ శతాబ్ది ఆరంభంలో కన్నడ దేశంలో బసవేశ్వరుడు స్థాపించిన వీరశైవం తెలుగు దేశంలో వ్యాప్తి చెందింది. ఈ వీరశైవ మతావలంబకులైన కవులకు శివకవులని పేరు. వారిలో కుమారసంభవమనే కావ్యం రచించిన నన్నెచోడుడు ప్రథముడు. ఇది జాను తెలుగులో, వర్ణనా ప్రాధాన్యంతో రచింపబడిన గ్రంథం. శివకవులలో రెండవ వాడు శివతత్త్వసారం, రుద్రమహిమ, లింగోద్భవ గద్యం రచించిన మల్లికార్జున పండితా రాధ్యుడు (1120-1180). మూడవవాడు క్రీ. శ. 13 వ శతాబ్ది ఉత్తరార్థం నాటి పాల్కు రికి సోమనాథుడు. ఈయన రచించిన వాటిలో బసవపురాణం, పండితారాధ్య చరిత్రం ప్రముఖమైనవి. నాల్గవ వాడు శివభక్తిదీపిక అనే గ్రంథాన్ని రచించినట్లుగా ప్రసిద్ధి చెందిన శ్రీపతి పండితుడు. శివకవుల కవిత్వం భక్తిప్రధానమూ, ఆవేశపూరితమూ అయినది. వారు దేశీయ చ్ఛందస్సును, సామాన్యులకు సహితం అందుబాటులో ఉండే జానుతెలుగును స్వీకరిం చడమేకాక, భావ ప్రకటనకు ఆటంకమైన నియమాలను ఉల్లంఘించారు. వీరిలో ప్రత్యేకంగా

పేర్కొనదగినవాడు సోమనాథుడు. మొత్తానికి శివకవులు సాహిత్యంలో ఒకకొత్త మార్గాన్ని సృష్టించారు.

వీరశైవం, రామానుజుడు స్థాపించిన వైష్ణవమతం, 13 వ శతాబ్దిలోని మధ్వాచార్యుల ద్వైత మతం, ప్రజలలో మతవైషమ్యాలను రెచ్చగొట్టి, దేశాన్ని అశాంతిమయం చేశాయి. ఆ పరిస్థితులలో శివకేశవుల అభేదాన్ని పాటించి, వీరశైవ, వీరవైష్ణవ మతాల సామరస్యానికి హరిహరనాథ తత్త్వం ప్రతిపాదించి, నవ్య మార్గాన్ని చూపిన వాడు తిక్కన సోమయాజి. ఈయన క్రీ. శ. 13 వ శతాబ్ది పూర్వార్థంలో నెల్లూరు పాలించిన మనుమసిద్ధి ఆస్థానంలో మంత్రిగా ఉన్నాడు. ఈయన మొదట నిర్వచనోత్తర రామాయణం రచించి, మనుమసిద్ధికే అంకితమిచ్చాడు. నన్నయ ప్రారంభించిన మహాభారతంలో 15 పర్వాలు వ్రాయడం ఓరుగల్లు కాకతి గణపతి దేవుని ఆస్థానంలో పూర్తిచేసి, తనదైవం హరిహర నాథునికి అంకితమిచ్చాడు. ఈయన కవిత్వంలో, అచ్చమైన దేశిత్వాన్ని అవలంబించి, ఎందరికో గురుతుల్యుడయ్యాడు. దశకుమార చరిత్ర వ్రాసిన కేతన, మార్కండేయపురాణం వ్రాసిన మారన, కేయూరబాహుచరిత్ర వ్రాసిన మంచన, సుమతీశతకకర్త బద్దెభూపాలుడు, రంగనాథ రామాయణం అనే ద్విపద కావ్యం వ్రాసిన గోన బుద్ధారెడ్డి, సర్వేశ్వర శతకం వ్రాసిన యథావాక్కుల అన్నమయ్య తిక్కన కాలపువారే.

తిక్కని తరువాత యుగకర్తగా చెప్పదగినవాడు ఎర్రన. ఈయన అద్దంకి రాజు ప్రోలయ వేమారెడ్డి (క్రీ. శ. 14 వ శతాబ్ది పూర్వభాగం) ఆస్థానకవి. భారతంలో నన్నయ, తిక్కనలు రచించకుండా వదిలివేసిన అరణ్యపర్వంలో శేషభాగమేకాక, హరివంశం, నృసింహ పురాణం రచించాడు. ఈయన కాలంలోనే సాహిణి మారన ప్రోత్సాహంతో భాస్కరుడు, మల్లికార్జునభట్టు, కుమారరుద్ర దేవుడు, అయ్యలార్యుడు కలిసి రామాయణం చంపూ కావ్యంగా ( అంటే పద్య, గద్యలతో కూడిన కావ్యం ) 1390 నాటికి రచించడం పూర్తి చేశారు. దీనినే భాస్కరరామాయణం అంటారు. విన్నకోట పెద్దన, అంబికాశతకం, ప్రేమాభిరామం (సంస్కృతం) రచించిన రావిపాటి త్రిపురాంతకుడు, వెన్నెలకంటి జన్న మంత్రి, సంకీర్తనలనే భక్తిగేయ రచనకు ఆద్యుడైన తాళ్లపాక అన్నమయ్య ఈకాలపువారే.

*ప్రబంధపూర్వయుగం :* (క్రీ. శ. 1400-1500) దీనినే శ్రీనాథయుగమని కూడా అంటారు. 1380 నుంచి 1460 వరకు జీవించిన శ్రీనాథుడు కవిసార్వభౌముడనే సార్థక బిరుదంతో, అసామాన్య పాండిత్య ప్రతిభలతో సింహాచలంనుంచి కంచి వరకు పర్యటించి ఆంధ్ర దేశైక కవిగా ప్రసిద్ధి పొందాడు. శ్రీనాథునితోనే కావ్యంలో కథకు ప్రాధాన్యం తగ్గి, వర్ణనకు, రసానికి ప్రాధాన్యం హెచ్చింది. ఈ యుగంలో కవుల కావ్యలక్షణాలే ఆ తరవాత నిర్దిష్టరూపందాల్చి ప్రబంధాలుగా ప్రసిద్ధి చెందాయి. శ్రీనాథుని రచనలలో గాథాసప్తశతి, పండితారాధ్యుల చరిత్ర, మరుత్తరాట్చరిత్రం అనేవి అలభ్యాలు. శృంగారనైషధం, భీమ ఖండం, కాశీఖండం, హరవిలాసం, క్రీడాభిరామం, శివరాత్రిమహాత్మ్యం, పల్నాటివీర చరిత్రం లభ్యాలు.

శ్రీనాథుని సమకాలికుడైన పోతన ( 1400 - 1450 ) శ్రీ మద్భాగవతం రచించాడు. వంగదేశంలో చైతన్యుని కంటే సుమారు 50 సం॥ ముందే ఆంధ్ర దేశానికి కృష్ణతత్త్వ విజ్ఞాన మందించినవాడు పోతన. ఈయన కవిత్వం మధురభక్తికి, అంత్యాను ప్రాసలతో కూడిన శబ్దసంగీతానికి పరాకాష్ఠ కలిగించి, విశ్వజనీనత సాధించింది.

ఈ యుగంలోని వారే - శృంగారశాకుంతలం, జైమినీ భారతం, మాఘమాహాత్మ్యం వ్రాసిన పిల్లలమర్రి పినవీరభద్రుడు, ప్రబోధ చంద్రోదయం వ్రాసిన నందిమల్లయ, ఘంట సింగన అనే జంట కవులు, విక్రమార్క చరిత్ర వ్రాసిన జక్కన, ఛందో దర్పణం, భోజ రాజీయం వ్రాసిన అనంతామాత్యుడు, సింహాసన ద్వాత్రింశిక వ్రాసిన కొరవి గోపరాజు, హరిశ్చంద్రోపాఖ్యానం వ్రాసిన గౌరన మొదలైనవారు.

*ప్రబంధయుగం :* (క్రీ. శ. 1500 - 1600) శృంగారరస ప్రాధాన్యం, అలంకార యుతమైన శైలి, అష్టాదశ వర్ణనలు, వస్త్వైక్యం, ఏకనాయకాశ్రయత్వం ఈకాలంలోని సాహి త్యంలో ప్రధానలక్షణాలు. ఈ లక్షణాలు తెలుగు సాహిత్యంలో నన్నెచోడునికావ్యంలో ప్రారంభమై, ఎర్రన, శ్రీనాథులకావ్యాలలో ప్రస్ఫుటమై, ఈ యుగంలో ప్రబంధ కావ్యమనే పేర నిర్దిష్ట రూపం దాల్చాయి.

ఆంధ్ర భోజుడని ప్రసిద్ధి పొందిన విజయనగర రాజు శ్రీకృష్ణదేవరాయలు (1509-1530 పాలనకాలం) తెలుగులో 'ఆముక్తమాల్యద' అనే ప్రౌఢ ప్రబంధాన్నేకాక, కొన్ని సంస్కృత గ్రంథాలుకూడా రచించాడట. ఆయన తన ఆస్థానంలో అష్టదిగ్గజాలని ప్రసిద్ధి పొందిన ఎనిమిది మంది కవులను పోషించాడు. ఈ అష్టదిగ్గజాలలో మనుచరిత్ర రచించి ఆంధ్రకవితా పితామహుడన్న బిరుదాన్ని పొందిన అల్లసాని పెద్దన (1475-1535), పారి జాతాపహరణం రచించిన నంది తిమ్మన, రామాభ్యుదయాన్ని రచించిన అయ్యలరాజు రామ భద్రుడు, రాజశేఖర చరిత్ర రచించిన మాదయగారి మల్లన, శ్రీకాళహస్తి మాహాత్మ్యం రచించిన ధూర్జటి తెలుగు కవులని, తక్కిన ముగ్గురూ ఇతర భాషా కవులని కొందరి భావన. ఈ కవులు రచించిన కావ్యాలన్నీ ప్రబంధాలే. పింగళి సూరన, భట్టుమూర్తి, రామాయణ రచయిత్రి మొల్ల ఈ కాలపువారే.

*దక్షిణాంధ్రయుగం :* పదహారో శతాబ్ది చివరికి విజయనగర సామ్రాజ్యం నుంచి తెలుగు కవిత్వం దక్షిణాంధ్రానికి ముఖ్యంగా తంజావూరు, మధుర రాజ్యాలకు తరలి వెళ్ళింది. ఈ కాలంలో ప్రబంధమేకాక, యక్షగానం, వచనం, గేయం అనే ప్రక్రియలు బాగా ప్రచురిత మయ్యాయి. తంజావూరి నాయకరాజు రఘునాథ నాయకుడు (1614-1633) వందగ్రంథాలు రచించాడట. ఈ యుగానికి తల మానికమైన కావ్యం విజయవిలాసం వ్రాసిన చేమకూర వేంకటకవి, కృష్ణాధ్వరి, ఈయన ఆస్థానంలోని వారే. రఘునాథుని కుమారుడైన విజయ రాఘవుడు అనేక యక్షగానాలు వ్రాయడమేగాక, మన్నారుదాస విలాసం వంటి కావ్యాలు వ్రాసిన రంగాజమ్మ వంటి కవయిత్రులను, కవులను పోషించాడు. చెంజి రాజకుటుంబానికి చెందిన చిన నారాయణరాజు (1600-1650) కువలయాశ్వ చరిత్రం అనే కావ్యాన్ని రచిం

చాడు. ఇది కళాపూర్ణోదయం కావ్యంతో సరితూగే గ్రంథమని కొందరి భావన. ఈ కాలపు వారే గోపాలదేవునిపై పదాలు వ్రాసిన మొవ్వగ్రామ నివాసి క్షేత్రయ్య. అనేక భక్తిభరితమైన కీర్తనలు వ్రాసి అమరమైన త్యాగరాజు, మధుర పాలకుడు విజయరంగ చొక్కనాథుడు వచన గ్రంథాలు వ్రాశాడు. రాధికాస్వాంతనం అనే కావ్యాన్ని వ్రాసిన ముద్దుపళని, అహల్యా సంక్రందనం వ్రాసిన సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడు ఈయన ఆస్థానంలోనివారే. సుభాషిత రత్నాకరం వ్రాసిన ఏనుగు లక్ష్మణకవి, అచ్చతెనుగు రామాయణం వ్రాసిన కూచిమంచి తిమ్మకవి, మొదలైనవారు ఈ కాలపువారే. ముఖ్యంగా ప్రజాకవి, మహాకవి అయిన వేమన 18 వ శతాబ్ది పూర్వ భాగంలో నివసించాడని అనేకమంది పరిశోధకుల భావన.

1775 తరవాత ఆంధ్రవాఙ్మయచరిత్రలో క్షీణదశగా పరిగణించబడుతోంది. అప్పటి రాజ్యాలన్నీ ఛిన్నాభిన్నమయిపోయి జమీలు మాత్రం మిగిలాయి. కవిత్వానికి పోషణ లేదు. చిత్రకవిత్వం, క్షుద్ర శృంగార కావ్యాలు ఎన్నో వెలువడ్డాయిగాని, వాటిలో రాశియేగాని వాసిలేదు.

***ఆధునిక యుగం :*** చిన్నయసూరి వ్యాకరణం, ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ నిఘంటువులు ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో ఆధునిక యుగానికి పూర్వరంగం. ఆధునిక యుగం కందుకూరి వీరేశలింగం గారితో ప్రారంభంఅవుతుందని చెప్పవచ్చు. నవల, కథ, ప్రహసనం, నాటకం, విమర్శ, స్వీయ చరిత్ర మొదలైన ప్రక్రియలను తెలుగు సాహిత్యంలో ప్రవేశపెట్టినదిఈయనే. తెలుగులో సరళమైన, సలక్షణమైన వచన రచనకు ఈయన ఆద్యులు. ఈయనతోనే ' కళ కళకోసమే' నన్న ప్రాచీన విశ్వాసం సడలి కళాకారునికి మానవ సమాజం పట్ల మహత్తర బాధ్యత ఉన్నదనే గుర్తింపు వచ్చింది. అదే సమయంలో గిడుగు రామ్మూర్తి పంతులుగారు అప్పటిదాకా తెలుగుభాషపై పండితుల అధికారం పటాపంచలుచేసి, వ్యావహారికభాషోద్యమం నడిపారు. కందుకూరి సాంఘిక విప్లవం, గిడుగు రామ్మూర్తి పంతులుగారి భాషావిప్లవం సమన్వయించి సాహిత్య విప్లవాన్ని తెచ్చినది గురజాడ అప్పారావుగారు (1861-1915). ఈయన వ్యావహారిక భాషకు కావ్యత్వ గౌరవం ఆపాదిస్తూ ముత్యాలసరాలు, కన్యాశుల్కం అనే నాటకం మొదలైనవి వ్రాశారు. అప్పటిలో ప్రాచీన మార్గాన్ని అవలంబించినా, కవిత్వం ప్రజల అవగాహన పరిధిలోకి తెచ్చి, అవధానాలతో, పాండవోద్యోగ విజయాలతో, దేవీ భాగవతంతో తెలుగు దేశంలో ఒక నూతన సాహిత్య చైతన్యం కలిగించినది తిరుపతి వేంకట కవులు.

ఆంగ్లభాష అభ్యాసంఫలితంగా పూర్వకవితా రీతులపైతిరుగుబాటుగా కాల్పనికోద్యమం ఏర్పడింది. దీనినే భావకవితోద్యమం అనికూడా అంటారు. ఈ కవిత్వానికి భావం ప్రధానం. వస్తు ప్రాధాన్యం లేదు. దీనిని ప్రకృతికవిత్వం, ప్రణయకవిత్వం, దేశభక్తికవిత్వం, సంఘ సంస్కరణ కవిత్వం, భక్తికవిత్వం, స్మృతికావ్యాలు అనేకరకాలుగా విభజింపవచ్చు. భావ కవిత్వానికి ఆచార్యులవంటివారు రాయప్రోలు సుబ్బారావుగారు. దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి కృష్ణపక్షం, నండూరి సుబ్బారావు ఎంకి పాటలు, తుమ్మల సీతారామమూర్తి రాష్ట్రగానం మొదలైనవి భావకవిత్వానికి ప్రతీకలు. 1930 కి భావకవిత్వం క్షీణదశకు చేరుకొంది.

ఆర్థిక మాంద్యం, జర్మనీలో ఫాసిజం కారణాలవల్ల పారిస్‌లో ఏర్పడిన అంతర్జాతీయ అభ్యుదయ సాహిత్య కేంద్రం ఉత్తేజంతో భారతదేశంలోనూ 1935లో అఖిలభారత అభ్యుదయ సంఘం ఏర్పడింది. దాని ప్రభావంతో, అప్పటికే భావకవిత్వంపై తిరుగుబాటుగా మారిన తెలుగు కవిత్వం 1943 లో అభ్యుదయ సంఘం స్థాపనతో అభ్యుదయ కవిత్వంగా మారింది. సామ్యవాద ఆర్థిక సిద్ధాంతాలు, వాస్తవికతా వాదం దీని జన్మ కారణాలు. మహాప్రస్థానం రచించి ఈ కవిత్వానికి శ్రీ శ్రీ ప్రయోక్త, ప్రవక్త అయ్యాడు. శ్లిష్టా, నారాయణబాబు, దాశరధి మొదలైనవారు ప్రసిద్ధులు. ఆతరువాతి కాలంలో విశ్వనాథ రచించిన రామాయణ కల్పవృక్షం వంటి సంప్రదాయబద్ధ కవిత్వమూ శ్రీ శ్రీ, ఆరుద్ర, తిలక్ పంటివారు రచించిన నవ్యమార్గపుకవిత్వమూ, సి. నారాయణరెడ్డి, విశ్వంపంటివారు రచించినసమన్వయ మార్గపు కవిత్వమూ వెలువడింది. చివరి రెండు మార్గాలూ అభ్యుదయ కవిత్వం పేరనే కొనసాగాయి. ఛందోబద్ధమైన కవిత్వం వ్రాసిన త్రిపురనేని రామస్వామి ఆంధ్రదేశంలో హేతువాదానికి మూలపురుషుడు. ఆ తరవాత వర్తమానసమాజంలోని అన్యాయాలూ, అక్రమాలూ నిరసించేందుకు ఆక్రోశం, అధిక్షేపణ, దూషణలతో కూడిన కవితా ప్రక్రియ చేపట్టిన దిగంబర కవితోద్యమం బయలుదేరింది. 1970 లో విప్లవ రచయితల సంఘం అభ్యుదయ రచయితల సంఘం నుంచి విడిపోయినప్పుడు ఈ దిగంబర కవులు విప్లవ కవులలో కలిసిపోయారు.

*నాటకం :* 1860 కి పూర్వం యక్షగాన వీధినాటకాలే వెలువడ్డాయి. 1860 నుంచి ఆంగ్ల, సంస్కృత నాటకాల ఆధారంగా తెలుగులో నాటకరచన ప్రారంభమయింది. 1860లో కోరాడ రామచంద్ర శాస్త్రిగారు వ్రాసిన మంజరీమధుకరీయం ప్రథమ నాటకం. ధార్వాడ సమాజం వారు ఆంధ్రదేశంలో వేసిన హిందీనాటకాలలో తెలుగువారు ఉత్తేజితులై నాటకాలు రచించి, అనేక పట్టణాలలో నాటక సమాజాలు స్థాపించి, ప్రదర్శించడం ప్రారంభించారు. మొదట్లో స్వతంత్ర నాటకాలు తక్కువగా, సంస్కృత, ఇంగ్లీషు నాటకాలు అనువాదాలు ఎక్కువగా వచ్చాయి. అప్పటి నాటక కర్తలలో వీరేశలింగం గారు, వేదం వేంకటరాయ శాస్త్రి, మానవల్లి రామకృష్ణకవి, చిలకమర్తి మొదలైనవారు ప్రముఖులు.

1880 తరువాత ధర్మవరం రామకృష్ణాచార్యులుగారు చిత్రనళీయం, పాదుకాపట్టాభిషేకం వంటి అనేక స్వతంత్ర నాటకాలు రచించి ప్రదర్శించడంతో స్వతంత్ర నాటకయుగం ప్రారంభమైంది. ఈయన సమకాలికుడు కోలాచలం శ్రీనివాసరావు గారు చాంద్‌బీబీ, మైసూరు రాజ్యం మొదలైన నాటకాలు రచించారు. పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి పాదుకా పట్టాభిషేకం చాలా ప్రసిద్ధి చెందినది. నాటకాలలో విశ్వనాథ వారి వేనరాజు, నర్తనశాల, తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగ విజయాలు, త్రిపురనేని రామస్వామి గారి ఖూనీ, శంబుకవధ మొదలైనవి ముఖ్యమైనవి. సాంఘిక నాటకాలలో గురజాడ అప్పారావు గారి 'కన్యాశుల్కం' నాటకానికి ప్రత్యేక స్థానముంది. ఇది సార్వకాలీనత, సార్వజనీనత గల ఉత్తమ నాటకంగా పేరుపొందింది.

నాటక ప్రక్రియతో ఏకదేశమైన ప్రహసనం కందుకూరి వీరేశలింగం గారితో, సంఘ

సంస్కరణ ప్రధాన లక్ష్యంగా ప్రారంభమైంది. చిలకమర్తి మొదలైన వారు ఆనాటి ప్రసిద్ధ ప్రహసన కర్తలు. 1920 ప్రాంతాలనుంచి దీర్ఘమైన నాటకాలు కాక, చిన్ననాటికలు, ఏకాంకికలు మంచి ప్రచారం పొందాయి. రాజమన్నారు (తప్పెవరిది), చలం, భమిడిపాటి కామేశ్వర రావు, మొదలైనవారు ఏకాంకికలు, నాటికలు రచించిన వారిలో ప్రముఖులు. 1943 తరవాత నాటికలు వ్రాసినవారిలో బుచ్చిబాబు, ఆత్రేయ, నార్ల (కొత్తగడ్డ) మొదలైనవారు ముఖ్యులు. రేడియో నాటిక విషయంలో కపిల కాశీపతి, గోరాశాస్త్రి, కృష్ణశాస్త్రి, పద్మరాజు, ఆరుద్ర, రజనీకాంతారావు, ముని మాణిక్యం ప్రముఖులు.

నవల : ఆంగ్ల భాషా సంపర్కంవల్ల తెలుగులో ప్రారంభమయిన సాహిత్య ప్రక్రియ ఇది. 1872 లో నరహరి గోపాలకృష్ణమ చెట్టిగారి శ్రీరంగరాజ చరిత్రము, 1879 లో వీరేశలింగంగారి రాజశేఖర చరిత్రము మొదటి నవలలు. ప్రారంభంలో వచన ప్రబంధంగా పిలువబడిన నవల 25 సం॥ తరవాత కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారిచేత 'నవల' అనే నామకరణం పొందింది. హేమలత, రామచంద్ర విజయం నవలలు వ్రాసిన చిలకమర్తి, ఆంధ్ర రాష్ట్రం వ్రాసిన భోగరాజు నారాయణమూర్తి, ప్రసిద్ధ ఆంగ్ల బెంగాలీ నవలలు అనువదించిన కేతవరపు వేంకటశాస్త్రి, వేంకట పార్వతీశ్వర కవులూ ఆనాటి ప్రసిద్ధ నవలాకర్తలు.

ఆ తరువాతి కాలాన్ని తెలుగు నవలా చరిత్రలో వికాసయుగం అంటారు. అప్పుడు జాతిజీవన విధానంలో వచ్చిన విప్లవాత్మకమైన మార్పులతో, తెలుగువారి జీవన విధానానికి గీటు రాయిగా ఉన్నవ లక్ష్మీనారాయణ గారు 'మాలపల్లి' నవల వ్రాశారు. ఈ యుగంలో మూడు రీతుల ఉద్యమాలకు ప్రతినిధుల వంటివారు ఏకవీర, వేయిపడగలు రచించిన విశ్వనాథ, మైదానం, అమీనా రచించిన చలం, నారాయణరావు, గోనగన్నారెడ్డి, రచించిన అడవి బాపి రాజు. ఈ కాలంలో మరోముగ్గురు ప్రఖ్యాత నవలాకారులు 'బారిష్టరు పార్వతీశం' వ్రాసిన మొక్కపాటి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి. ఈ కాలంలోనే వేలూరి శివరామశాస్త్రిగారు శరత్‌నవలలు అనువదించారు.

ఆ తరువాతి కాలంలో మనస్తత్వశాస్త్ర విధానాలు ఆలంబనగా పాత్రచిత్రణ చేయడం ప్రధానంగా కనబడుతుంది. కనక దీనిని మనోవైజ్ఞానికయుగం అంటారు. ఈ కాలంలో 'చివరకు మిగిలేది' వ్రాసిన బుచ్చిబాబు, 'అసమర్థుని జీవయాత్ర' వ్రాసిన గోపీచంద్, కీలు బొమ్మలు వ్రాసిన జి. వి. కృష్ణారావు, చదువు వ్రాసిన కొడవటిగంటి ప్రసిద్ధులు. 1950 తరవాత వార, మాస పత్రికల కారణంగా అసంఖ్యాకంగా నవలలువెలువడ్డాయి. ఈకాలంలో రుద్రమదేవి- వ్రాసిన నోరి నరసింహశాస్త్రి, చెంఘిజ్ ఖాన్ వ్రాసిన తెన్నేటి సూరి చారిత్రక నవలా రచయితలుగా ప్రసిద్ధులు. ఈ కాలంలోవెలువడిన నవలలలో సంఘంలోని సంఘర్షణే ప్రధాన పాత్ర వహించింది. పాలగుమ్మి పద్మరాజు, ఉప్పల లక్ష్మణరావు, మహీధర రామ మోహనరావు ఈకాలంలో సాంఘిక నవలా రచయితలుగా ప్రసిద్ధులు. తెలంగాణా మాండలికంలో దాశరథి రంగాచార్య వ్రాసిన చిల్లరదేవుళ్ళు, చైతన్యస్రవంతి పద్ధతిలో నవీన్‌వ్రాసిన అంపశయ్య, వినుకొండ నాగరాజు రచించిన వస్తున్నవ్యతగల ఊబిలో దున్న మొదలైనవి విలక్షణమైన నవలలు. స్త్రీల రచనలు అత్యధికంగా వెలువడటం ఈ కాలం ప్రత్యేకత.

శ్రీదేవి, రంగనాయకమ్మ, మాదిరెడ్డి సులోచన, కె. రామలక్ష్మి, వాసిరెడ్డి సీతాదేవి, యద్దనపూడి సులోచనారాణి, కౌసల్యాదేవి మొదలైనవారు ప్రఖ్యాత రచయిత్రులు.

***కథ :*** వేదాలలో, పురాణాలలో కథలున్నా, కాశీమజిలీ, మిత్రలాభం కథలున్నా, ఆధునిక కథాప్రక్రియ ఆంగ్లసాహిత్య ప్రభావంతోనే నిర్దిష్ట రూపం దిద్దుకొంది. గురజాడ అప్పారావు గారి 'దిద్దుబాటు' అన్నకథ ఆధునిక కథాప్రక్రియలో మొదటిది. ఆయన వ్రాసిన మెటిల్డా, మీపేరేమిటి మొదలైనకథలు ఈనాటికీ ఏ దృక్కోణంలో చూసినా, ఉత్తమమైనవి. పత్రికలసంఖ్య, జనబాహుళ్యంలో విద్యావ్యాప్తి పెరిగినకొద్దీ కథ, కథానిక, చిన్నకథ మరింత ప్రచారం పొందుతున్నాయి. సంక్షిప్తత, ఏకాంశవ్యగ్రత కథకుప్రధానలక్షణాలు. కందుకూరి, గురజాడ, చింతాదీక్షితులు మొదలైనవారు మొట్టమొదటి కథకులు. ఆ తరువాత అడవి బాపిరాజు, విశ్వనాధ (నీఋణం తీర్చుకున్నా, మాక్లీదుర్గంలోకుక్క కథలు), మునిమాణిక్యం (కాంతం కథలు), కరుణకుమార (సన్నజీవాలు సంపుటి), ప్రసిద్ధ కథా రచయితలు. మల్లాది రామకృష్ణశాస్త్రి కథలకు (డుముపులు మొదలైనవి) తెలుగు జాతీయత, శైలిదృష్ట్యా ప్రత్యేక స్థానముంది. ఆ తరువాతి కాలం కథలలో సామాజిక దృక్పథం, విప్లవ దృష్టితో వ్రాసిన కొడవటిగంటి కుటుంబరావు కథలూ, తాత్త్వికదృష్టితో వ్రాసిన గోపీచంద్ కథలూ, బుచ్చిబాబు కథలూ, చలం కథలు ముఖ్యమైనవి. 1950 తరవాత బాలగంగాధర తిలక్, ఆరుసారా కథలూ, ఆరుసారో కథలు వ్రాసిన రాచకొండ, యజ్ఞం వంటి కథలు వ్రాసిన కాశీపట్నం రామారావు, ముళ్లపూడి వెంకటరమణ, పాలగుమ్మి పద్మరాజు, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, ఇచ్ఛాపురపు జగన్నాధరావు, సి.యస్. రావు, హితశ్రీ ఆదివిష్ణు, ఆవసరాల రామకృష్ణారావు మొదలైనవారు ప్రసిద్ధులు. ఇటీవల పత్రికలసంఖ్యబాగా పెరగడంతో కథకుల సంఖ్య కూడాబాగా పెరిగింది. పాలగుమ్మి పద్మరాజువ్రాసిన'గాలివాన'అనేకథకు ఒకఅమెరికన్‌పత్రిక ద్వితీయబహుమతిఇవ్వగా,తెలుగుకథకు అంతర్జాతీయంగాగుర్తింపువచ్చింది. ఇల్లిందలసరస్వతీదేవి,తురగా జానకీరాణి, రంగనాయకమ్మ, మాలతీచందూర్, వాసిరెడ్డి సీతాదేవి, యద్దనపూడి సులోచనారాణి, బీనాదేవి వంటి ఎందరో రచయిత్రులు నవలారచన తరువాత కథారచనకే ప్రాముఖ్యం ఇస్తున్నారు.

పైన పేర్కొన్నవేకాక ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగులోకి వచ్చిన ప్రక్రియల లోనివే వ్యాసం, ఆత్మకథ, గల్పిక మొదలైనవి. తెలుగు వ్యాసం, ఆత్మకథ, మొదలైన ప్రక్రియలు వీరేశలింగంగారితోనే ప్రారంభ మయ్యాయి. విగ్రహారాధన, కన్యాశుల్కం మొదలైన విషయాలపై కందుకూరి అనేకవ్యాసాలు వ్రాశారు. గిడుగు రాంమూర్తి పంతులు గారి కాలంనాటికి కూడా వ్యాసం ప్రచార సాధనంగానే ఉంది. దానిని సాహిత్య స్థాయికి చేర్చినవారు వేటూరి ప్రభాకరశాస్త్రి, చిలుకూరి వీరభద్రరావు, ముట్నూరి కృష్ణారావు, కట్టమంచి రామలింగారెడ్డి మొదలైనవారు. ఈ వ్యాసాలు సాహిత్య వ్యాసాలయితే, అవి పీఠిక, సమీక్ష, విమర్శల రూపంలో కూడా ఉండవచ్చు. సారస్వత వ్యాసాలు రచించిన ప్రసిద్ధులు విశ్వనాథ, నార్ల, తాపీ ధర్మారావు, దేవులపల్లి మొదలైనవారు.ఆర్. యస్. సుదర్శనం, రాచమల్లు రామచంద్రారెడ్డి విమర్శకులుగా ప్రసిద్ధులు. సంజీవదేవ్, కాట్రగడ్డ నరసయ్య, మిక్కిలి

నేని రాధాకృష్ణమూర్తి ఇతర కళల గురించి వ్యాసాలు వ్రాసిన ప్రముఖులు. గాలి బాల సుందరరావు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, వసంతరావు, వేంకటరావు, నండూరిరామమోహన రావు మొదలైనవారువైజ్ఞానిక సంబంధ వ్యాసాలు వ్రాసినవారు.

## శిల్పకళ

శిల్పకళ రెండు రకాలు. గుండ్రని శిల్పం ఒకటి, శిల్పఫలకం రెండోది. శిల్ప ఫలకంలో మళ్ళీ రెండు రకాలు. అంతగా ఉబ్బెత్తుగా ఉండని మూర్తులు గల నిమ్న శిల్ప ఫలకం, ఉబ్బెత్తుగా ఉండే మూర్తులు గల ఉన్నత శిల్ప ఫలకం ( bas relief and alto relief)

ఆంధ్ర శిల్పం ప్రధానంగా శిల్ప ఫలకాలు గలదే. ఆంధ్ర శిల్పంలో సామూహిక మూర్తి రచన శిల్ప ఫలకాలుగాను, ఒకే మూర్తిగా ఉన్న శిల్పం గుండ్రని శిల్పంగాను ఉంటాయి.

ఆదిమశిల్పాన్ని వదలి చూస్తే, శాతవాహన కాలంతో ఆంధ్ర శిల్పం ప్రారంభమవుతుంది. ఈ కాలపు శిల్పాలు అమరావతి, గుంటుపల్లి, నాసిక్, జగ్గయ్య పేటలలో కనబడతాయి. వీటిలో అమరావతి ప్రసిద్ధమైనది. ఆనాటి హీనయాన బౌద్ధ సాంప్రదాయం ప్రకారం శిల్పం ఆడంబరాలు, ఆభరణాలు లేకుండా సాదాగా ప్రతీకలతో ఉంటుంది. క్రీ. శ. 2 వ శతాబ్ది నుంచి మహాయాన బౌద్ధ సాంప్రదాయం ప్రకారం వీటిలో బుద్ధ ప్రతిమలు చెక్కడం ప్రారంభమైంది. వీటిలో ఆదిమశిల్పాలలోని బలం, తరువాతి కాలపు సౌకుమార్యం కూడా ఉంటాయి. తరువాతి కాలంలో, అంటే క్రీ. శ. 250 - 340 నాటి ఇక్ష్వాకులకు శిల్పానికి నాగార్జున కొండ ప్రసిద్ధి చెందింది. దీనిలో కొద్దిగా గ్రీకు ప్రభావం కనబడుతుంది. అమరావతి శిల్పాలలో గ్రీగో గాంధార శైలి కనబడితే, నాగార్జున శిల్పాలలో గ్రీకులవాస్తవ వాదం, భారతీయుల ఆదర్శవాదం రెండూ సమన్వయింపబడినట్లు కనబడుతుంది. అమరావతి, నాగార్జున శిల్పాలు ప్రపంచ ప్రసిద్ధి పొందినవి.

పల్లవుల కాలంలో ( 225 - 340 ) కూడా దేశం అంతటా ఉత్తమ శిల్ప నిర్మాణం జరిగినా ప్రత్యేకించి మహాబలిపురంలోని పల్లవశిల్పం ప్రఖ్యాతి చెందింది. ఆ తరవాత విష్ణుకుండినులు ( క్రీ. శ. 350 - 610 ), కళింగ గాంగులు ( క్రీ. శ. 5 వ శతాబ్ది నుంచి 16వ శతాబ్ది వరకు ) మొదలైన రాజులకాలంనాటి శిల్పాలు విభిన్న రీతులలో అనేకచోట్లఉన్నాయి. కాని వీటిలో ప్రత్యేకత గలది కాకతీయుల శిల్పం ( క్రీ. శ. 1089 - 1323). ఇవి వరంగల్లు, కరీంనగర్, నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలలో వివిధ శివాలయాలలో కానవస్తాయి. గతిశీలత - అంటే ప్రతి మూర్తీప్రాణలయతో ప్రకంపిస్తున్నట్లు ఉండటం ఈ శిల్పాల ప్రత్యేకత. ఇందుకు ఉదాహరణ రామప్ప దేవాలయం. చిత్రకారులైన సంజీవదేవ్‌గారు అమరావతి శిల్పాన్ని మహాకావ్యంగా, నాగార్జునకొండ శిల్పాన్ని ఖండకావ్యంగా, కాకతీయ శిల్పాన్ని మధురసంగీతంగా వర్ణించారు. తరువాతిది విజయనగర రాజులపాలనలో నిర్మితమైన హంపీ శిల్పాలు. ఇవి ప్రధానంగా బలాన్ని ప్రదర్శించే గొప్ప ఆకారాలుగా గలశిల్పాలు. ముఖ్యంగా ఉగ్ర నరసింహ, విరూపాక్ష, హజార రామస్వామి విగ్రహాలు గాంభీర్యాన్ని, శక్తినీ ప్రదర్శిస్తాయి.

ఆధునిక కాలంలో మనుషుల రూప శిల్పాలను చెక్కే శిల్పులు అనేకమంది ఉన్నారు గాని, ఒక విషయాన్ని రచనా విన్యాసాన్ని చెప్పే శిల్పులు కొద్ది మందే ఉన్నారు. వీరిలో దేవీ ప్రసాదనారాయణరావు, వి. వి. చౌదరి, జి. ఛాయ, వై. వి. లక్ష్మయ్య, సి. యస్. పట్నాయక్ మొదలైనవారు ముఖ్యులు. నేటి శిల్పులు చాలా మంది ముందుగా బంకమన్నుతో శిల్పాలను నిర్మించి, తరవాత వాటిని కంచులోకో, రంగుసిమెంటులోకో పోత పోయించుకొంటున్నారు. గుంటూరుజిల్లా వేమూరులోని మహమ్మయాచారి వంటి కొద్ది మంది మాత్రం శిలలను చెక్కి, శిల్ప నిర్మాణం చేస్తున్నారు. ఆంధ్రదేశంలో వృత్తిరీత్యా శిల్పులున్నారు. గుంటూరుజిల్లా పురుషోత్‌పట్నం అనే గ్రామంలో కొన్ని ముస్లిం కుటుంబాలు తరతరాలుగా శిల్పులు. వీరు శిలలతో శాస్త్రీయంగా శిల్పాలు చెక్కుతారు. అయితే వీరి శిల్ప జ్ఞానం గ్రంథస్థమయినది కాదు. వంశ పారం పర్యంగా వస్తున్నది.

## సంగీతకళ

తెలుగువారు నాట్యశాస్త్రకర్త భరతముని కాలంనుంచి, అంటే క్రీ. పూ. 2వ శతాబ్ది నుంచి, సంగీతజ్ఞులనే విషయానికి అనేక సాక్ష్యాలున్నాయి. కర్ణాటక శాస్త్రీయ సంగీతం సంకీర్తన, పద, యక్షగాన, కలాప ప్రబంధ, గాత్రకచ్చేరీ సంప్రదాయాలని ఐదు విధాలు. ఆంధ్రులు భారతీయ సంగీతానికి అర్పించినవి ముఖ్యమైన మూడు రాగాలు. ఆంధ్ర, యరుకుల లేదా యదుకుల కాంభోజి, తిలంగ్ అనేవి. సంగీతజ్ఞులైన ఆంధ్రులలో కొందరు లక్షణకర్తలు, కొందరు లక్ష్య కర్తలు. లక్షణకర్తలు కాకతీయులనాటి జాయపసేనాని నృత్తరత్నావళి, సంగీతం శాస్త్రానికి సంబంధించిన గీతరత్నావళి, కావ్యరత్నావళి రచించాడు. శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరానికి కల్లినాథుడు, సర్వజ్ఞ సింగభూపాలుడు వ్యాఖ్యానం రచించారు. విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించడానికి కారకుడైన విద్యారణ్యస్వామి సంగీతసారమనే లక్షణ గ్రంథంలో మొదటిసారిగా మేళకర్త, జన్యరాగ పద్ధతిని ప్రవేశపెట్టాడు. తాళ్లపాక అన్నమయ్య సంకీర్తన లక్షణం రచించాడు. ఈయన మనుమడు చిన తిరుమలాచార్యుడు దీనిని తెనిగించాడు. అరవీటి రామరాయలి ఆస్థానంలోని రామయామాత్యుడు స్వరమేళకళానిధి అనే గ్రంథం రచించాడు. సంగీత సూర్యోదయం రచించిన భండారు లక్ష్మీనారాయణ, సంగీత పారిజాతం రచించిన అహోబల పండితుడు, సంగీతసుధ రచించిన గోవింద దీక్షితుడు, రాగవిబోధకర్త సోమనాథుడు, రాగ తాళ చింతామణి వ్రాసిన పోలూరి గోవిందకవి మొదలైనవారు కూడా లక్షణ కర్తలు.

తంజావూరు విజయరాఘవనాయకుని ఆస్థానంలోని వేంకటమఖి పండితుడు చతుర్దండి ప్రకాశిక అనే గ్రంథం వ్రాసి, నేటి 72 మేళకర్తలపద్ధతిని ప్రవేశపెట్టాడు. ఈయన గోవింద దీక్షితుని కుమారుడు. సంగీతమూర్తిత్రయంలో ఒకరైన ముత్తుస్వామిదీక్షితుని దత్తపుత్రుడు సుబ్బరామ దీక్షితుడు సంగీత సంప్రదాయ ప్రదర్శిని అనే గ్రంథం రచించాడు.

**లక్ష్యకర్తలు, వాగ్గేయకారులు :** వాగ్గేయకారులలో మొదట పేర్కొనవలసినవారు 32,000 సంకీర్తనలు రచించిన తాళ్ళపాక అన్నమయ్య. ఈయన సంకీర్తనలలో భక్తి,

శృంగార, వైరాగ్యాలు సమాన దక్షతతో పోషింపబడ్డాయి. అధ్యాత్మ రామాయణ కీర్తనలు, తరంగాలు రచించిన నారాయణ తీర్థులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి ప్రఖ్యాతులు. నృత్య సంగీత సమ్మేళనమైన 'భామాకలాపం సృష్టించినవారు సిద్ధేంద్రయోగి. భజన సంప్రదాయానికి చెందిన కీర్తనలు రచించినవారు భద్రాచల రామదాసు. ఎన్నోపదాలు రచించి భావానుగుణంగా రాగాన్ని వాడినవారు క్షేత్రయ్య. వాగ్గేయకారులలో నాయకమణివంటివారు త్యాగరాజస్వామి. ఈయన కీర్తన పాఠంలో నెరవు చెయ్యడం అనే పద్ధతిని ప్రవేశపెట్టడమే కాక, అనేక అపూర్వ రాగాలలో రచనలుచేసి కర్ణాటక సంగీతానికి మారుపేరయ్యారు. సంగీత మూర్తిత్రయంలో మొదటివారు త్యాగయ్యకాగా, తక్కిన ఇద్దరూ ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి. వీరు తెలుగులో అనేక రచనలు చేశారు. స్వాతి తిరునాల్ కూడా అనేక తెలుగు రచనలు చేశారు.

ఆధునికులలో హరికథాపితామహ నారాయణదాసు, హరి నాగభూషణం, మైసూరు వాసుదేవాచార్, అత్యాధునికులలో బాలమురళీకృష్ణ, ఓగిరాల వీరరాఘవశర్మ, ఈదర నాగరాజు, ఘంటసాల ప్రసిద్ధులు. శ్రీ బాలమురళీకృష్ణకు 1980 రాజా లక్ష్మి అవార్డు రూ. 10,000 లభించింది. అన్నమాచార్యుల పదాలను స్వరపరచిన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వాగ్గేయకారులు, లక్షణ శాస్త్రజ్ఞులు. ద్వారం వేంకటస్వామి నాయుడుగారు ప్రపంచ ప్రఖ్యాతి పొందిన వయొలిన్ విద్వాంసులు. వీణ వేంకటరమణ దాసు, తుమురాడ సంగమేశ్వర శాస్త్రి, ఈమని శంకరశాస్త్రి, చిట్టిబాబు ప్రసిద్ధ వైణికులు. కర్ణాటకసంగీతంలో ఉత్తేజితులైన పాశ్చాత్యులు కొందరు దానిని అభ్యసించారు. హెన్రీ హిగ్గిన్స్ అనే పాశ్చాత్యుడు ఇందుకు ఒక ఉదాహరణ.

ఆధునిక కాలంలో కాలానుగుణంగా గేయరచన ప్రాముఖ్యంలోకి రావడంతో శాస్త్రీయ సంగీతానికి భిన్నమయిన లలితసంగీతం ప్రచారంలోకి వచ్చింది. దీనికి జానపద సంగీతమే ప్రాతిపదిక అనవచ్చు. ఆ ప్రాతిపదికపై శాస్త్రీయ సంగీత జ్ఞానంతో లలిత సంగీతం తన పరిధి విస్తృతం చేసుకొంది దీనికి సినిమా, రేడియో, గ్రామఫోన్, ఇటీవల టెలివిజన్ వల్ల మంచి ప్రచారం వచ్చింది.

## నాట్యకళ

ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధి చెందిన నృత్యకళను అయిదు విధాలుగా విభజింపవచ్చు.

1. ఆరాధన నర్తనరీతి తాళ, లయల నాశ్రయించి ఉండే శుద్ధ నృత్తరీతులు. ఇవి అతిప్రాచీనమైన మారరీతికి చెందినది. ఆలయ పూజా సమయంలో పూర్వం వీటిని చేస్తుండేవారు.

2. నాట్యమేళం : ఇది తాండవ పద్ధతికి చెందిన పురుషుల నృత్యపద్ధతి. అనేక పాత్రలతో కూడిన నృత్య నాటకాలను ప్రదర్శించడం దీనిలో విశిష్టత. యక్షగానం, వీధి నాటకం, వీధి భాగవతం అనే మూడు శాఖలు దీనికి చెందుతాయి. క్షేత్రయ్య, తాళ్లపాక అన్నమాచార్యులు, సభాపతయ్య, సారంగపాణి, సీనయ్య మొదలైన పదరచయితలు దీనికి పుష్టిని చేకూర్చారు.

3. నట్టువమేళం : పూర్వం రాజదర్బారులలో, పండిత సభలలో ప్రదర్శింపబడి ప్రస్తుత కాలంలో భరతనాట్యం పేరుతో ప్రసిద్ధిచెందిన స్త్రీల నృత్య పద్ధతి.

4. జానపదనర్తనాలు:వీటిలో కుమ్మి,గొబ్బి,బతకమ్మ మొదలైనవిస్త్రీలచేతప్రదర్శింపబడేబృందనర్తనాలు. తప్పెట,గుండ్లు మొదలైనవి పురుషులుప్రదర్శించేజానపదనర్తనాలు.

5. గిరిజన నర్తనాలు : ఆంధ్రదేశపు అరణ్యాలలో వివిధ గిరిజన జాతులవారి ( గోండులు, సవరలు, చెంచులు, కోయలు మొదలైన వారు ) ప్రదర్శించే బృంద నర్తనాలు.

ఇవికాక గంటెభాగవతుల ప్రదర్శన (చిరుతల భాగవతం, చిరుతల రామాయణం) తెలంగాణంలో ప్రచారంలో ఉండేవి. తోలు బొమ్మలాట ప్రాచీనకాలం నుంచి ప్రత్యేక కళా ఖండంగాఆంధ్రప్రదేశ్‌లోవర్ధిల్లింది.పూర్వంకూచిపూడిభాగవతమనిపిలువబడినకూచిపూడినాట్యం మూలపురుషుడు సిద్ధేంద్రయోగి. ఈ కూచిపూడి కృష్ణాజిల్లా దివితాలూకాలో ఉంది, ఆంధ్రులు నృత్యకళకు సమర్పించిన మరొకప్రసిద్ధ నర్తనం పేరిణి. భరతనాట్యం, కూచిపూడి నాట్యం, ఇప్పుడిప్పుడే పేరిణి ఆంధ్రప్రదేశ్‌లో మంచి ప్రచారంలో ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో వేదాంతం రాఘవయ్య, వెంపటి చినసత్యం, యామినీ కృష్ణమూర్తి, సుమతీ కౌశల్, కోరాడ నరసింహారావు, మొదలైనవారు పేరుపొందిన నర్తక, నర్తకీమణులు.

## చిత్రకళ

మనకు లభించిన చారిత్రకాధారాలను బట్టి సాతవాహన, విజయనగర రాజులకాలంలో చిత్రకళ వెల్లువగాపొంగి పొరలిందని చెప్పవచ్చు. ఇక్ష్వాకు, విష్ణుకుండి, శాలంకాయన, పూర్వ చాళుక్య, కాకతీయ, రెడ్డి రాజ్యాలలో ఎట్లాఉండేదో చెప్పడం కష్టము. క్రీస్తుశకము మూడో శతాబ్దాంతము, నాలుగో శతాబ్దపు మొదటి భాగము, పదకొండో శతాబ్దపు చివరి భాగం, పద్దెనిమిదో శతాబ్దపు రెండో భాగం ఆంధ్ర చిత్రలేఖన చరిత్రలో అంధకారయుగాలనవచ్చు.

ప్రాచీన భారతీయ వాస్తుకు శిల్ప, చిత్రకళలు అలంకారాలుగా ఉండేవి. అందు వల్లనే మొదటి చిత్రాలన్నీ భిత్తి చిత్రాలు. అవి ఆధ్యాత్మిక వస్తువు గలవి. రానురాను చిత్ర, శిల్పకళలు వాస్తునుండి విడివడి స్వాతంత్ర్యాన్ని పొందినాయి. దారు ఫలకాలమీద, కాగితాల మీద, కాన్వాసుమీద చిత్రాలు వ్రాయబడుతూవచ్చి, వాటి వస్తువు సామాజికమూ. ఐహికమూ అయింది.

ఆంధ్రదేశంలో బౌద్ధం అవతరణ, చిత్రలేఖన ప్రారంభం ఏకకాలంలో జరిగినాయన వచ్చు. ప్రాచీన వర్ణ చిత్రాలలో అజంతాగుహలలో 9,10 సంఖ్యల గుహలలోవి మొట్టమొదట వ్రాసినచిత్రాలు. ఈగుహల రాజపోషకులు సాతవాహనులు, వాకాటకులు, బాదామిచాళుక్యులు. సిత్తన్నవాశల్, కాంచీపురం, తిరువాన్క్కూరు, తంజావూరు మొదలైన స్థలాలలోని కుడ్యవర్ణ చిత్రాలవల్ల ఆంధ్రదేశంలో 12 వ శతాబ్దివరకు చిత్రకళ అవిచ్ఛిన్నంగా సాగిందని తెలియ వస్తున్నది.

విజయనగర చిత్రకళ దేశీయం, స్వచ్ఛం. వీటిలో ఔత్తరాహుల, విదేశీయుల ప్రభావం ఉండదు. ఆనెగొంది, ఉచ్ఛయప్పమఠంలో, హంపీ విరూపాక్షస్వామి ఆలయంలో, కాంచీపుర వరదరాజస్వామి ఆలయంలో చిత్రాలు ఇందుకునిదర్శనాలు. లేపాక్షి దేవాలయంలో

సోంపల్లిలోని చిత్ర సముదాయం ఆనాటిదే. తంజావూరు బృహదీశ్వరాలయంలో క్రొత్తగా కనబడిన చిత్రాలు 1646-47 నాటివి.

ఇక 17 శతాబ్దాలలో గోలకొండ, హైదరాబాదు, అహమ్మద్‌నగర్, బిజాపూరు కళా కేంద్రాలై విలసిల్లినాయి. కాని అప్పటి కళ అంతా పారశీక, మొగలాయి సంప్రదాయాలకు బానిస.

18, 19 శతాబ్దాలలో చిత్రకళ లలితకళగా కాక, జానపద కళగా మారి బందరు కలంకారీపనులలో, కాళీకావడి పటాలలో, తోలుబొమ్మల అలంకారాలలో, దశావతారాల బిళ్ళలలో, కొండపల్లి ఆటవస్తువులలో తలదాచుకొంది.

20 వ శతాబ్దిలో 'సాంస్కృతిక పునరుద్ధరణ' లో చిత్రకళలో నూతన చైతన్యం కలిగింది. రాజమండ్రిలో కూల్డ్రేదొర, బందరులో ప్రమోదకుమార ఛటోపాధ్యాయ ఇందుకు కొంతవరకు కారకులు. వీరి మార్గదర్శకత్వాన అనేకమంది చిత్రకారులు బయలుదేరి, భిన్న మార్గాలలో తెలుగుదేశంలో చిత్రకళను అభివృద్ధిచేశారు. వారిలోముఖ్యులు దామెర్ల రామారావు గారు, అడవి బాపిరాజుగారు, వడ్డాది పాపయ్య, సి.యన్. వెంకటరావుగారు, వి.వి. భగీరథ గారు. వీరిలో దామెర్ల రామారావుగారు అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించారు. అడవి బాపిరాజు గారి 'తిక్కనకవి' చిత్రానికి ఆంధ్ర విశ్వకళాపరిషత్తు బహుమతినిచ్చింది.

రాజమండ్రిలో రామరాయ కళాశాల, హైదరాబాదులో గవర్నమెంటు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్, పెనుగొండలో రాయలసీమ ఆర్ట్స్ అకాడమీ, మద్రాసులో అభ్యుదయ చిత్రకార సంఘము మొదలైనవి చిత్రకళను బోధిస్తున్నాయి.

ఇటీవలి చిత్రకారులలో సంజీవదేవ్, పి. టి. రెడ్డి, యస్. వి. రామారావు, బాపు, చంద్ర మొదలైనవారు ముఖ్యులు. 'బాపు' రేఖాచిత్రాలు చిత్రలేఖనంలో క్రొత్త వరవడిని ప్రారంభించాయి. బాపు పెట్టిన వరవడిని అనేకమంది యువ చిత్రకారులు అనుసరిస్తున్నారు.

*కార్టూన్ చిత్రాలు :* ఆంధ్రప్రదేశ్‌లో కార్టూన్ చిత్రకళ గతరెండున్నర దశాబ్దాలుగా ఎక్కువ ప్రాముఖ్యంలోకి వచ్చిందని చెప్పవచ్చు. దిన, వార, పక్ష, మాస పత్రికలలో రాజకీయాలపైన, సామాజిక దురాచారాలపైన, మానవ బలహీనతలపైన, గృహచ్ఛిద్రాలపైన, ప్రవర్తనా లోపాలపైన ఎన్నో కార్టూన్‌లు వెలువడుతున్నాయి. ఆ కార్టూన్లు మనస్సుకు ఆహ్లాదాన్ని, ఉల్లాసాన్నీ, చిరునవ్వునూ, హాస్యాన్నీ, ఆలోచనాప్రేరణనూ కలిగిస్తాయి. ఆంధ్రప్రదేశ్‌లో కార్టూన్ కళ అభిలషణీయంగా అభివృద్ధి చెందిందని చెప్పవచ్చు. కార్టూన్లను వేయడంలో బాపు, చంద్ర, జయదేవ్, రాగతిపండరి, వడ్డాది పాపయ్య, బి. వి. సత్యమూర్తి మొదలైనవారు సుప్రసిద్ధులు. ఈనాటి పాఠకలోకానికి కార్టూన్లు మంచి కాలక్షేపాన్ని కలిగిస్తున్నాయి.

## అకాడెమీలు

### 1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి

దీనిని 1957 లో రాష్ట్ర ప్రభుత్వం స్థాపించింది. ఇది కేంద్ర సాహిత్య అకాడెమీ (నేషనల్ అకాడెమీ ఆఫ్ లెటర్స్)కి అనుబంధమైంది. ఇది తెలుగు భాషా సాహిత్యాలను

ప్రోత్సహించి, పరిశోధన కార్యక్రమాలు అభివృద్ధి పరచడానికి, తెలుగు నిఘంటువులు, ఎన్‌సైక్లోపీడియా, రిఫరెన్సు పుస్తకాల ప్రచురణకు, వ్యక్తులకుగాని, సాహితీ సంస్థలకు గాని సహకారాన్ని అందించడానికి తెలుగురచయితల విమర్శనాత్మక, క్రియాత్మక కార్యకలాపాలకు బహుమతులివ్వడంద్వారా ప్రోత్సహించడానికి, ఆధునిక శాస్త్రీయ విధానంలో విపరణాత్మక మైన తెలుగు నిఘంటువును, వ్యాకరణ పదకోశాన్ని తయారు చేయడానికి, సాధారణ ప్రజలలో ఉత్తమ సాహిత్య పరనాన్ని మెరుగుపరచడానికి ఉద్దేశించి స్థాపించబడింది.

## 2. సంగీత నాటక అకాడెమి

రాష్ట్ర ప్రభుత్వం భారతీయ నాట్య, నాటక, సంగీత కళలను, వివిధ రీతులను అభివృద్ధి పరచడానికి 1957 లో దీనిని స్థాపించింది. వివిధ కళలలో సంభాషిప్రాదం, నాటకం, సంగీతం, నాట్యం, జానపద కళలు-వీటిలో శిక్షణ, పరిశోధన, ప్రచురణ, తత్సంబంధమైన వాటికి ఆర్థిక వనరులు, ప్రజాసంబంధాలు దీని ఉద్దేశాలు.

## 3. లలితకళల అకాడెమి

రాష్ట్ర ప్రభుత్వం దీనిని 1961 లో స్థాపించింది. చిత్రలేఖనం, శిల్పం మొదలైన కళలను ప్రోత్సహించడం, ఆయా కళలలో అధ్యయనం, పరిశోధన కార్యక్రమాలను ప్రోత్స హించడం, వాటికి ఆర్థిక సహాయం చేయడం, వివిధ లలిత కళాసంస్థల మధ్య సమన్వయం, సద్భావన కలిగించడం ఎని ప్రధాన ఉద్దేశాలు.

## 4. తెలుగు అకాడెమి

ఉన్నత స్థాయిలో విద్యాబోధన వాహికగానూ, పాలనభాషగానూ తెలుగును సుసంపన్నం చేయడానికి, ఆధునికీకరించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1966 లో రాష్ట్రభాషా సంస్థను స్థాపించి దానికి తెలుగు అకాడెమి అని పేరుపెట్టింది. ఇది 1968 ఆగష్టు 6 వ తేదీ నుండి పని చేయడం ప్రారంభించింది. ఇది స్వతంత్ర ప్రతిపత్తి గల సంస్థ. తెలుగు భాషా వ్యాప్తిని పెంపు చేయడం, భాషను అభివృద్ధిపరచి, ఆధునికీకృతం చేయడం, పాలన సౌలభ్యం కోసం తెలుగును అధికార భాషగా ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం చేసే కృషిలో సహకరించడం, ఉన్నత విద్యలోని అన్ని స్థాయిలలోనూ తెలుగును బోధన మాధ్యంగా ప్రవేశ పెట్టడానికి విద్యాలయాలు చేసే కృషిలో సహకరించడం దీని ప్రధాన ఉద్దేశాలు. దీనిలో మూడు శాఖలున్నాయి. అవి పరిశోధన, బోధన, ప్రచురణ శాఖలు. పరిశోధనశాఖఉద్దేశాలు ఆధునిక తెలుగు భాషకు సమగ్రమైన వర్ణనాత్మక వ్యాకరణం రూపొందించడానికిగాను సామాజిక భాషా పరిశీలన జరపడం, ఉపయుక్తగ్రంథసూచికలు రూపొందించడం, వివిధ శాస్త్ర విషయాలలో పరిశోధనలను వివరించే సంహితలను సంకలనం చేయడం, నేటి సాహిత్యంలో వాక్యగత వైవిధ్యాన్ని అధ్యయనం చేయడం, గిరిజన పరిశోధన సంస్థ సహకారంతో గోండి, కోయ భాషాధ్యయనం చేసి, వాటికి తెలుగు లిపిలో వాచకాలు తయారుచేయడం. బోధనశాఖ ప్రధాన ఉద్దేశాలు : తెలుగు మాతృభాషకాని వయోజనులకు తెలుగు నేర్పించడం, 1-7 తర

గతుల విద్యార్థుల శబ్ద సంపద పరిశీలనచేసి పట్టికలు తయారు చేయడం మొదలైనవి. దీనికి భాషా ప్రయోగశాల ఉంది. ప్రచురణశాఖ ముఖ్య ఉద్దేశాలు : ఇంటర్మీడియట్, బి. ఏ., బి. యస్‌సి., బి. కాం. విద్యార్థులకు తెలుగులో మౌలిక పాఠ్య పుస్తకాలు వ్రాయించి, ప్రచురించడం, పోస్ట్ గ్రాడ్యుయేట్, వృత్తివిద్యా స్థాయిలో పాఠ్య, పఠనీయ గ్రంథాలు వ్రాయించి ప్రచురించడం, జనరంజక గ్రంథాలు, పౌర శాస్త్రవిజ్ఞాన వ్యాప్తికై పుస్తకాలు ప్రచురించడం, శాస్త్ర విషయాలలో మోనోగ్రాఫ్‌లు వ్రాయించి ప్రచురించడం, ఇంగ్లీషులోని రిఫరెన్సు గ్రంథాలను అనువదించి ప్రచురించడం, పునరభ్యసన గోష్ఠులను నిర్వహించడం, వైజ్ఞానికోపన్యాసాలు ఏర్పరచడం మొదలైనవి. అకాడెమీ ఇంతవరకు సుమారు 550 గ్రంథాలు ప్రచురించింది.

## 5. అంతర్జాతీయ తెలుగు సంస్థ

అయిదుకోట్ల మంది తెలుగు సాహిత్యాన్ని, తెలుగువారి సంస్కృతిని గురించిన పరిశోధనను విస్తృతం చేసి విదేశాలలోను, స్వదేశంలోను ఉన్న తెలుగు భాషా సంస్కృతి ప్రియులతో సాంస్కృతిక సంబంధాలు నెలకొల్పే నిమిత్తం 1975 సెప్టెంబరు 8 వ తేదీన రాష్ట్ర ప్రభుత్వం దీనిని స్థాపించింది. దీనిలో సమాజం - సంస్కృతి విభాగం, భాషా సాహిత్యాల విభాగం, ప్రచురణ విభాగం అనే మూడు విభాగాలున్నాయి.

## 6. ఆంధ్రప్రదేశ్ బాలల అకాడెమి

బాలలకోసం భారతదేశంలో మొట్టమొదటి సారిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే 1976 మార్చి నెలలో రాష్ట్ర ప్రభుత్వం దీనిని స్థాపించింది. పిల్లలలోని సృజనాత్మక శక్తులను ప్రోత్సహించి, బయల్పరచడం, వారి పఠనీయ పుస్తకాల తయారీని ప్రోత్సహించడం, వారికి తగిన పత్రికలు ప్రచురించడం, వారికి అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలు నెలకొల్పడం దీని ప్రధాన ఉద్దేశాలు. ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి వారు మార్చి 1979 నుంచి 'బాల చంద్రిక' అనే బాలల బొమ్మల మాసపత్రికను ప్రచురిస్తున్నారు. ఇందులో బాలల వినోదానికీ, విజ్ఞానికీ, వికాసానికీ తోడ్పడే కథలూ, పాటలూ, వ్యాసాలూ సచిత్రంగా ఉంటాయి.

## 7. ఉరుదూ అకాడెమి

దీనిని 1976 లో ఉర్దూ భాషా, సాహిత్యాల రక్షణకు, అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వం ఆదేశంతో రాష్ట్ర ప్రభుత్వం నెలకొల్పింది. 1 వ తరగతి నుంచి 5 వ తరగతి వరకు పాఠ్య పుస్తకాలు, కవిత, కథ, నాటకం, విమర్శ, పరిశోధన విషయాలలో పుస్తకాలు ప్రచురించింది. తన కార్య కలాపాలను జిల్లాలకు, గ్రామాలకు విస్తరింప జేయాలని విజయవాడ, కర్నూలు, నిజామాబాదులలో ప్రాంతీయ కేంద్రాలు స్థాపించింది. ఈ అకాడెమీకి మన రాష్ట్ర ప్రభుత్వం ఆర్థిక సహాయం చేస్తున్నది.

## 8 ఆంధ్రప్రదేశ్ అకాడెమీ ఆఫ్ సైన్స్

ఈ సంస్థను 1963 లో రాష్ట్ర ప్రభుత్వం ఏర్పరచింది. ఆంధ్రప్రదేశ్‌లో శాస్త్రీయ విజ్ఞానాన్ని పెంపొందించడం, శాస్త్రవిజ్ఞానాన్ని ప్రజలకు అందుబాటులోకి తీసుకురావటం

అనే లక్ష్యాలతో ఈ సంస్థను స్థాపించటం జరిగింది. దీనిలో విశ్వ విద్యాలయ ఆచార్యులు ప్రసిద్ధ శాస్త్రజ్ఞులు సభ్యులుగా ఉన్నారు. వీరు కొన్ని జనరంజక శాస్త్ర గ్రంథాలను, శాస్త్ర పరిశోధనలకు సంబంధించిన గ్రంథాలను ప్రచురించినారు. తెలుగులో గ్రంథ ప్రచురణ చేయాలనే ఆశయం వీరికి ఉంది. హైస్కూలు స్థాయిలో సైన్స్ పాఠ్య ప్రణాళికలను ఆధునికంగా తయారు చేయడంలో ఈ సంస్థవారు చాలా కృషిచేసినారు. రాష్ట్రంలో వివిధ విశ్వ విద్యాలయ కేంద్రాలలో వారు శాస్త్ర అంశాల మీద గోష్ఠులను, సదస్సులను నిర్వహిస్తున్నారు. ఇటీవల వీరు కొంత మంది యువ శాస్త్రజ్ఞులను సత్కరించినారు. ఈ సంస్థకు ప్రస్తుతం ఆచార్య టి. అనంతరావుగారు అధ్యక్షులుగాను, డా. ఎస్. బాలకృష్ణగారు కార్యదర్శిగాను ఉన్నారు.

# 7

# ఆంధ్రప్రదేశ్ వనరులు

ఆంధ్రప్రదేశ్ అపారమైన సహజ సంపదలకు పుట్టినిల్లు. ఆ సహజ సంపదలను సక్రమంగా, అభిలషణీయంగా వెలికితీసి, వినియోగించుకోవాల్సిన కర్తవ్యం మనపై ఉంది. ఈ కర్తవ్యాన్ని మన రాష్ట్ర ప్రభుత్వం గుర్తించి ఎన్నో అభివృద్ధి ప్రణాళికల పథకాలద్వారా వివిధమైన సహజ సంపదలను వెలికితీసి, రాష్ట్ర పురోభివృద్ధికి, ఆర్థికతకు వినియోగిస్తున్నది. ఏదేశం తన సహజ సంపదను సాధ్యమైనంత ఎక్కువగా వెలికితీసి, ఆర్థికాభివృద్ధికి సాధనంగా ఉపయోగిస్తుందో, ఆదేశం అంత వేగంగా అభివృద్ధి చెందుతుందని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. స్వాతంత్ర్యం లభించిన తరవాత మన దేశం సహజవనరుల వినియోగానికి ఎన్నో ప్రణాళికలను రూపొందించి అమలు పరుస్తున్నది. మన రాష్ట్రం కూడా అందులో ఒక భాగంగా సహజ సంపదల వినియోగానికి ప్రణాళికా బద్ధమైన కృషిని కొనసాగిస్తున్నది. 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరవాత ఆటవీ, ఖనిజ, పశు, మత్స్య, సముద్ర, నదీ సంపదలను వెలికితీసి, రాష్ట్రప్రగతికి ఒకసాధనంగా వినియోగించడానికి మన రాష్ట్రప్రభుత్వం తీవ్రంగా కృషిచేస్తున్నది. ఈ కృషిని, గత పాతికేళ్లలో వివిధ సంపదలలో సాధించిన ప్రగతిని కింద వివరించడం జరిగింది.

## అటవీ సంపద

జాతీయ అటవీ విధానం నిర్ణయం ప్రకారం దేశంలో 33 శాతం అడవులుండాలి. వ్యవసాయాధార ఆర్థిక వ్యవస్థలో అడవులు, అటవీసంపద ప్రధాన పాత్రవహిస్తాయి. కాని మన రాష్ట్రంలో 64,154 చ. కి. మీ మాత్రమే అడవులు వ్యాపించి ఉన్నాయి. ఈ వైశాల్యం రాష్ట్ర వైశాల్యంలో 23 శాతం.

**అటవీశాఖ కింద ఉన్న అడవుల విస్తీర్ణంవివరాలు** 1977 - 78 (చ.కి.మీ. లలో)

| మండలము | రిజర్వు చేయబడినవి | రక్షితమైనవి | వర్గీకరించనివి | మొత్తం |
|---|---|---|---|---|
| గుంటూరు | 7,883 | 681 | 10 | 8,574 |
| కర్నూలు | 8,373 | 78 | — | 8,451 |
| ఆదిలాబాదు | 4,581 | 2,479 | 155 | 7,215 |
| హైదరాబాదు | 3,801 | 988 | 107 | 4,896 |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| వరంగల్ | 4,528 | 1,686 | 68 | 6,282 |
| ఖమ్మం | 6,446 | 956 | 1,027 | 8,429 |
| విశాఖపట్నం | 2,154 | 4,234 | 81 | 6,469 |
| రాజమండ్రి | 3,616 | 1,091 | — | 4,707 |
| అనంతపూర్ | 5,087 | 1,383 | 17 | 6,487 |
| నిజామాబాదు | 1,752 | 782 | 110 | 2,644 |
| మొత్తం | 48,521 | 14,358 | 1,575 | 64,154 |

మూలం : ఛీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్. ఎ. పి.

అడవుల విస్తీర్ణం విషయంలో మనరాష్ట్రం 5 వ స్థానం ఆక్రమిస్తుంది. గత రెండు దశాబ్దాలుగా సుమారు 2 వేల చ. కి. మీ కి పైగా అడవులను వివిధ ప్రయోజనాలకై కొట్టేసి నట్లుగా అంచనా. మన రాష్ట్రంలో అడవుల విస్తీర్ణంలో ఖమ్మం మొదటిస్థానాన్ని ( 53శాతం భూమి అడవులు), ఆదిలాబాదు రెండవ స్థానాన్ని ( 45 శాతం భూమి అడవులు) ఆక్రమిస్తాయి.

స్థానికావసరాలకు ఉపయోగపడే అనేకరకాల కలప, అటవీ ఉత్పత్తులు మనరాష్ట్రంలో లభ్యమవుతున్నాయికాని విలువ దృష్ట్యా మనరాష్ట్రంలోని అటవీ ఉత్పత్తులు ఇతర రాష్ట్రాల వాటితో పోటీపడలేవు.

భారతదేశంలో ఉన్న రకరకాలైన అడవులు మనరాష్ట్రంలో కూడా ఉన్నాయి. ఆంధ్ర ప్రదేశ్ అడవులలో సుమారు 2,500 జాతుల మొక్కలున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని అడవులను శాస్త్రీయంగా అయిదు రకాలు విభజించవచ్చు.

1. ఆర్ద్ర ప్రాంతంలోని ఆకురాల్చే అడవులు (Mist deciduous forests) - ఇవి ఎక్కువగా శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాలోని ఏజన్సీ కొండ ప్రదేశాల్లో ఉన్నాయి.
2. అనార్ద్ర ప్రాంతంలోని ఆకురాల్చే అడవులు ( Dry deciduous forests ) - ఇవి కర్నూలు, కడప, ఆదిలాబాద్, వరంగల్, ఖమ్మం, నిజామాబాద్, కరీంనగర్ మొదలైన జిల్లాలో విస్తారంగా ఉన్నాయి.
3. ముళ్ల చెట్లతో కూడిన పొద అడవులు (forests with short thorny trees) ఇవి చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు నల్గొండ రంగారెడ్డి జిల్లాలలో ఉంటాయి.
4. సముద్ర తీరపు అడవులు - సముద్రతీర ప్రాంతంలోని ఇసుకలో నిత్యశ్యామలమైన చిన్న చిన్న పొదలు, సరుగుడు చెట్లు పెరుగుతాయి.

5. మడ అడవులు ( tidal forests ) - నదులు సముద్రంలో కలిసే తీరంలో ఇవి పెరుగుతాయి. ఇవి కృష్ణా, గోదావరీనదీ ముఖద్వారాలలో విస్తారంగా ఉంటాయి.

అడవుల అభివృద్ధికై ప్రభుత్వం మూడు స్థాయిల కార్యక్రమం చేపట్టింది. ఒకటి అడవులకై ఒక ప్రత్యేక కార్పొరేషన్‌ను ఏర్పరచడం; రెండు సామాజిక అడవుల పెంపకం (Social forestry)-అంటే సంఘ ప్రయోజనాలకుపయోగపడే అభివృద్ధి కార్యక్రమాలను ప్రారంభించడం; మూడు కాంట్రాక్టర్లను తీసివేసి ఆ స్థానంలో అటవీశాఖ పనిచేయడం. ఈ కార్యక్రమ ఫలితంగా 1978-79 లో టేకు చెట్లు 4,162 హెక్టార్లపైన, వెదురుచెట్లు 555 హెక్టార్లు, యూకలిప్టస్‌చెట్లు 255 హెక్టార్లపైన, సిల్వర్ఓక్ 325హెక్టార్లు, దేవదారు వృక్షాలు 86.25 హెక్టార్లకుపైన, సరగుడు (చవుకు) (casuarina) చెట్లు 156 హెక్టార్లు అదనంగా వేసినట్లు తెలుస్తున్నది. 1978-79 వ సం॥ లోనే కేంద్రప్రతిపాదిత కార్యక్రమాలలో మాచ్ ఖండ్ హరివాణంలో 400 హెక్టార్లమేర అడవులు పెంచినట్లు, 25,646 హెక్టార్ల అడవులు పునరుద్ధరించినట్లు, 3,418 కి. మీ. పొడవు షెల్టర్‌బెల్ట్‌లు పెంచినట్లు, గ్రామాలలోనిబీళ్ళలో 3,625 హెక్టార్లమేర మిశ్రమ వ్యవసాయం చేసినట్లు, క్షీణించిపోతున్న అడవులలో 1,820 హెక్టార్లమేర పునరుద్ధరించినట్లుఅంచనా. అటవీశాఖ రెవిన్యూ 1977-78 లో 2.054.86 లక్షలు కాగా, 1978-79 లో రూ 2,263.91 లక్షలుఉంది. 1977-78 లో ఆ శాఖవ్యయం 1,288.14 లక్షలు కాగా, 1978-79 లో రూ 1,425.23 లక్షలు ఉంది.

ఇక రాష్ట్ర వ్యాపంగా ఉన్న అడవులలో లభించే ఉత్పత్తులు: టేకు, మద్ది, ఇప్ప, చిరిమాను, భిల్లుడు, చంద్ర మొదలైన జాతి కర్ర తెలంగాణా జిల్లాలలోని అడవులలో లభ్యమవుతుంది. తూర్పు కనుమల పొడవునా విస్తరించి ఉన్న అడవులలో జీడి మామిడి, మంచ తంగేడు, ఎర్రకర్ర వంటివి ఎక్కువగా ఉన్నాయి. రాయలసీమ, గుంటూరు, నల్లగొండ జిల్లాలలో తుమ్మ (అకేసియా) చెట్లు, పశువులమేతకుపయోగించే గడ్డి లభ్యమవుతాయి. కృష్ణ, గోదావరి నదీ తీరాల వెంటగల అడవులలో అవిసీనియా, రిజాఫొరా మొదలైన చెట్లు ఉంటాయి. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోగల అడవులలోను వెదురు, కట్టెబొగ్గు వంట చెరుకు లభ్యమవుతాయి. ఏజన్సీ ప్రాంతాలలోను, తెలంగాణా అడవులలోను, బీడీ ఆకులు, అడ్డాకులు, బంక, తేనె, చింతపండు, ఉసిరి, కుంకుడు లభ్యమవుతాయి. చిత్తూరుజిల్లాలోని పాలకొండ, శేషాచలంఅడవులలో రక్తచందనం చెట్లు ఉన్నాయి. బొమ్మలు, సంగీత వాయిద్యాల తయారీకి ఈ కర్ర శ్రేష్ఠమైనది. తిరుపతివద్ద బొమ్మలు ఈ కర్ర తోనే చేస్తారు. చిత్తూరుజిల్లాలో గంధపు చెక్కకూడా లభ్యమవుతుంది.

> ప్రపంచంలో ఎక్కడా దొరకని ఎర్రచందనం మన రాష్ట్రం అడవులలో లభిస్తుంది.

**అటవీఉత్పత్తుల విలువకు సంబంధించిన వివరాలు**

1973 - 74 నుంచి 1977 - 78

( వేల రూపాయలలో )

| సంవత్సరం | ప్రధానమైన ఉత్పత్తులు | చిన్న ఉత్పత్తులు | చిల్లర మల్లర రాబడి | మొత్తం |
|---|---|---|---|---|
| 1973 - 74 | 57,666 | 45,698 | — | 1,03,364 |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 1974 - 75 | 74,317 | 57,784 | — | 1,32,101 |
| 1975 - 76 | 86,986 | 51,835 | 8,703 | 1,47,524 |
| 1976 - 77 | 1,11,341 | 72,897 | 10,184 | 1,94,422 |
| 1977 - 78 | 1,14,867 | 81,454 | 9,242 | 1,05,563 |

మూలం : చీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్

అందువల్ల రాష్ట్రంలో అటవీ ఉత్పత్తులు పరిమాణం రీత్యానే కాక, విలువరీత్యా కూడా పెరుగుతున్నాయి. రాష్ట్రంలో, ముఖ్యంగా ఏజన్సీ ప్రాంతాలలో చింతపండు, తేనె, బంక' సారపప్పు, ఉసిరికాయలు, కరక్కాయలు, మైనం, సీకాయపొడి, అన్నాటో విత్తనాలు మొదలైన మైనర్ అటవీఉత్పత్తులు లభ్యమవుతాయి. గోళ్లరంగు తయారీలో ఉపయోగించే అన్నాటో విత్తనాలకు విదేశాలలో మంచి గిరాకీఉంది.

1977 - 78 చివరికి రాష్ట్రంలోని అడవులలో వివిధ జాతుల చెట్లు నాటిన విస్తీర్ణాల వివరాలు; టేకు 51,430 హెక్టార్లు, యూకలిప్టస్ 11,543 హెక్టార్లు, సరుగుడు (చవుకు) 12,701 హెక్టార్లు, వెదురు 22,346 హెక్టార్లు, జీడి 12,701 హెక్టార్లు, ఇతర చెట్లు 32,408 హెక్టార్లు, అదే సంవత్సరంలో ఉత్పత్తులు : కలప 2,14,834 ఘ.మీ., వంటచెరుకు 14,80,517 టన్నులు, కట్టెబొగ్గు 22,778 టన్నులు, వెదురు 1,74,881 టన్నులు, బీడీ ఆకులు 18,249 టన్నులు, గంధంచెక్క 66 టన్నులు, రక్తచందనం 401 ఘ. మీ. అదే సంవత్సరంలో వివిధ ఉత్పత్తులపైరాబడి: కలప రూ. 884 లక్షలు, వంటచెరుకు, కట్టెబొగ్గు రూ. 253 లక్షలు, జీడిపప్పు రూ. 15.41 లక్షలు, కాఫీ రూ. 32.05 లక్షలు, ఇతర మైనర్ ఉత్పత్తులపై రూ. 64.82 లక్షలు. మొత్తం రూ. 2,054 లక్షలు. అంతకు క్రితం సంవత్సరం మొత్తం రాబడి రూ. 1944 లక్షలు.

అడవుల అభివృద్ధికై మొదటి పంచవర్ష ప్రణాళికలో పెట్టిన పెట్టుబడి రూ. 26.64 లక్షలు కాగా, ఐదో పంచవర్ష ప్రణాళికలో అది రూ. 434.34 లక్షలు. ఆరో పంచవర్ష ప్రణాళికలో రూ. 1200 లక్షలు కేటాయించి నట్లు అంచనా. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అడవులలోని రోడ్ల అభివృద్ధికై ఎక్కువ శ్రద్ధతీసుకొన్నట్లు, తృతీయ ప్రణాళికలో జంతు ప్రదర్శశాలల పట్ల ఎక్కువ శ్రద్ధతీసుకొన్నట్లు తెలుస్తున్నది. వన్యమృగ సంరక్షణ చర్యలలో భాగంగా రాష్ట్ర ప్రభుత్వం 1972 లో వన్యమృగ సంరక్షణ చట్టాన్ని ఆమోదించి, 1973 ఆగష్టు 1 నుండి ఆ చట్టాన్ని అమలు పరచింది. గిరిజన ప్రాంతాల అభివృద్ధి ప్రణాళిక చేపట్టి ప్రభుత్వం 462 హెక్టార్లు టేకు మొక్కలు, త్వరగా పెరిగే మొక్కల వంగడాలు 1136 హెక్టార్లలోను నాటించింది. దీనికి అయిన వ్యయం రూ. 47.99 లక్షలు.

## ఆంధ్రప్రదేశ్ అడవుల అభివృద్ధి సంస్థ

( A. P. Forst Development Corporation )

అడవి ఉత్పత్తుల పెంపుదలకు జూన్ 1974 లో ఆంధ్రప్రదేశ్ అడవుల అభివృద్ధి సంస్థ స్థాపితమైంది. క్షీణించి పోతున్న అడవులను పునరుద్ధరించే బాధ్యతలను ఈ కార్పొరేషన్ స్వీకరించింది. అడవులపై ఆధారపడిన పరిశ్రమల చుట్టూ పారిశ్రామిక పరీవాహ ప్రాంతాలను' అభివృద్ధి చేసే ప్రయత్నంలో 1979 మార్చి నాటికి రూ. 135 లక్షల వ్యయంతో 4,632 హెక్టార్లలో యూలికప్టస్ మొక్కలను, 2443 హెక్టార్లలో జీడిమామిడి తోటలనునాటి, 2,400 హెక్టార్ల జీడిమామిడి తోటలను అటవీ శాఖనుండి స్వాధీనం చేసుకొంది. అంతేకాక, 6,400 హెక్టార్లు కాఫీ తోటవేసి, అటవీశాఖ నుండి 1,300 హెక్టార్ల తోటలు స్వాధీనం చేసుకొంది. 1978 - 79లో యూకలిప్టస్, వెదురు మొక్కలు నాటడంలో ఈ సంస్థ తన లక్ష్యాన్ని మించింది. ఈ సంవత్సరం ఈ సంస్థ 1. వరంగల్, కరీంనగర్ యూకలిప్టస్స్ తోటల పెంపకం 2. నల్లమలలో వెదురు తోటల పెంపకం పథకాలను చేపట్టింది. వీటికి అయ్యే వ్యయం 1,050 లక్షలని అంచనా. వచ్చే సంవత్సరం వివిధ రకాల తోటల పెంపకానికై పెట్టుబడి రూ. 82 కోట్లు అని అంచనా.

చాలా కాలంగా ప్రైవేటు కాంట్రాక్టర్ల చేతుల్లో ఉన్న బీడీ ఆకుల సేకరణ వ్యాపారాన్ని 1971-72 నుండి జాతీయం చేసి, అటవీశాఖ డిపోలద్వారా ఆ ఆకుల సేకరణ చేస్తున్నారు. కాంట్రాక్టర్ల ఏజన్సీని తొలగించి అగవులకు సక్రమ రక్షణ కల్పించడం, అడవులను శాస్త్రీయంగా నిర్వహించడం, వినిమయదార్లకు, కలప పరిశ్రమలకు కలపను సక్రమంగా సరఫరా చేయడం, సహకార సంస్థలు, సూపర్ బజార్లద్వారా ప్రజలకు వంటచెరుకు పంపిణీ చేయడం మొదలైన ప్రయోజనాల కోసం అటవీఉత్పత్తులను సేకరించేపథకాన్ని అటవీశాఖ చేపట్టింది.

### అడవులపై ఆధారపడిన పరిశ్రమలు

ఇవి ఇదివరకే ఎన్నో ఉన్నాయి. ఇప్పుడు మరికొన్ని ఏర్పడుతున్నాయి. వీటిలో కొన్ని రాజమండ్రిలోని ఆం. ప్ర. పేపర్ మిల్స్, కాగజ్‌నగర్‌లోని సిర్పూర్ పేపర్ మిల్స్, కర్నూలులోని రాయలసీమ పేపర్ మిల్స్, భద్రాచలంలోని భద్రాచలం పేపర్ బోర్డు, వరంగల్‌లోని ఆం. ప్ర. రయాన్స్, కొత్తగూడెం సింగరేణి కాలరీస్ మొదలైనవి. ఈ పరిశ్రమలకు వెదురు, తేలిక కర్ర, యూకలిప్టస్, ప్లయ్‌ఉడ్, టేకు, వంటచెరుకు, కలప మొదలైనవి సప్లయ్ చేయడానికి ఆంధ్రప్రదేశ్‌లోని అడవులు ఉపయోగపడతాయి.

### అడవి జంతువులు

ఆంధ్రప్రదేశ్ అడవులలో పెద్దపులి మొదలుకొని ముంగిసవరకు గల అడవి జంతువులన్నీ ఉన్నాయి. సరీసృపాలలో పెద్దత్రాచు [King Cobra] మొదలు అన్ని రకాల పాములు, బల్లిజాతులు, ఉడుములు మొదలయినవి అన్నీ ఉన్నాయి.

అడవిపంది, కణితి [ కణుజు ], దుప్పి, కొండగొర్రె, జింకలు సాధారణంగా చిట్టడవులలో కనబడే జంతువులు. ఎనుబోతు [బైసన్] గోదావరికి ఉత్తరాన ఉన్న పర్వత

ప్రాంతాలలోను, విశాఖపట్టణం జిల్లా కొండలలో, ఆదిలాబాద్ వరంగల్ జిల్లా అడవులలోను మాత్రమేకనబడుతుంది. నీల్‌గాయ్, దుప్పి, ఎలుగుబంటు, చిరతపులి, కొండ్రపహోతు,తోడేలు, నక్క అన్ని అడవులలోను నివసిస్తున్నాయి. కారెనుము (wild buffelo) ఉత్తర కోస్తా అడవులలో ఉంది. పెద్దపులి ఆదిలాబాద్, ఖమ్మం, వరంగల్, నిజామాబాద్, మహబూబ్ నగర్ జిల్లాల అడవులలోను, నల్లమల అడవులలోను, వెలికొండ అడవులలోను తిరుగుతూ ఉంటుంది.

నాలుగు కొమ్ముల కొండగొర్రె రాయలసీమ జిల్లా అడవులలో ఉంది. దాదాపు అన్ని అడవులలో జింకలున్నాయి. బురుడు జింకలు అనంతపురం, కర్నూలు జిల్లాల అడవులలో మాత్రమే కనబడతాయి. గోదావరి దక్షిణభాగం అడవులలో కణుజు, దుప్పి, లేడి ఉన్నాయి. ఇవి కాక సివంగి, చారల సివంగి, రకాల కోతులు, పిల్లులు, నక్కలు, రేచు కుక్కలు అన్ని అడవులలోను ఉన్నాయి.

రాజమండ్రికి ఉత్తరాన గోదావరినదిలోను, తుంగభద్రానదిలోను మొసళ్లు ఉన్నాయి.

## ఖనిజసంపద

ఖనిజ సంపదకు ఆంధ్రప్రదేశ్ పెట్టిందిపేరు. బ్రిటిష్‌వారు శ్రీకాకుళంలోను, విశాఖ పట్నంలోను అపారంగా లభ్యమయ్యే ముడి మాంగనీస్‌ను తమ దేశానికి తీసుకొనిపోవడానికే 1933 లో విశాఖపట్నంలో రేవు కట్టారు. పూర్వం గోల్కొండ, హంపీ విజయనగరాలలో రవ్వలను వీధులలో అమ్మేవారని ప్రతీతి.

మన రాష్ట్రంలో ప్రధానంగా లభించే ఖనిజాలు : బొగ్గు, బెరైటిస్, ఆస్‌బెస్టాస్, మైకా, క్వార్ట్జ్, సున్నపురాయి, మాంగనీస్, క్లేను, గ్రాఫైట్. మనరాష్ట్రంలోని విశాఖపట్నం జిల్లా ఇటీవల ప్రపంచ వార్తలలోకి ఎక్కింది. అక్కడ 1628 మిలియన్‌టన్నుల ముడి బాక్సైటు లభిస్తుందని తెలిసింది. నూనెకోసం నర్సాపూర్‌లో జరుపుతున్న తవ్వకాలు ఫల ప్రదం కాగలవని తెలుస్తున్నది.

మన రాష్ట్రంలో ఖనిజాల అన్వేషణలోను, వాటిని తవ్వి తీయడంలోను ప్రధానంగా మూడు సంస్థలు కృషి చేస్తున్నాయి. అవి : జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, రాష్ట్ర ప్రభుత్వగనుల భూ విజ్ఞాన శాస్త్ర డైరక్టరేట్, ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్. రాష్ట్రం లోని సహజ వనరులపై నేషనల్ రిమోట్ సెన్సింగ్ ఏజన్సీ కూడా ఉపగ్రహ అన్వేషణ జరిపి, ప్రాజెక్ట్ రిపోర్ట్ తయారు చేసింది.

ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్ అంచనాల ప్రకారం రాష్ట్రంలో లభించే వివిధ ఖనిజాలు : ఆస్‌బెస్టాస్ రిజర్వ్‌లు 0.25 మిలియన్ టన్నులు ఉన్నాయి. ఇది దేశంమొత్తం రిజర్వులలో 50 శాతం. బెరైటిస్ 60 మిలియన్ టన్నులు (98 శాతం), క్లేలు 1.68 మిలి యన్ టన్నులు (0.52 శాతం), బొగ్గు 3,000 మిలియన్ టన్నులు (3.8శాతం), ఫెల్‌స్పార్ 0.25 మిలియన్ టన్నులు (0.3 శాతం), గ్రాఫైట్ 0.10 మిలియన్ టన్నులు (0.15),

లెమెనైట్ 6 మిలియన్ టన్నులు (4.3 శాతం), ముడిఇనుము 15,30 మిలియన్ టన్నులు (0.3 శాతం), సున్నపురాయి 2,018 మిలియన్ టన్నులు (5.6 శాతం), లెడ్ 6 మిలియన్ టన్నులు (9 శాతం), రాగి 6 మిలియన్ టన్నులు (6.3 శాతం), మాంగనీస్ 2.30 మిలియన్ టన్నులు (21 శాతం), క్వార్ట్జ్ 4.93 మిలియన్ టన్నులు (2 శాతం), రాక్ ఫాస్ఫేట్ 0.15 మిలియన్ టన్నులు (0.17 శాతం], స్టియటైట్ 0.33 మిలియన్ టన్నులు ( 1.3 శాతం), వుల్ఫ్రమైట్ 86 టన్నులు. ఇది మరే రాష్ట్రంలోనూ లభించదు.

విశాఖపట్టణం జిల్లాలో ఉత్పత్తిఅయ్యే అపటైట్, ఎరువుల పరిశ్రమలో ఉపయోగ పడుతున్నది. పులివెందులలోలభించే ఆస్‌బెస్టాస్ మంచినాణ్యత గలిగినది. దీనికి ఎగుమతి మార్కెట్ బాగా ఉంది. రాష్ట్రంలో ఉత్పత్తి అయ్యే బెరైటిస్ వివిధ పరిశ్రమలకు అందజేయ బడుతుంది. అంతే కాక, పల్వరైజేషన్ తరవాత ఎగుమతి చెయ్యబడుతుంది. విశాఖపట్నం జిల్లాలో ఇటీవలే బాక్సైట్ నిక్షేపాలు కనుక్కోవడం జరిగింది. పశ్చిమగోదావరి జిల్లాలో బాల్‌క్లే ఉత్పత్తి అవుతున్నది. గోదావరి హరివాణంలో, అంటే ఆదిలాబాదు, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, తూర్పు గోదావరిజిల్లాలలో గోండ్‌వానా బొగ్గునిక్షేపాలున్నాయి. కొత్త గూడెం, ఎల్లందు, రామగుండంలలోని సింగరేణి కాలరీలలో బొగ్గు వాణిజ్య నిక్షేపాల తవ్వకం జరుగుతున్నది. గుంటూరుజిల్లా అగ్నిగుండాల బెల్ట్‌లోను, ఖమ్మంజిల్లా మైలారం ప్రాంతాలలోను, కర్నూలుజిల్లా గని ప్రాంతాలలోను ముడిరాగి నిక్షేపాలు లభిస్తాయి. అగ్నిగుండాల బెల్ట్‌లోను, కడపజిల్లా పులివెందుల తాలూకాలోను సీసం, జింక్ ప్రాజెక్టు ప్రారంభించి, దానిని అభివృద్ధిచేస్తున్నారు. సిమెంటు గ్రేడుకు చెందిన సున్నపురాయి ఆదిలాబాదు, గుంటూరు, కరీంనగర్, హైదరాబాదు, కృష్ణ, మహబూబ్‌నగర్, కర్నూలు, కడప, పశ్చిమ గోదావరి జిల్లాలలో లభిస్తుంది. ఫ్లక్స్ గ్రేడు సున్నపురాయి కృష్ణ, గుంటూరు, ఆదిలాబాదు, విశాఖపట్నం జిల్లాలో లభిస్తుంది. గుంటూరుజిల్లాలోని లైమ్‌కంకర్ నిక్షేపాలు సిమెంటు తయారీలో ఉపయోగిస్తున్నారు. నెల్లూరుజిల్లాలోని నెల్లూరు మైకా బెల్టు దేశంలోని ముఖ్యమైన మూడు మైకా బెల్టులలో ఒకటి. దీనినుండి మస్కవైట్ మైకా లభిస్తుంది. హైదరాబాదు పట్టణంలోను, చుట్టుపక్కలఉన్న నిక్షేపాలలో క్వార్ట్జ్, సిలికాలభ్యమవుతాయి. అనంతపూరు, చిత్తూరు, కర్నూలు, కడప జిల్లాలలో మంచిరకం టాల్క్ నిక్షేపాలున్నాయి.

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన కోహినూర్ వజ్రం మనరాష్ట్రం కృష్ణానదీ లోయలో లభించినదే.

కేంద్ర ఉక్కు, గనుల మంత్రిత్వశాఖ అంచనాల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో 1977లో ఉత్పత్తి అయిన ఖనిజాల విలువ రూ. 69.1 కోట్లు.

ఖనిజాల రెవిన్యూనుంచి రాష్ట్రప్రభుత్వం 1978-79 లో రూ. 5 కోట్లు తీసుకొన్నదని అంచనా. ఖనిజాల అక్రమ రవాణాను అరికట్టడానికి రాష్ట్ర ప్రభుత్వం 'పర్మిట్ పద్ధతిని' విధించి, అమలు పరుస్తున్నది. పర్మిట్ మంజూరుపై ఆశాఖ 1977-78 లో రూ. 1.69కోట్లు సముపార్జించింది. 1978-79 లో రూ. 63.96 లక్షలు ఆర్జించింది.

## ఆంధ్రప్రదేశ్ ఖనిజాభివృద్ధి కార్పొరేషన్
[ A. P. Mineral Development Corporation ]

రాష్ట్ర ప్రభుత్వం ఈ కార్పొరేషన్‌పై 1979 మార్చి వరకు పెట్టిన పెట్టుబడి రూ. 330.12 లక్షలు. 1978-79 లో కడపజిల్లాలోని బ్రాహ్మణ పల్లిలో ఆస్‌బెస్టాస్ ప్రాజెక్టును అదే జిల్లాలో మంగంపేటలో బెరైటిస్ ప్రాజెక్టును, పశ్చిమ గోదావరి జిల్లాలోని ద్వారకా తిరుమలలో బాల్‌క్లే ప్రాజెక్టును ఈ కార్పొరేషన్ చేపట్టి పని సాగించింది. అంతే కాక, ఖమ్మం జిల్లాలో మైలారంలోని రాగి ప్రాజెక్టు కర్నూలుజిల్లా ధోనె తాలూకాలోని సున్నపురాతి ప్రాజెక్టు అభివృద్ధి పరచింది. ప్రకాశం జిల్లాలోని లోగ్రేడ్ ఇసుము నిక్షేపాల అన్వేషణ కార్యక్రమాన్ని కూడా ఈ కార్పొరేషన్ చేపట్టింది. అంతేకాక, రాక్‌ఫాస్ఫేట్, ఆస్‌బెస్టాస్, క్వార్ట్జ్, పాలరాయి ప్రాజెక్టులలో జాయింట్ వెంచర్‌కూడా కొనసాగించింది.

ఈ కార్పొరేషన్ మంగంపేటలో చేపట్టిన బెరైటిస్ ప్రాజెక్టు వల్ల ఉత్పత్తి సక్రమంగా ప్రారంభమైన తరవాత రెండు లక్షల టన్నుల బెరైటిస్ ముద్దలరూపంలోగాని, పొడి రూపంలోగాని వస్తుందని అంచనా. దీని విలువ సుమారు రూ. 6.78 కోట్లు ఉండవచ్చు. దీనిలో నూనె, సహజవాయుల కమిషన్ 20,000 టన్నుల బెరైటిస్ ఉపయోగిస్తుంది. బెరైటిస్‌ను ఎగుమతి చెయ్యగా లభించేది రూ. 85 మిలియన్ డాలర్లని అంచనా. దీని నుంచి ఉత్పత్తి అయ్యే ఆస్‌బెస్టాస్ ఫైబర్ 600 టన్నులని అంచనా. దాని విలువ రూ. 44 లక్షలు ఉండవచ్చు.

బాల్‌క్లే ఉత్పత్తి వల్ల రూ. 10 లక్షలు లభించవచ్చని అంచనా. ద్రోణాచలంలోని హైగ్రేడు సున్నపురాయి ప్రాజెక్టు ఈసంవత్సరం ఉత్పత్తి ప్రారంభించవచ్చని, దాని నుండి రూ. 40 లక్షల విలువచేసే లక్ష టన్నుల ఉత్పత్తి లభిస్తుందని అంచనా. మైలారం రాగి ప్రాజెక్టు సాలుకు 450 టన్నులు ఉత్పత్తి చేస్తుందని, దీని విలువ రూ. 20 లక్షలని అంచనా ఈ కార్పొరేషన్ చేపట్టిన అన్ని ప్రాజెక్టులు రూ. 777 లక్ష ఉత్పత్తిని ఇస్తాయని భావిస్తున్నారు. దీని వల్ల ఉత్పత్తిలో పెరుగుదల శాతం 25% అవుతుంది. ఈ కార్పొరేషన్ చేపట్టిన కార్యక్రమంలో 1974 - 78 మధ్య బెరైటిస్, ఆస్‌బెస్టాస్, బాల్‌క్లేల ఉత్పత్తి 1,61,710 టన్నులని అంచనా వేసినారు. దీని అమ్మకం విలువ రూ. 113.23 కోట్లు.

సింగరేణి కాలరీలలో బొగ్గు ఉత్పత్తి 5 వ పంచవర్ష ప్రణాళికతో సాలుకు 53.12 టన్నులు. 1977 - 78 లో ఆ కంపెనీ 89.12 లక్షల టన్నులు ఉత్పత్తి చేసింది.

### 1978 సంవత్సరంలో మనరాష్ట్రంలో ఉత్పత్తి అయిన ఖనిజాలు - వాటివిలువ

(పరిమాణం : '000 టన్నులు విలువ : రూ. వేలలో)

| ఖనిజం | పరిమాణం | విలువ |
|---|---|---|
| అపటైట్ (Apatiite) | 3.4 | 873 |
| ఆస్‌బెస్టాస్ | 1.3 | 7,181 |
| బెరైటిస్ (Barytes) | 374.8 | 19,321 |

| 1 | 2 | 3 |
|---|---|---|
| బాల్ క్లే | 33.3 | 931 |
| బంకమన్ను (clay) | 45.0 | 542 |
| బొగ్గు | 9,030.0 | 6,24,150 |
| చైనా క్లే (China clay) | 43.7 | 812 |
| రాగి | 1.5 | 135 |
| ఫెల్‌స్పార్ (Felspar) | 4.7 | 62 |
| ఫైర్‌క్లే | 14.9 | 401 |
| గ్రాఫైట్ | 0.5 | 121 |
| ఇనుపఖనిజం | 69.9 | 749 |
| సున్నపురాయి | 3,218.7 | 46,856 |
| మాంగనీసు | 86.7 | 4,354 |
| అభ్రకము | 3.1 | 5,973 |
| ఓకర్ (ochre) | 5.3 | 53 |
| క్వార్ట్జ్ | 69.3 | 1,276 |
| సిలికా ఇసుక | 8.5 | 97 |
| ఇసుక - ఇతరాలు | 265.6 | 1,292 |
| పలక (slate) | 2.7 | 57 |
| స్టీటైట్ (streatite) | 19.9 | 648 |
| వర్మిక్యులేట్ (vermiculate) | 1.0 | 55 |

మూలము : అర్థగణాంకశాఖ, ఎ.పి. 1978-79.

భారతదేశపు ఖనిజ సంపదతో పోల్చినప్పుడు బెరైటిస్ (ముగ్గురాళ్లు) 99 శాతం మన ఆంధ్రప్రదేశ్‌లోనే దొరుకుతాయి. బాల్ క్లే 94 శాతం మన రాష్ట్రంలో దొరుకుతుంది.

ఆంధ్రప్రదేశ్‌లో కింద పేర్కొన్న ఖనిజాలు కింది ప్రదేశాలలో లభిస్తాయి.

ఆస్‌బెస్టాస్ [రాతినార] : పులివెందల, బ్రాహ్మణపల్లి, బాపట్ల, నూతల (కడప), కర్నూలు అనంతపురం జిల్లాలు

బెరైటిస్ : సంజీవపురం, ముచ్చుకోట, అనంతపూర్, మంగంపేట, వేంపలి, (కడప), కర్నూల్ జిల్లాలు.

బాక్సైట్ : విశాఖపట్నం, గోదావరి జిల్లాలు

బెరిల్ : గూడూరు (నెల్లూరు జిల్లా), తిరువూరు [కృష్ణాజిల్లా], కురపాం (విశాఖజిల్లా)

క్రోమైట్ : కొండపల్లి (కృష్ణాజిల్లా),మధిర (ఖమ్మం జిల్లా)

బంకమన్ను [క్లే] : కురపాం (విశాఖజిల్లా), ద్వారకాతిరుమల (ప. గోదావరి జిల్లా), చిత్యాల [నల్గొండజిల్లా], కోనసముద్రం[నిజామాబాద్ జిల్లా].

బొగ్గు ఆదిలాబాద్, ఖమ్మం, వరంగల్, ఉభయ గోదావరిజిల్లాలు

కోరండం (కురువిందలు) : ఆత్మకూరు, దండువారిపల్లె (అనంతపురంజిల్లా), రంగాపురం, గోల్‌గూరు, బూంజారు ( వరంగల్ జిల్లా), విశాఖజిల్లా కొండ ప్రాంతాలు

డోల్‌మైటుసున్నపురాయి : కర్నూలు, కడప, విశాఖ, వరంగల్ జిల్లాలు

ఫెల్‌స్పార్ : కృష్ణా, విశాఖ, వరంగల్ జిల్లాలు

గార్నెట్ : గరీబుపేట, కొత్తగూడెం

వజ్రాలు : వజ్రకరూరు, ఎత్తివరల, గాడెపొత్తూరు, గంజికుంట (అనంత పురంజిల్లా), చెన్నూరు, కొండపేట (కడపజిల్లా).

బంగారు : మాలప్పకొండ, పెద్దవర్తికుంట (చిత్తూరుజిల్లా), పెనుకొండ, రామ గిరి (అనంతపురంజిల్లా).

గ్రాఫైట్ : వరంగల్, ఖమ్మం, కృష్ణా, ఉభయ గోదావరి, విశాఖపట్నం జిల్లాలు.

ఇనుము : కృష్ణా, కర్నూలు,చిత్తూరు,అనంతపూరు, ఖమ్మం, కడప, వరం గల్ జిల్లాలు.

మాంగనీసు : కోటూరు, గరివిడి, పెరాపి (విశాఖపట్టణం, శ్రీకాకుళంజిల్లాలు)

అభ్రకం : ఆత్మకూరు, రాపూరు, గూడూరు [ నెల్లూరు జిల్లా ], తిరువూరు [కృష్ణాజిల్లా], మధిర [ఖమ్మంజిల్లా], అంకన్నగూడెం [ పశ్చిమ గోదావరి జిల్లా].

కయనైట్ : సైదాపురం, చుండి సత్రం [గూడూరుజిల్లా], గరీబుపేట (వరం గల్ జిల్లా].

స్టియొటైట్ : నెల్లూరుజిల్లా, ముచ్చుకోట, లాడిపతి [అనంతపురంజిల్లా], ముస లాయ్‌చెరువు, ముద్దవరం [ కర్నూలుజిల్లా ], కొత్తగంటిరెడ్డిపల్లె [ కడపజిల్లా ].

సోప్‌స్టోన్ : కరీంనగర్, నల్గొండ జిల్లాలు

జిప్సమ్ : నెల్లూరుజిల్లా

సహజవాయువు : కృష్ణా, గోదావరి జిల్లాలు

పెన్‌కాన్‌డైట్ : శంకరరాజులపాడు ( నెల్లూరుజిల్లా ).

మోలెబ్డినం : తూర్పు గోదావరిజిల్లా

ఇల్మనైట్ : విశాఖపట్నం సముద్రతీరం

ఖనిజరంగులు : వికారాబాద్ (రంగారెడ్డిజిల్లా)
దిద్దుకూరు, ద్వారాకా తిరుమల, కాడేరు (పశ్చిమ గోదావరిజిల్లా), మాచెర్ల (గుంటూజిల్లా), గుంటుపల్లి (కర్నూలుజిల్లా), కడపజిల్లా.

సున్నపురాయి : కడప, కర్నూలు, గుంటూరు, ఖమ్మం, ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, జిల్లాలు.

రాగిఖనిజం : గరిమిన పెంట (నెల్లూరుజిల్లా), జంగంరాజుపల్లె (కడప), ముది గుబ్బ (అనంతపూర్), అగ్నిగుండాల గుంటూరు), గజ్జెల కొండ (కర్నూలు), చిత్ర్యాల (నల్గొండ), పాల్వంచ ( వరంగల్ జిల్లా ).

సీసం : కారెంపూడి, (గుంటూరు), జంగంరాజపల్లె (కడప), కోయిలకుంట (కర్నూలు)

పైరైటిస్ : మచిలీపట్టణ తీరప్రాంతం(కృష్ణాజిల్లా), కడప, కర్నూలు జిల్లాలు, తాండూరు (రంగారెడ్డిజిల్లా),కొత్తగూడెం (ఖమ్మం)

**ఖనిజాలవల్ల రాష్ట్రానికి లభించే ఆదాయం** (కోట్ల రూ లలో)

| సంవత్సరము | ఆదాయం |
|---|---|
| 1970-71 | 10.38 |
| 1975-76 | 17.84 |
| 1976-77 | 19.84 |
| 1977-78 | 19.07 |
| 1978-79 | 19.29 |

మూలం : అర్థగణాంకశాఖ, ఎ.పి.

ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత మన రాష్ట్ర ప్రభుత్వం ఖనిజాలను వెలికి తీయడానికి అభిలషణీయమైన పరిమాణంలో వియోగించడానికి, విదేశాల ఎగుమతికీ, వివిధ ఖనిజాల అభివృద్ధిద్వారా ఆంధ్రప్రదేశ్ ఆర్థికాభివృద్ధిని పెంపొందించడానికి ఎన్నోచర్యలు తీసుకొన్నది, తీసుకొంటున్నది.

## మత్స్య సంపద

మన రాష్ట్రానికి 982 కి. మీ. ల సముద్రతీరం ఉంది. మన దేశంలో విస్తృత తీరం గల రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్‌ని ఒకటిగా పేర్కొనవచ్చు. సముద్రపు ఒడ్డుకుంచి సముద్రం లోపలికి 32-43 కి. మీ. ల వరకు చేపలు పట్టే అవకాశం ఉంది. ఈ విస్తీర్ణం ఆంధ్రప్రదేశ్‌కు 31,044 చ. కి. మీ. లు ఉంది. అంతేగాకుండా ఆంధ్రప్రదేశ్‌లోని నదులు, ఉపనదులు, కాలువలు, జలాశయాలు, చెరువులు మొదలైన మంచినీటి వనరుల వల్ల మత్స్య పారిశ్రామికాభివృద్ధికి ఎన్నో అవకాశాలున్నాయి.

1956 సం॥ లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు మత్స్యశాఖ పశుసంవర్ధకశాఖకు అనుబంధంగా ఉండేది. అయితే తరవాత మత్స్యశాఖకు ప్రత్యేక ప్రతిపత్తి కల్పించబడింది. ఈ శాఖ ఆంధ్రప్రదేశ్‌లో మత్స్యసంపదాభివృద్ధికి తీవ్రంగా కృషి చేస్తూ ఉంది. 1976 సం. మే లో రాష్ట్ర మత్స్యశాఖను ఆరు మండలాలుగా విభజించి, ఒక్కొక్క మండలానికి ఒక డిప్యూటీ డైరెక్టరును నియమించినారు.

ఆంధ్రప్రదేశ్‌కు సంవత్సరానికి నాలుగు లక్షల టన్నుల సముద్ర చేపల ఉత్పత్తి సంభావ్యత ఉన్నది. ప్రస్తుతపు సగటు సముద్రచేపల ఉత్పత్తి లక్ష టన్నుల మేరకు మాత్రమే ఉంది. అందులో 70 శాతం మామూలు పద్ధతిలో చేపలు పట్టడం జరుగుతున్నది. రాష్ట్రం లోని మంచినీటి వనరులద్వారా చేపల ఉత్పత్తి విరివిగా జరిగే అవకాశాలు ఉన్నాయి. ప్రస్తుతం మంచినీటి చేపల ఉత్పత్తి 1,32,000 టన్నులు ఉంది.

> మన దేశంలో మనిషికి సగటున సంవత్సరానికి 11 కిలోల చేపల అవసరం ఉండగా, కేవలం 4 కిలోల చేపలు మాత్రమే అందించగలుగుతున్నాము.

సముద్రచేపల ఉప్పత్తి మండలాల వారీగా 1977 సం. లో కింది విధంగా ఉన్నది.

| మండలం | ఉత్పత్తి టన్నులలో |
|---|---|
| పలాసా | 6676 |
| శ్రీకాకుళం | 6983 |
| వాల్తేరు | 17386 |
| కాకినాడ | 43066 |
| నర్సాపూరు | 5109 |
| మచిలీపట్టణం | 1812 |
| ఒంగోలు | 7464 |
| నెల్లూరు 1 | 10852 |
| నెల్లూరు 2 | 1408 |
| మొత్తం | 100756 |

మూలం: డైరెక్టరు, మత్స్య శాఖ, ఆం. ప్ర.

మంచినీటి చేపల ఉత్పత్తి జిల్లాలవారీగా 1978 సం. లో కింది విధంగా ఉన్నది.

| | జిల్లాలు | టన్నులు |
|---|---|---|
| 1 | శ్రీకాకుళం | 2616 |
| 2 | విశాఖపట్టణం | 513 |
| 3 | తూర్పుగోదావరి | 625 |
| 4 | పశ్చిమగోదావరి | 549 |
| 5 | కృష్ణా | 139 |

| | | |
|---|---|---|
| 6 | గుంటూరు | 2438 |
| 7 | ప్రకాశం | 3762 |
| 8 | నెల్లూరు | 2802 |
| | కోస్తా ఆంధ్ర | 13,444 |
| 9 | కర్నూలు | 4022 |
| 10 | అనంతపూర్ | 4775 |
| 11 | కడప | 1478 |
| 12 | చిత్తూరు | 2444 |
| | రాయలసీమ | 12719 |
| 13 | హైదరాబాదు | 3195 |
| 14 | నిజామాబాద్ | 15234 |
| 15 | మెదక్ | 10671 |
| 16 | మహబూబ్‌నగర్ | 5715 |
| 17 | నల్గొండ | 10960 |
| 18 | వరంగల్లు | 18850 |
| 29 | ఖమ్మం | 7364 |
| 20 | కరీంనగర్ | 17576 |
| 22 | ఆదిలాబాదు | 4122 |
| | తెలంగాణా | 93,687 |
| | మొత్తం | 1,19,850 |

మూలం : డైరెక్టరు, మత్స్యశాఖ, ఆం. ప్ర.

ఆంధ్రప్రదేశ్ చేపల అభివృద్ధికి ప్రభుత్వం ఎన్నోచర్యలు తీసుకొంటున్నది. అందులో 1. చేపల విత్తనాలను పెంచడం. చేప పిల్లలను పెంచడానికి అనువుగా 102 ఉత్పత్తి కేంద్రాలు పనిచేస్తున్నాయి. ఈ కేంద్రాలలో చేపగుడ్లు, చేపనారు పెంచి చేపపిల్లలను రాష్ట్రం లోని ఇతరత్రా నీటి వనరులలో పెంచడానికి సరఫరాచేయడం జరుగుతున్నది. రాజేంద్ర నగర్, దింపి, కోయిల్‌సాగర్, మునేర్, నిజాంబాద్, పాతకడప, సుంకేసుల, మోపాడు, ఉప్పూరు, ధవళేశ్వరం, హైదరాబాద్ మొదలైన మత్స్య పాలక కేంద్రాలలో దేశవాళి, విదేశీ చేపల పెంపకం జరుగుతున్నది.

చేపలు పట్టడంలో ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టి మత్స్య పరిశ్రమను అభివృద్ధి చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం కొన్ని శిక్షణ కేంద్రాలను నెలకొల్పింది. వాటిల్లో 1957 సం.

లో కాకినాడలో నెలకొల్పిన మత్స్య సంపర్ధక శిక్షణా కేంద్రం, 1970 సం. లో వరంగల్లు 1972 సం. లో పెనకచర్ల (అనంతపురం జిల్లా) లలో నెలకొల్పినవి ప్రఖ్యాతమైనవి.

మన రాష్ట్రంలో 2,37,470 మత్స్యకారులు ఉన్నారు. వారు 408 మత్స్య గ్రామాలలో సముద్రతీరంవెంబడి ఉన్నారు. మత్స్యకారులలో అగ్నికుల క్షత్రియులు, వాడబలిజలు, గంగ పుత్రులు, జాలరులు, బెస్తలు, వడ్డెర్లు, నెయ్యాలు, గూండ్ల మొదలైన కులాలు ఉన్నాయి. మత్స్యకారుల ఆర్థికాభ్యున్నతికి మధ్య దళారుల నుంచి వారికి రక్షణ కల్పించడానికి రాష్ట్ర ప్రభుత్వం ఎన్నో మత్స్యకార్ల సహకార సంఘాలను నెలకొల్పింది. ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటికి రూ. 1.96 లక్షల వాటా ధనంతో సుమారు 40 వేల మంది సభ్యులుగాగల 240 బెస్తల సహకార సంఘాలు పనిచేస్తుండేవి. ప్రస్తుతం 1233 మత్స్యకారుల సహకార సంఘాలు మన రాష్ట్రంలో ఉన్నాయి. వాటిల్లో 1,18,737 మంది సభ్యులున్నారు. ఆ సంఘాలు చెల్లించిన మూలధనం రూ. 26.09 లక్షలు. ఈ సంఘాలను సన్నకారు రైతుల అభివృద్ధి ఏజన్సీ [ S. F. D. A. ], ఉపాంత వ్యవసాయ దారుల, వ్యవసాయ కార్మికుల అభివృద్ధి ఏజన్సీ [ M. F. A. L. A. ], L. C. D. C., I. R. D. P. మొదలైన సంస్థలు మత్స్యకారుల సంఘాలకు తక్కువ వడ్డీమీద పరపతి సౌకర్యాలను కలి గిస్తున్నాయి. మత్స్యశాఖవారు మత్స్యకారులకు అవసరమైన నైలాన్ వలలను సబ్సిడీ పథ కాల కింద సహాయం చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ కోస్తా తీర ప్రాంతంలో 800 యాంత్రిక బోట్లు, 54 ట్రాలర్లు పనిచేస్తున్నాయి. యాంత్రిక బోట్ల, ట్రాలర్ల సంఖ్యను పెంచడానికి, ప్రాథమిక అవస్థాపన సౌకర్యాలను పెంచడానికి ఎంతో ఆవశ్యకత ఉంది. దీనిని దృష్టిలో పెట్టుకొని సుసంఘటిత సముద్ర చేపల ప్రాజెక్టు [ Integrated Marine Fisheries Project ] తయారు జేయడమైంది. దీనికి ఆర్థిక సహాయాన్ని అందించడానికి ప్రపంచ బ్యాంకు, కేంద్ర ప్రభుత్వం అంగీకరించినాయి. విశాఖపట్టణం, కాకినాడలలో చేపల రేవులను అభివృద్ధిపరచడానికి నిజాంపట్టణంలో చేపల రేవులను నెలకొల్పడానికిగాను ఈ ప్రాజెక్టుకు రూ. 31.036 కోట్లు వ్యయం కాగలదని అంనా వేయడమైనది. అంతేకాకుండా భావనపాడు [శ్రీకాకుళం] చేపల రేవును రూ. 131.84 లక్షల వ్యయంతో నెలకొల్పడానికి కేంద్ర ప్రభుత్వం ఒప్పుకొంది. యునైటెడ్ కింగ్‌డం సహాయంతో నెల్లూరుజిల్లా తీరంలో కృష్ణా పట్టణంలో మరో చేపల రేవుమ నిర్మించడానికి సన్నాహాలు చురుకుగా జరుగుతున్నాయి. అను కొన్నప్రకారం ఈ చేపలరేవుల నిర్మాణంజరిగితే 23,125 టన్నుల చేపలు, 6,615 టన్నుల రొయ్యలు అదనంగా ఉత్పత్తి కాగలవని అంచనా వేయడమైంది.

> రాష్ట్రంలో ప్రతిసంవత్సరము సగటున 25 లక్షల టన్నుల చేపలు లభ్యమవుతున్నాయి. ఇందులో 15 లక్షల టన్నుల చేపలు సముద్రంనుంచే లభిస్తున్నాయి.

మనరాష్ట్రంలో చెరువుల కింద 8,68,440 ఎకరాలు, రిజర్వాయర్లకింద 5,97,590 ఎకరాల మొత్తం నీటివసతులున్నట్లు అంచనావేయడమైంది. ఇందులో 2,17,110 ఎకరాలు చెరువుల కిందను 2,98,795 ఎకరాలు రిజర్వాయర్లకిందను మంచినీటి చేపల పెంప కానికి అనువుగా నిల్వచేయవచ్చునని తెలియవస్తున్నది. ఈ నీటి నిల్వకు ఆరో ప్రణాళికలో

చేప పిల్లల ఆవశ్యకత 73 కోట్ల వరకు ఉన్నదని అంచనా వేసినారు. అయితే మనచేపపిల్లల ఉత్పత్తి ప్రస్తుత స్థాయి 17.6 కోట్లు మాత్రమే. ప్రస్తుత ఉత్పత్తిస్థాయికి భావి అవసరాలకు మధ్య గల అగాధాన్ని పూడ్చడానికి ప్రభుత్వం ఆరో ప్రణాళికా కాలంలో ఎన్నో చర్యలను తీసుకోవలసి ఉంది. మత్స్యశాఖవారి సాంకేతికసహాయంద్వారా రాష్ట్రంలో ప్రైవేటు రంగంలో 31 చేపల విత్తనాల క్షేత్రాలను (fish seed farms) ను నెలకొల్పడం జరిగింది.

ప్రస్తుతం ఉన్న చేపల విత్తనాల క్షేత్రాలను అభివృద్ధి పరచడం ద్వారాను, మత్స్య సహకారసంస్థలద్వారా కొత్తక్షేత్రాలను స్థాపించడం ద్వారాను చేపల విత్తనాల అవసరాలను ఆరో ప్రణాళికలో తీర్చడానికి భారీఎత్తున సన్నాహాలు జరుగుతున్నాయి.

మత్స్య పరిశ్రమాభివృద్ధికి మనరాష్ట్రం ప్రతి ప్రణాళికలోను కొన్ని లక్షల రూపాయలను కేటాయిస్తున్నది. కింది వివరాలను పరిశీలించవచ్చు.

| | ప్రణాళిక | కేటాయింపు (లక్షల రూపాయలలో) |
|---|---|---|
| 1 | మొదటి పంచవర్ష ప్రణాళిక | 14.47 |
| 2 | రెండో పంచవర్ష ప్రణాళిక | 70.28 |
| 3 | మూడో పంచవర్ష ప్రణాళిక | 131.22 |
| 4 | వార్షిక ప్రణాళిక (1966-69) | 109.18 |
| 5 | నాల్గో పంచవర్ష ప్రణాళిక | 242.17 |
| 6 | అయిదో పంచవర్ష ప్రణాళిక | 395 |

మూలం : డైరెక్టర్ ఆఫ్ ఫిషరీస్, ఎ. పి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆదాయంలో మత్స్య పరిశ్రమ పాత్ర గణనీయంగా ఉందని చెప్పవచ్చు. మత్స్యపరిశ్రమవల్ల రాష్ట్రానికి ఎంతఆదాయం సమకూరుతున్నదో కిందపేర్కొన్న సంఖ్యలు తెలియజేస్తాయి.

| సంవత్సరాలు | ఆదాయం(రూపాయలు కోట్లలో) (1960-61 ధరల ప్రకారం) |
|---|---|
| 1955-56 | 1.1 |
| 1960-61 | 9.7 |
| 1970-71 | 13.49 |
| 1975-76 | 18.41 |
| 1977-78 | 18.69 |
| 1978-79 | 18.83 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

తుఫానులు, వరదలు వచ్చినప్పుడు వాటివల్లదెబ్బతిన్న మత్స్యకారులకు ప్రభుత్వం రకరకాల సహాయాన్ని అందిస్తోంది. ఉదాహరణకు నవంబరు 1971 లో వచ్చిన పెద్ద తుఫానువల్ల మత్స్య పారిశ్రామికులు ఎన్నో విధాలుగా నష్ట పడటం జరిగింది. అప్పుడు ప్రభుత్వం సహాయ నిధుల కింద రు 175 లక్షల రూపాయలను మంజూరు చేసింది. తత్ఫలితంగా కిందపేర్కొన్న సహాయక చర్యలను తీసుకోవడం జరిగింది.

1 1750 కొత్తనావలను సప్లై చేయడం

2 103 క్రాఫ్టలను సప్లై చేయడం

3 43,644 బాస్కెట్ క్రాఫ్టలను సప్లై చేయడం

4 64.65 మె. టన్నుల నైలాన్ 16.7 మె. టన్నుల మోనో ఫిలమెంటు, 11,878 బాక్సుల నూలును సప్లై చేయడం.

5 చెడిపోయిన 108 క్రాఫ్టలను రిపేరులు చేయడం

1979 మే లో నెల్లూరు, ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో వచ్చిన తుఫాను సందర్భంలో సహాయకచర్యలకింద 65.93 లక్షలరూపాయలు కేటాయించడంజరిగింది. 1980సెప్టెంబరులో శ్రీకాకుళంప్రాంతానికి వచ్చినతుఫానులో దెబ్బతిన్నవారికికూడా సహాయాన్ని అందించడమైంది.

ఆంధ్రప్రదేశ్ నుంచి రొయ్యల ఎగుమతి చెప్పుకోదగినంతగా జరుగుతున్నది. ఫిష్ ప్రోడక్ట్స్ లిమిటెడ్, కాకినాడ, యూనియన్‌కార్బైడ్ లిమిటెడ్, వైజాగ్, ఈస్ట్‌కోస్ట్‌మెరైన్ ప్రోడక్ట్స్, వైజాగ్. ఆంధ్రప్రదేశ్ ఫిషరీష్ కార్పొరేషన్ మొదలైన సంస్థలు ముఖ్యంగా జపాన్‌కి రొయ్యలను ఎగుమతి చేస్తున్నాయి. తద్వారా విదేశీ మారక ద్రవ్యం మనకు లభిస్తున్నది.

**రొయ్యలఎగుమతి**

| సంవత్సరం | ఎగుమతి చేసిన సరుకు మె. టన్నులలో | విలువ (కోట్ల రూపాయలలో) |
|---|---|---|
| 1972 | 635 | 1.7 |
| 1974 | 760 | 2.37 |
| 1975 | 1335 | 5 3 |
| 1978 | 1726 | 10 |

## ఆంధ్రప్రదేశ్ మత్స్యపారిశ్రామికాభివృద్ధి సంస్థ

ఈ సంస్థను 1974 మే లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నెలకొల్పింది. దీని అధికృత మూలధనం 3 కోట్ల రూపాయలు. దీని ప్రధానఉద్దేశాలు సముద్రచేపల ఉత్పత్తిని, మంచినీటి చేపల ఉత్పత్తిని పెంచడం; దేశంలో చేపల వ్యాపారాన్ని ప్రోత్సహించడం; చేపల, రొయ్యల ఎగుమతి వ్యాపారాన్ని నిర్వహించి విదేశ మారక ద్రవ్యాన్ని సమకూర్చడం; మత్స్యసంపదకు

అనుబంధంగా ఉన్న చిన్న పరిశ్రమలను అభివృద్ధి పరచడం; మత్స్య పారిశ్రామికులకు ఆర్థిక, సాంకేతిక సహాయం అందించడం. హైదరాబాదు సికింద్రాబాదు జంట నగరాలలో ఈ సంస్థ టోకు వ్యాపారాన్ని చేపట్టింది. సముద్రతీరం నుంచి చేపలను రాష్ట్రంలోని కొన్ని ముఖ్య కేంద్రాలకు వాహనాలద్వారా చేరవేయడంజరుగుతోంది. ఈసంస్థకు కాకినాడ, విజయవాడలలో శీతలగిడ్డంగులు ఉన్నాయి.

## నీటివనరులు

ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా వ్యవసాయక రాష్ట్రము. అందుచేత మన రాష్ట్రంలో నీటి వనరుల ప్రాముఖ్యం ఎంతైనా ఉంది. మన రాష్ట్రం వనరులకు నిలయం. మనరాష్ట్రంలో కృష్ణా, గోదావరి, నాగావళి, వంశధార, తుంగభద్ర, పెన్న, మంజీర, మూసి మొదలైన నదులు ప్రవహిస్తున్నాయి. నదులవల్ల మన రాష్ట్రానికి 91% నీరు ఉపయోగపడుతున్నది. నదులేకాకుండా, కాలువలు, చెరువులు, గొట్టపుబావులు, ఇతరత్రాబావులు, మనకు నీటిపారుదల సౌకర్యాలను కలిగిస్తున్నాయి. నదులమీద ఆనకట్టలు కట్టడం ద్వారా, నదీజలాల వనరులను ఉపయోగించుకోగలుగుతున్నాము.

మనకుగల నదీజలాల వనరులు కింది విధంగా ఉన్నాయి.

| నదులు | క్యూసెక్కులు (మిలియన్లలో) | టిఎమ్‌సి |
|---|---|---|
| కృష్ణానది | 22,660 | 800 |
| గోదావరి | 42,470 | 1500 |
| పెన్నానది | 2760 | 97 |
| మిగతా తొమ్మిది అంతర్ రాష్ట్రనదులు | 2860 | 101 |
| | 70750 | 2498 |

పైన పేర్కొన్న నదులు కేవలం ఒక్క ఆంధ్రప్రదేశ్‌కేకాక, మహారాష్ట్ర, కర్ణాటక, మధ్యప్రదేశ్, ఒరిస్సా, తమిళనాడు రాష్ట్రాలకు నీటి వనరులను అందజేస్తాయి. మనరాష్ట్రంలో కృష్ణా, గోదావరి నదులు ఎల్లకాలం ప్రవహిస్తాయి. నాగావళి, వంశధార, పెన్నా నదులు సంవత్సరంలో కొద్దికాలం మాత్రమే ప్రవహిస్తాయి.

పైనపేర్కొన్న నదులేకాకుండా మనరాష్ట్రంలో ఎన్నో వాగులు, చెరువులు ఉన్నాయి. వాటిని స్థూలంగా కింద పేర్కొనడం జరిగింది.

| | జిల్లా | వాగులు/చెరువులు |
|---|---|---|
| 1 | శ్రీకాకుళం | : బాహుదా, వరహాలగడ్డ |
| 2 | విశాఖపట్నం | : చంపావతి, గోస్తని, శారదా, తాండవ. |

3. తూర్పుగోదావరి : ఏలేరు
4. పశ్చిమ గోదావరి : తమ్మిలేరు, జల్లేరు, ఎర్రకాలువ
5. కృష్ణా : ఉప్పుటేరు, బుడమేరు, మునేరు
6. గుంటూరు : గుండ్లకమ్మ
7. ప్రకాశంజిల్లా : పెన్న, పెన్నేరు, మోపాడు
8. నెల్లూరు : పెన్న
9. చిత్తూరు : సువర్ణముఖి, పాలార్
10. కర్నూలు : కుందేరు, నాగలేరు, హంద్రి
11. కడప : పాపఘ్ని, చిత్రావతి, చెయ్యేరు
12. ఆదిలాబాద్ : కడెం, పెన్‌గంగా
13. నల్లగొండ : పెద్దవాగు, ఆలేరు
14. ఖమ్మం : పాలేరు, వైరా
15. నిజామాబాద్ : నిజాంసాగర్
16. వరంగల్ జిల్లా ; రామప్పచెరువు, పాకాల
17. అనంతపురం : బుక్కసముద్రం

ఆంధ్రరాష్ట్రంలో ముఖ్యమైన నదులను గురించి కిందసంగ్రహంగా వివరించడమైనది.

*గోదావరి :* రాష్ట్రంలోని నదులన్నిటిలోను గోదావరి పెద్దది. ఇది బొంబాయికి 105 కిలో మీటర్ల దూరంలో ఈశాన్యంవైపున, అరేబియా సముద్రానికి 75 కిలోమీటర్లలోను పడమటి కనుమలలో వాసిక్ వద్ద త్రియంబక్‌లో జనిస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లోని నిజామాబాదు జిల్లా బస్రాక వద్ద ఈనది ప్రవేశించి బంగాళా ఖాతంలో చేరే ముందు 720 కిలో మీటర్లు ప్రవహిస్తున్నది. దీని ఆయకట్టు ప్రాంతం 90,658 చదరపు కిలోమీటర్లు కడం, మంజీర, ప్రాణహిత, ఇంద్రావతి, కిన్నెరసాని, శబరి, దీని ముఖ్య ఉపనదులు. సాధారణంగా దీని లోతు 35 నుంచి 75 మీటర్లు ఉంటుంది. వరదలు పొంగే కాలంలో అధికంగా ఉంటుంది. ప్రవాహం జలపరిమితి 85,000 క్యూసెక్కులు. ఇది కూనవరం వద్ద పాపి కొండల మధ్య నుంచి ప్రవహించి కోస్తా - మైదానాల మీదుగా ప్రవహిస్తుంది. పోలవరానికి 32 కి.మీ. దూరాన రెండు పాయలుగా చీలుతుంది. ఇవి ( గౌతమి, వశిష్ట ) సముద్రంవైపు ప్రవహిస్తూ ఏడు పాయలుగా చీలుతాయి. ఇదే సప్త గోదావరి. రాజమహేంద్రం వద్ద నుంచి ధవళేశ్వరం వైపుకు దీని వెడల్పు నాలుగు మైళ్ళు.

1853 లో ధవళేశ్వరం వద్ద ఈ నదిపై ఆనకట్ట నిర్మించబడింది. ఈ ఆనకట్టతో ఆంధ్రప్రదేశ్‌లో ఆధునిక నీటి పారుదల సౌకర్యం కలిగింది. తరవాత దీనికి 24 మీటర్ల ఎగువన గోదావరి బారేజ్ నిర్మాణం జరిగింది.

*కృష్ణ :* మహాబలేశ్వర్ వద్దనున్న ఒక దేవాలయంలో ( సముద్ర మట్టానికి సుమారు 1,200 మీటర్ల ఎత్తున ఉన్నది. ) చెక్కిన గోముఖ శిల్పం నోటిలో నుంచి పడే నీరు పడమటి కనుమల మీద నుంచి పారి మహబూబ్‌నగర్ జిల్లా ఆలంపూర్ వద్ద ఆంధ్ర ప్రదేశ్‌లో

ఇది 315కిలోమీటర్లు పీఠభూమిప్రాంతంలోప్రవహించి సిద్ధేశ్వరం నందికొండలమధ్య దాదాపు 192 కి. మీ. ప్రవహించి పులిచింతలకు 64 కి. మీ. దిగువన విజయవాడవద్ద రెండు కొండల మధ్యన ప్రవహించి 64 కి. మీ. దిగువన రెండుగా చీలుతుంది. రాష్ట్రంలో మొత్తం మీద 720 కిలోమీటర్లు ప్రవహిస్తుంది. దీని ఆయకట్టు ప్రాంతం 1.92 లక్షల చదరపుకిలో మీటర్లు ప్రవాహ జల పరిమితి 45,300 క్యూసెక్కులు. దీని ముఖ్య ఉపనదులు దిండి, మూసి, పాలేరు, మున్నేరు,తుంగభద్ర. దీనిపై 1852-55కాలంలో విజయవాడవద్ద ఆనకట్ట నిర్మించ బడింది. 1893లో ఆనకట్ట దిగువన రైలువంతెన కట్టారు. స్వాతంత్ర్యం తరవాత ప్రకాశం బారేజ్ కట్టారు.

పెన్న : పెన్నానది కర్నాటక రాష్ట్రంలోని నంది పర్వతాలలో పుట్టి, అనంతపురం జిల్లాలో అంధ్రప్రదేశ్‌లో ప్రవహిస్తుంది. ప్రవేశించే సమయానికి దీని గర్భం ఎత్తు సముద్ర మట్టానికి సుమారు 600 మీటర్లు. దీని ఉపనదులు కుందేరు, సగిలేరు, పాపఘ్ని, జొగ్గేరు. భూమి ఉపరితలంపై ప్రవహించే నీటిలో 3.5 శాతం నీటిని ఇది అందిస్తుంది. నెల్లూరుజిల్లాలో దీనిపై రెండు ఆనకట్టలు నిర్మించడం జరిగింది. వీటి నుంచి దువ్వూరు చెరువు, కనిగిరిచెరువు, సర్వేపల్లిచెరువు మరికొన్ని చెరువులకు నీటి సరఫరా చేయబడుతుంది.

***నాగావళి :*** ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించకముందు ఒరిస్సాలో ప్రవహించి శ్రీకాకుళం జిల్లాలో 110 కిలోమీటర్లు పారి మఫజ్ బందర్‌వద్ద బంగాళాఖాతంలో చేరుతుంది. దీని నీటి పారుదల పరిమాణం ఏటా 4 లక్షల హెక్టార్ మీటర్లు. దీనిపై శ్రీకాకుళం జిల్లా పార్వతీపురం తాలూకా తోటపల్లి నదిపై 1909 లో ఒక రెగ్యులేటర్ నిర్మించబడింది. దీనివల్ల 30 వేల హెక్టార్ల భూమికి నీటి పారుదల సమకూరుతుంది.

***వంశధార :*** వంశధార నది ఒరిస్సాలో తూర్పు కనుమలలో పుట్టి 10 కి. మీ. ప్రవహించి ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశిస్తుంది. రాష్ట్రంలో 120 కి. మీ. ప్రవహించి కళింగపట్నం వద్ద బంగాళాఖాతంలో పడుతుంది. దీనిఆయకట్టు 11,400 కిలోమీటర్లు. ఇది జీవనది. శ్రీకాకుళంలో దీనికి సంబంధించి ప్రాజెక్ట్ నిర్మాణం జరుగుతుంది.

***తుంగభద్ర :*** కృష్ణానదికి ప్రధాన ఉపనదియైన తుంగభద్ర తుంగ, భద్ర అను రెండు నదుల కలయిక. ఇవి కర్నాటక రాష్ట్రంలో పుట్టి శివమొగ్గవద్ద ఒకటిగాచేరి కర్నూలుజిల్లాలో ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశిస్తుంది. సంగమేశ్వరంవద్ద కృష్ణలో చేరుతుంది. దీనిఉపనదివగరి. తుంగభద్ర హై లెవెల్ కాలువ, పెన్న రిజర్వాయరు ప్రస్తుతం పూర్తవుతున్నవి.

***మంజీర :*** తెలంగాణా ప్రాంతంలోని అతిముఖ్యమైన నదులలో మంజీర ఒకటి. ఇది మహారాష్ట్రలోని బాలాఘాట్ పర్వతాలలో పుట్టి అమ్మినాబాద్ జిల్లానుంచి ప్రవహించి ఆంధ్రప్రదేశ్‌లో మెదక్ జిల్లాలో ప్రవేశిస్తుంది. నిజామాబాద్‌జిల్లా గుండా ప్రవహించి గోదావరిలో చేరుతుంది. దీని నిడివి 640 కిలోమీటర్లు.

***ప్రాణహిత :*** మధ్యప్రదేశ్‌లోని సత్‌పుర కొండలలో పుట్టి అదిలాబాద్ జిల్లా సరిహద్దు వెంబడిని ప్రవహించి చిన్నూరువద్ద ఈనది గోదావరిలోకలుస్తుంది. పెన్‌గంగా పెకిగంగానదుల కలయికతో ఇది ఏర్పడింది.

**మూసి :** హైదరాబాద్ జిల్లా అనంతగిరి కొండలలో పుట్టి తూర్పుగాపారె నల్లగొండ లోని ఆలేరులోకలసి వజీరాబాద్‌వద్ద కృష్ణలో కలుస్తుంది. తాపసి, ఎసి, ఆలేరు ఉపనదులు.

**మాచ్‌ఖండ్ :** ఇది విశాఖపట్నం జిల్లా మాడుగుల కొండలలో పుట్టింది. అటునుంచి ఉత్తరంగా కొంతవరకు ప్రవహించి తూర్పుకు తిరిగి ఒరిస్సాలో చేరుతుంది.

**మనినార్ :** కరీంనగర్‌కొండలలో పుట్టి కొండల ద్వారా కొంచ చరియలద్వారా 120 కిలోమీటర్లు ప్రవహించి మహదేవపురం తాలూకాలో గోదావరిలో కలుస్తుంది.

**దిండి :** మహబూబ్‌నగర్ జిల్లా షాబాద్ కొండలలో పుట్టి దక్షిణంగా అమరాబాద్ కొండమీదుగా ప్రవహించి ఏలేశ్వరానికి దక్షిణంగా కృష్ణలో చేరుతుంది.

**పాలేరు :** వరంగల్ జిల్లా ఘనపురంవద్ద పుట్టిన పాలేరు నల్లగొండ, ఖమ్మం జిల్లాల సరిహద్దుల వెంబడి ప్రవహించి కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేటవద్ద కృష్ణానదిలో కలుస్తుంది.

**మునేరు :** వరంగల్‌జిల్లా పాకాల చెరువులో పుట్టి దక్షిణంగా ఖమ్మం ద్వారాప్రవహించి వైరా, కొల్లేరులతోపాటు కృష్ణానదిలో చేరుతుంది. ఈ నది నిడివి 192 కి. మీ.

## పశుసంపద - పాడి పరిశ్రమ

ఆంధ్రప్రదేశ్ పశు సంపదకు, పాడి పరిశ్రమకూ మొదటినుంచీ ఎంతో ప్రాముఖ్య మున్నది. ఈ ప్రాముఖ్యం 1956 నుంచీ మనకు గోచరించసాగింది. 1956 లో పశు సంపద మూలధనపు విలువ రూ. 291 కోట్లుగా అంచనా వేసినారు. పశువులు, పాడి పరిశ్రమ నుంచి ఉత్పత్తి నుంచి రాష్ట్రానికి వచ్చే ఆదాయం రూ. 41.3కోట్లుగా అంచనావేయడమైంది. ఈ మొత్తం రాష్ట్ర ఆదాయంలో 5.4 శాతం.

పశు సంపద లెక్కల ప్రకారం 1956 లో ఆంధ్రప్రదేశ్ లో 29.5 మిలియన్లు పశు వులు ఉన్నాయి. ఇందులో —

| | | |
|---|---|---|
| ఆవులు, ఎడ్లు, గేదెలు, మొదలైనవి | 17.2 మిలియన్లు | ( 58.4% ) |
| గొర్రెలు, మేకలు | 11.5 మిలియన్లు | ( 39% ) |
| పందులు, గుర్రాలు, గాడిదలు మొదలైనవి | 0.729 మిలియన్లు | ( 2.5% ) |

1956 లో భారతదేశంలో గల పశుసందలో మన రాష్ట్రపు పశు సంపద 7.1 శాతం.

1977 లెక్కల ప్రకారం మన రాష్ట్రంలోని పశు సంపద కింది విధంగా ఉన్నది.

| పశువులవివరాలు | సంఖ్య |
|---|---|
| ఆవులు, ఎడ్లు (Cattle) | 1,20,40,888 |
| గేదెలు మొదలైనవి | 71,62,892 |
| గొఱ్ఱెలు | 70,64,311 |
| మేకలు | 43,64,013 |

| | |
|---|---|
| గుఱ్ఱాలు | 26791 |
| గాడిదలు | 57588 |
| పందులు | 7,54,654 |
| కంచర గాడిదలు | 261 |
| ఒంటెలు | 248 |
| మొత్తం పశుసంపద | 3,14,71,647 |

మొత్తం పశు సంపద 1966 లో 3,15,94,491 ఉండగా 1972 లో 3,30,64,351 ఉన్నది. దీనిని బట్టి 1977 లో పశుసంపద సంఖ్య తగ్గినట్లుగా కన్పిస్తున్నది.

పశుపోషణ, పశు గణాభివృద్ధి రంగానికి వ్యవసాయ రంగంతో సన్నిహిత సంబంధమున్నది. వ్యవసాయ రంగంతోబాటు పశుపోషణ, పశుగణాభివృద్ధిని పెంచవలసిన అవశ్యకత ఎంతైనా ఉంది. మన రాష్ట్రంలో అనేక రకాల పశులు ఉన్నాయి. గోజాతి పశువులలో ఒంగోలుజాతి గిత్తలు అఖిల భారత ఖ్యాతిని గడించాయి. ఒంగోలు జాతి పశువులను విదేశాలకి కూడా ఎగుమతి చేయడం జరుగుతోంది. జాతీయ పశువుల పోటీలలో 1975 - 76 సంవత్సరాలలో ఒంగోలుజాతి కోడె ప్రథమ స్థానాన్ని గెలుచుకుంది. ఈ ఒంగోలుజాతి పశువులు ప్రకాశం, గుంటూరు, నెల్లూరు జిల్లాలో ఎక్కువగా ఉన్నాయి. పుంగనూరు జాతి పశువులు చిత్తూరుజిల్లాలోని పుంగనూరు, పలమనేరు ప్రాంతాలలో విరివిగా ఉంటాయి.

**మనరాష్ట్రంలో వివిధజిల్లాలలో 1977 నాటికిగల పశుసంపద వివరాలు**

| జిల్లా | | పశుసంపదసంఖ్య |
|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 1420230 |
| 2. | విశాఖపట్నం | 1582697 |
| 3. | తూర్పుగోదావరి | 1045627 |
| 4. | పశ్చిమగోదావరి | 10,19,310 |
| 5. | కృష్ణా | 11,91,668 |
| 6. | గుంటూరు | 14,51,974 |
| 7. | ప్రకాశం | 17,69,414 |
| 8. | నెల్లూరు | 15,46,806 |
| | కోస్తా ఆంధ్ర మొత్తం | 1,10,27,726 |
| 9. | కర్నూలు | 13,85,294 |
| 10. | అనంతపూరు | 17,48,609 |

| | | |
|---|---|---|
| 11. | కడప | 13,76,012 |
| 12. | చిత్తూరు | 19,34,870 |
| | రాయలసీమ మొత్తం | 64,44,785 |
| 13. | హైదరాబాదు | 10,83,142 |
| 14. | నిజామాబాదు | 9,47,867 |
| 15. | మెదక్ | 13,680,097 |
| 16. | మహబూబ్‌నగర్ | 20,25,761 |
| 17. | నల్గొండ | 22,78,740 |
| 18. | వరంగల్ | 17,49,224 |
| 19. | ఖమ్మం | 13,70,145 |
| 20. | కరీంనగర్ | 19,29,667 |
| 21. | ఆదిలాబాద్ | 12,46,493 |
| | తెలంగాణా మొత్తం | 1,39,99,136 |
| | ఆంధ్రప్రదేశ్ మొత్తం | 3.14,71,647 |

కర్నూలు జిల్లాలో "దూపాడు" పొట్టిరకపుజాతి పశువులున్నాయి. కోస్తా జిల్లాలోను మహబూబ్‌నగర్, నల్గొండ, ఖమ్మం జిల్లాలలోను కృష్ణా లోయజాతి పశువులున్నాయి. తెలంగాణాలోని కొన్ని ప్రాంతాలలో ప్రధానంగా మెదక్‌జిల్లాలో 'దియోని'జాతి ఎద్దులున్నాయి 'మాల్వి' జాతి పశువులు సాధారణంగా తెలంగాణాలోని అన్ని ప్రాంతాలలోను కనబడతాయి. గేదెలలో మనరాష్ట్రంలో ఎక్కువగా జాతులులేవు. పాడిపరిశ్రమ అభివృద్ధిదృష్ట్యా ముర్రాజాతి (గమిడిగేదె) గేదెలు హైదరాబాదు, విజయవాడ, మండపేట రాజమండ్రి ప్రాంతాలలో ఎక్కువగా పోషింపబడుతున్నాయి.

నెల్లూరుజాతి గొర్రెలు మాంసానికి పేరెన్నిక గన్నవి. అయితే బళ్ళారిజాతి గొర్రెలు ముఖ్యంగా ఉన్నిగల గొర్రెలు. ఇవి అనంతపూర్, చిత్తూర్, కర్నూలు, జిల్లాలలో ఉన్నాయి. తెలంగాణాజిల్లాలో 'దక్కన్' జాతి గొర్రెలు ఉన్నాయి. ఇవి ముతక ఉన్ని గలవి. ఉభయ గోదావరిజిల్లాలు, విశాపట్నం, విజయనగరం జిల్లాలలో 'మంద్య' జాతి గొర్రెలున్నాయి.

**అభివృద్ధి పథకాలు**

మన రాష్ట్రంలో పశు సంపదను, పశుపోషణను అభివృద్ధి చేయడంకోసం గత పాతికేళ్ళుగా నిరంతరం కృషి జరుగుతూనే ఉంది. రాష్ట్ర ప్రభుత్వం ఎన్నో ప్రణాళికలను, ఎన్నో పథకాలను రూపొందించి అమలుపరుస్తున్నది.

***కీలక గ్రామపథకం :*** మొదటి ప్రణాళికా కాలంలో గ్రామ పథకాలను ఏర్పరచడం జరిగింది. ఈ పథకాలు పశుగణాభివృద్ధికి అవసరమైన సాంకేతిక సహాయాన్ని అందజేస్తాయి.

రాష్ట్రంలోని పలుజిల్లాలో గల 41 కీలక గ్రామ కేంద్రాలు నాలుగులక్షలపైగా ఉత్పత్తియోగ్య మైన పశుగణాభివృద్ధికి కృషిచేస్తున్నాయి. ఈ పథకంతో కృత్రిమ గర్భోత్పత్తి పద్ధతి అమలులో ఉంది. దాదాపు 400 కృత్రిమ గర్భధారణ ఉపకేంద్రాలు వివిధ కీలకగ్రామ పథకాం కింద పనిచేస్తున్నాయి.

*సాంద్రపశుగణాభివృద్ధి పథకం :* 1965 లో మన రాష్ట్రంలో ఈ పథకాన్ని చేపట్టడమైంది. సాంద్ర పశుగణాభివృద్ధి బ్లాకును విజయవాడ, హైదరాబాదు, వరంగల్, నంద్యాల, విశాఖపట్నం, ఖమ్మం, జగిత్యాల, చిత్తూరు, వికారాబాదు మొదలైన చోట్ల ఈబ్లాకులున్నాయి సాంద్ర పశుగణాభివృద్ధి కార్యక్రమాల వల్ల పాల ఉత్పత్తి ఎంతో మెరుగుదల కనిపిస్తున్నది. ఉదాహరణకు 1977 - 78 లో హైదరాబాదు కేంద్ర పశుగణాభివృద్ధి ప్రాంతంలో పాల ఉత్పత్తి రోజుకు 47-64 మెట్రిక్ టన్నులుండేవి. 1977 - 78 నాటికి పాల ఉత్పత్తి 82.8 మెట్రిక్ టన్నులకు పెరిగినట్లు తెలియవచ్చింది. సాంద్ర పశుగణాభివృద్ధి బ్లాకుల కింద రాష్ట్రంలో దాదాపు 3000 గ్రామాలున్నాయి.

*వీర్యసేకరణ కేంద్రాలు :* పశుగణాభివృద్ధికోసం మన రాష్ట్రంలో కడప, జడ్చర్ల, వైరా ( ఖమ్మంజిల్లా) విశాఖపట్నం, నంద్యాల, మొదలైన చోట్ల వీర్యసేకరణ కేంద్రాలను స్థాపించడం జరిగింది. వీటిలో కొన్ని శీతల వీర్యసేకరణ కేంద్రాలు.

*పశుక్షేత్రాలు :* పాతికేళ్ళకు పూర్వం రాష్ట్రంలో ఈ క్షేత్రాలు మూడు మాత్రమే ఉండేవి. ఇప్పుడు ప్రభుత్వ ఆధ్వర్యాన 10 పశుక్షేత్రాలు, వ్యవసాయ విశ్వవిద్యాలయం ఆధ్వర్యాన 11 పశుక్షేత్రాలు పనిచేస్తున్నాయి. ఈ క్షేత్రాల ప్రధానోద్దేశం వీర్యసేకరణ కేంద్రాలకు పలువంశాలకు చెందిన మేలుజాతి ఆబోతులను, దున్నలను సప్లైచేయడం, గ్రామీణప్రాంతాలలోపలి పశుసంతతిని మెరుగుపరచడం.

*మిశ్రమదాణా కర్మాగారాలు :* పశు గ్రాసాభివృద్ధికి భువనగిరి (నల్గొండజిల్లా), కరీంనగరు, బుద్ధవరం ( కృష్ణాజిల్లా), గుడ్లవల్లేరు ( కృష్ణాజిల్లా ), ఆముదాల వలస ( శ్రీకాకుళం జిల్లా ), మొదలైనచోట్ల మిశ్రమదాణా కర్మాగారాలను నెలకొల్పడం జరిగింది. ఇవిప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి సంస్థ కింద పనిచేస్తున్నాయి. ప్రైవేటు యాజమాన్యంలో కూడా కొన్ని దాణా కేంద్రాలున్నాయి.

గొఱ్ఱెల పెంపకానికి పందుల అభివృద్ధికి రాష్ట్రప్రభుత్వం ఎన్నోచర్యలను తీసుకున్నది. పశువుల ఆరోగ్యం, సంరక్షణ నిమిత్తం ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతరం రాష్ట్రంలో ఎన్నో పశువైద్యశాలలను నెలకొల్పడమైంది. పశువులకు వచ్చే ముసరవ్యాధి, జలగవ్యాధి, గర్భకోశ, జననేంద్రియ సంబంధ వ్యాధులకు ప్రత్యేక వైద్య సౌకర్యాలు కల్పించడం జరుగుతోంది.

1956 నాటికి రాష్ట్రంలో మొత్తం పశువైద్య శాలలు 284 ఉండేవి. ఇప్పుడు వివిధ తరహాలకు చెందిన దాదాపు 1500 పశువైద్యశాలలు పనిచేస్తున్నాయి. రాష్ట్రం మొత్తంమీద ఏటా 180 లక్షల పశువులకు చికిత్సచేయడం జరుగుతోంది.

## పాడి పరిశ్రమ

ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమకు పుట్టినిల్లు. ఈ పాడి పరిశ్రమ మీద సన్నకారు రైతులు, వ్యవసాయ కార్మికులు, తమ ఆర్థికాభ్యున్నతిని పెరుగుపరుచు కుంటున్నారు. ఈ పరిశ్రమ వేలాది రైతులకు అనుబంధ వృత్తిగా పరిణ మించినది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో ఈ పరిశ్రమ గణనీయమైన మార్పులను తీసుకు వస్తున్నది.

1956 తరవాతనే ఆంధ్రప్రదేశ్‌లో పాడి పరిశ్రమ మూడు పువ్వులు ఆరు కాయలుగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం 4.35 కోట్ల రూపాయల పెట్టుబడితో హైదరాబాదు - విజయవాడ సంయుక్త పాల ప్రాజెక్టు పథకాన్ని అమలు పరచింది. హైదరాబాదు విజయవాడ, విశాఖపట్నం, రాజమండ్రి, నెల్లూరు, చిత్తూరు, అనంతపూరు, కర్నూలు, వరంగల్లు మొదలైన ప్రదేశాల్లో డైరీలను స్థాపించడం జరిగింది. విజయవాడలో పాలపొడి ఫ్యాక్టరీ 1969 ఏప్రియల్‌లో స్థాపించారు. మన రాష్ట్రంలో ఎన్నోచోట్ల ఛిల్లింగ్, కూలింగ్ సెంటర్లు ఉన్నాయి. మరి కొన్నింటిని నెలకొల్పే ఆలోచన రాష్ట్ర ప్రభుత్వానికున్నది.

### ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమ అభివృద్ధి సంస్థ

### [A. P. Dairy Development Corporation]

ఈ సంస్థను రాష్ట్ర ప్రభుత్వం 1974 ఫిబ్రవరి 7 వ తేదీన ఏర్పాటు చేసింది. దీని మూలధనం 5 కోట్ల రూపాయలు. రాష్ట్రంలోని అన్ని డైరీ యూనిట్లను పాలశీతల కేంద్రాలను దాణామిశ్రమ ఫ్యాక్టరీలను ఈ సంస్థకు బదిలీ చేయడమైనది. ఈ సంస్థ కింద ప్రస్తుతం దాదాపు 3000 పాల శీతలీకరణ కేంద్రాలున్నాయి. ఈ కేంద్రాలకు రోజుకు 3,00,000 ల మంది పాలు సరఫరా చేస్తున్నట్లు తెలియవస్తున్నది. పాల సరఫరాదారులకు ప్రతిసంవత్సరం దాదాపు 20 కోట్ల రూపాయలు చెల్లించడం జరుగుతోంది.

ఈ సంస్థ ఉత్పత్తులలో వెన్న, నెయ్యి, వెన్నతీసిన పాలపొడి, వెన్నతియ్యని పాల పొడి, పిల్లల ఆహారం, పశుగ్రాసం మొదలైనవి చేరిఉన్నాయి. 1978-79 లో ఈ సంస్థ 39 కోట్ల రూపాయల వ్యాపారాన్ని కొనసాగించినట్లు తెలుస్తోంది.

## కోళ్ళ పెంపకం

ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత కోళ్ల పరిశ్రమ ఎంతో అభివృద్ధి చెందింది. కోళ్ళ పెంపకంలో పురాతన పద్ధతులను విడనాడి ఆధునిక నిర్వహణ శాస్త్రీయ వాణిజ్య పద్ధతులను అవలంబించడం జరుగుతోంది. మన రాష్ట్రంలో హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరాల లోను, విశాఖపట్నం, కృష్ణా, గుంటూరు, చిత్తూరు, కరీంనగరు, నల్గొండ మొదలైన జిల్లాలలోను కోళ్ల పరిశ్రమ దినదినాభివృద్ధి చెందుతున్నది. కోడిగ్రుడ్లకు, మాంసానికి గల డిమాండు హెచ్చు కావడంతో పరిశ్రమ అభివృద్ధికి అమితమైన ప్రోత్సాహం లభిస్తున్నది.

మన రాష్ట్రంలో 1977 నాటికి కోళ్లు, యితరాల సంఖ్య ఇట్లా ఉన్నది.

| | |
|---|---|
| కోళ్లు | 2,11,28,343 |
| బాతులు | 4,64,813 |
| ఇతరాలు | 15,618 |
| మొత్తం | 2,16,08,774 |

మనరాష్ట్రంలో వివిధజిల్లాలలో 1977 నాటికి కోళ్లు తత్సంబంధమైనవాటి వివరాలు కింద యివ్వడమైనది.

| | జిల్లా | కోళ్ళు, ఇతరాల సంఖ్య |
|---|---|---|
| 1. | శ్రీకాకుళంజిల్లా | 11,88,083 |
| 2. | విశాఖపట్నంజిల్లా | 13,04,859 |
| 3. | తూర్పుగోదావరి జిల్లా | 11,58,713 |
| 4. | పశ్చిమగోదావరి జిల్లా | 10,33,118 |
| 5. | కృష్ణాజిల్లా | 18,07,646 |
| 6. | గుంటూరుజిల్లా | 13,02,017 |
| 7. | ప్రకాశం జిల్లా | 11,60,532 |
| 8. | నెల్లూరు జిల్లా | 14,03,112 |
| | కోస్తా ఆంధ్ర | 1,03,58,080 |
| 9. | కర్నూలు | 6,57,860 |
| 10. | అనంతపూరు | 6,84,983 |
| 11. | కడప | 10,88,368 |
| 12. | చిత్తూరు | 14,42,877 |
| | రాయలసీమ | 38,74,088 |
| 13. | హైదరాబాదు | 11,32,026 |
| 14. | నిజామాదుదు | 3,51,735 |
| 15. | మెదక్ | 4.36,955 |
| 16. | మహబూబ్‌నగర్ | 9,81,978 |
| 17. | నల్గొండ | 11,60,284 |
| 18. | వరంగల్ | 10,30,029 |

| | | |
|---|---|---|
| 19. | ఖమ్మం | 9,18,641 |
| 20. | కరీంనగర్ | 8,55,926 |
| 21. | ఆదిలాబాద్ | 4,79,632 |
| | తెలంగాణా | 73,76,606 |
| | ఆంధ్రప్రదేశ్ మొత్తం | 2,16,08,774 |

కోళ్ల పెంపకానికి, పిల్లల ఉత్పత్తికి, కోడిగుడ్ల మార్కెటింగుకు ప్రభుత్వం కొన్ని కోళ్లక్షేత్రాలను స్థాపించింది. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో ఆరు ప్రాంతీయ కోళ్ల పరిశోధనా క్షేత్రాలున్నాయి. 8 జిల్లా ఉత్పత్తిక్షేత్రాలు, 8 సాంద్ర అభివృద్ధి బ్లాకులు ఉన్నాయి.

సరూర్‌నగర్ [హైదరాబాదుజిల్లా] పటాన్‌చెరువు [మెదక్‌జిల్లా] కడప, చిత్తూరు, లాం (గుంటూరు జిల్లా) విశాఖపట్నంలలో ప్రాంతీయ కోళ్ళ పెంపకం క్షేత్రాలున్నాయి. ఆలూరు(నెల్లూరుజిల్లా), దిచ్చుటపల్లి(నిజామాబాద్) గోపన్నపాలెం (ప.గో జిల్లా), వరంగల్, మహబూబ్‌నగర్, కరీంనగర్, విజయపురి (నల్గొండజిల్లా), బనవాసి (కర్నూలుజిల్లా). హైదరాబాదులలో జిల్లా కోళ్ళ పెంపకం క్షేత్రాలున్నాయి.

కోడిగుడ్లనుఅమ్మడానికి ఆంధ్రప్రదేశ్‌లో విశాఖపట్నం, ఒంగోలు, చిత్తూరు, నెల్లూరు, కాకినాడ, వరంగల్, నల్గొండ, కర్నూలు, విజయవాడ మొదలైనచోట్ల పౌల్ట్రీ మార్కెటింగ్ కేంద్రాలున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో కోళ్ళ పెంపకానికి కృష్ణా జిల్లాలోని గుడ్లవల్లేరు గ్రామాన్ని ప్రముఖంగా చెప్పుకోవచ్చు. ఈ గ్రామం యావత్ భారతదేశంలోనే అగ్రస్థానం వహిస్తున్నది.

ఈ గ్రామ పరిసర ప్రాంతాలనుంచి రోజూ ఒక లక్ష గ్రుడ్లవరకు మద్రాసు, కలకత్తా మొదలైన పట్టణాలకు ఎగుమతవుతున్నాయి. హరిజనులకు ఉపాధి కల్పించే నిమిత్తం సహకార రంగంలో ఆదర్శ హరిజన కోళ్ళ పెంపకం కేంద్రాన్ని గుడ్లవల్లేరుతో ప్రారంభించారు. ఈ కేంద్రంలో 5000 కోళ్లున్నాయి.

ప్రస్తుతం కోళ్ళ పరిశ్రమ కొన్ని సమస్యలను ఎదుర్కొంటున్నది. అందులో ప్రత్యేకంగా పేర్కొనదగినది నిర్వహణ ఖర్చులను తగ్గించుకోవడం. కోళ్ళ పరిశ్రమలో గ్రుడ్ల, ఉత్పత్తికయ్యే మొత్తం ఖర్చులో 75 శాతం మేతకే అవుతుంది. ఇటీవలి కాలంలో ఈ మేత ఖర్చులు మరింతగా పెరిగినాయి. అంతేకాకుండా కోళ్లకు రోగాలు ఎక్కువగా వస్తుంటాయి. అందుచేత వెటరనరీ సౌకర్యాలను హెచ్చుగా ప్రభుత్వం కల్పించవలసిన ఆవశ్యకత ఉన్నది. లాభదాయకమైన విక్రయ విధానం కూడా కోళ్ల పరిశ్రమకు దోహదం చేసేదిగా ఉండవలె.

## ఆంధ్రప్రదేశ్ మీట్. పౌల్ట్రీ అభివృద్ధి సంస్థ
## (A.P. Meat Ard Poultry Development Corporation)

ఈ సంస్థను అక్టోబరు 1977లో స్థాపించారు. దీనిచెల్లించిన మూలధనం రు 20 లక్షల రూపాయలు. ఈ సంస్థకు ఆరు ప్రాంతీయ కోళ్ల ప్రదర్శన పరిశోధనా కేంద్రాలు, మూడు జిల్లా కోళ్ల పెంపకం కేంద్రాలు 12 కోళ్ల మార్కెటింగ్ కేంద్రాలు. 29 కోళ్ల మార్కెటింగ్ ఉప కేంద్రాలు ఉన్నాయి.

ఈ సంస్థకార్యకలాపాలలోముఖ్యమైనవి కోళ్లమేతను సప్లైచేయడం, మందులను సప్లై చేయడం, మార్కెటింగుకు తోడ్పడటం. ఈ సంస్థకు రాష్ట్ర ప్రభుత్వ సబ్సిడీ లభిస్తున్నది. ఈ సంస్థ లాభదాయకంగా పనిచేస్తున్నది.

# 8

# భూమి వినియోగం

వాతావరణం మన రాష్ట్ర మంతటా ఒకే విధంగా ఉండదు. ఆంధ్రప్రదేశ్‌లో వేరు వేరు ప్రాంతాలలో విభిన్న వాతావణాలున్నాయి. వాతావరణంలో భిన్నత్వం కారణంగా భూములు నేలలు ఏర్పడతాయి. ఇదే కాక ఒక ప్రాంతంలోని భూమి, నేల వర్షాలవల్ల నదీనద ప్రవాహాలవల్ల ఎగువనుంచి దిగువకు కొట్టుకువచ్చి డెల్టాలుగాను, లంకలుగాను ఏర్పడతాయి. ఆంధ్రప్రదేశ్‌లో కింద చూపిన భూములు నేలలు ప్రధానమైనది.

***1. డెల్టా వండ్రు నేలలు :*** ఇవి అత్యంత సారవంతమైనవి. రాష్ట్రంలోని ముఖ్యమైన నదులకు రెండుప్రక్కలా ఉండే భూములు ఈ తరగతి కిందికి వస్తాయి. కృష్ణా, గోదావరి డెల్టాలు, పెన్నానది, వంశధారానదీ ముఖప్రాంతాలు డెల్టా భూములకు ఉదాహరణగా చెప్పవచ్చును.

***2. తీరపు వండ్రుభూములు :*** ఆంధ్రప్రదేశ్ కోస్తా తీరాన్నంటి ఉండే భూములు కోస్తా వండ్రుభూములుగా చెప్పవచ్చు. సముద్రతీర ప్రాంతాలలో ఇసుక మట్టివల్ల ఈ రకమైన భూములు ఏర్పడినాయి. అయితే తీరపు వండ్రుభూములు కూడా కోస్తాప్రాంతమంతటా ఒకే విధంగాలేవు.

***3. నల్లరేగడి భూములు :*** తెలంగాణాలో ఆదిలాబాదుజిల్లానుండి ఖమ్మంజిల్లా వరకు గోదావరి నదిప్రాంతాన ఈ తరగతి భూములున్నాయి. ఇంతేకాక మహబూబ్‌నగర్ పశ్చిమ భాగం, కర్నూలు జిల్లాలోని ఆదోనితాలూకా, ఆలూరు తాలూకాలలో ఈ నల్లరేగడి భూములున్నాయి.

***4. మధ్యరకం నల్లరేగడి భూములు :*** మధ్యరకం (లోతు తక్కువగా గల) నల్లరేగడి భూములు అధికంగా తెలంగాణా ప్రాంతంలో ఉన్నాయి. నిజామాబాదు, మెదక్, రంగారెడ్డిజిల్లా మహబూబ్‌నగర్ జిల్లాలలోను మెదక్ జిల్లాలోని కొంత ప్రాంతంలోను ఈ రకం భూమి ఏర్పడిఉంది.

***5. ఏతరగతికి చెందని నల్లభూమి :*** ఈ రకం భూమి పశ్చిమగోదావరి, కృష్ణ, గుంటూరు, ప్రకాశం జిల్లాలలో నల్గొండజిల్లా దక్షిణ ప్రాంతంలో, మహబూబ్‌నగర్‌జిల్లా ఆగ్నేయ ప్రాంతంలో, కర్నూలుజిల్లా మధ్య భాగంలోను, కడపజిల్లా వాయువ్యంగాను, అనంతపురంజిల్లా తాడిపత్రి తాలూకాలోను ఈ రకం భూమివున్నది. అంతేకాక చిత్తూరుజిల్లా

నాయల్పాడు, చంద్రగిరి తాలూకాలలోను, ప్రకాశంజిల్లా కనిగిరి, గిద్దలూరు తాలూకాలలో, అదిలాబాదుజిల్లా సిర్పూరు తాలూకాలోను కొంత ప్రాంతంలో ఈరకం భూమి ఉన్నది.

***6. ఎర్రభూములు/నేలలు :*** మన రాష్ట్రంలో పైన వివరించిన భూములు కాక మిగతా ప్రాంతం చాలా వరకు ఎర్రభూమి. ఈ భూములలో మొక్కలు అంతగా పెరగవు. ఈరకం భూమి తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలో అధికభాగం, శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పు గోదావరిజిల్లా, పశ్చిమ గోదావరిజిల్లాలలో కొంతభాగం, కృష్ణాజిల్లా గన్నవరం, నూజివీడు తాలూకాలు, గుంటూరుజిల్లాలో పల్నాడు, వినుకొండ, సత్తెనపల్లి తాలూకాలు, ప్రకాశంజిల్లాలో కొంతభాగం, నెల్లూరుజిల్లాలో అధికభాగం ఎర్రభూములే.

***7. దుబ్బనేల/దుబ్బభూమి :*** ఈ రకం భూమిలోకూడ మొక్కలు అంతగా పెరగవు. మెదక్‌జిల్లా నారాయణఖేడ్, జహీరాబాదు తాలూకా, తూర్పుగోదావరి జిల్లా ఎల్లవరం, పెద్దాపురంతాలూకాలు, నెల్లూరుజిల్లాలోని గూడూరు, కోవూరు, కావలి, సూళ్లూరుపేట తాలూకాలు, చిత్తూరు జిల్లాలోని పుత్తూరు, సత్యవేడు తాలూకాలలో ఈ రకం భూములున్నాయి.

***8. చౌడుభూములు :*** కోస్తాతీర ప్రాంతాలలో ఆమ్ల, క్షారస్వభావంగల చౌడుభూములు, కేవలం క్షారస్వభావంగల చౌడుభూములు కొన్ని ప్రాంతాలలో ఉన్నాయి. ఈ క్షారస్వభావం వల్ల మొక్కలు పెరగవు. కోస్తాప్రాంతంలోని శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలో కొంత ప్రాంతంలో ఇసుక భూములు ఉన్నాయి. ఆమ్ల లక్షణాలు కలిగిన చౌడుభూములు కోస్తా ప్రాంతపు యిసుక భూములకు ఎత్తుప్రాంతపు భూములకు మధ్యగా ఉన్నాయి.

**భూమి వినియోగం**

మానవుడు భూమిని అనేక విధాలుగా ఉపయోగించుకుంటాడు. వ్యవసాయం చేసి పంటలు పండించుకొనటానికి, తోటల పెంపకానికి, అడవుల పెంపకానికి, పశువుల మేతకు భూమిని ఉపయోగించవచ్చు. అట్లాగే వ్యవసాయేతర పనులకు, (గృహనిర్మాణానికి) ప్రజలు నివసించటానికి, అవసరమయిన గ్రామాలు పట్టణాలు నిర్మాణానికి, పరిశ్రమల స్థాపనకు కూడ భూమి ఉపయోగపడుతుంది. వ్యవసాయానికి పనికివచ్చే భూమి వినియోగం రెండు రకాలు. నీటి పారుదల సౌకర్యంగల భూమిలో పంటలు సాంద్ర వ్యవసాయ పద్ధతిలోచేస్తారు గనక భూమి వినియోగం అధికంగా ఉంటుంది. అంటే ఒకేభూమిలో ఒకే సంవత్సరంలో రెండు మూడు పంటలు పండిస్తారు. నీటిపారుదల సౌకర్యం లేని భూమివినియోగం తక్కువగా ఉంటుంది. అట్లాంటి భూముల [మెట్ట భూములు] లో సాలుకు ఒక పంటమాత్రమే పండుతుంది.

ఆంధ్రప్రదేశ్‌లోని భూమి ఉపయోగం వివిధ ప్రాంతాలలో వివిధ రకాలుగా ఉంది. డెల్టా ఏరియాలలో నీటి పారుదల ఉన్నచోట్ల సాంద్రవ్యవసాయ పద్ధతి అమలులో ఉంది. మెట్ట ప్రాంతాలలో కొంతభూమి వర్షాధారం మీద, మరికొంతభాగం గొట్టపుబావులు, మోట బావులమీద ఆధారపడి వినియోగపడుతున్నది. గత 25 సంవత్సరాల కాలంలో మనరాష్ట్రంలో వ్యవసాయానికి ఉపయోగపడుతున్న భూమి, వ్యవసాయేతర కార్యాలకు ఉపయోగపడుతున్న

భూమి, అడవుల కింద వదిలిన భూముల విస్తీర్ణం పెరిగింది. వ్యవసాయానికి పనికివచ్చి బీడుగా వుండిన భూమి విస్తీర్ణం క్రమంగా తగ్గుతున్నది. 1955-56 సంవత్సరంలో అడవుల కింద 56.62 లక్షల హెక్టార్ల భూమి ఉండేది. ఈ విస్తీర్ణం 1977 - 78 సంవత్సరానికి 61.7 లక్షల హెక్టార్లకు పెరిగింది. వ్యవసాయానికి అనువుగాలేని బీడుభూమి విస్తీర్ణం 1955-56 సం॥నాటికి 29.32 లక్షల హెక్టార్ల నుండి 1977-78నాటికి 23.4 లక్షల హెక్టార్లకు తగ్గింది. వ్యవసాయానికి వినియోగపడుతున్న భూమి 1955 - 56 సం॥లో 112.0 లక్షల హెక్టార్లకు విస్తీర్ణంతో ఉన్నది. వ్యవసాయ వినియోగపు భూమి విస్తీర్ణం 1977 - 78 సం॥ 120.2 లక్షల హెక్టార్లకు పెరిగింది. 1955 - 56 సం॥లో మొత్తం రాష్ట్ర భూమి వైశాల్యంలో వ్యవసాయ భూమి 41.8 శాతం ఉండేది. ఈ భూమి 1977 - 78 సంవత్సరానికి 41.9 శాతానికి పెరిగింది. 1955-56 సం॥ లో అడవికింద ఉన్న భూమి రాష్ట్రం మొత్తం వైశాల్యంలో 21.0 శాతం ఉండేది. ఈ భూమి 1977-78 సంవత్సరానికి 22.5 శాతానికి పెరిగింది. సాంద్ర వ్యవసాయానుకూలమైన భూమి 1955 - 56 సం॥లో 3.8 శాతం ఉండగా అది 77-78 సం॥లో 6.5 శాతానికి పెరిగింది.

భూమి వినియోగం భారత దేశమంతటా ఇంచుమించు ఒకే విధంగా ఉంది.

ఆంధ్రప్రదేశ్ లో భూమి వినియోగం తీరుతెన్నులను కింద యిచ్చిన పట్టిక నుంచి సులభంగా తెలుసుకోవచ్చు.

(లక్షల హెక్టార్లలో)

| అంశాలు | 1955-56 | 1977-78 |
|---|---|---|
| మొత్తం వైశాల్యం | 269.9 | 276.8 |
| అడవులు | 56.6 | 61.7 |
| బంజరు భూములు, సాగుకు పనికిరానిభూములు | 29.3 | 23.4 |
| వ్యవసాయేతర ఉపయోగాలకిందవున్నభూమి | 13.5 | 21.3 |
| సాగుకు పనికివచ్చే బంజరు | 16.7 | 9.1 |
| పంటభూమిలో చేర్చని పలురకాలచెట్లు, తోటలు తోపులుకిందవున్న భూమి. | 2.6 | 2.6 |
| శాశ్వత పచ్చికబీళ్ళు | 11.7 | 9.5 |
| ప్రస్తుతపుబీళ్ళు | 19.6 | 26.8 |
| ప్రస్తుతపుబీళ్ళుకాక యితర బీళ్లు | 7 | 10.8 |
| నికర సాగుభూమి | 102.9 | 109.1 |
| ఒకసారికిమించి సాగవుతున్న భూమి | 10.1 | 16.2 |
| స్థూల పంటభూమి | 113 | 125.4 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

వివిధ జిల్లాలలో భూమి వినియోగము తీరతెన్నులను పరిశీలిస్తే అన్ని జిల్లాల కంటె ఖమ్మం, ఆదిలాబాద్, విశాఖపట్నం జిల్లాలలో అడవులు అతి ఎక్కువగాను, కృష్ణా, పశ్చిమ గోదావరి, నల్గొండలలో అడవులు అతి తక్కువగాను వ్యాపించి ఉన్నట్లు తెలుస్తున్నది. అటవీ భూభాగ విస్తీర్ణం 1955 - 56 లెక్కలతో పోల్చితే కొన్ని జిల్లాలలో ఎక్కువగా పెరిగింది. మరికొన్ని జిల్లాలలో తగ్గిపోయింది. ప్రాంతాలవారీగా చూస్తే తెలంగాణాలో అడవుల భూభాగం ఎక్కువగా ఉన్నట్లు తెలియవస్తోంది. కడపజిల్లాలో బంజరుసాగుకు పనికి రాని భూములు ఎక్కువగా వున్నట్లు తెలియగలదు. వ్యవసాయేతర ఉపయోగాల కింద ఉన్న భూములు నెల్లూరు జిల్లాలో ఎక్కువగాను, మెదక్‌జిల్లాలో తక్కువగాను ఉన్నట్లు పై పట్టిక వల్ల తెలుసుకోవచ్చు. శాశ్వత పచ్చిక బయళ్ళు నెల్లూరుజిల్లాలో అధికంగా ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతాలవారీగా చూస్తే తెలంగాణాలో ఎక్కువ సాగులో ఉన్న నికర భూమి ఎక్కువగా ఉన్నట్లు కనిపిస్తుంది. కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాలలో శ్రేష్టమైన భూములున్నాయి.

జిల్లాల వారీ భూమి

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| నెం. | జిల్లా | అడవులు | బంజరు భూములు సాగుకు పనికి రాని భూములు | వ్యవసాయేతర ఉపయోగాలకి ఉన్న భూములు |
| 1. | శ్రీకాకుళం | 1,46,736 | 1,24,016 | 1,02,973 |
| 2 | విశాఖపట్నం | 5,02,622 | 2,11,968 | 1,07,515 |
| 3 | తూర్పుగోదావరి | 2,92,691 | 1,44,393 | 92,964 |
| 4 | పశ్చిమ గోదావరి | 81,190 | 50,318 | 86,968 |
| 5 | కృష్ణా | 60,440 | 62,989 | 1,00,129 |
| 6 | గుంటూరు | 1,62,020 | 42,965 | 1,46,829 |
| 7 | ప్రకాశం | 4,47,189 | 1,31,334 | 1,22,513 |
| 8 | నెల్లూరు | 2,44,165 | 1,95,406 | 2,92,659 |
| | కోస్తా ఆంధ్ర | 19,37,053 | 9,63,389 | 9,52,550 |
| 9 | కర్నూలు | 3,45,629 | 98,196 | 83,402 |
| 10 | అనంతపూర్ | 1,93,742 | 1,89,553 | 1,56,779 |
| 11 | కడప | 4,98,538 | 2,59,965 | 1,38,325 |
| 12 | చిత్తూరు | 4,53,327 | 1,70,433 | 1,38,388 |
| | రాయలసీమ | 14,91,236 | 7,18,147 | 5,16,894 |
| 13 | హైదరాబాదు | 13,496 | 44,311 | 86,161 |
| 14 | నిజామాబాదు | 1,68,102 | 67,457 | 69,262 |
| 15 | మెదక్ | 95,006 | 66,190 | 57,670 |
| 16 | మహబూబ్‌నగర్ | 3.00,710 | 1,04,381 | 92,004 |
| 17 | నల్గొండ | 84,355 | 91,339 | 82,263 |
| 18 | వరంగల్ | 3,71,313 | 50,525 | 67,530 |
| 19 | ఖమ్మం | 7,55,100 | 1,02,948 | 62,257 |
| 20 | కరీంనగర్ | 2,56,652 | 88,444 | 74,886 |
| 21 | ఆదిలాబాద్ | 6,99,146 | 40,193 | 65,163 |
| | తెలంగాణా | 27,43,880 | 6,55,788 | 6,57,196 |
| | ఆంధ్రప్రదేశ్ | 61,72,169 | 23,37,324 | 21,26,640 |

**వినియోగము 1977-78** (వైశాల్యం హెక్టారులలో)

| 6 | 7 | 8 | 9 | 10 | 11 |
|---|---|---|---|---|---|
| సాగుకు పనికి వచ్చే బంజరు | శాశ్వత పచ్చిక బీళ్ళు | పంటభూమిలో చేర్చని పలు రకాలచెట్లుతోటలు తోపులకిందఉన్న భూమి | ప్రస్తుతపు బీళ్లు | ప్రస్తుత బీళ్ళుకాక యితర బీళ్ళు | సాగులోఉన్న నికర భూమి |
| 20,516 | 4,259 | 7,851 | 56,105 | 19,735 | 4,84,985 |
| 31,875 | 10,020 | 20,613 | 66,430 | 24,363 | 4,06,030 |
| 25,366 | 31,564 | 12,342 | 39,758 | 46,396 | 3,96,369 |
| 50,540 | 25,290 | 8,678 | 48,239 | 20,837 | 4,07,478 |
| 44,155 | 25,276 | 6,061 | 75,252 | 13,366 | 4,95,026 |
| 28,154 | 22,972 | 26,863 | 67,819 | 24,952 | 6,10,250 |
| 1,25,810 | 72,533 | 11,714 | 1,49,087 | 73,360 | 5,80,822 |
| 73,665 | 1,22,386 | 77,522 | 40,444 | 76,304 | 3,38,665 |
| 4,00,081 | 3,11,000 | 1,11,644 | 5,43,134 | 2,99,313 | 37,19,625 |
| 83,838 | 4,078 | 2,006 | 99.512 | 94,909 | 9,48,464 |
| 1.07,880 | 26,047 | 23.086 | 1,84,913 | 1,09,972 | 9.21,520 |
| 43,299 | 27,059 | 19,718 | 63,470 | 84,768 | 4,02,696 |
| 65,548 | 46,539 | 29,021 | 42,848 | 80,766 | 4,87,726 |
| 2,99,565 | 1,03,723 | 73.831 | 3,90,743 | 3,70,415 | 27,60,406 |
| 30,501 | 60,614 | 10,295 | 1,19,058 | 90,421 | 3,21,392 |
| 10,240 | 36,739 | 4,990 | 1,23,433 | 16,516 | 3,09,476 |
| 33,467 | 69,757 | 13,231 | 1,41.117 | 21,399 | 4,54,066 |
| 16,853 | 50,593 | 8,406 | 2,89,560 | 52,255 | 9,32,379 |
| 25,987 | 1,10,246 | 5,210 | 3,54,012 | 81.993 | 5,86,919 |
| 10,065 | 49,839 | 10,329 | 3,04,564 | 8,262 | 4,11,125 |
| 31,487 | 55,856 | 8,356 | 1,38,509 | 57,166 | 3,69,257 |
| 20,922 | 59,603 | 9,125 | 1,88,116 | 22,861 | 4,67,890 |
| 29,351 | 46,057 | 9,318 | 91,545 | 54,143 | 5,85,465 |
| 2,08,878 | 5,39,304 | 79,260 | 17,49,914 | 4,05,116 | 44,37,969 |
| 9,08,519 | 9,54,027 | 2,64,735 | 26,83,791 | 10,74,844 | 1,09,18,000 |

మూలం : అర్థగణాంకశాఖ. ఆం. ప్ర

# 9

# భూసంస్కరణలు

అనాది కాలం నుంచి భూమి యాజమాన్యం హక్కులు ఎవరికి చెందాలనే విషయం అంటే రాజ్య పరిపాలన చేసే రాజుకా లేదా సాగుచేసే రైతుకా అనే మీమాంస జరుగుతూ వచ్చింది. తరవాతి కాలంలో భూమి యాజమాన్యం పరిమితులు పొందటానికి, పాలితులకు మధ్య ఎవరెవరికి ఎంతెంత ఉండాలనే వివాదం కొంతకాలం జరిగింది. భారతదేశంలో రాజ్య పాలన మహారాజులు, సంస్థానాధీసుల నుండి బ్రిటిష్ ప్రభుత్వం వారికి సంక్రమించి ఇంచు మించు దేశమంతటా వారి యాజమాన్యంలోకి వచ్చిన తరువాత ఈ విషయంలో సంస్కరణ నిమిత్తమే కొంత కృషి జరిగింది.

పౌరులకు భూయాజమాన్య పరిమితులను బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశపెట్టింది.

1947 ఆగష్టు 15 న భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందింది. ఆనాటికి మద్రాసు రాష్ట్రంలో ఉన్న ఆంధ్ర ప్రాంతాలలోను హైదరాబాదు సంస్థానంలో ఉన్న తెలంగాణా ప్రాంతంలోను మూడు విధాలైన భూమి అమరకపు విధాలు అమలులో ఉన్నాయి.

ఆంధ్ర ప్రాంతంలో జమిందారీ, ఈనాందారీ, ఖాల్సా (రైత్వారీ) గ్రామాలున్నాయి. హైదరాబాదు సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేసిన తరువాత తెలంగాణ ప్రాంతంలో జాగీర్దారీ, ఇనాందారీ, విధానాలను రద్దు చేయడం జరిగింది. ఆంధ్ర ప్రాంతంలో రైత్వారీ విధానం కింద 60 సంవత్సరాల విస్తీర్ణం ఉంది. మిగతా 40 వంతులు విస్తీర్ణం జమిందారీ, మొఖాసాదారీ, ఈనాందారీ, ముఠాదారీ విధానాల కింద ఉన్నది.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరవాత భారత జాతీయ కాంగ్రెసు ప్రభుత్వం ఫ్యూడల్ భూమి సంబంధాలను సమూలంగా రద్దు చేసింది. భూమిని దున్ని సాగుచేసే రైతుకు సహాయం చెయ్యనిదే దేశ ఆహార సమస్య పరిష్కారం కాదని భావించి భూసంస్కరణల విధానాన్ని ఏర్పరచడానికి సూచనలు చేయవలసిందిగా జె. సి. కొమారప్ప అధ్యక్షతన వ్యవసాయ సంస్కరణల కమిటీని నియమించడం జరిగింది. 1949 సం॥లో కుమారప్ప నివేదికను సమర్పించింది.

కౌలుదార్లకు రక్షణ కల్పించడం, భూస్వాముల భూములకు గరిష్ట పరిమితులు నిర్ణయించడం వగైరా అనేక విషయాలపై ఈ కమిటీ సూచనలు చేసింది. మొదటి పంచవర్ష ప్రణాళికా పత్రంలో భారత ప్రభుత్వం సాధికారికంగా భూసంస్కరణలను గురించిన తమ విధానాలను వెలిబుచ్చింది.

**కోస్తా ఆంధ్ర ప్రాంతం, రాయలసీమ జిల్లాలలో రైత్వారీ, ఎస్టేటుప్రాంతాల శాతం**

| నెం. | జిల్లా | రైత్వారీప్రాంతం | ఎస్టేటుప్రాంతం |
|---|---|---|---|
| 1 | విశాఖపట్టణం | 10% | 90% |
| 2 | తూర్పుగోదావరి | 60% | 40% |
| 3 | పశ్చిమగోదావరి | 60% | 40% |
| 4 | కృష్ణా | 45% | 55% |
| 5 | గుంటూరు | 91.8% | 8.2% |
| 6 | కర్నూలు | 98% | 2% |
| 7 | అనంతపురం | 95% | 5% |
| 8 | కడప | 94% | 6% |
| 9 | నెల్లూరు | 50% | 50% |
| 10 | చిత్తూరు | 47% | 53% |

మూలం : మద్రాసు స్టాటిస్టికల్ అట్లాసు· 1936

1937 లో టంగుటూరి ప్రకాశం పంతులు అధ్యక్షతన జమీందారీల రద్దుకు ఒక కమిటీని నియమించినారు. ఈ కమిటీ తమ నివేదికను 1938 లో సమర్పించింది. 1948 లో జమీందారీల రద్దు సూత్రాన్ని మద్రాసు అసెంబ్లీ ఆమోదించింది.

**ఆంధ్రప్రదేశ్‌లో బంజరుభూముల పంపిణీ**

| జిల్లాలు | (హెక్టార్లలో) 1977-78 చివరి వరకు |
|---|---|
| శ్రీకాకుళం | 50,339 |
| విశాఖపట్నం | 19,671 |
| తూర్పుగోదావరి | 12,450 |
| పశ్చిమగోదావరి | 16,960 |
| కృష్ణ | 26,095 |
| గుంటూరు | 25,329 |
| ప్రకాశం | 93,319 |
| నెల్లూరు | 64,210 |
| కోస్తా ఆంధ్ర | 3,08,373 |
| కర్నూలు | 31,767 |
| అనంతపూర్ | 1,10,709 |
| కడప | 58,179 |
| చిత్తూరు | 1,09,176 |
| రాయలసీమ | 3,09,827 |

| | |
|---|---|
| హైదరాబాద్ | 15,355 |
| నిజామాబాద్ | 5[illegible],[illegible]59 |
| మెదక్ | 35,909 |
| మహబూబ్‌నగర్ | 60,661 |
| నల్గొండ | 28,413 |
| వరంగల్ | 35,360 |
| ఖమ్మం | 62,681 |
| కరీంనగర్ | 11,656 |
| ఆదిలాబాద్ | 44,196 |
| తెలంగాణా | 3,47,090 |
| ఆంధ్రప్రదేశ్ | 9,65,290 |

మూలం : కమీషనర్ ఆఫ్ లాండ్ రెవిన్యూ. ఆం. ప్ర.

## భూగరిష్ఠ పరిమితి చట్టాలు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తరవాత వ్యక్తుల యాజమాన్యం, సంస్థల యాజమాన్యంలోని భూములకు గరిష్ఠ పరిమితులను నిర్ణయించడానికిగాను 1958లో ఒకబిల్లు ప్రవేశపెట్టబడింది. 1961 సం॥లో ఈ బిల్లు చట్టంగా రూపొందింది. దీనినే 1961 ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ భూముల గరిష్ఠ పరిమితి చట్టం అని పిలుస్తారు.

మాగాణి భూములను ఎ. బి. సి. ఇ అనే 5 తరగతులుగాను, మెట్టభూములను ఎఫ్. జి. హెచ్. అనే మూడు తరగతులుగాను ఈ చట్టం విభజించింది. పైవిభజన ప్రకారం ప్రతి తరగతి భూమిలోను కుటుంబ కమతాల విస్తీర్ణం నిర్ణయించారు. గరిష్ఠపరిమితి విధింపుకు కుటుంబం ప్రాతిపతిక కాదు. గరిష్ఠపరిమితి 5 గురు సభ్యులుగల కుటుంబానికి లేదా వ్యక్తికి అని పేర్కొన్నారు.

### చట్టంలో ఉదహరించిన భూమి గరిష్ఠ పరిమితి

| భూమి తరగతి | కుటుంబ కమతం ( ఎకరాలలో ) | గరిష్ఠ పరిమితి ( ఎకరాలలో ) |
|---|---|---|
| 'ఎ' తరగతి మాగాణి | 6 | 27 |
| 'బి' | 8 | 36 |
| 'సి' | 10 | 45 |
| 'డి' | 12 | 54 |
| 'ఇ' | 24 | 108 |
| 'ఎఫ్' తరగతి మెట్టభూమి | 36 | 162 |
| 'జి' | 48 | 216 |
| 'హెచ్' | 72 | 324 |

ఈ చట్టం 1973 వ్యవసాయభూముల గరిష్ఠపరిమితి చట్టంచేసేవరకు అమలులోఉంది.

***1973 భూగరిష్ఠ పరిమితి చట్టం :*** 10 ఎకరాల మాగాణి, 25 ఎకరాల మెట్టభూమికి పైబడిన వ్యవసాయభూముల అన్యాక్రాంతాలను నిషేధిస్తూ 1972 మే 2 తేదీన ప్రభుత్వం ఒక ఆర్డినెన్స్ జారీ చేసింది. దరిమిలా ఈ ఆర్డినెన్స్‌ను చట్టంగా రూపొందించినారు. భూసంస్కరణలకు సంబంధించిన కేంద్ర సంఘం చేసిన సిఫార్సులకు అనుగుణంగా తీసుకురాబడిన బిల్లును ఆంధ్రప్రదేశ్ శాసనమండలి 1972 సెప్టెంబరులో ఆమోదించింది. 1973 జనవరి 1 వ తేదీన ఈ బిల్లు రాష్ట్రపతి ఆమోదం పొంది చట్టంగా ప్రకటించబడింది. అయితే ఈ చట్టం 1975 జనవరి 1 వ తేతేదీ నుంచి అమలులోకి వచ్చినట్లుగా ప్రకటించబడింది. ఈ చట్టం రావడంతో 1961 ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కమతాలమీద గరిష్ట పరిమితిచట్టం, 1972 ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ భూముల అన్యాక్రాంతాల నిషేధచట్టం రద్దు అయాయి.

ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ రూపొందించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమంలో భూసంస్కరణలు ఒకటి. మన రాష్ట్రంలో భూసంస్కరణలను అమలు జరపడం జరుగుతోంది. ఈ భూ సంస్కరణల అమలువల్ల 3.79 లక్షల ఎకరాలు మిగులు భూమిని 1979 చివరి వరకు స్వాధీనం చేసుకున్నట్లు తెలుస్తున్నది. ఆ భూమిని షెడ్యూలు కులాలు. షెడ్యూలు తెగల, ఆర్థికంగా వెనకబడిన తరగతుల వారికి 1,74,125 కుటుంబాలకు పంపిణీ చేసినట్లు తెలియవస్తున్నది.

# 10

# వ్యవసాయము - పంటలు

దక్షిణాది ధాన్యాగారంగా ఆంధ్రప్రదేశ్ పేరు ప్రఖ్యాతులను గడించిన రాష్ట్రం. భారతదేశమే వ్యవసాయ ప్రాధాన్యంగల దేశం. మన జాతీయోత్పత్తిలో వ్యవసాయరంగం వాటా దాదాపుగా సగం ఉంది. భారత దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత జనాభా సంవత్సరానికి 2.1 శాతం చొప్పున పెరగగా, వ్యావసాయిక ఉత్పత్తులు సంవత్సరానికి 2.8 శాతం చెప్పున పెరగగం జరిగింది. మన దేశానికి సంబంధించిన ఈ సత్యాలూ, సంఖ్యలూ ఆంధ్రప్రదేశ్ కూడా వర్తిస్తాయి. ఆంధ్రప్రదేశ్ కూడా వ్యవసాయ ప్రాధాన్యత గల రాష్ట్రం. 1955 - 56 లెక్కలను బట్టి పరిశీలిస్తే మన రాష్ట్ర ఆదాయంలో వ్యవసాయరంగ వాటా 48.2 శాతం ఉంది అప్పుడు వ్యవసాయ రంగపు ఉత్పత్తుల విలువ రూ. 331.9 కోట్లు. 1978 - 79 లెక్కలను బట్టి చూస్తే ( 1960 - 61 నాటి ధరల ప్రకారం ) వ్యవసాయ ఉత్పత్తుల విలువ రూ. 801.2 కోట్లుగా తెలియవస్తుంది. గత 25 సంవత్సరాలలో ఎన్ని పెనుతుఫానులు వచ్చినా, కొన్ని జిల్లాలలో దుర్భిక్ష పరిస్థితులేర్పడినప్పటికీ, రాష్ట్ర ప్రభుత్వం వ్యవసాయ ప్రణాళికలను, కార్యకలాపాలను చిత్తశుద్ధితో అమలు జరపడం వల్ల ఆహారధాన్యోత్పత్తి అభిలషణీయమైన ప్రగతిలోనే జరుగుతూ వచ్చింది. మన రాష్ట్రంలో ఎన్నో రకాల పంటలు పండటానికి అనుకూలంగా నేలలు, నీటి పారుదల సౌకర్యాలు, వాతావరణ పరిస్థితులు ఉన్నాయి. మన రాష్ట్రంలో ఆహారపు పంటలు, ఆహారేతర పంటలు పండుతాయి. మన రాష్ట్రంలో పండించే పంటలలో వరి, జొన్న. సజ్జ, రాగి, వేరుశనగ పప్పులు, పత్తి, పొగాకు, ఆముదాలు, మిరప, పసుపు మొదలైనవి ముఖ్యమైనవి.

మొత్తం రాష్ట్ర వైశాల్యంలో దాదాపు 45 శాతం వరకు వివిధ పంటల కింద సేద్యం చేయడం జరుగుతున్నది. మొత్తం వ్యవసాయ భూమిలో ఆహార పంటలు పండించే భూమి 1955-56లో 77 శాతం ఉండగా 1977-78 సంవత్సరానికి 79.6 శాతానికి పెరిగింది. అయితే ఈ పెరుగుదల ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత స్థిరంగాలేదు. ఉదాహరణకు 1959-60 సం॥లలో ఈ శాతం 82.1 దాకా చేరుకుంది. 1971-72 సం॥లలో అదే 74.7 శాతానికి తగ్గిపోయింది. కాబట్టి ఆహార పంటలు, ఆహారేతర పంటలు పండిచే భూమి విస్తీర్ణతలో స్వల్పమైన మార్పులు గత పాతిక సంవత్సరాలలో మనకు గోచరిస్తాయి. ఈ మార్పులను కింది పట్టికద్వారా గ్రహించవచ్చు.

### ఆహార, అహారేతర పంటల కింద ఉన్న భూమి విస్తీర్ణం

(లక్షం హెక్టార్లలో)

| సంవత్సరం | ఆహార పంటల కింద ఉన్న భూమి | అహారేతర పంటల కిందఉన్న భూమి | మొత్తం |
|---|---|---|---|
| 1955-56 | 94.7 | 28.3 | 123 |
| 1960-61 | 96.8 | 21.4 | 118.2 |
| 1965-66 | 94.8 | 26.1 | 120.9 |
| 1970-71 | 102.5 | 31 | 133.5 |
| 1975-76 | 105.1 | 24.5 | 129.6 |
| 1977-78 | 100.1 | 25.3 | 125.4 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆంధ్రప్రదేశ్

ఆహాత పంటలకింద, ఆహారేతర పంటలకింద జిల్లాలవారీగా 1977-78 సం॥ రానికి ఎంత వి_స్తీర్ణం ఉన్నదో కింది పట్టికనుంచి తెలుసుకోవచ్చు.

(హెక్టారులలో)

| నెం. | జిల్లా | ఆహార పంటలు | ఆహారేతరపంటలు | మొత్తం |
|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 4,17,180 | 1,51,109 | 5,68,289 |
| 2. | విశాఖపట్నం | 4,06,169 | 1,15,972 | 5,22,141 |
| 3. | తూర్పుగోదావరి | 4,93,007 | 66,760 | 5,69,767 |
| 4. | పశ్చిమగోదావరి | 5,18,514 | 52,115 | 5,70,629 |
| 5. | కృష్ణా | 6,34,399 | 75,570 | 7,09,969 |
| 6. | గుంటూరు | 6,16,182 | 1,62,600 | 7,78,78 |
| 7. | ప్రకాశం | 4,34,258 | 1,90,220 | 6,24,478 |
| 8. | నెల్లూరు | 3,13,577 | 65,021 | 3,78,598 |
| | కోస్తా ఆంధ్ర | 38,33,286 | 8,79,367 | 47,12,653 |
| 9. | కర్నూలు | 6,96,383 | 3,23,807 | 10,20,190 |
| 10. | అనంతపూరు | 6,05,101 | 3,51,785 | 9,56,866 |
| 11. | కడప | 3,16,289 | 1,06,222 | 4,25,511 |
| 12. | చిత్తూరు | 3,41,640 | 2,14,143 | 5,55,683 |
| | రాయలసీమ | 19,59,413 | 9,96,057 | 29,55,470 |
| 13. | హైదరాబాదు | 3,00,035 | 47,859 | 3.47,894 |
| 14. | నిజామాబాదు | 3,34,114 | 15,678 | 3,49,792 |
| 15. | మెదక్ | 4,43,100 | 21,663 | 4,64,763 |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 16. | మహబూబ్‌నగర్ | 7,98,350 | 1,75,699 | 9,74,049 |
| 17. | నల్గొండ | 5,92,221 | 1,38,730 | 7,30,951 |
| 18. | వరంగల్ | 4,33,091 | 39,907 | 4,72,998 |
| 19. | ఖమ్మం | 3,63,933 | 36,230 | 4,00,163 |
| 20. | కరీంనగర్ | 4,83,804 | 43,881 | 5,27,685 |
| 21. | ఆదిలాబాద్ | 4,65,134 | 1,33,930 | 5,99,064 |
| | తెలంగాణా | 42,13,782 | 6,53,577 | 48,67,359 |
| | ఆంధ్రప్రదేశ్ | 1,00,06,481 | 25,29,001 | 1,25,35,482 |

మూలం : అర్థగణాంకశాఖ. ఆంధ్రప్రదేశ్

## ఆహారపు పంటలు

మన రాష్ట్రంలో పండే ఆహార పంటలను గురించి కింద సంగ్రహంగా వివరించడం జరిగింది.

### వరి

రాష్ట్రంలో పండే ఆహార ధాన్యపు పంటలలో కెల్లా వరి అత్యంత ప్రధానమైంది. 1978-79 లో వరి పంట విస్తీర్ణం 39.7 లక్షల హెక్టార్లు. 1978-79 లో వరిపంట 74.3 లక్షల టన్నులుగా అంచనా వేయడమైంది. రాష్ట్రంలోని మొత్తం పంటభూమిలో 1978-79 లెక్కల ప్రకారం వరి పండించే ప్రాంతం 30 శాతం. మన రాష్ట్రంలో పశ్చిమ గోదావరి తూర్పుగోదావరి, కృష్ణా, నెల్లూరు, గుంటూరు జిల్లాలలో వరి ఎక్కువగా పండుతుంది. మన రాష్ట్రంలో వరి దిగుబడి హెక్టారుకు 1978-79 లో 1907 కిలోగ్రాములుగా అంచనా వేయడమైనది. ఖరీఫ్, రబీ రెండు సీజనులలోను వరిపంట పండుతుంది. అయితే మూడింట రెండు వంతులు వరి ఖరీఫ్ కాలంలోనే ఎక్కువగా పండుతుంది. అధిక దిగుబడినిచ్చే వరి వంగడాలు మనకి ఎక్కువ అందుబాటులో ఉన్నాయి. మన రాష్ట్రంలో మసూరి, జయ. తెల్ల హంస, సోనా, ఐ. ఆర్-8, రత్న మొదలైన రకాలు ఎక్కువగా సాగులో ఉన్నాయి, భారతదేశపు వరి పండించే విస్తీర్ణంలో మన రాష్ట్రం 9.6 శాతం, బియ్యం ఉత్పత్తిలో 14.2 శాతం ఆక్రమించిందని చెప్పవచ్చు. సాగు విస్తీర్ణం రీత్యా భారతదేశంలో మన రాష్ట్రానికి 6 వ స్థానం, బియ్యం ఉత్పత్తి రీత్యా 2 వ స్థానం లభిస్తుంది.

**మనరాష్ట్రంలో బియ్యం ఉత్పత్తి ఇట్లా ఉంది. .**

| సంవత్సరం | విస్తీర్ణం ( లక్షల హెక్టార్లలో | (ఉత్పత్తి టన్నులలో) |
|---|---|---|
| 1973-74 | 33.8 | 55.8 |
| 1974-75 | 35.5 | 57 |
| 1975-76 | 38.9 | 64.5 |

| 1 | 2 | 3 |
|---|---|---|
| 1976-77 | 35.7 | 49.3 |
| 1977-77 | 36.2 | 56 |
| 1978-79 | 39.7 | 56.5 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆంధ్రప్రదేశ్

జిల్లాలవారీగా మన రాష్ట్రంలో బియ్యం ఉత్పత్తి 1977 - 78

| జిల్లా పేరు | విస్తీర్ణం (లక్షల హెక్టార్లలో) | ఉత్పత్తి (లక్షల టన్నులలో) |
|---|---|---|
| శ్రీకాకుళం | 2.6 | 2.3 |
| విశాఖపట్నం | 1.5 | 1.4 |
| తూర్పుగోదావరి | 3.5 | 7.0 |
| పశ్చిమగోదావరి | 4.1 | 9.0 |
| కృష్ణా | 3.8 | 5.0 |
| గుంటూరు | 3.9 | 4.1 |
| ప్రకాశం | 0.9 | 1.0 |
| నెల్లూరు | 2.0 | 3.0 |
| కోస్తా ఆంధ్ర | 22.3 | 32.8 |
| కర్నూలు | 1.0 | 1.5 |
| అనంతపూరు | 0.8 | 1.4 |
| కడప | 0.7 | 1.1 |
| చిత్తూరు | 1.6 | 3.1 |
| రాయలసీమ | 4.1 | 7.1 |
| హైదరాబాద్ | 0.5 | 0.9 |
| నిజామాబాద్ | 1.3 | 3.0 |
| మెదక్ | 0.8 | 1.0 |
| మహబూబ్‌నగర్ | 1.4 | 1.9 |
| నల్గొండ | 2.3 | 4.2 |
| వరంగల్ | 1.0 | 1.2 |
| ఖమ్మం | 0.9 | 0.7 |
| కరీంనగర్ | 1.4 | 2.3 |
| ఆదిలాబాదు | 0.7 | 0.8 |

| | | |
|---|---|---|
| తెలంగాణా | 10.3 | 16.0 |
| ఆంధ్రప్రదేశ్ | 36.7 | 55.9 |

మూలం : అర్థగణాంక శాఖ ఆం. ప్ర.

## జొన్న

మన రాష్ట్రంలో వరి పంట తరవాత జొన్న ముఖ్యమైన ఆహారపంట. ఇది సాగు విస్తీర్ణం దృష్ట్యా భారతదేశంలో ద్వితీయస్థానాన్ని ఆక్రమిస్తున్నది. జొన్న పంట రాయలసీమలో చిత్తూరు మినహా మిగతాజిల్లాలలో, తెలంగాణాలో నిజామాబాద్ మినహా మిగతాజిల్లాలలో ఆంధ్ర ప్రాంతంలో ప్రకాశంజిల్లాలో పండుతుంది. 1978-79 లో 23.5 లక్షల హెక్టారుల మేరకు ఈ పంటను వేయగా దిగుబడి 14.2 లక్షల టన్నులను పండించారు. దిగుబడి హెక్టారుకు 1978-79 లో 605 కిలో గ్రాములుగా అంచనా వేయడమైంది. ఈ పంట ఖరీఫ్, రబీ రెండు కాలాలలోను పండించడం జరుగుతున్నది.

**మన రాష్ట్రంలో జొన్నపంట వివరాలు**

| సంవత్సరం | విస్తీర్ణం (లక్షల హెక్టార్లలో) | ఉత్పత్తి (లక్షం టన్నులలో) |
|---|---|---|
| 1973-74 | 27.0 | 12.9 |
| 1974-75 | 25.0 | 15.7 |
| 1975-76 | 24.0 | 10.2 |
| 1976-77 | 20.0 | 10.6 |
| 1977-78 | 23.0 | 14.3 |
| 1978-79 | 23.5 | 14.1 |

**జిల్లాలవారీగా ఆంధ్రప్రదేశ్‌లో జొన్న పంట వివరాలు (1977-78)**

| జిల్లా | విస్తీర్ణం (వేల హెక్టార్లలో) | ఉత్పత్తి (వేల టన్నులలో) |
|---|---|---|
| శ్రీకాకుళం | 4.8 | 2.9 |
| విశాఖపట్నం | 16.7 | 10.3 |
| తూర్పుగోదావరి | 10.6 | 6.3 |
| పశ్చిమగోదావరి | 9.3 | 5.8 |
| కృష్ణా | 58.0 | 25.4 |
| గుంటూరు | 38.5 | 23.1 |
| ప్రకాశం | 107.5 | 61.0 |
| నెల్లూరు | 51.0 | 23.0 |
| కోస్తా ఆంధ్ర | 296.4 | 158.0 |

| 1 | 2 | 3 |
|---|---|---|
| కర్నూలు | 267.9 | 166.9 |
| అనంతపూర్ | 118.9 | 70.9 |
| కడప | 102.7 | 84.0 |
| చిత్తూరు | 17.2 | 11.0 |
| రాయలసీమ | 506.7 | 332.8 |
| హైదరాబాదు | 127.1 | 93.8 |
| నిజామాబాద్ | 51.3 | 40.8 |
| మెదక్ | 158.7 | 118.7 |
| మహబూబ్‌నగర్ | 320.8 | 184.1 |
| నల్గొండ | 151.3 | 46.1 |
| వరంగల్లు | 143.4 | 108.7 |
| ఖమ్మం | 172.6 | 119.0 |
| కరీంనగర్ | 115.0 | 82.5 |
| ఆదిలాబాదు | 256.5 | 147.2 |
| తెలంగాణా | 1505.7 | 940.9 |
| ఆంధ్రప్రదేశ్ | 230808 | 1431.7 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆం. ప్ర.

## సజ్జ

జొన్న తరవాత ఇదిముఖ్యమైన ధాన్యపుపంట. దేశపు మొత్తం సజ్జపైరు విస్తీర్ణంలో ఆంధ్రప్రదేశ్ 5.1 శాతం ఉత్పత్తిలో 9.5 శాతం ఆక్రమిస్తున్నది. విస్తీర్ణం దృష్ట్యా భారత దేశంలో 6 వ స్థానాన్ని ఉత్పత్తి దృష్ట్యా, 5 వ స్థానాన్ని మనరాష్ట్రం పొందుతున్నది. రాష్ట్రంలో సజ్జపంట ముఖ్యంగా విశాఖపట్నం, ప్రకాశం, నల్గొండ జిల్లాలలో పండిస్తారు. ఈ పంట ఎక్కువ భాగం ఖరీఫ్ కాలంలో పండుతుంది. ఎక్కువగా వర్షాధారంపైనే ఈ పంట సాగవుతుంది. 1978-79లో సజ్జపంటను 5.7 లక్షలహెక్టార్లలో వేసినట్లు, 3.7 లక్షల టన్నులు ఉత్పత్తి అయినట్లు తెలియవచ్చింది. హెక్టారుకు సజ్జదిగుబడి 630 కిలోగ్రాములుగా అంచనా వేయడమైంది.

మనరాష్ట్రంలోసజ్జపంట ఇట్లాఉంది.

| సంవత్సరం | విస్తీర్ణం (లక్షల హెక్టార్లలో) | ఉత్పత్తి (లక్షలటన్నులలో) |
|---|---|---|
| 1973-74 | 5.8 | 3.7 |
| 1974-75 | 5.8 | 3,1 |

| | | |
|---|---|---|
| 1975-76 | 6.2 | 3.5 |
| 1976-77 | 5.6 | 2.4 |
| 1977-78 | 5,7 | 3.5 |
| 1978-79 | 5.7 | 3.7 |

వివిధ జిల్లాలలో సజ్జపంట కిందివిధంగా వున్నది.

| జిల్లా | విస్తీర్ణం (వేల హెక్టార్లలో) | ఉత్పత్తి (వేల టన్నులలో) |
|---|---|---|
| శ్రీకాకుళం | 12.5 | 13.9 |
| విశాఖపట్నం | 70.1 | 62.3 |
| తూర్పుగోదావరి | 16.5 | 12.6 |
| పశ్చిమ గోదావరి | 0.8 | 0.7 |
| కృష్ణా | 2.4 | 2.0 |
| గుంటూరు | 27.0 | 12.9 |
| ప్రకాశం | 44.2 | 48.9 |
| నెల్లూరు | 15.0 | 19.7 |
| కోస్తా ఆంధ్ర | 188.5 | 174.0 |
| కర్నూలు | 26,7 | 13.6 |
| అనంతపూర్ | 63.8 | 40.3 |
| కడప | 31.4 | 30.8 |
| చిత్తూర్ | 29,6 | 29.0 |
| రాయలసీమ | 151.5 | 113.7 |
| హైదరాబాదు | 9.4 | 3.5 |
| నిజామాబాద్ | 0.8 | 0.3 |
| మెదక్ | 5.9 | 2.3 |
| మహబూబ్‌నగర్ | 64.6 | 32.5 |
| నల్గొండ | 118.8 | 28.9 |
| వరంగల్ | 22.1 | /7.3 |
| ఖమ్మం | 6.2 | 5.2 |
| కరీంనగర్ | — | — |
| ఆదిలాబాద్ | — | — |
| తెలంగాణా | 227.8 | 90.0 |
| ఆంధ్రప్రదేశ్ | 567.8 | 377.7 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆంధ్రప్రదేశ్

## గోధుమ

మనరాష్ట్రంలో ఈ పంటకు ప్రాముఖ్యమేలేదని చెప్పవచ్చు. విస్తీర్ణం, ఉత్పత్తుల దృష్ట్యా గోధుమ పంట విషయంలో మన రాష్ట్రం దేశంలో 16వ స్థానాన్ని ఆక్రమిస్తుంది. గోధుమపంట అత్యధికభాగం తెలంగాణా ప్రాంతంలోను, కొద్దిమేరకు రాయలసీమలోను పండుతుంది. కోస్తా ఆంధ్రలో ఇది దాదాపు పండదనే చెప్పవచ్చు. హైదరాబాద్, నిజామాబాద్, మెదక్, ఆదిలాబాద్ జిల్లాలలో ఈ పంట ఎక్కువగా పండుతుంది.

**మనరాష్ట్రంలో గోధుమపంట వివరాలు**

| సంవత్సరం | విస్తీర్ణం ( లక్షల హెక్టార్లలో) | ఉత్పత్తి ( టన్నులలో) |
|---|---|---|
| 1973-74 | 21,883 | 13,600 |
| 1974-75 | 25,213 | 18,001 |
| 1975-76 | 26,339 | 21,458 |
| 1976-77 | 22,949 | 13,554 |
| 1977-78 | 21,778 | 11,980 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆం. ప్ర.

## మొక్కజొన్న

మనరాష్ట్రంలోని పంటల్లో మొక్కజొన్న కూడాచెప్పుకోదగింది. భారతదేశపు మొక్కజొన్న పంటతో పోల్చి చూసినప్పుడు విస్తీర్ణంలో 5.0 శాతం, ఉత్పత్తిలో 8.5 శాతం మన రాష్ట్రం ఆక్రమిస్తుంది. అయితే విస్తీర్ణంలోనూ, ఉత్పత్తిలోనూ మన రాష్ట్రానికి ఆరో స్థానం లభిస్తుంది. మన రాష్ట్రంలో మొక్కజొన్న ఎక్కువగా తెలంగాణా ప్రాంతంలో కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్, మెదక్ జిల్లాలలో అత్యధికంగా పండుతుంది. మొక్కజొన్న ఖరీఫ్ కాలంలోనే ఎక్కువగా పండుతుంది.

మన రాష్ట్రంలో మొక్కజొన్న ఉత్పత్తి కిందివిధంగా ఉంది.

| సంవత్సరము | విస్తీర్ణం (లక్షల హెక్టార్లలో) | ఉత్పత్తి (లక్షల టన్నులలో) |
|---|---|---|
| 1973-74 | 2.8 | 4.2 |
| 1974-75 | 3.0 | 4.8 |
| 1975-76 | 3.0 | 5.0 |
| 1976-77 | 2.9 | 3.0 |
| 1977-78 | 3.0 | 4.7 |
| 1978-79 | 3.2 | 3.6 |

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ జిల్లాలలో మొక్కజొన్నపంట ఏ విధంగా పండుతుందో కింద ఇచ్చిన సమాచారం (1978-79) నుంచి తెలుసుకోవచ్చు.

| జిల్లా | విస్తీర్ణం (హెక్టార్లు) | ఉత్పత్తి (టన్నులలో) |
|---|---|---|
| శ్రీకాకుళం | 466 | 709 |
| విశాఖపట్నం | 5,823 | 8,774 |
| తూర్పుగోదావరి | 1,291 | 2,027 |
| పశ్చిమగోదావరి | 996 | 1,594 |
| కృష్ణా | 1,827 | 2,867 |
| గుంటూరు | 1,587 | 2,515 |
| ప్రకాశం | 5 | 8 |
| నెల్లూరు | 95 | 161 |
| కోస్తా ఆంధ్ర | 12,090 | 18,655 |
| కర్నూలు | 59 | 92 |
| అనంతపూరు | 611 | 1,014 |
| కడప | 54 | 81 |
| చిత్తూరు | 180 | 284 |
| రాయలసీమ | 904 | 1,471 |
| హైదరాబాద్ | 8,297 | 7,667 |
| నిజామాబాద్ | 55,174 | 1,16,625 |
| మెదక్ | 58,961 | 57,665 |
| మహబూబ్‌నగర్ | 67 | 104 |
| నల్గొండ | 2,157 | 3,280 |
| వరంగల్ | 45,457 | 80,341 |
| ఖమ్మం | 5,268 | 5,827 |
| కరీంనగర్ | 93,129 | 1,54,347 |
| ఆదిలాబాదు | 23,425 | 27,808 |
| తెలంగాణా | 2,91,945 | 4,53,564 |
| ఆంధ్రప్రదేశ్ | 3,04,939 | 4,73,690 |

మూలం : అర్థగణాంకశాఖ. ఆంధ్రప్రదేశ్

**రాగి**

భారతదేశంతో పోల్చినప్పుడు మన రాష్ట్రపు రాగి పంట విస్తీర్ణంలోనూ, ఉత్పత్తిలోనూ ద్వితీయ స్థానాన్ని ఆక్రమిస్తుంది. రాగి పంటకు మన రాష్ట్రంలో శ్రీకాకుళం, విశాఖ

పట్నం, ప్రకాశం, అనంతపూర్, చిత్తూరు, మహబూబ్‌నగర్ జిల్లాలు చెప్పుకోదగినవి. ఖరీఫ్, రబీ రెండు కాలాల్లోనూ ఈ పంట పండుతుంది.

**కింద పేర్కొన్న సంవత్సరాలలో రాగి పంట ఉత్పత్తిని గమనించవచ్చు :**

| సంవత్సరం | విస్తీర్ణం (లక్షల హెక్టార్లలో) | ఉత్పత్తి (లక్షల టన్నులలో) |
|---|---|---|
| 1973-74 | 2.5 | 2.7 |
| 1974-75 | 2.9 | 3.2 |
| 1975-76 | 3 2 | 3.7 |
| 1976-77 | 3 3 | 3.0 |
| 1977-78 | 3.3 | 3.5 |
| 1978-79 | 3.1 | 3.4 |

మూలం : అర్థగణాంకశాఖ ఆంధ్రప్రదేశ్

రాగులను కొన్ని ప్రాంతాలలో తమిదలనీ, మరికొన్ని ప్రాంతాలలో చోళ్లు అనీ అంటారు.

వివిధ జిల్లాలలో రాగులు 1977-78 సంవత్సరంలో కింద పేర్కొన్న విధంగా పండినాయి.

| జిల్లాలు | విస్తీర్ణం (హెక్టార్లలో) | ఉత్పత్తి (టన్నులలో) |
|---|---|---|
| శ్రీకాకుళం | 42,420 | 49,691 |
| విశాఖపట్నం | 41,433 | 40,130 |
| తూర్పుగోదావరి | 5,769 | 5,897 |
| పశ్చిమ గోదావరి | 905 | 1,095 |
| కృష్ణా | 483 | 614 |
| గుంటూరు | 496 | 756 |
| ప్రకాశం | 30,080 | 50,784 |
| నెల్లూరు | 10,771 | 14,551 |
| కోస్తాఆంధ్ర | 1,33,347 | 1,63,518 |
| కర్నూలు | 581 | 680 |
| అనంతపూర్ | 38,908 | 52,022 |
| కడప | 14,909 | 27,245 |
| చిత్తూర్ | 51,860 | 57,856 |
| రాయలసీమ | 1,06,258 | 1,37,903 |

| | | |
|---|---|---|
| హైదరాబాదు | 16,875 | 9,578 |
| నిజామాబాద్ | 2,618 | 1,507 |
| మెదక్ | 10,469 | 5,207 |
| మహబూబ్‌నగర్ | 57,984 | 35,093 |
| నల్గొండ | 187 | 257 |
| వరంగల్ | 116 | 67 |
| ఖమ్మం | 1 | 1 |
| కరీంనగర్ | 15 | 9 |
| ఆదిలాబాద్ | — | — |
| తెలంగాణా | 88,265 | 51,719 |
| ఆంధ్రప్రదేశ్ | 3,27,870 | 3,53,040 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆంధ్రప్రదేశ్

## చిరుధాన్యాలు

పైన పేర్కొన్నవే కాకుండా కొన్ని చిరుధాన్యపు పంటలు ఆంధ్రప్రదేశ్ లో పలు జిల్లాలలో పండుతాయి వాటిల్లో ముఖ్యమైనవి : కొర్ర, అరిక, సామ, వరిగ మొదలైనవి. ఈ చిరు ధాన్యాలు ఎక్కువగా రాయలసీమ జిల్లాలలో పండుతాయి.

ఈ చిరుధాన్యాల ఉత్పత్తి ఇట్లా ఉంది.

| సంవత్సరం | విస్తీర్ణం (లక్షల హెక్టార్లు) | ఉత్పత్తి (లక్షల టన్నులు) |
|---|---|---|
| 1973-74 | 7.4 | 3.2 |
| 1974-75 | 7.0 | 2.7 |
| 1975-76 | 8.0 | 2.9 |
| 1976-77 | 7.6 | 2.6 |
| 1977-78 | 7.6 | 3.9 |
| 1978-79 | 6.8 | 3.3 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆం. ప్ర.

ప్రాంతాలవారీగా చిరుధాన్యాలఉత్పత్తి 1977-78 సంవత్సరంలో కిందివిధంగా ఉంది.

| ప్రాంతం | విస్తీర్ణం (హెక్టార్లు) | ఉత్పత్తి (టన్నులు) |
|---|---|---|
| కోస్తా ఆంధ్ర | 1,88,541 | 1,01,078 |
| రాయలసీమ | 4,46,695 | 2,54,315 |
| తెలంగాణా | 1,23,274 | 41,700 |
| ఆంధ్రప్రదేశ్ | 7,58,510 | 3,97,093 |

1977-78సంవత్సరంలో మనరాష్ట్రంలో 92,25,335 హెక్టార్ల భూమిలో 89,84,389 టన్నుల ఆహారధాన్యాలను పండించడం జరిగించి. ఈ ఆహార ధాన్యాల ఉత్పత్తిని ప్రాంతాల వారీగా పరిశీలిస్తే, కోస్తా ఆంధ్ర ప్రాంతంలో 34,50,584 హెక్టార్ల భూమిలో 40,04,172 టన్నులనూ, రాయలసీమలో 17,70,375 హెక్టార్ల భూమిలో 15,92,887 టన్నులనూ, తెలంగాణాలో 40,34,376 హెక్టార్ల భూమిలో 33,82,337 టన్నులనూ 1977-78 సంవత్సరంలో పండించడం జరిగింది.

## పప్పుధాన్యాలు

ఆహారధాన్యాలలో పప్పుధాన్యాలను ఒక భాగంగా పేర్కొనవచ్చు. మనరాష్ట్రంలో కంది, పెసర, మినుము, శనగ, ఉలవలు మొదలైన పప్పుధాన్యాలు పండుతున్నాయి. పప్పుధాన్యాల ఉత్పత్తి 1973-74 నుంచి 1977-78 సంవత్సరాల మధ్య కిందివిధంగా ఉంది.

| సంవత్సరం | విస్తీర్ణం [లక్షల హెక్టార్లలో] | ఉత్పత్తి [లక్షల టన్నులలో] |
|---|---|---|
| 1973-74 | 14.0 | 4.0 |
| 1974-75 | 14 3 | 4.1 |
| 1975-76 | 14.5 | 4.2 |
| 1976-77 | 13.0 | 9.5 |
| 1977-78 | 13.0 | 3.2 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆం. ప్ర.

మన రాష్ట్రంలో పండే వివిధ రకాల పప్పు ధాన్యాలను గురించి సంగ్రహంగా కింద వివరించడమైంది.

***కంది :*** రాష్ట్రంలో అన్ని ప్రాంతాల్లోనూ కంది పండుతుంది. ప్రధానంగా రాయలసీమ తెలంగాణా జిల్లాలలో కందిపంట ఎక్కువ. 1977-78 సంవత్సరంలో మన రాష్ట్రంలో 1,99,16 హెక్టార్ల భూమిలో కంది పంట వేయగా, 29,859 టన్నుల దిగుబడి అయింది. కంది పంట 1977-78 సంవత్సరంలో 32,872 హెక్టార్ల భూమిలో 5,173 టన్నులూ, రాయలసీమలో 43,750 హెక్టార్ల భూమిలో 6,521 టన్నులూ, తెలంగాణాలో 1,22,538 హెక్టార్ల భూమిలో 18,165 టన్నులూ ఉత్పత్తి అయింది. మన రాష్ట్రంలో కంది పంటను ఆదిలాబాద్ (5,153 టన్నులు), మహబూబ్‌నగర్ (4,255టన్నులు), హైదరాబాదు (3,207 టన్నులు), అనంతపూర్ (2,840 టన్నులు), కర్నూలు (2,512 టన్నులు), గుంటూరు (1,334 టన్నులు) జిల్లాలలో పండిస్తున్నారు. 1978-79 సంవత్సరంలో మన రాష్ట్రంలో 2.66 లక్షల హెక్టార్ల భూమిలో కంది పంటను పండించగా 44 వేల టన్నులు ఉత్పత్తి అయినట్లు అంచనాల వల్ల తెలియవచ్చింది.

***మినుము :*** కోస్తా ఆంధ్రప్రాంతం మినుముల పంటకు ప్రసిద్ధి. 1977-73 సంవత్సరంలో మన రాష్ట్రంలో 1,55,111 హెక్టార్ల భూమిలో మినుములు పండించగా, 50,301

దిగుబడి అయింది. ఇందులో కోస్తా ఆంధ్ర ప్రాంతంలో 1,33,249 హెక్టార్ల భూమిలో 39,740 టన్నుల మినుములు ఉత్పత్తి అయినాయి. తెలంగాణాలో 40,541 హెక్టార్ల భూమిలో 10,099 టన్నుల మినుములు ఉత్పత్తి అయినాయి. రాయలసీమలో మినుముల పంట అతి స్వల్పం. 1,321 హెక్టార్లభూమిలో 462 టన్నుల ఉత్పత్తి మాత్రమే జరిగింది. మినుముల ఉత్పత్తి గుంటూరు (14,555 టన్నులు), ప్రకాశం (12,824 టన్నులు), శ్రీకాకుళం (4,513 టన్నులు), ఆదిలాబాద్ (4,155 టన్నులు), తూర్పుగోదావరి (5,718 టన్నులు) జిల్లాలు ముఖ్యమైనవి. మినుముల ఉత్పత్తి కరీంనగర్ (6 టన్నులు), కడప (9 టన్నులు) జిల్లాలలో బహు స్వల్పం. 1978-79 సంవత్సరంలో మినుముల పంట 2.27 లక్షలహెక్టార్ల భూమిలో 98 వేల టన్నులకు చేరుకొందని అంచనా.

*సెనగ :* ఇది ముఖ్యంగా రబీ పంట. దీని ఉత్పత్తి మన రాష్ట్రంలో తగ్గుముఖం పడుతూన్నది. 1975-76 లో 87,811 హెక్టార్ల భూమిలో 36,633 టన్నులు పండించగా 1977-78 లో 62,862 హెక్టార్ల భూమిలో 20,995 టన్నులు మాత్రమే పండించడం జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో సెనగ తెలంగాణా ప్రాంతంలో ఎక్కువగా పండుతుంది. మెదక్ (3,941 టన్నులు), నిజామాబాద్ (2,933 టన్నులు), హైదరాబాద్ (2,620 టన్నులు), కర్నూలు [3,522 టన్నులు], ఆదిలాబాద్ [1,487 టన్నులు], గుంటూరు [1,284టన్నులు] జిల్లాలలో సెనగ పంట పండుతుంది.

*పెసర :* ఇది రబీ, ఖరీఫ్ రెండు కాలాల్లో పండే పంట. 1978-79 సంవత్సరంలో మన రాష్ట్రంలో 5.19 హెక్టార్ల భూమిలో 1.5 లక్షలటన్నులు పండిందనిఅంచనా. 1977-78 సంవత్సరంలో మాత్రం 4,84,653 హెక్టార్ల భూమిలో ఈ పంట 1,36,090 టన్నుల మేరకు పండింది. మన రాష్ట్రంలో పెసరపంట ముఖ్యంగా కరీంనగర్ (32,075 టన్నులు), వరంగల్ [20,552 టన్నులు], కృష్ణా (16,816 టన్నులు), మెదక్ [10,207 టన్నులు], ఆదిలాబాద్ [9,950 టన్నులు], ఖమ్మం [9,804 టన్నులు] జిల్లాలలో పండుతుంది.

***ఉలవ :*** ఉత్పత్తి, విస్తీర్ణం దృష్ట్యా దీనికి ప్రాముఖ్యం ఉన్నా, పశువులకు దాణా రూపంలోనే దీనిని ఎక్కువగా ఉపయోగించడం జరుగుతూన్నది. 1977-78 సంవత్సరంలో 3,45,218 హెక్టార్ల భూమిలో 85,246 టన్నుల ఉలవలు ఉత్పత్తి అయినాయి. అయితే 1978-79 సంవత్సరంలో 3.58 లక్షల హెక్టార్ల భూమిలో 89 వేల టన్నులు ఉత్పత్తి అయినట్లు అంచనాలవల్ల తెలుస్తూంది. మన రాష్ట్రంలో ఉలవల ఉత్పత్తికి నల్గొండ [19,970 టన్నులు], అనంతపూర్ [11,301 టన్నులు], తూర్పుగోదావరి [6,522 టన్నులు], విశాఖపట్నం [6,343 టన్నులు], శ్రీకాకుళం [6,202 టన్నులు] జిల్లాలు పేరు పొందాయి.

ఇతరత్రా చిల్లర మల్లర పప్పుధాన్యాలు [అలసందలు, అనుములు మొదలైనవి] మన రాష్ట్రంలో 1977-78 సంవత్సరంలో 55,279 హెక్టార్ల భూమిలో 10,047 టన్నులు ఉత్పత్తి అయినాయి. ఇవిఎక్కువగా తెలంగాణా జిల్లాలలో (మెదక్, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్] పండుతాయి. తెలంగాణా ప్రాంతంలో 5,146 టన్నులు ఉత్పత్తి కాగా ఆంధ్ర ప్రాంతంలో

3,161 టన్నులు, రాయలసీమ ప్రాంతంలో 1,740 టన్నులు 1977-78 సంవత్సరంలో ఉత్పత్తి అయినాయి. 1978-79 లో వీటి ఉత్పత్తి 9 వేల టన్నులని అంచనా.

## వాణిజ్య పంటలు

ఆంధ్రప్రదేశ్‌లో ఆహార పంటలవరె నూనెగింజలు, వేరుశనగ, ఆముదాలు, నువ్వులు, కుసుమలు, పత్తి, చెరకు, పొగాకు, మిరప, పసుపు, జనుము మొదలైన వాణిజ్య పంటలు ఎన్నో పండుతాయి. ఈ వాణిజ్య పంటల ఉత్పత్తులు మన రాష్ట్ర అవసరాలకు పోగా కొన్నింటిని ఇతర రాష్ట్రాలకు, విదేశాలకు కూడా ఎగుమతి చేయడం జరుగుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లో పుష్కలంగా పండే ప్రధానమైన వాణిజ్య పంటలను గురించి కింద సంగ్రహంగా పేర్కొనడం జరిగింది.

### నూనె గింజలు

మన రాష్ట్రంలో పండే నూనె గింజలలో వేరుశనగ, ఆముదాలు, నువ్వులు ముఖ్యమైనవి. నూనెగింజలు పండే విస్తీర్ణం పలు సంవత్సరాలలో ఇట్లా ఉన్నది.

| సంవత్సరం | నూనెగింజల కింద ఉన్న విస్తీర్ణం (హెక్టార్లు) |
|---|---|
| 1973-74 | 21,66,820 |
| 1974-75 | 22,49,736 |
| 1975-76 | 17,58,019 |
| 1976-77 | 15,65,742 |
| 1977-79 | 15,45,616 |

మూలం : అర్థగణాంక శాఖ, ( ఆం. ప్ర. )

మన రాష్ట్రంలో 1977-78 లో మొత్తం నూనె గింజల ఉత్పత్తి 11,19,087 టన్నులు. నూనె గింజల నుంచి నూనెను తయారు చేయడానికి రాష్ట్రంలో ఎన్నో నూనె గానుగలు, మిల్లులు ఉన్నాయి. 1980-81 సంవత్సరానికి 14.9 లక్షల టన్నుల నూనెగింజల ఉత్పత్తి లక్ష్యాన్ని మన రాష్ట్రం చేరుకోవలసి ఉంది.

***వేరుశనగ :*** ఆంధ్రప్రదేశ్‌లో వేరుశనగ పంట అత్యంత ప్రాముఖ్యం వహించింది. 1977-78 లో 10,99,387 హెక్టార్ల భూమిలో వేరుశనగ వేయగా, 10,23,408 టన్నులు ఉత్పత్తి అయింది. భారతదేశం అంతటిలో విస్తీర్ణంలోను, ఉత్పత్తిలోను మన రాష్ట్రం వేరుశనగ పంట విషయంలో ప్రథమస్థానం ఆక్రమిస్తుంది. ఈ పంట ఖరీఫ్ కాలంలోను, రబీ కాలంలోను పండుతుంది. మన రాష్ట్రంలో వేరుశనగ పంట అత్యధికంగా రాయలసీమ ప్రాంతంలో పండుతుంది. మొత్తం ఉత్పత్తిలో 6,87,521 టన్నులు (1977-78) ఒక్క రాయలసీమలోనే పండుతుంది. మన రాష్ట్రంలో వేరుశనగ పంటకు అనంతపూర్ ( 2,74.629 టన్నులు), చిత్తూరు (2,54,263 టన్నులు), మహబూబ్‌నగర్ (58,960 టన్నులు), నల్గొండ (57,877 టన్నులు), విశాఖపట్నం (53,232 టన్నులు), జిల్లాలు ముఖ్యమైనవి.

1978-79 లో 12.8 లక్షల హెక్టార్ల భూమిలో ఈ పంటను సాగుచేయగా, 11.6 లక్షల ఉత్పత్తి అయినట్లు అంచనాలవల్ల తెలుస్తున్నది.

**ఆముదాలు :** ఈ పంట విషయంలోకూడా ఆంధ్రప్రదేశ్‌దే అగ్రస్థానం. 1977-78లో 1.9 లక్షల హెక్టార్ల భూమిలో ఈ పంట వేయగా, 40,000 టన్నులు ఉత్పత్తి అయింది. ఈ పంటకు తెలంగాణా ప్రాంతం సుప్రసిద్ధమైనది. మన రాష్ట్రంలో నల్గొండ, మహబూబ్ నగర్, హైదరాబాదు, ప్రకాశం, గుంటూరు, అనంతపూర్, వరంగల్లు, కరీంనగర్ జిల్లాలలో ఆముదాలు బాగా పండుతాయి. ప్రపంచంలో ఆముదం నూనె ఎగుమతి చేసే దేశాలలో భారతదేశానికి ద్వితీయస్థానం లభిస్తే, అందులో ఎక్కువగా ఉత్పత్తి చేసే మన రాష్ట్రం ప్రముఖస్థానం వహిస్తుంది.

**నువ్వులు :** ఈ పంట విస్తీర్ణంలో, ఉత్పత్తిలో మన రాష్ట్రానికి భారత దేశంలో 4వ స్థానం లభిస్తుంది. 1977-78లో 1,62,200 హెక్టార్ల భూమిలో 28,222 లక్షలటన్నులు నువ్వులను పండించడం జరిగింది. నువ్వులపంటలో కోస్తా ఆంధ్రకు హెచ్చు స్థానమున్నది. కోస్తా ఆంధ్రలో విశాఖపట్నం జిల్లాలో (24,773 టన్నులు) హెచ్చుగా నువ్వులు పండుతాయి. ఆ తరవాత చెప్పుకోదగిన జిల్లాలు తూర్పుగోదావరి (14,700 టన్నులు), పశ్చిమగోదావరి (15,985 టన్నులు), శ్రీకాకుళం (12,394 టన్నులు), గుంటూరు (11,688 టన్నులు) ఆదిలాబాదు (17,812 టన్నులు), కరీంనగర్ (13,910 టన్నులు). 1978-79 లో 1.7 లక్షల హెక్టార్ల భూమిలో నువ్వులు వేయగా 24 లక్షల టన్నులు ఉత్పత్తి లభించింది. ఈ నువ్వులు ఖరీఫ్, రబీ రెండు పంటకాలాలలోనూ పండించడం జరుగుతున్నది.

**కుసుమలు :** మన రాష్ట్రంలో కుసుమలు అధికంగా రాయలసీమలో పండుతాయి. ఆ తరవాత తెలంగాణాలో ఎక్కువగా పండుతాయి. కోస్తా ఆంధ్రలో ఇదిఏమాత్రం చెప్పుకో దగిన పంటకాదు. 1977-78 లో 26,445 హెక్టార్ల భూమిలో కుసుమలు వేయగా, 6,526 టన్నులు ఉత్పత్తి అయింది. కుసుమలు సర్వసాధారణంగా రబీపంట కాలంలో పండుతాయి. ఆంధ్రప్రదేశ్‌లో కుసుమలు అధికంగా కర్నూలు, అనంతపూర్, హైదరాబాదు, మెదక్ జిల్లాలలో పండుతాయి.

**కొబ్బరి :** మన రాష్ట్రంలో 1977-78 లో 39,822 హెక్టార్ల భూమిలో 16 కోట్ల కొబ్బరి కాయలు ఉత్పత్తి అయినాయి. కొబ్బరి పంటకు తూర్పుగోదావరి జిల్లా, పశ్చిమ గోదావరిజిల్లా, శ్రీకాకుళంజిల్లా, విశాఖట్నంజిల్లా చెప్పుకో దగినవి.

మన రాష్ట్రంలో అవిసె, ఆవాలు, సన్‌ఫ్లవర్, వెర్రినువ్వులు మొదలైన పంటలు కొన్ని ప్రాంతాలలో పండుతున్నాయి.

**పత్తి :**

మన రాష్ట్రంలో ఆదిలాబాదు, గుంటూరు, కర్నూలు, ప్రకాశం, అనంతపూర్, కడప మహబూబ్‌నగర్ జిల్లాలలో ఈ పంట విశేషంగా పండుతున్నది. ఇది ప్రధానంగా వాణిజ్య పంట కావటాన, పత్తి వేసే విస్తీర్ణం, ఉత్పత్తులు పత్తికిగల డిమాండు, ధరనుబట్టి మారుతూ ఉంటాయి. పక్కపేజీలోని పట్టిక ద్వారా పత్తి ఉత్పత్తి ధోరణులను గ్రహించవచ్చు.

| సంవత్సరం | విస్తీర్ణం (హెక్టార్లు) | ఉత్పత్తి (ఒక్కొక్క బేలు 170 కి.గ్రా. లింట్) |
|---|---|---|
| 1973-74 | 3,90,480 | 3,47,259 |
| 1974-75 | 4,13,788 | 4,82,865 |
| 1975-76 | 2,59,851 | 2,39,088 |
| 1976-77 | 2,88,372 | 2,60,703 |
| 1977-78 | 4,14.927 | 2,17,017 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆంధ్రప్రదేశ్

1979-80 లో 3 లక్షల బేళ్లకుపైగా పత్తి ఉత్పత్తి అయినట్లు అంచనా. 1980-81 లో 4.10 లక్షల బేళ్ల ఉత్పత్తి లక్ష్యంగా నిర్ణయమైంది.

## చెరుకు

ఈ పంటలో మనరాష్ట్రం భారతదేశంలో 4 వ స్థానాన్ని ఆక్రమిస్తుంది. 1977-78లో మన రాష్ట్రంలో 1,94,708 హెక్టార్లలో ఈపంట వేయగా, 13,41,644 టన్నులు లభించింది. అయితే 1978-79 లో చెరుకు సాగుబడి ప్రాంతం 1.43 లక్షల హెక్టార్లకు, దిగుబడి 9.5 లక్షల టన్నులకు తగ్గినట్లు తెలుస్తున్నది.

మన రాష్ట్రంలో చెరుకుపంట కింది జిల్లాలలో ఈ విధంగా ఉంది.

| జిల్లా | విస్తీర్ణం [హెక్టార్లు] | ఉత్పత్తి [టన్నులలో] |
|---|---|---|
| శ్రీకాకుళం | 11,566 | 88,017 |
| విశాఖపట్నం | 24,558 | 1,44,033 |
| తూర్పుగోదావరి | 19,929 | 1,44,559 |
| పశ్చిమగోదావరి | 24,757 | 1,66,466 |
| కృష్ణా | 17,000 | 1,38,754 |
| గుంటూరు | 5,533 | 43,168 |
| ప్రకాశం | 721 | 4,135 |
| నెల్లూరు | 519 | 101 |
| కోస్తా ఆంధ్ర | 1,04,583 | 7,29,233 |
| కర్నూలు | 779 | 5,391 |
| అనంతపూర్ | 5,172 | 45,333 |
| కడప | 4,681 | 36,521 |
| చిత్తూరు | 20,832 | 1,64,906 |
| రాయలసీమ | 31,464 | 2,52,151 |

| | | |
|---|---|---|
| హైదరాబాదు | 1,910 | 19,972 |
| నిజామాబాదు | 30,737 | 1,75,317 |
| మెదక్ | 21,851 | 1,33,668 |
| మహబూబ్ నగర్ | 248 | 321 |
| నల్గొండ | 1,256 | 8,150 |
| వరంగల్ | 26 | 161 |
| ఖమ్మం | 487 | 3,009 |
| కరీంనగర్ | 521 | 3,031 |
| ఆదిలాబాదు | 1,625 | 16,631 |
| తెలంగాణా | 58,661 | 3,60,260 |
| ఆంధ్రప్రదేశ్ | 1,94,708 | 13,41,644 |

మూలం : అర్థగణాంకశాఖ [ఆం. ప్ర.]

**పొగాకు**

పొగాకు ఉత్పత్తిలో మన రాష్ట్రానిది అగ్రస్థానం అని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. దేశం మొత్తంలో వర్జీనియా పొగాకు ఉత్పత్తిలో మనరాష్ట్రం అత్యధికభాగాన్ని పండిస్తున్నది. ఈ పొగాకు పంట కొన్ని వేలమంది కార్మికులకు జీవనోపాధి కల్పించడమేకాక, ప్రభుత్వానికి విదేశీమారక ద్రవ్యాన్ని కూడా ఆర్జించి పెడుతున్నది.

**ఆంధ్రప్రదేశ్‌లో పొగాకు పంటకు సంబంధించిన వివరాలు**

| సంవత్సరం | విస్తీర్ణం [హెక్టార్లు] | ఉత్పత్తి [టన్నులు] |
|---|---|---|
| 1973-74 | 2,36,484 | 2,37,090 |
| 1974-75 | 1,77,124 | 1,59,412 |
| 1975-76 | 1,56,292 | 1,29,614 |
| 1976-77 | 1,88,353 | 1,33,154 |
| 1977-78 | 2,90,662 | 2,62,806 |

మూలం : అర్థగణాంకశాఖ, [ఆం. ప్ర.]

పొగాకు పంటలో ప్రకాశం జిల్లాది [76,243 టన్నులు] అగ్రస్థానం. ఆ తరవాత నెల్లూరు, పశ్చిమగోదావరి, కర్నూలు, గుంటూరు, మహబూబ్‌నగర్, కృష్ణా, ఖమ్మం జిల్లాలు చెప్పుకోదగ్గవి. మొత్తంమీద కోస్తా ఆంధ్రలో పొగాకు ఎక్కువగా పండుతుంది. 1978-79 లో పొగాకు 1.99 లక్షల హెక్టార్లలో వేయగా, దిగుబడి 1.9 లక్షల టన్నులు అయినట్లుగా అంచనాలవల్ల తెలుస్తున్నది.

## మిరప

మిరప పంట విషయంలో భారతదేశంలో ఆంధ్రప్రదేశ్‌కు ఉత్పత్తి, విస్తీర్ణం దృష్ట్యా సముచితమైన స్థానముంది. 1977-78 లో 1,34,499 హెక్టార్లలో 1,00,039 టన్నుల మిరపకాయల ఉత్పత్తి జరిగింది. మన రాష్ట్రంలో మిరప తెలంగాణా ప్రాంతంలో ఎక్కువగా పండుతుంది. 1977-78 లెక్కల ప్రకారం తెలంగాణా ప్రాంతంలో 59,813 హెక్టార్ల భూమిలో 48,048 టన్నుల దిగుబడి జరిగింది. కోస్తా ఆంధ్ర ప్రాంతంలో 57,786 హెక్టార్ల భూమిలో 38,646 టన్నుల ఉత్పత్తి లభించింది. రాయలసీమ ప్రాంతంలో 16,900 హెక్టార్ల భూమిలో 13,645 టన్నులు దిగుబడి అయింది. మన రాష్ట్రంలో మిరప పంటకు వరంగల్, గుంటూరు, ఖమ్మం, కరీంనగర్, పశ్చిమ గోదావరి, నల్గొండ జిల్లాలు ముఖ్యమైనవి.

## ఉల్లి

వాణిజ్య పంటలలో ఉల్లి పంట కూడా ఒకటి. 1977-78 లో మన రాష్ట్రంలో 12,187 హెక్టార్ల భూమిలో ఉల్లి పంట పండించడం జరిగింది. 74,701 టన్నుల ఉల్లి గడ్డలు ఉత్పత్తి అయినాయి. ఉల్లి గడ్డలు మన రాష్ట్రం నుంచి ఇతర రాష్ట్రాలకు, విదేశాలకు ఎగుమతి అవుతున్నాయి. మన రాష్ట్రంలో ఉల్లిగడ్డలు రాయలసీమ ప్రాంతంలో అత్యధికంగా పండుతున్నాయి. కడప, కర్నూలు, అనంతపూర్, హైదరాబాదు, విశాఖపట్నం జిల్లాలు ఉల్లిపంట విషయంలో ముఖ్యమైనవి.

**పసుపు :** ఆంధ్రప్రదేశ్‌లోని వ్యాపార పంటలలో పసుపుకు సముచితమైన స్థానముంది. 1977-78 లో 17,164 హెక్టార్ల భూమిలో పసుపు పంటను పండించారు. 41,301 టన్నులు ఉత్పత్తి అయింది. మన రాష్ట్రంలో పసుపు పంట ఎక్కువగా కడప, నిజామాబాదు, కరీంనగర్, గుంటూరు జిల్లాలలో పండుతుంది.

మన రాష్ట్రంలో గోగునార, జనపనార ఉత్పత్తి అవుతున్నాయి.

మన రాష్ట్రంలో అనేక రకాలయిన పండ్లు, ఫలాలు, కూరగాయలు పండించబడుతున్నాయి. కొన్నింటిని విదేశాలకు కూడా ఎగుమతి చేయడం జరుగుతున్నది. మనరాష్ట్రంలో మామిడి, అరటి, నిమ్మ, ద్రాక్ష, జీడిమామిడి, సపోటా, జామ మొదలైనవి పండించడం జరుగుతున్నది. 1977-78 లో పండ్లు, ఫలాలు మొదలైనవి కింద పేర్కొన్న విస్తీర్ణంలో పండించడం జరిగింది.

| అంశాలు | విస్తీర్ణం (హెక్టార్లు) |
|---|---|
| మామిడి | 1,26,557 |
| నిమ్మ, నారింజ మొ॥ | 28,356 |
| ద్రాక్ష | 772 |
| జామ | 2,485 |
| డ్రై ఫ్రూట్స్ | 22,679 |

| అంశాలు | విస్తీర్ణం (హెక్టార్లు) |
|---|---|
| అల్లం | 2,180 |
| అరటి | 18,077 |
| ఆలుగడ్డ | 204 |
| చిలకడదుంప | 3,989 |
| వంగ | 7,262 |
| బెండ | 2,958 |
| ఆకుకూరలు | 1,185 |
| పొట్లు, సొరజాతి | 3,439 |
| కాబేజి | 570 |
| బీన్స్ | 1,018 |
| టొమాటో | 15,006 |
| తమలపాకు | 2,806 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆం. ప్ర.

మన రాష్ట్రంలో 1977-78 నుంచి ముఖ్యమైన పంటల యొక్క సగటు దిగుబడిని ఒక్కొక్క హెక్టారుకు కింద ఇవ్వడం జరిగింది (కిలోగ్రాములలో).

| అంశం | దిగుబడి (కి. గ్రా.) |
|---|---|
| బియ్యం | 1,565 |
| జొన్న | 621 |
| సజ్జ | 666 |
| రాగి | 1,077 |
| మొక్కజొన్న | 1,553 |
| కంది | 150 |
| వేరుసెనగ | 931 |
| ఆముదాలు | 211 |
| కుసుమలు | 174 |
| చెరుకు | 7,940 |
| పత్తి (లింట్) | 89 |
| పొగాకు | 1,069 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆంధ్రప్రదేశ్

ఆంధ్రప్రదేశ్ ఆవతరణ నుంచి ఇప్పటిదాకా ప్రాథమిక రంగమైన వ్యవసాయాన్ని, వ్యావసాయక ఉత్పత్తులను, ఉత్పాదక రేట్లను అభివృద్ధి చెయ్యడంలో పంచవర్ష ప్రణాళికా

కృషిద్వారా ఎంతో పాటుపడింది. రాష్ట్రఆదాయంలో వ్యావసాయక రంగం వాటా సంవత్సరం సంవత్సరం ఎక్కువ అవుతూనే వచ్చింది. వ్యవసాయ రంగాభివృద్ధికి అవసరమైన వ్యవస్థాపన సౌకర్యాలను ( నీటి పారుదల, హెచ్చురాబడి వంగడాలు, శ్రేష్ఠమైన రసాయనిక ఎరువులు, వ్యవసాయ పరిశోధనలు) కలిగిస్తున్నది. చిన్నరైతులకు, సన్నకారు రైతులకు సహాయాన్ని అందించే నిమిత్తం వారి ఆర్థికాభివృద్ధికి దోహదం చేసేందుకు కేంద్రప్రభుత్వం కొన్ని సంస్థలను నెలకొల్పింది. ఉదాహరణకు సన్నకారు రైతుల అభివృద్ధి ఏజెన్సీ (Small Farmers Development Agency),ఉపాంతరైతుల,వ్యావసాయక కార్మికుల అభివృద్ధి సంస్థ (Marginal Farmers and Agricultural Labourers Development Agency), ఇట్లాంటి సంస్థల సహాయాన్ని మనరాష్ట్రంలోని జిల్లాలకు అనువర్తింపజేసి సన్నకారు రైతులకు వ్యవసాయ కార్మికులకు తోడ్పడటంలో రాష్ట్రప్రభుత్వం ఎన్నో చర్యలు తీసుకొంది. రాష్ట్రంలో 16 జిల్లాలలో ఈ అభివృద్ధి సంస్థల కార్యక్రమాలను అమలు జరపటం జరుగుతున్నది. 1978 డిసెంబరు ఆఖరుకు 1652 లక్షల రూపాయలు కేంద్రప్రభుత్వ గ్రాంటును వినియోగించుకోవడం జరిగింది. దాదాపు 4 లక్షల మంది సన్నకారు రైతులు ఈ సంస్థలవల్ల ప్రయోజనాలు పొందారు.

వ్యవసాయాభివృద్ధికి వ్యావసాయక యంత్రాలు ఇనుమిక్కిలిగా తోడ్పడతాయి. వ్యావసాయక యంత్రాలను కొనుక్కోవటానికి గ్రామీణ సహకార పరపతి సంఘాలు, బాంకులు, భూమి అభివృద్ధి బాంకులు ఆర్థిక సహాయాన్ని రైతులకు అందజేస్తున్నాయి. మన రైతులు ఉపయోగించే వివిధ రకాల వ్యావసాయక యంత్రాల, పరికరాల వివరాలను [1977 సంవత్సరానికి సంబంధించిన వాటిని] కింద ఇవ్వడమైనది.

| | |
|---|---|
| నాగళ్ళు | 35,61,954 |
| నీటిపారుదలకు నీటిపంపులు: | |
| ఆయిల్ ఇంజన్లు | 2,04,989 |
| విద్యుచ్ఛక్తితో పనిచేసేవి | 2,96,368 |
| ట్రాక్టర్లు | 12,594 |
| చెరుకు క్రషర్లు | 39,268 |

మూలం : అర్థగణాంకశాఖ [ఆం. ప్ర.]

వ్యావసాయక రంగంలో ఆంధ్రప్రదేశ్ సర్వతోముఖంగా ముందంజ వేస్తున్నది. ఎన్ని తుఫానులు, వరదలువచ్చినా, దుర్భిక్ష పరిస్థితులుఎదురైనా ప్రభుత్వం వాటినన్నిటినీ ఎదుర్కొని రాష్ట్రంలో ఆహారధాన్యాల ఉత్పత్తిస్థాయిని నిలబెట్టుకొనేందుకు కృషిచేస్తున్నది. 1979-80లో 107 లక్షల టన్నుల ఆహారధాన్యాలు మనరాష్ట్రంలో ఉత్పత్తి అయినట్లు తెలుస్తున్నది. రాష్ట్ర పౌరసరఫరాల కార్పొరేషన్, కేంద్ర ఆహార సంస్థ కొనుగోలుకేంద్రాలద్వారా జరిగే ఆహార ధాన్యాల కొనుగోళ్ళ సందర్భంగా రైతాంగానికి గిట్టుబాటు ధర లభించేటట్లు ప్రభుత్వం

వ్యవసాయ ఉత్పత్తి పెంపుదలను కొనసాగించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎన్నో చర్యలను తీసుకున్నది. వాటిల్లో ముఖ్యమైనవి.

i) ఖరీఫ్, రబీ ఉత్పత్తి కార్యక్రమం : 1979-80 సంవత్సరానికి నిర్ణయించిన ఆహార ధాన్యాల ఉత్పత్తి లక్ష్యం 102.00 లక్షల టన్నులు. వివిధ వ్యవసాయోత్పత్తి కార్యక్రమాలకింద నిర్ణయించిన లక్ష్యాలను సాధించేందుకు అనేక చర్యలుతీసుకోవడమైంది. వ్యవసాయ, శీతోష్ణపరిస్థితులకు తగిన ప్రాధాన్యతనిస్తూ ప్రతి జిల్లాకు కార్యాచరణ ప్రణాళిక తయారు చేయడమైంది.

i) అధికదిగుబడి కార్యక్రమం : 1979-80లో వివిధ పంటల కింద అధిక దిగుబడి రకాలు 27.53 లక్షల హెక్టార్ల మొత్తం విస్తీర్ణంలో సాగుచేయడం జరిగింది. 1980-81 కి నిర్ణయించిన లక్ష్యం 36.86 లక్షల హెక్టార్లు. 1980-81 లో అధిక దిగుబడి రకాల విత్తనాలను సప్లయి చేయడానికి, పంపిణీ చేయడానికి రూ. 2 కోట్ల మొత్తం కేటాయించడం జరిగింది.

iii) ప్రదర్శనలు : ప్రదర్శనలు, ప్రయోగాలు ఏర్పాటు చేసేందుకు వివిధ పరిశోధనా కేంద్రాలను ఆధునిక వ్యవసాయ పద్ధతులు అనుసరిస్తూన్న ప్రగతి శీలమైన కొందరు రైతుల పొలాలను ఇతర రైతులు సందర్శించేందుకు వీలుగా 1879-80 లో 671 ప్రదర్శనలు నిర్వహించబడ్డాయి.

iv) ఉమ్మడి నారుమళ్ళు

v) విత్తనాల మార్పిడి కార్యక్రమం

vi) విత్తనాల ధ్రువీకరణ - మొదలైన చర్యలు కూడా ఉత్పత్తుల పెంపుదలకు దోహదం చేశాయి.

vii) ఎరువుల సరఫరా : 1978-79 లో 6.02 లక్షల టన్నులు 1979-80 లో 5.40 లక్షల టన్నులుఎరువులుసరఫరా చేయడంజరిగింది. 1980-81లో నిర్ణయించిన లక్ష్యం 7.45 లక్షల టన్నులు.

viii) సస్యరక్షణ : వివిధ పంటలకు సస్యరక్షణ కార్యకలాపాలను, విస్తరింప జేయడంలో రాష్ట్రం క్రమంగా ప్రగతి సాధిస్తున్నది. ఈ చర్యలలో నివారక, పరిహారక చర్యలు చేరి ఉన్నాయి. 1979-80 లో సుమారు 99 లక్షల హెక్టార్ల విస్తీర్ణానికి సస్యరక్షణ చర్యలను వర్తింపజేయడం జరిగింది. 1980-81 సంవత్సరానికి నిర్ణయించిన లక్ష్యం 125 లక్షల హెక్టార్లు.

దశలవారీగా జిల్లాలలో రైతు శిక్షణ కేంద్రాల ఏర్పాటు, విత్తనాల క్షేత్రాలలో మేలు రకం విత్తనాల అభివృద్ధి, ప్రయోగశాలల్లో విత్తనాలు, ఎరువులు, చీడల మందుల పరీక్ష వంటి కొన్ని ఇతర కార్య కలాపాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వ్యవసాయశాఖ 1980-81 లో కొనసాగిస్తూంది. ఈ కార్యక్రమాలు అమలు పర్చడంవల్ల 1980-81 లో నిర్ణయించిన ఉత్పత్తి లక్ష్యాలను చేరుకోవచ్చు.

## ఆంధ్రప్రదేశ్ విత్తనాల అభివృద్ధి సంస్థ
## ( A. P. State Seeds Development Corporation )

దీనిని ప్రైవేటు లిమిటెడ్ కంపెనీగా 1976 మార్చిలో నెలకొల్పడం జరిగింది. ఆ తరవాత రూ. 5 కోట్ల అధికృత మూలధనంతో 1976 జూలైలో పబ్లిక్ లిమిటెడ్ కంపెనీగా మార్చడం జరిగింది. అందువల్ల రాష్ట్రంలో అనేక మంది విత్తనం పెంపకందార్లు దానిలో భాగస్వాములు కావడానికి వీలు కలిగింది. 1976-77 లో పోలిస్తే సంస్థ ఉత్పత్తి కార్యక్రమాలు 1977-78 లో 70 శాతం పెరుగుదల, 1977-78 కంటె 1978-79 లో 36 శాతం పెరుగుదల తెలియజేస్తున్నాయి. 1979-80 లో అది 15 శాతం వరకు ఉండవచ్చు. జాతీయ విత్తనాల సంస్థ తణుకు, విజయవాడ, నిజామాబాదులలో నెలకొల్పిన ప్రాసెసింగ్ ప్లాంట్లను ఈసంస్థస్వాధీనం చేసుకొన్నది. దేశంలోని ఎక్కువ ప్రాంతాలలో కనీవినీ ఎరుగని అనావృష్టికి రైతులు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొంటున్నప్పుడు రైతుల సంక్షేమాభి వృద్ధికి అంకితమైన సంస్థగా 1979 లో రబీలో వ్యవసాయశాఖ రూపొందించిన ఆగంతుక ప్రణాళిక కింద రూ 174 లక్షల విలువచేసే ధ్రువీకరించిన మేలైన 2444 క్వింటాళ్ళ జొన్న విత్తనాలను, 822 క్వింటాళ్ల గోధుమ విత్తనాలను, 40,284 క్వింటాళ్ల వేరుసెనగ విత్తనాలను సేకరించి పంపిణీ చేయడంలో ఈ సంస్థ రాష్ట్ర ప్రభుత్వానికీ, వ్యవసాయ శాఖకూ అన్ని విధాలా తోడ్పాటు నందించింది.

# 11
# నీటిపారుదల

మన వ్యవసాయం, పంటలు వర్షాల దయాభిక్షపై ఆధారపడి ఉన్నాయనడంలో అతిశయోక్తి ఏమీలేదు. ఆంధ్రప్రదేశ్‌లో ఒకేకాలం ఒక ప్రాంతంలో అతివృష్టివల్ల వరదలు, మరో ప్రాంతంలో అనావృష్టివల్ల కరువు కాటకాలు ఏర్పడటం జరుగుతూ ఉంది. వరదల వల్ల వ్యావసాయిక ఉత్పత్తులు దెబ్బతినడం, వర్షాలు లేకపోవడంవల్ల అసలు ఉత్పత్తులు లేకపోవడం - అప్పుడప్పుడూ మన వ్యవసాయాభివృద్ధికి గ్రహణం పట్టించటం మనం చూస్తూనే ఉన్నాం. 'భారతదేశపు వ్యవసాయాన్ని వర్షాల జూదంతో పోల్చవచ్చు' అన్నాడొక అర్థశాస్త్రజ్ఞుడు. దేశంలో నీటి వనరుల సౌకర్యాలు పుష్కలంగా ఉంటే వరుణ దేవుని దయాదాక్షిణ్యాలపై ఆధారపడ నక్కరలేదు.

ఆంధ్రప్రదేశ్‌లో 10 వ శతాబ్దం నుంచీ నీటి పారుదల సౌకర్యాలు ఉన్నట్టు చారిత్రకాధారాలు చెబుతున్నాయి. కాకతీయ, విజయనగర రాజులు, కుతుబ్‌షాహీ వంశీయుల కాలాల్లో నీటి పారుదల కల్పనకు కృషి జరిగింది. బ్రిటిష్ వారి హయాంలో కోస్తా ఆంధ్రలో గోదావరి, కృష్ణ, పెన్నా మొదలైన నదులపై ఆనకట్టలు, రాయలసీమలో కర్నూలు, కడప కాలువ, తుంగభద్రా ప్రాజెక్టు మొదలైనవి నిర్మించబడ్డాయి. సర్ ఆర్థర్ కాటన్, సర్ ఛార్లెస్ అలెగ్జాండర్ ఓర్, జాన్ పిన్నిక్ విన్ వంటి బ్రిటిష్ ఇంజనీర్లను చిరకాలం స్మరించవచ్చు.

స్వాతంత్ర్యానికి ముందు మన రాష్ట్రంలో నీటి పారుదల సౌకర్యాల కల్పనకు కొన్ని ఆనకట్టలు నిర్మించడం, చెరువులు తవ్వించడం, తటాకాలను ఏర్పరచడం జరిగింది. అట్లాంటి ముఖ్యమైన ప్రాజెక్టుల వివరాలను కింద ఇవ్వడమైంది.

| ప్రాజెక్టు/చెరువు/కాలవ | ఆయకట్టు తాలూకాలు | ఆయకట్టు విస్తీర్ణం [ఎకరాలు] |
|---|---|---|
| *శ్రీకాకుళం జిల్లా :* | | |
| భైరి ఛానలు | శ్రీకాకుళం | 11,207 |
| పోలకి ఛానలు | నరసన్నపేట | 13,425 |
| నాగావళి [కాలవ] | పార్వతీపురం | 31,425 |
| కాదాడ ఛానలు | శ్రీకాకుళం | 12,049 |

| | | |
|---|---|---|
| *విశాఖపట్నం జిల్లా :* | | |
| కృష్ణంరాజు ఛానలు | అనకాపల్లి | 4,498 |
| రాచకట్టు ఛానలు | చోడవరం | 4,284 |
| *తూర్పుగోదావరిజిల్లా :* | | |
| ఏలేరు కాల్వ | పెద్దాపురం | 90,224 |
| గోదావరి కాల్వ | రామచంద్రపురం, రాజమండ్రి, కాకినాడ, అమలాపురం, రాజోలు, కొత్తపేట | 4,77,955 |
| పోలవరం ప్రాజెక్టు | కాకినాడ | 21,900 |
| *పశ్చిమగోదావరిజిల్లా :* | | |
| గోదావరిడెల్టా కాల్వలు | జిల్లాలోని తాలూకాలు | 4,97,000 |
| *కృష్ణాజిల్లా :* | | |
| కృష్ణాడెల్టా కాల్వలు | విజయవాడ, గుడివాడ కైకలూరు, బందరు దివి, గన్నవరం | 8,49,735 |
| మునేరు ఆనకట్ట | నందిగామ | 27,839 |
| *గుంటూరుజిల్లా :* | | |
| కృష్ణాడెల్టా కాల్వలు | గుంటూరు, తెనాలి, రేపల్లె, బాపట్ల, చీరాల,(ప్రకాశం) | 5,20,813 |
| *ప్రకాశంజిల్లా :* | | |
| మోపాడు రిజర్వాయరు | కనిగిరి | 12,510 |
| కంభం చెరువు | గిద్దలూరు | 12,000 |
| మార్కాపురంచెరువు | మార్కాపురం | 4,040 |
| *నెల్లూరుజిల్లా :* | | |
| పెన్నానదీకాల్వలు | జిల్లాలోని తాలూకాలు | 1,90,000 |
| *రాయలసీమజిల్లాలు :* | | |
| కర్నూలు-కడప కెనాల్ | కడపజిల్లాలోని జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, కడప, కమలాపురం తాలూకాలు,కర్నూలుజిల్లా | 2,78,240 |

**తెలంగాణా జిల్లాలు :**

| | | |
|---|---|---|
| మానేరు ప్రాజెక్టు (కరీంనగర్) | సిరిసిల్ల | 14,000 |
| పాలేరు ప్రాజెక్టు (ఖమ్మం) | ఖమ్మం | 19,650 |
| వైరా ప్రాజెక్టు (ఖమ్మం) | మధిర | 17,400 |
| మహబూబ్‌నహార్ (మెదక్) | మెదక్ | 6,131 |
| డిండి ప్రాజెక్టు (మెహబూబ్‌నగర్) | దేవరకొండ | 13,000 |
| ఆసిఫ్‌నహార్ (నల్గొండ) | రామన్నపేట | 12,500 |
| నిజాంసాగర్ (నిజామాబాద్) | బోధన్, బనస్వాడ, నిజామాబాద్, ఆర్మూరు | 2,31,403 |
| పోచారం ప్రాజెక్టు (నిజామాబాద్) | ఎల్లారెడ్డి | 9,060 |
| రామప్పచెరువు (వరంగల్) | ములుగు | 3,850 |
| లక్కవరంచెరువు (వరంగల్) | ములుగు | 4,983 |
| పాకాల (వరంగల్) | నరసంపేట | 10,500 |

Source : Perspective plans for Coastal Andhra, Rayalaseema and Telengana, Planning & Co. operative Dept., Govt. of A. P.

1956 లో ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత మన రాష్ట్రంతో వ్యవసాయాభివృద్ధికి నీటి పారుదల సౌకర్యాలను కల్పించే నిమిత్తం వివిధ ప్రణాళికల కింద ఎన్నో కోట్ల రూపాయలను వెచ్చించి, భారీ, మధ్యతరహా ప్రాజెక్టులను కొన్నింటిని పూర్తిచేసే నీటి పారుదలశక్తి కొన్ని వేల హెక్టార్లకు పొడిగించడం జరిగింది. నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు, గోదావరి బరాజ్, తుంగభద్రా ప్రాజెక్టు, సోమశిల ప్రాజెక్టు మొదలైనవి ముఖ్యమైనవి. నీటి పారుదల అభివృద్ధి నిమిత్తం వివిధ చిన్న, మధ్య, భారీ తరహా ప్రాజెక్టులకు మన రాష్ట్ర ప్రణాళికలలో ఖర్చుపెట్టిన మొత్తాలను కింద పేర్కొనడమైంది.

| ప్రణాళిక | వ్యయం (కోట్ల రూపాయలలో) |
|---|---|
| మొదటి ప్రణాళిక | 21-86 |
| రెండో ప్రణాళిక | 57-44 |
| మూడో ప్రణాళిక | 93-02 |
| 3 వార్షిక ప్రణాళికలు (1966-69) | 59-36 |
| నాలుగో ప్రణాళిక | 98-99 |
| అయిదో ప్రణాళిక | 191-25 |

నీటి పారుదల మార్గాలు ప్రధానంగా రెండు విధాలుగా విభజించ వచ్చు.

i) భూ ఉపరితల జల మార్గాలు (Surface Water)

ii) భూగర్భ జల మార్గాలు (Ground Water)

భూ ఉపరితల జలమార్గాలంటే ప్రవహిస్తున్న నదుల నుంచి, రిజర్వాయర్ల నుంచి, చెరువుల నుంచి పొలాలకు నీటిని అందజేయడం. ఇట్లాంటి మార్గాలద్వారా 60 శాతం నీరు పొలాలకు లభిస్తుందని అంచనా. బావులు, గొట్టపు బావులు మొదలైన వాటిని డ్రిల్లింగ్ ద్వారా తవ్వి, నీరును పొలాలకు సప్లయ్ చేసే పద్ధతులను భూగర్భ జలమార్గాలుగా పేర్కొంటారు. ఇది చాల ఖర్చుతో కూడుకున్నది. భూగర్భ జలాల వినియోగం ద్వారా మన రాష్ట్రంలో 1.8 మిలియన్ హెక్టారులకు నీటి సరఫరా చేయగల అవకాశాలున్నట్లు నీటి పారుదల సంఘం (1972) తన నివేదికలో తెలియజేసింది. భూ ఉపరితల జల మార్గాల ద్వారా 8.5 మిలియన్ హెక్టార్లకు నీటిపారుదల కలిగించే అవకాశముందని పై సంఘం పేర్కొంది. నీటి పారుదల పెంపుదల విషయంలో మన దేశంలో ఉత్తరప్రదేశ్ తర్వాత మన రాష్ట్రం ద్వితీయస్థానాన్ని ఆక్రమిస్తుంది.

వివిధ జలమార్గాల ద్వారా మన రాష్ట్రంలో 1977-78 సంవత్సరాంతానికి నీటి పారుదల కింద ఉన్న నికర విస్తీర్ణాన్ని కింద యివ్వడమైంది.

| | (హెక్టార్లలో) |
|---|---|
| కాలువలు | 16,42,572 |
| చెరువులు | 9,11,724 |
| గొట్టపుబావులు | 1,27,642 |
| ఇతరబావులు | 5,67,976 |
| ఇతరఆధారాలు | 1,09,247 |
| మొత్తం | 33,59,161 |

మూలం : అర్థగణాంకశాఖ, (ఆం. ప్ర.)

పైన పేర్కొన్న నీటిపారుదల నికర విస్తీర్ణాన్ని కింది పట్టిక ద్వారా ఆంధ్రప్రదేశ్‌లో ఏజిల్లాలో, ఏప్రాంతంలో ఎంతో తెలుసుకోవచ్చు.

| జిల్లాలు | 1977-78 విస్తీర్ణం (హెక్టార్లలో) |
|---|---|
| శ్రీకాకుళం | 2,33,406 |
| విశాఖపట్నం | 1,57,395 |
| తూర్పుగోదావరి | 2,57,437 |
| పశ్చిమగోదావరి | 3,13,978 |

| | |
|---|---|
| కృష్ణ | 3,32,024 |
| గుంటూరు | 3,04,593 |
| ప్రకాశం | 1,49,707 |
| నెల్లూరు | 2,19,941 |
| కోస్తా ఆంధ్ర | 19,68,481 |
| కర్నూలు | 1,05,680 |
| అనంతపూర్ | 1,34,692 |
| కడప | 1,19,255 |
| చిత్తూరు | 1,59,679 |
| రాయలసీమ | 5,19,306 |
| హైదరాబాద్ | 41,656 |
| నిజామాబాద్ | 1,37,536 |
| మెదక్ | 92,323 |
| మెహబూబ్‌నగర్ | 1,11,932 |
| నల్గొండ | 1,60,228 |
| వరంగల్ | 97,855 |
| ఖమ్మం | 68,688 |
| కరీంనగర్ | 1,23,025 |
| ఆదిలాబాద్ | 38,131 |
| తెలంగాణా | 8,71,374 |
| ఆంధ్రప్రదేశ్ | 33,59,161 |

మూలం : అర్థగణాంకశాఖ, (ఆం. ప్ర.)

ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత నికర నీటి పారుదల భూమి విస్తీర్ణం వివిధ ప్రాజెక్టుల ద్వారా గణనీయమైన అభివృద్ధిని సాధించిందని చెప్పవచ్చు. 1956-57 లో ఈ భూమి విస్తీర్ణం 28.6 లక్షల హెక్టార్లు ఉండేది. ఇది 1977-78 నాటికి 33.6 లక్షల హెక్టార్లకు పెరిగింది. ఒక సారికి మించి నీటి పారుదల చేత సాగవుతూన్న భూమి 1955-56 లో 5.27 లక్షల హెక్టార్లుఉండేది. ఇది 1977-78 లో 10.2 లక్షల హెక్టార్లకు పెరిగింది. రాష్ట్రంలోని మూడు ప్రాంతాలలో నీటి అభివృద్ధి తీరుతెన్నులను పరిశీలిస్తే ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి ఎన్నో తేడాలు గోచరిస్తాయి.

**మూడు ప్రాంతాలలో నీటి పారుదల వివరాలు**

| ప్రాంతం | మొత్తం వ్యవసాయ భూమిలో నీటిపారుదల గలిగిన స్థూల భూమి శాతం | |
|---|---|---|
| | 1956-57 | 1977-78 |
| కోస్తా ఆంధ్ర | 46.2 | 53.4 |
| రాయలసీమ | 16.3 | 28.8 |

నీటి పారుదల మార్గాలను ప్రధానంగా రెండు విధాలుగా విభజించవచ్చు.

i) భూ ఉపరితల జల మార్గాలు (Surface Water)

ii) భూగర్భ జల మార్గాలు (Ground Water)

భూ ఉపరితల జలమార్గాలంటే ప్రవహిస్తున్న నదుల నుంచి, రిజర్వాయర్ల నుంచి, చెరువుల నుంచి పొలాలకు నీటిని అందజేయడం. ఇట్లాంటి మార్గాలద్వారా 60 శాతం నీరు పొలాలకు లభిస్తుందని అంచనా. బావులు, గొట్టపు బావులు మొదలైన వాటిని డ్రిల్లింగ్ ద్వారా తవ్వి, నీరును పొలాలకు సప్లయ్ చేసే పద్ధతులను భూగర్భ జలమార్గాలుగా పేర్కొంటారు. ఇది చాల ఖర్చుతో కూడుకున్నది. భూగర్భ జలాల వినియోగం ద్వారా మన రాష్ట్రంలో 1.8 మిలియన్ హెక్టారులకు నీటి సరఫరా చేయగల అవకాశాలున్నట్లు నీటి పారుదల సంఘం (1972) తన నివేదికలో తెలియజేసింది. భూ ఉపరితల జల మార్గాల ద్వారా 8.5 మిలియన్ హెక్టార్లకు నీటిపారుదల కలిగించే అవకాశముందని పై సంఘం పేర్కొంది. నీటి పారుదల పెంపుదల విషయంలో మన దేశంలో ఉత్తరప్రదేశ్ తర్వాత మన రాష్ట్రం ద్వితీయస్థానాన్ని ఆక్రమిస్తుంది.

వివిధ జలమార్గాల ద్వారా మన రాష్ట్రంలో 1977-78 సంవత్సరాంతానికి నీటి పారుదల కింద ఉన్న నికర విస్తీర్ణాన్ని కింద యివ్వడమైంది.

| | (హెక్టార్లలో) |
|---|---|
| కాలువలు | 16,42,572 |
| చెరువులు | 9,11,724 |
| గొట్టపుబావులు | 1,27,642 |
| ఇతరబావులు | 5,67,976 |
| ఇతరఆధారాలు | 1,09,247 |
| మొత్తం | 33,59,161 |

మూలం : అర్థగణాంకశాఖ, (ఆం. ప్ర.)

పైన పేర్కొన్న నీటిపారుదల నికర విస్తీర్ణాన్ని కింది పట్టిక ద్వారా ఆంధ్రప్రదేశ్‌లో ఏజిల్లాలో, ఏప్రాంతంలో ఎంతో తెలుసుకోవచ్చు.

| జిల్లాలు | 1977-78 విస్తీర్ణం (హెక్టార్లలో) |
|---|---|
| శ్రీకాకుళం | 2,33,406 |
| విశాఖపట్నం | 1,57,395 |
| తూర్పుగోదావరి | 2,57,437 |
| పశ్చిమగోదావరి | 3,13,978 |

| వివరాలు | ప్రాంతము స్థలం/తాలూకా |
|---|---|
| గోదావరి బారేజ్ | ప. గోదావరి |
| తుంగభద్రప్రాజెక్టు ఎగువకాల్వ(రెండోదశ) | అనంతపూర్-ఉరవకొండ,గుత్తితాలూకాలు |
| పోచంపాడు ప్రాజెక్టు | నిజామాబాద్-ఆర్మూర్ |
| నిజాంసాగరు ప్రాజెక్టు (మరమ్మతులు-అభివృద్ధి) | నిజామాబాద్ జిల్లా |
| కృష్ణా, గోదావరి డెల్టా డ్రైనేజి స్కీములు | |
| మూసీ ప్రాజెక్టు | నల్గొండ/సూర్యాపేట |
| స్వర్ణ ప్రాజెక్టు | ఆదిలాబాద్ - నిర్మల్ |
| తాండవ రిజర్వాయరు | విశాఖ - నర్సీపట్నం |
| గాజులదిన్నె ప్రాజెక్టు | కర్నూలు |
| ఊకచెట్టివాగు ప్రాజెక్టు | మహబూబ్‌నగర్ - వనపర్తి |
| పులివెందుల కాల్వ పథకం | కడప - పులివెందుల |
| కోటిపల్లివాగు ప్రాజెక్టు | వికారాబాద్ |
| శారదానదిపై రిజర్వాయరు | విశాఖ/రాయివాడ |
| పెద్దవాగుపై రిజర్వాయరు | ఖమ్మం |
| గండిపాలెం రిజర్వాయరు | నెల్లూరు/ఉదయగిరి తాలూకా |
| చెయ్యేరు రిజర్వాయరు | కడప/రాజంపేట |
| లావణ్య నదిపై రిజర్వాయరు | చిత్తూరు/పుత్తూరు |

ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న కొన్ని ముఖ్యమైన ప్రాజెక్టుల గురించి సంగ్రహంగా వివరించడమైంది.

*నాగర్జునసాగర్ ప్రాజెక్టు :* ఇది మనరాష్ట్రంలో ప్రధానమైన బహుళార్థసాధకప్రాజెక్టు దీనిని కృష్ణానదిపై నల్గొండజిల్లా నందికొండవద్ద నిర్మించడం జరిగింది. ప్రపంచంలోని రాతి డామ్‌లలో దీనిని ప్రముఖంగా పేర్కొనవచ్చు. రాతి డామ్ ఎత్తు 125 మీటర్లు. జలాశయం విస్తీర్ణం 289 చ. కి. మీ. లాల్‌బహదూర్ కాలవ, జవహర్ కాలవ అని రెండు కాలవలు ఉన్నాయి. ఈ ప్రాజెక్టు కింద 8.8 లక్షల హెక్టార్లకు నీటిపారుదల సౌకర్యం కలిగించే అవకాశముంది. ఈ ప్రాజెక్టుమీద 1979 నాటికి 315 కోట్ల రూపాయలను ఖర్చుపెట్టడం జరిగింది. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి ప్రపంచ బ్యాంకు కూడా ఆర్థిక సహాయాన్ని అందిస్తున్నది.

*తుంగభద్ర ప్రాజెక్టు :* ఈ ప్రాజెక్ట్ కర్ణాటక, ఆంధ్ర రాష్ట్రాల ఉమ్మడి ప్రాజెక్టు. దీనికి దిగువ కాలువ, ఎగువ కాలువలున్నాయి. దిగువ కాలువ కర్నూలు జిల్లాలో ఉన్నది. కర్నూలు జిల్లాలో 196 కి. మీ. మేరకు ప్రవహించి 60,000 హెక్టార్ల భూమి సాగుదలకు ఉపయోగపడుతున్నది. ఎగువ కాలువ కింద రెండు దశలలో దాదాపు ఒక లక్ష హెక్టార్ల భూమిని నీటి

పారుదల కిందకు తేవాలని ఈ పథకం లక్ష్యం. ఈపథకం కింద తాడిపత్రికాలువ, గుంటకల్ బ్రాంచి కాలువ, గుత్తి బ్రాంచికాలువల పని పూర్తయింది. మైలవరం రిజర్వాయరు, చిత్రావతి నదిపై ఆనకట్ట, పులివెందల కాలువ నిర్మాణం దశలో ఉన్నాయి. ఈ ప్రాజెక్టుపై ఇంత వరకు దాదాపు 23 కోట్ల రూపాయలు ఖర్చుచేయడం జరిగింది.

***పోచంపాడు ప్రాజెక్టు :*** ఈ ప్రాజెక్టుకు 1963 లో ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ శంకుస్థాపన చేశారు. అయితే ఈ ప్రాజెక్టు నిర్మాణాన్ని కొన్ని కారణాలవల్ల ఆలస్యంగా చేపట్టడం జరిగింది. నిజామాబాద్ జిల్లాలో సోన్ వంతెనకు 5 కి. మీ. దూరంలో పోచంపాడు గ్రామం వద్ద గోదావరినదిపై ఆనకట్ట నిర్మిస్తున్నారు. ఆనకట్ట పొడవు 12134 మీటర్లు. పునాదిపై ఎత్తు 41 మీటర్లు. కుడివైపున 109 కి. మీ. పొడవున కాలువను నిర్మించి దాని మూలంగా కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్, వరంగల్, ఖమ్మం, నల్గొండ జిల్లాలలో 6.1 లక్షల హెక్టార్ల భూమిని సాగులోకి తేవాలని ఉద్దేశము. ఎడమ కాలువద్వారా ఆదిలాబాద్ జిల్లాలో నీటి పారుదల సౌకర్యాలు కలిగించడంతో పాటు కడెం రిజర్వాయరులోకి అదనంగా నీరు పంపటానికి ఉద్దేశించబడింది. కొన్ని అభివృద్ధి కార్యక్రమాలను ప్రతిపాదించడం వల్ల రెండు దశలలో ఈ ప్రాజెక్టుపై దాదాపు రూ. 500 కోట్లు ఖర్చు కాగలదని అంచనా. దీని పేరును ఈమధ్య శ్రీరాంసాగర్‌గాను దీని కాలువల పేర్లను సరస్వతి, లక్ష్మి గానూ మార్చడం జరిగింది. ఈ ప్రాజెక్టుకు ప్రపంచబాంకు ఆర్థిక సహాయం లభిస్తున్నది.

***సోమశిల ప్రాజెక్టు :*** నెల్లూరు జిల్లాకు ఈ ప్రాజెక్టు వరప్రసాదం. పెన్నానదిపై ఆత్మకూరు తాలూకా సోమశిలవద్ద ఈ ప్రాజెక్టు నిర్మాణం జరుగుతున్నది. ఈ ప్రాజెక్టు నిర్మాణం రెండు దశలలో పూర్తవుతుంది. ఈ ప్రాజెక్టు ఖర్చు రూ. 40 కోట్ల రూపాయలని అంచనా. 1978 మార్చినాటికి రూ. 8 1/2 కోట్లు దీనిపై వెచ్చించడం జరిగింది. ఆనకట్టగోడ కట్టడంలో కాలువ తవ్వకంలో హెచ్చుశాతం పని పూర్తయింది. ఈ ప్రాజెక్టు ద్వారా మొత్తంమీద రెండు లక్షల హెక్టార్ల భూమికి నీరు సప్లై కాగలదు.

***నిజాంసాగర్ ప్రాజెక్టు :*** నిజామాబాదు జిల్లా అచ్చంపేట దగ్గిర మంజీరా నదిపై ఈ ప్రాజెక్టు నిర్మించారు. మంజీరానదిలో కొట్టుకువచ్చే పూడికవల్ల ఈ నది నిలవశక్తి 25 శతకోటి క్యూసెక్కుల నుంచి 12 శతకోటి క్యూసెక్కులకు తగ్గిపోయింది. దీని నీటి నిలవశక్తి పునరుద్ధరించడానికి ఈ ప్రాజెక్టును రిమోడలింగ్ చేయడం జరుగుతోంది. దీనికి 15 కోట్ల రూపాయల వ్యయం అంచనా. మంజీరా ఎగువన సింగూరు వద్ద మరొక ప్రాజెక్టు కట్టడంవల్ల అదనపు నీరును నిల్వచేసే అవకాశం ఏర్పడింది. సింగూరు ప్రాజెక్టువల్ల నిజాంసాగరు జలాశయం పూడిపోదు. అంతే కాకుండా హైదరాబాదు నగరానికి మంచినీటి సప్లయ్ జరుగుతుంది.

***వంశధార ప్రాజెక్టు :*** ఈప్రాజెక్టు వల్ల శ్రీకాకుళం జిల్లాప్రజలు లాభాన్ని పొందుతారు. హీరమండలం గ్రామానికి ఉత్తరంగా 5 కి. మీ. దూరంలో నిర్మించబడుతున్న ఈప్రాజెక్టును రెండు దశలలో పూర్తిచేస్తారు. ఈ ప్రాజెక్టువల్ల దాదాపు 1.6 లక్షల హెక్టార్ల ఆయకట్టుకు నీరులభిస్తుంది. 1978 డిసెంబరు నాటికి దీనివ్యయం రూ. 15 కోట్లు అయింది.

## చిన్న, మధ్యతరహా సేద్యపు నీటి పారుదల

చిన్న, మధ్యతరహా నీటిపారుదల పథకాలవల్ల వెనుకబడిన ప్రాంతాలకు గ్రామీణప్రాంతాలకు ఎన్నో లాభాలున్నాయి. మొదటి పంచవర్ష ప్రణాళిక నుంచి మధ్య తరహా ప్రాజెక్టులను చేపట్టగా 5 వ ప్రణాళికాంతానికి 40 మధ్య తరహా ప్రాజెక్టులు పూర్తయినాయి. మధ్య తరహా నీటి పారుదల ప్రాజెక్టువల్ల 1978 సంవత్సరానికి 40550 హెక్టార్లకు నీరు సరఫరా చేసే అవకాశం కలిగింది. మిగిలిపోయిన ప్రాజెక్టులు పూర్తయితే అదనంగా 5000 హెక్టార్లకు నీటి పారుదల సౌకర్యాలు కలుగుతాయి. చిన్న తరహా నీటి పారుదల పథకాల నిమిత్తం మొదటి పంచవర్ష ప్రణాళికలో రాష్ట్ర ప్రభుత్వం రూ. 35 2 లక్షలు ఖర్చు పెట్టింది. ఈ వ్యయం ఐదో ప్రణాళికా కాలానికి రూ. 3770.8 లక్షలకు పెరిగింది. చిన్న తరహా నీటి పారుదల పథకాలవల్ల 1979 మార్చి నాటికి 78.144 హెక్టార్లకు అదనంగా నీటిపారుదల సౌకర్యాలేర్పడినాయి.

1978-1983 కాలానికి చిన్న, మధ్యతరహా నీటి పారుదల సౌకర్యాల కల్పనకు మన రాష్ట్ర ప్రభుత్వము భావి వ్యూహాన్ని రూపొందించింది. ఆ వ్యూహం ప్రకారం కొనసాగుతున్న మధ్య తరహా (31) ప్రాజెక్టులకు 92 కోట్ల రూపాయలు కొత్త మధ్య తరహా (23) ప్రాజెక్టులకు 84 కోట్ల రూపాయలను కేటాయించినారు.

మన రాష్ట్రంలో చిన్న తరహా నీటి పారుదల సౌకర్యాలవల్ల 20.2 లక్షల హెక్టార్లకు ఉపరితల నీటిపారుదల సౌకర్యాలు 22 లక్షల హెక్టార్లకు భూగర్భ జల నీటిపారుదల సౌకర్యాలు కలుగుతున్నాయని అంచనాలవల్ల తెలుస్తున్నది. చిన్న తరహా నీటిపారుదల పథకాలకు మన రాష్ట్ర ప్రభుత్వం 1951-1978 ప్రణాళికల కాలంలో రూ. 100 కోట్లు వెచ్చించినట్లు తెలుస్తున్నది. అందులో 5 వ ప్రణాళికలో కేటాయించినది రూ. 16 కోట్లు. 1978-83 కాలానికి రూ. 95 కోట్లను చిన్నతరహా నీటిపారుదల పథకాలను కేటాయించడం జరిగింది. ఇందులో ప్రజాపనుల శాఖకు ( P.W.D. ) రు. 53 కోట్లు, మిగతామొత్తాన్ని పంచాయతీ రాజ్, ఇరిగేషన్ డెవలెప్ మెంట్ కార్పొరేషన్ భూగర్భజలశాఖ వారికి కేటాయించటమైంది. పైకేటాయింపువల్ల 1983 నాటికి 51000 హెక్టార్ల మేరకు నీటి పారుదల సౌకర్యాలు కల్పించ బడతాయని భావించడమైనది.

## నీటిపారుదల పద్ధతుల మెయింటెనెన్స్

రాష్ట్రంలో నీటిపారుదల పద్ధతులను మెయింటెనెన్స్ చేయడంలో ఎన్నో సమస్యలు, యిబ్బందులు ఏర్పడుతున్నాయి. మెయింటెనెన్స్‌కు తగిన నిధులను కేటాయించ పోవడం ఒక సమస్యగా పరిణమించింది. 1974-75 వరకు మెయింటెనెన్స్ గ్రాంటు ఒక్కొక్క హెక్టార్లుకు రూ. 10/-లుగా కేటాయించేవారు. ఈ మొత్తాన్ని 1974-75 లో రూ. 15/-లకు పెంచారు. ఈ మొత్తాన్ని 1976-77 లో రూ. 22.50 పై లకు, 1977-78 లో రూ. 25/-లుగా చేయడమైనది. ఐతే 1977 నవంబరులో ఢిల్లీలో జరిగిన నీటి పారుదల రాష్ట్ర మంత్రుల సమావేశంలో ఈ విషయం చర్చకు వచ్చింది. ఆ సమావేశం మెయింటెనెన్స్ వ్యయాన్ని హెక్టారుకు రూ. 50/-ల దాకా పెంచవచ్చునని సిఫార్సు చేసింది. ఆ రూ. 50/-ల మెయింటెనెన్స్

వ్యయంలో స్థాపన ఖర్చులకు రూ. 10/-లు, యంత్రాలు, పరికరాలు నిమిత్తం రూ. 2-50పై మెయిన్ కెనాల్, బ్రాంచి కెనాల్స్‌కు రూ. 8-75 పై, పంటకాలువలకు రూ 26-25 పై, ఖననాలకు రూ. 2-50 పైసలుగా పరిగణించడమైనది.

## కమాండ్ ఏరియా అభివృద్ధి

(A) కమాండ్ ఏరియా అభివృద్ధి శాఖను 1974 ఆగష్టులో ప్రారంభించారు. ఈ శాఖ ప్రధానోద్దేశాలు, కల్పించిన నీటి పారుదల సౌకర్యాలకు, వాస్తవంగా ఉపయోగించే నీటి పారుదల సౌకర్యాలకు మధ్యగల అగాధాన్ని పూడ్చడం.

(B) భూమి అభివృద్ధికి, విస్తరణ సేవలకు సాంకేతిక మార్గ దర్శకత్వాన్ని అందించడం ద్వారా వ్యవసాయపు ఉత్పత్తులను పెంపొందించడం.

వ్యవసాయాన్ని ఆధునీకీకరణ చేయడానికి సాంద్ర క్షేత్ర అభివృద్ధికి నాలుగు కమాండ్ ఏరియాలను ఎంపిక చేసినారు. అవి నాగార్జున సాగర్ కుడి కాలవ, నాగార్జున సాగర్ ఎడమ కాలవ, పోచంపాడు ప్రాజెక్టు, తుంగభద్ర ప్రాజెక్టులను ఎన్నిక చేశారు. అయిదో ప్రణాళికా కాలంలో కమాండ్ ఏరియా అభివృద్ధి కార్యక్రమం కింద 666.34 లక్షల రూపాయలను ఖర్చు చేయడం జరిగింది. దీనివల్ల 3.81 లక్షల హెక్టార్ల భూమిని సాంద్ర వ్యవసాయ విస్తరణ కార్యక్రమం కింద తీసుకురావడం జరిగింది. 310 కి. మీ. మేరకు ఆయకట్టు రోడ్లను నిర్మించడమైనది. 35,000 హెక్టార్ల భూమిని క్రమమైన పద్ధతిలో అభివృద్ధి చేయడం జరిగింది.

### 1977-78 సంవత్సరాంతానికి నీటిపారుదల పథకాలు సాధించిన ఫలితాల పట్టిక

| ప్రాజెక్టులు | మొత్తం ఖర్చు కోట్ల రూ. లలో | 1977-78 అంతానికి ఖర్చు కోట్ల రూ. లలో | నీటి పారుదల సౌకర్యాల కల్పనశక్తి (000 హెక్టార్లలో) | 77-78 అంతానికి సమకూర్చిన నీటి పారుదల సౌకర్యాలు (000 హెక్టార్లలో) |
|---|---|---|---|---|
| 1 కె. సి. కెనాలు | 15.86 | 15.86 | 120.80 | 120.80 |
| 2 టి. బి. పి. ఎల్. ఎల్. సి. | 13.51 | 13.51 | 59.20 | 59.20 |
| 3 టి. బి.పి. హెచ్. ఎల్.సి. స్టేజిI | 20.04 | 20.04 | 45.02 | 45.02 |
| 4 కడం | 16.44 | 16.44 | 26.00 | 23.43 |
| (1 నుండి 4 వరకు) మొత్తం | 65.85 | 65.85 | 251.02 | 248.45 |
| నిర్మాణం కొనసాగుతున్న ప్రాజెక్టులు | | | | |
| 5 నాగార్జునసాగర్ | 434.46 | 270.04 | 867.38 | 505.95 |
| 6 పోచంపాడు స్టేజి-I | 308.00 | 129.60 | 267.03 | 103.24 |
| 7 [illegible] | 32.91 | 60.00 | స్థిరీకరణ | |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 8 వంశధార స్టేజి-I | 28,51 | 13.14 | 59.99 | 3.20 |
| 9 టి.బి.పి.హెచ్.ఎల్.సి. స్టేజి-II | 29.93 | 22.99 | 49.76 | 28.17 |
| 10 నిజాం సాగర్ అభివృద్ధి కార్యక్రమాలు | 12.84 | 7.88 | స్థిరీకరణ | |
| 11 సోమశిల స్టేజి-I | 32.90 | 8.50 | 115.19 | |
| 12 వంశధార స్టేజి-II | 75.14 | 0.31 | 48.60 | — |
| మొత్తం(5 నుండి 12వరకు) | 981.78 | 485.87 | 1407.95 | 640.66 |
| మొత్తం(1 నుండి 12వరకు) | 1047.63 | 551.22 | 1658.97 | 889.11 |
| మీడియమ్ ప్రాజెక్ట్లు | | | | |
| 13 పూర్తయిన పథకాలు(40) | 60.03 | 55.06 | 183.74 | 177.67 |
| 14 కొనసాగుతున్న పథకాలు(31) | 140.48 | 48.17 | 243.17 | 46.22 |
| మొత్తం(13 నుండి 14 వరకు) | 200.51 | 103.23 | 426.91 | 223.89 |
| మేజరు,మీడియమ్ ప్రాజెక్ట్ల మొత్తం (డ్రైనేజి, కొత్తప్రాజెక్ట్ల అన్వేషణ వగైరా కలిపి | 1248.14 | 654.45 | 2085.88 | 1113.00 |

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నీటి పారుదల అభివృద్ధి సంస్థ
## (A. P. Irrigation Development Corporation)

ఇది రాష్ట్రప్రభుత్వ సంస్థగా 1974 లో స్థాపితమైంది. దీని అధికృత మూల ధనం రూ. 10 కోట్లు. ఈసంస్థ యిప్పటివరకు 7.79 కోట్లరూపాయలవిలువగల 61 లిఫ్ట్ యిరిగేషన్ పథకాలను చేపట్టింది. తత్ఫలితంగా 25,443 హెక్టార్ల భూమి నీటిపారుదలకు అవకాశము లభించింది. ఖమ్మం, పశ్చిమ గోదావరి, నెల్లూరు జిల్లాలలో 110 వ్యవసాయపు గొట్టపు బావులను నెలకొల్పే కార్యక్రమాన్ని స్వీకరించింది. ఈ సంస్థ యింతవరకు 795 గొట్టపు బావులను తవ్వించింది. ఈ సంస్థ భవిష్యత్తు కార్యక్రమాలలో 218 లిఫ్ట్ యిరిగేషన్ పథకాలను అమలు పరచడం, 1,800 గొట్టపు బావులను తవ్వించడం ముఖ్యమైనవి. ఈ కార్యక్రమాలు 1983 నాటికి పూర్తి కాగలవని అంచనా. ఇందుకు రూ. 81 కోట్ల రూపాయలు ఖర్చు కాగలవని అంచనా.

# 12

# విద్యుచ్ఛక్తి

మన రాష్ట్రంలో జలసంపద, ఖనిజసంపద తగినంత ఉన్నాయి. అయితే తద్వారా రాష్ట్రానికవసరమైన విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయలేక పోతున్నాము. తత్ఫలితంగా మన రాష్ట్రం పారిశ్రామికంగా అంతగా ముందంజ వేయలేదని చెప్పవచ్చు.

ఆంధ్రప్రదేశ్‌లో మొట్ట మొదటి విద్యుత్ కేంద్రాన్ని హైదరాబాదులో హుస్సేన్‌సాగర్ వద్ద 1923 సం॥లో నెలకొల్పడం జరిగింది. రెండో థెర్మల్ స్టేషన్‌ను విశాఖపట్నంలో 1930 లో నెలకొల్పారు. 3వ కేంద్రాన్ని విజయవాడలో 1939 లో స్థాపించారు. 4వ థెర్మల్ స్టేషన్‌ను నెల్లూరు దగ్గర 1950 లో ప్రారంభించారు.

1951 లో పంచవర్ష ప్రణాళికలు ప్రారంభమైన దగ్గర నుండి విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు రాష్ట్రంలో కొన్ని కేంద్రాలను, ప్రాజెక్టులను, పథకాలను రాష్ట్ర ప్రభుత్వం చేపట్టింది. 1951 ప్రారంభం నాటికి రాష్ట్రంలో మొత్తం మీద విద్యు దుత్పాదక శక్తి 43.1 మెగా వాట్లు ఉంది. అది 1979 మార్చినాటికి 1677.9 మెగా వాట్లకు పెరిగింది. దీనిని బట్టి విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో ఆంధ్రప్రదేశ్ ఎంత ప్రగతిని సాధించిందో సులభంగా అర్థం చేసుకోవచ్చు. ట్రాన్సిమిషన్, డిస్ట్రిబ్యూషన్‌లైన్స్‌లో కూడా అమితమైనఅభివృద్ధి కనబడుతూన్నది. ఆంధ్ర ప్రదేశ్ అవతరణ నాటికి విద్యుచ్ఛక్తి వినిమయ దార్లు 1.49 లక్షల మంది ఉండేవారు. ఈ సంఖ్య 1979 మార్చి నాటికి 19.4 లక్షలకు చేరుకొన్నట్లు తెలియవస్తూన్నది. 1956-57లో విద్యుచ్ఛక్తి సౌకర్యం కలిగిన పట్టణాలు, గ్రామాలు ఆంధ్రప్రదేశ్‌లో 680 మాత్రమేఉండేవి 1979 మార్చి నాటికి ఈ సంఖ్య 15,677 కు చేరుకొన్నట్లు సమాచారం అందింది. ఆంధ్ర ప్రదేశ్ అవతరణ కాలంలో విద్యుచ్ఛక్తి నుంచి సాలు సరి ఆదాయం 2.48 కోట్ల రూపాయలుండగా, 1979 మార్చినాటికి సాలుసరి ఆదాయం 146.6 కోట్లు ఉంది. తలసరి విద్యుత్ వినియోగం 1956 లో 7 KMH ఉండగా 1979 మార్చినాటికి 82 KMH ఇన్నట్లుగా అంచనా వేయడంజరిగింది. ఈ సంఖ్యలు సత్యాలనుపరిశీలిస్తే గతపాతికసంవత్సరాలలో మన రాష్ట్రంలో విద్యుచ్ఛక్తిఅభివృద్ధి త్వరగా జరిగినట్లు చెప్పవచ్చు.

**ప్రణాళికల పెట్టుబడులు**

ఆంధ్రప్రదేశ్‌లో విద్యుచ్ఛక్తి అభివృద్ధి కోసం వివిధ పంచవర్ష ప్రణాళికలలో కింది విధంగా ఖర్చు చేయడం జరిగింది.

| ప్రణాళిక | వ్యయం (కోట్ల రూపాయలలో) | మొత్తం ప్రణాళికావ్యయంలో శాతం |
|---|---|---|
| మొదటిప్రణాళిక | 37.84 | 39.1% |
| రెండవ ప్రణాళిక | 38.53 | 28.4% |
| తృతీయ ప్రణాళిక | 93.62 | 26.6% |
| మూడు వార్షిక ప్రణాళికలు | 97.96 | 41.8% |
| నాలుగో ప్రణాళిక | 197.00 | 37% |
| అయిదవ ప్రణాళిక | 413.35 | 39% |

కింద యిచ్చిన పట్టికలద్వారా ఆంధ్రప్రదేశ్‌లో విద్యుచ్ఛక్తి, స్థాపిత శక్తిని, యితర అంశాలను గమనించవచ్చు.

| పవర్‌స్టేషన్ పేరు | 31-3-1978 నాటికి స్థాపితశక్తి (మెగావాట్లు) |
|---|---|
| ***జలవిద్యుత్ పవర్ స్టేషను*** | |
| 1) మాచ్ ఖండ్ | 80.3 |
| 2) తుంగభద్రడామ్; హంపి | 57.6 |
| 3) ఎగువసీలేరు | 120 |
| 4) నిజామ్‌సాగర్ | 10 |
| 5) దిగువసీలేరు | 345 |
| 6) నాగార్జునసాగర్ | 110 |
| | 722.9 |
| ***థెర్మల్ అండ్ గ్యాస్ పవర్ స్టేషనులు*** | |
| 1) హుస్సేన్‌సాగర్ | 10.0 |
| 2) రామగుండం [స్టేషన్ A] | 31.5 |
| 3) రామగుండం [స్టేషన్ B] | 62.5 |
| 4) నెల్లూరు | 30.0 |
| 5) కొత్తగూడెం (స్టేషన్ A) | 240.0 |
| 6) కొత్తగూడెం [స్టేషన్ B] | 220.0 |
| 7) కొత్తగూడెం నాలుగోదశ | 220.0 |
| గాస్ టర్బోసెట్స్ హైదరాబాద్ | 20.0 |
| మొత్తం | 840.0 |
| మొత్తం స్థాపిత శక్తి | 1562.9 |

మూలం : ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎలక్ట్రిసిటీబోర్డు

1979 మార్చి నాటికి స్థాపిత ఉత్పాదనశక్తి, 1678 MW మెగా వాట్లు ఉండగా 1980 మార్చినాటికి 1988 మెగావాట్లు ఉన్నట్లు తెలియవచ్చింది.

**విద్యుచ్ఛక్తి ఉత్పత్తి మిలియన్ కిలోవాట్ అవర్స్ (KWH in Millions)**

| సంవత్సరం | జల విద్యుత్తు | థెర్మల్ విద్యుత్తు | మొత్తం |
|---|---|---|---|
| 1959-60 | 505 | 123 | 628 |
| 1960-61 | 610 | 174 | 784 |
| 1965-66 | 844 | 555 | 1,399 |
| 1966-67 | 604 | 984 | 1,388 |
| 1967-68 | 811 | 1,091 | 1,902 |
| 1968-69 | 1,059 | 1,218 | 2,977 |
| 1969-70 | 1,460 | 1,116 | 2,624 |
| 1970-71 | 1,439 | 1,436 | 2,875 |
| 1971-72 | 1,221 | 1,824 | 2,045 |
| 1972-73 | 974 | 2,053 | 3,027 |
| 1973-74 | 910 | 2,196 | 3,106 |
| 1974-75 | 533 | 2,709 | 3,242 |
| 1975-76 | 941 | 2,729 | 3,670 |
| 1976-77 | 1,680 | 3,145 | 4,825 |
| 1977-78 | 2,002 | 3,146 | 5,148 |
| 1978-79 | 2,630 | 3,426 | 6,056 |

**జిల్లాలవారిగా విద్యుదీకరణ అయిన గ్రామాలు, పట్టణాలు**

| జిల్లాలు | మొత్తం గ్రామాలు పట్టణాలు | 31.3.1956 నాటికి విద్యుదీకరణ పొందిన గ్రామాలు, పట్టణాలు | 31.3.1978 నాటికి విద్యుదీకరణ పొందిన గ్రామాలు పట్టణాలు | విద్యుదీకరణ సౌకర్యం పొందిన జనాభా శాతం |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 2,881 | 38 | 882 | 60.3 |
| విశాఖపట్నం | 4,199 | 49 | 662 | 65.3 |
| తూర్పుగోదావరి | 1,357 | 112 | 748 | 92.8 |
| పశ్చిమ గోదావరి | 851 | 75 | 733 | 94.9 |
| కృష్ణా | 955 | 107 | 782 | 92.3 |
| గుంటూరు | 704 | 31 | 578 | 93.1 |
| ప్రకాశం | 1,014 | 7 | 572 | 81.2 |
| నెల్లూరు | 1,057 | 33 | 576 | 79.4 |
| కోస్తా ఆంధ్ర | 13,018 | 452 | 5,533 | 82.6 |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| కర్నూలు | 908 | 31 | 670 | 91.4 |
| అనంతపూరు | 941 | 45 | 703 | 90.4 |
| కడప | 904 | 18 | 561 | 82.8 |
| చిత్తూరు | 1,290 | 69 | 852 | 83.8 |
| రాయలసీమ | 4,043 | 163 | 2,786 | 87.2 |
| హైదరాబాదు | 968 | 9 | 703 | 95.5 |
| నిజామాబాదు | 869 | — | 596 | 88.1 |
| మెదక్ | 1,236 | — | 727 | 77.9 |
| మహబూబ్‌నగర్ | 1,470 | — | 977 | 83.1 |
| నల్గొండ | 1,121 | 1 | 814 | 85.1 |
| వరంగల్ | 985 | 1 | 727 | 91.5 |
| ఖమ్మం | 1,106 | 5 | 514 | 79.8 |
| కరీంనగర్ | 1,062 | 4 | 859 | 91.6 |
| ఆదిలాబాద్ | 1,567 | 2 | 645 | 71.4 |
| తెలంగాణా | 10,384 | 22 | 6,532 | 86.3 |
| ఆంధ్రప్రదేశ్ | 27,445 | 637 | 14,851 | 84.8 |

మూలం : ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎలక్ట్రిసిటీ బోర్డు

పై పట్టికలను గమనించగా 31.3.1956 నుంచి 31.3.1978 వరకు విద్యుదీకరణ అయిన గ్రామాల, పట్టణాల సంఖ్యలో 30.7 శాతం పెరుగుదల గోచరస్తుంది.

**వివిధ తరగతుల విద్యుచ్ఛక్తి వినియోగం (మిలియన్ KWH)**

| తరగతి | 1960-61 | 1970-71 | 1977-78 |
|---|---|---|---|
| గృహ సంబంధ | 65 | 179 | 361 |
| గృహాసంబంధంకాని | 45 | 127 | 169 |
| రైల్వేలు | — | — | 5 |
| పరిశ్రమలు | 51 | 160 | 273 |
| వాటర్‌వర్క్స్ మొదలైనవి | — | — | 14 |
| కుటీరపరిశ్రమలు | — | — | 2 |
| వ్యవసాయం | 57 | 394 | 755 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| వీధి దీపాలు | 14 | 25 | 35 |
| సాధారణ ప్రయోజనాలు | — | — | 6 |
| తాత్కాలిక | — | — | 2 |
| L. T. | 232 | 897 | 1,622 |
| H. T. | 339 | 1,239 | 2,160 |
| మొత్తం | 571 | 2,136 | 3,782 |

మూలం : ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఎలక్ట్రిసిటీ బోర్డు

విద్యుచ్ఛక్తి, గాస్ మొదలైన వాటివల్ల మన రాష్ట్రానికి కింది విధంగా ఆదాయం సమకూరుతుంది.

| సంవత్సరాలు | ఆదాయం (రూ. కోట్లలో) |
|---|---|
| 1970-71 | 14.99 |
| 1975-76 | 19.16 |
| 1976-77 | 23.51 |
| 1977-78 | 26.01 |
| 1978-79 | 28.91 |

మూలం : అర్థగణాంక శాఖ, ఆం. ప్ర.

## జలవిద్యుత్ కేంద్రాలు

***1. మాచ్ ఖండ్ :*** ఈ జల విద్యుత్ కేంద్రం ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు సంయుక్త నిర్మాణం. ఇందులో తయారైన విద్యుత్‌ను ఆంధ్రప్రదేశ్ ఒరిస్సా రాష్ట్రాలు 70:30 నిష్పత్తిలో పంచుకొంటాయి. ఈ కేంద్రంలో 6 యూనిట్లు ఉన్నాయి. మొదటి మూడు 17 MW ఉత్పాదక శక్తిగల యంత్రాలు. వీటిని మొదటిదశలో 1955-56 సం॥లో ప్రారంభించారు. రెండో దశలో ఒక్కొక్క యంత్రం 21,25 M W ఉత్పాదక శక్తి గలిగిన మూడు యంత్రాలను 1959 సం॥ లో ప్రారంభించినారు.

***2. ఎగువ సీలేరు :*** ఈ జల విద్యుత్ కేంద్రంలో ఒక్కొక్కటి 60 MW ఉత్పాదక శక్తి గలిగిన రెండు యంత్రాలు పనిచేస్తున్నాయి. వీటిని 1967-68 సం॥లో ప్రారంభించినారు. ఇక్కడి నీటిని కేవలం విద్యుదుత్పాదనకు మాత్రమే వినియోగిస్తున్నారు. బలిమెల డాం రిజర్వాయరులోని నీటిని ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు చెరిసగంగా వినియోగించుకొంటున్నాయి.

***దిగువసీలేరు :*** ఎగువ సీలేరులో విద్యుదుత్పాదనకు వినియోగించగా దిగువకు ప్రవహిస్తూన్న సీటితో దిగువ సీలేరులో తిరిగి విద్యుదుత్పాదన కావిస్తున్నారు. డొంకరాయిలో

ఉన్న ఈ విద్యుత్ కేంద్రం రిజర్వాయరులో 16.5 TMC నీరు నిల్వ చేయవచ్చు. ఇక్కడ అమర్చిన యంత్రాలు ఒక్కొక్కటి 115 MW విద్యుత్ ఉత్పాదన చేయగల శక్తి ఉంది. ఈ యంత్రాలలో మూడింటిని 1976-77 సం॥ లోను నాల్గవ యంత్రాన్ని 1978 సం॥లోను ప్రారంభించారు. మొత్తం ప్రాజెక్టు పూర్తయితే 1068 MKWH విద్యుత్ ఉత్పత్తి చేసే శక్తి ఉంటుంది. ఈ ప్రాజెక్టుకు 86 కోట్ల వ్యయం కాగలదు.

***తుంగభద్ర డాం :*** ఒక్కొక్క యంత్రం 9.1 MW ఉత్పాదక శక్తిగల 8 యంత్రాలున్నాయి. ఈ 8 యంత్రాలలోను 4 యంత్రాలు తుంగభద్ర డాం వద్దను, మిగతా 4 యంత్రాలు హంపిలోను స్థాపించారు, వీటిలో ఉత్పాదితమైన విద్యుచ్ఛక్తిని ఆంధ్రప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాలు 80 : 20 నిష్పత్తిలో పంపకం చేసుకొని వినియోగించు కొంటున్నాయి. ఈ జలవిద్యుత్ ప్రాజెక్ట్ మొదటి దశ 1957-58 సంవత్సరంలోను, రెండోదశ 1964 వ సం॥ లోను నిర్మాణమయ్యాయి. ఈ జలవిద్యుత్ కేంద్రంలోని ఉత్పాదన వ్యవసాయానికి వదిలే నీటిపై ఆధారపడి ఉండటం ఇందులోని ప్రత్యేకత. అందుచేతనే తుంగభద్ర డాంను బహుళార్థ సాధక ప్రాజెక్ట్‌గా చెబుతారు.

***నిజాంసాగర్ :*** ఈ జల విద్యుత్ కేంద్రంలో కూడా విద్యుదుత్పాదన వ్యవసాయానికి విడుదలచేసే నీటిపై ఆధారపడి ఉండటం ఇందులోని ప్రత్యేకత. ఈ కేంద్రాన్ని 1936 వ సంవత్సరంలో నిర్మించినారు. ఒక్కొక్కటి 5 MW ఉత్పాదకశక్తిగల యూనిట్లు స్థాపించ బడినప్పటికి ప్రస్తుతం రెండు యూనిట్లు మాత్రమే పనిచేస్తున్నాయి.

***నాగార్జునసాగర్ :*** ఇది మరొక గొప్ప జల విద్యుత్ కేంద్రము. 110 MW ఉత్పాదకశక్తిగల యంత్రాన్ని 1978 లో ప్రారంభించినారు. నాగార్జున సాగర్ నుండి కృష్ణా డెల్టాకు వినియోగమయేనీటిద్వారా ఇక్కడవిద్యుదుత్పాదనజరుగుతుంది. 634MKWH విద్యుత్‌ను సాలుకు ఉత్పాదన చేసేట్లుగా ఈ కేంద్రాన్ని రూపొందించారు.

***శ్రీశైలం జలవిద్యుత్ కేంద్రం :*** ఈప్రాజెక్టు మొదటిదశలో ఒక్కొక్కటి 110 MW ఉత్పత్తి శక్తిగల 4 యూనిట్లు నెలకొల్పుతారు. మొదటి రెండు యూనిట్లు 19787-9 సం॥ లోను, మూడు, నాలుగు యూనిట్లు 1979-80 సం॥లోను విద్యుత్ ఉత్పత్తి జరిపేటట్లు పథక నిర్మాణం జరిగింది. ఈజలవిద్యుత్ కేంద్రానికి ప్రస్తుతం 1000 టి. ఎమ్. సిల నీరు యిక్కడ లభ్యం కాగలదని అంచనా. ఈజలవిద్యుత్ కేంద్రం 770 మెగావాట్లు విద్యుచ్ఛక్తిని అదనంగా ఉత్పత్తి చేస్తుంది. ఈ విద్యుత్ కేంద్రం ద్వారా 3600 మిలియన్ కిలోవాట్లు విద్యుచ్ఛక్తి లభిస్తుందని అంచనా. శ్రీశైలం జల విద్యుత్ కేంద్రం 1963 లో ప్రారంభించినప్పుడు రూ. 40 కోట్ల పెట్టుబడి అవసరమని భావించారు. కాని ప్రాజెక్ట్ నిర్మాణం పని ఆలస్యం కావడం చేత వ్యయం మూడు రెట్లకు పెరిగింది. ప్రస్తుత అంచనాల ప్రకారం ఈ ప్రాజెక్ట్ మొదటిదశ పూర్తి కావడానికి రు. 172 కోట్లు అవసర మవుతాయని అంచనా.

***పోచంపాడు జలవిద్యుత్ కేంద్రం :*** పోచంపాడు డామ్ నుండి బయలుదేరిన దక్షిణ కాలువపై ఈ జలవిద్యుత్ కేంద్రం నిర్మింపబడుతున్నది. ఈ విద్యుత్ కేంద్రంలో 9 మెగా

వాట్ల విద్యుదుత్పాదన శక్తిగలిగిన నాలుగు యూనిట్లను నెలకొల్పుతారు పోచంపాడు ప్రాజెక్ట్ నుండి దక్షిణ కాలువలోకి వదిలే నీటి నుండి 36 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు పథకం వేయడమైంది. ఈ జల విద్యుత్ కేంద్రం అక్టోబరు నెలలో గరిష్ఠ స్థాయిలో 36 మెగావాట్ల విద్యుత్తు ఉత్పత్తి చేయగలిగినా ఏప్రియల్ నెల వచ్చేసరికి 1.57 మెగావాట్ల ఉత్పత్తి శక్తికి పడిపోతుంది. దీనికి కారణం విద్యుత్ ఉత్పాదనకు అవసరమైనంత నీరు ఏప్రియల్ నెలలో లభించక పోవడమే. ఈ విద్యుత్ కేంద్ర స్థాపనకు రూ. 1054 లక్షలువ్యయంగా అంచనా వేసినారు. ఈ కేంద్రం సంవత్సరానికి 147 మిలియన్ యూనిట్లు విద్యుత్తుఉత్పత్తి చేయ గలదు.

## థర్మల్ విద్యుత్ కేంద్రాలు

*కొత్తగూడెం :* ఆంధ్రప్రదేశ్‌లో నిర్మించిన పెద్ద థర్మల్ కేంద్రాలలో ఇది ప్రధాన మైనది. ఈ కేంద్రం నిర్మాణం 4 దశలలో జరిగింది. 60 MW ఉత్పాదక శక్తిగల రెండు యూనిట్లను 1966 సం॥లో మొదటి దశలో నిర్మించారు. అంతే శక్తిగల రెండు యూనిట్లను 1967 లో నిర్మించారు. 1974 వ సం॥లో 110 MW శక్తి గల రెండు యూనిట్లను మూడవ దశలో నిర్మించారు. నాల్గవదశలో 110 MW శక్తిగల రెండు యూనిట్లను 1977-78 సం॥లో నిర్మించారు. మొత్తం నాలుగు దశలలో నిర్మాణమైన యూనిట్లన్నీ కలిపి మొత్తం 220 MW విద్యుత్తును ఉత్పాదన చేయగలవు.

*రామగుండం:* రామగుండంలో రెండు విద్యుత్‌కేంద్ర విభాగాలు ఉన్నాయి. ఒకటి పురాతన తనమైనది (రామగుండం A); రెండోది ఆధునాతనమైనది (రామగుండంB). పురాతన కేంద్రం ఉత్పాదక శక్తి 20 MW గా ఉంది. రామగుండం ఉత్పాదకశక్తి 62.5 MW. దీనిని 1972 లో ప్రారంభించినారు.

*నెల్లూరు :* నెల్లూరులో 30 MW ఉత్పాదక శక్తిగల యంత్రాలను అమర్చినారు. ఈ కేంద్రం 1965 నుండి పనిచేస్తున్నది.

*విజయవాడ థర్మల్ స్కీమ్ :* ఒక్కొక్క యూనిట్ 120 MW ఉత్పాదన శక్తి గల రెండు యూనిట్లు నిర్మించడం ఈ స్కీమ్ ప్రధాన ధ్యేయం. ఈ ప్రాజెక్టుకయ్యే మొత్తం ఖర్చు రూ. 156.64 కోట్లుగా ప్రణాళిక సిద్ధపరచినారు. మార్చి 1977 వరకు ఈ ప్రాజెక్ట్ కింద ఖర్చుపెట్టిన మొత్తం రూ. 28.08 కోట్లు.

*హుస్సేన్ సాగర్ :* ఈ విద్యుత్ కేంద్రంలోని యంత్రాలు చాలా పురాతనమైనవి. వీటి మొత్తం ఉత్పాదకశక్తి 10 MW. జంట నగరాలకు ఎట్లాంటి అత్యవసర పరిస్థితులలో నయినా ఉపయోగపడేందుకు గాను ఈ కేంద్రాన్ని ప్రస్తుతం రిజర్వు ఉంచినారు.

*గ్యాస్ టర్బో సెట్స్ :* 1964 సం॥లో 10 MW శక్తి ఉత్పాదక శక్తి గల డీసెల్ విద్యుత్ ఉత్పాదక యంత్రాలను నెలకొల్పినారు. వీటిని కూడా ప్రస్తుతం జంటనగ రాలలో ఏర్పడే అత్యవసర పరిస్థితులలో ఉపయోగించడం కోసం సిద్ధంగా ఉంచినారు.

1977-78 సం॥ రివైజ్‌డు ఎస్టిమేట్లలో 43 కోట్ల రూపాయలు కేటాయించడం జరిగింది. మార్చి 1979 లో మొదటి యూనిట్, 1979 డిశంబరు మాసాంతానికి రెండవ యూనిట్ విద్యుత్ ఉత్పాదన ప్రారంభించ వచ్చునని భావించినారు.

## అంతర్ రాష్ట్ర గ్రిడ్

## (Inter State grid)

దక్షిణ భారతదేశంతోని రాష్ట్రాలన్నీ ఒక సమాఖ్య (grid) కింద వ్యవహరిస్తాయి. విద్యుచ్ఛక్తి లోటు ఉన్న పొరుగు రాష్ట్రాలకు అదనపు నిల్వలు ఉన్న రాష్ట్రాలు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం ద్వారా సరస్పరం సహాయం చేసుకోవడం ఈ సమాఖ్య ప్రధాన ధ్యేయము. ఈ ఏర్పాటు కింద 1975-76 సం॥లో ఆంధ్రప్రదేశ్ 47.35 కోట్ల యూనిట్లవిద్యుచ్ఛక్తిని పొరుగు రాష్ట్రాల నుండి పొందింది. అదే సంవత్సరంలో మనరాష్ట్రం 10.25 కోట్ల యూనిట్ల విద్యుత్తును గ్రిడ్‌లోని పొరుగు రాష్ట్రాలకు సరఫరా చేసింది.

## గ్రామీణ విద్యుదీకరణ సంస్థ

## (Rural Electrification Corporation)

గ్రామాలకు విద్యుత్ సరఫరా అందించే ఉద్దేశ్యంతో గ్రామీణ విద్యుదీకరణ సంస్థను 1970 లో స్థాపించడం జరిగింది. ఈ సంస్థాపన-దరిమిలా జరిగిన కృషి ద్వారా గ్రామీణ విద్యుదీకరణ పథకాలను అమలుచేయడంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం భారతదేశం మొత్తం మీద 9వ స్థానాన్ని ఆక్రమించింది. 1978 మార్చి నెలాఖరు నాటికి ఈ సంస్థ 182 సాధారణ పథకాలను 27 హరిజన బస్తీల విద్యుదీకరణను చేపట్టింది. దీనికి మొత్తం 6703.786 లక్షల రూపాయలు ఖర్చుకాగా వారు 6214.704 లక్షల రుణాన్ని మంజూరు చేసినారు. తెలంగాణా లోని 9 జిల్లాలు 3514.382 లక్షలరూపాయలు ఖర్చుకాగల 87 పథకాలను పొందినాయి. 1935.114 లక్షల రూపాయలు ఖర్చుకాగల 59 పథకాలను 8 కోస్తా జిల్లాలకు మంజూరు చేసినారు. అదే పథకం కింద రాయలసీమలోని 4 జిల్లాలు 36 పథకాలను 1179.725 లక్షల రూపాయల ఖర్చుతో పొందినాయి.

విద్యుదీకరణ చెందవలసిన గ్రామాలు, హరిజన వాడలు మొత్తం 7609. వీటిలో 1978 మార్చి నెలాఖరునాటికి 4921 గ్రామాలకు విద్యుత్ సరఫరా చేసినారు.

ఇదే కాలంలో 19729 పంపుసెట్లకు, 7201 వీధిదీపాలకు విద్యుత్ సరఫరా చేసినారు. ఈ పనులకుగాను 2861-985 లక్షల రూపాయలను వెచ్చించినారు.

## గ్రామీణ విద్యుత్ సహకార సంస్థలు

## (Rural Electric Co-operative Societies)

గ్రామీణ విద్యుదీకరణ కార్పొరేషన్ వారు రాష్ట్రంలోని మూడు ప్రాంతాలలోను మూడు గ్రామీణ విద్యుత్ సహకార సంస్థలకు ఋణ సహాయం చేసినారు. ఆ సంస్థలు 1) కరీంనగరు జిల్లాలోని సిరిసిల్లా విద్యుత్ కో-ఆపరేటివ్ సంస్థ. 2) కడప జిలాలోని

రాయచోటి విద్యుత్ కో-ఆపరేటివ్ సంస్థ. 3) విశాఖపట్నం జిల్లాలోని అనకాపల్లి విద్యుత్ సహకార సంస్థ.

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డును 1959 సం॥ ఏప్రియల్ 1 న స్థాపించారు. ఈ బోర్డు స్థాపన ప్రధానోద్దేశము రాష్ట్రంలోని విద్యుదుత్పాదన వనరులను అభిలషణీయమైన పరిమాణంలో వినియోగించుకోవడానికి కృషిచేయడం. రాష్ట్రప్రభుత్వం విద్యుత్ ఉత్పాదనకు, ట్రాన్స్‌మిషన్‌కు, పంపిణీకి పూర్తి బాధ్యతలను ఈ బోర్డుకు అప్పగించడమైంది. అయితే మాచ్ ఖండ్, తుంగభద్రల అంతర్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల వాటాకు నిర్మాణంలో ఉన్న శ్రీశైలం ప్రాజెక్ట్ ఆస్తులను రాష్ట్ర ప్రభుత్వమే ఉంచుకొంది. మిగతా విద్యుచ్ఛక్తి స్టేషనుల ఆస్తులన్నీ బోర్డు అధీనంలోనే ఉన్నాయి. ఈ సంస్థ మొత్తం ఆస్తుల విలువ 1979 మార్చి 31 వ తేదీనాటికి రూ. 662.41 కోట్లు. ఈ బోర్డు సేకరించిన ఋణాల మొత్తం 1979 మార్చి 31 నాటికి రూ. 682.03 కోట్ల రూపాయలు.

ఈ బోర్డుయొక్క స్థాపనశక్తి 1980 మార్చినాటికి 1988 మెగావాట్లు. ఈ బోర్డుతో దాదాపు 50,000 మంది ఉద్యోగులు పనిచేస్తున్నారు. 1978-79 లో ఈ బోర్డు చేసిన స్థూలం వ్యయం రూ. 146.6 కోట్ల రూపాయలు. బోర్డుయొక్క స్థూల ఆదాయం కూడా అదేకాలంలో దాదాపు అంతే ఉన్నది.

ఈ సంస్థకు రాష్ట్ర ప్రభుత్వం నుంచి 1978-79 సంవత్సరంలో రూ. 7.3 కోట్ల రూపాయల సబ్సిడీ లభించినట్లు తెలుస్తోంది. ఈ సంస్థ నికర రాబడి 1978-79 సంవత్సరానికి 9.5 శాతం. ఈ సంస్థ రాష్ట్రంలో అనేక విద్యుత్ పథకాలను, ప్రాజెక్ట్‌లను చేపట్టి రాష్ట్రంలో విద్యుదుత్పాదన అభివృద్ధికి విశేషంగా కృషి చేస్తున్నదని చెప్పవచ్చు. గ్రామీణ విద్యుదీకరణ పథకాలను కూడ ఈ సంస్థ అమలుపరుస్తున్నది. ఈ సంస్థ గ్రామీణ విద్యుదీకరణ రంగంలో గణనీయమైన ప్రగతిని సాధించింది. 1978 మార్చిలో 14,850 గ్రామాలకు, 3.18 లక్షల పంపుసెట్లకు విద్యుచ్ఛక్తి సప్లై చేయడం, 1980 మార్చినాటికి 16,691 గ్రామాలకు, 3.88 లక్షల పంపుసెట్లకు విద్యుచ్ఛక్తిని సప్లైచేయడం జరిగింది. 1979-80లో ఈ సంస్థకు కేటాయించిన పెట్టుబడి రూ. 119 కోట్లుకాగా 1980-81 లో రూ. 135.32 కోట్ల రూపాయలను పెట్టుబడి కింద కేటాయించడం జరిగింది.

# 13

# స్థానిక సంస్థల వ్యవస్థ

ఆంధ్రప్రదేశ్ స్థానిక సంస్థల వ్యవస్థలో పంచాయతీరాజ్, మున్సిపాలిటీలు, కార్పొరేషన్లు ఉన్నాయి. జిల్లా పాలక వ్యవస్థను ప్రజాస్వామిక వికేంద్రీకరణ చేసే సదుద్దేశంతో స్థానిక సంస్థల వ్యవస్థ రూపొందించడం జరిగింది.

## పంచాయతీరాజ్

బల్వంత్‌రాయ్ జి. మెహతా కమిటీ సమాజ వికాస, జాతీయ వికాస కార్యక్రమాలపై సమర్పించిన నివేదిక ననుసరించి పంచాయతీ రాజ్య వ్యవస్థ మనదేశంలో అవతరించింది. ఈ వ్యవస్థను అక్షరశః అమలు పెట్టడానికి ఆంధ్రప్రదేశ్ ముందంజ వేసింది. 1959 లో వచ్చిన చట్టం ఫలితంగా మనరాష్ట్రంలో పంచాయతీలు, పంచాయతీ సమితులు, జిల్లాపరిషత్తులు ఏర్పడ్డాయి. పంచాయతీరాజ్ వ్యవస్థ దేశంలో అనేక విధాలుగా అనేక రాష్ట్రాలలో అమలులో ఉంది. మనరాష్ట్రంలో ఈ పద్ధతి మూడు శ్రేణుల విధానంలో ఇమిడి ఉంది. కింది స్థాయిలో పంచాయతీలు, మాధ్యమిక స్థాయిలో పంచాయతీ సమితులు, పై స్థాయిలో జిల్లాపరిషత్తులు, ఈ సంస్థలు ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితి, జిల్లాపరిషత్‌చట్టం, గ్రామ పంచాయతీల చట్టాలననుసరించి వ్యవహరిస్తాయి. పంచాయతీరాజ్ పాలనా యంత్రాంగం ప్రజలకు సన్నిహితం కాగలదు. ప్రజల ఇబ్బందులను, సమస్యలను పరిష్కరించి, గ్రామాలు స్వయంసమృద్ధిగా, స్వయం పోషకంగా ఉండటానికి తోడ్పడగలదు. అధికార వికేంద్రీకరణ వల్ల గ్రామీణాభ్యుదయానికి అవకాశాలు హెచ్చు.

### పంచాయతీలు

జనాభా, ఆదాయం ప్రాతిపదికలపై ఒక రెవిన్యూ గ్రామాన్నిగానీ, కొన్ని చిన్న గ్రామాలను కలిపిగానీ పంచాయతీగా ఏర్పాటు చేస్తారు. రహస్య బాలెట్ పద్ధతిద్వారా పంచాయతీలకు ఎన్నికలు జరుగుతాయి. జనాభాను బట్టి పంచాయతీలో సభ్యులు 5 నుంచి 17 మంది వరకూ ఉండవచ్చు. షెడ్యూలు కులాలు, తెగల వారికి కొన్ని సీట్లను కేటాయిస్తారు. మహిళలకు కూడా కొన్ని స్థానాలను ప్రత్యేకిస్తారు. ఎన్నికైన సభ్యులలో ఒకరు సర్పంచ్‌గానూ, ఇంకొకరు ఉప సర్పంచ్‌గానూ ఎన్నికవుతారు. పంచాయతీ సభ్యుల పదవీకాలం అయిదు సంవత్సరాలు. పంచాయతీ ప్రాంతం అభివృద్ధికి, రోడ్లు ఏర్పరచ్చడానికి, మరమ్మతులు చేయడానికి, వీధిదీపాలు, మురుగునీటి పారుదల సౌకర్యాలు కల్పించడానికి, ప్రజల

ఆరోగ్య రక్షణకు పంచాయతీ చర్యలు తీసుకొంటుంది. ఇళ్ళపన్ను, వృత్తి పన్ను, వాహనాలపన్ను, మార్కెట్లపై పన్ను, చెరువులలో చేపల అమ్మకం మొదలైనవాటివల్ల పంచాయతీలకు ఆదాయం సమకూరుతుంది.

## పంచాయతీసమితి

పంచాయతీల సర్పంచ్‌లు, సమితి ప్రాంతానికి చెందిన శాసనసభ్యులు, శాసనమండలి సభ్యులు, ఆరుగురు కో ఆప్ట్ చేసుకొన్న సభ్యులతో పంచాయతీ సమితి ఏర్పడుతుంది. మన రాష్ట్రంలో 322 పంచాయతీ సమితులున్నాయి. ఈ సమితులు సమాజాభివృద్ధి కార్యక్రమాలను చేపడతాయి. చిన్నతరహా నీటిపారుదల సౌకర్యాలను కల్పిస్తాయి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటుచేసి నిర్వహిస్తాయి. ప్రాథమిక పాఠశాలలను నిర్వహిస్తాయి. వ్యవసాయదార్లకు, సహకార సంఘాలకు ఋణాలను పంపిణీ చేస్తాయి. బావుల తవ్వకానికి సబ్సిడీ, ఋణ పథకాలను అమలు పరుస్తాయి.

మనరాష్ట్రంలో జిల్లాలవారీ పంచాయతీలను, సమితులను 31.3.1978 నాటికి ఎన్ని ఉన్నాయో కింద తెలియజేయడమైంది.

| జిల్లా | పంచాయతీలు | సమితులు |
|---|---|---|
| శ్రీకాకుళం | 1,455 | 24 |
| విశాఖపట్నం | 1,264 | 24 |
| తూర్పుగోదావరి | 918 | 20 |
| పశ్చిమగోదావరి | 697 | 16 |
| కృష్ణా | 870 | 17 |
| గుంటూరు | 824 | 19 |
| ప్రకాశం | 775 | 17 |
| నెల్లూరు | 708 | 14 |
| కోస్తా ఆంధ్ర | 7,513 | 153 |
| కర్నూలు | 784 | 13 |
| అనంతపూరు | 740 | 16 |
| కడప | 646 | 12 |
| చిత్తూరు | 1,066 | 18 |
| రాయలసీమ | 3,236 | 59 |
| హైదరాబాద్ | 401 | 8 |
| నిజామాబాద్ | 410 | 9 |

| 1 | 2 | 3 |
|---|---|---|
| మెదక్ | 616 | 10 |
| మహబూబ్‌నగర్ | 773 | 16 |
| నల్గొండ | 720 | 15 |
| వరంగల్ | 630 | 14 |
| ఖమ్మం | 442 | 13 |
| కరీంనగర్ | 725 | 14 |
| ఆదిలాబాదు | 537 | 11 |
| తెలంగాణా | 5,254 | 110 |
| ఆంధ్రప్రదేశ్ | 16,003 | 322 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

**జిల్లాపరిషత్**

ఆంధ్రప్రదేశ్‌లో ప్రతిజిల్లాకు ఒక పరిషత్ ఉన్నది. పంచాయతీ సమితుల అధ్యక్షులు జిల్లాలోని శాసనసభ్యులు, శాసన మండలి సభ్యులు, లోకసభ, రాజ్యసభ సభ్యులు, కో ఆప్ట్ చేసుకోబడిన ఆరుగురు సభ్యులు, జిల్లాకలెక్టరు ఈ పరిషత్ లో ఉంటారు. మహిళలకు, షెడ్యూలు కులాల, తెగలవారికి ప్రత్యేక స్థానముంటుంది. అనధికార సభ్యుల్ని చైర్మన్‌గా ఎన్నుకోవడం జరుగుతుంది. జిల్లా పరిషత్ సభ్యుల పదవీకాలం అయిదేళ్ళు. కనీసం మూడు నెలలకు ఒకసారి జిల్లాపరిషత్ సమావేశమవుతుంది.

ప్రతిజిల్లా పరిషత్‌కు ఏడు స్థాయీ సంఘాలుంటాయి.

i) ప్రణాళికా, ఉత్పత్తి
ii) పరిశ్రమలు, సహకారం
iii) విద్య
iv) మహిళా సంక్షేమం
v) సాంఘిక సంక్షేమం
vi) రహదార్లు
vii) పన్నులు - ఆర్థిక వ్యవహారాలు

జిల్లాలోని సమితుల, తద్వారా పంచాయతీల అభివృద్ధి కార్యక్రమాలకు జిల్లాపరిషత్ తోడ్పడుతుంది.

ప్రతి పంచాయతీ, పంచాయతీ సమితి, జిల్లాపరిషత్ వార్షిక ఆదాయ, వ్యయాలను స్థానిక సంస్థల ఆడిట్‌వారు ఆడిట్ చేయడం జరుగుతుంది.

పంచాయత్ రాజ్ పరిపాలన ఆశించినంత ఆరోగ్యకరంగా లేకపోవడం వల్ల, కొన్ని అవక తవకలుండటం వల్ల ప్రత్యేకంగా కొన్ని కమిటీలను నియమించి, లోపాలను ఎత్తిచూపి, వాటి నివారణకు సిఫార్సులను స్వీకరించడం జరిగింది. అట్లాంటి కమిటీలలో ముఖ్యమైనవి.

i) శ్రీ ఎం. టి. రాజు కమిటి

ii) శ్రీ జె. వెంగళరావు కమిటి

iii) శ్రీ సి. నరసింహం కమిటి

ఈ కమిటీలు పంచాయతీ వ్యవస్థలో గ్రామ పంచాయతీల, సమితుల, పరిషత్‌ల నిర్వహణలో గల లోపాలను, అవక తవకలను వెలికితీసి, వాటి నివారణకు చర్యలనుసూచించడం జరిగింది. ఈ కమిటీల సిఫార్సులను ప్రభుత్వం అమలు పెట్టవలసి ఉంది.

ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్‌ల చట్టానికి, 1964 గ్రామ పంచాయతీ చట్టానికి కొన్ని సవరణలు తీసుకురావడం జరిగింది. ఆ సవరణలలో ముఖ్యాంశాలు :

i] సర్పంచ్, సమితి అధ్యక్షుల పదవులకు నేరుగా ఎన్నికలు జరగడం.

ii] పంచాయత్ వ్యవస్థలో బలహీనవర్గాలకు ఎక్కువ ప్రాతినిధ్యం కల్పించడం.

iii] జనాభా ప్రాతిపదికపై పంచాయతీ సమితులకు ఎన్నికైన సభ్యుల సంఖ్య 20-30 మధ్య నిర్ణయం కావడం.

iv] హరిజన, గిరిజనులకు రిజర్వేషన్లు కల్పించడం మొదలైనవి.

## మున్సిపాలిటీలు

ఆంధ్రప్రదేశ్ మొత్తం జనాభాలో పట్టణ ప్రాంతం జనాభా 19.3 శాతం ఉంది. ఆంధ్రప్రదేశ్ మున్సిపాలిటీల చట్టం, 1965 వచ్చేవరకు ఆంధ్రప్రదేశ్ నగరాల పరిపాలనకు సమగ్రమైన చట్టమంటూ లేదు. మన రాష్ట్రంలో 82 మున్సిపాలిటీలు ఉన్నాయి. సాధారణంగా 25,000 లకు మించి జనాభా ఉంటే ఆ పట్టణాన్ని మున్సిపాలిటీగా గుర్తిస్తుంది. అయితే కొన్ని ఇతరత్రా అర్హతల వల్లకూడా ఒక ప్రాంతాన్ని ప్రభుత్వం మున్సిపాలిటీగా ఆమోదించవచ్చు.

ఆదాయం ప్రాతిపదికగా మనరాష్ట్రంలోని మున్సిపాలిటీలను అయిదు తరగతులుగా వర్గీకరించారు.

| | | |
|---|---|---|
| సెలక్షన్ గ్రేడ్ | — | సాంవత్సరిక ఆదాయం 10 లక్షలకు మించి, వ్యాపార రీత్యా ప్రాముఖ్యం గల పట్టణాలు |
| స్పెషల్ గ్రేడ్ | — | కేవలం ఆదాయం 10 లక్షలు మించిన పట్టణాలు |
| ఫస్టు గ్రేడ్ | — | 6-10 లక్షల మధ్య ఆదాయంగలపట్టణాలు |
| సెకెండ్ గ్రేడ్ | — | 3-6 లక్షల మధ్య ఆదాయం వచ్చే మున్సిపాలిటీలు |
| థర్డ్ గ్రేడ్ | — | 3 లక్షల కంటే తక్కువ ఆదాయం వచ్చే మున్సిపాలిటీలు |

పై వర్గీకరణ ప్రకారం మనరాష్ట్రంలో సెలక్షన్ గ్రేడ్ 3, స్పెషల్ గ్రేడ్ 6, ఫస్ట్ గ్రేడ్ 15, సెకండ్ గ్రేడ్ 13, థర్డ్ గ్రేడ్ 45 మున్సిపాలిటీలున్నాయి.

### మనరాష్ట్రంలో ప్రాంతాలవారీగా, గ్రేడ్‌లవారీగా మున్సిపాలిటీల వివరాలు

| మున్సిపాలిటీ గ్రేడ్ | కోస్తా ఆంధ్ర | రాయలసీమ | తెలంగాణ | మొత్తం |
|---|---|---|---|---|
| సెలక్షన్ గ్రేడ్ | 2 | — | 1 | 3 |
| స్పెషల్ గ్రేడ్ | 5 | 1 | — | 6 |
| ఫస్ట్ గ్రేడ్ | 9 | 5 | 1 | 15 |
| సెకండ్ గ్రేడ్ | 4 | 5 | 4 | 13 |
| థర్డ్ గ్రేడ్ | 20 | 6 | 19 | 45 |
| | 40 | 17 | 25 | 82 |

మున్సిపాలిటీకి కౌన్సిలర్లను ఎన్నుకొంటారు. ఈ కౌన్సిల్ సభ్యుల నుంచి ఛైర్మన్‌ను, వైస్ ఛైర్మన్‌ను ఎన్నుకొంటారు. వీరి పదవీకాలం అయిదేళ్ళు.

పన్నులు, ఋణాలు, ప్రభుత్వ గ్రాంట్లు, వివిధ రకాల పన్నులు, సెస్సులద్వారా మున్సిపాలిటీలకు ఆర్థిక వనరులు సమకూరతాయి.

### 1977-78 సంవత్సరంలో మన రాష్ట్రంలో వివిధ జిల్లాలలో ఉన్న మున్సిపాలిటీల వివరాలు

| మున్సిపాలిటీలు | జనాభా (1971) | ఆదాయం (లక్షల రూ॥లలో) | వ్యయం (లక్షల రూ॥లలో) |
|---|---|---|---|
| *శ్రీకాకుళం జిల్లా :* | | | |
| 1. శ్రీకాకుళం | 45,179 | 59.5 | 51.2 |
| 2. సాలూరు | 39,929 | 20.5 | 20.5 |
| 3. బొబ్బిలి | 33,649 | 22.1 | 19.9 |
| 4. పార్వతీపురం | 30,025 | 22.3 | 20.4 |
| *విశాఖపట్నం జిల్లా :* | | | |
| 5. విశాఖపట్నం | 3,52,504 | 394.9 | 336.7 |
| 6. అనకాపల్లి | 57,273 | 69.2 | 67.6 |
| 7. భీమునిపట్నం | 14,201 | 12.9 | 10.4 |
| 8. విజయనగరం | 86,608 | 83.2 | 77.6 |
| *తూర్పుగోదావరి జిల్లా :* | | | |
| 9. కాకినాడ | 1,64,200 | 173.1 | 190.3 |

| | | | |
|---|---|---|---|
| 10. రాజమండ్రి | 1,65,912 | 152.8 | 115.4 |
| 11. అమలాపురం | 30,518 | 46.7 | 34.7 |
| 12. పెద్దాపురం | 28,579 | 25.8 | 22.3 |
| 13. సామర్లకోట | 31,607 | 20.9 | 22.2 |
| 14. పిఠాపురం | 31,301 | 30.6 | 28.9 |
| 15. మండపేట | 25,316 | 25.7 | 23.6 |
| 16 రామచంద్రపురం | 23,685 | 25.0 | 22.4 |
| 17. తుని | 28,344 | 33 0 | 25.4 |
| *పశ్చిమగోదావరి జిల్లా :* | | | |
| 18. ఏలూరు | 1,27,023 | 132.6 | 128.1 |
| 19. భీమవరం | 63,762 | 80.0 | 79.5 |
| 20. పాలకొల్లు | 36,196 | 74.2 | 59.4 |
| 21. నర్సాపూర్ | 36,147 | 45.5 | 44.0 |
| 22. తాడేపల్లి గూడెం | 43,610 | 45.4 | 44.0 |
| 33. కొవ్వూరు | 23,390 | 13.7 | 8.2 |
| 24. నిడదవోలు | 23,377 | 20.6 | 15.1 |
| *కృష్ణా జిల్లా :* | | | |
| 25. విజయవాడ | 3,17,258 | 703.4 | 564.8 |
| 26. గుడివాడ | 61,068 | 82.1 | 78.1 |
| 27. మచిలీపట్నం | 1,12,612 | 111.0 | 97.8 |
| *గుంటూరు జిల్లా :* | | | |
| 28. గుంటూరు | 2,69,991 | 308.4 | 220.9 |
| 29. తెనాలి | 1,02,539 | 106.0 | 99.0 |
| 30. బాపట్ల | 41,947 | 30.4 | 28.7 |
| 31. నర్సరావు పేట | 43,467 | 44.1 | 40.6 |
| 32. రేపల్లె | 27,873 | 39.0 | 31.6 |
| 33. చిలకలూరిపేట | 41,543 | 30.1 | 33.4 |

| | | | |
|---|---|---|---|
| 34. పొన్నూరు | 31,463 | 38.6 | 24.5 |
| 35. మంగళగిరి | 32,850 | 24.9 | 23.4 |
| *ప్రకాశం జిల్లా :* | | | |
| 36. ఒంగోలు | 53,330 | 87.4 | 64.7 |
| 37. చీరాల | 54,487 | 57.0 | 58.6 |
| 38. మార్కాపూర్ | 22,263 | 15.9 | 14.1 |
| *నెల్లూరు జిల్లా :* | | | |
| 39. నెల్లూరు | 1,33,500 | 170.2 | 161.8 |
| 40. గూడూరు | 33,778 | 28.4 | 21.2 |
| 41. కావలి | 29,616 | 25.2 | 25.2 |
| *చిత్తూరు జిల్లా :* | | | |
| 42. చిత్తూరు | 63,035 | 56.0 | 50.6 |
| 43. తిరుపతి | 65,843 | 60.9 | 62.9 |
| 44. మదనపల్లి | 36,458 | 47.7 | 37.1 |
| 45. శ్రీకాళహస్తి | 34,735 | 27.5 | 18.6 |
| *కడప జిల్లా :* | | | |
| 46. కడప | 66,115 | 83.4 | 88.9 |
| 47. ప్రొద్దుటూరు | 70,822 | 70.8 | 51.1 |
| *అనంతపూర్ జిల్లా :* | | | |
| 48. అనంతపూర్ | 80,059 | 103.7 | 98.3 |
| 49. గుంతకల్ | 66,320 | 32.7 | 29.4 |
| 50. హిందూపూర్ | 42,950 | 41.0 | 30.2 |
| 51. తాడిపత్రి | 31,618 | 22.9 | 23.3 |
| 52. రాయదుర్గ | 26,154 | 11.5 | 11.1 |
| 53. కదిరి | 33,810 | 29.7 | 20.9 |
| 54. ధర్మవరం | 30.875 | 16.8 | 17.4 |

కర్నూలు జిల్లా :

| | | | |
|---|---|---|---|
| 55. కర్నూలు | 1,36,710 | 144.4 | 130 6 |
| 56. ఆదోని | 85,311 | 55.6 | 55.1 |
| 57. నంద్యాల | 63,193 | 45.4 | 39.7 |
| 58. ఎమ్మిగనూరు | 30,265 | 10.2 | 9.6 |

హైదరాబాదు జిల్లా :

| | | | |
|---|---|---|---|
| 59. తాండూరు | 22,009 | 7 2 | 6.2 |

మెదక్ జిల్లా :

| | | | |
|---|---|---|---|
| 60. సంగారెడ్డి | 17,227 | 8.7 | 6.9 |
| 61. మెదక్ | 19,458 | 7.7 | 5.8 |
| 62. సిద్దిపేట | 26,296 | 11.5 | 9.6 |
| 63. సదాశివ పేట | 14,939 | 5.4 | 4.3 |
| 64. జహీరాబాద్ | 18,424 | 8.4 | 6.5 |

ఖమ్మం జిల్లా :

| | | | |
|---|---|---|---|
| 65. ఖమ్మం | 56,919 | 40.1 | 30.5 |
| 66. కొత్తగూడెం | 75,542 | 9.8 | 7 0 |

ఆదిలాబాద్ జిల్లా :

| | | | |
|---|---|---|---|
| 67. ఆదిలాబాద్ | 30,368 | 12.5 | 10.0 |
| 68. మంచిర్యాల | 19,808 | 17.1 | 12.0 |
| 69. భైన్‌సా | 14,763 | 5.8 | 4.7 |
| 70. నిర్మల్ | 28,529 | 10.2 | 8.3 |
| 71. కాగజ్‌నగర్ | 11,567 | 6.5 | 4.8 |

నల్లగొండ జిల్లా :

| | | | |
|---|---|---|---|
| 72. నల్లగొండ | 33,126 | 11.3 | 10.4 |
| 73. భోన్‌గిర్ | 21,815 | 14.6 | 12.0 |
| 74. సూర్యాపేట | 21,724 | 8.7 | 6.2 |

| | | | |
|---|---|---|---|
| *వరంగల్ జిల్లా :* | | | |
| 75. వరంగల్ | 2,07,520 | 165.3 | 114.5 |
| 76. జనగాం | 16,866 | 6.8 | 6.8 |
| *నిజామాబాద్ జిల్లా :* | | | |
| 77. నిజామాబాద్ | 1,15,640 | 70.0 | 61.5 |
| 78. బోధన్ | 37,589 | 18.8 | 16.1 |
| *మహబూబ్‌నగర్ జిల్లా :* | | | |
| 79. మహబూబ్‌నగర్ | 51,756 | 29.6 | 25.2 |
| 80. నారాయణ్ పేట్ | 21,744 | 7.6 | 5.7 |
| 81. గద్వాల్ | 21,828 | 7.7 | 8.3 |
| *కరీంనగర్ జిల్లా :* | | | |
| 82. కరీంనగర్ | 41,918 | 29.0 | 23.6 |
| 83. జగిత్యాల | 30,000 | 9.3 | 6.1 |

మూలం : డైరెక్టర్ ఆఫ్ మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్, ఆంధ్రప్రదేశ్

## కార్పొరేషన్‌లు

మన రాష్ట్రంలో రెండు కార్పొరేషన్‌లు ఉన్నాయి. 1960 లో హైదరాబాదు సికిందరాబాదు కార్పొరేషన్ల విలీనం తరవాత సమగ్ర కార్పొరేషన్‌గా హైదరాబాదు కార్పొరేషన్ ఏర్పడింది. 1971 జనాభా లెక్కల ప్రకారం ఈ కార్పొరేషన్ జనాభా 17,98,910. ఈ కార్పొరేషను 1) కార్పొరేషను, 2) స్థాయి సంఘం 3) కమీషనర్, 4) మేయర్ అనే నాలుగు విభాగాల యంత్రాంగం ద్వారా నగర పరిపాలనా బాధ్యతలను నిర్వహిస్తుంది. ఈ కార్పొరేషనులో హైదరాబాదు నుంచి 66 మంది, సికిందరాబాదు నుంచి 29 మంది మొత్తం 94 మంది కౌన్సిలర్లు ఉంటారు. షెడ్యూల్ కులాల వారికి ప్రత్యేకంగా ఇందులో కొన్ని స్థానాలున్నాయి. కార్పొరేషను పదవీకాలం నాలుగేళ్ళు.

1979 ఏప్రియల్ 14న విశాఖపట్నం మున్సిపల్ కార్పొరేషన్‌గా ఏర్పడింది.

***నగర అభివృద్ధి సంస్థలు :*** రాష్ట్ర ప్రభుత్వం అక్టోబరు 2, 1975 న హైదరాబాదు నగరాభివృద్ధి సంస్థను (**Urban Development Authority**), జూన్ 17, 1978 న విశాఖపట్నం నగరాభివృద్ధి సంస్థను నెలకొల్పింది. డిశంబరు 7, 1978 న విజయవాడ నగరాభివృద్ధి సంస్థను ప్రభుత్వం నెలకొల్పింది. ఈ సంస్థ విజయవాడ, గుంటూరు, తెనాలి, మంగళగిరి మునిసిపల్ ప్రాంతాలను పరిసర ప్రాంతాలను అభివృద్ధి చేయడానికి తోడ్పడు

తుంది. నగరాభివృద్ధి సంస్థలు స్వంత ప్రణాళికలను రూపొందించుకొని ప్రాంతీయాభి వృద్ధికి తోడ్పడతాయి. హైదరాబాద్ నగరాభివృద్ధి సంస్థ (H U D A) దాదాపు 960 చ.కి.మీ. ప్రాంతం అభివృద్ధికి తోడ్పడుతుంది. ఈ సంస్థ రామచంద్రపురం, పటంచెరు, హయత్ నగర్, ఘటకేసర్, మేడ్చల్, ఫతేనగర్, కట్టెదన్, షంషాబాద్, మల్కాజిగిరి ప్రదేశాల్లో శాటిలేట్ టవున్లు నెలకొల్పటానికి పథకాలు వేసింది.

మన రాష్ట్రంలో స్థానిక సంస్థల వ్యవస్థపై రాష్ట్ర ప్రభుత్వానికి నియంత్రణ ఉన్నది. స్థానిక సంస్థలకు సంబంధించిన ఎన్నికల విధానాలు, అధికార దుర్వినియోగం, బాధ్యతారాహిత్యం నిర్వహణ లోపం, చట్టాల ఉల్లంఘన మొదలైన కారణాలవల్ల స్థానిక సంస్థల పదవులను నిర్వహించే వారిని తొలగించే అధికారం ప్రభుత్వానికున్నది. మునిసిపల్ పాలనా వ్యవహారాలకు, పంచాయతీ సంస్థలకు ప్రత్యేక డైరెక్టరేటులు ఉన్నాయి. ఈ డైరెక్టరేట్లకు ఈ సంస్థలపై పరిపాలనా సంబంధమైన నియంత్రణ ఉన్నది. స్థానిక సంస్థల నిర్వహణ సమర్థవంతంగా ఉంటే అధికార కేంద్రీకరణ భావనకు సమగ్రమైన విలువ చేకూరుతుంది.

# 14

# విద్య

1-11-1956 ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించడంతో అప్పటికి ఉన్న పదకొండు ఆంధ్ర రాష్ట్ర జిల్లాలు, తొమ్మిది నిజామ్ ప్రభుత్వంలోని జిల్లాలు కలిసి మొత్తం తెలుగుజాతి రాష్ట్రంగా రూపుదాల్చింది. అప్పటినుంచి విభిన్న రంగాలతోబాటు విద్యారంగంలో కూడా రాష్ట్రమంతటా ప్రగతిచూపడానికి కృషి సాగుతూ వచ్చింది. అయితే అంతకు ముందున్న ప్రాంతీయ అసమానతల కారణంగా కొన్ని ప్రాంతాలపై ఎక్కువగా కృషి కేంద్రీకరించవలసి వచ్చింది. తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాల మధ్య విద్యారంగంలో 1956 నాటికి ఉన్న అసమానతలకు ప్రధాన కారణం 15-8-1947 దాకా బ్రిటిష్ పాలనలో ఉండి ఆ తరవాత ప్రజా ప్రభుత్వాల అజమాయిషీలోను, 1956 దాకా ఫ్యూడల్ ప్రభుత్వం అజమాయిషీలోనూ ఉండటమే. రాజకీయ పరిస్థితులు విద్యారంగం మీద తీవ్రమైన ప్రభావాన్ని చూపుతాయనేది విదితమైన విషయమే. అందువల్లనే అందరూ తెలుగువారైనప్పటికీ, తెలుగు వారి మాతృభాష అయినప్పటికీ, విభిన్న నేపథ్య రంగాలదృష్ట్యా విద్య, సంస్కృతి, ప్రగతి వంటి విషయాలలో రెండు ప్రాంతాల మధ్య ఒక అగాధం వంటిది కనిపించింది. ఈ రెండు అసమానతల కలయిక 1-14-56 న జరిగింది.

ఈ దిగువ పట్టికలో 1-11-56 వరకు రెండు ప్రాంతాలలో జరిగిన విద్యా ప్రగతి గమనించవచ్చు.

ప్రాంతాలవారీగా సంస్థల సంఖ్య (1956-57)

యాజమాన్యాలు

| పాఠశాలలు | కేంద్ర ప్రభుత్వం | రాష్ట్ర ప్రభుత్వం | జిల్లా బోర్డులు | మునిసిపాలిటీ | ఎయిడెడ్ | అన్ ఎయిడెడ్ | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| **కోస్తా ఆంధ్ర** | | | | | | | |
| 1. ప్రైమరీ/లోయర్ ఎలిమెంటరీ | — | 515 | 5,409 | 232 | 6,112 | 1 | 12,269 |
| 2. అప్పర్ ప్రైమరీ/ హైయర్ఎలిమెంటరీ | 1 | 14 | 265 | 37 | 230 | — | 547 |
| 3. సెకండరీ | — | 21 | 370 | 49 | 111 | — | 551 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| **రాయలసీమ** | | | | | | | |
| 1. ప్రైమరీ/లోయర్ ఎలిమెంటరీ | — | 237 | 3,656 | 126 | 1,865 | 11 | 5,845 |
| 2. అప్పర్ ప్రైమరీ/ హైయర్ ఎలిమెంటరీ | 1 | 6 | 105 | 8 | 97 | — | 217 |
| 3. సెకండరీ | — | 15 | 116 | 17 | 25 | 1 | 174 |
| **తెలంగాణ** | | | | | | | |
| 1. ప్రైమరీ/లోయర్ ఎలిమెంటరీ | — | 6.343 | — | — | 938 | 9 | 7,295 |
| 2. అప్పర్ ప్రైమరీ హైయర్ ఎలిమెంటరీ | — | — | — | — | — | — | — |
| 3. సెకండరీ | — | 167 | — | — | 97 | 10 | 274 |

మూలం : డైరెక్టర్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్

మూడు ప్రాంతాలలో 1957-57 నాటికి విద్యార్థుల సంఖ్య, ఉపాధ్యాయులు

| పాఠశాలలు | విద్యార్థులు | | | ఉపాధ్యాయులు | | |
|---|---|---|---|---|---|---|
| | బాలురు | బాలికలు | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం |
| **కోస్తాఆంధ్ర** | | | | | | |
| 1. ప్రైమరీ/లోయర్ ఎలిమెంటరీ | 7,51,481 | 5,34,851 | 12,86,332 | 30,094 | 7,191 | 37,285 |
| 2. అప్పర్ ప్రైమరీ/ హైయర్ ఎలిమెంటరీ | 89,470 | 60,552 | 1,49,992 | 4,021 | 974 | 10,288 |
| 3. సెకండరీ | 1,84,244 | 40,418 | 2,24,662 | 9,314 | 974 | 10,288 |
| **రాయలసీమ** | | | | | | |
| 1. ప్రైమరీ/లోయర్ ఎలిమెంటరీ | 2,95,607 | 1,42,727 | 4,37,334 | 10,570 | 2,079 | 12,649 |
| 2. అప్పర్ ప్రైమరీ/ హైయర్ ఎలిమెంటరీ | 36,400 | 14,660 | 51,060 | 1,423 | 438 | 1,861 |
| 3. సెకండరీ | 67,201 | 11,343 | 78,544 | 3,103 | 352 | 3,455 |
| **తెలంగాణ** | | | | | | |
| 1. ప్రైమరీ/లోయర్ ఎలిమెంటరీ | 3,27,597 | 1,16,845 | 4,44,442 | 13,792 | 2,295 | 16,087 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| 2. అప్పర్ ప్రైమరీ/ హైయర్ ఎలిమెంటరీ | — | — | — | — | — | — |
| 3. సెకండరీ | 1,09,946 | 38,801 | 1,48,646 | 4,440 | 1,832 | 6,272 |

**1956 - 57 నాటికి ఉన్నత సాధారణ విద్య - కళాశాలలు**

| | విశ్వవిద్యాలయాల ఆధ్వర్యంలో ఉన్న కళాశాలలు | ప్రభుత్వ కళాశాలలు | ప్రైవేటు కళాశాలలు |
|---|---|---|---|
| 1) ఆంధ్ర విశ్వకళాపరిత్తు | 1 | 4 | 20 |
| 2) శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం | 1 | 2 | 7 |
| 3) ఉస్మానియ విశ్వవిద్యాలయం | 11 | - | 21 |

మూలం : డైరెక్టరేట్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్

అయితే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేసిన గణనీయమైన కృషి ఫలితంగా ప్రాంతీయ అసమానతలు తొలిగిపోయినాయి. నేడు మూడు ప్రాంతాల వారికి అన్ని రకాల విద్య అందు బాటులో ఉంది.

ప్రస్తుత రాజ్యాంగం ప్రకారం విద్య ఉమ్మడి జాబితా కిందకి వస్తుంది. అయినప్పటికీ విద్యా నిర్వహణలో రాష్ట్రాలదే ప్రధాన బాధ్యత. ఆర్టికల్స్ 36-51 లో ఉదహరించిన మార్గ దర్శక సూత్రాలు ప్రాతిపదికగా తీసుకొని ఇతర రాష్ట్రాలతో బాటు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా పిల్లలకు 14 సంవత్సరాలునిండేవరకు అందరికీ ఉచిత, నిర్బంధవిద్య, సార్వత్రికంగా గరపడానికి కృషి చేస్తున్నది. 1979 లో చేసిన సవరణ ప్రకారం స్త్రీలకు ఇంటర్మీడి యట్ వరకు విద్య ఉచితము.

## పాలనా యంత్రాంగం

1956 కు పూర్వం ఆంధ్రజిల్లాలలో మద్రాసు రాష్ట్రంలో పాలనా విధానం ఉండేది. తెలంగాణా ప్రాంతంలో నిజాం ప్రభుత్వం అజమాయిషీ కింద మరో రకం పాలనా విధానం ఉండేది. ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత విద్య పాలనా యంత్రాంగం దిగువ సూచించిన విధంగా రూపొందింది.

విద్యాశాఖకార్యదర్శి
|
డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ ( డి. పి. ఐ. )
|
రీజనల్ డిప్యూటీ డి. పి. ఐ. లు ( 5 )
|
జిల్లా విద్యాశాఖాధికారులు (డి. ఈ. ఓ. లు )-(30)
|
పాఠశాల తనిఖీ అధికారులు ( ఇన్‌స్పెక్టర్లు )

ఫీల్డ్ స్థాయిలో పాఠశాల తనిఖీదారులు ప్రాథమిక పాఠశాలలను, జిల్లావిద్యాధికారులు మాధ్యమిక పాఠశాలలను, ఉన్నత పాఠశాలలను తనిఖీ చేసేవారు. యాజమాన్య మేదైనా వాటి పర్యవేక్షణాధికారం జిల్లా విద్యాధికారులకు ఉండేది.

1959 లో వచ్చిన ఆంధ్రప్రదేశ్ జిల్లాపరిషత్, పంచాయతి సమితుల గ్రామీణ ప్రాంతాలలోని ప్రాథమిక, సెకండరీ విద్యాభివృద్ధి పంచాయతీరాజ్ సంస్థల బాధ్యతగా పరిణమించింది. ప్రాథమిక పాఠశాలల యాజమాన్యం సమితులది. సెకండరీ పాఠశాలల యాజమాన్యం జిల్లా పరిషత్‌లది. ఆ యా కార్యాలయాలలో లయజాన్ అధికారులుగా సమితి స్థాయిలో విద్యా విస్తరణాధికారి, పరిషత్ స్థాయిలో విద్యా విభాగం డిప్యూటీ కార్యదర్శి ఉండేవారు. ఆ తరవాత 1965 లో విద్యాశాఖలో చాలా మార్పులు వచ్చినాయి. అట్లా కాలానుగతంగా మార్పులు చెందుతూ విద్యాశాఖలో విద్యాస్థాయిలననుసరించి విడివిడిగా డైరెక్టర్ల నియామకం జరిగింది. ప్రస్తుతం పాఠశాల విద్యకు, ఉన్నతవిద్యకు, వయోజన విద్యకు వేరు వేరు డైరెక్టరేట్‌లున్నాయి. అంతే కాకుండా ప్రత్యేకించి ప్రాథమిక విద్యా విభాగానికి ఒక అడిషనల్ డైరెక్టర్ ఉన్నారు.

ప్రస్తుతం విద్యాశాఖకు కేబినెట్ హోదాలో ఒక మంత్రి ఉన్నారు. అంతేకాకుండా సాంకేతిక విద్యకు మరొక మంత్రి కూడా ఉన్నారు. విద్యా విధానాలు రూపొందించి, అమలు జరిగేటట్లు చూడటానికి, విద్యారంగ విషయంలో మంత్రికి సలహా లివ్వడానికి విద్యా కార్యదర్శి ఉన్నారు. ఈయన కింద జాయంట్ కార్యదర్శులు, సెక్షన్ ఆఫీసర్లు, గుమాస్తాలు, తదితర సిబ్బంది ఉంటారు. మొత్తం ఈ సిబ్బందిని విద్యా కార్యదర్శి కార్యాలయ మంటారు. ఇది రాష్ట్ర సచివాలయంలో ఒక భాగము. విద్యా ప్రణాళికలను రూపొందించడం, ఆదాయ వ్యయాలను తయారుచేయడం, సంస్థలకు ధన సహాయం, విద్యాశాఖలోని ఉన్నతోద్యోగుల నియామకం మొదలైన పాలసీ వ్యవహారాలు ఇక్కడ జరుగుతుంటాయి.

సచివాలయం నేరుగా విద్యా విధానాన్ని అమలు పరచదు, నిర్వహించదు. విద్యా నిర్వహణ డైరెక్టర్ల బాధ్యత. వీరి కార్యాలయాలను డైరెక్టరేట్లు అంటారు. ప్రతి డైరెక్టర్ కింద జాయింట్ డైరెక్టర్లు, డిప్యూటీ డైరెక్టర్లు, గుమాస్తాలు మొదలైన ఉద్యోగులు చాలా మంది ఉంటారు. జిల్లా స్థాయులలో జిల్లా విద్యాధికారులు, వారి కార్యాలయ సిబ్బంది, జిల్లాపరిషత్ యంత్రాంగంగా ఉంటుంది. అదే విధంగా తాలూకా స్థాయిలో సమితులు. ఇన్‌స్పెక్టరు కార్యాలయాలు ఉంటాయి. విద్యా విధానాన్ని సక్రమంగా అమలు పర్చడం, విద్యా పాలనా, విద్యా సంస్థల నిర్వహణ, ఉపాధ్యాయుల శిక్షణ, విద్యా సంస్థల నిర్వహణ, సాంఖ్యకాల తయారీ, పరీక్షా నిర్వహణ మొదలైన బాధ్యతలు ఆ యా ఉద్యోగుల సహాయంతో డైరక్టరేట్‌లు నిర్వహిస్తాయి

కాలాను గతంగా మార్పులకు లోనవుతూ వచ్చిన ఈ విద్యాశాఖ ప్రస్తుత విధానాన్ని దిగువ గమనించవచ్చు.

10)

## I రాజధానిలో

- విద్యా కార్యదర్శి
  - డైరెక్టర్ హైయర్ ఎడ్యుకేషన్
    - హైయర్ ఎడ్యుకేషన్
      - జాయింట్ డైరెక్టర్
        - డిప్యూటీ డైరెక్టర్
          - అసిస్టెంట్ డైరెక్టర్
  - డైరెక్టర్ స్కూల్ ఎడ్యుకేషన్
    - డైరెక్టర్ ఎస్ సి ఇ ఆర్ టి
    - జాయింట్ డైరెక్టర్ (2)
      - డి. డి. (3)
        - ఏ. డి.
    - జాయింట్ కమీషనర్ ఫర్ గవర్నమెంట్ ఎగ్జామ్స్
  - అడిషనల్ డైరెక్టర్ ఎలిమెంటరీ ఎడ్యుకేషన్
  - డైరెక్టర్ అడల్ట్ ఎడ్యుకేషన్
  - 
    - డైరెక్టరు లైబ్రరీస్
    - డైరెక్టరు అభ్యుదయ ప్రాథమిక విద్యాసంస్థ
    - సెక్రటరీ బోర్డ్ ఆఫ్ ఇంటర్మీడియట్ ఎడ్యుకేషన్
    - సెక్రటరీ ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూట్స్
  - సి ఏ ఓ

### II ఫీల్డ్ స్థాయిలో

(a) డైరెక్టర్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్




(b) డైరెక్టర్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్




## విత్త పరిపాలన

**( Financial Administration )**

విద్య ఒక ముఖ్యమైన సంఘసేవ అయినప్పటికీ, భారతదేశం వంటి ఆర్థికంగా వెనకబడిన దేశాలలో వ్యవసాయము, పరిశ్రమలు వంటి రంగాలలో అత్యధిక ప్రాముఖ్య మివ్వవలసిన దృష్ట్యా విద్యపట్ల చూపవలసినంత శ్రద్ధ చూపడం జరగలేదు. ఈ కారణంగానే 1980 నాటికి కూడా అనుకొన్న లక్ష్యాలను అందుకోలేక పోయినాం. అయినప్పటికీ విద్యపట్ల కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సాధ్యమైనంత కృషి చేస్తూనే వస్తున్నాయి. కింది పట్టికలో 1956 నుంచి విద్యపై పెట్టిన వ్యయం వివరాలు చూడవచ్చు.

**వివిధ ప్రణాళికలలో విద్యారంగం బడ్జెట్**

| సంవత్సరం | మొత్తం ఖర్చు (కోట్ల రూపాయలలో) | విద్యకోసం పెట్టిన ఖర్చు (కోట్ల రూపాయలలో) |
|---|---|---|
| 1956-57 | 38.01 | 7.09 |
| 1961-62 | 90.64 | 22.14 |
| 1969-70 | 276.04 | 50.78 |
| 1974-75 | 430.09 | 80.13 |
| 1979-80 | 893.64 | 164.24 |
| 1980-81 (అంచనా) | 995.61 | 198.55 |

మూలం : డైరెక్టరేట్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్

పై పట్టికను బట్టి విద్యా రంగానికి పెట్టిన ఖర్చు మొదట్లో మొత్తం ఖర్చులో కంటె ఎక్కువగాను ఆ తరవాత తక్కువగాను ఉన్నట్లు గమనించ వచ్చు. అయితే విద్యకుగాను పెడుతున్న ఖర్చు ప్రతిసంవత్సరానికీ పెరుగుతూ వస్తున్నది. ఉదాహరణకు 1956-57లో 7.09 కోట్ల రూపాయలు మాత్రమే. అయితే 1979-80 లో ఈ ఖర్చు 164.24 కోట్లకు పెరిగింది. ఇంత ఖర్చు పెడుతున్నప్పటికీ, అవసరాలు ఇంతకంటే చాలా ఎక్కువ.

ఇక విద్యా స్థాయులను బట్టి చూస్తే విద్యా రంగంలో మిగిలిన స్థాయుల కంటే అత్యధిక శాతం ప్రాథమిక విద్యకోసం ఖర్చు పెడుతున్నది మన ప్రభుత్వం. ఇది సమంజసమే. ఎందుకంటే మన దేశంలో ప్రాథమిక విద్య నిర్బంధమూ, సార్వత్రికమూ. ఈ దృష్ట్యా 14 సంవత్సరాలలోపు వయసుగల పిల్లలందరికీ విద్య గరపవలసిన ప్రయత్నంలో ఈ స్థాయి మీద అత్యధికం ఖర్చు పెట్టవలసిన పరిస్థితి తప్పనిసరి.

## వ్యవస్థా నిర్మాణం

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు మన రాష్ట్రంలో (అప్పటికి ప్రత్యేక రాష్ట్రం లేదు) తెలంగాణా ప్రాంతంలో 10 సంవత్సరాల పాఠశాల విద్య, ఆంధ్ర ప్రాంతంలో 11 సంవత్సరాల విద్యఉండేవి. ఈపాఠశాల విద్యానంతరం 2సంవత్సరాల ఇంటర్మీడియట్ విద్య, 2 సంవత్సరాల డిగ్రీ విద్య ఉండేవి. తరవాతి దశాబ్దిలో ఈ నమూనాను కొద్దిగా మార్పుచేసి లక్ష్మణస్వామి మొదలియార్ కమిషన్ పంథాలో 12 సంవత్సరాల పాఠశాల విద్య ( దీనినే హైయర్ సెకండరీ అనేవారు ), రాధాకృష్ణన్ కమిషన్ సూచించిన మూడు సంవత్సరాల అండర్‌గ్యాడ్యుయేట్ కోర్సు నమూనా నిర్వహించడం జరిగింది. కొన్ని పాఠశాలలను బహుళార్థ సాధక (**Multi-purpose**) పాఠశాలలుగా రూపొందించి కొన్ని రకాల వృత్తి విద్యలను ప్రోత్సహించడం కూడా జరిగింది. అయితే ఆర్థిక ఇబ్బందుల కారణంగా హైయరు సెకండరీ నమూనాను అన్ని పాఠశాలలో అమలు పరచలేక పోవడం జరిగింది. నిజానికి, పాత 11 సంవత్సరాల పాఠశాల చదువు నమూనా ఉన్న పాఠశాలలే ఎక్కువగా ఉండేవి. పాఠశాల, కళాశాలల మధ్య అంతరాన్ని పూరించడానికి ఒక సంవత్సరం ప్రీయూనివర్శిటీ కోర్సును కళాశాలలకు అనుబంధంగా ప్రవేశ పెట్టారు. ఆంధ్రప్రదేశ్ అవతరించిన తరవాతి తొలి సంవత్సరాలలో మన రాష్ట్రంలో ఉన్న నమూనా ఇది. ఈనమూనా ప్రకారం 5 సంవత్సరాలు ప్రాథమిక విద్య, 6 సంవత్సరాలు సెకండరీ విద్య, ఒక సంవత్సరం ప్రీయూనివర్సిటీ, మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సు ఉండేవి.

భారతీయ విద్యా కమీషన్ జాతీయ స్థాయిలో విద్యారంగాన్ని క్షుణ్ణంగా సమీక్షించి ఒక సమగ్రమైన నివేదికను 1966లో ప్రకటించింది. అయితే అప్పటికే ఈ కమిషన్ సూచించిన 10+2+3 విధానం ఆంధ్రప్రదేశ్, కేరళ రాష్ట్రాలలో అమలులో ఉండేది. నిజానికి ఈ విధానాన్ని మన రాష్ట్ర ప్రభుత్వం 1965 లోనే అమలు పరిచింది. ఈ కొత్త నమూనా ప్రకారం 10 సంవత్సరాల పాఠశాల విద్య, (అంటే 5 సంవత్సరాలు ప్రాథమిక విద్య, 5 సంవత్సరాలు సెకండరీ విద్య), రెండు సంవత్సరాల ఇంటర్మీడియట్ విద్య, మూడు సంవత్సరాల అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులు ఉంటాయి. ప్రస్తుతం మనరాష్ట్రంలో అమలులో ఉన్న విద్యా నమూనా ఇదే.

రాష్ట్రంలో విద్యారంగంలో జరిగిన మరొక మార్పు ఉన్నత విద్యాస్థాయిలో తెలుగును బోధనా మాధ్యమంగా అమలు పరచడం. దీనిని 1969 లో ప్రవేశ పెట్టడం జరిగింది. మొదట ఇంటర్మీడియట్ విద్యకు దీనిని వర్తింపజేసి తరవాత డిగ్రీ స్థాయికి విస్తరింపజేసి క్రమంగా పోస్ట్ గ్రాడ్యుయేట్, ప్రొఫెషనల్ డిగ్రీ కోర్సులకు ప్రాతిపదిక తయారు జేయడానికి ప్రయత్నాలు సాగినాయి. సాధారణవిద్య అందించే అన్ని విశ్వ విద్యాలయాలలోను ప్రస్తుతం డిగ్రీ స్థాయి వరకు తెలుగు బోధనా మాధ్యమంగా ఉంది. అంతేకాకుండా కొన్ని విశ్వ విద్యాలయాలు పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయిలోను, బి. ఎడ్ కోర్సులోను విద్యార్థులు తెలుగులో పరీక్షలు వ్రాయడానికి అనుమతించినాయి. ఈ స్థాయులదాకా తెలుగు బోధనా మాధ్యమంగా వర్తింప జేయడానికి ప్రయత్నాలు కూడా సాగుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో 1971లో పాఠశాల విద్యారంగంలో వచ్చిన మరొక మహత్తరమైన మలుపు నాన్‌డిటెన్షన్ విధానం. ఈ విధానంప్రకారం 7వతరగతి, 10వ తరగతి చివరమాత్రం పబ్లిక్ పరీక్షలు జరుగుతాయి. మిగిలిన తరగతులకు సంబంధించి వార్షిక పరీక్షల ఆధారంగా పిల్లలను నిలిపివేయడం జరగదు. అయితే ప్రాథమిక దశలో 80%, సెకండరీ దశలో 90% కనీస హాజరుగా నిర్ణయించడం జరిగింది. అంతేకాకుండా విద్యా ప్రమాణాలను మెరుగు పరచడానికిగాను నూతన మూల్యాంకనా విధానం వంటి నూతన పోకడలను ప్రవేశ పెట్టడం జరిగింది. ఇవన్నీ విద్యలో అనాదిగా వస్తూఉన్న వ్యర్థత, స్తబ్దతలను అరికట్టడానికి ప్రభుత్వం చేస్తున్న ఫలవంతమైన కృషిలో భాగాలు.

ఇవి కాకుండా విద్యా నిర్మాణంలో నమూనాలో కొన్ని కొత్తపోకడలను ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టడం జరిగింది. వాటిలో ముఖ్యమైనవి. నైవాసిక పాఠశాలలు (**Residential schools**), అభ్యుదయ ప్రాథమిక పాఠశాలలు.

## ఆంధ్రప్రదేశ్ నైవాసిక పాఠశాలలు

సామాన్య మానవునికి ప్రామాణికమైన మంచి విద్యను అందుబాటులో ఉంచే నిమిత్తం మన ప్రభుత్వం 1972 లో **Andhra Pradesh Residential Educational Institutions Society (APREIS)** ను స్థాపించింది. ఈ సంస్థ ఆధిపత్యాన తెలంగాణా ప్రాంతంవారికి సర్వేలలోను, కోస్తా ఆంధ్ర ప్రాంతం వారికి గుంటూరుజిల్లా లోని తాడికొండలోను, రాయలసీమ ప్రాంతం వారికి అనంతపురం జిల్లాలోని కొడిగెనహళ్లిలోను నైవాసిక పాఠశాలలున్నాయి. ఈ పాఠశాలలు 5 నుంచి 10 వ తరగతి వరకు పాఠశాల విద్య అందిస్తున్నాయి. ఈ పాఠశాలలలో బోధనా మాధ్యమం తెలుగు. ఇది కాకుండా ఈ సంస్థ గిరిజన పిల్లలకోసం ఖమ్మం జిల్లాలోని కిన్నెరసాని డామ్ దగ్గర ఒక నైవాసిక పాఠశాలను, నాగార్జునసాగర్‌లో నైవాసిక జూనియర్ కళాశాలను నెలకొల్పింది. ఈ రెండు సంస్థలలో ప్రవేశానికి ప్రాంతీయ పరిమితి లేదు.

నైవాసిక పాఠశాలల లక్ష్యాలివి :

1. గ్రామీణ ప్రాంతాలలోని అన్నివర్గాల పిల్లలలో ప్రతిభావంతులను గుర్తించడం. వీటికిగాను పోటీ పరీక్షలు 9 సంవత్సరాలు నిండిన వారికి జరుపుతారు. పరీక్షలలో ఉత్తీర్ణులైనవారికి ప్రవేశం కల్పిస్తారు.

2. అత్యుత్తమ స్థాయిలో వీరికి విద్య అందించడం

3. అత్యున్నత విద్యా వాతావరణం కల్పించడంతోపాటు, శారీరక, మానసిక, నైతిక, సాంఘిక రంగాలలో కూడా విద్యార్థులు అత్యున్నత స్థాయికి వృద్ధి పొందేటట్లు సదుపాయాలు కల్పించడం.

ఈ పాఠశాలలు బాగా ఫలవంతమైనవని రుజువు చేసుకొన్నాయి. గడిచిన నాలుగేళ్ళలోనూ 10 వ తరగతి పరీక్షలలో మొదటి 25 శ్రేణులు సంపాదించుకొన్న విద్యార్థులలో ఈ నైవాసిక పాఠశాల విద్యార్థులు.

## అభ్యుదయ ప్రాథమిక, పాఠశాలలు

విద్యతోబాటు శారీరక, నైతిక, సాంఘిక రంగాలలో వికాసం అందించడానికి రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డిగారి చైతన్యస్రవంతి ఫలితంగా రూపులు దిద్దుకొన్న పాఠశాలలివి. ఒకటి నుంచి ఐదు తరగతుల వరకు విద్యగరిపే పాఠశాలలివి. అయితే కొన్ని ఉన్నత ప్రాథమిక పాఠశాలలలో 6, 7 తరగతులుకూడా ఉన్నాయి. ఇతర ప్రాథమిక పాఠశాలల లోని విద్యాప్రణాళికే ఈ పాఠశాలలలో కూడా ఉంటుంది. అదనంగా కొన్ని పాఠ్యాంశాలను కూడా చేర్చినారు. పాఠశాల దైనందిన కార్యక్రమమిట్లా ఉంటుంది.

ఉదయం 6 గం నుంచి 7.30 వరకు లేదా 6.30 నుంచి 8.00 వరకు } ప్రార్థన, యోగాసనాలు, ఆచరణాత్మక కార్యక్రమాలు మొదలైనవి.

9 గం. నుంచి మధ్యాహ్నం 12.40 వరకు - మామూలు విద్యా కార్యకలాపాలు.

సాయంత్రం 4.00 గం.నుంచి 5.30 వరకు - పాఠ్యప్రణాళికేతర కార్యకలాపాలు.

పిల్లలలో విద్యా కౌశలంతోబాటు శారీరక, నైతిక, సాంఘిక కళాత్మక కౌశలాలను కూడా పెంపొందించడం ఈ పాఠశాలల ప్రధానోద్దేశము. స్థానికసంస్థల సహకారంతో పిల్లలకు భౌతిక వసతులే కాకుండా, ఉదయం పాలు, మధ్యాహ్నం భోజనం అందించే ప్రయత్నాలు కూడా ఉన్నాయి. ప్రస్తుతం మన రాష్ట్రంలో ఇంచుమించు 700 పాఠశాలలున్నాయి. ఈ పాఠశాలల నిర్వహణ నిమిత్తం ఒక డైరెక్టర్ ఆధిపత్యంలో అభ్యుదయ పాథమిక విద్యా సంస్థ అనే పేరుతో ఒక డైరెక్టరేట్‌ను కూడా స్థాపించడం జరిగింది.

## నియతేతర పాఠశాలలు

ఐదవ ప్రణాళికా కాలంలో ఇంకా దాదాపు 26 లక్షల మంది 6-14 ప్రాయం పిల్లలకు విద్య అందించవలసి ఉంది. అయితే 10 లక్షల మంది మాత్రమే అనేక కారణాలవల్ల నియత పాఠశాలలలో చేరి చదివే అవకాశముంది. మిగిలిన 16 లక్షల మంది పిల్లలకు నియతేతర పాఠశాలలను ఏర్పరుస్తారు. ఈ పాఠశాలల ప్రత్యేక లక్షణాలివి.

1. నేర్చుకొనే వారి (విద్యార్థుల) అవసరాలకనుగుణంగా ఈ పాఠశాలల పనివేళలుంటాయి.

2. ప్రారంభకులే కాకుండా కొద్దిపాటి అక్షరాస్యత ఉన్న పిల్లలుకూడా తమపరిజ్ఞాన స్థాయినుంచి విద్య కొనసాగించడానికి అనువుగా పాఠ్య కార్యక్రమాలుంటాయి.

3. పిల్లలకు అక్షరాస్యతకలిగించడమే కాకుండా వారిలో ఆరోగ్యము, పారిశుద్ధ్యము, శాస్త్రీయ దృక్పథము మొదలైనవికూడా పెంపొందించేలక్ష్యాలుకూడా ఈపాఠశాలలకున్నాయి.

ఈ పథకం కార్యరూపం దాల్చిననాడు మధ్యలో కారణాంతరాల వల్ల చదువు మానేసిన పిల్లలకు, పరిస్థితుల దృష్ట్యా అక్షరాస్యతకు నోచుకోలేని అభాగ్యులకు వరప్రసాదంగా ఈ పాఠశాలలు పరిణమించగలవు.

## ప్రాక్ ప్రాథమిక విద్య

"మొక్కై వంగనిది మానై వంగదు", **(As the twig is bent so shall the tree grows)** వంటి ఆర్యోక్తులెన్ని వల్లించినప్పటికీ వాస్తవానికి ఆచరణలో పసి పిల్లల పాలన పట్ల ఇవి అంతగా ప్రాధాన్యం సంతరించుకోలేక పోయినాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఈ రంగంలో జరిగిన కృషిని మదింపు చేయడం కష్టం. కాని ఒక్కటి మాత్రం స్పష్టం - ప్రాక్ ప్రాథమిక విద్యకు సంబంధించి మన రాష్ట్రంలో కృషి చాలా స్వల్పం. కచ్చితమైన సాంఖ్యకవివరాలు లేకపోయినప్పటికీ, ప్రాక్ ప్రాథమిక పాఠశాల వయసు పిల్లలలో సుమారు 1% మాత్రమే ఏదో ఒక రకమైన ప్రాక్ ప్రాథమిక విద్యనందించే సంస్థలలో ఉన్నారని అంచనా.

ప్రాక్ ప్రాథమిక విద్య (Pre-primary education), ప్రాక్ పాఠశాల విద్య (Pre school education), నర్సరీ (Nursery), కిండర్‌గార్డెన్ (Kinder garten) మాంటిసోరీ పాఠశాలలు (Montessory school), బాల్వాడీలు, అంగన్‌వాడీలు మొదలైనవి. పేర్లు ఏవైనా ఇవి ప్రధానంగా $2\frac{1}{2}$-6 సంవత్సరాల మధ్య వయసు పిల్లలకోసం నిర్దేశించబడిన విద్యా సంస్థలు.

ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలకు, ప్రాక్ ప్రాథమిక సెక్షన్ అనుబంధించబడి ఉన్నప్పటికీ ఈ పాఠశాలల కంటె ఈ విద్య పట్ల ఎక్కువగా మొగ్గు చూపినవి క్రైస్తవ మిషనరీలు, రోమన్ కాథలిక్ పాఠశాలలు, ప్రైవేట్ యాజమాన్యాలు, స్వచ్ఛంద సేవా సంస్థలు మాత్రమే. అయితే ఈ పాఠశాలలు ఎక్కువగా నగర ప్రాంతాలకు, కొంత వరకు పట్టణ ప్రాంతాలకు మాత్రమే పరిమితమై ఉన్నాయి. గ్రామీణ ప్రాంతాలలో ఇటువంటి పాఠశాలలు లేవనే చెప్పవచ్చు. ఇప్పుడిప్పుడే వీటి అభివృద్ధిని గురించి శ్రద్ధ వహించి బాల్వాడీలను, అంగన్‌వాడీలను నెలకొల్పడం జరుగుతున్నది.

ఇక ప్రాక్ పాఠశాల ఉపాధ్యాయుల విషయం పరిశీలించినట్లయితే, ఈ రంగంలో కూడా చెప్పుకో తగినంత అభివృద్ధి జరగలేదని తెలుస్తుంది. 1959 లో హైదరాబాదులోని ప్రభుత్వ విద్యా కళాశాలలో ప్రాక్ పాఠశాల ఉపాధ్యాయుల శిక్షణకోర్సును ప్రారంభించడం జరిగింది. తెలుగు ఉర్దూభాషలు బోధనా మాధ్యంగా సాగిన ఈ శిక్షణ కార్యక్రమం 1971 దాకా సాగింది. 1971 లో ఈ కోర్సును రద్దుచేసినారు. ఈ 12 సంవత్సరాల కాలంలో

కూడా 440 మందికి మాత్రమే శిక్షణ ఇవ్వడం జరిగింది. ఇది కాకుండా, నర్సరీ పాఠశాల ఉపాధ్యాయ శిక్షణ కోర్సు హైదరాబాదులోని సెయింట్ జార్జ్ గ్రామర్ స్కూల్‌తో ఉండేది. శిక్షణ కాలం ఒక సంవత్సరం అయితే ఈ కోర్సును కూడా మూసి వేయడం జరిగింది. ఆ విధంగా కొద్దికాలం పాటు ఈ రంగంలో అభివృద్ధి సాగలేదు ఇప్పుడిప్పుడే నర్సరీ, ప్రాక్ ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులకు ప్రత్యేక శిక్షణ నిచ్చే సంస్థలు కొన్ని రూపులు దిద్దుకొంటున్నాయి.

రాష్ట్రంలోని గృహ విజ్ఞానశాస్త్ర కళాశాలలు, శాఖలు బి. ఎస్ సి. విద్యార్థినులకు పాఠ్య ప్రణాళికలో అంతర్భాగంగా ఈరంగానికి సంబంధించి కొంత పరిజ్ఞానమందిస్తున్నాయి. ఆచరణాత్మక అనుభవం కోసం అనుబంధంగా నర్సరీ పాఠశాలను కూడా నడుపుతున్నాయి. 1976 నుంచి 1978 వరకు హైదరాబాదులోని గృహ విజ్ఞాన కళాశాలలో **P.G. Diploma in Pre school Child Education** అనే కోర్సును నడిపారు. 1979 నుంచి వివేకవర్ధిని కళాశాలలో మాంటిసోరీ శిక్షణ కార్యక్రమాన్ని ప్రారంభించినారు. శిక్షణాకాలం ఒక సంవత్సరం. ఇది సాయంకాలం సమయంలో సాగుతున్న కోర్సు. ఇది కాక ఈ సంవత్సరం హైదరాబాదులో ఒక ప్రైవేటు సంస్థ (బంజారాహిల్స్) ప్రాక్ ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుల శిక్షణ కోర్సును ప్రారంభించింది. ఈ శిక్షణా కాలం కూడా ఒక సంవత్సరం.

గ్రామీణ ప్రాంతాలలో పిల్లల వికాసం కోసం బాల్వాడి, అంగన్‌వాడీ కార్యక్రమాలను ముమ్మరం చేస్తున్నారు. ఈ పథకంలో భాగంగా ఈ కార్యకర్తలకు శిక్షణ నిచ్చే నిమిత్తం కొన్ని సంస్థలు ముందుకు వచ్చినాయి. ఆంధ్రప్రదేశ్ స్టేట్ కౌన్సిల్ ఫర్ చైల్డ్ వెల్‌ఫేర్ వారు హైదరాబాదు, ఏలూరు, తిరుపతి కేంద్రాలలో శిక్షణ సంస్థలను నడుపుతున్నారు. ఈ మూడు కేంద్రాలలోను బోధనా మాధ్యమం తెలుగు. ఇవికాక హైదరాబాదులో నిజామియా విమెన్స్ ఎడ్యుకేషనల్ సెంటరు వారు కూడా ప్రాక్ పాఠశాల ఉపాధ్యాయ శిక్షణ కోర్సును ఒక దానిని నడుపుతున్నారు.

అంగన్‌వాడీ పథకం అభివృద్ధి కార్యక్రమం కింద రాజేంద్రనగరు, సామర్లకోట, తిరుపతి కేంద్రాలలో గ్రామసేవిక శిక్షణ సంస్థలను నడుపుతున్నారు. పోషణ, ఆరోగ్యం, పిల్లల పట్ల తీసుకోవలసిన జాగ్రత్తలు, ప్రాక్ పాఠశాల విద్యలు ఈ కోర్సులోని ముఖ్యాంశాలు. కోర్సుకాలం నాలుగు నెలలు. ఇవికాక హైదరాబాదులోని గృహ విజ్ఞాన శాస్త్ర కళాశాలలో కూడా ఒక కోర్సును ప్రారంభించడం జరిగింది.

3-5 సంవత్సరాల పిల్లల వికాసం కోసం, నెదర్లండ్ ఫౌండేషన్స్‌కు భారత కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు మధ్య ఏర్పరచుకొన్న ఒక ఒప్పందం అనుసరించి హైదరాబాదులోని చెవళ్ళ సమితిలో ఇండో-డచ్ పథకాన్ని ఒక దానిని చేపట్టడం జరిగింది. ఈ పథకం కింద ఆరోగ్య, పోషణ, విద్యా విషయాలలో పిల్లల వికాసంకోసం 47 గ్రామాలలో కృషి సలుపుతున్నారు.

వీటితోబాటు ప్రాక్ పాఠశాల పిల్లలవిషయంలో ప్రస్తుత ప్రభుత్వం కనబరుస్తున్న శ్రద్ధా, సంకల్పాల దృష్ట్యా స్థానిక సంస్థల సహకారంతో ఈ రంగంలో అభివృద్ధి అచిరకాలంలోనే ఇనుమడించి మూడు పువ్వులారుకాయలుగా ప్రగతి సాగగలదని ఆశిద్దాం.

## ప్రాథమిక విద్య

సాధారణ విద్యా సోపానంలో ప్రాథమిక విద్య అత్యంత కీలకమైనది. ఈకారణంగానే కాకుండా ఆర్టికల్ 45 ప్రకారం 14 సంవత్సరాలు నిండేవరకు అందరికీ నిర్బంధంగా, ఉచితంగా విద్య అందజేయవలెననే నిబంధన కారణంగా కూడా ప్రాథమిక విద్య ప్రాధాన్యం సంతరించు కొంది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1961 లో నిర్బంధ ప్రాథమిక విద్యా చట్టాన్ని పాస్ చేసింది. ఈ చట్టం ప్రకారం 6-11 వయోసమూహం పిల్లలను తప్పని సరిగా బడికి పంపవలె. ఈ చట్టమే కాకుండా, 1959 లో వచ్చిన జిల్లాపరిషత్, పంచాయతీ సమితి చట్టం కూడా ప్రాథమిక విద్యాభివృద్ధికి తోడ్పడింది. బడిలో చేరిన పిల్లల సంఖ్యా వివరాలను దిగువ పట్టికలో చూడవచ్చు.

| సంవత్సరం | బడివయసు పిల్లల జనాభా | పాఠశాలల సంఖ్య | బడిలోచేరిన పిల్లల సంఖ్య | శాతం |
|---|---|---|---|---|
| 1956-57 | 42,35,800 | 29,076 | 24,54,054 | 57.94 |
| 1960-61 | 43,59,800 | 34,040 | 29,76,055 | 68.26 |
| 1965-66 | 49,26,700 | 37,320 | 37,69,174 | 76.51 |
| 1973-74 | 62,58,500 | 36,984 | 40,39,989 | 74.55 |
| 1977-78 | 64,44,700 | 38,836 | 46,75,907 | 72.55 |
| 1978-79 | 64,03,800 | 36,696 | 49,25,484 | 76.8 |

మూలం : డైరెక్టరేట్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ ఆం. ప్ర.

పై వివరాలను చూస్తే ప్రాథమికవిద్యపట్ల ప్రభుత్వంచేసిన, చేస్తున్న కృషి అవగతం కాగలదు. అయితే ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవలసి ఉంది. 1965-75 మధ్యకాలం ఆంధ్రప్రదేశ్‌లో ఒడుదొడుకులు వచ్చినాయి. ఈ దశాబ్దికాలంలో అలజడులు, సమ్మెలు రాష్ట్రాన్ని కలచివేసినాయి.వీటితోబాటుకొన్నిచోట్ల కరువులు, మరికొన్నిచోట్ల తుఫాన్లు రాష్ట్రాన్ని సంక్షోభానికి గురిచేసినాయి. ఈ కారణాలవల్ల అన్నిరంగాలలో వలె ఈ రంగంలో కూడా ప్రగతి ఒడుదొడుకులలో సాగింది. అయినప్పటికీ ప్రభుత్వంచేసిన అకుంఠిత కృషి ఫలితంగా ప్రగతి మళ్ళీ పుంజుకొంది. దిగువ వివరాలను చూస్తే రాష్ట్రం ప్రాథమిక విద్యపై వెచ్చించిన ధనాన్ని గమనించవచ్చు.

| సంవత్సరం | 1973-74 | 74-75 | 75-76 | 76-77 | 77-78 | 78-79 | 79-80 (బడ్జెట్) | 80-81 (బడ్జెట్) |
|---|---|---|---|---|---|---|---|---|
| ఖర్చుపెట్టినడబ్బు (కోట్ల రూ.లలో) | 38.94 | 39.78 | 51.76 | 59.24 | 66.72 | 72.17 | 79.61 | 82.72 |

వివిధ రకాల విద్యలకు ఇచ్చిన వాటాలవారిగా చూస్తే మిగిలిన ఉన్నతస్థాయిల కంటె ప్రాథమికవిద్యకు అత్యంత ఎక్కువ కేటాయిస్తున్నట్లు కనిపిస్తుంది. ఉదాహరణకు 1978-79లో మొత్తం విద్యకు పెట్టిన ఖర్చు 166.99 కోట్లు కాగా ఒక్క ప్రాథమిక విద్యకు మాత్రమే 72.17 కోట్లు కేటాయించినారు. అయినప్పటికీ పెరుగుతున్న జనాభా దృష్ట్యా 6-11 వయసు పిల్లలనందరినీ బడిలో చేర్చవలెనని అనుకొంటే దాదాపు 100 కోట్లకు పైగా ఖర్చుకాగలదని అంచనా. ఈ మొత్తాన్ని భరించలేని స్థితిలో ఉన్నాము. ఈ కారణంగా ప్రత్యామ్నాయ కార్యక్రమాలపట్ల దృష్టి కేంద్రీకరించడం జరుగుతున్నది.

## అప్పర్ ప్రైమరీ పాఠశాలలు — ఉన్నత ప్రాథమిక విద్య

6,7 తరగతులను ప్రైమరీ పాఠశాలల కనుసంధించినప్పుడు అటువంటి పాఠశాలలను అప్పర్ ప్రైమరీ పాఠశాలలంటారు. 11-13 సంవత్సరాల పిల్లలు ఈ ఉన్నత ప్రాథమిక విద్యా స్థాయిలో ఉంటారు. 1956 నుంచి ఈ విద్యాస్థాయిలో సాగిన ప్రగతి ఈ దిగువ పట్టిక చూడవచ్చు.

| సంవత్సరం | పాఠశాలల సంఖ్య | బడివయసు పిల్లల జనాభా | బడిలోచేరిన పిల్లల సంఖ్య | శాతం |
|---|---|---|---|---|
| 1956-57 | 329 | 23,12,600 | 3,18,534 | 13.77 |
| 1960-61 | 1,466 | 24,21,700 | 4,07,885 | 16.84 |
| 1965-66 | 2,578 | 26,00,700 | 6,50,637 | 25.02 |
| 1973-74 | 3,662 | 22,81,200 | 5,93,685 | 26.03 |
| 1977-78 | 4,201 | 25,12,700 | 7,47,630 | 29.75 |
| 1978-79 | 4,382 | 25,54,500 | 7,70,714 | 30.2 |

మూలం : డైరెక్టరేట్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ ఆం. ప్ర.

ప్రాథమిక విద్యలో వలెకాక ఈ స్థాయికి సంబంధించి బడిలో చేరిన పిల్లల శాతం కమంగా పెరుగుతూ వచ్చిందనేది స్పష్టం. ఈ పెరుగుదలకు కారణాలు ముఖ్యంగా దిగువ రాచించినవి.

1. అప్పర్ ప్రైమరీ పాఠశాలల సంఖ్య పెరగడం
2. అప్పర్ ప్రైమరీ, సెకండరీ పాఠశాలల 6,7 తరగతులకు ఒకే సమైక్య పాఠ్య ప్రణాళికను ప్రవేశ పెట్టడం
3. విభిన్న శాస్త్రాంశాలను బోధించడానికి పట్టభద్రులైన ఉపాధ్యాయులను నియమించడం
4. ఎక్కువ సంఖ్యలో భాషా పండితులను నియమించడం
5. పిల్లలకు పుస్తకాల గ్రాంట్లు. హాజరు స్కాలర్‌షిప్‌లు, యూనిఫార్మ్‌లు వంటి ప్రోత్సాహకాలు ప్రవేశపెట్టడం

6. ఉపాధ్యాయులకు, ముఖ్యంగా విజ్ఞానశాస్త్ర ఉపాధ్యాయులకు ఉపయుక్త పరిజ్ఞానం కలిగించడం

ప్రాథమిక, ఉన్నత ప్రాథమిక విద్యాస్థాయులపట్ల ఎంతో శ్రద్ధచూపి కృషి చేస్తున్నప్పటికీ ఈ స్థాయులలో వ్యర్థత, స్తబ్ధతలను పూర్తిగా అరికట్టలేక పోతున్నాం. ఉదాహరణకు ఈ రెండు స్థాయులలో 1978-79 నాటికి బడి మానివేసిన పిల్లల శాతాలను దిగువ పట్టికలో గమనించండి.

| | 5వ తరగతి వరకు | | | 7వ తరగతి వరకు | | |
|---|---|---|---|---|---|---|
| | బాలురు | బాలికలు | మొత్తం | బాలురు | బాలికలు | మొత్తం |
| అన్నివర్గాలవారు | 60.1 | 64.5 | 62.4 | 69.4 | 77.5 | 72.6 |
| షెడ్యూల్డుకులాలవారు | 64.7 | 66.1 | 65 2 | 75.6 | 81.7 | 77 9 |

పరిస్థితులను మెరుగు పరచడానికి చట్టాలు మాత్రమే చాలవు. ప్రభుత్వ సంకల్పంతో బాటు ప్రజల సహకారం కూడా అవసరము. ప్రాథమిక విద్యపట్ల ప్రజలుకూడా సుముఖత చూపి పిల్లలందరినీ బడిలో చేర్పించి అందువల్ల ఏర్పడే ఇబ్బందులను ఇతోధికంగా పంచుకొని ప్రభుత్వంతో సహకరించిన నాడు నూటికి నూరుపాళ్ళు అక్షరాస్యతను అచిర కాలంలో సాధించగలం.

## సెకండరీ విద్య

సెకండరీ విద్య ముఖ్యంగా మూడు కారణాలవల్ల కీలకమైన విద్యాస్థాయి అనవచ్చు.

1. విద్యార్థి ప్రాథమిక దశలో నేర్చుకొన్నవి ఈ దశలో స్థిరపడటం, విస్తృతం కావడం జరుగుతుంది.

2. ఉన్నత విద్యకోసం విద్యార్థిని ఈదశలో సంసిద్ధుని చేయడం జరుగుతుంది.

3. ఉన్నత విద్య కాకుండా ఇతర సాంకేతిక, వృత్తి విద్య మానివేసి జీవితంలో స్థిరపడబోయే విద్యార్థులను (నిజానికి వీరధికసంఖ్యలో ఉంటారు) భావిజీవితం నిమిత్తం సంసిద్ధులను చేయడం జరుగుతుంది.

సెకండరీ విద్యకు సంబంధించి నంతవరకు మన రాష్ట్రం సాధించిన ప్రగతి దిగువ పట్టిక చూస్తే తెలుస్తుంది. సెకండరీ విద్య కోసం ప్రభుత్వం పెట్టిన ఖర్చు.

| సంవత్సరం | 1973-74 | 74-75 | 75-76 | 76-77 | 77-78 | 78-79 | 79-80 (అంచనా) | 80-81 (అంచనా) |
|---|---|---|---|---|---|---|---|---|
| ఖర్చు (కోట్ల రూపాయలలో) | 27.97 | 30.81 | 36.88 | 40.09 | 45.28 | 45.28 | 53.59 | 55.22 |

| సంవత్సరం | పాఠశాలల సంఖ్య | బడి వయసు పిల్లల జనాభా | బడిలో చేరిన పిల్లల సంఖ్య | శాతం |
|---|---|---|---|---|
| 1956-57 | 783 | 21,34,800 | 1,75,641 | 8.23 |
| 1960-61 | 1224 | 22,86,700 | 1,90,658 | 8.34 |
| 1965-66 | 2297 | 24,48,000 | 3,21,108 | 13.12 |
| 1969-70 | 2929 | 27,49,700 | 2,69,483 | 9.00 |
| 1973-74 | 3155 | 31,31,700 | 5,04,221 | 16.10 |
| 1977-78 | 3380 | 35,42,700 | 5,80,414 | 16.38 |
| 1978-79 | 3567 | 36,39,600 | 6,58,945 | 18.5 |

మూలం : డైరెక్టరేట్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ ఆం. ప్ర.

పై పట్టిక గమనిస్తే సెకండరీ పాఠశాలల కోసం ప్రభుత్వం చేస్తున్న కృషి గమనించవచ్చు. 1956-57 నుంచి 1978-79 వరకు మధ్య కాలంలో పాఠశాలల సంఖ్య దాదాపు 5 రెట్లు పెరిగింది. పెరుగుతున్న జనాభాకు అనుగుణంగానే కాకుండా బడిలో చేరిన పిల్లల శాతం ఈ కాలంలో రెండు రెట్లకు పైగా పెరిగింది. ఇట్లా పెరగడానికి దోహదం చేసిన కారణాలలో జిల్లాపరిషత్‌ల పాత్ర ముఖ్యమైనది. 1-12-1959 నుంచీ ఈ జిల్లా పరిషత్తులు గ్రామీణ ప్రాంతాలలో సెకండరీ పాఠశాలను నెలకొల్పడానికి తీవ్రంగా కృషి చేస్తూ వచ్చినాయి. ఇవి కాక నాన్ డిటెన్షన్ పాలసీ కారణంగా సెకండరీ విద్యలో వ్యర్థత, స్తబ్ధతలు చాలా వరకు తగ్గినాయి.

ఇన్ని ప్రయత్నాలుజరిగినప్పటికి ఐదవప్రణాళికాలక్ష్యమైన 24 శాతాన్ని పిల్లల శాతం అందుకోలేదు. 1978-79 నాటికి బడిలో చేరిన పిల్లల శాతం 18.5 శాతం మాత్రమే. ఆరవ ప్రణాళికా కాలంలో 30 శాతం లక్ష్యంగా పెట్టుకొన్నారు. ఈ లక్ష్య సాధన నిమిత్తం కృషిని ద్విగుణీకృతం చేయవలసి ఉంది. అంతే కాకుండా ధనం కూడా ఎక్కువగా ఖర్చు పెట్టవలసి ఉంది.

ప్రాథమిక, ఉన్నత ప్రాథమిక, సెకండరీ (హైస్కూలు) విద్యలను అందచేసే పాఠశాలల వివరాలను జిల్లాల వారీగా దిగువ పట్టికలో యిచ్చినాము. ఈ గణాంక వివరాలు 1977-78 నాటివి.

# ప్రాథమిక పాఠశాలలు - జిల్లాలవారీ 1977-78

| జిల్లా నిర్వహణ | పాఠశాలల సంఖ్య బాలురు | పాఠశాలల సంఖ్య బాలికలు | పాఠశాలల సంఖ్య మొత్తం | బడిలోచేరిన వారు బాలురు | బడిలోచేరిన వారు బాలికలు | ఉపాధ్యాయులు పురుషులు | ఉపాధ్యాయులు స్త్రీలు |
|---|---|---|---|---|---|---|---|
| **1. శ్రీకాకుళం :** | | | | | | | |
| 1. కేంద్రప్రభుత్వం | 1 | .... | 1 | 211 | 156 | 5 | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 66 | .... | 66 | 2,174 | 1,724 | 95 | 17 |
| 3. పంచాయతి సమితి | 2,824 | ... | 2,824 | 1,39,693 | 1,07,047 | 4,829 | 392 |
| 4. మునిసిపల్ | 51 | .... | 51 | 5,771 | 4,845 | 134 | 87 |
| 4. ఎయిడెడ్ | 97 | .... | 97 | 7,316 | 6,172 | 226 | 72 |
| 6. అన్ ఎయిడెడ్ | 4 | .... | 4 | 68 | 61 | 3 | 1 |
| మొత్తం | 3,043 | .... | 3,043 | 1,55,233 | 1,20,005 | 5,292 | 569 |
| **2. విశాఖపట్నం :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 5 | .... | 5 | 511 | 576 | 21 | 1 |
| 2. రాష్ట్రప్రభుత్వం | 131 | .... | 131 | 4,796 | 2,076 | 153 | 18 |
| 3. పంచాయతి సమితి | 2,017 | .... | 2,017 | 1,05,597 | 68,540 | 3,058 | 475 |
| 4. మునిసిపల్ | 121 | .... | 121 | 17,253 | 15,051 | 187 | 300 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 5. ఎయిడెడ్ | 124 | .... | 124 | 11,497 | 6,726 | 179 | 140 |
| 6. అన్ ఎయిడెడ్ | 11 | .... | 11 | 1,553 | 1,262 | 17 | 57 |
| మొత్తం | 2,409 | .... | 2,400 | 1,41,307 | 94,231 | 3,615 | 991 |
| **3. తూర్పుగోదావరి :** | | | | | | | |
| 1, కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .. | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 4 | .... | 4 | 235 | 141 | 7 | 2 |
| 3. పంచాయతి సమితి | 2,082 | 1 | 2,083 | 1,20,860 | 1,11,627 | 3,855 | 1,047 |
| 4. మునిసిపల్ | 177 | 8 | 185 | 15,917 | 15,161 | 350 | 363 |
| 5. ఎయిడెడ్ | 177 | .... | 177 | 8,665 | 8,194 | 38 | 52 |
| 6. అన్ ఎయిడెడ్ | 19 | .... | 19 | 1,448 | 1,054 | 250 | 188 |
| మొత్తం | 2,459 | 9 | 2,465 | 1,47,125 | 1,26,177 | 4,500 | 1,652 |
| **4. పశ్చిమగోదావరి :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | ... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | .... |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 3. పంచాయతీ సమితి | 1,761 | 4 | 1,765 | 1,04,365 | 98,620 | 3,065 | 1,475 |
| 4. మునిసిపల్ | 109 | 3 | 112 | 10,974 | 10,763 | 230 | 240 |
| 5. ఎయిడెడ్ | 281 | .... | 281 | 17,408 | 16,605 | 436 | 342 |
| 6. అన్ ఎయిడెడ్ | 8 | .... | 8 | 784 | 742 | 5 | 29 |
| మొత్తం | 2,159 | 7 | 2,166 | 1,33,531 | 1,26,730 | 3,736 | 2,086 |
| **5 కృష్ణా :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | .... |
| 3. పంచాయతీ సమితి | 1,585 | 3 | 1,588 | 90,636 | 78,261 | 2,170 | 1,220 |
| 4. మునిసిపల్ | 100 | 5 | 105 | 13,505 | 11,722 | 272 | 271 |
| 5. ఎయిడెడ్ | 580 | .... | 580 | 36,423 | 33,158 | 986 | 772 |
| 6. అన్ ఎయిడెడ్ | 16 | .... | 16 | 6,746 | 6,481 | 60 | 72 |
| మొత్తం | 2,281 | 8 | 2,289 | 1,47,310 | 1,29,622 | 3,488 | 2,335 |
| **6. గుంటూరు :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | .... |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 3 | .... | 3 | 149 | 112 | 3 | 2 |
| 3. పంచాయతీ సమితి | 1,939 | .... | 1,939 | 1,22,485 | 97,186 | 3,283 | 1,707 |
| 4. మునిసిపల్ | 194 | .... | 194 | 17,203 | 16,333 | 466 | 486 |
| 5. ఎయిడెడ్ | 236 | .... | 236 | 24,975 | 19.451 | 531 | 463 |
| 6. అన్ ఎయిడెడ్ | 21 | .... | 21 | 1,732 | 1,426 | 24 | 74 |
| మొత్తం | 2,393 | .... | 2,393 | 1,66,544 | 1,34,508 | 4,307 | 2,732 |

7. ప్రకాశం :

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 8 | .... | 8 | 239 | 173 | 10 | 2 |
| 3. పంచాయతీ సమితి | 2,032 | 5 | 2,037 | 1,46,948 | 98,974 | 3,574 | 1,099 |
| 4. మునిసిపల్ | 29 | .... | 29 | 2,515 | 2,194 | 43 | 62 |
| 5. ఎయిడెడ్ | 135 | .... | 135 | 14,817 | 11,829 | 293 | 124 |
| 6. అన్ ఎయిడెడ్ | 16 | .... | 16 | 1,037 | 705 | 18 | 9 |
| మొత్తం | 2,220 | 5 | 2,225 | 1,65,556 | 1,13,875 | 3,937 | 1,296 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| **8. నెల్లూరు :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 8 | .... | 8 | 779 | 618 | 21 | 20 |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 3 | .... | 3 | 60 | 63 | .... | 3 |
| 3. పంచాయతీ సమితి | 1,961 | 3 | 1,964 | 78,751 | 56,956 | 2,303 | 691 |
| 4. మునిసిపల్ | 60 | .... | 60 | 5,272 | 4,660 | 87 | 155 |
| 5. ఎయిడెడ్ | 68 | 1 | 69 | 6,420 | 5,454 | 150 | 108 |
| 6. అన్ ఎయిడెడ్ | 12 | .... | 12 | 622 | 533 | 4 | 20 |
| మొత్తం | 2,112 | 4 | 2,116 | 91,904 | 68,284 | 2,565 | 997 |
| **9. కర్నూలు :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 3 | .... | 3 | 608 | 564 | 2 | 4 |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 38 | .... | 28 | 2,432 | 1,700 | 61 | 26 |
| 3. పంచాయతీ సమితి | 1,434 | 19 | 1,453 | 93,776 | 51,918 | 2,202 | 648 |
| 4. మునిసిపల్ | 86 | 14 | 100 | 9,717 | 8,773 | 190 | 242 |
| 5. ఎయిడెడ్ | 65 | 1 | 66 | 5,540 | 4,757 | 110 | 135 |

11)

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 6. అన్ ఎయిడెడ్ | 11 | .... | 11 | 1,012 | 526 | 14 | 16 |
| మొత్తం | 1,637 | 34 | 1,671 | 1,13,085 | 68,238 | 2,579 | 1,072 |
| **10. అనంతపూరు :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 5 | .... | 5 | 1,038 | 617 | 17 | 9 |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 5 | .... | 5 | 218 | 105 | 4 | 1 |
| 3. పంచాయతీ సమితి | 2,015 | 10 | 2,025 | 1,01,723 | 49,925 | 2,873 | 618 |
| 4. మునిసిపల్ | 121 | 12 | 133 | 18,448 | 15,064 | 322 | 309 |
| 5. ఎయిడెడ్ | 28 | .... | 28 | 2,467 | 1,729 | 49 | 41 |
| 6. అన్ ఎయిడెడ్ | 2 | .... | 2 | 90 | 50 | 1 | 2 |
| మొత్తం | 2,176 | 22 | 2,198 | 1,23,984 | 67,490 | 3,266 | 980 |
| **11. కడప :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 2 | .... | 2 | 136 | 110 | 4 | .. |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 3 | .... | 3 | 265 | 123 | 8 | 7 |
| 3. పంచాయతీ సమితి | 2,014 | .... | 2,014 | 1,03,647 | 60,672 | 2,900 | 580 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 4. మునిసిపల్ | 55 | .... | 55 | 3,560 | 2,309 | 137 | 128 |
| 5. ఎయిడెడ్ | 62 | .... | 62 | 6,737 | 3,982 | 139 | 55 |
| 6. అన్ ఎయిడెడ్ | 15 | .... | 15 | 1,242 | 769 | 20 | 14 |
| మొత్తం | 2,151 | .... | 2,151 | 1,15,589 | 67,965 | 3,208 | 784 |
| **12. చిత్తూరు :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 2 | .... | 2 | 353 | 142 | 8 | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 84 | .... | 34 | 1,293 | 771 | 36 | 2 |
| 3. పంచాయతీ సమితి | 2,478 | .... | 2,478 | 1,18,734 | 76,291 | 3,068 | 745 |
| 4. మునిసిపల్ | 53 | .... | 53 | 6,996 | 6,301 | 111 | 162 |
| 5. ఎయిడెడ్ | 31 | .... | 31 | 3,702 | 3,424 | 2 | 15 |
| 6. అన్ ఎయిడెడ్ | 5 | .... | 5 | 212 | 175 | 69 | 61 |
| మొత్తం | 2,603 | .... | 2,603 | 1,31,290 | 87,054 | 3,314 | 985 |
| **13. హైదరాబాదు నగరం :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 1 | .... | 1 | 72 | 55 | 1 | 1 |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 216 | 65 | 281 | 21,579 | 20,950 | 585 | 31 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 3. పంచాయతీ సమితి | .... | .... | .... | .... | .... | .... | .... |
| 4. మునిసిపల్ | .... | .... | .... | .... | .... | .... | .... |
| 5. ఎయిడెడ్ | 20 | 8 | 28 | 4,390 | 3,914 | 59 | 141 |
| 6. అన్ ఎయిడెడ్ | 85 | .... | 85 | 11,907 | 8,214 | 56 | 567 |
| మొత్తం | 322 | 73 | 395 | 37,948 | 33,133 | 701 | 1,540 |
| **14. హైదరాబాదు జిల్లా :** | | | | | | | |
| 1. కేంద్రప్రభుత్వం | .... | .... | .... | .... | ... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 3 | .... | 3 | 126 | 80 | 3 | 3 |
| 3. పంచాయతీ సమితి | 813 | 24 | 837 | 30,007 | 15,570 | 1,211 | 173 |
| 4. మునిసిపల్ | .... | .... | .... | ... | .... | .... | .... |
| 5. ఎయిడెడ్ | 2 | .... | 2 | 317 | 180 | 7 | 14 |
| 6. అన్ ఎయిడెడ్ | 22 | .... | 22 | 3,033 | 1,983 | 22 | 88 |
| మొత్తం | 840 | 24 | 864 | 33,483 | 17,813 | 1,243 | 278 |
| **15. మెదక్ :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | .... |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 23 | 1 | 24 | 3,304 | 1,464 | 86 | 23 |
| 3. పంచాయతీ సమితి | 1,210 | 22 | 1,232 | 46,961 | 18,419 | 1,867 | 96 |
| 4. మునిసిపల్ | .... | .... | .... | .... | .... | .... | .... |
| 5. ఎయిడెడ్ | 1 | .... | 1 | 106 | 58 | 6 | 3 |
| 6. అన్ ఎయిడెడ్ | 1 | ... | 1 | 84 | 21 | 5 | 1 |
| మొత్తం | 1,235 | 23 | 1,258 | 50,455 | 19,962 | 1,964 | 123 |
| **16. నిజామాబాద్ :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 31 | 2 | 33 | 2,227 | 1,172 | 71 | 17 |
| 3. పంచాయతీ సమితి | 721 | 25 | 746 | 27,207 | 9,713 | 985 | 74 |
| 4. మునిసిపల్ | .... | .... | .... | .... | .... | .... | .... |
| 5. ఎయిడెడ్ | 4 | .... | 1 | 112 | 106 | 1 | 3 |
| 6. అన్ ఎయిడెడ్ | 5 | .... | 5 | 1,299 | 1,073 | 49 | 2 |
| మొత్తం | 758 | 27 | 785 | 30,845 | 12,064 | 1,106 | 96 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| **17. మహబూబ్ నగర్ :** | | | | | | | |
| 1. కేంద్రప్రభుత్వం | 2 | .... | 2 | 74 | 57 | 2 | 1 |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 16 | 1 | 17 | 1,542 | 982 | 47 | 21 |
| 3. పంచాయతీ సమితి | 1,527 | 38 | 1,565 | 57,532 | 28,052 | 2,182 | 250 |
| 4. మునిసిపల్ | .... | .... | .... | .... | .... | ... | .... |
| 5. ఎయిడెడ్ | 3 | .... | 3 | 367 | 205 | 8 | 4 |
| 6. అన్ ఎయిడెడ్ | .... | .... | .... | .... | .... | .... | .... |
| మొత్తం | 1,548 | 39 | 1,587 | 59,515 | 29,296 | 2,239 | 276 |
| **18. నల్లగొండ :** | | | | | | | |
| 1, కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | ... | .... |
| 2. రాష్ట్రప్రభుత్వం | 36 | 1 | 37 | 2,793 | 1,932 | 113 | 22 |
| 3. పంచాయతీ సమితి | 1,452 | 14 | 1,366 | 66,050 | 33,459 | 2,192 | 207 |
| 4. మునిసిపల్ | .... | .... | .... | 1,150 | .... | .... | ... |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 5. ఎయిడెడ్ | 14 | .... | 14 | 1,135 | 785 | 11 | 16 |
| 6. అన్ ఎయిడెడ్ | 6 | .... | 6 | .... | 656 | 27 | 23 |
| మొత్తం | 1,508 | 15 | 1,523 | 71,128 | 36,832 | 2,343 | 267 |
| ***19. వరంగల్ :*** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 75 | 6 | 81 | 3,747 | 1,908 | 120 | 32 |
| 3. పంచాయతి సమితి | 1,055 | 43 | 1,083 | 46,291 | 23,213 | 1,573 | 150 |
| 4. మునిసిపల్ | .... | .... | .... | .... | .... | .... | ... |
| 5. ఎయిడెడ్ | 9 | 2 | 11 | 1,169 | 716 | 21 | 38 |
| 6. అన్ ఎయిడెడ్ | 8 | .... | 8 | 771 | 554 | 12 | 33 |
| మొత్తం | 1,147 | 51 | 1,198 | 51,978 | 26,391 | 1,726 | 253 |
| ***20. ఖమ్మం :*** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 69 | .... | 69 | 4,600 | 2,359 | 175 | 47 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 3. పంచాయతీ సమితి | 894 | — | 894 | 30,319 | 18,378 | 1,101 | 167 |
| 4. మునిసిపల్ | — | — | — | — | — | — | — |
| 5. ఎయిడెడ్ | 82 | .... | 82 | 4,000 | 3,052 | 115 | 45 |
| 6. అన్ ఎయిడెడ్ | — | .... | — | — | — | — | — |
| మొత్తం | 1,045 | — | 1,045 | 38,919 | 23,789 | 1,391 | 259 |
| **21. కరీంనగర్ :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 15 | 2 | 17 | 1,204 | 1,368 | 48 | 16 |
| 3. పంచాయతీ సమితి | 1,277 | 26 | 1,303 | 52,376 | 21,560 | 1,807 | 161 |
| 4. మునిసిపల్ | — | — | — | — | — | — | — |
| 5. ఎయిడెడ్ | — | — | — | — | — | — | — |
| 6. అన్ ఎయిడెడ్ | — | .... | — | — | — | — | — |
| మొత్తం | 1,292 | 28 | 1,320 | 53,580 | 22,928 | 1,855 | 177 |
| **22. ఆదిలాబాద్ :** | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 2 | — | 2 | 118 | 89 | 1 | 3 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) |
|---|---|---|---|---|---|---|---|
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 33 | 2 | 35 | 2,449 | 1,204 | 75 | 8 |
| 3. పంచాయతీ సమితి | 1,069 | 17 | 1,086 | 35,431 | 11,102 | 1,261 | 61 |
| 4. మునిసిపల్ | – | – | – | – | – | – | – |
| 5. ఎయిడెడ్ | – | – | – | – | – | – | – |
| 6. అన్ ఎయిడెడ్ | 6 | – | 6 | 672 | 420 | 16 | 16 |
| మొత్తం | 1,110 | 19 | 1,129 | 38,670 | 12,815 | 1,353 | 88 |
| ఆంధ్రప్రదేశ్ : | | | | | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 31 | .... | 31 | 4,002 | 2,984 | 82 | 39 |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 812 | 80 | 892 | 55,432 | 40,407 | 1,700 | 1,100 |
| 3. పంచాయతీ సమితి | 34,160 | 254 | 34,414 | 17,10,389 | 11,35,483 | 51,378 | 12,036 |
| 4. మునిసిపల్ | 1,156 | 42 | 1,198 | 1,27,131 | 1,13,497 | 2,529 | 2,806 |
| 5. ఎయిడెడ్ | 2,016 | 12 | 2,028 | 1,57,578 | 1,30,497 | 2,646 | 2,765 |
| 6. అన్ ఎయిడెడ్ | 273 | .... | 273 | 35,447 | 26,658 | 393 | 1,091 |
| మొత్తం | 38,448 | 388 | 38,836 | 20,98,979 | 14,49,205 | 59,728 | 19,837 |

# అప్పర్ ప్రైమరీ పాఠశాలలు - జిల్లాలవారీ 1977-78

| జిల్లా/నిర్వహణ | సంస్థల సంఖ్య | బడిలో చేరిన విద్యార్థులు | ఉపాధ్యాయు |
|---|---|---|---|
| **1. శ్రీకాకుళం :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 5 | 533 | 24 |
| 3. పంచాయతీ సమితి | 169 | 40,988 | 1281 |
| 4. మునిసిపల్ | 13 | 5147 | 138 |
| 5. ఎయిడెడ్ | 9 | 3424 | 88 |
| 6. అన్ ఎయిడెడ్ | 1 | 134 | 8 |
| మొత్తం | 196 | 50,226 | 1539 |
| **2. విశాఖపట్నం :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 10 | 1,623 | 47 |
| 3. పంచాయతీసమితి | 119 | 33,524 | 945 |
| 4. మునిసిపల్ | 18 | 11,210 | 267 |
| 5. ఎయిడెడ్ | 20 | 14,145 | |
| 6. అన్ ఎయిడెడ్ | 3 | 784 | 300 |
| మొత్తం | 170 | 61,286 | 1586 |
| **3. తూర్పుగోదావరి :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్రప్రభుత్వం | 1 | 720 | 26 |
| 3. పంచాయతీ సమితి | 187 | 52,269 | 1512 |
| 4. మునిసిపల్ | 29 | 12,320 | 348 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 5. ఎయిడెడ్ | 20 | 9257 | 228 |
| 6. అన్ ఎయిడెడ్ | 15 | 3590 | 83 |
| మొత్తం | 252 | 78,656 | 2197 |
| **4. పశ్చిమగోదావరి :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 3. పంచాయతీ సమితి | 154 | 44,621 | 1398 |
| 4. మునిసిపల్ | 21 | 10,715 | 251 |
| 5. ఎయిడెడ్ | 14 | 5,052 | 122 |
| 6. అన్ ఎయిడెడ్ | 4 | 1,397 | 33 |
| మొత్తం | 193 | 61,785 | 1804 |
| **5. కృష్ణా :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్రప్రభుత్వం | .... | .... | .... |
| 3. పంచాయతీ సమితి | 226 | 54,949 | 1718 |
| 4. మునిసిపల్ | 34 | 18,860 | 448 |
| 5. ఎయిడెడ్ | 56 | 17,466 | 428 |
| 6. అన్ ఎయిడెడ్ | 14 | 2,135 | 114 |
| మొత్తం | 330 | 93,510 | 2708 |
| **6. గుంటూరు :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 1 | 204 | 9 |
| 3. పంచాయతీ సమితి | 158 | 43871 | 1313 |
| 4. మునిసిపల్ | 18 | 9094 | 170 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 5. ఎయిడెడ్ | 42 | 16558 | 429 |
| 6. అన్ ఎయిడెడ్ | 6 | 2330 | 50 |
| మొత్తం | 224 | 72,057 | 1971 |
| ***7. ప్రకాశం :*** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 3. పంచాయతీ సమితి | 109 | 23939 | 829 |
| 4. మునిసిపల్ | 3 | 1362 | 34 |
| 5. ఎయిడెడ్ | 25 | 8428 | 253 |
| 6. అన్ ఎయిడెడ్ | .... | .... | .... |
| మొత్తం | 137 | 33,729 | 1,116 |
| ***8. నెల్లూరు :*** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 1 | 160 | 4 |
| 2. రాష్ట్రప్రభుత్వం | 2 | 347 | 10 |
| 3. పంచాయతీ సమితి | 157 | 29811 | 968 |
| 4. మునిసిపల్ | 5 | 2765 | 63 |
| 5. ఎయిడెడ్ | 26 | 9566 | 236 |
| 6. అన్ ఎయిడెడ్ | 3 | 360 | 21 |
| మొత్తం | 194 | 43,009 | 1302 |
| ***9. కర్నూలు :*** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 1 | 196 | 7 |
| 3. పంచాయతీ సమితి | 90 | 20,055 | 643 |
| 4. మునిసిపల్ | 8 | 3401 | 021 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 5. ఎయిడెడ్ | 26 | 10,936 | 280 |
| 6. అన్ ఎయిడెడ్ | 4 | 1725 | 51 |
| మొత్తం | 129 | 36, 313 | 1,083 |
| **10. అనంతపూర్ :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 3. పంచాయతీ సమితి | 121 | 22,316 | 724 |
| 4. మునిసిల్ | 10 | 4758 | 140 |
| 5. ఎయిడెడ్ | 4 | 2350 | 67 |
| 6. అన్ ఎయిడెడ్ | .... | .... | .... |
| మొత్తం | 135 | 29,424 | 931 |
| **11. కడప :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 2 | 668 | 29 |
| 3. పంచాయతీ సమితి | 130 | 23,377 | 940 |
| 4. మునిసిపల్ | 5 | 2,588 | 70 |
| 5. ఎయిడెడ్ | 18 | 4,748 | 141 |
| 6. అన్ ఎయిడెడ్ | 4 | 992 | 37 |
| మొత్తం | 159 | 32,373 | 1,217 |
| **12. చిత్తూరు :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 3, పంచాయతీ సమితి | 199 | 35,057 | 1,070 |
| 4. మునిసిపల్ | 20 | 10,286 | 237 |

| 1 | 2 | 3 | 5 |
|---|---|---|---|
| 5. ఎయిడెడ్ | 10 | 4,752 | 145 |
| 6. అన్ ఎయిడెడ్ | 1 | 834 | 20 |
| మొత్తం | 230 | 50,929 | 1,472 |
| ***13. హైదరాబాదు నగరం :*** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 91 | 38,865 | 1,171 |
| 3. పంచాయతీ సమితి | .... | .... | .... |
| 4. మునిసిపల్ | .... | .... | ... |
| 5. ఎయిడెడ్ | 22 | 13,453 | 493 |
| 5. అన్ ఎయిడెడ్ | 77 | 30,084 | 939 |
| మొత్తం | 190 | 82,402 | 2,603 |
| ***14. హైదరాబాదు జిల్లా :*** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 1 | 773 | 14 |
| 3, పంచాయతీ సమితి | 140 | 27,455 | 1,078 |
| 4. మునిసిపల్ | .... | .... | .... |
| 5, ఎయిడెడ్ | 10 | 2,819 | 92 |
| 6. అన్ ఎయిడెడ్ | 11 | 3,324 | 60 |
| మొత్తం | 162 | 34,371 | 1,244 |
| ***15 మెదక్ :*** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 5 | 1,685 | 63 |
| 3. పంచాయతీ సమితి | 121 | 20,751 | 921 |
| 4. మునిసిపల్ | .... | ... | |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 5. ఎయిడెడ్ | .... | .... | .... |
| 6. అన్ ఎయిడెడ్ | 1 | 289 | 8 |
| మొత్తం | 127 | 22,725 | 992 |
| ***16. నిజామాబాద్ :*** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 1 | 311 | 9 |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 10 | 5,927 | 194 |
| 3. పంచాయతీ సమితి | 125 | 23,639 | 808 |
| 4. మునిసిపల్ | .... | .... | .... |
| 5. ఎయిడెడ్ | 6 | 2,918 | 62 |
| 6, అన్ ఎయిడెడ్ | 13 | 4,867 | 125 |
| మొత్తం | 155 | 37,672 | 1,207 |
| ***17. మహబూబ్ నగర్ :*** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 14 | 3,694 | 155 |
| 3. పంచాయతీ సమితి | 197 | 40,011 | 1,419 |
| 4. మునిసిపల్ | .... | .... | .... |
| 5. ఎయిడెడ్ | 15 | 1,952 | 60 |
| 6. అన్ ఎయిడెడ్ | 2 | 891 | 42 |
| మొత్తం | 228 | 46,538 | 1,676 |
| ***18. నల్గొండ :*** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 14 | 6,174 | 169 |
| 3. పంచాయతీ సమితి | 197 | 39,314 | 1,344 |
| 4. మునిసిపల్ | .... | .... | .... |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 5. ఎయిడెడ్ | 15 | 4,123 | 103 |
| 6. అన్ ఎయిడెడ్ | 2 | 422 | 18 |
| మొత్తం | 228 | 50,023 | 1,634 |
| **19. వరంగల్ :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 4 | 1,735 | 57 |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 26 | 8,053 | 327 |
| 3. పంచాయతీ సమితి | 159 | 35,242 | 1,053 |
| 4. మునిసిపల్ | — | — | — |
| 5. ఎయిడెడ్ | 11 | 3,128 | 88 |
| 6. అన్ ఎయిడెడ్ | 7 | 2,631 | 74 |
| మొత్తం | 207 | 50,789 | 1,599 |
| **20. ఖమ్మం :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | — | — | — |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 13 | 4,993 | 143 |
| 3. పంచాయతీ సమితి | 144 | 25,730 | 915 |
| 4. మునిసిపల్ | — | — | — |
| 5. ఎయిడెడ్ | 7 | 3,847 | 53 |
| 6. అన్ ఎయిడెడ్ | — | — | — |
| మొత్తం | 164 | 34,570 | 1,111 |
| **21. కరీంనగర్ :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | — | — | — |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 11 | 5,181 | 168 |
| 3. పంచాయతీ సమితి | 249 | 52,871 | 1,740 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 4. మునిసిపల్ | — | — | — |
| 5. ఎయిడెడ్ | 2 | 868 | 21 |
| 6. అన్ ఎయిడెడ్ | 4 | 1,076 | 33 |
| మొత్తం | 267 | 59,996 | 1,962 |
| **22. ఆదిలాబాద్ :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | — | — | — |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 20 | 7,152 | 202 |
| 3. పంచాయతీ సమితి | 86 | 16,022 | 584 |
| 4. మునిసిపల్ | — | — | — |
| 5. ఎయిడెడ్ | 2 | 1,034 | 24 |
| 6. అన్ ఎయిడెడ్ | 7 | 3,392 | 106 |
| మొత్తం | 115 | 27,600 | 916 |
| **ఆంధ్ర ప్రదేశ్ :** | | | |
| 1. కేంద్ర ప్రభుత్వం | 6 | 2,206 | 70 |
| 2. రాష్ట్ర ప్రభుత్వం | 224 | 86,798 | 2,758 |
| 3. పంచాయతీసమితి | 3,254 | 7,05,812 | 23,203 |
| 4. మునిసిపల్ | 184 | 93,106 | 2,268 |
| 5. ఎయిడెడ్ | 352 | 1,40,824 | 3,713 |
| 6. అన్ ఎయిడెడ్ | 181 | 61,244 | 1,859 |
| మొత్తం | 4,201 | 10,89,990 | 33,871 |

మూలం : అర్థగణాంక శాఖ ఆం. ప్ర.

# జిల్లాలవారీగా సెకండరీ పాఠశాలలు (హైస్కూళ్ళు)-1977-78

| జిల్లా/నిర్వహణ | హైస్కూళ్ళు | బడిలో చేరినవారు | | ఉపాధ్యాయులు | |
|---|---|---|---|---|---|
| | సంఖ్య | బాలురు | బాలికలు | పురుషులు | స్త్రీలు |
| **శ్రీకాకుళం** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్ర ప్రభుత్వం | 7 | 526 | 1,771 | 39 | 54 |
| జిల్లాపరిషత్ | 131 | 21,130 | 6,555 | 1,542 | 106 |
| మునిసిపల్ | 3 | 2,474 | 519 | 72 | 17 |
| ఎయిడెడ్ | 5 | 2,284 | 1,067 | 75 | 37 |
| అన్ ఎయిడెడ్ | — | — | — | — | — |
| మొత్తం | 146 | 26,414 | 9,912 | 1,728 | 214 |
| **విశాఖపట్నం** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్ర ప్రభుత్వం | 7 | 1,536 | 2,134 | 52 | 67 |
| జిల్లాపరిషత్ | 80 | 16,433 | 4,890 | 854 | 114 |
| మునిసిపల్ | 13 | 8,063 | 3,963 | 214 | 160 |
| ఎయిడెడ్ | 15 | 7,459 | 2,648 | 213 | 108 |
| అన్ ఎయిడెడ్ | 3 | 1,042 | 534 | 44 | 20 |
| మొత్తం | 118 | 34,533 | 41,169 | 1,377 | 469 |
| **తూర్పుగోదావరి** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | 1 | 227 | 246 | 11 | 5 |
| రాష్ట్ర ప్రభుత్వం | 7 | 1,608 | 2,313 | 75 | 74 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| జిల్లా పరిషత్ | 122 | 28,556 | 15,694 | 1,698 | 221 |
| మునిసిపల్ | 13 | 5,768 | 3,845 | 215 | 118 |
| ఎయిడెడ్ | 22 | 7,895 | 5,882 | 297 | 177 |
| అన్ఎయిడెడ్ | 19 | 3,960 | 2,254 | 124 | 129 |
| మొత్తం | 184 | 48,014 | 30,234 | 2,420 | 719 |
| ్రమగోదావరి | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్ర ప్రభుత్వం | 5 | 321 | 1,407 | 35 | 45 |
| జిల్లాపరిషత్ | 131 | 25,974 | 15,696 | 1,606 | 279 |
| మునిసిపల్ | 16 | 3,945 | 2,902 | 182 | 88 |
| ఎయిడెడ్ | 22 | 9,361 | 4,327 | 377 | 132 |
| అన్ ఎయిడెడ్ | 9 | 872 | 739 | 71 | 72 |
| మొత్తం | 183 | 40,473 | 25,071 | 2,271 | 566 |
| | | | | | |
| కేంద్రప్రభుత్వం | 2 | 1,154 | 972 | 30 | 31 |
| రాష్ట్ర ప్రభుత్వం | 3 | 583 | 479 | 59 | 28 |
| జిల్లా పరిషత్ | 141 | 35,390 | 17,382 | 2,976 | 419 |
| మునిసిపల్ | 17 | 6,402 | 4,210 | 346 | 192 |
| ఎయిడెడ్ | 39 | 12,561 | 9,726 | 899 | 357 |
| అన్ ఎయిడెడ్ | 6 | 1,639 | 1,494 | 41 | 103 |
| మొత్తం | 211 | 57,729 | 34,263 | 4,351 | 1,130 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| **గుంటూరు** | | | | | |
| కేంద్రప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్రప్రభుత్వం | 3 | 524 | 688 | 26 | 39 |
| జిల్లాపరిషత్ | 123 | 26,216 | 12,378 | 1,556 | 177 |
| మునిసిపల్ | 14 | 5,626 | 3,859 | 236 | 127 |
| ఎయిడెడ్ | 61 | 21,610 | 12,813 | 905 | 363 |
| అన్ ఎయిడెడ్ | 2 | 381 | 208 | 10 | 11 |
| మొత్తం | 203 | 54,357 | 29,946 | 2,733 | 717 |
| **ప్రకాశం** | | | | | |
| కేంద్రప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్ర ప్రభుత్వం | 2 | 104 | 523 | 16 | 12 |
| జిల్లాపరిషత్ | 113 | 16,507 | 7,331 | 1,387 | 116 |
| మునిసిపల్ | 5 | 3,575 | 1,693 | 142 | 54 |
| ఎయిడెడ్ | 22 | 4,938 | 1,834 | 293 | 39 |
| అన్ ఎయిడెడ్ | 2 | 163 | 76 | 13 | 1 |
| మొత్తం | 144 | 25,287 | 11,457 | 1,851 | 222 |
| **నెల్లూరు** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | 4 | 864 | 540 | 54 | 12 |
| రాష్ట్ర ప్రభుత్వం | 4 | 526 | 862 | 37 | 28 |
| జిల్లాపరిషత్ | 99 | 13,872 | 6,899 | 1,094 | 193 |
| మునిసిపల్ | 6 | 2,752 | 1,603 | 128 | 44 |
| ఎయిడెడ్ | 16 | 6,239 | 3,647 | 234 | 149 |
| అన్ ఎయిడెడ్ | 2 | 651 | 533 | 8 | 26 |
| మొత్తం | 131 | 24,904 | 14,084 | 1,555 | 452 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| **కర్నూలు** | | | | | |
| కేంద్రప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్ర ప్రభుత్వం | 12 | 2,355 | 3,652 | 95 | 123 |
| జిల్లా పరిషత్ | 115 | 19,291 | 6,604 | 1,328 | 119 |
| మునిసిపల్ | 7 | 5,463 | 666 | 196 | 18 |
| ఎయిడెడ్ | 14 | 4,780 | 2,058 | 194 | 59 |
| అన్ ఎయిడెడ్ | 8 | 1,038 | 345 | 66 | 37 |
| మొత్తం | 156 | 32,927 | 13,325 | 1,879 | 356 |
| **అనంతపూర్ :** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | 1 | 861 | 534 | 31 | 4 |
| రాష్ట్ర ప్రభుత్వం | 3 | 877 | 902 | 29 | 30 |
| జిల్లాపరిషత్ | 129 | 20,175 | 7,827 | 1,389 | 159 |
| మునిసిపల్ | 11 | 4,702 | 2,859 | 196 | 90 |
| ఎయిడెడ్ | 3 | 1,395 | 259 | 71 | 6 |
| అన్ ఎయిడెడ్ | 5 | 1,363 | 899 | 40 | 32 |
| మొత్తం | 152 | 29,473 | 13,280 | 1,756 | 321 |
| **కడప :** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్ర ప్రభుత్వం | 2 | 338 | 1,255 | 21 | 30 |
| జిల్లాపరిషత్ | 98 | 17,011 | 4,762 | 1,341 | 154 |
| మునిసిపల్ | 6 | 2,539 | 838 | 160 | 19 |
| ఎయిడెడ్ | 14 | 4,820 | 11,913 | 219 | 64 |
| అన్ ఎయిడెడ్ | 3 | 605 | 287 | 15 | 17 |
| మొత్తం | 123 | 25,313 | 19,015 | 1,756 | 284 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| **చిత్తూరు :** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్ర ప్రభుత్వం | 4 | 375 | 985 | 14 | 42 |
| జిల్లా పరిషత్ | 140 | 26,882 | 10,286 | 1,418 | 258 |
| మునిసిపల్ | 5 | 2,346 | 1,506 | 79 | 38 |
| ఎయిడెడ్ | 9 | 4,489 | 2,636 | 154 | 86 |
| అన్ ఎయిడెడ్ | 2 | 1,212 | 729 | 32 | 24 |
| మొత్తం | 160 | 35,304 | 16,142 | 1,697 | 448 |
| **హైదరాబాదు సిటీ** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | 1 | 1,485 | — | 41 | 23 |
| రాష్ట్ర ప్రభుత్వం | 95 | 23,941 | 22,779 | 1,256 | 1,141 |
| జిల్లా పరిషత్ | — | — | — | — | — |
| మునిసిపల్ | — | — | — | — | — |
| ఎయిడెడ్ | 81 | 35,269 | 33,802 | 708 | 1,335 |
| అన్ ఎయిడెడ్ | 39 | 33,725 | 27,245 | 314 | 1,265 |
| మొత్తం | 216 | 94,420 | 83,826 | 2,319 | 3,764 |
| **హైదరాబాదు జిల్లా :** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్రప్రభుత్వం | 5 | 2,041 | 1,242 | 58 | 23 |
| జిల్లా పరిషత్ | 84 | 21,062 | 7,095 | 971 | 390 |
| మునిసిపల్ | — | — | — | — | — |
| ఎయిడెడ్ | 12 | 3,836 | 4,115 | 71 | 177 |
| అన్ ఎయిడెడ్ | 7 | 3,630 | 3,325 | 36 | 151 |
| మొత్తం | 108 | 30,569 | 15,717 | 1,136 | 741 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| **మెదక్** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్ర ప్రభుత్వం | 5 | 1,627 | 1,759 | 90 | 64 |
| జిల్లా పరిషత్ | 128 | 20,572 | 7,958 | 1,416 | 176 |
| మునిసిపల్ | — | — | — | — | — |
| ఎయిడెడ్ | 2 | 1,120 | 635 | 28 | 27 |
| అన్ ఎయిడెడ్ | 4 | 1,278 | 1,118 | 30 | 51 |
| మొత్తం | 139 | 24,597 | 11,470 | 1,564 | 318 |
| **నిజామాబాద్** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | — | — | — | — | — |
| రాష్ట్ర ప్రభుత్వం | 6 | 1,730 | 1,482 | 107 | 66 |
| జిల్లాపరిషత్ | 93 | 21,366 | 7,124 | 1,245 | 160 |
| మునిసిపల్ | — | — | — | — | — |
| ఎయిడెడ్ | 7 | 3,569 | 1,430 | 89 | 45 |
| అన్ ఎయిడెడ్ | 2 | 1,319 | 1,218 | 14 | 42 |
| మొత్తం | 108 | 27,784 | 11,304 | 1,455 | 313 |
| **మహబూబ్ నగర్** | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... |
| రాష్ట్ర ప్రభుత్వం | 16 | 5,728 | 3,945 | 362 | .... |
| జిల్లాపరిషత్ | 162 | 23,240 | 8,409 | 1,756 | .... |
| మునిసిపల్ | .... | ... | .... | .... | .... |
| ఎయిడెడ్ | 10 | 3,740 | 1,418 | 125 | .... |
| అన్ఎయిడెడ్ | 1 | 373 | 221 | 9 | .... |
| మొత్తం | 189 | 33,081 | 13,993 | 2,252 | .... |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| *నల్గొండ :* | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... |
| రాష్ట్ర ప్రభుత్వం | 11 | 2,816 | 1,039 | 162 | 35 |
| జిల్లా పరిషత్ | 161 | 16,583 | 6,822 | 1,552 | 115 |
| మునిసిపల్ | .... | .... | .... | .... | .... |
| ఎయిడెడ్ | 7 | 1,135 | 594 | 56 | 28 |
| అన్ ఎయిడెడ్ | 2 | 357 | 196 | 11 | 11 |
| మొత్తం | 181 | 23,891 | 8,651 | 1,781 | 189 |
| *వరంగల్* | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | 1 | 646 | 430 | 14 | 16 |
| రాష్ట్ర ప్రభుత్వం | 21 | 7,944 | 4,446 | 503 | 101 |
| జిల్లా పరిషత్ | 125 | 35,006 | 11,561 | 1,894 | 122 |
| మునిసిపల్ | .... | .... | .... | .... | .... |
| ఎయిడెడ్ | 12 | 4,017 | 3,974 | 139 | 113 |
| అన్ ఎయిడెడ్ | 9 | 4,871 | 1,728 | 80 | 152 |
| మొత్తం | 168 | 52,484 | 22,139 | 2,620 | 534 |
| *ఖమ్మం* | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... |
| రాష్ట్ర ప్రభుత్వం | 10 | 3,885 | 1,393 | 200 | 74 |
| జిల్లాపరిషత్ | 125 | 16,941 | 9,093 | 1,126 | 216 |
| మునిసిపల్ | .... | .... | .... | .... | .... |
| ఎయిడెడ్ | 13 | 6,762 | 5,308 | 107 | 182 |
| అన్ ఎయిడెడ్ | 5 | 1,298 | 1,016 | 43 | 65 |
| మొత్తం | 136 | 28,886 | 16,810 | 1,476 | 537 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| కరీంనగర్ | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... |
| రాష్ట్ర ప్రభుత్వం | 10 | 3,376 | 1,161 | 224 | 28 |
| జిల్లాపరిషత్ | 125 | 24,954 | 7,556 | 1,660 | 76 |
| మునిసిపల్ | .... | .... | .... | .... | .... |
| ఎయిడెడ్ | 2 | 530 | 572 | 11 | 20 |
| అన్ ఎయిడెడ్ | 8 | 2,689 | 1,601 | 80 | 62 |
| మొత్తం | 145 | 31,549 | 10,890 | 1,975 | 186 |
| ఆదిలాబాద్ : | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | .... | .... | .... | .... | .... |
| రాష్ట్ర ప్రభుత్వం | 8 | 4,999 | 2,491 | 212 | 80 |
| జిల్లా పరిషత్ | 63 | 20,068 | 6,865 | 879 | 93 |
| మునిసిపల్ | .... | .... | .... | .... | .... |
| ఎయిడెడ్ | 2 | 1,120 | 490 | 32 | 15 |
| అన్ ఎయిడెడ్ | 6 | 2,321 | 1,397 | 53 | 82 |
| మొత్తం | 79 | 28,508 | 11,245 | 1,176 | 270 |
| మొత్తం ఆంధ్రప్రదేశ్ | | | | | |
| కేంద్ర ప్రభుత్వం | 10 | 5,237 | 2,722 | 181 | 91 |
| రాష్ట్ర ప్రభుత్వం | 245 | 67,760 | 56,700 | 3,672 | 2,353 |
| జిల్లాపరిషత్ | 2,475 | 4,70,328 | 1,88,837 | 30,688 | 3,843 |
| మునిసిపల్ | 116 | 5,655 | 28,463 | 2,166 | 960 |
| ఎయిడెడ్ | 390 | 1,48,729 | 1,01,148 | 5,297 | 3,578 |
| అన్ ఎయిడెడ్ | 144 | 64,787 | 47,163 | 1,124 | 2,316 |
| మొత్తం | 3,380 | 8,10,497 | 4,27,033 | 43,128 | 13,141 |

మూలం : డైరెక్టరేట్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ ఆం. ప్ర.

## జూనియర్ కళాశాలలలో జతచేయబడిన హైస్కూళ్ళు - జిల్లాలవారీ - 1977-78

| జిల్లా | హైస్కూళ్ళ సంఖ్య | బాలబాలికలు | ఉపాధ్యాయులు |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 15 | 9,355 | 357 |
| విశాఖపట్నం | 12 | 6,958 | 219 |
| తూర్పుగోదావరి | 12 | 8,100 | 306 |
| పశ్చిమగోదావరి | 8 | 3,799 | 150 |
| కృష్ణ | 8 | 3,945 | 191 |
| గుంటూరు | 9 | 5,780 | 210 |
| ప్రకాశం | 15 | 9,227 | 306 |
| నెల్లూరు | 8 | 4,161 | 164 |
| కర్నూలు | 8 | 4,658 | 186 |
| అనంతపూర్ | 12 | 10,866 | 393 |
| కడప | 8 | 4,556 | 188 |
| చిత్తూరు | 15 | 11,384 | 403 |
| హైదరాబాద్ సిటీ | 23 | 21,679 | 933 |
| హైదరాబాద్ జిల్లా | 3 | 1,091 | 82 |
| మెదక్ | 6 | 2,600 | 155 |
| నిజామాబాద్ | 5 | 1,224 | 95 |
| మహబూబ్‌నగర్ | 11 | 2,381 | 179 |
| నల్గొండ | 9 | 3,396 | 152 |
| వరంగల్ | 13 | 7,941 | 334 |
| ఖమ్మం | 14 | 3,468 | 206 |
| కరీంనగర్ | 11 | 4,318 | 206 |
| ఆదిలాబాద్ | 6 | 3,105 | 120 |
| ఆంధ్రప్రదేశ్ మొత్తం | 231 | 1,33,992 | 5,545 |

మూలం : డైరెక్టరేట్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ ఆం. ప్ర.

## ఇంటర్మీడియట్ విద్య

సెకండరీ అనంతర ఉన్నత విద్యను రెండు దశలుగా విభజించవచ్చు - మధ్యంతర స్థాయి, డిగ్రీస్థాయి.

మధ్యంతర స్థాయి కళాశాల విద్యకు, సెకండరీవిద్యకు మధ్య వారధి వంటి స్థాయి. ఈ మధ్యంతర స్థాయి విద్య ముఖ్యంగా మూడురకాల మార్పుకు గురి అయింది. మొదట్లో అంటే స్వాతంత్ర్యం వచ్చిన రోజులలో పాఠశాలవిద్య తరవాత రెండు సంవత్సరాల ఇంటర్మీడియట్ కోర్స్ ఉండేది. అప్పట్లో ఈ కోర్స్ కళాశాలకు అనుబంధంగా ఉండేది. తరవాతి కాలంలో పాఠశాలవిద్యను సంస్కరించిన కారణంగా 1957 నుంచి పాఠశాల విద్యానంతరం ఒక సంవత్సరం మధ్యంతర విద్య ఉండేది. పాఠశాలకే అనుసంధించబడి ఉన్నప్పుడు (హైయర్ సెకండరీ పాఠశాలలు)12 వ తరగతిగాను, కళాశాలకు అనుసంధించి ఉన్నప్పుడు ప్రీ యూనివర్సిటీ కోర్స్‌గాను చెలామణిలోఉండేది. అయితే విద్యా నిర్మాణంలో ఆంధ్ర తెలంగాణాల మధ్య అంతరాలుండేవి. ఈ కారణంగా రాష్ట్రమంతటా ఒకే విధంగా ఉండేటట్లుగా 1959-60 లో ఒక సమైక్య పాఠ్య ప్రణాళికను మొదటి తరగతిలో ప్రవేశపెట్టడం జరిగింది. దానిని ప్రతిఏటా తరగతివారీగా పైకి కొనసాగించడం జరిగింది.

అన్ని విషయాలను పరిశీలించి రాష్ట్రానికి అనువైన నిర్మాణాన్ని, విధానాన్ని రూపొందించడానికిగాను 1964 లో ఒక ఉన్నతస్థాయి సమావేశం జరిగింది. విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులు, భారతప్రభుత్వం ప్రతినిధులు, ప్రముఖ విద్యావేత్తలు, రాష్ట్ర విధాన మండలి ప్రతినిధులు, విద్యాపాలకులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. ఈ సమావేశం చేసిన సిఫార్సులను రాష్ట్రప్రభుత్వం ఆమోదించి అమలుపరచిన దరిమిలా ప్రస్తుత విద్యావిధానం రాష్ట్రంలో అమలులోకి వచ్చింది. ఈ విధానం ప్రకారం ప్రాథమికస్థాయి 5 సంవత్సరాలు 2 సంవత్సరాలు ఉన్నత ప్రాథమికస్థాయి, 3 సంవత్సరాలు సెకండరీస్థాయి, 2 సంవత్సరాలు ఉన్నత సెకండరీస్థాయి, 3 సంవత్సరాలు మొదటి డిగ్రీస్థాయి. తరవాత ఉన్నత సెకండరీ స్థాయిని ఇంటర్మీడియట్ కోర్స్ అన్నారు. స్థూలంగా చెప్పాలంటే 10+2+3 నమూనాను అనుసరించి సెకండరీ విద్యకు, ఉన్నతవిద్యకు మధ్యగాఉన్న రెండు సంవత్సరాల కోర్స్ ఇది. ప్రస్తుతం అమలులో ఉన్నది ఈ కోర్స్ మాత్రమే. ఈ కోర్స్ కొన్నిచోట్ల పాఠశాలలకు అనుసంధించబడి (జూనియర్ కళాశాలలు), మరికొన్నిచోట్ల డిగ్రీ కళాశాలలకు అనుసంధించబడిఉన్నాయి ఇంకా కొన్ని ప్రత్యేకంగా ఇంటర్మీడియట్ కోర్స్‌ను మాత్రమే నిర్వహించే జూనియర్ కళాశాలలు కూడా లేకపోలేదు.

ఈ ఇంటర్మీడియట్ కోర్స్ ఇటు సాధారణ విద్యా నమూనాలోని ఉన్నతవిద్యకే కాక అనేక వృత్తి విద్యా కోర్స్‌లకు కూడా పునాదిగా ఉపకరిస్తున్నది. ఈ కోర్స్‌కు కావలసిన పాఠ్య ప్రణాళికలను, పరీక్షా విధానాలను అమలుపరచడానికి ప్రత్యేకించి రాష్ట్రస్థాయిలో ఒక సంస్థ ఉంది. దానిని బోర్డ్ ఆఫ్ ఇంటర్మీడియట్ ఎడ్యుకేషన్ అంటారు. మనరాష్ట్రంలో ఈ స్థాయిలో తెలుగు, ఇంగ్లీష్, హిందీ, ఉర్దూ, తమిళం, ఒరియా, మరాఠీ, కన్నడ భాషలు బోధనామాధ్యంగా ఉన్నాయి. పార్ట్-II ద్వితీయభాషగా తెలుగు, ఉర్దూ, హిందీ, తమిళం,

మరాఠీ, కన్నడం, ఒరియా, సంస్కృతం, పర్షియన్, అరబిక్, ఫ్రెంచ్, రష్యన్, జర్మన్, భాషలు బోధించడం జరుగుతున్నది.

మొదట్లో అంటే 1971-72 కాలంనాడు రాష్ట్రంలో 192 జూనియర్ కళాశాలలుండేవి. నేడు (1979-80) వీటి సంఖ్య 356. ఇవికాక చాలా డిగ్రీ కళాశాలలలో ఇంటర్మీడియట్ కోర్స్ ఉంది.

***ఉద్యోగోన్ముఖ కోర్స్‌లు :*** (Job Oriented Courses): 1975 - 76 లో ఇంటర్మీడియట్ బోర్డ్ Associate degree కి దారితీసే 3 సంవత్సరాల కోర్స్‌ను ప్రవేశ పెట్టింది. ఈ కోర్స్‌లు రెండు రకాలు : 1. కమర్షియల్ ప్రాక్టీసు, సెక్రటేరియల్ కోర్సు 2. ఉపాధ్యాయ విద్య ఈ విధానంలో మొదటి సంవత్సరం పాఠ్య ప్రణాళిక మామూలుగానే ఉంటుంది. విద్యార్థుల సహజ సామర్థ్యాలు, నిష్పాదన అనుసరించి వీరిని ఉద్యోగోన్ముఖ కోర్స్‌లలో చేర్చుకొంటారు. ఇటువంటి సదుపాయాలున్న కళాశాలలు 5 మాత్రమే ఉన్నాయి.

కమర్షియల్ ప్రాక్టీసు, సెక్రటేరియల్ కోర్సులు

1. ప్రభుత్వ జూనియర్ కళాశాల - ఆలియ - హైదరాబాదు.
2. పి. సి. ఆర్ ప్రభుత్వ జూనియర్ కళాశాల - చిత్తూరు
3. ప్రభుత్వ జూనియర్ కళాశాల - రాజమండ్రి

***ఉపాధ్యాయ విద్య***

1. ప్రభుత్వ బాలికల జూనియర్ కళాశాల - నాంపల్లి - హైదరాబాదు
2. ప్రభుత్వ జూనియర్ కళాశాల - అవనిగడ్డ - కృష్ణాజిల్లా

***వృత్తి విద్యా కోర్స్‌లు :*** 1979-80 లో రాష్ట్రంలోని 22 ప్రత్యేకంగా ఎంపికచేసిన జూనియర్ కళాశాలలలో 34 వృత్తి విద్యా కోర్సులను ప్రవేశ పెట్టడం జరిగింది. వీటితో బాటు 1980-81 లో 44 జూనియర్ కళాశాలలలో 68 వృత్తివిద్యా కోర్సులను ప్రారంభించే ప్రయత్నాలు సాగుతున్నాయి.

## కళాశాల విద్య

యూనివర్సిటీ గ్రాంట్స్‌చట్టం 1956 ప్రకారం విశ్వవిద్యాలయ విద్యా నిర్వహణకోసం ఒక కమీషన్ ఏర్పరచడం, విశ్వ విద్యాలయాల అభివృద్ధికి పూనుకోవడం మొదలైనచర్యల ఫలితంగా ఉన్నత విద్యలో అనేక ప్రగతి సూచక పరిణామాలు ఏర్పడినాయి. సాధారణ విద్యా నమూనాకు సంబంధించిన విశ్వవిద్యాలయాలే కాకుండా సాంకేతిక, వృత్తివిద్యల అభివృద్ధికి ప్రత్యేకవిశ్వవిద్యాలయాలుఅవతరించడం గమనార్హము. 1956లో అంటే ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన కాలంలో మనరాష్ట్రంలో మూడువిశ్వవిద్యాలయాలుండేవి. నేడు ఈదిగువపేర్కొన్న విశ్వవిద్యాలయాలున్నాయి.

1. ఉస్మానియా విశ్వవిద్యాలయం - హైదరాబాదు - 1918
2. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు (ఆంధ్ర విశ్వవిద్యాలయం) - వాల్తేరు - 1926
3. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం - తిరుపతి - 1954
4. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం - హైదరాబాదు - 1964
5. జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం - హైదరాబాదు - 1972
6. హైదరాబాదు విశ్వవిద్యాలయం - హైదరాబాదు - 1974
7. కాకతీయ విశ్వవిద్యాలయం - వరంగల్లు - 1976
8. నాగార్జున విశ్వవిద్యాలయం - గుంటూరు - 1976

పై ఎనిమిది కాక అనంతపురంలో పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటర్‌ను (1976) నెలకొల్పడం జరిగింది.

ఇక కళాశాలల పెరుగుదల గమనిస్తే, ఉన్న కళాశాలలు విస్తృతం కావడమేకాకుండా రాష్ట్రంలోని కళాశాలల సంఖ్యకూడా బాగా పెరిగింది. 1956 నాటికి రాష్ట్రంలో 44 డిగ్రీ కళాశాలలు మాత్రమే ఉండేవి. నేడు (1979-80) 235 డిగ్రీ కళాశాలలున్నాయి. ఇవి క్రమంగా ఎట్లా పెరిగినాయో దిగువ పట్టిక చూస్తే తెలుస్తుంది.

| సంవత్సరం | కళాశాలల సంఖ్య | విద్యార్థుల సంఖ్య | అధ్యాపకుల సంఖ్య |
|---|---|---|---|
| 1956-57 | 55 | 46,202 | 2,797 |
| 1960-61 | 65 | 45,866 | 3,404 |
| 1965-66 | 103 | 64,357 | 4,921 |
| 1969-70 | 192 | 1,52,528 | 7,093 |
| 1973-74 | 201 | 1,56,892 | 10,117 |
| 1977-78 | 224 | 1,54,683 | — |
| 1978-79 | 230 | 1,73,673 | — |
| 1979-80 | 235 | — | — |

మూలం : డైరెక్టరేట్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ ఆం.ప్ర.

## విశ్వవిద్యాలయాలు

మనరాష్ట్రంలో ప్రస్తుతం ఎనిమిది విశ్వవిద్యాలయాలు, ఒక పోస్ట్‌గ్రాడ్యుయేట్ సెంటర్ ఉన్నాయి. ఒకటి సాంకేతిక విద్యకు, మరొకటి వృత్తివిద్యకు ప్రత్యేకించినవి. మిగిలిన విశ్వ

విద్యాలయాలు సాధారణ విద్యనందించేవే అయినా ఇంజనీరింగ్, వైద్యవిద్య, గృహవిజ్ఞాన శాస్త్రం, అధ్యాపన శాస్త్రం మొదలైన సాంకేతిక, వృత్తివిద్యలనుకూడా అందజేస్తున్నాయి.

***ఉస్మానియా విశ్వవిద్యాలయం :*** రాష్ట్రంలో ఇది మొట్టమొదట స్థాపించబడిన విశ్వవిద్యాలయం. 1918 లో దీనిని స్థాపించినవాడు నాటి హైదరాబాదు సంస్థానం మంత్రి అక్బర్ హైదరీ. దేశంలో నలుమూలలా ఇంగ్లిష్ బోధనామాధ్యంగా ఉన్నకాలంలో ఉర్దూను బోధనాభాషగా తీసుకొని ఉన్నత విద్య గరిపిన విశ్వవిద్యాలయమిది. తెలంగాణాలోని ఆదిలాబాదు, కరీంనగర్, ఖమ్మం, మహబూబ్‌నగర్, నల్గొండ మెదక్, నిజామాబాద్, రంగారెడ్డి, హైదరాబాదు జిల్లాలు ఈ విశ్వవిద్యాలయం ప్రాంతంలోకి వస్తాయి. విజ్ఞానశాస్త్రాలు, ఆర్ట్స్, వాణిజ్యశాస్త్రం, సాంఘికశాస్త్రాలు, న్యాయశాస్త్రం, సాంకేతికశాస్త్రాలు, వైద్యం, విద్య మొదలైన రంగాలకు సంబంధించి 50 కి పైగా శాఖలున్నాయి. రెగ్యులర్‌గా చదివే విద్యార్థులతోబాటు బి. ఏ., బి. కామ్ , ఎమ్. ఏ., ఎమ్. కామ్., పరీక్షలకు ప్రైవేట్‌గా కూర్చొనే సదుపాయంకూడా ఉంది. అంతేకాకుండా మెదటి డిగ్రీ కోర్సులకు కరెస్పాన్డెన్స్ కోర్సులు కూడా ఉన్నాయి.

ఈ విశ్వవిద్యాలయంలో చదివే విద్యార్థుల, విద్య అందించే కళాశాలల వివరాలు (1978-79) దిగువ సూచించాము. వృత్తివిద్యాకళాశాలలు కూడా దీనిలో చేర్చబడినాయి.

| కళాశాలలు | సంఖ్య | విద్యార్థులసంఖ్య | | |
|---|---|---|---|---|
| | | పురుషులు | స్త్రీలు | మొత్తం |
| యూనివర్సిటీకాలేజీలు | 7 | 3,663 | 829 | 4,492 |
| కన్‌స్టిట్యూయెంట్ కాలేజీలు | 11 | 6,669 | 1,715 | 8,594 |
| అనుబంధ ప్రభుత్వ కళాశాలలు | 32 | 14,492 | 2,612 | 17,104 |
| అనుబంధ ప్రైవేట్‌కళాశాలలు | 66 | 34,601 | 9,499 | 31,100 |
| మొత్తం | 116 | 49,635 | 11,655 | 61,290 |

ఈ విశ్వవిద్యాలయం ఆవరణలో దిగువ సూచించిన సంస్థలుకూడా ఉన్నాయి.

1. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ సైన్సెస్ రీసెర్చి (Indian Council of Social Sciences Researches (I C S S R) ) ప్రాంతీయ కేంద్రం.

2. అమెరికన్ రిసర్చి & స్టడీస్ సెంటర్ ( American Research & Studies Centre ) ( ARSC )

3. దయిరాతుల్ - మ'అరిఫ్ కేంద్రం. అరబిక్ భాషలో ప్రావీణ్యం కోసం రూపొందించిన సంస్థ.

4. సంస్కృత అకాడమి. సంస్కృత భాషలో ప్రావీణ్యం కోసం ఏర్పరచిన సంస·

5. ఖగోళ శాస్త్రంలో ఉన్నత అధ్యయనపు కేంద్రం Centre for Advance Studies in Astronomy )

6. సెంటర్ ఫర్ ఎక్స్‌ప్లోరేషన్ ఆఫ్ జియోఫిజిక్స్ ( Centre for Exploration of Geo-physics )

ఈ ఆరు సంస్థలూ ఈ విశ్వ విద్యాలయంతో అంబంధమున్నవి. ఆచార్య జి. రామ్ రెడ్డి ఈ విశ్వ విద్యాలయానికి ఉపాధ్యక్షుడు.

*ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు :* 1926 లో ఈ విశ్వ విద్యాలయాన్ని స్థాపించిన నాడు కోస్తా ఆంధ్రా జిల్లాలన్నీ దీని కింద ఉండేవి. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం స్థాపనతో నెల్లూరుజిల్లా ఆ విశ్వ విద్యాలయ ప్రాంతంగా మారింది. నాగార్జున విశ్వ విద్యాలయం తన చుట్టూ 20 మైళ్లదూరం వరకు ఉన్న కళాశాలలను తన ప్రాంతంగా తీసుకొంది. మిగిలిన ప్రాంతం అంటే శ్రీకాకుళం, విశాఖపట్నం, విజయనగరం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి కృష్ణా, గుంటూరు జిల్లాలలో కొంతభాగం, ప్రకాశంజిల్లాలు ఈ విశ్వ విద్యాలయం ప్రాంతం కిందికి వస్తాయి.

మొదట్లో విజయవాడలో నాలుగు సంవత్సరాల పాటు ఉండిన ఈ విశ్వ విద్యాలయం 1931 లో వాల్తేరుకు మార్చబడింది. డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి ఉపాధ్యక్షతన ప్రారంభమై ఆకాలంలోనే జాతీయస్థాయి గుర్తింపు మన్నన పొందిన ఈ విశ్వ విద్యాలయం క్రమంగా వృద్ధి చెందుతూ వచ్చింది. నేడు ఈ విశ్వ విద్యాలయంలో కూడా 50 కి పైగా శాఖలున్నాయి. సాధారణ నమూనాలోని ఉన్నత విద్యే కాకుండా, అనేక సాంకేతిక, వృత్తి విద్యలను కూడా ఈ విశ్వ విద్యాలయం అందిస్తున్నది.

రెగ్యులర్‌గా చదివే విద్యార్థుల కందించే కోర్సులే కాకుండా బి. ఏ., బి. కామ్., ఎమ్. ఏ., ఎమ్. కామ్., డిగ్రీలకు ప్రైవేట్‌గా పరీక్షలు వ్రాసే సదుపాయం కూడా ఈ విశ్వ విద్యాలయం కల్పించింది. కొన్ని కోర్సులకు సంబంధించి గ్రాడ్యుయేట్, పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయులలో కరస్పాన్డెన్స్ కోర్సులు కూడా ఉన్నాయి.

శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు ప్రస్తుతం ఈ విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షుడు.

*శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయం :* ఈ విద్యాలయం 2-9-1954 న అవతరించింది డాక్టర్ డి. జి. గోవిందరాజులు నాయుడు మొదటి ఉపాధ్యక్షుడు. చిత్తూరు, కడప, అనంతపురం, నెల్లూరుజిల్లాలలోని కళాశాలలు ఈ విశ్వ విద్యాలయ ప్రాంతం కిందికి వస్తాయి. 15 అనుబంధ కళాశాలతో ప్రారంభమైన ఈవిశ్వ విద్యాలయపు ప్రాంతంలో నేడు (1978-79) 52 అనుబంధ కళాశాలలున్నాయి; 20,464 విద్యార్థులు, 6230 విద్యార్థినులు విద్యనార్జిస్తున్నారు.

మొదట్లో 6 సబ్జెక్ట్‌లలో ( భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము, జంతుశాస్త్రము, గణితశాస్త్రము, తత్త్వ శాస్త్రము, అర్థశాస్త్రము) మాత్రమే ఆనర్స్ కోర్సులుండేవి. 1956లో తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యం కిందఉన్న ఓరియంటల్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్ ను

ఈ విశ్వ విద్యాలయం తీసుకొంది. 1959లో ఇంజనీరింగ్ శాఖాలను స్థాపించడం జరిగింది. ఇట్లాసాగిన విస్తరణలను టూకీగా దిగువ సూచించాము.

1959 — ఆనర్సు డిగ్రీ స్థానంలో మాస్టర్సు డిగ్రీ ప్రారంభం.

1959 — మొదటి ఆనర్సు సబ్జెక్ట్‌లకు అదనంగా వృక్షశాస్త్రము, భూ విజ్ఞానశాస్త్రము మనోవిజ్ఞాన శాస్త్రము, చరిత్ర, సంస్కృతం, హిందీ, ఉర్దూ, తెలుగు, ఇంగ్లీష్ విభాగాలలో మాస్టర్సు డిగ్రీ కోర్సులు ప్రారంభం

1962 — ఎమ్. ఎస్‌సి., సాంఖ్యక శాస్త్రం

1963 — గృహ విజ్ఞాన శాస్త్రంలో మాస్టర్సు డిగ్రీ

1966-67 — ఇంజనీరింగు ఫిజిక్స్, ఎకనో మెట్రిక్స్

1969 — వాణిజ్య శాస్త్రము

1970 — తమిళం, న్యాయశాస్త్రం

1971 - సమాజం, మానవశాస్త్రం, సివిల్, మెకానికల్, ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్‌లలో పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్సులు

1976 — న్యాయదర్శన - ఆలిండియాస్థాయి సంస్కృత సంస్థ ప్రారంభం

అనేక శాఖలకు సంబంధించి సాధారణ విద్యానమూనాలోని గ్రాడ్యుయేట్, పోస్ట్ గ్రాడ్యుయేట్, పరిశోధన డిగ్రీలే కాకుండా అనేకడిప్లమా, వృత్తివిద్య, ఓరియంటల్ కోర్సులు కూడా ఉన్నాయి.

రెగ్యులర్ విద్యార్థులే కాకుండా కొన్ని డిగ్రీలకు ప్రైవేటుగా పరీక్షలువ్రాసే సదుపాయం కూడా ఈ విశ్వ విద్యాలయం కల్పించింది. అంతే కాకుండా కరెస్పాన్డెన్స్ కోర్సులుకూడా ఉన్నాయి.

ఈ విశ్వ విద్యాలయం అధ్యక్షుడు ఆచార్య ఎమ్. వి. రామశర్మ.

***హైదరాబాదు విశ్వ విద్యాలయం :*** భారత ప్రభుత్వం ఆమోదించిన 6 సూత్రాల పథకం ఫలితంగా ఆచార్య గుర్బక్ సింగ్ అధ్యక్షతన అవతరించిన కేంద్రీయ విశ్వ విద్యాలయమిది. 1977-78 నుంచి స్వంతభవనాలు. అధ్యాపక బృందం వంటి సాధన సంపత్తులతో విద్య నందించడం ప్రారంభించింది. నేడు ఈ విశ్వ విద్యాలయంలో ( 1978-79 ) 22 కోర్సు లున్నాయి. 241 మంది విద్యార్థులున్నారు. ఈ విశ్వ విద్యాలయ మందిస్తున్న కోర్సుల వివరాలివి.

భౌతికశాస్త్రం : ఎమ్. ఎస్‌సి., ఎమ్. ఫిల్. పి. హెచ్ డి.

రసాయనశాస్త్రం : -do-

జీవశాస్త్రాలు (Life S-iences) : -do-

గణితశాస్త్రం, కంప్యూటర్ ఇన్‌ఫరేషన్ : ఎమ్. ఎస్. సి., ఎమ్. ఫిల్. (గణితం) ఎమ్. ఫిల్. (Com. Method ).,

మానవీయ శాస్త్రాలు: ఎమ్.ఎ., ఎమ్.ఫిల్., పిహెచ్.డి., ఇంగ్లీష్; ఎమ్.ఏ., ఎ.మ్ ఫిల్. తత్వశాస్త్రం; పిహెచ్.డి., హిందీ.

సాంఘిక శాస్త్రాలు : పిహెచ్.డి. [తెలుగు], ఎమ్. ఫిల్. [అర్థశాస్త్రము], ఎమ్‌ఫిల్. [గ్రామీణాభివృద్ధి]

ఈ విశ్వ విద్యాలయంలో చదివే విద్యార్థులకు కొన్ని ప్రోత్సాహకాలున్నాయి. ఉదాహరణకు పోస్ట్‌గ్రాడ్యుయేట్ విద్యార్థులకు 10 మెరిట్ స్కాలర్‌షిప్‌లు, 24 మెరిట్-కమ్-మీన్సు స్కాలర్ షిప్‌లు; ఎమ్. ఫిల్. విద్యార్థులకు 48 ఫెలోషిప్‌లు; పిహెచ్.డి. విద్యార్థులకు 18 జూనియర్ ఫెలోషిప్‌లు ఉన్నాయి. ఇవికాక ఇతర సంస్థ లందించే మరో 32 ఫెలోషిప్‌లు, స్కాలర్‌షిప్‌లు ఉన్నాయి.

ఈ విశ్వ విద్యాలయానికి ఆచార్య బి. స్. రామకృష్ణ ఉపాధ్యక్షుడు.

***కాకతీయ విశ్వ విద్యాలయము :*** 1967 లో పోస్ట్ గ్రాడ్యుయేట్ కేంద్రంగా ప్రారంభమై, విస్తరించి, చివరికి 29-8-1976 న ఆచార్య వెంకటరామయ్య ఉపాధ్యక్షతన కాకతీయ విశ్వ విద్యాలయంగా అవతరించింది. వరంగల్లు మునిసిపాలిటీ సరిహద్దులలో ఉన్న అన్ని కళాశాలలు ఈవిశ్వ విద్యాలయం పరిధిలోకి వస్తాయి.

ప్రస్తుతం ఈ విశ్వ విద్యాలయం కింద 3 కనుస్టిట్యుయెంట్ కళాశాలలు, 12 అనుబంధ కళాశాలలు, 1 అసోసియేట్ కళాశాల ఉన్నాయి. ఇంజనీరింగ్, వైద్యము, న్యాయ శాస్త్రము, విద్య, ఆర్ట్స్, విజ్ఞానశాస్త్రం, వాణిజ్యశాస్త్రం, వంటి ఫాకల్టీలకింద అనేక శాఖలున్నాయి. ఈ శాఖలకు సంబంధించి మాస్టర్స్ డిగ్రీలే కాకుండా, 10 శాఖలకు సంబంధించి ఎం. ఫిల్., పిహెచ్. డి., కోర్సులు కూడా ఉన్నాయి. ఇవికాక బిజినెస్ మానేజ్ మెంట్‌లో ఒక డిప్లమాకోర్సు కూడా ఉంది· మరికొన్ని డిప్లమా కోర్సులను ప్రారంభించే ప్రయత్నాలు సాగుతున్నాయి.

ప్రస్తుతం ఆచార్య జాఫర్ నిజాం ఈ విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షుడు.

***నాగార్జునవిశ్వవిద్యాలయం :*** 1967 లో పోస్ట్‌గ్రాడ్యుయేట్ కేంద్రంగా ప్రారంభమైన ఈ విశ్వ విద్యాలయం రూపుదాల్చి 1976 నుంచి పనిచేయడం ప్రారంభించింది. ఆచార్య బాలయ్య ఈ విశ్వ విద్యాలయం తొలి ఉపాధ్యక్షుడు.

ఈ విశ్వ విద్యాలయం ప్రాంగణం నుంచి 20 మైళ్ళవరకు చుట్టూఉన్న కళాశాలలన్నీ ఈ విశ్వ విద్యాలయానికి అనుబంధ కళాశాలలు. ఆ విధంగా గుంటూరు, విజయవాడ, తెనాలి నగరాలలోని అన్ని కళాశాలలు ఈ విశ్వ విద్యాలయం పరిధిలోకి వస్తాయి.

ఆర్ట్స్, వాణిజ్య శాస్త్రం, విజ్ఞాన శాస్త్రాలకు సంబంధించిన గ్రాడ్యుయేట్, పోస్ట్ గ్రాడ్యుయేట్ డిగ్రీ కోర్సులే కాకుండా, ఇంజనీరింగ్, వైద్యం, అధ్యాపన శాస్త్రం వంటి సాంకేతిక వృత్తి విద్యలను కూడా ఈ విశ్వ విద్యాలయమందిస్తున్నది.

ఆచార్య బి. సర్వేశ్వరరావు దీనికి ఉపాధ్యక్షులుగా ఉన్నారు.

*పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటర్-అనంతపురం:* 1967లో ఈ కేంద్రం నెలకొల్పబడింది. 30-4-1976 నుండి ఈ కేంద్రానికి స్వయం ప్రతిపత్తి ఏర్పడింది. ఈ కేంద్రాన్ని విశ్వ విద్యాలయంగా రూపొందించే ప్రయత్నాలు కూడా లేకపోలేదు.

మొదట్లో తిరుపతిలో ప్రారంభమైన ఈ కేంద్రం 1968లో అనంతపురానికి తరలించ బడింది. 1971లో స్వంత భవనాలలోకి మారింది. రసాయన శాస్త్రము, మెకానిక్స్, భౌతిక శాస్త్రము, అర్థ శాస్త్రము, ఇంగ్లీష్, తెలుగు, వాణిజ్య శాస్త్రము-ఈ ఎనిమిది శాఖలకు సంబంధించి మాస్టర్స్ డిగ్రీ కోర్సులేకాకుండా పిహెచ్. డి.,కి దారితీసే పరిశోధనా సదుపాయాలు కూడా ఈ కేంద్రం అందజేస్తున్నది.

శ్రీ వై. విశ్వనాథం ఈ సెంటరుకు డైరెక్టరుగా ఉన్నారు.

ఇంతవరకు వివరించినవి సాధారణ విద్యా సమూనాలో విద్యనందించే విశ్వవిద్యాలయాలు. అయితే ఇవి సాధారణ ఉన్నత విద్యే కాకుండా సాంకేతిక, వృత్తి విద్యలను కూడా అందిస్తున్నాయి. ఇవికాక మన రాష్ట్రంలో కేవలం సాంకేతిక విద్య నందించే విశ్వ విద్యాలయ మొకటి, వృత్తి విద్యనందించే విశ్వ విద్యాలయం మరొకటి ఉన్నాయి.

## సాంకేతికవిద్య

రాష్ట్రంలోని సాంకేతిక విద్య నిర్వహణకు ప్రత్యేకించి ఒక విభాగముంది-డిపార్ట్‌మెంట్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్. రాష్ట్రంలోని సాంకేతిక విద్యా నిర్వహణకు ఒక డైరెక్టర్ కూడా ఉన్నారు. ఈ శాఖ విధులు....

1. రాష్ట్ర ప్రభుత్వం పాలసీలను అమలు పరచడం
2. సాంకేతిక విద్యకు అవసరమైన సదుపాయాలు కలగజేయడం
3. ప్రైవేట్ సంస్థలకు గ్రాంట్స్-ఇన్-ఎయిడ్ మంజూరు చేయడం
4. టెక్నికల్ & కమర్షియల్ సబ్జెక్టులలో పరీక్షలు నిర్వహించడం

ఈ డిపార్ట్‌మెంట్‌కు పాలసీవిషయాలలో తగిన సలహాలివ్వడానికి ప్రత్యేక బోర్డ్ ఉంటుంది-ది స్టేట్ బోర్డ్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్. సాంకేతిక విద్యాశాఖ అజమాయిషీలో ఈ క్రింది సంస్థలు పనిచేస్తున్నాయి.

| | |
|---|---|
| 1. పాలిటెక్నిక్‌లు (ప్రభుత్వం + ప్రైవేట్) | 22 |
| 2. మైనింగ్ ఇన్‌స్టిట్యూట్, కొత్తగూడెం | 1 |
| 3. టెక్నికల్ హైస్కూల్స్ (పాలిటెక్నిక్‌లకు అనుబంధంగా ఉన్న టెక్నికల్ పాఠశాలలు) | 12 |
| 4. సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కామర్స్, సికింద్రాబాదు (ప్రైవేట్) | 1 |

5. ఇండస్ట్రియల్ స్కూల్ (కాకినాడ ఆంధ్రా పాలిటెక్నిక్‌కు అనుబంధం) 1
6. సంగీత, నాట్య కళాశాలలు 10
7. హోమిస్టిక్ సైన్స్ శిక్షణ కళాశాల 1
8. బాలికల వొకేషనల్ ఇన్‌స్టిట్యూట్‌లు 2
9. ఫుడ్ క్రాఫ్ట్ ఇన్‌స్టిట్యూట్, హైదరాబాదు (ప్రైవేట్) 1
10. కరికులమ్ డెవలప్‌మెంట్ సెంటర్, నెల్లూరు 1
11. దామెర్ల రామారావు మెమోరియల్ ఆర్ట్ గ్యాలరీ, రాజమండ్రి 1
12. ఎయిడెడ్ ఇండస్ట్రియల్ పాఠశాలలు 26
13. ఎయిడెడ్ సంగీత పాఠశాలలు 14
14. అనెయిడెడ్ ఇండస్ట్రియల్ పాఠశాలలు 19
15. అనైడెడ్ సంగీత పాఠశాలలు 7
16. గుర్తింపు పొందిన కమర్షియల్ ఇన్‌స్టిట్యూట్‌లు 1071

---

Source; Sri P.B.N.H. Sarma, Development of Technical Education in Andhra Pradesh. In Education in Andhra Pradesh: 1956-1976, Hyderabad Telugu Akademi 1977.

| ప్లాన్ ఔట్‌లే | రూ.లు |
|---|---|
| I ప్రణాళిక | 48.53 లక్షలు |
| II ప్రణాళిక | 250.07 ,, |
| III ప్రణాళిక | 307·69 ,, |
| 1966-67 | 62.48 ,, |
| 1967-68 | 47.92 ,, |
| 1968-69 | 45.00 ,, |
| IV ప్రణాళిక | 103.14 ,, |
| 1974-75 | 32.13 ,, |
| 1975-76 | 32.13 ,, |

1976-77 సంవత్సరం నాన్ ప్లాన్ బడ్జెట్ 389.776 లక్షల యాపాయలు

1977-78 ,, ,, 428.168 లక్షలు రూపాయలు

1978-79 బడ్జెట్ అంచనా 424.461 లక్షం రూపాయలు

***జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్సిటీ :*** జె. యన్. టి. యూనివర్సిటీ చట్టం ప్రకారం 2-10-1972 న ఈ విశ్వ విద్యాలయం అవతరించింది. ఈ చట్టంలోని 4 వ సెక్షనులో సూచించిన మేరకు ఈ విశ్వ విద్యాలయం ఇంజనీరింగ్, టెక్నాలజీ, విజ్ఞానశాస్త్రాలు, సాంఘికశాస్త్రాలు, బిజినెస్ అడ్మినిస్ట్రేషన్, భాషలు వంటిరంగాలలో బోధన,పరిశోధనలకు సదుపాయాలు అందజేస్తున్నది. అయితేటెక్నాలజీమీద ప్రాముఖ్యం ఎక్కువగా ఉంచటం జరిగింది.

కాకినాడ, అనంతపురం లోని ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలలు, హైదరాబాదులోని నాగార్జున ఇంజనీరింగ్‌కళాశాల, గవర్నమెంట్ కాలేజ్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ అండ్ ఆర్కిటెక్చర్‌లు ఈ విశ్వవిద్యాలయం కన్‌స్టిట్యూయెంట్ కళాశాలలు. (ఇవికాక శ్రీవేంకటేశ్వరా, ఆంధ్రా, ఉస్మానియా విశ్వవిద్యాలయాలకు అనుబంధంగా ఇంజనీరింగ్ కళాశాలలున్నాయి. ఆ కళాశాలల నిర్వహణ ఆ యా విశ్వ విద్యాలయాలు నిర్వహిస్తుంటాయి. జె. ఎన్. టి. విశ్వవిద్యాలయానికి సాంకేతిక విద్యాశాఖ గ్రాంట్-ఇన్-ఎయిడ్ ఇస్తున్నది. ఈ విధంగా 1976-77లో ప్లాన్ బడ్జెట్ కింద 8.18 లక్షలు, నాన్‌ప్లాన్ బడ్జెట్ కింద 123.41 లక్షలు అందజేసినట్లు అంచనా. పైన పేర్కొన్న నాలుగు కళాశాలలేకాకుండా కొత్తగా పోస్ట్ గ్రాడ్యుయేట్‌స్కూల్ ఆఫ్ కన్టిన్యూయింగ్ టెక్నలాజికల్ ఎడ్యుకేషన్‌ను 1976 లో ప్రారంభించడం జరిగింది. ఇక్కడ బి. టెక్., ఎమ్. టెక్., ఎమ్. ఎస్., పి. హెచ్‌డి.,కోర్సులకు సదుపాయాలున్నాయి.

ఇవికాక ఈ విశ్వవిద్యాలయంలో 1. కన్సల్టన్సీ సర్వీసెస్, 2. ఆక్టివిటీ అనాలిసిస్, 3. ఇవాల్యుయేషన్ అని మూడు యూనిట్లుకూడా ఉన్నాయి.

డాక్టర్ ఎన్. షన్ముఖరావు ఈ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు.

ప్రైవేటు యాజమాన్యంకింద ఇటీవల హైదరాబాద్, విజయవాడ, విద్యానగర్(వాకాడు) భీమవరం, కడప మొదలైన ప్రదేశాలలో ఇంజనీరింగ్ కళాశాలలను స్థాపించడం జరిగింది.

***ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం :*** ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ రంగానికి సంబంధించిన విద్యనందించేకార్యక్రమం 1945-46 నుంచీఉంది. అప్పట్లో తెలంగాణా ప్రాంతానికి నిజాం ప్రభుత్వము. ఆంధ్రా, రాయలసీమ ప్రాంతాలకు మద్రాసు ప్రభుత్వము ఈ కృషి సలుపుతుండేవి. ఈ కృషి ప్రభుత్వాలు మారి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించే వరకు సాగుతూ వచ్చింది. ప్రత్యేకరాష్ట్రం ఏర్పడిన తరవాత ఈ రంగంలో కృషి గుణాత్మకంగాను, సంఖ్యాత్మకంగానూ పెరిగింది. ఈ రంగంలో మన రాష్ట్రానికి సంబంధించినంత వరకు జరిగిన కృషిని క్లుప్తంగా దిగువ పొందుపరచినాము.

**1945** — బాపట్లలో మొట్టమొదట వ్యవసాయ కళాశాల స్థాపన.

1946 — రాజేంద్రనగర్‌లో వ్యవసాయ కళాశాల, ఉస్మానియా విశ్వ విద్యాలయం ఆవరణలో పశువైద్య కళాశాల స్థాపన (1947లో వ్యవసాయ కళాశాలను కూడా విశ్వ విద్యాలయం ఆవరణకు తరలించడం జరిగింది)

1956 — తిరుపతిలో పశువైద్య కళాశాల స్థాపన

1961 — తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర వ్యవసాయ కళాశాల స్థాపన

ఈ కళాశాలలు ప్రాంతాలను బట్టి ఆ యా విశ్వ విద్యాలయాలచే నిర్వహించబడుతూ వచ్చినాయి. వ్యవసాయ రంగంలో అభ్యున్నతిని, పరిశోధనాత్మక ప్రగతిని సాధించడానికి దేశమంతటా వ్యవసాయ విశ్వవిద్యాలయాల స్థాపన కార్యక్రమం 1960లో ప్రారంభమైంది. ఈ కార్యక్రమంలో భాగంగా 4-5-1964 లో శ్రీ ఓ. పుల్లారెడ్డి ఉపాధ్యక్షతన ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయం అవతరించింది.

ప్రస్తుతం (1980-81) ఈ విశ్వ విద్యాలయం అజమాయిషీ క్రింద రాజేంద్రనగర్, తిరుపతి, బాపట్లలలో వ్యవసాయ కళాశాలలు, తిరుపతి, రాజేంద్రనగర్‌లలో పశువైద్య కళాశాలలు, హైదరాబాదులో గృహ విజ్ఞానశాస్త్ర కళాశాల (మొత్తం ఆరుకళాశాలలు) ఉన్నాయి. ఇవి కాక 46 పరిశోధనా కేంద్రాలు, 176 పథకాలు ఉన్నాయి.

వ్యవసాయ, పశువైద్య గృహవిజ్ఞాన పాకల్టీలకు సంబంధించి గ్రాడ్యుయేట్ డిగ్రీ కోర్సులు ఈ ఆరు కళాశాలలలో ఉన్నాయి. వాటి వివరాలివి.

| | కోర్సులు | కేటాయించిన సంఖ్య |
|---|---|---|
| i. | బి. ఎస్‌సి. (వ్యవసాయ) | 325 |
| ii. | బి. వి. ఎస్‌సి. అండ్ ఏ. హెచ్. | 106 |
| iii. | బి. ఎస్‌సి. (గృహ విజ్ఞానం) | 68 |
| vi. | ఎమ్. ఎస్‌సి. (వ్యవసాయం) | 106 |
| v. | ఎమ్. వి. ఎస్‌సి. | 55 |
| iv. | ఎమ్. ఎస్‌సి. (గృహవిజ్ఞానం) | 16 |

గ్రాడ్యుయేట్ కోర్సులకు సంబంధించిన పైన పేర్కొన్నవి కాకుండా అదనంగా దిగువ సూచించిన మేరకు ప్రత్యేక రిజర్వేషన్ సీట్లు ఉన్నాయి.

| | | బి.వి.ఎస్‌సి. (వ్యవ.) | బి.వి.ఎస్‌సి. | బి.ఎస్‌సి.(గృహ) |
|---|---|---|---|---|
| i. | ఇతర రాష్ట్రాల వారికి | 3 | 1 | 1 |
| ii. | డిఫెన్స్‌శాఖ పనిచేసే వారిపిల్లలకు | 3 | 1 | 1 |

| | | | |
|---|---|---|---|
| iii. ICAR/భారతప్రభుత్వం స్పాన్సర్ చేసిన వారికి | 20 | 8 | 6 |
| iv. VDOగా పంచాయత్‌రాజ్‌లో పనిచేస్తున్న వారికి | 22 | - | 2 |
| v. విశ్వ విద్యాలయంలో సబ్ అసిస్టెంట్లుగా పనిచేస్తున్నవారికి | 4 | - | - |
| vi. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో సబ్‌అసిస్టెంట్లుగాఉన్నవారికి | 8 | - | - |

ఈ గ్రాడ్యుయేట్, పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్సులే కాకుండా రాజేంద్రనగర్‌లో వ్యవసాయ, పశువైద్య కళాశాలలోను, హైదరాబాదు నగరంలోని గృహవిజ్ఞానశాస్త్ర కళాశాలలోను పి. హెచ్‌డి., కోర్సులున్నాయి.

పైన సూచించినవి రెగ్యులర్ కోర్సులు. ఇవి కాకుండా ఈ విశ్వ విద్యాలయం వృత్యంతర శిక్షణా కార్యక్రమాలు(In service training programmes) అన్ని కళాశాలలు ప్రతిఏటా నిర్వహిస్తున్నాయి.

ఈ మూడు ఫాకల్టీల విషయంలో మరొక విషయం గమనార్హం. వ్యవసాయ, పశువైద్య శాస్త్రాలకు సంబంధించి ఈ విశ్వ విద్యాలయం ఒక్కటే విద్య నందిస్తున్నది. అయితే గృహవిజ్ఞాన శాస్త్రానికి సంబంధించి ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయ మొక్కటే కాకుండా రాష్ట్రంలో ఇతర విశ్వ విద్యాలయాల అనుబంధ కళాశాలలు కొన్నిటిలో బి. ఎస్ సి. కోర్సులు ఉన్నాయి. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఎం. ఎస్ సి. కోర్సేకాకుండా పి. హెచ్ డి. సదుపాయం కూడా ఉంది.

శ్రీ జె. రఘోత్తమ రెడ్డి ఈ విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షుడు.

రాష్ట్రంలోని ఉన్నత విద్యను (సాధారణ, సాంకేతిక, వృత్తి విద్యలను) అందించే కళాశాలల, విశ్వ విద్యాలయాలకు సంబంధించి కొన్ని గణాంక వివరాలను దిగువ పట్టికలో సూచించినాము. ఈ వివరాలలో కేంద్రప్రభుత్వం అజమాయిషీలో ఉన్న హైదరాబాదు విశ్వ విద్యాలయం వివరాలను చేర్చలేదు. ఈ వివరాలు 1977-78 నాటివి.

# సాధారణ విద్య

| విశ్వవిద్యాలయం/సంస్థరకం | యాజమాన్యం | సంస్థలసంఖ్య | విద్యార్థులు పురుషులు | విద్యార్థులు స్త్రీలు | అధ్యాపకులు పురుషులు | అధ్యాపకులు స్త్రీలు |
|---|---|---|---|---|---|---|
| **1. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు:** | | | | | | |
| డిగ్రీ & పి. జి. | (i) ప్రభుత్వం | 20 | 10,615 | 3,193 | 660 | 149 |
| కళాశాలలు | (ii) విశ్వవిద్యాలయం | 5 | 2,817 | 671 | 406 | 49 |
| | (iii) ప్రైవేటు | 63 | 39,910 | 11,751 | 2,113 | 461 |
| | మొత్తం | 88 | 53,342 | 15,615 | 3,179 | 659 |
| (బి) జూనియర్ | (i) ప్రభుత్వం | 72 | 12,807 | 3,481 | 725 | 93 |
| కళాశాలలు | (ii) ప్రైవేటు | 45 | 9,398 | 3,372 | 512 | 135 |
| | మొత్తం | 117 | 22,205 | 6,853 | 1,237 | 228 |
| **2. నాగార్జున విశ్వవిద్యాలయం :** | | | | | | |
| (ఎ) డిగ్రీ & పి.జి. | (i) ప్రభుత్వం | 3 | 1,629 | 1,054 | 104 | 122 |
| కళాశాలలు | (ii) విశ్వవిద్యాలయం | 1 | 518 | 202 | 53 | 6 |
| (బి) [illegible] | (iii) ప్రైవేటు / (i) [illegible] | 16 | 14,902 | 5,408 | 794 | 193 |
| | మొత్తం | 21 | 17,049 | 7,564 | 951 | 321 |
| I | 5 | 3 | | | | |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| (బి) జూనియర్ | (i) ప్రభుత్వం | .... | .... | .... | .... | ... |
| కళాశాలలు | (ii) ప్రైవేటు | 13 | 2,069 | 1,868 | 115 | 52 |
| | మొత్తం | 13 | 2,069 | 1,868 | 115 | 52 |
| **3. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం :** | | | | | | |
| (ఎ) డిగ్రీ & పి.జి. | (i) ప్రభుత్వం | 19 | 10,088 | 4,021 | 684 | 159 |
| కళాశాలలు | (ii) విశ్వవిద్యాలయం | 4 | 2,319 | 605 | 229 | 22 |
| | (iii) ప్రైవేటు | 17 | 14,336 | 4,056 | 783 | 184 |
| | మొత్తం | 40 | 26,743 | 8,682 | 1,696 | 365 |
| (బి) జూనియర్ | (i) ప్రభుత్వం | 50 | 10,806 | 2,833 | 530 | 60 |
| కళాశాలలు | (ii) ప్రైవేటు | 17 | 4,684 | 1,004 | 768 | 33 |
| | మొత్తం | 67 | 15,490 | 3,837 | 768 | 93 |
| **4. ఉస్మానియా విశ్వవిద్యాలయం :** | | | | | | |
| (ఎ) డిగ్రీ & పి.జి | (i) ప్రభుత్వం | 24 | 6,047 | 1,501 | 670 | 123 |
| కళాశాలలు | (ii) విశ్వ విద్యాలయం | 11 | 3,534 | 2,064 | 505 | 147 |
| | (iii) ప్రైవేటు | 54 | 13,965 | 8,735 | 998 | 539 |
| | మొత్తం | 89 | 23,546 | 12,300 | 2,173 | 809 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| (బి) జూనియర్ కళాశాలలు | (i) ప్రభుత్వం | 89 | 9,988 | 3,260 | 1,131 | 197 |
| | (ii) ప్రైవేటు | 31 | 4,240 | 2,379 | 228 | 134 |
| | మొత్తం | 120 | 14,228 | 5,639 | 1,359 | 331 |
| **5. కాకతీయ విశ్వవిద్యాలయం :** | | | | | | |
| (ఎ) డిగ్రీ & పి.జి. కళాశాలలు | (i) ప్రభుత్వం | 3 | 267 | 720 | 59 | 25 |
| | (ii) విశ్వవిద్యాలయం | 3 | 1,315 | 233 | 146 | 11 |
| | (iii) ప్రైవేటు | 4 | 1,489 | 96 | 109 | 8 |
| | మొత్తం | 10 | 3,071 | 1,049 | 314 | 44 |
| మొత్తం : | | | | | | |
| (ఎ) డిగ్రీ & పి.జి. కళాశాలలు | (i) ప్రభుత్వం | 69 | 28,646 | 11,398 | 2,176 | 578 |
| | (ii) విశ్వవిద్యాలయం | 24 | 10,580 | 4,120 | 1,366 | 265 |
| | (iii) ప్రైవేటు | 155 | 84,602 | 30,046 | 4,796 | 1,385 |
| | మొత్తం | 248 | 1,23,828 | 45,555 | 8,340 | 2,228 |
| (బి) జూనియర్ కళాశాలలు | (i) ప్రభుత్వం | 213 | 34,933 | 9,677 | 2,492 | 366 |
| | (ii) ప్రైవేటు | 110 | 20,729 | 8,731 | 1,083 | 360 |
| | మొత్తం | 323 | 55,662 | 18,408 | 3,575 | 726 |

మూలం : డైరెక్టరేట్ అఫ్ హైయర్ ఎడ్యుకేషన్ ఆం. ప్ర.

# సాంకేతిక, వృత్తి విద్య

| విద్యారకం/సంస్థరకం | యాజమాన్యం | సంస్థల సంఖ్య | విద్యార్థులు పురుషులు | విద్యార్థులు స్త్రీలు | అధ్యాపకులు పురుషులు | అధ్యాపకులు స్త్రీలు |
|---|---|---|---|---|---|---|
| *1. వ్యవసాయం :* | | | | | | |
| ఎ. ఆం.ప్ర.వ్య. విశ్వవిద్యాలయం | | 3 | 1,399 | 51 | 264 | 14 |
| | మొత్తం | 3 | 1,399 | 51 | 264 | 14 |
| *2. ఉపాధ్యాయ శిక్షణ :* | | | | | | |
| ఎ.ఆంధ్రవిశ్వకళాపరిషత్తు | ప్రభుత్వం | 1 | 125 | 66 | 9 | 1 |
| | ప్రైవేటు | 3 | 667 | 380 | 34 | 7 |
| | మొత్తం | 4 | 792 | 446 | 43 | 8 |
| బి. నాగార్జున వి.వి | ప్రైవేటు | 2 | 263 | 249 | 16 | 16 |
| | మొత్తం | 2 | 263 | 249 | 16 | 16 |
| సి. శ్రీవేంకటేశ్వర వి.వి | ప్రభుత్వం | 2 | 160 | 137 | 24 | 1 |
| | మొత్తం | 2 | 160 | 137 | 24 | 1 |
| డి. ఉస్మానియా వి.వి | ప్రభుత్వం | 3 | 446 | 83 | 36 | 7 |
| | విశ్వవిద్యాలయం | 1 | 71 | 25 | 10 | 5 |
| | ప్రైవేటు | 3 | 127 | 280 | 8 | 25 |
| | మొత్తం | 7 | 644 | 388 | 54 | 37 |
| ఈ. కాకతీయ వి.వి. | ప్రభుత్వం | 1 | 252 | 72 | 13 | .... |
| | మొత్తం | 1 | 252 | 72 | 13 | .... |
| *3. ఇంజనీరింగ్ :* | | | | | | |
| ఎ. ఆంధ్ర వి.క.ప | విశ్వవిద్యాలయం | 1 | 1,616 | 26 | 133 | 3 |
| | మొత్తం | 1 | 1,616 | 26 | 133 | 3 |
| బి. శ్రీవేంకటేశ్వర వి.వి | విశ్వవిద్యాలయం | 1 | 571 | 8 | 69 | 1 |
| | మొత్తం | 1 | 571 | 8 | 69 | 1 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| సి. ఉస్మానియా వి.వి | విశ్వవిద్యాలయం | 2 | 1,453 | 41 | 138 | 3 |
| | మొత్తం | 2 | 1,453 | 41 | 138 | 3 |
| డి. జె. ఎన్. టి. వి.వి | విశ్వవిద్యాలయం | 5 | 4,071 | 127 | 437 | 13 |
| | మొత్తం | 5 | 4,071 | 127 | 437 | 13 |
| **4. వ్యాయామవిద్య :** | | | | | | |
| ఏ. ఆంధ్ర వి.క.ప | ప్రభుత్వం | 1 | 147 | 23 | 13 | 3 |
| బి. ఉస్మానియా వి.వి. | ప్రభుత్వం | 1 | 98 | 25 | 7 | 1 |
| **5. పశువైద్యం :** | | | | | | |
| ఏ. ఆం.ప్ర. వ్యవసాయ | విశ్వవిద్యాలయం | 2 | 544 | 7 | 143 | 2 |
| **6. గృహవిజ్ఞానం : *** | | | | | | |
| ఏ. ఆం.ప్ర. వ్యవసాయ | విశ్వవిద్యాలయం | 1 | 0 | 271 | 3 | 29 |

* ఇతర విశ్వవిద్యాలయాలలోని గృహవిజ్ఞానశాస్త్రశాఖ వివరాలు ఆ యా విశ్వవిద్యాలయాల సాధారణ విద్య గణాంక వివరాలలో కలిపి చూపడం జరిగింది.

మూలం : డైరెక్టరేట్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్ ఆం. ప్ర.

## ఉపాధ్యాయ శిక్షణ

పాఠశాల, ఉపాధ్యాయుడు అనే భావనలు అవినాభావ సంబంధమున్నవి. ఉపాధ్యాయుని దక్షత, సామర్థ్యం మొదలైనవాటి మీద విద్యాభివృద్ధి అమితంగా ఆధారపడి ఉంటుంది. ఈ విషయాన్ని గుర్తించిన మన ప్రభుత్వం పాఠశాల విద్యా రంగంలోని అన్ని స్థాయిల ఉపాధ్యాయుల వృత్తి శిక్షణకు ప్రాముఖ్యమిచ్చింది. విద్యారంగంలో పెరుగుదల అన్నప్పుడు పాఠశాలల సంఖ్యలోనే కాకుండా ఉపాధ్యాయుల సంఖ్యలో కూడా పెరుగుదల తప్పక ఉంటుంది. ఈ పెరుగుదలను దిగువ పట్టికలో చూడవచ్చు.

| పాఠశాల స్థాయి | 1956 - 57 పాఠశాల సంఖ్య | 1956 - 57 ఉపాధ్యాయుల సంఖ్య | 1978 - 79 పాఠశాలల సంఖ్య | 1978 - 79 ఉపాధ్యాయుల సంఖ్య |
|---|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 29,076 | 77,205 | 39,696 | 78,702 |
| అప్పర్ ప్రైమరీ పాఠశాలలు | 329 | 4,421 | 4,382 | 34,687 |
| సెకండరీ పాఠశాలలు | 733 | 16,166 | 3,567 | 54,833 |

పై పట్టికను గమనిస్తే పెరుగుదలలు అనేవి అన్ని స్థాయిలలోను ఉన్నా, అవి సమానంగా సాగలేదని విశదమవుతున్నది. ఉదాహరణకు పాఠశాలల సంఖ్య 1956-57 నుంచి 1978-79నాటికి ప్రాథమికస్థాయిలో 29,076 నుంచి 39,696కు మాత్రమే పెరిగింది, కాని అప్పర్ ప్రైమరీ పాఠశాలలు దాదాపు 13 రెట్లు, సెకండరీ పాఠశాలలు దాదాపు 5 రెట్లు పెరిగినాయి.

ఉపాధ్యాయ శిక్షణలకు సంబంధించి 1956-57లో మిడిల్ ట్రెయినింగు (తెలంగాణా) హైయర్ గ్రేడు ట్రెయినింగు [ఆంధ్రా], ఇంటరు ట్రెయిన్డ్ [తెలంగాణా] వంటి రకరకాల శిక్షణ కోర్సులుండేవి. [ఇవి గాక గ్రాడ్యుయేట్ స్థాయి శిక్షణ కోర్సులు కూడా ఉండేవి] వీటిలో మిడిల్ ట్రెయినింగు, హైయర్ గ్రేడు ట్రెయినింగ్ కోర్సుకాలం రెండు సంవత్సరాలు మెట్రిక్ ట్రెయినింగ్, సెకండరీ గ్రేడు ట్రెయినింగ్ కోర్సుల కాలం ఒక సంవత్సరం.

శిక్షణ పొందిన ఉపాధ్యాయుల సంఖ్య ఎక్కువ కావడంతో చాలా జూనియర్ బేసిక్ సెకండరీగ్రేడ్ శిక్షణ పాఠశాలలను 1960 లో మూసివేయడం జరిగింది. తరువాత మళ్ళీ శిక్షణ సంస్థలను పునరుద్ధరించడం జరిగింది.

## ఉపాధ్యాయ శిక్షణ సంస్థలు

విద్యారంగంలోని నూతన ధోరణులకనుగుణంగా ప్రాథమిక ఉపాధ్యాయులను తయారుచేసే నిమిత్తం 1975 - 76 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్రమంతటా 12 సంస్థలను ప్రారంభించింది. ఈ ప్రభుత్వ ఉపాధ్యాయ శిక్షణ సంస్థలు బొమ్మరపల్లి, భీముని పట్నం, ఏలూరు, రాయచోటి, కార్వేటినగరం, మహబూబ్‌నగర్, నల్గొండ, ఖమ్మం, హనుమకొండ, మెదక్, ఆదిలాబాద్, నేరేడుమెట్ట [జంటనగరాలు] లలో ఉన్నాయి. ఇవికాక షాద్‌నగర్‌లో ఒక ప్రైవేట్ సంస్థ ఉంది. ఈ ప్రభుత్వ సంస్థలలో 150 మంది దాకా చేరవచ్చు. ఈ ఉపాధ్యాయ శిక్షణలోచేరడానికి కనీసవిద్యార్హత ఇంటర్మీడియట్. శిక్షణాకాలం ఒక సంవత్సరం. బోధనామాధ్యం తెలుగు. అయితే ఉర్దూ ఉపాధ్యాయులకు ఏలూరు, రాయచోటి, నేరేడుమెట్ట, హనుమకొండ సంస్థలలో ప్రత్యేక సదుపాయాలున్నాయి.

ఉద్యోగోన్ముఖ కోర్సు కింద రెండు జూనియర్ కళాశాలలలో ఇంటర్మీడియట్ ఉపాధ్యాయ శిక్షణలను సమైక్యంచేసి మూడు సంవత్సరాల ఇంటర్మీడియట్ కోర్సుగా ప్రవేశపెట్టి ఉన్నారు. ఆ ఇంటర్మీడియట్ కోర్సును పాసయినవారు ఉపాధ్యాయ శిక్షణ సర్టిఫికెట్ పొందిన వారితో సమానం.

***విద్యాకళాశాలలు :*** గ్రాడ్యుయేట్ ఉపాధ్యాయుల శిక్షణ కోర్సు నిమిత్తం మనరాష్ట్రంలో విద్యాకళాశాలలున్నాయి. ఈ కోర్సు పాసయినవారికి **Bachelor of Education (B. Ed)** డిగ్రీ ఇస్తారు. ఈ శిక్షణ అందించే కళాశాలల పట్టీ దిగువ సూచించాము.

| కళాశాలలు | అనుమతించిన గరిష్ఠ సంఖ్య |
|---|---|
| *ఏ. ప్రభుత్వకళాశాలలు* | 1979-80 |
| 1. ప్రభుత్వ సమగ్రవిద్యా కళాశాల, హైదరాబాదు | 250 |
| 2. - do - , రాజమండ్రి | 100 |
| 3. - do - , నెల్లూరు | 100 |

| | | |
|---|---|---|
| 4. ప్రభుత్వ విద్యాకళాశాల, కర్నూలు | | 100 |
| 5. - do - | నాగార్జునసాగర్ | 100 |
| 6. - do - | మహబూబ్‌నగర్ | 200 |
| 7. - do - | వరంగల్లు | 200 |
| *బి. ప్రైవేట్ కళాశాలలు :* | | |
| 8. సెయింట్ జోసెఫ్ స్త్రీలవిద్యా కళాశాల, గుంటూరు | | 800 |
| 9. శ్రీమతి అద్దేపల్లి మహాలక్ష్మీదేవి విద్యాకళాశాల, రాజమండ్రి | | 200 |
| 10. సెయింట్ ఆన్స్ స్త్రీల విద్యాకళాశాల, సికిందరాబాదు | | 125 |
| 11. ఆంధ్రమహిళాసభ విద్యా కళాశాల, హైదరాబాదు | | 100 |
| 12. డాక్టరు నీలం సంజీవరెడ్డి విద్యాకళాశాల, హైదరాబాదు | | 200 |
| 13. ఆంధ్రా లూథరన్ విద్యాకళాశాల, గుంటూరు | | 275 |
| 14. ఆంధ్ర జాతీయ బోధన కళాశాల, మచిలీపట్నం | | 625 |
| 15. మహారాజావారి విద్యాకళాశాల, విజయనగరం | | 500 |
| 16. విద్యాశాఖ, నేదురుమల్లి బాలకృష్ణారెడ్డి ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల, విద్యానగరు | | 100 |

ఈ విద్యా కళాశాలలలో బోధనామాధ్యం ఇంగ్లీష్. అయినా బి.ఎడ్., పరీక్షను తమ మాతృభాషలో వ్రాయడానికి రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాలు అనుమతించి ఉన్నాయి.

ఈ సంవత్సరం రాష్ట్రంలో ప్రత్యేక ఉపాధి కల్పన కార్యక్రమం కింద బి. ఎడ్., కోర్సులో 350, ఉపాధ్యాయ శిక్షణ కోర్సులో 1,200 మంది షెడ్యూల్డ్ కులాల, వర్గాల అభ్యర్థులు వివిధ విద్యాకళాశాలలలోను, ఉపాధ్యాయశిక్షణ సంస్థలలోను శిక్షణపొందుతున్నారు.

ఈ రెగ్యులర్ బి. ఎడ్., కోర్సులకు అదనంగా హైదరాబాదులోని ప్రభుత్వ సమగ్ర విద్యాకళాశాలలో సాయం సమయ బి. ఎడ్. కళాశాలను స్థాపించినారు. ఈ కోర్సులో చేరదగిన విద్యార్థుల సంఖ్య 140. ఇది కాక ఉస్మానియా విశ్వ విద్యాలయం ఈ సంవత్సరం బి. ఎడ్., కరెస్పాన్డెన్స్ కోర్సును ప్రారంభించింది. ఈ కోర్సులో 200 మంది అభ్యర్థులున్నారు.

అధ్యాపన శాస్త్రంలో పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయి డిగ్రీ కోర్సులు ప్రస్తుతం 5 కళాశాలలలో ఉన్నాయి.

1. ప్రభుత్వ సమగ్ర విద్యా కళాశాల, రాజమండ్రి
2. మహరాజావారి విద్యా కళాశాల, హైదరాబాదు
3. ఆంధ్రాలూథరన్ విద్యాకళాశాల. గుంటూరు
4. ఉస్మానియా విశ్వ విద్యాలయం, విద్యాకళాశాల, హైదరాబాదు
5. వేంకటేశ్వర విశ్వ విద్యాలయం, విద్యా కళాశాల, తిరుపతి

పై సంస్థలు అందించేవి, Master of Education (M. Ed.) కోర్సులు. ఇవి కాక ఉస్మానియా, ఆంధ్రా విశ్వ విద్యాలయాలలో M. A. (Education) కోర్సులు, Ph.D., పరిశోధనావకాశాలూ ఉన్నాయి.

**భాషాపండితులు :** పాఠశాలలో తెలుగు, ఉర్దూ, హిందీ ఒంటిభాషలను ప్రత్యేకం ఆ భాషలలో పాండిత్యం పొందినవారు బోధిస్తుంటారు. ఇటువంటి భాషా పండితుల కోర్సులను ప్రభుత్వం రాజమండ్రి, నెల్లూరు, హైదరాబాదు, వరంగల్లు, కర్నూలు విద్యా కళాశాలలలో నిర్వహిస్తున్నది. వీటికి అదనంగా దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్రమహిళాసభ, ఆంధ్ర సారస్వత పరిషత్తు వంటి ప్రైవేట్‌సంస్థలు కూడా భాషాపండితుల కోర్సులను నిర్వహిస్తున్నాయి.

## వ్యాయామ విద్య

వ్యాయామవిద్యలో ఉపాధ్యాయుల, అధ్యాపకులకు శిక్షణ ఇచ్చే సంస్థలు ప్రస్తుతం రెండు ఉన్నాయి. ఈ రెండు ప్రభుత్వ కళాశాలలు. ఈ రెండు సంస్థలలోనూ అండర్ గ్రాడ్యు యేటు డిప్లమా [U. G. D.] కోర్సులు, Batchlor of Physical Education [B. P. Ed.] కోర్సులు ఉన్నాయి.

పశ్చిమ గోదావరి జిల్లా పెదవేగిలో ఉన్న గవర్నమెంట్ కాలేజ్ ఆఫ్ ఫిజికల్ ఎడ్యు కేషన్ ఆంధ్రావిశ్వవిద్యాలయానికి అనుబంధము, హైదరాబాదులోని గవర్నమెంట్ కాలేజ్ ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్ ఉస్మానియా విశ్వ విద్యాలయానికి అనుబంధము.

ఈ రెండు కళాశాలలలో శిక్షణ పొందుతున్న వారి వివరాలివి :

| వ. నం. | కళాశాల | శిక్షణ పొందుతున్న వారి సంఖ్య యు. జి. డి. | | బి. పి. ఎడ్. |
|---|---|---|---|---|
| 1. | గవర్నమెంట్ కాలేజ్ ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్, పెదవేగి | 100 | .... | 36 |
| 2. | గవర్నమెంట్ కాలేజీ ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్ హైదరాబాదు | 200 | .... | 69 |

ఈ రెండు కళాశాలలో హైదరాబాదులోని కళాశాల మొదటిది. ఈ కళాశాలలను 1958 ఆగస్టులో స్థాపించడం జరిగింది. ఆలియా ప్రాథమిక పాఠశాల భవనంలో ప్రారంభ మైన ఈ కళాశాల మొదట్లో హై గ్రేడ్ సర్టిఫికట్ కోర్సును, డిప్లమా కోర్సును నిర్వహించేది. 1960 లో ఈ కళాశాలను దోమలగూడ ప్రస్తుత భవనాలలోకి మార్చినారు. ఆ సంవత్సరమే ఇది ఉస్మానియా విశ్వ విద్యాలయానికి అనుబంధ కళాశాలగా మారింది. కాలానుగతంగా వస్తున్న మార్పులకు అనుగుణంగా 1967 లో డిగ్రీ కోర్సును ప్రారంభించడం జరిగింది. ప్రస్తుతం హైయ్యరు గ్రేడ్ లేదు. అండర్ గ్రాడ్యుయేట్ డిప్లమా, బాచిలర్ ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్ కోర్సులు మాత్రమే ఉన్నాయి. ఈ కోర్సుల కాలం ఒక సంవత్సరం. ఈ రెండూ ఉస్మానియా విశ్వవిద్యాలయం పరిధిలోకి వస్తాయి.

1967 లో ఒక ప్రైవేట్ యాజమాన్యంకింద ఏలూరు వగ్గరలో పెదవేగిలో ఎస్. ఎస్. ఆర్. కాలేజ్ ఆఫ్ ఫిజికల్ ఎడ్యుకేషన్‌ను ప్రారంభించడం జరిగింది. మొదట్లో ఇక్కడ యు. జి. డి. కోర్సు మాత్రమే ఉండేది. 1975-76 లో ఇక్కడ కూడా డిగ్రీ స్థాయికోర్సును ప్రారంభించారు. ప్రైవేట్ యాజమాన్యంకింద ప్రారంభించిన ఈ కళాశాలలను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది.

## వయోజన విద్య

దేశంలో అన్ని రంగాలలో అభివృద్ధిలోబాటు అక్షరాస్యతలో కూడా అభివృద్ధి రావలె అనేది అందరూ అంగీకరించే సత్యం. మనదేశంలో కూడా నిరక్షరాస్యతను నిర్మూలించడానికి ప్రయత్నాలు సాగుతూనే వచ్చినాయి. ఈ కృషిలో సహజ వనరులే కాకుండా అంతర్జాతీయ సంస్థలు, ముఖ్యంగా యునెస్కో వంటివి పాలుపంచుకొంటున్నాయి. అక్షరాస్యత విషయంలో మనదేశం చాలా వెనకబడిఉందని చెప్పవచ్చు. జనాభా పెరుగుదల ఈ రంగంలో జరుగుతున్న కృషికి పెద్దఆటంకం. అయినా కృషిమాత్రం సాగుతూనేఉంది. ఉదాహరణకు దిగువ పట్టిక చూస్తే 1961-1971 ల మధ్య సాధించిన ప్రగతి అవగతం కాగలదు.

| వ. సం. | రాష్ట్రం | 1961 అక్షరాస్యులశాతం | | | 1971 అక్షరాస్యులశాతం | | |
|---|---|---|---|---|---|---|---|
| | | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు |
| 1. | ఆంధ్రప్రదేశ్ | 21.1 | 30.2 | 12.0 | 24.6 | 33.2 | 15.8 |
| 2. | అస్సాం | 27.4 | 37.3 | 16.0 | 28.1 | 36.7 | 18.6 |
| 3. | బీహారు | 18.4 | 29.8 | 6.9 | 19.9 | 30.6 | 8.7 |
| 4. | గుజరాత్ | 30.5 | 41.1 | 19.1 | 35.8 | 46.1 | 24.7 |
| 5. | హర్యానా | ... | .... | .... | 26.9 | 37.3 | 14.9 |
| 6. | హిమాచల్‌ప్రదేశ్ | 17.1 | 27.2 | 6.2 | 31.9 | 43.2 | 20.2 |
| 7. | జమ్ము & కాశ్మీరు | 11.0 | 17.0 | 4.3 | 18.6 | 26.7 | 9.3 |
| 8. | కేరళ | 46.8 | 55.0 | 38.9 | 60.4 | 66.6 | 54.9 |
| 9. | మధ్యప్రదేశ్ | 17.1 | 27.0 | 6.7 | 22.1 | 32.7 | 10.9 |
| 10. | మహారాష్ట్ర | 29.8 | 42.0 | 16.8 | 39.2 | 56.0 | 26.4 |
| 11. | మణిపూరు | 30.4 | 45.1 | 15.9 | 32.9 | 46.0 | 19.5 |
| 12. | మేఘాలయ | .... | .... | .... | 29.5 | 34.1 | 24.6 |
| 13. | కర్నాటక(మైసూరు) | 25.4 | 36.1 | 14.2 | 31.5 | 41.6 | 20.9 |

ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన తరవాత కూడా ఈ రంగంపట్ల స్వచ్ఛంద సేవాసంస్థలే మొగ్గుచూపుతూ వచ్చినాయి. అయితే 1960 లో పంచాయతీ సంస్థలుకూడా ఈ విషయంపట్ల అవధానం మళ్ళించినారు. 1970 లో ఉస్మానియా, శ్రీ వేంకటేశ్వరా, ఆంధ్రా విశ్వవిద్యాలయాలలో వయోజన, కొనసాగింపు విద్యాశాఖలను ఏర్పరచడం జరిగింది. అంతే కాకుండా ఎన్. ఎస్. పథకాలు ప్రవేశపెట్టడంలో యువత దృష్టికూడా ఈ రంగం మీదికే మళ్ళింది. ఇవికాక మరెన్నో సంస్థలు ముందుకు వచ్చినాయి.

అయితే స్వచ్ఛందసేవాసంస్థలు, విద్యాసంస్థలు, స్థానికసంస్థలు చేసినకృషి అంచనాలకు చాలా వెనకబడిఉండిపోయింది. వాటికున్న పరిమిత వనరులేదానికి ముఖ్యకారణం. వీటన్నిటిని పురస్కరించుకొని 1979 లో రాష్ట్రప్రభుత్వమే నేరుగా రంగంలో ప్రవేశించింది. వయోజన విద్యా డైరెక్టరేట్ నొకదానిని నెలకొల్పింది. జిల్లాలలోకూడా అధికారులను నియమించి ఫీల్డ్‌స్థాయిలో విస్తరింపజేయడానికి సమాయత్తాలు జరిగినాయి. ప్రస్తుతం ఈ వయోజన విద్య నిర్మాణత ఇట్లా ఉంది.




అధికారులు వీరే అయినప్పటికీ నిజానికి ఈ రంగంలో ఎన్నో ఇతర శాఖలు కూడా సహాయ సహకారాలందిస్తున్నాయి. ఉదాహరణకు, వ్యవసాయ శాఖ, పశుగణాభివృద్ధి శాఖ, సహకార సంస్థలు, ఆరోగ్యశాఖ, మొదలైనవి తమ సాంకేతిక సహాయాలందిస్తున్నాయి. అదే విధంగా ఇతర స్వచ్ఛంద సేవాసంస్థలు కూడా ఈ కృషిలో పాలుపంచుకొంటున్నాయి.

ఈ విధంగా సాగించిన కృషిలో భాగంగా 1979-80 లో 23 ప్రాజెక్ట్‌లను చేపట్టడం జరిగింది. వీటిలో 18 ప్రాజెక్ట్‌లకు కేంద్రప్రభుత్వం, మిగిలిన 5 ప్రాజెక్ట్‌లకు రాష్ట్రప్రభుత్వం ఆర్థిక సహాయమందించింది. ఈ విధంగా అంచెలంచెలుగా విస్తరించుకొంటూ 1984 నాటికి రాష్ట్రమంతటా అన్ని బ్లాక్‌లలోను ఈ ప్రాజెక్ట్‌లను పెట్టవలెనని ప్రభుత్వం సంకల్పం.

## విద్యా పరిశోధన - ఎస్. సి. ఇ. ఆర్. టి

మారుతున్న కాలానికి అనుగుణంగా విద్యారంగంలో మార్పులు అవసరం. ప్రజాస్వామిక సమాజం అవసరాలకనుగుణంగా విద్యలో మార్పులు తేవడానికి రాష్ట్రప్రభుత్వం నిరం

తరం కృషి చేస్తూనే వచ్చింది. లోగడ ఈ విషయం చూడటానికి 1. స్టేట్ ఇవాల్యుయేషన్ యూనిట్, 2. స్టేట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషన్, 3. స్టేట్ సైన్స్ ఎడ్యుకేషన్‌యూనిట్ 4. స్టేట్ బ్యూరో ఆఫ్ ఎడ్యుకేషనల్ అండ్ వొకేషనల్ గైడన్స్ అని నాలుగు ఏజెన్సీలుండేవి. ఇవి నాలుగూ వియుక్తంగా పనిచేస్తుండేవి కాబట్టి వీటి ఫలితాలను సమైక్యపరచి విద్యారంగంలో పొందుపరచడానికి కష్టంగా ఉండేది. కాబట్టి వీటన్నిటిని కలిపి ఒకేసంస్థగా రూపొందించవలెనని 1967 లో రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది. తదనుగుణంగా ఈ నాలుగు యూనిట్లనేకాక, మరో 6 యూనిట్లను శాఖలను కలిపి మొత్తం 10 శాఖలతో రాష్ట్ర విద్యా పరిశోధన, శిక్షణ పరిషత్తు (State Council of Educational Research and Training - SCERT) అనే సంస్థను స్థాపించడం జరిగింది. దీని నిర్మాణమిట్లా ఉంటుంది.




1. డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎడ్యుకేషన్
2. డిపార్ట్‌మెంట్ ఆఫ్ సైన్స్ ఎడ్యుకేషన్
3. డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఇవాల్యుయేషన్
4. డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎడ్యుకేషనల్ అండ్ వొకేషనల్ గైడన్స్
5. డిపార్ట్‌మెంట్ ఆఫ్ సైకలాజికల్ స్టడీస్
6. డిపార్ట్‌మెంట్ ఆఫ్ కరికులమ్ అండ్ టెక్స్ట్ బుక్స్
7. డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎక్స్‌టెన్షన్ సెర్వీసెస్
8. ఎడ్యుకేషనల్ టెక్నాలజీ సెల్
9. డిపార్ట్‌మెంట్ ఆఫ్ స్టాటిస్టిక్స్
10. కలిజియేట్ సెల్

ఈ సంస్థల లక్ష్యాలివి.

1. ప్రాథమిక, సెకండరీ పాఠశాలల, కళాశాలల స్థాయిలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు వృత్యంతర శిక్షణ కార్యక్రమాలను నిర్వహించడం, వారిలో అధ్యాపన సామర్థ్యాన్ని పెంపొందించడం, తద్వారా తరగతి బోధనను మెరుగుపరచటం.

2. బోధనాభ్యాసాలు, వ్యర్థత, స్తబ్ధత వంటి సమస్యలు, ప్రయోగాత్మక విద్యాప్రణాళిక, పని అనుభవం వంటి రంగాలలో క్రియాశీల పరిశోధనాపథకాలను (Action research projects) చేపట్టి పరిశోధన చేయడం.

4. విద్యారంగానికి అవసరమైన నూతన పోకడలను, మూల్యాంకనం, విజ్ఞాన శాస్త్రాలు, పని అనుభవం, నియతేతర విద్య, స్కూల్‌కాంప్లెక్స్, సంస్థాప్రణాళిక, ప్రాథమిక విద్య సార్వత్రీకరణం మొదలైన అంశాలపై గ్రంథాలు తదితర సహాయక సాధన సంపత్తులను ప్రచురించి సమాచారాలను అందజేయటం.

5. విద్యా విషయాన్ని, విధానాలను ఆధునికీకరణం చేసే దృక్పథంతో జాతీయ, అంతర్జాతీయ కార్యక్రమాలలో పాల్గొని సహాయ సహకారాలందించడం.

6. సమయ, సందర్భాలనుబట్టి అవసరమైన విద్యాకార్యక్రమాలను చేపట్టడం.

ఈ సంస్థ ఎన్నో విధాలుగా విద్యారంగానికి సేవ చేస్తున్నది. ఈ సంస్థ చేసినకృషిలో, చేపట్టిన కార్యక్రమాలలో కొన్నిటిని దిగువ సూచించినాము.

1. 1971 లో రాష్ట్రప్రభుత్వం నాన్-డిటెన్షన్ పాలసీని ప్రవేశపెట్టినప్పుడు ఈ విప్లవాత్మక పరిణామానికి అనుగుణంగా ఉపాధ్యాయ సామర్థ్యాలను మెరుగుపరచడానికి ఈ సంస్థ రాష్ట్ర వ్యాప్తంగా విద్యా కార్యక్రమాన్ని చేపట్టి అమలు పరిచింది.

2. కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు నూతన పాఠ్య ప్రణాళికలను ప్రవేశపెట్టగానే ఈ సంస్థ ఈ నూతన ప్రణాళికలకనుగుణంగా గ్రంథాలను తయారు చేయించే కార్యక్రమం చేపట్టింది. ఈ కొత్త గ్రంథాల ప్రచురణ కార్యక్రమమిట్లా సాగుతుంది.

| | |
|---|---|
| 1, 2 తరగతులకు | 1979-80 |
| 3,4,5 తరగతులకు | 1980-81 |
| 6, 7 తరగతులకు | 1981-82 |
| 8, 9, 10 తరగతులకు | 1982-83 |

3. జాతీయ విద్యా పరిశోధన, శిక్షణ పరిషత్తు (N C E R T) కార్యక్రమాలను రాష్ట్రంలో అమలు పరచడానికి ఈ సంస్థ కృషి చేసింది. ఈ కృషిలో భాగంగా 10 ఏళ్ళ పాఠశాల చదువు, పని అనుభవం వంటి అంశాలపై సదస్సులు,కార్యగోష్ఠులు నిర్వహించింది.

4. ప్రాథమిక, ఉన్నత పాఠశాలల విద్యా కార్యక్రమాల విషయంలో ఆకాశవాణికి అన్ని విధాలా సహకరిస్తున్నది.

పైన సూచించినవి కొన్ని మచ్చుకు మాత్రమే. ఇవి కాకుండా ఈ సంస్థ అనేక కార్య క్రమాలు, పథకాలు చేపట్టి రాష్ట్రానికి విద్యారంగంలో అన్ని విధాలా తోడ్పడుతున్నది.

## గ్రంథాలయాలు

దేశంలో నిరక్షరాస్యత నిర్మూలనకు, పామరులకు పరిజ్ఞాన మందించడానికి, పిల్లల జ్ఞాన వికాసానికి, విద్యాప్రగతికి గ్రంథాలయాలు ఎంతో తోడ్పడతాయి. ఈ విషయం గుర్తిం చిన వ్యక్తులెందరో స్వచ్ఛందంగా గ్రంథాలయాల స్థాపనకు నడుం కట్టినారు.

భారతదేశంలో గ్రథాలయోద్యమాన్ని మొదటగా చేపట్టిన వాడు నాటి బరోడా మహా రాజు శ్రీ శయాజీరావు గైక్వాడ్. 1906 లో గ్రామీణ గ్రంథాలయ కార్యక్రమం చేపట్టి ప్రాథమిక పాఠశాల ఉన్న ప్రతి గ్రామానికి గ్రంథాలయ సదుపాయం కల్పించినాడు. ఇది గ్రంథాలయోత్యమానికి నాంది. అయితే గ్రంథాలయాలు 19 వ శతాబ్ది ముందునుంచే ఉన్నాయి. 20 వ శతాబ్దిలో ఈ ఉద్యమం ఆరంభమై ప్రజ్వరిల్లి దేశం నలుమూలలకు సాగింది.

మన తాష్ట్రానికి సంబంధించి గ్రంథాలయోద్యమము, గ్రంథాలయ స్థాపనలకు సంబం ధించిన చరిత్రతో ముఖ్య ఘట్టాలను దిగువ సూచించాము.

1839 జేమ్స్ థామస్ రాజమండ్రిలో ఒక రీడింగ్‌రూమ్ స్థాపించినాడు.

1886 విశాఖపట్నంలో శ్రీ మంథిన ఆదినారాయణమూర్తి స్థాపించిన మొదటి పౌర గ్రంథాలయం - సరస్వతీ గ్రంథాలయం

ఇవికాక 19 వ శతాబ్దిలోనే పులివెందుల, ఒంగోలు, విజయనగరం, ఉండి, కుముద వల్లి మొదలైన స్థలాలలో గ్రంథాలయాలను నెలకొల్పడం జరిగింది.

1901 శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయం, హైదరాబాదు.

1904 హిందూయువజన సమాజ గ్రంథాలయం, ఏలూరు.

1905 రాజరాజనరేంద్ర ఆంధ్ర భాషానిలయం, హనమకొండ, శబ్దానుశాసన ఆంధ్ర గ్రంథాలయం, వరంగల్లు; ఆర్య బాలసమాజం, పెదపాలెం ( ఏలూరు తాలూకా )

10-4-1914 ఆంధ్రదేశ గ్రంథాలయ నిర్వాహకుల సమావేశం, విజయవాడ. ఈ సమా వేశం అనంతరం "ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘం" ఏర్పడింది. తరవాత ఈ సంఘం "అంధ్రదేశ గ్రంధాలయ సంఘం" గా మారింది.

1915 "గ్రంథాలయ సర్వస్వము" త్రైమాస పత్రిక ప్రారంభం

1920 మొదటి సారిగా 20 మంది గ్రంథాలయ సేవకులకు నెలపాటు శిక్షణ కార్యక్రమం.

1927-28 దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు రచించిన "ఆంధ్ర వాఙ్మయ సూచిక" ప్రచురణ

1938 గ్రంథాలయ సంఘం స్థిర వసతి కృషి ప్రారంభం. ఈ కార్యాలయ భవనాన్ని 1949 లో నిర్మించుకోవడం జరిగింది.

1948 పౌర గ్రంథాలయాల స్థాపన, నిర్వహణల నిమిత్తం మదరాసు ప్రభుత్వం చేసిన శాసనం.

1955 హైదరాబాదు పౌర గ్రంథాలయ శాసనం

1960 ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ శాసనం

గ్రంథాలయాల స్థాపనలకు, పెరుగుదలకు, గ్రంథాలయోద్యమానికి తోడ్పడిన వారెందరో ఉన్నారు. వారిలో ముఖ్యంగా దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, గిడుగు వెంకటరామమూర్తి, శ్రీసూరి వెంకట నరసింహశాస్త్రి, శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావు, అయ్యంకి వెంకటరమణయ్య శ్రీ కొమ్మా సీతారామయ్య, శ్రీ మాడపాడి హనుమంతరావు, శ్రీ పాతూరి నాగభూషణం, రావిచెట్టు రంగారావు దంపతులు, శ్రీ కోదాటి నారాయణరావు గారలను పేర్కొనవచ్చు.

ఈ విధంగా అనేక మంది అనేక రకాలుగా దోహదం చేసిన ఈ ఉద్యమం ఫలితంగా నేడు ఎన్నో గ్రంథాలయాలున్నాయి. మన రాష్ట్రంలో గ్రంథాలయ చట్టం (1960) ప్రవేశ పెట్టినప్పటి నుంచి జరిగిన ప్రగతిని దిగువ పట్టికలో చూడవచ్చు.

| గ్రంథాలయాలు | గ్రంథాలయ సంఖ్య | | |
|---|---|---|---|
| | 1960-61 | 1970-71 | 1974-75 |
| 1. ప్రభుత్వ గ్రంథాలయాలు | 4 | 7 | 7 |
| 2. జిల్లాకేంద్రగ్రంథాలయాలు | 21 | 21 | 22 |
| 3. శాఖాగ్రంథాలయాలు | 220 | 552 | 629 |
| 4. గ్రామీణ గ్రంథాలయాలు | — | — | 7 |
| 5. పుస్తక పంపిణీ కేంద్రాలు | 470 | 504 | 571 |
| 6. సహాయక గ్రంథాలయాలు | 1,111 | 1,850 | 2,3159 |
| మొత్తం | 1,826 | 2,934 | 2,159 |

మొత్తం గ్రంథాలయాలు 1977-78 నాటికి 3537 ఉన్నాయని, వీటిలో 1921 కోస్తా జిల్లాలలోను, 975 తెలంగాణా జిల్లాలలోను, 641 రాయలసీమ జిల్లాలలోను ఉన్నాయని అంచనా. జిల్లాలవారీగా చూస్తే కృష్ణాజిల్లాలో అత్యధిక గ్రంథాలయాలు (533), ఖమ్మం జిల్లాలో అత్యల్ప సంఖ్యలో గ్రంథాలయాలు (45) ఉన్నాయి. 1978-79 లో అంచనా ప్రకారం రాష్ట్రంలో 3741 గ్రంథాలయాలున్నాయి. వీటిలో 8 ప్రభుత్వ గ్రంథాలయాలు, 22 జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, ఒక నగర కేంద్ర గ్రంథాలయం. 704 శాఖా గ్రంథాలయాలు, 108 గ్రామీణ గ్రంథాలయాలు, పుస్తక పంపిణీ కేంద్రాలు 607, సహాయక గ్రంథాలయాలు 2292 ఉన్నాయి. ప్రభుత్వ గ్రంథాలయాలలోని పుస్తకాల సంఖ్య 4.35 లక్షలు, జిల్లా గ్రంథాలయాలలో 42.41 లక్షల పుస్తకాలు ఉండవచ్చునని అంచనా. ఈ గ్రంథాలయాల ఖర్చు నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం ఏటా రెండు లక్షల రూపాయలు గ్రాంటు మంజూరు చేస్తున్నది.

1980-81 సంవత్సరానికి గ్రంథాలయాల అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం ప్రణాళి కేతర పద్దు కింద రూ. 1,67,68,900 లను ప్రణాళిక కింద రూ. 94,000 లను కేటాయించడం జరిగింది.

## జవహర్ బాల భవన్

దీనిని 1966 జూన్ 23 న స్థాపించారు. 3-17 సంవత్సరాల మధ్యగల బాల బాలికలకు లలితకళలు, సంగీతం, నృత్యం, నాటకం, వ్యాయామం మొదలైన రంగాలలో అదనంగా విద్యను నేర్పడానికి ఇది ఏర్పడింది. ఇందులో దాదాపు 5,000 మంది సభ్యులున్నారు. రోజూ వివిధ కార్య కలాపాలలో 500 మంది పిల్లలు పాల్గొంటారు. 1979 లో అంతర్జాతీయ పిల్లల సంవత్సరం సందర్భంగా ఇట్లాంటి కేంద్రాలను సిద్దిపేట, మహబూబ్‌నగర్, కర్నూల్, ఖమ్మం, విజయవాడ, గుంటూరు, విశాఖపట్నం, అనంతపూర్ మొదలైన చోట్ల తెరవడం జరిగింది. 1979-80 లో సాంస్కృతిక వినిమయ కార్యక్రమాలను ఎన్నో నిర్వహించడం జరిగింది. పిల్లలను ఇతర రాష్ట్రాలకు పంపడం జరిగింది. బాల భవన్ ఉద్యమాన్ని ఆంధ్ర ప్రదేశ్‌లో విస్తరింప జేయడానికి మాస్టర్ ప్లానులు తయారు చేయడం జరిగింది.

# 15

# శాస్త్రీయవిజ్ఞానం, సాంకేతిక రంగాలు

ఆధునిక యుగంలో శాస్త్రవిజ్ఞాన, సాంకేతిక రంగాల ప్రాముఖ్యాన్ని ప్రపంచమంతటా గుర్తించడం జరిగింది. మానవ జీవన ప్రమాణాన్ని మెరుగుపరచడానికి శాస్త్ర, సాంకేతిక రంగాలలో ఇతోధికంగా కృషిచేయవలసిన ఆవశ్యకతను భారతప్రభుత్వం గుర్తించి స్వాతంత్ర్యం సిద్ధించినప్పటినుంచి ఈ రంగాలలో పరిశోధనా కార్యక్రమాలకు చాలా ప్రోత్సాహం ఇచ్చింది. ప్రపంచం మొత్తంమీద ఉన్న శాస్త్ర విజ్ఞాన పరిశోధక బృందంలో దాదాపు నాలుగోవంతు మన దేశంలో ఉన్నారు. భారత ప్రభుత్వంవారు దాదాపు 250 పరిశోధనా సంస్థలను నిర్వహిస్తున్నారు. ఇవికాక మనదేశంలో రాష్ట్రప్రభుత్వాల ఆధ్వర్యంలో దాదాపు 150 పరిశోధనా సంస్థలు పనిచేస్తున్నాయి. అంతేకాకుండా విశ్వవిద్యాలయాలలోకూడా ఈ రంగాలలో చెప్పుకోతగినంత కృషి జరుగుతోంది. ఇటీవలికాలంలో విశ్వవిద్యాలయాల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. వీటిలో వ్యవసాయ విశ్వ విద్యాలయాల పాత్రకూడా ఎంతైనా ఉంది. గత 3 దశాబ్దాలలో ఈ పరిశోధనా సంస్థలను నిర్వహించడానికి పదివేలకోట్ల రూపాయల పైనే ఖర్చుపెట్టడం జరిగింది. ఇదిగాక ఐక్యరాజ్య సమితి నుంచి, ఇతర దేశాలనుంచి అదనంగా మనకు ఆర్థిక వనరులు సమకూరినాయి.

మనరాష్ట్రంలోకూడా గత పాతికేళ్ళలో శాస్త్ర, సాంకేతిక రంగాలలో గణనీయమైన ప్రగతి సాధించడం జరిగింది. ఈ ప్రగతి ముఖ్యంగా విశ్వవిద్యాలయాలలోను, ప్రభుత్వ పరిశోధనా సంస్థలలోను జరిగిందనిచెప్పవచ్చు. ఇంకా జరుగుతూంది.

**విశ్వవిద్యాలయాలలో శాస్త్ర, సాంకేతిక పరిశోధనలు**

ప్రస్తుతం మనరాష్ట్రంలో ఉన్న విశ్వవిద్యాలయాలు :

1. ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు
2. ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు
3. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి
4. కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు
5. నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు
6. అటానమస్ పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటర్, అనంతపూరు
7. హైదరాబాదు విశ్వవిద్యాలయం, హైదరాబాదు
8. జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్సిటీ, హైదరాబాదు
9. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం, హైదరాబాదు

## ఆంధ్ర విశ్వవిద్యాలయం

**భౌతికశాస్త్రవిభాగం (Physics):** ఈ విభాగం 1932 లో స్థాపించబడినప్పటి నుంచి ఆచార్య సూరి భగవంతం, ఆచార్య కె. రంగధామరావు, ఆచార్య ఇచ్ఛాపురం రామకృష్ణారావు, ఆచార్య బి. రామచంద్రరావు మొదలైన ఎందరో ప్రముఖ శాస్త్రజ్ఞుల కృషిఫలితంగా సర్వతో ముఖ ప్రగతిని సాధించింది. వర్ణపట శాస్త్రం (Spectroscopy), రామన్ ఎఫెక్ట్(Raman Effect) వంటి అంశాలతో ప్రారంభమైన పరిశోధనలు రానురాను ఎంతో వైవిధ్యాన్ని సంత రించుకొన్నాయి. అతిధ్వనిశాస్త్రం ( Ultra Sonics ) స్ఫటిక భౌతికశాస్త్రం (Crystal Physics) ఘనస్థితి భౌతిక శాస్త్రం (Solid State Physics), అంతరిక్ష భౌతికశాస్త్రం (Space Physics) ఎలక్ట్రానిక్స్, సైద్ధాంతిక అణుభౌతికశాస్త్రం (Theoretical Nuclear Physics) వంటి అధునాతన రంగాలలో అడుగుపెట్టి ప్రశంసనీయమైనపరిశోధనలు జరుపుతున్నారు. ఈ విభాగం కార్యక్రమాలు అంతకంతకు విస్తృతం కావడంతో అనేక శాఖలు దీనినుంచి విడిపోయి స్వతంత్ర విభాగాలుగా రూపొందడం జరిగింది. వీటిలో ముఖ్య మైనవి అనుప్రయుక్త భౌతికశాస్త్రం (Applied Physics) గణిత భౌతికశాస్త్రం (Mathematical Physics), భూభౌతికశాస్త్రం (Geophysics), వాతావరణశాస్త్రం, (Meteorology) సాగర శాస్త్రం (Oceanography), కేంద్రక భౌతిక శాస్త్రం, (Nuclear Physics) మొదలైనవి. వీటిని గురించి వేరువేరుగా ప్రత్యేకించి ప్రస్తావించటం అవసరం.

**అనుప్రయుక్త భౌతికశాస్త్రం (Applied Physics):** ఈవిభాగంలో పరిశోధనలు 1) థిన్ ఫిల్మ్స్, 2) ఫొటోఎలాస్టిసిటీ ఎటా స్ఫెరిక్స్ 2) మెడికల్ ఎలక్ట్రానిక్స్ అనే అంశా లలో జరుగుతున్నాయి. అంతేకాకుండా శాస్త్రీయ, పారిశ్రామిక రంగాలలో ఇతర సంస్థలతో సహకరించి అభివృద్ధి కార్యక్రమాలనుకూడా ఈ విభాగంవారు నిర్వహిస్తున్నారు. 1) ఆప్టికల్ అండ్ ఎలక్ట్రికల్ ఆప్టికల్ ఇన్‌స్ట్రుమెంటేషన్ 2) అల్ట్రాసానిక్ ఇన్‌స్ట్రుమెంటేషన్ 3) మెడి కల్ ఎలక్ట్రానిక్ ఇన్‌స్ట్రుమెంటేషన్ మొదలైన రంగాలలో సాంకేతిక విజ్ఞానాన్ని ఇతరసంస్థలకు అందచేయడానికి ఈ విభాగం వారు సంసిద్ధులుగా ఉన్నారు.

**భూభౌతికశాస్త్రం (Geophysics):** ఈ శాఖ 1949లో ప్రారంభించబడింది. ఆచార్య ఎన్. కె. సూర్, డా. ఎస్.ఆర్. సఫూర్, డా. ఎమ్. ఎస్. కృష్ణన్, డా. సి. మహాదేవన్, ప్రొ.బి.సుందరరామరావుగార్లవంటి ప్రసిద్ధశాస్త్రవేత్తల అధ్వర్యంలో ఈవిభాగం పురోగమించి ఈనాడు దేశంలో ఎంతో పేరుపొందిన శాఖగా తయారయింది. ఈ శాఖలో ప్రస్తుతం 1. మాగ్నెటిక్ ప్రోస్పెక్టింగ్; 2. ఎలక్ట్రికల్ ప్రోస్పెక్టింగ్; 3. గ్రావిటీ ప్రోస్పెక్టింగ్ 4. పారామాగ్నెటిజమ్; 5. అన్వేషణ భౌతిక శాస్త్రంలో వ్యాఖ్యాన సాంకేతిక విధానాలు; 6.భూకంపశాస్త్రం (Seismology) 7. భూజల శాస్త్రం (Geohydrology) మొదలైన అంశాలను గురించి పరిశోధనలు జరుగుతున్నాయి.

*వాతావరణశాస్త్రం, సాగరశాస్త్రం :* మనదేశంలో వాతావరణశాస్త్ర అధ్యయనం విశ్వవిద్యాలయ స్థాయిలో మొట్టమొదట ఆంధ్ర విశ్వ విద్యాలయంలో 1949 లో ప్రారంభమయింది. ఈ విభాగంలో జరిపిన పరిశోధనల ఫలితంగా మేఘాలు, వర్షపాతం వీటి భౌతికధర్మాలు, స్వభావం గురించిన ఆసక్తికరమైన విషయాలుకొన్ని తెలిసినాయి. నైరుతి పవనపు ఉద్భవం, దానివల్ల కలిగే వర్షపాతక్రమం, విస్తరణ, ఆ ఋతుపవన సమయంలో మనదేశ సముద్ర ప్రాంతాలలో సంచరించే వాయుగుండాలపై ఆధారపడి ఉంటాయని విశదమైంది.

అనువర్తిత శీతోష్ణస్థితి శాస్త్రంలో జలసంతులనం, వ్యవసాయ వాతావరణశాస్త్రం వాతావరణ కాలుష్యం మొదలైన అంశాలను గురించి కూడా ఈ విభాగంలో పరిశోధనలు ఆచార్య ఆర్. రామనాథం, ఆచార్య వి. పి. సుబ్రహ్మణ్యం గార్ల పర్యవేక్షణలో జరుగుతున్నాయి.

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో సాగరశాస్త్ర పరిశోధనలను అమెరికన్ సాగర శాస్త్రజ్ఞుడైన లాఫొండ్ గారు ప్రారంభించారు. సముద్ర ప్రవాహాల స్వభావం, జలరాసుల నిర్మాణం ఊర్ధ్వ అధోజల గమనాలను గురించిన పరిశోధనలు జరిగాయి. ఇంకా అనేక ఇతర అంశాలను గురించికూడా పరిశోధనలు జరుగుతున్నాయి.

*కేంద్రకభౌతికశాస్త్రం* (Nuclear physic.) : 1956 లో ప్రొ. జ్ఞానానంద గారి ఆధ్వర్యంలో ఈ విభాగం ప్రారంభించిన నాటినుండి ఈనాటి వరకు చాలా అభివృద్ధి సాధించింది. పరిశోధనలు చురుకుగా సాగుతున్నాయి. అణుశక్తి సంస్థవారి సహకారంకూడా వారికి బాగా లభించింది.

*గణితశాస్త్రాలు :* గణితశాస్త్ర విభాగానికి స్వర్గీయ ఆచార్య టి. విజయరాఘవన్, స్వర్గీయ ఆచార్య వి. రామస్వామి వంటి సుప్రసిద్ధులు అధ్యక్షత వహించి ఎందరో గణిత శాస్త్రజ్ఞులను తయారు చేశారు. తరవాత ఆచార్య ఎన్. వి. సుబ్రహ్మణ్యంగారి అధ్వర్యంలో ఈ భాగంలో ప్రశంసనీయమైన కృషి జరిగింది.

*అనువర్తగణితశాస్త్రం* (Applied Mathematics): విభాగంలో డా.డి.ఆర్.కె. సంగమేశ్వరరావు వంటి శాస్త్రజ్ఞులు కృషిచేస్తున్నారు. గణిత సంబంధ భౌతికశాస్త్ర (Mathematical Phycis) విభాగంలో ఆచార్య టి. వెంకటరాయుడు, ఆచార్య ఎస్. మీనాక్షి సుందరం ఆచార్య టి. ఎస్. జి. కృష్ణమూర్తి వారి శిష్యులు గణనీయమైన పరిశోధనలు జరిపినారు.

*సాంఖ్యకశాస్త్రం* (Statistics) : ఈవిభాగం మొదట ఆచార్య కందులనాగభూషణం గారి అధ్యక్షతన ప్రారంభించబడింది. తరవాత ఆచార్య టి. వి. అవధానిగారి పర్యవేక్షణలో ఈ విభాగం వేగంగా పురోగమించింది.

*రసాయనశాస్త్రం :* ఈ విభాగం 1931 లో స్థాపించబడింది. ప్రొ. లుడ్విగ్‌ఉల్ఫ్, ప్రొ. టి. ఆర్. శేషాద్రి, ఎఫ్. ఆర్. ఎస్; ప్రొ. జి. గోపాలరావు మొదలైన ప్రసిద్ధ రసాయన శాస్త్రవేత్తల పర్యవేక్షణలో ఈ విభాగం ఎంతో ముందంజవేసింది. ఈ విభాగంలో, మూలక, కర్బన, భౌతిక, కేంద్రక, విశ్లేషక రసాయనశాస్త్ర శాఖలలో విశేష పరిశోధనలు జరుగుతున్నాయి. కర్బన రసాయన శాస్త్రంలో సహజోత్పన్నాల రసాయన శాస్త్రం గురించి మొదట్లో ప్రొ. టి. ఆర్ శేషాద్రిగారు, ఆ తరవాత ప్రొ. ఎల్. ఆర్. రావుగారి పర్యవేక్షణలో ముమ్మరంగా పరిశోధనలు జరిగాయి. అంతేకాకుండా విరళమృత్తికల రసాయన శాస్త్రము (Chemistry of rare earths) ఘనస్థితి రసాయన శాస్త్రము, మూలక సంశ్లిష్టాల రసాయన శాస్త్రము, కేంద్రక రసాయనశాస్త్రం మొదలైన అంశాలలో కూడా ఆచార్య ఎమ్. ఎన్. శాస్త్రిగారి ఆధిపత్యంలో ప్రస్తుతం కృషి జరుగుతోంది.

*జీవరసాయనశాస్త్రం :* (Biochemistry) ఈ విభాగం 1957 లోడా. బి. నాగన్నగారి అధిపత్యంలో ప్రారంభమయింది. ఈ విభాగంలో పరిశోధనలు సీరం ప్రొటీన్‌లు మందు మొక్కల ఎన్‌జైమ్‌లు. ఆవశ్యక అమైనో ఆమ్లలోపంలో ప్రాథమికశక్తి చర్యలు, కణజాల శ్వాసక్రియ, మూలక పైరోఫాస్ఫేట్‌లు మొదలైన అంశాలను గురించి పరిశోధనలు జరుగుతున్నాయి.

*భూవిజ్ఞానశాస్త్రం :* ఇది 1941 లో ప్రారంభించడం జరిగింది ఈ శాఖ ప్రొ. కె. పి. రోడె, ప్రొ. డి. మహదేవన్, ప్రొ. ఎ. శ్రీరామదాసు మొదలైన ప్రముఖ భూవిజ్ఞాన శాస్త్రజ్ఞుల నిర్వహణలో సర్వతోముఖంగా ప్రగతి సాధించింది. 1972 లో ఈ శాఖను యు. జి. సి. వారు స్పెషల్ అసిస్టెన్స్ శాఖగా గుర్తించి సహాయం చేసినారు. ఈ శాఖలో చేసిన పరిశోధనల ఫలితంగా చాలామంది డాక్టరేటు పట్టాలు పొందారు. ఈ విభాగంలో శిక్షణపొంది పట్టభద్రులయిన అనేకమంది శాస్త్రవేత్తలు మనదేశంలో చాలాచోట్ల ప్రముఖ స్థానాలను అలంకరిస్తున్నారు. జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా డైరక్టర్ జనరల్‌గా పని చేసిన డా. సి. కరుణాకరన్‌గారు ఈ శాఖలో ఒకప్పుడు అధ్యాపకులుగా పనిచేసినవారే.

*వృక్షశాస్త్రవిభాగం* (Botany) *:* ఈశాఖ 1946 లో ప్రారంభించినది మొదలు ప్రొ. ఎమ్, ఒ. పి. అయ్యంగారు, ప్రొ. జి. ఎస్.రంగస్వామి అయ్యంగారు, ప్రొ. జె. వెంకటేశ్వర్లు, ప్రొ. రోళ్ల శేషగిరిరావు మొదలైన ప్రసిద్ధ వృక్షశాస్త్రజ్ఞుల పర్యవేక్షణలో గణనీయమైన ప్రగతి సాధించింది.

ఈ శాఖలో వృక్ష పిండోత్పత్తి శాస్త్రంలోను, కణజన్య శాస్త్రంలోను ప్రొ. జె. వెంకటేశ్వర్లుగారిఆధ్వర్యంలో అనేకమంది డి.ఎస్‌సి. పిహెచ్‌డి.పట్టాలుపొందినారు. 1949లో పి.వి.వి. శేషగిరి, శరీరధర్మశాస్త్రంలో పరిశోధనలు ప్రారంభించినారు. తరవాత చాలామంది విద్యార్థులు వృక్షశరీర ధర్మశాస్త్రంలో పరిశోధనలుజరిపి పట్టాలుపొందారు. 1957లో డా. టి. శ్రీరాములుగారు వాయు జీవశాస్త్రము, శైవల శాస్త్రాలలో పరిశోధనలు ప్రారంభించి చాలా

మంది పరిశోధకులను తయారు చేసినారు. 1972 లో కణజన్యుశాస్త్రంలో ఈ విభాగాన్ని యు. జి. సి వారు ప్రత్యేక సహాయ కేంద్రంగా గుర్తించినారు, ఇటీవల ప్రొ, రోళ్ళ శేషగిరి రావు గారి పర్యవేక్షణలో వృక్షవర్గీకరణ శాస్త్రంలో కూడా కొంతకృషి జరిగింది, ఇంకా జరుగుతోంది. ఇప్పుడు ఈ శాఖకు ఆచార్య వి.ఆర్.రెడ్డిగారు అధిపతిగా ఉన్నారు.

***జంతుశాస్త్రవిభాగం* (Zoology) :** ఈ విభాగంకూడా 1946 లోనే ప్రారంభ మయింది. ఆచార్య ఆర్. గోపాలఅయ్యర్, డా. సి. జె. జార్జ్ ఆచార్య పి. ఎన్. గణపతి ఆచార్య కె. హనుమంతరావు మొదలైన ప్రఖ్యాత జంతుశాస్త్రవేత్తల మార్గదర్శకత్వం కింద ఈ విభాగం శీఘ్రగతిని సర్వతోముఖంగా అభివృద్ధి చెందింది. ఈ విభాగంలో ముఖ్యంగా సముద్ర జీవశాస్త్రం, పరాన్న జీవశాస్త్రం, ప్రోటోజువాలజీ, కణరసాయనశాస్త్రం మొదలైన అంశాలను గురించి పరిశోధనలు జరుగుతున్నాయి. చాలామంది డాక్టరేటు పట్టాలు పొందారు.

***ఫార్మస్యూటికల్ ఔషధశాస్త్ర విభాగము* (Pharmacy) :** ఈ విభాగము ఆచార్య టి. ఆర్. శేషాద్రి, ఆచార్య ఎస్. రంగస్వామి, ఆచార్య వి. సుబ్బారావు వంటి ప్రముఖ శాస్త్రవేత్తల మార్గదర్శకత్వంలో పురోగమించింది. ప్రస్తుతం వివిధ ఫార్మస్యూటికల్ శాస్త్రాలలో పరిశోధనలు జరుగుతున్నాయి. మొక్కల రసాయనశాస్త్ర అధ్యయనంలో మందు మొక్కలకు, విషభరిత మొక్కలకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు, గుండె జబ్బులకు పనికివచ్చే మందులను గురించి విస్తృతంగా జరిగిన పరిశోధనల ఫలితంగా కొన్ని ఉత్తమ ఔషధాలను కనిపెట్టడం జరిగింది. ఈ విభాగంలో శిక్షణపొందిన అనేకమంది శాస్త్రవేత్తలు దేశంలో నలుమూలలా అనేక సంస్థలలో ఉన్నత పదవులలో పనిచేస్తున్నారు.

పైన పేర్కొన్న శాస్త్రవిభాగాలేకాకుండా ఇటీవల ఆంధ్రవిశ్వవిద్యాలయంలో సముద్ర సంబంధ శాస్త్రాలకు **(Marine sciences)** పరిసర సంబంధ శాస్త్రాలకు **(Environmental science)** ప్రత్యేక విభాగాలను ఏర్పాటు చేసినారు. అనతికాలంలోనే ఈ విభాగాలలో కూడా విశేషమైన వైజ్ఞానిక పరిశోధనలు జరుగుతాయని ఆశించవచ్చు.

## ఉస్మానియా విశ్వ విద్యాలయం

***భౌతికశాస్త్రవిభాగం* (Physics):** 1949లో ప్రొ.ఎస్. భగవంతం ఈశాఖ అధిపత్యం చేపట్టిన దగ్గర నుంచి పరిశోధనలలో ఈ శాఖ ముందంజవేసింది. ఆ తరవాత ప్రొ. రావాడ సత్యనారాయణ, ప్రొ. కె. ఎన్. అయ్యంగారు, ప్రొ. కె. వెంకట్రామయ్య, ప్రొ. కె. వి. కృష్ణారావుగార్లు ఈ శాఖ పురోభివృద్ధికి కృషి చేశారు. అణు భౌతికశాస్త్రం, ఘన స్థితి భౌతికశాస్త్రం, కేంద్ర భౌతికశాస్త్రం, ఎలక్ట్రానిక్సు, జీవ భౌతికశాస్త్రం వంటి ఆధునిక అంశాలలో పరిశోధనలుజరుగుతున్నాయి. 1950నుంచి అనేకమంది డాక్టరేట్ పట్టాలుతీసుకొన్నారు. అనేక పరిశోధన వ్యాసాలు ప్రచురించడం జరిగింది.

*రసాయన శాస్త్రం* (Chemistry) : దాదాపు గత అర్థ శతాబ్దంగా ఈ శాఖ పరిశోధనా కార్యక్రమాలు నిర్వహిస్తోంది. మొదట్లో కాంతి రసాయనచర్యలు, కర్బనహాలైడ్‌లు వంటి అంశాలను గురించి పరిశోధనలు జరిగాయి. 1952 నుంచి ఆచార్య ఎన్. వి. సుబ్బారావుగారి పర్యవేక్షణలో ఈవిభాగంలో కర్బనరసాయనశాస్త్రంలో విశేషమైనకృషి జరిగింది. ముఖ్యంగా సహజ పదార్థాల కర్బన రసాయన శాస్త్రంలోని విస్తృతమైన పరిశోధనలు జరిగాయి. ఇటీవలికాలంలో ఆచార్య వి. ఆర్. శ్రీనివాసన్, ఆచార్య టి. నవనీతరావుగార్ల మార్గదర్శకత్వంలో భౌతిక రసాయనశాస్త్రం మొదలైన అనేకరసాయనశాస్త్ర విభాగాలలో పరిశోధనలు జరుగుతున్నాయి.

***జీవరసాయన శాస్త్రం*** (Biochemistry) : ఈ విభాగంలో ఆచార్య ఎల్. కె. రామచంద్రన్, డా. కె. ఎస్. శాస్త్రి గార్ల పర్యవేక్షణలో పరిశోధనలు జరుగుతున్నాయి. ప్రోటీన్‌లలోని ఫార్మల్ గ్రూప్ విశ్లేషణ, చెట్లజిగురులు, లేథరస్ మొక్క జీవ రసాయన శాస్త్రం, అమైనో చక్కెరలు, మొదలైన వాటి తులనాత్మక జీవ రసాయనశాస్త్రం గురించి పరిశోధనలు జరుగుతున్నాయి.

***వృక్షశాస్త్రం*** (Botany) : ఈ విభాగంలో పరిశోధనలు చాలా కాలం స్వర్గీయ ప్రొ. ఎమ్. సయిదుద్దీన్‌గారి పర్యవేక్షణలో హైదరాబాదు వృక్ష సంపదను గురించి, కాక్టేసి, అకాంథేసి, కుకుర్బిటేసి మొదలైన కుటుంబాల అంతర్నిర్మాణం గురించి జరిగినాయి. పుష్ప అంతర్నిర్మాణం, పిండోత్పత్తిశాస్త్రం గురించి కూడా కొన్ని పరిశోధనలు జరిగినాయి. పత్ర బాహ్య చర్మం గురించిఅనేక మొక్కలలో చాలాసమాచారం సేకరించడం జరిగింది. శిలీంధ్రాలు, వృక్ష వ్యాధులను గురించి ప్రొ. సలామ్‌గారి పర్యవేక్షణలో ప్రారంభమయిన పరిశోధనలు నేటికి డా. పి. రామారావు, డా. పి. రఘువీరరావు మొదలైనవారి పర్యవేక్షణలో కొనసాగుతున్నాయి. శైవలాలను గురించి ఆచార్య ఎమ్. ఆర్. సక్సేనాగారు ప్రారంభించిన పరిశోధనలు, జల జీవశాస్త్ర పరిశోధనలు ఇప్పటికీ చురుకుగా సాగుతున్నాయి. కణజన్యు శాస్త్రంలో ఆచార్య జాఫరు నైజామ్, ఆచార్య యు. బి.ఎస్. స్వామిగార్లు, వారి సహచరులు పరిశోధనలు జరుపుతున్నారు. ఇటీవల ఆచార్య కె. వి. ఎన్. రావుగారి ఆధ్వర్యంలో వృక్ష శరీర ధర్మశాస్త్రంలో విశేషమైన కృషిజరుగుతోంది.

***జంతుశాస్త్రం*** (Zoology) : ఈ విభాగం 1939 నుంచి ప్రారంభమయింది. మొదట స్వర్గీయ ఆచార్య బి. కె. దాస్ ఆధ్వర్యంలో మంచినీటి చేపలను గురించి పరిశోధనలు జరిగాయి. ఆ తర్వాత ఆచార్య సత్యనారాయణ సింగ్ పర్యవేక్షణలో పరాన్న జీవుల గురించి కృషి జరిగింది. ఆచార్య ఖద్రి, ఆయనసహచరులు ప్రోటోజోవా గురించి కొంత అధ్యయనం చేసారు. అమెరికాలో శిక్షణ పొందిన ఆచార్య పి. రామచంద్రరావుగారు, వారి బృందం వారు అణుజీవశాస్త్రం వంటి అధునాతన విషయాలను గురించి, [illegible]యణరావు గారు పరాన్న జీవశాస్త్రంలోను పరిశోధలు జరుపుతున్నారు. ఇంతే కాక జంతు ఆవరణ శాస్త్రము; జలజీవశాస్త్రము వంటి వాటిలోను ఆచార్య జె. వి. రమణరావుగారి నిర్వహణకో జంతు శరీరశాస్త్రం గురించి పరిశోధనలు జరుగుతున్నాయి.

*సూక్ష్మజీవశాస్త్రం* (Microbiology) : ఈ విభాగము ఇటీవలే ప్రారంభించబడింది. అయినప్పటికీ ఆచార్య హెచ్. పొలాసా గారి ఆధ్వర్యంలో ఈ విభాగంలో అనేక ఆసక్తికరమైన అంశాలను గురించి పరిశోధనలు చురుకుగా జరుగుతున్నాయి.

*జన్యుశాస్త్రం :* (Genetics) ఈ విభాగంలో ఆచార్య ఒ. ఎస్. రెడ్డి, ఆచార్య జి. మాధవరెడ్డిగార్ల పర్యవేక్షణలో ప్రశంసనీయమైన కృషి జరుగుతోంది. డ్రోసోఫైలా ఈగల పైన X-కిరణాల ప్రభావం, జనిటిక్ రికవరీస్ ఫాస్ట్‌న్యూట్రాన్‌ల ప్రభావం పరిశీలించడం జరిగింది. X-కిరణాల సహాయంతో చిట్టెలకలలో స్థానాంతరణలను గురించి అధ్యయనం చేశారు. ఇటీవల సూక్ష్మజీవ జన్యుశాస్త్రంలోను, వృక్షజన్యుశాస్త్రంలోను, మానవ జన్యుశాస్త్రంలోను కూడా పరిశోధనలు జరుగుతున్నాయి.

*భూవిజ్ఞానశాస్త్రం* (Geology) : ఈ విభాగం 1936 లో ప్రారంభమయింది. ఈ శాఖలో అనేకమంది ప్రముఖ విదేశీ శాస్త్రజ్ఞులు కూడా పనిచేశారు. ఇటీవలి కాలంలో ఆచార్య ఎస్. బాలకృష్ణ, ఆచార్య వై. జె. రావు, ఆచార్య సి. లీలానందంగార్ల ఆధ్వర్యంలో ఈ శాఖ ఎంతగానో ముందంజ వేసింది. పల్నాడులో సున్నపురాయి గురించి, పాకాల ప్రాంతంలో ఖనిజ సంపద గురించి, కొండపల్లి శిలలను గురించి పరిశోధనలు జరిగాయి. ఖమ్మం, కృష్ణా, గుంటూరు హైదరాబాదు ప్రాంతాలలోని ఖనిజ విశేషాలను, జల లక్షణాలను పరిశోధించారు.

*భూభౌతికశాస్త్రం* (Geophysics) : ఈ శాఖకు ఆచార్య వి. ఎల్. ఎస్. భీమశంకరం గారు అధ్యక్షులుగా ఉన్నారు. మద్రాస్ - పొన్నేరిప్రాంత భూగర్భ జలసంబంధమైన ఎలక్ట్రికల్ రెసిస్టివిటీ పరిశీలనలు లోగడ జరిపినారు. ఆంధ్రప్రదేశ్‌లోని భౌమ జల సంపదను వినియోగించుకొనే కృషి ప్రశంసనీయంగా జరిగింది. వజ్రకరూర్ ప్రాంతంలోని వజ్రాలేర్పడే పటాన్ని గురించి, వెల్దుర్తి ప్రాంతంలోని హెమటైట్ నిక్షేపాలను గురించి అయస్కాంత, విద్యుత్ విధానాలు అధ్యయనం చేసినారు. శిలాపరిశీలనలో భారత భూభాగంలో ఏకైక ఎర్త్ టైడల్ పరిశోధనశాల ఎంతో ఉపయోగపడుతుంది.

*గణితశాస్త్రం :* ఈ విభాగంలో నవీన బీజగణితము, డిఫరెన్షన్ సమీకరణాలు, సాపేక్ష సిద్ధాంత సంబంధమైన గణితశాస్త్రము, ద్రవగతి శాస్త్రము అయస్కాంత ద్రవగతి శాస్త్రము, స్థితిస్థాపకత మొదలైన విషయాలలో పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ విభాగానికి ప్రొ. వనజ అయ్యంగారు అధిపతిగా ఉన్నారు.

| |
|---|
| జూలై 18, 1980న భారతదేశం 'రోహిణి'ఉపగ్రహాన్ని రోదసీలోకి పంపింది. మనదేశపు శాస్త్రీయ, సాంకేతికప్రగతికిఇదొకతార్కాణం |

*ఖగోళశాస్త్రం :* ఈ విభాగానికి ఆచార్య అభ్యంకరుగారుఅధిపతిగా ఉన్నారు. ఇటీవల సంపూర్ణసూర్యగ్రహణ సందర్భంలో ఈవిభాగంవారు విశేష పరిశోధనలు జరిపారు.

*గణాంకశాస్త్రం :* ఈ విభాగానికి ఆచార్య నరహరిపండిట్ అధిపతిగా ఉన్నారు. ఈ విభాగంలో ఆపరేషన్సు రిసెర్చి, కాంబినేషనల్ గణితశాస్త్రం మొదలైన అంశాలలో పరిశోధనలు జరుగుతున్నాయి,

## శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం

*గణితశాస్త్రం :* ఈ విభాగం 1954 లో ఆచార్య వైద్యనాథస్వామిగారి ఆధిపత్యంలో ప్రారంభింపబడింది. ఆ కాలంలో "టోపాలజీ" "జామెట్రి జేషను ఆఫ్ డైనమిక్స్" అనే అంశాలలో పరిశోధనలు ప్రారంభించారు. ఆ తరవాత ఆచార్య బెనర్జీగారు గణిత, భౌతిక శాస్త్రాలను అభివృద్ధి పరచినారు. ప్రస్తుతం ఈ విభాగానికి ఆచార్య సీతారామ్‌గారు అధిపతిగా ఉన్నారు. ఆధునిక బీజగణితం, సంఖ్యాసిద్ధాంతం, ప్రాయోగిక గణితశాస్త్రం, ద్రవయుత గణిత శాస్త్రాలను గురించి పరిశోధనలు జరుగుతున్నాయి.

*భౌతికశాస్త్రం :* ఈ విభాగానికి మొదట్లో వరసగా ఆచార్య ఎస్. రామచంద్రరావుగారు, ఆచార్య జె. భీమసేనాచారిగారు అధ్యక్షత వహించారు ప్రస్తుతం ఆచార్య పి. జయరామ రెడ్డి గారు అధిపతిగా ఉన్నారు. అల్ట్రాసోనిక్స్, సాలిడ్ స్టేట్ ఫిజిక్స్, టెంపరేచర్ ఫిజిక్స్, అప్పరు ఎట్మాస్ఫియర్, మాగ్నెటిజం, మాలిక్యులర్ వైబ్రేషన్, స్పెక్ట్రోస్కోపీ మొదలైనరంగాలలో పరిశోధనలు విరివిగా జరుగుతున్నాయి.

*రసాయన శాస్త్రం :* ఈ విభాగాన్ని మొదట డా.ఎ.కప్పన్న, తరవాత ఆచార్య కె. నీలకంఠంగార్లు నిర్వహించారు. ప్రస్తుతం ఆచార్య వి. ఆర్. కృష్ణన్ గారు అధిపతిగా ఉన్నారు. ఈ విభాగంలో విశ్లేషణ రసాయన శాస్త్రం, విద్యుత్ రసాయన శాస్త్రం, ఉష్ణగతి శాస్త్రం, సహజ పదార్థాల రసాయన శాస్త్రం మొదలైన అంశాలలో పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ విభాగానికి చెందిన ఆచార్య ఎస్.అప్పలరాజుగారి పర్యవేక్షణలోకూడా విశేష పరిశోధనలు జరుగుతున్నాయి.

*వృక్షశాస్త్రం :* ఈ విభాగానికి మొదట్లో ఆచార్య ఐ. ఎమ్. రావుగారు అధిపతిగాఉన్న సమయంలో ప్రత్యేకించి వృక్ష శరీర ధర్మశాస్త్రంలో పరిశోధనలు ప్రారంభించారు. ఆ తరవాత ఆచార్య వి. ఎస్. రామదాస్ గారు చాలాకాలం ఈ విభాగానికి అధ్యక్షులుగా ఉండి వృక్ష శరీరధర్మ శాస్త్ర వివిధ శాఖలలో విశేషమైన కృషి చేశారు. ముఖ్యంగా కిరణజన్యసంయోగ క్రియ, బాష్పోత్సేకం మొదలైన అంశాలను గురించి ఆచార్య రామదాస్‌గారి పర్యవేక్షణలో చాలామంది విద్యార్థులు డాక్టరేట్ పట్టాలు పొంది మనదేశంలోను, విదేశాలలోను ప్రముఖ స్థానాలలో ఉన్నారు.ప్రస్తుతం ఈ విభాగానికి అధ్యక్షత వహిస్తున్న ఆచార్య ఎమ్.వి.నాయుడు గారు వృక్షవ్యాధి శాస్త్రము, వైరస్ వ్యాధులు మొదలైన అంశాలలో కృషి చేస్తున్నారు. ఈ విభాగానికి చెందిన ఆచార్య జి. రాజేశ్వర రావుగారు తదితరులు వృక్ష శరీర ధర్మశాస్త్రంలో పరిశోధనలు కొనసాగిస్తున్నారు.

*జంతుశాస్త్రం :* ఈ విభాగం ప్రారంభించినప్పుడు ఆచార్య మనవాళ్ళ రామానుజంగారు అధిపతిగా ఉండేవారు. తరవాత కొంతకాలం ఆచార్య కె. పంపాపతిరావుగారు ఈ విభాగం కార్యక్రమాలను నిర్వహించారు. ప్రస్తుతం ఆచార్య కె. ఎస్. స్వామిగారు అధ్యక్షులుగా ఉన్నారు. ఈ విభాగంలో పరిశోధనలు ముఖ్యంగా జంతు శరీరధర్మ శాస్త్రంలో కొనసాగుతున్నాయి. నరాలపైన, కండరాలపైన తేలు విష ప్రభావాన్ని పరిశోధించినారు. కణ, అణు

ధర్మశాస్త్రంలో కూడా పరిశోధనలు జరుగుతున్నాయి. ఇంతవరకు ఈ విభాగంలో చాలా మంది డాక్టరేటు పట్టాలు పొందారు.

*భూ విజ్ఞానశాస్త్రం :* ఈవిభాగానికి మొదట్లో ఆచార్య ఎమ్. జి. చక్రపాణి నాయుడు గారు అధ్యక్షులుగా ఉండేవారు. ప్రస్తుతం ఆచార్య కె. వి. సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షులు. ఈ విభాగంలో ఖనిజశాస్త్రం, శిలాశాస్త్రం, పురాజీవశాస్త్రం, శిలా అయస్కాంతత్వం మొదలైన విషయాలను గురించి పరిశోధనలు జరుగుతున్నాయి. చాలా మంది డాక్టరేటు పట్టాలు తీసుకొన్నారు. చిత్తూరు జిల్లాలోని భౌమ జల సంపదను అన్వేషించడంలో చాలా కృషి చేశారు.

*సాంఖ్యకశాస్త్రం :* ఈ విభాగం 1965 లో ప్రారంభించబడినప్పటి నుంచి దీనికి డా. ఎమ్. పేరి శాస్త్రిగారు అధిపతిగా ఉన్నారు. ఇంతవరకు ముగ్గురు డాక్టరేటు పట్టాలు, ఆరుగురు M. Phil పట్టాలు తీసుకొన్నారు. వీరు అసంపూర్ణ దత్తాంశాల నుంచి అనుమితులు చేయడం, స్టాకాస్టిక్‌నమూనాలు, ఎకనోమెట్రిక్స్ అనే అంశాలను గురించి పరిశోధనలు చేస్తున్నారు. ప్రస్తుతం 14 మంది డాక్టరేటు కోసం, ఆరుగురు M. Phil కోసం కృషి చేస్తున్నారు.

*గృహవిజ్ఞానశాస్త్రం :* మొదట్లో ఈ విభాగానికి ఆచార్య డొరొథిపియర్సన్ అధిపతిగా ఉండేవారు. ప్రస్తుతం ఆచార్య ఫిలోమినా రాయప్పరెడ్డిగారు అధిపతిగా ఉన్నారు. వారి పర్యవేక్షణలో పోషణ పరిశోధనలు జరుగుతున్నాయి.

## నాగార్జున విశ్వ విద్యాలయం

ఈ విశ్వ విద్యాలయం మొదట 1967 లో పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటరుగా ప్రారంభమయినప్పటి నుంచి ఇందులో భౌతికశాస్త్రము, రసాయన శాస్త్రము, జంతుశాస్త్రము, అనే విభాగాలు పనిచేస్తున్నాయి. భౌతికశాస్త్రము ప్రారంభం నుంచి ఆచార్య డి. ప్రేమ స్వరూప్ గారి నిర్వహణలో పరిశోధనారంగంలో విశేషమైన కృషిచేస్తోంది. ఈ విభాగంలో ఆచార్య సి. రాధాకృష్ణమూర్తిగారు కూడా చాలా కాలం నుంచి పరిశోధనలు జరుపుతున్నారు.

రసాయన శాస్త్ర విభాగాన్ని ఆచార్య ఎల్. రామచంద్రరావుగారు ప్రారంభించినారు. వీరు కర్బన రసాయశాస్త్రంలో పరిశోధనలు ప్రారంభించారు. ఆ తరవాత ఈ విభాగము ఆచార్య వి. పాండురంగారావుగారి అధ్వర్యంలోకి వచ్చింది. వీరు ముఖ్యంగా విశ్లేషణాత్మక రసాయన శాస్త్రంలో పరిశోధనలు జరిపి ఇటీవల స్వర్గస్థులయినారు.

వృక్షశాస్త్ర విభాగాన్ని ఆచార్య సి. వెంకట్రావుగారు ప్రారంభించారు. వీరి పర్యవేక్షణలో ఆవృత బీజాలస్వరూప శాస్త్రంలో పరిశోధనలు జరిగినాయి. తరవాత ఆచార్య టి. శ్రీరాములుగారు ఈ విభాగానికి అధిపతిగా ఉన్నారు. వీరు శిలీంధ్రశాస్త్రము, వృక్ష వ్యాధి శాస్త్రాలలో పరిశోధనలు ప్రారంభించారు. ప్రస్తుతం ఈ విభాగానికి ఆచార్య ఎ. శేషగిరి రావుగారు అధ్యక్షులుగా ఉన్నారు. వీరి పర్యవేక్షణలో వృక్షవ్యాధి శాస్త్రంలో, మృత్తిక శిలీంధ్రాలను గురించి పరిశోధనలు జరుగుతున్నాయి. అంతే కాక ఈ విభాగంలో ఆవృత బీజాల స్వరూప శాస్త్రంలో కూడా పరిశోధనలు జరుగుతున్నాయి.

జంతుశాస్త్ర విభాగాన్ని ఆచార్య ఎస్. దత్‌గారు ప్రారంభించారు. వీరి పర్యవేక్షణలో జంతు ఆవరణ శాస్త్రంలోను, మత్స్యశాస్త్రంలోను పరిశోధనలు జరిగినాయి. ప్రస్తుతం ఈ విభాగానికి ఆచార్య వై. రాధాకృష్ణగారు అధిపతిగా ఉన్నారు. వీరు కూడా ఆవరణ శాస్త్రంలో పరిశోధనలు నిర్వహిస్తున్నారు.

## కాకతీయ విశ్వవిద్యాలయం

ఈ విశ్వ విద్యాలయంలో భౌతిక, రసాయన, వృక్ష, జంతు శాస్త్ర విభాగాలున్నాయి. వృక్ష శాస్త్ర విభాగానికి మొదట్లో ఆచార్య యు. బి. ఎస్. స్వామిగారు అధిపతిగా ఉన్నారు. వీరి పర్యవేక్షణలో జన్యు శాస్త్రంలో పరిశోధనలు ప్రారంభించినారు. ప్రస్తుతం ఈ విభాగానికి డా. ఎల్. లక్ష్మినారాయణగారు అధిపతిగా ఉన్నారు. వీరి ఆధ్వర్యంలో ఆవృతబీజాల స్వరూపశాస్త్రం, పిండోత్పత్తి శాస్త్రంలో పరిశోధనలు జరుగుతున్నాయి. అంతే కాకుండా ఈ విభాగంలో వృక్ష వ్యాధి శాస్త్రము, శిలీంధ్రశాస్త్రాలలో కూడా పరిశోధనలు జరుగుతున్నాయి. జంతు శాస్త్ర విభాగము ఆచార్య పి. రామచంద్రరావుగారి పర్యవేక్షలో ప్రారంభమయింది. ప్రస్తుతం ఈ విభాగానికి ఆచార్య టి. వాసుదేవ్‌గారు అధ్యక్షుడుగా ఉన్నారు.

## పోస్ట్‌గ్రాడ్యుయేట్ సెంటర్, అనంతపూర్

ఈ కేంద్రము 1968 లో స్థాపించినపుడు, గణిత, భౌతిక, రసాయనశాస్త్ర విభాగాలు మాత్రమే ఉండేవి. ఇటీవల జీవశాస్త్ర విభాగాన్ని కూడా ప్రారంభించినారు. భౌతిక శాస్త్ర విభాగానికి ఆచార్య ఎస్. వి. సుబ్రహ్మణ్యంగారు అధిపతిగా ఉన్నారు. వీరి పర్యవేక్షణలో అల్ట్రాసోనిక్స్‌లో పరిశోధనలు జరుగుతున్నాయి. చాలా మంది డాక్టరేట్లు పొందారు. అనేక పరిశోధన వ్యాసాలు ప్రచురితమయినాయి.

రసాయన శాస్త్ర విభాగానికి ఆచార్య ఎస్. బ్రహ్మజీరావుగారు అధిపతిగా ఉన్నారు. వీరి ఆధ్వర్యంలో ప్రముఖంగా భౌతిక రసాయన శాస్త్రంలో పరిశోధనలు జరుగుతున్నాయి.

గణిత శాస్త్ర విభాగానికి ఆచార్య ఆర్. సీతారామస్వామిగారు అధిపతిగా ఉన్నారు.

## యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్

ఈ విశ్వ విద్యాలయానికి మొదటి ఉపాధ్యక్షుడుగా పనిచేసిన డా. గురుబక్ష్ సింగ్ గారు ప్రసిద్ధ రసాయన శాస్త్రవేత్త. వీరు వివిధ శాస్త్రాలలో పరిశోధనలకు కావలసిన గ్రంథాలయ సదుపాయాలను, ప్రయోగశాలలను పెద్ద ఎత్తున నిర్మించడానికి అవసరమైన చర్యలు తీసుకొని ప్రశంసనీయమైన కృషి చేశారు. ఈ విశ్వ విద్యాలయంలో భౌతిక, రసాయన, జీవశాస్త్ర విభాగాలున్నాయి. జీవశాస్త్ర విభాగానికి ప్రసిద్ధ జీవ రసాయనశాస్త్రజ్ఞుడు డా. ఎ. ఎస్. రాధాకృష్ణన్‌గారు ఉన్నారు. వీరి పర్యవేక్షణలో జీవ రసాయన శాస్త్రంలో ముమ్మరంగా పరిశోధనలు జరుగుతున్నాయి. జీవశాస్త్ర విభాగంలో ఒక భాగంగా సెంటర్ ఫర్ ఫోటోసింథసిస్‌ను స్థాపించారు. దీనికి డైరెక్టర్‌గా ఉన్న ఆచార్య వి. ఎస్. రామదాస్ గారు లోగడ శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో చాలా కాలం ఉన్నారు. వీరి పర్య

వేషణలో ఇక్కడ వృక్ష శరీర ధర్మశాస్త్రంలో ప్రశంసనీయమైన కృషిజరుగుతోంది. సూక్ష్మ జీవ శాస్త్రంలో ఆచార్య సింగ్‌గారి పర్యవేక్షణలో పరిశోధనలు జరుగుతున్నాయి. ఆచార్య రామమూర్తిగారు కూడా ఈ విభాగంలో ఉన్నారు.

## ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం

ఈ విశ్వ విద్యాలయము 1964 లో స్థాపించబడింది. దీనికి అనుబంధంగా రాష్ట్రంలోని వ్యవసాయ, పశువైద్య, గృహవిజ్ఞాన కళాశాలలను చేర్చినారు. అంతే కాకుండా రాష్ట్రంలోని 40 వ్యవసాయ పరిశోధనా కేంద్రాలను, 5 పశుపోషణ కేంద్రాలను కూడా ఈ విశ్వ విద్యాలయాలకి చేర్చినారు. వాటిని కింద పేర్కొన్నాము. 1. వ్యవసాయ పరిశోధనా సంస్థ, రాజేంద్రనగర్; 2. వ్యవసాయ కళాక్షేత్రము, రాజేంద్రనగర్; 3. మొక్కజొన్న పరిశోధనా కేంద్రము, అంబర్‌పేట; 4. ప్రాంతీయ ఫల పరిశోధనా కేంద్రము,సంగారెడ్డి; 5. ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా కేంద్రం, రుద్రూరు, నిజామాబాదుజిల్లా; 6. వ్యవసాయ పరిశోధనా కేంద్రం, వరంగల్; 7. వ్యవసాయ పరిశోధనా కేంద్రము, పాలెం; 8. వ్యవసాయ పరిశోధనా కేంద్రము, ఆదిలాబాద్; 9 మొక్కల పెంపకం కేంద్రం, మథోల్, ఆదిలాబాదు జిల్లా 10. వ్యవసాయ పరిశోధనా కేంద్రం, కరీంనగర్, 11. మిల్లెట్ పరిశోధనా కేంద్ర, మధిర; 12. వరి పరిశోధనా కేంద్రం, వైరా, ఖమ్మంజిల్లా; 13. పత్తి పరిశోధనా కేంద్రం, నంద్యాల; 14. కూరగాయల పరిశోధనా కేంద్రం, కర్నూల్; 15. తమలపాకుల పరిశోధనా కేంద్రం, ఊటుకూరు, కడపజిల్లా; 16. ప్రాంతీయ ఫల పరిశోధనా కేంద్రం, అనంతరాజుపేట, కడపజిల్లా; 17. వ్యవసాయ పరిశోధనా కేంద్రం, అనంతపురం; 18. వ్యవసాయ, నూనెవిత్తనాల పరిశోధనా కేంద్రం, కదిరి, అనంతపురంజిల్లా; 19. వ్యవసాయ పరిశోధనా కేంద్రం, పెరుమల్లపల్లి, చిత్తూరుజిల్లా; 20. శ్రీ వేంకటేశ్వర వ్యవసాయ కళాక్షేత్రం, తిరుపతి; 21. ప్రాంతీయ పరిశోధనా కేంద్రం, నెల్లూరు; 22. జొన్న పరిశోధనా కేంద్రం, పొదలకూరు, నెల్లూరుజిల్లా; 23. జాతీయ పొగాకు పరిశోధనా కేంద్రం, కావలి: 24. వేరుసెనగ పరిశోధనా కేంద్రం, దరిశి, ప్రకాశంజిల్లా; 25. వ్యవసాయ కళాశాల, బాపట్ల; 26. వ్యవసాయ పరిశోధనా కేంద్రం, తెనాలి; 27. పత్తి వ్యవసాయ పరిశోధనా కేంద్రం, అమరావతి, గుంటూరుజిల్లా; 28. జొన్న పరిశోధనా కేంద్రం, లాం, గుంటూరు జిల్లా; 29. వరిపరిశోధనా కేంద్రం, మచిలీపట్టణం; 30. వరి పరిశోధనా సహాయకేంద్రం, పూళ్ళ, పశ్చిమ గోదావరిజిల్లా; 31 అరటి పరిశోధనా కేంద్రం, కొవ్వూరు; 32. వ్యవసాయ పరిశోధనా కేంద్రం, మారుటేరు; 33. కొబ్బరి పరిశోధనా కేంద్రం, అంబాజిపేట, తూర్పు గోదావరిజిల్లా; 34. జొన్న పరిశోధనా కేంద్రం, పెద్దాపురం; 35. కొబ్బరి వ్యాధుల జాతీయస్థాయి పరిశోధనా కేంద్రం, 36. నూనెగింజల పరిశోధనా కేంద్రం, యలమంచిలి; 37. జొన్న పరిశోధనా కేంద్రం, విజయనగరం: 38. చెరకు పరిశోధనా కేంద్రం, అనకాపల్లి; 39. ప్రాంతీయ వరి పరిశోధనా కేంద్రం, రాగోలు, శ్రీకాకుళంజిల్లా; 40. జనుము పరిశోధనా కేంద్రం, అముదాలవలస.

ఆయా ప్రాంతాలలో ప్రాంతీయమైన సమస్యలను అధ్యయనం చేయడానికి ఈ పరిశోధనా కేంద్రాలు కృషి చేస్తున్నాయి.

## బాపట్ల వ్యవసాయ కళాశాల

ఈ కళాశాల 1945 లో ప్రారంభించబడింది. ఈ కళాశాలలో వ్యవసాయశాస్త్రంలో వివిధ విభాగాలలో పరిశోధనలు జరపడానికి వసతులున్నాయి. ముఖ్యంగా వృక్ష శరీర ధర్మశాస్త్రం, రసాయనశాస్త్రం, కీటకశాస్త్రం, శిలీంధ్రశాస్త్రం, కలుపుమొక్కల నివారణ,మృత్తికశాస్త్రం మొదలైన అంశాలలో పరిశోధనలు జరుగుతున్నాయి

తిరుపతిలోను, రాజేంద్రనగర్‌లోను వ్యవసాయ కళాశాలలు ఉన్నాయి.

## పశువైద్యశాస్త్ర కళాశాల, రాజేంద్రనగర్

ఈ కళాశాల 1946 లో స్థాపించబడింది. ఈ కళాశాలలో డెయిరీ, పశుశాస్త్రం, జంతుశరీర ధర్మశాస్త్రం, పేథాలజీ, అనాటమీ, పౌల్ట్రీసైన్స్ మొదలైనవిభాగాలలో ఉన్నత స్థాయి పరిశోధనలు జరపడానికి అవసరమైన వసతులున్నాయి.

ఇదే విధంగా తిరుపతిలోకూడా ఒక వెటర్నరీ కళాశాల ఉన్నది.

## గృహవిజ్ఞానశాస్త్ర కళాశాల, హైదరాబాదు

ఇదికూడా ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయానికి అనుబంధ కళాశాలగాఉంది. ఈ కళాశాలలో ఆహారం, పోషణ అనే అంశాలలో పరిశోధనలు జరుగుతున్నాయి. పట్టణ ప్రాంతాలలోని మురికివాడలలో నివసించే ప్రజల ఆహారవిషయమై పరిశోధనలు జరిపినారు. సోయా చిక్కుళ్ళ అధికంగా వినియోగించేందుకు వాటి పోషక పదార్థాలను ఎక్కువగా పొందేందుకు పరిశోధనలుజరిపినారు. సూర్యకాంతం (Sunflower) పువ్వులనూనె జీవసంబంధ ప్రాముఖ్యం విశ్లేషించినారు. ఆకుకూరలను, కూరగాయలను, శుద్ధిచేసిన ఆహారధాన్యాలను వండటంవల్ల నష్టమయ్యే పోషకపదార్థాలను గురించి పరిశీలించినారు.

# సాంకేతికరంగం

## జవహర్‌లాల్‌నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం

ఈ విశ్వవిద్యాలయం 1971 లో స్థాపించినారు. కాకినాడ, అనంతపురం ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలలు, వరంగల్ ప్రాంతీయ ఇంజనీరింగ్‌కళాశాల, హైదరాబాద్ నాగార్జున ఇంజనీరింగ్ కళాశాల, లలితకళలు, వాస్తుశాస్త్రం (Architecture)కళాశాలలు ఈ విశ్వవిద్యాలయానికి చెందుతాయి.

ఈ విశ్వవిద్యాలయంవారు కొన్ని గోష్ఠులు, సదస్సులు నిర్వహించారు. కాని చెప్పుకోతగినంతగా ఇంజనీరింగ్‌లో పరిశోధనలేమీ జరగడంలేదు. కొన్ని కొన్ని సంస్థలకు ఇంజనీరింగ్ విషయాలలో సలహా, సహకారాలను అందిస్తున్నారు. కొన్ని సబ్జక్ట్‌లలో పిహెచ్.డి కోర్సులు ప్రారంభించాలనే ప్రతిపాదనలున్నాయి.

## ఆంధ్ర యూనివర్సిటీ కాలేజి ఆఫ్ ఇంజనీరింగ్

ఈ కాలేజి 1956 లో స్థాపించబడింది. ఇందులో సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ విభాగాలే కాకుండా కెమికల్ ఇంజనీరింగ్ విభాగం కూడా చేర్చినారు. ఈ కాలేజి మొదటి ప్రిన్సిపాల్ ఆచార్య సి. వెంకట్రావు గారు. కెమికల్ ఇంజనీరింగ్ శాఖకు చెందినవారు. ఇక్కడ కెమికల్ ఇంజనీరింగ్‌లోను, మరికొన్ని ఇతర అంశాలలోను కొంత పరిశోధన కృషి జరుగుతోంది.

## వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఇంజనీరింగ్ కళాశాల

ఈ కళాశాల 1957 లో స్థాపించబడింది. ఇందులో అన్ని ఇంజనీరింగ్ శాఖలు ఉన్నాయి. రాయలసీమ ప్రాంతాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిచేయడానికి సహాయపడేందుకు వీరు కొన్ని ప్రణాళికలు చేపట్టినారు.

# వైద్యశాస్త్ర రంగం

మనరాష్ట్రంలో మొత్తం 8 వైద్యకళాశాలలున్నాయి. ఇటీవలనే విజయవాడలో ఒక ప్రైవేట్ మెడికల్ కాలేజి స్థాపనకుప్రభుత్వం అనుమతిఇచ్చింది. హైదరాబాదులోని ఉస్మానియా వైద్యకళాశాలలోని వైద్యశాస్త్రాలసంస్థను పరిశోధనా సంస్థగామార్చాలని ప్రతిపాదనలున్నాయి. ఇప్పటికే మెడిసిన్, సర్జరీ, పెడియాట్రిక్స్, ఆఫ్థలమాలజి, రేడియాలజీ, అనెస్థీసియా, ఫిజియాలజీ, పెథాలజీ, ఫోరెన్సిక్ మెడిసిన్, మైక్రోబయాలజీ విభాగాలను అప్‌గ్రేడ్ చేయడం జరిగింది. ఈ కళాశాలలో 19 వ శతాబ్ది చివరిభాగంలో బ్రిటిష్ వైద్యశాస్త్రజ్ఞుడైన మేజర్ ఎడ్వర్డ్ లారీ నాయకత్వంలో క్లోరోఫామ్ మత్తులక్షణాలను గురించి పరిశోధనలు జరిగినాయి. ప్రస్తుతం ఉస్మానియా వైద్యకళాశాలలో వివిధ విభాగాలలో ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చ్, యు. జి. సి. అమెరికాలోని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ మొదలైన సంస్థల సహకార ప్రోత్సాహాలతో అనేక పరిశోధనా కార్యక్రమాలు నిర్వహించబడుతున్నాయి. శరీరధర్మశాస్త్రం (అప్‌గ్రేడెడ్) అధిపతి ఆచార్య జోసెఫ్ గుమ్మడిగారు విశేష పరిశోధనలు జరుపుతున్నారు.

విశాఖపట్టణంలోని ఆంధ్రవైద్య కళాశాలలో కూడా పరిశోధన కృషి కొన్ని విభాగాలలో జరుగుతున్నది.

## ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్రివెంటివ్ మెడిసిన్

ఇది హైదరాబాద్‌లో ఉంది. ఇందులో కలరా, మశూచి; నీటి పరీక్ష, రోగనిర్ధారణ విభాగాలు, ఆహార, మందులప్రయోగశాల, రాష్ట్రమందులప్రయోగశాల మొదలైనవిఉన్నాయి. ఈ సంస్థ అధ్వర్యంలో వరంగల్లు, గుంటూరు, కర్నూలు, విశాఖపట్టణం వద్ద ప్రాంతీయ ప్రయోగశాలలున్నాయి. కలరా, మశూచి, టైఫాయిడ్ వంటి అంటురోగాల వ్యాప్తిని అరికట్టేందుకు టీకామందులు తయారు చేస్తారు.

## జాతీయ పోషకాహార సంస్థ, హైదరాబాదు

1918 లో తమిళనాడులోని కోనూరువద్ద ప్రారంభించబడిన ఈ సంస్థను 1958 లో హైదరాబాదుకు తరలించినారు. పోషణ లోపాల వల్ల వచ్చే జబ్బులను గురించి వీరు పరి

శోధనలు జరుపుతారు. ఇందులో వైద్య శాస్త్రజ్ఞులే కాకుండా జీవరసాయన శాస్త్రజ్ఞులు, జీవ భౌతిక శాస్త్రజ్ఞులు, విశ్లేషణాత్మక రసాయన శాస్త్రజ్ఞులు, వ్యాధి నిర్ణయ శాస్త్రజ్ఞులు, మొదలైనవారుకూడా పనిచేస్తున్నారు.

ఆహారం విషపూరితం కావడం గురించి పరిశోధించే టాక్సికాలజీ విభాగం కూడా ఇందులో ఉంది. ఈ పరిశోధనా సంస్థవారు పరిశోధించిన ముఖ్య సమస్యలలో కిందివాటిని పేర్కొనవచ్చు. లాథిరస్ సెటైలీస్ పప్పులలోని విషపదార్థాన్ని వేరుచేయడం, శాగేసీటిలో ఫ్లోరైడ్ ఎక్కువగా ఉండటంవల్ల వచ్చే ఫ్లోరోసిస్ వ్యాధిని గురించి, పెల్లాగ్రా వ్యాధిని గురించి జరిపే పరిశోధనలు.

## వ్యవసాయశాస్త్రంలో పరిశోధనా కేంద్రాలు

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయమే కాకుండా మనరాష్ట్రంలో కేంద్రప్రభుత్వ ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న కొన్ని వ్యవసాయ పరిశోధనా సంస్థలుకూడా ఉన్నాయి.

### కేంద్ర పొగాకు పరిశోధనా సంస్థ

ఈ సంస్థను 1947 లో రాజమండ్రిలో నెలకొల్పినారు. దీనికి అనుబంధంగా గుంటూరు వేదసందూరు, హుస్నూరు, పూసా (బీహారు), దిన్‌హటా (పశ్చిమ బెంగాల్), లలో పరిశోధనా కేంద్రాలు ఉన్నాయి. ఇవే కాకుండా పశ్చిమగోదావరి జిల్లాలోని దేవరపల్లిలోను, తూర్పుగోదావరి జిల్లాలోనిఏజన్సీ ప్రాంతంలోనుకూడా అనుబంధపరిశోధనా కేంద్రాలున్నాయి. వీటన్నిటిలో సిగరెట్టు పొగాకు, లంకపొగాకు రకాలను గురించి సస్య వృక్షోత్పత్తి రసాయన, కీటక, రోగ, గణిత, సాంకేతిక శాఖలలో పరిశోధనలు జరుగుతున్నాయి.

### ఆలిండియా కో ఆర్డినేటెడ్ రైస్ ఇంప్రూవ్‌మెంట్ ప్రాజెక్ట్, రాజేంద్రనగర్, హైదరాబాదు

ఈ సంస్థ ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రిసెర్చ్ వారి ఆధ్వర్యంలో నెలకొల్పబడింది. కొత్త వరివంగడాలను రూపొందించటం, వివిధ ప్రాంతాలకు వాటి అనుకూలతను పరిశీలించడం. వాటికికావలసిన పోషకావసరాలను పరిశీలించడం, వాటికివచ్చే తెగుళ్ళను, చీడలను నివారించడం మొదలైన కార్యక్రమాలను ఈ సంస్థ అఖిల భారతస్థాయిలో నిర్వహిస్తోంది. ఈ సంస్థకు చాలాకాలం డా. ఎస్. వి. ఎస్. శాస్త్రిగారు ప్రోజెక్ట్ కో ఆర్డినేటర్‌గా పనిచేశారు. వీరి ఆధ్వర్యంలో ''జయ'' వంటి కొత్త వరివంగడాలు తయారు చేసినారు. ప్రస్తుతం డా. సీతారామన్‌గారు ప్రోజెక్ట్ కో ఆర్డినేటర్‌గా ఉన్నారు.

### ఆలిండియా కో ఆర్డినేటెడ్ సోర్ఘమ్ ఇంప్రూవ్‌మెంట్ ప్రాజెక్ట్, రాజేంద్రనగర్

పైన పేర్కొన్న సంస్థవలెనే ఈ ప్రాజెక్ట్ జొన్న పంటకు సంబంధించిన పరిశోధనలు జరపడానికి నెలకొల్పబడింది. దీనికి మొదట డా. ఎన్. గంగా ప్రసాదరావు గారు ప్రాజెక్ట్ కో ఆర్డినేటర్‌గా చాలా కాలం పనిచేశారు. ప్రస్తుతం దీనికి డా. ఆర్. వి. వి. భూషణం గారు ప్రాజెక్ట్ కో ఆర్డినేటర్‌గా ఉన్నారు.

## వెటురినరీ బయలాజికల్ పరిశోధనా సంస్థ, హైదరాబాదు

పశురోగాలకు టీకా మందులను పెద్ద ఎత్తున తయారుచేయడానికి ఈ సంస్థ నెలకొల్పబడింది. గొర్రె, మేక, కోళ్ళ రోగపరిశోధన కూడా ఇక్కడ జరుగుతోంది. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రిసెర్చ్‌వారి ఆధ్వర్యంలో గాలికుంటు రోగం గురించి ఇక్కడ పరిశోధనలు జరుగుతున్నాయి.

## ఆయిల్ టెక్నలాజికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, అనంతపురం

ఈ సంస్థ 1949లో స్థాపించబడింది. నూనెపదార్థాలనుంచి నూనెను ఉత్పత్తి చెయ్యడంలోను, నూనెల నాణ్యతను పెంచడంలోను ఎదురయ్యే సమస్యలను గురించి ఈ సంస్థ పరిశోధనలు జరుపుతుంది. ముఖ్యంగా నూనెగింజల నుంచి లభించే ఖాద్య తైలాలను గురించి వీరు ఎక్కువగా కృషిచేస్తున్నారు నువ్వులనుంచి నూనెను తీయడంలో సులువు పద్ధతులను వీరు కనుక్కొన్నారు. గోగుగింజలు, మేగాన్‌గింజలు, ఆర్గ్యాన్‌గింజలు, కొర్రతవుడు నుంచి లభించే నూనెలను జనరంజకం చేయడంలో వీరు కృషిచేస్తున్నారు. పత్తిగింజలనూనె, ఆముదం, బియ్యపు తవుడునూనె, సౌరవిత్తనాల నూనెలను, శుద్ధపరిచేందుకు కొత్త విధానాలను కనిపెట్టినారు. నూనెపరిశ్రమలకు చెందిన అనేక విషయాలలో నూతన యాంత్రిక పద్ధతులను కనుక్కొన్నారు. నూనెలో కల్తీని సులభంగా, కచ్చితంగా కనుక్కొనే మార్గాలను కనిపెట్టినారు. మొత్తంమీద ఈ సంస్థలోను ప్రశంసనీయమైన కృషిచేస్తున్నారు.

## మనరాష్ట్రంలోని ఇతర పరిశోధనా సంస్థలు

*రీజినల్ రిసెర్చి లాబొరేటరీ, హైదరాబాదు :* కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రిసెర్చి ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న జాతీయస్థాయి పరిశోధనా సంస్థ ఇది. ఇందులో ముఖ్యంగా రసాయన, సాంకేతిక విభాగాలలో అనువర్తిత ప్రాముఖ్యంగల పరిశోధనలు జరుగుతున్నాయి. ఇటీవల సెంటర్ ఫర్ సెల్యులర్ అండ్ మోలిక్యులర్ బయాలజీని కూడా ఈ సంస్థలో భాగంగా స్థాపించినారు. పరిశ్రమల అభివృద్ధికి కావలసిన సాంకేతిక సలహా సహకారాలు ప్రయివేట్ సంస్థలకు ప్రభుత్వానికి అందజేయడం ఈ సంస్థ ముఖ్య లక్ష్యం. కర్బనరసాయనాలు, కీటకనాశకాలు, ఖాద్యతైలాలు, వార్నిషులు, రంగులు తక్కువ శ్రేణిబొగ్గు వినియోగం, మూలకరసాయనాలు, పారిశ్రామిక పింగాణి ఉత్పాదనాలు, కెమికల్ ఇంజనీరింగ్ ఉన్నతశ్రేణి కాగితం తయారీ, కంప్యూటర్ విధానాలు—మొదలైన రంగాలలో ఈ సంస్థ పరిశోధన, అభివృద్ధి, విస్తరణ కార్యక్రమాలను నిర్వహిస్తోంది.

ఈ సంస్థకు మొదట్లో చాలాకాలం డా. హుస్సేన్‌జహీర్ డైరక్టర్‌గా పనిచేసారు. ప్రస్తుతం డా. జి. ఎస్. సిద్ధు డైరక్టర్‌గా ఉన్నారు. ఇంకా డా. పి. ఎమ్ భార్గవ డా. బి. ఎస్. ఆర్ శాస్త్రి మొదలైన ప్రముఖ శాస్త్రజ్ఞులు ఈ సంస్థలో పనిచేస్తున్నారు.

***నేషనల్ జియోఫిజికల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, హైదరాబాదు:*** ఇది 1961 లో స్థాపితము. ఇదికూడా కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రిసెర్చివారి ఆధ్వర్యంలో నడపబడుతోంది. భౌమజలసంపదను, ఖనిజ సంపదను అన్వేషించడంలో ఈ సంస్థవారు

అధునాతన విధానాలను అవలంబిస్తున్నారు. భూకంపాలు, భూఉష్ణోగ్రత, భూనిర్మాణం, చలనం మొదలైన విషయాలను గురించి పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ సంస్థ పరిశ్రమలకు ప్రభుత్వ ఇతర సంస్థలకు సహకారాన్ని అందచేస్తుంది.

ఖనిజ సంపద అన్వేషణలో వాయుగత సర్వేలను నిర్వహించడానికి తగిన విధానాలను వారు రూపొందించినారు. భూకంపాలను గురించి కూడా వారు పరిశోధనలు జరుపుతున్నారు. సముద్ర తీరప్రాంతాలలో నూనె అన్వేషణకోసం భూభౌతిక సర్వేలను వీరు నిర్వహిస్తున్నారు.

హైదరాబాదులో భారతభౌమ సర్వేక్షణాసంస్థ (Geological Survey of India) వారి ప్రాంతీయ విభాగం కూడా. వీరు కూడా మనరాష్ట్రంలో ఖనిజాన్వేషణకోసం విస్తృతమైన పరిశోధనలు కొనసాగిస్తున్నారు. అదేవిధంగా ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్‌వారు రాష్ట్ర ప్రభుత్వ భూవిజ్ఞాన, గనుల శాఖవారు కూడా మన రాష్ట్రంలోని ఖనిజసంపదను వినియోగించుకోవడానికి చాలా కృషి చేస్తున్నారు. కేంద్రప్రభుత్వ జనరల్ ఎక్స్‌ప్లొరేషన్ కార్పొరేషన్ వారు కూడా ఈ రంగంలో పాత్రవహిస్తున్నారు. కేంద్ర అంతర్జల బోర్డ్‌వారి ప్రాంతీయ విభాగం కూడా హైదరాబాదులో ఉంది వీరుకూడా మన రాష్ట్రంలోని భూజలసంపదను పైకి తీయడానికి, సద్వినియోగం చేయడానికి కృషిచేస్తున్నారు.

***అంతరిక్ష పరిశోధనా కేంద్రం, శ్రీహరికోట :*** నెల్లూరు జిల్లాలో సూళ్ళూరు పేటకు సమీపంలో ఉన్న శ్రీహరికోట ఒక ద్వీపము. ఇక్కడ అంతరిక్ష పరిశోధనల కోసం రాకెట్లు ప్రయోగించే కేంద్రాన్ని భారత ప్రభుత్వంవారు నెలకొల్పినారు. ఇక్కడ ఉపగ్రహాల నుంచి వచ్చే సంకేతాలను రికార్డుచేసే సాధనాలు కూడా ఉన్నాయి. ఇటీవలే వీరు 'రోహిణి' ని జయప్రదంగా అంతరిక్షంలోకి పంపినారు.

***ఇక్రిసాట్ :*** అంతర్జాతీయ సస్య పరిశోధనాసంస్థ (అర్ధశుష్క ఉష్ణమండల ప్రాంతాలకు) (International Crop Research Institute for Semi - Arid Tropics) హైదరాబాదులోని పటాన్ చెరువు సమీపంలో పెద్దఎత్తున రూపొందింది. ఇక్కడ జొన్న, వేరుసెనగ, పప్పుధాన్యాలు మొదలైన పంటలను గురించి విస్తృతంగా పరిశోధనలు జరుపుతున్నారు. నేలలు, తెగుళ్ళు, చీడలు, పంటల శరీరధర్మశాస్త్రము, సూక్ష్మజీవశాస్త్రము, వృక్షప్రజననం మొదలైన విభాగాలున్నాయి. ఇందులో కొద్దిమంది విదేశీ నిపుణులేకాకుండా చాలామంది ఉత్తమ భారతీయ శాస్త్రవేత్తలు కూడా పనిచేస్తున్నారు. ప్రస్తుతం ఈ సంస్థకు డా. ఎల్. డి. స్విన్‌డేల్ డైరక్టరు జనరల్‌గా ఉన్నారు.

# 16

# వైద్య, ఆరోగ్య సౌకర్యాలు

మనదేశంలోను, రాష్ట్రంలోను, మనం ఎదుర్కొంటున్న ముఖ్య ఆరోగ్య సమస్యలు : 1. అంటువ్యాధులు; 2. పోషక ఆహారలోపం వల్ల కలిగే వ్యాధులు; 3. పరిసర పారిశుధ్య సమస్యలు; 4. వైద్య ఆరోగ్య సిబ్బందికొరత; 5. సామాజిక ఆరోగ్య సమస్యలు. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం ఈ ఆరోగ్య సమస్యలను పరిష్కరించడానికి ప్రజానీకానికి ఇతోధికంగా ఆరోగ్యసౌకర్యాలను కలగజేయడానికి ప్రభుత్వంవారు చాలాచర్యలు తీసుకొంటున్నారు. మనరాష్ట్రంలో 1978-79 సంవత్సరంలో అల్లోపతి, ఆయుర్వేద, యునాని, హోమియోపతి వైద్య విధానాలలో అందుబాటులో ఉన్న సౌకర్యాలను కిందిపట్టికలో చూడవచ్చు. ఈపట్టికలో ఇచ్చిన సమాచారం కేవలం ప్రభుత్వ నిర్వహణలో ఉన్న సంస్థలకుమాత్రమే పరిమితమైంది. ఇవికాక ప్రయివేట్ రంగంలో ఇంకా ఎన్నోఆస్పత్రులు, నర్సింగ్‌హోమ్‌లు, క్లినిక్‌లు,డాక్టర్లు ఉన్నారనే సంగతి వేరే చెప్పనవసరం లేదు.

| | | |
|---|---|---|
| I | అల్లోపతి : | |
| | a) ఆసుపత్రులు | 289 |
| | b) ప్రత్యేక చికిత్సకోసం ఆసుపత్రులు | 39 |
| | c) డిస్‌పెన్సరీలు | 1,139 |
| | d) పడకలు | 24,018 |
| | e) ప్రభుత్వ డాక్టర్‌లు | 4,248 |
| II | ఆయుర్వేద : | |
| | a) ఆసుపత్రులు | 4 |
| | b) డిస్‌పెన్సరీలు | 1,321 |
| | c) డాక్టర్‌లు, వైద్యులు | 1,418 |
| III | యునాని : | |
| | a) ఆసుపత్రులు | 2 |
| | b) డిస్‌పెన్సరీలు | 131 |
| | c) డాక్టర్‌లు, తబీబ్‌లు | 187 |

IV **హోమియోపతి :**

| | | |
|---|---|---|
| a) | ఆసుపత్రులు | 3 |
| b) | డిస్పెన్సరీలు | 131 |
| c) | డాక్టర్లు | 187 |

మూలం : డైరక్టర్ ఆఫ్ హెల్త్, ఫామిలీ వెల్ఫేర్, ఆం. ప్ర.

అయితే ఆధునిక వైద్యశాస్త్ర దృక్పథంతో చూస్తే కేవలం జబ్బుచేసినప్పుడు చికిత్స చేసి, నయం చేయడమే కాకుండా వ్యాధి నివారణ కార్యక్రమాలకు చాలా ప్రాముఖ్యం ఉంది. ఇందులో భాగంగా అంటువ్యాధుల నివారణ, పోషకాహార ప్రాముఖ్యం, మాతా శిశు సంక్షేమ కార్యక్రమాలు, పరిసర పారిశుధ్యం, సామాజిక ఆరోగ్య సమస్యలు, వివిధ స్థాయిలలో ఆరోగ్య సిబ్బంది శిక్షణ మొదలైన కార్యక్రమాలను ఆంధ్రప్రదేశ్ లో గుర్తించి, నిర్వహించ డం జరుగుతోంది. ఈ కార్యక్రమాలలో కొన్ని జాతీయ, అంతర్జాతీయ పథకాలలో భాగంగా కొనసాగుతున్నాయి. అయినప్పటికీ మనరాష్ట్రంలో డాక్టర్లసంఖ్య, నర్సులసంఖ్య ఉండవలసిన దానికన్నా చాలా తక్కువగా ఉన్నాయి. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో వైద్యసౌకర్యాలను మెరుగుపరచవలసిన అవసరం ఎంతైనా ఉంది. కింది పట్టికలో 1976,77 సంవత్సరాలలో వివిధ వ్యాధులవల్ల గవర్నమెంట్ ఆసుపత్రులలో మరణించినవారి సంఖ్యలు ఇచ్చినాము.

| వ్యాధిపేరు | మరణాలసంఖ్య | |
|---|---|---|
| | 1976 | 1977 |
| 1. కలరా | 76 | 132 |
| 2. మసూచి | — | — |
| 3. మలేరియా | 438 | 391 |
| 4. ఇతరజ్వరాలు | 79,667 | 68,580 |
| 5. రక్తగ్రహణి, విరేచనాలు | 6,568 | 5,869 |
| 6. శ్వాసకోశ వ్యాధులు | 18,599 | 17,422 |
| 7. గాయాలు | 4,254 | 5,461 |
| 8. ప్రసవాలవల్ల | 1,290 | 1,174 |
| 9. ఇతర కారణాలు | 1,30,010 | 1,32,958 |
| మొత్తం | 2,41,010 | 2,31,977 |

మూలం : డైరక్టర్ ఆఫ్ హెల్త్, ఫామిలీ వెల్ఫేర్, ఆం. ప్ర.

## జాతీయస్థాయి పథకాలు

***1. మశూచి నిర్మూలనా కార్యక్రమం :*** మన రాష్ట్రంలో మశూచి వ్యాధి కొన్ని శతాబ్దాలుగా విలయ తాండవం చేస్తూ ఉండేది. 1957-58 లో 14059 మందికి ఈ వ్యాధి సోకగా 8736 మంది మరణించినారు. ఈనాడు మన రాష్ట్రంలో మశూచి పూర్తిగా నిర్మూలించడం సాధ్యమయింది.

ప్రపంచ ఆరోగ్య సంస్థ సహాయంతో అయిదు నిఘా బృందాలు మన రాష్ట్రంలో పని చేస్తున్నాయి.

***2. మలేరియా నిర్మూలనా కార్యక్రమం :*** జాతీయ కార్యక్రమం ప్రారంభించక ముందు మన రాష్ట్రంలో సుమారు 70 లక్షల మంది ఈ వ్యాధి తీవ్రతకు లోనైనారు. 1970 నాటికి వ్యాధి సోకిన వ్యక్తుల సంఖ్య 23 వేలకి తగ్గిపోయింది. అయితే అనేక కారణాలవల్ల మళ్ళీ మలేరియా ఉధృతంగా తలఎత్తింది. అందువల్ల 1977 లో మలేరియా నియంత్రణ కార్యక్రమానికి కొత్త పథకాన్ని చేపట్టినారు. ఇందుకోసం అవసరమైన ప్రత్యేక సిబ్బందిని నియమించినారు.

***3. జాతీయ కలరా నియంత్రణ పథకం :*** మన రాష్ట్రంలో 1956-57 సం॥లో 7731 మందికి ఈ వ్యాధి సోకగా 3550 మంది మరణించినారు. 1972-73లో 983 మందికి వ్యాధిసోకి 110 మంది మాత్రమే మరణించినారు. మన రాష్ట్రంలో కలరా నియంత్రణ పథకాన్ని నాల్గవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రారంభించినారు. ఈ పథకం ప్రకారం వ్యాధి రాకుండా సూది మందువేయడం, పారిశుధ్య కార్యక్రమాలను, మంచినీటి సరఫరా కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

***4. జాతీయ బోదవ్యాధి నియంత్రణ కార్యక్రమం :*** మన రాష్ట్రంలో 1955-56లో ఈ పథకాన్ని ప్రారంభించినారు. ఈ పథకం ప్రకారం తూర్పు గోదావరిజిల్లాలో మండపేటలోను, నిజామాబాద్ జిల్లాలోని కామారెడ్డిలోను బోధ వ్యాధి నియంత్రణ చికిత్సా కేంద్రాలను హైదరాబాదులో ఒక సర్వే యూనిట్‌ను నెలకొల్పినారు. 1976 నాటికి రాష్ట్రంలో 24 బోద వ్యాధి నియంత్రణ కేంద్రాలను, ఒక శిక్షణా కేంద్రాన్ని నెలకొల్పినారు.

***5. జాతీయ క్షయవ్యాధి నియంత్రణ కార్యక్రమం :*** మన రాష్ట్రంలో సుమారు 20 వేల మంది క్షయ వ్యాధితో బాధపడుతున్నారు. ప్రతిఏడు ఈ వ్యాధివల్ల సగటున వేయి మరణాలు సంభవిస్తున్నాయి. ప్రతి జిల్లాలోను జిల్లా క్షయవ్యాధి నియంత్రణ కేంద్రాన్ని నెలకొల్పినారు. అంతే కాకుండా స్వచ్ఛంద సేవా సంస్థలుకూడా ఈ రంగంలో కృషి చేస్తున్నాయి. మన రాష్ట్రంలో 22 B. C. G. బృందాలు పని చేస్తున్నాయి.

***6. జాతీయ కుష్ఠువ్యాధి నియంత్రణ పథకం :*** ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 6.2 లక్షల కుష్ఠు రోగులు ఉన్నారు. అన్ని జిల్లాలలోను కుష్ఠు వ్యాధి ఉంది. ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయానికి రాష్ట్రంలో మూడు కుష్ఠువ్యాధి సబ్సిడియరీ కేంద్రాలు పని చేస్తున్నాయి.

1) కుష్ఠువ్యాధి నియంత్రణ యూనిట్లు — 57
2) పట్టడి కుష్ఠు వ్యాధి కేంద్రాలు — 55
3) S. E. T. (Survey, Education, Treatment) కేంద్రాలు — 492
4) శిక్షణ కేంద్రాలు — 5

కుష్ఠు రోగులకు పునరావాస సౌకర్యాలను కూడా ప్రభుత్వం వారు ఏర్పాటుచేసినారు.

*7. లైంగిక వ్యాధుల నివారణ పథకాలు :* ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మన రాష్ట్రంలో లైంగిక వ్యాధుల నియంత్రణ కార్యక్రమాలను కేంద్ర ప్రభుత్వ సహాయంతో చేబట్టినారు. అన్ని ప్రభుత్వ జనరల్ ఆసుపత్రులలో వి డి. చికిత్సా కేంద్రాలను కేంద్రాలను నెలకొల్పినారు.

*8. జాతీయ ట్రకోమావ్యాధి నియంత్రణ పథకం :* మన రాష్ట్రంలో ప్రబలత రేటు 5 3 శాతం. ఈ వ్యాధి సోకిన రోగులకు వైద్యశాలలు, ఆరోగ్య కేంద్రాలు ఉచిత చికిత్సా సదుపాయాలు అందజేస్తాయి.

*9. పోషకాహార పథకాలు :* మన రాష్ట్రంలో వైద్య, ఆరోగ్యశాఖలో పోషకాహార కార్యక్రమాలను నిర్వహించడానికి, పర్యవేక్షణ చేయడానికి అసిస్టెంట్ డైరక్టర్ హోదాలో ఒక అధికారిని నియమించినారు. కొన్ని జిల్లాలలో 1977 లో డైట్ సర్వే కార్యక్రమాలను నిర్వహించినారు. కొన్ని జిల్లాలలో కేర్ (CARE) సంస్థ సహాయంతో 13,000 ప్రాథమిక పాఠశాలలో సుమారు తొమ్మిది లక్షల బాల బాలికలకు మధ్యాహ్న భోజన సదుపాయాన్ని కలిగించినారు. ప్రత్యేక పోషకాహార కార్యక్రమాలను రాష్ట్రంలో 20 మునిసిపాలిటీలలో అమలు పరుస్తున్నారు. ఈపథకంలో మోడరన్ బేకరీవారు ప్రత్యేకంగా తయారు చేసిన రొట్టెలను 712 పంపిణీ కేంద్రాలలో పంపిణీ చేస్తున్నారు. ఈ కార్యక్రమంవల్ల 1,50,000 మందిపిల్లలుఫలితం పొందుతున్నారు. 19జిల్లాలలో 28 గిరిజనబ్లాకులలోకూడా ఈకార్యక్రమం నిర్వహిస్తున్నారు. రాష్ట్రంలోని 79 కమ్యూనిటి డెవలెప్ మెంటు బ్లాకులలో అనువర్తిత పోషకాహార కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. దీని కింద సుమారు 600 గ్రామాలు లాభం పొందుతున్నాయి. సమగ్ర శిశు సంరక్షణ పథకం కింద ఆరు సంవత్సరాలలోపు బాల బాలికలకు పోషకాహారం, వ్యాధి నివారణ టీకాలు, వైద్య, ఆరోగ్యపరీక్షలు చికిత్స సదుపాయాలు అందచేస్తున్నారు. ఈ కార్యక్రమాలకు FAO, UNICEF, సంస్థలు ఆర్థిక సాంకేతిక సహాయాన్ని అందజేస్తున్నాయి.

***10. జాతీయ మంచినీటి సరఫరా, పారిశుధ్య కార్యక్రమాలు :*** ఈ కార్యక్రమం 1954 లో ప్రారంభించబడింది. పట్టణ, గ్రామీణ, ప్రాంతాలలో గల ప్రజలకు అవసరమయిన మంచినీటిని పారుదల సదుపాయాలను కలగ చేయడం ఈ కార్యక్రమం లక్ష్యాలు.

***11. జాతీయ కనీస అవసరాల కార్యక్రమం :*** ఈ పథకం ప్రకారం ప్రజారోగ్య, వ్యాధి నివారణ, వైద్య, చికిత్స, కుటుంబ సంక్షేమ కార్యక్రమాలను నిర్వహించడానికివీలుగా కింది లక్ష్యాలను చేపట్టినారు.

1. రాష్ట్రంలో గల ప్రతి సమాజ వికాస బ్లాక్‌లోను ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని నెలకొల్పటం.

2. ప్రతి పదివేల జనాభాకు ఒక ఉప కేంద్రాన్ని నెలకొల్పటం.

3. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు ఔషధాలకోసం సాలీనా రూ. 12,000 ఉప కేంద్రాలకు రూ. 2000 మంజూరు చేయటం.

4. ప్రతి నాలుగు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలోను ఒకే కేంద్రాన్ని 30 పడకలు గల గ్రామీణ వైద్యశాలగా మార్చటం.

ఈ కార్యక్రమం కింద అయిదవ పంచవర్ష ప్రణాళికలో అయిదు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు, 101 ఉప కేంద్రాలను స్థాపించానారు.

*అంతర్జాతీయ సంస్థలు :* WHO (ప్రపంచ ఆరోగ్య సంస్థ) UNICEF, CARE FAO, ILO వంటి ఐక్యరాజ్య సమితి విభాగాలు ప్రత్యక్షంగాను పరోక్షంగాను అందచేస్తున్న ఆర్థిక, సాంకేతిక సహాయంవల్ల మనరాష్ట్రంలో వైద్య ఆరోగ్య కార్యక్రమాలకు ప్రోత్సాహం లభిస్తుంది.

*స్వచ్ఛంద సంస్థలు :* ప్రభుత్వ ఆధ్వర్యంలోనేగాక అనేక స్వచ్ఛంద సేవాసంస్థలు కూడా ఆరోగ్య సంరక్షణలో చాలా సేవచేస్తున్నాయి. వీటిలో ముఖ్యంగా చెప్పుకోవలసినవి రెడ్‌క్రాస్, ఫోర్ట్‌ఫౌండేషన్, హింద్‌కుష్ఠ నివారణ సంస్థ, క్షయనివారణ సంఘము, ఆంధ్ర మహిళాసభ మొదలైన సంస్థలు.

## వైద్య విద్య

మనరాష్ట్రంలో కిందపేర్కొన్న ఎనిమిది వైద్య కళాశాలలున్నాయి :

1) ఉస్మానియా వైద్యకళాశాల హైదరాబాద్ : ఇందులో ఎమ్. బి. బి. ఎస్ లో 150 సీట్లు, పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్సులకు 147 సీట్లు ఉన్నాయి. అంతేకాక దంతవైద్య శాస్త్రం కోర్సులో (బి. డి. ఎస్) 32 సీట్లు ఉన్నాయి. బి. ఎస్. (నర్సింగ్) కోర్స కూడా ఈ కాలేజీలో నడుపుతున్నారు.

2) గాంధి మెడికల్ కాలేజీ, హైదరాబాద్ : ఎమ్. బి. బి. ఎస్ సీట్లు 100, పోస్ట్‌గ్రాడ్యుయేట్ సీట్లు 65.

3) కాకతీయ వైద్యకళాశాల, వరంగల్ : ఎమ్. బి. బి. ఎస్ సీట్లు 200, పోస్ట్‌గ్రాడ్యుయేట్ సీట్లు 37.

4) కర్నూల్ మెడికల్ కాలేజి, కర్నూల్ : ఎమ్. బి. బి. ఎస్, సీట్లు 120, పోస్ట్ గ్రాడ్యుయేట్ సీట్లు 59.

5) శ్రీ వేంకటేశ్వర వైద్య కళాశాల, తిరుపతి : ఎమ్. బి. బి. ఎస్. సీట్లు 80, పోస్ట్ గ్రాడ్యుయేట్ సీట్లు 46.

6) గుంటూరు మెడికల్ కాలేజీ, గుంటూరు ఎమ్. బి. బి. ఎస్. సీట్లు 125 పోస్ట్‌గ్రాడ్యుయేట్‌సీట్లు 65.

7) రంగరాయ మెడికల్ కాలేజీ, కాకినాడ : ఎమ్. బి. బి. యస్ సీట్లు 100, పోస్ట్ గ్రాడ్యుయేట్ సీట్లు, 44.

8) ఆంధ్ర మెడికల్ కాలేజి, విశాఖపట్టణం : ఎమ్. బి. బి. ఎస్. సీట్లు 125, పోస్ట్ గ్రాడ్యుయేట్ సీట్లు, 90.

ఇంతేకాక మనరాష్ట్రంలో నర్సుల శిక్షణకు 9 స్కూళ్ళు ఉన్నాయి. వీటిలో మొత్తం 1029 సీట్లు ఉన్నాయి. అట్లాగే లాబొరేటరీ టెక్నిషియన్‌లకు శిక్షణ ఇచ్చే కేంద్రాలు 9 ఉన్నాయి. వీటిలో మొత్తం 200 సీట్లు ఉన్నాయి. లాబొరేటరీ అటెండర్‌లకు శిక్షణ ఇచ్చే కేంద్రాలు 9 ఉన్నాయి. వీటిలో మొత్తం సీట్లు 200 ఉన్నాయి. ప్రతి మెడికల్ కాలేజీలోను శానిటరీ ఇన్‌స్పెక్టర్లకు శిక్షణ ఇచ్చే కేంద్రం ఉంది. ఒక్కొక్క కేంద్రంలో 100 సీట్ల చొప్పున మొత్తం 800 సీట్లు ఉన్నాయి. శానిటరీ ఇన్‌స్పెక్టరు కోర్స్‌కు ఇటివలే తెలుగు మాధ్యమం ప్రవేశపెట్టినారు.

ఇటీవల రాష్ట్రప్రభుత్వం కింగ్‌కోఠి భవనం స్వాధీనం చేసుకొని అందులో ఒక హాస్పిటల్ ప్రారంభించింది. దానిలో పోస్టుగ్రాడ్యుయేట్ స్థాయిలో వైద్య విద్యా సౌకర్యాలు కలగజేసే ప్రతిపాదన కూడా ఆలోచనలో ఉంది.

ఆంధ్రమహిళా సభవారు ఆగ్జిలరీ హెల్త్ వర్కర్స్ కోర్స్ నిర్వహిస్తున్నారు. ఈ కోర్స్‌లో తెలుగు మాధ్యమం ప్రవేశపెట్టినారు. పైన పేర్కొన్న అలోపతి వైద్యకళాశాలలే కాక మన రాష్ట్రంలో ఆయుర్వేద హోమియోపతి, యునానీ వైద్యకళాశాలలు కూడా ఉన్నాయి. హైదరాబాదులోని ఆయుర్వేద కళాశాలలో 50 సీట్లు, వరంగల్‌లో 30 సీట్లు, విజయవాడలో 30 సీట్లు ఉన్నాయి. హైదరాబాద్ ఆయుర్వేద కళాశాలలో పోస్ట్‌గ్రాడ్యుయేట్ సీట్లుకూడా 10 ఉన్నాయి.

హైదరాబాదులో ఉన్న హోమియోపతి కళాశాలలో 80 సీట్లున్నాయి. గుడివాడ హోమియోపతి కళాశాలలో 50 సీట్లున్నాయి.

హైదరాబాదులోని నిజామియా తిబ్బి యునాని కళాశాలలో 50 సీట్లున్నాయి. ఇక్కడ పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్స్‌లో 10 సీట్లు కూడా ఉన్నాయి.

భారతీయ వైద్యవిధానాలను నిర్వహించడానికి ప్రత్యేకంగా ఒక ప్రభుత్వ శాఖ ఉంది. వీరు ఆయుర్వేద యునాని మందులు తయారు చేయడానికి ఒక కేంద్రాన్ని నడుపుతున్నారు. వీరు ఆయుర్వేద యునాని వైద్య విధానాలలో పరిశోధనలు కూడా జరుపుతున్నారు.

ఇవికాక హైదరాబాద్‌లో కేంద్రప్రభుత్వ ఆధ్వర్యంలో యునాని వైద్య పరిశోధనా కేంద్రం, దానికి అనుబంధంగా ఒక ఆసుపత్రి కూడా ఉన్నాయి

కేంద్ర ప్రభుత్వం వారి ఇండియన్ మెడిసినల్ ప్లాంట్స్ ఆర్గనైజేషన్‌వారి ప్రాంతీయ కేంద్రం విజయవాడలో ఉంది. వీరు మనరాష్ట్రంలో లభ్యమయ్యే మందు మొక్కలను సేక

సికింద్రాబాద్‌లోని వేమనయోగి పరిశోధనా కేంద్రం వైద్యకళాశాల సహకారంతో యోగాభ్యాసం వల్ల మనదేహంలో కలిగే శరీరధర్మ, జీవరసాయన మార్పులను గురించి పరిశోధనలు జరుపుతున్నారు.

***ఆహార ఔషధ నియంత్రణ :*** ఆహారపదార్థాల కల్తీనివారణ చట్టాన్ని అమలు జరపడానికి రాష్ట్రంలోని మునిసిపాలిటీలు, పంచాయితీలు చర్యలు తీసుకుంటున్నాయి. హైదరాబాద్‌లో నాచారం సమీపంలో ఒక ఆహార, ఔషధ ప్రయోగశాలను నెలకొల్పుతున్నారు. ఇందులో వర్తకుల వద్దనుంచి సేకరించిన సాంపుల్స్ పరీక్షించి కల్తీచేసినవారా హుపటానికి చర్యలు తీసుకొంటారు.

**ప్రభుత్వ సౌకర్యాలు (అల్లోపతి) - జిల్లాలవారీ (1977-78)**

| జిల్లా | ఆస్పత్రులు, డిస్పెన్సరీల సంఖ్య | పడకల సంఖ్య | డాక్టర్ల సంఖ్య |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 76 | 671 | 111 |
| విశాఖపట్నం | 129 | 2,436 | 365 |
| తూర్పుగోదావరి | 128 | 1,410 | 299 |
| పశ్చిమగోదావరి | 97 | 648 | 129 |
| కృష్ణ | 46 | 1,058 | 150 |
| గుంటూరు | 59 | 1,576 | 341 |
| ప్రకాశం | 55 | 394 | 73 |
| నెల్లూరు | 116 | 899 | 130 |
| కోస్తా ఆంధ్ర | 706 | 9,092 | 1,598 |
| కర్నూలు | 79 | 1,294 | 279 |
| అనంతపూర్ | 50 | 839 | 115 |
| కడప | 110 | 552 | 88 |
| చిత్తూరు | 55 | 1,290 | 269 |
| రాయలసీమ | 294 | 3,975 | 751 |
| హైదరాబాదు | 84 | 6,093 | 881 |
| నిజామాబాద్ | 32 | 524 | 97 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| మెదక్ | 46 | 349 | 86 |
| మహబూబ్‌నగర్ | 45 | 623 | 124 |
| నల్గొండ | 72 | 598 | 117 |
| వరంగల్ | 33 | 1,132 | 226 |
| ఖమ్మం | 38 | 472 | 100 |
| కరీంనగర్ | 43 | 502 | 111 |
| ఆదిలాబాద్ | 32 | 516 | 101 |
| తెలంగాణా | 425 | 10,809 | 4,192 |
| ఆంధ్రప్రదేశ్ | 1,425 | 23,876 | 4,192 |

మూలం : డైరక్టర్ ఆఫ్ మెడికల్ & హెల్త్ సర్వీసెస్, ఆం. ప్ర.

## ఆయుర్వేద సౌకర్యాలు 1977-78

| | |
|---|---|
| ప్రభుత్వ ఆస్పత్రులు | 121 |
| మున్సిపల్ ఆస్పత్రులు | 65 |
| పంచాయతీసమితి డిస్పెన్సరీలు | 157 |
| సబ్సిడీ ఇచ్చిన ఆస్పత్రులు | 624 |
| సబ్సిడీ ఇవ్వని ఆస్పత్రులు | 147 |
| గ్రాంట్ ఇన్ ఎయిడ్‌లో గల ఆస్పత్రులు | 165 |
| డాక్టర్లు | 1,365 |
| చికిత్స పొందిన రోగులు | 30,58,859 |

మూలం : డైరక్టర్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్స్, హోమియోపతి శాఖ, ఆం. ప్ర.

## యూనాని వైద్యసౌకర్యాలు - 1977-78

| | |
|---|---|
| ప్రభుత్వ ఆస్పత్రులు | 99 |
| మునిసిపల్ ఆస్పత్రులు | 10 |
| సబ్సిడీగల ఆస్పత్రులు | 2 |

| | |
|---|---|
| గ్రాంట్ ఇన్ ఎయిడ్‌గల ఆస్పత్రులు | 12 |
| | 123 |
| డాక్టర్లు, హకీమ్‌లు, లెక్చరర్లు మొ॥ వారు | 186 |
| చికిత్స పొందినరోగులు | 35,05,186 |

మూలం : డైరక్టర్ ఆఫ్ ఇండియన్ మెడిసన్ అండ్ హోమియోపతిశాఖ, ఆం. ప్ర.

**హోమియోపతి వైద్య సౌకర్యాలు - 1977-78**

| | |
|---|---|
| ప్రభుత్వ ఆస్పత్రులు | 47 |
| మునిసిపల్ ఆస్పత్రులు | 9 |
| పంచాయతీ డిస్పెన్సరీలు | 4 |
| సబ్సిడీగల ఆస్పత్రులు | 4 |
| సబ్సిడీలేని ఆస్పత్రులు | 7 |
| గ్రాంట్ ఇన్ ఎయిడ్‌గల ఆస్పత్రులు | 19 |
| | 90 |
| డాక్టర్లు వైద్యులు, లెక్చరర్లు మొ॥ వారు | 164 |
| చికిత్సపొందిన రోగులు | 8,31,211 |

మూలం : డైరక్టర్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్ అండ్ హోమియోపతిశాఖ, ఆం. ప్ర.

# 17

# పరిశ్రమలు

దేశ ఆర్థిక ప్రగతికి పారిశ్రామికాభివృద్ధి పట్టుగొమ్మ. అభివృద్ధి చెందిన దేశాల తీరు తెన్నులను పరిశీలిస్తే జాతీయోత్పత్తిలో ప్రాథమిక రంగం (వ్యవసాయం మొ॥ నవి) వాటా తక్కువగా ఉండి, ద్వితీయ రంగం (పరిశ్రమలు, గనులు మొ॥ నవి) వాటా హెచ్చుగా ఉంటుంది. మనదేశం వ్యావసాయికంగా ప్రధానమైంది కాబట్టి మన జాతీయోత్పత్తిలో వ్యవసాయరంగం వాటా హెచ్చుగా ఉండి, పరిశ్రమల రంగం వాటా తక్కువగా ఉంటుంది. మనరాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో కూడా ఇదే పరిమాణాన్ని గమనించవచ్చు. 1960-61 ధరల ప్రాతిపదికగా 1955-56 లో మొత్తం రాష్ట్ర ఆదాయంలో పరిశ్రమల రంగం వాటా 11.4 శాతం ఉంది. ఇది 1979-80 నాటికి 20.3 శాతం పెరిగినట్లు తెలుస్తూన్నది. ప్రణాళికా బద్ధమైన కృషిద్వారా గత పాతికేళ్ళలో ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికాభివృద్ధి ఓ మాదిరిగా జరిగిందనే చెప్పవచ్చు. పరిశ్రమల రంగంలో పనిచేస్తున్న జనాభాశాతం కూడా పెరిగింది. అయితే ఈ పెరుగుదల మహారాష్ట్ర, మద్రాసు, పశ్చిమ బెంగాల్, గుజరాత్ మొదలైన రాష్ట్రాలతో పోల్చుకున్నప్పుడు అంతగా లేదని చెప్పలనసి వస్తుంది. అయితే చిన్న తరహా పరిశ్రమల విషయంలో మనరాష్ట్రంలో చెప్పుకోదగిన అభివృద్ధి జరిగింది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడేనాటికి దాదాపు మొదటి పంచవర్ష ప్రణాళిక ముగియవచ్చింది. మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికీకరణ ఏమంతగా జరగ లేదు. ఆ తరువాతి ప్రణాళికల కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో వివిధ ప్రాంతాలలో భారీ, మధ్య తరహా, చిన్నతరహా పరిశ్రమలు అభివృద్ధి చెంద సాగినాయి. పారిశ్రామికాభివృద్ధికి వివిధ ప్రణాళికలలో అయిన వ్యయాన్ని గమనిస్తే పారిశ్రామిక రంగంలో ఆంధ్రప్రదేశ్ ఆశించినంతగా అభివృద్ధి చెందలేదనేది విశదమవుతుంది.

| వివరాలు | వ్యయం [కోట్లరూపాయలు] |
|---|---|
| మొదటి ప్రణాళిక | 1.15 |
| రెండో ప్రణాళిక | 10.15 |
| మూడో ప్రణాళిక | 15.19 |
| మూడు వార్షిక ప్రణాళికలు | 7.11 |
| నాలుగో ప్రణాళిక | 15.26 |
| అయిదో ప్రణాళిక | 47.45 |

పైన పేర్కొన్న వివరాలను పరిశీలిస్తే, నాలుగో ప్రణాళికాకాలానికి ద్వితీయరంగంకింద రాష్ట్ర ప్రభుత్వం ఖర్చుపెట్టిన 48.86 కోట్ల రూపాయలు అంటే, మొత్తం నాలుగు ప్రణాళికలలో పారిశ్రామికాభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం ఖర్చు చేసింది 3.8 శాతం మాత్రమే అయితే అయిదో ప్రణాళికా కాలంలో పారిశ్రామికాభివృద్ధికి 47.45 కోట్ల రూపాయలు కేటాయించి, ప్రత్యేక శ్రద్ధకనబర్చినట్లు గోచరిస్తున్నది. అయిదో ప్రణాళికలో భారీ, మధ్యతరహా పరిశ్రమలకు రూ. 26.55 కోట్లు, గ్రామీణ చిన్నతరహా పరిశ్రమలకు రూ. 12.95 కోట్లు, గనులు, మెటలర్జికల్ పరిశ్రమలకు రూ. 7.95 కోట్లు కేటాయించడం జరిగింది.

మన రాష్ట్రంలో వివిధరకాల పరిశ్రమల అభివృద్ధికి, సంస్థాపనా సౌకర్యాలను కల్పించడానికి, ఆర్థిక, సాంకేతిక సహాయాలను అందించడానికి ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి సంస్థ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ, ఆంధ్రప్రదేశ్ చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్, ఆంధ్రప్రదేశ్ అవస్థాపనా సంస్థ మొదలైన వాటిని నెలకొల్పడం జరిగింది. 1977-78లో కేంద్ర పారిశ్రామికశాఖ జరిపిన వార్షిక సర్వే ప్రకారం మన దేశంలో పారిశ్రామికీకరణంలో ఆంధ్రప్రదేశ్ ఆరో స్థానాన్ని ఆక్రమించింది.

## కేంద్రరంగ పరిశ్రమలు

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత అనేక రంగాలలో పబ్లిక్‌రంగంపాత్ర నానాటికీ హెచ్చు కాసాగింది. కేంద్ర ప్రభుత్వం అనేక రాష్ట్రాలలో ప్రభుత్వరంగం కింద సంస్థలను స్థాపించి పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడుతున్నది. మనరాష్ట్రంలో కూడా పబ్లిక్ రంగం కింద కొన్ని సంస్థలను స్థాపించడం జరిగింది. అయితే మనరాష్ట్రంలో పారిశ్రామికీకరణకు కేంద్రం పెట్టుబడులు స్వల్పంగానే ఉన్నాయని చెప్పవచ్చు. నాలుగో ప్రణాళికాంతానికి ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమల అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వం ఖర్చుచేసింది రూ. 154.3 కోట్లు మాత్రమే. బీహార్ మధ్యప్రదేశ్, ఒరిస్సా, తమిళనాడు, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలతో పోల్చుకుంటే ఇది చాలా తక్కువే అని చెప్పవచ్చు. మనరాష్ట్రంలో ఉన్న జిల్లాలలో 14 జిల్లాలను పారిశ్రామికంగా వెనకబడి ఉన్నట్టు ప్రణాళికా సంఘం పేర్కొన్నది. ముఖ్యంగా రాయలసీమ జిల్లాలు పారిశ్రామికంగా బాగా వెనకబడి ఉన్నాయి. 1971 జనాభా లెక్కల ప్రకారం 1,000 మంది జనాభాలో సగటున పరిశ్రమలలో పనిచేసేవారి సంఖ్య భారత దేశంలో 9 మంది ఉండగా ఆంధ్రప్రదేశ్‌లో 6 మంది మాత్రమే ఉన్నారు. ఈ సంఖ్య మహారాష్ట్రలో 20.2 మంది, పశ్చిమ బెంగాల్‌లో 18.8 మంది, గుజరాత్‌లో 16.6 మంది, తమిళనాడులో 10.7 మందిగా ఉంది. వీన్నిబట్టిచూస్తే మనరాష్ట్రం దేశంలో చాలా రాష్ట్రాలకంటె పారిశ్రామికంగా వెనకబడి ఉన్నట్లు తెలుస్తోంది.

మనరాష్ట్రంలో కేంద్రరంగ పరిశ్రమలు 22 ఉన్నాయి. అందులో ముఖ్యమైన వాటిని గురించి క్లుప్తంగా వివరించడం జరిగింది.

**హిందూస్తాన్ మెషీన్ టూల్స్, హైదరాబాదు :** ఈ ఫ్యాక్టరీనిర్మాణం 1964 జూన్‌లో మొదలై, 1967 ఆగష్టుకు ఉత్పత్తి దశకు వచ్చింది. ఈ ఫ్యాక్టరీలో దాదాపు 3,000 మంది ఉద్యోగస్థులు, కార్మికులు పనిచేస్తున్నారు. ఇందులో హారిఖాండల్ బోరింగ్ యంత్రాలు, ఆటో

మెషీన్ టూల్స్, ప్రింటింగ్ మెషిన్లు హైడ్రాలిక్ మెకానిక్ ప్రెస్‌లు, ప్రెస్‌బ్రేకర్లు, బస్సులు, విద్యుద్దీపాలకు సంబంధించిన సిమెంట్లు క్యాప్‌లు, రవాణా సామాగ్రి పరికరాలు తయారవుతున్నాయి. దీని ఉత్పత్తుల విలువ రూ 8.5 కోట్ల విలువకు చేరుకొంది

***భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్, రామచంద్రపురం, హైదరాబాదు:*** ఈ సంస్థ 1966 డిసెంబరు నుంచి పని చేస్తున్నది. ఇందులో విద్యుచ్ఛక్తి కేంద్రాలకు పనికివచ్చే అనేక రకాల యంత్ర సామాగ్రి స్టీమ్ టర్బైన్ జనరేటర్లు, పంపుసెట్లు, కంప్రెసర్లు, సర్క్యూట్ బ్రేకర్లు మొదలైనవి తయారవుతున్నాయి. ఇందులో దాదాపు 9,000 మందికార్మికులు పనిచేస్తున్నారు. మొదట్లో ఈ సంస్థకు నష్టాలు వచ్చాయి కాని, గత కొద్ది సంవత్సరాలుగా లాభాలు వస్తున్నాయి. 1979 లో దీని ఉత్పత్తుల విలువ 73.3 కోట్ల రూపాయలు. ఇక్కడ తయారయ్యే యంత్రాలు ఇరాక్, మలేషియా, లిబియా మొదలైన దేశాలకు ఎగుమతి అవుతున్నాయి.

***ఎలక్ట్రానిక్ కార్పొరేషన్, హైదరాబాదు :*** ఈసంస్థను 1967 ఏప్రిల్‌లో నెలకొల్పడం జరిగింది. క్రమేణా ఈ సంస్థ ఎంతో అభివృద్ధి చెందింది. మైక్రోవేవ్ ఇంట్రూడర్ అలారమ్ ట్రాఫిక్ ఎనలైజర్స్, ట్రాన్స్ రిసీవర్లు, కాక్‌పిట్‌వాయిస్ రికార్డర్లు, కంప్యూటర్లు, రేడియోలు టెలివిజన్ సెట్లు, వైద్యపరికరాలు కమ్యూనికేషన్ సామాగ్రి మొదలైనవెన్నో ఫ్యాక్టరీల్లో తయారుచేస్తున్నారు. దాదాపు పదివేలమంది ఉద్యోగస్థులు, కార్మికులు పనిచేస్తున్నారు. సాలీనా దాదాపు రూ 33 కోట్ల విలువగల వస్తువులను ఈ సంస్థ ఉత్పత్తి చేస్తున్నది.

***సింథటిక్ డ్రగ్స్‌ప్లాంట్, హైదరాబాదు:*** సోవియట్‌యూనియన్‌సహకారంతో దీనిని 1961 సం॥లో కేంద్రప్రభుత్వం నెలకొల్పింది. ఇది 1967లో రకరకాల మందుల ఉత్పత్తిని ప్రారంభించింది. ఈఫ్యాక్టరీలో అనాల్జిన్, సెమిజోల్ హెక్సాలిట్, కాల్‌మోడ్,సక్సీ, అఫిడిన్ మొదలైన మందులు తయారవుతున్నాయి. అంతేకాకుండా, టి. బి. నివారణ మందులు, పైరిటిక్స్ నివారణ మందులు, విటమిన్‌లు కూడా తయారవుతున్నాయి. 1971-72 లో 1039 టన్నుల మందులు ఉత్పత్తికాగా 1978-79 నాటికి దాదాపు 3,000 టన్నుల మందులను తయారుచేసినట్లుగా తెలియవచ్చింది. దాదాపు 38 రకాల మందులు ఈ ఫ్యాక్టరీలో తయారుచేస్తున్నారు.

***హిందూస్థాన్ కేబుల్స్ లిమిటెడ్, హైదరాబాదు :*** ఈ సంస్థ ముఖ్యంగా భూగర్భ టెలిఫోన్ కేబుల్స్‌ను తయారుచేస్తుంది. ఇందులో దాదాపు 1000 మంది ఉద్యోగులు, కార్మికులు పనిచేస్తున్నారు. ఈ సంస్థలో అనేకరకాలయిన కేబుల్స్ తయారవుతున్నాయి. ఈ సంస్థ అతివేగంగా అభివృద్ధిచెందుతూ విదేశాలకు కేబుల్స్‌ను ఎగుమతి చేస్తున్నది.

***భారత డైనమిక్స్ లిమిటెడ్, హైదరాబాదు :*** ఈ కంపెనీ 1970 లో దేశరక్షణ శాఖ ఆధ్వర్యాన స్థాపించడం జరిగింది. ఇందులోయాంటిగైడెడ్ మిసిలీలు ఎలక్ట్రానిక్ పరికరాలు, యుద్ధపరికరాలు తయారవుతున్నాయి. ఈ సంస్థ 1972 నుంచి ఉత్పత్తిని ప్రారంభించింది. 1978-79 లో ఈ సంస్థ ఉత్పత్తి రు 4.2 కోట్లుగా తెలియవచ్చింది.

**భారత హెవీప్లేట్స్ అండ్ వెసల్స్ లిమిటెడ్, విశాఖపట్నం:** దీనిని 1966లో స్థాపించడం జరిగింది. ఈ కంపెనీ రసాయనిక ఎరువులు పెట్రోకెమికల్స్ భారీ రసాయనాలు తదితర ప్రోసెస్ పరిశ్రమం కవసరమైన అధునాతన యంత్రసామగ్రిని తయారు చేస్తున్నారు. అంతేకాకుండా ప్రెజర్‌వెస్సల్, హీట్ ఎక్ఛేంజర్ ఎయిర్‌గాస్, సెపరేషన్‌ప్లాంట్లు మొదలైన పరికరాలుకూడ ఈ సంస్థ తయారుచేస్తున్నది. ఈ సంస్థలో దాదాపు 4,500 మంది ఉద్యోగాలు చేస్తున్నారు ఈ సంస్థ సాలుకు రూ 21 5 కోట్ల విలువగల పరికరాలను ఉత్పత్తి చేస్తున్నది.

**హిందూస్థాన్ షిప్‌యార్డు విశాఖపట్నం :** దీనిని 1941 లో స్థాపించినారు. 1952లో ఈ సంస్థను భారత ప్రభుత్వము స్వాధీనం చేసుకొంది. ఈ సంస్థ 1979 నాటికి చిన్నపెద్ద 78 నౌకలను నిర్మించింది. ఇందులో దాదాపు 8,000 మంది పనిచేస్తున్నారు. 1971 సంవత్సరంలో అధునాతన యంత్రసామగ్రితో హిందూస్థాన్ డ్రైడాక్సు అనే నౌకామరమత్తుల కేంద్రాన్ని స్థాపించినారు.

పైన పేర్కొనకుండా ఆంధ్రప్రదేశ్‌లో కింద ఉదహరించిన కేంద్ర రంగ పరిశ్రమలున్నాయి,

1. నేషనల్ మినరల్ డెవలప్‌మెంటు కార్పొరేషను, హైదరాబాదు
2. ప్రాగాటూల్స్ కార్పొరేషను, హైదరాబాదు
3. తుంగభద్రస్టీల్స్ ప్రోడక్ట్సు, తుంగభద్ర డామ్
4. కాల్‌టెక్స్ ఆయిల్ రిఫైనరీ, విశాఖపట్నం
5. డ్రెడ్జింగ్ కార్పొరేషన్, ఆఫ్ ఇండియా, విశాఖపట్నం
6. ఫర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, రామగుండం
7. ఇండియన్ డ్రగ్స్ అండ్ ఫార్మస్యూటికల్స్ లిమిటెడ్, హైదరాబాదు
8. లాంప్ ప్రాజెక్టు - హైదరాబాదు
9. హిందూస్థాన్ జింక్ లిమిటెడ్, విశాఖ పట్నం
10. మిశ్రధాతునిగమ్, హైదరాబాదు

## రాష్ట్ర ప్రభుత్వ సంస్థలు

రాష్ట్ర ప్రభుత్వం తన యాజమాన్యంలో కొన్ని భారీ పరిశ్రమలను నెలకొల్పింది. అందులో ముఖ్యమైన వాటిని గురించి కింద పొందుపరచడమైంది.

**హైదరాబాదు ఆల్‌విన్ మెటల్ వర్క్స్:** దీనిని 1942లో ప్రైవేటు రంగంలో స్థాపించారు. 1969 లో దీని నిర్వహణను ప్రభుత్వం చేపట్టింది. ఇది స్టీలు ఫర్నిచరు, 5 సైజులలో రిఫ్రిజిరేటర్లు, ఆఫీసు పరికరాలు, మొదలైనవి తయారు చేస్తుంది. బస్సు బాడీలను కూడా ఈ కంపెనీ నిర్మిస్తుంది. రెండస్తుల బస్సు బాడీలను నిర్మించిన ఘనత మొట్ట మొదటగా

ఈ కంపెనీకే దక్కిందని చెప్పవచ్చు. ఎల్. పిజి సిలిండెర్లను కూడ ఈ కంపెని తయారు చేస్తుంది. ఈ కంపెనీలో దాదాపు 6000 మంది పని చేస్తున్నారు.

*ఇండో నిప్పన్ ప్రసిషన్ బేరింగ్ లిమిటెడ్, హైదరాబాదు :* ఈ కంపెని 1964 లో స్థాపించారు. అప్పుడు దీని పెట్టుబడి రూ. 6 కోట్లు. 1970 నుంచి ఈ కంపెని ఉత్పత్తిని ప్రారంభించింది. ఈ కంపెనీలో బాల్ బేరింగులు, రోలర్ బేరింగులు తయారవుతాయి. ఇందులో దాదాపు 1000 మంది ఉద్యోగులున్నారు.

*ఆంధ్రప్రదేశ్ స్కూటర్స్ లిమిటెడ్, హైదరాబాదు:* ఈఫ్యాక్టరీని హైదరాబాదు సమీపంలోని పటాన్‌చెరువుదగ్గర 1974 లో స్థాపించారు. ఇది 1978 చివరకు దాదాపు 21,500 స్కూటర్లను తయారుచేసింది. కొన్ని స్కూటర్లను శ్రీలంక, స్విట్జర్లాండు దేశాలకు ఎగుమతి చేయడం జరిగింది. ఈ ఫ్యాక్టరీ దాదాపు 2000 మందికి ఉపాధిని కల్పిస్తోంది.

*రిపబ్లిక్ ఫోర్జ్ లిమిటెడ్, హైదరాబాదు :* దీనిని 1957 లో నెలకొల్పారు. ఈ కంపెనీలో స్టీలు, ఎల్లాయ్ ఫోర్జింగ్స్ తయారు చేస్తారు. దీని స్థాపిత ఉత్పాదక శక్తి ఏడాదికి 8,250 టన్నులు. దీనిలో సుమారు 1000 మంది పనిచేస్తున్నారు. 1977-78 లో దీని ఉత్పత్తి 3000 టన్నులు. ఈ కంపెనీ లాభార్జన దశలో ఉంది.

*నిజామ్ సుగర్ ఫ్యాక్టరీ, షక్కర్‌నగర్ :* 1958లో ఈ ఫ్యాక్టరీని రాష్ట్ర ప్రభుత్వపు పరిశ్రమల విభాగం చేపట్టింది. ఈ కంపెనీ నిజామాబాద్‌జిల్లా బోధన్ దగ్గర షక్కర్ నగర్‌లో ఉంది. ఈ కంపెనీకి మధునగర్, అమృతసర్, హిందూపూర్, ముప్పంపేటలలో విభాగాలున్నాయి. మన దేశంలోగల పంచదార ఫ్యాక్టరీలలో ఇది చెప్పుకో తగినది. ఈ ఫ్యాక్టరీ, దీని అనుబంధ విభాగాలు సంవత్సరానికి ఏడు లక్షల టన్నుల చెరకును ఆడించి 69వేల టన్నుల పంచదారను ఉత్పత్తి చేయడం జరుగుతుంది.

*ఆంధ్రప్రదేశ్ పవర్ ఆల్కహాలు ఫ్యాక్టరీ, బోధన్ :* ఈ ఫ్యాక్టరీ 1964 నుంచి ఉత్పత్తిని ప్రారంభించింది. 1978 చివరకు ఇది 38,000 టన్నుల మొలాసెస్ నుంచి 9 కోట్ల లీటర్ల స్పిరిటును తయారు చేసింది. ఈ స్పిరిటును అనేక పరిశ్రమలకు సప్లైచేస్తుంది. ఇంకా మన రాష్ట్రంలో సింగరేణి కాలరీస్ లిమిటెడ్ కొత్తగూడెం, గవర్నమెంటు డిస్టిలరీ నారాయణగూడా, కామారెడ్డి, ఆగ్రోపంపుసెట్స్ లిమిటెడ్ మొదలైనవి కొన్ని సంస్థలున్నాయి.

## ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్యమైన పరిశ్రమలు

ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన అనేక ఖనిజాలు, లోహాలు, వ్యవసాయక ఉత్పాదకాలు లభ్యమవుతున్నప్పటికి ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికీకరణ అంతగా జరగలేదు. మన రాష్ట్ర పారిశ్రామికాభి వృద్ధిలో ప్రయివేట్ రంగం ముఖ్యమైన పాత్ర వహిస్తున్నది. ప్రయివేట్ రంగంలో పరిశ్రమల స్థాపనకు అభివృద్ధికి ప్రణాళికల కేటాయింపు ఉన్నప్పటికీ పెక్కు ఉద్యమిదార్లు రాష్ట్రంలో మధ్యతరహా, చిన్నతరహా, పరిశ్రమలను నెలకొల్పడానికి, విస్తరింపజేయటానికి ఎంతో ఉత్సాహాన్ని చూపుతున్నారు. రాష్ట్రంలోని చిన్నతరహా పరిశ్రమలన్నీ దాదాపు ప్రయివేట్ రంగంలోనే ఉన్నాయని చెప్పవచ్చు. మన రాష్ట్రంలోని వివిధ పరిశ్రమల తీరు తెన్నులను కింద సంగ్రహంగా పేర్కొనడం జరిగింది.

## సిమెంటు పరిశ్రమ

మన రాష్ట్రంలో సిమెంటు పరిశ్రమ 1939లో ప్రారంభమయిందనవచ్చు. మొదట్లో రెండు సిమెంటు ఫ్యాక్టరీలు ఉండేవి. అవి ఆంధ్రా సిమెంటు ఫ్యాక్టరీ (విజయవాడ), కృష్ణా సిమెంటు ఫ్యాక్టరీ (తాడేపల్లి), 1955-56లో వీటి ఉత్పాదకశక్తి సంవత్సరానికి 1,90,000 టన్నులు. 1977-78 నాటికి వీటి ఉత్పాదక శక్తి 5 లక్షల టన్నులకు పెరిగింది. 1955లో కర్నూలుజిల్లా ద్రోణ్‌తాంగాకా బేతంచర్లపట్ట పాణ్యం సిమెంటు ఫ్యాక్టరీ, గుంటూరుజిల్లా మాచెర్లలో మరో సిమెంటు ఫ్యాక్టరీని స్థాపించడం జరిగింది. ఆ తరువాత 1958లో మంచిర్యాలలో 1967లో కరీంనగరు జిల్లా పెదపల్లి దగ్గర కేశోరామ్ సిమెంటు ఫ్యాక్టరీని నెలకొల్పడం జరిగింది. మొత్తంమీద ఆంధ్రప్రదేశ్‌లో ఆరు సిమెంటు ఫ్యాక్టరీలు ఉన్నాయి. సిమెంటు అవసరం దృష్ట్యా ఆంధ్రప్రదేశ్‌లో ప్రయివేట్, ప్రభుత్వ రంగాలలో మరిన్ని ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి కృషి జరిగింది. ప్రయివేట్ రంగంలో 5, ప్రభుత్వ రంగంలో 4 సిమెంటు ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి కొన్ని సంస్థలు అనుమతి పొందాయి. వాటి వివరాలు.

*ప్రయివేట్ రంగంలో*

1. పాణ్యం సిమెంట్సు, సుఖ్మారుపేట, ఉత్పాదక శక్తి 45,000 టన్నులు
2. తాడిపత్రి సిమెంట్సు లిమిటెడ్, తాడిపత్రి, ఉత్పాదక శక్తి 4,00,000 లక్షల టన్నులు
3. పాణ్యం సిమెంట్సు, యాడికి, ఉత్పాదకశక్తి 4 లక్షల టన్నులు
4. ఆంధ్రా సిమెంట్సు, బోసికల్లు, ఉత్పాదకశక్తి 6.6 లక్షల టన్నులు
5. ఆంధ్రా సిమెంట్సు, విజయవాడ, ఉత్పాదకశక్తి 2 వేల టన్నులు

*ప్రభుత్వరంగంలో*

1. సిమెంటు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, ఆదిలాబాదు, ఉత్పాదకశక్తి 4 లక్షల టన్నులు
2. సిమెంటు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, తాండూరు, ఉత్పాదకశక్తి 4 లక్షల టన్నులు
3. సిమెంటు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, ఎర్రగొంట్ల, ఉత్పాదకశక్తి 4 లక్షల టన్నులు
4. ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ డెవలెప్‌మెంటు కార్పొరేషన్, జగిత్యాల ఉత్పాదక శక్తి 4 లక్షల టన్నులు

**ఆంధ్రప్రదేశ్‌లో సిమెంటు ఉత్పత్తి**

| సంవత్సరము | ఉత్పత్తి (వేల టన్నులలో) |
|---|---|
| 1956 | 225 |
| 1961 | 730 |

| | |
|---|---|
| 1965 | 1,213 |
| 1971 | 1,734 |
| 1974 | 1,422 |
| 1975 | 1,563 |
| 1976 | 1,977 |
| 1977 | 2,012 |
| 1978 | 1,988 |

మూలం . అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్.

ఆంధ్రప్రదేశ్‌లో సిమెంటు ఫ్యాక్టరీలసంఖ్య అంతగా పెరగనప్పటికీ వాటి ఉత్పాదకశక్తి మాత్రం పెంచడం జరిగింది. అయితే మన రాష్ట్రంలో ఉన్న ఆరు పెద్ద సిమెంటు ఫ్యాక్టరీల ఉత్పాదక శక్తి 25 లక్షలటన్నులు ఉండగా ఆ లక్ష్యాల మేరకు మనం చేరుకోలేకపోతున్నాం.

ఆంధ్రప్రదేశ్‌లో సిమెంటు వినియయం ఈ మధ్య కాలంలో హెచ్చుగా జరుగుతోంది. సిమెంటు డిమాండు తట్టుకోవడానికి ఉన్న ఫ్యాక్టరీలు ఉత్పాదకశక్తి పెంచవలసిన అవసరం కొత్త ఫ్యాక్టరీలను నెలకొల్ప వలసిన అవశ్యకత ఎంతైనా ఉంది.

## పంచదార పరిశ్రమ

ఆంధ్రప్రదేశ్‌లో 1935 వరకు పంచదార ఫ్యాక్టరీ అంటూ ఏమీ లేదు. అదే సంవత్సరంలో బొబ్బిలిలో, సీతానగరంలో పంచదార ఫ్యాక్టరీలు స్థాపితమయినాయి. తరవాతి సంవత్సరాలలో ఏటికొప్పాక, అనకాపల్లి, సామర్లకోట, జోధన్, ఆముదాలవలస, తణుకు, ఉయ్యూరు మొదలైనచోట్ల పంచదార ఫ్యాక్టరీలను నెలకొల్పడం జరిగింది. మన రాష్ట్రంలో ప్రస్తుతం 27 పంచదార ఫ్యాక్టరీలు ఉన్నాయి. వీటిలో 5 ప్రభుత్వ రంగంలోను 9 ప్రయివేట్ రంగంలోను 13 సహకార రంగంలోను ఉన్నాయి. ఈ ఫ్యాక్టరీల ఉత్పాదక శక్తిని పెంచడానికి రాష్ట్ర ప్రభుత్వం లైసెన్సులను మంజూరు చేసింది. మన రాష్ట్రంలో పంచదార పరిశ్రమ ఎక్కువగా పశ్చిమగోదావరి, నిజామాబాద్, విశాఖపట్నం, తూర్పుగోదావరి, చిత్తూరు, కృష్ణా, శ్రీకాకుళం, మెదక్ జిల్లాలలో కేంద్రీకృతమై ఉన్నదని చెప్పవచ్చు.

మన రాష్ట్రంలో వాడే చెరకులో సుమారు 29 శాతం మాత్రమే పంచదార ఫ్యాక్టరీలు వినియోగించ గలుగుతున్నాయి. మిగతా శాతం బెల్లం వండటానికి వినియోగ మవుతున్నాయి. పంచదార ఫ్యాక్టరీలు ఉత్పాదకశక్తి మేరకు పనిచేయడం లేదు. ఫ్యాక్టరీలలో పనిచేసే రోజులుకూడా తక్కువగా ఉన్నాయి. ఉదాహరణకు మన రాష్ట్రంలోని పంచదార ఫ్యాక్టరీలు 1956-57 లో 9 ఫ్యాక్టరీలు 146 రోజులు, 1960-61 లో ఫ్యాక్టరీలు 154 రోజులు 1,966-67 లో 19 ఫ్యాక్టరీలు 82 రోజులు, 1970-71 లో 18 ఫ్యాక్టరీలు 100 రోజులు

1975-76 లో 20 ఫ్యాక్టరీలు 107 రోజులు పనిచేసినట్లు లెక్కలవల్ల తెలియవస్తున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో పంచదార ఉత్పత్తి వివరాలు

| సంవత్సరము | ఉత్పత్తి (వేల టన్నులలో) |
|---|---|
| 1956-57 | 144 |
| 1960-61 | 183 |
| 1964-65 | 306 |
| 1970-71 | 267 |
| 1973-74 | 342 |
| 1974-75 | 518 |
| 1975-76 | 298 |
| 1976-77 | 277 |
| 1977-78 | 387 |
| 1978-79 | 343 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్.

ఆంధ్రప్రదేశ్‌లో ఖండసారి పరిశ్రమ 1955 నుంచి ప్రారంభమైంది. ఈ ఫ్యాక్టరీలు ప్రస్తుతం మన రాష్ట్రంలో 160 దాకా ఉన్నాయి. ఇవి దాదాపు 70,000 టన్నుల వరకు పంచదార ఉత్పత్తి చేస్తున్నాయి. ఈ పరిశ్రమ ప్రధానంగా శ్రీకాకుళం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, మెదక్, నిజామాబాద్, జిల్లాలలో హెచ్చుగా కేంద్రీకృతమై ఉంది.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో చెరకుపంటకు, పంచదార పరిశ్రమకు ప్రముఖస్థానమున్నది. ఈ పరిశ్రమమీద కొన్నివేల మంది రైతులు ఆధారపడి ఉన్నారు. అయితే మన రాష్ట్రంలో చెరకు సగటు దిగుబడి ఎకరానికి 30-35 టన్నుల వరకు మాత్రమే ఉంటున్నది. పంచదార దిగుబడి శాతం కుడా 11 కి మించటం లేదు. ప్రస్తుతం దేశంలోను, రాష్ట్రంలోను పంచదారకున్న డిమాండు దృష్ట్యా ఈ పరిశ్రమ విషయంలో వ్యవసాయదారులకు, పారిశ్రామికులకు ప్రభుత్వము యితోధికంగా శ్రద్ధ తీసుకోవలసి ఉంది. చెరకు అభివృద్ధికోసం రాష్ట్ర ప్రభుత్వం కొన్ని పరిశోధనా కార్యక్రమాలను చేపట్టింది. బొబ్బిలి, ఆముదాలవలస, యలమంచిలి, సామర్లకోట, ఉయ్యూరు, కొవ్వూరు, చల్లపల్లి, చిత్తూరు, నిజామాబాద్, జహీరాబాద్ మొదలైనచోట్ల ప్రభుత్వం ఫారాలను నెలకొల్పింది.

## వస్త్రపరిశ్రమ

ఆంధ్రప్రదేశ్‌లో వస్త్రపరిశ్రమకు సుదీర్ఘమైన చరిత్ర ఉన్నది. తూర్పుగోదావరి జిల్లా పందలపాకలో మొట్టమొదటగా 1915 ప్రాంతాంలో నూలుమిల్లును స్థాపించడం జరిగింది. 1921 లో అనంతపూరు జిల్లా రాయదుర్గంలో నేతమిల్లును నెలకొల్పడం జరిగింది. ఆ తరవాత మన రాష్ట్రంలో అనేకచోట్ల మిల్లులను స్థాపించారు. మనరాష్ట్రంలో 18 నూలుమిల్లులు 13 నేతమిల్లులు పనిచేస్తున్నాయి. ఇందులో ప్రయివేట్ రంగంలో 20 మిల్లులు, సహకార రంగంలో 5 మిల్లులు, నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్ కింద మిల్లులు పనిచేస్తున్నాయి. ప్రయివేట్ రంగంలో పనిచేసే మిల్లులశక్తి 3,41,60,656 కదురు. సహకార రంగంలో పనిచేస్తున్న మిల్లులశక్తి 75,692 కదుర్లు. నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్ వారికింద ఉన్నిమిల్లుల స్థాపితశక్తి 1,02,666 కదుర్లు. ఆంధ్రప్రదేశ్‌లో ప్రయివేట్ రంగం, సహకార రంగం, నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్ ఆధ్వర్యంలో గల మొత్తం 31 మిల్లులలోను ప్రస్తుతం 6.67 లక్షల కదుర్లు నెలకొల్పబడి ఉన్నాయి. వీటి సాలుసరి నూలు ఉత్పత్తి దాదాపు 2.22 లక్షల బేళ్లు. వస్త్రపరిశ్రమ మన రాష్ట్రంలో చెప్పుకోదగిన స్థితిలోలేదు. భారత దేశంలో 699 మిల్లులుండగా మనరాష్ట్రంలో 31 మిల్లులు మాత్రమే ఉన్నాయి. అందుచేత రాష్ట్రప్రజల అవసరాలకు కావలసిన బట్టలు యితర రాష్ట్రాలనుంచి దిగుమతి చేసుకోవలసి వస్తున్నది. మనరాష్ట్రంలో గల మిల్లులలో పేర్కొనదగినవి (1) సూపర్ స్పిన్నింగ్ మిల్స్ లిమిటెడ్, హిందూపూర్ (అనంతపురంజిల్లా) (2) డి. బి. ఆర్ మిల్స్ లిమిటెడ్, సికింద్రాబాద్ (3) అక్కమాంబా టెక్స్‌టయిల్స్ లిమిటెడ్, తణుకు (పశ్చిమగోదావరిజిల్లా) (4)ఆదోని స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్స్ కంపెనీ, ఆదోని (కర్నూలుజిల్లా) (5) అజంజాహి మిల్స్ లిమిటెడ్, వరంగల్ (6) సర్వరాయ టెక్స్‌టయల్స్ లిమిటెడ్, కాకినాడ (7) ఎమ్మిగనూర్ స్పిన్నింగ్‌మిల్స్ లిమిటెడ్, ఎమ్మిగనూర్ (కర్నూల్‌జిల్లా) (8) ఆంధ్రా కోఆపరేటివ్ స్పిన్నింగ్‌మిల్స్ లిమిటెడ్, గుంతకల్ (అనంతపూరుజిల్లా) (9) తిరుపతి కాటన్‌మిల్స్ లిమిటెడ్, రేణిగుంట (చిత్తూరుజిల్లా) (10)సూర్యలక్ష్మి కాటన్‌మిల్స్ లిమిటెడ్, మహబూబ్‌నగర్ (11) రాయలసీమ మిల్స్ లిమిటెడ్, ఆదోని, (12) హేమలతా టెక్స్‌టయిల్స్ లిమిటెడ్, పెదకాకాని (గుంటూరుజిల్లా) మొదలైనవి పేర్కొనదగినవి.

ఆంధ్రప్రదేశ్‌లో నూలు, నూలుబట్టలు, రేయాన్, రేయాన్ బట్టలు ఉత్పత్తి కింది విధంగా ఉన్నది.

| సంవత్సరం | నూలు (వేలకిలోలలో) | నూలుబట్టలు (వేలమీటర్లలో) | రేయాన్ (వేలకిలోలలో) | రేయాన్ బట్టలు (వేలమీటర్లలో) |
|---|---|---|---|---|
| 1974 | 32,539 | 38,237 | 2,150 | 5,195 |
| 1975 | 30,065 | 33,251 | 2,101 | 4,844 |
| 1976 | 30,344 | 34,265 | 2,167 | 4,476 |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 1977 | 28,310 | 34,793 | 2,424 | 4,972 |
| 1978 | 30,522 | 33,330 | [illegible]473 | 5,172 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

ఆంధ్రప్రదేశ్‌లో వరంగల్ జిల్లాలో 20 కోట్ల పెట్టుబడితో ఆంధ్రప్రదేశ్ రేయాన్ లిమిటెడ్ మిల్లు నిర్మాణంలో ఉంది.

## జనపనార పరిశ్రమ

భారతదేశంలో జనపనార పరిశ్రమలలో ఆంధ్రప్రదేశ్‌కు ద్వితీయస్థానం లభిస్తుంది. మనరాష్ట్రంలో దాదాపు 88 లక్షల హెక్టార్ల భూమిలో గోగుపంట పండుతున్నది. 8,000 హెక్టార్లలో జనుముపంటపండుతున్నది. మా రాష్ట్రంలో నాలుగుజనపనార మిల్లులున్నాయి. అవి

*1. శ్రీకృష్ణా జూట్ మిల్స్ లిమిటెడ్, ఏలూరు:* ఇది అతి పురాతనమైంది. దీన్ని 1905 లో స్థాపించారు. దీనిని 1940 లో ఈస్టిండియా కమర్షియల్ కంపెనీ, కలకత్తావారు తీసుకొన్నారు. ఈ మిల్లులో దాదాపు 3,000 మంది పనిచేస్తున్నారు. ఉత్పాదకశక్తి సుమారు 5,000 కదుళ్లు.

*2. నెల్లిమర్ల జూట్ మిల్, నెల్లిమర్ల :* దీనిని 1922 లో స్థాపించడం జరిగింది. ఇందులో దాదాపు 3,500 మంది కార్మికులు పనిచేస్తున్నారు. 340 మగ్గాలు, 6,500 కదుళ్ళు పనిచేస్తున్నాయి. సాంవత్సరిక ఉత్పత్తిశక్తి 8,000 టన్నులు.

*3. చిట్టివలస జూట్ మిల్స్, చిట్టివలస :* దీనిని 1926 లో స్థాపించారు. ఇందులో దాదాపు 500 మగ్గాలు, 6701 కదుళ్ల పనిచేస్తున్నాయి.

*4. శ్రీభజరంగ్ జూట్ మిల్స్, గుంటూరు :* ఈ మిల్లులో దాదాపు 2,500మంది కార్మికులు పనిచేస్తున్నారు. ఇందులో అత్యంత ఆధునికమైన మగ్గాలు ఉన్నాయి. ఇందులో పనిచేస్తున్న కదుళ్లు సుమారు 4,000.

ఆంధ్రప్రదేశ్‌లో నాలుగు పురికొస మిల్లులున్నాయి. అవి (1) అరుణ్‌జూట్ ట్వైన్ అండ్ రోప్ ఫ్యాక్టరీ విజయనగరం (2) ఈస్ట్‌కోస్ట్ కమర్షియల్ కంపెనీ లిమిటెడ్, విజయనగరం (3) ఉమాజూట్ ట్వైన్ మిల్స్, కొత్తవలస. (4) శ్రీ గోపాలకృష్ణా జూట్‌మిల్స్ లిమిటెడ్, బొబ్బిలి.

ఆంధ్రప్రదేశ్‌లో జనపనార పరిశ్రమ కేవలం మూడు జిల్లాలలోనే కేంద్రీకృతమైంది. అవి విశాఖపట్నం, పశ్చిమగోదావరి, గుంటూరుజిల్లాలు.

కింది పట్టికద్వారా వివిధ సంవత్సరాలలో జనపనార వస్తువుల వివరాలను తెలుసుకోవచ్చు.

| సంవత్సరం | ఉత్పత్తి (టన్నులు) |
|---|---|
| 1956 | 27,837 |
| 1961 | 32,365 |
| 1965 | 44,760 |
| 1970 | 55,756 |
| 1974 | 79,212 |
| 1975 | 57,060 |
| 1976 | 88,112 |
| 1977 | 85,111 |
| 1978 | 94,830 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్.

## బియ్యపుమిల్లుల పరిశ్రమ

బియ్యపు మిల్లుల పరిశ్రమలో ఆంధ్రప్రదేశ్‌ది అగ్రస్థానము. ఈ పరిశ్రమ దాదాపు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాలకు విస్తరించి వుంది. అన్నింటిలో తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు, ఆదిలాబాదు జిల్లాలు వరుస క్రమంలో ప్రాధాన్యత వహిస్తాయి. మనరాష్ట్రంలో ప్రస్తుతం సాలీనా సుమారు 1000 కోట్ల క్వింటాళ్ళ బియ్యాన్ని ఆడగలిగే సుమారు 11,000 లైసెన్సులు పొందిన బియ్యపు మిల్లులు ఉన్నాయి. ఇందులో 6,135 హల్లర్ మిల్లులు, 724 షెల్లర్ మిల్లులు, 3,440 సి. హెచ్. ఎస్. మిల్లులు 165 ఆధునిక యంత్ర సామాగ్రిగల మిల్లులు ఉన్నాయి. మిల్లుల ఆధునీకీకరణకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ ఆర్థిక సహాయాన్ని అందిస్తుంది. ధాన్యం ఆడించడంలో హల్లర్ మిల్లులు సాంప్రదాయక పద్ధతిని అనుసరిస్తున్నాయి. అయితే ఈ పద్ధతిలో ధాన్యం నష్టం ఎక్కువ కావడంవల్ల హల్లర్ల వాడకాన్ని కేంద్ర ప్రభుత్వం నిషేధించింది. ఇప్పుడు ఆ హల్లర్ మిల్లులకు కొత్తగా పర్మిట్లు యివ్వడంలేదు. ఈ మిల్లులలో రబ్బరు రోలర్ పద్ధతిని ప్రవేశపెట్టడానికి చర్యలు తీసుకోవడం జరుగుతున్నది. మనరాష్ట్రంలో దాదాపు 300 కోట్ల క్వింటాలు హల్లరు మిల్లుల వల్ల 111 కోట్ల క్వింటాళ్ళ షెల్లరుమిల్లుల వల్ల దాదాపు 600 కోట్ల క్వింటాళ్ళు సి. హెచ్. ఎస్ మిల్లుల వల్ల బియ్యం ఉత్పత్తి అవుతున్నట్లు తెలుస్తున్నది. కింది పట్టిక ద్వారా వివిధ జిల్లాలలో ఉన్న లైసెన్సు పొందిన బియ్యపు మిల్లుల వివరాలను గ్రహించవచ్చు.

| జిల్లా | హల్లర్ మిల్లులు | షెల్లర్ మిల్లులు | సిహెచ్ఎస్ మిల్లులు | ఆధునిక మిల్లులు |
|---|---|---|---|---|
| తూర్పుగోదావరి | 894 | 183 | 180 | 5 |
| చిత్తూరు | 594 | 3 | 16 | .... |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| కరీంనగరు | 537 | 14 | 53 | 2 |
| పశ్చిమగోదావరి | 368 | 62 | 516 | 10 |
| కృష్ణా | 62 | 104 | 643 | 16 |
| గుంటూరు | 68 | 176 | 560 | 21 |
| నిజామాబాద్ | 305 | — | 268 | 8 |
| విశాఖపట్నం | 544 | 35 | 8 | — |
| అనంతపూర్ | 340 | 26 | 21 | 1 |
| నెల్లూరు | 271 | 15 | 282 | 30 |
| శ్రీకాకుళం | 481 | 54 | 16 | 9 |
| వరంగల్ | 260 | — | 129 | 7 |
| కడప | 226 | — | 64 | 2 |
| నల్గొండ | 243 | — | 107 | 23 |
| మహబూబ్‌నగర్ | 211 | 1 | 70 | 5 |
| కర్నూలు | 188 | 13 | 76 | — |
| ప్రకాశం | 130 | 27 | 153 | 2 |
| మెదక్ | 136 | 1 | 126 | 2 |
| హైదరాబాదు | 148 | 2 | 55 | 9 |
| ఖమ్మం | 53 | 5 | 123 | 1 |
| ఆదిలాబాదు | 76 | 3 | 114 | 1 |

మనరాష్ట్రంలో ఉప్పుడు బియ్యం ఉత్పత్తి చేసే మిల్లులు ఎక్కువగాలేవు. అందుచేత రాష్ట్రప్రభుత్వం భారత ఆహారసంస్థ కలిసి రాష్ట్రంలో కాంపొజిట్ మిల్లులను నెలకొల్పడానికి కృషిచేస్తున్నాయి.

**కాగితం పరిశ్రమ**

మనరాష్ట్రంలో అటవీ సంపద సమృద్ధిగా ఉన్నది. అటవీ సంపద ఆధారంగా మన రాష్ట్రంలో భారీ పేపరు మిల్లులు పనిచేస్తున్నాయి. వాటిలో ఆంధ్రప్రదేశ్ పేపరు మిల్స్, రాజమండ్రి చెప్పుకోదగింది. ఇది రోజుకు 200 టన్నులపేపరును ఉత్పత్తిచేస్తుంది. ఇందులో 5,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు. మొదట్లో ఈ మిల్లును ప్రైవేటు రంగంలో ప్రారంభించినా దీనిని 1948 లో ప్రభుత్వం కొనుగోలు చేసింది. అయితే తిరిగి ఈ మిల్లును ఆ మధ్య ప్రైవేటు రంగానికి అప్పగించడం జరిగింది. ఇందులో తెల్లకాగితం, క్రాఫ్ట్ కాగితం, స్ట్రాబోర్డు తయారవుతున్నాయి.

సిర్‌పూర్ పేపరు మిల్సును 1939 లో సిర్‌పూర్ కాగజ్ నగర్‌లో నెలకొల్పడం జరిగింది. ఇందులో కూడా ఎక్కువగా తెల్లకాగితం తయారవుతుంది. ఈ ఫ్యాక్టరీ రోజుకు 125 టన్నుల కాగితాన్ని ఉత్పత్తి చేస్తున్నది.

కర్నూలులో రాయలసీమ పేపర్ మిల్స్ లిమిటెడ్‌ను ఆమధ్య స్థాపించడం జరిగింది. ఇది 1978 నుండి కాగితాన్ని ఉత్పత్తి చేస్తున్నది. ఇందులో వ్రాతకు, అచ్చుకు ఉపయోగపడే కాగితంతోపాటు కాగితం తయారీలో ఉపయోగించే గుజ్జును తయారుచేయడం జరుగుతుంది. ఈ మిల్లువల్ల దాదాపు 2,000 మందికి ఉపాధి లభిస్తున్నది. ఈ ఫ్యాక్టరీ సాలీనా 42,000 టన్నుల వ్రాత, అచ్చు కాగితాన్ని ఉత్పత్తి చేయగలదు.

భద్రాచలంవద్ద భద్రాచలం పేపర్ బోర్డ్ లిమిటెడ్ అనే ఫ్యాక్టరీ ఏర్పాటయింది. దీని పెట్టుబడివ్యయం 150 కోట్ల రూపాయలు. ఈ ఫ్యాక్టరీ రోజుకు 150 టన్నుల పేపరును ఉత్పత్తిచేయగలదు.

వివిధ సంవత్సరాంలలో ఆంధ్రప్రదేశ్‌లో తయారవుతున్న కాగితం ఉత్పత్తి వివరాలు

| సంవత్సరం | కాగితం టన్నులలో |
|---|---|
| 1956 | 16,840 |
| 1961 | 32,976 |
| 1965 | 34,544 |
| 1971 | 1,00,920 |
| 1974 | 1,00,754 |
| 1975 | 67,550 |
| 1976 | 1,04,045 |
| 1977 | 1,17,018 |
| 1978 | 1,29,505 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్.

## చేనేతపరిశ్రమ

చేనేతపరిశ్రమలో ఆంధ్రప్రదేశ్‌కు ప్రథమస్థానం లభిస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లో 5,97,000 చేనేత మగ్గాలున్నట్లు ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ హాండ్లూం ఎంక్వైయిరీ కమిటీ రిపోర్ట్ (1976) వల్ల తెలుస్తున్నది. మనరాష్ట్రం నూలు, పట్టు ఉన్ని వస్త్రాల తయారీకి ఎన్నో శతాబ్దాలనుంచి పేరు ప్రఖ్యాతులు గడించింది. ఆంధ్రప్రదేశ్‌లో తయారైన చేనేత బట్టలు విదేశాలకు ఎగుమతయ్యేవి. మన చేనేత వస్త్రాలు మానవుని పనితనానికి కళానైపుణ్యానికి ప్రత్యక్షనిదర్శనాలు. ఆంధ్రప్రదేశ్‌లోని చేనేత పరిశ్రమ చరిత్ర ప్రసిద్ధమైంది. మనరాష్ట్రంలో ప్రసిద్ధిచెందిన చేనేత కళాక్షేత్రాలు ఉప్పాడలోనూ, సిద్దిపేటలోనూ తయారుచేసే బుటావీరలు పోచంపల్లి, చీరాల, మంగళగిరి, చిటికెచీరెలు, వేటపాలెం, నర్సాకెకల్‌లో నేసే చేతిరుమాళ్లు,

సిద్ధిపేట, నారాయణపేట, గుంటూరు, వెంకటగిరి గద్వాలలో తయారయ్యే పేటికం చీరలు మోరి, నారాయణవనంలో నేసే సన్నపాటి ధోవతులు, కంబళ్ళు, పెద్దగుంటూరు రంగుల గుడ్డలు పెండ్యాల గళ్ళచొక్కా గుడ్డలు జనగామలో తయారయ్యే పూసల వోళ్లు వినియోగదారుల అభిమానాన్ని స్వదేశంలోనే కాకుండా విదేశాలలో కూడా ఎంతో అభిమానాన్ని విశేషంగా చూరగొన్నాయి. అంతేకాకుండా ఉరుమూరు, ధర్మవరం, పోచంపల్లి, గద్వాల, నారాయణపేట మొదలైనచోట్ల పట్టుబట్టలు ప్రసిద్ధివహించాయి. హైదరాబాదులో హిమ్రూ పైఠాన్ మొదలైన ప్రత్యేకరకాల వస్త్రాలు తయారవుతాయి. శ్రీకాళహస్తి, మచిలీపట్నం కలంకారీ అద్దకాలు ఎంతో ప్రాముఖ్యాన్ని పొందాయి.

ఆంధ్రప్రదేశ్‌లో చేనేత పరిశ్రమ సుమారు 15 లక్షల మందికి ఉపాధి కల్పిస్తున్నది. సుమారు 50 లక్షలమంది ఈ పరిశ్రమపై ఆధారపడి జీవిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లోని చేనేత పరిశ్రమను మూడు రకాలుగా వర్గీకరించవచ్చు.

(1) సహకారరంగం

(2) చిన్నతరహా యూనిట్లుగాగల చేనేత పారిశ్రామికులు

(3) మాస్టర్ వీవర్స్

***సహకార రంగంలో చేనేత పరిశ్రమ :*** ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత సహకార రంగంలో చేనేత పరిశ్రమ ఎంతో అభివృద్ధి చెందింది. 1975-76 సంవత్సరం నాటికి మన రాష్ట్రంలో 1,165 చేనేత సహకార సంఘాలున్నాయి. వీటిలో 2.46 లక్షలమంది సభ్యులున్నారు. ఈ సంఘాలు చెల్లించిన మూలధనం 134 71 లక్షల రూపాయలు. ఈ సంఘాల నిర్వహణ మూలధనం 576.82 లక్షల రూపాయలు.

1975 - 76 సంవత్సరంలో జిల్లాలలో చేనేత సహకార సంఘాలు కింది విధంగా ఉన్నాయి.

| జిల్లా | సంఘాలసంఖ్య | సభ్యులు వేలలో | చెల్లించిన మూలధనం వేల రూ.లలో | నిర్వహణ మూలధనం వేల రూ.లలో |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 87 | 10 | 639 | 2,906 |
| విశాఖపట్నం | 45 | 10 | 446 | 2,439 |
| తూర్పుగోదావరి | 87 | 20 | 1,834 | 7,879 |
| పశ్చిమగోదావరి | 56 | 9 | 654 | 2,709 |
| కృష్ణా | 87 | 10 | 1,292 | 4,568 |
| గుంటూరు | 70 | 13 | 1,312 | 6,296 |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| ప్రకాశం | 69 | 12 | 408 | 1,340 |
| నెల్లూరు | 38 | 4 | 415 | 1,940 |
| కోస్తాఆంధ్ర మొత్తం | 539 | 78 | 7,000 | 30,077 |
| కర్నూలు | 60 | 9 | 804 | 6,632 |
| అనంతపూరు | 75 | 8 | 352 | 1,603 |
| కడప | 98 | 13 | 406 | 1,979 |
| చిత్తూరు | 27 | 4 | 337 | 1,963 |
| రాయలసీమమొత్తం | 260 | 34 | 1,899 | 12,177 |
| హైదరాబాదు | 20 | 5 | 332 | 809 |
| నిజామాబాదు | 21 | 11 | 301 | 703 |
| మెదక్ | 28 | 14 | 325 | 976 |
| మెహబూబ్‌నగర్ | 61 | 21 | 653 | 1,971 |
| నల్గొండ | 37 | 15 | 807 | 3,576 |
| వరంగల్ | 72 | 21 | 878 | 3,501 |
| ఖమ్మం | 5 | 2 | 65 | 124 |
| కరీంనగర్ | 112 | 32 | 1,078 | 3,296 |
| ఆదిలాబాద్ | 12 | 3 | 133 | 472 |
| తెలంగాణా మొత్తం | 363 | 124 | 4,572 | 15,428 |
| ఆంధ్రప్రదేశ్ మొత్తం | 1,167 | 246 | 13,471 | 57,482 |

మూలం : అర్థ గణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

***మాస్టర్ వీవర్లు :*** ఆంధ్ర ప్రదేశ్‌లో మాస్టర్ వీవర్ల పాత్ర చెప్పుకోదగింది. ఆంధ్ర ప్రదేశ్‌లో ఉన్న మొత్తం మగ్గాంలో 55 శాతం మగ్గాలు, స్వతంత్ర చేనేత పారిశ్రామికుల కిందగాని, మాస్టర్ వీవర్ల కిందగాని ఉన్నాయని చెప్పవచ్చు. మాస్టర్ వీవర్లలో అధిక సంఖ్యాకులు కొన్నాళ్ళు నేతవారుగాను మరికొన్నాళ్ళు మాస్టర్‌వీవర్లుగాను మారుతూ ఉంటారు.

***రిబేటు పథకం :*** చేనేత పరిశ్రమకు రక్షణ కల్పించేందుకు చేనేత వస్త్రాల మార్కెట్‌ను నిలిపేందుకు, కేంద్ర ప్రభుత్వం రిబేట్ పథకాన్ని 1954 నుంచి అమలులో పెట్టింది. ఆంధ్ర ప్రదేశ్‌లో సంవత్సరంలో ఎక్కువకాలం 10 శాతం స్పెషల్ రిబేట్‌ను, పండుగల సమయాలలో యిస్తూవుంటుంది. అయిదవ ప్రణాళిక మొదటి సంవత్సరాంతం వరకు ఈ రిబేట్ పథకం కింద మన రాష్ట్ర ప్రభుత్వం 9.23 కోట్ల రూపాయలను ఈ పద్దుకింద ఖర్చుపెట్టింది. ఆ వివరాలు.

| ప్రణాళిక | రిబేట్‌పై ఖర్చుపెట్టిన మొత్తం లక్షల రూపాయలలో |
|---|---|
| మొదటిప్రణాళిక (రెండుసంవత్సరాలకుమాత్రమే) | 20.77 |
| రెండో ప్రణాళిక | 229.73 |
| మూడో ప్రణాళిక | 213.01 |
| మూడు వార్షిక ప్రణాళికలు | 95.48 |
| నాలుగో ప్రణాళిక | 188.01 |
| ఐదోప్రణాళిక (మొదటి సం॥) | 176.56 |
| మొత్తం | 923.56 |

మూలం : ఎ. పి. లెజిస్లేటివ్ ఎంక్వయిరీ రిపోర్టు, 1976,

రాష్ట్రంలో చేనేత పరిశ్రమాభివృద్ధికి ప్రభుత్వం ఎన్నో విధాలుగా చర్యలు తీసుకొంటున్నది. నాల్గవ ప్రణాళికా కాలంలో కేంద్రప్రభుత్వం 12,400 మరమగ్గాలను ఆంధ్రప్రదేశ్‌కిచ్చింది. వీటిలో 7,561 మర మగ్గాలను సహకార రంగానికి 2,316 మర మగ్గాలను ప్రయివేట్ రంగానికి 560 మర మగ్గాలను విద్యావంతులైన నిరుద్యోగులకు కేటాయించడం జరిగింది. 1963 గుర్తింపులేని మగ్గాలను క్రమబద్ధ చేయడం జరిగింది. అయితే రాష్ట్రంలోని మొత్తం మరమగ్గాలలో దాదాపు 3000 మాత్రమే పనిచేస్తున్నట్లు తెలియవస్తున్నది. చేనేత పరిశ్రమకు మనరాష్ట్ర ప్రభుత్వము, ఆంధ్రప్రదేశ్ టెక్స్టయల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్, ఆంధ్రప్రదేశ్ వెనకబడిన తరగతుల కార్పొరేషన్ జాతీయంచేసిన బాంకులు ఆర్థికసహాయాన్ని అందిస్తున్నాయి. చేనేత కార్మికులకు గృహనిర్మాణ సౌకర్యాలకు సాంఘిక సంక్షేమాలకోసం ప్రభుత్వం సహాయం చేస్తున్నది. దాదాపు 40 లక్షల రూపాయల వ్యయంతో చేనేత కార్మికులకు 1400 యిళ్ళు నిర్మించి యివ్వడం జరిగింది.

## పుగాకు పరిశ్రమ

భారతదేశంలో పుగాకు పరిశ్రమలో ఆంధ్రప్రదేశ్‌కు ప్రథమ స్థానముంది. పుగాకు

పండించే భూమి మొత్తం భారతదేశంలో సగం ఆంధ్రప్రదేశ్‌లోనే ఉన్నది. ఉత్పత్తికూడా సగం ఆంధ్రప్రదేశ్ నుంచే అవుతుంది. ఆంధ్రప్రదేశ్‌లోని మొత్తం పొగాకు విస్తీర్ణంలో 56 శాతం ఉత్పత్తిలో 55 శాతం ప్రకారం గుంటూరు జిల్లాలే ఆక్రమిస్తున్నాయి. తూర్పు పశ్చిమగోదావరి జిల్లాలు కృష్ణా, నెల్లూరు, ఖమ్మం, కర్నూలు, కరీంనగర్ జిల్లాలు పొగాకు పండించే ప్రధాన జిల్లాలుగా పేర్కొనవచ్చు. మనరాష్ట్రంలో వర్జీనియా పొగాకు అధికంగా పండుతుంది. మొత్తం పొగాకు విస్తీర్ణంలో 70 శాతం, ఉత్పత్తిలో 67 శాతం వర్జీనియా పొగాకుదే. భారతదేశం నుంచి ఎగుమతయే పొగాకులో వర్జీనియా పొగాకు శాతం 85. ఆంధ్ర ప్రదేశ్‌లో నాటు పొగాకు, లంకపొగాకు, బర్లీపొగాకు కూడా పండుతాయి.

***సిగరెట్ పరిశ్రమ :*** మనరాష్ట్రం పొగాకు పంటలో ప్రథమస్థానంలో ఉన్నా సిగరెట్ల ఉత్పత్తిలో మాత్రం ప్రథమస్థానంలో లేదు. మనరాష్ట్రంలో పండే పొగాకు ఎక్కువ భాగం ఇతర రాష్ట్రాలకు, విదేశాలకు ఎగుమతవుతుంది. మనరాష్ట్రంలో 6 సిగరెట్ ఫ్యాక్టరీలున్నాయి. ఈ ఆరింటిలో అయిదు ఫ్యాక్టరీలు హైదరాబాదులోనే ఉన్నాయి. ఒకటి తూర్పుగోదావరి జిల్లా చిక్కవోలులో ఉంది. మనరాష్ట్రంలో ఉన్న సిగరెట్ ఫ్యాక్టరీలలో వజీర్ సుల్తాన్ టుబాకో కంపెనీ, నవభారత్ టుబాకో కంపెనీ, హింద్ టుబాకో అండ్ సిగరెట్ కంపెనీ, హైదరాబాదు దక్కన్ సిగరెట్ కంపెనీ, యూనివర్సల్ టుబాకో కంపెనీ, నేషనల్ టుబాకో కంపెనీ లిమిటెడ్, ముఖ్యమైనవి. వజీర్ సుల్తాన్ టుబాకో కంపెనీ, భారతదేశంలో అత్యధికంగా అమ్ముడుపోతున్న చార్మినార్ సిగరెట్ బ్రాండును తయారుచేస్తున్నది.

**ఆంధ్రప్రదేశ్‌లోని సిగరెట్ల ఉత్పత్తి**

| సంవత్సరం | ఉత్పత్తి (మిలియన్‌లలో) |
|---|---|
| 1956 | 5,326 |
| 1960 | 6,819 |
| 1965 | 10,345 |
| 1970 | 13,568 |
| 1974 | 13,492 |
| 1975 | 13,867 |
| 1976 | 15,279 |
| 1977 | 14,932 |
| 1978 | 14,605 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్.

**పొగాకు ఎగుమతులు :** ఆంధ్రప్రదేశ్‌నుంచి వర్జీనియా పొగాకు ఎక్కువగా విదేశాలకు ఎగుమతి అవుతున్నది. సుమారు 35 సంస్థలు రైతులనుంచి పొగాకును కొనుగోలుచేసి రిడ్రైయింగ్, ప్యాకింగు చేసి ఎగుమతి చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌నుంచి పొగాకు గ్రేట్ బ్రిటన్, రష్యా, జపాన్, నెదర్లాండ్స్, బల్గేరియా, ఇటలీ, బెల్జియం ఫ్రాన్సు మొదలైన దేశాలకు ఎగుమతి అవుతున్నది.

**వర్జీనియా పొగాకు ఎగుమతి వివరాలు**

| సంవత్సరం | పొగాకు ఎగుమతి (కోట్ల కిలోలలో) |
|---|---|
| 1956 | 5.1 |
| 1971 | 4.7 |
| 1973 | 9.5 |
| 1974 | 7.8 |
| 1978 | 7.8 |
| 1979 | 6.5 |

**ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని పరిశ్రమలకు సంబంధించిన గణాంక సమాచారం**

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| పరిశ్రమ | యూనిట్ (టన్నులు) | 1974 | 1976 | 1977 | 1978 |
| వనస్పతి | | 34,543 | 25,256 | 27,041 | 31,277 |
| టీ ప్యాకింగ్ | | 9,830 | 8,631 | 9,200 | 10,318 |
| కాఫీ ప్యాకింగ్ | | 3,571 | 3,384 | 4,040 | 4,304 |
| రసాయనిక ఎరువులు | [వేల టన్నులు] | 327 | 304 | 333 | 309 |
| మందులు | [రూ.లక్షలలో] | 2,909 | 4,464 | 4,414 | 4,784 |
| మత్తుపానీయాలు | [వేల లీటర్లలో] | 22,122 | 30,756 | 30,536 | 34,371 |
| ఆక్సిజన్ | ['000CM.Mts] | 2,389 | 2,474 | 2,453 | 2.578 |
| డెటోనేటర్స్ | [రూ.లక్షలలో] | 656 | 1,064 | 1,401 | 1,664 |
| పెట్రోలియమ్‌వస్తువులు | [వేలటన్నులు] | 1,053 | 1,019 | 1,129 | 1,224 |
| ఎసెటిక్ ఆసిడ్స్ | [టన్నులలో] | 1,519 | 2,007 | 1,847 | 2,065 |
| తోళ్ళపరిశుద్ధి | [రూ.లక్షలలో] | 32.5 | 50.6 | 45.1 | 53.5 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| గ్లాస్ | [టన్నులు] | 25,059 | 14,271 | 23,309 | 24,966 |
| ఆస్బెస్టాస్ సిమెంట్ | [వేలటన్నులలో] | 113 | 110 | 76 | 131 |
| బొగ్గు | [ ,, ] | 5,761 | 7,928 | 8,789 | 9,043 |
| ఫెర్రో ఎల్లాయ్స్ | [టన్నులలో] | 50,096 | 72,554 | 64,772 | 68,128 |
| ఫోర్జింగ్స్ | [ ,, ] | 3,131 | 3,110 | 3,193 | 2,939 |
| బాల్, రోలర్ బేరింగ్స్ | [వేలసంఖ్యలో] | 1,481 | 1,971 | 1,976 | 1,966 |
| యంత్ర పరికరాలు | [రూ లక్షలలో] | 1,011 | 2,053 | 1,603 | 2,277 |
| వాటర్ కూలర్స్ | [సంఖ్య] | 1,754 | 4,352 | 1,947 | 2,839 |
| రిఫ్రిజిరేటర్లు | [సంఖ్య] | 37,496 | 27,042 | 32,169 | 32,375 |
| డీజిల్ ఇంజన్లు | [ ,, ] | 17,789 | 17,327 | 19,610 | 17,633 |
| ఎలక్ట్రికల్ కేబుల్స్ | [రూ.లక్షలలో] | 432 | 1,922 | 1,866 | 2,326 |
| హౌస్‌సర్వీసు మీటర్లు | [వేలసంఖ్యలో] | 516 | 511 | 564 | 649 |
| ట్రాన్స్‌ఫార్మర్లు | ['000KVA] | 244 | 310 | 287 | 281 |
| డ్రై సెల్స్ బాటరీ సెల్సు | [లక్షలసంఖ్యలో] | 656 | 1,084 | 1,275 | 1,448 |
| ఎలక్ట్రానిక్ సామగ్రి | [రూ లక్షలలో] | 1,502 | 2,643 | 2,708 | 2,720 |
| మోటారు సైకిళ్ళు | [సంఖ్య] | 11,828 | 22,572 | 20,017 | 22,288 |
| ఎలక్ట్రిక్ మోటార్లు | [ ,, ] | 3,964 | 2,355 | — | — |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

ఆంధ్రప్రదేశ్‌లో భారీ మధ్యతరహా పరిశ్రమలు డిసెంబరు 1979 నాటికి జిల్లాల వారీగా కింది విధంగా ఉన్నాయి.

| జిల్లా | యూనిట్ల సంఖ్య | పెట్టుబడి మొత్తం (కోట్లరూపాయలలో) | ఉపాధికల్పన |
|---|---|---|---|
| 1 | 2 | 2 | 4 |
| శ్రీకాకుళం | 7 | 9 4 | 5,697 |
| విశాఖపట్నం | 31 | 208.0 | 25,350 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| తూర్పుగోదావరి | 20 | 41.8 | 10,177 |
| పశ్చిమగోదావరి | 20 | 28.4 | 10,479 |
| కృష్ణా | 19 | 31.2 | 5,957 |
| గుంటూరు | 20 | 26.3 | 6,712 |
| ప్రకాశం | 4 | 4.6 | 1,418 |
| నెల్లూరు | 8 | 4.0 | 1,711 |
| కోస్తా ఆంధ్ర | 129 | 353.7 | 67.501 |
| కర్నూలు | 15 | 53.2 | 9,325 |
| అనంతపూరు | 9 | 6.2 | 1,182 |
| కడప | 13 | 15.6 | 3,899 |
| చిత్తూరు | 15 | 20.6 | 4,418 |
| రాయలసీమ మొత్తం | 52 | 95.6 | 18,824 |
| హైదరాబాదు | 114 | 436.2 | 75,304 |
| నిజామాబాద్ | 7 | 4.0 | 5,277 |
| మెదక్ | 21 | 35.6 | 4,862 |
| మహబూబ్‌నగర్ | 3 | 0.9 | 878 |
| నల్గొండ | 5 | 6.6 | 744 |
| వరంగల్ | 1 | 6.0 | 4,900 |
| ఖమ్మం | 8 | 65.6 | 46,883 |
| కరీంనగర్ | 6 | 167 5 | 13,875 |
| ఆదిలాబాద్ | 7 | 27.6 | 19,316 |
| తెలంగాణా | 172 | 750.0 | 1,72,042 |
| ఆంధ్రప్రదేశ్ మొత్తం | 353 | 1,199.3 | 2,58,367 |

మూలం : డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్‌కామర్స్, ఆంధ్రప్రదేశ్.

## ఆంధ్రప్రదేశ్‌లోని భారీమధ్యతరహా పరిశ్రమలకు సంబంధించి వివిధరకాలు (31-12-1979)

| పరిశ్రమ | యూనిట్లసంఖ్య | పెట్టుబడి (కోట్లరూపాయలలో) | ఉపాధికల్పన |
|---|---|---|---|
| ఆహారపదార్థాలు | 167 | 183 1 | 72,313 |
| ఇంజనీరింగ్, ఎలక్ట్రికల్ | 88 | 480.8 | 69,202 |
| ఎలక్ట్రానిక్స్ | 11 | 16.1 | 7,661 |
| రసాయనాలు | 50 | 328.9 | 23,459 |
| ఖనిజాలు | 17 | 65.6 | 73,563 |
| అడవులు | 7 | 112.7 | 10,820 |
| ఇతరాలు | 13 | 12.7 | 1349 |

మూలం : డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్ కామర్స్, ఆంధ్రప్రదేశ్

## లఘుపరిశ్రమలు

జాతీయ ఆర్థిక వ్యవస్థలో లఘుపరిశ్రమలు గణనీయమైన పాత్రను నిర్వహిస్తున్నాయనేది అందరికీ తెలిసిన విషయమే. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన దగ్గరనుంచి లఘుపరిశ్రమలపట్ల రాష్ట్ర ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ వహిస్తున్నది. నాలుగో, అయిదో పంచవర్ష ప్రణాళికంలో గ్రామీణ ప్రాంతాలలోను వెనుకబడిన ప్రాంతాలలోను లఘుపరిశ్రమలను అభివృద్ధి చేయటానికి రాష్ట్రప్రభుత్వం అనేక పథకాల ప్రోత్సాహక ఉద్యమాలను చేపట్టింది. లఘుపరిశ్రమలను అభివృద్ధి చేయడంద్వారా ఉపాధికల్పన పెంపొందించవచ్చు. ఆర్థిక పారిశ్రామిక ఆధారాలను విస్తృతంచేయవచ్చు. ప్రాంతీయ వనరులను పూర్తిగా వినియోగంలోకి తెచ్చుకోవచ్చు. బలహీన వర్గాల ఆర్థికాభ్యున్నతికి తోడ్పడవచ్చు.

ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయంలో రాష్ట్రంలో 11,229 చిన్నతరహా పారిశ్రామిక సంస్థలు ఉండేవి. వాటి పెట్టుబడి రూ 5 కోట్లు. అవి 13519 మందికి ఉపాధి కల్పించాయి. గత 25 సంవత్సరాలుగా మనరాష్ట్ర ప్రభుత్వం వీటి అభివృద్ధికి తీసుకున్న చర్యల ఫలితంగా ప్రస్తుతం దాదాపు 22,000 చిన్నతరహా పారిశ్రామిక సంస్థలు ఉన్నట్లు తెలియవస్తున్నది. వీటి పారిశ్రామిక పెట్టుబడి దాదాపు రూ 200 కోట్లు ఉన్నది. ఉపాధికల్పన దాదాపు 2.5 లక్షలు ఉన్నవి. అప్పటికీ ఇప్పటికీ గల సంఖ్యలు సత్యాలను పోల్చిచూస్తే లఘుపరిశ్రమలలో మనరాష్ట్రం సాధించిన ప్రగతి సులభంగా బోధపడగలదు. మనరాష్ట్రంలో దాదాపు అన్ని జిల్లాలకు లఘుపరిశ్రమలు విస్తరించి ఉన్నాయి.

ఈ లఘుపరిశ్రమలు అనేకరకాల వస్తువులను తయారుచేస్తాయి. వీటిలో పేర్కొనదగినవి సైకిలు విడిభాగాలు, కుట్టు మిషనులు వాటి విడిభాగాలు స్టీలు డ్రాయింగ్ సర్వే పరికరాలు; వ్యవసాయ పనిముట్లు, షట్టర్లు, స్ప్రేయర్లు, అల్యూమినియంవస్తువులు, ఎలక్ట్రికల్

ఎలక్ట్రానిక్ పరికరాలు, ట్యూబ్‌లైట్లు,వాటి ఫిట్టింగ్ స్విచ్చులు, కండక్టరులు, ఆటోమొబైల్ విడి భాగాలు, పెయింట్లు, వార్నిషులు, ఆహార సంబంధ పదార్థాలు, క్రిమిసంహారక మందులు ప్లాస్టిక్ వస్తువులు, పరిమళ వస్తువులు, అగరుపత్తులు, రబ్బరు వస్తువులు ,మార్బుల్‌టైల్స్, ఇటుకలు, లెదర్‌ఫోమ్ వస్తువులు, సబ్బులు, అగ్గిపెట్టెలు, బొమ్మలు, పెట్టెలు, ప్రయాణీకుల వస్తువులు, కొవ్వొత్తులు కాగితాలు మొదలైనవి ఎన్నో ఉన్నాయి.

చిన్న పరిశ్రమల అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వమే కాకుండా వాణిజ్య బ్యాంకులు ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సహాయసంస్థ ఆంధ్రప్రదేశ్ లఘుపరిశ్రమల అభివృద్ధిసంస్థ, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా మొదలైన ఆర్థిక సాంకేతిక వ్యవస్థాపనా సౌకర్యాలను అందిస్తున్నాయి.

31-3-1978 నాటికి మన రాష్ట్రంలో వివిధ జిల్లాలలో లఘుపరిశ్రమల వివరాలు కింద యివ్వడం జరిగింది.

| జిల్లా | యూనిట్ల సంఖ్య | పెట్టుబడి రూ. లక్షలలో | ఉపాధికల్పన |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| శ్రీకాకుళం | 567 | 555 | 6,227 |
| విశాఖపట్నం | 1087 | 1065 | 11,957 |
| తూర్పుగోదావరి | 1812 | 1775 | 19,932 |
| పశ్చిమగోదావరి | 1140 | 1117 | 12,540 |
| కృష్ణా | 2153 | 2110 | 23,683 |
| గుంటూరు | 1614 | 1582 | 18,754 |
| ప్రకాశం | 644 | 631 | 7,084 |
| నెల్లూరు | 637 | 624 | 7,007 |
| చిత్తూరు | 723 | 709 | 7,953 |
| కడప | 708 | 694 | 7,788 |
| అనంతపూర్ | 543 | 532 | 5,973 |
| కర్నూలు | 784 | 768 | 8,624 |
| మహబూబ్‌నగర్ | 344 | 337 | 3,734 |
| హైదరాబాద్ | 3,750 | 3,675 | 41,250 |
| మెదక్ | 165 | 162 | 1,815 |
| నిజామాబాద్ | 474 | 464 | 5,104 |
| ఆదిలాబాద్ | 307 | 301 | 3,370 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| కరీంనగర్ | 408 | 390 | 4,488 |
| వరంగల్ | 672 | 659 | 7,392 |
| ఖమ్మం | 358 | 351 | 3,938 |
| నల్గొండ | 522 | 512 | 5,742 |
| మొత్తం | 19,412 | 19,013 | 2,13,422 |

మూలం : డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్ కామర్స్, ఆంధ్రప్రదేశ్.

ప్రాంతాలవారీగా ఆంధ్రప్రదేశ్‌లో లఘు పరిశ్రమల ప్రగతిని కింద చూపడమైనది.

| ప్రాంతం | 1966 యూనిట్ల సంఖ్య | 1966 పెట్టుబడి రూ.లక్షలలో | 1966 ఉపాధి కల్పన | 1978 యూనిట్ల సంఖ్య | 1978 పెట్టుబడి రూ.లక్షలలో | 1978 ఉపాధి కల్పన |
|---|---|---|---|---|---|---|
| కోస్తా ఆంధ్ర | 2,954 | 1663 7 | 42,857 | 9,654 | 9459 | 1,06,194 |
| తెలంగాణ | 2,739 | 804.7 | 26,743 | 7,000 | 6851 | 76,890 |
| రాయలసీమ | 877 | 470.9 | 12,364 | 2728 | 2,703 | 30,338 |
| మొత్తం | 6,570 | 2939.3 | 81,964 | 19,412 | 19,013 | 2,13,422 |

మూలం : డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్ కామర్స్, ఆంధ్రప్రదేశ్.

## కుటీరపరిశ్రమలు

మనరాష్ట్రంలో కుటీరపరిశ్రమలు చరిత్ర ప్రసిద్ధికెక్కినవి. మనరాష్ట్రంలో అనేకరకాల కుటీర పరిశ్రమలున్నాయి. వాటిలో తివాచీలు, కంబళ్లు, బిద్రివేర్, కలంకారీపని, గాజులు, పేముఅల్లకం, కొమ్ము దంతపు వస్తువుల తయారీ పట్టు పరిశ్రమ ఆటవస్తువులు, నిర్మల్ పెయింట్లు, పీచు, అగరువత్తులు, హారతి కుందులు, కూజాల తయారీ, వెదురు బుట్టలల్లడం మొదలైనవి. ఎన్నో కుటీర పరిశ్రమలు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నాయి. చేతివృత్తుల అభివృద్ధికి ప్రతి ప్రణాళికలోను ప్రభుత్వం కొన్ని లక్షల రూపాయల గ్రాంటును యిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ రకాల కుటీరపరిశ్రమలు వాటికి ప్రసిద్ధిచెందిన ప్రదేశాలుకింద పేర్కొవడం జరిగింది.

| *కుటీరపరిశ్రమలు* | *తయారయ్యే ప్రదేశాలు* |
|---|---|
| తివాచీలు, కంబళ్లు | ఏలూరు, వరంగల్లు |
| బిద్రివేర్ | హైదరాబాద్, సికింద్రాబాద్ |

| | |
|---|---|
| కలంకారీ అద్దకం | మచిలీపట్నం |
| గాజులు | పాపానాయుడు పేట (చిత్తూరుజిల్లా), కాళహస్తి సింహాచలం, (విశాఖపట్నంజిల్లా) గాజులపేట, (మహబూబ్‌నగర్ జిల్లా) |
| పేము అల్లకం | హైదరాబాదు, రాజమండ్రి, ఇందుకూరుపేట (నెల్లూరుజిల్లా)చీరాల,నర్సీపట్నం మొదలైనవి. |
| ఉప్పు | నౌపాడ, పూండి, కళింగపట్నం, కృష్ణపట్నం ఇసుకపల్లి, పాకాల, మచిలీపట్నం. |
| కొమ్ము, దంతపు వస్తువులు | సికిందరాబాద్, విశాఖపట్నం |
| పట్టు | మునేరు(మెదక్ జిల్లా) కర్నూలు, అనంతపూర్, చిత్తూరు, కరీంనగరు, వరంగల్లు, శ్రీకాకుళం, ఆదిలాబాదు |
| ఆటవస్తువులు, బొమ్మలు | కొండపల్లి, ఏటికొప్పాక, నక్కపల్లి, తిరుపతి |
| నిర్మల్ పెయింట్లు | నిర్మల్ (ఆదిలాబాద్ జిల్లా), హైదరాబాద్ |
| అగరువత్తులు | ఏలూరు, హైదరాబాదు, వేటపాలెం |
| పీచు పరిశ్రమ | తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి,శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు |
| చిరుచాపల తయారీ | మహబూబ్‌నగర్ |
| బూరుగుదూది పరుపులు | కుప్పం |
| సంగీత పరికరాలు | పిఠాపురం, బొబ్బిలి, జగ్గయ్యపేట |

అంతేకాకుండా ఆంధ్రప్రదేశ్‌లో అనేకచోట్ల కుటీర పరిశ్రమల రూపంలో కుండలు, కూజాలతయారీ వెదురుబుట్టల అల్లకం, వెండి బంగారు వస్తువుల తయారీ, తోలుబొమ్మలు, అగ్గిపెట్టెల తయారీ మొదలైన పరిశ్రమలు అనేక ప్రాంతాలలో విస్తరించి ఉన్నాయి.

## పరిశ్రమల వార్షిక సర్వే

ఆంధ్రప్రదేశ్‌లో అర్థగణాంక శాఖవారు 1973-74 నుంచి పరిశ్రమల వార్షిక సర్వేను చేపట్టారు. ఈ వార్షికసర్వే రెండు భాగాలుగా ఉంటుంది. 1. లెక్కలభాగం (**Census sector**) 2. లెక్కలేనిభాగం(**non-census sector**). భారతీయ ఫ్యాక్టరీచట్టం, 1948 సెక్షన్ 2m (i), 2 m (ii) కింద రిజిష్టరైన ఫ్యాక్టరీలన్నీ, 50 లేదా అంతకంటె ఎక్కువ మంది కార్మికులను నియమించి విద్యుచ్ఛక్తితో పనిచేసే, 100 లేదా అంత కంటె ఎక్కువ మంది కార్మికులను నియమించి విద్యుచ్ఛక్తితో నిమిత్తం లేకుండా పనిచేసే ఫ్యాక్టరీలన్నీ

మొదటిభాగం కిందకు వస్తాయి. మిగతా ఫ్యాక్టరీలు రెండోభాగం కిందకు వస్తాయి. మిగతా ఫ్యాక్టరీలంటే 10 లేదా అంతకంటె ఎక్కువ మంది కార్మికులు విద్యుచ్ఛక్తి సహాయం లేకుండా పనిచేసే ఫ్యాక్టరీలు ఇట్లాంటి ఫ్యాక్టరీల గణాంకాలను శాంపుల్ సర్వే ప్రాతిపదిక మీద సేకరించడం జరుగుతుంది. రాష్ట్రంలో ఎన్నో చిన్నతరహా పరిశ్రమలు రకరకాలైన పథకాల కింద స్థాపించబడటంతో, రాష్ట్ర పారిశ్రామికీకరణలో ఈ చిన్నతరహా పారిశ్రామిక సంస్థల పాత్ర గణనీయంగా ఉండటంతో వీటిని గురించి లెక్కలు సేకరించాల్సిన ఆవశ్యకత ఎంతో ఉంది. ఈ పనిని ఆంధ్రప్రదేశ్ అర్థగణాంకశాఖవారు చేపట్టారు.

1970 సంవత్సరానికి ఉత్పత్తి రంగంలోకి దిగిన ఫ్యాక్టరీల సంఖ్య 3.512, ఈ ఫ్యాక్టరీలకు ఉత్పాదన మూలధనం రూ. 1,092 కోట్లు ఉంది. ఈ ఫ్యాక్టరీలు 3.88 లక్షల మందికి ఉపాధికల్పిస్తున్నాయి. రూ. 1,570 కోట్ల విలువగల వస్తువులను ఉత్పత్తిచేసినాయి. అయితే తరవాతి కాలంలో ఈ ఫ్యాక్టరీల సంఖ్య, ఉత్పాదకశక్తి, ఉత్పత్తుల విలువలు, ఉపాధికల్పన పెరిగింది.

1976-77 నాటికి ఆంధ్రప్రదేశ్‌లో సెక్షన్ 2 m **(i)**, 2 m **(ii)** కింద రిజిష్టరైన వివిధ రకాల ఫ్యాక్టరీలను, వాటికి సంబంధించిన వివరాలు కింది పట్టికలో ఇవ్వడం జరిగింది.

| అంశం | యూనిట్ | 1976 - 77 |
|---|---|---|
| ఫ్యాక్టరీలు | సంఖ్య | 7,353 |
| స్థిరమూలధనం | రూ. కోట్లలో | 956.86 |
| నిర్వహణ మూలధనం | ,, | 315,50 |
| ఉత్పాదక మూలధనం | ,, | 1,272.36 |
| చెల్లించాల్సిన ఋణాలు | ,, | 837.26 |
| కార్మికులు | వేలల్లో | 431 |
| మనిషి పనిగంటకు **(Man hours)** | లక్షలలో | 106.04 |
| ఉద్యోగస్తులు | వేలల్లో | 575 |
| కార్మికులకు వేతనాలు | కోట్ల రూపాయలలో | 103.40 |
| మొత్తంవేతనాలు, జీతాలు మొదలైనవి | ,, | 174.03 |
| ఇంధనం వగైరా | ,, | 99.27 |
| వినియోగించిన మెటీరియల్స్ | ,, | 1,115.54 |
| మొత్తం ఉత్పాదకాలు (inputs) | ,, | 1,574.67 |
| ఉత్పత్తులు | ,, | 1,654 89 |
| సగం తయారీ వస్తువులు | ,, | 254.27 |
| మొత్తం ఉత్పత్తి | ,, | 1,909.16 |
| తరుగుదల | | 59.89 |
| కూడిన విలువ **(Value added)** | ,, | 374.40 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్.

ఆంధ్రప్రదేశ్‌లో 1976-77 నాటికి వివిధ జిల్లాలలోఉన్న ఫ్యాక్టరీలు, వాటి రకరకాల మూలధనాలు, వాటిల్లో పనిచేసే కార్మికుల సంఖ్య, ఉత్పత్తివివరాలు కిందపట్టికలో ఇవ్వడం జరిగింది.

| జిల్లా | ఫ్యాక్టరీల సంఖ్య | స్థిరమూలధనం (రూ.లక్షలలో) | నిర్వహణ మూలధనం (రూ.లక్షలలో) | ఉత్పాదక మూలధనం (రూ.లక్షలలో) | మొత్తం ఉత్పత్తి (రూ.లక్షలలో) | కార్మికుల సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| శ్రీకాకుళం | 217 | 866.65 | 768.03 | 1,634.68 | 3,819.71 | 11,545 |
| విశాఖపట్నం | 369 | 6,915.17 | 7,151.36 | 14,366.53 | 24,462.61 | 23,447 |
| తూర్పుగోదావరి | 554 | 2,652.46 | 904.40 | 3,556.86 | 8,358.96 | 23,039 |
| పశ్చిమగోదావరి | 495 | 1,934.80 | 1,551.89 | 3,486.69 | 10,336,77 | 25,581 |
| కృష్ణా | 495 | 1,633.63 | 1,654 94 | 6,288.57 | 8,610.04 | 19,680 |
| గుంటూరు | 723 | 1,663.12 | 1,585.29 | 3,248.41 | 19,591.88 | 46,948 |
| ప్రకాశం | 370 | 253.76 | 427.57 | 681.33 | 7,032.27 | 50,687 |
| నెల్లూరు | 176 | 313.55 | 222.99 | 536.84 | 1,268.30 | 2,833 |
| కర్నూలు | 367 | 1,259.10 | 445.79 | 1,704.89 | 6,585.76 | 11,709 |
| అనంతపూర్ | 227 | 454.60 | 205.56 | 660.16 | 3,088.92 | 5,819 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
|---|---|---|---|---|---|---|
| కడప | 148 | 370.89 | 249.91 | 620.80 | 3,952.83 | 4,777 |
| చిత్తూరు | 219 | 593.16 | 383.94 | 977.10 | 6,120.80 | 6,568 |
| హైదరాబాదు | 894 | 68,858.89 | 11,583.94 | 74,443.23 | 61,670.36 | 91,778 |
| నిజామాబాద్ | 926 | 1,396.63 | 602.97 | 4,999.60 | 5,120 68 | 48,962 |
| మెదక్ | 124 | 3,174.94 | 2,166.19 | 5,341.13 | 9,918 67 | 14,713 |
| మహబూబ్‌నగర్ | 222 | 141.71 | 23.61 | 165.32 | 697.28 | 1,895 |
| ఖమ్మం | 66 | 433.99 | 163.38 | 596.87 | 997.38 | 2,194 |
| వరంగల్ | 139 | 82.13 | 340.22 | 412.35 | 2 202.09 | 6,748 |
| కరీంనగర్ | 374 | 1,120.55 | 255.27 | 1,357.82 | 1,714.42 | 14,363 |
| నల్గొండ | 108 | 131.85 | 74.10 | 205.95 | 1,693 80 | 1,868 |
| ఆదిలాబాద్ | 140 | 1,452.52 | 489.11 | 1,941.63 | 3,672.46 | 16,273 |
| ఆంధ్రప్రదేశ్ | 7,352 | 95,686.10 | 31,550.46 | 1,27,236.46 | 1,90,916.29 | 4,31,427 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్.

పరిశ్రమలవారీగా చూస్తే మనరాష్ట్రంలో 1977 నాటికి ఒక్కొక్క పరిశ్రమలో ఎన్ని ఫ్యాక్టరీలున్నాయో, ఎంతమందికార్మికులు పనిచేస్తున్నారో దిగువపట్టికద్వారా తెలుసుకోవచ్చు.

| పరిశ్రమ | ఫ్యాక్టరీల సంఖ్య | ఉద్యోగులసంఖ్య |
|---|---|---|
| వ్యావసాయిక ఉత్పత్తి | 8 | 88 |
| పశుసంపదకు సంబంధించినది | 4 | 112 |
| వ్యావసాయక సేవలు | 3 | 62 |
| ఆహారపదార్థాల తయారీ | 5,443 | 1,03,561 |
| స్వాదు పానీయాలు, పొగాకు, పొగాకు ఉత్పత్తులు | 450 | 1,13,587 |
| కాటన్ టెక్స్‌టైల్స్ | 397 | 30,285 |
| ఉన్ని, సిల్కు, సింథటిక్ ఫైబర్, టెక్స్‌టైల్స్ | 49 | 2,907 |
| జనపనార, హెంప్, మెస్తా టెక్స్‌టైల్స్ | 18 | 12,555 |
| టెక్స్‌టైల్ ఉత్పత్తులు (రెడీమేడ్ దుస్తులు మొ॥నవి) | 23 | 1,801 |
| కొయ్య, కొయ్యసామానులు, ఫర్నిచర్ మొదలైనవి | 1,171 | 7,306 |
| కాగితం, కాగితపు ఉత్పత్తులు, ప్రింటింగ్ పబ్లిషింగ్ తదితర పరిశ్రమలు | 1,220 | 19,268 |
| చర్మ పరిశ్రమలు | 19 | 536 |
| రబ్బరు, ప్లాస్టిక్, పెట్రోలియమ్, బొగ్గు ఉత్పత్తులు | 66 | 3,924 |
| రసాయనాలు, రసాయనిక ఉత్పత్తులు | 259 | 32,051 |
| లోహేతర ఖనిజోత్పత్తులు | 371 | 16,200 |
| లోహపు ఉత్పత్తులు, విడిభాగాలు | 166 | 3,113 |
| యంత్రాలు, యంత్రపరికరాలు, విడిభాగాలు | 1,009 | 28,553 |
| విద్యుత్ యంత్రాలు, పరికరాలు | 67 | 9,227 |
| రవాణా సామాగ్రి, విడిభాగాలు | 77 | 22,661 |
| ఇతర తయారీ పరిశ్రమలు | 49 | 2,743 |
| విద్యుచ్ఛక్తి | 33 | 3,489 |
| గ్యాస్, స్టీము | 12 | 333 |
| వాటర్ వర్క్స్, సప్లయ్ | 13 | 232 |
| కన్స్ట్రక్షన్ తదితర కార్యకలాపాలు | 1 | 16 |
| ఆహారాలు, టెక్స్టైల్స్,స్వాదుపానీయాలు మొదలైనవాటి టోకు వ్యాపారం | 1 | 13 |

| | | |
|---|---|---|
| కలప, కాగితం, తోళ్ల చర్మాలు మొదలైనవాటిలో టోకు వ్యాపారం | 7 | 209 |
| నిల్వ, గిడ్డంగి | 2 | 29 |
| విద్య, శాస్త్రీయ పరిశోధన సేవలు | 6 | 5,139 |
| క్రీడా, సాంస్కృతిక సర్వీసులు | 2 | 105 |
| వ్యక్తిగత సర్వీసులు | 8 | 207 |
| రిపేరు సర్వీసులు | 612 | 17,663 |
| ఏ తరగతికి చెందని సర్వీసులు | 1 | 68 |
| | 11,797 | 4,46,020 |

మూలం : ఛీఫ్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ ఫ్యాక్టరీస్ అండ్ బాయిలర్, ఆంధ్రప్రదేశ్.

**ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామిక ఉత్పత్తి సూచీ సంఖ్యలు**

(ఆధార సంవత్సరం : 1970=100)

| పరిశ్రమలు | 1974 | 1978 |
|---|---|---|
| గనులు | 159.8 | 250.8 |
| ఆహారం | 85.6 | 96.4 |
| స్వాదుపానీయాలు (కాఫీ, టీ మొ॥) | 130.1 | 201.8 |
| పొగాకు | 100.7 | 109.0 |
| టెక్స్‌టైల్స్ | 128.9 | 137.7 |
| కాగితం, కాగితపు వస్తువులు | 127.2 | 163.5 |
| చర్మపు వస్తువులు | 76.6 | 75.4 |
| రసాయనాలు, రసాయనిక వస్తువులు | 107.7 | 172.3 |
| పెట్రోల్, పెట్రోల్ వస్తువులు | 97.1 | 116.3 |
| లోహేతర ఖనిజోత్పత్తులు | 113.3 | 145.2 |
| మూల లోహపు ఉత్పత్తులు | 95.0 | 121.1 |
| లోహపు ఉత్పత్తులు | 131.7 | 145.0 |
| యంత్రాలు | 139.3 | 264.9 |
| విద్యుత్ యంత్రాలు | 228.9 | 405.4 |
| రవాణా సామగ్రి | 231.2 | 276.2 |

| 1 | 2 | 3 |
|---|---|---|
| చిల్లరమల్లర వస్తువులు | 129.5 | 162.8 |
| విద్యుచ్ఛక్తి | 110.7 | 204.1 |
| సాధారణ సూచి | 128.3 | 184.1 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

## పారిశ్రామిక క్షేత్రాలు (Industrial Estates)

దేశంలో పారిశ్రామికీకరణకు విద్యావంతులైన నిరుద్యోగులకు స్వయంఉపాధి కల్పనా సదుపాయాలకోసం స్వంతంగా పరిశ్రమలను స్థాపించుకో దలచిన ఇంజనీర్లు సాంకేతిక నిపుణుల నిమిత్తం అన్ని రాష్ట్రాలలో పారిశ్రామిక క్షేత్రాలను స్థాపించడం జరిగింది. అట్లాగే మన రాష్ట్రంలో కూడా 1978 నాటికి వివిధ జిల్లాలలో 108 పారిశ్రామిక క్షేత్రాలను స్థాపించడం జరిగింది. హైదరాబాద్, కర్నూలు, ఒంగోలు కాకినాడ, విశాఖపట్నం ప్రత్యేక పారిశ్రామిక క్షేత్రాలను నెలకొల్పడం జరిగింది. వీటిలో కొన్ని అనుబంధ పారిశ్రామిక క్షేత్రాలుగా కొన్నింటిని ఏర్పాటు చేశారు. ఉదాహరణకు భారత్ హెవీ ఎలక్ట్రికల్స్, రామచంద్రాపురం; ఎలక్ట్రానిక్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, హైదరాబాదు; హిందూస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్ మొ॥ వాటికి అనుబంధంగా పారిశ్రామిక క్షేత్రాలను నెలకొల్పారు. రాష్ట్రంలో పరిశ్రమల విస్తరణకు సంతులిత పారిశ్రామికీకరణకు ఈ పారిశ్రామిక క్షేత్రాలు ఎంతో ఉపయోగ పడతాయి. రాష్ట్రంలోని పారిశ్రామిక క్షేత్రాలన్నీ ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషను యాజమాన్యం కింద ఉన్నాయి.

**ఆంధ్రప్రదేశ్‌లో వివిధ జిల్లాలలో ఉన్న పారిశ్రామిక క్షేత్రాలు (1977 - 78)**

| జిల్లా | ప్రస్తుతం ఉన్నవి | ప్రతిపాదనలో ఉన్నవి | మొత్తం |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 3 | 2 | 5 |
| విశాఖపట్నం | 8 | 1 | 9 |
| తూర్పుగోదావరి | 7 | 2 | 9 |
| పశ్చిమగోదావరి | 2 | 4 | 6 |
| కృష్ణా | 4 | 4 | 8 |
| గుంటూరు | 5 | 5 | 10 |
| ప్రకాశం | 2 | 2 | 4 |
| నెల్లూరు | 6 | 2 | 8 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| చిత్తూరు | 9 | 1 | 10 |
| కడప | 6 | 5 | 11 |
| అనంతపూర్ | 5 | 1 | 6 |
| కర్నూలు | 6 | 1 | 7 |
| మహబూబ్‌నగర్ | 3 | 1 | 4 |
| మెదక్ | 4 | 2 | 6 |
| నిజామాబాద్ | 4 | 2 | 6 |
| ఆదిలాబాద్ | 3 | 2 | 5 |
| ఖమ్మం | 5 | 2 | 7 |
| వరంగల్ | 4 | — | 4 |
| కరీంనగర్ | 2 | 1 | 3 |
| నల్గొండ | 3 | 2 | 5 |
| హైదరాబాదు | 17 | — | 17 |
| మొత్తం | 108 | 42 | 150 |

మూలం : ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషన్, హైదరాబాదు.

పరిశ్రమలకు ఆర్థిక సహాయాన్ని అందించే వివిధ సంస్థలు

## ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి సంస్థ

## (Andhra Pradesh Industrial Development Corporation)

ఈ సంస్థను 1960 డిశంబరులో నెలకొల్పడం జరిగింది. ఈ సంస్థకు 15 కోట్ల రూపాయలు అనుమతి ఇచ్చిన పెట్టుబడి, 21.5 కోట్ల రూపాయలు చెల్లించిన పెట్టుబడులు ఉన్నాయి. ఈ సంస్థ ఇంజనీరింగ్, రసాయనాలు, బట్టలు, రసాయనిక ఎరువులు, పంచదార, సిమెంటు, ప్లాస్టిక్ కాగితం, ఫార్మాస్యూటికల్స్, లోహాలు మొదలైన రకరకాల పరిశ్రమలు ఆర్థిక సహాయాన్ని అందిస్తున్నది. కొన్ని ఫ్యాక్టరీల స్థాపనకు కృషి చేసింది. ఈ సంస్థ సహాయాన్ని పొందిన ఫ్యాక్టరీలద్వారా ఎంతో మందికి ఉపాధికల్పన లభిస్తున్నది. సంయుక్త రంగంలో కూడా ఈసంస్థ అసోసియేటెడ్ గ్లాస్‌ఇండస్ట్రీస్, గంగప్ప కేబుల్స్ లిమిటెడ్, ఫెర్రో ఎలక్ట్రిక్ ప్రయివేట్ లిమిటెడ్, ఆంధ్ర మెకానికల్ అండ్ ఎలక్ట్రికల్ ఇండస్ట్రీస్, అల్కా-మెటల్స్ ప్రయివేట్ లిమిటెడ్, మొదలైన వాటి స్థాపనకు ఈ సంస్థ తోడ్పడింది. ఈ సంస్థ

ఇంతవరకు దాదాపు రెండువందల పెద్ద మధ్య చిన్నతరహా పరిశ్రమలుంపు ఆర్థిక సహాయాన్ని అందించినట్లు తెలుస్తున్నది.

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి సంస్థ
## ( A. P. State Small Industries Development Corporation )

ఈ సంస్థను 1961 లో స్థాపించారు. దీని స్థాపనలోని ప్రధానోద్దేశం ఆంధ్రప్రదేశ్ లోని రకరకాల చిన్నతరహా పరిశ్రమలకు ఆర్థిక సహాయాన్ని అందించి వాటి అభివృద్ధికి అన్ని విధాలా తోడ్పడటం ఈ సంస్థ కార్యకలాపాలలో ముఖ్యమైనవి. శిక్షణ ఉత్పత్తి కేంద్రాలను నిర్వహించడం, ముడిపదార్థాల సప్లయ్ కేంద్రాలను స్థాపించి చిన్న పరిశ్రమల యూనిట్ కేంద్రాలకు సప్లయే చేయడం చిన్నతరహా పరిశ్రమల స్థాపనలో సహకారాన్నందించడం మొదలైనవి. ఇందులోని సాంకేతిక అధికారులు రాష్ట్రంలో ఎక్కడ ఏ పరిశ్రమను స్థాపించడానికి వీలుగా ఉంటుందో ప్రాజెక్ట్ రిపోర్టులను తయారుచేసి ఔత్సాహిక పారిశ్రామికులకు తగిన సలహా ఇస్తూ ఉంటారు. ఈ సంస్థ చిన్నతరహా పరిశ్రమల స్థాపనకు అవసరమైన సౌకర్యాలను సమకూరుస్తుంది. నిరుద్యోగులయిన విద్యావంతులు స్వయం ఉపాధి కల్పన పథకం క్రింద పరిశ్రమలను స్థాపించడానికి అనువుగా యంత్రపరికరాలను అద్దె పద్ధతిపై సప్లయ్ చేస్తుంది. చిన్న పరిశ్రమల ద్వారా ఉత్పత్తి అయ్యే వస్తువులకు మార్కెటింగ్ నిమిత్తం తగిన సలహాలు ఇస్తుంది. ఈ సంస్థ ఎన్నో సదస్సులను, వర్క్ షాపులను నిర్వహించి ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలకు ప్రోత్సాహాన్ని ఇస్తుంది. మొదట్లో ఈ సంస్థ పెట్టుబడి 50 లక్షల రూపాయలయినప్పటికీ ఇప్పటి దీని పెట్టుబడి 5 కోట్ల మేరకు చేరుకొన్నది. ఈ సంస్థకు రాష్ట్రంలో 12 ముడిపదార్థాల సప్లయ్ కేంద్రాలున్నాయి. 19 ఉత్పత్తి విభాగాలు ఉన్నాయి. ఈ సంస్థ కొన్ని వేలమంది ఉద్యోగ కల్పనకు ప్రత్యక్షంగా పరోక్షంగా తోడ్పడింది.

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థికసహాయసంస్థ
## (Andhra Pradesh State Finance Corporation)

ఇట్లాంటి సంస్థలు దేశమంతటా ప్రతిరాష్ట్రానికి ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తరవాత అంతకు ముందు ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రాలలోని ఆర్థిక సంస్థలను విలీనంచేసి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థగా రూపొందించడం జరిగింది. ప్రయివేట్ రంగలో భారీ మధ్య చిన్న తరహా పరిశ్రమల స్థాపన వాటి విస్తరణ ఆధునికీకరణ మొదలైన అవసరాల నిమిత్తం ఆర్థిక సహాయం చేయడం ద్వారా రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడటం ఈ సంస్థ ప్రధాన లక్ష్యం. ఈ సంస్థ పరిశ్రమల అభివృద్ధికి ఎన్నో రకాలుగా సహాయాన్ని అందిస్తున్నది. పరిశ్రమల స్థాపనకు పెట్టుబడి పెట్టడం, వాటాల డిబెంచర్ల జారీ కొనుగోళ్ళకు తోడ్పడటం గ్యారంటీలనివ్వడం ప్రభుత్వం తరఫున రుణాలను చెల్లించడం విద్యావంతులైన నిరుద్యోగులకు ఆర్థిక సహాయం అందించడం మొదలైనవి. ఈ సంస్థద్వారా మన రాష్ట్రంలో అనేకరకాల భారీ చిన్న తరహా సంస్థలు ఆర్థిక సహాయాన్ని పొందాయి. ముఖ్యంగా ఆహారోత్పత్తుల తయారీ సంస్థలు, టెక్స్టైల్ మిల్లులు, రసాయినాలు, రసాయనికోత్పత్తుల సంస్థలు,

మొదలైనవి ఎక్కువ సహాయాన్ని పొందాయి. ఈ సంస్థకు విశాఖపట్నం, తిరుపతి, వరంగల్ విజయవాడలలో బ్రాంచీలు నిజామాబాద్, ఒంగోలు, కడప, శ్రీకాకుళం, నెల్లూరులలో సబ్ బ్రాంచీలు ఉన్నాయి. ఈ సంస్థను నెలకొల్పినప్పటినుంచి 1978-79 నాటికి దాదాపు 3,500 చిన్న తరహా పరిశ్రమలకు 3,464 లక్షల రూపాయల మేరకు మంజూరు చేసినట్లు తెలియ వస్తున్నది.

## ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అవస్థాపన సంస్థ

## (Andhra Pradesh Industrial Infrastructure Corporation)

దీనిని 1973 సెప్టెంబరులో 10 కోట్ల రూపాయల అనుమతి మూలధనంతో రాష్ట్ర ప్రభుత్వం స్థాపించింది. దీనిస్థాపనలోని ప్రధానోద్దేశం రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధికి అవసర మైన అవస్థాపనా సౌకర్యాలను కల్పించడం. అవస్థాపన సౌకర్యాలలో పరిశ్రమల స్థాపనకు వీలుగా నీరు, విద్యుత్ కమ్యూనికేషన్లు షెడ్యూల్ నిర్మించడం, స్థలాలు సమకూర్చడం మొద లైనవి. రాష్ట్రమంతటా భారీ మధ్యతరహా చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధికి అవసరమయిన ప్రాథమిక వసతులను కల్పించడంలో ఈ సంస్థ గణనీయమైన కృషిని చేస్తున్నది. ఒక రకంగా ఈ సంస్థ అటు ప్రభుత్వానికి, ఇటు పారిశ్రామికులకు మధ్య ఏజంటుగా వ్యవహరిస్తు న్నదని చెప్పవచ్చు. ఈ సంస్థ స్థాపన తరవాత రాష్ట్రంలో పారిశ్రామిక క్షేత్రాలు పారిశ్రా మిక అభివృద్ధి ప్రాంతాలు హెచ్చుగా నెలకొల్పడం జరిగింది. ఈ సంస్థ గృహనిర్మాణ పథకా లను కూడ చేపట్టింది. ఈసంస్థ కేంద్ర సబ్సిడీలు మార్జిన్ సొమ్ము రాష్ట్ర ప్రభుత్వం కల్పించే రాయితీలు రుణాలను విడుదలచేయడంలోను కార్మికులకు గృహవసతి కల్పించడంలోను కీలక మైన పాత్రను నిర్వహిస్తున్నది. ఈ సంస్థ కేంద్ర సబ్సిడీ క్రింద రూ 18 లక్షలు, మార్జిన్ సొమ్ము ద్వారా రూ 85 లక్షలు, రాష్ట్ర ప్రభుత్వపు ప్రోత్సాహక రాయితీల ద్వారా రు. 116 లక్షలు, బ్రిడ్జి ఋణాలక్రింద రు. 502 లక్షలు, స్వచ్ఛంద రుణాలక్రింద రూ. 60 లక్షలు విడుదల చేసినట్లు తెలియవస్తున్నది. రాష్ట్రంలో వివిధ ప్రాంతాల పారిశ్రామికాభివృద్ధికిగాను కొన్నివేల ఎకరాలను ఈ సంస్థ సేకరించింది.

## ఆంధ్రప్రదేశ్ తోళ్ళ పరిశ్రమల అభివృద్ధి సంస్థ

## (Andhra Pradesh Leather Industries Development Corporation)

ఈ సంస్థను 1968 లో రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసింది. రాష్ట్రంలో తోళ్ల పరిశ్ర మను అభివృద్ధి పరచడానికి ఆ పరిశ్రమపై ఆధారపడే ప్రజలకు తగిన సహాయ సహకారాలు అందించడానికి ఈ సంస్థను నెలకొల్పడం జరిగింది. హైదరాబాదు కానరీస్, గుంతకల్ కాన రీస్, మోడల్ లెదర్ గూడ్స్ మాన్యుఫాక్చరింగ్ యూనిట్; యుటిలిటీ లెదర్ గూడ్స్ సెంటర్ మొదలయినవన్నీ ఈ సంస్థ ఆధ్వర్యంలోకి వచ్చినాయి. ఈ సంస్థ స్వయం ఉపాధి కల్పనా పథకం క్రింద విద్యావంతులైన నిరుద్యోగులకు ఆర్థిక సహాయం చేస్తున్నది. చర్మకారుల కోసం నాలుగు జిల్లాలలో రోడ్ల పక్క 160 బంకులను నెలకొల్పింది. ఈ సంస్థ కింద 7 షోరూమ్‌లు 14 ముడిసరుకు డిపోలు ఉన్నాయి.

## ఆంధ్రప్రదేశ్ వ్యావసాయిక పరిశ్రమల అభివృద్ధి సంస్థ
## (Andhra Pradesh Agro Industries Development Corporation)

ఈ సంస్థను రాష్ట్ర ప్రభుత్వం 1968 లో నెలకొల్పింది. ఇందులో రాష్ట్ర ప్రభుత్వానికి 5 శాతం వాటాలు, కేంద్ర ప్రభుత్వానికి 49 శాతం వాటాలు. దీని చెల్లించిన వాటా మూలధనం రూ. 5 కోట్లు. వ్యవసాయానికి సంబంధించిన పరిశ్రమలను అభివృద్ధి చేయడమే ఈ సంస్థ ప్రధానలక్ష్యం. ఈ సంస్థ కార్యకలాపాల్లో దేశ విదేశాలలో తయారైన ట్రాక్టర్లను అమ్మడం, ట్రాక్టరు విడిభాగాల్ని అమ్మడం, ఎరువులు క్రిమిసంహారక మందుల వ్యాపారాన్ని చేపట్టడం, వ్యావసాయక ఆధార పరిశ్రమల స్థాపనకు, విస్తరణకు తోడ్పడటం మొదలైనవి చేరి ఉన్నాయి. ఈ సంస్థ ఇంతవరకు దాదాపు నాలుగువేల రెండువందల ట్రాక్టర్లను అమ్మింది. కర్నూలు, కరీంనగర్, నెల్లూరు, విజయనగరం, విశాఖ జిల్లాలలో ఉన్న అయిదు గ్రామీణ పంపిణీ కేంద్రాల ద్వారా ఇనుము ఉక్కును పంపిణీ చేసింది. వివిధ జిల్లాలలో ఈ సంస్థకు వర్క్‌షాపులు, విక్రయ కేంద్రాలు ఉన్నాయి. ఈ సంస్థ భూమి అభివృద్ధి పథకం క్రింద 65 వేల హెక్టార్ల భూమి సాగుకు యోగ్యం చేసింది.

## నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్
## (National Textile Corporation)

రాష్ట్రంలో ప్రయివేట్ రంగంలోగాని సహకార రంగంలోగాని టెక్స్‌టైల్ మిల్లులు ఏ కారణంవల్లనైనా పనిచేయలేక మూలబడితే లేదా ఆ దశకు వస్తే ఆ మిల్లులను ఈ సంస్థ తన ఆధ్వర్యంలోకి తీసుకొని పనిచేయించడానికి, అవసరమైన ఆర్థిక వనరులను సమకూరుస్తుంది. ఈ సంస్థ నిర్వహణలో ఆరు టెక్స్టైల్ మిల్లులు ఉన్నాయి. ఇందులో నాలుగు మిల్లులు ప్రయివేట్ రంగానికి, ఒకటి సహకార రంగానికి, మరొకటి ప్రభుత్వ రంగానికి సంబంధించినవి. దీని ఆధ్వర్యంకింద ఉన్న మిల్లులు అజాంజాహి మిల్స్ లిమిటెడ్, వరంగల్, తిరుపతి కాటన్‌మిల్స్, రేణిగుంట, ఆదోని కాటన్‌మిల్స్, ఆదోని, నటరాజ్ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్స్, నిర్మల్, అనంతపూర్ కాటన్‌మిల్స్, తాడిపత్రి, నేతా కోఆపరేటివ్ స్పిన్నింగ్‌మిల్స్, సికిందరాబాదు. ఈ మిల్లుల కదుళ్ళ సంఖ్య మొత్తం లక్ష రెండువేల ఆరువందల అరవైఆరు (1,02, 666). ఆంధ్రప్రదేశ్‌లో సత్వర పారిశ్రామికాభివృద్ధికి పుష్కలమైన వనరులు ఎన్నో ఉన్నాయి. ఈ వనరులను అభిలషణీయమైన పరిమాణంలో వినియోగించుకొని రాష్ట్రంలో వివిధ ప్రాంతాల సంతులిత పారిశ్రామికాభివృద్ధికి ప్రభుత్వం చర్యలు తీసుకోవలసి ఉంది. పారిశ్రామికాభివృద్ధి వేగంగా జరిగితే రాష్ట్రానికి ఎన్నో ప్రయోజనాలు సమకూరతాయి. రాష్ట్ర ప్రభుత్వం ఆదాయం పెరుగుతుంది. రాష్ట్రంలో ఉద్యోగావకాశాలు ఎక్కువవుతాయి. రాష్ట్రం మొత్తంమీద పారిశ్రామిక ఉత్పత్తులు పెరుగుతాయి. రాష్ట్ర ప్రజల తలసరి ఆదాయం వృద్ధి చెందుతుంది. కాబట్టి పారిశ్రామికీకరణ వల్ల ఎన్నో ప్రయోజనాలున్నాయి. దక్షిణాది ధాన్యాగారంగా పేరుపొందిన ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధిలోకూడా సత్వర పురోభివృద్ధి సాధించగలదని ఆశించవచ్చు.

## ఆంధ్రప్రదేశ్ టెక్స్‌టైల్ అభివృద్ధి సంస్థ
## (Andhra Pradesh Textile Development Corporation)

దీనిని అక్టోబరు 2, 1975 లో స్థాపించడం జరిగింది. దీని మూలధనం రూ. 1.2 కోట్లు. దీనిస్థాపనలో ప్రభుత్వం ముఖ్యోద్దేశం చేనేత పరిశ్రమకూ, ఆ పరిశ్రమ ద్వారా ఉత్పత్తి అయ్యే దుస్తుల పెంపుదలకూ, ఎగుమతికీ తోడ్పడటం. కొప్పూరు, ప్రొద్దుటూరు, వేటపాలెం మొదలైనచోట్ల ఉత్పత్తి కేంద్రాలను, హైదరాబాద్, పుత్తూరు, మచిలీపట్నం పాలకొల్లు, మొదలైన చోట్ల సేకరణ కేంద్రాలను ఈ సంస్థ స్థాపించింది. ఈ సంస్థ కార్య కలాపాలలో ప్రయివేట్ రంగంలో తయారై నిల్వఉన్న వస్తువులను అమ్మడం, ఎగుమతి పథకాలను అమలు పర్చడం, స్పిన్నింగ్ మిల్లులను నెలకొల్పడం మొదలైనవి చేరి ఉన్నాయి. ఈ సంస్థ పశ్చిమజర్మనీ, ఫ్రాన్స్, స్వీడన్ ఇతరత్రా యూరోపియన్ దేశాలనుంచి చేనేత దుస్తుల ఎగుమతి నిమిత్తం రూ. 45.18 లక్షల మేరకు ఆర్డర్లకు 1980 సంవత్సరం ప్రారంభంలో సేకరించినట్లు తెలియవచ్చింది. ఇంతవరకూ ఈ సంస్థ రూ. 21.51 లక్షల విలువ మేరకు దుస్తులను విదేశాలకు ఎగుమతి చేసింది.

## జిల్లా పరిశ్రమల కేంద్రాలు
## (District Industries Centres)

లఘు, గ్రామీణ పరిశ్రమలకు అవసరమైన సాధన సంపత్తిని సమకూర్చే నిమిత్తం పారిశ్రామిక తీర్మానం, 1977 ప్రకారం దేశంలో 31-1-1979నాటికి 246 జిల్లా పరిశ్రమల కేంద్రాలను స్థాపించడం జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో కూడా వివిధ జిల్లాలలో ఈ కేంద్రాలను నెలకొల్పారు. జిల్లా స్థాయిలో పారిశ్రామికీకరణకు ఈ కేంద్రాలు పాటుబడతాయి. జిల్లాలో గల రకరకాల వనరుల సర్వేచేసి, ఆ వనరుల వినియోగానికి ఈ కేంద్రాలు చర్యలు తీసుకొంటాయి. యంత్రాలు, పనిముట్లు, సప్లయ్‌చేయడం ఆర్థిక సౌకర్యాలను సమకూర్చడం మార్కెటింగ్ సదుపాయాలను కల్పించడం, ముడిపదార్థాలను అందుబాటులో ఉంచడం, ఔత్సాహిక కార్మికులకు శిక్షణ ఇవ్వడం మొదలైన కార్యకలాపాలను ఈ కేంద్రాలు నిర్వహిస్తాయి. ఖాదీ, గ్రామీణ పరిశ్రమల కమీషన్, అఖిలభారత చేతిపనులబోర్డు, అఖిలభారత చేనేతబోర్డు, ఖాదీబోర్డు, కేంద్ర సిల్కుబోర్డు మొదలైన సంస్థల కార్యకలాపాలు ఈజిల్లా పరిశ్రమల కేంద్రాలద్వారా జరుగుతాయి.

# 18

# కార్మికులు - ఉపాధికల్పన

ఏదేశానికైనా ఉన్న వనరులలో అతి ముఖ్యమైనవి మానవ వనరులు ( Human resources ). ప్రజలు పాటు పడనిదే ఏదేశమూ పురోగమించలేదు, వాస్తవానికి దేశం మనుగడే ఉండక పోవచ్చు. నాగరికత, పారిశ్రామికీకరణం, ప్రగతి మొదలైన అభ్యున్నతులన్నిటికీ శ్రమ మూలాధారం.

శ్రమించేవారిని ప్రధానంగా మూడు వర్గాలుగా విభజించి చెప్పవచ్చు - కౌశలం అవసరంలేని శ్రామికులు, పాక్షికంగా కౌశల మవసరమైన శ్రామికులు, కౌశలం పూర్తిగా అవసరమున్న వృత్తులను చేపట్టినవారు. ఈ మూడు వర్గాల వారిలో మొదటిరకం కార్మికులు ఎక్కువగా ఉంటారు.

మన దేశంలో పనిచేసేవాళ్ళు తక్కువ, పని చేయనివాళ్లు ఎక్కువ. రాష్ట్రంలో కూడా అంతే. ఉదాహరణకు 1971 లెక్కల ప్రకారం మన రాష్ట్రంలో 1,80,05,999 మంది శ్రామికులు ఉన్నారు. రాష్ట్ర జనాభాలో వీరి శాతం 41.4 మిగిలిన 58.6 శాతం అంటే 2,54,96,709 మంది శ్రామికులు కానివారని తెలుస్తున్నది.

కార్మికులను వారు పనిచేసే రంగాల వారీగా విభజించి చూస్తే ఎక్కువ మంది వ్యవసాయరంగంలోనే పనిచేస్తున్నట్లు గమనించవచ్చు. ఇది సుబోధకమైన విషయమే. మన రాష్ట్రం ప్రధానంగా వ్యవసాయ రంగంమీద ఆధారపడినది. ఇప్పుడిప్పుడే పారిశ్రామికీకరణం చెందుతున్నా మొదటి నుంచీ ఎక్కువ మంది వ్యవసాయం మీద ఆధారపడి జీవించారు, ఇంకా జీవిస్తున్నారు. ఉపాధిని బట్టి ఉద్యోగులన్నట్లు ఈ రంగంలోనే శ్రామికులెక్కువగా ఉన్నారు. 1971 లెక్కల ప్రకారం 1,26,23,386 మంది అంటే జనాభాలో 29 శాతం వ్యవసాయరంగంలోను, 53,82,613 అంటే 12.4 శాతం వ్యవసాయేతర రంగాలలోను పని చేస్తున్నారు.

జిల్లాల వారీగా చూస్తే శ్రీకాకుళం జిల్లాలో ఎక్కువ మంది వ్యవసాయరంగంలో పని చేసే శ్రామికులు, హైదరాబాదు జిల్లాలో అత్యల్ప వ్యవసాయరంగ శ్రామికులున్నారు. అయితే ఇతర రంగాలలో పనిచేసే కార్మికుల సంఖ్య హైదరాబాదుజిల్లాలో ఎక్కువ, ఖమ్మంలో తక్కువ. కార్మికులు కానివారి సంఖ్య తూర్పుగోదావరిలో ఎక్కువ, నిజామాబాదులో తక్కువ. జనాభా దృష్టితో చూస్తే మహబూబ్‌నగర్ జిల్లాలో అత్యధిక శాతం ( 47 శాతం), హైదరాబాదులో అత్యల్పశాతం (3.5 శాతం) వ్యవసాయ రంగంలో పని చేసే శ్రామికులు. ఇతర

రంగాలలో పని చేస్తున్నవారి శాతం హైదరాబాదు జిల్లాలో ఎక్కువ (22 శాతం), చిత్తూరు జిల్లాలో తక్కువ. కార్మికులు కానివారి శాతం హైదరాబాదు జిల్లాలో ఎక్కువ. (65 శాతం), మహబూబ్‌నగర్ జిల్లాలో తక్కువ (53 శాతం).

1971 నాటికి ఉన్న జిల్లాలవారీగా మొత్తం జనాభా, వ్యవసాయ రంగంలోను, ఇతర రంగాలలోను పనిచేసేవారి సంఖ్య, కార్మికులు కానివారి సంఖ్య మొదలైన వివరాలు కింది పట్టికలో ఇచ్చాం.

| ప.సం. | జిల్లా | జనాభా | కార్మికులు | | కార్మికులుకానివారు |
|---|---|---|---|---|---|
| | | | వ్యవసాయ రంగం | వ్యవసాయేతర రంగాలు | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| | **కోస్తా ఆంధ్రా :** | | | | |
| 1. | శ్రీకాకుళం | 25,89,991 | 8,45,758 | 2,59,327 | 14,84,906 |
| 2. | విశాఖపట్నం | 28,05,366 | 8,08,739 | 3,31,770 | 16,64,857 |
| 3. | తూర్పుగోదావరి | 30,87,262 | 7,84,643 | 3,98,686 | 19,03,933 |
| 4. | పశ్చిమగోదావరి | 23,74,306 | 6,98,635 | 2,65,527 | 14,10,144 |
| 5. | కృష్ణా | 24,93,574 | 6,26,199 | 3,29,943 | 15,37,432 |
| 6. | గుంటూరు | 28,44,488 | 7,78,023 | 3,65,941 | 17,00,524 |
| 7. | ప్రకాశం | 19,19,995 | 5,49,173 | 2,28,034 | 11,42,788 |
| 8. | నెల్లూరు | 16,09,617 | 4,76,917 | 1,85,681 | 9,47,019 |
| | మొత్తం | 1,97,24,599 | 55,68,087 | 23,64,909 | 1,17,91,603 |
| | **రాయలసీమ :** | | | | |
| 9. | కర్నూలు | 19,82,090 | 6,26,336 | 2,13,328 | 11,42,426 |
| 10. | అనంతపూరు | 21,15,321 | 6,73,082 | 2,17,088 | 12,25,151 |
| 11. | కడప | 15,87,267 | 4,58,034 | 1,74,211 | 9,45,022 |
| 12. | చిత్తూరు | 22,85,536 | 7,26,018 | 2,13,369 | 13,46,149 |
| | మొత్తం | 79,60,214 | 24,83,470 | 8,17,996 | 46,58,748 |

| 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|
| తెలంగాణా : | | | | |
| 3. హైదరాబాదు | 27,91,762 | 3,52,234 | 6,23,734 | 18,15,794 |
| 4. నిజామాబాద్ | 13,13,268 | 3,93,531 | 2,04,983 | 7,14,754 |
| 5. మెదక్ | 14,67,944 | 5,19,275 | 1,50,292 | 7,98,377 |
| 6. మహబూబ్‌నగర్ | 19,32,082 | 7,13,457 | 1,94,475 | 10,24,15 |
| 7. నల్గొండ | 18,19,738 | 6,01,388 | 2,12,512 | 10,05,838 |
| 8. వరంగల్లు | 18,70,933 | 5,74,316 | 2,23,407 | 10,73,210 |
| 9. ఖమ్మం | 13,69,892 | 4,14,109 | 1,48,458 | 8,07,325 |
| 0. కరీంనగర్ | 19,63,928 | 6,15,635 | 2,90,245 | 10,58,048 |
| 1. ఆదిలాబాదు | 12,88,348 | 3,87,884 | 1,51,602 | 7,48,862 |
| మొత్తం | 1,58,17,895 | 45,71,829 | 21,99,708 | 90,46,358 |
| ఆంధ్రప్రదేశ్ | 4,35,02,708 | 1,26,23,386 | 53,82,613 | 2,54,96,709 |

మూలం : భారతదేశ జనాభా లెక్కలు, 1971 భాగం II-A ఆంధ్రప్రదేశ్

కార్మికుల వివరాలను చూస్తే రాష్ట్రంలో ఇతర రంగాలలో కంటె వ్యవసాయ రంగం లోనే వీరు ఎక్కువగా ఉన్నట్లు గమనించవచ్చు. ఈరంగంలో పనిచేసేవారిని స్థూలంగా వ్యవసాయదారులని, వ్యవసాయ కార్మికులని రెండు వర్గాలుగా విభజించవచ్చు. 1971 జనాభా లెక్కల ప్రకారం జిల్లాలవారీగా వీరి వివరాలిట్లా ఉన్నాయి.

రాష్ట్రంలో మిగిన జిల్లాలకంటె విశాఖపట్నంలో వ్యవసాయదారులెక్కువ, నెల్లూలో తక్కువ. కాని కార్మికులు తూర్పుగోదావరిలో ఎక్కువ, నిజామాబాదులో తక్కువ. ఈ రంగంలోని శ్రామికుల పూర్తి వివరాలను దిగువ పట్టికలో చూడవచ్చు.

| వ. సం. | జిల్లా | వ్యవసాయదారులు | కార్మికులు | మొత్తం |
|---|---|---|---|---|
| | కోస్తా ఆంధ్రా : | | | |
| 1. | శ్రీకాకుళం | 4,27,931 | 4,17,827 | 8,45,758 |
| 2. | విశాఖపట్నం | 4,89,822 | 3,18,817 | 8,08,739 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 3. తూర్పుగోదావరి | 2,49,221 | 5,35,422 | 7,84,643 |
| 4. పశ్చిమగోదావరి | 2,16,315 | 4,82,320 | 6,98,635 |
| 5. కృష్ణా | 2,07,903 | 4,18,296 | 6,26,199 |
| 6. గుంటూరు | 2,80,663 | 4,97,360 | 7,78,032 |
| 7. ప్రకాశం | 2,24,832 | 3,24,341 | 5,49,173 |
| 8. నెల్లూరు | 1,65,326 | 3,11,591 | 4,76,917 |
| మొత్తం | 22,62,013 | 33,06,074 | 55,68,087 |
| **రాయలసీమ :** | | | |
| 9. కర్నూలు | 2,25,086 | 4,01,250 | 6,26,336 |
| 10. అనంతపూరు | 3,26,992 | 3,46,090 | 6,73,082 |
| 11. కడప | 2,02,869 | 2,55,165 | 4,58,034 |
| 12. చిత్తూరు | 4,08,399 | 3,17,619 | 7,26,018 |
| మొత్తం | 11,63,346 | 13,20,124 | 24,83,470 |
| **తెలంగాణా :** | | | |
| 13. హైదరాబాదు | 1,83,282 | 1,68,952 | 3,52,234 |
| 14. నిజామాబాదు | 2,40,215 | 1,53,316 | 3,93,531 |
| 15. మెదక్ | 2,96,881 | 2,22,394 | 5,19,275 |
| 16. మహబూబ్‌నగర్ | 3,62,432 | 3,51,025 | 7,13,457 |
| 17. నల్గొండ | 2,99,490 | 3,01,898 | 6,01,388 |
| 18. వరంగల్ | 2,76,766 | 2,97,550 | 5,74,316 |
| 19. ఖమ్మం | 1,81,697 | 2,32,412 | 4,14,106 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 20. కరీంనగర్ | 3,17,581 | 2,98,054 | 6,15,635 |
| 21. ఆదిలాబాద్ | 2,10,998 | 1,76,886 | 3,87,884 |
| మొత్తం | 23,69,342 | 22,02,487 | 45,71,829 |
| ఆంధ్రప్రదేశ్ | 57,94,701 | 68.28,685 | 1,26,23,386 |

వ్యవసాయేతర రంగాలలోని కార్మికులను స్థూలంగా 7 వర్గాలుగా విభజించి చెప్ప వచ్చు. 1. గనులు, క్వారియింగ్, పశుపోషణ, అటవీశాఖ, మత్స్యపరిశ్రమ తదితర అనుబంధ రంగాలు 2. గృహపరికరాలు తయారుచేసే పరిశ్రమలు 3. మిగిలిన రకాల పనిముట్లు తయారుచేసే పరిశ్రమలు 4. నిర్మాణము 5. వర్తక వాణిజ్యాలు 6. రవాణా, నిల్వ, వార్తా ప్రసారరంగాలు 7. ఇతర రంగాలు.

జిల్లాలవారీగా చూస్తే మొదటి వర్గానికి సంబంధించిన కార్మికులు తూర్పుగోదావరిలో ఎక్కువ, కర్నూలులో తక్కువ. రెండవ వర్గానికి సంబంధించినవారు కరీంనగర్‌లో ఎక్కువ, ఆదిలాబాదులో తక్కువ. మూడవవర్గానికి సంబంధించి హైదరాబాదులో ఎక్కువ, మహబూబ్ నగర్ తక్కువ. నాలుగో వర్గంవారు కూడా హైదరాబాదులో ఎక్కువ, అయితే తక్కువ మంది మెదక్‌లో ఉన్నారు. ఐదవవర్గం వారుకూడా హైదరాబాదులోనే ఎక్కువమంది ఉన్నారు, తక్కువమంది ఆదిలాబాదులో ఉన్నారు. పై ఆరు వర్గాలకు చెందని శ్రామికులు కూడా హైదరాబాదులోనే ఎక్కువమంది ఉన్నారు, మెదక్‌లో తక్కువమంది ఉన్నారు. హైదరాబాదు నగరం పారిశ్రామికంగా అభివృద్ధి చెందడమే కాకుండా, నగరీకరణం ధోరణి కూడా ఇక్కడ ఎక్కువైన కారణంగా వ్యవసాయేతర రంగాలలోని శ్రామికులు ఇక్కడ ఎక్కువమంది ఉన్నారు. ముఖ్యంగా పనిముట్ల తయారీ, వర్తకవాణిజ్యాలు, రవాణాసౌకర్యాలు ఇక్కడ ఎక్కువైన కారణంగా కార్మికుల సంఖ్య కూడా అధికంగానే ఉంది.

జిల్లాలవారీగా వ్యవసాయేతర రంగాలలో పనిచేసేవారి సంఖ్యల వివరాలను దిగువ పట్టికలో చూడవచ్చు. పైన సూచించిన 7 వర్గాలవారీగా కార్మికుల సంఖ్యలను వేలలో సూచించాం.

| వ. సం. | జిల్లా | వర్గాలు | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మొత్తం |
| 1. | శ్రీకాకుళం | 42.7 | 55.01 | 14.8 | 4 4 | 55.5 | 12.7 | 74.0 | 259.3 |
| 2. | విశాఖపట్నం | 30.3 | 48.7 | 41.3 | 11.6 | 57.7 | 44.7 | 97.2 | 331.7 |
| 3. | తూర్పుగోదావరి | 52.5 | 52.3 | 61.3 | 13.6 | 84 9 | 30.7 | 103.0 | 398.6 |
| 4. | పశ్చిమగోదావరి | 29.4 | 27.7 | 44.7 | 9.5 | 56.3 | 18 9 | 78.7 | 265.5 |
| 5. | కృష్ణా | 27.2 | 34.1 | 52.6 | 22.6 | 67.7 | 37.7 | 87.7 | 329.9 |
| 6. | గుంటూరు | 25.3 | 40.7 | 80.9 | 21.2 | 73.4 | 29.1 | 95.1 | 365 9 |
| 7. | ప్రకాశం | 37.2 | 38.9 | 33.1 | 14.09 | 38.07 | 10 3 | 56 05 | 228 03 |
| 8. | నెల్లూరు | 29.2 | 23.3 | 25.9 | 7 4 | 34.05 | 15.1 | 50.4 | 185.6 |
| | కోస్తాఆంధ్ర మొత్తం | 274.1 | 321.05 | 354.9 | 104.8 | 467.9 | 199.6 | 642.3 | 2364.9 |
| 9. | కర్నూలు | 15.6 | 40.9 | 24.5 | 17.6 | 44.9 | 12.4 | 56.9 | 213.3 |
| 10. | అనంతపురం | 27.5 | 45.1 | 18.2 | 15.6 | 41.8 | 16.2 | 52.3 | 217.08 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 11. | కడప | 19.3 | 40.01 | 19.1 | 8.7 | 32.3 | 9.9 | 44.6 | 174.2 |
| 12. | చిత్తూరు | 29.4 | 31.3 | 25.9 | 10.3 | 41.6 | 15.4 | 59.06 | 213.3 |
| | రాయలసీమ మొత్తం | 92.06 | 157.5 | 87.9 | 52.4 | 160.8 | 54.1 | 213.05 | 817.9 |
| 13. | హైదరాబాదు | 38.4 | 29.2 | 117.7 | 30.2 | 127.8 | 74.4 | 205.7 | 623.7 |
| 14. | నిజామాబాదు | 28.9 | 47.1 | 39.4 | 11.7 | 30.9 | 9.8 | 36.8 | 204.9 |
| 15. | మెదక్ | 32.4 | 36.07 | 12.9 | 4.2 | 25.4 | 4.5 | 34.5 | 150.2 |
| 16, | మహబూబ్‌నగర్ | 36.0 | 61.7 | 7.7 | 8.7 | 33.02 | 6.2 | 41.02 | 194.4 |
| 17. | నల్గొండ | 40.2 | 48.5 | 22.9 | 18.1 | 33.2 | 5.4 | 43.8 | 212.5 |
| 19. | వరంగల్లు | 31.5 | 47.7 | 34.6 | 9.2 | 30.9 | 17.5 | 51.6 | 223.4 |
| 19. | ఖమ్మం | 33.1 | 20.9 | 10.1 | 15.4 | 22.9 | 7.1 | 38.5 | 148.5 |
| 20. | కరీంనగర్ | 47.4 | 81.2 | 40.5 | 23.07 | 29.1 | 8.9 | 59.7 | 290.2 |
| 21. | ఆదిలాబాదు | 34.5 | 21.6 | 26.1 | 7.04 | 20.2 | 5.5 | 36.4 | 151.6 |
| | తెలంగాణా మొత్తం | 322.5 | 394.3 | 312.3 | 128.03 | 853.9 | 139.7 | 548.4 | 2199.7 |
| | మొత్తం ఆంధ్రప్రదేశ్ | 689.08 | 872.9 | 755.2 | 285.3 | 382.6 | 393.5 | 1403.8 | 5382.6 |

మూలం : స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్ట్

కార్మికుల ధోరణులను గమనిస్తే క్రమంగా జనాభాలో వీరిశాతం తగ్గుతున్నట్లు తెలుస్తున్నది. వ్యవసాయ రంగంలోని కార్మికుల శాతం వ్యవసాయేతర రంగాలలోని కార్మికుల శాతంకంటె ఎక్కువగా తగ్గుతున్నది. ఈ కారణాలవల్ల కార్మికులు కానివారి శాతం పెరుగుతున్నది. ఉదాహరణగా 1961, 1971 జనాభా లెక్కల నుంచి గణించిన వివరాలను మూడు ప్రాంతాలవారీగా సంక్షిప్తరూపంలో దిగువ పట్టికలో పొందుపరిచాము. ఇక్కడ చూపిన సంఖ్యలు మొత్తం జనాభాకు లెక్కగట్టిన శాతాలు.

| వ. సం. | ప్రాంతాలు | కార్మికులు | | | | మొత్తం | | కార్మికులు కానివారు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయరంగం | | వ్యవసాయేతరరంగాలు | | | | | |
| | | 1961 | 1971 | 1961 | 1971 | 1961 | 1971 | 1961 | 1971 |
| 1. | కోస్తాఆంధ్రా | 34.2 | 28.2 | 16.4 | 12.0 | 50.6 | 40.2 | 49.4 | 59.8 |
| 2. | రాయలసీమ | 38.5 | 31.2 | 13.3 | 10.2 | 51.6 | 41.5 | 48.4 | 58.5 |
| 3. | తెలంగాణా | 35.9 | 28.9 | 16.2 | 13.9 | 53.6 | 42.8 | 57.2 | 48.1 |
| 4. | ఆంధ్ర ప్రదేశ్ మొత్తం | 35.6 | 29.0 | 16.2 | 12.4 | 51.9 | 41.4 | 48.1 | 58.6 |

# కార్మికరంగాలు

## వ్యవసాయరంగం

మొదటినుంచీ, మనరాష్ట్రం ప్రధానంగా వ్యవసాయరంగం మీదనే ఆధారపడుతూ వస్తున్నది. రాష్ట్రంలో అత్యధికభాగం గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్నారు. ఉదాహరణకు 1971 జనాభా లెక్కలను బట్టి రాష్ట్రంలో 80.69 శాతం గ్రామీణ ప్రాంతాలలోను, మిగిలిన 19.31 శాతం పట్టణాలలోను ఉన్నారు. గ్రామీణ ప్రాంతాలలో నివసించే శ్రామికులలో అత్యధికభాగం వ్యవసాయ రంగంలోని శ్రామికులు. అయితే ఈ రంగంలో నానాటికీ శ్రామికులశాతం తగ్గుముఖం పట్టుతున్నట్లు తెలుస్తున్నది. వ్యవసాయ రంగంలో ఆధునిక పద్ధతులు, పరికరాలు ప్రవేశపెట్టడం ఈ తగ్గుదలకు ప్రధాన కారణమని చెప్పవచ్చు. ఈ కారణంగా వ్యవసాయ రంగంలోని కార్మికులు శ్రామికేతరులుగానో, పాక్షిక నిరుద్యోగులుగానో ఉండిపోతున్నారు. జిల్లాలవారీగా మొత్తం జనాభాతో వ్యవసాయ రంగంలో పనిచేసే శ్రామికుల శాతాలను 1961 1971 సంవత్సరాల లెక్కలప్రకారం చూపినాము.

| వ. సం. | జిల్లా | కార్మికుల శాతం | |
|---|---|---|---|
| | | 1961 | 1971 |
| 1 | 2 | 3 | 4 |
| 1. | శ్రీకాకుళం | 43.2 | 32.7 |
| 2. | విశాఖపట్నం | 37.9 | 28.8 |
| 3. | తూర్పుగోదావరి | 28.4 | 25.4 |
| 4. | పశ్చిమగోదావరి | 32.6 | 29.4 |
| 5. | కృష్ణా | 30.6 | 25.1 |
| 6. | గుంటూరు | 31.9 | 27.3 |
| 7. | ప్రకాశం | -- | 28.6 |
| 8. | నెల్లూరు | 35.8 | 29.6 |
| కోస్తా ఆంధ్రా మొత్తం | | 34.2 | 28.2 |
| 9. | కర్నూలు | 36.0 | 31.6 |
| 10. | అనంతపూరు | 38.4 | 31.8 |
| 11. | కడప | 37.4 | 29.0 |
| 12. | చిత్తూరు | 41.6 | 31.8 |
| రాయలసీమ మొత్తం | | 38.5 | 31.2 |
| 13. | హైదరాబాదు | 16.9 | 12.6 |
| 14. | నిజామాబాదు | 39.8 | 30.0 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 15. | మెదక్ | 44.1 | 35.4 |
| 16. | మహబూబ్‌నగర్ | 42 1 | 36.9 |
| 17. | నల్గొండ | 40.7 | 33.0 |
| 18. | వరంగల్ | 38.9 | 30.7 |
| 19. | ఖమ్మం | 38.1 | 30.2 |
| 20. | కరీంనగర్ | 35.1 | 31.3 |
| 21. | ఆదిలాబాదు | 38.3 | 30.1 |
| తెలంగాణా మొత్తం | | 35.9 | 28.9 |
| ఆంధ్రప్రదేశ్ మొత్తం | | 35 3 | 29 0 |

వ్యవసాయ రంగంలో పనిచేస్తున్న శ్రామికులలో 21,26,833 మంది షెడ్యూల్డ్ కులాలవారు, 3,83,595 మంది షెడ్యూల్డ్ జాతులకు చెందినవారు.

పారిశ్రామిక కార్మికులకోసం కనీసవేతన చట్టం వచ్చిన పరిమిలా దీనిని వ్యవసాయ రంగానికి కూడా విస్తరింప జేయాలని ఎన్నో ప్రయత్నాలు జరిగినాయి. చివరికి 1971 లో రాష్ట్ర ప్రభుత్వం నియమించిన కనీస వేతనాల పరిశీలనాసంఘం సిఫారసులను దృష్టిలో ఉంచుకొని వ్యవసాయ కార్మికులకు కనీస వేతనాలు నిర్ణయిస్తూ 1974 లో ఒక ప్రకటన చేయడం జరిగింది. అయితే ఈ వేతనాలు 2-12-1975 నుంచి అమలులోకి వచ్చాయి.

## వ్యవసాయేతర రంగాలు

ముందు పేజీలలో ఇచ్చిన వివరాలు కాకుండా ఈ రంగాలలో పనిచేస్తున్న కార్మికుల వివరాలు కొన్ని ఇక్కడ క్లుప్తంగా పొందుపర్చాం.

1. రాష్ట్రంలో 1976-77 నాటికి 5.7 లక్షల మంది కార్మికులు ఫ్యాక్టరీలలో పనిచేస్తున్నారు.

2. చిన్నతరహా పరిశ్రమలలో 1.9 లక్షలమంది పనిచేస్తున్నారు.

3. హోటళ్లు మొదలైన వాటిలో పనిచేస్తున్నవారి సంఖ్య దాదాపు 4.1 లక్షలు.

4. దాదాపు 1.08 లక్షలమంది బీడీ, చుట్ట వగైరాలు తయారుచేస్తున్న సంస్థలలో పనిచేస్తున్నారు.

5. దుకాణాలు తదితర ఎంటర్ ప్రైజెస్‌లో పనిచేస్తున్న వారిసంఖ్య 2.1 లక్షలు.

6. బొగ్గు గనులలో 1977 నాటికి సగటున రోజుకు 40,552 మంది పనిచేస్తున్నారు. వివిధ గనులలో పనిచేస్తున్నవారి సంఖ్యల వివరాలను దిగువ పట్టికలో చూడవచ్చు.

| వ.సం. | గనులు | 1973 | 1974 | 1975 | 1976 | 1977 |
|---|---|---|---|---|---|---|
| 1. | కొత్తగూడెం, రుద్రంపురం | 6,563 | 6,849 | 7,624 | 7,887 | 7,689 |
| 2. | బెల్లంపల్లి | 5,623 | 5.743 | 6,240 | 6,836 | 7,145 |
| 3. | మందమర్రి | 3.738 | 3,980 | 4,218 | 4,607 | 4,974 |
| 4. | రామగుండం | 6,130 | 6,717 | 8,319 | 9,903 | 11,107 |
| 5. | ఎల్లందు | 3,294 | 3,508 | 3,805 | 4,172 | 4,089 |
| 6. | రామకృష్ణాపురం | 2,610 | 2,802 | 3,060 | 3,530 | 4,865 |
| 7. | మణుగూరు | .... | .... | 125 | 304 | 683 |
| | మొత్తం | 27,958 | 29,599 | 33,391 | 37,239 | 40,552 |

మూలం : జనరల్ మేనేజర్, ది సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్, హైదరాబాదు.

వివిధ కర్మాగారాలు, సంస్థలు మొదలైన వాటిలో రోజుకు పనిచేస్తున్నవారి సగటు సంఖ్య, ప్రాంతాలవారీగా. ఈ వివరాలు 1977 వి.

| వ.సం | సంస్థలరకం | కోస్తాఆంధ్రా | | రాయలసీమ | | తెలంగాణ | | ఆంధ్రప్రదేశ్ | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | సంస్థల సంఖ్య | కార్మికుల సంఖ్య | సంస్థల సంఖ్య | కార్మికుల సంఖ్య | సంస్థల సంఖ్య | కార్మికుల సంఖ్య | సంస్థల సంఖ్య | కార్మికుల సంఖ్య |
| 1. | ఆహారపదార్థాలతయారీ | 2,631 | 43,652 | 378 | 8,230 | 1,012 | 27,663 | 4,021 | 79,545 |
| 2. | మత్తుపానీయాలు, పొగాకు ఉత్పత్తులు | 257 | 78,567 | 11 | 762 | 29 | 5,299 | 297 | 84,628 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|
| 3. నూలువస్త్రాలు | 145 | 8,238 | 77 | 8,144 | 49 | 9,968 | 271 | 26,350 |
| 4. ఉన్ని, పట్టు, సింథటిక్ వస్త్రాలు | 10 | 118 | 33 | 423 | 4 | 2,342 | 47 | 2,883 |
| 5. జనుము, గంజాయి, మేస్టాలనారవస్త్రాలు | 11 | 12,317 | .... | .... | 1 | 34 | 12 | 12,351 |
| 6. వస్త్రోత్పత్తులు, దుస్తులు | 14 | 1,667 | 2 | 21 | 1 | 9 | 17 | 1,697 |
| 7. కర్రసామగ్రులు | 395 | 2,397 | 105 | 497 | 339 | 2,238 | 839 | 5,132 |
| 8. కాగితాలు, ముద్రణ, తదితర పరిశ్రమలు | 384 | 4,990 | 123 | 887 | 420 | 10,746 | 927 | 16,673 |
| 9. చర్మ పరిశ్రమలు | 7 | 190 | ... | .... | 5 | 184 | 12 | 374 |
| 10. రబ్బరు, ప్లాస్టిక్, పెట్రోలియమ్, బొగ్గు నుంచి వస్తూత్పత్తి | 24 | 1,348 | 2 | 40 | 19 | 1,698 | 45 | 3,086 |
| 11. పెట్రోలియమ్, బొగ్గు,రసాయనిక ఉత్పత్తులు | 50 | 4,153 | 28 | 737 | 74 | 25,264 | 182 | 30,154 |
| 12. లోహాలుకాని ఖనిజాలనుంచి వస్తూత్పత్తి | 187 | 6,641 | 39 | 1,407 | 56 | 6,789 | 282 | 14,837 |
| 13. లోహపరిశ్రమలు | 90 | 3,013 | 4 | 79 | 66 | 4,167 | 160 | 6,259 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|
| 14. లోహపు విడిభాగాల తయారీ (యంత్రపరికరాలు, రవాణాకాకుండా) | 60 | 975 | 15 | 138 | 47 | 1,118 | 122 | 2,232 |
| 15. యంత్రాలు, యంత్ర సామగ్రి | 421 | 7,962 | 100 | 492 | 168 | 16,758 | 689 | 25,212 |
| 16. విద్యుత్పరికరాలు, భాగాలు | 19 | 639 | 3 | 214 | 35 | 8,032 | 57 | 9,035 |
| 17. మోటార్ల పరికరాలు, భాగాలు | 52 | 9,368 | 1 | 278 | 9 | 10,789 | 62 | 20,435 |
| 18. ఇతర వస్తూత్పత్తి పరిశ్రమలు | 15 | 959 | 2 | 60 | 18 | 1,461 | 35 | 2,480 |
| 19. విద్యుచ్ఛక్తి | 3 | 381 | .... | .... | 7 | 2,577 | 10 | 2.958 |
| 20. గ్యాస్, స్టీమ్ | 7 | 217 | .... | .... | 1 | 58 | 8 | 275 |
| 21. నీటి సరఫరా | 2 | 30 | .... | .... | 2 | 40 | 4 | 70 |
| 22. మరమ్మత్తులు | 232 | 5,591 | 65 | 1,371 | 120 | 6,366 | 417 | 13,328 |

మూలం : ఛీఫ్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ ఫ్యాక్టరీస్ అండ్ బాయిలర్స్, ఆంధ్రప్రదేశ్

## బాలకార్మికులు

కార్మికులలో వివిధ వయోసమూహాలకు చెందినవారుంటారు. ఈ సమూహాల రకాలు వ్యవసాయ రంగంలో కొట్టొచ్చినట్లుగా కనిపిస్తాయి. సాధారణంగా 14 సంవత్సరాలలోపు కార్మికుల నందరిని కలిపి బాలకార్మిక సమూహంగా పరిగణిస్తారు. గ్రామీణ జనాభాలో వీరి కున్న నిష్పత్తిని బట్టి రాష్ట్ర ఆర్థిక రంగంలో ముఖ్యంగా వ్యవసాయ రంగంలో వీరి పాత్రను గుర్తించవలసిన అవసరముంది.

1971 జనాభా లెక్కల ప్రకారం మనరాష్ట్రంలో 16 2 లక్షల మంది బాలకార్మికు లున్నారు. వీరిలో 10.5 లక్షలమంది బాలురు, 5 7 లక్షలమంది బాలికలు. గ్రామీణ జనాభా మొత్తానికి చూస్తే బాల కార్మికుల శాతం స్త్రీ పురుష భేదాలరీత్యా చూస్తే పురుష కార్మికులలో బాలురశాతం 8 2 స్త్రీ కార్మికులలో బాలికల శాతం 10.99. దీనిని బట్టి బాలికలు ఎక్కువగా శ్రామికత్వానికి గురిఅవుతున్నట్లు భావించవచ్చు.

ఇక కార్మికరంగాల రీత్యాచూస్తే బాలకార్మికులు ఎక్కువగా వ్యవసాయ రంగంలోనే పనిచేస్తున్నట్లు తెలుస్తున్నది 11 6 లక్షల మంది వ్యవసాయరంగంలో పనిచేస్తున్నారు. ఇతర రంగాలలోని బాలకార్మికుల సంఖ్య దాదాపు 4.6 లక్షలు మాత్రమే. వ్యవసాయరంగంలోఉన్న శ్రామికులలో 3.4 లక్షల మంది వ్యవసాయదారులు, 8.2 లక్షల మంది కార్మికులు. దేశ జనాభా ధోరణిలాగానే బాలకార్మికులు కూడా అత్యధిక భాగం గ్రామీణ ప్రాంతాలలోనే పనిచేస్తున్నారు.

## కార్మికసంక్షేమం

రాష్ట్రంలోని కార్మిక రంగానికి సంబంధించి రాష్ట్రస్థాయిలో ఒక కార్మికశాఖ ఉంది. దీనికి అధిపతిగా ఒక ఐ. ఏ. ఎస్ అధికారి ఉంటాడు. ఇతనిని లేబర్ కమీషనర్ అంటారు. ఇతనికింద ఇద్దరు జాయింట్ కమిషనర్లు ఉంటారు. వీరి అజమాయిషీ కింద అసిస్టెంట్ కమిషనర్ల స్థాయిలో 9 మంది అధికారులు, వారివారి కార్యాలయ సిబ్బంది ఉంటారు. ఈ స్థాయిలో ఉన్న అధికారుల వివరాలివి.

1. అసిస్టెంట్ కమిషనర్ ఆఫ్ లేబర్ (అడ్మినిస్ట్రేషన్)
2. అసిస్టెంట్ కమిషనర్ ఆఫ్ లేబర్ (ఇవాల్యూయేషన్ & ఇంప్లిమెంటేషన్)
3. అసిస్టెంట్ కమిషనర్ ఆఫ్ లేబర్ (ఉమెన్ సెల్)
4. అసిస్టెంట్ చీఫ్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ ఎస్టాబ్లిష్‌మెంట్స్
5. స్టాటిస్టికల్ ఆఫీసర్
6. అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్ (ఎస్. ఐ. హెచ్. ఎస్)
7. సెక్రటరీ, మినిమమ్ వేజెస్ కమిటీస్
8. సెక్రటరీ, ఏ. పి. స్టేట్ కాంట్రాక్ట్ లేబర్ అడ్వైజరీ బోర్డ్

9. సెక్రటరీ, అడ్వైజరీ కమిటీ అండర్ ముత్త, ఒట్టు, అండ్ అదర్ మాన్యువల్ వర్కర్స్ ఆక్ట్, 1976.

రాష్ట్రాన్ని ఫీల్డ్‌స్థాయి పరిపాలన నిమిత్తం 7 మండలాలుగా విభజించినారు. ఈ ఏడు మండలాలకు డిప్యూటీ కమిషనర్ ఆఫ్ లేబర్ అనేపేరిట ఏరుగురు అధికారులుంటారు. విశాఖపట్నం, ఏలూరు, గుంటూరు, కర్నూలు, వరంగల్లు పట్టణాలతోబాటు రంగారెడ్డిజిల్లాకు ఒకటి, జంటనగరాలకు మరొకటి చొప్పున హైదరాబాదులో రెండు మొత్తం ఏడు కేంద్ర కార్యాలయాలున్నాయి. వీరుకాక 23 మంది అసిస్టెంట్ కమిషనర్లు, 26 మంది లేబర్ ఆఫీసర్లు ఉన్నారు. వీరికి ఒక్కొక్కరికి ఒక్కొక్క సర్కిల్ చొప్పున ఉంటుంది.

కార్మికరంగానికి చెందిన చట్టాల, పరిహారాలు మొదలైన నియమ నిబంధనలు అమలు జరిగేటట్లు చూడటమే కాకుండా కోడ్ ఆఫ్ డిసిప్లిన్ కింద ఎన్నికలు జరిపించడం మొదలైనవి కూడా నిర్వహిస్తుంటారు.

రాష్ట్రంలో 12 కార్మిక సంక్షేమ కేంద్రాలున్నాయి. వీటిలో నాలిగింటిని జంటనగరాల లోని అజామాబాదు, ముషీరాబాదు, సనత్‌నగర్, సీతాఫల్‌మండీలలోను, మిగిలిన ఎనిమిదిం టిని విశాఖపట్నం, రాజమండ్రి, విజయవాడ, గుంటూరు, ఆదోని, వరంగల్లు, సిర్‌పూర్-కాగజ్‌నగర్, నిజామాబాదులలోను నెలకొల్పారు. ఇవి అసిస్టెంట్ కమిషనర్ ఆఫ్ లేబర్ అజమాయిషీ కింద ఉన్నాయి. ప్రతి కేంద్రానికి ఒక వెల్‌ఫేర్ ఆర్గనైజర్ ఉన్నారు. పారిశ్రా మిక శ్రామికులకు వారి కుటుంబాలకు వినోద, విజ్ఞాన, విద్యాసదుపాయాలను అందించడం ఈ కేంద్రాల ప్రధానోద్దేశం. ఈ ఉద్దేశ పరిపూర్తికిగాను 1. పయోజనవిద్య 2. శ్రమదృశ్య విభాగం 3. క్రీడలు 4. చేతిపని, కళలు 5. నర్సరీ పాఠశాల 6. ఆరోగ్య విభాగం అని ఆరు విభాగాలున్నాయి.

రాష్ట్ర కార్మికశాఖ నిర్వహించే విధులు, అమలు జరిపే చట్టాలు, ఇతర కార్యకలాపాలు మొదలైన వాటిలో కొన్నిటిని ఇక్కడ పేర్కొన్నాము.

1. పారిశ్రామిక వివాదాల చట్టం
2. ట్రేడ్‌యూనియన్ల చట్టం
3. బోనస్‌చట్టం
4. వర్క్‌మెన్స్ కాంపెన్సేషన్‌చట్టం
5. శ్రామికులకు న్యాయశాస్త్ర సంబంధ సలహాలు, సహాయాలు
6. కనీస వేతనాలచట్టం
7. మోటార్స్ ట్రాన్స్‌పోర్ట్ వర్కర్స్ చట్టం
8. ఇండస్ట్రియల్ హౌసింగ్ పథకాలు
9. కార్మికులకు విద్యా సౌకర్యాలు
10. కోడ్ ఆఫ్ డిసిప్లిన్

11. వివాదాల పరిష్కారాలు

12. బహుమతులు, ఒప్పందాలు అమలుపరచడం

13. కాంట్రాక్ట్ లేబర్ చట్టం

ఈ శాఖ 1978 సంవత్సరంలో నిర్వహించిన కార్యకలాపాలలో కొన్నిటిని ఉదాహరణలుగా దిగువ చూపడమైనది.

***1. మోటార్ ట్రాన్స్‌పోర్టు చట్టం :*** లోగడ 7008 మోటార్ ట్రాన్‌స్పోర్టు సంస్థలుండేవి. 1978 లో 801 కొత్తవాటిని నమోదు చేయించడం, 1106 సంస్థలను రిజిస్టర్‌నుంచి తొలిగించడం జరిగింది. రిజిస్ట్రర్లకు, రెన్యూయిన్లకు గాను మొత్తం రూ. 91,943-51 పైసలు వసూలుచేయడం జరిగింది. 15 యూనిట్లలో 20 కాంటీన్లు, 73 యూనిట్లలో 131 విశ్రాంతి గదులను, 12 యూనిట్లలో డిస్పెన్సరీలను నెలకొల్పడం జరిగింది. ఈ సంవత్సరంలో 5,556 తనిఖీలు జరిగినాయి. పనివేళలు, భోజనవిరామాలు, సెలవులువంటి నిబంధనలను పాటించని కారణంగా కొన్ని సంస్థలకు జరిమానాలు విధించడం జరిగింది. ఈ విధంగా 23,751 రూపాయలు ప్రభుత్వం వసూలు చేసింది. ఏ. పి. యస్. ఆర్. టి.సి.కి సంబంధించి 24 ఫిర్యాదులను పరిష్కరించడం జరిగింది.

***2. కనీసవేతనాల చట్టం :*** ఈ చట్టంకింద 33 రకాల వృత్తులను చేర్చడం జరిగింది. కనీసవేతనాల సలహాబోర్డ్ 1978 లో 10 సమావేశాలు జరిపింది. ఈ సంవత్సరకాలంలో 79,880 వృత్తుల తనిఖీలు జరిగినాయి. 719 కేస్‌లను పరిష్కరించడం జరిగింది. 151 ఫిర్యాదులను పరిష్కరించడం జరిగింది.

***3. ఆంధ్రప్రదేశ్ షాప్స్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్స్ చట్టం :*** ఈ చట్టాన్ని 1978 లో 33 మునిసిపాలిటీలలో, 235 పంచాయతీలలోనే కాకుండా మరో 82 స్థలాలలో ఈ చట్టాన్ని అమలుపరచడం జరిగింది. 31-12-78నాటికి రాష్ట్రంలో 1,69,172 సంస్థలున్నాయి. 2,07,354 మంది వీటిలో పనిచేస్తున్నారు ఈ సంవత్సరకాలంలో 10,107 ప్రాసిక్యూషన్లకు దాఖలాపరచడం జరిగింది. వీటిలో 9,120 కేస్‌లను న్యాయస్థానాలు పరిష్కరించినాయి. వచ్చిన 559 ఫిర్యాదులలో 499 కేస్‌లను పరిష్కరించడం జరిగింది.

***4. పారిశ్రామిక వివాదాల చట్టం :*** 1978లో 1540 వివాదాలను దర్యాప్తుచేయడం జరిగింది. ఈ సంవత్సరంలో జరిగిన సమ్మెలు లాకౌట్ల వివరాలివి.

| | సంఖ్య | పాల్గొన్న కార్మికులు | నష్టమైన మనిషి పనిదినాలు (Loss of man days) |
|---|---|---|---|
| సమ్మెలు | 100 | 43,061 | 5,63,393 |
| లాకౌట్లు | 17 | 9,903 | 1,10,370 |
| మొత్తం | 117 | 52,964 | 6,73,763 |

వేతనాలు, జీతాలు, బోనస్‌లు ఎక్కువ కావలెనని, ఇంకా మంచి సౌకర్యాలు కలగ జేయవలెనని కోరుతూనే కాకుండా ఉద్యోగుల బర్తరఫ్, గ్రాట్యుటీ చెల్లించక పోవడం మొదలైన వాటి కారణంగా కూడా సమ్మెలు సాగాయి.

రాష్ట్రప్రభుత్వం పారిశ్రామిక సంస్థలకు సంబంధించి కార్మిక వివాదాల పరిస్థితి ఇట్లా ఉంది :

| సంవత్సరం | వివాదాల సంఖ్య | వివాదాలకు సంబంధించిన కార్మికులు | నష్టమైన మనిషి పనిదినాలు |
|---|---|---|---|
| 1976 | 28 | 15,853 | 1,02,098 |
| 1977 | 53 | 31,898 | 5,77,232 |
| 1978 | 69 | 35,220 | 2,64,188 |
| 1979 | 63 | 31,643 | 2,82,951 |

మూలం : కమిషనర్ ఆఫ్ లేబర్, హైదరాబాద్.

**5.** *కార్మికుల నష్టపరిహార చట్టం :* 1978 సంవత్సరాంతానికి 279 మరణానికి దారితీసిన కేస్‌లున్నాయి. వాటిలో 228 కేసులను పరిష్కరించడం జరిగింది. శాశ్వత అంగ వైకల్యానికి దారితీసిన కేస్‌లు 192. వీటిలో 50 కేస్‌లకు పరిష్కరించడం జరిగింది.

కార్మికుల సంక్షేమానికి కార్మిక శాఖనే కాకుండా ఇతర స్వచ్ఛంద సంస్థలు ప్రభుత్వ సంస్థలు ముందుకు వచ్చినాయి. నేడు కార్మికుల సంక్షేమానికి కలిగించిన సదుపాయాలలో కొన్నిటిని ఇక్కడ సూచిస్తున్నాం.

1. ఈ. ఎస్. ఐ ఆసుపత్రులు. ఇవి కార్మికుల ఆరోగ్యపరిరక్షణ నిమిత్తం ఏర్పరచిన వైద్యశాలలు.

2. ఆకాశవాణి కార్యక్రమాలు. కార్మికులకు పరిజ్ఞానం కలిగించేనిమిత్తం ఆకాశవాణి వారు ప్రతిరోజూ కార్మికుల కార్యక్రమాలను ప్రసారం చేస్తున్నారు. ఈ కార్యక్రమాల ద్వారా కార్మికులకు వినోదంతోబాటు విజ్ఞానదాయిక విషయాలను కూడా అందిస్తున్నారు.

3. కార్మిక వర్గానికి అక్షరాస్యత, విద్యాసౌకర్యం కలిగించడానికి శ్రామికవిద్యాపీఠ్ కేంద్ర కార్యాలయాలు రెండు మనరాష్ట్రంలో ఉన్నాయి.

4. వయోజన, నియతేతర విద్యాకార్యక్రమాల కింద రాష్ట్రప్రభుత్వం నిరక్షరాస్యులైన శ్రామికులకు అక్షరాస్యత కలిగించడమే కాకుండా వారుచేస్తున్న పనులకు, చేపట్టిన వృత్తులకు సంబంధించి ప్రయోజనాత్మక విద్యనుకూడా అందిస్తున్నది.

# ఉపాధికల్పన

పెరుగుతున్న జనాభాతో తులతూగే విధంగా ఉద్యోగావకాశాలు పెరగడంలేదు. ఈ పరిస్థితి చాలా దేశాలలో ఉంది. ముఖ్యంగా భారతదేశం వంటి వర్ధమాన దేశాలలో ఈ పరిస్థితి మరీ ఎక్కువ. ఈ దేశాలు మానవ శక్తి యుక్తులను గరిష్ఠస్థాయిలో ఉపయోగించుకోలేకపోతున్నాయి. ఈ కారణంగానే మనదేశంలో కూడా నిరుద్యోగ సమస్య ఉత్పన్నమై నానాటికీ తీవ్రరూపం దాలుస్తున్నది. ఈ పరిస్థితి దేశంలోని అన్ని రాష్ట్రాలలోను స్పష్టంగా కనిపిస్తున్నది. పెరుగుతున్న జనాభా, విస్తరిస్తున్న విద్యా సౌకర్యాలు విద్యకు, జీవనానికి మధ్యనున్న అంతరాలు, సరైన గమ్యాలు నేర్పచుకోలేని విద్యార్థులు, విద్యావంతులు వారి తల్లిదండ్రులు- ఇంకా ఎన్నో ఉన్నాయి. నిరుద్యోగ సమస్యకు దోహదం చేస్తున్న కారణాలు, కారకాలు. ఈ సమస్య కారణంగా నిరాశానిస్పృహలకులోనైన వారెందరో ఉన్నారు మనరాష్ట్రంలో. ఈ పరిస్థితి ప్రభావం ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఇతర రంగాల మీద పడి, ఆర్థిక, సామాజిక సమస్యలకు దారితీస్తున్నది.

> 31, ఆగస్టు 1980 నాటికి మనరాష్ట్రంలోని ఎంప్లాయ్‌మెంట్ ఎక్ఛేంజిల్లో ఉద్యోగాలకోసం నమోదు చేసుకొన్న వారి సంఖ్య 13.75 లక్షలు.

మనరాష్ట్రంలో నానాటికీ ఉపాధికల్పన పరిస్థితి క్షీణిస్తున్నట్లు సంఖ్యలు, సత్యాలవల్ల తెలియవస్తోంది. నిరుద్యోగులసంఖ్య సంవత్సరం సంవత్సరానికీ పెరిగిపోతున్నది. 1977 లో 8.09 లక్షలమంది ఉంటే, 1977 నాటికి అది 10.07 లక్షలకు పెరిగింది. 1979 నాటికి నిరుద్యోగుల సంఖ్య 12.61 లక్షలయింది. 1980 ఆగష్టునాటికి ఈ సంఖ్య 13.75 లక్షలకు చేరుకున్నట్టు తాజాగా తెలుస్తోంది.

ఈ సమస్యను గురించి ప్రస్తావిస్తున్నప్పుడు ఈ సమస్యను ఐదు భాగాలుచేసి పరిశీలించవలసిఉంది. I. ఉద్యోగాలు, కల్పించిన ఉద్యోగావకాశాలు II. ఎంప్లాయ్‌మెంట్ ఎక్ఛేంజ్‌లు-నిరుద్యోగులు III. నిరుద్యోగ నివారణ-విద్యావిధానంలో మార్పులు IV. నిరుద్యోగ సమస్యా పరిష్కారం-ప్రభుత్వం కృషి V. ప్రజలలో పరివర్తన.

## I ఉద్యోగాలు — కల్పించిన ఉద్యోగావకాశాలు

దేశవ్యాప్తంగా ప్రణాళికలను అనుసరించి సాగించిన ప్రగతి పథంలో భాగంగా ఉద్యోగావకాశాలు పెరిగాయి. కిందటి ప్రణాళికలో దేశవ్యాప్తంగా ఐదులక్షల మందికిపైగానే ఉద్యోగాలు లభించాయి. ఇవి మన రాష్ట్రానికి కూడా వర్తించాయి. ఇవికాక అభివృద్ధి చెందుతున్న పరిశ్రమలు, సెక్టార్‌లు, విద్య, వైద్యం వంటి రంగాలుకూడా ఎక్కువమొత్తాలలో ఉద్యోగావకాశాలనుకల్పించాయి. సౌలభ్యంకోసం మూడు శీర్షికలకిందవిభజించి వివరిస్తున్నాం.

*ప్రభుత్వోద్యోగాలు :* ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటినుంచి చూస్తే ప్రభుత్వోద్యోగాలు దాదాపు నాలుగురెట్లు పెరిగినట్లుతెలుస్తున్నది. నేడు దాదాపు 4 లక్షలమంది ఉద్యోగులున్నట్లు అంచనా. అయితే ప్రభుత్వ ఉద్యోగాలలో పనిచేస్తున్నవారి సంఖ్యా వివరాలను 1955నుంచి 1972 వరకు మాత్రమే దిగువపట్టికలో సూచించాం.

| సంవత్సరం | గెజిటెడ్ | నాన్ గెజిటెడ్ | మొత్తం |
|---|---|---|---|
| 1955-56 | 2,523 | 96,936 | 99,459 |
| 1965-66 | 5,950 | 2,05,715 | 2,11,665 |
| 1968-69 | 7,568 | 2,85,866 | 2,93,434 |
| 1970-71 | 8,007 | 2,89,506 | 2,97,513 |
| 1971-72 | 8,326 | 3,00,195 | 3,08,521 |

మూలం : ఇకనామిక్ & స్టాటిస్టికల్ బులెటిన్, 1972.

1972 తరవాతి ఉద్యోగుల సంఖ్యా వివరాలు అందుబాటులో లేనప్పటికీ ఎంప్లాయ్ మెంట్ ఎక్స్ఛేంజ్‌ల ద్వారారాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన ఖాళీలనుబట్టి ఉద్యోగావకాశాల పెరుగుదలను ఊహించవచ్చు. ఉదాహరణకు రాష్ట్రప్రభుత్వం 1973 లో 15,760, 1975 లో 19,260, 1976లో 33,920 1977 లో 30,278, 1978 లో 29,151, 1979 లో 23,183 ఉద్యోగాలు ఖాళీ ఉన్నట్లు ప్రకటించింది.

*పబ్లిక్ సెక్టార్ :* 1962 లో ప్రభుత్వరంగ పరిశ్రమలలో 5.66 లక్షల మంది ఉద్యోగులుండేవారు, 1975 కు ఈసంఖ్య దాదాపు 9 లక్షలకు పెరిగింది. ఈ రంగంలోని ఉద్యోగుల సంఖ్యలను దిగువ చూపడమైనది.

| | |
|---|---|
| 1962 | 5.66 లక్షలు |
| 1965 | 6.52 లక్షలు |
| 1968 | 6.67 లక్షలు |
| 1970 | 7.15 లక్షలు |

*ఫ్యాక్టరీలు :* ఫ్యాక్టరీలలో పనిచేసేవారి సంఖ్య 1955 లో 1.65 లక్షలు. ఈ సంఖ్య 1973 నాటికి 3.41 లక్షలకు పెరిగింది. వివరాలివి.

| | |
|---|---|
| 1955 | 1.65 లక్షలు |
| 1960 | 1.95 లక్షలు |
| 1962 | 2.09 లక్షలు |
| 1965 | 2.50 లక్షలు |
| 1968 | 2.79 లక్షలు |
| 1972 | 3.34 లక్షలు |
| 1973 | 3.41 లక్షలు |

పై పట్టికలను పరిశీలిస్తే అన్ని రంగాలలోను ఉద్యోగాల సంఖ్య పెరిగినట్లు స్పష్టంగా కనిపిస్తుంది అయినప్పటికీ అందరికీ ఉద్యోగాలు కల్పించడం దుస్సాధ్యమని ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లలో నమోదు చేసుకొన్నవారి సంఖ్యలనుబట్టి చూస్తే తెలుస్తున్నది.

## II. ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లు – నిరుద్యోగులు

రాష్ట్రంలో గ్రామీణ ప్రాంతాల జనాభా ఎక్కువ. ఈ ప్రాంతాలలోనే పాక్షిక నిరుద్యోగులు, శాశ్వత నిరుద్యోగులు ఎక్కువగా కనిపిస్తూ ఉంటారు. వ్యవసాయ రంగంలో పని అన్ని కాలాలపాటు ఉండదు. సంవత్సరంలో కొద్దిరోజులు మాత్రమే పనులెక్కువ. మిగిలిన కాలమంతా పనులుచేసే అవకాశాలులేక చాలా మంది నిరుద్యోగులుగా ఉండిపోతారు. వీరిలో ఏకొద్దిమందో ప్రత్యామ్నాయంగా ఇతర వ్యాపకాలు పెట్టుకొంటారు. వీరందరూ ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లలో తమ పేర్లు నమోదు చేసుకొని ఉండరు కాబట్టి వీరిని గురించి సరైన గణాంక వివరాలు లేవు. అయినప్పటికీ రాష్ట్రంలో జరిగిన సర్వేలనుబట్టి ఈ గ్రామీణ ప్రాంతాలలో నిరుద్యోగ సమస్య ఎక్కువని స్పష్టమవుతున్నది.

పట్టణ ప్రాంతాలలోని నిరుద్యోగులు ప్రధానంగా పారిశ్రామిక కార్మికులు, మధ్య తరగతికి చెందినవారు ఉంటారు. ఉన్నవారేకాకుండా నగరీకరణం కారణంగా పల్లె ప్రాంతాల నుంచి తరలి వస్తున్న జనసందోహం కూడా పట్టణ ప్రాంతాలలోని నిరుద్యోగ సమస్యను ఇనుమడింప జేస్తున్నాయి.

ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లలో పేర్లు నమోదు చేసుకొన్న వారిని గురించిన గణాంక వివరాలు మాత్రమే మనకు అందుబాటులో ఉన్నాయి. వీటిని గమనించినట్లయితే నిరుద్యోగుల సంఖ్య ఏ నిష్పత్తిలో పెరుగుతున్నదో తెలియగలదు.

రాష్ట్రంలో మొత్తం 32 ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లు (1978). వీటిలో 23 జిల్లా ఎక్స్ఛేంజ్‌లు, 6 సబ్-ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లు, 3 విశ్వవిద్యాలయాలలోని ఎంప్లాయ్‌మెంట్ ఇన్ఫర్మేషన్ అండ్ గైడెన్స్ బ్యూరోలు. ఈ ఎక్స్ఛేంజ్‌ల వివరాలు దిగువ సూచించినాము. ( అభ్యర్థుల సంఖ్యలు లక్షలలో ఇచ్చినాము.

| సంవత్సరం | ఎక్స్ఛేంజిల సంఖ్య | ఆరంభంలో | సంవత్సరంలో నమోదు చేసుకొన్నవారి సంఖ్య | మొత్తం | ఉద్యోగాలు పొందినవారు | ఉద్యోగాలు పొందకుండా పేర్లు తీసివేసినవారు | సంవత్సరాంతానికి మిగిలినవారు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1957 | — | 0.67 | 0.08 | — | 0.01 | — | 0.66 |
| 1963 | 25 | 1.19 | 2.24 | 3.33 | 0.29 | 1.70 | 1.34 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| 1964 | 26 | 1.34 | 2.27 | 3.61 | 0.38 | 1.91 | 1.32 |
| 1965 | 27 | 1.32 | 2.51 | 3.83 | 0.41 | 1.97 | 1.45 |
| 1970 | 25 | 2.16 | 3.04 | 5.20 | 0.26 | 2.13 | 3.81 |
| 1973 | 26 | 3.71 | 3.17 | 6.88 | 0.27 | 1.80 | 4.81 |
| 1974 | 26 | 4.81 | 3.29 | 8.10 | 0.26 | 2.09 | 5.75 |
| 1975 | 32 | 5.75 | 3.31 | 9.07 | 0.34 | 2.61 | 6.11 |
| 1976 | 32 | 6.11 | 3.54 | 9.65 | 0.51 | 2.41 | 6.72 |
| 1977 | 32 | 6.72 | 3.91 | 10.33 | 0.52 | 1.73 | 8.09 |
| 1978 | 32 | 8.09 | 3.86 | — | 0.50 | 1.38 | 10.87 |

మూలం : 1957 - ఇకనామిక్స్ అండ్ స్టాటిస్టికల్ బులెటిన్, సిల్వర్ జూబిలీ నంబర్, 1972
1963 - 1978 : స్టాటిస్టికల్ ఆబ్‌స్ట్రాక్ట్‌లు

ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లలో నమోదు చేసుకొన్నవారి అర్హతల వివరాలను పరిశీలించినట్లయితే వీరిలో ఎక్కువ మంది కౌశలంలేని కార్మిక వృత్తులను కోరేవారు, ఏ పని అనుభవంగాని, శిక్షణగాని లేని సాధారణ విద్య చదివినవారు ఉన్నారు. ఉదాహరణకు 1976-1977 సంవత్సరాలలో నమోదు చేసుకొన్నవారిని విశాలమైన వృత్తి వర్గాల కింద విభజించి దిగువ పట్టికలో చూపడమైనది.

| వ.సం | వృత్తి వర్గము | 1976 | 1977 |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 1. | వృత్తివిద్య, సాంకేతిక విద్యార్హతలు మొ॥ ఉన్నవారు | 43,080 | 53,836 |
| 2. | పరిపాలనా, నిర్వహణార్హతలున్న శ్రామికులు | 1,030 | 1,329 |
| 3. | గుమాస్తాలు, సేల్స్‌మన్‌లు, తదితర శ్రామికులు | 23,130 | 26,174 |
| 4. | వ్యవసాయం తదితర శ్రామికులు | — | 1,069 |
| 5. | గనులు, రవాణా, ఉత్పత్తి మొ॥ వాటి శ్రామికులు | 52,030 | 58,839 |
| 6. | క్రీడా, వినోదంవంటి వాటికి సంబంధించిన శ్రామికులు | 920 | 1,043 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 7. | ఇతరులు, (వృత్తి సంబంధ శిక్షణగాని, పనితనుభవంగాని లేని వారు) | 2,90,340 | 3,53,451 |
| 8. | కౌశలంలేని కార్మికవర్గం వారు | 2,62,400 | 3,13,148 |
| | మొత్తం | 6,72,930 | 8,08,889 |

మూలం : స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్ట్, 1978.

ఈ నమోదు చేసుకొన్నవారిలో 1977 నాటికి 4,905 మంది ఎక్స్-సర్వీస్‌మన్‌లు, 1,248 మంది ప్రభుత్వోద్యోగాల నుంచి డిస్చార్జ్ అయినవారు, 80 446 మంది షెడ్యూల్డ్ కులాలవారు, 9,178 మంది షెడ్యూల్డ్ జాతివారు ఉన్నారని తెలుస్తున్నది. అంతేకాకుండా అభ్యర్థులలో 95,990 మంది స్త్రీలు.

ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లను అన్నిరకాల యాజమాన్యాలూ సహాయం కోరుతున్నాయి. వీటిలో ఎక్కువగా ఎక్స్ఛేంజ్ సహాయం తీసుకొనేది రాష్ట్ర ప్రభుత్వం.

పై వివరాలను పరిశీలిస్తే నానాటికీ నిరుద్యోగుల సంఖ్య అమితంగా పెరుగుతున్నట్లు కనిపిస్తూనే ఉంది. వీటి నిమిత్తం అంటే నిరుద్యోగ సమస్యను ఎదుర్కోవడానికి ఎన్నో విధాలుగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు చర్యలు తీసుకొంటున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో ఉపాధికల్పన పరిస్థితిని స్థూలంగా కింది పట్టికద్వారా గ్రహించ వచ్చు.

| అంశం | 1977 | 1978 | 1979 |
|---|---|---|---|
| ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లు : | | | |
| i) రిజిస్ట్రేషన్ (లక్షలలో) | 3.58 | 3.86 | 3.56 |
| ii) ప్రకటించిన ఖాళీలు మొత్తం | 70,501 | 66,879 | 63,480 |
| ఎ) కేంద్రప్రభుత్వం | 5,121 | 5,577 | 5,376 |
| బి) రాష్ట్ర ప్రభుత్వం | 30,278 | 29,151 | 23,188 |
| సి) క్వాజి ప్రభుత్వసంస్థలు | 28,818 | 25,117 | 26,835 |
| డి) ప్రైవేట్ రంగం | 6,284 | 7,034 | 8,081 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| iii) సంవత్సరానికి రిజిష్టర్‌లో ఉన్న దరఖాస్తు దార్ల సంఖ్య (లక్షలలో) | 8.09 | 10.07 | 12.61 |

మూలం . డైరెక్టర్ ఆఫ్ ఎంప్లాయ్‌మెంట్ & ట్రైనింగ్, హైదరాబాద్.

## III. నిరుద్యోగనివారణ — విద్యావిధానంలో మార్పులు

ఏదైనా సమస్య పరిష్కారం కావాలంటే నివారణ చర్యలు తీసుకోవలసి ఉంటుంది. ఈ విధంగానే నిరుద్యోగ సమస్య నిర్మూలనకు ప్రాతి పదికగా నివారణ చర్యల కింద విద్యా విధానంలో ఎన్నో మార్పులను ప్రవేశపెట్టడం జరిగింది. విద్యాలయాలలో తయారవుతున్న ''రేపటి పౌరులకు" భావిజీవితం పట్ల సుముఖమైన ధోరణి కలిగించడానికి, చదువుతరవాత నిత్యజీవితంలో తమ తమ సామర్థ్యాభిరుచుల ప్రకారం వృత్తి నెన్నుకొని స్థిరపడి పోవడానికి గాను వారికి ఈదశలోనే సరైన వాతావరణం, అవకాశాలు కలిగించవలె. ఈ విధానాన్నే నేడు మన ప్రభుత్వం అనుసరిస్తున్నది.

విద్యావంతులలో నిరుద్యోగ సమస్య ప్రబలి పోవడానికి ప్రధానకారణం అశాస్త్రీయమైన, అస్త వ్యస్తమైన విద్యా విధానం. దీనిని సంస్కరించడం, శాస్త్రీయమైన ఉపాధికల్పనా సామర్థ్యమున్న పటిష్ఠమైన విద్యా విధానానికి విద్యారంగంలో నేడు కృషి సాగుతున్నది. అనేక రకాల వృత్తి విద్యలను, సాంకేతిక విద్యలను ప్రవేశపెట్టి విద్యా విధానాన్ని పటిష్ఠంచేయ డానికి ప్రయత్నాలు సాగుతున్నాయి. ఉదాహరణకు నేడు ఇంటర్మీడియట్ స్థాయిలో అనేక రకాల వృత్తి విద్యలను, ఉద్యోగోన్ముఖ కోర్సులను ప్రవేశపెట్టడం జరిగింది. అంతేకాకుండా పని అనుభవమనేది విద్యా ప్రణాళికలో చోటు చేసుకొంది. అయితే విద్యార్థి జనాభాతో పోల్చి చూస్తే చేసిన కృషి చాలా తక్కువగా కనిపిస్తుంది. ఈ కృషి ముమ్మరంగా సాగిస్తేనే భవి ష్యత్తులో ఈ సమస్య ఉధృతం కాకుండా ఉండగలదు.

నివారణ చర్యలు భవిష్యత్తులో నిరుద్యోగ సమస్య తీవ్రంకాకుండా ఉంచగలదు. అయితే ప్రస్తుతమున్న సమస్యను పరిష్కరించే ఏర్పాట్లుకూడా ఈ నివారణ చర్యలతో బాటు సాగవలె.

## IV. నిరుద్యోగసమస్యా పరిష్కారం-ప్రభుత్వ కృషి

గ్రామీణ ప్రాంతాలలో నిరుద్యోగ సమస్య ఎక్కువగా ఉన్న కారణంగా కార్మికశక్తిని వినియోగించుకోవడానికి వీలుగా కార్యక్రమాలు చేపట్టవలసి ఉంది. సహకార పథకాలద్వారా పనులు కల్పించినట్లయితే గ్రామీణులలో నిరుద్యోగం తక్కువ కాగలవు. అంతేకాకుండా ఈ కార్యక్రమాలు పట్టణాలకు సాగే "వలస" లను కూడా కొంతవరకు తగ్గించగలదు. నూతన కార్యక్రమాలను చేపడితే చాలదు. వాటిపట్ల ప్రజలకు అభిరుచికలిగించవలె. వాటిలో కొంత

నైపుణ్యం కూడా కలిగించవలె. నిరక్షరాస్యతా నిర్మూలనంలో భాగంగా ఈ సమస్యాపరిష్కారం ఉండవలె. దీనికిగాను ప్రస్తుతం ముమ్మరంగా సాగిస్తున్న ప్రయోజనవిద్యా కార్యక్రమాలెంతగానో తోడ్పడగలవు. ముఖ్యంగా ప్రయోజనాత్మక విద్యద్వారా పల్లెప్రాంతాలలోని వారికి పని అనుభవం, శిక్షణ, మొదలైనవి కల్పించి వారి నైపుణ్యాలను పెంపొందించవచ్చు.

పట్టణ ప్రాంతాలలో చిన్నతరహా పరిశ్రమలను నెలకొల్పడం ద్వారా నిరుద్యోగ సమస్యను కొంతవరకు పరిష్కరించవచ్చు. ఇటువంటి వాటివల్ల ఇతర రకాల సమస్యలు కూడా తక్కువ.

విద్యావంతులైన నిరుద్యోగులకు తగిన శిక్షణ, ప్రోత్సాహం ఇచ్చి స్వయం ఉపాధి కల్పనా విధానాలను అమలు పరచవచ్చు. ఈ విధంగా చేసినందువల్ల ఆ నిరుద్యోగులకు పని కల్పించడమే కాకుండా వారిద్వారా వారికింపరికి ఉద్యోగావకాశాలు కల్పించే అవకాశముంది.

భారత ప్రధాని ఇందిరాగాంధి ప్రకటించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమంలో ఇవి భాగాలు. ఈ కార్యక్రమాన్ని అనుసరిస్తున్న మనరాష్ట్రంలో ఇప్పుడిప్పుడే ఆశాభావాలు చిగురిస్తున్నాయి. అనతి కాలంలోనే నిరుద్యోగ సమస్య పూర్తిగా కాకపోయినా చాలావరకు పరిష్కరించ బడగలదని ఆశించవచ్చు.

అయితే ఇక ఒక విషయం స్పష్టంగా గుర్తుంచుకోవలసి ఉంది. ఏ అభివృద్ధి పథకమైనా ప్రజల తోడ్పాటు లేనిదే విజయవంతం కాజాలదు.

## V. ప్రజలలో పరివర్తన

నిరుద్యోగ సమస్య ఒక్క ప్రభుత్వానిదేకాదు. ఇది యావత్ రాష్ట్రానికి, దేశానికి, సంబంధించిన సమస్య. పౌరులమైన మనందరికీ సంబంధించిన సమస్య. దీని పరిష్కారానికి ప్రభుత్వంతో బాటు ప్రజలు సహకరించవలె. దీనికిగాను సంఘం, సంస్థలు స్వచ్ఛందంగా ముందుకు రావలె.

ఈ పరిణామంలో మొదటి దశగా ప్రజల దృక్పథంలో మార్పురావలె. విద్య పట్ల, వైట్‌కాలర్ ఉద్యోగాలపట్ల చాలామంది మోజుచూపుతున్నారు. అందుకనే ఈ తరహాకుచెందిన నిరుద్యోగు లెక్కువవు తున్నారు. మనోవిజ్ఞానశాస్త్రరీత్యా చెప్పవలెనంటే ఈ తరహా వారికి నిర్దిష్టమైన గమ్యాలుండవు. చదువు చదువుకోసమని కాకుండా చదువు బ్రతుకుకోసం అనే దృక్పథం రావలె ప్రభుత్వంతోబాటుగా ప్రజలలో కూడా ప్రయోజనాత్మక విద్యపట్ల, సాంకేతిక విద్యపట్ల అభిరుచులెక్కువగా పెంచుకోవడమే కాకుండా ఉద్యోగాలకోసం యెదురు చూడటం బదులు స్వయం ఉపాధి కల్పనా మార్గాలనన్వేషించి దేశప్రగతి సాయపడవలె. ఇందుకుగాను ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు తదితర పెద్దలు పాటుపడవలె. అంతేకాకుండా ఈ పథకాల విషయంలో సహాయ సహకారాలందించడం కూడా ఉండవలె. నేడు అనేక బాంక్‌లు, కొన్ని సంస్థలు మాత్రమే ఈ పథకాలకు తోడ్పడుతున్నాయి. ఇవికాక స్వచ్ఛంద సేవా సంస్థలు, గ్రామ సహకార సంఘాలు రూపొంది ఈ పథకాలకు ఆర్థిక, సాంకేతిక, సహాయాలందించిననాడు గ్రామాలలోను, పట్టణాలలోను కూడా ఉన్న ఈ నిరుద్యోగ సమస్యకు పరిష్కార వేదికలమరగలవు.

# 19

# సహకార రంగం

ఆర్థిక వ్యవస్థలను పెట్టుబడిదారీ, సామ్యవాదం, కమ్యూనిస్టు, ఫాసిస్టు, వ్యవస్థలని నాలుగు ప్రత్యామ్నాయ వ్యవస్థలుగా విభజించడం పరిపాటి. సహకారం ఒక ప్రత్యామ్నాయ ఆర్థిక వ్యవస్థగా ఇంతవరకు ఏ దేశంలోను కూడా రూపొందించడం జరగనప్పటికీ, దాని విశిష్టతను అన్ని దేశాలు గుర్తించాయి. ముఖ్యంగా బహుగు దేశాలలో సామ్యవాద వ్యవస్థను ప్రజాస్వామిక మార్గాలద్వారా నిర్మించడంలోను, ఆర్థికాభివృద్ధిని సాధించడంలోను, సహకారం ప్రాముఖ్యాన్ని గుర్తించడం జరిగింది.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో గ్రామీణాభ్యుదయానికి సహకారం ప్రాతిపదికంగా ఉన్న ఆర్థిక వ్యవస్థను నిర్మించి ప్రోత్సహించడం ప్రధాన మార్గంగా పరిగణిస్తున్నారు. భారత దేశ ఆర్థిక వ్యవస్థలో కూడా సహకార రంగానికి ఒక విశిష్టమైన స్థానం కల్పించారు. తదను గుణంగా సహకారరంగ విస్తరణకు ప్రణాళికాబద్ధంగా కృషికూడా జరుగుతూ ఉంది. ఆర్థిక అసమానతలను తగ్గించి, సత్వరఆర్థికాభివృద్ధి సాధించి సర్వజన శ్రేయస్సును పెంపొందిస్తూ, ప్రజాస్వామ్య పద్ధతులలో ఆర్థిక వనరులను జాతీయ శ్రేయస్సుకోసం, ఉపయోగించుకొనవలె నంటు సహకారరంగం అన్ని కార్యక్రమాలకు విస్తరించవలెననే సమ్మకం మన ప్రణాళికలలో స్పష్టం చేయడం జరిగింది.

ఆర్థిక సమతను సాధించడం, సహకార సూత్రాల లక్ష్యాలలో అతిముఖ్యమైనది. వడ్డీ వ్యాపారులకు దక్కుతున్న లాభాలను వ్యవసాయదారులకు దక్కేటట్లు చూడడానికి సహకార వ్యవస్థలో వీలుంటుంది. వ్యవసాయదారు తాను పెట్టదలుచుకొన్న పెట్టుబడికి వడ్డీవ్యాపారుల నుంచి మూలధనం సేకరిస్తాడు. రసాయనిక ఎరువులు మొదలైన ఉత్పాదకాలను కొంటాడు. తాను పండించిన వస్తువులను మార్కెట్‌లో విక్రయిస్తాడు. ఈ అన్ని సందర్భాలలోను అత నికి న్యాయం జరగడం లేదనే అభిప్రాయం బాగా వ్యాప్తిలో ఉంది. సహకార విధానాలను అనుసరించినట్లయితే పరిస్థితులను వ్యవసాయదారునికి అనుకూలంగా మలచడానికి వీలుంటదనే అభిప్రాయం క్రమంగా బలపడసాగింది. ఈ పద్ధతివల్ల తక్కువ వడ్డీరేట్లను మూలధనం సమకూర్చవచ్చు. చౌకధరలను వ్యవసాయోత్పాదకాలను రైతులకు అందించవచ్చు. అతడు పండించిన వస్తువులకు మంచిధర గిట్టుబాటయ్యేటట్లు చూడవచ్చు. ఈ విధంగా ఇంతకుముందు వడ్డీవ్యాపారులు, దళారీలు మొదలైనవారు పొందుతూవచ్చిన లాభాలను వ్యవసాయదారులకు బదలాయించి దానిద్వారా ఆదాయపంపిణీలో ప్రగతి సాధించవచ్చు.

మనదేశంలో సహకారోద్యమం 1904 లో ప్రారంభమయి అనేకదశలలో అభివృద్ధి చెందుతూ వచ్చింది. 1941 వరకు మందకొడిగా సాగినా 1947 లో ప్రభుత్వ భాగస్వామ్యం ప్రారంభమైన తరవాత కొంతవేగంగా అభివృద్ధిచెందుతూ వచ్చింది. మొదట్లో సహకార సంఘాలు కేవలం వ్యావసాయిక పరపతిని రైతాంగానికి అందించడానికి మాత్రమే పరిమితమై ఉండేది. రానురాను వాటి కార్యకలాపాలు విస్తృతంగా సాగినాయి. వ్యవసాయదారుల ఋణాలను తీర్చడానికి 1904 కు పూర్వంలో కూడా ఆలోచనఉన్నప్పటికి 1904 నుంచే ఒకక్రమ బద్ధమైన ప్రయత్నం ప్రారంభమైంది. 1904 లో ప్రభుత్వ చట్టంద్వారా మనదేశంలో సహకార సంఘములను స్థాపించడం జరిగింది. వ్యవసాయదారులకు కావలసిన వివిధరకాల ఋణాలను అంటే స్వల్పకాలిక, మధ్యకాలిక, దీర్ఘకాలిక ఋణాలను - ఈ సంఘాలు అందించగలవని భావించినారు. కానీ ఈ సంఘాలకు దీర్ఘకాలిక ద్రవ్య వనరులు లేనందువల్ల దీర్ఘకాలిక ఋణాలివ్వడానికి వీలుపడదేదని త్వరలో తేలిపోయింది.

వ్యవసాయదారులు తమ పాత బాకీలను తీర్చుకోవడానికి వీలుగా సులువైన షరతులపై దీర్ఘకాలిక ఋణాలివ్వడానికి ప్రభుత్వం సంకల్పించింది. 1919 వ సంవత్సరంలో మద్రాసు రాష్ట్రసహకారసంఘముల రిజస్ట్రార్ శ్రీ ఎఫ్.ఆర్. హెమింగ్‌లే రైతులకు దీర్ఘకాలిక ఋణాలివ్వడానికి వీలుగా ఒక ప్రతిపాదన చేసినాడు. దీని ప్రకారం రాష్ట్ర సహకార బాంకులే డిబెంచర్‌లను అమ్మి దీర్ఘకాలిక ఋణాలను ఇవ్వవలసి ఉంటుంది. సక్రమమైన పద్ధతిలో భారతదేశంలో మొట్టమొదట భూమి తనఖాబాంకు మద్రాసురాష్ట్రంలోనే స్థాపించడం జరిగిం దని చెప్పవచ్చు. దీనిని 1925 లో స్థాపించారు. కాలం గడిచినకొద్దీ సహకార సంఘాల కార్యకలాపాలు, వ్యవసాయ వస్తువుల ప్రోసెసింగ్, మార్కెటింగ్, ఉత్పాదకాల సప్లయ్ వినియోగదారులకు సరసమైన ధరలకు అందచెయ్యడం, వెనకబడిన తరగతులైన షెడ్యూల్డ్ కులాలు, గిరిజనుల ప్రత్యేక ఆర్థిక సాంఘిక సమస్యలను తీర్చడానికి ప్రయత్నించడం వంటి రంగాలలో కూడా ప్రవేశించి పనిచేయ్యడం ప్రారంభించినాయి.

సహకారరంగంలో నాలుగు రకాల సంఘాలుంటాయి. అవి : 1. సహకార వ్యవసాయ పరపతి సంఘములు. 2.సహకార వ్యవసాయేతర పరపతిసంఘాలు. 3.వ్యవసాయేతర పరపతి సంఘములు. 4. వ్యవసాయేతర పరపతేతర సహకార సంఘాలు, సహకార సేవాసంఘాలు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కూడా ప్రజాస్వామ్య వ్యవస్థను పటిష్ఠం చేయడానికి సహకార సంఘములను ఒక ముఖ్యమైన సాధనంగా ఉపయోగిస్తున్నారు. మనరాష్ట్రంలోని సహకారోద్యమ లక్ష్యాలలో ముఖ్యమైనవి.

1. వ్యవసాయదారులకు చాలినంత పరపతి అందజెయ్యడం,
2. సంపూర్ణోద్యోగిత స్థితిని చేరుకోవడానికి ప్రయత్నించడం, రాష్ట్రంలో దారిద్ర్యాన్ని నిర్మూలించడం, నిస్సహాయులైన వారికి అవసరమైన ఆసరా కల్పించడం.
3. ఆర్థికాభివృద్ధిని వికేంద్రీకరించడం
4. సంఘటిత గ్రామీణాభివృద్ధి, వ్యవసాయ ప్రాతిపదిక ఉన్న పరిశ్రమలను నెలకొల్పడం
5. సమాజంలోని వెనకబడిన వర్గాల ప్రజలకు ఉపాధి అవకాశాలు కల్పించడం,

6. న్యాయమైన ధరలకు నిత్యావసర వస్తువులను సమకూర్చడం ద్వారా ధరల స్థిరీకరణను సాధించడం, బలహీనవర్గ ప్రజలకు నిత్యావసర సరుకులను న్యాయమైన ధరలకు అందించడంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకోవడం మొదలైనవి.

## సహకార సంఘాల వ్యవస్థానిర్మాణం

సహకారోద్యమం ప్రారంభమైన నాటినుంచి కొనసాగుతూ వచ్చిన వ్యవస్థ ఆధునిక అవసరాలకు, బాధ్యతల నిర్వహణకు అనువుగా లేదని వ్యవస్థాపరమైన మార్పులుచేస్తూ, 1978 సెప్టెంబర్ 16 వ తేదీన ప్రభుత్వ ఉత్తరువులు జారీచేసింది. ఈ ఉత్తరువుల ననుసరించి ప్రస్తుత వ్యవస్థలో రిజిస్ట్రార్ కో ఆపరేటివ్ డిపార్ట్‌మెంట్‌కు అధిపతిగా ఉంటారు. అతనికి సహాయం చేయడానికి ముగ్గురు అదనపు రిజిస్ట్రార్‌లు డిప్యూటీ రిజిస్ట్రార్‌లు, ఇతర సిబ్బంది, ఉంటారు. మార్పుచేసిన పద్ధతి ననుసరించి ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క జోనల్ ఆఫీసర్‌ను కూడా నియమించడం జరిగింది. ఈ విధంగా చేయడంలోని ప్రధానోద్దేశం అధికారాన్ని వికేంద్రీకరించి జిల్లాస్థాయి అధికారులకు ఎక్కువ అధికారులను దత్తంచేయడం, దీని ఫలితంగా కార్యక్రమాలను చురుకుగా అమలు జరిపించి సత్వర ఫలితాలను సాధించడం, ఇప్పుడున్న పద్ధతి ప్రకారం ప్రతి జిల్లాస్థాయిలోను, ఒక స్పెషల్ కాటగిరీ డిప్యూటీ రిజిస్ట్రార్ జిల్లా కో ఆపరేటివ్ ఆఫీసర్‌గా పనిచేస్తాడు. అట్లాగే డివిజన్ స్థాయిలో డివిజనల్ ఆఫీసర్ ఒకరు ఉంటాడు. వీరికి సహాయంచేయడానికి తగిన ఇతర సిబ్బంది ఉంటుంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సహకారోద్యమం బాగా వేళ్ళూనిందనే చెప్పవచ్చు. ముఖ్యంగా 1970 నుంచి సహకారోద్యమ ప్రగతి గణనీయంగా ఉన్నట్లు కనబడుతుంది. రాష్ట్రంలో 1971-72 నుంచి 1975-76 మధ్యకాలం సహకార సంఘాల సంఖ్యను, వాటిలోని సభ్యుల సంఖ్యను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

| సంవత్సరం (1) | సహకార సంఘాలు (వేలల్లో) (2) | సభ్యుల సంఖ్య (లక్షలలో) (3) | చెల్లించిన వాటా మూలధనం (కోట్లరూ.లలో) (4) | నిర్వహణ మూలధనం (కోట్లరూ.లలో) (5) |
|---|---|---|---|---|
| 1971-72 | 27.7 | 49.1 | 54.9 | 501.2 |
| 1972-73 | 28.3 | 51.4 | 58.9 | 553.5 |
| 1973-74 | 28.8 | 55.2 | 64.1 | 583.2 |
| 1974-75 | 35.6 | 66.6 | 77.0 | 674.7 |
| 1975-76 | 37.6 | 68.5 | 81.8 | 837.2 |
| 1976-77 | 37.2 | 81.2 | 90.8 | 996.2 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 1975-76 నాటికి వివిధ తరహాల సహకార సంఘాలు 26. వాటి వివరాలను కింది పట్టికలో చూడవచ్చు. మన రాష్ట్రంలో సహకారోద్యమం బహుముఖంగా వ్యాపించిందనే విషయం పై పట్టిక స్పష్టం చేస్తుంది.

## 1975-76 సం॥ నాటికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సహకార ఉద్యమ ప్రగతి

రూ. వేలల్లో

| నెం. | సహకారసంఘ రకాలు | సహకారసంఘాల సంఖ్య | సభ్యుల సంఖ్య | చెల్లించిన వాటాధనం | నిర్వహణ మూలధనం | ఇచ్చిన ఋణాలు | బకాయి ఋణాలు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1. | స్టేట్ కో ఆపరేటివ్ బాంక్ | 1 | 40 | 39,626 | 8,21,850 | 12,01,866 | 6,10,374 |
| 2. | సెంట్రల్ కో ఆపరేటివ్ బాంక్ | 26 | 27,093 | 1,64,311 | 12,59,546 | 11,42,449 | 9,21,318 |
| 3. | స్టేట్ భూమితనఖా బాంకులు | 1 | 201 | 64,412 | 18,47,543 | 2,97,058 | 11,70,969 |
| 4. | ప్రైమరీ భూమి తనఖా బాంకులు | 201 | 8,16,819 | 1,59,442 | 13,92,222 | 3,54,685 | 10,86,259 |
| 5. | ప్రైమరీ అగ్రికల్చరల్ క్రెడిట్ సొసైటీలు | 14,627 | 29,41,000 | 1,55,347 | 12,27,347 | 7,35,079 | 8,49,411 |
| 6. | ధాన్యం బాంకులు | 3,162 | 2,67,000 | 4,074 | 12,482 | 1,537 | 4,663 |
| 7. | ప్రైమరీ వ్యవసాయేతర ఋణ సొసైటీలు | 2,237 | 6,14,000 | 48,279 | 3,17,970 | 1,49,957 | 2,34,596 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| 8. | సెంట్రల్ పర్చస్ మార్కెటింగ్ సొసైటీలు | | | | | | |
| | (1) ఆంధ్రప్రదేశ్ మార్కెటింగ్ ఫెడరేషన్ | 1 | 390 | 21,750 | 2,49,618 | 3,128 | 7,597 |
| | (2) సెంట్రల్ అండ్ ప్రైమరీ మార్కెటింగ్ సొసైటీలు | 308 | 3,16,014 | 32,556 | 2,55,570 | 5,833 | 5,551 |
| 9. | స్పెషలైజ్డ్ అగ్రికల్చరల్ కమోడిటీస్ మార్కెటింగ్ సొసైటీలు | 61 | 54,700 | 4,397 | 21,003 | 2,398 | 4,225 |
| 10. | స్టేట్ పామ్‌గర్, నీరా, టాడీటాపర్ సెంట్రల్ అండ్ ప్రైమరీ పామ్‌గర్ సొసైటీలు | 1 | 550 | 220 | 1,570 | .... | 800 |
| 11. | నీరా అండ్ టాడీటాపర్స్ సొసైటీలు | 3,826 | 1,41,420 | 1,870 | 7,707 | .... | 882 |
| 12 | కో ఆపరేటివ్ సుగర్ ఫ్యాక్టరీలు | 23 | 75,604 | 1,218 | 1,793 | 133 | 240 |
| 13. | ప్రోసెసింగ్ సొసైటీలు | 179 | 22,940 | 5,257 | 26,439 | 24 | 1,890 |
| 14. | అదర్ లైవ్‌స్టాక్ ప్రోడక్ట్స్ సొసైటీలు | 29 | 3,289 | 65 | 122 | 56 | 56 |
| 15. | ఫార్మింగ్ సొసైటీలు | 1,158 | 65,199 | 1,811 | 23,180 | 2,793 | 4,569 |
| 16. | ఇరిగేషన్ సొసైటీలు | 174 | 29,050 | 854 | 18,464 | .... | .... |
| 7. | ఆంధ్రప్రదేశ్ కన్‌స్యూమర్స్ ఫెడరేషన్ | 1 | 34 | 3,317 | 10,525 | .... | .... |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| 18. | డి స్ట్రిక్ట్ ప్రైమరీ కన్స్యూమర్స్ స్టోర్స్ | 968 | 5,09,052 | 22,221 | 95,305 | .... | .... |
| 19. | ఆంధ్రప్రదేశ్ హౌసింగ్ ఫెడరేషన్ | 2 | 692 | 22,458 | 2,94,332 | 14,223 | 1,54,807 |
| 20. | ప్రైమరీ హౌసింగ్ సొసైటీలు | 1,219 | 1,62,347 | 21,624 | 2,80,005 | 21,287 | 1,15,523 |
| 21. | హౌస్ మార్టిగేజ్ బాంకులు | .... | ... | .... | .... | .... | .... |
| 22. | లేబర్ కాంట్రాక్టు అండ్ కన్‌స్ట్రక్షన్ సొసైటీలు | 811 | 44,665 | 1,336 | 4,918 | 895 | 1,213 |
| 23. | ఫారెస్ట్ లేబర్ సొసైటీలు | 83 | 8,867 | 200 | 584 | .... | 26 |
| 24. | ట్రాన్స్‌పోర్ట్ సొసైటీలు | 117 | 4,479 | 3,990 | 22,089 | 7,626 | 11,457 |
| 25. | అదర్ నాన్ క్రెడిట్ సొసైటీలు | 2,584 | 1,67,980 | 11,103 | 87,823 | 4,101 | 10,375 |
| 26. | సహకార సంఘము-సంస్థ | 4 | 3,448 | .... | .... | .... | .... |
| | మొత్తం | 31,804 | 62,67,873 | 7,91,738 | 81,90,996 | 39,44,133 | 51,96,801 |

Source : *Hand Book of Statistics on Co-operatiee Movement in A. P., 1975-76.*

## జిల్లాలవారీగా సహకార సంఘాలు (1975-76)

| వ.సం. | జిల్లా | సొసైటీల సంఖ్య | సభ్యత్వం (వేలల్లో) | చెల్లించిన మూలధనం (రూ. వేలల్లో) | నిర్వహణ మూలధనం (రూ. వేలల్లో) |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. | శ్రీకాకుళం | 2,056 | 467 | 24,438 | 1,39,104 |
| 2. | విశాఖపట్నం | 1,420 | 457 | 45,000 | 3,41,809 |
| 3. | తూర్పుగోదావరి | 2,526 | 649 | 55,461 | 4,14,658 |
| 4. | పశ్చిమగోదావరి | 1,504 | 382 | 50,168 | 3,45,049 |
| 5. | కృష్ణా | 2,645 | 470 | 64,565 | 5,06,349 |
| 6. | గుంటూరు | 1,836 | 351 | 47,320 | 3,53,267 |
| 7. | ప్రకాశం | 1,275 | 262 | 24,185 | 2,08,204 |
| 8. | నెల్లూరు | 987 | 190 | 20,292 | 1,74,778 |
| | కోస్తా ఆంధ్రమొత్తం | 14,249 | 3,228 | 3,31,429 | 24,83,218 |
| 9. | కర్నూలు | 1,190 | 242 | 32,859 | 2,23,730 |
| 10. | అనంతపూరు | 1,271 | 408 | 44,105 | 2,09,258 |
| 11. | కడప | 1,312 | 188 | 23,486 | 2,17,656 |
| 12. | చిత్తూరు | 1,596 | 320 | 30,960 | 2,73,926 |
| | రాయలసీమ మొత్తం | 5,369 | 1,158 | 1,31,410 | 9,24,580 |
| 13. | హైదరాబాదు | 2,850 | 367 | 1,85,919 | 34,38,910 |
| 14. | నిజామాబాద్ | 1,412 | 237 | 24,567 | 2,09,702 |
| 15. | మెదక్ | 2,272 | 213 | 14,774 | 1,35,170 |
| 16. | మహబూబ్‌నగర్ | 2,392 | 194 | 17,059 | 1,30,499 |
| 17. | నల్గొండ | 2,773 | 337 | 25,632 | 2,31,009 |
| 18. | వరంగల్లు | 1,600 | 271 | 17,979 | 1,19,648 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 19. | ఖమ్మం | 1,210 | 172 | 21,115 | 2,07,99 |
| 20. | కరీంనగర్ | 2,344 | 319 | 30,950 | 2,46,382 |
| 21. | ఆదిలాబాదు | 1,540 | 264 | 18,442 | 1,74,140 |
| | తెలంగాణా మొత్తం | 18,393 | 2,374 | 3,56,442 | 48,93,452 |
| | ఆంధ్రప్రదేశ్ | 38,011 | 6,760 | 8,19,285 | 83,01,250 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రధానంగా వ్యవసాయక రాష్ట్రం కావడం వల్ల సహకార సంఘాలు వ్యవసాయదారులకు అవసరమైన పరపతి సౌకర్యాలు కల్పించడంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకోవడం సహజం. వ్యావసాయిక పరపతి అందజేయడంలో సహకార సొసైటీలు నిర్వహించే పాత్ర విశిష్టమైందనే చెప్పవచ్చు.

సహకార సంఘాలు రైతులకు అందించే ఋణం మూడు తరహాలుగా ఉంటుంది. 1) అల్పకాలిక ఋణాలు, 2) మధ్యకాలిక ఋణాలు, 3) దీర్ఘకాలిక ఋణాలు.

వ్యవసాయ దారులకు అల్పకాలిక ఋణాలు ఇవ్వడంకోసం ఏర్పడిన పరపతి వ్యవస్థ కింది విధంగా రూపొందింది. మొదట్లో గ్రామీణ పరపతి సొసైటీలు మాత్రమే ఉండేవి. కాని వాటి కార్యకలాపాలను పర్యవేక్షించడానికి, వాటికి కావలసిన మూలధనం సమకూర్చడానికి కేంద్ర సంస్థలు ఉండేవి కావు. ఈ లోపాలను కొన్ని సవరణలద్వారా 1940 లో సరిదిద్దడం జరిగింది. అల్పకాలిక పరపతిలో మొట్టమొదటిది ప్రాథమిక పరపతి సంఘం. ఇది కాకుండా జిల్లా స్థాయిలో కేంద్రసహకార బాంకు, రాష్ట్రస్థాయిలో రాష్ట్ర సహకార బాంకు ఏర్పడినాయి.

ప్రాథమిక సంఘాలు వ్యవసాయ కార్యకలాపాలకుగాను 12-15 నెలల వరకు అల్పకాలిక ఋణాలు ఇస్తాయి. వడ్డీరేటు చాలా తక్కువ 6% ఉంటుంది. వ్యక్తిగత బాధ్యతమీద ఇతర సభ్యుల వ్యక్తిగత బాధ్యతమీద, ఆస్తి తనఖామీదా, ఋణాలు లభిస్తాయి. ఈ మధ్య వ్యవసాయదారులు గిడ్డంగులలో నిలవచేసిన వ్యవసాయోత్పత్తిని ఆధారం చేసుకొని ఋణాలిచ్చే పద్ధతి ప్రాధాన్యం వహిస్తోంది. అల్పకాలిక ఋణాలందించే విషయంలో ప్రాథమిక పరపతి సొసైటీలు కీలక పాత్ర వహిస్తాయి.

మధ్యకాలిక ఋణాలకు కాలవ్యవధి 2-5 ఉంటుంది. మధ్యకాలిక ఋణాలు సాధారణంగా కింది కార్యక్రమాలకుగాను అవసరమవుతుంది.

1. పశువుల కొనుగోలు
2. బావులు తవ్వడానికి, బాగుచేయించడానికి

3. మధ్యంతరగతి వ్యవసాయ యంత్రపరికరాలు కొనడానికి
4. చిన్న చిన్న భూములను మరమ్మత్తు చేయడానికి దీర్ఘకాలిక రుణాలు భూముల కొనుగోలు, వాటి అభివృద్ధికి గాను ఇవ్వడం జరుగుతుంది. వీటి కాలవ్యవధి 5 నుంచి 20 సంవత్సరాల వరకు ఉంటుంది.

మన రాష్ట్రంలో పైన పేర్కొన్న మూడు రకాల రుణాలను ఎంత వరకు రైతులకు అందించిందో కింది పట్టిక స్పష్టం చేస్తుంది.

కేంద్ర సహకార వ్యవసాయాభివృద్ధి బాంకు వివిధ కార్యక్రమాలకోసం మంజూరు చేసిన రుణాల వర్గీకరణ (1976 జూన్ మాసాంతరం వరకు).

| నంబరు | రుణం మంజూరుచేసిన కారణం | మొత్తం (రూ. వేలలో) |
|---|---|---|
| 1. | వ్యవసాయంకోసం, బావులు తవ్వడానికి | 4,974 |
| 2. | పాతబావులు, చెరువుల మరమ్మత్తు నిమిత్తం | 17115 |
| 3. | డీసిల్ ఇంజన్‌లు, కరెంట్ పంపుసెట్లు కొనడంకోసం | 38766 |
| 4. | ట్రాక్టర్‌లు మొదలైనవి కొనడానికి | 86771 |
| 5. | గోదాములు, షెడ్లు, వ్యవసాయిక వినియోగావసర భవన నిర్మాణానికి | 29787 |
| 6. | భూమి వ్యవసాయానికి అనుకూలంగా చేయడం, తోటల,పండ్లతోటల అభివృద్ధికిగాను | 66770 |
| 7. | ఇతర పనులకోసం | 8675 |
| | మొత్తం | 2,97,058 |

1979-80 లో వివిధ రకాల పరపతి అవసరాలకు సంబంధించిన అంచనాలను తగిన విధంగా సవరించడం జరిగింది. 1980-81 కి సంబంధించిన బడ్జెట్‌లో గ్రామీణరంగంలో అల్పకాలిక, మధ్యకాలిక దీర్ఘకాలిక రుణ అవసరాల నిమిత్తం తగిన కేటాయింపులు చేయడం జరిగింది. కింది పట్టికలోని విషయాలను పరిశీలిస్తే 1980-81 బడ్జెట్‌కాలంలో వివిధ తరహాల రుణాలకు ఎంతెంత మొత్తం కేటాయించింది తెలుసుకోవచ్చు.

(లక్షల రూపాయలలో)

| వరస పథకం | 1978-79 లెక్కలు | 1979-80 కి సవరించిన మొత్తం | 1980-81 బడ్జెట్ అంచనాలు |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| ***దీర్ఘకాలిక రుణ పథకం*** | | | |
| **a. A.P.C.C.A.D డిబెంచర్‌లకోసం పెట్టుబడి** | | | |
| (i) సాధారణ డిబెంచర్‌లు | 40.000 | 20,00 | 55.00 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| (ii) స్పెషల్ డిబెంచర్‌లు | 330.00 | 340.00 | 320.00 |
| b. ప్రాథమిక వ్యవసాయాభివృద్ధి బాంకుల వాటా మూలధనంలో పెట్టుబడికోసం | 9.00 | 14.00 | 1.00 |
| c. కమాండ్ ఏరియాలలో గీర్ఘకాలిక పథకాలను అమలుచేయడానికి అవసరమైన సిబ్బందికోసం | 13.667 | 20.00 | 18.00 |
| d. ఇతర ప్రాంతాలలో దీర్ఘకాలిక పథకాలను అమలుచేయడానికి అవసర మైన సిబ్బందికోసం | 23.315 | 24.134 | 24.439 |
| e. ఆంధ్రప్రదేశ్ కేంద్ర వ్యవసాయాభివృద్ధి బాంకు సహాయార్థం | 0.924 | 0.260 | 0.180 |
| *అల్పకాలిక, మధ్యకాలిక ఋణపథకం* | | | |
| a. సహకార సంఘాల వాటా మూలధనంకోసం | 355.295 | 264.00 | 183.00 |
| b. సహకార పరపతి సంఘాల సహాయంకోసం | 21.662 | 22.020 | 17.870 |
| c. వివిధ సహకార పరపతి సంఘాల సిబ్బందికోసం | 0.890 | — | — |
| d. వ్యవసాయ పరపతి స్థిరీకరణ నిధికోసం | | | |
| (i) రాష్ట్రప్రభుత్వంవాటా | — | 200.00 | 100.00 |
| (ii) కేంద్ర ప్రభుత్వంవాటా | 200.00 | 200.00 | 150.00 |
| e. సహకార పరపతి సంఘాల సహాయార్థం | — | 19.500 | — |
| f. రిజిస్ట్రేషన్ ఫీజు రీఇంబర్స్‌మెంట్సు కోసం | 168.778 | 107.00 | 119.00 |
| g. సిబ్బంది సహకార సంఘాలకు అప్పులు ఇవ్వడానికి | 6.00 | .... | .... |
| మొత్తం | 1169.531 | 1230.914 | 988.489 |

ఆంధ్రప్రదేశ్ కేంద్ర సహకార వ్యవసాయాభి వృద్ధి బ్యాంకు భూమి అభివృద్ధికిగాను దీర్ఘకాలిక రుణ సదుపాయాలను కల్పిస్తున్నది. ఈ కార్యక్రమనిర్వహణ దానికి అనుబంధంగా ఉన్న 205 ప్రాథమిక వ్యవసాయాభివృద్ధి బాంకుల ద్వారాజయప్రదంగా సాగిస్తున్నది. ఈ కేంద్ర బాంకు తన విధానాన్ని ప్రస్తుత పరిస్థితులకు అనువుగా మలుచుకొంటూ వీలైనంత నంతవరకు రుణ విధానాన్ని విస్తృత ప్రాతి పదికపై ఏర్పరచుకొంటున్నది. ఈ బాంకు అందించే మొత్తం రుణంలో 15% సన్నకారు రైతులకోసం, 3% రుణాలను షెడ్యూల్డ్ జాతులు, షెడ్యూల్డ్ తెగల వారికోసం కేటాయిస్తున్నది.

***1978-79 లో సాధించిన విజయాలు :*** దీర్ఘకాలిక రుణాలకింద 1978-79 లో రూ. 55 కోట్లు ఇవ్వవలెనని మొదట్లో అనుకొన్నా ఆ సంవత్సరాంతానికి ఈ పథకం అందించిన పరపతి రూ. 57.38 కోట్లు దాటింది. ఈ పథకం కింద అంతకు ముందు ఏడాది కేవలం 47.68 కోట్లు మాత్రమే అందించ గలిగింది. రుణాలేకాక రాష్ట్రప్రభుత్వ డిబెంచర్ల కొనుగోలు కోసం 370 లక్షల రూపాయలు పెట్టుబడి పెట్టింది.

దీర్ఘకాలిక రుణాల పంపిణి ఏ ఏ కార్యక్రమాలకోసం జరిగిందో పరిశీలిస్తే సహకార రంగం వ్యవసాయాభి వృద్ధికి ఎంతగా పాటుపడుతూ ఉందో తెలుసుకోవచ్చు.

**1978-79 లో దీర్ఘకాలిక రుణాల పంపిణి**

| అవసరము/పని | నంబరు | మొత్తం రూ. లక్షలలో |
|---|---|---|
| గొట్టపు బావులు | 2981 | 112.97 |
| మామూలు బావులు | 26,405 | 1,186.00 |
| ఆయిల్ ఇంజన్‌లు | 14,667 | 614.00 |
| ఎలెక్ట్రిక్ మోటార్లు | 5,047 | 182.46 |
| ట్రాక్టర్‌లు | 1,236 | 821.18 |
| బీడుభూములను బాగుచేయడానికి, పొగాకు బారన్‌లు, విద్యుచ్ఛక్తి డిపాజిట్‌లు మొదలైన వాటికోసం | | 2,807.85 |
| మొత్తం | | 5,738.40 లక్షలులేదా 57.38 కోట్లు. |

**అల్పకాలిక — మధ్యకాలిక రుణాలు**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 6,550 ప్రాథమిక సహకార పరపతి సంఘాలు, 26 మధ్యస్థ సహకార కేంద్ర బాంకులు, రాష్ట్ర స్థాయిలో ఆంధ్రప్రదేశ్ కో-ఆపరేటివ్ బాంక్‌లు పనిచేస్తున్నాయి. వీటన్నిటి ద్వారా రాష్ట్రంలోని వ్యవసాయదారులకు అవసరమైన రుణం అందివ్వడం జరుగుతోంది. ఈ సంస్థలు 1977-78 లో 75.14 కోట్లు, 1978-79 కరీఫ్

కాలంలో 66.11 కోట్లు మేరకు పరపతి సౌకర్యాలు అందచేసినాయి. దీనికి తోడు 1979-80 అంతానికి అదనంగా 30 కోట్ల రూపాయలు అందజేయగలవని భావిస్తున్నారు. కాని మొదట్లో అనుకొన్నట్లు 150 కోట్లు (1979-80 కి) లక్ష్యాన్ని చేరుకోలేక పోతున్నాయి. దీనికి కారణం ప్రతికూలంగా ఉన్న వాతావరణ పరిస్థితులేనని పేర్కొనడం జరిగింది.

అల్పకాలిక రుణంగా ఇస్తూ వచ్చిన సగటు మొత్తాన్ని ఇంతకు ముందు మాదిరి పంట వేసిన పొలంలోని ఎకరానికి 52/- రూ. కాక 1982-83 నాటికి రూ. 169/-కు పెంచాలని నిర్ణయించినారు. 1980-81లో అల్పకాలిక రుణాలకింద 170 కోట్ల రూపాయలు పంచి పెట్టాలని మొదట్లో నిర్ణయించి నప్పటికి, ప్రణాళికా సంఘం సలహా మేరకు దానిని 130 కోట్లకు తగ్గించవలసి వచ్చింది.

ఈ పథకంలో భాగంగా రుణాలుగా ఇచ్చే మొత్తంలో 75% మొత్తాన్ని సన్నకారు రైతులకు అందేటట్లు చూడాలని, రుణాలకోసం దరఖాస్తు పెట్టుకొన్న వారిలో సన్నకారు రైతులకు ప్రాధాన్యం ఇవ్వాలని నిర్ణయించినారు. దీని ఫలితంగా 1978-79 లో సన్నకారు రైతులకు రూ. 49.35 కోట్ల మొత్తాన్ని పంపిణీ చేసినారు. ఈ మొత్తం మొత్తం రుణాలలో 61% ఉంటుంది. 1979 కరీఫ్ కాలంలో సన్నకారు రైతులకు పంపిణీ చేసిన రుణం 36.10 కోట్లు అంటే మొత్తం రుణంలో ఇది 58.3%ఉంది.

సన్నకారు రైతులకు ప్రాధాన్యం ఇవ్వడంతోపాటు షెడ్యూల్డ్ కులాలవారికి మొత్తంలో 15% షెడ్యూల్డ్ జాతుల వారికి 3% అందేటట్లు చూడాలని నిశ్చయించినారు. దీని దృష్ట్యా 1978-79లో షెడ్యూల్డ్ జాతుల వారికి రూ. 5.22 కోట్లు, షెడ్యూల్డ్ తెగలవారికి రూ.1.53 కోట్లు పంపిణీ చేయడం జరిగింది. 1980-81 లో పై రెండు వర్గాలవారికి ఇంతకు ముందు సంవత్సరం కంటే ఎక్కువ మొత్తాలను కేటాయించాలనే ఆలోచన ఉంది. ఈ విధంగా చేయడం వల్ల సమాజంలోని బలహీన వర్గాలవారి ఆర్థిక పరిస్థితి మెరుగు పడుతుందనే ఆశ ఉంది.

## మధ్యకాలిక రుణాలు

అల్పకాలిక రుణాలేకాక సహకార సొసైటీలు రైతులు సాగుచేసే భూముల ఉత్పాదకతను పెంచడానికి తోడ్పడేవిధంగా బావులను అమర్చుకోవడానికి, పాతవాటిని బాగుచేయించుకోవడానికి, పంపుసెట్లను అమర్చుకోవడానికి రుణ సదుపాయాలను కల్పిస్తున్నది. వీటికితోడు రైతులకు ఇతర వృత్తుల ద్వారా ఆదాయ మార్గాలను కల్పించే ఉద్దేశంతో పాడి పరిశ్రమ, కోళ్ళు, గొర్రెల పెంపకం మొదలైన ఉప వృత్తులను ప్రోత్సహిస్తున్నాయి. అనావృష్టికి గురి అయ్యే ప్రాంతాలలోని రైతులకు సహాయం చేయటానికి, సన్నకారురైతుల అభివృద్ధి సంస్థను స్థాపించడానికి కూడా పథకాలను చేపట్టడం జరుగుతూఉంది. వీటన్నింటిని దృష్టిలో ఉంచుకొని 1974-75 లో ఇచ్చిన రుణ సహాయం మొత్తం రూ. 3.40 కోట్లను 1979-80 నాటి రూ. 10.00 కోట్లకు పెంచే ప్రయత్నంలో విజయం సాధించినాయి. ఈ పన్నులన్నింటికిగాను 1980-81 సంవత్సరంలో 10 కోట్లు ఖర్చు పెట్టాలని అంచనావేసినారు.

ఆంధ్రప్రదేశ్‌లోని తీర ప్రాంతాలు ఈ మధ్య తుఫాను తాకిడికి బాగా దెబ్బతిన్న విషయం తెలిసిందే. ఈ విధంగా దెబ్బతిన్న నెల్లూరు, ప్రకాశం జిల్లాలలోని రైతుల పరిస్థితులను సరిదిద్దడానికి అనువైన పథకాలను రాష్ట్ర ప్రభుత్వం రూపొందించింది. ఈ పథకం కింద ప్రకాశం, నెల్లూరు జిల్లాలకు ఆ యా జిల్లాలలోని సహకార కేంద్ర బాంకులు అందించిన సహాయం ఎట్లా ఉందో కింద పట్టిక తెలుపుతుంది.

మొత్తం రూ. లక్షలలో

| | ప్రకాశం జిల్లా సహకార కేంద్ర బాంకు | నెల్లూరుజిల్లా సహకార కేంద్ర బాంకు |
|---|---|---|
| 1. 1979 లో వ్యవసాయ పనులకు (కాలిక) కరీఫ్ కాలంలో ఇచ్చిన రుణాలు | 433.11 | 315.87 |
| 2. రబీకాలంలో ఇవ్వదలుచుకొన్న రుణాలు | 150.00 | 150.00 |
| 3. ఆకుతోటలను బాగుచేయడానికిగాను | .... | 1.86 |
| 4. చౌడు తొలగించడానికి | 1.37 | 0.94 |
| 5. అరటి, పత్తిపంటలకోసం | .... | 7.03 |
| 6. మధ్యకాలిక రుణాలు | 40.77 | 35.43 |
| 7. వినియోగానికి | 1.36 | .... |
| 8. బకాయిలను ప్రత్యేకించడం | 223.82 | 203.82 |

అనావృష్టి వంటి ప్రకృతి సహజమైన పరిస్థితులు ఏర్పడిన ప్రాంతాలలోని రైతులు చెల్లించవలసిన అల్పకాలికరుణాలను మధ్యకాలిక, దీర్ఘకాలికరుణాలుగా మార్పడం జరుగుతూ ఉంటుంది. ఇట్లాంటి ప్రకృతి వైపరీత్యాల వల్ల సహకార సంఘాలకు వసూలు కావలసిన రుణాలు నిలిచిపోవడం, సహకార సంస్థలు, బాంకులు ఆర్థికమైన ఒడుదుడుకులను లోను కావడం జరగవచ్చు. ఇటువంటి సంకట పరిస్థితులను దృఢంగా ఎదుర్కోవడానికి తగిన శక్తిని కల్పించే ఉద్దేశంతో రాష్ట్రంలో వ్యావసాయిక పరిస్థితి స్థిరీకరణ నిధిని ఏర్పాటు చేయడం జరిగింది. ఈ నిధినుంచి సహకార బాంకులకు అవసర సహాయాలలో నిధులను అప్పు రూపంలోను, గ్రాంట్‌ల రూపంలోను అందించడం జరుగుతుంది. 1978-79 సంవత్సరంలో రూ. 6.17 కోట్లను విడుదల చేయవలసిందిగా భారత ప్రభుత్వాన్ని కోరడం, వారు ప్రారంభంలో 200 లక్షలను విడుదల చేయడం జరిగింది. ఇందులో 50 లక్షలు అప్పుగాను, 150 లక్షలు గ్రాంట్‌గాను ఇచ్చినారు. 1980-81 కి గాను 150 లక్షలను బడ్జెట్‌లో కేంద్రసహాయ పథకం కింద కేటాయించినారు.

పైన పేర్కొన్న నిధికి రాష్ట్ర ప్రభుత్వం 15% డబ్బును కేటాయించవలసి వస్తుంది. ఈ నిధికి ఆంధ్రప్రదేశ్ స్టేట్ కో- ఆపరేటివ్ బాంకు 10% ఇవ్వవలసి ఉంటుంది. తక్కిన 60% రిజర్వ్ బాంకు సమకూరుస్తుంది. ఈ నిధికి అవసరమైన మొత్తాన్ని దృష్టిలో ఉంచుకొని రాష్ట్ర బడ్జెట్‌లో 1980-81 గాను 100 లక్షలను కేటాయించడం జరిగింది.

**వినియోగ పరపతి**

రాష్ట్రంలోని సహకార సంఘాలు వ్యావసాయిక పరపతినే ప్రధానాంశంగా తీసుకొన్న వినియోగ అవసరాల నిమిత్తం కూడా ఇతోధికంగా సహాయంచేస్తున్నాయి. మన రాష్ట్రంలోని సహకార సంస్థలు సమాజంలోని వెనకబడిన తరగతుల ప్రజలకు వినియోగ పరపతిని కూడా సమకూరుస్తున్నాయి. ప్రణాళికా సంఘం సభ్యుడైన శ్రీ బి. శివరామన్‌గారి నివేదికలో పేర్కొన్నట్లుగా ఇటువంటి రుణ సదుపాయాలను ½ ఎకరంఅంతకన్న తక్కువ కమతాలున్న బడుగురైతులకు, వ్యవసాయ కూలీలకు, గ్రామీణ చేతి పనివారికి, కల్పిస్తున్నారు. ఇటువంటి రుణాలను గ్రామస్థాయిలోని ప్రాథమిక సహకార పరపతి సంఘాల ద్వారా అందజేస్తారు. 1976-77 లో వినియోగ అవసరాలకోసం రూ. 19.35 లక్షలు, 1977-78 లో 38.21 లక్షలు ఇచ్చినారు. ఈ రకమైన రుణాలివ్వడంలో కొంత నష్టభయం ఉంది. ఈ భయాన్ని తొలగించడానికి, దాని ఫలితంగా ఏర్పడే ఒడుదుడుకులను తట్టుకోవడానికి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు కొత్తధనం ఇస్తాయి. 1978-79 లో రాష్ట్రప్రభుత్వం ఇందుకుగాను సహకార సంఘాలకు 5.756 లక్షల మొత్తాన్ని అందజేసింది. 1979-80 సంవత్సరానికి ఈ పథకం కింద రూ.2,87,295 రూపాయలు రాష్ట్రప్రభుత్వం మంజూరు చేసింది. 1980-81 బడ్జెట్‌లో ఈ పద్దు కింద 3.37 లక్షలు కేటాయించడం జరిగింది.

సహకార పరపతి సంస్థల శక్తి సామర్థ్యాలు డిపాజిట్ల సేకరణపై ఎక్కువగా ఆధారపడి ఉంటాయి. డిపాజిట్లను సేకరించడంలో ఎంతోశ్రద్ధా శక్తులు చూపించి సహకార సంస్థల బాంకుల డెపాజిట్ మొత్తాలను పెంచాలని పెద్ద ఎత్తున ప్రయత్నాలు 1972-73 నుంచి జరుగుతూనే ఉన్నాయి. ఇట్లాంటి డిపాజిట్ మొత్తాలు 1972-73 లో 22.56 కోట్లు ఉండేవి. 1978-79 నాటికి అది 64.70 కోట్లకు పెరిగినాయి. 1972-73 లో ఉన్న 116 సహకార సంస్థల శాఖలు 1978-79 సంవత్సరానికి 310 వరకు పెరిగినాయి. 1979-80 నాటి డిపాజిట్‌ల స్థాయిని 70 కోట్లకు పెంచాలని పథకం వేశారు.

మన రాష్ట్రంలో పనిచేస్తున్న 26 సహకార కేంద్ర బాంకులలో 12 బాంకులను బలహీనమైనవిగా గుర్తించారు. వీటికి స్వస్థత చేకూర్చడానికి గ్రాంట్‌ల రూపంలో ధనసహాయం అందించి రంగంలో అవి నిలదొక్కుకోవడానికి అవసరమైన సహాయం చేయడం సహకారోద్యమం ఒక భాగంగా ఉంటూ ఉన్నది. ఈ పథకం కింద రాష్ట్ర ప్రభుత్వం 1978-79 కి గాను 13.82 లక్షలు అందజేసింది. ఈ విధంగా సహాయం పొందిన సహకారబాంకులలో అనంతపురం, కాకినాడ, మహబూబ్‌నగర్ లలోని సహకార బాంకులు ముఖ్యమైనవి. 1979-80 సంవత్సరానికి 2.31 లక్షల సొమ్మును బలహీలమైన బాంకులకు అందజేయడానికి సంబంధించిన ప్రతి పాదనలు ప్రభుత్వ పరిశీలనలో ఉన్నాయి.

## రైతు సేవాసొసైటీలు

1976 లో ఏర్పాటు చేసిన వ్యవసాయదారుల సేవా సొసైటీలకు సంబంధించిన జాతీయ కమిషన్ సిఫారసులననుసరించి రైతు సేవా సొసైటీలను ఆంధ్రప్రదేశ్‌లో కూడా స్థాపించినారు. ఇట్లాంటి వాటిలో ముఖ్యంగా పేర్కొనదగినవి (a) సన్నకారు రైతుల సేవా సంఘము, (b) అనావృష్టికి లోనయ్యే ప్రాంతాలకు సంబంధించిన పథకాలు, (c) కమాండ్ ఏరియా అభివృద్ధి సంఘము, ఈ రకమైన సేవా సొసైటీలు సంఘటిత గ్రామీణ పరపతి సేవలను అందజేస్తాయి. (ఇందులో అల్పకాలిక, మధ్యకాలిక, దీర్ఘకాలిక రుణాలు కూడా ఉంటాయి). ఇంతేకాక రైతులకు అవసరమైన సాంకేతిక సలహాలను కూడా అందజేస్తాయి. ఇంత వరకు ఈ పథకం కింది మన రాష్ట్రంలో 63 సొసైటీలను నెలకొల్పినారు. వీటిలో 53 ని వాణిజ్య బాంకులు, 10 సహకార బాంకులు స్థాపించినాయి. 1980-81 సంవత్సరంలో 8 ప్రస్తుతం పనిచేస్తున్న ప్రాంతీయ గ్రామీణబాంకుల ప్రాంతంలో 20 రైతు సేవా సొసైటీలను నెలకొల్ప వలెననే సంకల్పం ఉంది. రైతు సేవా సొసైటీలు వివిధ తరహా పరపతి కింద ఇంత వరకు 551.68 లక్షల రూపాయలను రైతులకు అందజేయ గలిగినాయి.

## గిడ్డంగి సౌకర్యాలు—మార్కెటింగ్

వ్యవసాయదారులకు పరపతి సమకూర్చినంత మాత్రాన సహకార సొసైటీల బాధ్యత తీరదు. పరపతితోబాటు విక్రయం, ప్రోసెసింగ్, గిడ్డంగి వంటి కార్యకలాపాలకు సంబంధించిన సౌకర్యాలు కూడా వారికి సమకూర్చినప్పుడే వ్యవసాయం లాభసాటిగా రూపొందడానికి అవకాశముంటుంది. గ్రామీణ పరపతి పరిశీలనా సంఘం వారి సంఘటిత పథకంలో పరపతిని విక్రయం, తదితర కార్యకలాపాలతో జోడించడం జరిగింది. అంటే సహకార పరపతి విధానంలో ఒక క్రొత్త ధోరణి, దశ ప్రారంభమైనాయి.

వ్యవసాయ వస్తువులను నిలవ చేయడానికి గిడ్డంగులను దేశమంతటా నిర్మించాలని, ఈ కార్యక్రమం చేపట్టడానికి జాతీయ సహకార అభివృద్ధి, గిడ్డంగుల బోర్డును, అఖిలభారత గిడ్డంగుల కార్పొరేషన్‌ను, రాష్ట్ర గిడ్డంగుల కార్పొరేషన్‌ను స్థాపించాలని పై సంఘం సూచించింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ప్రస్తుతం 306 ప్రాథమిక మార్కెటింగ్ సొసైటీలు, 20 జిల్లాస్థాయి సహకార మార్కెటింగ్ సొసైటీలు పనిచేస్తున్నాయి. ఇవి సమర్థవంతంగా పని చేయడానికి, రైతులు పండించే పంటకు మంచి మార్కెట్ లభించేటట్టు చూసే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం కృషి చేస్తూ ఉంది. రసాయనిక ఎరువుల వ్యాపార నిమిత్తం సహకార సొసైటీలకు "మార్జిన్ మని" నిబంధనలకు సంబంధించి కొని మినహాయింపులు ఇవ్వమని రిజర్వ్ బాంకు వాణిజ్య బాంకులకు సలహా ఇచ్చింది. అందువల్ల రాష్ట్రప్రభుత్వం ఇందుకుగాను ఏమీ కేటాయించవలసిన అవసరం కలగలేదు. సహకార సొసైటీల సమాఖ్య రసాయనిక ఎరువుల ఉత్పత్తి దారులవద్ద వాటిని కొనుగోలుచేసి జిల్లా, గ్రామీణస్థాయిలలోని సహకారమార్కెటింగ్

సొసైటీలద్వారా రైతులకు సరఫరా చేస్తున్నది. దీనికి సంబంధించి రాష్ట్రప్రభుత్వం 13.50 కోట్ల రూపాయలను సహకార సొసైటీల సమాఖ్యకుహామీగా నిలిచింది. సహకారమార్కెటింగ్ సొసైటీల ద్వారా 1978-79 లో 1.093 లక్షల మెట్రిక్ టన్నుల ఎరువులు రైతులకు సరఫరా అయినాయి. 1979 - 80 సంవత్సరంలో కరీఫ్, రబీ కాలాలలో 69,997 మెట్రిక్ టన్నుల రసాయనిక ఎరువులను [వీటివిలువ 11.20 కోట్ల రూపాయలు] సహకార మార్కెటింగ్ సొసైటీలు రైతులకు సప్లయ్ చేయగలిగినాయి.

రాష్ట్రంలోని అనేక సహకార సొసైటీలకు తగిన అవస్థాపన సౌకర్యాలు లేవు దీనికితోడు కొన్నింటికి తగినంత చర మూలధనం కూడా అందుబాటులో లేదు. ఫలితంగా మార్కెటింగ్ కార్య కలాపాలనుగాని, ప్రోసెసింగ్ కార్యక్రమాలనుగాని ఫల వంతంగా నెరవేర్చలేక పోతున్నాయి. ఇట్లాంటి ఇబ్బందులను ఎదుర్కొంటూనే కొన్ని సహకార సొసైటీలు వినియోగ వస్తువుల సేకరణ పంపిణీ బాధ్యతలను చేపట్టినాయి. కొన్ని సంస్థలు ప్రోసెసింగ్ యూనిట్లను కూడా నడుపుతున్నాయి.

సహకార మార్కెటింగ్ సంస్థలు ఎదుర్కొంటున్న సమస్యలను దృష్టిలో ఉంచుకొని జాతీయ సహకారాభివృద్ధి కార్పొరేషన్ అనంతపురంలో ఉన్న వేరుసెనగ నూనె ఉత్పత్తి కేంద్రానికి సహాయ పడటానికిగాను మార్జిన్ ద్రవ్యంగా 1978-79 లో ఆంధ్రప్రదేశ్ కో-ఆపరేటివ్ మార్కెటింగ్ ఫెడరేషన్‌కు 23.10 లక్షలరూపాయలు సమకూర్చింది.

మన రాష్ట్రంలో జనుము కొనుగోలు చేయడంలో మధ్యవర్తులను తొలగించడానికి జూట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా శ్రీ కాకుళంజిల్లా సహకార మార్కెటింగ్ సొసైటీని తన ఏజంట్‌గా నియమించింది. ఈ సందర్భంలో శ్రీకాకుళం మార్కెటింగ్ సంఘానికి 15 లక్షల మార్జిన్ మనీని అందచేయడం జరిగింది. 1980-81 సంవత్సరం బడ్జెట్‌లో మార్జిన్ మనీకిగాను 8 లక్షల రూపాయలను కేటాయించడం జరిగింది.

## ప్రోసెసింగ్ సహకార సంఘాలు

వ్యావసాయికోత్పత్తి పథకానికి మద్దతుగా ప్రోసెసింగ్ కో ఆపరేటివ్ యూనిట్‌లను ఏర్పాటుచేయడం ప్రారంభించారు. ఈ సంస్థలను స్థాపించడానికి జాతీయ సహకార సంస్థల కార్పొరేషన్, రాష్ట్రప్రభుత్వం సహాయం చేస్తున్నాయి. ఈ పథకంలో భాగంగా 189 ప్రోసెసింగ్ యూనిట్‌లను ఏర్పాటుచేయడం జరిగింది. ఇందులో 144 రైసుమిల్లులు కూడా ఉన్నాయి. ఇట్లాంటి ప్రొసెసింగ్ యూనిట్‌లు ఎక్కడెక్కడ స్థాపించారో కింది పట్టిక వివరిస్తుంది.

| నంబరు | జిల్లా | సంఘాల సంఖ్య | సభ్యత్వం | చెల్లించిన మూల ధనం | చర మూల ధనం | మొత్తం అప్పులు | ప్రోసెస్ చేసిన మొత్తం (టన్నులలో) |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1. | శ్రీకాకుళం | 7 | 409 | 1 | 24 | 30 | .... |
| 2. | విశాఖపట్నం | 24 | 1,275 | 38 | 65 | 65 | .... |
| 3. | తూర్పుగోదావరి | 12 | 2,293 | 1,347 | 5,792 | 6,018 | 1,052 |
| 4. | పశ్చిమగోదావరి | 4 | 4,812 | 2,265 | 15,322 | 19,154 | .... |
| 5. | కృష్ణా | 4 | 2,420 | 396 | 1,410 | 2,005 | 11 |
| 6. | గుంటూరు | 2 | 300 | 267 | 755 | 644 | 126 |
| 7. | ప్రకాశం | .... | .... | .... | .... | .... | .... |
| 8. | నెల్లూరు | .... | .... | .... | .... | .... | .... |
| కోస్తాఆంధ్ర మొత్తం | | 53 | 11,509 | 4,314 | 23,368 | 27,916 | 1,189 |
| 9. | కర్నూలు | .... | .... | .... | .... | .... | .... |
| 10. | చిత్తూరు | 3 | 1,139 | 349 | 502 | 573 | .... |
| 11. | కడప | .... | .... | .... | .... | .... | .... |
| 12. | అనంతపూరు | 2 | 2,494 | 249 | 932 | 1,166 | .... |
| రాయలసీమ మొత్తం | | 5 | 3,633 | 598 | 1,434 | 1,739 | .... |
| 13. | హైదరాబాదు | .... | .... | .... | .... | .... | .... |
| 14. | మహబూబ్‌నగర్ | 24 | 960 | .... | .... | .... | .... |
| 15. | మెదక్ | ... | .... | .... | .... | .... | .... |
| 16. | నిజామాబాదు | .... | .... | .... | .... | .... | .... |
| 17. | కరీంనగర్ | .... | .... | 63 | 254 | 227 | .... |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| 18. | ఆదిలాబాద్ | 95 | 1,354 | 259 | 1,307 | 1,304 | 240 |
| 19. | వరంగల్ | 2 | 5,484 | 345 | 1,637 | 1,606 | 240 |
| 20. | ఖమ్మం | .... | .... | .... | ... | .... | .... |
| 21. | నల్గొండ | .... | .... | .... | .... | .... | .... |
| | తెలంగాణా మొత్తం | 121 | 2,798 | 667 | 3,198 | 3,137 | 480 |
| | ఆంధ్రప్రదేశ్ మొత్తం | 179 | 17,940 | 5,579 | 28,000 | 32,892 | 1,669 |

ప్రోసెసింగ్ యూనిట్‌లను స్థాపించడానికిగాను 1980-81 బడ్జెట్‌లో కింది మొత్తాలను కేటాయించడం జరిగింది.

| నంబరు | పథకం | 1978-79 కి సంబంధించిన పద్దులు | సవరించిన పద్దులు 1979-80 | 1980-81 బడ్జెట్ అంచనాలు |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| 1. | ప్రోసెసింగ్ యూనిట్ల మానేజ్‌మెంటుకు ఇచ్చే సబ్సిడీ | 0.018 | 0.200 | 0.100 |
| 2. | ప్రోసెసింగ్ యూనిట్‌లకు ఇచ్చే సహాయం | | | |
| | (a) రాష్ట్రప్రభుత్వంవాటా | 1.00 | 7.00 | 7.00 |
| | (b) జాతీయ సహకారాభివృద్ధి కార్పొరేషన్ వాటా | 10.239 | 20.00 | 10.250 |
| 3. | సాంకేతిక రిపోర్ట్‌ల తయారీకోసం | .... | 0.250 | 0.250 |
| | మొత్తం | 11.257 | 27.450 | 17.600 |

ప్రోసెసింగ్ యూనిట్‌లకు రాష్ట్ర ప్రభుత్వం జాతీయ సహకారాభివృద్ధి కార్పొరేషన్‌లు ఇతోధికంగా సహాయంచేస్తున్నాయి. ఆరో ప్రణాళికాకాలంలో ప్రోసెసింగ్ యూనిట్‌ల స్థాపనకు కొన్ని ప్రతిపాదనలను కూడా రాష్ట్రప్రభుత్వం చేసింది. అట్లా చేసిన ప్రతిపాదనలలో కింద వివరించినవి ముఖ్యమైనవి.

| ప్రొసెసింగ్ యూనిట్‌లు | | సంఖ్య |
|---|---|---|
| 1. | పప్పు ధాన్యం మిల్లులు | 1 |
| 2. | పత్తి మిల్లులు (గింజతీయడం) | 5 |
| 3. | కోల్డ్‌స్టోరేజి | 1 |
| 4. | కాగితం తయారీ | 5 |
| 5. | పండ్లు, కూరగాయల యూనిట్‌లు | 5 |
| 6. | వేరుసెనగనూనె మిల్లులు | 20 |
| 7. | పేపర్ బాలింగ్ యూనిట్‌లు | 15 |
| 8. | కోళ్ళ ఆహారం తయారుచేసేవి | 5 |
| 9. | జూట్ బాలింగ్ యూనిట్‌లు | 10 |
| | మొత్తం | 67 |

## వినియోగదారుల సహకార సంఘాలు

రాష్ట్రంలో ప్రస్తుతం (1979-80) లో 950 ప్రాథమిక సహకార సొసైటీలు, 179 తాలూకాస్థాయి సూపర్‌బజార్‌లు, 25 మహిళా సూపర్ బజారులు పనిచేస్తున్నాయి. ఇవి వినియోగదారులకు అవసరమైన నిత్యవాడక వస్తువులను న్యాయమైన ధరలకు విక్రయించి, వారికి తోడ్పడుతున్నాయి. కానీ ఈ మధ్య కాలంలో అనేకచోట్ల పనిచేస్తున్న సూపర్‌బజార్లు భారీనష్టాలకు గురిఅయి మూతపడినాయి. 1980-81 సంవత్సరానికి సంబంధించిన బడ్జెట్‌లో వినియోగదారుల సహకార సొసైటీల కోసం రూ. 48 లక్షలు కేటాయించడం జరిగింది. కంట్రోలు సరుకులైన పంచదార, కిరసనాయలు, ముతకరకం బట్టవంటి నిత్యవాడకం వస్తువులను గ్రామీణ ప్రజలకు సులభంగా అందించే బాధ్యత గ్రామస్థాయిలోని ప్రాథమిక సహకార సొసైటీలకు అప్పజెప్పడం కూడా జరిగింది.

## సేద్య సహకార సంఘాలు

సేద్యసహకార సొసైటీల ప్రధానోద్దేశం, పరిమితంగాను, చిన్నచిన్న కమతాలుగాను ఉన్న భూములను సహకార ప్రాతిపదికపై ఉమ్మడిగా వ్యవసాయంచేసి, భూమి ఉత్పాదకతను పెంచడం, మొత్తం వ్యవసాయోత్పత్తిని పెంచడం. ఈలక్ష్యసాధనకుగాను, ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం 2807 సేద్యసహకార సొసైటీలు రిజిస్టర్ అయినాయి. వాటిలోని సభ్యులసంఖ్య 1.18 లక్షలు, ఈ సొసైటీల అధీనంలోని భూవిస్తీర్ణం 3.14 లక్షల ఎకరాలు. ఇంతవరకు అమలు జరిపిన పథకాల వివరాలు, 1980-81 బడ్జెట్‌లో కేటాయించిన మొత్తం వివరాలు కింది ట్టిక లోచూడవచ్చు.

| నంబరు | పథకం | 1978-79 పద్దులు | సవరించిన పద్దులు 1979-80 | బడ్జెట్ అంచనాలు 1980-81 |
|---|---|---|---|---|
| 1. | సేద్య సహకార సొసైటీల కార్యక్రమాల నిర్వహణకు అవసరమైన సిబ్బందికోసం | 2.156 | 2.630 | 2.330 |
| 1. | సేద్య సహకార సొసైటీలకు ఇస్తున్న సహాయం కోసం | 10.542 | 7.00 | 3.300 |
| 3. | రిపేర్ సెంటర్‌లకు ఇస్తున్న సహాయంకోసం | | | |
| | (a) జాతీయ సహకారాభివృద్ధి కార్పొరేషన్‌వాటా | .... | 6.00 | 0.750 |
| | (b) రాష్ట్రప్రభుత్వం వాటా | .... | .... | 0.500 |

సేద్య సహకార సొసైటీలలో ముఖ్యంగా షెడ్యూలు జాతులు, షెడ్యూలు తెగలు వెనకబడిన తరగతుల రైతులు సభ్యులుగా ఉంటారు. ఈ రకమైన 113 సొసైటీలకు రాష్ట్రప్రభుత్వం ఇతోధికంగా సహాయం అందజేస్తూనే ఉంది.

## కార్మిక సహకార సొసైటీలు

శరీర కష్టంచేసే కార్మికులకోసం, కార్మిక సొసైటీలను ఏర్పాటుచేయడం జరిగింది. ఈ సొసైటీల హరిజనులు, గిరిజనులు, వెనకబడిన తరగతులకు చెందిన కార్మికుల సమస్యలను పరిశీలించి, పరిష్కరించడానికి ముఖ్యంగా ప్రయత్నిస్తాయి. ప్రస్తుతం మనరాష్ట్రంలో 989 కార్మిక సహకార సొసైటీలు పనిచేస్తున్నాయి.

ఈ పథకం ప్రదానోద్దేశం పబ్లిక్ వర్క్సులకు సంబంధించి ఎంతో కాలంగా అమలులో ఉన్న కాంట్రాక్ట్ పద్ధతిని తొలగించి దాని స్థానంలో కార్మిక సహకార సొసైటీలను ఏర్పరచడం, కార్మికులకు న్యాయమైన కూలీ లభించేటట్లు చూడటం, కంట్రాక్టర్‌ల దురాగతాలు, దోపిడీనుంచి కార్మికులను రక్షించడం.

ఇట్లాంటి కార్మిక సహకార సొసైటీల స్థాపన, అభివృద్ధికిగాను, రాష్ట్రప్రభుత్వం తగిన ధన సహాయం - వాటామూలధనం సమకూర్చడం, నిర్వహణకు సంబంధించి సబ్సిడీ ఇవ్వడం, నిర్వహణకుగాను ఓవర్‌సీర్‌లను ఏర్పాటుచేయడం, పనిముట్లు కొనడానికి అప్పులు సబ్సిడీలు ఇవ్వడం మొదలైన పద్ధతులలో తోడ్పడుతున్నది.

అడవులలో సాగుతున్న పనులకు సంబంధించి ఫారెస్ట్‌హాప్ లేబరు సొసైటీలను ఏర్పాటుచేయడం కూడా జరుగుతూఉంది. ఇటువంటి సహకార సంఘాలవల్ల గిరిజన కార్మికులకు ఎంతో లాభం కలుగుతోంది.

## పంచదార ఫ్యాక్టరీలు : సహకారరంగం

ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న మొత్తం 26 పంచదార ఫ్యాక్టరీలలో 13 ఫ్యాక్టరీలు సహకార రంగంలో ఉన్నాయి. సహకార రంగంలోని పంచదార ఫ్యాక్టరీల వివరాలు

1. ఆముదాలవలస, శ్రీకాకుళంజిల్లాలోని ఆముదాల వలస సహకార వ్యవసాయ పారిశ్రామిక సొసైటీ లిమిటెడ్.
2. అనకాపల్లిలోని అనకాపల్లి కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్.
3. చిత్తూరులోని చిత్తూరు కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్.
4. విశాఖపట్నం జిల్లాలోని చోడవరం కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్, గోవాడ.
5. కడపలోని కడప కో ఆపరేటివ్ షుగర్ లిమిటెడ్.
6. విశాఖపట్టణం జిల్లాలోని ఏటి కొప్పాక కో ఆపరేటివ్ అగ్రికల్చరల్ అండ్ ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్.
7. నిజామాబాద్‌లోని నిజామాబాద్ కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్.
8. పశ్చిమగోదావరి జిల్లాలోని, పాలకొల్లు కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్.
9. నెల్లూరు జిల్లాలోని, పినాకినీ కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్, కొవ్వూరు,
10. విశాఖపట్టణం జిల్లాలోని తాండవ కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్.
11. చిత్తూరు జిల్లాలోని శ్రీ వేంకటేశ్వర కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్.
12. విశాఖపట్టణం జిల్లాలోని శ్రీ విజయరామ గజపతి కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్, భీమసింగి.
13. పశ్చిమగోదావరి జిల్లాలోని వెస్ట్‌గోదావరి కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్.

21)

## పంచదార ఫ్యాక్టరీలు పనిచేసినతీరు 1978-79

| పంచదార ఫ్యాక్టరీ | ప్రస్తుత స్థాపితశక్తి | చెరకుగానుగ ఆడేశక్తి (లక్షల మె. టన్నులలో) | | ఉత్పత్తి అయిన పంచదార (మె. టన్నులు) | | పంచదార దిగుబడిశాతం | |
|---|---|---|---|---|---|---|---|
| | | 1978-79 | 1977-78 | 1978-79 | 1977-78 | 1978-79 | 1977-78 |
| 1 | 2 | 3 | 4 | 5 | 9 | 7 | 8 |
| అముదాలవలస | 1,000 | 0.88 | 2.26 | 0.08 | 0.18 | 9.10 | 7.88 |
| అనకాపల్లి | 1,000 | 0.62 | 1.05 | 0.05 | 0.09 | 8.62 | 9.04 |
| చిత్తూరు | 1,600 | 1.73 | 2.50 | 0.15 | 0.21 | 8.92 | 8.50 |
| చోడవరం | 1,600 | 1.35 | 1.86 | 0.11 | 0.15 | 8.47 | 8.15 |
| కడప | 1,250 | 0.65 | 1.41 | 0.06 | 0.11 | 8.78 | 7.60 |
| ఏటి కొప్పాక | 1,500 | 1.05 | 1.66 | 0.09 | 0.13 | 8.62 | 8.05 |
| నిజామాబాద్ | 1,000 | 1.53 | 1.38 | 0.15 | 0.14 | 9.75 | 9.96 |
| పాలకొల్లు | 1,600 | 0.76 | 1.77 | 0.06 | .... | 8.57 | 8.34 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| పినాకిని | 1,250 | 0.19 | NS | 0.01 | .... | 6.04 | .... |
| తాండవ | 350 | 0.27 | 0.53 | 0.02 | 0.05 | 8.67 | 8.83 |
| శ్రీ విజయరామగజపతి | 1,250 | 0.52 | 1.32 | 0.05 | 0.11 | 8.80 | 8.22 |
| శ్రీ వేంకటేశ్వర | 1,250 | 0.59 | 0.38 | 0.04 | 0.02 | 7.51 | 5.37 |
| పశ్చిమగోదావరి | 1,250 | 1.01 | 1.65 | 0.09 | 0.14 | 8 82 | 8.58 |
| మొత్తం | 15,900 | 11.15 | 17.77 | 0.96 | 1.48 | 8.61 | 8.33 |

పైన పేర్కొన్న 13 పంచదార ఫ్యాక్టరీలకు తోడుగా సహకార రంగంలో నెలకొల్పిన సంద్యాల కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్, ఫ్యాక్టరీ 1980-81 నాటికి చెరుకు గానుగ ఆడించడం ప్రారంభిస్తుందని అంచనా వేస్తున్నారు. ఇదేకాక సహకార రంగంలో కింద పేర్కొన్నవి కొత్తగా స్థాపించ దలచుకొన్న సహకార పంచదార ఫ్యాక్టరీలు.

1. శ్రీ హనుమాన్ కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్, హనుమాన్ జంక్షన్, కృష్ణాజిల్లా.
2. పాలేరు కో ఆపరేటివ్ షుగర్స్, రాజేశ్వరపురం, ఖమ్మం జిల్లా
3. నాగార్జునా కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్, గురజాల, గుంటూరుజిల్లా
4. అన్నపూర్ణ కో ఆపరేటివ్ షుగర్స్ లిమిటెడ్, తెనాలి, గుంటూరుజిల్లా
5. కొత్తకోట కో ఆపరేటివ్ షుగర్స్, విశాఖపట్టణం

## ఇతరరకాల సహకార సంఘాలు

సమాజంలో వెనకబడిన తరగతుల - హరిజన, గిరిజన తరగతుల - ఆర్థిక సాంఘిక పరిస్థితులను మెరుగుపరచడానికి, స్వయం ఉపాధి అవకాశాలు కల్పించడానికి, పెట్టుబడి దారుల దురాగతాల నుంచి, దోపిడీనుంచి అసహాయులైన పేదకార్మికులను, వృత్తులవారిని రక్షించడానికి ప్రభుత్వం ఎన్నో విధాలైన సహకార సంఘాలను ఏర్పాటు చేస్తూనే ఉంది. అట్లా ఏర్పాటు చేసిన వాటిలో ప్రధానంగా పేర్కొన దగినవి, 1. రజకుల సహకార సంఘాలు, 2 క్షురకుల సహకార సంఘాలు, 3. రిక్షావారి సహకార సంఘాలు మొదలైనవి షెడ్యూల్డ్‌కులాలు, తెగలు, వెనకబడిన వర్గాల ప్రజలలో సాంకేతికవృత్తి, విద్యలను అభ్య సించిన వారికి తగిన ఉపాధి కల్పించే ఉద్దేశ్యంతో 1. పందుల పెంపకానికి సంబంధించిన సహకార సంఘాలను, 2. డ్రైవర్ల సహకార సంఘాలను, 3. ప్రింటింగ్ ప్రచురణ సహకార సంఘాలను కూడా ప్రత్యేక సహకార సంఘాలుగా ఏర్పాటుచేయడం జరిగింది.

*రజక సహకార సంఘాలు :* ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం 728 రజక సహకార సంఘాలు పనిచేస్తున్నాయి. ఈ సంఘ సభ్యులకు ఒక్కొక్కరికి రూ, 35/- వరకు ధనసహాయం చేస్తారు. వారి వృత్తికి సంబంధించిన పరికరాలను సప్లయ్ చేస్తారు. 1979 మార్చినాటికి 13,443 మంది రజకులకు 34.55 లక్షల రూపాయలు ధనసహాయంగా అందించడం జరి గింది. 1980-81 బడ్జెట్‌లో ఇందుకుగాను 2.00 లక్షలు కేటాయించారు.

*క్షురకుల సహకారసంఘాలు :* మన రాష్ట్రంలో ఇప్పుడు 431 సంఘాలు ఉన్నాయి. ఈ సంఘ సభ్యులకు తల కొక్కంటికి 350/- ధనసహాయం, వారి వృత్తికి అవసరమైన పని ముట్లు అందజేయడం జరుగుతుంది. ఈ పథకానికి గాను రాష్ట్ర ప్రభుత్వం 7,227 మంది సభ్యులకు సహాయం చేయడానికి 21.58 లక్షలరూపాయలు మంజూరు చేసింది. 1980-81 సంవత్సరానికిగాను 2.00 లక్షల రూపాయలు కేటాయించింది. దీనివల్ల 1000 మంది క్షుర కులు లాభం పొందుతారని అంచనా.

*పందుల పెంపకానికి సంబంధించిన సహకార సంఘాలు :* మన రాష్ట్రంలో ఇప్పటికి 99 సహకార సొసైటీలున్నాయి. ఇందులో 2,308 మంది సభ్యులున్నారు. వీరిలో 800 మంది సభ్యులకు సహాయం అందివ్వడానికి 1978-79 ల- 10.06 లక్షల రూపాయలు ఖర్చు చేయడం, 1979-80 సంవత్సరానికి వీరి సహాయార్థం 5.75 లక్షలు కేటాయించినారు.

పైన చెప్పిన సహకార సొసైటీలేకాక ప్రత్యేకమైన కొన్ని సహకార సొసైటీలను ఏర్పాటు చేయడం మొదలైంది. ఇట్లాంటి ప్రత్యేక సొసైటీలలో ముఖ్యంగా పేర్కొనదగినవి పండ్లు కూరగాయలు అమ్ముకొనేవారికోసం ఏర్పాటు చేసిన సొసైటీలు, చిన్నచిన్న వ్యాపారం చేసేవారికోసం ఏర్పాటు చేసిన సొసైటీలు. ఇట్లాంటి సొసైటీల సభ్యులలో 411 మందికి 1978-79 లో 2 లక్షల వరకు సహాయం అందివ్వడం జరిగింది. ఈ ధన సహాయాన్ని ఏర్పాటు చేసిన 15 సహకార సొసైటీల ద్వారా అందించినారు. ఇట్లాంటి వర్గాల వారికి కేటా యించిన మొత్తం 1980-81 నాటి 7.75 లక్షలకు పెంచినారు.

*రిక్షా నడిపేవాళ్ళ సహకార సంఘాలు :* ఈ రకమైన సహకార సంఘాలను స్థాపించడం లోని ముఖ్యోద్దేశం రిక్షాబండ్లు లాగేవాళ్ళ ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచడం, ప్రయివేట్ రిక్షా యజమానుల దోపిడీ నుంచి పేద రిక్షావాళ్ళను కాపాడటం. ఇట్లాంటి సహకార సంఘాలు రాష్ట్రంలో 400 వరకు ఉన్నాయి. ఈ సంఘాల ద్వారా కొత్త రిక్షా ఖరీదు మొత్తాన్ని రూ. 1000/- సభ్యులకు అందజేస్తారు. 1978-79 ఆఖరు నాటికి 12,640 మంది సభ్యులకు లాభం చేకూరింది. వీరికి పంచిన మొత్తం 96.60 లక్షలు. 1979-80 సంవత్సరానికి ఇట్లాంటి పథకానికిగాను 7.00 లక్షలు కేటాయించడం జరిగింది. దీనివల్ల మరో 700 మందికి లాభం చేకూరుతుంది.

*ఎడ్లబండ్లునడిపేవారి సహకార సంఘాలు :* ప్రస్తుతం రాష్ట్రంలో 78 ఎడ్లబండి నడిపే వాళ్ళ సహకార సంఘాలు పనిచేస్తున్నాయి. ఇంత వరకు 1,962 మంది సభ్యులకు తల కొక్కింటికి రూ. 2,000/- చొప్పున ధనసహాయం అందించడం జరిగింది. 1979-80 నాటికి మరో 192 మంది సభ్యులకు ఆర్థిక సహాయం చేయడానికి రూ. 3.35 లక్షలు కేటాయించి నారు. 1980-81 సంవత్సరానికి గాను రూ. 5.75 లక్షల రూపాయల మేరకు సహాయం చేయాలని అంచనా వేసినారు.

*రవాణారంగంలో పనిచేసేవారి సహకార సంఘాలు :* రవాణాకు పనికొచ్చేవాహనాలు- ఆటోరిక్షాలు, టాక్సీలు మొదలైనవాటిని నడిపే డ్రైవర్ల సహకార సొసైటీలను నెలకొల్పడం జరిగింది. 1978 మార్చినాటికి 2,007 మంది ఆటోరిక్షా డ్రైవర్ల సహకార సొసైటీలకు రూ. 21.00 లక్షలు, 806 మంది సభ్యులున్న టాక్సీడ్రైవర్ల సహకారసొసైటీలకుగాను రూ. 30.07 లక్షలు, 45 మంది సభ్యులున్న లారీ డ్రైవర్ల సహకార సొసైటీలకుగాను రూ. 32.94 లక్షలు కేటాయించడం జరిగింది. ఇట్లాంటి సహాయ పథకం కింది వాహనం మొత్తం ఖరీదులో 10% ప్రభుత్వం 85% జాతీయం చేసిన బాంకులు, 5% సహకార సంఘం సభ్యులు భరిస్తారు. జాతీయం చేసిన బాంకులనుంచిలభించాల్సిన 85% మొత్తం రావడంలో ఎదురైన ఇబ్బందుల వల్ల ఆశించినంత మేరకు సహాయం జరగలేదు. 1978-79 సంవత్సరానికిగాను ప్రభుత్వం ఇవ్వవలసిన 10% వాటా ధనాన్ని 5 లారీ డ్రైవర్ల సహకార సొసైటీలకుగాను రూ. 1.354 లక్షలు కేటాయించినారు. 1979-80 కి గాను రూ. 0.75 లక్షలు కేటాయించినారు. కాని 1980 - 81 సంవత్సరపు బడ్జెట్‌లో ఈ పథకం కింద ఆర్థిక సహాయం నిమిత్తం ఏమీ కేటాయించలేదు.

సన్నకారు రైతులు, బలహీన వర్గాలవారు ఎడ్లు కొనుక్కోవడానికిగాను, గ్రామీణ ప్రాథమిక పరపతి సొసైటీల ద్వారా $2\frac{1}{2}$ ఎకరం మాగాణికాని, 5 ఎకరాల మెట్టపొలం గాని ఉన్న రైతులకు ఒక్కొక్కరికి రూ. 1,500/- ఇవ్వడానికి ఏర్పాట్లు చేశారు. ఈ పథకాన్ని 1979-80 లో ప్రారంభించారు. దీనికిగాను 2.25 లక్షలు కేటాయించినారు. ఈ మొత్తాన్ని 1980-81 బడ్జెట్‌లో 7.75 లక్షలకు పెంచినారు.

*ప్రింటింగ్, పబ్లిషింగ్ సహకార సంఘాలు :* ప్రస్తుతం రాష్ట్రంలో 30 సహకార సొసైటీలున్నాయి. వీటిని స్థాపించడంలోని ప్రధానోద్దేశం, ప్రింటర్లకు, బైండర్లకు, రచయి

తలకు ఉపాధి కల్పించడం. 1978-79 లో 662 మంది సభ్యులకు ఆర్థిక సహాయం లభించేటట్లు చూడటానికిగాను 16.52 లక్షలు కేటాయించినారు. 1980-81 సంవత్సరానికి సంబంధనాభావంవల్ల ఈ పథకానికి ఏమీ కేటాయించలేదు.

***మహిళా సంక్షేమ సహకార సంఘాలు :*** మహిళా సంక్షేమ సొసైటీలు ప్రస్తుతం 447 ఉన్నాయి. నిరాశ్రయులైనవారు, భర్తలు వదిలివేసినస్త్రీలు, మొదలైన స్త్రీల ఆర్థిక పరిస్థితులను మెరుగు పరచడమే. ఈ రకమైన సహకార సొసైటీల ముఖ్య ఆశయం. ఈ రకమైన సహకార సొసైటీలకుగాను 1979-80 సంవత్సరంలో 9.20 లక్షలు వ్యయం చేసినారు. 1979 మార్చిలో అంతమైన ఆర్థిక సంవత్సరానికి రూ. 32.63 లక్షలు ఈ పథకం కోసం వ్యయం చేయడం జరిగింది. 1980-81 సంవత్సరపు బడ్జెట్‌లో ఈ సొసైటీల కోసం 7.73 లక్షలు కేటాయించారు.

ఆరు సూత్రాల పథకం కింద సమాజంలో వెనకబడిన వర్గాలవారికి ఆర్థిక సహాయం అందించే పథకాలు ప్రవేశపెట్టినారు. 1978-79 లో ఈ తరగతులవారి కోసం ఏర్పాటైన సహకార సొసైటీలకు కేటాయించిన మొత్తాల వివరాలు కింది విధంగా ఉన్నాయి.

(కేటాయించినమొత్తం లక్షలలో)

| | కేటాయించినమొత్తం |
|---|---|
| 1. గ్రామీణ విద్యుదీకరణ సహకార సంస్థ, రాయచోటి, కడపజిల్లా | 02.7 |
| 2. కో ఆపరేటివ్ ఎలక్ట్రిసిటీ సప్లయ్ సొసైటీ లిమిటెడ్, సిరిసిల్లా, కరీంనగర్ జిల్లా | 2.87 |
| 3. ఎక్స్ బాండెడ్ లేబర్, చేవెళ్ళ తాలూకా, రగారెడ్డి జిల్లా | 2.08 |

సహకార సంఘం చరిత్రను పరిశీలిస్తే వాటిలక్ష్యాలు, కాల గమనంతో మారుతూ వచ్చినట్లు స్పష్టమవుతుంది. వాటిని ప్రారంభించిన తొలి రోజులలో అవి కేవలం రైతులకు రుణ సదుపాయాలను కల్పించడానికే పరిమితమైనాయి. కానీ కాలం గడిచే కొద్ది వాటి బాధ్యతలలో కూడా మార్పులు, చేర్పులు తేవలసిన అవసరం ఏర్పడింది. ఫలితంగా సహకార సొసైటీలు వివిధ రంగాలకు విస్తరించి బహుముఖంగా వ్యాపించినాయి. నేడు సహకార సొసైటీలు ప్రవేశించని రంగమంటూ లేదు. సహకారోద్యమం విజయవంతం కావాలంటే అ ఉద్యమంలో పాల్గొనే ప్రతివారు చిత్తశుద్ధితో పనిచేయడం ఎంతో అవసరం. ప్రజాస్వామ్య వ్యవస్థకు గ్రామీణ సహకార వ్యవస్థ ప్రాతిపదిక వంటిది. ఈ సహకార సొసైటీలు సక్రమంగా పనిచేసిననాడే మొత్తం ఆర్థిక వ్యవస్థ చక్కగా పనిచేసి, ప్రగతి సాధించడానికి వీలవుతుంది.

# 20

# సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడినప్పటి నుంచి మన రాష్ట్రంలో సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు అనేక రంగాలలో విస్తృతంగా నిర్వహించడం జరుగుతోంది. ఈ కార్యక్రమాలలో ముఖ్యంగా పేర్కొనవలసినవి :

1. హరిజన సంక్షేమం;
2. వెనుకబడిన తరగతుల వారి సంక్షేమం;
3. గిరిజనుల సంక్షేమం;
4. మహిళల, బాలల సంక్షేమం;
5. యువజన సంక్షేమం;
6. ముసలివారికి, అంధులకు సహాయం;
7. అనాథశరణాలయాలు;
8. ముష్టివారికి శరణాలయం;
9. అవిటివారికి సహాయం;
10. సాంఘిక అత్యాచారాలకు గురిఅయిన వారికి సహాయం మొదలైనవి.

సంఘంలో ఆర్థికంగా, సాంఘికంగా వెనుకబడిన బలహీన వర్గాలవారు హరిజనులు, ఇతర షెడ్యూల్డ్ కులాలవారు, గిరిజనులు, వెనుకబడిన కులాలవారు, మహిళలు, బాలలు అనే సంగతి గుర్తించి ప్రభుత్వం వారు ఆయా వర్గాలవారి సంక్షేమ కార్యక్రమాలను నిర్వహించడానికి ప్రత్యేక శాఖలను నెలకొల్పారు. అంతేకాక ఇతర ప్రభుత్వ శాఖలలోకూడా ఈ బలహీన వర్గాల సంక్షేమంకోసం ప్రత్యేక కార్యక్రమాలు ఉన్నాయి. బలహీన వర్గాల వారిని పైకి తీసుకురావాలంటే ముఖ్యంగా కింది రంగాలు ప్రత్యేకంగా కృషి చేయవలసి ఉంటుందని ప్రభుత్వం గుర్తించింది : 1. విద్య; 2. గృహవసతి, ఆరోగ్యపథకాలు; 3. ఆర్థికంగా వారి స్థితిని మెరుగుపరిచే పథకాలు; 4. సాంఘిక రక్షణ పథకాలు. ఈ పథకాలను గురించి సవివరంగా ఆయా శాఖలకు సంబంధించినంత వరకు వేరు వేరుగా కింద సమీక్షించడం జరిగింది.

# హరిజన సంక్షేమ కార్యక్రమాలు

1971 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూల్డ్ కులాలవారి జనాభా 57, 74, 548. ఇది రాష్ట్ర జనాభాలో 13.27% హరిజన సంక్షేమ శాఖవారు నిర్వహిస్తున్న కార్యక్రమాలు కింది అయిదు విభాగాలుగా వర్గీకరించ వచ్చు. 1. విద్య. 2. ఆరోగ్యము, 3. ఆర్థికాభివృద్ధి, 4. సాంఘిక రక్షణ. 5. సాంఘిక సమైక్యీకరణం, పౌర సంబంధాలు పబ్లిసిటీ, ఇతరపథకాలు.

## విద్య

షెడ్యూల్డ్ తరగతుల వారికి విద్యా సౌకర్యాలు కల్పించడంలో ముఖ్యమైన భాగంగా ప్రభుత్వంవారు 1 వ తరగతి నుంచి డాక్టరేట్ స్థాయి వరకు అన్ని తరగతుల విద్యార్థులకు వృత్తి విద్యలకు స్కాలర్‌షిప్‌లు మంజూరు చేస్తున్నారు.

***1 ప్రీ మెట్రిక్ స్కాలర్ షిప్‌లు :*** రాష్ట్ర ప్రభుత్వం వారు 6 వ తరగతి నుంచి 10 వ తరగతి వరకు హాస్టల్‌లో ఉన్న విద్యార్థులను బయట ఉండే విద్యార్థులకు కూడా షెడ్యూల్డ్ కులాల వారికి స్కాలర్‌షిప్‌లు ఇస్తున్నారు. 1976-77 నుంచి 5 వ తరగతి విద్యార్థులకు కూడా ఈ పథకాన్ని అమలు పరుస్తున్నారు. 1977-78 నుంచి 1, 2 తరగతుల విద్యార్థులకు కూడా ఈ సౌకర్యం కల్పించారు. 1, 2 తరగతుల వారికి 30 రూ. చొప్పున, 3-8 తరగతుల వారికి 45 రూ. చొప్పున, 9, 10 తరగతుల వారికి 85 రూ. చొప్పున స్కాలర్‌షిప్‌లు ఇస్తున్నారు. 1978-79 లో ఈ పథకం కింద 3—10 తరగతులలో 1,64,622 షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు 94.38 లక్షల రూపాయలు వ్యయం చేస్తారు. అదే సంవత్సరంలో 2.7 లక్షల మంది 1,2 తరగతుల విద్యార్థులకు 85.71 లక్షల రూపాయలు స్కాలర్‌షిప్‌ల రూపంలో ఇచ్చారు.

***2. కాన్వెంట్‌లు, ఇతర పేరుమోసిన పాఠశాలలో చదివే విద్యార్థులకు స్కాలర్ షిప్‌లు :*** హైదరాబాదు నగరంలో, జిల్లాలలోను కాన్వెంట్‌లలోను, పేరుమోసిన పాఠశాలలోను చదివే షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు స్కూల్ జీతం కట్టుకునే నిమిత్తం ఒక్కొక్కరికి సంవత్సరానికి రూ. 120 చొప్పున మంజూరు చేస్తున్నారు. ఇటీవల ఈ స్కాలర్‌షిప్ మొత్తాన్ని చదివే క్లాసునుబట్టి రూ. 20 - 30 అవధిలో ఉండేటట్లు పెంచారు.

***3. ఐ. టి. ఐ ల లోని షెడ్యూల్ కులాల విద్యార్థులకు స్టైఫెండ్‌లు :*** నెలకు రూ. 70/- చొప్పున కోర్స్ చదివినంతకాలం స్కాలర్‌షిప్ ఇస్తున్నారు. ఈ పథకం కింద 1978-79 లో 2,2442 మంది షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు 15.72 లక్షలరూపాయలు వ్యయం చేసారు.

***4. పోస్ట్ మెట్రిక్ స్కాలర్‌షిప్‌లు :*** షెడ్యూల్డ్ కులాల పోస్ట్ మెట్రిక్ విద్యార్థులకు భారత ప్రభుత్వంవారు రెసిడెన్షియల్,నా-న్ రెసిడెన్షియల్ స్కాలర్‌షిప్‌లు ఇస్తున్నారు. వారు చదివే కోర్సునుబట్టి ప్రస్తుతంహాస్టల్‌లో చదివేవారికి నెలకి రూ. 40 నుంచి రూ. 90 వరకు ఇస్తున్నారు.

***5. ఎమ్. డి., ఎమ్. ఎస్., ఎమ్. ఇ. ఇతర పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు చదివే షెడ్యూల్డు కులాల విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు :*** వైద్య, ఇంజనీరింగ్ శాఖలలో పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్స్‌లు చదివే షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు స్టైఫండ్‌లు లభిస్తున్నాయి కనక వారికి భారత ప్రభుత్వ స్కాలర్‌షిప్‌లు తీసుకొనే అర్హతలేదు. కాని స్టైఫండ్‌లు చాలక పోవడంచేత చాలా మంది షెడ్యూల్డ్ కులాల విద్యార్థులు ఈ కోర్స్‌లు చదవడానికి ఆసక్తి చూపడంలేదు. కనక ఎక్కువ మంది విద్యార్థులను ఈ కోర్స్‌లు చదివేటట్లు ప్రోత్సహించడానికి రాష్ట్ర ప్రభుత్వం వారు ఆ యా విద్యార్థులకు ప్రభుత్వం నుంచిగాని, విశ్వ విద్యాలయాలనుంచిగాని లభించే స్టైఫండ్లు కాక అదనంగా ఒక్కొక్కరికి నెలకి రూ. 100/- చొప్పున మంజూరు చేసినారు. ఈ విధంగా మొత్తం వారికి నెలకు స్టైఫండ్‌తో కలిపి రూ. 400/- ముడుతుంది. 1978-79 లో ఈ పథకం కింద మన రాష్ట్రంలో ఎమ్. డి., ఎమ్. ఎస్., ఎమ్. ఇ. చదివే షెడ్యూల్డ్ కులాల విద్యార్థులు మొత్తం 117 మంది ఉన్నారు. వీరికి రూ. 1.20 లక్షలు మంజూరు చేసినారు. 1979-80 1980-81 సంవత్సరాలలో ఈ మొత్తాన్ని 2.25 లక్షలకు పెంచారు.

***6. షెడ్యూల్డు కులాల రిసెర్చి స్కాలర్‌లకు స్కాలర్‌షిప్‌లు:*** ఎమ్.ఫిల్.,పి హెచ్.డి. చేసే షెడ్యూల్డు కులాల విద్యార్థులలో కొంత మందికి మాత్రమే యు. జి. సి. స్కాలర్‌షిప్‌లు లభిస్తున్నాయి. మిలిగిన వారికి కూడా స్కాలర్‌షిప్ సౌకర్యాలు కలుగచేసే నిమిత్తం 1979-80, 80-81 సంవత్సరాలలో రాష్ట్ర ప్రభుత్వం వారు 2 లక్షల రూపాయలు కేటాయించినారు.

***7. కాలేజిఅనుబంధ హాస్టల్‌లోని షెడ్యూల్డుకులాల విద్యార్థులకు పూర్తి మెస్ ఖర్చులు:*** రాష్ట్రంలో ప్రస్తుతం 116 కాలేజి అనుబంధ హాస్టల్‌లలో 7191 మంది షెడ్యూల్డ్ కులాల విద్యార్థులు ఉన్నారు. 1979 నవంబర్ నుంచి ఈ విద్యార్థులకిచ్చే స్కాలర్‌షిప్ మొత్తాన్ని పెంచారు. ఇంటర్మీడిట్ విద్యార్థులకు భారత ప్రభుత్వం వారు ఇచ్చే పోస్ట్‌మెట్రిక్ స్కాలర్‌షిప్ కన్నా అదనంగా రూ. 25 ఇస్తున్నారు. డిగ్రీ, పోస్ట్ గ్రాడ్యుయేట్ విద్యార్థులకు నెలకు రూ. 120 ఇస్తున్నారు.

## హాస్టల్ సౌకర్యాలు

మన రాష్ట్రంలో గవర్నమెంట్ హాస్టల్‌లలో ఉండే షెడ్యూల్ కులాల స్కూల్ విద్యార్థులకు భోజన, వసతి సౌకర్యాలు ఉచితంగా లభిస్తున్నాయి. స్కూల్ హాస్టల్‌లలో ఉండే విద్యార్థులకు 1979 అక్టోబర్ వరకు భోజన నిమిత్తం నెలకు రూ. 50/- చొప్పున ఇచ్చేవారు. నవంబర్ 1979 నుంచి 8, 9, 10 క్లాసుల విద్యార్థులకు నెలకు 75 రూ. ఇస్తున్నారు. అంతేకాక హాస్టల్ విద్యార్థులకు కాస్మెటిక్ చార్జిల కింద నెలకు 4 రూ — 10 రూ. వరకు ఇస్తున్నారు.

హరిజన సంక్షేమ శాఖవారు నిర్వహిస్తున్న హాస్టల్‌లలో హరిజనులే కాకుండా ఇతర వెనకబడిన తరగతులవారు కూడా ఉంటున్నారు. ఈ హాస్టల్‌లలో వివిధ కులాల వారికి రిజర్వేషన్‌లు కింది విధంగా ఉన్నాయి.

| | |
|---|---|
| షెడ్యూల్డ్ కులాలు | 60% |
| హరిజన్ క్రిష్టియన్‌లు | 15% |
| లిస్ట్‌లోచేరిన వెనకబడిన తరగతులవారు | 14% |
| ఆర్థికంగా వెనుకబడిన తరగతులవారు | 6% |
| షెడ్యూల్డ్ తెగలవారు | 5% |

మన రాష్ట్రంలో 1979-80 లో 1,460 గవర్నమెంట్ హాస్టల్‌లు ఉన్నాయి. వీటిలో 68 కాలేజి హాస్టల్‌లు. ఈ హాస్టల్‌లలో మొత్తం 1,07,053 మంది విద్యార్థులు ఉంటున్నారు.

ప్రభుత్వం వారు స్వయంగా నిర్వహిస్తున్న హాస్టల్‌లే కాకుండా విద్యార్థులు తమంతట తాము నిర్వహించ వీలున్న హాస్టల్‌లు 186 ఉన్నాయి. వీరికి కూడా భోజన వసతి నిమిత్తం ప్రభుత్వం ఇచ్చే స్కాలర్‌షిప్‌లు ప్రభుత్వహాస్టల్‌లలో ఉండే వారి మాదిరిగానే లభిస్తున్నాయి. షెడ్యూల్డ్ కులాలవారికిచ్చేరేటులోనే హరిజన్ క్రిష్టియన్ విద్యార్థులకు కూడా స్కాలర్‌షిప్‌లు లభిస్తున్నాయి.

ప్రస్తుతం 268 ప్రభుత్వ హాస్టల్‌లు మాత్రమే సొంత భవనాలలో ఉన్నాయి. మిగిలినవి ప్రైవేటు భవనాలలో ఉన్నాయి. హాస్టల్‌లకోసం యింకా భవనాలను నిర్మించడానికి ప్రభుత్వం చర్యలు తీసుకొంటున్నారు.

***హాస్టల్ విద్యార్థులకు దుస్తులు :*** ప్రభుత్వ హాస్టల్‌లలో ఉండే షెడ్యూల్డ్ తరగతుల విద్యార్థు లందరికి రెండేసి జతల చొప్పున దుస్తులు ఉచితంగా ఇస్తున్నారు. ఒక్కొకరికి ఇందు నిమిత్తం రూ. 51.50 లక్షలు కేటాయించారు.

## షెడ్యూల్డ్ కులాలవిద్యార్థులకు ప్రభుత్వ హాస్టళ్ళు జిల్లాలవారీ (1978-79)

| | జిల్లా | కాలేజి విద్యార్థులకు | | పాఠశాల విద్యార్థులకు | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|
| | | సంఖ్య | విద్యార్థులు | సంఖ్య | విద్యార్థులు | సంఖ్య | విద్యార్థులు |
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 1. | శ్రీకాకుళం | 2 | 115 | 54 | 3,920 | 56 | 3,405 |
| 2. | విశాఖపట్నం | 2 | 420 | 56 | 4,693 | 58 | 5,113 |
| 3. | తూర్పుగోదావరి | 4 | 275 | 70 | 4,440 | 74 | 4,715 |
| 4, | పశ్చిమగోదావరి | 2 | 60 | 119 | 8,083 | 121 | 8,143 |
| 5. | కృష్ణా | 5 | 460 | 121 | 7,831 | 126 | 8,291 |
| 6. | గుంటూరు | 2 | 120 | 57 | 4,080 | 58 | 4,200 |
| 7. | ప్రకాశం | 2 | 74 | 56 | 6,349 | 58 | 6,423 |
| 8. | నెల్లూరు | 2 | 150 | 96 | 7,468 | 98 | 7,618 |
| | కోస్తాఆంధ్ర | 21 | 1,674 | 629 | 46,234 | 650 | 47,908 |
| 9. | కర్నూలు | 2 | 80 | 70 | 4,571 | 72 | 4,651 |
| 10. | అనంతపూరు | 3 | 243 | 60 | 5,500 | 63 | 5,743 |
| 11. | కడప | 2 | 112 | 82 | 7,000 | 84 | 7,112 |

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| 12. | చిత్తూరు | 2 | 340 | 53 | 3,628 | 55 | 3,968 |
| | రాయలసీమ | 9 | 775 | 265 | 20,699 | 274 | 21,474 |
| 13. | హైదరాబాదు (నగర ప్రాంతం) | 10 | 690 | 18 | 1,273 | 28 | 1,963 |
| 14. | హైదరాబాదు (గ్రామీణ ప్రాంతం) | 2 | 60 | 19 | 1,615 | 21 | 1,675 |
| 15. | నిజామాబాదు | 1 | 30 | 39 | 2,490 | 40 | 2,520 |
| 16. | మెదక్ | 3 | 90 | 56 | 4,507 | 59 | 4,597 |
| 17. | మహబూబ్ నగర్ | 7 | 405 | 65 | 3,824 | 72 | 4,229 |
| 18. | నల్గొండ | 4 | 157 | 58 | 4,256 | 62 | 4,413 |
| 19. | వరంగల్ | 2 | 177 | 57 | 3,395 | 59 | 3,572 |
| 20. | ఖమ్మం | 5 | 230 | 49 | 3,353 | 54 | 3,583 |
| 21. | కరీంనగర్ | 2 | 110 | 34 | 2,639 | 36 | 2,749 |
| 22. | ఆదిలాబాద్ | 2 | 60 | 33 | 2,150 | 35 | 2,210 |
| | తెలంగాణ | 38 | 2,009 | 428 | 29,502 | 466 | 31,511 |
| | ఆంధ్రప్రదేశ్ | 68 | 4,458 | 1,322 | 96,435 | 1,390 | 1,00,893 |

మూలం : డైరక్టర్ ఆఫ్ హరిజన వెల్ఫేర్

## షెడ్యూల్డ్ జాతులు, విముక్తిజాతుల విద్యార్థులకు ప్రభుత్వ హాస్టళ్ళు (జిల్లాలవారీ 1978-79)

| | జిల్లా | షెడ్యూల్డు జాతులకు | | విముక్తిజాతులకు | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|
| | | సంఖ్య | విద్యార్థులు | సంఖ్య | విద్యార్థులు | సంఖ్య | విద్యార్థులు |
| | 2 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 1. | శ్రీకాకుళం | 16 | 1,390 | 1 | 50 | 17 | 1,440 |
| 2. | విశాఖపట్నం | 25 | 1,706 | 1 | 70 | 26 | 1,776 |
| 3. | తూర్పుగోదావరి | 18 | 1,225 | 1 | 50 | 19 | 1,275 |
| 4. | పశ్చిమగోదావరి | 16 | 966 | 1 | 64 | 17 | 1,030 |
| 5. | కృష్ణ | 17 | 1,245 | 2 | 133 | 19 | 1,378 |
| 6. | గుంటూరు | 24 | 1,993 | .... | .... | 24 | 1,993 |
| 7. | ప్రకాశం | 18 | 2,035 | 1 | 50 | 19 | 2,085 |
| 8. | నెల్లూరు | 15 | 1,160 | 1 | 75 | 16 | 1,244 |
| | కోస్తాఆంధ్ర | 149 | 11,729 | 8 | 492 | 157 | 12,221 |
| 9. | కర్నూలు | 6 | 410 | 3 | 150 | 9 | 560 |
| 10. | అనంతపూర్ | 5 | 880 | 2 | 253 | 8 | 1,133 |
| 11. | కడప | 7 | 580 | 1 | 50 | 8 | 630 |

| 1 | | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| 12. | చిత్తూరు | 10 | 693 | 1 | 81 | 11 | 774 |
| | రాయలసీమ | 28 | 2,563 | 7 | 534 | 35 | 3,097 |
| 13. | హైదరాబాదు | 4 | 330 | 3 | 310 | 7 | 640 |
| 14. | రంగారెడ్డి | 7 | 469 | 1 | 100 | 8 | 569 |
| 15. | నిజామాబాదు | 7 | 400 | 2 | 104 | 9 | 504 |
| 16. | మెదక్ | 8 | 515 | 1 | 70 | 9 | 585 |
| 17. | మహబూబ్‌నగర్ | 9 | 560 | 4 | 378 | 13 | 938 |
| 18. | నల్గొండ | 17 | 1,491 | 5 | 641 | 22 | 2,132 |
| 19. | వరంగల్ | 17 | 1,372 | 4 | 285 | 21 | 1,657 |
| 20. | ఖమ్మం | 28 | 1,700 | 3 | 200 | 31 | 1,900 |
| 21. | కరీంనగర్ | 9 | 525 | 1 | 60 | 10 | 585 |
| 22. | ఆదిలాబాద్ | 20 | 1,360 | 2 | 115 | 22 | 1,475 |
| | తెలంగాణ | 126 | 8,722 | 26 | 2,263 | 152 | 10,985 |
| | ఆంధ్రప్రదేశ్ | 303 | 23,014 | 41 | 3,289 | 344 | 26,303 |

మూలం : డైరక్టర్ ఆఫ్ హరిజన వెల్‌ఫేర్

## ఇతరవిద్యాపథకాలు

***1. జాతీయంచేసిన పాఠ్యగ్రంథాలు, పలకలు :*** షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు 1 నుంచి 10 తరగతులలో జాతీయంచేసిన పాఠ్యగ్రంథాలు ఉచితంగా ఇస్తున్నారు. ఇందు కోసం 1980-81 లో రూ. 77.73 లక్షలు కేటాయించినారు.

***2. బుక్ బాంకులు :*** డిగ్రీ తరగతులలోను, పోస్ట్‌గ్రాడ్యుయేట్ తరగతులలోను వైద్య ఇంజనీరింగ్, వ్యవసాయ, న్యాయశాస్త్ర కోర్సులలోను చదువుకునే షెడూల్డ్ కులాల విద్యార్థులకు తమ పాఠ్యగ్రంథాలను, రిఫెరెన్స్ గ్రంథాలను కొనుక్కోవాలంటే ఆర్థికంగాచాలా ఇబ్బందులకు గురి అవుతారు. అందుకోసం రాష్ట్రప్రభుత్వం అన్ని జిల్లాలలోను దశలవారీగా బుక్ బాంక్‌లను స్థాపించే పథకాన్ని చేపట్టినారు. ఇప్పటి వరకు హైదరాబాద్, విశాఖపట్నం, కర్నూల్, వరంగల్, తిరుపతి, తూర్పుగోదావరి జిల్లాలలో బుక్‌బాంక్‌లు స్థాపించడం జరిగింది. మిగిలిన జిల్లాలలో కూడా సంవత్సరానికి మూడేసి జిల్లాల చొప్పున ఈ పథకాన్ని చేపట్టడానికి నిశ్చయించినారు. వైద్య, ఇంజనీరింగ్ కోర్సులు చదివే షెడూల్డ్‌కులాల వారి కోసం ప్రత్యేకంగా బుక్‌బాంకులు స్థాపించడానికి భారత ప్రభుత్వంవారు కొంత ధనసహాయం చేస్తున్నారు. ఇది కాకుండా రాష్ట్ర ప్రభుత్వం కూడా అదనంగా కొంత మొత్తాన్ని ఈ పథకం కోసం ఖర్చు పెడుతున్నారు. అంతేకాకుండా ఐ.టి.ఐ. లలోను పాలిటెక్నిక్‌లలోను ఇంజనీరింగ్ కళాశాలలలోను, చదివే షెడూల్డ్ కులాల విద్యార్థులకు పుస్తకాలు, పరికాలు కొనుక్కోనేందును రాష్ట్రప్రభుత్వం ధనసహాయం చేస్తోంది.

***షెడ్యూల్డ్ కులాల అడ్వొకేట్‌లకు ధనసహాయం :*** షెడూల్డ్ కులాలకు చెందిన న్యాయశాస్త్ర గ్రాడ్యుయేట్‌లు కొత్తగా ప్రాక్టీస్ మొదలుపెట్టడానికి ఒక్కొక్కరికి ఎన్‌రోల్‌మెంట్ రుసుముకింద రూ.500/- న్యాయశాస్త్ర గ్రంథాలు కొనుక్కోవడానికి రూ. 1000/- చొప్పున ఏటేటా పదిమందికి రాష్ట్రప్రభుత్వం ధనసహాయం చేస్తున్నారు.

***4. ఐ.ఏ.ఎస్. శిక్షణకేంద్రం :*** షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల అభ్యర్థులకు ఐ.ఏ.ఎస్. పరీక్షకు శిక్షణ ఇచ్చే ఉద్దేశంతో 1976 లో రాష్ట్రప్రభుత్వం ఈ కేంద్రాన్ని హైదరాబాద్‌లో నెలకొల్పినారు. తరవాత ఈ కేంద్రంలో ఇతర కులాల వారిని కూడా చేర్చుకుంటున్నారు. ఇప్పుడు దీనిని స్వయం ప్రతిపత్తిగల సంస్థగా రూపొందించినారు.

పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్సులు చదివే షెడ్యూలు కులాల విద్యార్థులకు ఇంగ్లీష్‌లో ప్రత్యేక శిక్షణ ఇవ్వడానికి రాష్ట్రప్రభుత్వం ఒక పథకాన్ని రూపొందించింది. ఇది త్వరలోనే అమలులోకి వస్తుంది.

***5. ఆశ్రమపాఠశాల :*** షెడ్యూల్డ్ కులాలకు చెందిన బాలికలకోసం కరీంనగర్ జిల్లాలోని జమ్మికోటలో 1979-80 లో ఒక ఆశ్రమ పాఠశాలను నెలకొల్పినారు.

## ఆరోగ్య, గృహవసతి పథకాలు

***1. ఇళ్ళస్థలాలు :*** షెడ్యూల్డ్‌కులాల వారికి ఉచితంగా ఇళ్లస్థలాలు ఇచ్చే పథకం కింద రాష్ట్రప్రభుత్వం వారు భూములను సంపాదించడానికి పెద్దఎత్తున కార్యక్రమం నిర్వహిస్తు

న్నారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటి నుంచి ఇంతవరకు 49,548.17 ఎకరాల భూమిని 21.44 కోట్లరూపాయలవ్యయంతో రాష్ట్రప్రభుత్వంవారు సంపాదించారు. ఇందులో 21,262.05 ఎకరాల భూమిని ఇళ్లస్థలాలుగా ఇవ్వడం జరిగింది. ఇళ్లస్థలాలు ఇవ్వడం కాకుండా రోడ్లు, మురికి కాలవలు, మంచినీటి సరఫరా, విద్యుచ్ఛక్తి సరఫరా మొదలై సౌకర్యాలు కలగజేయడానికి కూడా రాష్ట్రప్రభుత్వం చర్యలు తీసుకొంటున్నారు. బలహీన వర్గాల గృహవసతి కార్యక్రమాల కోసం ప్రత్యేకంగా ఒక డైరక్టర్‌ను నియమించారు.

*2. ప్రజారోగ్యసౌకర్యాలు :* చాలా గ్రామీణ ప్రాంతాలలో షెడ్యూల్డ్‌కులాల జనాభాలకు తగినంత మంచినీరు సులువుగా అందుబాటులో లేకపోవడం పెద్ద సమస్యగా ఉంది. ఆ ప్రాంతాలలో తగినంత స్థలం లేకపోవడంవల్ల ఇరుకుగా ఉండటం, పారిశుద్ధ్య పరిస్థితులు సరిగా లేకపోవడం, రోడ్లు లేకపోవడం ఇవన్నీ కూడా షెడ్యూల్డ్‌కులాలవారి అసౌకర్యానికి దోహదం చేస్తున్నాయి. కొన్ని గ్రామాలలో అయితే వారికి స్మశాన వాటికలు కూడా లేవు. కనక ఇటువంటి సౌకర్యాలు అన్నీ కల్పించడం సాంఘిక సంక్షేమశాఖ కర్తవ్యంగా భావించి ఇందుకు తగిన చర్యలు తీసుకొంటున్నారు. ఆరోగ్యకరమైన మరుగుదొడ్లు ఏర్పాటుచేయడం కూడా ఈ కార్యక్రమంలో భాగంగా ఉంది.

## గృహవసతి కార్యక్రమాలు

బలహీన వర్గాలవారికి గృహవసతి కల్పించడానికి చాలా పథకాలు అమలులో ఉన్నాయి దేశంలో గృహవసతికి ఆర్థికసహాయంచేసే సంస్థలలో ప్రముఖమైనది. హౌసింగ్, అర్బన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (HUDCO) వారు గత 7 సంవత్సరాలలో (1979కిముందు) మనరాష్ట్రంలో బలహీన వర్గాలవారి గృహవసతి కార్యక్రమాలకోసం 23.78 రూ. కోట్లు మంజూరు చేయగా ఈ సంవత్సరం ఇప్పటి వరకు రూ. 17.14 కోట్లు మంజూరు చేసినారు. దీనిని బట్టి ఈ కార్యక్రమాలకు ఎంత ప్రోత్సాహం లభిస్తుందో గ్రహించవచ్చు. పూర్వం ఇల్లు కట్టుకొనేందుకు కొంతలో కొంత ఆర్థిక స్తోమత ఉన్నవారు మాత్రమే గృహవసతి కార్యక్రమాల కింద ప్రభుత్వం ఇచ్చే ఆర్థిక సహాయాన్ని వినియోగించుకో గలిగారు. అందువల్ల నిజంగా అవసరమున్నవారు చాలామంది ప్రభుత్వ సహాయాన్ని అందుకోలేక పోయేవారు. ఈ పరిస్థితిని చక్కబరచడానికి రాష్ట్రప్రభుత్వం కింది కార్యక్రమాలను చేపట్టినారు.

a. స్థలాలు, సేవలు కార్యక్రమం.

b. గ్రామీణ శాశ్వత గృహవసతి కార్యక్రమం.

c. నగర శాశ్వత గృహవసతి కార్యక్రమం.

ఈ కార్యక్రమాలను 50 మందిగాని అంతకన్న ఎక్కువమందిగాని ఉన్న సముదాయ ప్రాతిపదికగా అమలు జరుపుతున్నారు. ఈ విధంగా ఆర్థికసహాయం, సేవలు సాముదాయకంగా సులువుగా అందజేయడానికి వీలవుతుంది. ఈ కార్యక్రమం క్రింద సౌకర్యాలు కల్పిస్తున్నారు.

a. ఇళ్లస్థలాలను అభివృద్ధి చేయడం అంటే చదునుచేయడం వంటివి.

b. మంచినీరు, రోడ్లు, మురికికాలువలు, వీధిదీపాలు మొదలైనవి సమకూర్చడం.

c. శాశ్వత గృహనిర్మాణాన్ని చేపట్టడానికి వారి ఆర్థికస్తోమతను పెంపొందించడానికి ఉద్యాన పథకాలు మొదలైనవి ఏర్పాటుచేయడం.

d. తక్కువ వ్యయంతో గృహనిర్మాణాలు చేసుకోవడానికి సహాయం చేయడం.

**షెడ్యూల్డ్ కులాలవారికి వెనకబడిన వర్గాలవారికి ఇళ్ళస్థలాల పంపిణీ-జిల్లాలవారీ**
(31-3-1979 నాటికి)

| జిల్లా | ఆర్జించిన భూమి విస్తీర్ణం (ఎకరాలలో) | లబ్ధిపొందినవారి సంఖ్య |
|---|---|---|
| శ్రీకాకుళం | 261 | 4,246 |
| విశాఖపట్నం | 275 | 6.818 |
| తూర్పుగోదావరి | 431 | 7,597 |
| పశ్చిమగోదావరి | 230 | 3,185 |
| కృష్ణా | 247 | 4,415 |
| గుంటూరు | 3,330 | 5,010 |
| ప్రకాశం | .... | .... |
| నెల్లూరు | 537 | 7,689 |
| కోస్తాఆంధ్ర | 5,311 | 38,960 |
| కర్నూలు | 1,032 | 14,413 |
| అనంతపూరు | 260 | 5,242 |
| కడప | 180 | 2,081 |
| చిత్తూరు | 220 | 4,569 |
| రాయలసీమ | 1,692 | 26,309 |
| హైదరాబాదు | .... | .... |
| రంగారెడ్డి | 167 | 3,065 |
| నిజామాబాదు | 396 | 4,427 |
| మెదక్ | 319 | 4,162 |
| మహబూబ్‌నగర్ | 929 | 10,266 |
| నల్గొండ | 307 | 3,962 |
| వరంగల్లు | 174 | 2,445 |
| ఖమ్మం | 362 | 4,213 |
| కరీంనగర్ | 434 | 1,982 |
| ఆదిలాబాదు | 37 | 580 |
| తెలంగాణా | 3,135 | 35,102 |
| మొత్తం ఆంధ్రప్రదేశ్ | 10,138 | 1,00,371 |

మూలం : డైరెక్టర్ ఆఫ్ హరిజన్ వెల్‌ఫేర్, ఆంధ్రప్రదేశ్

## షెడ్యూల్డు తెగలకు, విముక్తజాతులకు ఇళ్ళ స్థలాల పంపిణీ జిల్లాలవారీ
(31-3-1979 నాటికి)

| జిల్లా | షెడ్యూల్డ్ కులాలు | | విముక్తజాతులు | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|
| | పంపిణీచేసిన భూమి విస్తీర్ణం (ఎకరాలలో) | లబ్ధిపొందిన వారి సంఖ్య | పంపిణీచేసిన భూమి విస్తీర్ణం (ఎకరాలలో) | లబ్ధిపొందిన వారి సంఖ్య | పంపిణీచేసిన భూమి విస్తీర్ణం (ఎకరాలలో) | లబ్ధిపొందిన వారి సంఖ్య |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| శ్రీకాకుళం | .... | .... | .... | .... | .... | .... |
| విశాఖపట్నం | 24.29 | 288 | .... | .... | 24.29 | 288 |
| తూర్పుగోదావరి | 3.66 | 77 | .... | .... | 3.66 | 77 |
| పశ్చిమగోదావరి | .... | .... | .... | .... | .... | .... |
| కృష్ణా | .... | .... | .... | .... | .... | .... |
| గుంటూరు | 45.26 | 511 | .... | .... | 45.26 | 511 |
| ప్రకాశం | 26.83 | 403 | .... | .... | 26.83 | 403 |
| నెల్లూరు | 34.74 | 345 | 9.24 | 124 | 43.98 | 469 |
| కోస్తా ఆంధ్ర | 134.78 | 1,624 | 9.24 | 124 | 144.02 | 1,748 |
| కర్నూలు | 4.52 | 78 | .... | ... | 4.52 | 78 |
| అనంతపూరు | 10.35 | 267 | 5.20 | 7.6 | 15.55 | 343 |
| కడప | .... | .... | 5.04 | 60 | 5.04 | 60 |
| చిత్తూరు | .... | .... | .... | .... | .... | .... |
| రాయలసీమ | 14.87 | 345 | 10.24 | 136 | 25.11 | 481 |
| హైదరాబాదు | .... | .... | .... | .... | .... | .... |
| నిజామాబాద్ | 20.31 | 237 | 6.09 | 81 | 26.40 | 317 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| మెదక్ | 0.34 | 28 | .... | .... | 0.34 | 28 |
| మహబూబ్‌నగర్ | .... | .... | 12.96 | .... | 12.96 | .... |
| నల్గొండ | 7.02 | 94 | .... | .... | 55.28 | 691 |
| వరంగల్ | 55.28 | 691 | .... | .... | 7.02 | 94 |
| ఖమ్మం | 20.23 | 268 | .... | .... | 20.23 | 268 |
| కరీంనగర్ | 1.08 | 15 | .... | .... | 1.08 | 15 |
| ఆదిలాబాదు | 14.29 | 263 | .... | .... | 14.29 | 263 |
| తెలంగాణా | 118.55 | 1,595 | 19.05 | 81 | 137.60 | 1,676 |
| మొత్తం ఆంధ్రప్రదేశ్ | 268.20 | 3,564 | 38.53 | 343 | 306.73 | 3,905 |

స్థలాలు, సేవలు కార్యక్రమం రుణాలు తీర్చలేనివారికోసం ఉద్దేశించబడినది. గ్రామీణ శాశ్వత గృహనిర్మాణ కార్యక్రమం రుణాలు తీర్చుకోగలిగిన వారికోసం ఉద్దేశించబడింది. దీనికి జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్‌వారు, హడ్‌కోవారు రుణసహాయం చేస్తున్నారు. ఒక్కొక్క ఇంటికి 400 రూ. అవుతుంది. ఇందులో సగం రుణంగాను, మిగిలినది ఆహార ధాన్యాల రూపంలో సహాయంగాను ఇస్తున్నారు. నగర శాశ్వత గృహవసతి పథకం కింద మురికి వాడలలో ఉంటూ, ప్రభుత్వంవారు ఇళ్ళ స్థలాలు ఇచ్చినప్పటికీ ఇళ్ళు కట్టుకునే పరిస్థితిలో లేనివారికి సహాయం చేస్తారు. ఈ పథకానికి హడ్‌కోవారి వద్దనుంచి రుణ సహాయం లభిస్తోంది. ఒక్కొక్క ఇంటి ఖరీదు రూ. 5,000 - 6,000 ఉంటుంది.

## ఆర్థికాభివృద్ధి పథకాలు

*ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డ్‌కులాల సహకార ఫైనాన్స్ కార్పొరేషన్:* మన రాష్ట్రంలో ఇటువంటి కార్పొరేషన్‌ను స్థాపించడం ఇతర రాష్ట్రాలకు మార్గదర్శకం అయింది. ఈ కార్పొరేషన్ 1974లో ప్రారంభించారు. ఇప్పుడు ఈ సంస్థ వాటాల మూలధనం 10 కోట్ల రూపాయలు దాటి పోయింది. ఈ కార్పొరేషన్‌కు అనుబంధంగా ప్రతి జిల్లాలోను ఒక షెడ్యూల్డు కులాల సేవా సహకార సంఘం ఉంటుంది. వ్యవసాయం, పాడిపరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు, వర్తక, వాణిజ్య రంగాలలో ఈ కార్పొరేషన్‌వారు అనేక రకాల పథకాలను చేపట్టినారు. డాక్టర్లు ప్రాక్టీస్ పెట్టుకొనేందుకు, చర్మకారులకు, పెట్రోల్ బంక్‌లు పెట్టుకొనే వారికి, లారీలు కొనుక్కోవడానికి, భూములు చదును చేసుకొనేందుకు ట్రాక్టర్లు కొనుక్కోవడానికి, ఇర్రిగేషన్ బావులు తవ్వుకోవడానికి, ఎలెక్ట్రిక్ మోటార్‌లు పంపుసెట్‌లు, ఆయిల్ ఇంజన్‌లు కొనుక్కోవడానికి, గ్రామీణ ప్రాంతాలలో సినిమాహాళ్ళు కట్టుకోడానికి, బియ్యం

మిల్లులు నెలకొల్పడానికి రుణ సహాయం ఈ కార్పొరేషన్‌వారు ఇచ్చినారు. 1979 నాటికి కార్పొరేషన్ వివిధ రంగాలలో అందజేసిన రుణసహాయం వివరాలు కింది పట్టికలో చూడవచ్చు.

| | పథకాలఖర్చు (లక్షలరూపాయలలో) | లాభం పొందినవారి సంఖ్య |
|---|---|---|
| 1. వ్యవసాయం | 1,268.33 | 87,249 |
| 2. పశువుల పెంపకం | 878.91 | 63,285 |
| 3. చిన్నతరహా పరిశ్రమలు, వ్యాపారం | 951.59 | 55,261 |
| 4. చేనేత పరిశ్రమ | 8.31 | 902 |
| 5. చేపల పెంపకం | 43.18 | 1,571 |
| 6. బస్సులు | 65.00 | 1,922 |
| 7. ఇతరాలు | 11.70 | 2,000 |
| | 3,227.07 | 2,12,190 |

రాష్ట్రస్థాయిలోను, జిల్లాస్థాయిలోను ఈ పథకాలను అమలు పరచడానికి అన్ని ప్రభుత్వ శాఖలు ఈ కార్పొరేషన్‌తో సహకరిస్తున్నాయి.

రోడ్లు తుడవడం, దొడ్లుతుడవడం ( **Scavenging** ) వంటి అశుభ్ర వృత్తులలో నిమగ్న లయినవారిని ఆ వృత్తుల నుంచి మళ్లించి ఇతర వృత్తులలో వారికి అవకాశాలు కల్పించడానికి కూడా ప్రభుత్వం ఫైనాన్స్ కార్పొరేషన్ ద్వారా కొన్ని పథకాలు అమలు పరుస్తున్నది.

**శిక్షణకార్యక్రమాలు**

షెడ్యూల్డు కులాలలో శిక్షణ పొందిన అభ్యర్థులు తక్కువగా ఉండడం వల్ల సాంఘిక సంక్షేమ శాఖవారు వారికి శిక్షణ ఇచ్చే కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. శిక్షణ సమయంలో ఒక్కొక్కరికి నెలకి రూ. 100 చొప్పున స్టైఫండ్ ఇస్తున్నారు. షార్ట్‌హాండ్ కోర్స్‌కు మాత్రం నెలకు రూ. 150 ఇస్తున్నారు.

***వృత్తి శిక్షణ :*** షెడ్యూల్డు కులాలవారికి వారి వారి సాంప్రదాయక ఆనువంశిక వృత్తులున్నాయి. ఉదాహరణ తోలుపనిచేయడం, తోలుపని, బుట్టలు అల్లటం, నేతపని, వడ్రంగి పని వంటివి. సరిఅయిన శిక్షణ, మూలధనం, ఇతర సదుపాయాలు లేక వీరిలో చాలామంది తమ నైపుణ్యాన్ని కోల్పోయి లాభదాయిక మయిన తమ వృత్తులను వదులుకోవలసిన పరిస్థితి ఏర్పడుతోంది. అందుకోసం వీరికి సహాయం చేయడంకోసం ప్రభుత్వ శిక్షణ - ఉత్పత్తి కేంద్రాలను ప్రారంభించినారు. ఇప్పుడు ఇటువంటి కేంద్రాలు 27 ఉన్నాయి. శిక్షణ పొందే వారికి నెలకు రూ. 40 నుంచి రూ. 60/- వరకు స్టైఫండు ఇస్తున్నారు. శిక్షణ పూర్తి అయిన

తర్వాత వారికి ఉచితంగా పనిముట్లు, అవసరమైతే మూలధనం కూడా ప్రభుత్వం వారు సమకూరుస్తున్నారు.

*దుస్తుల తయారీ కేంద్రాలు :* 12 జిల్లాలలో 17 దర్జీపని శిక్షణ కేంద్రాలను సాంఘిక సంక్షేమ శాఖవారు నడుపుతున్నారు. పశ్చిమగోదావరి, కడప జిల్లాలలో ఈ కేంద్రాలలో శిక్షణ ఇవ్వటమే కాకుండా హాస్టల్ విద్యార్థులకు దుస్తులు తయారుచేసే పనిని కూడా 1975 నుంచి ప్రారంభించారు. ఇంకా ఇతర కేంద్రాలలో కూడా దుస్తులు తయారుచేసే పని ప్రారంభించాలని ప్రతిపాదన ఉంది.

## ప్రత్యేక ఉద్యోగ పథకం

షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, వెనుకబడిన తరగతులు, ఆర్థికంగా వెనుకబడిన తరగతులలో చదువుకొని, నిరుద్యోగులుగాఉన్న యువకులకు ఉద్యోగావకాశాలు కల్పించడానికి ప్రత్యేకంగా ప్రభుత్వ సెక్రటరేట్‌లో 1978 లో ఒక విభాగాన్ని ఏర్పరచినారు.సివిల్ మెకానికల్ ఇంజనీరింగ్, టైప్‌రైటింగ్, షార్ట్‌హాండ్, వంటి కోర్స్‌లలోను, కోళ్ళపెంపకం, పట్టుపరిశ్రమ, కృత్రిమ శుక్రధారణ కార్యక్రమాలలో శిక్షణ ఇస్తున్నారు. వీటివల్ల సుమారు 12,000 మందికి లాభం కలుగుతోంది.

అంతేకాకుండా 1200 మందికి S.G.B.T. టీచర్లుగాను 350 మందికి B.Ed. అసిస్టెంట్‌గాను శిక్షణ ఇస్తున్నారు.

1115 మందికి ఐ.టి.ఐలలో శిక్షణ ఇస్తున్నారు. 280 మందికి సివిల్ ఇంజనీరింగ్ డిప్లమాకోర్స్‌లోను, 480 మందికి షార్ట్‌హాండ్‌లోను, ఇంకా మరికొంత మందికి ఇతర కోర్స్‌లలోను శిక్షణ ఇస్తున్నారు.

600 మంది స్త్రీలకు చేతికితొడుక్కునే గ్లోవ్‌లు, ఇతర తోలుసామగ్రి తయారుచేయడంలో శిక్షణ ఇస్తున్నారు.

2464 మందికి డ్రైవర్‌లు, మెకానిక్‌లు, కండక్టర్‌లు, క్లీనర్‌లుగా శిక్షణ ఇచ్చి APSRTC బస్సులలో ఉద్యోగాలు ఇచ్చినారు. ఈ సంవత్సరం కొత్తగా ప్రవేశపెట్టిన పథకం కింద 50 బస్సులు జంటనగరాలలో నడుపుతున్నారు. ఒక్కొక్కబస్సుకి ఇద్దరు డ్రైవర్‌లు ఒక మెకానిక్‌కు శిక్షణ ఇస్తారు. ఈ పథకం SETWIN వారి నిర్వహణలో అమలు జరుగుతోంది. ఆర్థిక సహాయం ఆంధ్రప్రదేశ్ స్టేట్‌ఫైనాన్స్ కార్పొరేషన్‌నుంచి లభిస్తోంది.

షెడ్యూల్డ్ కులాల వారికి జిల్లా స్థాయిలో సాంఘిక సంక్షేమ పథకాన్ని ప్రవేశపెట్టడానికి విజయవాడ, కడప, వరంగల్లులలో మూడు ప్రాంతీయ డైరెక్టరేట్లను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రారంభించింది. అట్టడుగు బీదరికంలో ఉన్న 50% మందికైనా సహాయం చేద్దామన్న ఉద్దేశంతో 1980-81 సంవత్సరంలో 377 లక్షల రూపాయల్ని కేటాయించడం జరిగింది.

# గిరిజన సంక్షేమ కార్యక్రమాలు

ఆంధ్రప్రదేశ్‌లో గిరిజనుల జనాభా 22.26 లక్షలు. రాష్ట్ర జనాభాలో ఇది 5.1%; మొత్తం 33 తెగలున్నాయి. వీరిలో చెంచులు, కోలమ్‌లు, కొండరెడ్లు అతి ఆదిమమైన తెగలుగా గుర్తించినారు. బంజారాలు, యెరుకులు, యానాదులు, చెంచులు, అత్యధికంగా షెడ్యూల్డు ప్రాంతానికి వెలుపల ఉంటారు. మిగిలినవారు ముఖ్యంగా షెడ్యూల్డు ప్రాంతంలోను, దానిచుట్టు పట్లా కేంద్రీకృతమై ఉంటారు. షెడ్యూల్డ్ ప్రాంతం 30,028 చ.కి.మీ ఉంటుంది ఇది మొత్తం రాష్ట్రవైశాల్యంలో 10.9% ఉంటుంది. ఇందులో శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, ఖమ్మం, వరంగల్, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్ జిల్లాలలో 6,172 గ్రామాలున్నాయి. ఆదిలాబాదు, వరంగల్, ఖమ్మం, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి విశాఖ పట్టణం, శ్రీకాకుళం జిల్లాలను, 7 సమగ్ర గిరిజనాభివృద్ధి ఏజన్సీలుగా ఏర్పాటు చేసినారు. షెడ్యూల్డ్ తెగలలో అక్షరాస్యత 5.3% ఉంది. వారి ప్రధానవృత్తి వ్యవసాయం.

గిరిజనులకుండే ఇబ్బందులన్నింటిని తొలగించి వారిని జాతీయ జీవిత ప్రవాహంలో చేర్చడానికి అవసరమైన అనేకరకాల కార్యక్రమాలను గిరిజన సంక్షేమ పథకాలు నిర్వహిస్తున్నాయి. వీటన్నిటిలోకి విద్యాకార్యక్రమాలు ముఖ్యస్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. ఈ రంగంలో విద్యార్థులకు ఉచిత భోజన, వసతి సౌకర్యాలు, పాఠ్యగ్రంథాలు, నోట్‌బుక్‌లు, దుస్తులు స్కాలర్‌షిప్‌లు ఇస్తున్నారు గిరిజనులలో తెలివైన పిల్లలను పేరుమోసిన పాఠశాలలలో జేర్పించి అందుకయ్యే యావత్తుఖర్చు ప్రభుత్వం భరిస్తోంది. ఐ.టి.ఐల లోను ఇతర సాంకేతిక శిక్షణ సంస్థలలోను గిరిజనులను జేర్పించి వారికి స్కాలర్‌షిప్‌లు ఇస్తున్నారు.

ఆర్థికాభివృద్ధి రంగంలో వ్యవసాయానికి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. ఎందుకంటే గిరిజనుల ప్రధానవృత్తి వ్యవసాయమే. నీతి నియమాలు లేని వర్తకులు వన్య ఉత్పత్తులను గిరిజనుల వద్దనుంచి తక్కువ ధరలకుకొని, వారికి కావలసిన నిత్యావసర వస్తువులను అధిక ధరలకు విక్రయించి గిరిజనులను కొల్లగొడుతున్నారు. ఈ బాధను తొలగించడానికి గిరిజన సహకార కార్పొరేషన్‌వారు కృషిచేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డు తెగల సహకార ఫైనాన్స్ కార్పొరేషన్ వారు గిరిజనుల ఆర్థికాభివృద్ధికి కావలసిన ఆర్థికసహాయం సమకూరుస్తున్నారు. ఆరోగ్యరంగంలో ప్రాక్-పాఠశాల బాలలకు, గర్భవతులకు, తల్లులకు అదనపు పోషణ అందజేయడం ముఖ్యకార్యక్రమాలు. భూమిని స్వాధీనం చేసుకొనేవారినుంచి, నీతి నియమాలులేని అప్పులిచ్చేవారినుంచి రక్షణ కల్పించడానికి తగిన శాసనాలను రూపొందించి, అమలు పరుస్తున్నారు.

1978-79 లో వివిధ గిరిజన సంక్షేమ కార్యక్రమాలకు కేటాయించిన మొత్తాలను

| కార్యక్రమం | గిరిజన సంక్షేమ శాఖ | కేటాయింపు లక్షలరూపాయలు ఇతర శాఖలు | వ్యవస్థా పరమైన | కేంద్రప్రభుత్వ పథకాలు | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. విద్య | 522.45 | 40.95 | ... | .... | 563.40 |
| 2. ఆర్థికాభివృద్ధి | 354 59 | 1083.57 | 77.24 | 41.53 | 1556.93 |
| 3. ఆరోగ్యం, ఇతరపథకాలు | 582.49 | 205.00 | .... | .... | 787.49 |
| మొత్తం | 1459.53 | 1329.52 | 77.24 | 41.53 | 2907.82 |

*ఉప ప్రణాళిక :* అయిదో ప్రణాళికలో గిరిజనులు ఎక్కువగా కేంద్రీకృతమైన ప్రాంతాలలో వివిధ కార్యక్రమాలను సమగ్రంగా అమలుపరచడానికి ఒకసరికొత్త భావనను ప్రవేశపెట్టినారు. రాష్ట్ర ప్రభుత్వ శాఖలు, ప్రత్యేక కేంద్ర సహాయం, కేంద్ర ప్రభుత్వ పథకాలు, వ్యవస్థా పరమైన ఆర్థిక సహాయం – వీటన్నిటినీ కూడదీసుకుని గిరిజనులకు సహాయం చేయడానికి ఈ ఉప ప్రణాళిక తోడ్పడుతుంది.

1979 - 80 లో వివిధ మూలాలనుంచి వచ్చిన కేటాయింపులను కింది పట్టికలో చూడవచ్చు.

| రాష్ట్ర ప్రభుత్వ శాఖలు | కేంద్ర సహాయం | వ్యవస్థాపరమైన సహాయం | కేంద్ర పథకాలు | మొత్తం |
|---|---|---|---|---|
| 1518.28 | 822.87 | 262.30 | 783.78 | 3387.25 |

ఈ ఉప ప్రణాళికను అమలుపరచడానికి లోగడ పేర్కొన్న 7 సమగ్ర గిరిజనాభివృద్ధి ఏజన్సీలను ఏడు జిల్లాలలో ఏర్పాటు చేసినారు. అంతేకాకుండా హైదరాబాదు, నల్గొండ, ప్రకాశం, గుంటూరు, కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాలలో ఉన్న ఆదిమ తెగలయిన చెంచుల కోసం ఇటీవల ఒక సమగ్ర గిరిజనాభివృద్ధి ఏజన్సీని ఏర్పాటు చేసినారు. అదేవిధంగా ఈ సంసవత్సరంలో కేంద్ర ప్రభుత్వ సహాయంతో ఇంకో ఆదిమ తెగ అయిన కొండ రెడ్ల కోసం ఒక ఏజన్సీని ఏర్పాటు చేసినారు. ఆదిమతెగ అయిన కోలమ్‌లకు కూడా ఒక పథకం తయారవుతోంది.

*విద్యాకార్యక్రమాలు :* 1. ఆశ్రమ పాఠశాలలు : ఈ పాఠశాలలకు అనుబంధంగా హాస్టల్‌లు కూడా ఉంటాయి. వీటిలో ఉచిత భోజన, వసతి సౌకర్యాలేకాకుండా, పుస్తకాలు, దుస్తులు, నోట్‌బుక్‌లు కూడా ఇస్తారు. ఇదివరకున్న 410 ఆశ్రమ పాఠశాలలే కాకుండా

1979 - 81 సంవత్సరాలలో మరో 18 ఆశ్రమ పాఠశాలలు నెలకొల్పాలని ప్రభుత్వం నిర్ణయించింది.

***హాస్టల్‌లు :*** హైస్కూల్‌లలో చదువుకొనే విద్యార్థులకోసం తాలూకా ముఖ్య పట్టణాలలో హాస్టల్‌లు ఏర్పాటు చేసినారు. ఇప్పుడున్న 300 హాస్టల్‌లు కాక ఇంకో 47 హాస్టల్‌లు 1979-81 లో ప్రారంభించాలని ప్రభుత్వం నిర్ణయించింది.

***పేరుమోసిన పాఠశాలలలో చేర్పించడం :*** ఈ పథకాన్ని 1975-76 లో ప్రారంభించినారు. తెలివైన గిరిజన విద్యార్థులను కాన్వెంట్‌లు, ఇతర పేరుమోసిన పాఠశాలలో చేర్పించి వారికి కావలసిన ఉచిత భోజన, వసతి సౌకర్యాలు కల్పిస్తున్నారు. ఇదివరకు ఈ పథకం కింద 350 సీట్లు ఉండగా 1978-81 లో ఈ సీట్లు 800 వరకు పెంచాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఇప్పుడు దాదాపు నూరు మంది గిరిజన విద్యార్థులు పబ్లిక్ పాఠశాలలో చదువుతున్నారు.

***రెసిడెన్షియల్ పాఠశాలలు :*** ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ ఎడ్యుకేషన్ సొసైటీవారు ఖమ్మం జిల్లాలో కిన్నెరసానివద్ద గిరిజకులకోసం ఒక రెసిడెన్షియల్ పాఠశాలనిర్వహిస్తున్నారు. 1979-80 లో అప్పర్ సీలేరువద్ద ఒక రెసిడెన్షియల్ పాఠశాలను తెరిచారు. రాయలసీమలో ఒక పాఠశాలను తెరవాలని ఆలోచిస్తున్నారు.

***స్కాలర్‌షిప్‌లు :*** కిందివిధంగా గిరిజన విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు ఇస్తున్నారు.

| | |
|---|---|
| 1 వ తరగతి | సాలీనా రూ. 20 |
| 2 వ తరగతి నుంచి 7 వ తరగతి వరకు | సాలీనా రూ. 50 |
| 8 వ తరగతి నుంచి 10 వ తరగతి వరకు | సాలీనా రూ. 70 |

1980-81 నాటికి ఈ పథకం కింద 50,000 మంది విద్యార్థులు లాభం పొందుతారని అంచనా.

***స్కౌటింగ్ :*** 1971-72 లో మొదటి సారిగా గిరిజన సంక్షేమ సంస్థలలో స్కౌటింగ్ కార్యక్రమం ప్రారంభించారు. 1980-81 నాటికి 454 యూనిట్లు పనిచేస్తూ ఉంటాయని అంచనా. వీరు 1980 రిపబ్లిక్ డే పెరేడ్‌లో పాల్గొన్నారు.

***గిరిజన సాంస్కృతికపరిశోధన,శిక్షణసంస్థ :*** గిరిజన సంక్షేమ పథకాలను అర్థవంతంగా అమలు పరచాలంటే గిరిజనుల జీవిత విధానాలు, వివిధ గిరిజన సమూహాల పరిణామం మొదలైన అంశాలను గురించి శాస్త్రీయంగా పరిశోధించడం ఎంతైనా అవసరం. ఈ ఉద్దేశంతోనే గిరిజన సాంస్కృతిక, పరిశోధన, శిక్షణ సంస్థను హైదరాబాదులో 1963 లో స్థాపించినారు. ఇందులో పరిశోధన, శిక్షణ అనే రెండు విభాగాలున్నాయి. పరిశోధన విభాగంవారు గిరిజనుల తెగలను గురించి పరిశోధించడం, ప్రణాళికలు తయారుచేయడం, అభివృద్ధి కార్యక్రమాల మూల్యాంకనం చేయడం, గిరిజనులకు సంబంధించిన అనేక సమస్యలను

గురించి సలహాలివ్వడం మొదలైన కార్యక్రమాలు నిర్వహిస్తారు. శిక్షణ విభాగం వారు గిరిజన సంక్షేమ కార్యక్రమాలలో పాల్గొనే వివిధ అధికారులకు, ఇతరులకు శిక్షణ ఇస్తారు.

***శిక్షణ కార్యక్రమాలు :*** గిరిజన యువతకు ఉద్యోగావకాశాలు పెంపొందించాలని, వారి ఆర్థిక స్థితిని మెరుగుపరచే ఉద్దేశంతో కింద పేర్కొన్న శిక్షణ కార్యక్రమాలను ప్రభుత్వం వారు నిర్వహిస్తున్నారు.

| | శిక్షణ పొందుతున్న వారి సంఖ్య |
|---|---|
| 1. గ్రామాధి కారులు | 500 |
| 2. కారుడ్రైవింగ్ | 603 |
| 3. ఇ. సి. ఐ.యల్.లో వృత్తులు | 108 |
| 4. దుస్తులు తయారీ | 433 |
| 5. టైప్‌రైటింగ్, షార్ట్‌హాండ్ | 239 |
| 6. వడ్రంగిపని | 17 |
| 7. ఇంటివైరింగ్, ఆయిల్ ఇంజన్ మెకానిజమ్ | 10 |
| 8. పశువుల పెంపకం, గొర్రెల పెంపకం | 200 |
| 9. మోటార్ మెకానిజమ్ | 80 |
| 10. పోలీస్ కాన్‌స్టేబుల్ శిక్షణ | 52 |
| 11. ఐ. టి. ఐ. లలో శిక్షణ | 12 |
| 12. సెక్రెటేరియల్ శిక్షణ | 5 |
| 13. తాపీపని | 10 |
| 14. గోదావరిఖని గనులలో శిక్షణ | 45 |
| 15. గిరిజన మహిళలకు శిక్షణ | 16 |
| 16. సెక్రటరీలు | 20 |
| 17. వెటర్నరీ కాంపౌడర్‌ల శిక్షణ | 4 |
| 18. వెదురు, పేముపని | 140 |
| 19. మోటారు, స్కూటర్ మెకానిజమ్ | 88 |
| 20. ఎలక్ట్రిక్ మోటారు శిక్షణ | 1 |
| 21. సహకార శిక్షణ | 1 |
| 22. రెవిన్యూ ఆఫీసర్ శిక్షణ | 50 |
| 23. A. P. స్కూటర్స్‌లో శిక్షణ | 25 |

**ఆర్థికాభివృద్ధి పథకాలు :** ఆర్థికాభివృద్ధి పథకాలలో కిందివి పేర్కొనవచ్చు. చిన్న తరహా నీటి పారుదల పథకాలు, వ్యవసాయాభివృద్ధికి కావలసిన సామగ్రిని అందచేయటం, పశువులను సమకూర్చటం మొదలైనవి. కాఫీ తోటలు పెంచే పథకానికి 18 లక్షల రూపాయలు ఖర్చు పెట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది.

## కుటుంబ, శిశుసంక్షేమ పథకాలు

ఇటువంటివి మొత్తం 7 కేంద్రాలున్నాయి.

| జిల్లా | కేంద్రం |
|---|---|
| ఆదిలాబాద్ | 1. వంకిడి |
| తూర్పుగోదావరి | 2. అడ్డతీగెల |
| ఖమ్మం | 3. భద్రాచలం |
| | 4. అశ్వారావుపేట |
| శ్రీకాకుళం | 5. సీతంపేట |
| వరంగల్ | 6. ఏటూరునగరం |
| విశాఖపట్టణం | 7. కొవ్వూరు |

ఈ పథకాల కార్యకలాపాలు మూడు విభాగాలలో నిర్వహిస్తారు.

***1. గృహకళ్యాణకేంద్రం :*** గృహ నిర్వహణ, వ్యక్తిగత ఆరోగ్యం, శిశు సంవర్ధనం, కుటుంబపోషణ, పరిసర పారిశుధ్యము, దుస్తులు, ప్రథమ చికిత్స, ప్రసవపూర్వ, ప్రసవానంతర జాగ్రత్తలు, అక్షరాస్యత మొదలైన అంశాలను గురించి 15-45 సంవత్సరాల మధ్య వయస్సు గిరిజన మహిళలకు శిక్షణ ఇస్తారు.

***2. బాలవికాసకేంద్రం :*** వీరు నిర్వహించే కార్యకలాపాలు : a. క్రెచ్ b. ప్రాక్-ప్రాథమిక పాఠశాల; c. పాలపంపిణీ, అదనపు పోషణ d. పిల్లలకు టీకాలువేయడం e. శిశు సంరక్షణ గురించి తల్లులకు సలహాలివ్వడం.

***3. బాలసభ :*** బాలలకు సాంస్కృతిక కార్యకలాపాలలో శిక్షణ ఇవ్వటం - నాటకాలు హాబీలు మొదలైనవి.

## గిరిజన సహకార కార్పొరేషన్ లిమిటెడ్, విశాఖపట్నం

ఈ సంస్థ ముఖ్య లక్ష్యాలు ఇవి.

1. గిరిజనుల వద్దనుంచి వన్య ఉత్పత్తులు, వ్యవసాయ ఉత్పత్తులు సమంజసమైన ధరలకు కొనడం.
2. గిరిజనులకు కావలసిన దినసరి సరుకులను సరసమైన ధరలకు అందజేయడం.

3. గిరిజనులకు రుణసౌకర్యాలు కలగజేయడం.

4. వన్య ఉత్పత్తులను ప్రోసెసింగ్, గ్రేడింగ్ చేయడం.

5. గిరిజనుల ఆర్థికాభివృద్ధికి, సాంఘిక సంక్షేమానికి అవసరమైన ఇతర కార్యకలాపాలు చేపట్టడం.

ఈ సంస్థవారు నర్సీపట్టణంలో తేనెపరిశ్రమను 1967 లో నెలకొల్పినారు. ఇక్కడ 8 గంటల షిఫ్ట్‌లో 75 కిలోల తేనెను శుభ్రంచేసి సీసాలలో పాక్ చేస్తారు. ముడితేనెను గిరిజనుల వద్దనుంచి కొంటారు.

అదేవిధంగా నర్సీపట్నంలో షికాయిప్లాంట్, పాడేరులో సబ్బుయూనిట్, నిర్మల్‌లో జిగురు తయారుచేసే యూనిట్ ఈ సంస్థవారు నడుపుతున్నారు.

జాతీయ సహకార అభివృద్ధి కార్పొరేషన్ (న్యూఢిల్లీ) వారు గిరిజన సహకార కార్పొరేషన్‌కు ఆర్థికసహాయం అందజేస్తున్నారు.

**కాఫీతోటలు :** విశాఖపట్టణం, తూర్పుగోదావరి జిల్లాలలో మన్య ప్రాంతాలలో గిరిజన సహకాల సంస్థవారు కాఫీతోటలు పెంచుతున్నారు. పూర్తిగా పెరిగిన తరవాత ఒక్కొక్క కుటుంబానికి 2 ఎకరాల చొప్పున వీటిని గిరిజనుల కిస్తారు. 1974 నుంచి 1980 వరకురాష్ట్ర ప్రభుత్వం ఈ పథకం కింద రూ. 72.84 లక్షలు ఖర్చుపెట్టారు. ఇంతవరకు 1650 ఎకరాలలో కాఫీతోటలు పెంచారు. ఈ పథకానికి కేంద్రసహాయంకూడా ధారాళంగా లభించింది.

## ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డ్ తెగల సహకార ఫైనాన్స్ కార్పొరేషన్

ఈ సంస్థవారు పరిశ్రమలు, పశుపోషణ, వ్యవసాయం, సహకారం మొదలైన రంగాలలో వివిధ పథకాలకు 25,000 రూపాయల వరకు మంజూరు చేస్తారు. ఈ సంస్థవారు బాంక్‌లవద్దనుంచి రుణాలను తీసికొని గిరిజన హాస్టల్‌లు, ఆశ్రమపాఠశాలలకు కావలసిన భవనాలు నిర్మిస్తున్నారు. ఈ సంస్థకు భారత ప్రభుత్వం నుంచి కూడా ఆర్థిక సహాయం లభిస్తోంది. ఈసహాయాన్ని వీరుప్రధానంగా వ్యవసాయాభివృద్ధి పథకాలకు వినియోగిస్తున్నారు.

## వెనకబడిన తరగతులవారి సంక్షేమం

కొన్ని తరగతుల ప్రజలు సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో వెనకబడి ఉన్నారని మిగిలిన వారితో సమానంగా లేరని మన రాజ్యాంగ నిర్మాతలు గుర్తించినారు. కనక ఇటువంటి వారి బాగోగులు చూడడానికి రాజ్యాంగంలో కొన్ని రక్షణలు కల్పించాలని వారు భావించినారు. అందుకోసం మన రాజ్యాంగంలోని ఆర్టికల్ 15(4) సాంఘికంగా, విద్యాపరంగా వెనకబడిన తరగతుల వారి అంటే షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు కాకుండా – పురోభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం కొన్ని ప్రత్యేక వసతులు కల్పించాలని ఆదేశిస్తుంది.

1968 లో మన రాష్ట్రప్రభుత్వం వారు వెనకబడిన తరగతుల పట్టికను తయారు చేయడానికి ఒక కమీషన్‌ను నియమించారు. ఈ కమీషన్ వారి సిఫార్సుల ఆధారంగా ప్రభుత్వం

వారు 92 కులాలను వెనకబడిన తరగతులుగా గుర్తించి వారిని మళ్ళీ 4 వర్గాలుగా విభజించి నారు. ఆ తరవాత ప్రభుత్వంవారు మరో 3 కులాలను వెనకబడిన తరగతులుగా గుర్తించి నారు. కనక ప్రస్తుతం వీరి మొత్తం సంఖ్య 95 గ్రూప్ A లో 40 కులాలు ఉన్నాయి. వారిలో ముఖ్యంగా అబోరిజినల్ తెగలు, విముక్త జాతీయ, సంచార, అర్థసంచార జాతులు మొదలైనవారు ఉన్నారు. B గ్రూప్‌లో 21 కులాలు ఉన్నాయి. వీరు చాలా మటుకు వివిధ వృత్తులకు సంబంధించినవారు. C గ్రూప్‌లో క్రిష్టియన్ మతం పుచ్చుకున్న షెడ్యూల్డ్ కులాలవారు. వారి పిల్లలను చేర్చినారు. మిగిలిన 33 కులాలు D గ్రూప్‌లో చేర్చబడ్డారు లంబాడులు, ఎరుకుల వారిని A గ్రూప్‌లో నుంచి తీసివేసి షెడ్యూల్డ్ తెగలలో చేర్చినారు జాబితాలో జేర్చిన వెనకబడిన తరగతుల వారు రాష్ట్ర జనాభాలో 40% కన్నా ఎక్కువే ఉంటారు.

1970 లో రాష్ట్ర ప్రభుత్వం వారు వెనకబడిన తరగతుల వారి జాబితాను గుర్తించిన సమయంలోనే వారికి కొన్ని రాయితీలను, రక్షణలను కల్పించినారు. ఆ తరవాత మరికొన్ని సదుపాయాలను కల్పించినారు. మనరాష్ట్రంలో ప్రస్తుతం వెనకబడిన తరగతులవారికి కింద పేర్కొన్న సౌకర్యాలు లభిస్తున్నాయి.

1. రాష్ట్రప్రభుత్వ ఉద్యోగాలలోను, రాష్ట్ర ప్రభుత్వ సంస్థలలోను, 25% ఉద్యోగాలు వెనకబడినతరగతులవారికి కిందసూచించిన విధంగా కేటాయించినారు.

   గ్రూప్ A 7%

   గ్రూప్ B 10%

   గ్రూప్ C 1%

   గ్రూప్ D 7%

2. వృత్తి విద్యాకళాశాలలలో 25% సీట్లు పై నిష్పత్తిలో వెనకబడిన తరగతుల వారికి కేటాయించినారు. అదేవిధంగా వృత్తివిద్యలు కాని అండర్ గ్రాడ్యుయేట్ కోర్స్‌లలోకూడా 25%సీట్లు వెనకబడినతరగతులవారికి రిజర్వు చేసినారు.
3. అన్ని పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్స్‌లలోను 25% సీట్లు వెనకబడిన తరగతుల వారికి రిజర్వు చేసినారు. విద్యాసంస్థలు ముందు కుల ప్రసక్తి లేకుండా కేవలం మెరిట్‌పై ఆధారపడి అభ్యర్థులజాబితా తయారుచేయవలసిఉంటుంది. ఆ తరవాత వెనకబడిన తరగతులవారికి కేటాయించిన సీట్లకు సంబంధించి వేరే జాబితా తయారుచేయాలి.
4. రాష్ట్రప్రభుత్వ ఉద్యోగుల నియామకానికి షెడ్యూల్డు కులాలవారికి, షెడ్యూల్డు తెగలవారికి ఇచ్చినట్లుగానే గరిష్ఠ వయోపరిమితిని అయిదు సంవత్సరాలు వెనకబడిన వారికి కూడా పెంచారు.
5. పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షలకు వెనకబడిన తరగతుల అభ్యర్థులు, షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలవారి వలెనే పరీక్ష రుసుము చెల్లించనవసరం లేదు.

6. ప్రతి జిల్లాలోను ఇళ్ళస్థలాలకోసం కేటాయించిన మొత్తంలో 25% కేవలం వెనక బడిన తరగతులవారికోసం వినియోగించాలి

7. ఆంధ్రప్రదేశ్ హౌసింగ్‌బోర్డ్ ఆధ్వర్యంలో నిర్మించిన ఇళ్ళలో 15% వెనకబడిన తరగతులవారికోసం రిజర్వు చేసినారు.

8. వెనకబడిన తరగతుల విద్యార్థులు ఉన్నత పాఠశాల స్థాయివరకు ట్యూషన్ రుసుము, ప్రత్యేక రుసుము చెల్లించనవసరంలేదు. అయితే తల్లిదండ్రుల వార్షిక ఆదాయం రూ. 6,000 మించనివారికి మాత్రమే ఇది వర్తిస్తుంది.

9. అదే విధంగా పోస్ట్ మెట్రిక్, పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్స్‌ల విద్యార్థులకు కూడా పై సదుపాయం ఉంటుంది. ఈ విధంగా ప్రయివేట్ కాలేజీలు, యూనివర్సిటీలు నష్టపోయిన ఆదాయాన్ని వెనకబడిన తరగతుల సంక్షేమశాఖవారు భర్తీచేస్తారు. ప్రభుత్వ కళాశాలలకికూడా ఇదే విధంగా ప్రభుత్వం వారు భర్తీచేస్తారు.

10. తల్లిదండ్రుల ఆదాయం సాలీనా రూ. 6,000 మించని వెనకబడిన తరగతుల విద్యార్థులు ప్రభుత్వంవారు సమకూర్చిన స్కాలర్‌షిప్‌లు, హాస్టల్ సౌకర్యాలు, ఇతర విద్యాపరమయిన సదుపాయాలు తీసుకోవడానికి అర్హులు.

11. ప్రభుత్వ వెనకబడిన తరగతుల హాస్టల్‌లలో ఉండే విద్యార్థులందరికీ ఒక జత దుస్తులు ఉచితంగా ఇస్తారు.

12. ప్రభుత్వ వెనకబడిన తరగతుల హాస్టల్‌లలో ఉండే విద్యార్థులందరికీ జాతీయం చేసిన పాఠ్య పుస్తకాలు, నోట్ బుక్‌లు ఉచితంగా ఇస్తారు.

13. కులాంతర వివాహాలు చేసుకున్న దంపతులలో ఏ ఒక్కరైనా వెనకబడిన తరగతికి చెందితే వారికి రూ.500/- బహుమానం ఇస్తారు. వీరుకులాంతరవివాహానికి రిజిస్ట్రేషన్ రుసుము చెల్లించనవసరం లేదు. వీరి పిల్లలను తల్లిదండ్రులలో ఎవరి కులానికి చెందితే వారికి లాభదాయకంగా ఉంటుందో ఆ కులానికి చెందినట్లుగా భావిస్తారు. వీరికి వెనకబడిన తరగతులవారితో సమానంగా అన్ని విద్యా విషయక సౌకర్యాలు లభిస్తాయి.

## వెనకబడిన తరగతుల సంక్షేమ శాఖ

1975 వరకు వెనకబడిన తరగతుల అభివృద్ధి పథకాలను అమలు పరిచే బాధ్యత సాంఘిక సంక్షేమశాఖవారు చూస్తుఉండేవారు. వెనకబడిన తరగతుల కమీషన్‌వారి సిఫార్సులను దృష్టిలో ఉంచుకొని ఒకపక్క వెనకబడిన తరగతుల అభివృద్ధిని, వేరొక పక్క షెడ్యూల్డు కులాల అభివృద్ధిని త్వరితం చేయడానికి ఇంకా ఎక్కువ శ్రద్ధ చూపించే ఉద్దేశంతోను 1975 లో సాంఘిక సంక్షేమశాఖను హరిజన సంక్షేమశాఖ అని, వెనకబడిన తరగతుల సంక్షేమశాఖ అని రెండుగావిభజించినారు. మొదట్లో రాష్ట్రంలోని వెనకబడిన తరగతుల వారి హాస్టల్‌లు నడపడం, స్కాలర్ షిప్‌లు మంజూరు చేయడం పనులను వెనకబడిన తర

గతుల సంక్షేమ శాఖవారికి అప్పగించారు. క్రమక్రమంగా వెనకబడిన తరగతుల సంక్షేమ కార్యక్రమాలు విస్తృతపరచి ఇంకా అనేక పథకాలు ఈ శాఖకు అప్పగించినారు. ప్రస్తుతం వెనకబడిన తరగతులవారి అభివృద్ధికోసం విశిష్ట కార్యక్రమాలను రూపొందించడం నాటిని అమలు పరచడం మొదలైన బాధ్యతలు వెనకబడిన తరగతుల సంక్షేమశాఖవారు నిర్వహిస్తున్నారు. జిల్లా స్థాయిలో ఈపథకాలను అమలుపరిచే బాధ్యత జిల్లా కలెక్టర్లకు అప్పగించారు.

1976-77 లో వెనకబడిన తరగతులవారి సంక్షేమం గురించి ఒక శాసన సంఘం ఏర్పాటు చేసినారు. ఇందులో 12 మంది సభ్యులు ఉన్నారు. వీరు వెనకబడిన తరగతుల వారి సంక్షేమం కోసం తీసుకోవలసిన చర్యలను పరిశీలించి, సమీక్షించి, సిఫార్సులు చేస్తారు. ఇటీవల ఈ సంఘంవారు ప్రభుత్వానికి తమ నివేదికను సమర్పించినారు. 1978-79 లో ఈ సంఘాన్ని పునర్వ్యవస్థీకరించారు.

1976-77, 77-78, 78-79, 79-80 లలో వెనకబడిన తరగతులవారి సంక్షేమం కోసం బడ్జెట్‌లో కేటాయించిన మొత్తాలు కిందిపట్టికలో చూడవచ్చు.

లక్షల రూపాయలలో

| పథకం | 1976-77 | 1987-78 | 1978-89 | 1979-80 |
|---|---|---|---|---|
| నాన్ - ప్లాన్ | 235.44 | 328.91 | 397.00 | 523.30 |
| ప్లాన్ | 131.85 | 225.53 | 355.00 | 234.23 |
| ఎన్.పి.ఎఫ్ | 27.14 | 23.42 | 17.27 | .... |
| సి.ఎస్.ఎస్ | .... | 25.48 | 28.75 | 13.63 |
| రుణాలు | .... | 41.66 | 16.25 | 0.70 |
| మొత్తం | 394.43 | 645.00 | 814.27 | 781.86 |

## సంక్షేమ కార్యక్రమాలు

వెనకబడిన తరగతుల వారి సంక్షేమ కార్యక్రమాలను కిందచూపిన విధంగా వర్గీకరించవచ్చు.

1. విద్యాభివృద్ధి
2. ఇళ్ళస్థలాలు, సమాజ పథకాలు
3. ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల సహకార ఫైనాన్స్ కార్పొరేషన్ లిమిటెడ్ వారు చేపట్టిన ఆర్థిక సహాయ కార్యక్రమాలు

***విద్యాభివృద్ధి :*** వెనుకబడిన తరగతుల వారిలో విద్యను శీఘ్రగతిని అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం వారు వారికి అనేక సౌకర్యాలను అనేక రూపాలలో ఉదారంగా అందజేస్తున్నారు.

విద్యా సౌకర్యాలలో ముఖ్యమైనవి స్కాలర్‌షిప్‌లు, హాస్టల్ వసతులు, జాతీయంచేసిన పుస్తకాలు, నోట్ పుస్తకాలు సరఫరాచేయడం, రుసుములు, ప్రత్యేక రుసుములలో రాయితీలు, వృత్తి, అండర్ గ్రాడ్యుయేట్, పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్స్‌లలో సీట్లు రిజర్వేషనులు.

**స్కాలర్‌షిప్‌లు :** కింది పట్టికలో వివిధ పథకాల కింద 1977-78, 78-79, 79-80 లో బడ్జెట్‌లో కేటాయించిన మొత్తాలు చూడవచ్చు.

| పథకము | 1977-78 | 1978-79 | 1979-80 |
|---|---|---|---|
| రాష్ట్ర స్కాలర్‌షిప్‌లు | 144.15 | 161.94 | 188.94 |
| ఐ. టి. ఐ. స్కాలర్ షిప్‌లు | 18.65 | 25.03 | 37.03 |
| మొత్తం | 152.80 | 186.97 | 225.97 |

వెనకబడిన తరగతుల విద్యార్థులకు 5 వ క్లాసునుంచి పోస్ట్ గ్రాడ్యుయేట్ తరగతుల వరకు వారి తల్లి దండ్రుల సాలుసరి ఆదాయం రూ. 6000/- దాటకుండా ఉంటే రెసిడెన్షల్ నాన్-రెసిడెన్షల్ స్కాలర్‌షిప్‌లు మంజూరు చేస్తారు. కాలేజీలకు అనుబంధంగా ఉన్న గుర్తింపు పొందిన హాస్టల్‌లలోను, కుల సంఘాల హాస్టల్‌లలోను. విద్యార్థులు నిర్వహించే హాస్టల్‌లలోను ఉండేవారికి రెసిడెన్షనల్ స్కాలర్‌షిప్‌లు ఇస్తారు. తల్లి దండ్రుల దగ్గరఉండి చదువుకునే విద్యార్థులకు నాన్ రెసిడెన్షల్ స్కాలర్‌షిప్‌లు ఇస్తారు.

1976-77, 77-78, 78-79 లలో వెనుకబడిన తరగతుల వారికి మంజూరు చేసిన వేరు వేరు రకాల స్కాలర్‌షిప్‌ల వివరాలు కింది పట్టికలో చూడవచ్చు.

| పథకాల వివరాలు | 1976-77 ఖర్చైన మొత్తం | 1976-77 స్కాలర్‌షిప్‌లు మంజూరు చేసిన విద్యార్థుల సంఖ్య | 1977-78 ఖర్చైన మొత్తం | 1977-78 స్కాలర్‌షిప్‌లు మంజూరు చేసిన విద్యార్థుల సంఖ్య | 1978-79 |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. పోస్ట్ మెట్రిక్ స్కాలర్ షిప్‌లు | 80,06,814 | 34,406 | 81,08,36 | 30,151 | 185.71 |
| 2. వృత్తి, పోస్ట్‌గ్రాడ్యుయేట్ విద్యార్థులకు పూర్తి మెస్ ఖర్చులు | — | — | 42,57,000 | 2,838 | — |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 3. ప్రీమెట్రిక్‌స్కాలర్‌షిప్‌లు | 12,22,700 | 22,513 | 20,54,776 | 25,647 | 26.23 |
| 4. ఐ.టి.ఐ.స్కాలర్‌షిప్‌లు | 2,10,000 | 2,179 | 10,65,503 | 2,391 | 25.03 |
| మొత్తం | 94,39,514 | 59,098 | 1,54,80.598 | 61,027 | 186.97 |

***విద్యార్థులు నిర్వహించే హాస్టళ్ళు:*** ఇదివరకటి ప్రభుత్వ కాలేజి హాస్టల్‌లను 1974-75 లో విద్యార్థులు నిర్వహించే హాస్టల్‌లుగా మార్చినారు. జాబితాలో ఉన్న వెనకబడిన తరగతుల విద్యార్థులకోసం 1976-77 లో ప్రభుత్వం కొత్తగా విద్యార్థులు నిర్వహించే హాస్టల్‌లు మరికొన్ని మంజూరు చేసారు.

1978-79 లో విద్యార్థులు నిర్వహించే హాస్టల్‌లలో జాబితాలో చేర్చిన వెనకబడిన తరగతుల విద్యార్థుల సంఖ్య 3,641. 1978-79 లో ఇటువంటి హాస్టలులలో విద్యార్థుల సంఖ్య 4 566కు పెంచారు. ఈ విద్యార్థులకు పోస్ట్‌మెట్రిక్ స్కాలర్‌షిప్‌ల పథకం కింద మంజూరు చేసిన ధనం నుంచి మెస్ చార్జీలు భరిస్తారు.

1977-78, 73,77,79-80 సంవత్సరాలలో ఈ పథకంకోసం బడ్జెట్‌లో కిందివిధంగా కేటాయింపు చేసారు.

లక్షల రూపాయలు.

| పథకాలు | 1977-78 | 1978-79 | 1979-80 |
|---|---|---|---|
| ప్రభుత్వ హాస్టల్‌లు. | 166.11 | 211.46 | 259.63 |

వెనకబడిన తరగతుల విద్యార్థుల కోసం వెనకబడిన తరగతుల సంక్షేమశాఖవారు హాస్టల్‌లు నడుపుతున్నారు. ఈ హాస్టల్‌లలో ఉచిత భోజన, వసతి సదుపాయాలు లభిస్తాయి. అంతేకాకుండా పాఠశాల హాస్టల్ విద్యార్థులకు సబ్బు, కొబ్బరినూనె నిమిత్తం నెలకు రూ.2 ఇస్తారు.

1978-79 ప్రారంభంలో ఉన్నత పాఠశాల విద్యార్థులకోసం 35 ప్రభుత్వ వెనకబడిన తరగతుల హాస్టలులు ఉండేవి. వీటిలో 22,180 విద్యార్థులు ఉండేవారు. 1978-79 లో ఈ హాస్టల్‌లలో ఉండేవారి సంఖ్య జాబితాలో ఉన్న వెనకబడిన తరగతుల వారి విషయంలో 7,455 పెంచారు. అంతేకాకుండా ఆర్థికంగా వెనకబడిన వారికి 545 సీట్లు ఇచ్చారు. 1978-79 లో మరో 22 ప్రభుత్వ హాస్టల్‌లు తెరిచారు. ఒక్కొక్క దానిలో 50 మంది విద్యార్థులు ఉంటారు.

1979-80 లో కొత్తగా నూరు ప్రభుత్వ హాస్టల్‌లు తెరవాలని ప్రభుత్వం వారు తలపెట్టినారు.

ప్రభుత్వం వెనకబడిన తరగతుల హాస్టల్‌లలో ఉండే విద్యార్థులకు రెండేసి దుస్తులు ఇస్తారు. బాంకులనుంచి రుణాలు తీసికొని ప్రభుత్వ హాస్టల్‌లకు సొంత భవనాలు నిర్మించే పథకాన్ని ఈ శాఖవారు చేపట్టినారు.

## బలహీన వర్గాల వారికి ఉద్యోగార్హతలు పెంచడానికి శిక్షణ కార్యక్రమాలు

గ్రామాధికారులు, డ్రైవర్‌లు, టైపిస్టులు, స్టెనోలు మొదలైన ఉద్యోగాలకు వెనకబడిన తరగతుల అభ్యర్థులు తక్కువగా ఉన్నారు. అందుకని కొన్ని ఉద్యోగాలకు కావలసిన శిక్షణ ఇచ్చే కార్యక్రమాన్ని చేపట్టినారు. ఈ శిక్షణ పొందే అభ్యర్థులకు నెలకు 70 నుంచి 100 రూ॥ వరకు స్టైఫండ్ ఇస్తారు. 1977-78 లో 1083 అభ్యర్థులకు శిక్షణఇచ్చినారు. 1978-79లో శిక్షణ పొందిన వారి వివరాలు కింది పట్టికలో చూడవచ్చు.

| శిక్షణ పథకం | శిక్షణపొందిన వారిసంఖ్య |
|---|---|
| 1. గ్రామాధికారులు | 115 |
| 2. మోటార్‌డ్రైవింగ్ | 180 |
| 3. దర్జీపని | 140 |
| 4. వెటరనరీ కాంపౌండర్‌లు | 74 |
| 5. ఆయిల్ ఇంజన్‌ల శిక్షణ | 29 |
| 6. కోళ్లపెంపకం | 6 |
| 7. డీసెల్‌మెకానిజమ్ | 20 |
| 8. మత్స్యకారుల శిక్షణ | 45 |
| 9. పేము అల్లిక | 4 |
| 10. వడ్రంగిపని | 74 |
| 11. జనరల్ ఇంగ్లీష్, ప్రత్యేక ఇంగ్లీష్‌లో ప్రత్యేక శిక్షణ | 120 |

***పారిశుద్ధ్య కార్యక్రమాలు :*** వెనకబడిన తరగతులవారు నివసించే ప్రాంతాలలో మురికి నీటి పారుదల, తాగేనీరు, ఇతర పారిశుద్ధ్య సౌకర్యాలు లేవు. ఇటువంటి సౌకర్యాలు కలగ జేయడంకోసం 1978-79 లో 1.75 లక్షల రూపాయలు మంజూరు చేసారు. 1979-80 లో 2 లక్షల రూపాయలు ఇందుకోసం ఖర్చుపెట్టాలని ప్రభుత్వం నిశ్చయించింది.

*ఇళ్ళస్థలాలు :* హరిజనులవలెనే వెనకబడిన తరగతుల వారికి కూడా గృహవసతి తీవ్ర సమస్యగా ఉంది. వారివలెనే వీరుకూడా ఇరుకు ఇళ్ళలో నివసిస్తున్నారు. కనక షెడ్యూల్డ్ కులాలవారితోబాటు వెనకబడిన తరగతుల వారికికూడా ప్రభుత్వం వారు ఇళ్ళ స్థలాలు ఇస్తున్నారు. సాంఘిక సమైక్యీకరణ చర్యగా హరిజనులకోసం స్వాధీనంచేసుకొన్న ఇళ్ళస్థలాలలో 25% వెనకబడిన తరగతుల వారికోసం రిజర్వు చేస్తున్నారు.

ఇళ్ల స్థలాలకోసం కేటాయించిన మొత్తంలో 25 శాతం కేవలం వెనకబడిన తరగతుల వారికోసం వినియోగించాలని 1976 లో ప్రభుత్వం వారు జిల్లా కలెక్టర్‌లకు ఆదేశాలిచ్చారు. జిల్లాలకు ఇళ్ల స్థలాలకోసం కేటాయించిన మొత్తంలో 25% వెనకబడిన తరగతుల వారికి, ఇంకో 25 శాతం షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు, జాబితాలో చేర్చిన వెనక బడిన తరగతులవారుకాని, ఇతర బలహీన వర్గాలకోసం వినియోగించాలని 1977 లో ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది. వెనకబడిన తరగతుల వారికోసం నేరుగా ఇళ్ళ స్థలాలు స్వాధీనం చేసుకొనే కార్యక్రమం కింద వదిలేసి, సమాజంలో బలహీన వర్గాల వారందరికి కలిపి భూమి స్వాధీనం చేసుకోవాలని 1978-79 లో ప్రభుత్వం వారు సవరించిన ఆదేశాలు జారీచేసినారు.

*వెనకబడిన తరగతుల వారికి ఇచ్చిన భూములలో ఇరిగేషన్ బావులు తవ్వడం :* లాండ్ సీలింగ్ చట్టంకింద వచ్చిన భూములను వెనకబడిన తరగతుల వారికి కూడా ఇస్తున్నారు. ఈ భూములను అభివృద్ధిచేసి ఇరిగేషన్ బావులు తవ్వవలసిన అవసరం ఉంది. ఇందుకోసం 1978-79 లో 40 లక్షల రూపాయలు కేటాయించినారు. ఈ పథకాన్ని ఆంధ్ర ప్రదేశ్ వెనకబడిన తరగతుల సహకార ఫైనాన్స్ కార్పొరేషన్‌ద్వారా అమలు జరుపుతున్నారు 1979-80 లో ఈ పథకం కింద 10 లక్షల రూపాయలు కేటాయించినారు.

## ఆర్థిక సహాయ కార్యక్రమాలు

*ఆంధ్రప్రదేశ్ వెనకబడిన తరగతుల సహకార ఫైనాన్స్ కార్పొరేషన్ లిమిటెడ్ హైదరాబాద్ :* రాష్ట్రంలోని వెనకబడిన తరగతుల ఆర్థికాభివృద్ధి పథకాలను చేపట్టడానికి ఈ సంస్థను రాష్ట్రప్రభుత్వం వారు 1974 లో స్థాపించారు. జిల్లా స్థాయిలో జిల్లా కలెక్టర్‌ల అధ్యక్షతన జిల్లా సొసైటీలను ఏర్పాటు చేసినారు. ఈ సంస్థవారు ఇంతవరకు 25.19 కోట్ల రూపాయల ఖర్చుతో వివిధ పథకాలను అమలు పరచినారు.

*బీదవారికి ఆర్థిక సహాయ పథకాలు :* సమాజంలో ఆర్థికంగా వెనకబడిన తరగతుల వారికి ఆర్థిక సహాయం చేయడానికి 1977-78 లో ప్రభుత్వంవారు కార్పొరేషన్‌కు ప్రణాళిక కింద 25 లక్షల రూపాయలు కేటాయించినారు. 1978-79 లో ఈ కార్పొరేషన్ వారు రూ. 50.74 లక్షలతో కొన్ని పథకాలను అమలు పరిచినారు. 1978-79 లో ఆర్థికంగావెనకబడినవారి సహాయార్థం ప్రభుత్వంవారు 15 లక్షల రూపాయలు మంజూరు చేసినారు. తల్లి తండ్రుల సాలుసరి ఆదాయం రూ. 1500 కు మించని వారినందరినీ ఆర్థికంగా బీదవారిగా పరిగణించి, వారికి జాబితాలో చేర్చిన వెనకబడిన తరగతుల వారితో సమానంగా స్కాలర్

షిప్‌లు, హాస్టల్‌సౌకర్యాలు చేకూరుస్తున్నారు. ప్రీమెట్రిక్ కోర్స్‌లలో ఆర్థికంగా బీదవారికి జాబితాలో చేర్చిన వెనకబడిన తరగతుల వారితో సమానంగా స్కాలర్‌షిప్‌లు ఇస్తున్నారు. పోస్ట్‌మెట్రిక్ కోర్సులలో 50% కన్న తక్కువ కాకుండా మార్కులు వచ్చినవారికి గ్రాడ్యుయేట్ కోర్సులలోను పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్స్‌లలో 55%కన్న తక్కువ కాకుండా మార్కులు వచ్చినవారికి ఆర్థికంగా వెనకబడిన వారికి స్కాలర్‌షిప్‌లు ఇస్తున్నారు. వృత్తికోర్స్‌లు, పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్స్‌లు చదువుతూ అనుబంధ హాస్టల్‌లలో ఉండేవారికి పూర్తి మెస్ ఖర్చులు మంజూరుచేయడానికి మార్కులతో నిమిత్తం లేదు. 1977-78 నుంచి వృత్తి కోర్స్‌లలోను, పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్స్‌లలోను చదువుకొనే ఆర్థికంగా బీదవారికి పూర్తి మెస్ ఖర్చులు ఇవ్వాలని ప్రభుత్వం ఉత్తరువులు జారీ చేసినారు. 1979-80 లో ఆర్థికంగా బీదవారికి స్కాలర్‌షిప్‌లు ఇవ్వడానికి కేటాయించిన మొత్తాలను కింది పట్టికలో చూడవచ్చు.

లక్షల రూపాయలు.

| | నాన్-ప్లాన్ | ప్లాన్ | మొత్తం |
|---|---|---|---|
| పోస్ట్‌మెట్రిక్ స్కాలర్‌షిప్‌లు | 32.60 | 3.00 | 35.60 |
| ప్రీమెట్రిక్ స్కాలర్‌షిప్‌లు | 10.88 | — | 10.88 |
| ఐ.టి.ఐ. స్కాలర్‌షిప్‌లు | 5.97 | 3.00 | 8.97 |
| మొత్తం | 49.45 | 6.00 | 55.45 |

1976-77, 77-78, 78-79 లలో ఆర్థికంగా బీదవారికి రక రకాల స్కాలర్‌షిప్‌ల నిమిత్తం ఖర్చుపెట్టిన మొత్తాలు కింది పట్టికలో చూడవచ్చు.

| | 1976-77 | | 1977-78 | | 1978-79 |
|---|---|---|---|---|---|
| పథకం | ఖర్చైన మొత్తం | స్కాలర్‌షిప్ పొందిన విద్యార్థుల సంఖ్య | స్కాలర్‌షిప్ పొందిన విద్యార్థుల సంఖ్య | ఖర్చైన మొత్తం | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. పోస్ట్ మెట్రిక్ స్కాలర్ షిప్‌లు | 18,74,686 | 7,442 | 6,759 | 16,88,361 | |
| 2. వృత్తికోర్సులలోను పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్సులలోను పూర్తి మెస్ ఖర్చులు | .... | .... | 1,331 | 19,96,500 | 32,60,000 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 3. ప్రీ మెట్రిక్ స్కాలర్ షిప్‌లు | 2,88,400 | 3,997 | 4,150 | 7,36,553 | 10,88,000 |
| 4. ఐ.టి.ఐ.స్కాలర్‌షిప్‌లు | 90,000 | 762 | 1,578 | 4,91,613 | 5,97,000 |
| మొత్తం | 22,53,086 | 11,201 | 13,818 | 49,13,007 | 49,45,000 |

1978-79 లో ఆర్థికంగా బీద విద్యార్థులకు విద్యార్థులు నిర్వహించే హాస్టల్‌ల ద్వారా 1567 పోస్ట్‌మెట్రిక్ స్కాలర్‌షిప్‌లు ఇచ్చారు. ఈ హాస్టల్‌లలో చేర్చుకొన్న విద్యార్థులకు స్కాలర్‌షిప్‌ల మొత్తాలనుంచి మెస్ ఖర్చులు ఇస్తారు.

*ప్రభుత్వ హాస్టళ్ళు :* వెనకబడిన తరగతుల విద్యార్థులకోసం వెనకబడిన తరగతుల సంక్షేమ శాఖవారు హాస్టల్‌లు నడుపుతున్నారు. వెనకబడిన తరగతుల సీట్లలో 75% సీట్లు జాబితాలో చేర్చిన వెనకబడిన తరగతుల వారికి, ఆర్థికంగా వెనకబడిన వారికి 7:3 నిష్పత్తిలో పంచుతున్నారు.

*ఆర్థికంగా బీదవారికి శిక్షణ కార్యక్రమాలు :* డ్రైవర్‌లు, దర్జీపని, ఇతరవృత్తులలో ఆర్థికంగా బీదవారికి శిక్షణఇచ్చే కార్యక్రమాన్ని ప్రభుత్వం వారు మంజూరు చేశారు. 1978-79 లో ఇందుకోసం లక్షరూపాయలు ఖర్చుపెట్టినారు.

*కేంద్రపథకాలు :* అశుభ్ర వృత్తులలో (దొడ్లు తుడవటం, తోలుపని) నిమగ్నులయిన వారి పిల్లలకు స్కాలర్‌షిప్‌లు ఇచ్చే పథకాన్ని కేంద్రప్రభుత్వం 1977-78 లో ప్రవేశపెట్టినారు. మొదటి సంవత్సరంలో 60 స్కాలర్‌షిప్‌లు ఇచ్చారు. 1978-79 లో 120 స్కాలర్‌షిప్‌లు ఇచ్చారు. 1979-80 లో ఇందుకోసం 2.18 లక్షల రూపాయలు మంజూరు చేసినారు.

## స్త్రీ, శిశుసంక్షేమం

ఆధునిక సమాజంలో స్త్రీల పాత్ర చాలా ప్రాముఖ్యం వహిస్తోంది. గృహ నిర్వహణ లోనేకాక సాంఘిక, రాజకీయ రంగాలలో కూడా స్త్రీలు యితోధికంగా బాధ్యతవహిస్తున్నారు. సుఖ సంతోషాలతో నిండిన గృహాలే సమాజ స్థిరత్వానికి, అభివృద్ధికి పునాదులు. అందువల్ల గృహిణిగా కూడా స్త్రీ పాత్ర ఎంతో కీలకమైనది. భావి భారత పౌరులైన బాలలను తీర్చి దిద్దడంలో స్త్రీల పాత్ర ప్రాముఖ్యాన్ని అందరూ గుర్తించారు.

1953 లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు మహిళా సంక్షేమ శాఖను కూడా ఏర్పాటు చేసినారు. పంచవర్ష ప్రణాళికలలో చేపట్టిన అనేక సమాజ అభివృద్ధి పథకాలలో మహిళా, శిశు సంక్షేమ కార్యక్రమాలకు బాగా మద్దతు లభించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత 1958 లో మహిళా సంక్షేమ పథకాలను తెలంగాణా జిల్లాలన్నింటికీ అనువర్తింప

చేశారు. హైదరాబాదులో మహిళలకు ఒక సర్వీస్ హోమ్ నెలకొల్పారు. అదే సంవత్సరంలో రాష్ట్రంలోని ప్రధాన కేంద్రాలలో ఆఫ్టర్ కేర్ హోమ్‌లు నెలకొల్పినారు.

రెండో పంచవర్ష ప్రణాళికలో చదువుకున్న యువతులకు వృత్తి శిక్షణ కేంద్రాలు, అనాధబాలలకు బాలల గృహాలు, బడకిపోయే పిల్లలకు బాల విహార్‌లు ప్రారంభించినారు. పాలనా దక్షతను పెంపొందించడానికి ప్రాంతీయ కార్యాలయాలను స్థాపించినారు. మూడో పంచవర్ష ప్రణాళికలో బాలల సంక్షేమ కార్య క్రమాలకు చెప్పుకోదగినంత ప్రోత్సాహం లభించింది. బాలల గృహాల సంఖ్య పెరిగింది. గ్రామీణ ప్రాంతాల వ్యవసాయ కార్మికుల శిశువుల కోసం క్రెచ్‌లు ప్రారంభించారు. మహిళామండలుల వంటి స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ సంస్థలకు ధనసహాయం చేయడానికి ఏర్పాటు చేసారు. దీనివల్ల ప్రత్యేకించి గ్రామీణ ప్రాంతాలలో స్వచ్ఛంద కృషికి ప్రోత్సాహం లభించింది.

1968 లోనే పంచాయతీ సమితుల, జిల్లాపరిషత్తుల సాధారణ రాబడిలో 6% శాతం కేవలం మహిళా శిశుసంక్షేమ కార్యక్రమాలకునివియోగించాలని నిర్దేశించడంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మన దేశంలోని కొద్ది రాష్ట్రాలలో ఒకటి. ఈ విధంగా పంచాయతీ సమితులు జిల్లా పరిషత్తులు సమకూర్చిన నిధులతో గ్రామీణ ప్రాంతాలలో సమాజ సంక్షేమ కార్యక్రమాలు చేపట్టడం సాధ్యమయింది.

శిశు సంక్షేమ కార్యక్రమాలను అమలు పరచవలసిన ఆవశ్యకత ఇటీవలి సంక్షేమ పథకాలలో బాగా ప్రతిబింబిస్తుంది. 0-14 ఏళ్ళ వయస్సు బాలలు జనాభాలో 40 శాతం ఉంటారు. ఒక విధంగా చూస్తే సంఘంలో వారు ఉత్పత్తికి దోహదం చేసేవారు కారు. అయినప్పటికీ మానవ వనరుల నాణ్యత, దీనిమీద ఆధారపడి ఉండే సామాజిక, ఆర్థిక ప్రగతి చాలా మటుకు మనం ఈ వయస్సు పిల్లలకు సమకూర్చగల సేవలమీదే ఆధారపడి ఉంటాయి. పెరుగుతున్న తరంలో మానవ వనరుల పరంగా వీరికి చేసే ఖర్చువల్ల భవిష్యత్తులో చాలా లాభాలు వనకూడుతాయి. ఈ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొని బాలవాడిలు, ప్రాక్ పాఠశాల విద్యార్థులకు క్రెచ్‌లు, బాలవిహారులు, బాలల గృహాలు స్థాపించడం జరిగింది.

మహిళలు ఉన్నచోటే బాలలు కూడా తప్పకుండా ఉంటారనే సత్యాన్ని గుర్తించి అన్ని వయస్సుల బాలలకు సంక్షేమ సంస్థలు, కార్యక్రమాలు విస్తృత పరచడం జరిగింది. అందువల్ల మొదట్లో మహిళా సంక్షేమ శాఖగాఉన్న శాఖను 1978లో మహిళా, శిశు సంక్షేమ శాఖగా మార్పుచేసారు. మహిళా, శిశు సంక్షేమానికి ప్రత్యేక విభాగము, ప్రత్యేకంగా ఒక మంత్రి పనిచేస్తున్న చాలా కొద్ది రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. ఈ విభాగంలో కింది సంస్థలు ఉన్నాయి.

**మహిళా సంక్షేమ పథకాలు :**

| సంస్థ పేరు | మొత్తం సంఖ్య |
|---|---|
| 1. నిరాశ్రయులైన మహిళలకు సేవా సదనాలు | 7 |
| 2. స్టేట్ హోమ్‌లు | 4 |

| | | |
|---|---|---|
| 3. | మహిళలకు సెక్రెటేరియల్ కోర్స్‌లలో శిక్షణఇచ్చే కేంద్రాలు | 7 |
| 4. | ప్రాంతీయ దర్జీపని కేంద్రాలు | 2 |
| 5. | యూనిఫామ్‌లు తయారుచేసే కేంద్రాలు | 8 |
| 6. | దర్జీపని కేంద్రాలు | 3 |
| 7. | వయస్సుమళ్ళిన స్త్రీలకు శరణాలయాలు | 1 |
| 8. | ఉద్యోగం చేసే స్త్రీలకు హాస్టల్‌లు | 3 |

***శిశు సంక్షేమ పథకాలు :***

| | | |
|---|---|---|
| 1. | 0 - 5 వయస్సు పిల్లలకు క్రెచ్‌లు | 74 |
| 2. | బాల విహార్‌లు | 28 |
| 3. | నిరాశ్రయులైన, అనాథలయిన పిల్లలకు శరణాలయాలు | 46 |
| 4. | బాలికలకు కాలేజీ హోమ్‌లు | 3 |

***సేవా సదనాలు :*** మహిళా సంక్షేమ కార్యకర్తలు, గ్రామ సేవికలు, ఇతర విస్తరణ ఉద్యోగులు గృహాలను సందర్శించి నప్పుడు నిస్సహాయులైన స్త్రీల సంగతులు పరిశీలించి వారిని సేవా సదనాలలో చేర్పిస్తారు. విసర్జింపబడిన భార్యలు, వితంతువులు, నిరాశ్రయులు వాటిలో ఉంటారు. సాధారణంగా అటు వంటి స్త్రీలు సేవా సదనాలలో 3 సంవత్సరాల పాటు ఉంటారు. వీరికి కొంత సామాన్య విద్య, అనేక ఉపయుక్త వృత్తులలో శిక్షణ ఇస్తారు. వారిని ప్రభుత్వ పరీక్షలకు పంపుతారు. ఈ సేవా సదనాలలో శిక్షణ కార్యక్రమాలు, ఉత్పత్తి కేంద్రాలు ఉంటాయి. అయిదు సంవత్సరాల లోపుఉన్న తమ శిశువులను కూడా ఈ స్త్రీలతో పాటు సేవా సదనాలలో ఉండనిస్తారు. ప్రతి సేవా సదనంలోను ఒక బాలల విభాగం కూడా ఉంటుంది. మన రాష్ట్రంలో మహిళా సంక్షేమ శాఖవారు నిర్వహిస్తున్న 6 సేవా సదనాలు కాకుండా తూర్పు గోదావరి జిల్లాలో కస్తూరిబా గాంధి జాతీయ స్మారక ట్రస్ట్‌వారు నిరహిస్తు న్నది ఒకటి, కర్నూలు జిల్లాలో ఒక మహిళా మండలి ఉన్నాయి.

***స్టేట్ హోమ్‌లు :*** దుష్టశక్తులకు లోనైన స్త్రీలను రక్షించడానికని మొదట్లో వీటిని 1958 లో ప్రారంభించారు. వీటిని భారత ప్రభుత్వం వారి ఆధ్వర్యంలో నడిపారు. రాను రాను ఇవి సేవా సదనాలవలెనే నిరాశ్రయులైన స్త్రీలకు ఆశ్రయాలుగా తయారయ్యాయి. రెండో పంచవర్ష ప్రణాళిక చివరికి వీటికి కేంద్ర సహాయం నిలిపివేసారు. ఇవి ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వ బాధ్యతలోకి వచ్చాయి.

ఆశ్రయం, అండకావలసిన స్త్రీలు తమంత తామే వీటిలో చేరతారు. లేదా మహిళా సంక్షేమ శాఖ ఉద్యోగులు సిఫార్సు చేసిన మీదట చేరుతారు. వీరు ఇక్కడ మూడు సంవత్స రాల పాటు ఉంటారు. సామాన్య విద్య, ఉపయుక్తమైన వృత్తులలో శిక్షణ పొందుతారు.

రెడీమెడ్ దుస్తులు, చాపలు అల్లడం, నవారు తయారుచేయటం, గాజులుతయారుచేయటం మొదలైన వాటిలో ఉత్పత్తి కేంద్రాలు ఉన్నాయి. మన రాష్ట్రంలో ఇప్పుడు నాలుగు ఉన్నాయి.

***వృత్తి శిక్షణ కేంద్రాలు :*** తక్కువ ఆదాయం గల కుటుంబాలకు చెందిన, చదువుకున్న నిరుద్యోగులైన యువతుల కోసం ఇవి ఏర్పాటు చేశారు. ఇటు పంటివారు తమంతట తాము ఉన్నత విద్యగాని, సాంకేతిక అర్హతలుగాని సంపాదించి ఉద్యోగార్హత పొందలేరు. యస్.యస్.సి. హెచ్.యస్సి.లేదా మెట్రిక్యులేషన్ కనీస అర్హత ఉన్న బాలికలను చేర్చుకొని వారికి టైప్, షార్ట్‌హాండ్, అకౌంటెన్సీ, బాంకింగ్ మొదలైనవాటిలో శిక్షణ ఇచ్చి ప్రభుత్వ పరీక్షలకు పంపుతారు. మన రాష్ట్రంలో ఇప్పుడు ఇటువంటివి 7 ఉన్నాయి. ఒక్కొక్క కేంద్రంలో 30 మందిబాలిక లుంటారు. వీరిలో 20 మందికి స్టైఫండ్ ఇస్తారు స్టైఫండ్ ఇచ్చే వారందరికీ హాస్టల్‌వసతులుంటాయి.

***ప్రాంతీయ కుట్టుపని కేంద్రాలు :*** బీద కుటుంబాలకు చెందిన నిరక్షరాస్యులయిన యువతులకు కుట్టుపనిలో శిక్షణ ఇవ్వడం కోసం ఇవి స్థాపించినారు. ఒక్కొక్క కేంద్రంలో 50 మంది యువతులుంటారు. వారందరూ హాస్టల్‌లో ఉంటారు. ప్రస్తుతం మన రాష్ట్రంలో రెండున్నాయి.

***యూనిఫారమ్ తయారీ కేంద్రాలు :*** వీటిని 1970 లో ప్రారంభించారు. తెలంగాణా అభివృద్ధి నిధులతో వీటిని స్థాపించారు. తెలంగాణా జిల్లాల ముఖ్య పట్టణాలలో నిస్సహాయులైన మహిళల కోసం ఇవి స్థాపించారు. వివిధ ప్రభుత్వ శాఖలలో ఉద్యోగులకు అవసరమైన యూనిఫారమ్‌లను తయారు చేస్తారు. ఈ విధంగా మహిళలకు అదనంగా ఆదాయం సమకూరుతుంది. ఇప్పుడు ఇవి 8 ఉన్నాయి.

***కుట్టుపని కేంద్రాలు :*** వీటిని జంటనగరాలలో మురికివాడలలో ప్రారంభించారు. తక్కువ రాబడికల కుటుంబాల మహిళలకు శిక్షణ, ఉద్యోగం కల్పించడానికి ఇవి ఉద్దేశించబడినాయి. ఇప్పుడు ఇవి మూడున్నాయి.

***కోర్టులో విచారణ జరుగుతున్నవారికి రక్షణసదనాలు :*** పడుపు గృహాలమీద దాడులు జరిపి పోలీసువారు నిందితులను విచారణకోసం కోర్టుకు పంపుతారు. విచారణ జరుగుతున్న సమయంలో, రిమాండ్‌లో ఉన్న నిందితులను ఈ రక్షణగృహాలకు పంపుతారు. 1974-75లో ఒకటి విజయవాడలోను, ఒకటి హైదరాబాదులోను స్థాపించినారు. ఇక్కడ తిండి, బట్ట, వసతి కల్పించడమే కాకుండా వారికి పునరావాసం కల్పించడానికి ప్రయత్నిస్తారు.

***వయస్సు మళ్ళిన స్త్రీల సదనం :*** 1971-72 లో చిత్తూరులో దీనిని స్థాపించినారు. నిరాశ్రయులైన 50 మంది వయస్సు మళ్ళిన స్త్రీలకు రక్షణ కల్పిస్తారు. ఇప్పుడు హైదరాబాదులో కూడా ఒకటి ఉంది.

***ఉద్యోగాలుచేసే మహిళల హాస్టల్‌లు :*** గత దశాబ్దంలో స్త్రీలలో విద్యావంతుల సంఖ్య పెరిగింది. నిత్యావసర వస్తువుల ధరలు పెరగడంతో కుటుంబ ఆదాయం చాలక చాలా గృహాలలో మహిళలుకూడా ఉద్యోగాలు చేయవలసిన అవసరం కలుగుతోంది. నగర ప్రాం

తాలలో పరిశ్రమలు వృద్ధి చెందడంతో అక్కడే ఉద్యోగావకాశాలు ఎక్కువగా ఉంటున్నాయి కనక స్త్రీలుకూడా అధిక సంఖ్యలలో ఉద్యోగాలకోసం నగరాలకు తరలిపోక తప్పడంలేదు. వారి వ్యక్తిగత భద్రతకు భంగం లేకుండా వారి స్థోమతకు తగినట్లు ఉండటానికి ఈ మహిళలకు ఒక ప్రదేశం అవసరమయింది. ఈ అవసరాన్ని దృష్టిలో ఉంచుకొని 1974-75 లో రెండు హాస్టల్‌లు స్థాపించారు- ఒకటి హైదరాబాదులోను, ఒకటి విశాఖ పట్టణంలోను.

## బాలల సంక్షేమ పథకాలు

బాలల సంక్షేమం మహిళల సంక్షేమం నుంచి వేరు చేయరానిది. మహిళల పోషక, ఆరోగ్య, ఆర్థిక స్థాయిలో ఏ అభివృద్ధి జరిగినా అది బాలల సర్వతోముఖ అభివృద్ధికి దోహదం చేస్తుంది.

*క్రెచ్‌లు :* చాలామంది మహిళలు వ్యవసాయ పనులలో నిమగ్నులయి ఉంటారు. పనిచేస్తున్న స్త్రీలలో నిజానికి 74% వ్యవసాయ పనివారే. ఈ స్త్రీలు ఉదయంనుంచి సాయంత్రం వరకు పని చేస్తూనే ఉంటారు. అందువల్ల వారి పిల్లలు తల్లిప్రేమకు దూరమై పోతారు. ఇటువంటి పిల్లలకు వ్యవస్థాపరమైన రక్షణ అవసరమవుతుంది. ఫాక్టరీ చట్టం అమలులోఉన్న పారిశ్రామిక సంస్థలలో మాత్రమే క్రెచ్‌ల రూపంలో ఇటువంటి రక్షణ లభిస్తోంది. కనక మూడో ప్రణాళికలో వ్యవసాయ కార్మికుల ప్రాక్‌పాఠశాలపిల్లలకోసం, గ్రామీణ ప్రాంతాలలో క్రెచ్‌లు ప్రారంభించారు. ఒక్కొక్క క్రెచ్‌లో 0-5 వయస్సుగల 30 మంది పిల్లలుంటారు. వారికి ఉదయం 8గం॥నుంచి సాయంత్రం 5గం॥వరకు వారి తల్లులు పనిలోఉన్న సమయంలో స్నానం చేయించడం, బట్టలుతొడగడం, ఆహారం ఇవ్వడం చేస్తారు. ప్రస్తుతం మనరాష్ట్రంలో ఇవి 138 ఉన్నాయి.

***బాల విహార్‌లు :*** 18 సంవత్సరాల వయస్సువరకు ఉండే బాలలకు ఇవి వినోద కేంద్రాలుగా (Recreation Centres) ఉంటాయి. ప్రతి ఉదయం ప్రాక్ పాఠశాలపిల్లలకు ఇవి నడుపుతారు. బడికి వెళ్ళే పిల్లలకు, బడికి వెళ్లని పిల్లలకు కూడా వినోద సౌకర్యాలు కల్పిస్తారు. కొన్ని బీద ప్రాంతాలలో మునిసిపాలిటీలు పంచాయతీలు నడిపే పాఠశాలలో సాధారణంగా పిల్లలకు వినోదసౌకర్యాలు లభ్యంకావు. అందువల్ల బాలవిహార్‌లలో ఇటువంటి సౌకర్యాలు కల్పిస్తారు. ఇటు వంటివి 28 ఉన్నాయి.

***బాలసదనాలు :*** ఇవి అనాధల కోసం, నిరాశ్రయులైన బాలల కోసం ఉద్దేశించ బడినవి 7 - 10 సంవత్సరాల మధ్య వయస్సు పిల్లలను వీటిలో చేర్చుకుంటారు. బాలికలు 18 సంవత్సరాల వయస్సువరకు ఉండవచ్చు. మగ పిల్లలకు పదిసంవత్సరాలునిండగానే వీటి నుంచి పంపి వేస్తారు. వారిని అప్పుడు సాంఘిక సంక్షేమ హాస్టల్‌లలో చేర్చుతారు.

ఒక్కొక్క సదనంలో 50 మంది పిల్లలుంటారు. వారికి తిండి, బట్ట, వైద్య సహాయం అందజేస్తారు. వారిని స్థానిక పాఠశాలలలో చేర్పించి పుస్తకాలు,యూనిఫామ్‌లు వంటి అవసరాలు కూడా సమకూరుస్తారు.

మన రాష్ట్రంలో ఉన్న బాల సదనాలలో 14 షెడ్యూల్డ్ కులాల వారికి, ఒకటి షెడ్యూల్డ్ తెగలవారికి, 4 కుష్ఠురోగుల ఆరోగ్యవంతమైన పిల్లలకు, మిగిలినవి అన్ని కులాల, మతాల పిల్లలకు ఉద్దేశింపబడినాయి.

***బాలికల కాలేజి యేట్ సదనం :*** బాలల సదనంలో ఉన్నత విద్యకు అభిలాష చూపిన వారిని ఎంపిక చేసి హైదరాబాదులోను, తిరుపతిలోను ఉన్న కాలేజియేట్ హోమ్‌లలో చేర్పిస్తారు. ఒక్కొక్క హోమ్‌లో 30 మంది ఉంటారు. వారు 5 సంవత్సరాల పాటు ఉండవచ్చు. అప్పటికి వారు డిగ్రీ చదువు పూర్తి చేస్తారు.

వివిధ బాల సంక్షేమ పథకాల ద్వారా నిరాశ్రయులైన, అర్హులైన బాలలు శైశవం నుంచి, ప్రౌఢదశ వరకు రక్షణ పొందడమే కాకుండా జీవిత సమస్యలను నమ్మకంతో ఎదుర్కొవడానికి కావలసిన విద్యార్హతలు కూడా సంపాదించు కోవచ్చు.

## సమగ్ర శిశు సంవర్ధనం
## ( Integrated Child Development )

బాలల అభివృద్ధికి తగిన వసతులు కల్పించవలసిన అవశ్యకతను గుర్తించి అయిదో పంచవర్ష ప్రణాళికలో ఇంకా అత్యంత ప్రాధాన్యతను ఇచ్చినారు. బాలల కోసం నిర్దేశించిన జాతీయ విధానంలో 15 సూత్రాల ప్రణాళికను రూపొందించినారు. ఈ జాతీయ విధానానికి అనుగుణ్యంగా భారత ప్రభుత్వం వారు సమగ్ర శిశు సంవర్ధన సేవా పథకాన్ని మంజూరు చేసారు. దీనిని ప్రాయోగికంగా ముందు దేశంలోని వివిధ ప్రాంతాలలో మొత్తం 33 బ్లాక్‌లలో ప్రవేశ పెట్టినారు. ఇందులో భాగంగా అదనపు పోషణ, టీకాలు, ఆరోగ్యరక్షణ, తల్లులకు పోషణ సంబంధమైన విద్య, ప్రాక్ పాఠశాల విద్య, వినోదం, కుటుంబ నియంత్రణ మొదలైన కార్యక్రమాలు అమలు జరుపుతారు.

సమగ్ర శిశుసంవర్ధన సేవల ప్రధాన ఆశయాలు ఇవి :

1. 0-6 సంవత్సరాల వయస్సు పిల్లలు పోషక, ఆరోగ్య స్థాయిని మెరుగుపరచడం.
2. పిల్లల సరిఅయిన మానసిక, భౌతిక, సామాజిక అభివృద్ధికి కావలసిన పునాదులు వేయటం.
3. శిశుసంవర్ధన లక్ష్యాలను సాధించడానికి వివిధశాఖల మధ్య, విధానం రూపొందించడంలోను, అమలు జరపడంలోను, సమన్వయం చేకూర్చటం.
4. సరిఅయిన పోషణ, ఆరోగ్య విద్యద్వారా, పిల్లల సామాన్య ఆరోగ్య, పోషణ అవసరాలను తల్లులు చూడగలిగే శక్తిని పెంపొందించడం.

మన రాష్ట్రంలో అనంతపూర్ జిల్లాలో కంబదూర్ గ్రామీణ బ్లాక్‌లోను, అదిలాబాద్ జిల్లాలోని ఉట్నూర్ గిరిజనాభివృద్ధి బ్లాకులోను 1975లో ఈ పథకాన్ని ప్రారంభించినారు. ప్రస్తుతం మన రాష్ట్రంలో 9 ఉన్నాయి.

*అంగన్‌వాడి కేంద్రాలు :* ఈ పథకాన్ని 1976 లో ప్రారంభించినారు. ఒక్కొక్క బ్లాక్‌లో 100 అంగన్‌వాడులు ఏర్పరచినారు. అంగన్‌వాడి కార్యకర్తను సాధారణంగా స్థానిక సమాజం నుంచే ఎంపికచేసి, ఆమెకు బహుళార్థక సాధక కార్యకర్తగా శిక్షణ ఇస్తారు. ప్రాక్ పాఠశాల లేదా బాల్‌వాడి కార్యక్రమాలు, శిశువులకు అదనపు పోషణ, తల్లులకు ఆహార, పోషణ విద్యనేర్పడం, తల్లిదండ్రులకు బోధించడానికి గృహాలు సందర్శించడం, సమాజ సహకారం సంపాదించడం, ఈ పథకంలో ఆరోగ్యానికి సంబంధించిన అంశాల నిర్వహణలో వైద్య సిబ్బందితో సహకరించడం (టీకాలు వేయడం, ఆరోగ్యపరీక్ష మొదలైనవి) మహిళా మండలులతోను, పాఠశాల అధ్యాపకులతోను, సత్సంబంధాలు నెలకొల్పడం ఇవన్నీ అంగన్‌వాడి కార్యకర్త బాధ్యతలు. హైదరాబాదులోని ఉస్మానియా వైద్యకళాశాల, తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర వైద్యకళాశాలలకు ఈ పథకంతో సన్నిహిత సంబంధం ఉంది.

ఈ పథకానికి UNICEF, CARE వంటి అంతర్జాతీయ సంస్థల సహాయ సహకారాలు కూడా లభిస్తున్నాయి. ఈ పథకానికి సంవత్సరానికి 7.8 లక్షల రూపాయలు కేటాయిస్తున్నారు.

*ప్రయోజనాత్మక అక్షరాస్యత :* మన రాష్ట్రంలో 6 బ్లాక్‌లలో ఈ పథకం అమలులో ఉంది. 15-45 సంవత్సరాల మధ్య ఉన్న మహిళలకు ఆరోగ్యం, ఆహారం, పోషణ, గృహ నిర్వహణ, శిశుసంరక్షణ, పౌరవిద్య, మొదలైన వాటిలో శిక్షణ ఇస్తారు. 1980-81 లో ఈ పథకానికి 15.05 లక్షల రూపాయలు కేటాయించారు.

*ఆంధ్రప్రదేశ్ మహిళా సహకార ఫైనాన్స్ కార్పొరేషన్ :* దానిని 1975 లో ప్రారంభించారు. పాడిపరిశ్రమ, కోళ్లపెంపకం, కూరగాయలు, పళ్లు, చేపలఅమ్మకం, చిల్లర దుకాణం, దర్జీపని, ఊరగాయల తయారీవంటి పనులు చేయడానికి వ్యక్తిగతంగా మహిళలకు సహకార సొసైటీలకు, వీరు ఆర్థిక సహాయం చేస్తారు. రాష్ట్రప్రభుత్వం ఈ కార్పొరేషన్‌లో వాటా మూలధనం రూపంలో 120.0 లక్షల రూపాయలు వినియోగించినారు. 2,67,042 రూపాయలు లాభం పొందిన మహిళల నుంచి వాటా మూలధనం రూపంలో సేకరించినారు.

*ఇంటిపనివారి శిక్షణ పథకం :* 18 ఏళ్లపైబడిన 50 మంది బాలికలకు శిశు సంరక్షణ, గృహనర్సింగ్, వ్యక్తిగత ఆరోగ్యము, వంట,వార్పు, మామూలు ఇంటి జాగ్రత్త, బట్టలుతకటం, రొట్టెల తయారీ, వడ్డన, ఇంగ్లీషు, హిందీ భాషలలో సంభాషణ జరపడం వంటివాటిలో శిక్షణ ఇచ్చి వారికి మనదేశంలోను, ఇతర దేశాలలోను ఇంటి పనివారిగా ఉద్యోగావకాశాలు కల్పించడానికి ఈ పథకం రూపొందించినారు. దీనిని మహిళల సాంకేతిక శిక్షణ సంస్థకు అనుబంధంగా 1979-80 లో ప్రారంభించినారు. 1980-81 లో దీనికోసం 0.39 లక్షల రూపాయలు కేటాయించినారు.

*క్రాఫ్ట్ శిక్షణ కేంద్రాలు :* షెడ్యూల్డ్‌కులాల, షెడ్యూల్డ్ తెగల మహిళలకు బట్టల అద్దకం, రంగువేయడం, పట్టుపరిశ్రమ, వెదురుపని, పూసలపని, నవారు నేయడం, కలంకారీ, చాపలు నేయడం, కుట్టుపని, తాళ్లు తయారుచేయడం వంటి పనులలో శిక్షణ ఇస్తారు.

ఇటువంటి కేంద్రాలు 14 ఉన్నాయి. 1980-81 లో వాటికి 3 లక్షల రూపాయలు కేటాయించినారు.

***శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ ప్రభుత్వ మహిళా సాంకేతిక శిక్షణాసంస్థ :*** దీనిని 1978-79 లో స్థాపించినారు. ఇందులో రేడియో, టెలివిజన్ మెకానిక్, డ్రాఫ్ట్స్‌మన్, గడియారాల తయారీ, బట్టల అద్దకం, సివిల్ ఇంజనీరింగ్, ఆర్కిటెక్చర్ కోర్స్‌లలో శిక్షణ ఇస్తారు.

నెల్లూరులో షెడ్యూల్డ్‌కులాల మహిళలకోసం ఒక సాంకేతిక శిక్షణా సంస్థను 1979-80 లో స్థాపించినారు.

***మహిళామండలులు :*** అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ప్రతి పంచాయితీలో ఒక మహిళా మండలి ఉండాలనేఉద్యమం ప్రారంభమయింది. మనరాష్ట్రంలో ఇప్పుడు 8,000 రిజిస్టర్డ్ మహిళామండలులు 11,000 రిజిస్టర్డ్ కాని మహిళామండలులుఉన్నాయి. వాటికిజిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితుల నుంచి ఆర్థిక సహాయం లభిస్తోంది. ఇదికాక రాష్ట్రప్రభుత్వం నాన్‌ప్లాన్ కింద లక్షరూపాయలు విరాళం ఇస్తోంది.

## యువజన సంక్షేమ కార్యక్రమాలు

రాష్ట్రప్రభుత్వం 1972 లో యువజన సంక్షేమ శాఖను స్థాపించింది. నెహ్రూయువక కేంద్రాలు నిర్వహించడమేకాక, ఈ శాఖ కింది పథకాలు కూడా నిర్వహిస్తున్నారు.

1. ఉద్యోగం లేని విద్యావంతులైన యువకులకు ఉపాధి కల్పించేందుకు యువజనాభివృద్ధిదళ పథకం ఏర్పాటు.
2. అక్షరాస్యత తరగతులు, యువజన సంఘసమావేశాలు, మొదలైన సామూహిక, సామాజిక, సేవా కార్యక్రమాలకు పనికివచ్చే యువజన సంఘ భవనాలనిర్మాణం
3. గ్రామీణ యువజనుల కేంద్రాలలో పాల్గొనేందుకు వీలుగా క్రీడా మైదానాలు ఏర్పాటు చేయడం.
4. యువజన సంఘాలను పునరుద్ధరించడం.
5. ఆటలు, సాంస్కృతిక కార్యక్రమాలు, శిబిరాలు, ఊరేగింపులు నిర్వహించడం.

# 21

# రవాణా

రవాణా దేశానికి నాడీవ్యవస్థ అని, రవాణా అభివృద్ధి నాగరికతా చిహ్నమని అందరికీ తెలుసు. దేశ ఆర్థికాభివృద్ధికి, సామాజికావగాహనకు ఇది ఎంతగానో తోడ్పడుతుంది. వివిధ ప్రాంతాల మధ్య సంబంధాలు పెంచుతూ, అందరినీ దగ్గరగా చేర్చడమే కాకుండా వ్యాపార వాణిజ్యాలకు, పరిశ్రమలకు, రవాణా ఎంతగానో తోడ్పడుతున్నది.

రవాణా మన రాష్ట్రంలో ప్రధానంగా నాలుగు రకాలుగా సాగుతున్నది. రోడ్లు, రహదారులు, రైల్వేమార్గాలు, జలమార్గాలు, విమానమార్గాలు.

## రోడ్లు, రహదారులు

అనాదినుంచి మానవ నాగరికతలో ముడిపడి ఉన్నది. రోడ్డురవాణా ప్రయాణీకులను సరుకులను, గమ్యస్థానం వరకు చేరవేయడానికి ఇది ఎంతగానో ఉపకరిస్తున్నది. అందుకనే ప్రభుత్వం దీని అభివృద్ధికి కృషిచేస్తున్నది. 1947 నాటికి మనదేశంలో 3,88,226 కిలో మీటర్లు ఉండేది. దీనిని 1970-71 నాటికి 12,87,000 మేరకు విస్తృత పరచడం జరిగింది. ప్రస్తుతం (1975-76) దేశంలో రోడ్ల నిడివి 13,75,244 కిలోమీటర్లు. దేశంతోపాటే మన రాష్ట్రంలో కూడా రోడ్ల అభివృద్ధి విస్తృతంగా సాగింది.

మనరాష్ట్రంలో రోడ్ల రవాణాను ప్రధానంగా మూడు రకాలుగా విభజించవచ్చు. జాతీయ రహదారులు రాష్ట్రప్రభుత్వ రోడ్లు పి.డబ్లు.డి నిర్వహించేవి. స్థానిక సంస్థలరోడ్లు (కార్పొరేషన్‌లు, మునిసిపాలిటీలు, జిల్లా పరిషత్తులు, పంచాయతీలు నిర్వహించేవి).

***జాతీయ రహదారులు*** , ఆంధ్రప్రదేశ్ ద్వారా 4,5,7,9, 43 నెంబర్లుగల జాతీయ రహదార్లు పోతున్నాయి. ఇవి భారత ప్రభుత్వం అధీనంలో ఉన్నాయి. మన రాష్ట్రానికి సంబంధించి నంతవరకు వీటి పొడవు దాదాపు 2,350 కిలోమీటర్లు. 1961 నుంచి 20 ఏళ్ళ పథకం కింద వీటిని వెడల్పుచేయడం. పటిష్టం చేయడం, వంతెనల నిర్మాణం మొదలైన అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టడం జరిగింది. ఈ పథకం నిమిత్తం కేటాయించిన మొత్తం నాల్గవ ప్రణాళికలో 37.5 కోట్లు, ఐదవ ప్రణాళికలో 17 కోట్లు. అయితే కారణాంతరాలవల్ల లక్ష్యం మేరకు పనిసాగలేదు. ఆరో ప్రణాళికలో ఆంధ్రప్రదేశ్‌లోని జాతీయ రహదార్ల అభివృద్ధికి కేంద్రప్రభుత్వం రూ. 26.75 కోట్లను కేటాయించింది.

***వంతెనల నిర్మాణం, టోలుపన్ను :*** ప్రణాళికల మేరకు అనేక రహదార్లపై, రోడ్లపై కొత్త వంతెనలను నిర్మించడం, ఇరుకైన వంతెనలను వెడల్పు చేయడంవంటి కార్యక్రమా

లను చేపట్టడం జరిగింది. ఇటువంటి వాటిలో ప్రధానమైనది రాజమండ్రివద్ద గోదావరి నది మీద నిర్మించిన రైలు కమ్ రోడ్ వంతెన. దీనికి అయిన ఖర్చు 10.5 కోట్లు దీనిని నాల్గవ ప్రణాళికా కాలంలో పూర్తిచేసి 20.11.1974 న ప్రారంభించడం జరిగింది. ఇదికాక ముఖ్యంగా చెప్పుకోదగినవి మరికొన్ని ఉన్నాయి. ఉదాహరణకు సంకిలివద్ద నాగావళి మీద ఒక వంతెన, ప్రధగౌతమి మీద ఒక వంతెన, పెదఎర్లగాడిమీద మరొక వంతెన, మద్రాసు బొంబాయి జాతీయ రహదారిలో 266/1 మైలువద్ద ఒక వంతెన, మొదలైనవి ఈ కోవకు చెందినవి.

ఇవికాక రైల్వేలైన్ల మీద కొన్ని ఓవర్ బ్రిడ్జిలను కూడా నిర్మించడం జరిగింది. ఉదాహరణకు ఆదోనివద్ద కట్టిన ఓవర్ బ్రిడ్జి, నర్సీపట్నం, తిరుపతి, గూడూరు, గుడివాడ, మంగళగిరి, కుప్పం, జనగామ, నెల్లూరు, కాజీపేట, మొదలైనచోట్ల ఎగువ-దిగువ వంతెనలు నిర్మాణం కూడా ఈ కోవలోకి వస్తాయి.

1956 తరవాత 10 లక్షల కంటె ఎక్కువ ఖర్చుతో నిర్మించిన వంతెనల మీద రాక పోకల పన్ను (టోలుపన్ను) వసూలు చేసే చట్టం 21.6.1975 నుంచి రాష్ట్రంలో అమలు లోకి వచ్చింది. ఈ చట్టంకింద 22 వంతెనలను చేర్చినారు. ఈ విధంగా వసూలుచేసిన పన్నులవల్ల సగటున ఏటా 50 లక్షల రాబడి ఉండవచ్చునని అంచనా.

## రాష్ట్రీయరోడ్లు

రాష్ట్రంలోని జాతీయ రహదార్లుకాక మిగిలినవి రెండు రకాల యాజమాన్యం కింద ఉన్నాయి. పి.డబ్ల్యు.డి. (ఆర్ & బి) ద్వారా ప్రభుత్వం నిర్వహించేవి, స్థానిక సంస్థలు నిర్వహించేవి.

మొత్తంమీద చూస్తే ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు నాటికి (1956-57) రాష్ట్రంలోని రోడ్ల నిడివి 14,906 కిలోమీటర్లు 1978 మార్చి నాటికి వీటి నిడివి 86,982 కిలో మీటర్లు. వీటిలో 31,558 కిలోమీటర్ల రోడ్లు పి.డబ్ల్యు.డి కింద మిగిలిన మేర స్థానిక సంస్థల యాజమాన్యం కింద ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని రోడ్ల నిడివి జిల్లాలవారీగా దిగువ పట్టికలో సూచించడం జరిగింది.

| వ. సం. | జిల్లా | 1978-79<br>పి. డబ్ల్యుడి. రోడ్లు | నిడివి : కిలోమీటర్లు<br>స్థానిక సంస్థల రోడ్లు |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 1. | శ్రీకాకుళం | 1,547 | 2,609 |
| 2. | విశాఖపట్నం | 1,540 | 3,054 |
| 3. | తూర్పుగోదావరి | 1,822 | 2,294 |
| 4. | పశ్చిమగోదావరి | 1,667 | 2,889 |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 5. | కృష్ణా | 2,009 | 2,994 |
| 6. | గుంటూరు | 1,962 | 2,327 |
| 7. | ప్రకాశం | 1,856 | 1,378 |
| 8. | నెల్లూరు | 1,530 | 1,218 |
| | మొత్తం కోస్తాఆంధ్ర | 13,933 | 18,763 |
| 9. | కర్నూలు | 1,648 | 1,985 |
| 10. | అనంతపూరు | 1,620 | 6,130 |
| 11. | కడప | 1,391 | 2,766 |
| 12. | చిత్తూరు | 1,684 | 4,022 |
| | మొత్తం రాయలసీమ | 6,343 | 14,903 |
| 13. | హైదరాబాదు | 1,197 | 2,198 |
| 14. | నిజామాబాదు | 998 | 2,178 |
| 15. | మెదక్ | 967 | 2,491 |
| 16. | మహబూబ్‌నగర్ | 1,637 | 3,088 |
| 17. | నల్గొండ | 1,488 | 2,540 |
| 18. | వరంగల్లు | 1,142 | 3,113 |
| 19. | ఖమ్మం | 1,705 | 2,217 |
| 20. | కరీంనగర్ | 991 | 2,616 |
| 21. | ఆదిలాబాదు | 1,157 | 1,317 |
| | తెలంగాణా | 11,282 | 21,758 |
| | మొత్తం ఆంధ్రప్రదేశ్ | 31,558 | 55,424 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

**వాహనాలు**

రవాణా అభివృద్ధి నిమిత్తం రాష్ట్రంలో ప్రత్యేక రవాణా విభాగముంది. రోడ్డు రవాణా సదుపాయాలను అందజేయడం, మోటారు వాహనాల నిర్వహణ, టైర్లు, స్పిరిట్ మొదలైన వాటి పంపిణీ మొదలైనవి ఈ విభాగం చూస్తుంది. రాజధానిలోని కేంద్ర విభాగం కాకుండా ప్రతి రెవిన్యూ జిల్లాకు ఒకటి చొప్పున ప్రాంతీయ రవాణా విభాగాలున్నాయి. ఈ విభాగం ఆదాయ వ్యయాల వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

రూ. లక్షలలో

| సంవత్సరం | ఆదాయం | వ్యయం |
|---|---|---|
| 1959-60 | 253.99 | 6.63 |
| 1965-66 | 832.98 | 16.69 |
| 1970-71 | 1453.96 | 30.45 |
| 1973-74 | 2030.64 | 41.59 |
| 1974-75 | 2534.28 | 48.17 |
| 1975-76 | 2664.40 | 62.1 |
| 1976-77 | 3077.00 | 72.23 |
| 1977-78 | 3188.00 | 84.21 |

రాష్ట్రంలో మొత్తం వాహనాల సంఖ్య 1978 నాటికి రిజిస్టర్ నమోదు అయినవి 2,12,468 వీటిలో రోడ్లమీద నడుస్తున్నవి 1,88,668. వాహనాలను పబ్లిక్ వాహనాలు ప్రైవేట్ వాహనాలని రెండుగా విభజించవచ్చు. వాటి రకాన్ని బట్టి స్టేజ్ కారేజ్‌లు, సరుకుల రవాణా వాహనాలు, కాంట్రాక్టు బస్సులు, కార్లు, ఆటోలు, జీపులు, ట్రాక్టర్లు అని రకరకాలుగా ఉన్నాయి. ఈ వాహనాలను నడపడానికి లైసెన్సులు అవసరం. రాష్ట్రంలో ఇట్లా జారీ చేసిన లైసెన్సులు, వాటి ద్వారా వచ్చిన ఆదాయం వివరాలు దిగువ పట్టికలో చూడవచ్చు.

| | 1973-74 | 1975-76 | 1977-78 |
|---|---|---|---|
| 1. భారీ మోటారువాహనాలు | 7,682 | 8,092 | 5,930 |
| 2. మధ్యమమోటారువాహనాలు | 1,562 | 2,341 | 4,744 |
| 3. తేలిక మోటారు వాహనాలు | 20,265 | 13,698 | 16,414 |
| 4. మోటారు సైకిళ్ళు | 12,753 | 16,671 | 22,173 |
| 5. ఇతర రకాలు | 2,835 | 848 | 2,699 |
| 6. వసూలైన రుసుములు (రూ ॥ లలో) | 14,02,461 | 14,38,429 | 22,73,801 |

వాహనాల సంఖ్య నానాటికీ ఎక్కువవుతూనే ఉంది. ఉదాహరణకు 1961 లో వాహనాల సంఖ్య 31,434 కాగా 1975-76 నాటికి వాటి సంఖ్య 1,50,450. వీటి సంఖ్య 1978 నాటికి 1,88,668. అయితే ఇతర రాష్ట్రాలతో పోలి చూస్తే మనరాష్ట్రం ఈ సంఖ్యలో 8 వ స్థాన మాత్రమిస్తుంది.

రాష్ట్రంలోని జిల్లాలవారీగా చూస్తే 31-3-1977 నాటికి అత్యధిక వాహనాలు హైదరాబాదులో ఉన్నాయి. అత్యల్పం మెదక్ జిల్లాలో ఉన్నాయి. వాహనాల రకాలలో కూడా దాదాపు అన్నిరకాల వాహనాలూ హైదరాబాదులోనే ఎక్కువ. అయితే ట్రాక్టర్లు మాత్రం నెల్లూరు జిల్లాలో ఎక్కువగా ఉన్నాయి. వివిధ రకాల వాహనాల వివరాలను జిల్లాల వారీగా దిగువ పట్టికలో చూడవచ్చు.

## జిల్లాలవారీ పనిచేస్తున్న వాహనాల వివరాలు (31-3-1978)

| వ.సం. జిల్లా | స్టేజ్ కారేజ్‌లు | సరుకులు రవాణా చేసేవి | కాంట్రాక్టు వాహనాలు | ఆటోలు | మోటారు కార్లు జీపులు | ట్రాక్టర్లు | మోటారు సైకిళ్ళు స్కూటర్లు | ఇతరాలు | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 1. శ్రీకాకుళం | 288 | 706 | — | 1 | 378 | 95 | 922 | 116 | 2,496 |
| 2. విశాఖపట్నం | 365 | 1,215 | 56 | 245 | 1,906 | 58 | 7,048 | 603 | 11,496 |
| 3. తూర్పుగోదావరి | 385 | 1,517 | 48 | 7 | 1,728 | 590 | 9,886 | 2,279 | 16,440 |
| 4, పశ్చిమగోదావరి | 341 | 975 | 36 | 52 | 1,052 | 1,123 | 6,138 | 885 | 10,602 |
| 5. కృష్ణా | 638 | 4,324 | 134 | 227 | 1,744 | 121 | 5,738 | 445 | 13,371 |
| 6. గుంటూరు | 543 | 1,597 | 74 | 85 | 2,810 | 852 | 4,108 | 874 | 11,443 |
| 7. ప్రకాశం | 225 | 469 | 6 | 15 | 651 | .... | 1,357 | 1,034 | 3,757 |
| 8. నెల్లూరు | 353 | 657 | 19 | 13 | 1,198 | 1,590 | 1,824 | 826 | 6,480 |
| కోస్తాఆంధ్ర | 3,138 | 10,275 | 373 | 645 | 21,467 | 4,419 | 37,021 | 8,747 | 76,085 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 9. కర్నూలు | 381 | 856 | 33 | 1 | 1,000 | .... | 1,768 | 62 | 4,101 |
| 10. అనంతపూరు | 474 | 615 | 42 | 15 | 851 | 739 | 2,065 | 147 | 4,948 |
| 11. కడప | 333 | 762 | 27 | 2 | 713 | 53 | 981 | 575 | 3,436 |
| 12. చిత్తూరు | 617 | 943 | 139 | 133 | 957 | 670 | 2,063 | 786 | 6,308 |
| రాయలసీమ | 1,805 | 3,176 | 231 | 151 | 3,521 | 1,462 | 6,877 | 1,570 | 18,793 |
| 13. హైదరాబాదు | 839 | 6,472 | 404 | 5,889 | 11,357 | 840 | 43,976 | 1,101 | 70,977 |
| 14. నిజామాబాదు | 208 | 625 | 18 | 30 | 580 | 200 | 1,720 | 647 | 4,028 |
| 15. మెదక్ | 169 | 134 | 3 | .... | 97 | .... | 605 | 28 | 1,036 |
| 16. మహబూబ్‌నగర్ | 208 | 192 | 52 | .... | 221 | 133 | 976 | 209 | 1,991 |
| 17. నల్గొండ | 190 | 195 | 11 | 7 | 196 | ... | 1,184 | 573 | 2,356 |
| 18. వరంగల్ | 278 | 495 | 57 | 38 | 665 | 60 | 2,272 | 228 | 4,093 |
| 19. ఖమ్మం | 192 | 347 | 6 | 27 | 471 | 60 | 1,357 | 169 | 2,629 |
| 20. కరీంనగర్ | 219 | 401 | 66 | 3 | 1,087 | 43 | 2,376 | 393 | 4,588 |
| 21. ఆదిలాబాద్ | 172 | 359 | 10 | 1 | 608 | 20 | 729 | 193 | 2,092 |
| తెలంగాణా | 2,475 | 9,220 | 627 | 6,004 | 15,282 | 1,356 | 55,195 | 3,631 | 93,790 |
| ఆంధ్రప్రదేశ్ | 7,418 | 23,856 | 1,231 | 6,800 | 30,270 | 7,237 | 99,093 | 8,763 | 1,88,668 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణాసంస్థ
## (A.P. State Road Transport Corporat on)

ఈ సంస్థను 1932 లో నైజాం ప్రభుత్వం స్థాపించింది. అయితే అప్పట్లో నైజాం రాష్ట్ర రైల్వేతో ముడిపడి ఉండేది. ఇట్లా 1951 అక్టోబరు వరకు అనుబంధ రవాణా విభాగంగా ఉన్న ఈ సంస్థకు ఆ తరవాత స్వయంప్రతిపత్తి ఏర్పడింది. ఈ రోడ్డు రవాణా విభాగ నిర్వహణను హైదరాబాదు రాష్ట్రం చేపట్టింది. 1956 లో ఆంధ్రప్రదేశ్ అవతరించడంతో నాటి హైదరాబాదు రాష్ట్రరోడ్డు రవాణా విభాగం మూడు ముక్కలుగా ఆంధ్రప్రదేశ్, మైసూరు, బొంబాయి రాష్ట్రాలకు చీలిపోయింది. మనరాష్ట్రం భాగంగా తెలంగాణాలోని జిల్లాల బస్సుసర్వీస్‌లు, మన ప్రభుత్వ మధీనమైనాయి. ఆ తరవాత ఈ విభాగాన్ని రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ చట్టం 1950 అనుసరించి 11-1-1958 న ఒక చట్టబద్ధమైన సంస్థగా రూపొందించడం జరిగింది.

1932 లో ఈ సంస్థకు 24 మంది ప్రయాణించగల ఆల్బియన్ బస్సులు 27మాత్రమే ఉండేవి. 1951 నుంచి విడివడిన నాటికి 600 పైగా బస్సులుండేవి. అయితే ఈ సంఖ్య రాష్ట్ర అవతరణ నాటికి (799 నుంచి) 564 కు తగ్గింది. ఆ తరవాత జాతీయకరణ పథకం కారణంగా ఈ సంస్థ బలంపుంజుకొని అన్ని రంగాలలోను అభివృద్ధి చెందింది. 31-3-80 నాటికి ఈ సంస్థ 6994 వాహనాలను నడుపుతున్నది.

1958 లో ఆంధ్రప్రదేశ్ రోడ్డురవాణా సంస్థగా రూపొందిననాటినుంచి ఈ సంస్థలో జరిగిన అభివృద్ధి వివరాలను క్లుప్తంగా దిగువ పట్టికలో పొందుపరిచాం.

| ప.సం | సంవత్సరం | బస్సుల సంఖ్య | ఉద్యోగులు | ప్రయాణికులు (సంఖ్య లక్షలలో) | రాబడి (లక్షల రూ॥లో) | ఖర్చు (లక్షల రూ॥లో) |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 1. | 1958-59 | 679 | 5081 | 650.02 | 299.22 | 249.45 |
| 2. | 1960 | 938 | 6585 | 835.96 | 373.15 | 339.47 |
| 3. | 1964 | 1986 | 13,477 | 2100.13 | 964.95 | 973.86 |
| 4. | 1971 | 2464 | 22,258 | 3239.51 | 2469.54 | 2424.22 |
| 5. | 1975 | 3774 | 3,1242 | 5785.01 | 5739.97 | 5418.22 |
| 6. | 1979 | 6072 | .... | 9920.70 | 11240.00 | 1145.00 |
| 7. | 1980 | 6994 | .... | 11578.41 | 13150.00 | 13966.00 |

మూలం : ఏ.పి యస్.ఆర్.టి.సి.

*వ్యవస్థాపన :* ఈ సంస్థకు ఒక బోర్డ్ ఉంది. ఒక ఛైర్మన్, వైస్‌ఛైర్మన్, జనర మేనేజర్ ఉంటారు. వీరికింది శాఖాధిపతులు, సంయుక్త జనరల్ మేనేజర్‌లు, సి.ఏ.ఓ సి.టి.ఎమ్., సి.పి.ఎమ్ మొదలైన అధికారులు, తదితర సిబ్బంది ఉంటారు. ఫీల్డ్ స్థాయి ఈ సంస్థకు 5 రీజియన్లు, 17 డివిజన్లు, 3 వర్క్‌షాప్‌లు, 4 రీట్రేడింగ్ షాప్‌లు, 104 ఆ రేషనల్ డిపోలు, 91 అడ్మినిస్ట్రేటివ్ యూనిట్లు ఉన్నాయి.

*అంతర్‌రాష్ట్ర సర్వీస్‌లు :* ఈ సంస్థ తమిళనాడు, కర్నాటక, మహారాష్ట్ర, మధ ప్రదేశ్, పాండిచ్చేరి, ఒరిస్సా రాష్ట్రాలతో చేసుకొన్న ఒడంబడిక ప్రకారం 90 అంతర్‌రాష సర్వీస్ బస్సులను నడుపుతున్నది. వీటిలో చాలావరకు సూపర్ డీలక్స్ బస్సులు. ఈ సర్వీస్‌లవల్ల పాండిచ్చేరి, బెంగుళూరు, మద్రాసు, నాగపూరు, ఔరంగాబాదు, పూరి, బైలడిల్ల పూనా మొదలైన అనేక నగరాలకు మన రాష్ట్రంనుంచి బస్సు సౌకర్యాలున్నాయి.

*డిస్ట్రిక్ట్ సర్వీసులు :* జాతీయాకరణ పథకంకింద అంచెలవారీగా ఈ సంస్థ రాష్ట్ర లోని దాదాపు అన్ని రూట్లు అధీనంలోకి తీసుకొంది. అంతర్ రాష్ట్ర సర్వీసులు కొన్ని, మరికొన్ని చిన్న రూట్లుతప్ప మిగిలిన సర్వీసులన్నీ ఈ సంస్థవే. 1980 మార్చి నాటికి రాష్ట్రం లోని 22,006 గ్రామాలకు ఈ సంస్థ బస్సుసౌకర్యాలు ఏర్పరచినట్లు తెలియవస్తున్నది. వివరాలు దిగువ పట్టికలో చూడవచ్చు.

**జిల్లాలవారీగా బస్సు సర్వీసు సౌకర్యాలు ( ఏప్రియల్ 1980 నాటికి )**

| జిల్లా | గ్రామాల సంఖ్య | 31-3-78 నాటికి రవాణా సౌకర్యమున్న గ్రామాల సంఖ్య | ప్రై. బ.ఏ. ద్వారా రవాణా వసతిగల గ్రామాల సంఖ్య | ప్రై. బ.బ. ద్వారా రవాణా వసతిగల గ్రామాల సంఖ్య | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| ఆదిలాబాదు | 1,552 | 574 | 403 | 25 | 1,002 |
| అనంతపురం | 3,330 | 1,733 | 224 | 9 | 1,966 |
| కడప | 1,002 | 551 | 189 | 12 | 752 |
| చిత్తూరు | 1,336 | 731 | 435 | 16 | 1,212 |
| తూర్పుగోదావరి | 1,525 | 629 | 206 | — | 835 |
| గుంటూరు | 1,544 | 1,094 | 307 | — | 1,401 |
| హైదరాబాదు | — | — | — | — | — |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| కరీంనగర్ | 1,105 | 619 | 132 | 66 | 817 |
| ఖమ్మం | 1,226 | 716 | 239 | 44 | 999 |
| కర్నూలు | 1,535 | 713 | 338 | 172 | 1,223 |
| కృష్ణా | 953 | 641 | 173 | 24 | 838 |
| మెదక్ | 1,246 | 648 | 348 | 8 | 1,004 |
| మహబూబ్‌నగర్ | 1,472 | 768 | 195 | 31 | 994 |
| నల్గొండ | 1,179 | 648 | 231 | 37 | 916 |
| నిజామాబాదు | 874 | 708 | 152 | — | 860 |
| నెల్లూరు | 1,192 | 556 | 112 | 8 | 676 |
| ప్రకాశం | 1,005 | 694 | 112 | 37 | 843 |
| రంగారెడ్డి | 1,110 | 694 | 280 | 17 | 991 |
| శ్రీకాకుళం | 2,103 | 795 | 55 | 131 | 981 |
| విశాఖపట్నం | 3,592 | 1,111 | 159 | 34 | 1,304 |
| విజయనగరం | 1,642 | 652 | 92 | — | 744 |
| వరంగల్లు | 1,097 | 519 | 386 | 10 | 915 |
| పశ్చిమగోదావరి | 857 | 536 | 199 | — | 733 |
| మొత్తం | 32,460 | 16,358 | 4,967 | 681 | 22,006 |

మూలం : 5 5 80 న జిల్లాకలెక్టర్ల సమావేశంలో ముఖ్యమంత్రి ఇచ్చిన ప్రసంగం నుంచి

*నైట్ సర్వీసులు :* ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణాసంస్థ చాలాకాలం క్రిందట నైట్ సర్వీసు బస్సులను ప్రవేశపెట్టింది. రోజూ హైదరాబాదునుంచి కొన్ని వందల బస్సులు రాష్ట్రంలో ముఖ్యమైన నగరాలకు (విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి, అనంతపూర్, కడప, రాజమండ్రి, నెల్లూరు, తెనాలి, కరీంనగర్, భద్రాచలం మొదలైనవి) రాత్రిపూట బయలుదేరి వెళతాయి. ఆయా నగరాలనుంచి రాత్రిపూట బయలుదేరి రాజధాని నగరానికి చేరుతాయి. మద్రాసు, బెంగుళూరు మొదలైన పట్టణాలకు కూడా నైట్ సర్వీసు బస్సులు న్నాయి. రాష్ట్రంలో దాదాపు అన్ని జిల్లా కేంద్రాలకే కాకుండా, ముఖ్యమైన నగరాలకుకూడా

ఈ సౌకర్యాలు విస్తరించడం జరిగింది. నైట్ సర్వీసులవల్ల రాష్ట్రంలోని ప్రయాణీకులకు ఎంతో సౌకర్యంగా ఉందని చెప్పవచ్చు.

***సిటీ సర్వీసులు :*** హైదరాబాదు, సికిందరాబాదు, జంటనగరాలలో ఈ సంస్థ దాదాపు 650 బస్సులను నడుపుతున్నది. సగటున రోజుకు 6 లక్షల మంది ఈ సౌకర్యాన్ని వినియోగించు కొంటునట్లు అంచనా.

ఇటీవల ఈ సిటీ సర్వీసు సౌకర్యాలను రాష్ట్రంలోని ఇతర పెద్ద పట్టణాలలో కూడా ప్రవేశపెట్టాలని ఈ సంస్థ నిర్ణయం తీసుకొంది. 1979 జనవరిలో విజయవాడలో సిటీ సర్వీసులను ప్రవేశపెట్టారు. ఇదికాక విశాఖపట్నంలో కూడా ఈ సౌకర్యముంది.

## ఈ సంస్థ ప్రవేశపెట్టిన కొన్ని నూతన పథకాలు

***1. పల్లెపల్లెకు ప్రయాణసౌకర్యం :*** ఈ పథకం గ్రామీణ ప్రజల జీవిత పంథాలలో మలుపు తెచ్చిందనవచ్చు. అంతేకాకుండా గ్రామీణ ఆర్థిక స్థితిని కూడా ఇది మెరుగుపరిచింది. పల్లెప్రాంతాలకు బస్సుసౌకర్యాలు కలగజేయడం వల్ల అక్కడి ప్రజలు దగ్గరి పట్టణాలకు, ఇతర ప్రదేశాలకు సుఖంగా ప్రయాణించే వీలు కలిగింది. ఈ పథకం కింద 1979 నాటికి 207 బస్సులుండగా ఈ 1980 మార్చి నాటికి 181 బస్సులను ప్రవేశపెట్టడం జరిగింది.

***2. కార్గోసర్వీసులు :*** 1-11-79 న ఈ సంస్థ కార్గో బస్సుసర్వీసులను ప్రవేశపెట్టింది. తమ సరుకులను దగ్గరి పట్టణాలకు లేదా ఇతర మార్కెటింగ్ స్థలాలకు చేరవేయడంలో వ్యవసాయదారులు పడుతున్న కష్టాలను తీర్చడానికి ప్రవేశపెట్టిన పథకమిది. ఈ పథకం కింద 1980 మార్చి వరకు 12 కార్గోబస్సులను ప్రవేశపెట్టడం జరిగింది.

***3. జీప్-మినీ బస్సుల సర్వీసులు :*** అన్ని పల్లెలూ బస్సుప్రయాణానికి అనుకూలంగా లేవు. కొన్ని మారుమూల పల్లెలకు రోడ్లేలేవు. ముఖ్యంగా కొండ ప్రాంతాలలోని పల్లెలను బస్సులు చేరలేవు. ఇటువంటి పల్లెలకు కూడా రవాణా సౌకర్యం కలిగించే నిమిత్తం ఈసంస్థ ఈపథకాన్ని చేపట్టింది. ఇది పల్లెపల్లెకు ప్రయాణ సౌకర్యం కలిగించే పథకం అంతర్భాగం. ఈ పథకం కింద జీపులను మినీ బస్సులను ప్రవేశపెట్టినారు. ఈ వాహనాలు బస్సులువంటి భారీ మోటారు వాహనాలు పోలేని మార్గాలద్వారా ప్రయాణించగలవు. ఒడుదుడుకులను తట్టుకోగలవు. 1980 మార్చివరకు ఈ పథకం కింద 11 జీప్ మినీబస్సులను ప్రవేశపెట్టడం జరిగింది.

***4. సెట్విన్ సర్వీసులు :*** నిరుద్యోగులకు స్వయం ఉపాధికల్పన సౌకర్యాలను కలిగించాలని ప్రభుత్వం నిర్ణయం తీసుకొంది. ఈ కార్యక్రమం కింద స్పెషల్ ఎంప్లాయ్‌మెంట్ పథకాన్ని ప్రారంభించింది. ఈ పథకానికి రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ సహాయ సహకారాలందిస్తూ ఈ సంస్థ అజమాయిషీ కింద ఆర్థికంగా వెనకబడినవారికి 50 సెట్విన్ బస్సులను అందించింది.

రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థకు సంబంధించిన సమాచారాన్ని కొన్ని వివరాలతో దిగువ పట్టికలో సంక్షిప్తంగా వ్యక్తంచేయడం జరిగింది.

| ప. సం. | సమాచార వివరాలు | 1978-79 | 1979-80 |
|---|---|---|---|
| 1. | డివిజన్లు | 17 | 17 |
| 2. | డిపోల సంఖ్య | 99 | 104 |
| 3. | ప్రయాణీకులనుంచి వచ్చిన ఆదాయం | 107 కోట్లు | 128.91 కోట్లు |
| 4 | సగటున రోజుకు ప్రయాణించేవారి సంఖ్య | 27.18 లక్షలు | 31.72 లక్షలు |
| 5. | 1,00,000 చ.కి.మీ. కు ప్రమాదాలరేటు | 0.21 | 0.22 |
| 6. | బస్సులు ఆగి పోవడాలు(10,000 చ.కి.మీ.కు) | 0.86 | 0.91 |
| 7. | కాలనిర్ణయ పాటింపు (పంక్చ్యువాలిటీ) | 97.81 | 97.80 |
| 8. | పల్లెపల్లెకు ప్రయాణ సౌకర్యం పథకం కింద ఉన్న సర్వీసులు | 207 | 388 |
| 9. | ప్రయాణ సౌకర్యమున్న పల్లెలు | 18,753 | 22,006 |
| 10. | కార్గో బస్సుల సంఖ్య | .... | 12 |
| 11. | జీప్-మినీ బస్సుల సంఖ్య | .... | 11 |
| 12. | సెట్విన్ బస్సులసంఖ్య | .... | 50 |
| 13. | మొత్తం వాహనాల సంఖ్య | 6,072 | 6,994 |
| 14. | బస్సు సిబ్బంది నిష్పత్తి | 10.78 | 10.85 |
| 15. | 10,000 కి.మీ.కు సిబ్బంది రేటు | 12.42 | 12.02 |
| 16. | పెట్టుబడి(కోట్ల రూ॥లలో) | 106.38 | 123.76 |
| 17. | మొత్తం ఆదాయం (కోట్ల రూ॥లలో) | 112.40 | 131.50 |
| 18. | ఖర్చు (కోట్ల రూ॥లలో) | 119.45 | 139.66 |
| 19. | నికర నష్టం (కోట్ల రూ॥లలో) | 7.05 | 8.16 |
| 20. | పెట్టుబడిపై వడ్డీ (కోట్ల రూ॥లలో) | 2.11 | 3.00 |

## రైల్వే మార్గాలు

ఆంధ్రప్రదేశ్‌కు మూడు రైల్వే డివిజన్ల రూట్లున్నాయి - దక్షిణ మధ్య రైల్వే, దక్షిణ రైల్వే, ఆగ్నేయ రైల్వే. ఆయా డివిజన్ల కిందఉన్న స్టేషన్లు, రైల్వే లైన్ల నిడివి మొదలైన వివరాలను దిగువ పట్టికలో చూడవచ్చు.

1977 - 78

| | స్టేషన్ల సంఖ్య | రూట్ల నిడివి బ్రాడ్ గేజ్ | మీటర్ గేజ్ | నేరో గేజ్ | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. దక్షిణమధ్య రైల్వే | 566 | 2,330 | 1,610 | .... | 3,940 |
| 2. దక్షిణ రైల్వే | 26 | 151 | 90 | .... | 241 |
| 3. ఆగ్నేయ రైల్వే | 69 | 526 | .... | 34 | 560 |
| మొత్తం | 661 | 3,007 | 1,700 | 34 | 4,741 |
| **1978 - 79** | | | | | |
| 1. దక్షిణ మధ్య రైల్వే | 566 | 2,330 | 1,610 | .... | 3,940 |
| 2. దక్షిణ రైల్వే | 25 | 151 | 90 | .... | 241 |
| 3. ఆగ్నేయ రైల్వే | 67 | 526 | .... | 34 | 560 |
| మొత్తం | 661 | 3,007 | 1,700 | 34 | 4,747 |

మూలం : 1. జనరల్ మేనేజర్, దక్షిణ మధ్య రైల్వే, సికిందరాబాదు.

2. జనరల్ మేనేజర్, దక్షిణ రైల్వే, మద్రాసు

3. (i) డివిజనల్ సూపరింటెండెంట్, ఆగ్నేయ రైల్వే, వాల్తేరు

(ii) డివిజనల్ సూపరింటెండెంట్, ఆగ్నేయరైల్వే, కుర్దారోడ్డు, ఒరిస్సా.

ఆంధ్రప్రదేశ్ రైల్వేలలో ఎక్కువ భాగం దక్షిణ మధ్య రైల్వే ఆధీనంలోనే ఉంది. ఈ రైల్వే విభాగాన్ని 1966 లో ఏర్పరిచినారు. దీని కేంద్రం సికిందరాబాదు. సికిందరాబాదు షోలాపూర్, హుబ్లి, విజయవాడ అన్ డివిజన్లు ఈ రైల్వే విభాగం కింద ఉన్నాయి.

## ప్రధాన రైలు మార్గాలు

దేశంలోని ప్రధానమైన రైలు మార్గాలైన మద్రాసు-కలకత్తా, మద్రాసు-బొంబాయి, మద్రాసు-ఢిల్లీ, రైల్వే లైన్లు ఆంధ్రప్రదేశ్ గుండా పోతున్నాయి. వీటిలో మద్రాసు-కలకత్తా లైను మీద గూడూరు, నెల్లూరు,విజయవాడ, రాజమండ్రి, వాల్తేరు మొదలైన స్టేషన్లున్నాయి. సుప్రసిద్ధమైన రైల్వే కమ్ రోడ్ బ్రిడ్జి ఈ లైనులోనే గోదావరినదిమీద రాజమండ్రి వద్దఉంది. మద్రాసు-బొంబాయి లైనుమీద రేణిగుంట, నందలూరు, కడప, గుంతకల్లు మొదలైన స్టేషన్లున్నాయి. మద్రాసు-ఢిల్లీ లైనుమీద గూడూరు, నెల్లూరు, విజయవాడ, కాజీపేట మొదలైన పెద్ద స్టేషన్లున్నాయి. వీటన్నిటిలో విజయవాడ చాలా కీలకమైనది. ఉత్తర దక్షిణాల రాక కలపోలో చాలవరకు ఈ స్టేషనుమీదనే పోతున్నాయి.

ఇవికాక దక్షిణ-మధ్య రైల్వే ఆధీనం ఉన్న రైల్వేలు ఆంధ్రప్రదేశ్ నుంచి బయలు దేరేవి ఉన్నాయి. వాటిలో సికిందరాబాదు/హైదరాబాదు నుంచి బయలుదేరే ఆంధ్రప్రదేశ్ ఎక్స్‌ప్రెస్ (ఢిల్లీకి), మీనార్ ఎక్స్‌ప్రెస్ (బొంబాయికి), గోదావరి ఎక్స్‌ప్రెస్ (విశాఖ పట్నంకు), రాయలసీమ, వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్ (తిరుపతికి), బెంగుళూరు ఎక్స్‌ప్రెస్ (బెంగుళూరుకు), అజంతా ఎక్స్‌ప్రెస్ (ఔరంగాబాదుకు), కృష్ణా, గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లు (గుంటూరుకు) ముఖ్యమైనవి. ఇవి కాక తిరుపతి-మద్రాసుల మధ్య బాలాజీ ఎక్స్‌ప్రెస్, విజయవాడ తిరుపతిల మధ్య తిరుమల ఎక్స్‌ప్రెస్ మొదలైనవి కూడా ఉన్నాయి.

తూర్పు తీరాన ఉన్న విశాఖపట్నం, కాకినాడ, నరసాపురం, మచిలీపట్నం మొదలైన ఓడరేవు పట్టణాలకు రైల్వే సదుపాయముంది. అంతే కాకుండా ఇతర వ్యాపార కేంద్రాలైన కొత్తగూడెం, రాజమండ్రి, కాగజ్‌నగర్, విజయవాడ, గుంటూరు, గూడూరు, రామగుండం, కోడూరు మొదలైన పట్టణాలు కూడా విభిన్న రైలు మార్గాలతో కలబడి ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్ అవతరించినప్పటినుంచి రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల అవసరాలను పురస్కరించుకొని అనేక కొత్త రైలు మార్గాలను నిర్మించడం జరిగింది. కొత్త రైలుబళ్ళను ప్రవేశ పెట్టడం జరిగింది. ప్రయాణీకుల సౌకర్యార్థం అనేక మార్పులు కూడా ప్రవేశపెట్టడం జరిగింది. నేడు ప్రయాణీకులకు స్లీపర్ కోచీలు, భోజన సౌకర్యాలు, ఛైర్‌కార్లు మొదలైన ఆధునిక సదుపాయాలున్నాయి. కొన్ని స్లీపర్లకు బల్లల స్థానంలో పరుపులు ఏర్పరచడం జరిగింది. అంతే కాకుండా స్టీమ్ ఇంజన్ల ఆధునికీకరణ, డీసెల్ ఇంజన్లను ప్రవేశపెట్టడం మొదలైనవి కూడా ప్రవేశపెట్టినారు. కొత్తగా విజయవాడ-తెనాలి మధ్య ఎలెక్ట్రిక్ ట్రైయిన్‌ను ప్రవేశపెట్టడం కూడా జరిగింది. వీటిని విస్తృతంగా అభివృద్ధి పరచే కార్యక్రమాలు కూడా సాగుతున్నాయి.

1978-79 నాటికి రాష్ట్రంలోని రైల్వేలు చేస్తున్న సేవల వివరాలిట్లా ఉన్నాయి.

| | |
|---|---|
| సగటున రోజుకు నడిచే గూడ్స్‌బళ్ళు | 500 |
| సగటున రోజుకునడిచే ప్రయాణీకుల బళ్ళు | 460 |
| చేరవేసిన సరుకులు | 19 మిలియన్ల టన్నులు |
| ప్రయాణీకులు | 155 మిలియన్లు |
| పెట్టుబడి | 427.8 కోట్ల రూపాయలు |
| రాబడి | 198.8 కోట్ల రూపాయలు |

## జలమార్గాలు

ఆంధ్రప్రదేశ్‌కు సువిశాలమైన దాదాపు 1000 కి. మీల సముద్ర తీర ప్రాంతం ఉంది. రాష్ట్రంలో నదులమీద, నదీ కాలువలమీద జలమార్గాయానం కూడా ఉంది.

## ఓడరేవులు

మన రాష్ట్రంలో 8 ఓడరేవులున్నాయి. వీటిలో విశాఖపట్నం పెద్దతరహాకు చెందినది మిలిగిన 7 రేవులైన కాకినాడ, మచిలీపట్నం, కళింగపట్నం, భీమునిపట్నం, నరసాపురం, వాడరేవు, కృష్ణాపట్నం ఓడరేవులు మధ్య తరహా లేదా చిన్నతరహా ఓడరేవులుగా పరిగణించ బడుతున్నాయి.

విశాఖపట్నం రేవు ఆంధ్రప్రదేశ్‌లోని ఓడరేవులలోకెల్లా పెద్దది. ఇది సహజమైన ఓడరేవు. 'డాల్ఫిన్స్‌నోస్' అనే కొండ ఈ రేవుకు కోటపలె ఒకవైపున ఉంది. 1933 లో ప్రారంభమైన ఈ ఓడరేవు నేటి వరకు కూడా ఓడల రాకపోకలకు అనువుగా ఉంటూ రాష్ట్ర ఆర్థిక వ్యవస్థమీద అనుకూల ప్రభావం చూపుతూనే వచ్చింది. సరుకుల బరువురీత్యా యావ ద్భారతదేశంలోని 10 పెద్ద రేవుల్లో విశాఖపట్నం మూడోస్థానం ఆక్రమిస్తుంది. దిగువ పట్టికలో 1933 నుంచి 78 వరకు ఈ రేవు నుంచి జరిగిన దిగుమతులు, ఎగుమతులు గమనించ వచ్చు.

| సంవత్సర | దిగుమతి (లక్షలటన్నులు) | ఎగుమమతి (లక్షలటన్నులు) |
|---|---|---|
| 1933-34 | 0.12 | 1.14 |
| 1947-78 | 1.62 | 5.46 |
| 1951-52 | 2.9 | 9.37 |
| 1956-57 | 4.94 | 9.96 |
| 1961-62 | 13.96 | 14.57 |
| 1965-66 | 19.00 | 26.00 |
| 1970-71 | 25.5 | 94.5 |
| 1974-75 | 28.59 | 56.76 |
| 1976-77 | 23.19 | 60.88 |
| 1977-78 | 23.46 | 70.21 |

ఈ రేవు నుంచి దిగుమతులు, ఎగుమతులు జరుగుతున్న పదార్థాల వివరాలను దిగువ పట్టీలో చూపాం.

### ఎగుమతులు (1977-78)

| వ.సం. | సరుకులు | పరిమాణం (వేలటన్నులలో) | విలువ (లక్షలరూపాయలలో) |
|---|---|---|---|
| I. | ముడి ఖనిజాలు | 6,282 | 7,481 |
| | 1. ఇనపఖనిజం | 6,057 | 6,519 |

| | | |
|---|---|---|
| 2. మాంగనీస్ ఖనిజం | 165 | 298 |
| 3. ఫెర్రో ఉత్పత్తులు | 60 | 664 |
| II. ఇనము, ఉక్కు పదార్థాలు | 608 | 6,409 |
| 1. దుక్క ఇనుము | 312 | 1,984 |
| 2. ఉక్కుపట్టాలు | 76 | 934 |
| 3. ఇతర ఉత్పత్తులు | 220 | 3,491 |
| III. ఇతర సాధారణ వాణిజ్య సరుకులు | 131 | 2,573 |
| 1. కరక్కాయలు | 2 | 29 |
| 2. చక్కెర | 19 | 261 |
| 3. అల్యూమినం | 3 | 28 |
| 4. ఇతరాలు | 107 | 2,255 |
| మొత్తం ఎగుమతులు | 7,021 | 16,463 |

మూలం : విశాఖపట్నం పోర్ట్ ట్రస్ట్

## దిగుమతులు (1977-78)

| వ. సం. సరుకులు | పరిమాణం (వేల టన్నులలో) | విలువ (లక్షల రూపాయలలో) |
|---|---|---|
| I. రసాయనాలు, రసాయనిక ఎరువులు | 808 | 5,486 |
| 1. యూరియా | 288 | 3,057 |
| 2. ఇతర రసాయనిక ఎరువులు | 112 | 1,285 |
| 3. గంధకం (సల్ఫర్) | 136 | 475 |
| 4. రాక్ ఫాస్ఫేట్ | 272 | 669 |
| II. ఆహారధాన్యాలు | 8 | 103 |
| 1. గోధుమలు | 5 | 54 |
| 2. ఇతరాలు | 3 | 49 |
| III. పెట్రోలియమ్, పెట్రోలియమ్ ఉత్పత్తులు | 1,392 | 11,011 |
| 1. కిరోసిన్ | 83 | 1,490 |

| | | |
|---|---|---|
| 2. డీసెల్ | 66 | 908 |
| 3. హెవీ ఎండ్స్ (ఎఫ్.ఓ. + సి.ఓ.) | 1,243 | 8.613 |
| IV. ఇతర సాధారణ రవాణాసరుకులు | 138 | 4,699 |
| 1. ఇనప, ఉక్కు తయారీలు (యంత్రాలతోసహా) | 20 | 1,978 |
| 2. రిఫ్రాక్టరీస్ | 2 | 47 |
| 3. జింక్ కాన్సెన్ట్రేట్‌లు | 22 | 448 |
| 4. ఇతరాలు | 94 | 2,226 |
| మొత్తం దిగుమతులు | 2,346 | 21,399 |

మూలం : విశాఖపట్నం పోర్ట్ ట్రస్ట్

పై పట్టికలను గమనిస్తే ఈ రేవునుంచి 9,367 టన్నుల రవాణా జరిగినట్లు, వీటి విలువ 37,762 లక్షలున్నట్లు గుర్తించవచ్చు. అయితే ఎగుమతి దిగుమతుల రీత్యా చూస్తే దిగుమతుల కన్నా ఎగుమతులే ఎక్కువగా ఉన్నట్లు కనిపిస్తుంది. 77-78 లో ఎగుమతి చేసినవి 7,021 వేల టన్నులు కాగా దిగుమతి చేసుకొన్నవి 2,346 వేల టన్నులు మాత్రమే. అయితే విలువ రీత్యా చూస్తే ఆదాయం కంటే ఖర్చే ఎక్కువ. ఎగుమతి చేసిన వాటి విలువ 16,463 లక్షలు కాగా దిగుమతి చేసుకొన్న వాటి విలువ 21,299 లక్షలు. అంటే లోటు 4,836 లక్షలన్నమాట.

కాకినాడ తూర్పు గోదావరి జిల్లాలో ఉంది. ఇది మధ్య తరహా ఓడరేవు. ఇది రాష్ట్ర ప్రభుత్వ అధీనంలో ఉంది. 1956-57 లో ఈ రేవు ద్వారా రవాణా అయిన సరుకులు 3,64,171 టన్నులు. వీటి విలువ 9.67 కోట్ల రూపాయలు. ఈరేవు అభివృద్ధికి గాను కేంద్ర ప్రభుత్వం 1.52 కోట్ల రూపాయలు మంజూరు చేసింది. రాష్ట్రప్రభుత్వం 1.35 కోట్లు మంజూరు చేసింది. ఇటీవలి కాలంలో ఈ రేవునుంచి జరిగిన దిగుమతి, ఎగుమతుల పరిమాణాలు దిగువ పట్టికలోను, ఆ తరవాత పట్టికలో 1977-78 లో జరిగిన దిగుమతి ఎగుమతుల వివరాలు ఇచ్చినాము.

| సంవత్సరం | దిగుమతులు (వేల టన్నులలో) | ఎగుమతులు (వేల టన్నులలో) | మొత్తం (వేల టన్నులలో) |
|---|---|---|---|
| 1974-75 | 77 | 400 | 477 |
| 1975-76 | 90 | 448 | 538 |
| 1976-77 | 7 | 643 | 650 |

| | | | |
|---|---|---|---|
| 1977-78 | 56 | 479 | 535 |
| 1979-80 | 206 | 638 | 844 |

మూలం : డైరెక్టర్ ఆఫ్ స్టేట్ పోర్ట్స్, కాకినాడ.

**1977-79 లో ఎగుమతులు, దిగుమతులు**

(పరిమాణం టన్నులలో, విలువ లక్షల రూ॥ లలో)

| వ.సం. సరుకులు | 1977-78 | | 1978-79 | |
|---|---|---|---|---|
| | పరిమాణం | విలువ | పరిమాణం | విలువ |
| *ఎగుమతులు* | | | | |
| 1. ఇనప ఖనిజం | 15,351 | 24.64 | 6,182 | 11.55 |
| 2. దుక్కి ఇనుము | 1,66,095 | 1172.17 | 1,25,288 | 939.57 |
| 3. ఎముకల పొడి | 750 | 11.18 | .... | .... |
| 4. కొమ్ములు మొ॥ | .... | .... | .... | .... |
| 5. సముద్రగవ్వలు | 21 | 0.56 | 21 | 0.61 |
| 6. రైస్ బ్రాన్ | 2,14,184 | 1,255.2 | 2,94,191 | 1,255.91 |
| 7. వీట్ బ్రాన్ | 198 | 1.82 | 981 | 7.45 |
| 8. అనాటో గింజల నూనె | 40 | 2.07 | .... | .... |
| 9. తాటిపీచు | 3,549 | 130.15 | 3,877 | 184.17 |
| 10. పొగాకు | 39,653 | 5,446.26 | 46,470 | 5,231.45 |
| 11. నైగర్ గింజలనూనె | 1,946 | 25.13 | 1,549 | 14.16 |
| 12. వేరుసెనగనూనె | 2,631 | 39.45 | 3,333 | 49.48 |
| 13. బాబుల్‌గింజలనూనె | 157 | 1.23 | .... | .... |
| 14. బోన్ గ్రీజ్ | 400 | 3.57 | 400 | 5.18 |
| 15. తాటిబోదెలు | 103 | 1.40 | 132 | 1.04 |
| 16. బోన్ సింకస్ | 72 | 0.44 | .... | .... |
| 17. గుగ్గిలం గింజలనూనె | 12,561 | 83.87 | 10,333 | 31.77 |
| 18. పత్తిగింజల నూనె | 11,439 | 156.19 | 32,882 | 411.44 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 19. | నువ్వుల తెలకపిండి | 3,232 | 59.45 | 816 | 10.71 |
| 20. | గ్రానైట్ రాళ్లు | 269 | 1.20 | 2,289 | 10.32 |
| 21. | రేప్ గింజలనూనె | 296 | 3.06 | .... | ... |
| 22. | నైగర్ గింజలు | 350 | 16.90 | .... | .... |
| 23. | షార్క్ వాజాలు | 137 | 0.22 | .... | .... |
| 24. | టాపికో చిప్స్ | 1,048 | 8.14 | 7,055 | 54.59 |
| 25. | గిట్టలు, కొమ్ములు, | 115 | 0.96 | 50 | 0.61 |
| 26. | సన్ హెంప్ | 104 | 3.43 | 282 | 6·95 |
| 27. | డీజల్ ఇంజన్ భాగాలు | 62 | 55.97 | .... | .... |
| 28. | ఇండియన్ హెంప్ | 21 | 0.40 | .... | .... |
| 29. | హార్న్ టిప్స్ | 35 | 4.27 | 141 | 5.22 |
| 30. | అభ్రకం తుక్కు | 22 | 0.34 | 40 | 0.55 |
| 31. | అల్యూమినియం సల్ఫేట్ | 506 | 2.30 | .... | .... |
| 32. | ఫెర్రోమాంగనీస్ స్లాగ్ | .... | ... | 10,000 | 17.08 |
| 33. | ఫెర్రోమాంగనీస్ క్రోమ్ | .... | .... | 2,000 | 80.82 |
| 34. | ఫెర్రో సిలికాన్ | .... | .... | 922 | 41.44 |
| 35. | మామిడిటెంక నూనె | .... | ... | 5,587 | 26.89 |
| 36. | కొబ్బరినూనె | .... | .... | 1,232 | 14.35 |
| 37. | జంతువుల ఎముకలపొడి | .... | .... | 650 | 10.13 |
| 38. | కరక్కాయల పొడి | .... | .... | 100 | 1.78 |
| 39. | కాల్సినేటెడ్ రైస్ స్పెల్ | .... | .... | 259 | 2.56 |
| 40. | అమ్మోనియం సల్ఫేట్ | .... | .... | 505 | 2.30 |
| 41. | షార్క్ వాజాలు, చేపల అవయవాలు | .... | .... | 406 | 0.38 |
| 42. | పశుగ్రాసం | .... | .... | 665 | 6.59 |

| 1 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|
| 43. పసుపు పొడి | .... | .... | 61 | 7.05 |
| 44. చింతగింజలు | .... | .... | 15 | 0.23 |
| 45. ఫ్రోజన్ ష్రింప్‌లు | .... | .... | 9 | 1.26 |
| 46. హింజ్‌లు | .... | .... | 2 | 1.00 |
| 47. జీడిపప్పు | .... | .... | 3 | 1.97 |
| 48. గంధం చెక్కలు | .... | .... | 9 | 4.14 |
| 49. దుస్తులు | .... | .... | 1 | 0.48 |
| 50. అనాటా గింజలు | .... | .... | 48 | 2 17 |
| మొత్తం ఎగుమతులు | 4,78,857 | 8,515.53 | 5,52.785 | 8,455.35 |
| *దిగుమతులు* | | | | |
| 1. యూరియా | 18,861 | 241.04 | 86,538 | 1,019.23 |
| 2. కాల్షియమ్ అమ్మోనియమ్ నైట్రేట్ | .... | .... | 25,642 | 217.46 |
| 3. రాక్ ఫాస్ఫేట్ | 29,615 | 95.53 | 20,926 | 62.89 |
| 4. ఉప్పు | 8,041 | 13.30 | 11,295 | 20.19 |
| 5. డై-అమోనియమ్ ఫాస్ఫేట్ | .... | .... | 36,297 | 562.15 |
| 6. అమోనియమ్ సల్ఫేట్ | .... | .... | 12,775 | 85.68 |
| 7. మురేట్ పొటాష్ | .... | .... | 9,992 | 46.98 |
| మొత్తం దిగుమతులు | 56,517 | 349.87 | 2,03,465 | 2,014.58 |

మూలం : పోర్ట్ ఆఫీసర్, పోర్ట్ డిపార్ట్‌మెంట్, ఆంధ్రప్రదేశ్, కాకినాడ.

పై పట్టికలు గమనిస్తే ఈ రేవు క్రమంగా ప్రాముఖ్యంలోకి వస్తున్నట్లు గమనించవచ్చు. అంతేకాకుండా నాగార్జునసాగర్ ఎరువుల కర్మాగారం దీనికి దగ్గరగా ఉండటంతో దీనికి మరింత ప్రాముఖ్యం వస్తున్నది. దీనిని క్రమేణా అభివృద్ధిపరచి 20 లక్షల టన్నులకు ఈ ఓడరేవు నిర్వహణశక్తి పెంచడానికి పథకాలు సాగుతున్నాయి.

మచిలీపట్నం మరొక మధ్యతరహా ఓడరేవు. ఇది కృష్ణాజిల్లాలో ఉంది. దీనికి మరొక పేరు బందరు ఓడరేవు. ఇది తూర్పు ఇండియా కంపెనీవారి కాలంలోనే ప్రాచుర్యానికి వచ్చింది. ఇక్కడ పెద్దపెద్ద గోడౌన్‌లు, ఒక లైట్‌హౌస్ ఉండటం. ఒక విశేషం. ఈ రేవునుంచి కాకిరాయి విస్తారంగా ఎగుమతి అయ్యేది. 1956-57 సంవత్సరంలో 3,26,179 టన్నుల సరుకు రవాణా ఈ రేవుద్వారా సాగింది. ఆ సరుకుల విలువ 1.04 కోట్ల రూపాయలు 1979-80 లో 14,912 మెట్రిక్ టన్నుల యూరియా ఈ రేవునుంచి దిగుమతి అయింది.

ఈ ఓడరేవును అభివృద్ధి పరచాలని రాష్ట్రప్రభుత్వం సంకల్పించిన పరిమిలా ఈరేవు ఇప్పుడిప్పుడే మళ్ళీ వెలుగులోకి వస్తున్నది. నాల్గవ ప్రణాళికా కాలంలో 50 లక్షల రూపాయలతో ఈ రేవు అభివృద్ధి ప్రారంభమైంది. 1971 లో ప్రభుత్వం 184 లక్షలు మంజూరు చేసింది. 5వ ప్రణాళికా కాలంలో 120 లక్షలు కేటాయింపు జరిగింది. 1976-78 ల మధ్య నిర్మాణం పనుల నిమిత్తం 36.2 లక్షలు ఖర్చుపెట్టండం కూడా జరిగింది. అయితే 1977-78 వచ్చిన తుఫానువల్ల ఈ రేవు చాలావరకు దెబ్బతింది.

ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణా, పశ్చిమగోదావరి, గుంటూరు వంటి ప్రముఖ జిల్లాలు ఈ రేవుకు అందుబాటులో ఉన్నాయి. ఈ రేవు నిర్వహణశక్తి 50 లక్షల టన్నులు.

కృష్ణాపట్నం, భీమునిపట్నం, వాడరేవు, నరసాపురం. కళింగపట్నం ఓడరేవులు చిన్న తరహాకు చెందినవి. వీటిలో కృష్ణాపట్నం ఓడరేవు అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. సర్వే, పరిశోధన, సిబ్బంది, రోడ్ల అభివృద్ధి మొదలైన వాటికిగాను దాదాపు ఏడు లక్షల రూపాయలు ఖర్చుపెట్టడం జరిగింది. ఇంకా అభివృద్ధి పరచే కార్యక్రమం కింద 1978-79, 1979-80 సంవత్సరాలకు దాదాపు 3 25 లక్షలు కేటాయించినట్లు తెలుస్తున్నది. ఈ రేవు నెల్లూరు, రాయలసీమ జిల్లాలకు అందుబాటులో ఉండగల ఓడరేవు. దీనిని 3 లక్షల టన్నులు నిర్వహించే ఓడరేవుగా రూపొందించే సంకల్పముంది.

మిగిలిన నాలుగు చిన్నతరహా రేవు అభివృద్ధి నిమిత్తం నిధులు సమకూర్చుకోవలసి ఉంది. వీటిని అభివృద్ధి చేయడంతోబాటు చేపల పరిశ్రమను అభివృద్ధి చేయడం వంటివి కూడా ఉన్నాయి. ఈ ఓడరేవుల నిర్వహణ, తవ్వకం, పడవల సర్వీసు తదితర పనులకోసం ప్రణాళికేతర పథకం కింద దాదాపు 58 లక్షలు ఈ ఏటికి మంజూరు చేసినట్లు తెలియవస్తున్నది.

**జలమార్గాలు**

రాష్ట్రంలో గోదావరి, కృష్ణా, పెన్నా (పినాకిని) నదులు ప్రధానమైనవి. వీటిడెల్టా ప్రాంతాలలో ఏర్పరిచిన కాలువలు పంటలను సస్యశ్యామలం చేయడమే కాకుండా రవాణాకు కూడా ఉపయోగపడుతున్నాయి. నదులమీద కూడా పడవల ద్వారా ప్రయాణ, రవాణా సౌకర్యాలున్నాయి. అయితే మొత్తంమీద ఇట్లా ఉపయోగపడుతున్న దూరం 1930 కిలోమీటర్లు మాత్రమే.

నదీ కాలవలలో ముఖ్యమైనవి కృష్ణ కాలువలు (995 కిలోమీటర్లు) గోదావరి కాలువలు (800 కిలోమీటర్లు) బకింగ్‌హామ్ కాలువ (410 కిలోమీటర్లు) కడప కర్నూలు కాలువ (120 కిలోమీటర్లు). గోదావరి కాలువలు సంవత్సరంలో 11 నెలలపాటు అనుకూలంగా ఉంటాయి. గోదావరి, బకింగ్‌హామ్ కాలవల ద్వారా కాకినాడ నుంచి, మద్రాసు వరకు రవాణా సాగుతూ ఉంది. పడవల రేవు నిర్వహణ పోర్ట్‌డిపార్ట్‌మెంట్ అధీనంలో ఉంది. అదేవిధంగా కృష్ణకాలువలు కూడా సంవత్సరంలో 11 నెలలపాటు రవాణాకు అనుకూలంగా ఉన్నాయి. కృష్ణ కాలవలలోని కొమ్మమూరు కాలవ బకింగ్‌హామ్ కాలవను గోదావరి డెల్టా కాలవలతో కలుపుతూ కాకినాడ మద్రాసు రవాణాకు (640 కిలోమీటర్లు) సౌకర్యం కల్పిస్తున్నది.

కాలువలు ముఖ్యంగా ధాన్యం, ఉప్పు, నూనెగింజలు, పొగాకు, వంట చెరుకు, వెదురు బొగ్గు, రాక్షసిబొగ్గు, మొదలైన సరుకులు చేరవేయడానికి దోహదపడుతున్నాయి. అంతే కాకుండా ఒక వైపునుంచి మరొకవైపు పోవడానికి ప్రయాణీకులకు కూడా కాలువలు, నదుల మీద ప్రయాణ సౌకర్యాలున్నాయి. పడవలు, లాంచీలు, వీటికి ఉపయోగపడతాయి. వీటివల్ల ఖర్చులు తక్కువ, కాలయాపన కూడా తక్కువే.

కాలవల అభివృద్ధికి శ్రీ బి. భగవతి అధ్యక్షతన ఒక కమిటీనీ కేంద్రప్రభుత్వం నియమించింది. ఈ కమిటీ ఆంధ్రప్రదేశ్ సర్వేచేసి కొన్ని సూచనలిచ్చింది. ఈ సూచనల మేరకు కాలవల అభివృద్ధి పరచడానికి 5వ ప్రణాళికా కాలంలో 17.02 కోట్లరూపాయల ఖర్చుతో పనులు చేపట్టే పథకం సాగుతున్నది.

## విమానమార్గాలు

మనదేశంలో రెండురకాల విమానయానాలున్నాయి. అంతర్జాతీయ విమానయానం, దేశంలోని వివిధ పట్టణాల మధ్య ప్రయాణం. విదేశయానాలకు విమానాలను మనదేశంలో ఎయిర్ ఇండియా సంస్థ నడుపుతున్నది. ఇన్‌లాండ్ విమానాలు ఇండియన్ ఎయిర్‌లైన్స్ అధ్వర్యం కింద ఉన్నాయి. భారతదేశంలో మొత్తం 90 విమానాశ్రయాలున్నాయి. వీటిలో పాలం (ఢిల్లీ), డమ్‌డమ్ (కలకత్తా), శాంతాక్రజ్ (బొంబాయి), మీనంబాకం (మద్రాసు), విమానాశ్రయాలు అంతర్జాతీయ విమానాశ్రయాలు. ఇవికాక దేశంలో 13 పెద్ద విమానాశ్రయాలు, 40 మధ్యతరహా విమానాశ్రయాలు, 31 చిన్న విమానాశ్రయాలున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో అంతర్జాతీయ విమానాశ్రయం లేదు. ఈ రాష్ట్రంలో ఉన్న విమానాశ్రయాలలో ఒకటి మాత్రమే పెద్ద విమానాశ్రయము. మిగిలిన వాటిలో 3 మధ్యతరహా విమానాశ్రయాలు 4 చిన్న విమానాశ్రయాలు. వాటి వివరాలివి.

| | |
|---|---|
| I. పెద్ద విమానాశ్రయం : | 1. బేగంపేట (హైదరాబాదు) |
| II. మధ్యతరహా విమానాశ్రయాలు : | 1. తిరుపతి |
| | 2. విశాఖపట్నం |
| | 3. గన్నవరం (విజయవాడ) |

III. చిన్న విమానాశ్రయాలు : 1. రాజమండ్రి
2. కడప
3. దొనకొండ
4. వరంగల్లు

పెద్ద, మధ్యతరహా విమానాశ్రయాలలో ప్రతిదినం విమాన రాకపోకలుంటాయి. చిన్న విమానాశ్రయాలు ప్రత్యేక సమయాలలో మాత్రమే ఉపయోగించబడతాయి. ఈ విమానాశ్రయాలన్నీ సివిల్ ఏవియేషన్ ఆధ్వర్యం కింద ఉన్నాయి.

హైదరాబాదు నుంచి మద్రాసు, ఢిల్లీ బొంబాయి, కలకత్తా, విశాఖపట్నం. విజయవాడ తిరుపతి, బెంగుళూరు, నాగపూర్ మొదలైన నగరాలకు, పట్టణాలకు విమానసౌకర్యాలున్నాయి. మద్రాసు, ఢిల్లీ, బొంబాయి, కలకత్తాలకు బోయింగ్ 737 విమానసౌకర్యాలున్నాయి. ఇటీవల రెండు ఎయిర్ బస్సులను కూడా ప్రవేశపెట్టడం జరిగింది. ఇవికాక ఆవ్రో విమానాల సర్వీసులు కూడా ఉన్నాయి.

మామూలు ప్రయాణీకుల విమానాశ్రయమే కాకుండా హైదరాబాదులో ఒక సెంట్రల్ ట్రెయినింగ్ సంస్థకూడా ఉంది. ఒక ఫ్లైయింగ్ క్లబ్ కూడా ఉంది. ఈమధ్యకాలంలో విదేశాలకు పోదలుచుకొన్న వారికి పాస్‌పోర్ట్‌లు ఇచ్చే విభాగం కూడా హైదరాబాదులో నెలకొల్పినారు.

# 22

# మార్కెటింగ్

దేశ ఆర్థిక వ్యవస్థలో మార్కెటింగ్ వ్యవస్థకు రానురాను ప్రాముఖ్యం పెరుగుతున్నది. దేశంలో వ్యాపార, వాణిజ్య పరిశ్రమలు విస్తృతం అవుతున్నకొద్దీ, సత్వర పారిశ్రామికీకరణ జరుగుతున్న కొద్దీ మార్కెటింగ్ యొక్క ప్రాముఖ్యం అధికమవుతుందనే దానిలో అతిశయోక్తి లేదు. మన రాష్ట్రంలో కూడా పరిశ్రమలు, వర్తక, వాణిజ్య, వ్యాపారాలు అభివృద్ధి చెందడంలో మార్కెటింగ్ వ్యవస్థకు ఎంతో ప్రాముఖ్యం ఏర్పడింది. 1956 నవంబరులో ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగినప్పుడు వ్యవసాయ శాఖలో మార్కెటింగ్ విభాగాన్ని ఏర్పాటు చేయడమైంది. అయితే 1962 ఫిబ్రవరిలో మార్కెటింగ్ శాఖను వ్యవసాయశాఖ నుంచి విడదీసి స్వతంత్రమైన శాఖగా మార్కెటింగ్‌ను ఏర్పాటుచేయడం జరిగింది.

మార్కెటింగ్‌శాఖ ప్రధాన కార్యాలయం హైదరాబాదులో ఉంటుంది. దాని డైరెక్టరుకు సహాయకారులుగా డెప్యూటీ డైరెక్టర్లు, అసిస్టెంట్ డైరెక్టర్లు, మొదలైన వారు ఉంటారు. ప్రాంతీయస్థాయిలో ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్క అసిస్టెంట్ డైరెక్టరు, అతని కింద సిబ్బంది ఉంటారు.

ఈ మార్కెటింగ్ శాఖ రకరకాల వ్యావసాయక ఉత్పత్తుల ధరలను, వాటి ధోరణులను సమాచార రూపంలో అందజేస్తుంది. ఈ సమాచారాన్ని రేడియోలద్వారా, దిన పత్రికలద్వారా ప్రకటించడం జరుగుతుంది. వ్యావసాయక ఉత్పత్తులు, ఇతరత్రా వస్తువులకు సంబంధించిన మార్కెట్ సమాచారాన్ని తాజాగా అందించడంవల్ల వ్యవసాయదారులకు, వినియోగదారులకు, ఉత్పత్తిదారులకు, మధ్యదళారులకు ఎన్నో ప్రయోజనాలు లభిస్తాయి. మార్కెట్ సమాచారంవల్ల మార్కెట్ ధోరణులను, తెలుసుకోవడానికి, ఉత్పత్తి అంచనాలు వేసుకోవడానికి, జీవనవ్యయసూచీ (**Index numbers**) సంఖ్యలను తయారుచేయడానికి, వస్తువుల డిమాండ్ సప్లైలకు సంబంధించి, ధరల నియంత్రణకు సంబంధించి ప్రభుత్వం నిర్దుష్టమైన విధానాలను రూపొందించడానికి అవకాశం కలుగుతుంది. వ్యవసాయ ఉత్పత్తులను సమీకరించడం- ప్రాసెస్ చెయ్యడం, ప్రమాణీకరించడం, శ్రేణీకరణ చేయడం,ప్యాకింగ్ చెయ్యడం, నిలవ ఉంచడం, ఈ కార్యకలాపాలకు విత్తాన్ని సమకూర్చడం మొదలైనవన్నీ సాధారణంగా మార్కెటింగ్ విధుల కిందకు వస్తాయి. మార్కెటింగ్‌శాఖ రాష్ట్రంలో అనేక వ్యవసాయ ఉత్పత్తులకు సంబంధించి, వివిధ జిల్లాలలో ఉన్న మార్కెట్‌లకు సంబంధించి సర్వేక్షణలు జరిపి నివేదికలు అందజేస్తుంది. ఈ సర్వేలో ఏయే పంటలకింద ఎంతభూమి సాగవుతున్నదో

ఏయే పంటలు ఏయే ప్రాంతాలలో పండుతున్నాయో, ఏయే సీజన్లలో పంటలు లభిస్తున్నాయో, ఉత్పత్తులకయ్యే ఖర్చులు, వాటినుంచి లభించే రాబడులు, వాటికిగల డిమాండ్, వినియోగం మొదలైన అంశాలన్నీ మార్కెటింగ్ సర్వేలో వెల్లడవుతాయి. మార్కెటింగ్‌శాఖ మన రాష్ట్రంలో ప్రధానమైన వ్యవసాయోత్పత్తులమీద సర్వేలుచేయించి, నివేదికలు ప్రచురించింది. వాటిలో బియ్యం, మిర్చి, పొగాకు, నిమ్మ, చెరకు, బెల్లం, మొక్కజొన్న, కందులు, పెసలు, వేరుసెనగ, ఆముదాలు, ద్రాక్ష, ఉల్లి మొదలైనవి చేరి ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో వివిధ చోట్లగల మార్కెట్లపై కూడా సర్వేలు చేయడం జరిగింది. ప్రభుత్వం మార్కెటింగ్ విధానాలను రూపొందించడానికి, కొత్తగా మార్కెట్ యార్డ్‌లను నెలకొల్పడానికి ఈ మార్కెట్ల సర్వే అనేక విధాలుగా ఉపయోగపడుతోంది.

*వ్యవసాయోత్పత్తుల శ్రేణీకరణ :* వ్యవసాయోత్పత్తులను వాటి నాణ్యత, పరిమాణం, రంగు, రుచి మొదలైన అంశాలదృష్ట్యా నిర్ణీత ప్రమాణాల మేరకు శ్రేణీకరణ చేయడం జరుగుతుంది. దీనినే గ్రేడింగ్ అంటారు. శ్రేణీకరణ జరిగిన వస్తువులపట్ల వినియోగదారులకు విశ్వాసం మెండుగా ఉంటుంది. ధరల నిర్ణయం సులభంగాఉంటుంది.ఎగుమతులకు ప్రోత్సాహం లభిస్తుంది. ఉత్పత్తిదారులకు మంచిరేట్లు లభిస్తాయి. మనరాష్ట్రంలో వ్యవసాయోత్పత్తుల శ్రేణీకరణ కేంద్రాలను అన్ని జిల్లాలలో ఏర్పాటు చేయడం జరిగింది. గ్రామీణస్థాయిలో కూడా కొన్ని శ్రేణీకరణ కేంద్రాలను మార్కెటింగ్‌శాఖ స్థాపించి సౌకర్యాలను అందజేస్తుంది. తాడేపల్లి, భువనగిరి, వనపర్తి, బైన్సా, ఖమ్మం, నిజామాబాదు, సూర్యాపేట, అనకాపల్లి, దుగ్గిరాల, ఆదోని మొదలైనచోట్ల శ్రేణీకరణ కేంద్రాలున్నాయి. శ్రేణీకరణ చేసిన ఉత్పత్తులకు అగ్‌మార్క్ గుర్తు వేయడం జరుగుతుంది. మన రాష్ట్రంనుంచి ఎగుమతి అయ్యే వర్జీనియా పొగాకు, నెయ్యి, వేరుసెనగనూనె, చందనతైలం, నువ్వులనూనె, పసుపు మొదలైన వాటికి ఈ మార్కు వేస్తారు.

## వ్యవసాయ మార్కెట్ కమిటీలు

తమ వ్యవసాయోత్పత్తులను అమ్ముకోవడంలో రైతులు ఎన్నో ఇబ్బందులకు, మోసాలకు, దగాకొలతలకు, అక్రమ మినహాయింపులకు, డబ్బు చెల్లింపులు జాప్యాలకు గురి అవుతున్నారు. ఈ అక్రమ చర్యలను నివారించేందుకు, వ్యావసాయకోత్పత్తుల మార్కెటింగ్‌లో రైతులకు లాభాలను కలిగించడానికి, రక్షణలకు ఏర్పరచడానికి, సౌకర్యాలను పెంపొందించడానికి మార్కెటింగ్ చట్టాలను ఆంధ్రప్రదేశ్ ఏర్పడకముందు, ఏర్పడిన తరువాత రూపొందించడం జరిగింది. అయితే అంతకు ముందు వివిధ ప్రాంతాలలో వివిధ రకాల చట్టాలను ఏకీకృత పరచి 1966 లో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయోత్పత్తుల, పశుగణ మార్కెట్‌ల చట్టం (**Andhra Pradesh Agricultural Products and Live stock Market Act**) రూపొందించడం జరిగింది. ఈ చట్టం 1967 అక్టోబరులో అమలులోకి వచ్చింది. ఈ చట్టం ఫలితంగా మనరాష్ట్రంలో క్రమబద్ధమైన మార్కెట్లు (**Regulated Markets**), వివిధ ప్రాంతాలలో మార్కెట్ కమిటీలు ఏర్పడ్డాయి. మార్కెట్ కమిటీలలో రైతులకు

వ్యాపారస్తులకు, సహకారక్రయవిక్రయ సంఘాలకు, స్థానిక సంస్థలకుప్రాతినిధ్యం ఉంటుంది. ఈ చట్టంకింద 67 వ్యావసాయకోత్పత్తులు, 22 పండ్లరకాలు, 50 కూరగాయల రకాలు, 4 మత్స్యజాతులు, 10 పశుగణ వర్గాలు, 6 పశుగణ ఉత్పత్తులు, 3 కోళ్ళజాతులు క్రమబద్ధీకరణ చేయడం జరిగింది.

1974 డిసెంబరులో 16 మంది సభ్యులతో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వ్యవసాయ మార్కెటింగ్ సలహా బోర్డును (**Andhra Pradesh State Agricultural Marketing Advisory Board**) రాష్ట్రప్రభుత్వం నియమించింది. ఈ బోర్డు రాష్ట్రంలోని మార్కెట్ల అభివృద్ధికి, మార్కెట్ల చట్టాన్ని సక్రమంగా అమలు జరపడానికీ తోడ్పడుతుంది.

## మార్కెట్ కమిటీలు — క్రమబద్ధీకరణ మార్కెట్లు

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ ప్రాంతాలలో 203 మార్కెట్ కమిటీలు ఉన్నాయి. అందులో 120 ఆంధ్ర, రాయలసీమ ప్రాంతంలోను, 83 తెలంగాణా ప్రాంతంలోను ఉన్నాయి. 1978 డిసెంబరు నాటికి ఆంధ్రప్రదేశ్‌లో 536 అక్రమబద్ధీకరణ మార్కెట్లు ఉన్నట్లు తెలుస్తోంది. వీటిలో 326 ఆంధ్ర, రాయలసీమ ప్రాంతంలోను, 210 తెలంగాణా ప్రాంతంలోను ఉన్నాయి. క్రమబద్ధీకరణ మార్కెట్లు ఆరోగ్యకరమైన వర్తక సంప్రదాయాలను నెలకొల్పడంలో అవస్థాపన సౌకర్యాలను కలిగించడంలో, మార్కెట్ సమాచారాన్ని అందించడంలో, వ్యవసాయదారులకు లాభసాటి ధరలను రాబట్టడంలో, సరైన తూకాల ఏర్పాట్లు చెయడ్యంలో కట్టుదిట్టమైన మార్కెట్ యార్డ్‌లను స్థాపించడంలో, మధ్యదళారుల దోపిడీనుంచి రైతులను రక్షించడంలో తోడ్పడతాయి.

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ జిల్లాలలో ఉన్న మార్కెట్ కమిటీలను, ఆ కమిటీల కింద ఉన్న ప్రకటిత మార్కెట్లను కింద పొందు పరచడమైంది.

| జిల్లా/మార్కెట్ కమిటీలు | | | | మార్కెట్లుగల ప్రదేశాలు |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం జిల్లా : | | | | |
| 1. | మార్కెటింగ్ కమిటీ, | ఆముదాలవలస | : | ఆముదాలవలస, శ్రీకాకుళం, చింతాడ, పోల్లి, కుసుమ, వీరఘట్టం |
| 2. | ,, | పొందూరు | : | పొందూరు, చీపురుపల్లి, రాజాం, బుడమూరు |
| 3. | ,, | పార్వతీపురం | : | పార్వతీపురం |
| 4. | ,, | కాంచిలి | : | కాంచిలి, సోంపేట, హరిపురం |
| 5. | ,, | సాలూరు | : | సాలూరు, రామభద్రపురం, మత్వా, పాచిపెంట, తోనాం, దుగ్గేరు. |

6. మార్కెటింగ్ కమిటీ, బొబ్బిలి : బొబ్బిలి, డొంకెనవలస

7. ,, పాతపట్నం : పాతపట్నం, చాపర, సర్వకోట

8. ,, టెక్కలి : పలాస, టెక్కలి

9. ,, ఇచ్ఛాపురం : ఇచ్ఛాపురం, కవిత

10. ,, నరసన్నపేట : నరసన్నపేట, కోటబొమ్మాలి, నారాయణవలస, పల్లిపేట

*విశాఖపట్నం జిల్లా :*

1. మార్కెటింగ్ కమిటీ, అనకాపల్లి : అనకాపల్లి, మక్కవరపాలెం, తుమ్మపల్ల

2. ,, కొత్తవలస : కొత్తవలస, ఆలమంద, శృంగవరపుకోట, అనంతగిరి

3. ,, విజయనగరం : విజయనగరం, అత్తాహూతపురం, మోపాడ

4. ,, చోడవరం : చోడవరం, వల్లడి, తిమిరం

5. ,, ఎలమంచిలి : ఎలమంచిలి

6. ,, నరిసీపట్నం : నరిసీపట్నం, చింతపల్లి

7. ,, గజపతినగరం : గజపతినగరం

8. ,, భీమ్లీ : తగరపువలస, భోగాపురం, మేడవలస

9. ,, పాడేరు : పాడేరు, అరకు, గంగరాజి, మాడుగుల, తుంటలపుట్ట,

10. ,, విశాఖపట్నం : విశాఖపట్నం

*తూర్పుగోదావరి జిల్లా :*

1. మార్కెటింగ్ కమిటీ, తుని : తుని

2. ,, రాజమండ్రి : రాజమండ్రి, రఘుదేవపురం, తొర్రేడు, ముగ్గల

3. ,, అంబాజీపేట : అంబాజీపేట, ముక్తేశ్వరం

4. ,, కొత్తపేట : కొత్తపేట, గన్నవరం, రావులపాలెం

5. ,, రాజోలు : తాటిపాక

| | | | |
|---|---|---|---|
| 6. | మార్కెటింగ్ కమిటీ, | పిఠాపురం | : పిఠాపురం, గొల్లప్రోలు |
| 7. | ,, | కాకినాడ | : కాకినాడ, సామర్లకోట |
| 8. | ,, | పెద్దాపురం | : పెద్దాపురం, కిర్లంపూడి, ఏలేశ్వరం |
| 9. | ,, | రామచంద్రాపురం | : రామచంద్రాపురం, ద్రాక్షారం |
| 10. | ,, | ముమ్మిడివరం | : ముమ్మిడివరం, మురమళ్ళ, పల్లంకురు కాట్రేనుకోన |
| 11. | ,, | ఆలమూరు | : మండపేట, ద్వారపూడి, చింతలూరు |

*పశ్చిమగోదావరిజిల్లా :*

| | | | |
|---|---|---|---|
| 1. | మార్కెటింగ్‌కమిటీ, | తాడేపల్లిగూడెం | : తాడేపల్లిగూడెం, పెంటపాడు, చేబ్రోలు, గణపవరం |
| 2. | ,, | ఏలూరు | : ఏలూరు, భీమడోలు, ద్వారకాతిరుమల |
| 3. | ,, | పాలకొల్లు | : పాలకొల్లు, నరసాపురం |
| 4. | ,, | భీమవరం | : భీమవరం, ఆకివీడు, ఉండి, శృంగవృక్షం, కొనితివాడ, జువ్వలపాలెం |
| 5. | ,, | కొవ్వూరు | : నిడదవోలు, తాళ్ళపూడి, మలకపల్లి, గోపాలపురం, దేవరపల్లి |
| 6. | ,, | తణుకు | : తణుకు, పెనుగొండ, అత్తిలి |
| 7. | ,, | చింతలపూడి | : చింతలపూడి, ధర్మాజిగూడెం, కామవరపుకోట |
| 8. | ,, | పోలవరం | : పోలవరం, జంగారెడ్డిగూడెం, కోయలగూడెం, జీలుగమల్లి, బుట్టాయిగూడెం |

*కృష్ణాజిల్లా :*

| | | | |
|---|---|---|---|
| 1. | మార్కెటింగ్ కమిటీ, | జగ్గయ్యపేట | : జగ్గయ్యపేట |
| 2. | ,, | విజయవాడ | : విజయవాడ, కంకిపాడు, మైలవరం |
| 3. | ,, | మచిలీపట్నం | : మచిలీపట్నం, పెడన, బంటుమిల్లి |

4. మార్కెటింగ్ కంమిటీ, గుడివాడ : గుడివాడ, పామర్రు, గుడ్లవల్లేరు

5. ,, నూజివీడు : నూజివీడు, ఆగిరిపల్లి, బాపులపాడు

6. ,, నందిగామ : నందిగామ, కంచికచెర్ల, చంద్రాలపాడు

7. ,, దివి : అవనిగడ్డ, కొడాలి, నాగాయిలంక, ఏటిమొగ, చల్లపల్లి

8. ,, కైకలూరు : కైకలూరు, కలదిండి

9. ,, గన్నవరం : గన్నవరం, ఉయ్యూరు, వీరంకిలాకు

10. ,, తిరువూరు : తిరువూరు, గంపలగూడెం, విస్సన్నపేట

*గుంటూరు జిల్లా :*

1. మార్కెటింగ్ కమిటీ, గుంటూరు : గుంటూరు, మంగళగిరి, తాడికొండ, అమరావతి, లేమళ్ళ, సిరిపురం

2. ,, తెనాలి : తెనాలి, దుగ్గిరాల, చేబ్రోలు, వేమూరు, కూచిపూడి

3. ,, నరసరావుపేట : నరసరావుపేట, చిలకలూరిపేట,

4. ,, బాపట్ల : బాపట్ల, మంతెనవారిపాలెం, పొన్నూరు, పెదనందిపాడు, నిడుబ్రోలు

5. ,, పలనాడు : మాచెర్ల, రెంటచింతల, దాచేపల్లి, పిడుగురాళ్ళ

6. ,, వినుకొండ : వినుకొండ, ముప్పాళ్ళ

7. ,, రేపల్లె : రేపల్లె, చెరుకుపల్లి, నిజాంపట్నం

8. ,, సత్తెనపల్లి : సత్తెనపల్లి, క్రోసూరు, ఫిరంగిపురం

*ప్రకాశం జిల్లా :*

1. మార్కెటింగ్ కమిటీ, ఒంగోలు : ఒంగోలు, ఉప్పుగుండూరు, సంతనూతలపాడు, టంగుటూరు, ఎడుగొండ్లపాడు, రావినూతల, మద్దిపాడు, నాగల్లేపలపాడు, త్రోవగుంట

2. మార్కెటింగ్ కమిటీ, గిద్దలూరు : గిద్దలూరు, కంభం

3. ,, కందుకూరు : కందుకూరు,సింగరాయకొండ, వెస్పూరు

4. ,, అద్దంకి : అద్దంకి, మేదరమెట్ల, మారుటూరు, సంతమాగులూరు

5. ,, చీరాల : చీరాల, పరుచూరు, ఇంకొల్లు

6. ,, కనిగిరి : కనిగిరి, పామూరు

7. ,, పొదిలి : పొదిలి, తార్లపాడు, పెదరికొల్లు

8. ,, దర్శి : దర్శి, కురిచేడు, లాఘ్నారు

9. ,, మార్కాపురం : మార్కాపురం, త్రిపురాంతకం, ఎర గొండలపాలెం, డోర్నాల

**నెల్లూరు జిల్లా :**

1. మార్కెటింగ్ కమిటీ, నెల్లూరు : నెల్లూరు

2. ,, గూడూరు : గూడూరు, మల్లం

3. ,, కావలి : చౌదరిపాలెం, కనిగిరి

4. ,, సూళ్ళూరిపేట : సూళ్ళూరిపేట, నాయుడుపేట, తడ

5. ,, రాపూరు : రాపూరు, పొదలకూరు

6. ,, వెంకటగిరి : వెంకటగిరి

7. ,, ఉదయగిరి : ఉదయగిరి, దుత్తలూరు, నందవరం, వింజమూరు

8. ,, ఆత్మకూరు : ఆత్మకూరు, సంగం, ధర్మరాజు చెరువుపల్లి, అనంతసాగరం, కమ్మవారిపాలెం

9. ,, కొవ్వూరు : కొవ్వూరు, కడవలూరు, అల్లూరు, బుచ్చిరెడ్డివారిపాలెం, ఊటుకూరు

**చిత్తూరు జిల్లా :**

1. మార్కెటింగ్ కమిటీ, చిత్తూరు : చిత్తూరు

2. ,, పాకాల : పాకాల

| | | | |
|---|---|---|---|
| 3. మార్కెటింగ్ కమిటీ, | పీలేరు | : | పీలేరు, రొంపిచెర్ల |
| 4. ,, | మదనపల్లి | : | మదనపల్లి, బి.కొత్తపేట, ములకలచెరువు |
| 5. ,, | పలమనేరు | : | పలమనేరు వి. కోట |
| 6. ,, | శ్రీకాళహస్తి | : | శ్రీకాళహస్తి |
| 7. ,, | పుత్తూరు | : | పుత్తూరు, నగరి, పడమలపేట |
| 8. ,, | పుంగనూరు | : | పుంగనూరు, రాయలపేట, రామసముద్రం, చౌడేపల్లి |
| 9. ,, | తిరుపతి | : | తిరుపతి, చంద్రగిరి |
| 10. ,, | సత్యవీడు | : | నాగలాపురం |
| 11. ,, | బంగారుపాలెం | : | బంగారుపాలెం, అరగొండ, ఇరాల |
| 12. ,, | కుప్పం | : | కుప్పం |
| 13. ,, | వాయలపాడు | : | వాయలపాడు, కలికిరి, చింతపర్తి, కలకడ |

*కడప జిల్లా :*

| | | | |
|---|---|---|---|
| 1. మార్కెటింగ్ కమిటీ, | కడప | : | కడప |
| 2. ,, | రాజంపేట | : | రాజంపేట, కోడూరు |
| 3. ,, | పులివెందుల | : | పులివెందుల, వేంపల్లి, సింహాద్రిపురం |
| 4. ,, | ప్రొద్దుటూరు | : | ప్రొద్దుటూరు, మైదుకూరు |
| 5. ,, | రాయచోటి | : | రాయచోటి, లక్కిరెడ్డిపల్లి, గాలివేడు, తాసుండపల్లి, చినమండ్యం |
| 6. ,, | కమలాపురం | : | ఎర్రగుంట్ల, కమలాపురం, |
| 7. ,, | జమ్మలమడుగు | : | జమ్మలమడుగు, కొండాపురం |
| 8. ,, | సిద్దౌటు | : | సిద్దౌటు, నందవరం |
| 9. ,, | బద్వేలు | : | బద్వేలు, పోరుమామిళ్ళ |

**అనంతపూర్ జిల్లా**

| | | | |
|---|---|---|---|
| 1. | మార్కెటింగ్ కమిటీ, కల్లూరు | : | కల్లూరు, నారపాల |
| 2. | ,, కదిరి | : | కదిరి, టంకల్లు, ముద్దిగుబ్బ |
| 3. | ,, హిందూపురం | : | హిందూపురం, గోరంట్ల, చిలమత్తూరు |
| 4. | ,, రాయదుర్గ | : | రాయదుర్గ, కనేకల్ |
| 5. | ,, తాడిపత్రి | : | తాడిపత్రి, ర్యాలో |
| 6. | ,, గుత్తి | : | గుత్తి, గుంటకల్లు |
| 7. | ,, ధర్మవరం | : | ధర్మవరం |
| 8. | ,, కళ్యాణదుర్గ | : | కళ్యాణదుర్గ |
| 9. | ,, మడకసిర | : | మడకసిర |
| 10. | ,, పెనుకొండ | : | పెనుకొండ, కొత్తచెరువు |
| 11. | ,, ఉరవకొండ | : | ఉరవకొండ, కోనకొండాల |

**కర్నూలుజిల్లా**

| | | | |
|---|---|---|---|
| 1. | మార్కెటింగ్ కమిటీ, కర్నూలు | : | కర్నూలు, కోడుమూరు |
| 2. | ,, ఆదోని | : | ఆదోని, ఒసిగి |
| 3. | ,, నంద్యాల | : | నంద్యాల |
| 4. | ,, ఆళ్ళగడ్డ | : | ఆళ్లగడ్డ, చాగలమర్రి, సిరవెళ్ళ |
| 5. | ,, ఎమ్మిగనూరు | : | ఎమ్మిగనూరు |
| 6. | ,, డోన్ | : | డోన్, పీపిల్లి |
| 7. | ,, నందికొట్కూరు | : | నందికొట్కూరు |
| 8. | ,, కోయిలకుంట్ల | : | కోయిలకుంట్ల |
| 9. | ,, పాటికొండ | : | పాటికొండ |
| 10. | ,, ఆలూరు | : | ఆలూరు |
| 11. | ,, బంగినపల్లి | : | బంగినపల్లి |
| 12. | ,, ఆత్మకూరు | : | ఆత్మకూరు, వెలుగోడు |

ఆదిలాబాదు జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1. | మార్కెటింగ్ కమిటీ, ఆదిలాబాదు | : | ఆదిలాబాదు |
| 2. | ,, మంచిర్యాల | : | మంచిర్యాల, లక్సెట్టిపేట, జిన్నారు |
| 3. | ,, భైన్సా | : | భైన్సా, పాన్సీ, మథోల్, కాభీర్ |
| 4. | ,, నిర్మల్ | : | నిర్మల్, సారంగపూర్, లక్మణ్‌చందా |
| 5. | ,, బోథ్ | : | బోథ్, ఎకోడ్ |
| 6. | ,, చిన్నూరు | : | చిన్నూరు |
| 7. | ,, కాగజ్‌నగర్ | : | సిర్‌పూర్, సిర్‌పూర్ కాగజ్‌నగర్ |
| 8. | ,, ఆసిఫాబాదు | : | ఆసిఫాబాదు, బెల్లంపల్లి |
| 9. | ,, ఖనాపూర్ | : | ఖనాపూర్ |
| 10. | ,, పుత్తునూరు | | పుత్తునూరు, ఇందన్‌వల్లి, హసన్‌పూర్ |

హైదరాబాదు జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1. | మార్కెటింగ్ కమిటీ, హైదరాబాదు | | హైదరాబాదు, చాంద్రాయణగుట్ట, బాటసింగారం |
| 2. | ,, నార్సింగి | : | నార్సింగి, ఎర్రగడ్డ, బొగ్గుగుడ |
| 3. | ,, వికారాబాదు | : | వికారాబాదు |
| 4. | ,, తాండూరు | : | తాండూరు బషీరాబాదు |
| 5. | ,, శంకరపల్లి | : | శంకరపల్లి, చేవెళ్ల |
| 6. | ,, సర్దార్‌నగర్ | : | సర్దార్‌నగర్ |
| 7. | ,, పర్గి | : | పర్గి, మహమూదాబాదు |
| 8. | ,, ఇబ్రహింపట్నం | : | ఇబ్రహింపట్నం |
| 9. | ,, మేడ్చల్ | : | మేడ్చల్ |

ఖమ్మం జిల్లా

| | | | |
|---|---|---|---|
| 1. | మార్కెటింగ్ కమిటీ, ఖమ్మం | : | ఖమ్మం, నేలకొండపల్లి |
| 2. | ,, కొత్తగూడెం | : | కొత్తగూడెం, పాలవంచ |
| 3. | ,, మథిర | : | మథిర, వైరా, ఎర్రుపాలెం |

4. మార్కెటింగ్ కమిటీ, ఎల్లెందు : ఎల్లెందు, గార్ల

5. ,, భద్రాచలం : భద్రాచలం, కొనవరం

6. ,, నూగేరు : వెంకటాపురం, చార్ల

7. ,, సత్తుపల్లి : సత్తుపల్లి, అశ్వారావుపేట

8. ,, బూర్గంపాడు : బూర్గంపాడు, రుద్రమకోట

***కరీంనగర్ జిల్లా***

1. మార్కెటింగ్ కమిటీ, కరీంనగర్ : కరీంనగర్, హసన్‌బాద్, గంగాధర్ గండిగోపాల్, చొప్పదండి

2. ,, వేములవాడ : వేములవాడ, సిరిసిల్లా, జెప్పాపూర్ పేతన్‌గల్

3. ,, మెట్‌పల్లి : మెట్‌పల్లి, అబ్రహీంపట్నం

4. ,, జగిత్యాల : జగిత్యాల, ధర్మపురి, రాయకుల్, గొల్లపల్లి

5. ,, పెద్దపల్లి : పెద్దపల్లి, పోతకపల్లి, సుల్తానాబాదు

6. ,, జమ్మికుంట : జమ్మికుంట, హుజూరాబాదు, ఉప్పల్

7. ,, కోరట్ల : కోరట్ల

8. ,, మంథెని : మంథెని, మహదేవపూర్

***మహబూబ్ నగర్ జిల్లా***

1. మార్కెటింగ్ కమిటీ, మహబూబ్‌నగర్ . మహబూబ్‌నగర్, ఎనమగండ్ల

2. ,, బాదేపల్లి : బాదేపల్లి, కోవరంపేట

3. ,, నారాయణపేట : నారాయణపేట

4. ,, కొల్లాపూర్ : కొల్లాపూర్, పెంటవల్లి, పెదకొత్తపల్లి

5. ,, గద్వాల్ : గద్వాల్, అలంపూర్ అయిజ

6. ,, షాద్‌నగర్ : షాద్‌నగర్, చౌదర్‌గూడా

7. ,, వనపర్తిరోడ్ : వనపర్తిరోడ్, వనపర్తిటౌన్, ఖిలా గోన్‌పూర్, పెబ్బేర్

8. మార్కెటింగ్ కమిటీ, కోసిగి : కోసిగి, కొడంగల్లు

9. ,, నాగర్‌కర్నూల్ : నాగర్‌కర్నూల్, తేలకపల్లి

10. ,, మక్తల్ : మక్తల్, కృష్ణ

11 ,, కల్వకుర్తి : కల్వకుర్తి, అమంగల్, చెరకొండ కడ్తల్

12. ,, అచ్చంపేట : అచ్చంపేట, అమరాబాదు, లింగల్

13. ,, ఆత్మకూరు : ఆత్మకూరు, దేవరకద్రా

14. ,, రాయచూర్ క్రాస్‌రోడ్స్ : రాయచూర్ క్రాస్‌రోడ్స్

*మెదక్ జిల్లా*

1. మార్కెటింగ్ కమిటీ, మెదక్ : మెదక్, రామాయంపేట, చేగుంట శంకరంపేట

2. ,, జోగిపేట : జోగిపేట, తాకమల్, శంకరంపేట నారాయణఖేడు

3. ,, సదాశివపేట : సదాశివపేట, కంది, సంగారెడ్డి

4. ,, జహీరాబాదు : జహీరాబాదు, కోహిర్

5. ,, సిద్దిపేట : సిద్దిపేట

6. ,, గజ్వేల్ : గజ్వేల్

7. ,, నర్సపూర్ : నర్సాపూర్, దౌలతాబాదు

*నిజామాబాదు జిల్లా :*

1. మార్కెటింగ్ కమిటీ, నిజామాబాదు : నిజామాబాదు, నందిపేట

2. ,, కామారెడ్డి : కామారెడ్డి, తిక్నూర్

3. ,, బోధన్ : బోధన్, సాతపూర్, పోతంగల్

4. ,, మద్నూర్ : మద్నూర్, బిక్నోండ, జుక్కల్

5. ,, బాన్సువాడా : బాన్సువాడా, బిక్నూర్, పాట్లం, నిజాం సాగర్

6. ,, ఎల్లారెడ్డి : ఎల్లారెడ్డి, నాగిరెడ్డిపేట, లింగంపేట

7. ,, ఆర్మూరు : ఆర్మూరు, కిసాన్‌సాగర్, కమ్మరపల్లె

*నల్గొండ జిల్లా :*

| | | | |
|---|---|---|---|
| 1. | మార్కెటింగ్ కమిటీ, నల్గొండ | : | నల్గొండ, తిప్పర్తి |
| 2. | ,, నకరేకల్ | : | నకరేకల్, పావురాలగూడెం, కట్టంగూర్ |
| 3. | ,, చిట్యాల్ | : | చిట్యాల్, చెందూర్, ముంగోడ్ నార్కెట్‌పల్లి |
| 4. | ,, భువనగిరి | : | భువనగిరి, మహదేవపురం, బూజుపేట |
| 5. | ,, ఆలేరు | : | ఆలేరు, మట్టుకోడూరు |
| 6. | ,, మిర్యాలగూడా | : | మిర్యాలగూడా, దేవరపల్లి |
| 7. | ,, దేవరకొండ | : | దేవరకొండ, వేంకటేశ్వరనగర్, కురుముడి, వెంకటంపేట, పెద్ద అడ్డాలపల్లి దిండిగుండ్లపల్లి, నాంపల్లి, మల్లేపల్లి, చింతపల్లి, గుండిపల్లి |
| 8. | ,, సూర్యాపేట | : | సూర్యాపేట, నూతంగల్, తిరుమలగిరి |
| 9. | ,, కోదాడ | : | కోదాడ, హుజూర్‌నగర్, నారేడుచెర్ల, నందిగూడెం |
| 10. | ,, రామన్నపేట | : | రామన్నపేట, చౌటుప్పల్, మోపకూర్ వాలిగొండ |
| 11. | ,, నిడమానూరు | : | నిడమానూరు, పెదపూర |

*వరంగల్ జిల్లా :*

| | | | |
|---|---|---|---|
| 1. | మార్కెటింగ్ కమిటీ, వరంగల్ | : | వరంగల్ |
| 2. | ,, మహబూబాబాద్ | : | మహబూబాబాద్, డోర్నకల్ |
| 3. | ,, ఘనాపూర్ | : | ఘనాపూర్, ఇల్లెందు |
| 4. | ,, కె. సముద్రం | : | కె. సముద్రం, ఇంగుర్తి |
| 5. | ,, జనగాం | : | జనగాం, రఘునాథపల్లి, నవాబుపేట, చెర్యాల్ |
| 6. | ,, తొర్రువ | : | తొర్రువ |
| 7. | ,, పరకాల | : | పరకాల, చిట్యాల, శ్యాంపేట |

| | | | |
|---|---|---|---|
| 8. మార్కెటింగ్ కమిటీ, | నర్సంపేట | : | నర్సంపేట, నెక్కొండ |
| 9. ,, | ములుగు | : | ములుగు, ఏటు రంగారం, గోవింద రావుపేట |

మూలం : డైరెక్టర్ ఆఫ్ మార్కెటింగ్

## సరుకులరీత్యా క్రమబద్ధీకరణ మార్కెట్లు

కొన్ని సరుకులకు కొన్ని మార్కెట్లు ప్రసిద్ధి వహించాయి. ఆ మార్కెట్‌లో ధర వరలు ఆ సరుకుల ప్రవృత్తినిబట్టి మారుతుంటాయి. అందుచేత ఏ యే మార్కెట్‌లలో ఎయే సరుకులకు ప్రాముఖ్యం ఉన్నదో తెలుసుకోవడం అవసరం.

| | | |
|---|---|---|
| ధాన్యం ఒకటోరకం | .... | నిజామాబాదు, వరంగల్, కాకినాడ, తాడేపల్లిగూడెం, గుడివాడ, తాడిపత్రి |
| ధాన్యం రెండోరకం | .... | నిజామాబాదు, వరంగల్, తాడేపల్లిగూడెం, గుడివాడ |
| బియ్యం ఒకటోరకం | .... | హైదరాబాదు, వరండల్, విజయవాడ, తాడేపల్లిగూడెం కాకినాడ, కడప, తాడిపత్రి |
| బియ్యం రెండోరకం | .... | హైదరాబాదు, నిజామాబాదు, వరంగల్, తాడేపల్లి గూడెం, గుడివాడ, ప్రొద్దుటూరు |
| జొన్న (పచ్చ) | .... | హైదరాబాదు, ఖమ్మం, బాగేపల్లి, నంద్యాల, నరస రావుపేట |
| జొన్న (తెల్లనివి) | .... | తాండూరు, ఆదిలాబాదు, నెల్లూరు |
| సజ్జ | .... | హైదరాబాదు, జహీరాబాదు, బాగేపల్లి, అనకాపల్లి, ఆదోని |
| మొక్కజొన్న | .... | హైదరాబాదు, భువనగిరి, నిజామాబాదు, కరీంనగర్ |
| కందులు | .... | హైదరాబాదు, ఆదిలాబాదు, గుంటూరు, నంద్యాల |
| సెనగలు | .... | హైదరాబాదు, నిజామాబాదు, సదాశివపేట, విజయ వాడ, నంద్యాల |
| మినుము | .... | హైదరాబాదు, జహీరాబాదు, గుంటూరు, ఆముదాల వలస |
| ఉలవలు | .... | హైదరాబాదు, నిజామాబాదు, మహబూబ్‌నగర్, నంద్యాల, కాకినాడ |

| | | |
|---|---|---|
| పసుపు | .... | హైదరాబాదు, నిజామాబాదు, కడప, దుగ్గిరాల, రాజమండ్రి |
| చింతపండు | .... | నిజామాబాదు, షాద్‌నగర్, మదనపల్లి, హిందూపూర్ తాడేపల్లిగూడెం, విజయనగరం |
| బెల్లం | .... | హైదరాబాదు, నిజామాబాదు, హిందూపూర్, చిత్తూరు, అనకాపల్లి |
| వేరుసెనగ | .... | బాగేపల్లి, వరంగల్, హైదరాబాదు, ఆదోని, విజయ నగరం |
| కువ్వులు | .... | హైదరాబాదు, వికారాబాదు, జనగాం, తాడేపల్లిగూడెం తుని, విజయనగరం |
| ఉల్లి | .... | సదాశివపేట, హైదరాబాదు, అనంతపూర్, కడప |
| మిర్చి | .... | హైదరాబాదు, నిజామాబాదు, గుంటూరు, వరంగల్, కడప |
| మెస్త | .... | విజయనగరం, పొందూరు, పార్వతీపురం |
| కొబ్బరికాయలు | .... | అంబాజీపేట, పాలకొల్లు, రాజమండ్రి, ఆముదాలవలస |

ఈ మార్కెట్ కమిటీలకు క్రమబద్ధీకరణ మార్కెట్‌లనుంచి ఆ మార్కెట్‌లలో జరిగే వర్తక, వ్యవహారాలద్వారా ( వందరూపాయల సరుకుకు రూపాయి ఫీజు) లభించే రుసుము, లైసెన్సు ఫీజు, చిల్లరమల్లరరాబడులద్వారా ఆదాయంలభిస్తుంది. క్రమబద్ధీకరణమార్కెట్‌ల ఆదాయం 1975-86 లో రూ. 5.10 కోట్లు, 1976-77లో రూ. 5.87 కోట్లు, 1977-78లో రూ. 5.97 కోట్లు, 1978-79 లో రూ. 8.54 కోట్లు వచ్చినట్లు తెలుస్తున్నది.

ఆంధ్రప్రదేశ్‌లోని క్రమబద్ధీకరణ మార్కెట్లలో ముఖ్యమైన వ్యావసాయక వస్తువుల సాంవత్సరిక టర్నోవర్

(పరిమాణం : వేల క్వింటాళ్లలో)

(విలువ : వేల రూపాయలలో)

1978 - 79

| వస్తువు | పరిమాణం | విలువ |
|---|---|---|
| 1. ధాన్యం | 25,573 | 22,82,204 |
| 2. వరి | 12,784 | 20,52,433 |
| 3. గోధుమ | 78 | 10,477 |
| 4. జొన్న | 854 | 74,495 |

| 1 | 2 | 3 |
|---|---|---|
| 5. సజ్జలు | 260 | 21,806 |
| 6. మొక్కజొన్న | 994 | 91,490 |
| 7. రాగులు | 368 | 30,792 |
| 8. శెనగలు | 72 | 14,724 |
| 9. కందులు | 319 | 82,757 |
| 10. పెసలు | 732 | 1,58,438 |
| 11. మినుములు | 380 | 1,02,925 |
| 12. ఉలవలు | 179 | 20,410 |
| 13. ఇతర పప్పుదినుసులు | 95 | 1,530 |
| 14. వేరుశెనగకాయలు | 5,138 | 10,24,110 |
| 15. వేరుశెనగపప్పులు | 862 | 2,43,769 |
| 16. అవిశెలు | 12 | 2,755 |
| 17. నువ్వులు | 342 | 1,34,468 |
| 18. ఆముదాలు | 317 | 66,091 |
| 19. మిరప | 1,174 | 5,96,727 |
| 20. పసుపు | 871 | 3,81,725 |
| 21. ఉల్లి | 1,746 | 94,926 |
| 22. చింతపండు | 505 | 2,03,643 |
| 23. ధనియాలు | 132 | 29,107 |
| 24. బెల్లం | 3,471 | 3,77,439 |
| 25. ప్రత్తి | 2,045 | 7,66,697 |
| 26. ప్రత్తి (నార) | 64 | 77,178 |
| 27. జనుము | 599 | 98,939 |
| 28. పొగాకు | 1,033 | 5,51,159 |
| 29. ఇతరాలు | 768 | 2,56,574 |
| మొత్తం (1 నుంచి 29 వరకు) | 61,776 | 98,49,838 |

| | | |
|---|---|---|
| 30. కొబ్బరికాయలు (వేలలో) | 3,02,556 | 4,23,745 |
| 31. పండ్లు, చేపలు, ఆహారోపయోగ జంతువుల విలువ | | 2,41,793 |
| 32. కూరగాయలు, గ్రుడ్లు, ఆకు కూరల విలువ | | 30,507 |
| మొత్తం వ్యవసాయ వాణిజ్య సరుకుల విలువ | | 1,05,45,883 |

మార్కెట్ల కమిటీ ఆదాయ వ్యయాలను పరిశీలిస్తే కొన్ని మార్కెట్లు ఎక్కువ ఆదాయాలను ఆర్జిస్తున్నట్లు కనబడుతుంది. 1978-79 నాటికి హైదరాబాదు కమిటీకి ఒక కోటి రూపాయలు, గుంటూరు కమిటీకి 82 లక్షల రూపాయలు, భీమవరం కమిటీకి 72 లక్షల రూపాయలు, నిజామాబాద్ కమిటీకి 58 లక్షల రూపాయలు వరంగల్ కమిటీకి 51 లక్షల రూపాయలు ఉన్నట్లు తెలుస్తుంది.

వివిధ జిల్లాలలోగల మార్కెట్ కమిటీల ఆదాయవ్యయాలను 1978-79 కి సంబంధించి కింద ఇవ్వడం జరిగింది. (రూ. లక్షలలో)

| జిల్లా | ఆదాయం | వ్యయం |
|---|---|---|
| శ్రీకాకుళం | 26.42 | 16.79 |
| విశాఖపట్నం | 17.01 | 16.48 |
| తూర్పుగోదావరి | 52.27 | 15.60 |
| పశ్చిమగోదావరి | 98.41 | 34.31 |
| కృష్ణ | 58.13 | 41.50 |
| గుంటూరు | 76.94 | 48.57 |
| ప్రకాశం | 26.76 | 23.42 |
| నెల్లూరు | 15.40 | 7.50 |
| చిత్తూరు | 40.39 | 28.95 |
| కడప | 32.55 | 19.99 |
| అనంతపురం | 37.75 | 24.57 |

| 1 | 2 | 3 |
|---|---|---|
| కర్నూలు | 68.93 | 50.24 |
| ఆదిలాబాదు | 28.29 | 15.46 |
| హైదరాబాదు | 49.99 | 27.10 |
| ఖమ్మం | 23.31 | 25.27 |
| కరీంనగర్ | 18.00 | 16.74 |
| మహబూబ్‌నగర్ | 32.13 | 27.55 |
| మెదక్ | 14 81 | 11.75 |
| నిజామాబాద్ | 44.31 | 27.35 |
| నల్గొండ | 48.85 | 37.14 |
| వరంగల్ | 40.20 | 27.69 |

(మూలం : మార్కెటింగ్‌శాఖ, ఆంధ్రప్రదేశ్)

## ఆంధ్రప్రదేశ్ స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్
## (Andhra Pradesh State Trading Corporation)

ఈ సంస్థను 1971 లో స్థాపించారు. ఇది పూర్తిగా రాష్ట్రప్రభుత్వ రంగంలో ఉన్న వాణిజ్య సంస్థ. ఈ సంస్థ రాష్ట్రంలోని వివిధరకాల వస్తువుల ఎగుమతికి తోడ్పడుతుంది. వివిధ రకాల పరిశ్రమలకుఅవసరమైన ముడిపదార్థాలను, సామగ్రిని కూడా ఈ సంస్థ విదేశాల నుంచి దిగుమతి చేసుకొంటుంది. అంతేకాకుండా ఎంపిక చేసుకొన్న వస్తువులతో దేశీయ వ్యాపారాన్ని కొనసాగిస్తుంది. ఈసంస్థ ప్రారంభంనుంచి చేనేతవస్త్రాలను, హస్తనైపుణ్యంతో చేసిన వస్తువులను ఎగుమతి చేస్తున్నది. లేపాక్షి హేండీక్రాఫ్ట్స్ ఎంపోరియం ఈ సంస్థ అధీనంలో ఉంది. ఈ సంస్థ బియ్యం, తాజా కూరగాయలు, ఖనిజాలు, బాల్‌బేరింగ్‌లను పొగాకు, పసుపు, ఆముదం, చందనం, రెడీమెడ్ దుస్తులను వివిధ దేశాలకు ఎగుమతి చేస్తున్నది. 1979-80 సం॥లో ఈ సంస్థ 5.54 కోట్ల రూపాయల విలువగల వస్తువులను ఎగుమతి చేసింది. 1980-81 సం॥లో 12.05 కోట్ల రూపాయలవిలువగల వస్తువులను ఎగుమతి చేయాలనేది ఈ సంస్థ లక్ష్యంగా తెలియవచ్చింది. ఈ సంస్థ 1974-75 నుంచి క్లియరింగ్ అండ్ ఫార్‌వర్డింగ్ (clearing and forwarding) ఏజెంట్‌గా కూడా వ్యవహరిస్తున్నది. విదేశాలనుంచి దిగుమతి చేసుకున్న యంత్రాలు యంత్ర పరికరాలు మొదలైన వాటిని ప్రభుత్వ శాఖలకు, ప్రభుత్వ ఆధ్వర్యంలో ఉన్నసంస్థలకు, ప్రయివేట్ సంస్థలకు పంపిణీ చేయడం జరుగుతున్నది. ఈసంస్థ ఆధ్వర్యంలోనే 1977 లో ఎయిర్‌కార్గో కాంప్లెక్స్‌ను

హైదరాబాదులో నెలకొల్పడం జరిగింది. దీనివల్ల పండ్లు, కూరగాయలు, కోళ్లు, కోడిగుడ్లు, చేనేత వస్త్రాలు, హస్తనైపుణ్యంగల వస్తువులు, ఇంజనీరింగ్ వస్తువులు, రసాయనాలు, రెడీమేడ్ దుస్తులు, తోళ్ళు, తోళ్లవస్తువులు మొదలైన వాటికి కస్టమ్స్ క్లియరెన్స్ సౌకర్యాలు సమకూరుతున్నాయి.

ఈ సంస్థ లేపాక్షి హేండిక్రాఫ్ట్స్ ఎంపోరియం శాఖలను న్యూఢిల్లీ, వరంగల్, విజయవాడ, రాజమండ్రి, విశాఖపట్నం, అనంతపూర్, తిరుమల పట్టణాలలో నెలకొల్పింది.

ఆంధ్రప్రదేశ్ స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ యొక్క 1978-79 నాటికి పరిపాలన నివేదిక పరిశీలిస్తే, ఈ సంస్థ అభివృద్ధి కార్యక్రమాలు బోధపడగలవు. ఆ సంవత్సరంలో ఈ సంస్థ 18.55 లక్షల రూపాయల నికరలాభాన్ని గడించింది. హెడ్ ఆఫీసుద్వారా రూ. 354.47 లక్షల వ్యాపారపు టర్నోవర్‌ను ఇది చేసింది. వివిధ లేపాక్షి హేండీక్రాఫ్ట్‌ల ఎంపోరియం ద్వారా రూ. 118.76 లక్షల వ్యాపారాన్ని నిర్వహించింది. 1978-79 లో రూ. 244.79 లక్షల విలువగల సిమెంటును దిగుమతి చేసుకొంది. రూ. 171.49 లక్షల విలువగల దేశీయవ్యాపారాన్ని ఈసంస్థ నిర్వహించింది. 29-12-78 నుంచి ఆంధ్రప్రదేశ్‌లో సిమెంట్ పంపిణీకి ఈ సంస్థను ఏజెంట్‌గా రాష్ట్రప్రభుత్వం నియమించింది.

విద్యార్థులకు ఎక్సర్‌సైజ్ నోట్‌పుస్తకాలను తయారుచేసి రాష్ట్రంలోని వివిధ ప్రదేశాలకు అందించే బాధ్యతలను కూడ ప్రభుత్వం అప్పగించింది. ఈ సంస్థకు 1978-79 నాటికి 16 లక్షల చెల్లించిన మూలధనం ఉన్నది. ఆంధ్రప్రదేశ్ వర్తక వాణిజ్య వ్యవహారాలలో, ఎగుమతుల దిగుమతుల వ్యాపారంలో వస్తువుల పంపిణీలో ఈ సంస్థ ప్రశంసనీయమైన పాత్ర నిర్వహిస్తున్నది. ఈ సంస్థ భాగ్యలక్ష్మి లాటరీలను కూడా నిర్వహిస్తోంది.

# 23

# గృహవసతి సౌకర్యాలు

మన రాష్ట్రంలో గృహవసతి సౌకర్యాలు మెరుగుపరచాలని రాష్ట్రప్రభుత్వం ఎంతగా కృషి చేస్తున్నా పరిస్థితి ఇంకా చాలా తీవ్రంగా ఉన్నదనటం నిర్వివాదాంశం. ఒక్క హైదరాబాద్ నగరం తీసుకున్నా ఈ విషయం స్పష్టమవుతుంది. హైదరాబాదులో 1971 లో గృహవసతి కొరత 79,000 ఉండగా, 1981 నాటికి ఇది 2 లక్షల వరకు పెరుగుతుందని అంచనా. 1991 నాటికి ఈ కొరత 4 లక్షలవుతుంది. ఈ కొరత తీర్చడానికి సంవత్సరానికి 44 వేల ఇళ్ళు కట్టాలని లక్ష్యం పెట్టుకున్నప్పటికీ, నిజానికి సంవత్సరానికి 7,000 ఇళ్ళు మాత్రమే కట్టడం జరుగుతోంది. హైదరాబాదునగరంలో ప్రస్తుతం 455 మురికివాడలున్నాయి. వీటిలో 4.2 లక్షల మంది నివసిస్తున్నారు. ఇంకో రకంగా చెప్పాలంటే మురికివాడలలో ఉండే వారి జనాభా మొత్తం నగర జనాభాలో అయిదో వంతు. ఈ మురికి వాడలలో ఉన్న పదివేల కుటుంబాలకు ఇళ్ళ స్థలాలు ఇచ్చారు. అనేక సంస్థలు వారికి ఇళ్లు కట్టుకోవడానికి సహాయం చేస్తున్నాయి.

గృహనిర్మాణంలో ప్రధాన పాత్ర వహిస్తున్న సంస్థ హౌసింగ్ బోర్డ్. వీరు మన రాష్ట్రంలో కోస్తా ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో గృహనిర్మాణ పథకాలను దశలవారీగా అమలుజరపడానికి ప్రయత్నిస్తున్నారు. అంతేకాకుండా వీరు వరంగల్, నిజామాబాద్ విశాఖ పట్టణం జిల్లాలలో కమర్షియల్ కాంప్లెక్స్‌లు నిర్మించే పథకాన్ని చేపట్టారు. హైదరాబాద్ నగరంలో ముఖరాంజాహి రోడ్ అభివృద్ధి పథకం కింద అనేక అంతస్తుల భవనాలు నిర్మిస్తున్నారు. ఇవి షాప్‌లకు, ఆఫీస్‌లకు బాగా పనికివస్తున్నాయి. ఇందుకోసం వీరికి కేంద్ర హౌసింగ్ అండ్ అర్బన్ డెవలెప్‌మెంట్ కార్పొరేషన్(HUDCO) వారినుంచి ఆర్థిక సహాయం లభిస్తోంది. లైఫ్ ఇన్‌సూరెన్స్ కార్పొరేషన్‌వారు కూడా ఆంధ్రప్రదేశ్ హౌసింగ్ బోర్డ్ వారికి గణనీయమైన ఆర్థిక సహాయం అందజేస్తున్నారు. హౌసింగ్ బోర్డ్ స్థాపన జరిగిననాటినుంచి 10 వేలకుపైగానే ఇళ్లు కట్టడం పనిచేపట్టారు. వీటిలోదాదాపు 9వేల ఇళ్లు జంటనగరాలలోనే ఉన్నాయి. అంతేకాకుండా గ్రామీణ ప్రాంతాలలో కూడా ఇళ్ళు కట్టే పథకాన్ని వీరు చేపట్టారు.

## హైదరాబాద్ అర్బన్ డెవలెప్‌మెంట్ అథారిటీ (HUDA)

జంటనగరాలలో రోడ్లు, గృహవసతి సౌకర్యాలు మెరుగుపరిచే ఉద్దేశంతో ఈ సంస్థను నెలకొల్పటం జరిగింది. వీరు అనేక బృహత్ ప్రణాళికలను చేపట్టారు. వీటిలో ముఖ్యంగా

పేర్కొనదగినది వనస్థలి పురంలో వీరు నిర్మిస్తున్న హౌసింగ్ కాంప్లెక్స్. ఇందులో కొన్ని ఇళ్ళు తయారయిపోయాయి. ఇళ్లుకట్టడమే కాకుండా ఆ ఇళ్ళలో ఉండేవారికి కావలసిన సకల అనుబంధ సౌకర్యాలు కూడా కల్పిస్తున్నారు. మంచినీటి సరఫరాయం, డ్రైనేజ్, ఆటస్థలాలు, మార్కెట్ కాంప్లెక్స్, పాఠశాలలు మొదలైనవన్నీ కూడా వారే ఏర్పాటు చేస్తున్నారు. ఇటు వంటి హౌసింగ్ కాంప్లెక్స్‌లు ఇంకా అనేకం జంటనగరాలలో చేపట్టాలని కూడావారు సంకల్పించారు. ఇంతేకాకుండా వీరు ఇళ్ళ స్థలాలు కూడా సమకూరుస్తున్నారు.

*పారిశ్రామిక కార్మికులకు గృహావసతి :* ఆంధ్రప్రదేశ్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషన్ వారు పారిశ్రామిక కార్మికుల కోసం దాదాపు 650 కోట్ల రూపాయల ఖర్చుతో 4 వేల పైనే ఇళ్లు నిర్మించడానికి 20 పథకాలు చేపట్టారు. వీటిలో దాదాపు 2,000 ఇళ్ళు ఆర్థికంగా బల హీనవర్గాలకు, దాదాపు 2,000 ఇళ్లు తక్కువ ఆదాయం గలవారికి, దాదాపు 500 ఇళ్లు మధ్య తరగతివారికి ఉద్దేశింపబడినాయి.

***పోలీస్ శాఖవారికి గృహావసతి :*** పోలీస్ సిబ్బందికి సర్కిల్ఇన్‌స్పెక్టర్ స్థాయివరకు అందరికీ అద్దెలేకుండా క్వార్టర్స్ ఇవ్వవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉంది. కాని వారిలో 32% కు మాత్రమే ఇప్పుడు క్వార్టర్స్ ఇచ్చారు. వీరికి ఇళ్ళు కట్టించడం కోసం ప్రత్యేకంగా ఆంధ్రప్రదేశ్ స్టేట్ పోలీస్ హౌసింగ్ కార్పొరేషన్ ఏర్పాటయింది. 250 మంది సర్కిల్ ఇన్‌స్పెక్టర్లకు, 920 మంది సబ్ ఇన్‌స్పెక్టర్లకు, 2,900 మంది హెడ్ కానిస్టేబుల్‌లకు, 17,500 మంది కానిస్టేబుల్‌లకు ఇంకా కార్పొరేషన్ కట్టించవలసి ఉంది.

*హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ :* హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ వారుకూడా దాదాపు 750 ఇళ్ళు కట్టించడానికి పథకాలు తయారు చేశారు. వీటిలో కొన్ని అప్పుడే పూర్తిఅయ్యాయి. వీరుముఖ్యంగా మురికివాడల నిర్మూలనకు కృషి చేస్తున్నారు.

విశాఖపట్టణం టౌన్ ప్లానింగ్ ట్రస్ట్ వారు కొన్ని ఇళ్లస్థలాలు కేటాయించారు. ఇటీవల విశాఖపట్టణం అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీని వ్యవస్థాపించారు. ఈ సంస్థకూడా గృహ నిర్మాణానికి కొన్ని పథకాలు చేపట్టింది.

## ఇతర గృహనిర్మాణపథకాలు

ఇవే కాకుండా రాష్ట్రప్రభుత్వం, కేంద్రప్రభుత్వం, ప్రభుత్వ రంగ సంస్థలు, బాంకులు మొదలైన సంస్థలు తమ ఉద్యోగులకు ఇళ్లు కట్టుకోవడానికి, స్థలాలు కొనుక్కోవడానికి ఋణాలు మంజూరు చేస్తున్నాయి. ఈ సదుపాయాన్ని వినియోగించుకొని చాలా మంది ఉద్యోగులు తమ స్వంత గృహాలు నిర్మించుకొంటున్నారు. లైఫ్ ఇన్‌స్యూరెన్స్ కార్పొరేషన్ వారు తమ పాలసీదారులకు గృహనిర్మాణంకోసం ఋణాలు మంజూరుచేస్తున్నారు. అంతే కాకుండా ఈ సంస్థవారు హైదరాబాదు, మరికొన్ని ముఖ్య నగరాలలో తామే గృహాలు నిర్మించి, పాలసీ దారులకు వాయిదాల పద్ధతిని చెల్లించే ప్రాతి పదిక మీద ఇస్తున్నారు. అట్లాగే స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియావారు కూడా తమ ఉద్యోగుల కోసం తామే కొన్ని ఇళ్ళు నిర్మించి, వాయిదాల పద్ధతిని చెల్లించే ప్రాతిపదికమీద ఇస్తున్నారు.

కొన్ని ప్రయివేట్ సంస్థలవారు అనేక-అంతస్తులున్న భవనాలు నిర్మించి వాటిలో ఫ్లాట్‌లు వాయిదాల పద్ధతిని అమ్ముతున్నారు. హైదరాబాద్ - సికిందరాబాద్ జంటనగరాలలో ఇటువంటి భవనాలు ఇటీవల చాలా వచ్చాయి. ఇంకా కొన్ని నిర్మాణంలో ఉన్నాయి. ఇవి నగరంలో కేంద్రస్థానాల వద్ద ఉండటమే కాకుండా అన్ని హంగులతో చాలా సౌకర్యంగా ఉంటున్నాయి.

## హౌసింగ్ అండ్ అర్బన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్(HUDCO)

ఇది కేంద్ర సంస్థ. వీరు దేశంలో వివిధ ప్రాంతాలలో గృహనిర్మాణ పథకాలకు ఆర్థిక సహాయం చేస్తున్నారు. గ్రామీణ ప్రాంతాలలోను, పట్టణ ప్రాంతాలలోను కూడా హడ్కో వారి సహాయంతో అనేక గృహనిర్మాణ పథకాలు అమలుజరుగుతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో హడ్‌కోవారు 1980 లో మంజూరు చేసిన పథకాల వివరాలు కింది పట్టికలో చూడవచ్చు.

గ్రామీణ గృహనిర్మాణ పథకాలు

| పథకాల సంఖ్య | మంజూరుచేసిన ఋణంమొత్తం | మంజూరుచేసిన నివాసాలసంఖ్య |
|---|---|---|
| 2 | 102.80 లక్షలు | 5,259 |

**హడ్‌కో పథకాలు**

| పథకాల సంఖ్య | వాటికిఅయ్యే ఖర్చు | మంజూరుచేసిన ఋణం | మంజూరుచేసిన నివాసాలసంఖ్య | మంజూరుచేసిన స్థలాల సంఖ్య |
|---|---|---|---|---|
| 104 | 5851.45 లక్షలు | 4091.71 లక్షలు | 43,901 | 23 |

## రాష్ట్రప్రభుత్వ లక్ష్యాలు

గృహవసతి కార్యక్రమాలకు సంబంధించినంత వరకు రాష్ట్రప్రభుత్వం మౌలికలక్ష్యాలు కింది విధంగా పేర్కొనవచ్చు.

1. గ్రామీణ ప్రాంతాలలో ప్రత్యేకించి షెడ్యూల్డ్‌కులాలు, తెగలవారికి ఇళ్ళస్థలాలు, ఇళ్ళు సమకూర్చడం
2. గ్రామీణ ప్రాంతాలలో కొన్ని ఎంపిక చేసిన గ్రామాలలో ఒక ప్రణాళిక ప్రాతిపదికగా పైలట్ ప్రాజక్ట్ కింద గృహవసతి సౌకర్యాలు కల్పించడం
3. పట్టణ ప్రాంతాలలో మురికివాడల నిర్మూలనకు కొంతకృషి చేయటం
4. పారిశ్రామిక కార్మికులకు, మధ్యతరగతి, తక్కువ ఆదాయం గలవారికి హగృవసతి కల్పించడం.

ఈ లక్ష్యాలను సాధించడానికి ఉద్దేశించిన పథకాలను మన రాష్ట్రంలో అనేక శాఖల వారు అమలు పరుస్తున్నారు. వాటిలో ముఖ్యమైనవి : 1. సహకార సంఘాల రిజిష్ట్రార్; 2. మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ డైరక్టర్; 3. ఆంధ్రప్రదేశ్ హౌసింగ్ బోర్డ్; 4. టౌన్ ప్లానింగ్ డైరక్టర్; 5. లేబర్ కమీషనర్; 6. హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్.

వివిధ గృహనిర్మాణ కార్యక్రమాల కింద మూడో పంచవర్ష ప్రణాళికా కాలంలో మొత్తం 250 లక్షలరూపాయలు ఖర్చు చేశారు. నాలుగో పంచవర్ష ప్రణాళికలో 740లక్షల రూపాయలు ఖర్చయినాయి. ఇదే విధంగా గృహ నిర్మాణ కార్యక్రమాలకు వెచ్చించే మొత్తం అంతకంతకు ఎక్కువవుతోంది.

***ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర షెడ్యూల్డ్ కులాల, తెగల సహకార గృహనిర్మాణ సంఘాల ఫెడరేషన్ :*** ఈ సంస్థను 1971 లో రిజిష్టర్ చేసారు. దీనికి షెడ్యూల్డ్ కులాల, తెగల జిల్లాస్థాయి గృహనిర్మాణ సంఘాలు అనుబంధంగా ఉంటాయి. ఈ సంస్థకు రాష్ట్ర ప్రభుత్వం నాలుగో ప్రణాళికా కాలంలో 133.75 లక్షల రూపాయలు విడుదల చేసింది. లైఫ్ ఇన్‌సూరెన్స్ కార్పొరేషన్ వారు ఈ ఫెడరేషన్‌కు 10 కోట్ల రూపాయలు ఋణం మంజూరు చేశారు. ఈ పథకం కింద సభ్యులకు తక్కువ ఖర్చుతో ఇళ్లు కట్టించి ఇస్తారు.

***మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ డైరక్టర్ :*** మునిసిపల్ పట్టణాలలో మురికివాడలను నిర్మూలించడానికి, అక్కడి పరిస్థితులను మెరుగు పరచడానికి మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ డైరక్టర్ ఒక పథకాన్ని చేపట్టారు. అభివృద్ధిచేసిన ప్లాట్‌లు ఇవ్వటం, తక్కువ ఖర్చుతో ఇళ్ళుకట్టడం మొదలైన కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

***లేబర్ కమీషనర్ :*** పారిశ్రామిక కార్మికులకు గృహవసతి కల్పించడం కోసం ఒక పథకాన్ని దశలవారీగా చేపట్టారు. ఈ పథకం కింద గృహనిర్మాణానికి అయ్యే ఖర్చులోసగం ప్రభుత్వం ఋణాల రూపంలోను, 25% సబ్సిడీ రూపంలోను ఇస్తుంది. మిగిలిన 25% యజమానులు భరించాలి. పారిశ్రామిక కార్మికుల సహకార గృహనిర్మాణ సంఘాల విషయంలో ప్రభుత్వం 90% వరకు ధనసహాయం చేస్తుంది. ఇందులో 65% సబ్సిడీరూపంలో ఉంటుంది. ఈ పథకం కింద గుంటూరు, సిర్‌పూర్ కాగజ్‌నగర్, బసంత్‌నగర్ (కరీంనగర్‌జిల్లా), చెల్లూరు (పశ్చిమగోదావరిజిల్లా), సిమెంట్‌నగర్ (కర్నూల్‌జిల్లా), గుంటకల్, మొదలైనచోట్ల గృహనిర్మాణం జరిగింది.

***టౌన్‌ప్లానింగ్ డైరక్టర్ :*** మనరాష్ట్రంలో పంచాయతీ సమితుల ద్వారా టౌన్‌ప్లానింగ్ డైరక్టర్ గ్రామీణ గృహనిర్మాణ పథకాన్ని అమలు పరిచారు. వీరు కొన్ని ఇళ్లస్థలాలు పంచారు. రోడ్లు వేశారు.

***కేంద్రప్రభుత్వ ఆధ్వర్యంలోని పథకాలు :*** మునిసిపాలిటీలలో పనిచేసే రోడ్లుఊడిచే వారికి, పాకీపనివారికి,వారి నివాసపరిస్థితులను మెరుపగురచడానికి భారతప్రభుత్వం 1961-62 లో ఒక పథకాన్ని ప్రవేశపెట్టింది. మనరాష్ట్రంలో కూడా ఈ పథకాన్ని కొన్ని ఎంపికచేసిన మునిసిపాలిటీలలో ప్రవేశపెట్టారు. ఈ పథకం కింద ఊడిచేవారికి, పాకీవారికి ఇళ్ళు కట్టించడం కోసం మునిసిపాలిటీలకు సబ్సిడీ రూపంలో ధనసహాయం చేస్తారు.

*సహకార రంగంలో గృహనిర్మాణ పథకాలు :* సహకార రంగంలో తక్కువ ఆదాయం కలవారికి, మధ్యతరగతి వారికి రెండు పథకాలున్నాయి. సహకార గృహనిర్మాణ సంఘాల సభ్యులకు ఈ రెండు పథకాల కింద ఋణాలు ఇస్తారు. సాలుసరి ఆదాయం రూ. 7,200 మించనివారు తక్కువ ఆదాయం తరగతి కిందికి వస్తారు. వీరికిచ్చే ఋణం గరిష్ఠ పరిమితి రూ. 12,500. సాలుసరి ఆదాయం రూ. 7,201—రూ.18,000 మధ్యనున్న వారు మధ్యతరగతికి చెందుతారు. వీరికిచ్చే ఋణం గరిష్ఠ పరిమితి రూ 25,000 ఈ మొత్తం వాయిదాల పద్ధతిలో తీర్చాలి.

*ఆంధ్రప్రదేశ్ సహకార గృహనిర్మాణ సంఘాల ఫెడరేషన్ హైదరాబాదు :* దీనికి అనుబంధంగా 700 కు పైగా సహకార గృహనిర్మాణ సంఘాలు ఉన్నాయి. సహకార గృహ నిర్మాణ సంఘాల సభ్యులకిచ్చే ఋణాలన్నీ ఈ ఫెడరేషన్ ద్వారానే ఇవ్వాలని ప్రభుత్వం ఆదేశించింది. ఈ ఫెడరేషన్‌వారు లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ నుంచి ఋణాల రూపంలో ధనసహాయం పొందుతారు. ప్రభుత్వం వారు వాటా మూలధనం కూడా ఈ ఫెడరేషన్‌కు సమకూర్చారు. మనరాష్ట్రంలో వెయ్యికిపైగా ప్రైమరీ సహకార గృహనిర్మాణ సంఘాలున్నాయి.

*మనరాష్ట్రంలో గృహవసతి సౌకర్యాల సర్వేక్షణ :* రాష్ట్రప్రభుత్వం వారు కూడా లోగడ ఇటువంటి సర్వేక్షణలు జరిపించారు. వీటివల్ల తేలిందేమంటే మనరాష్ట్రంలో జనాభా పెరిగినంత వేగంగా గృహవసతి సౌకర్యాలు పెరగడంలేదు. ఉన్న ఇళ్లలో కూడా కచ్చా ఇళ్ళే ఎక్కువశాతం ఉన్నాయి. సగానికన్న ఎక్కువఇళ్లు ఒక్కగది ఉన్నవి. దాదాపు 10% ఇళ్లకి ఒక్కగదికూడా లేదు. అంటే వంట, భోజనాలు, పడక అన్నీ ఒక గదిలోనే జరుపుకోవాలన్నమాట. తరవాత ఇళ్లకున్న సదుపాయాలు చూస్తే పరిస్థితి ఇంకా అధ్వాన్నంగాఉంది. అధిక సంఖ్యాకమైన ఇళ్లకు మరుగుదొడ్లులేవు. విద్యుచ్ఛక్తిలేదు. మంచినీటి సదుపాయం ఉండదు. ఇతర రాష్ట్రాలతో పోలిస్తే మనరాష్ట్రంలో గృహవసతి పరిస్థితులు చాలా విచారకరంగా ఉన్నాయని చెప్పకతప్పదు.

# 24

# బాంకింగ్

మన దేశంలో బ్యాంకులకు ఎన్నో సంవత్సరాల చరిత్ర ఉన్నప్పటికీ, ఎన్నో దశాబ్దాలుగా అని వర్తక, వాణిజ్య, వ్యాపార పరిశ్రమలకు తోడ్పడుతున్నప్పటికి 1969 జులై 14వ తేదీని మనదేశ బ్యాంకింగ్ చరిత్రలో సువర్ణ ఘట్టంగా పేర్కొనవచ్చు. ఆ రోజున దేశంలో గల 14 పెద్ద బ్యాంకులను జాతీయం చేయడం జరిగింది. ఆ జాతీయీకరణ బ్యాంకింగ్ వ్యవస్థ రూపురేఖల్ని విప్లవాత్మకంగా మార్చివేసింది. అంతకుముందు బాంకింగ్ సేవలు, కార్యకలాపాలు, లావాదేవీలు అన్నీ పట్టణాలకే పరిమితమై ఉండేవి. ద్రవ్యావసరాలకోసం ప్రజలే బ్యాంకుల దగ్గరకు వెళ్ళేవారు. కాని బ్యాంకుల జాతీయీకరణతో బాంకింగు వ్యవస్థను ప్రణాళికా బద్ధమైన దేశాభివృద్ధి పరిధిలోకి తీసుకురావడం జరిగింది. బ్యాంకింగ్ పరిశ్రమను జాతీయాభి వృద్ధి లక్ష్యాల, ఆదర్శాలమేరకు మలుచుకోవడమైంది. బ్యాంకుల జాతీయీకరణ తరవాత బ్యాంకు ఆఫీసులే ప్రజల దగ్గరకు వస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాలలో విరివిగా బ్యాంకు బ్రాంచీలను తెరవడం నిద్రాణంగా పడిఉన్న సొమ్మును డిపాజిట్ల రూపంలో సమీకరించడం, గ్రామీణులకు వ్యవసాయ కార్యకలాపాలకు, పనిముట్లు కొనుక్కోవడానికి, పశుసంపద పెంచుకోవడానికి, చేతివృత్తుల వారికి, ఆర్థికంగా వెనుకబడినవారికి, బలహీనవర్గాలవారికి, షెడ్యూల్డ్ కులాల, తెగలవారికి రకరకాలయిన అవసరాల నిమిత్తం బ్యాంకులు ఆర్థిక సహాయాన్ని అనేక రకాలుగా అందిస్తున్నాయి. దేశంలో పలుచోట్ల ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులను కూడ ప్రత్యేకంగా రైతులకు గ్రామీణ ఆర్థిక వ్యవస్థకు తోడ్పడేందుకు తెరవడం జరిగింది. 20 అంశాల ఆర్థిక కార్యక్రమాన్ని జయప్రదంగా అమలుపరచడంలో జాతీయంచేసిన బ్యాంకులు ఎన్నో విధాలుగా తోడ్పడుతున్నాయి. మనదేశంలో దాదాపు 93 శాతం బ్యాంకింగ్ వ్యవస్థ ప్రభుత్వ రంగం కిందే ఉన్నది. 1980 ఏప్రియల్‌లో మరో ఆరు బ్యాంకులు జాతీయం చేశారు. కొత్తగా జాతీయంచేసిన బ్యాంకులలో ఆంధ్రాబ్యాంకు కూడాఉంది. దేశంలోని పైనవివరించిన బాంకింగ్ వ్యవస్థలోని పరిణామాలు, ఫలితాలు ఆంధ్రప్రదేశ్‌కు కూడావర్తిస్తాయని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

1956 నాటినుంచి 1980 నాటికి మనరాష్ట్రంలో జరిగిన బ్యాంకింగ్ అభివృద్ధిని, పెరిగిన బ్యాంకు ఆఫీసులను, హెచ్చు అయిన బ్యాంకు డిపాజిట్లను, బ్యాంకులు ఇచ్చే ఋణాలను, అడ్వాన్సులను, ప్రజలలో పెరిగిన బ్యాంకింగ్ అలవాటును, విస్తరించబడిన బ్యాంకింగ్ సౌకర్యాలను పరిశీలిస్తే గణనీయమైన అభివృద్ధి గోచరిస్తుంది.

1980 జనవరి నాటికి ఆంధ్రప్రదేశ్‌లో 2,433 బ్యాంకు బ్రాంచీలు ఉన్నట్లు తెలుస్తోంది. అయితే జులై 1969 నాటికి మనరాష్ట్రంలో 571 బ్యాంకు బ్రాంచీలు మాత్రమే ఉన్నాయి. ఇప్పుడున్న 2,433 బ్యాంకు బ్రాంచీలలో 1820 బ్రాంచీలు గ్రామీణ ప్రాంతాలలోను, చిన్నచిన్న నగరాలలోను ఉన్నాయి.

1969 జులైలో ఒక్కొక్క బ్యాంకు ఆఫీసు 75,000 మంది ప్రజలకు సేవలందించింది. ఇప్పుడు ఒక్కొక్క బ్యాంకు ఆఫీసు 18,000 మందికి సేవలందిస్తున్నది. గ్రామీణ, చిన్నచిన్న నగరాలలో ఒక్కొక్కరు బ్యాంకు ఆఫీసు 23,000 మంది జనాభాకు సేవలందిస్తున్నది.

## బ్యాంకు బ్రాంచీలు

మనరాష్ట్రంలో గ్రామీణ ప్రాంతాలలో 1188 బ్యాంకు బ్రాంచీలు ఉన్నాయి. చిన్నచిన్న నగరాలలో (**Semi Urban areas**) 632 బ్రాంచీలున్నాయి. పట్టణాలలో 246 బ్రాంచీలు ఉన్నాయి. మెట్రోపాలిటన్ ఓడరేవు పట్టణాలలో 367 బ్రాంచీలున్నాయి. మొత్తంగల 2,433 బ్యాంకు బ్రాంచీలలో 1,186 కోస్తాజిల్లాలలోను, 915 (హైదరాబాదులో ఉన్న 300 బ్రాంచీలతో సహా) తెలంగాణా ప్రాంతంలో ఉన్నాయి. రాయలసీమ ప్రాతంలో 412 బ్యాంకు బ్రాంచీలున్నాయి. ఒక్కొక్కజిల్లా సగటువారీచూస్తే కోస్తా అంధ్రలో 123, రాయలసీమలో 103, తెలంగాణాలో 91 ఉన్నాయి. గ్రామీణ ప్రాంతాలవారీగాచూస్తే సగటున కోస్తాజిల్లాకు ఒక్కొక్క జిల్లాకు 61 బ్రాంచీలు, రాయలసీమ జిల్లాలలో ఒక్కొక్క జిల్లాకు 56బ్రాంచీలు తెలంగాణా జిల్లాలో ఒక్కొక్క జిల్లాకు 41 బ్రాంచీలు ఉన్నట్లు తెలుస్తున్నది.

వివిధ జిల్లాలలోగల బ్యాంకు ఆఫీసులను ఆ బ్యాంకు ఆఫీసులు సేవలందించే జనాభా వివరాలను కింద యివ్వడమైంది.

**ఆఫీసులసంఖ్య** (జనవరి 1, 1980 నాటికి)

| జిల్లా | గ్రామీణ | చిన్న నగరాలు | పట్టణాలు | మెట్రోపాలిటన్ పట్టణాలు | మొత్తం | ఒక్కొక్క ఆఫీసుకు సగటు జనాభా (వేలల్లో) |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| ఆదిలాబాదు | 27 | 16 | .... | .... | 43 | 30 |
| అనంతపూరు | 49 | 47 | .... | ... | 96 | 22 |
| చిత్తూరు | 61 | 50 | .... | .... | 111 | 29 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| కడప | 56 | 29 | .... | .... | 85 | 19 |
| తూర్పుగోదావరి | 80 | 41 | 25 | 28 | 174 | 16 |
| గుంటూరు | 77 | 40 | 50 | .... | 167 | 17 |
| హైదరాబాదు | 8 | 4 | .... | 288 | 300 | 6 |
| కరీంనగర్ | 41 | 33 | .... | .... | 74 | 27 |
| ఖమ్మం | 67 | 25 | .... | .... | 92 | 15 |
| కృష్ణా | 75 | 31 | 74 | .... | 180 | 14 |
| కర్నూలు | 60 | 41 | 19 | ... | 120 | 17 |
| మహబూబ్‌నగర్ | 50 | 23 | .... | ... | 73 | 26 |
| మెదక్ | 30 | 17 | .... | .... | 47 | 31 |
| నల్గొండ | 69 | 25 | .... | .. . | 94 | 19 |
| నెల్లూరు | 44 | 19 | 22 | .... | 85 | 19 |
| నిజామాబాదు | 41 | 13 | 16 | .... | 70 | 19 |
| ప్రకాశం | 62 | 36 | .... | .... | 98 | 20 |
| రంగారెడ్డి | 33 | 10 | .... | .... | 43 | 24 |
| శ్రీకాకుళం | 49 | 19 | .... | .... | 68 | 23 |
| విశాఖపట్నం | 56 | 23 | .... | 51 | 130 | 17 |
| విజయనగరం | 35 | 27 | .... | .... | 62 | 28 |
| వరంగల్లు | 46 | 10 | 23 | .... | 79 | 24 |
| పశ్చిమగోదావరి | 72 | 53 | 17 | .... | 142 | 17 |
| మొత్తం | 1,188 | 632 | 246 | 367 | 2,433 | 18 |

మూలం : జాతీయం చేయబడిన బాంకుల ప్రాంతీయ సలహాసంఘం 6 వ సమావేశం. ఎకనామిక్ ఎఫైర్స్ దక్షిణమండలం (బాంకింగు విభాగం) భారత ప్రభుత్వం ఆర్థికశాఖ.

మనరాష్ట్రంలో బాంకులవారీగా ఆఫీసుల విస్తరణ ఇట్లా ఉంది.

| బ్యాంకు | ఆఫీసుల సంఖ్య |
|---|---|
| స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా | 525 |
| స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ | 254 |
| అలహాబాద్ బ్యాంక్ | 13 |
| బ్యాంక్ ఆఫ్ బరోడా | 31 |
| బ్యాంక్ ఆఫ్ ఇండియా | 32 |
| బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర | 16 |
| కెనరా బ్యాంక్ | 84 |
| సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా | 61 |
| దేనా బ్యాంకు | 14 |
| ఇండియన్ బ్యాంక్ | 106 |
| ఆంధ్రా బ్యాంక్ | 452 |
| ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్ | 65 |
| పంజాబ్ నేషనల్ బ్యాంక్ | 18 |
| సిండికేట్ బ్యాంక్ | 165 |
| యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా | 73 |
| యునైటెడ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా | 3 |
| యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్ | 24 |
| ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు | 250 |
| మిగతా బ్యాంకులు | 247 |

***డిపాజిట్ల సమీకరణ :*** బ్యాంకుల జాతీయీకరణ తర్వాత డిపాజిట్ల సమీకరణ దేశంలో గణనీయంగా పెరిగింది. అదే విధంగా ఆంధ్రప్రదేశ్‌లో కూడా హెచ్చుగా బ్యాంకు ఆఫీసులు తెరవడంవల్ల డిపాజిట్ల సమీకరణ చెప్పుకోదగినంతగా జరిగింది. 1969 లో ఆంధ్రప్రదేశ్‌లో బ్యాంకుల డిపాజిట్లు మొత్తం రూ. 173.05 కోట్లు ఉండగా, 1980 జనవరి నాటికి రూ. 1,145 కోట్లు అయింది. దీనిని బట్టి ప్రజలలో బ్యాంకింగ్ అలవాటు రానురాను పెరుగు తున్నట్లు గ్రహించవచ్చు.

ఈమధ్యకాలంలో ప్రభుత్వరంగ బ్యాంకుల డిపాజిట్ల సేకరణ ఇట్లా ఉంది :

| సంవత్సరం | డిపాజిట్లు ( కోట్ల రూపాయలలో ) |
|---|---|
| జూన్ 1976 | 704.90 |
| ,, 1977 | 895.92 |
| ,, 1978 | 1021.44 |
| డిసెంబరు 1979 | 1,145 |

**అడ్వాన్సులు :** వివిధ అవసరాల నిమిత్తం వివిధ రకాల ప్రజలకు అంటే వ్యవసాయ దార్లు, పారిశ్రామికవేత్తలు, స్వయం ఉపాధికల్పన ద్వారా జీవించేవారు, చేతి వృత్తులవారు, బలహీన వర్గాలవారు మొదలైన ఎంతో మందికి బ్యాంకులు ఆర్థికసహాయాన్ని కలిగిస్తున్నాయి. పరపతి విస్తరణలో 1969 తర్వాత బ్యాంకులు ఎంతో ముందంజ వేశాయని చెప్పవచ్చు. 1969 లో ఆంధ్రప్రదేశ్‌లో వివిధ వర్గాల వారికి రూ.163.02 కోట్ల రూపాయలను బ్యాంకులు అడ్వాన్సులు, ఋణాలు అందించగా 1979 డిసెంబరు 3 నాటికి రూ.882కోట్లు అందజేయడం జరిగింది.

ఈమధ్యకాలంలో ప్రభుత్వ రంగ బ్యాంకులు ఇచ్చిన అడ్వాన్సుల మొత్తాల వివరాలు

| సంవత్సరం | అడ్వాన్సులు (కోట్లలో) |
|---|---|
| జూన్ 1976 | 505.54 |
| ,, 1977 | 597.03 |
| ,, 1978 | 777.03 |
| డిసెంబరు 1979 | 882 |

బ్యాంకులు వ్యవసాయం, పరిశ్రమలు, స్వయంఉపాధికల్పన మొదలైన ప్రధాన రంగాలకు అడ్వాన్సులు ఇస్తూ ఉంటాయి. 1979 లో వివిధ రంగాలకు ప్రభుత్వ రంగ బ్యాంకులు రూ. 882 కోట్లు మంజూరుచేశాయి. అందులో ఇంకా చెల్లించవలసిన మొత్తం రూ. 431.59 కోట్లు. వాటి వివరాలు.

| *రంగం :* | మొత్తం (కోట్ల రూ॥లలో) |
|---|---|
| వ్యవసాయం | 266.85 |
| ఖాతాలసంఖ్య | 9,24,682 |
| చిల్లర వర్తకం - చిన్న వ్యాపారాలు | 30.13 |
| ఖాతాలసంఖ్య | 1,75,617 |
| వృత్తి, స్వయం ఉపాధికల్పన | 9.47 |

| | |
|---|---|
| ఖాతాలసంఖ్య | 5,0034 |
| విద్య | 0.53 |
| ఖాతాలసంఖ్య | 2,608 |
| చిన్నతరహా పరిశ్రమలు | 112.28 |
| ఖాతాలసంఖ్య | 5,42,529 |
| రోడ్డు, నీటి రవాణా ఆపరేటర్లు | 12.33 |
| ఖాతాలసంఖ్య | 16,558 |
| మొత్తం | 431.59 |
| మొత్తం ఖాతాలసంఖ్య | 11,63,753 |

## భేదాత్మక వడ్డీ రేటు పథకం

బలహీన వర్గాలకు ఆర్థిక సహాయాన్ని ప్రత్యేకంగా చేసే ఉద్దేశంతో ఈ పథకాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. ఈ పథకం ప్రకారం ఒక ప్రత్యేకమైన ఆదాయపరిమితి, భూ పరిమితికి లోబడిన వారందరికి తగ్గించిన 4 శాతం వడ్డీరేటుపై ఉత్పత్తి కార్యక్రమాలకు ఆర్థిక సహాయం చేయడం జరుగుతుంది. ఈ పథకం మన రాష్ట్రంలో దాదాపు అన్ని జిల్లాలలో అమలులో ఉంది. మొదట్లో ఈ పథకం కింద ఒక ఎకరం మాగాణి, 2.5 ఎకరాల్లో మెట్టభూమికిలోపు భూ వసతి గలవారికి ఋణాలివ్వడానికి నిర్ణయమైంది. ఆ తర్వాత షెడ్యూల్డ్ కులాలు, తెగలవారి కోసం భూ పరిమితి షరతును తొలగించడం జరిగింది. ఈ పథకం కింద ప్రభుత్వరంగ బ్యాంకులు 1979 జూన్ నాటికి 1459 బ్రాంచీలలో 1,43,317 ఖాతాలద్వారా రూ. 8,68,00,000 ను అడ్వాన్సులుగా ఇవ్వడంజరిగింది. అందులో షెడ్యూల్డ్ కులాలు, తెగలవారికి 46.7 శాతం మేరకు ఆర్థిక సహాయాన్ని అందించడం జరిగింది.

## మార్జిన్ ద్రవ్యపథకం

ఈ పథకం కింద రాష్ట్ర ప్రభుత్వాలకు చిన్న నగరాల, గ్రామీణ ప్రాంతాలలో చిన్న తరహా పరిశ్రమ అభివృద్ధికి మార్జిన్ ద్రవ్య సహాయాన్ని బ్యాంకులు కల్పించడం జరుగుతోంది. 1979 జూన్‌కి మన రాష్ట్రంలో ఈపథకంకింద 1,772 దరఖాస్తులను స్వీకరించడం జరిగింది. అందులో 1,661 దరఖాస్తులను మంజూరు చేయడమైంది. 77 అప్లికేషన్లు పెండింగులో ఉన్నాయి. ఈ పథకం కింద చెల్లించవలసిన మొత్తం రూ. 90.62 లక్షలు.

## వ్యవసాయక అభివృద్ధి బ్రాంచీలు

## (Agricultural Development Branches)

ఇట్లాంటి బ్రాంచీలు డిసెంబరు 1979 నాటికి మన రాష్ట్రంలో 72 ఉన్నాయి. వీటిని స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా గ్రూప్ వారు నెలకొల్పారు. ఈ బ్రాంచీల ద్వారా

2,43,787 మంది వ్యవసాయ దారులకు రూ. 49.73 కోట్ల మేరకు ఆర్థిక సహాయాన్ని అందించడం జరిగింది. ప్రభుత్వరంగ బ్యాంకులు వ్యవసాయ, గ్రామీణాభివృద్ధికి ఎన్నో విధాలుగా తోడ్పడుతున్నాయి. జూన్ 1979నాటికి ప్రభుత్వరంగ బ్యాంకులు ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యక్ష, పరోక్ష ఆర్థిక సహాయం ద్వారా వ్యవసాయ రంగానికి 245.24 కోట్ల రూపాయలను అందించడం జరిగింది. మన రాష్ట్రంలోని వాణిజ్య బ్యాంకులు జూన్ 1971 నాటికి 7,283 గ్రామాలను దత్తతగా స్వీకరించి ప్రత్యేకఆర్థిక సౌకర్యాలను కల్పించడంజరిగింది.

## ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు

మనరాష్ట్రంలో నాలుగు గ్రామీణ బ్యాంకులు ఉన్నాయి. 1976 లో స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా నాగార్జునా గ్రామీణ బ్యాంకు (ఖమ్మం)ను, శ్రీ విశాఖ గ్రామీణ బ్యాంకు(శ్రీకాకుళం) స్థాపించింది. సిండికేట్ బ్యాంకువారు రాయలసీమ గ్రామీణబ్యాంకును 1976 లో కడప లోను, అనంత గ్రామీణ బ్యాంకును 1979లో అనంతపూరులోను స్థాపించడంజరిగింది. నాగార్జున,విశాఖ, రాయలసీమ గ్రామీణ బ్యాంకులు మనరాష్ట్రంలో ఏడుజిల్లాలకు 245బ్రాంచీల ద్వారా సేవలందిస్తున్నాయి. ఈ బ్రాంచీలు 1979 నాటికి రూ. 13.4 కోట్లమేరకు 3,85,487 ఖాతాలద్వారా డిపాజిట్లను సేకరించినాయి. 3,33,583 ఖాతాలకు రూ. 47.85 కోట్లమేరకు అడ్వాన్సులిచ్చినాయి. ఈ అడ్వాన్సులలో 65 శాతం చిన్న, ఉపాంత వ్యవసాయదారులకు, భూమిలేని వ్యవసాయ కార్మికులకు ఇవ్వడం జరిగింది.

ఆంధ్రప్రదేశ్‌లోని వాణిజ్య బ్యాంకులు జనవరి 1, 1980 నాటికి వేరువేరు పథకాలకు రకరకాల ప్రయోజనాల నిమిత్తం కింది విధంగా ఆర్థికసహాయాన్ని అందించడం జరిగింది.

| ప్రయోజనం | పథకాలసంఖ్య | ఆర్థిక సహాయం (రూ॥లక్షలలో) |
|---|---|---|
| చిన్నతరహా నీటిపారుదల | 149 | 2029.65 |
| భూమి అభివృద్ధి | 18 | 711.54 |
| వ్యవసాయ యాంత్రికీకరణ | 53 | 873.74 |
| తోటల పెంపకం | 22 | 201.77 |
| పాడిపరిశ్రమాభివృద్ధి | 115 | 856.84 |
| కోళ్లపెంపకం | 111 | 581.84 |
| మత్స్యపరిశ్రమ | 43 | 387.46 |
| గొర్రెలపెంపకం | 85 | 388.20 |
| మార్కెట్‌యార్డులు, గిడ్డంగులు | 52 | 643.12 |
| అటవీకరణ | 8 | 392.25 |

| | | |
|---|---|---|
| గోబర్ గ్యాస్ | 1 | 3.41 |
| గ్రామీణ విద్యుదీకరణ | 31 | 882.64 |
| మొత్తం | 688 | 7953.48 |

మూలం : ఆర్థిక మంత్రిత్వశాఖ, కేంద్రప్రభుత్వం

బ్యాంకుల జాతీయీకరణ తరవాత ప్రధానమంత్రి 20 అంశాల ఆర్థిక కార్యక్రమానికి చేదోడుగా బ్యాంకింగు పరిశ్రమ అభివృద్ధి చెందుతున్నది. గ్రామీణ ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధి చేయడానికి, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పటిష్ఠంచేయడానికి ప్రభుత్వరంగ బ్యాంకులు ఎన్నో రకాలుగా ఆర్థిక సహాయం చేస్తున్నాయి. ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి అన్నట్లు "కోట్లాది ప్రజల జీవితాలను బ్యాంకింగు సంస్థలు ప్రభావితం చేస్తాయి. జాతీయ లక్ష్యాల సాధనలో, గ్రామీణాభ్యుదయంలో, పారిశ్రామికీకరణలో బ్యాంకులు నిర్వహించే పాత్ర ఎంతో ఉంది." మనరాష్ట్రంలో కూడా ప్రభుత్వరంగ బ్యాంకులు ఇతర వాణిజ్య బ్యాంకులు వ్యవసాయరంగానికి, చిన్నతరహా పరిశ్రమలకు, కుటీరపరిశ్రమలకు, బలహీన వర్గాలకు,ఎన్నో రకాలుగా ఆర్థికసహాయాన్ని సమకూరుస్తున్నాయి.

# 25

# వర్తక, వాణిజ్య, వ్యాపారాలు

దేశ ఆర్థిక వ్యవస్థలో వలెనే రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో కూడా వర్తక, వాణిజ్య, వ్యాపారాలు ప్రముఖ పాత్ర నిర్వహిస్తాయి. రాష్ట్రానికి సంబంధించినంతవరకు ఇతరరాష్ట్రాలతోను, విదేశాలతోను వాణిజ్య వ్యాపారాల ద్వారా ఆర్థికాభివృద్ధి సాగుతుంటుంది. 1970 నుంచీ ఈ రంగాలలో అభివృద్ధి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఉదాహరణకు 1955-56 లో మొత్తం 587 కంపెనీ లుండేవి. 1969-70 దాకా ఈ సంఖ్యలో పెద్దగా మార్పు, అంటే పెరుగుదల కనిపించదు. కాని 1970 నుంచీ క్రమంగా పెరుగుతూ వస్తున్నది. 1978 మార్చి నాటికి వీటి సంఖ్య 1,529. వీటి వివరాలను దిగువపట్టికలో చూడవచ్చు.

**ఆంధ్రప్రదేశ్‌లోని జాయింట్‌స్టాక్ కంపెనీల వివరాలు**

రూ. లక్షలలో

| | | పబ్లిక్ కంపెనీలు | | ప్రైవేట్ కంపెనీలు | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|
| వ.సం. | సంవత్సరం | కంపెనీల సంఖ్య | చెల్లించిన పెట్టుబడులు | కంపెనీల సంఖ్య | చెల్లించిన పెట్టుబడులు | కంపెనీల సంఖ్య | చెల్లించిన పెట్టుబడులు |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1. | 1955-56 | 210 | 1,805 | 377 | 270 | 587 | 2,076 |
| 2. | 1960-61 | 150 | 2,124 | 296 | 332 | 446 | 2,456 |
| 3. | 1965-66 | 155 | 4,110 | 379 | 842 | 534 | 4,952 |
| 4. | 1970-71 | 160 | 6,080 | 583 | 2,380 | 743 | 8,460 |
| 5. | 1973-74 | 181 | 6,890 | 813 | 12,770 | 994 | 19,660 |

| | | |
|---|---|---|
| గోబర్ గ్యాస్ | 1 | 3.41 |
| గ్రామీణ విద్యుదీకరణ | 31 | 882.64 |
| మొత్తం | 688 | 7953.48 |

మూలం : ఆర్థిక మంత్రిత్వశాఖ, కేంద్రప్రభుత్వం

బ్యాంకుల జాతీయీకరణ తరవాత ప్రధానమంత్రి 20 అంశాల ఆర్థిక కార్యక్రమానికి చేదోడుగా బ్యాంకింగు పరిశ్రమ అభివృద్ధి చెందుతున్నది. గ్రామీణ ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధి చేయడానికి, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పటిష్ఠంచేయడానికి ప్రభుత్వరంగ బ్యాంకులు ఎన్నో రకాలుగా ఆర్థిక సహాయం చేస్తున్నాయి. ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి అన్నట్లు "కోట్లాది ప్రజల జీవితాలను బ్యాంకింగు సంస్థలు ప్రభావితం చేస్తాయి. జాతీయ లక్ష్యాల సాధనలో, గ్రామీణాభ్యుదయంలో, పారిశ్రామికీకరణలో బ్యాంకులు నిర్వహించే పాత్ర ఎంతో ఉంది." మనరాష్ట్రంలో కూడా ప్రభుత్వరంగ బ్యాంకులు ఇతర వాణిజ్య బ్యాంకులు వ్యవసాయరంగానికి, చిన్నతరహా పరిశ్రమలకు, కుటీరపరిశ్రమలకు, బలహీన వర్గాలకు,ఎన్నో రకాలుగా ఆర్థికసహాయాన్ని సమకూరుస్తున్నాయి.

# 25

# వర్తక, వాణిజ్య, వ్యాపారాలు

దేశ ఆర్థిక వ్యవస్థలో వలెనే రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో కూడా వర్తక, వాణిజ్య, వ్యాపారాలు ప్రముఖ పాత్ర నిర్వహిస్తాయి. రాష్ట్రానికి సంబంధించినంతవరకు ఇతరరాష్ట్రాలతోను, విదేశాలతోను వాణిజ్య వ్యాపారాల ద్వారా ఆర్థికాభివృద్ధి సాగుతుంటుంది. 1970 నుంచి ఈ రంగాలలో అభివృద్ధి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఉదాహరణకు 1955-56 లో మొత్తం 587 కంపెనీ లుండేవి. 1969-70 దాకా ఈ సంఖ్యలో పెద్దగా మార్పు, అంతే పెరుగుదల కనిపించదు. కాని 1970 నుంచీ క్రమంగా పెరుగుతూ వస్తున్నది. 1978 మార్చి నాటికి వీటి సంఖ్య 1,529. వీటి వివరాలను దిగువపట్టికలో చూడవచ్చు.

**ఆంధ్రప్రదేశ్‌లోని జాయింట్ స్టాక్ కంపెనీల వివరాలు**

రూ. లక్షలలో

| | | పబ్లిక్ కంపెనీలు | | ప్రైవేట్ కంపెనీలు | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|
| క్ర.సం. | సంవత్సరం | కంపెనీల సంఖ్య | చెల్లించిన మూలధనం | కంపెనీల సంఖ్య | చెల్లించిన మూలధనం | కంపెనీల సంఖ్య | చెల్లించిన మూలధనం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1. | 1955-56 | 210 | 1,805 | 377 | 270 | 587 | 2,076 |
| 2. | 1960-61 | 150 | 2,124 | 296 | 332 | 446 | 2,456 |
| 3. | 1965-66 | 155 | 4,110 | 379 | 842 | 534 | 4,952 |
| 4. | 1970-71 | 160 | 6,080 | 583 | 2,380 | 743 | 8,460 |
| 5. | 1973-74 | 181 | 6,890 | 813 | 12,770 | 994 | 19,660 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| 6. | 1974-75 | 210 | 7,180 | 944 | 13,650 | 1,154 | 20,830 |
| 7. | 1975-76 | 226 | 8,380 | 1,059 | 15,480 | 1,285 | 23,860 |
| 8. | 1976-77 | 236 | 9,940 | 1,166 | 19,060 | 1,402 | 29,000 |
| 9. | 1977-78 | 246 | 11,590 | 1,283 | 21,720 | 1,529 | 33,310 |

మూలం : డిపార్ట్ మెంట్ ఆఫ్ కంపెనీ అఫేర్స్. మినిస్ట్రీ ఆఫ్ లా, జస్టిస్ అండ్ కంపెనీ అఫేర్స్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, న్యూఢిల్లీ

అయితే పై పట్టికలో కంపెనీల సంఖ్యలలో పెరుగుదల ఉన్న కంపెనీలకు అదనంగా చేరుతున్న కొత్త కంపెనీల సంఖ్యలని అనుకోకూడదు. కొన్ని కంపెనీలు పెట్టుబడులు తగ్గిపోవడం నష్టాలురావడం, ఇతర కంపెనీలతో పోటీపడలేక పోవడం మొదలైన కారణాలవల్ల దివాలాతీసి, వీటిని మూసివేయడం కూడా జరుగుతుంటుంది. వాస్తవానికి ఇట్లా మూసివేసిన కంపెనీల సంఖ్యకూడా పెరుగుతూనే ఉంది. 1973-74 లో 359 లక్షల రూపాయలు చెల్లించిన పెట్టుబడులున్న కంపెనీలు 12 మూతపడ్డాయి. 1974-75 లో 589 లక్షల పెట్టుబడుల కంపెనీలు 17 ని మూసివేయడం జరిగింది.

ఇతర రాష్ట్రాలతో పోల్చిచూస్తే మన రాష్ట్రం ఈ రంగంలో చెప్పుకోదగినంత అభివృద్ధి సాధించలేదనే చెప్పవచ్చు. దేశం మొత్తంమీద ఉత్తరప్రదేశ్, తమిళనాడు రాష్ట్రాలలో ప్రభుత్వరంగం కంపెనీలు, కేరళ, మహారాష్ట్ర, ఢిల్లీ కేంద్రపాలితప్రాంతం, పశ్చిమబెంగాల్, కర్నాటకలలో ప్రైవేట్ కంపెనీలు ఎక్కువగా ఉన్నాయి. దిగువ పట్టికలో 1978 మార్చి నాటికి దేశం వివరాలు, రాష్ట్రం వివరాలు సూచించినాము. వీటినిబట్టి భారతదేశపు జాయింట్ స్టాక్ కంపెనీలలో మన రాష్ట్రం స్థానం అవగతం కాగలదు. పెట్టుబడిని కోట్ల రూపాయలలో సూచించడం జరిగింది.

| వ. సం. | వివరాలు | ఆంధ్రప్రదేశ్ | దేశంమొత్తం | దేశంలోరాష్ట్ర స్థానంశాతంలో |
|---|---|---|---|---|
| 1. | పబ్లిక్ కంపెనీలు | | | |
| | a. సంఖ్య | 246 | 8,186 | 3.01 |
| | b. చెల్లించినపెట్టుబడి | 115.9 | 2,905.6 | 3.99 |
| 2. | ప్రైవేట్ కంపెనీలు | | | |
| | a. సంఖ్య | 1,283 | 40,993 | 3.13 |
| | b. చెల్లించినపెట్టుబడి | 217.2 | 8,514.0 | 2.55 |

3. మొత్తం

| | | | |
|---|---|---|---|
| a. సంఖ్య | 1,529 | 49,179 | 3.11 |
| b. చెల్లించినపెట్టుబడి | 333.1 | 11,419.6 | 2.92 |

మూలం : డిపార్ట్‌మెంట్ ఆఫ్ కంపెనీ అఫేర్స్, మినిస్ట్రీ ఆఫ్ లా, జస్టిస్ అండ్ కంపెనీ అఫేర్స్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, న్యూఢిల్లీ.

## విదేశవర్తకం

ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా వ్యవసాయధార ఆర్థికవ్యవస్థ ఉన్న రాష్ట్రం. అయినప్పటికీ ఖనిజ వనరులు, అటవీసంపద, మత్స్యసంపద, చేతిపనుల పరిశ్రమ కూడా అధికంగా ఉన్న కారణంగా వీటికి సంబంధించిన అనేక ద్రవ్యాలు ఎగుమతి చేస్తున్నాము. వీటికి అవసరమైన కొన్నిటిని దిగుమతి కూడా చేసుకొంటున్నాము.

*ఎగుమతులు :* వ్యవసాయరంగంలో ఆహారపంటలే కాకుండా చెరుకు, పొగాకు, వేరుసెనగ, ఆముదం, పత్తి, పసుపు వంటి వాణిజ్య పంటలు కూడా మన రాష్ట్రంలో అధికంగానే పండిస్తున్నాము. వీటిలో కొన్నిటిని ఇతర దేశాలకు ఎగుమతి చేస్తున్నాము. ఇట్లా ఎగుమతి చేస్తున్న వస్తువులలో 1. పొగాకు 2. సిగరెట్లు 3. చక్కెర 4. పసుపు 5. మిరపకాయలు 6. వేరుసెనగపప్పు, పిట్టు 7. జీడిపప్పు 8. ఆముదము, అవిశెవంటివంటి నూనెలు 9. చింతగింజలు, పొడి 10. ఊరగాయలు 11. పశుగ్రాసం 12. పాలఉత్పత్తులు ఉన్నాయి.

ఖనిజాలు, అటవీసంపద, వస్తువులు, వాటి ఉత్పత్తులకు సంబంధించి మనరాష్ట్రం నుంచి అభ్రకం, గ్రానైట్, కాగితం, పెయింట్లు, రాతినార, ఫెర్రోమాంగనీసు సిలికాక్రోమ్ ఫెర్రోక్రోమ్, చందనం, ముగ్గురాయి, జిప్సం మొదలైనవి ఎగుమతి చేయబడుతున్నాయి.

లేసులు, ఉన్నికంబళ్లు, గోల్డ్‌కవరింగ్ ఆభరణాలు మొదలైనవి చేతిపరిశ్రమకు సంబంధించిన ఎగుమతి వస్తువులు. ఇవి తోళ్ళు, ఎముకలపొడి, కొమ్ములు, డెక్కలు, పిడకలు, షార్క్‌చేప పొలుసులు, సముద్రపుగవ్వలు, ఫ్రీజ్‌చేయబడిన వివిధరకాల చేపలు, రొయ్యలు కూడా ఎగుమతి చేయబడుతున్నాయి.

రసాయనాలకు సంబంధించి అనేక రసాయనాలు, ఇంజనీరింగ్ పరికరాలు, పనిముట్లు, యంత్రాల విడిభాగాలు, కొన్ని మాంటసోరీ బోధన పరికరాలు కూడా విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నాయి.

*ఎగుమతుల ప్రోత్సాహక విభాగం :* వివిధ వస్తువులను విదేశాలకు ఎగుమతిచేయడంలో ప్రోత్సాహం ఇవ్వడానికిగాను 1966 లో వాణిజ్య ఎగుమతుల ప్రోత్సాహక విభాగాన్ని నెలకొల్పడం జరిగింది. ఈ సంస్థ ఆయా వస్తువుల, ఉత్పత్తుల ఎగుమతి వ్యాపార సమాచారాలను అందిస్తుంది. ఈ విధంగా చేయడంవల్ల అనేక సంస్థలు ఎగుమతి వ్యాపారం చేపట్టడంలో ఈ విభాగం ఎంతో సహకారిగా ఉంటూ మొత్తంమీద ఎగుమతుల అభివృద్ధికి తోడ్పడుతూఉంది.

*ఆంధ్రప్రదేశ్ స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ :* రాష్ట్రంలో ఉత్పత్తి అయ్యే వస్తువుల వాణిజ్యాన్ని అభివృద్ధి పరచడానికి 1970 లో స్థాపించిన సంస్థఇది. రాష్ట్రంలో తయారయ్యే వస్తువుల ఎగుమతిని పటిష్ఠంచేసి, అభివృద్ధిపరచడంలోను, స్థానికంగా లభ్యంకాని వాటిని దిగుమతి చేసుకొని మార్కెట్ చేయడంలోను ఈ సంస్థ కీలకపాత్ర వహిస్తున్నది.

## భీమావ్యాపారం

వ్యక్తికి భద్రతాభావం ప్రధానం. తాను, తనవస్తువులు, ఆస్తి, తనవారుభద్రంగాఉన్నారని నమ్మకం ఏర్పడినప్పుడే ఇచ్ఛాపూర్వకంగా ప్రగతి పథంలో భాగస్వామి కాగలడు. ఈ భద్రతాభావాలు కలిగించడానికి ఏర్పడిన సంస్థలే భీమా సంస్థలు. భీమావ్యాపారాన్ని మూడు ప్రధాన విభాగాలుగా పేర్కొనవచ్చు. సాధారణ భీమాసంస్థలు, జీవితభీమా సంస్థ, ప్రభుత్వ భీమా విభాగం.

### సాధారణ భీమాసంస్థలు

ఆస్తిపాస్తులు, వాహనాలు, భరణాలు, పంటలు మొదలైనవాటికి నష్టం వాటిల్లినప్పుడు పరిహారంగా కొంత సొమ్మును పొందడానికి చేసుకొన్న ఏర్పాటు సాధారణ భీమా అనవచ్చు. 1956 కు ముందు మనరాష్ట్రంలో నాలుగు కంపెనీలుండేవి- ఆంధ్రాఇన్సూరెన్స్ కంపెనీ, హిందుస్థాన్ ఇండియల్ ఇన్సూరెన్స్ కంపెనీ, కో-ఆపరేటివ్ జనరల్ ఇన్సూరెన్స్ సొసైటీ, హైదరాబాదు యునైటెడ్ ఇన్సూరెన్స్ కంపెనీ. 1958 లో ఆంధ్రా ఇన్సూరెన్ కంపెనీ, హిందుస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్స్ కంపెనీలో విలీనమైంది. అదేవిధంగానే 1961 లో హైదరాబాదు యునైటెడ్ ఇన్సూరెన్స్ కంపెనీ కూడా విలీనమైంది. కాగా కో-ఆపరేటివ్ జనరల్ ఇన్స్యూరెన్స్ కంపెనీ ప్రత్యేకంగా ఉండిపోవడంతో రాష్ట్రంతో రెండు ప్రధాన కంపెనీలు మిగిలినాయి. ఈ రెండు కంపెనీల ప్రధాన కార్యాలయాలు హైదరాబాదులోనే ఉండేవి. ఇవి స్థానికాలు. ఇవికాక మరికొన్ని స్వదేశీ, విదేశీ భీమా కంపెనీలు కూడా మనరాష్ట్రంలో సాధారణ భీమావ్యాపారం సాగిస్తుండేవి. 1972 లో దేశంలోని సాధారణ భీమాకంపెనీల జాతీయకరణ జరగడంలో ఈ రంగంలో ప్రైవేట్ కంపెనీలు పోయినాయి. అయితే రకరకాలపేర్లు మిగిలినాయి. వీటన్నిటినీ సమన్వయపరచడానికిగాను 1973 లో జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (జి.ఐ.సి) సంస్థను భారత ప్రభుత్వం స్థాపించింది. ఈ సంస్థ ఆధ్వర్యంకింద నాలుగు సబ్సిడరీ కంపెనీలను ఏర్పాటుచేసి అంతకు ముందున్న కంపెనీలన్నిటిని విలీనంచేయడం జరిగింది. జి.ఐ.సి ప్రధాన కార్యాలయము బొంబాయి.

***1.** యునైటెడ్ ఫైర్ అండ్ జనరల్ ఇన్సూరెన్స్ కంపెనీ :* దీని కేంద్రకార్యాలయం మద్రాసు. భీమాసంస్థలు జాతీయంచేయకముందు రాష్ట్రంలో ఉండిన రెండు ఇన్సూరెన్స్ కంపెనీలు దీనిలో విలీనమైనాయి. మన రాష్ట్రంలోని సాధారణ భీమా వ్యాపారంలో అత్యధికభాగం ఈ కంపెనీ నిర్వహిస్తున్నది. రాష్ట్రంలో ఈ కంపెనీకి 5 డివిజన్లున్నాయి. హైదరాబాదులో రెండు, సికిందరాబాదు, విజయవాడ, విశాఖపట్నంలలో ఒకటి చొప్పున ఉన్నాయి. ఈ డివిజన్ల ద్వారా ఈ కంపెనీ ఏటా దాదాపు ఆరుకోట్లరూపాయలకు పైగానే

ప్రీమియం వసూలుచేస్తున్నట్లు అంచనా. ఈ డివిజన్లకింద అనంతపురం, కడప, ఆదోని, నిజామాబాదు, వరంగల్లు, మచిలీపట్నం, ఏలూరు, గుంటూరు, ఒంగోలు, నెల్లూరు, విజయ నగరం, రాజమండ్రి, కాకినాడ మొదలైనచోట్ల బ్రాంచీలున్నాయి.

***2. ఓరియంటల్ ఫైర్ అండ్ జనరల్ ఇన్సూరెన్స్ కంపెనీ :*** దీని కేంద్ర కార్యాలయం ఢిల్లీ, లోగడ రాష్ట్రంలో ఉండిన న్యూగ్రేట్ ఇన్సూరెన్స్ కంపెనీ, ఇండియన్ మర్కంటైల్ ఇన్సూరెన్సు కంపెనీ, స్టెర్లింగ్ జనరల్ ఇన్సూరెన్సు కంపెనీ మొదలైన భీమాసంస్థల జాతీయాకరణ ఫలితంగా ఈ కంపెనీలో విలీనమైనాయి. ఈ కంపెనీకి రాష్ట్రంలో రెండు డివిజన్లు, ఒకటి హైదరాబాదులోను, మరొకటి విజయవాడలోను ఉన్నాయి. వీటికింద నిజామాబాదు, గుంటూరు, రాజమండ్రి, విశాఖపట్నం వంటి చోట్ల సేవాకేంద్రాలు బ్రాంచీలు ఉన్నాయి. వీటిద్వారా ఏటా ఒక కోటిరూపాయలకుపైగా ప్రీమియం వసూలు చేస్తున్నట్లు అంచనా.

***3. నేషనల్ ఇన్స్యూరెన్స్ కంపెనీ :*** దీని కేంద్ర కార్యాలయం కలకత్తా. ఇతర కంపెనీలతో పోల్చి చూస్తే దీని ప్రభావం మన రాష్ట్రంలో చాలా తక్కువ. దీనికి మన రాష్ట్రంలో ఒక డివిజన్ హైదరాబాదులో మాత్రమే ఉంది. రెండు మూడు బ్రాంచీలున్నాయి. దాదాపు 80 లక్షల ప్రీమియం వసూలు చేస్తున్నట్లు అంచనా.

***4. న్యూ ఇండియా అస్యూరెన్స్ కంపెనీ :*** దీని కేంద్ర కార్యాలయం బొంబాయి. లోగడ ఆంధ్రాలో ఉన్న ఆనంద్, వాన్‌గార్డ్, లిబర్టీ వంటి భీమా కంపెనీలు దీనిలో విలీనమైనాయి. ప్రస్తుతం దీనికి రాష్ట్రంలో రెండుడివిజన్లు 10 దాకా బ్రాంచీలు, సబ్‌బ్రాంచీలు ఉన్నాయి. ఏటా కోటి రూపాయలకు పైగా వ్యాపారం చేస్తున్నట్లు అంచనా.

మొత్తంమీద సాధారణ భీమా కంపెనీల ప్రభావం మన రాష్ట్రంలో తక్కువ. ఉన్న డివిజన్లు, బ్రాంచీలు ప్రధానంగా పట్నాలలోనే ఉన్నాయి. గ్రామీణ ప్రాంతాలను దాదాపు నిర్లక్ష్యం చేస్తున్నాయి. ఇప్పుడిప్పుడే నేషనల్ పాలసీ పంథాలో గ్రామీణ ప్రాంతాలకు ఈ పథకాలు విస్తరిస్తున్నాయి.

## జీవిత భీమా సంస్థ

1-9-1956 న లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ అవతరించింది. దేశంలోఅంతవరకు ఉన్న 243 సంస్థలు దీనిలోవిలీనమైనాయి. ప్రస్తుతం మనరాష్ట్రంలో మూడు డివిజన్లున్నాయి. అంతేకాకుండా రాష్ట్రంలోని చిత్తూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతాలు మద్రాసు డివిజనల్ ఆఫీసు అధీనంలో ఉన్నాయి.

జీవిత భీమా సంస్థను జాతీయం చేసిన తరవాత భీమా వ్యాపారం చెప్పుకోదగినంత అభివృద్ధి సాధించిందని చెప్పవచ్చు. ఉదాహరణకు రాష్ట్రంలోని భీమా వ్యాపారం అభివృద్ధిని దిగువ పట్టికలో చూడవచ్చు.

(భీమా చేసినమొత్తం కోట్ల రూపాయలలో)

| సంవత్సరం | హైదరాబాదు డివిజను పాలసీల సంఖ్య | హైదరాబాదు డివిజను భీమా మొత్తం | మచిలీపట్నం డివిజను పాలసీల సంఖ్య | మచిలీపట్నం డివిజను భీమా మొత్తం | విశాఖపట్నం డివిజను పాలసీల సంఖ్య | విశాఖపట్నం డివిజను భీమా మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1970-71 | 61,236 | 43.64 | 55,843 | 36.44 | .... | .... |
| 1972-73 | 88,933 | 90.59 | 66,983 | 52.95 | .... | .... |
| 1973-74 | 1,05,161 | 116.87 | 87,268 | 74.95 | .... | .... |
| 1978-79 | 8,01,000 | 668.88 | 3,98,000 | 314.64 | 2,98,000 | 220.52 |

జీవిత భీమా సంస్థ జాత్రీయాకరణ తరవాత పల్లెప్రాంతాల వైపు మొగ్గుచూపి అక్కడ కృషి కేంద్రీకరించడంతో ఇంతగా అభివృద్ధి సాధించిందని చెప్పవచ్చు. నేడు ఈ సంస్థ పాలసీదారులలో దాదాపు 46 శాతం గ్రామీణ ప్రాంతాలవారు. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల వారికి ఇది అందుబాటులో ఉన్నప్పటికీ, రాయలసీమ ప్రాంతానికి ప్రత్యేక డివిజను లేదు. ఇప్పుడిప్పుడే కడపలో ఒక డివిజను కార్యాలయం ప్రారంభించడానికి సన్నాహాలుసాగుతున్నాయి.

ఈ సంస్థ వ్యాపారంతోబాటుగా అనేక ఇతర సంస్థలకు ఆర్థిక సహాయం కూడా అంద జేస్తున్నది. ఈ సంస్థ విభిన్న సంస్థలకు పెట్టిన పెట్టుబడులను దిగువ పట్టికలో సూచించాం. ఈ వివరాలు చూస్తే రాష్ట్ర ప్రగతికి ఈ సంస్థ ఏ విధంగా దోహదంచేస్తున్నదీ తెలియగలదు.

| వ. సం. | వివరాలు | పెట్టుబడి విలువ కోట్ల రూ॥లలో 1975 | 1979 |
|---|---|---|---|
| 1. | రాష్ట్రప్రభుత్వ సెక్యూరిటీలు | 25.01 | .... |
| 2. | ప్రభుత్వేతర సెక్యూరిటీలు | 32.91 | .... |
| 3. | గృహ పథకం | 17.95 | 48.04 |
| 4. | మున్సిపాలిటీలకు అప్పులు | 4.70 | .... |
| 5. | రాష్ట్ర విద్యుత్ బోర్డ్‌కు | 23.50 | 76.56 |
| 6. | పారిశ్రామిక వాటికలు | 39.98 | .... |
| 7. | చక్కెర ఫ్యాక్టరీలు | 1.50 | 5.94 |
| 8. | స్టాక్ ఎక్స్ఛేంజ్ పెట్టుబడులు | 61.74 | 90.74 |
| 9. | గ్రామీణ నీటి సరఫరా పథకాలు | 1.89 | 6.46 |
| 10. | వివిధ కంపెనీలకు | 3.16 | 15.94 |

11. పట్టణ నీటి సరఫరా పథకాలు .... 17.79

12. సహకార గృహ నిర్మాణాలకు .... 33.29

ఇవికాక షెడ్యూల్డ్ కులాల, జాతుల అభివృద్ధికోసం ప్రభుత్వాలు చేస్తున్న కృషులకు దోహదం చేస్తూ 10 కోట్ల రూపాయలు ఈ సంస్థ మంజూరు చేసింది.

## ప్రభుత్వజీవితభీమా విభాగం

ఈ విభాగం చేపట్టిన పథకం రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకు మాత్రమే పరిమితము. ప్రీమియమ్‌ను ఉద్యోగుల వేతనాలనుంచి మినహాయించడం జరుగుతుంది. ఈ పాలసీలద్వారా భీమా చేసిన సొమ్మును కోర్టులద్వారా, ఇతర డిక్రీల ద్వారా ఇతరులు స్వాధీనం చేసుకోలేరు. బాకీతేదీ పాలసీ సొమ్మునుంచి మినహాయించడానికి వీలులేదు. ఇటువంటి రాయితీలున్న ఈ పథకం ఉద్యోగులకు అనుకూలంగా ఉందనే చెప్పవచ్చు.

ఈవిభాగానికి హైదరాబాదు, వరంగల్లు, విజయవాడ, కర్నూలు పట్నాలలో ప్రాంతీయ కార్యాలయాలున్నాయి. ఈ పథకం ప్రగతిని టూకీగా దిగువ పొందుపరచినాము.

| సంవత్సరం | పాలసీదారులు | భీమా మొత్తం | వ్యాపారం |
|---|---|---|---|
| 1956 | 28,676 | 131 లక్షలు | 317 లక్షలు |
| 1970 | 62,651 | .... | 786 లక్షలు |
| 1976 | 9,20,006 | 729 లక్షలు | 1,539 లక్షలు |

ఈ విభాగానికి చెందిన అన్ని నిధులూ ప్రభుత్వం అధీనంలో ఉంటాయి. ఈ నిధులకు తగిన వడ్డీకూడా ప్రభుత్వం చెల్లిస్తుంది.

# 26

# ధరలు

ధరల పెరుగుదల ప్రభావానికి లోనుగాని వినియోగదారులుండరు. ఆదాయాలలో పెరుగుదల లేకుండా ధరలస్థాయిలో పెరుగుదల ఏర్పడటంవల్ల వ్యక్తుల నిజాదాయం క్షీణిస్తుంది. అంటే అతనికొనుగోలుశక్తి తగ్గిపోతుందన్నమాట. ఇట్లాంటి పరిస్థితి అందరూ ఎదుర్కొంటున్నదే. ముఖ్యంగా నిత్యావసర వస్తువుల ధరలు పెరగడంవల్ల అల్పాదాయవర్గాల ప్రజల, స్థిరాదాయవర్గాల ప్రజలజీవనప్రమాణం తగ్గుతుంది. మిగతారంగాలలోఎంత అభివృద్ధి సాధించినా ప్రజల వాస్తవిక ఆదాయం తగ్గడంవల్ల అభివృద్ధి ఫలితాలను అనుభవించలేకుండా పోతారు. అసలు అభివృద్ధికి సూచికగా ప్రజల జీవనప్రమాణస్థాయికి ఎంతో ప్రాముఖ్యముంది. కానీ ధరలు ఆకాశాన్ని అంటుతూ ఉండటం మన అందరి అనుభవంలో ఉన్న విషయమే. కానీ ఆహారధాన్యాలు, ఇతర నిత్యావసర వస్తువుల ధరలు సామాన్యులకు అందుబాటులో లేకుండటం కేవలం ఆధునికలోకానికే పరిమితమైన సమస్యకాదేమోఅనిపిస్తుంది. చరిత్రపుటలు తిరగేస్తే ఈ అంశానికి సంబంధించిన కొన్ని వాస్తవాలు గోచరిస్తాయి. ఉదాహరణకు, కౌటిల్యుని అర్థశాస్త్రంలో నిత్యావసర వస్తువుల ధరల తీరుతెన్నులను గురించిన ప్రస్తావన లేకపోలేదు. అందులో మణుగు బియ్యం పావలాకు, ఉప్పు రెండుపైసలు లభించేవని వ్రాశాడు. ఆఫ్రికన్ యాత్రికుడు ఇబెన్ బటూటా 13వ శతాబ్దంలో మనదేశం వచ్చాడని మనదేశచరిత్ర చెబుతూఉంది. ఆనాటి వస్తువుల ధరలు ఈనాటి కరెన్సీలో 40 కిలోల గోధుమకు 20పైసలు, యవలు 11 పైసలు, బియ్యం 44 పైసలు, సెనగలు 11 పైసలుగా ఉండేవని బటూటా వ్రాశాడు.

| సంవత్సరం | పాలు (కిలోధర) పైసలలో | నెయ్యి కిలోధర |
|---|---|---|
| 1911 | 12.5 (పైసలు) | 42.5 పైసలు |
| 1939 | 0.15 ( ,, ) | 1.25 (రూ) |
| 1953 | 0.55 ( ,, ) | 5.00 (రూ) |
| 1960 | 87.5 ( ,, ) | 7.50 (రూ) |
| 1968 | 1.25 (రూ) | 10 (రూ) |
| 1972 | 1.50 (రూ) | 17.25 (రూ) |
| 1980 | 2.25 (రూ) | 25.00 (రూ) |

గడిచిన 5,6 సంవత్సరాలలో వచ్చిన విపరీతమైన మార్పుల స్వరూపాన్ని, అందుకు కారణాలను సరిగ్గా అర్థంచేసుకోవాలంటే స్వాతంత్ర్యానికి పూర్వం, రెండో ప్రపంచయుద్ధ పర్యవసానంగా ఆహారధాన్యాలలో ఏర్పడిన విపరీతమైన కొరత పరిస్థితులను గురించి తెలుసుకోవడం అవసరం. రెండో ప్రపంచయుద్ధకాలంలో ఆహారసమస్య తలెత్తి ధరలు పెరగడంతో ప్రభుత్వం వ్యవసాయదారుల వద్దనుంచి ఆహారధాన్యాలు సేకరించి రేషనింగ్ పద్ధతిని ప్రవేశ పెట్టడం మన అనుభవంలోని విషయమే. కొరతగాఉన్న ఆహారధాన్యాలకు గరిష్ఠధరలు నిర్ణయించింది. ఆహారసమస్యవిషయంలో నిర్దిష్టమైన అభిప్రాయాలు లేకపోవడంవల్ల ప్రభుత్వం కంట్రోళ్లను 1947 లో రద్దుచేసింది. కానీ ధరలు విపరీతంగా పెరగడంవల్ల వాటిని తిరిగి విధించింది. ఆహారధాన్యాల సప్లయ్ పరిస్థితి క్రమంగా మెరుగు పరచడంవల్ల తిరిగి ప్రభుత్వం 1952 నుంచి కంట్రోళ్లను తొలగించడం మొదలుపెట్టింది. ఈ ప్రక్రియ 1954 నాటికి పూర్తి అయింది.

స్వాతంత్ర్యం వచ్చిన ఈ సంవత్సరం కాలంలో ధరలు పెరుగుతూనే వచ్చాయి. ద్రవ్యోల్బణంను విశ్లేషించేవారు ఈ30 సంవత్సరాల కాలాన్ని రెండు నిర్దిష్టమైన కాలాలుగా విభజిస్తారు. స్వాతంత్ర్యం వచ్చిన నాటినుంచి 1962 వరకు ఉన్నకాలం ఒకటి. 1962 తరవాత నేటివరకు ఇంకొకకాలం. 1962 తరవాత 1977-78 సంవత్సరంలో ధరలు కొంత తగ్గుముఖం పట్టాయి. కాని అది ఎంతోకాలం ఉండలేదు. తిరిగి పెరగడం ప్రారంభించాయి.

మన దేశంలో ఆర్థిక ప్రణాళికలు మొదలైనప్పటి నుంచి అన్నిరకాల వస్తువుల ధరలు పెరుగుతూ వచ్చాయి. ఒక్క మొదటి ప్రణాళికా కాలంలోతప్ప 1952-53 సంవత్సరాన్ని సాధారణ పరిస్థితులున్న సంవత్సరంగా తీసుకొని ఆ సంవత్సరపు ధరల సూచీ సంఖ్యను 100 అనుకొని ఆ తరవాతి సంవత్సరాలలో సూచీ సంఖ్యను బట్టి ధరల పెరుగుదల తీరును గ్రహించవచ్చు. కానీ 1952-53 సంవత్సరాన్ని మూల సంవత్సరంగా తీసుకొన్నప్పుడు అంతకు పూర్వం ధరలలో కలిగిన మార్పులు లెక్కలోకి రావు. 1939-1952-55 మధ్య సాధారణ ధరల సూచి సంఖ్య 100 నుంచి 380.5 కు, పారిశ్రామిక వస్తువుల సూచీ సంఖ్య 371.3 కు పెరగగా, ఆహారధాన్యాల సూచీ సంఖ్య 444.5 కు పెరిగింది. అంటే మన దేశంలో ప్రణాళికా యుగం ప్రారంభమయిన సమయానికి సాధారణ ధరలు 3½ రెట్లకు పైగాను, ఆహారధాన్యాల ధరలు 4½ రెట్ల వరకు పెరిగాయి. 1951 తరవాత ధరల నిజస్వరూపం తెలుసుకోవాలంటే ఈ అంశాన్ని మరచి పోకూడదు. ఈ సందర్భంలో గమనించవలసిన ఇంకోవిషయం పారిశ్రామిక వస్తువుల ధరలకన్న ఆహారధాన్యాల ధరలు ఎక్కువగా పెరగడం.

> గత మూడు దశాబ్దాల కాలంలో ద్రవ్యోల్బణంవల్ల రూపాయి విలువ 1949 ని ప్రాతిపదికగా తీసుకొంటే -22 పైసలు మాత్రమేనని వెల్లడైంది.

1951 తరవాత ధరలు ఏవిధంగా పెరిగిందీ కింది పట్టిక నుంచి తెలుసుకోవచ్చు.

| సంవత్సరం | సాధారణ సూచిసంఖ్య | ఆహార ధాన్యాలు | ఆహార వస్తువులు | పారిశ్రామిక ముడిపదార్థాలు | పారిశ్రామిక వస్తువులు |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| (మూలసంవత్సరం ఆగష్టు 1939 = 100) | | | | | |
| 1951-53 | 380.6 | | 444.5 | | 371.3 |
| (మూల సంవత్సరం 1952-53 = 100) | | | | | |
| 1951-52 | 111.8 | 112 5 | 94.7 | 130.9 | 103.3 |
| 1955-56 | 92 5 | 86.6 | 75.5 | 99.0 | 99.7 |
| 1960-61 | 124.9 | 130.0 | 104.4 | 145.4 | 123.9 |
| 1965-66 | 165.1 | 168.8 | 148.1 | 189.1 | 149.1 |
| జనవరి 1967 | 198.3 | 209.7 | 190.0 | 237.1 | 167.2 |

మూలం : Report of Currency and Finance, 1965-66 R B I

మొదటి ప్రణాళిక ముగిసే నాటికి ఆహార వస్తువుల ధరలు, వాటికన్నా ఎక్కువగా ఆహారధాన్యాల ధరలు పడిపోయినాయి. రెండు మూడు సంవత్సరాల పాటు వరసగా పంటలు బాగా పండటమే కాకుండా ఆర్థిక వ్యవస్థ మందకొడిగా ఉండటం మూలంగా ఈ పరిణామం ఏర్పడింది. అంతేగాని ధరలను తగ్గించడంకోసం ప్రభుత్వం ప్రత్యేకంగా చర్యలు తీసుకో లేదు. 1954-55 నుంచి అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన వ్యయం పెరగడం, బాంకు పరపతి, ద్రవ్య పరిమాణం విస్తరించడం, ఆహార ధాన్యాల దిగుమతి కనిష్ఠ స్థాయికి దిగజారడం, వీటితో బాటు పంటలు బాగా లేకపోవడం మూలంగా ధరలు పెరగడం మొదలు పెట్టాయి — 1950-55 మధ్య ఆహార ధాన్యాల ధరలు 540% పెరిగాయి. 1955-56 స్థాయి మీద ఆహార ధాన్యాల ధరలు 1965-66 లో 90% 1967 లో 150% ఎక్కువయినాయి.

1966 తరవాత కూడా ధరల పెరుగుదల మరీ ఎక్కువయింది. కింది పట్టికలోని వివరాలు ఈ విషయం స్పష్టంచేస్తాయి.

టోకు ధరల సూచి (1961-62 = 100)

| సంవత్సర | ఆహార వస్తువులు | అన్ని వస్తువులు |
|---|---|---|
| 1969-70 | 200 | 176 |
| 1970-71 | 200 | 181 |

| | | |
|---|---|---|
| 1971-72 | 217 | 192 |
| 1972-73 | 250 | 218 |
| 1973-74 | 322 | 284 |

మూలం : RBI Bullet n, January-1975

పై పట్టికను బట్టి చూస్తే సాధారణ ధరల స్థాయి 1969-79 లో ఉన్న 176 నుంచి 1973-74 నాటికి 284 కు పెరిగిందని స్పష్టమవుతుంది. అట్లాగే ఆహార వస్తువులైన ఆహార ధాన్యాలు, పప్పుదినుసులు, పంచదార, పాలు మొదలైన వాటి ధరలస్థాయి మొదట్లో 200 నుంచి 1973-74 నాటికి 322 కు చేరుకొంది. 1972-73 వరకు పెరుగుదల రేటు అంత అధికం కాలేదు కానీ 1973 నుంచి ఏర్పడిన పెరుగుదల చాలా విపరీతంగా ఉంటూవచ్చింది. ధరల పెరుగుదల అల్పాదాయ వర్గాలవారికి, స్థిరాదాయ వర్గాలవారికి ఎంతో కలవరపాటు కలిగిస్తున్నది. ప్రభుత్వం వాటిని అదుపుచేయలేక పోతున్నది. దీనికి ఎన్నో కారణాలను చూడవచ్చు. ముఖ్యంగా గమనించ దగిన కారణాలు : విపరీతమైన పన్నుల వత్తిడి, బంగ్లా దేశ్ నుంచి కాందిశీకుల రాక, 1971 లో పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధం, పంటలు దెబ్బతినడం, విద్యుచ్ఛక్తి కొరతవల్ల పరిశ్రమలు మందకొడిగా పనిచేయడం, గోదుమ వ్యాపారాన్ని ప్రభుత్వం చేపట్టకపోవడం, ఆహార ధాన్యాలను దొంగగా నిలవచేయడం, చీకటిబజారు మొదలైన పరిస్థితులవల్ల ధరల పెరుగుదలకు అడ్డు అపు లేకుండా పోయింది. దేశం విపరీతమైన ఆర్థిక ఇబ్బందులకు గురిఅయి ప్రజాజీవనం దుర్భరమైంది.

ఈ విధమైన ధరల పెరుగుదల నిరాటంకంగా సాగుతూనే వచ్చింది. 1974 లో ధరల సూచి 330 స్థాయికి చేరుకొంది. అప్పటి నుంచి ధరలు క్రమంగా తగ్గుముఖం పట్టనారంభించినాయి. ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకొంది. ఉదాహరణకు దొంగ వ్యాపారుల కార్యకలాపాలను అరికట్టడం, డివిడెండ్ ఆదాయాలను స్తంభింప జేయడం, వేతనాలను నియంత్రించడం, బాంకు రేటును పెంచడం మొదలైన చర్యల ఫలితంగా ధరలను అదుపులో ఉంచగలిగింది.

ఐదో పంచవర్ష ప్రణాళికా కాలంలో ధరలసూచీ సంఖ్యలు కింది విధంగా ఉండటం గమనించవచ్చు.

టోకు ధరల సూచి (1970 -71 = 100)

| సంవత్సరం | టోకు ధరల సూచీ సంఖ్య |
|---|---|
| 1973-74 | 140 |
| 1974-75 | 175 |
| 1975-76 | 173 |
| 1976-77 | 177 |

| | |
|---|---|
| 1977-78 | 186 |
| 1978-79 | 186 |

1974 వ సంవత్సరంలో ప్రభుత్వం తీసుకొన్న చర్యల ఫలితంగా ధరలు తగ్గడం ప్రారంభించాయి. కానీ ఇది ఎక్కువకాలం ఉండలేదు. 1976 నుంచి ధరల పెరుగుదల మళ్ళీ ప్రారంభమై, 178—79 నాటికి 186 కు చేరుకొంది. 1979 నుంచి ధరలు పెరుగుతూనే ఉన్నాయి. ప్రణాళికా కాలంలో ధరలు ఎట్లా పెరిగాయో కింది పట్టిక తెలుపుతుంది.

| | |
|---|---|
| మొదటి ప్రణాళిక | 22% ధరలు తగ్గాయి |
| రెండో ప్రణాళిక | 30% పెరిగాయి |
| మూడో ప్రణాళిక | 32% పెరిగాయి |
| నాలుగో ప్రణాళిక | 61% పెరిగాయి |
| ఐదో ప్రణాళిక (మొదటి నాలుగు సంవత్సరాలు) | 33% పెరిగాయి |

1976 లో కనిపించిన ధరల పెరుగుదల (1976 అక్టోబరులో కనిపించే తగ్గుదల మినహాయిస్తే) జూలై 1977 వరకు కొనసాగింది. 1977 ఆగష్టు నుంచి ధరలు తగ్గుముఖం పట్టడం గమనించవచ్చు. దీనికిముఖ్యమైన కారణాలు: ఆ యేటి నుంచి ఖరీఫ్ పంటరావడం, దక్షిణ ప్రాంతంలో తుఫాను వల్ల అపారనష్టం ఏర్పడినా రబీ పంట బాగా పండటం, ఆహార మండలాలను రద్దుచేయడం, వీరికి మద్దతు ధరలను పెంచడం, స్వేచ్ఛా మార్కెట్‌కు పంచదారను ఎక్కువగా విడుదల చెయ్యడం, పప్పు దినుసులకు సంబంధించి నిలవ పరిమితులను నిర్ణయించడం. వంటనూనెలు, వనస్పతి నిల్వలకు పరిమితులను నిర్ణయించడం, కంట్రోల్ లేని వస్త్రానికి ఎక్స్ ఫాక్టరీ ధరలను ముద్రించడం వంటి చర్యలను ప్రభుత్వం తీసుకొన్న ఫలితంగా ధరలు నిలకడగా ఉంటూ వచ్చాయి. కానీ ఆ సంవత్సరం డిశంబర్ నాటికి ధరలు కొద్దిగా పెరగడం మొదలు పెట్టాయి.

## ధరల పెరుగుదల ప్రభావాలు

వస్తుసేవల ధరలు నెమ్మదిగా పెరిగినందువల్ల మొత్తంమీద ప్రజలకు లాభం కలుగుతుంది. ఎందుకంటే, ధరలు పెరగడంవల్ల లాభాలు పెరుగుతాయి. లాభాలు పెరగడం వల్ల ఉత్పత్తి పెరుగుతుంది. ఇది సామాన్యంగా జరిగే పని. కానీ మనదేశంలోని పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉంది. ధరలు పెరగడం వల్ల లాభాలు అధికంగా పెరిగాయే కాని, ఉత్పత్తిగాని, ఉద్యోగావకాశాలు గాని పెరగలేదు. ధరల పెరుగుదలవల్ల లాభం పొందిన వర్గాలు కేవలం వర్తకులు, పెట్టుబడిదారులుమాత్రమే. వస్తూత్పత్తిపెరగనందువల్ల వస్తువులకొరత ఏర్పడటం, ధరలు అదుపు లేకుండా పోవడం జరిగింది.

స్థిరాదాయాలు తెచ్చుకొనే మధ్యతరగతి ప్రజలు అనేక ఇబ్బందులకు గురి అయినారు. వారి ఆదాయాలు ఎంత మారినా, ధరల పెరుగుదల విపరీతం కావడంవల్ల వారి కొనుగోలు

శక్తి తగ్గిపోవడం, జీవన ప్రమాణం పడిపోవడం జరిగింది, కార్మికవర్గం కూడా ఇటువంటి దుష్ఫలితాలనే అనుభవిస్తూంది. వ్యవసాయదారులకు పంటలు పండించిన వెంటనే విక్రయించాల్సిన దుస్థితి ఏర్పడుతూంది. వారు పండించిన పంటను కొంతకాలం వాళ్లు అట్టిపెట్టుకొనే స్తోమత లేనందువల్ల తక్కువ ధరలకే అమ్ముకోవలసి వస్తూంది. ధాన్యం వ్యాపారం చేసే వర్తకులు వాటిని దాచి ఉంచి, మార్కెట్‌లో కొరత పరిస్థితులు సృష్టించి, అధిక ధరలకు వాటిని విక్రయించి, అధికలాభాలు ఆర్జిస్తున్నారు. పేదవారు మరీ పేదవారు కావడం, ధనికులు మరింత ధనికులు కావడం మనం చూస్తున్న విషయమే.

## ధరలు పెరగడానికి కారణాలు

ధరల పెరుగుదల ఎన్నో సంవత్సరాల నుంచి మనలను కలవర పెడుతున్న గడ్డ సమస్య. ఈ సమస్యకు ఆద్యంతాలు ఏమిటనే సమస్యను ప్రభుత్వం, నిపుణులు ఎంతో తీవ్రంగా చర్చిస్తూనే వస్తున్నారు. ఎప్పటికప్పుడు కొన్ని చర్యలు తీసుకోవడం, తాత్కాలికంగ కొంత ఉపశమనం లభించడం మన అందరి అనుభవంలోని విషయమే. ధరల పెరుగుదల కున్న కారణాలను స్థూలంగా రెండుగా విభజించడం పరిపాటి. (1) ఆహారధాన్యాల కొరత (2) నోట్ల ముమ్మర పరిస్థితి. అంటే ఒకటి భౌతిక వస్తుసేవల కొరత, రెండోది ద్రవ్య పర మైన ఉల్బణం. దీనినే మామూలుగా ద్రవ్యోల్బణం అంటారు. కానీ ఈ ద్రవ్యోల్బణం కేవలం సమస్యను ఒకే కోణం - చలామణిలోని ద్రవ్యం మొత్తం పెరగడం - నుంచి మాత్రమే చూడటమవుతుంది. వస్తువుల కొరత, అంటే భౌతిక వస్తువుల కొరతవల్ల కూడా ధరలలో పెరుగుదల సంభవమవుతుందన్న సత్యం ద్రవ్యోల్బణం అనటం వల్ల మరుగున పడుతుంది వస్తువుల కొరత, ద్రవ్యోల్బణం అనేవి నాణానికి బొమ్మ, బొరుసు లాంటివి. ఈ రెండింటి మధ్య ఉండవలసిన సమతౌల్యం లోపించినప్పుడు ధరలలో పెరుగుదల కనిపిస్తుంది.

వినియోగ వస్తువుల కొరతకు ఎన్నో కారణాలుంటాయి. జనాభా పెరుగుదలను ప్రధాన కారణంగా పేర్కొనవచ్చు. ఈ మధ్య కాలంలో జనాభా విపరీతంగా పెరిగింది. కింది పట్టికలో ఈ విషయం స్పష్టమవుతుంది.

| సంవత్సరం | జనాభా పరిమాణం (మిలియన్‌లు) | దశాబ్దంలో పెరుగుదల (మిలియన్లు) | దశాబ్దంలో పెరుగుదల శాతం |
|---|---|---|---|
| 1901 | 236 | .... | .... |
| 1911 | 252 | 16 | 6.7 |
| 1921 | 251 | -1 | 0.3 |
| 1931 | 279 | 28 | 11.00 |
| 1941 | 319 | 40 | 14.2 |

| | | | |
|---|---|---|---|
| 1951 | 361 | 42 | 13.3 |
| 1961 | 439 | 78 | 21.5 |
| 1971 | 546 | 107 | 24.5 |

అంటే 1961-71 మధ్య ఏడాదికి 2.45 శాతం చొప్పున జనాభా పెరగడం ప్రారంభించింది (1979-80 లో మనదేశ జనాభా 650 మిలియన్లని అంచనా). జనాభా పెరుగుదలతోపాటు ఆహారధాన్యాల పెరుగుదల లేనందువల్ల ఆహార ధాన్యాల కొరత ఏర్పడింది. ఆహార ధాన్యాలు పెరగక పోవడానికి ప్రకృతి వైపరీత్యాలుకూడా కొంత కారణం కావచ్చు.

గడిచిన 30 సంవత్సరాలనుంచి మనదేశంలో ఆహారధాన్యాల కొరత తీవ్రమైన సమస్యగా పరిణమించింది. ఈ సమస్యను పరిష్కరించడానికి ప్రభుత్వం అనేక చర్యలు తీసుకొన్నది. ముఖ్యంగా పంచవర్ష ప్రణాళికలలో ఆహారోత్పత్తిని పెంచడానికి ప్రాముఖ్యం ఇవ్వడం జరుగుతూవచ్చింది. ప్రణాళికల కాలంలో జరిగిన అభివృద్ధికృషి ఫలితంగా 1961-6- 1968-69 మధ్య ఆహారోత్పత్తి 52.9 మిలియన్ టన్నులనుంచి 94.0 మిలియన్ టన్నులకు పెరిగింది. 1969-70 లో 99.5 మి. టన్నుల, 1970-71 లో 108.4 మి. టన్నులు, 1971-72 లో 105.2 మి. టన్నులు, 1972-73 లో 97.0 మి. టన్నులు, 1973-74 లో 103.6 టన్నులు. 1974-75 లో 104.50 టన్నులు పెరిగింది. ఈ పరిమాణంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి ఎప్పుడూ జరగలేదు. అయినా మనదేశంలో ఆహారసమస్య తీరిందని అనుకోడానికి వీలులేదు. ఆహారధాన్యాల కొరతను తగ్గించడానికి దేశంలో ఉత్పత్తిని పెంచడంకాని అవసరమైనప్పుడు వాటిని విదేశాలనుంచి దిగుమతి చేసుకోవడంకాని చేయవలసి ఉంటుంది. మొదటి మూడు ప్రణాళికల కాలంలో ఆహారధాన్యాల దిగుమతులు ఏటా 4.8 మి. టన్నుల, నుంచి 10.7 మి. టన్నులకు, 1970-71 లో 2.05 మి. టన్నులకు, 1971-72 లో 0.45 మిలియను టన్నులకు, 1972-73లో 3.61 మి. టన్నులకు, 1973-74లో 3.61 మి. టన్నులకు, 1974-75 లో 4.87 మి. టన్నులకు పెరిగిన సంగతి తెలిసిందే.

ఆహారధాన్యాల కొరతను తగ్గించి ధరలను స్థిరీకరించడానికి ప్రభుత్వం ఎప్పటికప్పుడు చర్యలు తీసుకొంటూనే వచ్చింది. ఈ సమస్యను పరిశీలించడానికి ప్రభుత్వం 1957 లో నియమించిన ఆహారధాన్యాల పరిశీలనా సంఘంవారు కొన్ని ముఖ్యమైన సూచనలు చేశారు. మన ప్రభుత్వం ఆహారవిధానంలో ఆహారధాన్యాల ధర స్థిరీకరణ ప్రధానాంశంగా ఉండాలని పేర్కొంటూ అందుకోసం ఆహారధాన్యాల టోకు వ్యాపారాన్ని పాక్షికంగా జాతీయం చేయాలని ధరల స్థిరీకరణ విధానాన్ని రూపొందించడానికి ధరల స్థిరీకరణ బోర్డును, బఫర్‌స్టాక్ కార్యకలాపాలను నిర్వహించడం ద్వారా ధరలలోఒడుదుడుకులను తొలగించి ధరల స్థిరీకరణ విధానాన్ని అమలుపరచడానికి ఆహారధాన్యాల స్థిరీకరణ సంస్థను నెలకొల్పాలని, ఆహార వస్తువుల పంపకానికి చౌకధర దుకాణాలను, సహకార సంఘాలను విస్తారంగా ఏర్పరచాలని వారు ఉద్ఘాటించారు. ఈ దశలో ప్రభుత్వం అనేకచర్యలు తీసుకొంది. 1. ఆహారధాన్యాల టోకువ్యాపారం ఆహారసంస్థ చేపట్టింది. 2. ప్రకృతి వైపరీత్యాలు సంభవించి కొరత ఏర్పడిన

పరిస్థితులలో ఆహారధాన్యాలు ప్రజలకు అందుబాటులో ఉండేటట్లు చేయడానికి బఫర్‌స్టాక్‌ను ఏర్పాటు చేసింది. 3. పంపిణీ విధానాన్ని అనుసరించడం. ఇన్ని చర్యలను తీసుకొన్నా ధరలను అదుపులో పెట్టడం దుస్సాధ్యమయింది.

ఈ మధ్యకాలంలో అనేక అభివృద్ధి కార్యక్రమాలకుగాను ప్రభుత్వం, ప్రయివేట్ వ్యక్తులు చేసే పెట్టుబడి మొత్తాలు విపరీతంగా పెరుగుతూ వచ్చాయి. 1951-74 సంవత్సరాల మధ్య కాలంలో దేశంలో 32,000 కోట్ల పెట్టుబడి జరిగినట్లు అంచనా. ఐదో పంచవర్ష ప్రణాళికా కాలంలో ఏటా, 7,600 కోట్ల రూపాయల పెట్టుబడి జరిగింది. పెట్టుబడి పెట్టటం వల్ల, వివిధ వర్గాలవారి ఆదాయాలు పెరగడం, కొందరికి కొత్తగా ఆదాయాలు లభించడం జరుగుతుంది. ఆదాయంలో మార్పులురావడంవల్ల ఆహారపదార్థాలకు డిమాండ్ ఏర్పడటంకానీ ఉన్న డిమాండ్ పెరగడం కాని జరుగుతుంది. పెరిగిన డిమాండ్‌కు అనుగుణంగా ఆహార పదార్థాల, ఇతర నిత్యావసర వినియోగ వస్తువుల ఉత్పత్తికూడా పెరగకుండా ఉంచే వాటి మధ్య అసమతౌల్యం ఏర్పడటం, పరిణామంగా ధరలు పెరగడం జరుగుతుంది. మనదేశంలో ఆర్థికాభివృద్ధిలో భాగంగా అనేకభారీ ప్రాజెక్ట్‌లను ప్రారంభించడం జరిగింది. ముఖ్యంగా భారీ నీటిపారుదల ప్రాజెక్ట్‌లను ఎన్నింటినో ప్రారంభించారు. వీటిచలన కాలం చాలా ఎక్కువగా ఉంటుంది. వీటినుంచి ఫలితాలను పొందడం-అంటే ఆహారధాన్యాల ఉత్పత్తినిపెంచడం-చాలాకాలం పడుతుంది. ఈ మధ్యకాలంలో నూతన ఆదాయ సృష్టి జరగడంవల్ల- ఆహార ధాన్యాలకోసం డిమాండ్ పెరుగుతుంది. ఫలితంగా వాటి కొరత సమస్య ఎదురవుతుంది.

ధరలు పెరగడాన్ని చలామణిలో ఉన్న ద్రవ్యం మొత్తం పెరగడం ఫలితంగా ఏర్పడిన పరిణామంగా కూడా భావించడం జరుగుతూ ఉంది. ద్రవ్యంమొత్తం పెరగడంవల్ల ధరలలో ఒడుదుడుకులు ఏర్పడతాయనేది సంప్రదాయక ఆర్థికవేత్తలవాదం. దేశంలో చలామణిలో ఉన్న ద్రవ్యం మొత్తం 1951 నుంచి ఏ విధంగా పెరుగుతూ వచ్చిందో కింది పట్టికను బట్టి తెలుసుకోవచ్చు.

| సంవత్సరం | ద్రవ్యం సప్లయ్ (రూ॥ కోట్లలో) | సూచీసంఖ్య |
|---|---|---|
| 1950-51 | 1,850 | 100 |
| 1960-61 | 2,870 | 155 |
| 1970-71 | 7,140 | 386 |
| 1978-79 | 21,860 | 1,180 |

మూలం : రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా బులిటిన్

1960-61 వ సంవత్సరంలో సప్లయ్ స్వల్పంగా (55%) పెరిగింది. కానీ ఆ తరవాతి దశాబ్దికాలంలో ద్రవ్యం సప్లయ్ విపరీతంగా పెరగడం గమనించవచ్చు. ద్రవ్యంసప్లయ్ పెరిగినంత మాత్రంతో ధరలు పెరగనవసరం లేదనే ఒక వాదముంది. వనరులను వివిధ

ఉత్పత్తిరంగాలకు సంతులితమైన నిష్పత్తిలో కేటాయించినప్పుడు ద్రవ్యోల్బణ రహితమైన వృద్ధి సాధ్యమవుతుంది. అంటే ఉన్న వనరులను వినియోగవస్తూత్పత్తి రంగానికి, మూలధన వస్తూత్పత్తి రంగానికి సంతులితమైన నిష్పత్తిలో కేటాయించినప్పుడు ద్రవ్యోల్బణంలేని అభివృద్ధి సాధ్యమవుతుందని కొందరు ఆర్థికవేత్తలు అభిప్రాయపడుతున్నారు. అంతేకాక దీర్ఘ ఫలన కాలమున్న భారీతరహా ప్రాజెక్ట్‌లను చేపట్టడంవల్ల నూతన ఆదాయాలను సృష్టించడం జరుగుతుంది. నూతన ఆదాయవర్గాలకు కొనుగోలుశక్తి లభించడంవల్ల వినియోగ వస్తువులకు డిమాండ్ పెరుగుతుంది. వినియోగవస్తువులకున్న డిమాండ్‌లో ఏర్పడిన పెరుగుదలకు అనుగుణంగా వస్తూత్పత్తి పెరగాల్సి ఉంటుంది. లేకుంటే డిమాండు సప్లయ్‌లలో అసమతౌల్యం ఏర్పడి, ధరల పెరుగుదలకు దారితీస్తుంది. భారీతరహా ప్రాజెక్ట్‌లవల్ల ఏర్పడవలసిన అదనపు ఉత్పత్తి ఆలస్యంగా జరుగుతుంది కాబట్టి డిమాండుకుతగ్గ సప్లయ్‌ని అందించలేకపోవడం జరుగుతుంది. ఈ కారణంగా ధరలలో విపరీతమైన ఒడుదుడుకులు ఏర్పడి ప్రజలకు నిత్య జీవితం దుర్భరమవుతుంది. ఈ విధమైన పరిణామాలు దేశవ్యాప్తంగా జరగడంవల్ల ఆర్థికంగా ఎన్నో ఒడుదుడుకులు ఏర్పడి అభివృద్ధి కృషి మందగిస్తుంది. అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థలలో ఎంతో కొంత ద్రవ్యోల్బణం అనివార్యమవుతుందనే సత్యాన్ని విస్మరించకూడదు.

ధరలను తగ్గించడానికి రాష్ట్రప్రభుత్వం ఎన్నో చర్యలు తీసుకొంటున్నది. అందులో నిత్యావసర వస్తువుల పంపిణీని వ్యవస్థీకరించడం, కొన్ని వస్తువుల ధరలు నిర్ణయించడం మొదలైనవి పేర్కొనదగినవి. ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం 23,760 చౌకధరల దుకాణాలున్నాయి. అంతేకాకుండా పౌరసంఘరా శాఖవారు కొన్ని దుకాణాలను తెరిచారు. ఈ దుకాణాలలో బియ్యం, పంచదార, కిరోసిను మొదలైనవి కంట్రోల్ ధరలకు సప్లయ్ చేయడం జరుగుతుంది.

ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని వస్తువుల తీరుతెన్నులు ఇట్లా ఉన్నాయి.

(క్వింటాల్ రూ॥లలో)

| వస్తువు | 1973 | 1978 | 1979 | 1980 |
|---|---|---|---|---|
| పంచదార | 380 | 400 | 225 | 700 |
| బెల్లం | 190 | 195 | 162 | 240 |
| పెసలు | 177 | 272 | 280 | 340 |
| సన్నబియ్యం | 231 | 237 | 227 | 230 |
| ఎండుమిర్చి | 500 | 655 | 650 | 690 |
| నువ్వులు | 425 | 450 | 415 | 520 |
| చింతపండు | 485 | 370 | 525 | 600 |
| నువ్వులనూనె | 800 | 1000 | 1070 | 1120 |

మూలం : ఈనాడు

ఆహారధాన్యాల సాలుసరి సగటు టోకు ధరలు (క్వింటాల్ - రూ. పై లలో)
(మార్చి చివరకు)

| వస్తువు | 1976-77 | 1977-78 | 1978-79 |
|---|---|---|---|
| ధాన్యం 1 వ రకం | 104.54 | 115.22 | 104.08 |
| ,, 2 వ రకం | 89.51 | 98.20 | 87.71 |
| బియ్యం 1 వ రకం | 178.98 | 197.48 | 185.13 |
| ,, 2 వ రకం | 154.44 | 169.17 | 155.94 |
| గోధుమలు (ఎర్రవి) | 165.66 | 188.35 | 171.49 |
| మొక్కజొన్నలు | 90.23 | 104.15 | 94.12 |
| జొన్నలు (తెల్లవి) | 125.98 | 113.55 | 93.44 |
| బజ్ర (సజ్జలు) | 97.03 | 102.63 | 86.15 |
| రాగులు | 96.08 | 99.57 | 82 95 |

మూలం : డైరెక్టర్ ఆఫ్ మార్కెటింగ్, ఆంధ్రప్రదేశ్

# 27

# వార్తా ప్రసార సాధనాలు

వార్తా ప్రసార సాధనాం ద్వారా సమాచారాన్ని, ఉద్దేశాలను వినోద, విజ్ఞాన కార్యక్రమాలను ప్రజలకు అందించవచ్చు. అన్ని తరగతుల ప్రజలకు అంటే కర్షకులకు, కార్మికులకు విద్యార్థులకు, మహిళలకు, పత్రికలు, రేడియో, దూర దర్శన్ మొదలైన వాటి ద్వారా వినోదాన్ని, విజ్ఞానాన్ని, కాలక్షేపాన్ని అందించవచ్చు. మానవ వికాసానికి వార్తా ప్రసార సాధనాలు తోడ్పడతాయనడంలో అతిశయోక్తి ఏమీలేదు. ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ రకాలైన వార్తా ప్రసార సాధనాలను గురించి ఈ అధ్యాయంలో తెలియజేయడం జరిగింది.

## వార్తా పత్రికలు

మన రాష్ట్రంలో వార్తా పత్రికల చరిత్ర శతాబ్దానికి హెచ్చుగానే ఉన్నది. వార్తా పత్రికల యుగానికి 1872 లో బందరులో పునాది ఏర్పడినట్లుగా తెలుస్తోంది. ఉమారంగనాయకులుగారు "పురుషార్థ ప్రదాయిని" అనే పత్రికను స్థాపించారు. తరవాత సాంఘిక సంస్కరణోద్యమ కర్త వీరేశలింగం పంతులుగారు 1874 లో "వివేకవర్ధనీ" 1875 లో "హాస్య సంజీవనీ", 1883 లో "సతీహిత బోధినీ", 1892 లో "సత్య సంవర్ధినీ", 1905 లో "సత్యవాదిని" మొదలైన పత్రికలను ప్రారంభించారు. ఆ కాలంలోనే మద్రాసు నుంచి ఎ. వి. పార్థసారథి నాయుడుగారు "ఆంధ్ర ప్రకాశిక" బెజవాడ నుంచి దేవగుప్తం శేషాచలపతిగారు "దేశాభిమాని" ని ప్రచురించడం జరిగింది. ఆ తరవాత సౌందర్యవల్లి, "హిందూ సుందరి", "అనసూయ", "మనోరమ", "సావిత్రి", "దేశమాత", "తెలుగు", "వజ్రాయుధం", "హాస్యవర్ధని", ఆంధ్ర సాహిత్య పరిషత్, సర్వాజ్ఞ, ఆంధ్రకేసరి, ఆంధ్ర పత్రిక, కృష్ణా పత్రిక, భారతి, తెలుగు స్వతంత్ర, జమీన్ రైతు, గోల్కొండ, ఆంధ్రవాణి, అభ్యుదయ, తెలంగాణా, మీజాన్, శోభ, ప్రజాశక్తి, ఆంధ్ర జనతా, గృహలక్ష్మి, ప్రజాబంధు, వాహిని, ప్రజామిత్ర, ప్రతిభ, ఆంధ్రభూమి, సాహితి, విజ్ఞానం, బాల, చందమామ, ఆంధ్రజ్యోతి, మొదలైనవి ఎన్నో పత్రికలు వచ్చాయి. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో దిన, వార, పక్ష, మాస, త్రైమాస పత్రికలెన్నో ఉన్నాయి. కాని మన రాష్ట్రంలో పత్రికలు చదివేవారి సంఖ్య పొరుగు రాష్ట్రాలైన కేరళ, తమిళనాడుతో పోల్చుకొన్నప్పుడు అతి స్వల్పమని చెప్పవలసి ఉంటుంది.

మన రాష్ట్రంలో తెలుగు ముద్రణ పరిశ్రమ కూడా చెప్పుకో దగినంతగా అభివృద్ధి చెందలేదు. తెలుగు ముద్రణ 18 వ శతాబ్దం పూర్వార్థంలోనే ప్రారంభమైనా ఈమధ్య కాలం

వరకు ఏమంత ప్రగతిని సాధించడం జరగలేదు. ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత పత్రికల సంఖ్య, పుస్తకాల ప్రచురణ సంఖ్య పెరగడంతో మన రాష్ట్రంలో ప్రింటింగ్ ప్రెస్‌ల సంఖ్య కూడా బాగా పెరిగింది. ఇటీవలి కాలంలో ఆఫ్‌సెట్ ప్రింటింగ్ కూడా ప్రాముఖ్యంలోకి వస్తున్నది.

మన రాష్ట్రంలో 1978-79 నాటికి గల ప్రింటింగ్ ప్రెస్‌లు, వార్తా పత్రికలు, మేగజీనులు, రిజిస్టరయిన పుస్తకాలను గురించిన వివరాలను కింద చూడవచ్చు.

| | | |
|---|---|---|
| ప్రింటింగ్ ప్రెస్‌లు | | 1,764 |
| వార్తా పత్రికలు, మాగజైనులు | | 7,456 |
| రిజిస్టరయిన పుస్తకాలు | | 935 |
| 1. తెలుగు | 738 | |
| 2. హిందీ | 21 | |
| 3. ఉరుదు | 14 | |
| 4. ఇంగ్లీషు | 108 | |
| 5. సంస్కృతం | 44 | |

పై సమాచారాన్ని 1977-78 సంబంధించి కింద యివ్వడమైంది.

| | జిల్లా | ప్రింటింగ్ ప్రెస్‌లు | పుస్తకాలు | పత్రికలు |
|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 30 | 2 | 19 |
| 2. | విశాఖపట్నం | 45 | 25 | 54 |
| 3. | తూర్పుగోదావరి | 210 | 70 | 66 |
| 4. | పశ్చిమగోదావరి | 195 | 37 | 200 |
| 5. | కృష్ణా | 210 | 480 | 1,265 |
| 6. | గుంటూరు | 233 | 75 | 119 |
| 7. | ప్రకాశం | 31 | 3 | 23 |
| 8. | నెల్లూరు | 83 | 15 | 208 |
| | కోస్తా ఆంధ్ర | 1,037 | 707 | 1,954 |
| 9. | కర్నూలు | 95 | 15 | 15 |
| 10. | అనంతపూరు | 73 | 1 | 23 |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 11. | కడప | 102 | 5 | 59 |
| 12. | చిత్తూరు | 83 | 27 | 119 |
| | రాయలసీమ | 353 | 48 | 216 |
| 13. | హైదరాబాదు | 235 | 239 | 4,095 |
| 14. | నిజామాబాదు | 14 | 3 | .... |
| 15. | మెదక్ | 1 | 1 | ... |
| 16. | మహబూబ్‌నగర్ | 1 | 5 | 1 |
| 17. | నల్గొండ | 14 | 1 | 3 |
| 18. | వరంగల్ | 42 | 3 | 49 |
| 19. | ఖమ్మం | 14 | 2 | 6 |
| 20. | కరీంనగర్ | 8 | .... | .... |
| 21. | ఆదిలాబాద్ | 5 | 1 | .... |
| | తెలంగాణా | 334 | 255 | 4,154 |
| | ఆంధ్రప్రదేశ్ | 1,724 | 1,010 | 6,324 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆంధ్రప్రదేశ్

**1978 జనవరినాటికి ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న వివిధ పత్రికల వివరాలు**

| | | తెలుగు |
|---|---|---|
| దినపత్రికలు | 34 | 22 |
| ద్వైవార పత్రికలు | 2 | 1 |
| వారపత్రికలు | 337 | 126 |
| ఇతరాలు | 523 | 314 |

మూలం : ఇండియా, 1979

**1978 జనవరి నాటికి తెలుగు పత్రికల సర్క్యులేషన్**

| | (వేలల్లో) |
|---|---|
| దినపత్రికలు | 332 |
| వారపత్రికలు | 364 |
| ఇతరాలు | 716 |

మూలం : ఇండియా, 1979

పెద్ద పెద్ద దినపత్రికలన్నీ హైదరాబాదు, విజయవాడల నుంచి ప్రచురితమవుతున్నాయి. రాష్ట్ర ప్రభుత్వానికి హైదరాబాదులో డైరెక్టరేట్ జనరల్ ఆధ్వర్యాన నడిచే సమాచారం, పౌర సంబంధాల డైరెక్టరేట్ ( Directorate of Information and Public Relations) ఉంది. దీనికింద 22 జిల్లా పౌర సంబంధాల ఆఫీసర్లు (District Public Relations Officers) ఒక్కొక్క తాలూకాకు ఒక్కొక్క పౌర సంబంధాల ఆఫీసరు ఉంటారు. వారే తమ తమ అధికార పరిధులలో అధికారిక వార్తలను (Official News) విడుదల చేస్తుంటారు.

భారత ప్రభుత్వం వారి ప్రెస్ ఇన్ ఫరమేషన్ బ్యూరో ఆఫీసు హైదరాబాదులో ఉంది. వారు కూడా వార్తా పత్రికలకూ, ఇతరత్రా వార్తలూ, ఫీచర్ ఆర్టికల్‌లూ విడుదల చేస్తూ ఉంటారు. న్యూఢిల్లీ నుంచి వార్తలు సేకరించడానికిగాను ఈ ఆఫీసువారు టెలిప్రింటర్ ఉపయోగిస్తారు. వీరికి మరొక ఆఫీసు విజయవాడలో ఉంది.

వార్తాపత్రికలకు ప్రధానంగా జాతీయ, అంతర్జాతీయ వార్తావిశేషాలు ప్రెస్ ట్రస్ట్‌ఆఫ్ ఇండియా (Press Trust of India) యునైటెడ్ న్యూస్ ఆఫ్ ఇండియా (United News of India) అనే రెండు ఏజన్సీలద్వారా అందుతాయి. ఈ రెండింటికీ హైదరాబాదు విజయవాడలలో ఆఫీసులున్నాయి. UNI కి ఈ రెండు చోట్లేకాక, విశాఖపట్నం, తిరుపతి, కర్నూలులలో కూడా ఆఫీసులున్నాయి. ఈ ఆఫీసులు రోజుకు 24 గంటలు నిర్విరామంగా పని చేస్తూ ఉంటాయి. ఇవికాక మన రాష్ట్రానికి హిందూస్థాన్ సమాచార్, సమాచార్ భారతి అనే రెండు హిందీన్యూస్ ఏజన్సీలు కూడా వార్తావిశేషాల నందజేస్తాయి. మెట్రోపాలిటన్ కేంద్రాల నుంచి ప్రచురితమయ్యే ప్రముఖ పత్రికలకు ప్రత్యేక విలేకరులు రాష్ట్ర రాజధాని అయిన హైదరాబాదులో ఉన్నారు.

అసోసియేటెడ్ న్యూస్‌సర్వీస్ అనేది ఈ రాష్ట్రంలో మొట్టమొదట ప్రాంతీయ న్యూస్ సర్వీస్. ఇది హైదరాబాదులో 1940 లో స్థాపించబడింది. ఇది ప్రాంతీయ, రాష్ట్రవ్యాప్త వార్తావిశేషాలను ప్రాంతీయ పత్రికలకు అందిస్తుంది. ఇదేకాక, ఇంకా ప్రాంతీయ, న్యూస్ ఏజన్సీలు కూడా ఉన్నాయి. ఇటువంటి వాటిలో ఒకటి "DATA న్యూస్ ఫీచర్స్" అనేది. ఇది ఇటీవల హైదరాబాదులో స్థాపించబడింది. ఇది వార్తాపత్రికలకు తెలుగు, ఇంగ్లీషు భాష

లలో ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించిన ఫీచర్ ఆర్టికల్స్ అందిస్తుంది. "డేటా ఆంధ్రప్రదేశ్" అనే ఫోర్ట్ నైటలీ డాక్యుమెంటేషన్ సర్వీసు, రికార్డర్ ఆఫ్ కరెంటు ఈవెంట్సును ప్రచురిస్తుంది. కొన్ని పత్రికలవారు స్వంతంగా న్యూస్ ఏజన్సీలను ఏర్పాటు చేసుకొన్నారు.

## రేడియో

ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటిసారిగా 1933 సంవత్సరంలో హైదరాబాదులో స్థాపించబడింది. దీనిని నగరంలోని చిరాగ్‌అలీ గల్లీలో ఒక వ్యక్తి పెట్టుకొన్నాడు. దీనిని అప్పటి నిజాం ప్రభుత్వం 1935 సం॥లో స్వాధీనం చేసుకొని దానికి "దక్కన్ రేడియో" అని పేరు పెట్టింది. అది అప్పటికి కేవలం 1/5 కిలోవాట్ల మీడియంవేవ్ ట్రాన్స్‌మీటరుతో దాదాపు హైదరాబాదు నగరానికి మాత్రమే పరిమితమై ఉండేది. 1950 లో కేంద్రప్రభుత్వం ఆల్ ఇండియా రేడియోశాఖ ఈ కేంద్రాన్ని తన అధీనంలోకి తీసుకొంది. 1957లో ఈ కేంద్రాన్ని ప్రస్తుతం ఉంటున్న రాక్‌ల్యాండ్స్‌కు మార్చి,5 కిలోవాట్ల అధునాతన ట్రాన్స్‌మిటర్‌ను ఏర్పాటు చేశారు. 1958 లో రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకూ ప్రసారాలు అందాలని 10 కిలోవాట్ల షార్ట్‌వేవ్ ట్రాన్స్‌మిటరును ఏర్పాటు చేశారు. 1966 లో 50 కిలోవాట్ల హైపవర్ ట్రాన్స్‌మిటర్‌ను ఏర్పాటు చేశారు. 1971 లో హైదరాబాదునుంచి వాణిజ్య ప్రసార విభాగం ప్రారంభించారు. దీనిని 1972 లో 10 కిలోవాట్ల మీడియంవేవ్ ట్రాన్స్‌మిటర్‌గా మార్చారు.

విజయవాడ కేంద్రం 1948 లో ప్రారంభించబడింది. స్వాతంత్ర్యానంతరం దేశంలో ఆకాశవాణి కేంద్రాల అభివృద్ధికి భారత ప్రభుత్వం కృషి కారణంగా ఆంధ్రులకోసం ప్రత్యేకంగా ఈ కేంద్రం ఏర్పాటయింది. ప్రారంభంలో ఇది 1 కిలోవాట్ శక్తితో మీడియంవేవ్ ట్రాన్స్‌మిటరులో ఉండేది. ఇది 1966 నుంచి విజయవాడ'బి' పేర వివిధ భారతి ప్రసారాలకై వినియోగింపబడుతోంది. ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత 20 కిలోవాట్ల శక్తిగల మీడియంవేవ్ ట్రాన్స్‌మిటరును విజయవాడ 'ఏ' కేంద్రం పేర విజయవాడకు 20 మైళ్ళ దూరానగల నంబూరులో 1956 లో స్థాపించబడింది.

విజయవాడ, హైదరాబాదు, కేంద్రాలపై రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల ప్రజలూవినే అవకాశం లేదు. అందువల్ల విశాఖపట్నం, కడపలకో, రిలేకేంద్రాలు ప్రారంభింపబడ్డాయి. విశాఖపట్నంలో 10 కిలోవాట్ల మీడియంవేవ్ ట్రాన్స్‌మిటర్‌తోను, కడపలో 20 కిలోవాట్ల మీడియంవేవ్ ట్రాన్స్‌మిటర్‌తోను ఈ స్టేషన్లు 1963 లో ప్రారంభింపబడ్డాయి. వీటివల్ల కోస్తా జిల్లా లన్నింటిలో ప్రజలకు విజయవాడ, హైదరాబాదు కేంద్రాలనుంచి ప్రసారమయ్యే కార్యక్రమాలు వినేఅవకాశం కలిగింది.

1970 నుంచి విశాఖపట్నం కేంద్రంలో అక్కడే తయారైన ప్రోగ్రాంలు కూడా ప్రసారమవుతున్నాయి. ఇక్కడ 100 కిలోవాట్ల శక్తిగల ప్రసారకేంద్రం నెలకొల్పడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇందుకు కారణం విశాఖపట్నం ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికంగా, నౌకాయానదృష్ట్యా ప్రముఖ పట్టణం కావడమే.

వీటి అన్నిటితో ప్రస్తుతం రాష్ట్రంలో హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్నం, కడప లో రేడియో కేంద్రాలు నాలుగున్నాయి. ఆకాశవాణిలో వివిధభారతి విభాగం ఫిల్మ్

సంగీతానికి ప్రాముఖ్యం ఇవ్వడంవల్ల అది బాగా జనరంజకమయింది. వాణిజ్యప్రసారవిభాగం వ్యాపార ప్రకటనలు ఇస్తుంది. ఇదే ఆకాశవాణికి ముఖ్యమైనఆదాయం.

1973 లో కట్టిన లెక్కల ప్రకారం, హైదరాబాదులోని ఎ.ఐ.ఆర్ కేంద్రాలనుంచి ఏక కాలంలో ప్రసారాలు జరుగుతాయి కనుక, ఈ రేడియో ప్రసారాలు రోజుకు 46 గంటలని అంచనా వేశారు. హైదరాబాదులో వివిధ భాషలకు చెందినవారున్నారు కనుక రేడియో ప్రసారాలు ప్రధానంగా తెలుగులోనే జరిగినా, ఇంగ్లీషు, ఉర్దూ, హిందీ, సంస్కృత, కన్నడ, మరాఠీ భాషలలో కూడా ప్రోగ్రాంలు వస్తాయి. రేడియోలో వివిధ అంశాల కార్యక్రమాలు ప్రసారం చేసినా, ముఖ్యమైనవి వ్యవసాయం, దానికి సంబంధించిన అంశాలు, జాతీయ, అంతర్జాతీయ వార్తా విశేషాలు.

హైదరాబాదు ఆకాశవాణికేంద్రం 1978లో మొట్టమొదటిసారిగా సంగీతానికి సంబంధించిన బహుమతి పొందింది. 'సంగీత విశ్వజనీనత' అనే అంశంలో సంగీత వ్యవస్థలను చిత్రించే అఖిలభారత పోటీలో శ్రీ ఎన్. ఎస్. శ్రీనివాసన్ అనే ఆయన ఎంపిక అయ్యారు. సాంప్రదాయక సంగీత కార్యక్రమాల విషయంలో హోంసోబుకం ఫౌండేషన్ ఏర్పాటుచేసిన రేడియోబహుమతిని 1979 లో శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు 'శివతాండవం' అనే సంగీతరూపకానికి పొందారు.

1977 లో జారీచేసిన రేడియో లైసెన్సులు 17,29,000 రాబడి రు. 2,53,98,000లు 1978 లో జారీచేసిన లైసెన్సులు 14,84,500. రాబడి రు. 2,03,29,000లు.

## దూర్ దర్శన్

సాటిలైట్ ఇన్‌స్ట్రక్షనల్ టెలివిజన్ ఎక్స్‌పెరిమెంట్ (**Satellite Instructional Television Experiment — SITE**) అనుసరణ కార్యక్రమం కింద దేశంలో నెలకొల్పిన ఆరు దూరదర్శన్ కేంద్రాలలో హైదరాబాదు ఒకటి. దేశ సామాజికార్థికాభివృద్ధికి, ప్రత్యేక విద్యను విభిన్నరీతులలో గరపడానికి ఉద్దేశించినకార్యక్రమమిది. అటు గ్రామీణ ప్రాంతాల వారికే కాక ఇటు నగరవాసులకు కూడా అనువుగాఉండేటట్లు ప్రసారాలను రూపొందించడం జరిగింది.

హైదరాబాదులోని దూర్‌దర్శన్ కేంద్రాన్ని 23-10-77 న ప్రారంభించారు. దీని ప్రసార పరిధి 75 కి. మీటర్లు. నగరానికి చుట్టూ 17,000 కి.మీ విస్తీర్ణంలోని ప్రజలకిది ఉపయోగపడుతున్నది. అంటే 38 లక్షల మందికి ఇది సేవల నందిస్తున్నదన్నమాట.

SITE కార్యక్రమం కింద రాష్ట్రంలో ఎన్నికచేసిన జిల్లాలు హైదరాబాదు, మెదక్, మహబూబ్‌నగర్; కర్నూలు జిల్లాలు. ఒక్కొక్క జిల్లాలో నూరేసి గ్రామాలకు ఈ ప్రసారాలను నిర్దేశించడం జరిగింది. ఆ గ్రామాలలో ప్రాథమిక పాఠశాలల ఆవరణలలోను, పంచాయతీ భవనాలలోను టెలివిజన్ రిసీవర్లను ఏర్పాటు చేశారు. అమెరికావారు టెలివిజన్ ప్రసారాలకుగాను అంతరిక్షంలో నిలిపిన ఉపగ్రహం ద్వారా ప్రసారమయ్యే కార్యక్రమాలు రూపొందించడానికి హైదరాబాదులో ఒక కేంద్రం స్థాపించబడింది. ఈ కార్యక్రమాలను మాగ్నటిక్

టేప్ మీదికి మళ్ళించి అహమ్మదాబాదు పంపుతారు. అక్కడఉన్న ప్రసార యంత్రంద్వారా ఆ కార్యక్రమం ఉపగ్రహానికి చేరుతుంది. ఉపగ్రహం ఆ కార్యక్రమాలను తిరిగి భూమిమీదికి ప్రసారం చేస్తుంది. ఈ కార్యక్రమాలు ప్రధానంగా గ్రామీణులను దృష్టిలో పెట్టుకొని రూపొందించినవి. వారికి వీలయినంత ఎక్కువ విజ్ఞానాన్ని అందించి, వారి జీవన విధానాన్ని మెరుగుపరచాలన్న ఉద్దేశ్యమే దీనిలో ప్రధానం. వీటిలో ముఖ్యాంశాలు వ్యవసాయరంగం విద్యా ప్రసారం; వినోద కార్యక్రమాలు. ప్రతి శనివారం ఒక హిందీ చలనచిత్రం, ప్రతి ఆదివారం ఒక తెలుగు చలనచిత్రం ప్రసారమవుతున్నాయి.

1978 లో 9,786 టెలివిజన్ లైసెన్సులు జారీ చేయబడ్డాయి. వాటివల్ల రాబడి రూ. 71,300 లు. 1977 లో 4,400 టెలివిజన్ లైసెన్సులు జారీచేశారు. వాటివల్ల రాబడి రూ. 69,600 లు.

# 28

# క్రీడారంగం

ఆరోగ్యవంతమైన మనసు ఆరోగ్యవంతమైన శరీరంలో ఉంటుందనేది సుస్పష్టం. ఆరోగ్యవంతమైన శరీరానికి ఆహారం ఎంత అవసరమో, వ్యాయామం కూడా అంతేఅవసరం. శరీరంలోని అన్ని అంగాలు వాటి పనులను సక్రమంగా నిర్వర్తించడానికి, శరీరంలోని మలినాలు తొలగించడానికి, శరీర పటుత్వానికీ, వ్యక్తి ఉత్సాహంగా ఉండటానికి వ్యాయామం అవసరం. వ్యాయామం వల్ల దేహ దారుఢ్యం పెరుగుతుంది. మనస్సుకు ఉల్లాసం కలుగుతుంది. నాయకత్వ లక్షణాలు పెంపొందుతాయి. బృందభావం అలవడుతుంది, సహకారభావం పెరుగుతుంది, ఆరోగ్యవంతమైన పోటీకి వీలు కలుగుతుంద అని విద్యావేత్తల అభిప్రాయం. విద్యాభ్యాసంలో వ్యాయామ క్రీడలకు అనాదినుంచీ ప్రాధాన్యమిచ్చినట్లు గమనించవచ్చు. భారతీయ వ్యాయామ విద్యను గురించిన ప్రామాణిక ఆధారాలు లభ్యం కానప్పటికీ ఆర్యుల కాలంలో కత్తియుద్ధం, గుర్రపు స్వారీ, రథాల పరుగులకు ప్రాధాన్యమిచ్చినట్లు, అట్లాగే, రామాయణకాలంలో యోగాసనాలు, సూర్యనమస్కారాలు, ప్రాణాయామం, బౌద్ధుల కాలంలో విలువిద్య, మహమ్మదీయుల కాలంలో కత్తియుద్ధం, గుర్రపుస్వారీలు ప్రాచుర్యంతో ఉన్నట్లు తెలియవస్తున్నది. బ్రిటిష్ వారి కాలంలో వ్యాయామక్రీడలు బాగా వ్యాప్తిలోకి వచ్చినాయి. క్రికెట్, హాకీ, టెన్నిస్, వాలీబాల్, మొదలైన నియతక్రీడలుప్రాచుర్యంసంతరించుకొన్నాయి. భారతదేశంలో మొదటిసారిగా హెచ్. సి. బక్ 1928 లో వై. ఎమ్. సి. ఏ. వ్యాయామ విద్యా కళాశాలను స్థాపించాడు.

ఆంధ్రప్రదేశ్‌లో క్రీడలను, ఆటలను, సువ్యవస్థితం చేసి అభివృద్ధి పరచడానికి గాను ఈ రంగాలకు సంబంధించిన కేంద్ర సంస్థగా ఆంధ్రప్రదేశ్ స్పోర్ట్స్ కౌన్సిల్ (ఆంధ్రప్రదేశ్ క్రీడా మండలి) ని 1958 లో (11-12-1958) స్థాపించడం జరిగింది. నాటినుంచి ఇది ప్రభుత్వ సలహాదారుగా రాష్ట్రంలోని క్రీడారంగం అభివృద్ధికి దోహదం చేస్తూ వస్తున్నది.

## ఆంధ్రప్రదేశ్ క్రీడామండలి

ఈ మండలి కేంద్ర కార్యాలయం హైదరాబాదులోని లాల్ బహదూర్ స్టేడియం ఆవరణలో ఉంది.

1. రాష్ట్రంలోని గుర్తింపు పొందిన అన్ని ఆటల పోటీలను అభివృద్ధి పరచడం.
2. క్రీడా సంఘాల మధ్య సయోధ్య పెంపొందించడం

3. రాష్ట్రంలోని యువతీయువకుల పాటవాలను గుర్తించి, అర్హులకు తగిన శిక్షణ లిప్పించడం

4. గ్రామీణ ప్రాంతాలలో కూడా క్రీడాభిరుచులను పెంపొందించడం మొదలైనవి ఈ మండలి లక్ష్యాలు.

రాష్ట్ర ముఖ్యమంత్రి ఈ మండలి అధ్యక్షులు. క్రీడారంగ శాఖను నిర్వహించే మంత్రి దీని ఉపాధ్యక్షులు, డైరెక్టర్ ఆఫ్ స్పోర్ట్స్ అండ్ యూత్ సర్వీసెస్ ఈ మండలి కార్యదర్శి. వీరుకాక, విద్యా, ఆర్థిక, కార్మిక శాఖల ప్రభుత్వ కార్యదర్శులు, డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్, ఛీఫ్ ఇంజనీర్ (రోడ్స్ అండ్ బిల్డింగ్స్), వివిధ క్రీడా సంఘాల ప్రతినిధులు, జిల్లా క్రీడా మండలి ప్రతినిధులు, విశ్వవిద్యాలయాల ప్రతినిధులు, విద్యాశాఖ నుంచి ప్రతినిధులు, రాష్ట్రంలో పేరుపొందిన క్రీడాకారులలోఐదుగురు, సచివాలయం నుంచి ఇద్దరు, స్థానికసంస్థల ప్రతినిధులు ఈ మండలి సభ్యులు.

ఈ మండలికి రాష్ట్ర ప్రభుత్వం గ్రాంట్ల రూపంలో ఆర్థిక సహాయమందజేస్తుంది. ఉదాహరణకు 1977-78 లో ఈ మండలికి రాష్ట్రప్రభుత్వం 21.79 లక్షల రూపాయలను, 1979-80 లో 27.35 లక్షల రూపాయలను నాన్-ప్లాన్ కింద మంజూరు చేసింది.

ఈ మండలి రాష్ట్రంలోని విభిన్న క్రీడా సంఘాలకు , జిల్లాస్థాయి క్రీడా మండలులకు, ఆర్థిక సహాయాలందజేస్తుంటుంది. ప్రస్తుతం రాష్ట్రంలో విభిన్న క్రీడలకు సంబంధించి 42 సంఘాలు ఈ మండలికి అనుబంధంగా ఉన్నాయి.

1. ఏ.పి. అమెచూర్ అథ్లెటిక్ అసోసియేషన్
2. ఏ.పి. ఫుట్‌బాల్ అసోసియేషన్
3. ఏ.పి. ఒలింపిక్ అసోసియేషన్
4. ఆంధ్రా క్రికెట్ అసోసియేషన్
5. హైదరాబాదు క్రికెట్ అసోసియేషన్
6. ఆంధ్రా హాకీ అసోసియేషన్
7. హైదరాబాదు హాకీ అసోసియేషన్
8. ఏ.పి. బాడ్‌మింటన్ అసోసియేషన్
9. ఏ.పి. బాక్సింగ్ అసోసియేషన్
10. ఏ.పి సైక్లింగ్ అసోసియేషన్
11. ఏ.పి. ఇండియన్ స్టైల్ రెస్లింగ్ అసోసియేషన్
12. ఏ.పి. కో-కో అసోసియేషన్
13. ఏ.పి. లాన్ టెన్నిస్ అసోసియేషన్
14. ఏ.పి. రైఫిల్ అసోసియేషన్

15. ఏ.పి. టేబుల్ టెన్నిస్ అసోసియేషన్
16. ఏ పి. అమెచూర్ ఆక్వాటిక్ అసోసియేషన్
17. ఏ.పి. జిమ్నాస్టిక్ అసోసియేషన్
18. ఏ.పి. వాలీబాల్ అసోసియేషన్
19. ఆంధ్రా బాల్ బాడ్మింటన్ అసోసియేషన్
20. హైదరాబాదు బాల్ బాడ్ మింటన్ అసోసియేషన్
21. ఏ.పి. వెయిట్ లిఫ్టింగ్ అసోసియేషన్
22 ఏ.పి. చెస్ అసోసియేషన్
23. ఏ.పి. స్టేట్ బ్రిడ్జ్ అసోసియేషన్
24. ఏ పి. బాస్కెట్ బాలు అసోసియేషన్
25. ఆంధ్రా అమెచూర్ రెస్లింగ్ అసోసియేషన్
26. హైదరాబాదు అమెచూర్ రెస్లింగ్ అసోసియేషన్
27. ఆంధ్రా కబడీ అసోసియేషన్
28. హైదరాబాదు కబడీ అసోసియేషన్
29. ఏ.పి. జూడో అసోసియేషన్
30. ఏ.పి. టెనికాయిట్ అసోసియేషన్
31. ఏ.పి. అట్యా-పట్యా అసోసియేషన్
32. ఏ.పి. సైకిల్ పోలో అసోసియేషన్
33. ఏ.పి. సాఫ్ట్ బాల్ అసోసియేషన్
34. ఏ.పి. బిలియర్డ్స్ అసోసియేషన్
35. ఏ.పి. హాండ్‌బాల్ అసోసియేషన్
36. ఆంధ్రా కారమ్స్ అసోసియేషన్
37. హైదరాబాదు కారమ్స్ అసోసియేషన్
38. ఏ.పి. బాడీ బిల్డర్స్ అసోసియేషన్
39. తెలంగాణా బాడీ బిల్డింగ్ అసోసియేషన్
40. ఏ.పి. అసోసియేషన్ ఆఫ్ డెఫ్
41. ఏ.పి. విమెన్స్ క్రికెట్ అసోసియేషన్
42. ఏ.పి. ఆర్చెరీ అసోసియేషన్

ఈ సంఘాలకు ఆర్థికసహాయమే కాకుండా కోచ్‌ల సహాయం, క్రీడల నిర్వహణ నిమిత్తం ఆటస్థలాలను, క్రీడాసామగ్రిని కూడా ఉచితంగా ఈ మండలి అందజేస్తుంది.

పైన వివరించిన 42 సంఘాలే కాకుండా రాష్ట్రంలోని గ్రామీణ యువకుల పాటవాలను పెంపొందించడానికి జిల్లాస్థాయి క్రీడామండలులున్నాయి. ఈ రంగంలో రాష్ట్ర క్రీడామండలి జిల్లా మండలులకు ఆర్థిక సహాయమే కాకుండా కోచింగ్ సదుపాయాలు కూడా అందిస్తుంది.

ఆయా క్రీడలకు సంబంధించి కోచింగ్ ఇవ్వడానికిగాను ఈ మండలి అధీనంలో 84 మంది కోచ్‌లున్నారు. వీరు కాకుండా జాతీయకోచింగ్ కార్యక్రమం కింద నేతాజీ సుభాస్ నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్స్, పాటియాలా మరో 15 మంది కోచ్‌లను రాష్ట్రమండలికి అప్పగించింది. వివిధ క్రీడలకు సంబంధించిన కోచ్‌ల సంఖ్యలను దిగువ సూచించినాము.

| క్రీడలు | మండలికోచ్‌లు | జాతీయకోచ్‌లు |
|---|---|---|
| అథ్లెటిక్స్ | 6 | 2 |
| బాల్ బాడ్మింటన్ | 2 | .... |
| బాస్కెట్‌బాల్ | 10 | 3 |
| క్రికెట్ | 5 | 1 |
| సైక్లింగ్ | 1 | .... |
| ఫుట్‌బాల్ | 7 | .... |
| జిమ్నాస్టిక్స్ | 5 | 1 |
| బాక్సింగ్ | .... | 1 |
| హాండ్‌బాల్ | 2 | .... |
| హాకి | 7 | 2 |
| కబడీ | 5 | .... |
| కో-కో | 4 | .... |
| షటిల్ బాట్మింటన్ | 4 | 1 |
| స్విమింగ్ | 2 | .... |
| టేబుల్ టెన్నిస్ | 4 | 1 |
| టెన్నిస్ | 2 | 1 |
| వాలీబాల్ | 2 | 1 |
| వెయిట్ లిఫ్టింగ్ | 5 | 1 |
| రెస్లింగ్ | 2 | .... |

మూలం : ఆంధ్రప్రదేశ్ క్రీడామండలి అందించిన సమాచారం.

ఇవికాక రాష్ట్ర క్రీడామండలి దిగువ పేర్కొన్న సహాయ సహకారాలు అందిస్తున్నది. కొన్నిటిని నిర్వహిస్తున్నది.

1. కోచింగ్ సెంటర్లలో శిక్షణ పొందేవారికి ఉచితంగా క్రీడాసామగ్రి
2. జూనియర్ బాలబాలికలకు వేసవి సెలవులలో శిక్షణ శిబిరాలు నడపడం
3. క్రీడారంగంలో ఆధునిక పోకడలను వివరిస్తూ 1973 నుంచి ఈ సంస్థ ఒక క్రీడా పత్రికను ప్రచురిస్తున్నది. ఈ పత్రిక త్రైమాసికము
4. 750 పుస్తకాలున్న ఒక చిన్న గ్రంథాలయ నిర్వహణ
5. జాతీయ గ్రామీణ క్రీడల పోటీలలో ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్రేణులు గడించిన వారికి స్కాలర్‌షిప్‌లు.

6. 1973 నుంచి ఈ సంస్థ గ్రామీణ క్రీడా పథకాన్ని చేపట్టి రాష్ట్రస్థాయిలో వివిధ క్రీడా పోటీలను నిర్వహిస్తున్నది. వీరినుంచి జాతీయస్థాయి పోటీలకు ఎంపిక చేసుకొన్న వారికి ఉచితంగా కోచింగ్ ఒక నెలరోజులపాటు ఇస్తున్నది. ఇట్లా శిక్షణపొందిన వారిలో కొందరు XXV వ జాతీయ క్రీడలలో సాధించిన విజయాలను దిగువ సూచించినాము.

| క్రీడలు | డివిజను | పేరు | గడించిన స్థానం |
|---|---|---|---|
| లాంగ్‌జంప్ | మెన్ | ఏ. నాంచారయ్య | II |
| పోల్‌వాల్ట్ | సీనియర్‌బాయ్ | హరిగోపాల్ | III |
| 800 మీటర్ల పరుగుపందెం | సబ్‌జూనియర్‌బాయ్స్ | ఎస్. రాజేశ్వర్ | I |
| ,, | ,, | డి. నాగేశ్వరరావు | II |
| జావెలిన్ విసరడం | 16 సం॥ల బాలికలు | రెబెకాటూలీ | I |
| ,, | ,, | డి. ప్రమీల | II |
| జూడో (75 కేజీలు) | మెన్ | స్వామినాథ్ | III |
| జూడో (45 కేజీలు) | విమెన్ | నీలం డి. పండిట్ | I |
| జిమ్నాస్టిక్స్ | మెన్ | ఎమ్. జి. దత్తాత్రి | II |
| రెస్లింగ్ 48 (కేజీలు) | మెన్ | కృష్ణసింగ్ | II |
| రెస్లింగ్ (100 కేజీలపైన) | మెన్ | మహమ్మద్ సయీద్ | III |
| బాక్సింగ్ (ఫెదర్ వెయిట్) | మెన్ | ఎస్. చోటిమియా | I |
| బాక్సింగ్ (లైట్ ఫ్లైవెయిట్) | మెన్ | బి. యన్. ఓమ్‌ప్రకాష్ | II |

ఇవికాక ఈ పోటీలలో ఆంధ్రప్రదేశ్ పురుషులజట్టు హాండ్‌బాల్‌లో ద్వితీయస్థానం గడించింది.

7. 1975 నుంచి సమితి, జిల్లా, రాష్ట్రస్థాయిలో ఆటల పోటీలు ఈ మండలి నిర్వహిస్తున్నది. ఈ పోటీలలో గెలుపొందిన వారిని, రాష్ట్ర స్త్రీల జట్లను జాతీయస్థాయి పోటీలకు పంపుచున్నది.

1976 లో ఢిల్లీలో జరిగిన జాతీయ క్రీడోత్సవాలలో ఆంధ్రప్రదేశ్ స్త్రీల కబడీజట్టు వాలీబాల్ జట్టు ద్వితీయస్థానాలు గడించినాయి. 1977 లో బెంగుళూరులో జరిగిన జాతీయ క్రీడోత్సవాలలో ఆంధ్రప్రదేశ్ స్త్రీల టేబుల్ టెన్నిస్ జట్టు చాంపియన్‌షిప్ సంపాదించింది.

8. గిరిజన ప్రాంతాలలోని యువతీయువకులలో దాగిఉన్న పాటవాలను గుర్తించి, వాటిని పైకి తేవడానికి 1979 లో ఈ మండలి గిరిజన క్రీడాపథకాన్ని ప్రవేశపెట్టింది.

ఇవికాక వసతి గృహాలు, కొత్తఆటల మైదానాలు, మొదలైనవి నిర్మించి క్రీడారంగాన్ని అభివృద్ధి చేయవలెనని కూడా ఈ సంస్థ సమాయత్తమవుతున్నది.

## రాష్ట్రంలోని ప్రసిద్ధ ఆటల మైదానాలు

***1. లాల్ బహదూర్ స్టేడియం, హైదరాబాదు:*** ఇది రాష్ట్రంలోకెల్లా పేరెన్నికగన్నది. వివిధ క్రీడలు, పోటీలు మొదలైనవి జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో ఇక్కడ అప్పుడప్పుడూ నిర్వహిస్తుంటారు. క్రికెట్, ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్, కబడీ, కో-కో, రెస్లింగ్, టేబుల్ టెన్నిస్, జిమ్నాస్టిక్స్, బాక్సింగ్, బాల్‌బాట్ మింటన్, హాండ్‌బాల్ లకు సంబధించి కోచింగ్ సదుపాయాలున్నాయి.

***2. ఇన్-డోర్ స్టేడియం, హైదరబాదు :*** షటిల్ బాడ్‌మింటన్ తదితర ఇన్-డోర్ క్రీడలకు సంబంధించి జాతీయ, అంతర్జాతీయ పోటీలు జరుగుతుంటాయిక్కడ. ఈ క్రీడలలో కోచింగ్ సదుపాయాలు కూడా ఉన్నాయి.

***3. జింఖానా గ్రౌండ్స్ సికిందరాబాదు :*** అథ్లెటిక్స్, బాస్కెట్‌బాల్, బాక్సింగ్, క్రికెట్, సైక్లింగ్, ఫుట్‌బాల్, జిమ్నాస్టిక్స్, హాకీ వంటి క్రీడలకు సదుపాయాలున్నాయి.

ఇవి కాక జంట నగరాలలో విక్టరీ ప్లేగ్రౌండ్స్, వై.యం.సి.ఏ. ప్లేగ్రౌండ్స్, పెరేడ్ గ్రౌడ్స్, ఫోషామహల్ స్టేడియం మొదలైన ఆటల మైదానాలు కూడా ఉన్నాయి.

***4. సంజీవరెడ్డి స్టేడియం, అనంతపురం :*** అథ్లెటిక్స్, బాస్కెట్‌బాల్, క్రికెట్, ఫుట్‌బాల్, హాకీ, వాలీబాల్, లకు సదుపాయాలున్నాయి.

***5. బ్రహ్మానందరెడ్డి స్టేడియం, గుంటూరు :*** అథ్లెటిక్స్, క్రికెట్, ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్, జిమ్నాస్టిక్స్, వాలీబాల్‌లకు సదుపాయాలున్నాయి.

***6. కడప స్టేడియం, కడప :*** అథ్లెటిక్స్, క్రికెట్, ఫుట్‌బాల్, హాకీ, కబడీ, బాస్కెట్‌బాల్, కో-కో, జిమ్నాస్టిక్స్, వెయిట్ లిఫ్టింగ్, వాలీబాల్.

***7. మునిసిపల్ స్టేడియం, విజయవాడ :*** అథ్లెటిక్స్, బాస్కెట్‌బాల్, బాల్‌బాడ్ మింటన్, క్రికెట్, ఫుట్‌బాల్, హాకీ, కబడీ, కో-కో, టేబుల్ టెన్నిస్, వాలీబాల్, వెయిట్ లిఫ్టింగ్.

*8. చిత్తూరు స్టేడియం, చిత్తూరు :* అథ్లెటిక్స్, ఫుట్‌బాల్, క్రికెట్, హాకీ.

ఇవి కాకుండా రాష్ట్రంలో వివిధ విశ్వ విద్యాలయాలకు, కళాశాలలకు ప్రత్యేక ఆటల మైదానాలున్నాయి. కర్నూలు వంటి చోట్ల ప్రత్యేక స్విమింగ్ పూల్స్ కూడా ఉన్నాయి.

## గుర్రపు పందాలు

ఆంధ్రప్రదేశ్‌లో హైదరాబాదు, మలక్‌పేటలో రేస్‌క్లబ్ ఉంది. ఇది 1977 కి పూర్వం మద్రాసు రేస్‌క్లబ్ కింద ఉండేది. అయితే యిప్పుడు స్వతంత్ర ప్రతిపత్తిగల క్లబ్ అయింది. సంవత్సరానికి రెండు సీజన్లలో గుర్రపు పందాలు జరుగుతాయి. జులై చివరి వారం నుంచి అక్టోబరు ఆఖరి వారం వరకూ వర్షాకాలం సీజను జరుగుతుంది. నవంబరు మొదటి వారం నుంచీ ఫిబవరి ఆఖరి వారం వరకూ శీతాకాలపు సీజను జరుగుతుంది. ఈ రెండు సీజన్లలో కొన్ని వందల గుర్రాలు పరుగెత్తుతాయి. అంతే కాకుండా మద్రాసు, ఊటీ, బెంగుళూరు, కలకత్తా కేంద్రాలలో గుర్రపు పందాలు జరుగుతున్నప్పుడు ఇంటరేవెన్యూ బెటింగ్ సౌకర్యాలు ఉంటాయి. ఇక్కడ జరిగే రేసుల్లో నిజాం గోల్డ్‌కప్, ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా గోల్డ్‌కప్, దక్కను డర్బీ, గోల్కొండ సెంటలీగర్, గోల్కొండ డర్బీ, ఫిల్లెస్ ట్రయల్ స్టేక్స్, కోల్ట్ ట్రయల్ స్టేక్స్ మొదలైన ముఖ్యమైన రేస్ ఈవెంట్స్ జరుగుతాయి. అయిదేళ్ళ కొకసారి ఇన్విటేషను కప్, స్ప్రింటర్స్‌కప్ ఈ రెండు జరుగుతాయి. రేస్‌కొచ్చే లక్షలాది ప్రజలు జాక్‌పాట్, ట్రిబుల్ ఈవెంట్, విన్,ఫోర్‌కాస్ట్, క్వినెల్లా, తనాలా, బుక్కీస్ వద్దర బెటింగ్ ఆడుతూఉంటారు. బెటింగ్‌టాక్స్ కింద రాష్ట్ర ప్రభుత్వానికి ఏటా కొన్ని లక్షల రూపాయల ఆదాయం వస్తుంది.

హైదరాబాదు రేస్‌క్లబ్‌లో మూడు ఎన్‌క్లోజర్లు ఉన్నాయి. 1. సభ్యులకు 2. మొదటి ఎన్‌క్లోజరు; 3.రెండో ఎన్‌క్లోజరు. రేస్‌క్లబ్‌కు ఛైర్మన్, సెక్రటరీ స్టూవర్ట్స్ కమిటీఉంటుంది. అంతే కాకుండా కొన్ని వందల మందికి ఈ క్లబ్ ఉపాధి కల్పిస్తున్నది. గుర్రాలు కొనుగోలు చేసే సభ్యులకు ఋణ సదుపాయాన్ని క్లబ్ కలగజేస్తుంది.

## క్రీడారంగాలు — తెలుగు వారి ప్రతిభావిశేషాలు

*1. క్రికెట్ :* బ్రిటిష్ కాలంనాటి నుంచీ తెలుగు వారిపేరు క్రికెట్ ఆటలో వినిపిస్తూనే ఉంది. 1937-38 లో నాటి హైదరాబాదు జట్టు రంజీ ట్రోఫీని గెలుచుకొంది. ఈ కాలం లోనే ఇతర రాష్ట్రాలలో కొందరు తెలుగు క్రీడాకారులుండేవారు. అటువంటి వారిలో మధ్య ప్రదేశ్‌లో నివసించిన సి. కె నాయుడుగారిని ముఖ్యంగా పేర్కొవచ్చు. ఇతని కీర్తి ప్రతిష్ఠలు అంతర్జాతీయ స్థాయినందుకొన్నాయి.

ఆంధ్రప్రదేశ్ అవతరించక ముందునుంచి కూడా హైదరాబాదు టెస్ట్‌మాచ్ సెంటర్‌గా ఉంది. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో హైదరాబాదు జట్టు, ఆంధ్రాజట్టు అని రెండు క్రికెట్ జట్లున్నాయి. ఈ రెండింటిలో హైదరాబాదు జట్టు పటిష్ఠమైనది. ఇబ్రహీమ్‌ఖాను, గులాం అహ్మద్, పటౌడీ, జయసింహ, అబిద్‌ఆలీ వంటి జాతీయస్థాయి క్రీడాకారులు ఈ జట్టులో వారు. ఈనాటికీ శివలాల్‌యాదవ్, నరసింహారావు, షాహిద్ అక్బర్, జ్యోతిప్రసాద్ రామ్ నారాయణ్, కృష్ణమూర్తి మొదలైన సుప్రసిద్ధ ఆటగాళ్ళున్నారు.

ఆంధ్రాజట్టు ప్రస్తుతం అంత బలమైనదికాదు. కాని సి. కె. నాయుడు, మహరాజ కుమార్ ఆఫ్ విజయనగరం, సి. ఎస్. నాయుడు మొదలైన సుప్రసిద్ధ క్రీడాకారుల అండ దండలున్న జట్టిది. ఇటీవలి కాలంలో కుమార్, మెహర్‌బాబా, రామ్‌ప్రసాద్, రామారావు, చంద్రశేఖరరావు, రవికుమార్, నాయన మొదలైన వారు ఈ జట్టు తరపున ఆడిన వారిలో ముఖ్యులు.

నేడు క్రికెట్‌కు అనేక సంస్థల ఆదరాభిమానాలున్నాయి. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు, ఆంధ్రాబ్యాంక్, సిండికేట్ బ్యాంక్· దక్షిణ మధ్య రైల్వే వజీర్ సుల్తాను టొబాకో, దక్కను క్రానికల్ మొదలైన సంస్థలకు స్వంత జట్లున్నాయి. లీగ్ పోటీలు ఏటా నిర్వహించ బడుతున్నాయి.

అన్నిటి కంటె ఆంధ్రప్రదేశ్‌కు పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టింది. మొయిన్ ఉద్దౌలా గోల్డ్‌కప్ పోటీలు. ఈ పోటీలో జాతీయ జట్లే కాకుండా అంతర్జాతీయ క్రికెట్ జట్లుకూడా పాల్గొనడం విశేషము. 1980 లో జరిగిన గోల్డెన్ జూబిలీ పోటీ అత్యంత ఆకర్షణీయంగా సాగింది. ఈ ఏటి మేటిజట్టు గవాస్కర్ నాయకత్వంతో ఆడిన నిర్లాన్స్ జట్టు.

ఇటీవల కాలంనుంచి స్త్రీలజట్లుకూడా ఈ రంగంలో ప్రవేశించినాయి. జూనియర్, సీనియర్, విశ్వవిద్యాలయ స్థాయిలలో నేడు స్త్రీల క్రికెట్ జట్లున్నాయి. మంజుల, సంగీత, విద్య, కౌసార్, రాధిక, మీనాక్షి, వాణి, రంజని, రేణుక మొదలైనవారు తమ ప్రతిభను అప్పుడే చాటుకొన్నారు కూడా.

**2. ఫుట్‌బాల్ :** ఒకప్పుడు బాగా పేరు సంపాదించి, మరుగుపడిపోయి మళ్ళీ మన రాష్ట్రం ఇప్పుడిప్పుడే ఈరంగంలో వెలుగులోకి వస్తూన్నది. నేడు ఆంధ్రప్రదేశ్ జట్టు, రైల్వే జట్టు, పి అండ్ టి జట్టు, టెలిఫోన్సు జట్లు, ఈ ఎ మ్ ఈ జట్టు మొదలైనవి ఎన్నోఉన్నాయి. ఈ క్రీడకు సంబంధించి అప్పారావు, రాములు, వరహాలు, అప్పలరాజు, రహీమ్, హనుమంత రావు, బలరామ్, యూసఫ్‌ఖాను, తంగరాజ్, సయ్యద్‌నయీ ముద్దీను మొదలైనవారు సుప్రసిద్ధులు.

**3. వ్యాయామం :** వ్యాయామం అనగానే మనకు గుర్తుకువచ్చేది 'కోడి రామమూర్తి నాయుడు' అనే పేరు. జాతీయ, అంతర్జాతీయ కీర్తి ప్రతిష్ఠలు గడించిన ఈయన తెలుగువాడు ఈయన తరవాత ఈ రంగంలో సీతారామయ్య, పైడిరాధా, గులాం మొహియుద్దీను, అహ్మద్ బక్ష్, జోగారావు ప్రభృతులు ముఖ్యులు.

**4. ఇతర క్రీడలు :** ఈ రంగాలే కాకుండా వెయిట్‌లిఫ్టింగ్, కుస్తీ, శరీరసౌష్ఠవం, వాలీబాల్, బాల్ బాడ్మింటను, టెన్నిస్, షటిల్ బాడ్మింటను, కబడీ మొదలైన క్రీడలలో కూడా అనేక మంది ఆంధ్రులు పేరుతెచ్చుకొన్నారు. ఉదాహరణగా కామినేని ఈశ్వరరావు (వెయిట్ లిఫ్టింగ్), శ్రీమన్నారాయణరావు (వెయిట్ లిఫ్టింగ్), అర్జాజనార్ధనరావు (శరీర సౌష్ఠవం), వీర వెంకయ్య (కుస్తీ), నెల్లూరు కాంతారావు (కుస్తీ), రత్తయ్య (వాలీబాల్), సుందరరావు (వాలీబాల్), బుచ్చిరామయ్య (వాలీబాల్), పిచ్చయ్య, (బాల్ బాడ్మింటను), మిత్రాసోదరులు (టెన్నిస్) ప్రభృతులు.

అర్జున అవార్డు గ్రహీతలు :

| వ.సం. | పేరు | క్రీడారంగం | సంవత్సరం |
|---|---|---|---|
| 1. | శ్రీ టి. బలరామ్ | ఫుట్‌బాల్ | 1962 |
| 2. | శ్రీ కె. ఈశ్వరరావు | వెయిట్‌లిఫ్టింగ్ | 1963 |
| 3. | శ్రీ యూసఫ్‌ఖాన్ | ఫుట్‌బాల్ | 1966 |
| 4. | శ్రీ తంగరాజ్ | ఫుట్‌బాల్ | 1967 |
| 5. | శ్రీ మిర్ ఖాసిం | టేబుల్‌టెన్నిస్ | 1969 |
| 6. | శ్రీ జె. పిచ్చయ్య | బాల్‌బాడ్మింటన్ | 1970 |
| 7. | శ్రీ సయ్యద్ నయీముద్దీన్ | ఫుట్‌బాల్ | 1970 |
| 8. | శ్రీ సి. నారాయణన్ | బాక్సింగ్ | 1972 |
| 9. | శ్రీమతి జి. మునినిరెడ్డి | వాలీబాల్ | 1973 |
| 10. | శ్రీ ఎమ్. శ్యామసుందరరావు | వాలీబాల్ | 1973 |
| 11. | శ్రీ లతీఫ్ ఆలి ఇక్బాల్ | బాల్‌బాడ్మింటన్ | 1975 |
| 12 | శ్రీ ఏ. రమణారావు | వాలీబాల్ | 1977 |

# 29

# వినోద, విహార యాత్రాస్థలాలు

చరిత్రకారులకు, పురాతత్వ శాస్త్రజ్ఞులకు, యాత్రికులకేకాక, కేవలం వినోదం కోసం పర్యటించేవారికి కూడా ఆంధ్రప్రదేశ్‌లో అనేక స్థలాలు ఆసక్తిదాయకంగాను, ఆకర్షణీయంగాను ఉంటాయి. ఇటీవల నాగార్జునకొండ వద్ద బయటపడ్డ అమూల్యమైన శిధిలాలు అనేక వేల సంవత్సరాలక్రితం ఈ ప్రాంతాన్ని పాలించిన మహత్తర నాగరికతలను పర్యాటకుల ఊహను ప్రేరేపిస్తాయి. ప్రాచీన దేవాలయాలు వాటి శిల్ప విశేషాలు, అనేక కాలాలకు చెందిన శాసనాలు, వివిధ గిరిజన సమాజాలు వారి విలక్షణమైన వేషభాషలు, ఆచార వ్యవహారాలు - ఇవన్నీ పర్యాటకులకు కుతూహలాన్ని రేకెత్తిస్తాయి. అంతేకాకుండా తమ సహజసౌందర్యంతో చూసేవారి మనస్సును దోచుకొనే స్థలాలుకూడా ఉన్నాయి. ఆధునిక యుగంలో నాగార్జున సాగర్ వంటి ఇంజనీరింగ్ నైపుణ్యం ప్రదర్శించే కట్టడాలు కూడా ఉన్నాయి. అనేక లక్షల మంది జీవితాలను సుసంపన్నం చేస్తున్న ఇటువంటినిర్మాణాలు ఈనాటి దేవాలయాలు అనటం అతిశయోక్తికాదు. దేశ, విదేశ పర్యాటకులను ఆకర్షించి, వారికి కావలసిన రవాణా, నివాస, భోజన సౌకర్యాలు కల్పించి, అవసరమైన సమాచారాన్ని అందించడానికి రాష్ట్ర ప్రభుత్వం వారు 1974 లో ప్రత్యేకంగా పర్యాటనల శాఖను ఏర్పాటు చేశారు. హైదరాబాదు విమానాశ్రయం, నాగార్జునసాగర్, తిరుపతి, విశాఖపట్టణం, వరంగల్లులలో ప్రాంతీయ యాత్రా సమాచారకేంద్రాలున్నాయి. న్యూఢిల్లీలోకూడా ఒక కేంద్రం ఉంది. గైడ్‌లకు శిక్షణకోర్స్‌లను కూడా నిర్వహిస్తున్నారు. కొన్ని ప్రత్యేకయాత్రాస్థలాలను గురించి బుక్‌లెట్‌లు ప్రచురించారు. ఇవి యాత్రికులకు ఉచితంగా లభిస్తాయి. ఆయా టూరిస్ట్ ఇన్‌ఫర్‌మేషన్ ఆఫీసులనుంచి కావలసిన సమాచారాన్ని, సహాయాన్ని యాత్రికులు పొందవచ్చు.

ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని ముఖ్యమైన వినోద విహార యాత్రాస్థలాలను గురించి కింద వివరాలు సంక్షిప్తంగా ఇచ్చాము.

## హైదరాబాదు

ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరం హైదరాబాద్. మనదేశంలోని నగరాలలో పరిమాణంలో అయిదోది. హైదరాబాదు, సికిందరాబాదు కలిసి జంటనగరాలుగా ప్రసిద్ధి చెందాయి. ఇది భారతదేశంలో ఉన్న విభిన్న భాషా సంస్కృతుల కూడలి అనవచ్చు. ఈ నగరంలో చూడవలసిన స్థలాలు చాలా ఉన్నాయి.

*గోల్కొండకోట :* ఇది హైదరాబాదుకు 10 కి.మీ. దూరంలో ఉంది. 1518-1687 మధ్య ప్రాంతంలో ఈ ప్రాంతాన్ని పాలించిన ఖుతుబ్‌షాహి రాజులకు ఇది రాజధాని. ఇది ఒక కొండమీద ఉండటంవల్ల చాలా దూరంనుంచి కనిపిస్తుంది. ఈ కోట చుట్టుకొలత సుమారు 11 కి.మీ. దీని చుట్టూఉన్న రాతిగోడలో 8 గేట్లున్నాయి. ఈ కోట వాస్తుశిల్పం చాలా అసాధారణమైనది. ఇందులో నీటి సరఫరా వ్యవస్థ అద్భుతంగా ఉంటుంది. ఉద్యానవనాలు చూడ ముచ్చటగా ఉంటాయి. దీనిని ఔరంగజేబ్ 1687 లో ముట్టడించి స్వాధీనం చేసుకున్నాడు.

*ఉస్మాన్‌సాగర్ :* ఇది మూసీనది నుంచి ఏర్పరచిన పెద్ద సరస్సు. దీని వైశాల్యం 45 చ.కి.మీ. దీనినే గండిపేట రిజర్వాయర్ అని కూడా అంటారు. ఇక్కడకూడా ఒక ఉద్యానవనంఉంది. చాలామంది ఇక్కడికి పిక్నిక్‌కువెళుతూ ఉంటారు. సిటీ బస్సులుఉన్నాయి.

*చార్‌మినార్ :* దీనిని మహమ్మద్ కూలి ఖుతుబ్‌షా 1591 లో కట్టించాడు. ఇది హైదరాబాదులో ఉన్న కట్టడాలన్నిటిలోకి అత్యంతాకర్షణీయమైనది. దీనిలో తూర్పు, పడమర ఉత్తర దక్షిణ, దిక్కులకు అభిముఖంగా నాలుగు ఆర్చిలు ఉంటాయి. ఈ ఆర్చిల పైనుంచి నాలుగు శిఖరాలున్నాయి. వీటి ఎత్తు 55 మీ. వీటిలో పైకి ఎక్కడానికి మెట్లున్నాయి.

*మక్కామసీదు :* ఇది దక్షిణ భారతదేశంలోని అతి పెద్ద మసీదులలో ఒకటి. ఇందులో ఒకేసారి 10,000 మంది కూర్చుని ప్రార్థన చేసుకోవచ్చు. దీని నిర్మాణం 1614 లో మహమ్మద్ ఖుతుబ్‌షా ప్రారంభించాడు. తరవాత దానిని ఔరంగజేబ్ చక్రవర్తి పూర్తిచేశాడు. ఇది చార్‌మినార్ సమీపంలో ఉంది.

*పబ్లిక్‌గార్డెన్స్ :* పురజనుల వినోదానికి ఈ ఉద్యానవనం ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. దీనిచుట్టు గోడఉంది. ఇందులో శాసనసభ, శాసనమండలి, హెల్త్‌మ్యూజియమ్ బాల్‌భవన్, ఆర్కియాలజీ మ్యూజియమ్ మొదలైన భవనాలు ఉన్నాయి. ఈ ఉద్యానవనంలో అనేక రకాల మొక్కలు, చిన్న చిన్న సరస్సులు, గులాబితోట, పెదపెద్ద చెట్లు ఉన్నాయి.

*నెహ్రూ జంతుప్రదర్శనశాల :* ఇది నాంపల్లి స్టేషన్ నుంచి 10 కి.మీ. దూరంలో మీర్‌ఆలమ్ చెరువు సమీపంలో ఉంది. ఇక్కడ అనేకరకాల వన్యమృగాలు వాటివాటి సహజ పరిసరాలలో ఉంటాయి. పెద్దవారికి ఈతకొట్టడానికి, పడవషికారుకు సౌకర్యాలున్నాయి. చిన్న పిల్లలకి జూలాజికల్‌పార్కు చూడడానికి లోపల రైలుసౌకర్యం కూడా ఉంది.

*సాలార్‌జంగ్ మ్యూజియమ్ :* తూర్పుదేశాలలో ఉన్న వస్తుప్రదర్శనశాల అన్నిటిలోకి ఉత్తమమైనదిగా భావిస్తారు. మొత్తం చిన్నాపెద్దా అన్నీకలిపి 77 గదులున్నాయి. ఆభరణాలు పెయింటింగ్‌లు, శిలావిగ్రహాలు, కొయ్యచెక్కడాలు, అందమైన కర్రసామాను, కత్తులు అనేక లోహసామగ్రి ఉన్నాయి. జపాను, చైనా, ఫ్రాన్సు, ఇటలీ, ఇంగ్లండ్ దేశాల నుంచి వాటిని సాలార్‌జంగ్ సేకరించారు. ఇదొక జాతీయ మ్యూజియమ్.

*ఫతేమైదాన్ :* ఇక్కడ ఔరంగ్‌జేబ్ చక్రవర్తి తన శిబిరం ఏర్పాటు చేసుకొన్నాడని ప్రతీతి. ఇప్పుడు ఇక్కడ లాల్‌బహదూర్ స్టేడియమ్ ఉంది. అన్నిరకాల క్రీడలకు ఇదే కేంద్రం.

*రవీంద్రభారతి :* దీనిని 1961 లో నిర్మించారు. ఇది ఒక జాతీయ థియేటర్. ఇక్కడ నృత్య, నాటకప్రదర్శనలు, సమస్త సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతాయి.

*ఇందిరాపార్కు :* ఇటీవలి కాలంలో నెలకొల్పిన ఈ పార్కు దిన దినాభివృద్ధి చెందుతూ రాజధాని ప్రజలకు ఇతరత్రా యాత్రికులను విపరీతంగా ఆకర్షిస్తున్నది. టాంక్ బండ్ కింద రోడ్డులో ఉంది.

*ఫలక్‌నామాపేలస్:* ఇదొక కొండమీద ఉంది. ఇక్కడ నుంచిచూస్తే చుట్టూఉన్న ఊరు మనోహరంగా కనిపిస్తుంది. ఇక్కడ ఒకసారి రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ బసచేశారు. ఇక్కడఉన్న గ్రంథాలయంలో వ్రాతప్రతులు, ముద్రిత గ్రంథాలు ఉన్నాయి.

*బిర్లామందిర్ :* నౌబత్‌పహాడ్ మీద శ్రీ వెంకటేశ్వర స్వామివారి బిర్లామందిర్ ఉంది.

*హుసేన్‌సాగర్ :* దీని ఒడ్డునే జంటనగరాలను కలిపే రోడ్డు పోతుంది. ఇవికాకుండా హైదరాబాదులో చూడవలసిన ప్రదేశాలు చాలా ఉన్నాయి. వాటిలో ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైకోర్ట్, కింగ్‌కోఠి, రెసిడెన్సీ, హిమాయత్‌సాగర్ మొదలైనవి ముఖ్యమైనవి.

**విశాఖపట్టణం**

మన రాష్ట్రంలో హైదరాబాదు తరవాత పెద్దపట్టణం ఇదే. మన దేశంలోని ముఖ్య రేవు పట్టణాలలో ఇది ఒకటి. ఇక్కడనుంచి ముడిఇనుపఖనిజం జాపాన్‌కి ఎగుమతిచేస్తున్నారు. ఈ ఖనిజం ఓడలోకి ఎక్కించడానికి ఇక్కడ హార్బర్‌లో ఆటోమాటిక్ ఓర్‌హాండ్లింగ్ వసతి నిర్మించారు. ఇటీవల అవుటర్‌హార్బర్ కూడా నిర్మించారు. ఈ స్టరన్‌కమాండు నావల్ హెడ్‌క్వార్టర్స్ ఇక్కడే ఉంది. నావల్ కాడట్‌లకు శిక్షణ ఇచ్చే కేంద్రం, ట్రైనింగ్‌షిప్ కూడ ఇక్కడ ఉన్నాయి. డ్రైడాక్ కూడా ఉంది. హిందూస్తాన్ షిప్‌యార్డ్ మనదేశంలో మొట్టమొదటి ఓడలు నిర్మించే కర్మాగారము. పెట్రోలియమ్ నూనెశుద్ధి కర్మాగారం మన దేశంలో మూడోది. ఇక్కడ డాల్ఫిన్‌నోస్‌మీద నిర్మించిన లైట్‌హౌస్ ప్రపంచంలోని పెద్ద లైట్‌హౌస్‌లలో ఒకటి. అంతేకాకుండా ఇక్కడ చాలా పరిశ్రమలు కూడా ఉన్నాయి. జింక్ స్మెల్టర్‌ప్లాంట్, హిందూస్తాన్ హెవీప్లేట్స్ అండ్ వెసెల్స్, కోరమాండల్ ఫర్టిలైజర్స్ మొదలైనవి. విశ్వవిద్యాలయం కూడా చూడదగిన ప్రదేశాలలో ఒకటి. ఇటీవల ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణం ఇక్కడ చురుకుగా సాగుతోంది.

ఒకవైపు బంగాళాఖాతతీరం, ఇంకోవైపు కొండలు ఆవరించిఉన్న ఈ నగరంలో సహజ సౌందర్య దృశ్యాలు చాలా ఉన్నాయి.

**విజయవాడ**

మన రాష్ట్రంలోని ప్రధాన నగరాలలో ఇది ఒకటి. పెద్ద రైల్వేకూడలి. ఇక్కడరైల్వే స్టేషన్‌కూడా మనదేశంలోని పెద్దస్టేషన్‌లలో ఒకటి. విజయవాడ ఒక ముఖ్యవాణిజ్యకేంద్రం. ఇంద్రకీలాద్రి పర్వతంమీద అర్జునుడు తపస్సుచేసి శివుని దగ్గరనుంచి పాశుపతాస్త్రం సంపాదించాడని ప్రతీతి. ఇక్కడ ఉన్న మల్లేశ్వరస్వామి, కనకదుర్గ దేవాలయం చాలా ప్రసిద్ధమైనవి. మల్లేశ్వరస్వామి దేవాలయంలో మహాభారతం అంతా చెక్కబడి ఉంది. ఇక్కడ కృష్ణానదిమీద ఒకపెద్ద రైలువంతెన ఉంది. ప్రకాశంబారేజ్ కూడా ఇక్కడే ఉంది. 12 సంవత్సరాల కొకసారి ఇక్కడ పుష్కరాలు వైభవోపేతంగా జరుగుతాయి. ఇటీవల ఇక్కడ ఒక రైల్వేవేగన్ రిపేరింగ్ వర్క్‌షాపు నెలకొల్పారు. ఇక్కడ పెద్దసిమెంట్ ఫ్యాక్టరీఉంది.

**వరంగల్**

ఇది చారిత్రాత్మకంగా ప్రసిద్ధి చెందిన నగరం. కాకతీయ రాజుల రాజధానిగా దీనికి

12 వ శతాబ్దంలో చాలా ప్రాముఖ్యం ఉండేది. అక్కడ ఉన్న వేయిస్తంభాల గుడి ప్రత్యేక ఆకర్షణ. ఇది వరంగల్ నుంచి కాజీపేటపోయే రోడ్డుమీద హనుమకొండవద్ద ఉంది. దీనిని 12 వ శతాబ్దంలో రుద్రమదేవుడు అనే రాజు కట్టించాడు. శివుడు, విష్ణువు, సూర్యుడు ఈ ముగ్గురికి ఇది అంకితమయింది. అయితే విగ్రహాలుఉండవు. అయితే అక్కడఉన్న రమణీయ మైన శిల్పాలవల్ల ఈ సంగతి గ్రహించవచ్చు.

వరంగల్‌కోట చాలా పెద్దది. వరంగల్‌లో ఇప్పుడు కాకతీయ విశ్వవిద్యాలయం, రీజినల్ ఇంజనీరింగ్ కళాశాల, మెడికల్ కాలేజి ఉన్నాయి. కాజీపేట ఒక పెద్ద రైల్వే కూడలి. వరంగల్, కాజీపేట జంటనగరాలవలె ఉంటాయి.

***అరకులోయ :*** ఇది విశాఖపట్టణం నుంచి 127 కి.మీ. దూరంలో ఉంది. కొంతదూరం ఘాట్‌రోడ్‌మీద ప్రయాణంచేయాలి. అనంతగిరి దాటిన తరవాత 3827 అ॥ ఎత్తున సుంకరి మెట్ట వస్తుంది. సుంకరిమెట్ట నుంచి కొంచెం కిందికిపోతే 3200 అ॥ ఎత్తువద్ద అరకులోయ ఉంటుంది. ఇక్కడి ప్రకృతి దృశ్యాలు అత్యంత రమణీయంగా ఉంటాయి. అరకులోయలో అభివృద్ధి కార్యక్రమాలు చాలా అమలు జరుపుతున్నారు. ఇక్కడ ఉండే కొండ జాతుల వారు కూడా ప్రకృతి సౌందర్యాన్ని ఇనుమడింప జేస్తారు. ఇక్కడి జంతువృక్ష సంపద శాస్త్రజ్ఞులకు చాలా కుతూహలాన్ని కల్పిస్తుంది.

అనంతగిరి నుంచి మూడుమైళ్ల దూరంలో బొర్రాగుహాలున్నాయి. ఇవి కూడా చూడ వలసినదే. అరకులోయ నుంచి ఇంకా 53 మైళ్ల పైకిపోతే మాచ్‌కండ్ జలవిద్యుత్ ప్రాజెక్టు వస్తుంది. ఈ దారి అరకు తరవాత కొంతదూరంనుంచి ఒరిస్సా రాష్ట్రంలోనుంచి పోతుంది.

***హార్స్‌లీకొండలు :*** ఇది చిత్తూరు జిల్లాలోని మదనపల్లి సమీపంలో ఉన్న కొండ. ఇది 4100 అ॥ వరకు ఎత్తు ఉంటుంది. ఇక్కడ వృక్షసంపద వృక్షశాస్త్రజ్ఞులకు ఆసక్తికర మైనది. శీతోష్ణస్థితి ఆహ్లాదకరంగా ఉంటుంది. కొన్ని వన్యమృగాలు కూడా ఉంటాయి. దీనినే వేసవికాలపు విహారకేంద్రంగా అభివృద్ధి చేస్తున్నారు.

***మెదక్‌చర్చి :*** ఇక్కడ ఇంగ్లీష్ వెస్లియన్ మిషన్‌వారి కార్యకలాపాలు అర్ధశతాబ్దం పై నుంచి దక్షిణ భారతదేశంలో ప్రసిద్ధి చెందాయి. ఇక్కడ ఉన్న చర్చి శిల్పనైపుణ్యంవృష్ట్యా మనదేశంలోని ఉత్తమ చర్చిలలో ఒకటి. దీని నిర్మాణం 1914 లో ప్రారంభించి 1924లో పూర్తిచేసారు.

***నిజామ్‌సాగర్ :*** ఇది కామారెడ్డినుంచి 41 కి.మీ దూరంలో ఉంది. గోదావరినదికి ఉప నది అయిన మంజీర నదిమీద ఇక్కడ జలాశయం నిర్మించారు. దీనివైశాల్యం 129 చ.కి.మీ.

***రామప్పచెరువు :*** ఇది వరంగల్ జిల్లాలో రామప్పగుడి సమీపంలో ఉంది. దీనివైశాల్యం దాదాపు 21 చ.కి.మీ దీనిని కాకతీయరాజు గణపతి దేవుడు నిర్మించాడు. దీనినుంచి నాఱుపంట భూములకు సరఫరా అవుతుంది.

***పాకాలసరస్సు :*** ఇది హనుమకొండ నుంచి 50 కి.మీ దూరంలో ఉంది. వైశాల్యం 30 చ.కి.మీ దీనిచుట్టూ మూడువైపులా దట్టమైన అడవులతో నిండిన కొండలున్నాయి.

***పుట్టపర్తి :*** అనంతపురం జిల్లాలో ధర్మవరం సమీపంలో ఉన్న ఈ గ్రామంఇప్పుడు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా నిర్మించిన ప్రశాంతినిలయం ద్వారా ప్రపంచ ఖ్యాతి చెందింది. శ్రీ సత్యసాయి దర్శనార్థం ఇక్కడకు ప్రపంచలోని అన్ని ప్రాంతాలనుంచి భక్తులు అసంఖ్యాకంగా వస్తున్నారు. శ్రీ సత్యసాయిబాబా ఇక్కడ హైస్కూళ్ళు, కాలేజి, హాస్పిటల్, హాస్టల్‌లు భక్తులకు వసతి గృహాలు పెద్దఎత్తున నిర్మించారు. ఎంతమంది వచ్చినా ఇక్కడి క్యాంటిన్‌లో భోజన సదుపాయాలుంటాయి.

***కాళేశ్వరం :*** ఇది కరీంనగర్ జిల్లాలో మంతెనతాలూకాలో గోదావరి నదీతీరాన ఉన్న పవిత్రస్థలం. దీనిని దక్షిణకేశి అనికూడా అంటారు. దీనికి రెండువేల సంవత్సరాల చరిత్ర ఉంది.

***చిలకలపూడి :*** బందరు సమీపంలో ఉంది. ఇటీవల కాలంలో ఇక్కడ ఒకపెద్ద పాండురంగ దేవాలయం కట్టారు. ఇక్కడ ఆషాడమాసంలో ఏకాదశినాడు పెద్ద ఉత్సవం జరుగుతుంది.

***పోచంపల్లి :*** ఇది చీరల అద్దకానికి ప్రసిద్ధిచెందిన గ్రామము. ఇక్కడే ఆచార్య వినోబాభావె తన భూదాన ఉద్యమాన్ని ప్రారంభించాడు.

***జొన్నవాడ :*** ఇది నెల్లూరుకు 15 మైళ్ల దూరంలో ఉంది. ఇక్కడ మహాభారత కవులలో ఒకరైన తిక్కన ఇక్కడ యజ్ఞం చేసాడట. ఇక్కడ కామాక్షితాయి దేవాలయంఉంది.

***చింతపల్లి :*** ఇది విశాఖపట్టణం జిల్లాలో మన్యప్రాంతం. ఇది గూడెం ఏజెన్సీకి ముఖ్యపట్టణం ఇక్కడ వన్యమృగాలు ఎక్కువగా ఉంటాయి. చింతపల్లికి 50 మైళ్ల దూరంలో సైలేరు ప్రాజెక్ట్ ఉంది.

***విజయనగరం :*** ఇప్పుడు ఇదేపేరుతో కొత్తగా ఏర్పాటు చేసిన జిల్లాకు ముఖ్యపట్టణం. మొగల్‌యుగం అనంతరం ఇక్కడ విజయనగరం రాజులు పరిపాలించారు. ఇప్పటికీఇక్కడ ఒక పెద్దతోట ఉంది

**తిరుపతి**

వెంకటేశ్వరస్వామి ఆలయం భారతదేశంలో అత్యంత ప్రసిద్ధమైన దేవాలయం. హిందువులందరికీ అతి పవిత్రమైనది. ఈ ఆలయం తిరుపతి సమీపంలో 2800 అ॥ ఎత్తున తిరుమల కొండమీద ఉంది. ఇక్కడ వాతావరణం సంవత్సరం అంతటా ఇంచుమించు సమానంగా ఉంటుంది. పల్లవులు, చోళరాజులు పాండ్యరాజులు ఈ దేవాలయానికి తమ నిధులను చాలా ధారాళంగా వెచ్చించారు. విజయనగరం పాలకులు వీరందరికన్నా ఎక్కువగా విరాళాలిచ్చారు. కృష్ణదేవరాయలు విగ్రహం ఆయన జీవితకాలంలోనే ఇక్కడ ప్రతిష్ఠించడం జరిగింది. అది ఇప్పటికీ అక్కడ చూడవచ్చు. ఆ తరవాత వచ్చిన పాలకులు కూడా ఈ దేవాలయాన్ని బాగా పోషించారు. గద్వాల్, మైసూర్ మహారాజులు కూడా ఈ దేవాలయానికి బాగా విరాళాలిచ్చారు. ఈ దేవాలయ నిర్మాణశిల్పం దక్షిణభారతదేశంలోకెల్లా ప్రశస్తమైనది. దీని గోపురం, ధ్వజస్తంభం చాలా పెద్దవి. ఇక్కడ జరిగే పూజలు, అర్చనలు రామానుజా

చార్యుడు నిర్దేశించిన ప్రకారం ఈ నాటికీ కొనసాగుతున్నాయి. ఈ దేవాలయం సమీపంలో స్వామి పుష్కరిణి సరస్సు ఉంది. ఇందులో భక్తులు స్నానంచేసి వస్తారు. ప్రతిరోజు దాదాపు 10,000 మంది భక్తులు స్వామిని దర్శిస్తారు సెప్టెంబర్ అక్టోబర్ మాసాలలో బ్రహ్మోత్సవం జరుగుతుంది. కింది తిరుపతిలో కూడా చాలా పవిత్ర దేవాలయాలున్నాయి. వీటిలో గోవిందరాజస్వామి దేవాలయం, తిరుచానూరువద్ద పద్మావతి దేవాలయం ముఖ్యమైనవి.

భోజన, వసతి సదుపాయాలు బాగా ఉన్నాయి. తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయము, వైద్యకళాశాల, వ్యవసాయ కళాశాల, ఇంజనీరింగ్ కళాశాల, పశువైద్యకళాశాల, సంస్కృత విద్యాపీఠం, మొదలైన విద్యాసంస్థలున్నాయి.

***లేపాక్షి :*** అనంతపూర్ జిల్లాలోని హిందుపూర్ తాలూకాలో ఇదొక చిన్న గ్రామం. విజయనగర శిల్పంతో నిర్మించిన శైవదేవాలయం 16వ శతాబ్దం నాటిది. దీని గోపురంమీది పై కప్పుమీద ఉన్న చెక్కడాలు ఈ దేవుని వివిధ రూపాలను భక్తుల జీవితాలను ప్రస్తుతి స్తాయి. ఒకేరాతిలో చేసిన నంది విగ్రహం చాలా పెద్దది.

***శ్రీశైలం :*** కృష్ణానది దక్షిణ తీరాన రుషభగిరి కొండమీద ఉంది ఇక్కడ ఉన్న శివాలయం చాలా పవిత్రమైనది, ప్రాచీనమైనది. మహాభారతంలోను, పురాణాలలోను, (సంకల్ప స్నానం చేసేటప్పుడు చెప్పుకొనే శ్లోకాలు) దీనిపేరు ఉండటం విశేషం. ఇక్కడ శివపార్వతులు, మల్లికార్జున భ్రమరాంబ రూపాలలో వెలిసారు. ఇక్కడ కృష్ణానదిని పాతాళ గంగ అంటారు. కృష్ణదేవరాయలు ఇక్కడ మండపాలు కట్టించారు.

***శ్రీహరికోట :*** నెల్లూరుజిల్లా సూళ్ళూరుపేట దగ్గరలో బంగాళాఖాతంలో ఉన్న చిన్న ద్వీపం. ఆదిమవాసులైన యానాదులకు పుట్టుక స్థలం. ఇటీవల భారతప్రభుత్వం ఇక్కడ రాకెట్ కేంద్రం స్థాపించింది.

***రాజమండ్రి :*** గోదావరీ నదీ తీరాన ఉన్న చారిత్రాత్మక నగరం. చాళుక్య రాజు రాజ నరేంద్రునికి రాజధాని, ఆదికవి నన్నయకు నెలవు. నది ఒడ్డున కోటి లింగాలయమున్నది. 12 సం॥ కొకసారి పుష్కరిణి ఉత్సవాలు జరుగుతాయి. ధవళేశ్వరం వద్ద గోదావరినది మీద ఆనకట్టఉంది. రోడ్ కమ్ రైల్ బ్రిడ్జ్ ఇక్కడ ఒక ప్రత్యేక ఆకర్షణ.

***భీమునిపట్నం :*** విశాఖపట్నం సమీపంలో సముద్ర తీరాన ఉన్న వేసవి విడిది. 17 వ శతాబ్ది డచ్‌వారు కట్టిన ఫాక్టరీ, కోటలున్నాయి. ఇక్కడ సముద్రతీరాన చేసే ప్రయాణం లోని అనుభవం భారతదేశంలో మరెక్కడా కలగదని అంటారు.

***కొండపల్లి :*** విజయవాడ సమీపంలోని గ్రామం. 14 వ శతాబ్దంలో రెడ్డిరాజులు నిర్మించిన రక్షణ దుర్గం ఇక్కడ ఉంది. ఇక్కడ అడవులలో లభ్యమయ్యే పొణుకు కలపతో ఇక్కడే తయారయ్యే బొమ్మలకు అంతర్జాతీయఖ్యాతి ఉంది.

***నాగార్జునకొండ :*** నాగార్జునసాగర్ డామ్‌కు 24 కి.మీ. దూరంలో ఉంది. క్రీ.శ.200, 300 ఏళ్ళ నాటి స్తూపాలు, మఠాలు లభించాయి. బౌద్ధ సంస్కృతికి ఇది ప్రతీక. నాగార్జున

సాగర్ డామ్ కాలువ మూలంగా ఈ ప్రదేశం మునిగిపోతుందనే అభిప్రాయంతో పురావస్తువు లన్నీ కాలువ కుడివైపు కొండమీద ఒక మ్యూజియమ్ నిర్మించి, అందులో భద్రపరిచారు.

*నాగార్జున సాగర్ డామ్ :* ప్రపంచంలోనే ఎత్తైన డామ్. ఎత్తు 404 అ॥ హైదరాబాదుకు 150 కి. మీ. దూరంలో కృష్ణానదిపైన 140 కోట్ల వ్యయంతో నిర్మించబడింది. బుద్ధుని అనుచరుడైన ఆచార్య నాగార్జునుడు బోధించిన విశ్వ విద్యాలయం ఉన్న పట్టణం విజయపురి దీని చుట్టూ విస్తరించి ఉంది.

*ఎత్తిపోతల జలపాతం :* గుంటూరు జిల్లాలో మాచర్లకు 8 కి మీ. దూరంలో ఉన్న జలపాతం. ఇక్కడ చంద్రవంక ఏరు ఎంతో ఎత్తునుంచి ప్రవహిస్తూ రమణీయంగా ఉంటుంది.

*ఫణిగిరి :* నల్గొండజిల్లాలో జనగాంకు 48 కి.మీ. దూరంలో ఉంది. ఇక్కడి త్రవ్వకాలలో అమరావతి, సాంచిరీతులను పోలిన 2 వేల సం॥నాటి బౌద్ధ నిర్మాణాలుబయల్పడినాయి.

*పెద్ద బంకూరు :* చారిత్రకంగా ప్రసిద్ధిపొందిన స్థలం క్రీ. పూ. 2 వ శతాబ్దినుంచి క్రీ. శ. 2 వ శతాబ్ది వరకు శాతవాహనాలున్నారనడానికి ఇక్కడ సాక్ష్యాధారాలు లభించాయి. ముఖ్యమైన చారిత్రకాంశాలు వెలువడ్డాయి.

*కదంబపూర్ :* పెద్ద బంకూరుకు కొద్ది దూరంలో క్రీ. పూ. 1,000 నుంచి క్రీ. శ. 2,3 శతాబ్దులవరకు ఆనాటి ప్రజలు చేసిన సమాధులు బయల్పడ్డాయి. చారిత్రక ప్రాముఖ్యం గల స్థలం.

*శ్రీకాళహస్తి :* చిత్తూరు జిల్లాలో స్వర్ణముఖి నదీ తీరాన శ్రీ కాళహస్తీశ్వరాలయంతో ప్రసిద్ధి చెందింది. పంచ మహాభూత లింగాలలో ఈ లింగం వాయులింగమని ప్రసిద్ధి.

*సింహాచలం :* విశాఖపట్టణానికి 16 కి. మీ. దూరంలో ఎత్తైన కొండలమీద సముద్రమట్టానికి 300 అ॥ ఎత్తున ఉంది. విష్ణుమూర్తి అవతారమై, చందన చర్చితుడైన శ్రీ వరాహ నరసింహ స్వామి ఆలయంతో ప్రసిద్ధి చెందింది.

*భద్రాచలం :* శ్రీ సీతారామచంద్రుల దేవాలయంతో ప్రసిద్ధి చెందినది. శ్రీరామ భక్తుడైన రామదాసు [కంచెర్ల గోపన్న] రచించిన గేయాలు శిలాఫలకాలపైన ఉన్నాయి. ఇది ఖమ్మం జిల్లాలోనిది.

*అన్నవరం :* శ్రీ వీర వేంకట సత్యనారాయణస్వామి దేవాలయంతో ప్రసిద్ధి చెందినది. ఇక్కడికి యాత్రికులు అవిచ్ఛిన్నంగా వచ్చి సత్యనారాయణ వ్రతాలు చేస్తారు. తూర్పు గోదావరి జిల్లాలో ఉంది.

*పుష్పగిరి :* కడపకు ఆగ్నేయంగా 16 కి. మీ. దూరంలో విష్ణు-శైవ భక్తులకు పవిత్ర స్థలం. ఇక్కడ ఎనిమిది దేవాలయాలున్నాయి. చెన్న కేశవ స్వామి దేవాలయం అందంగా ఉంటుంది.

*యాదగిరిగుట్ట :* నల్గొండ జిల్లాలోనిది. హైదరాబాదుకు సుమారు 40-45 కి. మీ. దూరంలో కొండగుహలో శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి దేవాలయంతో ప్రసిద్ధి చెందింది.

***వేములవాడ :*** కరీంనగర్ జిల్లాలోనిది. శ్రీ రాజ రాజేశ్వర స్వామి దేవాలయంతో ప్రసిద్ధి చెందినది. నన్నయకు సమకాలికుడైన వేములవాడ భీమకవి ఇక్కడివాడే.

***అహోబిలం :*** కర్నూలు జిల్లాలోనిది. ఇక్కడ కొండమీద శ్రీ లక్ష్మీ నరసింహస్వామి ఆలయంతో ప్రసిద్ధి చెందింది. ఇక్కడ నవనారసింహ క్షేత్రాలున్నాయి. శ్రీ వైష్ణవ సంప్రదాయంలోని రెండు పీఠాలలో ఇది ఒకటి.

***మహానంది :*** శ్రీ శైలానికి సమీపంగా ఉంది. ఇక్కడి నంది నోటినుంచి సర్వదా నీరు ప్రవహిస్తుంది. ఈ ఆలయం అరణ్యంలో ఉంది.

***రామతీర్థం :*** విజయనగరం జిల్లాలో ఉంది. ప్రాచీన బౌద్ధ, జైన మతక్షేత్రం.

***ఉండవల్లి :*** గుంటూరు జిల్లాలో ఉంది. విజయవాడకు 5 కి.మీ దూరంలో ఉంటుంది. ఈ గ్రామంలో నాలుగు అంతస్తుల బౌద్ధ గుహాలయం ఉంది. రెండవ అంతస్తులో 16 మంది పాలతో కూడిన గర్భాలయంలో నృసింహస్వామి విగ్రహం, మూడవ అంతస్తులో 17 అ॥ పొడవుగల అనంత పద్మనాభస్వామి విగ్రహం ఉన్నాయి.

***పంచారామాలు :*** ఒకే లింగము ఐదు భాగాలుగా ఐదు ఆరామాలలో ప్రతిష్ఠింపబడటం వల్ల ఈ పేరు వచ్చింది.

***1. ద్రాక్షారామం :*** తూర్పుగోదావరి జిల్లా ద్రాక్షారంలో ఉంది.

***2. కొమరారామం :*** తూర్పుగోదావరి జిల్లాలోని సామర్లకోటలో ఉంది.

***3. సోమారామం :*** పశ్చిమగోదావరి జిల్లాలో గునుపూడిలో (భీమవరం) ఉంది.

***4. క్షీరారామం :*** పశ్చిమగోదావరి జిల్లాలోని పాలకొల్లులో ఉంది.

***5. అమరారామం :*** గుంటూరు జిల్లాలోని అమరావతిలో ఉంది. ఇదే అమరేశ్వరస్వామి ఆలయం. ఇది గుంటూరుకు 32 కి.మీ దూరంలో ఉంది. అమరావతియే శాతవాహన రాజుల కాలంలో రాజధాని అయిన ధాన్యకటక పట్టణం. బౌద్ధశిల్ప కళకు అమరావతి ప్రసిద్ధిచెందింది.

***అలంపురం :*** అష్టాదశ శక్తి పీఠాలలోని జోగులాంబా పీఠం ఇక్కడే ఉంది. అంతే కాక, నవబ్రహ్మల ఆలయం ఉంది. ఇది మహబూబ్‌నగర్ జిల్లాలో ఉంది. తుంగభద్రానది ఒడ్డునఉంది.

***బాసర :*** ఆదిలాబాదు జిల్లాలోనిది. ఇక్కడ గోదావరి నదీతీరాన ఉన్న సరస్వతీ ఆలయంతో ప్రసిద్ధి చెందింది. భారతదేశమంతటిలోను సరస్వతీ ఆలయాలు ఇక్కడకాక, కాశ్మీర్, శృంగేరిలలోనే ఉన్నాయి.

***ధర్మపురి :*** కరీంనగర్ జిల్లాలోనిది. గోదావరీ నదీతీరాన శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయంతో ప్రసిద్ధి చెందింది.

***అరసవల్లి :*** శ్రీకాకుళం జిల్లాలోనిది. పురాతన కాలంనుంచి ప్రసిద్ధిచెందిన శ్రీ సూర్యనారాయణ స్వామి ఆలయంతో ప్రసిద్ధి చెందింది. భారతదేశంలో సూర్యదేవాలయాలు ఇక్కడ కాక మరిరెండుచోట్ల మాత్రయే ఉన్నాయట. ఒరిస్సారాష్ట్రంలోని కోణార్క్‌లోని సూర్యదేవాలయం ప్రసిద్ధి చెందినది.

*శ్రీకూర్మం :* శ్రీకాకుళం జిల్లాలోనిది. శ్రీ కూర్మనాథస్వామి ఆలయంతో ప్రసిద్ధిచెందింది.

*పాడేరు :* విశాఖపట్టణం జిల్లాలోనిది ఇక్కడికి సమీపంలోని "మత్స్యకుండు" తో ఇది ప్రసిద్ధిచెందింది.

*ద్వారకాతిరుమల :* పశ్చిమగోదావరి జిల్లాలోనిది. భూమూర్తి అయిన శ్రీ వెంకటేశ్వర స్వామి ఆలయంతో ప్రసిద్ధిచెందింది.

*కోటప్పకొండ :* గుంటూరు జిల్లాలోనిది. త్రికూటేశ్వరస్వామి దేవాలయంతో ప్రసిద్ధి చెందింది. శివరాత్రికి ఇక్కడ జరిగే ఉత్సవాలు ప్రసిద్ధిచెందినాయి.

*మంగళగిరి :* గుంటూరు జిల్లాలోనిది ఇక్కడ శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవాలయంతో (పానకాల నరసింహస్వామి) ప్రసిద్ధిచెందింది. ఈ గుడి గోపురం చాలా పెద్దది. ఎత్తైనది.

*అంతర్వేది :* తూర్పుగోదావరి జిల్లాలోనిది. శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవాలయంతో ప్రసిద్ధిచెందింది. భీష్మఏకాదశి సాగరసంగమంలో స్నానంచేసి అర్చించడానికి లక్షలాదిజనం వస్తారు.

*ర్యాలి :* తూర్పుగోదావరి జిల్లాలోనిది. ఇక్కడ జగన్మోహినీ చెన్నకేశవస్వామి ఆలయం తో ప్రసిద్ధిచెందింది. ముందుభాగం చెన్నకేశవస్వామిగాను, వెనుకభాగం జగన్మోహినీ దేవిగాను కనబడుతుంది.

*బుగ్గరామేశ్వరం :* హైదరాబాదుకు 40 కి.మీ దూరంలో ఉన్న ప్రాణలింగంతో ప్రసిద్ధి చెందింది. ఆజానుబాహువులుసైతం లింగాన్ని కౌగలించుకొని రెండుచేతులూ కలుపలేరు. నమశ్శివాయ అనగానే ప్రక్కనున్న కొలనునుంచి బుడుబుగ్గలు లేస్తాయట.

*భోగేశ్వరం :* కృష్ణాజిల్లాలోని కైకలూరు తాలూకా కల్దిండి గ్రామసమీపంలో గ్రామ సరిహద్దులలో శ్రీ భోగేశ్వరాలయం ఉంది. నమశ్శివాయ అనగానే ప్రక్కనున్న కోనేరునుంచి బుదు బుడగలు లేస్తాయట.

*మంత్రాలయం :* కర్నూలు జిల్లాలో తుంగభద్రానదీ తీరంలో శ్రీ రాఘవేంద్రస్వామి 304 సం॥ క్రిందట సజీవ సమాధి పొందిన ప్రదేశంగా ప్రసిద్ధి చెందింది.

*ఉపమాక :* విశాఖపట్టణం జిల్లాలోనిది. పురాణప్రసిద్ధి చెందినక్షేత్రం. ఇక్కడి కొండ మీద శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంతో ప్రసిద్ధి చెందింది.

*ముఖలింగం :* శ్రీకాకుళానికి 56 కి.మీ దూరంలో వంశధార నదీతీరాన ముఖలింగేశ్వర స్వామి, భీమేశ్వరస్వామి, సోమేశ్వరస్వామి ఆలయాలవల్ల ప్రసిద్ధిచెందింది. ఇక్కడి క్షేత్ర మహిమ కాపాడటానికి భూవరాహమూర్తి రక్షణకు దుర్గాదేవి వెలిశారట. ముఖలింగం పూర్వ కళింగనగరం. ఇక్కడి శిల్పకళ చాలా సుందరమైనది.

*రామప్ప దేవాలయం :* వరంగల్లు జిల్లాలో వరంగల్లుకు 50 కి. మీ. దూరంలో పాలెం పేటలో ఉన్న శివాలయం. ఇక్కడి శిల్పాలు రాతిలో కవితలుగా వర్ణింప బడ్డాయి. కాక తీయులనాటి శిల్పకళా వైభవాన్ని చాటే ఈ ఆలయం క్రీ.శ. 1204 లో నిర్మించబడింది.

*నంగునూరు :* కరీంనగర్ జిల్లాలోని గ్రామం. ఇక్కడ చాళుక్యరాజు రాజరాజనరేంద్రుడు నాలుగువందల దేవాలయాలు నిర్మించడంతో ఈ గ్రామానికి ఆ పేరు వచ్చిందట. కాని ఇప్పుడు అపురూప శిల్పసంపదతో కూడిన నల్ల పాలరాతి దేవాలయాలు కొన్ని మాత్రం

ఉన్నాయి. తెలుగు, కన్నడ భాషలలో చెక్కబడిన శిలాస్తూపం ఒకటి పురావస్తుశాఖ ప్రయత్నాలతో బయల్పడింది.

*బోధన్* : నిజామాబాదు జిల్లాలోనిది. ఇక్కడ తుగ్లక్ ఔరంగజేబు నిర్మించిన రెండు మసీదులున్నాయి. క్రీ.శ. 10 వ శతాబ్దంలో తూర్పుచాళుక్య రాజధాని ఇక్కడి దేవాలయాల మీద కన్నడ శాసనాలున్నాయి.

ఇవికాక రాష్ట్రంలో ఇంకా అనేకచోట్ల పూర్వచరిత్రను, వైభవాన్ని చాటే ప్రదేశాలు, అత్యంతసుందరమైన ప్రదేశాలు అనేక మున్నాయి.

దేశంలో యాత్రను అభివృద్ధి చెయ్యడానికి ప్రభుత్వం ప్రత్యేకరైలు యాత్రలు వేసవిలో రైలుచార్జీలలో రాయితీలు మొదలైన చర్యలను తీసుకున్నది. హైదరాబాదులో యువజనుల హాస్టల్ భవనాన్ని, మంత్రాలయం, వరంగల్లులలో టూరిస్టు బంగళాలను నిర్మించడం ప్రారంభించింది. హైదరాబాదు, శ్రీశైలం, రామప్ప, అలంపూర్, తిరుపతి, హార్స్లీ కొండలు, సింహాచలం, నాగార్జునసాగర్, నాగార్జునకొండ, మొదలైన 25 చోట్ల రాష్ట్ర ప్రభుత్వం విశ్రాంతి గృహాలు నిర్మించింది. భారతయాత్రాభివృద్ధిసంస్థ హైదరాబాదులో ఒక ట్రాన్స్‌పోర్ట్ యూనిట్‌ను ఏర్పాటుచేసి, జంటనగరాలలో చూడవలసిన ప్రదేశాలనేకాక, ప్రతి ఆదివారం నాగార్జునసాగర్‌ను యాత్రికులకు చూపుతుంది. ఈ విభాగానికి యాత్రికుల సౌకర్యార్థం ఎయిర్ కండిషన్ చేసినకార్లు, డీలక్స్‌బస్సులు ఉన్నాయి. ఇటీవల ఏర్పడిన ట్రావెల్ అండ్ టూరిజం కార్పొరేషన్ (ఆం. ప్ర) ప్రైవేట్ లిమిటెడ్ ఇటువంటి యాత్రలను నిర్వహిస్తుంది.

హైదరాబాదు సమీపంలోని షామీర్ పేటవద్ద జవహర్ లేక్‌ను, హరిణవనం, పక్షివనం, కుటీరాలు, సవారీస్థలం మొదలైనవాటిని ఏర్పాటుచేసే నిమిత్తం రాష్ట్రప్రభుత్వం 46.5లక్షలు మంజూరు చేసింది. 1980 జనవరి 26 నుంచి 13 రోజులపాటు రాష్ట్రమంతటా యాత్రోత్సవం జరిగింది. హైదరాబాదులో, రాష్ట్రంలోని జిల్లాల ముఖ్య కేంద్రాలలోను చుట్టుప్రక్కల ప్రాంతాలు చూపే ప్రైవేట్ సంస్థలు అనేకం ఉన్నాయి. టూరిస్టు బస్సులలోను రైళ్లలోను అనేక ఇతర రాష్ట్రాలనుంచి వచ్చిన మన రాష్ట్రంలోని పుణ్యస్థలాలు సందర్శిస్తూ ఉంటారు. సింహాచలం గుడికి ఎక్కువగా ఒరిస్సారాష్ట్రంనుంచి యాత్రికులు వస్తూఉంటారు. తిరుపతి కొండకు యావద్భారత దేశంలోని అన్ని ప్రాంతాలవారు తండోప తండాలుగా వస్తారు. కాని వీరిలో అధికభాగం దక్షిణ రాష్ట్రాల వారుంటారు. అట్లాగే రాజమండ్రిలో గోదావరినదిలో స్నానం చేయడానికి ఉత్తరదేశ యాత్రికులు చాలామంది వస్తారు.

# 30

# న్యాయవ్యవస్థ

రాష్ట్ర న్యాయవ్యవస్థలో హైకోర్టు అత్యున్నతాధికారం గల సంస్థ. ఇది ఆంధ్రప్రదేశ్ అవతరణతో రాష్ట్ర రాజధాని అయిన హైదరాబాదులో ఏర్పడింది. హైకోర్టు తరవాత న్యాయ వ్యవస్థలో ఎక్కువ అధికార, బాధ్యతలు గలవి జిల్లా కోర్టులు. జిల్లా స్థాయిలో ఈ జిల్లా కోర్టులే ఉన్నత న్యాయస్థానాలు. వీటికి కింద అదనపు జిల్లాకోర్టులు, సబార్డినేట్ జిల్లాకోర్టులు మేజిస్ట్రేటు కోర్టులు ఉంటాయి. రాష్ట్రంలో 20 జిల్లాకోర్టులు, 19 అదనపు జిల్లాకోర్టులు, 56 సబార్డినేట్ జిల్లాకోర్టులు, 235 జ్యుడిషియల్ 1 వ తరగతి మేజిస్ట్రేటు కోర్టులు, 31 జ్యుడిషి యల్ 2 వ తరగతి మేజిస్ట్రేటు కోర్టులు, 4 రైల్వేల జుడిషియల్ 1 వ తరగతి మేజిస్ట్రేటు కోర్టులు, 10 రైల్వే స్పెషల్ జుడిషియల్ 2 వ తరగతి మేజిస్ట్రేటు కోర్టులు, 15 స్పెషల్ జుడిషియల్ 2 వ తరగతి మేజిస్ట్రేటు కోర్టులు ఉన్నాయి. రాష్ట్రంలో ప్రస్తుతం 5 సంచార న్యాయస్థానాలు ఉన్నాయి. ఇవి కాక రాష్ట్ర రాజధాని అయిన హైదరాబాదులో సిటీసివిల్ కోర్టులు, సిటీస్మాల్‌కాజెస్ కోర్టులు, సిటీ క్రిమినల్ కోర్టులు ఉన్నాయి.

## హైకోర్టు

సివిల్, క్రిమినల్ అప్పీళ్ళకు రాష్ట్రంలో హైకోర్టు అత్యున్నతాధికారులు గల సంస్థ. సివిల్, క్రిమినల్ వివాదాలలో కింది కోర్టుల నుంచి హైకోర్టుకు వెళ్ళవచ్చు. అప్పీలు నేరుగా చేసుకొనే అధికారం, కింది నుంచి తీసుకొనే అధికారం హైకోర్టుకు ఉంది. ప్రైవేటు వ్యక్తులు గాని, ప్రభుత్వంగాని అనేక రకాల వివాదాల విషయంలో హైకోర్టు ముందుకు నేరుగా వెళ్ళ వచ్చు. వైవాహిక సంబంధమైన వివాదాలు, ఆస్తికి సంబంధించిన వివాదాలు మొదలైన విషయాలు హైకోర్టు ముందుకు వెళ్ళవచ్చు. క్రిమినల్ కేసుల విషయంలో, ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు శిక్షలు విధించిన వాటిలో హైకోర్టు ముందుకు అప్పీలుకు వెళ్ళవచ్చు. సివిల్ కేసుల విషయంలో రూ. 2,000 మొత్తానికి మించిన అన్ని కేసులూ హైకోర్టు ముందుకు వెళ్ళ వచ్చు. హైకోర్టుకు రాష్ట్రంలోని అన్ని కోర్టులపైన అజమాయిషీ అధికారం ఉంటుంది. రాజ్యాంగానికి భాష్యం చెప్పవలసిన కేసులను తనకు తానుగా హైకోర్ట్ కిందికోర్టు నుంచి బదిలీ చేసుకోవచ్చు. ప్రాథమిక హక్కుల అమలుకు సంబంధించిగాని, మరే యితర కార ణాలవల్లగాని హైకోర్ట్ రిట్ ఉత్తరువులు ఇవ్వవచ్చు. రాజ్యాంగం, 226 ఆర్టికల్ ప్రకారం హైకోర్ట్‌కు ప్రాథమిక హక్కులు, ఇతర అవసరాల దృష్ట్యా ఆదేశాలు, సూచనలు, రిట్ ఉత్తరువులు ఇచ్చే అధికారం ఉంది. సివిల్ ప్రొసీజర్‌కోడ్, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లకు ఇంకా ఇతర చట్టాలు, ఆర్డినెన్సులు, నిబంధనలు మొదలైన వాటికి హైకోర్ట్ వివరణలు

కింది కోర్ట్ విధించిన మరణశిక్ష హైకోర్ట్ ధ్రువీకరించనిదే అది అమలు జరగదు. సెషన్సు కోర్ట్‌లో 7 సం॥ గాని, అంతకు మించిగాని శిక్షలు పడిన కేసులను పరిశీలించే అధికారం, కింది కోర్ట్‌లు కొట్టివేసిన కేసులపై అప్పీళ్ళు స్వీకరించే అధికారం హైకోర్ట్‌కుంది. కంపెనీల చట్టం క్రింద స్వకీయమైన అధికారాలు ఉన్నాయి. అంతేకాక, ప్రజా, ప్రాతినిధ్య చట్టం ప్రకారం ఎన్నికల వివాదాలు పరిష్కరించే అధికారం హైకోర్ట్‌కు ఉంది. ఇవి హైకోర్ట్‌కున్న అధికారాలలో కొన్ని మాత్రమే.

హైకోర్టు అత్యున్నతాధికారి ప్రధాన న్యాయమూర్తి. ప్రధాన న్యాయమూర్తి కాక, న్యాయమూర్తులు, అదనపు న్యాయమూర్తులు ఉంటారు. న్యాయమూర్తుల విషయంలో నిర్ణీత సంఖ్య లేదు. సుప్రీం కోర్టు, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తుల, రాష్ట్ర ముఖ్యమంత్రి, రాష్ట్ర గవర్నర్ సలహా సంప్రదింపులతో రాష్ట్రపతి ఎప్పటికప్పుడు న్యాయమూర్తులను నియమిస్తారు. ఈ న్యాయమూర్తులలో అందరికన్న సీనియర్ న్యాయమూర్తిని ప్రధాన న్యాయమూర్తిగా రాష్ట్రపతి నియమిస్తారు. వీరుకాక, హైకోర్టులో పేరుకొనిపోయిన పనిని త్వరితంగా ముగించడం కోసం రెండేళ్ళ కాల పరిమితికి లోబడి అదనపు న్యాయమూర్తులను నియమించడం జరుగుతుంది. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో ప్రధాన న్యాయమూర్తితో సహా 1978 నాటికి 17 మంది న్యాయమూర్తులు, ఇద్దరు అదనపు న్యాయమూర్తులు ఉన్నారు. న్యాయమూర్తిగా నియమితమయ్యే వ్యక్తి భారతదేశ పౌరుడై, హైకోర్టు న్యాయవాదిగా గాని, దేశంలో ఎక్కడో ఒకచోట న్యాయాధికారిగా గాని 10 సం॥ అనుభవం గడించి ఉండాలి. ఆ వ్యక్తి చరిత్ర వంకలు లేనిదై నిష్కల్మషంగా ఉండాలి.

హైకోర్టుకు సంబంధించిన పరిపాలనా విషయాలు ప్రధాన న్యాయమూర్తి పర్యవేక్షణలో కార్యనిర్వాహక విభాగం నిర్వహిస్తుంది. ఈ విభాగానికి ముఖ్యమైన అధికారి రిజిస్ట్రారు. పరిపాలన విషయాల నిర్వహణలో, అడిషనల్, డిప్యూటి, అసిస్టెంటు, అసిస్టెంటు రిజిస్ట్రార్లు రిజిస్ట్రారుకు సహాయకులుగా ఉంటారు. కార్యనిర్వాహకవర్గం నిర్వహించే ముఖ్యమైన పనులు కోర్టు ఖర్చుల బడ్జెట్ తయారీ, క్రింది కోర్టులను హైకోర్టుకు సంబంధించిన పరిపాలన విషయాలు, ఉద్యోగుల నియామకం మొదలైనవి. వీటిపై ప్రధాన న్యాయమూర్తి పర్యవేక్షణ ఉంటుంది.

## కింది కోర్టులు

రాష్ట్రంలో ప్రతి జిల్లాలోనూ ఉండే సివిల్‌కోర్టు జిల్లాస్థాయిలో ఉన్నత న్యాయస్థానం. రాష్ట్రంలోని దాదాపు ప్రతి జిల్లాకు సివిల్, క్రిమినల్ కోర్టులు విడిగా ఉంటాయి. జిల్లాజడ్జీతో ఉండే సివిల్ కోర్టుకు కింది కోర్టుపై అజమాయిషీ అధికారం ఉంటుంది. అంతేకాక, క్రింది కోర్టులలోని కేసుల విషయంలో అప్పీళ్ళను స్వీకరించే అధికారం ఉంటుంది. సెషన్సు జడ్జిగా కూడా జిల్లా జడ్జీయే వ్యవహరిస్తారు. జిల్లా జడ్జికి ఏ శిక్షనయినా విధించేఅధికారం ఉంటుంది. 1,2,3 తరగతులకు చెందిన మెజిస్ట్రేటు కోర్టులు జిల్లా సివిల్, క్రిమినల్ కోర్టుల అజమాయిషీ క్రింద ఉంటాయి. మెజిస్ట్రేటులకు గల అధికారాలు :

| | | |
|---|---|---|
| 3 వ తరగతి మెజిస్ట్రేటు | — | ఒకనెల జైలుశిక్ష, రూ. 50 జరిమానా విధించే అధికారం |
| 2 వ తరగతి మెజిస్ట్రేటు | — | 6 నెలల జైలుశిక్ష, రూ. 200 వరకు జరిమానా విధించే అధికారం |
| 1 వ తరగతి మెజిస్ట్రేటు | — | 2 సం॥ జైలుశిక్ష, రూ. 2,000 వరకు జరిమానా విధించే అధికారం |

రాష్ట్ర రాజధాని అయిన హైదరాబాదులో సిటీసివిల్ కోర్టులు, సిటీ స్మాల్ కాజెస్ కోర్టులు, సిటీ క్రిమినల్ కోర్టులు ఉన్నాయి సిటీ సివిల్ కోర్టుకు ప్రధాన అధికారి చీఫ్ జడ్జి ఎనిమిది మంది అదనపు చీఫ్ జడ్జీలు, ఎనిమిది మంది అసిస్టెంట్ జడ్జీలు ఆరుగురు అదనపు జడ్జీలు ఈయనకు సహాయ పడతారు. వీరిలో అదనపు చీఫ్ జడ్జీలు జిల్లా సెషన్సు స్థాయిగల వారు. అసిస్టెంట్ జడ్జీలు జిల్లా మున్సిఫ్ స్థాయిగలవారు. అదనపు జడ్జీలు సబ్ జడ్జిస్థాయి గలవారు.

సిటీస్మాల్ కాజెస్ కోర్టుకు ప్రధాన అధికారి చీఫ్‌జడ్జి. అదనపు జడ్జి ఈయనకు సహాయ పడతారు. సిటీ క్రిమినల్ కోర్టుకు ఒక మెట్రోపాలిటన్ సెషన్సు జడ్జి, ఒక చీఫ్ మెట్రోపాలిటన్ మెజిస్ట్రేటు, ముగ్గురు మెట్రోపాలిటన్ మెజిస్ట్రేటులు ఉంటారు. వీరిలో చీఫ్ మెట్రోపాలిటన్ మెజిస్ట్రేటుది, మెట్రోపాలిటన్ మెజిస్ట్రేటులది జిల్లా మున్సిఫ్‌స్థాయి.

జిల్లా మున్సిఫ్‌లే అధికారులుగాగల రెండు కంట్రోలు కోర్టులు మూడు జంటనగరాలలో ఉన్నాయి. వీటిలో ఒకటి హైదరాబాదులోను, రెండు సికింద్రాబాదులోను ఉన్నాయి.

రాష్ట్రంలోగల 5 సంచార న్యాయస్థానాలలో 3 హైదరాబాదులో ఉన్నాయి. వీటి అధికారులు 2 వ తరగతి మెజిస్ట్రేటులు. వీటిలో ఒకటి సిటీబస్సులలో టికెట్టులేని ప్రయాణీకుల కేసులను, రెండవది మోటారు వాహనాల చట్టం కేసులను, మూడవది మునిసిపల్ కేసులను చూస్తాయి. తక్కిన రెండు సంచార న్యాయస్థానాలలో ఒకటి విజయవాడలోను, రెండవది గుంటూరులోను ఉన్నాయి. ఇవి మోటారు వాహనాలచట్టం, మోటారు వాహనాల పన్నుచట్టం కేసులను చూస్తాయి.

రాష్ట్రానికి సంబంధించిన కేసులను సుప్రీంకోర్టులో చూడటానికి ఇద్దరు అడ్వకేట్స్ ఆన్ రికార్డ్ ఉన్నారు. హైకోర్టుకు, అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్స్‌కు అనుబంధంగా గవర్నమెంటు ప్లీడరు, జూనియర్లు, పబ్లిక్ ప్రాసిక్యూటర్లు, అదనపు పబ్లిక్ ప్రాసిక్యూటర్లు, ఉన్నారు. అడ్మినిస్ట్రేటర్ జనరల్, జిల్లాకొకరు చొప్పున 14 మంది పార్ట్‌టైం అఫిషియల్ రిసీవర్లు నియమిత మవుతారు.

## హైకోర్టు ప్రధాన న్యాయమూర్తుల జాబితా

( 1954 నుంచి 1980 వరకు ఉన్నవారు )

1. శ్రీ కోకా సుబ్బారావు
2. శ్రీ పి. చంద్రారెడ్డి
3. శ్రీ పి. సత్యనారాయణరాజు
4. శ్రీ పి. రామ్‌మనోహర్ పర్షాద్
5. శ్రీ పి. జగన్మోహనరెడ్డి
6. శ్రీ కె. కృష్ణారావు

7. శ్రీ ఎన్. కుమరయ్య  8. శ్రీ కె. ఎ. యల్. నరసింహం
9. శ్రీ గోపాలరావు ఎగ్బోటే  10. శ్రీ ఎస్. ఓబులరెడ్డి
11. శ్రీ. బి. జె. దివాన్  12. శ్రీ ఆవుల సాంబశివరావు
13. శ్రీ. సి. కొండయ్య  14. శ్రీ కుప్పుస్వామి

1976-77 నాటికి మన రాష్ట్రంలో గల జుడిషియల్ ఆఫీసర్ల వివరాలు :

| ఆఫీసర్ల తరగతి | సంఖ్య |
|---|---|
| హైకోర్ట్ జడ్జీలు శాశ్వత | 17 |
| అదనపు | 2 |
| జిల్లా సెషన్స్ జడ్జీలు (అదనపు జిల్లా సెషన్ జడ్జీలతో సహా) | 63 |
| సబ్ జడ్జీలు | 56 |
| జిల్లా మున్సిఫ్‌లు (అసిస్టెంట్ సెషన్స్ జడ్జీలు, ఫస్ట్‌క్లాస్ మెజిస్ట్రేట్లతోసహా) | 253 |
| జుడీషియల్ సెకండ్‌క్లాస్ మెజిస్ట్రేట్లు | 30 |

మూలం : హైకోర్ట్ రిజిస్ట్రార్ ఆం ప్ర.

# 31

# సినిమా పరిశ్రమ

భారతదేశంలో మొట్ట మొదటిసారిగా 1903 లో "క్రీస్తు జీవితం" అనే షార్ట్ ప్రదర్శింప బడింది. 1910 నుంచి విదేశీచిత్రాలు కొంచెం అధికంగా మన దేశంలో ప్రదర్శింప బడినాయి. భారతదేశంలో మొట్టమొదట తయారయిన చలనచిత్రం 1911లో "రాజదర్బారు" అనే మూకీ సినిమా. 1913 లో దంఢిరాజ్ ఫాల్కే "హరిశ్చంద్ర" అనే చిత్రాన్ని నిర్మించారు. ఇది పూర్తి నిడివి చిత్రం. ఈ చిత్ర నిర్మాణంతో ఉత్సాహితులైన దక్షిణ భారతీయులు తెలుగు దేశంలోనూ చిత్రనిర్మాణం ప్రారంభించారు.

భారత చలనచిత్ర పరిశ్రమకు దాదాఫాల్కే వలె, దక్షిణ భారత చలన చిత్ర పరిశ్రమకు ఆర్. వెంకయ్యగారు పితామహులు. 1910 నాటికే "చెరో-మెగాఫోన్" అనే యంత్రంతో భారతదేశమంతటానేకాక, బర్మా. సిలోన్‌లలోకూడా చలన చిత్రాలను ప్రదర్శించిన ఆర్. వెంకయ్యగారు తమ కుమారులైన ఆర్. ప్రకాష్‌ను ఫిల్మ్ నిర్మాణాధ్యయనానికి అమెరికా, ఇంగ్లండ్ దేశాలు పంపారు. విదేశాల నుండి తిరిగివచ్చిన ప్రకాష్‌గారు "స్టార్ ఆఫ్ ఇండియా కంపెనీ పేరుతో 1923 లో "భీష్మ" అనే మూకీ చిత్రం నిర్మించారు. ఈ చిత్రంతో కెమేరామెన్ రంగయ్యగారి సహకారంతో సి. పుల్లయ్యగారు "మార్కండేయ" మూకీ షార్ట్ స్వంత పెట్టుబడితో తీయడమేకాక, తాను అందులో ఒక పాత్రకూడా ధరించారు. ఆ తరవాత 8 సం॥లకు తెలుగు టాకీ చిత్రాలు ప్రారంభ మయ్యాయి. 1931 లో హెచ్. యం. రెడ్డిగారు తీసిన "భక్తప్రహ్లాద" అనేదే మొదటి టాకీ చిత్రం.

## స్టూడియోలు

1936 లో రాజమండ్రిలో నిడమర్తి బ్రదర్స్ నిర్మించిన "దుర్గాసినీటోన్" అనేది తెలుగువారు తెలుగు దేశంలో నిర్మించిన మొట్ట మొదటి స్టూడియో 1937 లో విశాఖపట్నంలో "ఆంధ్ర-సినీటోన్" అనే మరొక స్టూడియో నిర్మితమైంది. కానీ ఈరెండు స్టూడియోలూ త్వరలోనే మూతపడినాయి. తెలుగు సినిమా నిర్మాతలు మద్రాసులోనే తమచిత్రాలు నిర్మించడం ప్రారంభించారు. మీర్జాపురంరాజా "శోభనాచల"అనేపేరుతో 1944లో మద్రాసులో స్టూడియో నిర్మించారు తరవాత క్రమంగా అనేక స్టూడియోలు మద్రాసులో వెలసినాయి.

తెలుగు చిత్ర పరిశ్రమ అంతా మద్రాసులోనే స్థిరపడి పోవడంవల్ల, తెలుగు దేశానికి పరిశ్రమను తొలగించే మొదటి ప్రయత్నంగా 1956 లో హైదరాబాదులో శ్రీ సారథీ స్టూడియోస్ స్థాపితమైంది. తరవాత సదరన్ మూవీటోన్ నిర్మాణమైంది. ఇటీవల అన్నపూర్ణా,

రామకృష్ణా, భాగ్యనగర్ స్టూడియోలు నిర్మాణమైనాయి. విజయవాడలోను, విశాఖపట్నంలోనూ స్టూడియో నిర్మాణానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

## పంపిణీ

తెలుగు దేశంలో మొట్ట మొదటి ఫిలిం డిస్ట్రిబ్యూషన్ సంస్థ 1934 లో స్థాపించబడిన 'క్వాలిటీ' పిక్చర్స్. దీని వ్యవస్థాపకులు జి. కె. మంగరాజు. 1953 నాటికి ఆంధ్రరాష్ట్రంలో 58 పంపిణీ సంస్థలుండేవి. 1957 నాటికి ఈ సంఖ్య 126 వరకు పెరిగింది. ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత ఈ ఫిలిండిస్ట్రిబ్యూషన్ వ్యాపారం బాగా పెరిగింది. గత పది సంవత్సరాలుగా ప్రాంతాల వారీ, జిల్లాలవారీ పంపిణీ విధానం అమలుకావడంతో ఈ వ్యాపారం, వ్యాపార సంస్థలూ మరింత పెరిగాయి. 1979 నాటికి ఆంధ్రప్రదేశ్ చిన్న చిన్న సంస్థలతో సహా మొత్తం 550 పైన డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు ఉన్నాయి.

## ప్రదర్శన

తెలుగు దేశంలో మొట్ట మొదట చలన చిత్ర ప్రదర్శన 1918 లో ప్రారంభమైంది. "జోయిస్ బయస్కోప్" పేరుతో మళయాళీలు తెలుగు దేశంలో టూరింగుహాలులు నడిపారు. అప్పటి ప్రదర్శన ఇప్పటివలె ఉండేదికాదు. చుట్టూ గుడ్డలుకట్టి, ప్రొజెక్టరును చేతితో తిప్పేవారు. ఆ తరవాత 1919లో రఘుపతి వెంకట రత్నంగారి తమ్ముడు వెంకయ్యగారు ఇంజను డైనమోతో కూడిన టూరింగ్‌హాలు ప్రారంభించారు. ఆయనే ఆ తరవాత "గెయిటీ" హాలును చిత్ర ప్రదర్శనకై మద్రాసులో నిర్మించారు. పోతిన శ్రీనివాసరావు పాత్రుడు అనే ఆయన 1921 లో విజయవాడలో "మారుతీ" హాలు నిర్మించారు. ఇది తెలుగు దేశంలో నిర్మింపబడిన మొట్ట మొదటి పర్మనెంటు సినిమాహాలు. ఆ తరవాత అంటే 1925, 26 లలో బందరులో మినర్వా, ఏలూరులో పాండురంగా, రాజమండ్రిలో కృష్ణాటాకీస్ అనేవి నిర్మితమైనాయి. ఇట్లా ఆంధ్రప్రదేశ్ అంతటా ఏర్పడిన సినిమాహాళ్ళ సంఖ్య 1979 నాటికి 2,818. సినిమాహాలులు అధికంగా ఉన్న రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ రెండవస్థానం ఆక్రమిస్తుంది. ఈనాడు ఆంధ్రప్రదేశ్‌లో మినీ థియేటర్ల నిర్మాణం అధికంగా ఉంది. సెమీ పర్మనెంటు థియేటర్లకు కూడా లైసెన్సులు ఇస్తున్నారు.

## పబ్లిసిటీ

ఇదివరకు చిత్రాలకు సంబంధించిన న్యూస్ పేపరు పబ్లిసిటీ అంతా పంపిణీదార్లు నిర్వహించేవారు. కొంత కాలం నుంచి పబ్లిసిటీ కన్సల్టెంట్‌లు ప్రారంభమై, వారి ద్వారా ఈ పబ్లిసిటీ నిర్వహించ బడుతోంది. నిర్మాతలు, పంపిణీదార్లు కలిసి పబ్లిసిటీలు స్వయం నియమావళిని రూపొందించారుగాని, ఇది అంతగా సఫలీకృతం కాలేదని చిత్రపరిశ్రమలో కొందరు అభిప్రాయపడుతున్నారు.

## ఫిలిం ఛాంబర్లు, కౌన్సిల్ సంస్థలు

పరిశ్రమలోని సమస్యలను పరిశీలించి, పరిష్కరించే నిమిత్తం 1953 లో ఆంధ్ర ఫిలిం ఛాంబర్ ఆఫ్ కామర్స్ స్థాపితమైంది. ఇదేకాక ఇటీవలి కాలంలో, నిర్మాతల కౌన్సిల్ పంపిణీదార్ల కౌన్సిల్, ప్రదర్శకుల కౌన్సిల్ కూడా స్థాపించబడ్డాయి. 1974 లో ఈ మూడు కౌన్సిల్‌లూ ఒకే వేదికమీద పరిశ్రమలోని సమస్యల పరిష్కారానికై చర్చలు జరిపాయి. ఇదికాక, ఈనాడు ఫిలిండిస్ట్రిబ్యూటర్స్ ఎంప్లాయీస్ అసోసియేషన్, ఎగ్జిబిటర్స్ అసోసియేషన్ సంస్థలు కూడా ఉన్నాయి.

## ప్రభుత్వం-పరిశ్రమ

హైదరాబాదులో స్టూడియో వెలసిన తరవాత ప్రభుత్వం ఈ పరిశ్రమకు కొంత ప్రోత్సాహం ఇస్తోంది. ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమ విస్తరణను ప్రోత్సహించడానికి మన రాష్ట్రంలోనే నిర్మించిన చిత్రానికి మొదట్లో రూ.50,000 లు సబ్సిడీ ప్రభుత్వం ఇచ్చేది. దీనిని 1973 లో లక్షకు పెంచారు. 1964 నుంచి ప్రతి సంవత్సరం ఉత్తమ చిత్రానికి, దర్శకునికి, నటునికి, నటికి, గాయనికి, రచయితకు ప్రభుత్వం ఒక కమిటీని ఏర్పాటుచేసి స్వర్ణ, రజిత, కాంస్య, నంది ఫలకాలేకాక, పారితోషికాలు కూడా అందజేసి ప్రోత్సహిస్తూఉండేది. స్టూడియోలకు ఋణాలు మంజూరు చేస్తుంది. సినిమాహాలుల అభివృద్ధికి సెమీ పర్మనెంటు థియేటర్లకు కూడా లైసెన్సులు మంజూరు చేస్తుంది. ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌ను రాష్ట్రంలో నెలకొల్పడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. 1975 లో ఆంధ్రుల చలన చిత్ర పరిశ్రమాభివృద్ధి కార్పొరేషన్ నెలకొల్పింది. ప్రభుత్వం వసూలుచేసే వినోదపన్నులో 7 శాతాన్ని సినిమాల, కళాకారుల అభివృద్ధికి వినియోగిస్తుంది. కొన్ని చిత్రాలకు వినోదపు పన్ను మినహాయిస్తుంది. ఫిలిం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ సినిమా హాలుల నిర్మాణానికి కూడా అప్పులు ఇస్తుంది. అదనపు వినోదపు పన్నును కూడా ప్రభుత్వం విధించింది. అయితే త్వరలో ఈ విషయంలో స్లాబ్ సిస్టమ్‌ను ప్రవేశపెట్టే యోచన ఉంది. ప్రభుత్వం లైసెన్సు చట్టాన్ని సవరించే యోచన కూడా చేస్తోంది. ఇది వరకు ప్రభుత్వం 35 శాతం వినోదపు పన్ను విధించేది. 1972 లో రిఫ్యూజి రిలీఫ్ టాక్స్‌గా సినిమాటికెట్‌కు ఒక్కదానికి 10 పైసల చొప్పున విధించింది. 1973లో దీనిని రద్దుచేసింది. 1974 లో పరిశ్రమలో అన్ని శాఖలతో పాటు ప్రదర్శన శాఖలోకూడా మినిమమ్ వేజెస్ ప్రవేశ పెట్టబడినాయి. 1974 లోనే రాష్ట్రప్రభుత్వం అదనపు పన్ను విధించింది. అయితే ఈ పన్నుల భారం తట్టుకోవడం ముఖ్యంగా టూరింగ్ టాకీస్‌ల వారికి ఇబ్బందిగా ఉండటంవల్ల స్లాబ్ సిస్టమ్ గురించి యోచన జరుగుతున్నది.

చిత్రాలు కేవలం వినోదంకోసమేకాక, సృజనాత్మకంగాను, మేధస్సును కదిలించేవిగాను ఉండాలనే ధోరణి బలపడుతుండటంవల్ల అటువంటి వాతావరణం నిర్మాణానికి సహాయపడే ఫిలిం అప్రీసియేషన్ కోర్సులు, ఫిలిం వర్క్‌షాపులు ప్రారంభించాలనే అభిప్రాయం బలపడుతున్నది. ఇటువంటి చిత్రాలు పెంపొందించడానికి ఫిలింసొసైటీలు గణనీయమైన

కృషి చేస్తున్నాయి. ఈ ఫిలింసొసైటీలు మనరాష్ట్రంలో ఇటీవలనే ప్రారంభమవుతున్నాయి. చిన్నబడ్జెట్ చిత్రాల నిర్మాణావశ్యకత కనబడుతోంది. ఫిలింఛాంబర్‌కు కూడా అప్రిసియేషన్ కోర్సులు నిర్వహించాలన్న అభిప్రాయం ఉంది.

## తెలుగుచిత్రాలు, స్వభావం

తెలుగులో 1935 వరకు నిర్మించిన చిత్రాలన్నీ పౌరాణికాలే. 1936 లో 'ప్రేమ విజయం' అనే సాంఘిక చిత్రం నిర్మింపబడి, అటువంటి సినిమాలకు ఒరవడి నిచ్చింది. అట్లా నెమ్మదిమీద సినిమాల సంఖ్య పెరిగి, సాంఘిక చిత్రాలుకూడా ఎక్కువగా రావడం ప్రారంభ మైంది. 1938 లో మద్యపాన సమస్య ఇతివృత్తంగా హెచ్. ఎమ్. రెడ్డిగారు తీసిన "గృహలక్ష్మి", గూడవల్లి రామబ్రహ్మంగారు అస్పృశ్యతా నివారణమీద తీసిన 'మాలపిల్ల' వచ్చాయి. 1939 లో జమిందారీ సమస్యమీద రామబ్రహ్మంగారు నిర్మించిన 'రైతుబిడ్డ' చిత్రం ప్రభుత్వ ఆగ్రహానికి గురిఅయింది. 'మళ్ళీపెళ్ళి' వరవిక్రయం వంటి ప్రబోధనాత్మక చిత్రాలు ఎన్నో వచ్చాయి. కాని 1944-49లో సాంఘిక సినిమానిర్మాణం చాలావరకు తగ్గింది. అప్పుడే జానపదాలు ప్రారంభమై ప్రేక్షకులను రంజింపజేయడం ప్రారంభించాయి. బాలరాజు, కీలుగుర్రం వంటి సినిమాలు కనకవర్షం కురిపించాయి. మళ్ళీ 1950 కి సాంఘిక చిత్రాలకు ఎక్కువ ఆదరణ లభించింది. క్రమంగా సాంఘిక చిత్రాల నిర్మాణం పెరిగింది. అదీకాక 1945 నుంచి రెండవ ప్రపంచయుద్ధం కారణంగా చిత్రనిర్మాణ సంఖ్య పడిపోయింది. 1950 నుంచి పుంజుకోవడం ఆరంభమయింది. 1950 లో 19 చిత్రాలు విడుదలయ్యాయి. క్రమేపీ చిత్రనిర్మాణసంఖ్య పెరుగుతూవచ్చి, 1971 లో 85 చిత్రాలు విడుదలైనాయి. 1973 నుంచి పౌరాణిక చిత్రాలు, జానపదచిత్రాల నిర్మాణం చాలా తగ్గిపోయింది.

*డబ్బింగ్ చిత్రాలు :* 1950 లో డబ్బింగ్ చిత్రాల విడుదల ప్రారంభమైంది. 1960 నాటికి ఈ సంఖ్య 19కి పెరిగి 1971 లో 20 వరకు ఉంది.

ఇంతేకాక ఇతరభాషలలో విజయవంతమైన సినిమాలను పునర్నిర్మించడం ఇటీవల ఎక్కువగా ఉంది. ఎక్కువగా హిందీ, తమిళ, చిత్రాలకు ఈ విధంగా పునర్నిర్మిస్తు న్నారు. తెలుగుచిత్రాలు కూడా అడపాతడపా ఇతరభాషలలో పునర్నిర్మింపబడి విజయవంత మవుతున్నాయి.

తెలుగులో వచ్చిన మొట్టమొదటి కలర్ సినిమా సి. పుల్లయ్యగారి దర్శకత్వంలో 1963 లో ప్రారంభమైంది. 1965 లో ఆదుర్తి సుబ్బారావుగారి దర్శకత్వంలో కొత్త తారాగణంతో తెలుగులో పూర్తికలర్ చిత్రం నిర్మింపబడింది. 1971 నుంచి కలర్ సినిమాల సంఖ్య బాగా పెరిగింది. అప్పటి వరకు సంవత్సరానికి 1 లేదా 2 కలర్ సినిమాలు విడుదల అయితే, 1971 లో 15 కలర్ సినిమాలు (7 డైరెక్ట్‌టేక్, 8 డబ్బింగ్ చిత్రాలు) విడుదలై నాయి. ఇటీవల చెదురుమదురుగా ఒకటి రెండు చిత్రాలు తప్ప అన్నీ కలర్ సినిమాలే తీస్తున్నారు.

సినిమాస్కోప్ వర్ణచిత్రాలు 1974 లో తెలుగులో ప్రారంభమైనాయి. 1974 లో వచ్చిన చిత్రం అల్లూరి సీతారామరాజు అనే చిత్రం. ఆ తరవాత దేవదాసు అనే చిత్రం విడుదల అయింది.

***ఆంధ్రేతర ప్రాంతాలలో తెలుగు చిత్రాలు :*** ముఖ్యంగా మైసూర్‌రాష్ట్రంలో తెలుగు చిత్రాలకు మంచి ఆదరణ లభిస్తున్నది. తెలుగువారు ఎక్కువగాఉన్న ఖరగ్‌పూర్, జంషెడ్ పూర్, కలకత్తా, బెంగుళూరు, షోలాపూరు మొదలైన నగరాలలో తెలుగు చిత్రాలకు మంచి ఆదరణ ఉంది. అటువంటి ప్రాంతాలలో తెలుగు వారందరూ సంఘాలుగా ఏర్పడి తెలుగు చిత్రాలు తెప్పించుకొని ప్రదర్శన ఏర్పాటు చేసుకొంటారు.

స్టూడియోలలో ఈ మధ్య లేబరు సమస్యల, విద్యుచ్ఛక్తికోత, నిర్మాణం ఖర్చుపెరగడం, యూనిట్ సమస్యలవల్ల కొన్నిస్టూడియోలు కొంతకాలంపాటు మూతపడటం మొదలైన కారణాలవల్ల స్టూడియోలలోకంటె ఔట్‌డోర్‌లోనే చిత్రనిర్మాణం ఎక్కువగా చేస్తున్నారు. అంతేకాక, స్టూడియో సెట్టింగ్‌లలోని కృత్రిమ వాతావరణం విసుగెత్తి ప్రేక్షకులు కూడా ఔట్‌డోర్ నిర్మాణాలనే ఎక్కువగా ఆదరిస్తున్నారు. ఇటీవల కొన్ని చిత్రాలు సంపూర్తిగా ఔట్‌డోర్‌లోనే నిర్మాణం కావడం విశేషం.

***సినిమాలు-విభజన :*** సినిమాలను కమర్షియల్, సెమీ కమర్షియల్, ఆర్ట్, న్యూవేవ్ సినిమాలుగా వాటి కథాంశాన్ని బట్టి విభజించవచ్చు. కమర్షియల్ సినిమాలు పౌరాణికాలు, చారిత్రాత్మకాలు, జానపదాలు, సాంఘికాలు, స్టేజి నాటకాలు, క్రైమ్, స్టంటు మొదలైనవి అనేకమున్నాయి. వీటిలో చాలావరకు నటీనటుల ప్రాముఖ్యం ఉన్నవి, కొన్ని దర్శకుని ప్రాముఖ్యం ఉన్నవి, భారీ సెట్టింగులు ప్రాముఖ్యం ఉన్నవి ఉన్నాయి. ఔత్సాహికులను అభివృద్ధి పరిచే లిటిల్ సినిమా మరొక కోవకు చెందినది. న్యూ సినిమాలలో కమిటెడ్ సినిమాలు, థర్డు వరల్డు సినిమాలు, ఆర్ట్ సినిమాలు, రాజకీయ సినిమాలు, మానవతా ప్రాధాన్యం గల సినిమాలు చేరతాయి. కమర్షియల్, న్యూ సినిమాలకు మధ్యస్థంగా ఉండేవాటిని సెమీ కమర్షియల్ సినిమాలనవచ్చు.

ఇటీవల కేవలం భారీ సెట్టింగులు, నటీనటుల ప్రాధాన్యంతో వచ్చే ఫార్ములా చిత్రాల కన్న, కథా బలం కలిగి, సాంఘిక సమస్యలను ప్రతిభావంతంగా చిత్రించి పరిష్కారంచూపే చిత్రాలు విజయవంతమవుతున్నాయి.

రాను రాను మానవ జీవన విధానంలో వేగం పెరిగినట్లే, ఫిలిం పరిశ్రమలో అన్ని శాఖలలోనూ ఆ వేగం ప్రతిబింబిస్తోంది. ఇటీవలి సినిమాలలో కథలోనూ, కథనంలోనూ అంతులేని వేగం, కొత్తదనం కనిపిస్తున్నాయి. అట్లాగే ప్రదర్శకులు (ఎగ్జిబిటర్లు) తమ థియేటర్లను పర్సంటేజి పద్ధతిపైకాక, వీక్లీరెంటల్స్‌పై ప్రదర్శిస్తున్నారు. డిస్ట్రిబ్యూషన్ కూడా అన్ని ఏరియాలలోనూ ఒకే సంస్థ తన శాఖలను ఏర్పరిచి ఒక చిత్రంకొని ఆ చిత్రం డిస్ట్రిబ్యూషన్ బాధ్యత తానే వహించేది. కాని ఇటీవల నిర్మాతలు తాము నిర్మించిన చిత్రాలకు

డబ్బు త్వరగా రాబట్టుకోవాలనే ఆత్రుతతో సర్క్యూట్‌వారీ అమ్మకాలు ప్రారంభించారు. ఆ పద్ధతే ఆ తరవాత జిల్లాలవారీ, టౌనువారీ అమ్మకాలుగా మారింది. అందువల్ల ఒక్కొక్క చిత్రానికి కొనుగోలుదార్లు, హక్కుదార్లు ఎక్కువగా ఉంటున్నారు. అంతేకాక నిర్మాణ శాఖలో కూడా విపరీతమైన వేగం వచ్చింది. పూర్వం ఒక చిత్రం నిర్మాణమే సుమారు ఆరు నెలల నుంచి సంవత్సర కాలం పట్టేది. కాని ఇటీవల ఒక్క నెల రోజులలోను, అంతకు లోపుగానూ కూడా చిత్రనిర్మాణం పూర్తి అవుతోంది. వారానికి సగటున రెండు సినిమాల చొప్పున విడుదల అవుతున్నాయి. టికెట్ ధరలు పెరిగినాయి. తెలుగు చిత్రాలతోపాటు తెలుగు దేశంలో హిందీ చిత్రాలకు కూడా మంచి గిరాకీ ఉంది. అందువల్ల తెలుగులో తీసిన అన్ని చిత్రాలూ విజయవంతం కావడం లేదు. డబ్బింగ్ చిత్రాల సంఖ్యకూడా పెరిగింది. 1950 లో డబ్బింగ్ చిత్రాలు ప్రారంభమయ్యాయి. 1960 లో 19 డబ్బింగ్ చిత్రాలు విడుదల కాగా, 1971 లో 20 చిత్రాలు విడుదల అయ్యాయి. ఇతర భాషా చిత్రాలలో బాగా విజయవంతం పొందిన వాటిని తెలుగులో పునర్నిర్మించడం ఇటీవల బాగా ఎక్కువయ్యింది. ముఖ్యంగా హిందీ, తమిళ చిత్రాలు రీ మేక్ చిత్రాలుగా తెలుగులో వస్తుంటాయి. ఇటీవల తెలుగు నవలలనే చిత్రాలుగా తీయడం ఎక్కువయింది.

సుమారు 50 సం ॥ ల చరిత్రగల తెలుగు చిత్ర పరిశ్రమ ఎన్నో ఒడుదుడుకులకు లోనై అభివృద్ధి చెందుతోంది. ప్రస్తుతం పరిశ్రమ ఎన్నో సమస్యలను ఎదుర్కొంటున్నది. ముడిఫిలిం కొరత, పెట్టుబడి, హెచ్చు ఓవర్‌హెడ్ వ్యయాలు, నిర్మాణ వ్యయాలు పెరిగిపోయాయి. దాదాపు 100 సినిమాలలో 10 సినిమాలే ఆర్థికంగా విజయవంతమవుతున్నాయి. మిగతావి దెబ్బతింటున్నాయి. సినిమా పరిశ్రమకు ప్రభుత్వ ఆదరణ, రక్షణ ఆవశ్యకత ఎంతో ఉంది.

## 1931 నుంచి 79 వరకు విడుదలైన చిత్రాల సంఖ్య

| సంవత్సరం | చిత్రాలసంఖ్య | డబ్బింగ్ చిత్రాలు | మొత్తంచిత్రాలు |
|---|---|---|---|
| 1931 | 1 | .... | 1 |
| 1941 | 14 | .... | 14 |
| 1951 | 23 | 1 | 24 |
| 1961 | 28 | 2 | 30 |
| 1971 | 85 | 20 | 105 |
| 1975 | 72 | 13 | 85 |
| 1976 | 81 | 12 | 93 |
| 1977 | 70 | 15 | 85 |
| 1978 | 82 | 7 | 89 |
| 1979 | 95 | 23 | 118 |

ఇంతవరకు తెలుగులో మొత్తం 1,776 చిత్రాలు విడుదలయ్యాయి.

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఫిలిం అభివృద్ధి కార్పొరేషన్

## (A. P. State Film Develpoment Corporation)

ఈ సంస్థను 1975 అక్టోబరులో స్థాపించడం జరిగింది. సినిమాటోగ్రాఫ్, లలిత కళల అభివృద్ధికి కేటాయించిన వినోదపన్ను 7%లో లభించే నిధులనుంచి ఖర్చులను భరించి ఫిలిం పరిశ్రమ, లలిత కళల అభ్యున్నతికి వివిధ పథకాలు రూపొందించి అమలుచేయడం కోసం ఈ కార్పొరేషన్ ఏర్పాటు చేయబడింది. ఈ సంస్థ ప్రదర్శన సదుపాయాల విస్తరణ స్టూడియోల నిర్మాణం, ఫిలింపరిశ్రమ అభివృద్ధికి అవస్థాపన సదుపాయాలు, డాక్యుమెంటరీలు న్యూస్‌రీల్సు తయారుచేయడం, ఆడిటోరియంలు నిర్మించడం, మొదలైన కార్యకలాపాలను చేపట్టి నిర్వహిస్తోంది. ఈ సంస్థ గ్రామీణ చిన్నతరహా పట్టణప్రాంతాల్లో 96 సినిమాథియేటర్ల నిర్మాణానికి రూ. 2. 18 కోట్ల మేరకు ఋణాలు మంజూరుచేసింది. అందులో 78 థియేటర్ల నిర్మాణం పూర్తిఅయి, పనిచేస్తున్నాయి. ఈ సంస్థ మూడు కొత్త స్టూడియోల నిర్మాణానికి రెండు పాతస్టూడియోల విస్తరణకు, పునరుద్ధరణకు రూ 75 లక్షల మేరకు ఋణాలు మంజూరు చేసింది. ఫిలింపరిశ్రమ అభివృద్ధి నిమిత్తం అవస్థాపన సదుపాయాల కల్పనకు తోడ్పడుతుంది. ఈ కార్పొరేషన్ ఇంతవరకు (31-3-1980 నాటికి) 18 వార్తా చిత్రాలను నిర్మించింది. మరో 9 డాక్యుమెంటరీలు, 2 న్యూస్‌రీల్సు నిర్మాణంలో ఉన్నాయి. రాజమండ్రి, నెల్లూరు. చిత్తూరు, గూడూరు, మొదలైనచోట్ల ఆడిటోరియంల నిర్మాణానికి ఆర్థికసహాయం చేసింది. రానున్న అయిదేళ్లలో ఆంధ్రప్రదేశ్‌లో 23 జిల్లాల్లో ఆడిటోరియంలను నిర్మించాలని ఈ సంస్థ సంకల్పం. ఈ సంస్థకు భవిష్యత్ పథకాలెన్నో ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ రజతోత్సవాల సందర్భంగా తెలుగు ఫిలిం పరిశ్రమ సహకారంతో వివిధ థియేటర్లలో నవంబరు 9, 1980 న తెలుగు చలన చిత్రాల ప్రత్యేక ప్రదర్శన వివిధ పట్టణాలలో రూ. 1, అర్ధరూపాయి ప్రవేశ రుసుముతో జరిపారు.

# 32

# తంతి-తపాలా సౌకర్యాలు

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత తంతి-తపాలా సర్వీసుల విభాగం ఒకే సర్కిల్ కిందకు తీసుకురావడం జరిగింది. ఈ విభాగం పోస్ట్ మాస్టర్ జనరల్ ఆధ్వర్యంలో పని చేస్తుంది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరవాత అన్ని రంగాలతోపాటు తంతి-తపాలా, టెలిఫోన్ సౌకర్యాలు కూడా విస్తరించడం జరిగింది. ఈ సౌకర్యాలవల్ల ప్రజలకు ఎన్నో ప్రయోజనాలు చేకూరుతున్నాయని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

## తపాలా

ఆంధ్రప్రదేశ్‌లో తపాలా ఆఫీసులు ప్రతి సంవత్సరం అభివృద్ధి చెందుతూనే ఉన్నాయి. గ్రామీణ ప్రాంతాలలో కూడా మారుమూల ప్రజలకు తపాలా సౌకర్యాలను కల్పించడం జరిగింది. మన రాష్ట్రంలో పోస్టాఫీసుల పెరుగుదల కింద పట్టిక ద్వారా తెలుసుకోవచ్చు.

| సంవత్సరం | పోస్టాఫీసుల సంఖ్య |
|---|---|
| 1960 | 9,319 |
| 1971 | 13,355 |
| 1976 | 14,055 |
| 1978 | 14,734 |
| 1979 | 15,063 |

మూలం : పోస్ట్‌మాస్టర్ జనరల్, ఆంధ్రప్రదేశ్ సర్కిల్

1979 మార్చి 31 నాటికి గల 15,063 పోస్టాఫీసులలో 59 హెడ్ పోస్టాఫీసులు 2,989 సబ్ ఆఫీసులు, 12,015 బ్రాంచి ఆఫీసులు ఉన్నాయి.

| జిల్లా | హెడ్డాఫీసులు | సబ్ ఆఫీసులు | బ్రాంచి ఆఫీసులు | మొత్తం |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 3 | 102 | 652 | 757 |
| విశాఖపట్నం | 3 | 120 | 676 | 799 |
| తూర్పుగోదావరి | 3 | 142 | 611 | 756 |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| పశ్చిమగోదావరి | 4 | 128 | 551 | 683 |
| కృష్ణా | 3 | 150 | 644 | 797 |
| గుంటూరు | 4 | 163 | 684 | 851 |
| ప్రకాశం | 2 | 82 | 536 | 620 |
| నెల్లూరు | 4 | 115 | 748 | 867 |
| కోస్తాఆంధ్ర | 26 | 1,002 | 5,102 | 6,130 |
| కర్నూలు | 4 | 129 | 886 | 1019 |
| అనంతపూరు | 3 | 126 | 811 | 940 |
| కడప | 2 | 73 | 548 | 623 |
| చిత్తూరు | 4 | 134 | 757 | 895 |
| రాయలసీమ | 13 | 462 | 3,002 | 3,477 |
| హైదరాబాదు | 6 | 226 | 323 | 555 |
| నిజామాబాద్ | 2 | 52 | 390 | 444 |
| మెదక్ | 1 | 48 | 456 | 504 |
| మహబూబ్‌నగర్ | 2 | 77 | 713 | 792 |
| నల్గొండ | 2 | 67 | 595 | 664 |
| వరంగల్ | 2 | 72 | 567 | 641 |
| ఖమ్మం | 1 | 57 | 397 | 455 |
| కరీంనగర్ | 2 | 80 | 598 | 680 |
| ఆదిలాబాద్ | 1 | 51 | 340 | 392 |
| తెలంగాణా | 19 | 729 | 4,379 | 5,127 |
| ఆంధ్రప్రదేశ్ | 58 | 2,193 | 12,483 | 14,734 |

మూలం : పోస్ట్‌మాస్టర్ జనరల్, ఆంధ్ర సర్కిల్.

మనరాష్ట్రంలోగల పోస్టాఫీసుల సంఖ్య, అవి జనాభాకు అందించే సేవలు పరిశీలిస్తే రాష్ట్రగ్రామీణ ప్రాంతంలో సగటున ప్రతి 19 చ.కి మీటర్లకు ఒకపోస్టాఫీసు ఉన్నట్లు తెలియ వస్తున్నది. ప్రతి ఒక్క పోస్టాఫీసు దాదాపు 2,500 మంది జనాభాకు సేవ చేస్తున్నది. పట్టణ ప్రాంతాలను పరిశీలిస్తే దాదాపు 3 చ.కి మీటరుకు ఒక పోస్టాఫీసు ఉన్నట్లు తెలియ న్నది. ఒక్కొక్కటి సగటున 7,500 మంది జనాభాకు సేవచేస్తున్నది.

తపాలా విభాగంలో ఈ మధ్యకాలంలో క్విక్ మెయిల్ సర్వీసును ప్రవేశ పెట్టడం జరిగింది. దీనివల్ల తపాలా బట్వాడాలో ఆలస్యాన్ని తగ్గించవచ్చు. మన రాష్ట్రంలోని జిల్లా ముఖ్య కేంద్రాలకు ఈ సర్వీసును విస్తరించడం జరిగింది. అంతే కాకుండా విజయవాడ, తిరుపతి, ప్రొద్దుటూరు, ఆదోని, భీమవరం, తెనాలి, గుడివాడ మొదలైన పట్టణాలలో కూడా క్విక్ మెయిల్ సర్వీసు రాష్ట్ర రాజధానికి కలపడం జరిగింది. పోస్ట్ చేసిన రోజునే ఉత్త రాలు బట్వాడా జరిగే సౌకర్యాన్ని హైదరాబాదు, విజయవాడ మొదలైన పట్టణాలలో ఏర్పాటు చేయడం జరిగింది. లోకల్ డెలివరీ ఉత్తరాలను యిట్లా బట్వాడా చేస్తారు.

రైల్వే సౌకర్యాలు లేనిచోట్ల ఒక ప్రాంత నుంచి మరొక ప్రాంతానికి తపాలా సదు పాయాలను కల్పించడంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రరోడ్డురవాణా సంస్థ ప్రశంసనీయమైన పాత్ర నిర్వహిస్తోంది. రైల్వే సౌకర్యాలు ఎక్కువగాలేని రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో ఈ సంస్థ ఎక్కువగా తపాలా శాఖకు తోడ్పడుతున్నది. అంతే కాకుండా రాత్రిపూట బస్సుల సర్వీసులు ఉండటంవల్ల ఎక్కువ ప్రాంతాలకు త్వరితంగా తపాలా పంపించడానికి వీలు కలుగుతున్నది. మన రాష్ట్రంనుంచి బొంబాయి, ఢిల్లీ, కలకత్తా, మద్రాసు, విదేశాలకు పోయే తపాలాను హైదరాబాదు నుంచి విమానాల ద్వారా పంపడం జరుగుతున్నది.

## తంతి

ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు ప్రతి 200 చ.కి.మీ.కు ఒక తంతి కార్యాలయం ఉన్నట్లు తెలు స్తోంది. మన రాష్ట్రంలోని మూడు ప్రాంతాలను విడివిడిగా పరిశీలిస్తే తెలంగాణా ప్రాంతంలో తంతి కార్యాలయాలు తక్కువగాను, రాయలసీమ ప్రాంతంలో ఒక మాదిరిగాను, కోస్తా ప్రాంతంలో హెచ్చుగాను ఉన్నాయని తెలియగలదు. సగటున ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 25,000 మంది జనాభాకు ఒక తంతి కార్యాలయం ఉందని చెప్పవచ్చు. మన రాష్ట్రంలో 1978 సంవత్సరానికి 2,155, 1979 మార్చినాటికి 2,642 తంతి కార్యాలయాలు ఉన్నట్లు జనరల్ మేనేజర్ టెలికమ్యూనికేషన్స్ ఆంధ్రప్రదేశ్ వారి లెక్కలు చెబుతున్నాయి.

జిల్లాలవారీగా 31-3-1978 నాటికి మన రాష్ట్రంలో కింద పేర్కొన్న తంతి కార్యా లయాలు ఉన్నాయి.

| జిల్లా | తంతికార్యాలయాలు |
|---|---|
| శ్రీకాకుళం | 46 |
| విశాఖపట్నం | 44 |

| | |
|---|---|
| తూర్పుగోదావరి | 207 |
| పశ్చిమగోదావరి | 174 |
| కృష్ణా | 195 |
| గుంటూరు | 180 |
| ప్రకాశం | 115 |
| నెల్లూరు | 83 |
| కోస్తా ఆంధ్ర | 1044 |
| కర్నూలు | 185 |
| అనంతపూరు | 92 |
| కడప | 72 |
| చిత్తూరు | 168 |
| రాయలసీమ | 517 |
| హైదరాబాదు | 81 |
| నిజామాబాద్ | 47 |
| మెదక్ | 44 |
| మహబూబ్ నగర్ | 74 |
| నల్గొండ | 52 |
| వరంగల్ | 76 |
| ఖమ్మం | 58 |
| కరీంనగర్ | 111 |
| ఆదిలాబాద్ | 51 |
| తెలంగాణామొత్తం | 594 |
| ఆంధ్రప్రదేశ్ మొత్తం | 2,155 |

మూలం : జనరల్ మేనేజర్ టెలికమ్యూనికేషన్స్, ఆంధ్రా సర్కిల్.

## టెలిఫోనులు

హైదరాబాద్ పట్టణానికి టెలిఫోన్ సౌకర్యం 1897 లోనే వచ్చింది. ఆంధ్రప్రదేశ్ అవతరణ తరవాత టెలిఫోన్ సౌకర్యాలు వివిధ పట్టణాలలో అభివృద్ధి చెందాయని చెప్ప

వచ్చు. 1978 మార్చి నాటికి మనరాష్ట్రంలో 804 టెలిఫోన్ ఎక్స్ఛేంజీలు 1979 మార్చి నాటికి 955 టెలిఫోన్ కేంద్రాలు ఉన్నాయి. మనరాష్ట్రంలో ఉన్న టెలిఫోను ఎక్స్ఛేంజిలలో ఆటోమేటిక్ ఎక్స్ఛేంజీలు, మాన్యువల్ ఎక్స్ఛేంజీలు ఉన్నాయి. 1979 మార్చి నాటికి మనరాష్ట్రంలో 1966 పబ్లిక్‌కాల్ ఆఫీసులు, 1,13, 184 టెలిఫోను కనెక్షన్‌లు ఉన్నాయి.

విజయవాడ, గుంటూరు, విశాఖపట్నం, కాకినాడ పట్టణాలలోగల ఎక్స్ఛేంజిలలో 1500 లైన్లు ఉన్నాయి. జిల్లా కేంద్రాలలో ఎక్స్ఛేంజీలలో 300 నుంచి 1000 లైన్లుగల 24 ఎక్స్ఛేంజీలున్నాయి. జంటనగరాలలో గల ఎక్స్ఛేంజీలలో దాదాపు 40,000 లైన్లు ఉన్నాయి. జంట నగరాలలో, గౌలిగూడా, సైఫాబాదు, ముషీరాబాదు, ఎర్రగడ్డ ఎక్స్ఛేంజీలలో ఉపగ్రహ ఎక్స్ఛేంజీలు పనిచేస్తున్నాయి.

31-3-1978 నాటికి వివిధ జిల్లాలలోగల టెలిఫోన్ ఎక్స్ఛేంజీలు, పబ్లిక్‌కాల్ ఆఫీసుల వివరాలు కింద యివ్వడం జరిగింది.

| జిల్లా | టెలిఫోన్ ఎక్స్ఛేంజీలు | పబ్లిక్‌కాల్ ఆఫీసులు |
|---|---|---|
| శ్రీకాకుళం | 36 | 175 |
| విశాఖపట్నం | 28 | 132 |
| తూర్పుగోదావరి | 74 | 241 |
| పశ్చిమగోదావరి | 71 | 118 |
| కృష్ణ | 57 | 184 |
| గుంటూరు | 60 | 203 |
| ప్రకాశం | 42 | 101 |
| నెల్లూరు | 43 | 121 |
| కోస్తాఆంధ్ర మొత్తం | 411 | 1,275 |
| కర్నూలు | 32 | 123 |
| అనంతపూర్ | 30 | 34 |
| కడప | 29 | 89 |
| చిత్తూరు | 53 | 197 |
| రాయలసీమ మొత్తం | 144 | 197 |
| హైదరాబాద్ | 32 | 363 |

| | | |
|---|---|---|
| నిజామాబాద్ | 31 | 13 |
| మెదక్ | 20 | 20 |
| మహబూబ్‌నగర్ | 30 | 36 |
| నల్గొండ | 34 | 38 |
| వరంగల్ | 22 | 48 |
| ఖమ్మం | 22 | 23 |
| కరీంనగర్ | 36 | 55 |
| ఆదిలాబాద్ | 22 | 24 |
| తెలంగాణా | 249 | 620 |
| ఆంధ్రప్రదేశ్ | 804 | 2,338 |

మూలం : జనరల్ మేనేజర్, టెలిఫోన్స్ హైదరాబాదు.

## సబ్ స్క్రైబర్ ట్రంక్ డయలింగ్ (STD)

ఈ సౌకర్యాన్ని యిటీవలనే హైదరాబాదు, విజయవాడ, గుంటూరు, తిరుపతి, విశాఖ పట్నం మొదలైన పట్టణాలకు కల్పించడం జరిగింది. దీనివల్ల ఒక నగరం నుంచి మరొక నగరానికి ఎక్చేంజితో నిమిత్తం లేకుండా నేరుగా మాట్లాడుకొనే సదుపాయం కలుగుతుంది. ఇందువల్ల టెలిఫోన్‌దారులకు ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్ రాజధానియైన హైదరాబాదు నుంచి కింద పేర్కొన్న పట్టణాలకు ఎస్. టి. డి. సర్వీసు ఉన్నది.

## ఫుల్‌టైం ఎస్.టి. డి. సర్వీసు

| పట్టణం | ఎస్.టి.డి.కోడ్ నం | పట్టణం | ఎస్.టి.డి. కోడ్ నం |
|---|---|---|---|
| ఆదిలాబాద్ | 08732 | కాలికట్ (కోజికోడ్) | 0495 |
| అలెప్పీ | 0477 | కన్ననూర్ | 0497 |
| బెంగుళూరు | 0812 | చెంగల్‌పట్ | 04114 |
| బెల్‌గాం | 0831 | కోయంబత్తూరు | 0422 |
| బొంబాయి | 022 | ధర్మపురి | 04342 |
| కలకత్తా | 033 | దావణగిరి | 0819 |

| | | | |
|---|---|---|---|
| ఎర్నాకులమ్ | 0484 | క్విలన్ | 0474 |
| ఈరోడ్ | 0424 | రాజమండ్రి | 0883 |
| గుంటూరు | 0863 | రాజపాల్యం | 04563 |
| కాకినాడ | 0884 | సేలం | 0427 |
| ఖమ్మం | 08742 | షిమోగా | 08182 |
| కోయిల్ పట్టి | 04632 | తిరుపతి | 08574 |
| కొట్టాయం | 0481 | తుమ్కూరు | 0816 |
| మద్రాసు | 044 | తిరుపూర్ | 0421 |
| మధురై | 0452 | త్రిచూర్ | 0487 |
| మంగుళూరు | 0824 | తిరుచీ | 0431 |
| మచిలీపట్నం | 08672 | త్రివేంద్రం | 0471 |
| మెర్కారా | 08272 | ఉడిపి | 08252 |
| మైసూరు | 0821 | ఉడుమల్ పేట | 04252 |
| నరక్కల్ | 04852 | వెల్లూరు | 0416 |
| న్యూఢిల్లీ | 011 | విజయవాడ | 0866 |
| ఒంగోలు | 08592 | విరుదునగర్ | 04562 |
| ఊటీ | 0423 | విశాఖపట్నం | 0891 |
| పాలకొల్లు | 08814 | వరంగల్ | 08712 |
| పాల్ఘాట్ | 0491 | | |

## రాత్రి సమయంలో ఎస్.టి.డి. సర్వీసు

| | | | |
|---|---|---|---|
| ఆగ్రా | 0562 | జమ్ షెడ్పూరు | 0657 |
| అంబాలా | 0171 | జలంధర్ | 0181 |
| అసన్ సోల్ | 0341 | ఖరగ్ పూర్ | 03222 |
| భువనేశ్వర్ | 0674 | ముజఫర్ పూర్ | 0621 |
| చండిగర్ | 0172 | పాట్నా | 0612 |
| చప్రా | 06152 | రూర్ కేలా | 0661 |
| కటక్ | 0671 | షిల్లాంగ్ | 0364 |
| దర్భాంగా | 06272 | సమస్తిపూర్ | 06274 |
| జైపూర్ | 0141 | | |

## ప్రతిపాదనలో ఉన్న ఎస్.టి.డి. స్టేషనులు కోడ్ నంబర్లు

| | | | |
|---|---|---|---|
| అహమదాబాద్ | 0272 | మాయావరమ్ | 04364 |
| అనంతపూర్ | 08554 | నాగపట్టణం | 04365 |
| బరోడా | 0265 | నాగపూరు | 0712 |
| భీమవరం | 08816 | నాసిక్ | 0253 |
| భోల్ | 0755 | పణజి | 0832 |
| చిదంబరం | 04144 | పటాన్‌చెరు | 08453 |
| ధన్‌బాద్ | 0326 | పూనె | 0212 |
| గాంధినగరు | 0274 | రాయ్‌పూరు | 0771 |
| గుడివాడ | 08674 | రాజ్‌కోట్ | 0281 |
| హుబ్లి | 0836 | సూరత్ | 0261 |
| ఇండోరు | 0731 | థేని | 04546 |
| కొల్హాపూరు | 0231 | తిరువారూరు | 04366 |
| మహబూబ్‌నగరు | 08542 | ట్యూటికోరిన్ | 0461 |
| మన్నారుగుడి | 04367 | విల్లుపురమ్ | 04146 |
| | | విజయనగరం | 08922 |

ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని నగరాలకు "నోడిలే" సర్వీసులు ఉన్నాయి. అందులో విజయవాడ, విశాఖపట్నం, రాజమండ్రి, ఏలూరు, గుంటూరు, ఒంగోలు, తెనాలి, నెల్లూరు, గుడివాడ, ఖమ్మం, హైదరాబాదు ముఖ్యమైనవి. ఆంధ్రప్రదేశ్‌లో మైక్రోవేవ్‌లింక్‌లు సికింద్రాబాదు-వరంగల్, సికింద్రాబాదు-పూనా, విజయవాడ-తెనాలి-గుంటూరు మధ్య ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో 11 పట్టణాలను కోయాక్సిల్, కేబుల్‌ద్వారా కలపడం జరిగింది. అవి సికింద్రాబాద్, విజయవాడ, విశాఖపట్నం, శ్రీకాకుళం, రాజమండ్రి, విజయనగరం, గుంటూరు, ఏలూరు, ఒంగోలు, నెల్లూరు, కాకినాడ.

1965 ఏప్రిల్‌లో మొట్టమొదటగా హైదరాబాదులో 100 లైన్లతో టెలెక్స్ ఎక్ఛేంజిని నెలకొల్పడం జరిగింది. ఇప్పుడు దాదాపు 700 లైన్లను పెంచడం జరిగింది.

## పిన్‌కోడ్ నంబర్లు

పాఠకుల సౌకర్యార్థం ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ నగరాల గ్రామాల పిన్‌కోడ్‌నంబర్లను కింద యిస్తున్నాము. పిన్‌కోడ్ నిమిత్తం ఆంధ్రప్రదేశ్‌లోని 24 రెవిన్యూ జిల్లాలుగా విభజింపడం జరిగింది. వాటి మొదటి మూడు అంకెల పిన్‌చార్టును కింద ఇస్తున్నాము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | హైదరాబాద్ టి. డి. | 500 | 2. | హైదరాబాద్ జిల్లా | 501 |
| 3. | మెదక్ జిల్లా | 502 | 4. | నిజామాబాద్ జిల్లా | 503 |
| 5. | ఆదిలాబాద్ జిల్లా | 504 | 6. | కరీంనగరు జిల్లా | 505 |
| 7. | వరంగల్ జిల్లా | 506 | 8. | ఖమ్మంజిల్లా | 507 |
| 9. | నల్గొండజిల్లా | 508 | 10. | మహబూబ్‌నగరుజిల్లా | 509 |
| 11. | అనంతపూరుజిల్లా | 515 | 12. | కడపజిల్లా | 516 |
| 13. | చిత్తూరుజిల్లా | 517 | 14. | కర్నూలుజిల్లా | 518 |
| 15. | విజయవాడ టి.డి | 520 | 16 | కృష్ణా టి డి | 521 |
| 17. | గుంటూరు టి.డి | 522 | 18. | ప్రకాశం టి.డి | 523 |
| 19. | నెల్లూరు టి.డి | 524 | 20. | విశాఖపట్నం టి.డి | 530 |
| 21. | విశాఖపట్నం జిల్లా | 531 | 22. | శ్రీకాకుళం జిల్లా | 532 |
| 23. | తూర్పుగోదావరిజిల్లా | 533 | 24. | పశ్చిమగోదావరిజిల్లా | 534 |

## అం

| | | | |
|---|---|---|---|
| అంగర | 533307 | అచ్చంపేట(గుంటూరు) | 522409 |
| అంగలకుదురు | 522211 | అచ్చంపేట(మహబూబ్‌నగర్) | 509375 |
| అంగలూరు | 521330 | అచ్యుతాపురం | 531011 |
| అంతకపేట | 505466 | అడవులదీవి | 522263 |
| అంతగావ్ టెక్స్‌టైల్స్ | 505514 | అట్లూరు | 51601 |
| అంతర్వేదిపాలెం | 533252 | అత్తిలి | 534134 |
| అందోలె | 502273 | అదాలత్-ఉల్-ఆలియా | 500266 |
| అంబం | 503235 | అద్దంకి | 523201 |
| అంబాజీపేట | 533214 | అద్దటీగాల | 533428 |
| అంబారీపేట | 505306 | అనంతగిరి | 501201 |
| అక్కన్నపేట | 502115 | అనంతగిరి (విజయనగరం) | 531150 |
| అక్కయ్యపాలెం | 530016 | అనంతపూర్ H.O. | 515001 |
| అక్కుపల్లి | 532219 | అనంతరాజు పేట | 516105 |
| అక్కుర్తి | 517536 | అనంతవరం(తూర్పుగోదావరి) | 533222 |
| అగదూరు | 516421 | అనంతవరం (గుంటూరు) | 522301 |
| అగలి | 515311 | అనంతసాగరం | 524302 |

| | |
|---|---|
| అనకాపల్లి | 534111 |
| అనపర్తి | 533342 |
| అన్నవరం | 533406 |
| అనుమసముద్రంపేట | 524304 |
| అప్పికట్ల | 522310 |
| అబ్బినేనిగుంటపాలెం | 522015 |
| అమరచింత | 506130 |
| అమరాపురం | 515281 |
| అమరాబాదు | 509201 |
| అమరావతి | 522020 |
| అమర్తలూరు | 522325 |
| అమలాపురం H.O | 533201 |
| అమిద్యాల | 515822 |
| అమ్మనబ్రోలు | 523180 |
| అయినబ్రోలు | 522659 |
| అరకులోయ | 531149 |
| అరగొండ | 517129 |
| అరసవల్లి | 533401 |
| అలంపూరు | 509152 |
| అల్లూరు (నెల్లూరు) | 524315 |
| అల్లూరు (కర్నూలు) | 518395 |
| అవనిగడ్డ | 521121 |
| అశ్వారావుపేట | 507301 |

**ఆ**

| | |
|---|---|
| ఆకిరిపల్లి | 521211 |
| ఆకివీడు | 534235 |
| ఆకునూరు | 521245 |
| ఆకుమళ్ల | 518196 |
| ఆచంట | 534123 |
| ఆత్మకూరు (నెల్లూరు) | 509131 |
| ఆత్మకూరు (అనంతపూరు) | 515751 |
| ఆత్మకూరు (కర్నూలు) | 518422 |
| ఆత్మకూరు (నల్గొండ) | 508111 |
| ఆత్మకూరు (వరంగల్) | 506342 |
| ఆత్రేయపురం | 533235 |
| ఆదర్శనగర్ | 500473 |
| ఆదిలాబాదు H.O | 504001 |
| ఆదోని H.O | 518301 |
| అనెమడుగు | 524203 |
| ఆమంగల్ | 509321 |
| ఆమదగూరు | 515560 |
| ఆమళ్లదిన్నె | 515445 |
| ఆముదాలవలస | 532185 |
| ఆరవల్లి | 534230 |
| ఆరోగ్యవరం | 517330 |
| ఆర్తపీడు | 523335 |
| ఆర్మూరు | 503224 |
| ఆర్యాపురం | 533104 |
| ఆలమంద | 531240 |
| ఆలమూరు (తూ. గోదావరి) | 533233 |
| ఆలమూరు (ప. గోదావరి) | 534126 |
| ఆలూరు (కర్నూలు) | 513395 |
| ఆలేరు | 508101 |
| ఆసిఫాబాదు | 504293 |
| ఆస్పారి | 518347 |
| ఆళ్లగడ్డ | 518543 |
| ఆళ్లదుర్గ | 502269 |
| ఆళ్లవరం | 533215 |

**ఇ**

| | |
|---|---|
| ఇంకోలె | 523167 |
| ఇంగలదవోల్ | 518308 |
| ఇంటూరు | 522341 |
| ఇందల్వాయి | 503164 |
| ఇందుకూరు పేట | 524314 |
| ఇందుపల్లి | 521311 |
| ఇంద్రపాలెం | 533460 |
| ఇచ్ఛాపురం | 532312 |
| ఇబ్రహీంపట్నం (కరీంనగర్) | 505450 |
| ఇబ్రహీంపట్నం (కృష్ణా) | 521226 |
| ఇబ్రహీంపట్నం(హైద్రాబాదు) | 501506 |
| ఇస్మాయిల్ ఖాన్ పేట | 502296 |

**ఈ**

| | |
|---|---|
| ఈజ | 509127 |
| ఈడుపులపాడు | 523190 |
| ఈపురుపాలెం | 523166 |
| ఈపూరు (గుంటూరు) | 522658 |
| ఈమని | 522308 |
| ఈరగవరం | 534217 |
| ఈరల్ | 517130 |
| ఈరువరం | 517123 |
| ఈరెడ్లపాడు | 521170 |
| ఈశ్వరుకొత్త పేట | 518186 |

**ఉ**

| | |
|---|---|
| ఉండి | 534199 |
| ఉత్తరవిల్లి | 532124 |
| ఉదయగిరి | 524226 |
| ఉప్పల్ (కరీంనగర్) | 505101 |
| ఉప్పలపాడు(కందుకూరు) | 523279 |
| ఉప్పలపాడు (పొదిలి) | 523253 |
| ఉప్పాద | 533445 |
| ఉప్పుగుండూరు | 523180 |
| ఉరవకొండ | 515812 |
| ఉర్లం | 532425 |
| ఉలవపాడు | 523292 |
| ఉలిందకొండ | 518218 |
| ఊత్కూరు | 509311 |
| ఊట్నూరు | 504311 |

**ఎ**

| | |
|---|---|
| ఎండపల్లి | 505526 |
| ఎక్నూరు | 507168 |
| ఎచోడ | 504307 |
| ఎడపల్లి | 503202 |
| ఎడవల్లి | 523356 |
| ఎడ్లపల్లి(గుంటూరు) | 522340 |
| ఎడ్లపాడు | 522233 |
| ఎతముక్కల | 523280 |
| ఎర్రగొండపాలెం | 523327 |
| ఎలగందల | 505401 |
| ఎలగేడు | 505525 |
| ఎలమర్రు | 521148 |

**ఏ**

| | |
|---|---|
| ఏకాంబరకుప్పం | 517592 |
| ఏటికొప్పాక | 531082 |
| ఏటుకూరు | 522017 |

| | |
|---|---|
| ఏటూరునగరం | 506165 |
| ఏలూరు | 534001 |
| ఐలాండ్ పోలవ ం | 533219 |

ఒ

| | |
|---|---|
| ఒంగోలు | 523001 |
| ఒండవల్లి | 509153 |
| ఓనిపెంట | 516173 |
| ఓబలదేవర చెరువు | 515561 |
| ఓబలవారిపల్లె | 516103 |
| ఓల్డ్ గుంటకల్ | 515803 |
| ఔక్ | 518122 |

క

| | |
|---|---|
| కంకిపాడు | 521151 |
| కంచికచర్ల | 521180 |
| కంచిలి | 532290 |
| కంచెర్లపాలెం (విశాఖ) | 530008 |
| కంతేశ్వర్ | 503002 |
| కంది | 502285 |
| కందిమల్లయ్యపల్లె | 516503 |
| కందుకూరు(అనంతపూర్) | 515721 |
| కందుకూరు (ప్రకాశం) | 523105 |
| కంబదూర్ | 515765 |
| కంబం (ప్రకాశం) | 523333 |
| కంభంపాడు | 521227 |
| కటారం | 505503 |
| కట్టెంగూడెం | 508205 |
| కట్టకింద వెంకటాపురం | 517561 |
| కత్రేనికోన | 533212 |
| కడప | 516001 |
| కడవకుదురు | 523181 |
| కడియం | 533126 |
| కడివెళ్ళ | 518358 |
| కడివేడు | 524410 |
| కడ్తల్ | 509358 |
| కదిరి | 515591 |
| కనకమామిడి | 501504 |
| కనగనపల్లి | 515641 |
| కనగల | 522259 |
| కనల | 518593 |
| కనిగిరి | 523230 |
| కనితి | 530025 |
| కానిపాకం | 517131 |
| కనుమోలు | 521100 |
| కనెకల్ | 515871 |
| కన్నపురం | 534311 |
| కపిలేశ్వరపురం(కృష్ణా) | 521246 |
| కపిలేశ్వరపురం (తూ గో.) | 533309 |
| కమలాపురం | 516289 |
| కమలాపూర్ | 505102 |
| కరటంపాడు | 524307 |
| కరవడి | 523182 |
| కరీంనగర్ | 505001 |
| కర్నూలు | 518001 |
| కర్లపాలెం | 522111 |
| కలకడ | 517236 |
| కలసపాడు | 516217 |
| కలికిరి | 517234 |

(మొత్తం కోట్లరూపాయలలో)

| అంశము | మూడో ప్రణాళికలో కేటాయించిన మొత్తం | ఖర్చుచేసినమొత్తం |
|---|---|---|
| 1. విద్యుదుత్పత్తి | 53.26 | 58.91 |
| a. పూర్తికాని పథకాలకోసం | 20.98 | 25.94 |
| b. కొత్తపథకాలకోసం | 32.28 | 32.97 |
| 2. విద్యుచ్ఛక్తి ప్రసారము, పంపిణీ | 9.50 | 8.52 |
| 3. గ్రామీణ విద్యుదీకరణ | 13.90 | 21.81 |
| 4. ప్రాజెక్ట్ల ఇన్వెష్టిగేషన్ | 0.20 | 0.40 |
| 5. నాలుగో ప్రణాళికా పథకాలకోసం ముందుగా తీసుకొన్న చర్యల నిమిత్తం | 1.95 | 3.97 |
| మొత్తం | 78.81 | 93.61 |

మూలం : ఆంధ్రప్రదేశ్ ఆర్థికాభివృద్ధి—1951-68

## పారిశ్రామికాభివృద్ధి

పారిశ్రామికాభివృద్ధి విషయంలో రాష్ట్రప్రభుత్వం నిర్వహించిన పాత్ర అంత విశిష్టమైంది కాదు. కేంద్రప్రభుత్వం జాతీయ పారిశ్రామికీకరణ విధానంలో భాగంగా వివిధ ప్రాంతాలలో పరిశ్రమలను నెలకొల్పడం జరుగుతూ వచ్చింది. అందువల్లనే మొదటి ప్రణాళికలో పరిశ్రమలకుగాను 91.02 లక్షలు మాత్రమే కేటాయించారు. రెండో ప్రణాళికలో 153.50 లక్షలు, మూడో ప్రణాళికలో 581.59 లక్షలు కేటాయించారు. దీనిని బట్టి రాష్ట్రం, పారిశ్రామికాభివృద్ధికి ఏ విధంగానూ తోడ్పడలేదని భావించకూడదు. పరిశ్రమల స్థాపనకు అనువైన పరిస్థితులు కల్పించడంలో రాష్ట్రప్రభుత్వం పాత్రను విస్మరించకూడదు. పరిశ్రమలకు అవసరమైన నీరు, విద్యుచ్ఛక్తి మిగతా అవస్థాపన సౌకర్యాలు కల్పించడంలో రాష్ట్ర ప్రభుత్వం అవసరమైన శ్రద్ధ తీసుకొంది.

రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధి విషయంలో ప్రయివేట్ పెట్టుబడి గణనీయంగానే జరిగింది. తృతీయ ప్రణాళికా కాలంలో ప్రయివేట్ పెట్టుబడి మొత్తం 55 కోట్లు ఉండవచ్చని అంచనా. మూడో ప్రణాళికాకాలంలో రాష్ట్రంలో నెలకొల్పిన పరిశ్రమలకోసం కేంద్రం 76.5 కోట్లు పెట్టుబడి పెట్టింది. రాష్ట్రంలో ఏర్పడిన పారిశ్రామిక వాతావరణం ప్రోత్సాహకరంగా ఉండటం వల్ల రాష్ట్రప్రభుత్వం పరిశ్రమల స్థాపనకు తోడ్పడే రెండు ద్రవ్యసంస్థలను -1. స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్,-2. ఇండస్ట్రియల్ డెవలప్మెంట్ కార్పొరేషన్ స్థాపించింది. మూడో ప్రణాళికా కాలంలో స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ 101 చిన్నతరహా పరిశ్రమలకు రూ. 79.00 లక్షలు, 40 మధ్యతరహాపరిశ్రమలకు రూ. 372 లక్షలు, 2 సహకార సంస్థలకు

రూ.21 లక్షలు ధనసహాయం అందించింది. ఖనిజ సంపదను ఆధారంచేసుకొని పరిశ్రమలు ఏర్పాటుచేసే అవకాశాలను పరిశీలించి సాంకేతిక సహాయం అందించగల మైనింగ్ కార్పొరేషన్ 1961 లో స్థాపించారు.

చిన్నతరహా పరిశ్రమల విషయంలో రాష్ట్రప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ చూపింది. ఈ రకమైన పరిశ్రమల అభివృద్ధికిగాను రాష్ట్ర ప్రభుత్వం రెండు మూడు ప్రణాళికలలో కేటాయించి ఖర్చుచేసిన మొత్తాల వివరాలు కిందివిధంగా ఉన్నాయి.

(రూ. లక్షలలో)

| అభివృద్ధి అంశము | రెండో ప్రణాళికలోని కేటాయింపు | రెండో ప్రణాళికా కాలంలో చేసినఖర్చు | మూడో ప్రణాళికలోని కేటాయింపు | మూడో ప్రణాళికా కాలంలో చేసినఖర్చు |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| 1. చిన్నతరహాపరిశ్రమలు | 259.9 | 242.39 | 246.87 | 214.27 |
| 2. ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లు | 152.04 | 138.34 | 220.00 | 239.62 |
| 3. చేతిపనులు | 20.55 | 20.20 | 22.00 | 16.42 |
| 4. పట్టుపరిశ్రమ | 12.65 | 13.02 | 12.00 | 9.24 |
| 5. పీచుపరిశ్రమ | 4.06 | 3.65 | 6.00 | 4.23 |
| 6. పారిశ్రామిక సహకార సంఘాలు | 7.25 | 7.02 | 10.00 | 6.19 |
| 7. తోళ్ళపరిశ్రమ | .... | .... | 50.00 | 34.07 |
| 8. ఖాదీ విలేజ్ ఇండస్ట్రీస్ | .... | .... | 6.02 | 7.71 |
| 9. చేనేత పరిశ్రమ | 431.10 | 437.03 | 331.21 | 360.81 |
| 10. ఇతరమైనవి | 7.75 | .... | .... | .... |
| మొత్తం | 895.36 | 861.15 | 904.08 | 892.56 |

మూలం : ఆంధ్రప్రదేశ్ ఆర్థికాభివృద్ధి, 1951-68

పైన పేర్కొన్న ప్రధాన రంగాలలోనే కాక ఇతర రంగాలైన విద్య, ఆరోగ్యము, గృహవసతి మొదలైనవాటిలోకూడా ప్రగతిసాధించడం జరిగింది. మొదటి మూడుప్రణాళికల కాలంలో వివిధపథకాలకోసం కేటాయించినమొత్తాల వివరాలను పట్టిక[పేజీలు506,507] లో చూడవచ్చు.

## వార్షిక ప్రణాళికలు 1966–69

రాష్ట్ర ప్రభుత్వం 1966-67 నుంచి 1970-71 కు గల 5 సంవత్సరాల కాలానికి సరిపడే నాలుగో పంచవర్ష ప్రణాళికను మొదట్లో తయారు చేసింది. ఈ ప్రణాళికా కాలానికి నిర్దేశించిన మొత్తం రూ. 700 కోట్లు. ఈ ప్రణాళికల లక్ష్యాలలో ప్రధానంగా పేర్కొన దగినది - రాష్ట్రంలో తలసరి ఆదాయాన్ని 29.4% పెంచడం. కానీ ప్రణాళికా సంఘంతో జరిపిన చర్చల అనంతరం, ప్రణాళికా మొత్తాన్ని రూ. 522 కోట్లకు తగ్గించారు. ఇందులో కేంద్రం వాటా రూ. 280 కోట్లుగాను, రాష్ట్ర ప్రభుత్వం వాటా రూ. 242 కోట్లుగాను నిర్ణయించారు. జాతీయాభివృద్ధి మండలి వివిధ రాష్ట్ర ప్రణాళికలను క్షుణ్ణంగా పరిశీలించి, ప్రణాళికల స్వభావ స్వరూపాలలో అనువైన మార్పులు చేయడానికి ప్రధాన మంత్రికి అనుమతిస్తూ ఒక నిర్ణయం చేసింది. దేశ భద్రతావసరాలదృష్ట్యా, దేశపు దీర్ఘకాలిక అవసరాలదృష్ట్యా రాష్ట్ర ప్రణాళికలో మార్పులుచేసే అధికారాన్ని ప్రధాన మంత్రికి ఇవ్వడం జరిగింది. దేశ రక్షణ అవసరాలను అంచనా వేయడం ప్రారంభమైంది. కాని ఈపని చాలాకాలం పట్టవచ్చు కాబట్టి, అంతవరకు రాష్ట్రాల ఆర్థికాభివృద్ధి కార్య కలాపాలను ఆపి ఉంచడం శ్రేయస్కరం కాదని భావించి తాత్కాలికంగా వివిధ రాష్ట్ర ప్రణాళికల కేటాయింపులను నిర్ణయించారు. ఆ సందర్భంలో 1966-67 కు గాను రాష్ట్ర వార్షిక ప్రణాళిక మొత్తం పెట్టుబడిని రూ. 79.25 కోట్లుగా మొదట్లో నిర్ణయించారు. ఇందులో కేంద్రం తన వనరుల నుంచి రూ. 50 కోట్లు సమకూరుస్తుందని, రాష్ట్రం తన స్వంత వనరుల నుంచి రూ. 29.25 కోట్లు సమీకరించ వలసి ఉంటుందని నిర్ణయించింది. ఈ మొత్తానికి అదనంగా నాగార్జున సాగర్ ప్రాజెక్ట్‌కుగాను రూ. 8.00 కోట్లు, మైనర్ ఇర్రిగేషన్‌కుగాను రూ. 1.75 కోట్లు, గొట్టపు బావులకు, పంప్ సెట్లను విద్యుదీకరించడానికిగాను 1.50 కోట్లు కేంద్రం కేటాయించింది. దీనితో 1966-67 సంవత్సరానికిగాను పెట్టదలుచుకొన్న మొత్తం పెట్టుబడి రూ. 90.50 కోట్లయింది. తరవాత ఈ అంచనాలను సవరించి ప్రణాళిక పెట్టుబడి మొత్తాన్ని రూ. 94.38 కోట్లుగా నిర్ధారించారు. వార్షిక ప్రణాళికాంతానికి కేటాయించిన మొత్తం 94.38 కోట్లలో 93.40 కోట్లు వ్యయం చేయడం జరిగింది.

1967-68 వార్షిక ప్రణాళికను కూడా అంతకు ముందు సంవత్సరపు ప్రణాళిక మాదిరిగానే తాత్కాలిక ప్రాతిపదికపై తయారుచేశారు. మొదట్లో నాలుగో పంచవర్ష ప్రణాళికా కేటాయింపులను దృష్టిలో ఉంచుకొంటే (రూ. 522 కోట్ల పెట్టుబడి 4వ పంచవర్ష ప్రణాళికా కాలంలో పెట్టాలని మొదట్లో నిర్ణయించారు) ఈ వార్షిక ప్రణాళికా కాలానికి కేటాయించ వలసిన పెట్టుబడి మొత్తం 74.87 కోట్లు కావలసింది. కాని వార్షిక ప్రణాళికలోని మొత్తం పెట్టుబడి 57.50 ఉంటుందని నిర్ణయించారు. అంటే 1966-67 వార్షిక ప్రణాళికా కాలంలో పెట్టిన పెట్టుబడి మొత్తం 94.97 కోట్లను, 1967-68 వార్షికప్రణాళికలో తగ్గించారన్న మాట. ఈ విధమైకోత, నీటి పారుదల, విద్యుచ్ఛక్తి రంగాలు తప్పమిగతా అన్నిరంగాలపైన దెబ్బతీసింది. కింద పేర్కొన్న ప్రాధాన్యాలను దృష్టిలో ఉంచుకొని వార్షిక ప్రణాళిక పెట్టుబడి తీరును పునః రూపొందించడం జరిగింది.

1. అంతకు ముందు సంవత్సరం ప్రారంభించి, ఇంకా కొనసాగుతున్న పథకాలకు ప్రాధాన్యమివ్వడం (ఇందులోకూడా,సిబ్బంది,కంటింజెన్సీ ఖర్చులను తగ్గించుకోవలె)

2. అల్పకాలంలో ఫలితాలనిచ్చే ఉత్పాదక పథకాలను చేపట్టడం.

3. ఇప్పటికే పెద్దమొత్తాలు ఖర్చుచేసి పూర్తి కావస్తున్న పథకాలను కొనసాగించడం.

4. భవనాల నిర్మాణం, అనుత్పాదక పథకాలను వీలైనంత వరకు వాయిదావేయడం.

కానీ విద్యుచ్ఛక్తిబోర్డ్ సంపాదించాలనుకొన్న ఋణాలలో లోటు ఏర్పడటంవల్ల,రాష్ట్ర ఆదాయవనరులనుంచి అనుకొన్నంత సేకరించలేక పోవడంవల్ల ఈ వార్షిక ప్రణాళిక కేటాయింపును ఇంకా తగ్గించవలసిన అవసర మేర్పడింది. ఈ విధంగా చేయడంవల్ల చివరికి ఈ వార్షిక ప్రణాళిక మొత్తాన్ని 71.45 కోట్లుగా నిర్ణయించారు. ఈ ప్రణాళికలోనే నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు గతంలోనే కేటాయించిన 8.00 కోట్ల మొత్తాన్ని 12 కోట్లకు పెంచారు. విద్యుచ్ఛక్తికి సంబంధించి 2 కోట్ల కోతను, పెద్దతరహా, మధ్యతరహా నీటి పారుదల పథకాల మొత్తాలను 1.00 కోట్లు ఇతర రంగాల పెట్టుబడిని 10% తగ్గించాల్సిన అవసర మేర్పడింది. 1966-67, 1968-69 మధ్యకాలానికి నిర్ణయించిన వార్షిక ప్రణాళికలలో వివిధ అభివృద్ధి పథకాలకు కేటాయించిన పెట్టుబడి తీరు కింది పట్టికలో చూడవచ్చు.

(రూ. లక్షలలో)

| అభివృద్ధి అంశము | 1966-67 సవరించిన కేటాయింపులు | వ్యయం | 1967-68 ఖర్చు | సవరించిన | 1968-69 పెట్టుబడి కేటాయింపు |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. వ్యవసాయోత్పత్తి | 241.71 | 236.54 | 209.99 | 181.26 | 205.00 |
| 2. శిక్షణ కేంద్రాలు | 3.57 | 0.77 | 6.89 | 3.83 | 4.00 |
| 3. భూమి అభివృద్ధి | 9 50 | 9.50 | 12.25 | 11.03 | 11.00 |
| 4. ఆయకట్ల అభివృద్ధి | 244.80 | 212.19 | 267.96 | 134.09 | 250.00 |
| 5. చిన్నతరహా నీటిపారుదల | 771.15 | 721.19 | 475.75 | 428.18 | 507.00 |
| 6. సాయిల్ కన్సర్వేషన్ | 58.56 | 57.99 | 61.25 | 55.71 | 45.00 |
| 7. గిడ్డంగులు, మార్కెటింగ్ | 1.82 | 0.66 | 3.00 | 2.70 | 3.00 |
| 8. పశుగణాభివృద్ధి | 80.33 | 78.22 | 40.50 | 36.45 | 35.00 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 9. పాడిపరిశ్రమ, పాలసరఫరా | 71.10 | 70.43 | 56.70 | 51.03 | 56.00 |
| 10. అడవులు | 35.13 | 35.25 | 32.27 | 28.45 | 36.00 |
| 11. మత్స్యపరిశ్రమ | 43.82 | 44.25 | 55.02 | 42.32 | 40.00 |
| వ్యావసాయిక పథకాలు | 1,516.48 | 1,466.99 | 1,221.58 | 975.05 | 1,192.00 |
| 1. సహకారం | 83.91 | 45.33 | 66.00 | 59.40 | 60.00 |
| 2. సమాజాభివృద్ధి | 207.32 | 207.32 | 157.47 | 141.72 | 165.00 |
| సహకారం,సమాజాభివృద్ధి | 291.23 | 252.65 | 223.47 | 201.72 | 225.00 |
| 1. బహుళార్థ సాధకప్రాజెక్ట్ | 1,650.00 | 1,650.00 | 850.00 | 1,200.00 | 850.00 |
| 2. పెద్ద, మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టులు | 575.68 | 620.48 | 715.00 | 615.00 | 687.00 |
| 3, విద్యుచ్ఛక్తి | 3,949.00 | 3,936.90 | 3,200.00 | 3,000.00 | 3,000.00 |
| నీటిపారుదల,విద్యుచ్ఛక్తి | 6,174.68 | 6,207.38 | 4,765.00 | 4,815.00 | 4,537.00 |
| 1. పెద్ద, మధ్యతరహా పరిశ్రమలు | 126.00 | 121.40 | 113.00 | 109.19 | 80.00 |
| 2. ఖనిజాభివృద్ధి | 22.00 | 21.84 | 13.91 | 13.02 | 10-50 |
| 3. గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలు | 55.21 | 42.25 | 48.75 | 42.18 | 40.00 |
| 4. చేనేత పరిశ్రమ | 83.00 | 83.00 | 47.25 | 44.25 | 54.50 |
| పరిశ్రమలు, గనులు | 286.21 | 268.49 | 222.91 | 208.61 | 185.00 |
| రోడ్లు, రవాణా | 299.00 | 324.57 | 222.25 | 192.52 | 220.00 |
| వినోద పర్యటన | 0.75 | .... | 0.75 | 0.66 | 1.00 |
| రవాణా,కమ్యూనికేషన్‌లు | 299.75 | 324.57 | 223.00 | 193.19 | 221.00 |
| 1. సాధారణ విద్య | 235.78 | 200.75 | 244.54 | 281.56 | 270.00 |
| 2. సాంకేతిక విద్య | 63.95 | 47.43 | 56.25 | 50.62 | 48.00 |
| 3. వైద్యం | | | | | |
| (a) ఆధునిక వైద్యం | 68.50 | 65.95 | 73.66 | 66.32 | 71.00 |
| (b) భారతీయవైద్యం | 0.94 | 0.94 | 2.25 | 2.02 | 2.20 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 4. ప్రజారోగ్యం | 123 68 | 126.67 | 130.35 | 117.32 | 126.30 |
| 5. పట్టణ నీటిసరఫరా, పారిశుధ్యం | 287.82 | 280.97 | 213.70 | 193.75 | 215.00 |
| 6. గ్రామీణ నీటి సరఫరా, పారిశుధ్యం | .... | .... | 24.00 | 21.60 | 35.00 |
| 7. గృహవసతి | 25.51 | 77.79 | 20.75 | 19.62 | 20.00 |
| 8. షెడ్యూల్డ్ కులాలు, వెనకబడిన కులాలు | 13.00 | 11.01 | 9.75 | 8.77 | 9.75 |
| 9. షెడ్యూల్డ్ తెగలు | 26.00 | 31.38 | 20.25 | 18.22 | 20.25 |
| 10. సాంఘిక సంక్షేమం | 5.26 | 3.61 | 7.83 | 6.27 | 6.35 |
| 11. శ్రమ, శ్రామికసంక్షేమం | 21.50 | 23.06 | 18.75 | 17.96 | 20.13 |
| 12. ప్రజాసహకారం | 0.86 | 0.88 | 0.75 | 0.64 | 0.46 |
| సాంఘిక సేవలు | 872.79 | 810.44 | 822.85 | 745.77 | 844.94 |
| 1. గణాంకాలు | 4.10 | 3.95 | 2.85 | 2.15 | 3.40 |
| 2. పబ్లిసిటీ | 1.28 | 1.17 | 1.39 | 1.25 | 1.25 |
| 3. ప్రసారం | 1.00 | 0.02 | 0.75 | 0.67 | 0.75 |
| 4. నగరాభివృద్ధి | 4.00 | 4.00 | 3.00 | 2.69 | 3.00 |
| 5. ఇతరాలు | 10.38 | 9.14 | 7.99 | 6.76 | 8.40 |
| మొత్తం | 9,496.52 | 9,339.66 | 7486.80 | 7145.50 | 7213.34 |

మూలం : ఆంధ్రప్రదేశ్ వార్షిక ప్రణాళికలు 1966-67 — 1968-69

## నాలుగో పంచవర్ష ప్రణాళిక 1969—74

1967, 1969-74 కాలానికి నాలుగో పంచవర్ష ప్రణాళికను రూపొందించాలని జాతీయాభివృద్ధి మండలి నిర్ణయించింది. దీన్ని దృష్టిలో ఉంచుకొని ఆ యా రాష్ట్రాలలో అంత వరకు జరిగిన అభివృద్ధిని సమీక్షించి నాలుగో ప్రణాళికను రూపొందించడానికి అవసరమైన చర్యలు తీసుకోవలసిందిగా 1968 ఫిబ్రవరిలో ప్రణాళికాసంఘం వివిధ రాష్ట్రాలనుకోరింది. ప్రణాళికను తయారుచేయడానికి రాష్ట్రస్థాయిలో 12 సంఘాలను ఏర్పరచినారు. వీరందరు భవిష్యదవసరాలను దృష్టిలో ఉంచుకొని రూ.628.00 కోట్ల పెట్టుబడి ఉన్న ఒక ముసాయిదా

ప్రణాళికను తయారుచేశారు. ఈ ప్రణాళికాకాలంలో అనాదిగా అనావృష్టికి గురి అవుతున్న ప్రాంతాల అభివృద్ధికిగాను, నగరాల అభివృద్ధి, గిరిజనాభివృద్ధికిగాను ప్రత్యేక పథకాలు చేపట్టా లని తీర్మానించారు. వీటికిగాను 22.00 కోట్లు కేటాయించారు. దీనితో కలుపుకొని 4వ ప్రణా ళిక పెట్టుబడి 650 కోట్లయింది.

రాష్ట్ర ప్రభుత్వం తయారుచేసిన ముసాయిదా ప్రణాళికను జాతీయ అభివృద్ధి మండలి క్షుణ్ణంగా పరిశీలించి ఆ ప్రణాళికలోని పెట్టుబడి మొత్తం 420.50 కోట్లు ఉంటుందని నిర్ధా రించారు. ఈ మొత్తంలో కేంద్ర సహాయం కింద 240 కోట్లు, రాష్ట్ర వనరులనుంచి 180.50 కోట్లు సమకూర్చడం జరుగుతుందని నిర్ణయమైంది. ఈ అంచనాలను తరవాత సవరించి ప్రణాళిక పెట్టుబడిని 445.00 కోట్లుగా తేల్చారు. ప్రణాళికకోసం కేటాయించిన పెట్టుబడి వివరాలను కింది పట్టికలో చూడవచ్చు.

(రూ. కోట్లలో)

| | నాలుగో ప్రణాళిక ముందు కేటాయించిన మొత్తం | సవరించిన కేటాయింపు | వ్యయం |
|---|---|---|---|
| 1969-70 | 78.50 | 84.43 | 81.39 |
| 1970-71 | 84.56 | 86.01 | 91.70 |
| 1971-72 | 105.08 | 103.60 | 100.59 |
| 1972-73 | 96.34 | 80.79 | 81.60 |
| 1973-74 | 87.59 | 89.36 | 93.59 |
| మొత్తం | 452.07 | 444.19 | 448.57 |

మూలం : రాష్ట్ర నాలుగో ప్రణాళిక—1969-70-1973-74

నాలుగో ప్రణాళికాకాలంలో కేంద్రం నుంచి కూడా 230.31 కోట్ల రూపాయలు, అప్పు రూపంగాను, గ్రాంట్ల రూపంగాను అందింది. దీనికి సంబంధించిన వివరాలు కింది పట్టికలో చూడవచ్చు.

ప్రత్యేక తెలంగాణా అభివద్ధి పథకాలకింద నాలుగో ప్రణాళికాకాలంలో లభించిన కేంద్రసహాయం

| సంవత్సరము | రాష్ట్రప్రణాళిక అప్పు | గ్రాంటు | మొత్తం |
|---|---|---|---|
| 1969-70 | 28.82 | 12.53 | 41.35 |
| 1970-71 | 30.27 | 13.07 | 43.34 |
| 1971-72 | 33.05 | 14.34 | 46.39 |
| 1972-83 | 35.04 | 14.44 | 49.48 |
| 1973-74 | 34.13 | 14.62 | 48.75 |
| | 161.31 | 69.00 | 230.31 |

మూలం : రాష్ట్ర నాలుగో ప్రణాళిక—1969-70 -1973-74

నాలుగో ప్రణాళికలో వివిధ అభివృద్ధి పథకాలకు కేటాయించిన మొత్తాం వివరాలు కింది విధంగా ఉన్నాయి.

పక్కపేజీలోని పట్టికను పరిశీలిస్తే వివిధ రంగాలకు కేటాయించిన మొత్తంలో రవాణా, కమ్యూనికేషన్ రంగంలో అధికశాతం (195.8%) ఖర్చు చేయగలిగినట్లు స్పష్ట మవుతుంది. దీని తరవాత పేర్కొనదగింది పరిశ్రమలు, గనులరంగం. ఈ రంగంలో కేటా యించిన మొత్తంలో 101.2% వ్యయం చేయడం జరిగింది. నీటి పారుదల రంగంలో వ్యయం 99.9% గాను, వ్యవసాయము, దాని అనుబంధ పథకాలకు అయిన మొత్తం శాతం 93.1% గాను ఉన్నట్లు తెలుస్తుంది.

వ్యవసాయరంగానికి సంబంధించి భౌతిక ఉత్పత్తి కొంత తక్కువగా జరిగినట్లు తెలు స్తుంది. వ్యవసాయరంగంలో నాలుగో ప్రణాళికాకాలంలో అదనంగా 77.44 లక్షల టన్నుల ఆహారధాన్యాలను ఉత్పత్తి లక్ష్యంగా పెట్టుకొంటే 61.63 లక్షల టన్నుల ఉత్పత్తి మాత్రమే సాధించగలిగాము. దీనికి కారణం ప్రకృతి అనుకూలంగా లేకపోవడమే అని చెప్పవచ్చు. కానీ ఇతర పంటల విషయంలో లక్ష్యాలకు మించే సాధించడం గమనించవచ్చు. ఉదాహరణకు నూనెగింజల విషయంలో 3.54 లక్షల టన్నుల ఉత్పత్తి లక్ష్యంగా ఉంచుకోగా సాధించిన ఉత్పత్తి 3.87 లక్షల టన్నులు. అట్లాగే చెరుకు ఉత్పత్తి లక్ష్యం 20.00 లక్షల టన్నులుం డగా వాస్తవానికి సాధించిన ఉత్పత్తి 28.15 లక్షల టన్నులు. 94,000 బేళ్ళ పత్తి ఉత్పత్తి లక్ష్యంగా పెట్టుకొని 3,39,000 బేళ్లపత్తి పండించ గలిగాము.

పంటల దిగుబడి పెరిగి లక్ష్యాలను అధిగమించడంలో తోడ్పడిన ముఖ్యమైన చర్యలలో హెచ్చుగాలుబడినిచ్చే వంగడాలను, రసాయనిక ఎరువులను వాడటం మొదలైన వాటిని పేర్కొనవచ్చు.

మంచి విత్తనాలు, రసాయనిక ఎరువుల వాడకంవల్లనేకాక పంటభూములకు నీటి సదు పాయాలు కల్పించడంకూడా జరగడంతో పంట దిగుబడి పెరగడం, అధికోత్పత్తి సాధిం చడం సాధ్యమైనాయి. ఉదాహరణకు చిన్న తరహా నీటిపారుదల పథకాలవల్ల అదివరకు సాగులోకి తెచ్చిన 2 22 లక్షల ఎకరాల భూములను స్థిరపరచడం, అదనంగా 1.52 లక్షల ఎకరాల పొలాన్ని సాగులోకి తేవడం జరిగింది. పంచాయతీ రాజ్యశాఖ ఆధ్వర్యంలో కూడా 22.27 లక్షల ఎకరాలకు నీటి వసతులను స్థిరపరచడం జరిగింది. భూగర్భజల సంపదశాఖ వారు 4,525 గొట్టపు బావులకు, 65,215 తవ్వకంబావులకు, 21,486 పాత బావుల పున రుద్ధరణకు, 86,779 పంపుసెట్లకు సంబంధించిన సాంకేతికసలహాలను, అనుమతిని ఇవ్వడం జరిగింది. సహకార పరపతి పథకం కింద 45,298 మామూలు బావుల తవ్వకానికి, 21,057 ఆయిల్ ఇంజన్‌లు కొనడానికి, 23,154 కరెంట్ మోటారులను అమర్చుకోవడానికి, ఋణ సహాయం అందివ్వడం జరిగింది.

నాలుగో ప్రణాళికా కాలంలో నాగార్జున సాగర్ ప్రాజెక్ట్ కింద అదనంగా 2.76 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలు లభించే అవకాశం కల్పించారు. దీనిలో 1.28 లక్షల ఎకరాలు కుడికాలువ కింద, 1.48 లక్షల ఎకరాలు ఎడమకాలువ కింద సాగుఅయ్యే

| ప్రధాన అభివృద్ధి అంశం | సవరించిన కేటాయింపులు 1969-70 | 70-71 | 71-72 | 72-73 | 73-74 | సవరించిన మొత్తం కేటాయింపు 1969-74 | వ్యయం 1969-70 | 70-71 | 71-72 | 72-73 | 73-74 | మొత్తం వ్యయం 1969-74 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 1. వ్యవసాయం, దానికి అనుబంధ పథకాలు | 10.03 | 10.87 | 11.63 | 8.16 | 8.38 | 49.07 | 9.20 | 10.82 | 11.28 | 6.68 | 7.72 | 45.70(93.1) |
| 2. సహకారం,సమాజాభివృద్ధి | 2.26 | 3.06 | 4.51 | 3.06 | 3.11 | 16.00 | 2.09 | 3.01 | 4.53 | 2.43 | 2.38 | 14.44(90.3) |
| 3. నీటిపారుదల | 22.32 | 21.34 | 23.72 | 15.75 | 15.44 | 98.57 | 21.77 | 21.32 | 23.65 | 16.38 | 15.43 | 98.55(99.9) |
| (a) నాగార్జునసాగర్ ప్రాజెక్ట్ | 11.40 | 10.20 | 10.62 | 6.69 | 5.30 | 44.21 | 11.40 | 10.20 | 10.62 | 6.69 | 5.30 | 44.21(100) |
| (b) పోచంపాడు ప్రాజెక్ట్ | 7.00 | 6.00 | 6.00 | 6.00 | 5.57 | 30.57 | 6.70 | 6.09 | 6.06 | 6.00 | 5.57 | 30.42(99.5) |
| (c) ఇతర పెద్ద,మధ్యతరహా నీటిపారుదల ప్రాజెక్టులు | 3.92 | 5.14 | 7.10 | 3.06 | 4.57 | 23.79 | 3.67 | 5.03 | 6.97 | 3.69 | 4.50 | 23.92(100.5) |
| 4. విద్యుచ్ఛక్తి | 38.81 | 35.10 | 42.11 | 33.91 | 42.23 | 192.16 | 37.14 | 37.87 | 37.98 | 33.01 | 44.57 | 190.57(99.2) |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 5. పరిశ్రమలు, గనులు | 3.09 | 3.24 | 3.37 | 2.63 | 2.23 | 14 56 | 3.44 | 2.93 | 3.38 | 3.33 | 1.66 | 14.74(101.2) |
| 6. రవాణా, కమ్యూనికేషన్‌లు | 2.06 | 2.35 | 3.79 | 3.56 | 3.01 | 14 77 | 2.56 | 5.82 | 5.79 | 7.16 | 7.5 | 28.92(195.8) |
| 7. సాంఘిక సేవలు | 5.83 | 10.01 | 14.26 | 13.60 | 14.86 | 58.56 | 5.09 | 9.91 | 13 91 | 12.58 | 14.24 | 55.73(95.2) |
| 8. ఇతరాలు | 0.03 | 0.04 | 0.21 | 0.12 | 0.10 | 0.50 | 0.01 | 0.02 | 0.07 | 0.03 | 0.09 | 0.22(44) |
| ఆంధ్రప్రదేశ్ కంతటికి మొత్తం | 84.43 | 86.01 | 103.60 | 80.97 | 89.36 | 444.19 | 81.39 | 91.70 | 100.59 | 81.61 | 93.59 | 448.89(101 1 |
| కోస్తాఆంధ్రాకు మొత్తం | 34 86 | 35.18 | 42.26 | 34.19 | 37.69 | 184.18 | 32.77 | 37.54 | 42.79 | 31.66 | 39.55 | 184.31(101.1) |
| రాయలసీమకు మొత్తం | 13.75 | 16.47 | 21.93 | 16.38 | 18.44 | 86.97 | 12.98 | 17.68 | 20.71 | 16.82 | 19.01 | 87.20(100.3) |
| తెలంగాణాకు మొత్తం | 35.82 | 34.36 | 39.41 | 30.22 | 33.23 | 173.04 | 35.64 | 36.48 | 37.09 | 33.12 | 35 03 | 177.36(102.5) |

మూలం : నాలుగో ప్రణాళిక

గమనిక : చివర కాలంలో(    ) లోని అంకెలు మొత్తం కేటాయింపులో ఖర్చయిన మొత్తం శాతం తెలుపుతాయి.

అవకాశం ఏర్పరచడం జరుగుతుంది. నాలుగో ప్రణాళికాంతానికి నీటి పారుదల అవకాశం లభించే భూవిస్తీర్ణం 10.26 లక్షల ఎకరాలుంటుందని అంచనా. అట్లాగే పోచంపాడుప్రాజెక్ట్ వల్ల అదనంగా 0.44 లక్షల ఎకరాలకునీటి సౌకర్యం ఏర్పడే అవకాశాలు కల్పించారు. ఇతర మధ్యతరహా, చిన్నతరహా పథకాలవల్ల 1.28 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలు ఏర్పరచడానికి అవకాశాలు ఏర్పరచారు. దీనితో ఈ ప్రాజెక్టులకింద నీటిసౌకర్యం లభించే భూ విస్తీర్ణం 11.33 లక్షల ఎకరాలవుతుందని అంచనా. భారీ, మధ్యతరహా నీటి సౌకర్యాల ప్రాజెక్టుల వల్ల 22.03 లక్షల ఎకరాలుంటుందని భావించారు. కాని 17.36 లక్షల ఎకరాలకు మాత్రమే ఈ అవకాశం కల్పించగలిగారు.

నీటి వనరులను అభివృద్ధి పరచుకోవడంతో పాటు విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని పెంచ దానికి అనేక పథకాలు రూపొందించారు. నాలుగో ప్రణాళికా కాలంలో 53 మెగావాట్ల స్థాపిత ఉత్పత్తి శక్తిని అదనంగా చేర్చారు. దీనితో మన రాష్ట్రంలో విద్యుదుత్పాదక స్థాపిత శక్తి 668 మెగవాట్ల స్థాయికి పెరిగింది. నాలుగో ప్రణాళికా కాలంలో విద్యుచ్ఛక్తి వినియోగ దారుల సంఖ్య పెరిగింది. ముఖ్యంగా వ్యవసాయదారులలో విద్యుచ్ఛక్తి వాడకందారులకు ఇచ్చిన కనెక్షన్ల సంఖ్య 1,38,822 నుంచి 2,61,989 కి పెరిగింది. గ్రామీణ విద్యుదీ కరణకు పథకాలను అమలు పరచడంవల్ల మొదట్లో ఉన్న 4,697 కనెక్షన్లు నాలుగోప్రణాళి కాంతానికి 10,485 కు పెరిగింది. దీనితో రాష్ట్రంలో ఉన్న తలసరి విద్యుచ్ఛక్తి వినియోగం 16 కిలో వాట్ల నుంచి 100 కిలోవాట్లకు పెరిగింది.

మన రాష్ట్రం ప్రధానంగా వ్యావసాయిక రాష్ట్రం. అయినా పారిశ్రామికాభివృద్ధిపట్ల శ్రద్ధ తీసుకోవడంలో మన రాష్ట్ర ప్రభుత్వలోపం ఏమీ జరగలేదనే చెప్పాలి. నాలుగో ప్రణాళికా కాలంలో పెద్దతరహా, చిన్నతరహా పరిశ్రమల స్థాపనకుగాను 906.66 లక్షల రూపాయలు, చిన్నతరహా (చేనేత, వస్త్రం ఉత్పత్తితోకలిసి) పరిశ్రమలకుగాను 517.19 లక్షలు, ఖనిజ సంపదను అభివృద్ధి చేయడానికి 48.87 లక్షలరూపాయలను వెచ్చించడం గమనార్హం.

రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి, అవస్థాపన సౌకర్యాలవంటి రోడ్లు, రహదారులు మొద లైన వాటిని కూడా తగిన విధంగా అభివృద్ధిచేయడానికి కృషి జరిగింది.

వివిధ తరహాల నీటిపారుదల పథకాలను చేపట్టడమేకాక మెట్ట సాగుఉన్న ప్రాంతాల కోసం ప్రత్యేక పథకాలను రూపొందించడం జరిగింది. ఈ కార్యక్రమంలో భాగంగా రామ చంద్రాపురంలో అంతర్జాతీయ మెట్టసాగుకు సంబంధించిన ఒక సంస్థను నెలకొల్పారు. నాలుగో ప్రణాళికలో ఈసంస్థ స్థాపనకవసరమైన స్థలంకోసం 12.50 లక్షలు వ్యయంచేశారు. ఈ పథకం కింద, ఫారమ్ ఫారెస్ట్రీ, చీడలు, తెగుళ్ళ నియంత్రణోద్యమం, సబ్సిడీ ఇస్తూ క్రిమి సంహారక మందులకు సప్లయ్ చేయడం హాండ్ స్ప్రేయర్లు, కొబ్బరి మొక్కలు అందచేయడం, మామిడి, నిమ్మ తోటలలో మందుజల్లడం, మొదలైన ఎన్నో కార్యక్రమాలను ప్రారంభించారు. ఈ పథకం కింద నిర్వహించిన వివిధ పనులకు గాను రాష్ట్రప్రభుత్వం ఈ ప్రణాళికా కాలంలో 32.04 లక్షలు ఖర్చు చేసింది.

వ్యవసాయంలో యంత్రాల వాడకాన్ని ప్రవేశపెట్టడానికిగాను నాలుగో ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలో సంవత్సరానికి 25.00 లక్షల చొప్పున వ్యయం చెయ్యడానికి అవసరమైన మొత్తాలను ఆగ్రో ఇండస్ట్రీస్ కార్పొరేషన్‌కు ఇచ్చింది. 1969-70 లో ఈ కార్పొరేషన్ పోచంపాడు ప్రాజెక్ట్ ప్రాంతంలో భూమి పునరుద్ధరణకు గాను ట్రాక్టర్‌లను కొన్నది. 1968లో స్థాపితమైన కార్పొరేషన్ 1973 నాటికి 2,757 ట్రాక్టర్‌లు అమ్మింది. 6,053 గొట్టపు బావులు తవ్వింది.

భూమి అభివృద్ధి పునరుద్ధరణ పథకాలలో భాగంగా 34 బ్లాకులలోని 21,652 ఎకరాల భూమిని సేద్యయోగంచేసి భూమిలేని పేదవారికి ఇచ్చింది. దీనివల్ల భూమిలేని 5,074 వ్యవసాయ కుటుంబాలు లాభం పొందాయి.

రాష్ట్రంలో లభించే నీటి వనరులను వ్యవసాయానికి ఉపయోగపడేటట్లు చేయడానికి పథకాలు అమలు చేసినట్టే భూగర్భ జలసంపదను వినియోగంలోకి తేవడానికి కూడా కృషి ప్రారంభించడం ఈ ప్రణాళికా కాలంలో జరిగింది. ఈ పనికిగాను రాష్ట్రప్రభుత్వం నాలుగో ప్రణాళికాకాలంలో 61.84 లక్షలు కేటాయించింది. రాష్ట్రంలో వెనకబడిన ప్రాంతమైన తెలంగాణా ప్రాంతానికి భూగర్భ జలసంపద సద్వినియోగానికి సంబంధించిన దీర్ఘదర్శి పథకానికిగాను 1.96 లక్షలు ఖర్చుచేశారు.

రాష్ట్ర ప్రజల ఆర్థిక పరిస్థితులను మెరుగుపరిచే ఉద్దేశంతో ఎన్నో పథకాలు అమలు పరిచింది. వీటిలో ముఖ్యంగా ధరల పెరుగుదల ప్రభావం నుంచి సామాన్య వినియోగదారులకు రక్షణ కల్పించే ఉద్దేశంతో రాష్ట్రప్రభుత్వం గ్రామ ప్రాంతాలలోను, నగరాలలోను ధరల స్థిరీకరణ పథకాలను చేపట్టింది. ఈ పథకం విషయంలో సాధించిన ఫలితాలు కింది విధంగా ఉన్నాయి. నాలుగో ప్రణాళికాంతానికి మన రాష్ట్రంలో 18 హోల్‌సేల్ కో ఆపరేటివ్ సెంట్రల్ సొసైటీలు, 13 సూపర్ బజారులు, 811 ప్రాథమిక వినియోగదార్ల స్టోర్‌లు, 3 యూనివర్సిటీ కన్స్యూమర్ స్టోరులు పనిచేయగం ప్రారంభించాయి.

గ్రామీణ ఉద్యోగితా అవకాశాలు పెంచడానికి నాలుగో ప్రణాళికలో 1971-72 లో క్రాష్‌ప్రోగ్రామ్ ప్రారంభించారు. ఈ పథకం ప్రధానోద్దేశాలు 1. ప్రతిజిల్లా స్థాయిలోను శ్రమ సాంద్రమైన ఉత్పత్తి పథకాలను అమలుచేయడంద్వారా ఉపాధి అవకాశాలు కల్పించడం, 2. సమగ్ర అభివృద్ధికి దోహదంచేసే మన్నికగల వస్తువులను, ఆస్తి పాస్తులను అభివృద్ధి పరచడం. ఈ క్రాష్‌ప్రోగ్రాం 1972-73 నుంచి 1973-74 లో అమలులోకి వచ్చింది. ఈ పథకం కింద చేపట్టిన పనులలో ముఖ్యమైనవి, చిన్నతరహా నీటి పారుదల పథకాలు, సాయిల్ కన్సర్వేషన్, అడవుల పెంపకం, భూమి పునరుద్ధరణ, రోడ్ల నిర్మాణం. నాలుగో ప్రణాళికలో ఈ పథకానికిగాను 559.00 ఖర్చుపెట్టనం జరిగింది.

సమాజంలో వెనకబడిన వర్గాలైన షెడ్యూల్డ్ కులాలూ, వెనకబడిన వర్గాలవారి ప్రయోజనంకోసం అనేక సంక్షేమ పథకాలను ప్రారంభించారు. ఈ పథకం ప్రధానలక్ష్యం ఆ వర్గాల ప్రజల సాంఘిక ఆర్థిక స్థితిని మెరుగుపరచడం. నాలుగో ప్రణాళికలో ఈ పథకాలకుగాను 257.04 లక్షలు కేటాయించారు. కేటాయించిన మొత్తాన్ని మించి ఖర్చుచేయడం జరిగింది.

(రూ. 270.46 లక్షలు). షెడ్యూల్డ్ కులాలవారి ప్రయోజనంకోసం, విద్యారంగంలో స్కాలర్ షిప్‌లు, బట్టలుకొనడంకోసం ధనసహాయం, పుస్తకాలు సప్లయ్ చేయడం, హాస్టల్ భవనాల నిర్మాణం, పౌష్టికాహారం ఇవ్వడం మొదలైన ఎన్నో పథకాలు అమలు చేశారు.

ఆర్థికంగా వెనకబడిన వర్గాలవారిని ఉద్ధరించడానికి కింది పథకాలు చేపట్టారు. 1. పాడి పశువులు ఇవ్వడం, 2. వ్యవసాయం చేసుకొనే వారికి ధనసహాయం, 3. వడ్డీలేని ఋణాలు ఇవ్వడం, 4. ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డ్‌కాస్ట్స్ ఫైనాన్స్ కార్పొరేషన్‌ను స్థాపించడం. ఈ పథకాలకుగాను 26.00 లక్షల రూపాయలు వ్యయంచేశారు.

సంతులిత ప్రాంతీయాభివృద్ధి సాధించే ఉద్దేశంతో కొన్ని ప్రత్యేక పథకాలను రూపొందించింది. ఈ ఉద్దేశంతోనే రాష్ట్రంలోని తెలంగాణా, కోస్తా, ఆంధ్రప్రాంతం, రాయలసీమ ప్రాంతాల సమగ్రాభివృద్ధికోసం మూడు ప్రాంతాలకు మూడు ప్రత్యేక అభివృద్ధి సంస్థలను నెలకొల్పి ఇతోధిక ధనసహాయం అందించడం జరిగింది. ఈ సందర్భంలో రాయలసీమ అభివృద్ధి సంస్థకు 99.44 లక్షల మేరకు నిధులు కేటాయించింది. అట్లాగే కోస్తా అభివృద్ధిసంస్థకు 15.00 లక్షలు కేటాయించారు.

షెడ్యూల్డ్ తెగలవారి అభివృద్ధికి కూడా ప్రత్యేక ప్రణాళికను రూపొందించి అమలు పరచడం జరిగింది. నాలుగో ప్రణాళికాకాలంలో గిరిజన ప్రజల సర్వతోముఖాభివృద్ధిని సాధించడానికి కృషిచేశారు. వారి జీవన ప్రమాణం పెంచడానికి, అక్షరాస్యతను అభివృద్ధిచేయడానికి వారి ఆరోగ్య మెరుగుపరచడానికి తాగడానికి తగిన నీటి వసతి కల్పించడానికి, పౌష్టికాహారం అందించడానికి ప్రత్యేకంగా కృషి జరిగింది. ఈ విధమైన పథకాలకోసం ప్రత్యేకంగా నిధులను సమకూర్చారు.

తెలంగాణా ప్రాంతానికిగాను అభివృద్ధి పథకాన్ని చేపట్టారు (1969-74). ఈ ప్రాంతం అభివృద్ధికిగాను 43.72 కోట్ల రూపాయలు కేటాయించారు. కేటాయించిన 43.72 కోట్లలో 41.10 కోట్లు ఖర్చుచేయడం జరిగింది.

నాలుగో ప్రణాళికారంభం నాటికి తెలంగాణాలోని గ్రామాలు, నగరాలకు 17.3% మాత్రమే విద్యుచ్ఛక్తి అందుబాటులో ఉండేది. రాష్ట్రమంతటిలో సగటున 21.1% ప్రాంతానికి విద్యుచ్ఛక్తి సదుపాయముండేది. ఈ విషయంలో తెలంగాణా ప్రాంతాన్ని అభివృద్ధి చేయడానికి రూ. 12.36 కోట్లు కేటాయించారు. నాలుగో ప్రణాళిక మొదటి మూడుసంవత్సరాలలో 1,393 పల్లెలకు విద్యుచ్ఛక్తి సప్లయ్ చేయడానికి ఎంపిక చేసుకొన్నారు. అనుకొన్నట్లుగా ఆ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయ్ చేయగలిగారు.

నీటి పారుదల ప్రాజెక్ట్‌లను కూడా ప్రారంభించారు. ప్రపంచ బాంకుతో కుదిరిన ఒప్పందం ప్రకారం పోచంపాడు ప్రాజెక్టుకుగాను 45.00 కోట్లు ఖర్చుపెట్టడానికి నిర్ణయించారు. అనుకొన్న ప్రకారం కేటాయించిన మొత్తాన్ని ఖర్చుచేయడం జరిగింది. చిన్న తరహా నీటి పారుదల పథకాలకోసం నాలుగో ప్రణాళికాకాలంలో 432.57 లక్షలు వ్యయం చెయ్యాలని నిర్ణయించారు. ఈ పథకాలవల్ల 7,238 ఎకరాల భూమికి నీటి పారుదల సౌకర్యాలు కల్పించడానికి అవకాశమేర్పడింది. నిజాంసాగర్ ప్రాజెక్టుకింద ఉన్న భూములకు నీటి పంపిణీ పథకానికి 25.00 ఖర్చుచేయడం జరిగింది. ఈ ప్రాజెక్టు కిందఉన్న 400 ఎకరాలకు నీటి పంపిణీ పథకానికి 23.23 లక్షలు ఖర్చుచేశారు.

తెలంగాణా అభివృద్ధికోసం చేపట్టిన ప్రత్యేక పథకాల వివరాలు, వాటికోసం ఖర్చు చేసిన మొత్తాల వివరాలను కింది పట్టికలలో చూడవచ్చు.

34)

(రూ. లక్షలలో)

| సంవత్సరం | నాలుగో ప్రణాళిక | | కోస్తా ప్రాంతానికి ప్రత్యేక అభివృద్ధి ప్రణాళిక | | రాయలసీమ ప్రాంతానికి ప్రత్యేక అభివృద్ధి ప్రణాళిక | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|---|
| | కేటాయింపు | వ్యయం | కేటాయింపు | వ్యయం | కేటాయింపు | వ్యయం | కేటాయింపు | వ్యయం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 1969-70 | 19.00 | 17.42 | .... | ... | .... | .... | 19.00 | 17.42 |
| 1970-71 | 35.05 | 58.56 | 83.95 | 113.78 | 5.65 | 5.65 | 124.65 | 177.99 |
| 1971-72 | 56.25 | 56.51 | 65.75 | 65.73 | 4.00 | 4.00 | 126.00 | 126.24 |
| 1972-73 | 57.00 | 53.73 | 65.00 | 50.66 | 4.25 | 3.50 | 126.25 | 107.89 |
| 1973-74 | 50.79 | 35.18 | 49.21 | 46.39 | 7.00 | 7.00 | 107.00 | 88.57 |
| | 218.09 | 221.40 | 263.91 | 276.56 | 20.90 | 20.15 | 502.90 | 518.11 |

మూలం : రాష్ట్ర నాలుగో ప్రణాళిక 1968-69 — 1973-74

తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి పథకం 1969-74 (రూ. లక్షలలో)

| పథకాలు | 1969-70 | 1970-71 | 1971-72 | 1972-73 | 1973-74 | నాలుగో సం॥నికి మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| I గ్రామీణ విద్యుదీకరణ | 436.00 | 300.00 | 300.00 | 300.00 | .... | 1,336.00 |
| II నీటి పారుదల | | | | | | |
| (i) పోచంపాడు ప్రాజెక్ట్ | .... | 100.00 | 200.00 | 200.00 | 100.00 | 600.00 |
| (ii) చిన్నతరహా నీటిపారుదల (PWD) | 23.32 | 71.28 | 145.84 | 71.68 | 73.52 | 385.74 |
| (iii) చిన్నతరహా నీటిపారుదల (PR) | 23.20 | 15.00 | 8.63 | .... | .... | 46.83 |
| (iv) నిజాంసాగర్ ప్రాజెక్ట్ | .... | 10.24 | 12.99 | .... | .. . | 23.23 |
| III కమ్యూనికేషన్‌లు | | | | | | |
| (i) రోడ్లు (PR) | 132.46 | 130.00 | 110.00 | 39.46 | 47 57 | 459.49 |
| (ii) రోడ్లు (PWD) | 48.81 | 22.48 | 11.42 | .... | .... | 75.71 |
| (·ii) మునిసిపల్ రోడ్లు | 1.00 | .... | .... | .... | .... | 1.00 |
| IV నీటిసరఫరా | | | | | | |
| (i) రక్షితనీటి సరఫరా [54 పట్టణకమిటీలు] | 51.40 | 77.40 | 81.66 | 62.00 | 60.29 | 332.75 |
| (ii) నీటిసరఫరా [మునిసిపాలిటీలు] | 16.30 | 9.96 | 10.40 | 7.50 | 0.76 | 44.92 |
| (iii) గ్రామీణ నీటిసరఫరా | .... | .... | .... | .... | 3.05 | 3.05 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| V ఆర్థిక సహాయ పథకాలు | | | | | | |
| (i) సాంఘిక సంక్షేమం | 24.67 | 22.50 | 30.52 | 20.00 | 20.00 | 117.69 |
| (ii) గిరిజన సంక్షేమం | 2.78 | 49.17 | 39.90 | 4.09 | 39.88 | 135.82 |
| (iii) స్త్రీ సంక్షేమం | .... | 2.31 | .... | .... | .... | 2.31 |
| VI పశుగణాభివృద్ధి, పాడి పరిశ్రమ | | | | | | |
| (i) పశుగణాభివృద్ధి | .... | .... | 3.39 | 11.42 | 11.90 | 27.71 |
| (ii) పాలసరఫరా పథకాలు | 6.46 | 25.02 | 38.75 | 35.52 | 23.47 | 129.22 |
| VII విద్య | | | | | | |
| (i) జిల్లాపరిషత్ భవనాలు | 103.10 | 2.69 | 4.58 | .... | .... | 110.37 |
| (ii) మునిసిపల్ స్కూల్ భవనాలు | 1.76 | 1.65 | .... | .... | ... | 3.41 |
| (iii) ప్రయివేట్ కాలేజి భవనాలు | 22.00 | .... | .... | .... | .... | 22.00 |
| (iv) గవర్నమెంట్ కాలేజి భవనాలు | .... | .... | .... | .... | 0.60 | 0.60 |
| (v) పోస్ట్‌గ్రాడ్యుయేట్ టీచర్ల ట్రెయినింగ్ | .... | 4.00 | .... | 3.00 | .... | 7.00 |
| (vi) పోస్ట్‌గ్రాడ్యుయేట్ సెంటర్, వరంగల్లు | .... | 5.00 | .... | .... | .... | 5.00 |
| (vii) ఎక్విప్‌మెంట్ కొనుగోలు (a) నిజాం కాలేజి | .... | ... | 7.50 | .... | .... | 7.50 |
| (b) ప్రయివేట్ కాలేజీలు | .... | .... | 2.00 | .... | 2.60 | 4.60 |

| వివరాలు | సన్నకారు రైతుల అభివృద్ధి ఏజెన్సీ | | మార్జినల్ ఫార్మర్స్, వ్యవసాయ కూలీల అభివృద్ధి ఏజెన్సీ | | | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| | నల్గొండ | కడప | శ్రీకాకుళం | నల్గొండ | విశాఖపట్నం | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 1. రిజిష్టర్ అయిన తేదీ | 20.11.1970 | 11.2.1971 | 30.12.1970 | 20.11.1970 | 1.2.1971 | |
| 2. పరిధి | రామన్నపేట,నల్గొండ సూర్యాపేట | పూర్తిజిల్లా | పూర్తిజిల్లా | భువనగిరి,రామన్న పేట, నల్గొండ | విశాఖ,అనకాపల్లి, భీమునిపట్నం | |
| 3. మొత్తం పరపతిపథకం(లక్షలలో) | 662.50 | 410.00 | 683.00 | 186.00 | 350.00 | 2,291.50 |
| 4. ఏజెన్సీపెట్టుబడిమొత్తం(లక్షలలో) | 150.00 | 150.00 | 150.00 | 100.00 | 100.00 | 650.00 |
| 5. లాభం పొందేవారు (అంచనా) | 50,000 | 50,000 | 50,000 | 20,000 | 21,500 | 1,91,500 |
| 6. లాభం పొందినవారు | 31,376 | 75,023 | 39,005 | 33,660 | 26,664 | 2,05,728 |
| 7. కో-ఆపరేటివ్‌సొసైటీసభ్యులుగాచేరినవారు | 15,650 | 14,940 | 16,005 | 15,120 | 3,654 | 65,369 |
| 8. లోన్ అప్లికేషన్‌లను పరిశీలించి సంస్థలకు పంపినవి | 18,802 | 16,262 | 23,507 | 15,835 | 10,845 | 85,251 |
| 9. ఋణాల పంపకం (లక్షలలో) | | | | | | |
| 1) స్వల్పకాలిక ఋణాలు | 72.45 | 123.33 | 54.39 | 24.36 | 31.88 | 303.41 |
| 2) మధ్యకాలిక ఋణాలు | 11.81 | 16.02 | 10.56 | 10.01 | 49.44 | 97.84 |
| 3) దీర్ఘకాలిక ఋణాలు | 25.75 | 58.82 | 9.49 | 10.03 | 2.55 | 106.64 |
| మొత్తం | 110.01 | 195.17 | 77.44 | 44.40 | 83.87 | 507.29 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| VIII వైద్యశాఖ | | | | | | |
| (i) భవనాలు | 1.39 | 8.25 | 1.35 | 12.03 | 9.07 | 32.09 |
| (ii) హోమియోపతి ఆస్పత్రి | .... | 0.67 | .... | .... | .... | 0.67 |
| (iii) గాంధీ మెడికల్ కాలేజి పరికరాల కోసం | .... | 1.53 | .... | .... | .... | 1.53 |
| (iv) రెండు మెడికల్ కాలేజి సీట్లకోసం | .... | .... | .... | .... | 5.18 | 5.18 |
| IX పరిశ్రమలు | .... | 32.00 | 9.60 | .... | 11.48 | 53.08 |
| X సహకారం | .... | 15.00 | 65.00 | 5.00 | .... | 85.00 |
| XI వ్యవసాయం, అనుబంధ పథకాలు | | | | | | |
| (i) సాయిల్ కన్సర్వేషన్ | .... | 18.69 | 6.67 | 11.07 | 10.58 | 47.01 |
| (ii) చేపల పరిశ్రమ | .... | .... | 1.00 | 2.95 | .... | 3.95 |
| (iii) పచ్చికబయళ్ళ పెంపకం | .... | ... | .... | .... | 0.96 | 0.96 |
| మొత్తం | 887.65 | 924.84 | 1,091.20 | 785.82 | 420.91 | 4,110.42 |

మూలం : రాష్ట్ర నాలుగో ప్రణాళిక — 1968-69 — 1973-74

నాలుగో ప్రణాళికా కాలంలో రాష్ట్ర ప్రభుత్వం తయారుచేసి అమలు పరిచిన వివిధ అభివృద్ధి పథకాలకు తోడు కొన్ని కేంద్ర ప్రభుత్వం అమలు చేసిన పథకాలు కూడా ఉన్నాయి. వీటిలో ముఖ్యంగా పేర్కొనదగ్గవి సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ (SFDA), మార్జినల్ రైతుల సహకార పథకం (MFALDAS) నాలుగో ప్రణాళికా కాలంలో పై పథకాలకుగాను ఖర్చుపెట్టిన మొత్తాల వివరాలను కింది పట్టికలో చూడవచ్చు.

| | | | |
|---|---|---|---|
| 12. వ్యవస్థ | 3.50 | 3.50 | .... |
| 13. శిక్షణ | 3 12 | 1.62 | .... |
| మొత్తం | 249.43 | 270.02 | .... |

మూలం : రాష్ట్ర నాలుగో ప్రణాళిక -1968-69-1973-74

తరుచు అనావృష్టికి గురిఅయ్యే ప్రాంతాలకు సహాయ పడేటటువంటి కార్యక్రమాలను కూడా నాలుగో ప్రణాళికాకాలంలో మొదలు పెట్టారు. ఈ పథకంలోని భాగమైన రూరల్ వర్క్స్ ప్రోగ్రాం 1970-71 లో ప్రారంభమైంది. అనావృష్టికి గురిఅయ్యే ప్రాంతాలలో కొరత పరిస్థితులను తొలగించడానికి, ప్రజల కష్టాలను తగ్గించడానికి శ్రమ సాంద్రమైన అనేక ఉత్పాదక కార్యక్రమాలను చేపట్టడం జరిగింది. ఈ ప్రాంతాలలో ప్రారంభించే పను లలో ముఖ్యమైనవి చిన్నతరహా నీటి పారుదల ప్రాజెక్టులు, సాయిల్ కన్సర్వేషన్, అడవుల పెంపకం, రోడ్ల నిర్మాణం మొదలైనవి. ఈ పథకాన్ని మొదట మహబూబ్‌నగర్, కర్నూలు, అనంతపురం, కడప, చిత్తూరు జిల్లాలలో 10.00 కోట్ల రూపాయలఖర్చుతో ప్రారంభించారు. తరవాత 1972లో దీన్ని ప్రకాశం జిల్లాలోని కనిగిరి తాలూకా, నల్లగొండ జిల్లా లోని దేవర కొండ తాలూకాలకు కూడా విస్తరించారు. ఈ పథకానికి అదనంగా 64.00 లక్షలు కేటాయించారు.

ఈ పథకం కింద అన్ని జిల్లాలలోను 2,277 పనులు చేపట్టారు. ఈ పథకాలకు నాలుగో ప్రణాళికలో అయిన ఖర్చు 905.52 లక్షలు. చిన్నతరహా నీటి పారుదల పథకాల కింద 64,975 ఎకరాల భూమికి నీటి వసతి కల్పించారు.

పైన చెప్పిన పథకాలే కాకుండా, విద్య, వైద్య, ఆరోగ్య రంగాలలోను, సాంఘిక సంక్షేమము, వసతి, మంచినీటి సరఫరా మొదలైన ఇతరరంగాలలోను కూడా కృషిజరిగింది.

## అయిదో పంచవర్ష ప్రణాళిక 1974-78

ఆంధ్రప్రదేశ్ జనాభాలో 70% ప్రజలు వ్యవసాయంపైనే ఆధారపడి ఉన్నారుకాబట్టి ఈ రంగాన్ని అభివృద్ధి చేసినట్లయితే సమాజంలోని పేదవర్గాల ప్రజల జీవితం మెరుగుపడు తుంది. కాబట్టి ఇంతకు ముందు ప్రణాళికలలో మాదిరిగానే ఈ ప్రణాళికలలో కూడా వ్యవ సాయాభివృద్ధికి అధిక ప్రాధాన్యమివ్వడం జరిగింది. వ్యవసాయాభివృద్ధికి కీలకమైన నీటి పారుదల పథకాలు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి తాలూకు పథకాలకు కూడా అధిక ప్రాధాన్యం లభించినట్లు తెలుస్తున్నది. అంటే మన ప్రణాళికలలో వ్యవసాయము, నీటి పారుదల ప్రాజె క్టులకు, విద్యుచ్ఛక్తి పథకాలకు ప్రాధాన్యం ఇవ్వడంవల్ల ప్రణాళికా కేటాయింపులో అత్యధిక శాతం 76% వీటికే కేటాయించడం జరిగింది. అయిదో ప్రణాళికలో కూడా పెట్టుబడి ధోరణి అంతకు క్రితం అమలు పరిచిన ప్రణాళికల మాదిరిగానే ఉంది. ఈ ప్రణాళికలోని కేటా యింపుల తీరు కింది పట్టికలో చూడవచ్చు.

(రూ. కోట్లలో)

| అభివృద్ధి అంశము | 1974-78 కేటాయించినది | 1974-78 వ్యయంచేసినది |
|---|---|---|
| 1. వ్యవసాయము, అనుబంధ పథకాలు | 77.00 | 78.88 |
| 2. సహకారము | 18.99 | 20.52 |
| 3. నీటి పారుదల | 286.40 | 284.96 |
| (i) నాగార్జునసాగర్ ప్రాజెక్టు | 79.15 | 79.15 |
| (ii) పోచంపాడు ప్రాజెక్టు | 69.63 | 69.63 |
| (iii) గోదావరి బారేజ్ ప్రాజెక్టు | 28.09 | 27.09 |
| (iv) ఇతర భారీ మధ్యతరహా ప్రాజెక్టులు | 87.94 | 87.63 |
| (v) వరదనిరోధక, మురుగునీటి పథకాలు | 18.09 | 17.96 |
| (vi) ఆంధ్రప్రదేశ్ కన్‌స్ట్రక్షన్‌కార్పొరేషన్ | 3.50 | 3.50 |
| 4. విద్యుచ్ఛక్తి | 398.18 | 387.50 |
| 5. పరిశ్రమలు, గనులు | 36.13 | 35.13 |
| 6. రవాణా కమ్యూనికేషన్‌లు | 92.58 | 88.92 |
| 7. సాంఘిక, సామాజిక సేవలు | 131.97 | 116.20 |
| 8. ఆర్థిక సేవలు | 0.84 | 0.72 |
| 9. సాధారణసేవలు | 2.54 | 1.82 |
| మొత్తం | 1,044.63 | 1,014.65 |

మూలం : రాష్ట్ర ప్రణాళిక 1974-78

అయిదో ప్రణాళికా కాలానికంతటికి వ్యవసాయోత్పత్తుల లక్ష్యాలను నిర్ణయించారు. హఠాత్తుగా సంభవించే ప్రకృతి వైపరీత్యాలను తట్టుకోవడానికి తగిన విధంగా వీటిని నిర్ణయించారు. వివిధ వ్యవసాయపు పంటల ఉత్పత్తి లక్ష్యాలు, సాధించిన విజయాల వివరాలను కింది పట్టికలో చూడవచ్చు.

| పంటలు | 1974-75 | 1975-86 | 1976-77 | 1977-78 |
|---|---|---|---|---|
| 1. ఆహారధాన్యాలు-లక్ష్యం— | 84.00 | 87.00 | 92.00 | 92.00 |
| సాధించినది | 90.86 | 94.24 | 74.97 | 86.60 |

| | | | | |
|---|---|---|---|---|
| 2. నూనెగింజలు-లక్ష్యం — | 14.50 | 15.40 | 16.65 | 16.65 |
| సాధించినది | 16.29 | 11.89 | 6.56 | 10.71 |
| 3. పత్తి-లక్ష్యం — | 2.85 | 3.90 | 4.00 | 4.00 |
| సాధించినది | 4.78 | 2.39 | 2.59 | 2.31 |
| 4. మెస్తా-లక్ష్యం — | 3.30 | 3.55 | 3.80 | 4.50 |
| సాధించినది | 5.24 | 5.96 | 9.22 | 8.57 |
| 5. పొగాకు-లక్ష్యం — | 2.15 | 2.29 | 2.44 | 2.60 |
| సాధించినది | 1.59 | 1.30 | 1.33 | 1.99 |
| 6. చెరుకు-లక్ష్యం — | 122.00 | 127.00 | 133.00 | 133.00 |
| సాధించినది | 144.96 | 103.32 | 102.81 | 96.48 |
| 7. రసాయనిక ఎరువులు-లక్ష్యం — | 3.00 | 1.91 | 3.90 | 4.10 |
| i) నత్రజని ఎరువు సాధించినది | 1.89 | 2.56 | 2.90 | 3.60 |
| ii) ఫాస్ఫేట్‌లు-లక్ష్యం — | 1.00 | 0.62 | 0.65 | 1.50 |
| సాధించినది | 0.51 | 0.54 | 0.81 | 1.38 |
| iii) పొటాష్-లక్ష్యం — | 0.50 | 0.23 | 5.25 | 0.40 |
| సాధించినది | 0.25 | 0.17 | 0.23 | 0.37 |

మూలం : రాష్ట్ర ఐదో పంచవర్ష ప్రణాళిక 1974–1978

ఆహార ధాన్యాల ఉత్పత్తి విషయంలో 1974-75, 1975-76 సంవత్సరాలు ఎంతో ప్రాముఖ్యమున్న సంవత్సరాలు. ఈ విషయం పట్టిక స్పష్టం చేస్తుంది. కానీ ఈ విధమైన స్థాయిని తరవాతి సంవత్సరాలు—1976-77, 1977-78—అంతకు ముందు సంవత్సరం సాధించిన ఉత్పత్తి స్థాయిని నిలబెట్టుకోలేక పోయాయి; ఉత్పత్తి తగ్గింది. ఈ విధంగా ఉత్పత్తి క్షీణించడానికి ఆ కాలంలో ఏర్పడిన ప్రకృతి వైపరీత్యాలు—తుఫాను, అనావృష్టి—ప్రధాన కారణాలు. అంతేకానీ కృషిలోపంకాదు. ఇన్ని వైపరీత్యాలున్నా 1977-78 లో లక్ష్యంగా పెట్టుకొన్న 92.00 లక్షల టన్నులకు బదులు 86.60 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు పండించ గలిగారు. పైన తెలిపిన వైపరీత్యాలే లేకుంటే ఉత్పత్తి 100 లక్షల స్థాయిని చేరుకొని ఉండేది. మిగతా పంటల విషయంలో కూడా ప్రకృతి వైపరీత్యాల ప్రభావం ఉన్నట్లు గమనించవచ్చు.

వ్యవసాయాభివృద్ధిలో నీటిపారుదల సౌకర్యాలు ప్రముఖపాత్రవహిస్తాయనే విషయంలో రెండు అభిప్రాయాలకు తావులేదు. ఈ రంగంలో రాష్ట్ర ప్రభుత్వం ఐదో ప్రణాళికా కాలంలో

తగిన శ్రద్ధ కనపరచింది. ఈ విధమైన సౌకర్యాలు కల్పించడానికి రూ. 2,279.34 లక్షల పెట్టుబడి పెట్టింది. అదనపు సౌకర్యాలు కల్పించడం, ఉన్న వనరులను అభివృద్ధి చేయడం, పంటకాలువలు తవ్వించడం ఈ పథకంలోని ముఖ్యమైన అంశాలు.

నీటిపారుదల విషయాల విషయంలో రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ చూపించడానికి నిదర్శనం 1974 స్టేట్ ఇర్రిగేషన్ డెవలప్ మెంట్ కార్పొరేషన్ సంస్థను స్థాపించడమే. ఈ సంస్థ రాష్ట్రంలో నీటి వనరులకున్న అవకాశాలను పరిశీలించి తగిన పథకాలను రూపొందిస్తుంది. ప్రస్తుతం ఈ సంస్థ లిఫ్ట్ ఇరిగ్రేషన్ పథకాలకు నిర్వహిస్తున్నది. ఈ పథకంలో భాగంగా 13 లిఫ్ట్ ఇర్రిగేషన్ పథకాలను చేపట్టింది. వీటివల్ల ఖరీఫ్‌లో 20,828 హెక్టార్ల భూమికి, రబీలో 19,211 హెక్టార్ల భూమికి నీటి సౌకర్యం లభిస్తుంది. ఈ కార్పొరేషన్ 343 గొట్టపు బావుల తవ్వకం కూడా పూర్తిచేసి 16,464 హెక్టార్లభూమికి నీటిసౌకర్యం కలగజేసింది.

వ్యవసాయాభివృద్ధి రంగంలో ఆయకట్ల అభివృద్ధికి చేపట్టిన పథకాలను ప్రత్యేకంగా పేర్కొనవచ్చు. వివిధ ప్రాజెక్టుల ప్రాంతంలోని భూములను అభివృద్ధిచేసి కల్పించిన సౌకర్యాలను సద్వినియోగం చేసుకొని అధిక ఉత్పత్తిని సాధించే వీలు కల్పించడానికి ఈ పథకాలను చేపట్టారు. ఆయకట్టు భూముల అభివృద్ధి తాలూకు పథకాలను రూపొందించి నిర్వహించడానికి 1974 కమాండ్ ఏరియా డెవలప్ మెంట్ డిపార్ట్ మెంట్‌ను స్థాపించారు. ఈ సంస్థ భూముల అభివృద్ధి విషయంలో రైతులకు అవసరమైన సాంకేతిక సలహా సహాయాలు అందిస్తుంది. ఇట్లాంటి ఆయకట్టు ప్రాంతాల అభివృద్ధికిగాను 4 ప్రాజెక్టు ప్రాంతాలలో కృషి ప్రారంభమైంది. అవి : 1. నాగార్జునసాగర్ కుడికాలవ, 2. నాగార్జునసాగర్ ఎడమ కాలవ, 3. పోచంపాడు ప్రాజెక్టు, 4. తుంగభద్ర ప్రాజెక్టులు. పంటకాలువలు తవ్వడం వీటి పనులలో ముఖ్యంగా పేర్కొన దగ్గవి, 1977-78 సంవత్సరంలో ఇట్లాంటి పంటకాలవల తవ్వకం పని చేట్టింది. నాలుగు ప్రాజెక్టు ప్రాంతాలలోని 20,157 హెక్టార్ల భూములు.

## అనావృష్టికి గురికాగల ప్రాంతాల అభివృద్ధి

అనావృష్టికి గురికాగల ప్రాంతాల అభివృద్ధికి అనుసరించిన వ్యూహం సమగ్రగ్రామీణాభివృద్ధి. ఈ వ్యూహానికి వనరులలో ప్రధానమైన నీరు, భూమి, పశుసంపదల అభిలషణీయ ఉపయోగం ఆయువుపట్టు. ఈప్రాంతాల అభివృద్ధికిగాను ఐదో ప్రణాళికా కాలంలో సాధించిన ప్రగతిని కింది పట్టిక తెలుపుతుంది.

| రంగం పేరు | యూనిట్ | 1974-1977-78 |
|---|---|---|
| I వ్యవసాయం | | |
| A సాయిల్ వాటర్ కన్సర్వేషన్ | | |
| (1) సాయిల్ సర్వే, ప్లానింగ్ | హెక్టార్లు | 52 |
| 2. సాయిల్ కన్సర్వేషన్ పథకం కిందబాగుచేసిన నేలలు | హెక్టార్లు | 1,140 |

B పంటలు

1. మెరుగైన పంటలతీరుకు సంబంధించిన పనులు

| | | |
|---|---|---|
| (a) నీటి పారుదల భూమి సాగుకు | హెక్టార్‌లు | 6,413 |
| (b) మెట్ట సాగుభూమి | హెక్టార్‌లు | 10,603 |
| 2. ఉత్పాదకాలు | | |
| (a) రసాయనిక ఎరువులు | టన్నులు | 1,14,228 |
| (b) విత్తనాలు | టన్నులు | 7,226 |
| (c) చీడల మందులు | టన్నులు | 5,004 |
| (d) పనిముట్లు | నంబరు | 3,905 |
| II నీటి పారుదల | | |
| (a) నేలపై లభించే నీటి వనరులు | హెక్టార్‌లు | 14,473 |
| (b) భూగర్భ జలసంపద అభివృద్ధి | హెక్టార్‌లు | 4,641 |
| III అడవులు, పచ్చికబయళ్ళు | | |
| 1. అడవుల పెంపకంలోని విస్తీర్ణం | హెక్టార్‌లు | 7,093 |
| 2. సోషియల్ ఫారెస్టరీ | హెక్టార్‌లు | 5,288 |
| 3. పచ్చికబయళ్ళ అభివృద్ధి | హెక్టార్‌లు | 15,986 |
| IV పశుగణాభివృద్ధి | | |
| A పశుసంపద, పాడిపరిశ్రమాభివృద్ధి | | |
| 1. పాడి పశువుల పెంపకం | నంబరు | 9,493 |
| 2. కృత్రిమ గర్భోత్పత్తి | నంబరు | 19,316 |
| 3. పాల సొసైటీల స్థాపన | నంబరు | 120 |
| 4. సొసైటీల సగటు పాలసేకరణ | లీటర్లు | 2,160 |
| 5. పశుగ్రాసం పెంచిన విస్తీర్ణం | హెక్టార్‌లు | 337 |
| B గొర్రెల పెంపకం | | |
| 1. సంకరజాతి గొర్రెల వృద్ధి | నంబరు | 2,887 |
| 2. గొర్రె పిల్లలు | నంబరు | 25,805 |
| 3. గొర్రెల సహకార సంఘాల స్థాపన | నంబరు | 307 |
| C కోళ్ళ పెంపకం యూనిట్ల స్థాపన | నంబరు | 307 |
| V తోటల పెంపకం | | |
| a. పండ్ల చెట్లు నాటడం | నంబరు | 13,630 |

| | | |
|---|---|---|
| b. విస్తీర్ణం | హెక్టార్‌లు | 672 |
| c. కూరగాయలకింద ఉన్న విస్తీర్ణం | హెక్టార్‌లు | 10,760 |
| VI చేపల పరిశ్రమ | | |
| 1. నర్సరీల అభివృద్ధి | హెక్టార్‌లు | 5 |
| VII పట్టుపరిశ్రమ | | |
| మల్బరీ పెంపకంలో ఉన్న విస్తీర్ణం | హెక్టార్‌లు | 2,653 |

మూలం : రాష్ట్ర 5 వ ప్రణాళిక — 1974-1978.

## విద్యుచ్ఛక్తి ఉత్పాదన

1974-75 నుంచి 1977-78 మధ్యకాలంలో విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు రూ. 395.18 కోట్లు కేటాయించారు. విద్యుచ్ఛక్తి ఉత్పాదన పథకాలకోసం చేసిన మొత్తం ఖర్చు రూ. 384.50 కోట్లు. వివిధ పథకాలకోసం చేసిన వ్యయం తాలూకు వివరాలు కింది పట్టికలో చూడవచ్చు.

| పథకం | మొత్తం ఖర్చు 1974-78 |
|---|---|
| I. హైడ్రో ఎలక్ట్రిక్ స్కీమ్స్ | |
| 1. శ్రీశైలం | 82.43 |
| 2. దిగువ సీలేరు | 61.32 |
| 3. నాగార్జునసాగర్ (కన్వెక్షనల్) | 7.11 |
| 4. నాగార్జునసాగర్ (పంపిణీ స్టోరేజి) | 0.66 |
| 5. ఎగువసీలేరు II | 1.01 |
| **కొత్త ప్రాజెక్టులు** | |
| 6. బలెమీలాలోని పవర్ హౌస్ | 0.39 |
| 7. నాగార్జునసాగర్ కుడికాలువ | 0.10 |
| మొత్తం | 153.02 |
| II. థర్మల్ స్కీమ్స్ | |
| 8. కొత్తగూడెం స్టేజ్ II | 4.38 |
| 9. కొత్తగూడెం స్టేజ్ IV | 69.20 |
| 10. విజయవాడ T.S | 70.16 |
| **కొత్తవి** | |
| 11. మంగూర్ సూపర్ థర్మల్ స్టేషన్ | 0.03 |
| మొత్తం | 143.77 |
| III. విద్యుత్ ప్రసారము, గ్రామీణ విద్యుదీకరణ మొదలైనవి | |
| 12. ప్రసారము | 34.83 |
| 13. గ్రామీణ విద్యుదీకరణ | 52.42 |
| 14. ఇన్వెస్టిగేషన్ | 0.46 |
| మొత్తం | 87.71 |
| I+II+III మొత్తం | 384.50 |

మూలం : రాష్ట్ర 5వ పంచవర్ష ప్రణాళిక 1974-1978

## పరిశ్రమలు

పారిశ్రామికాభివృద్ధి రంగంలో కూడా ఐదో ప్రణాళికా కాలంలో కృషి జరిగింది. పెద్ద పరిశ్రమలు, మధ్యతరహా పరిశ్రమల అభివృద్ధికిగాను ఈ ప్రణాళికలో 16.42 కోట్ల రూపాయలు కేటాయించారు దీనిలో ఖర్చుచేసిన మొత్తం 15.66 కోట్ల రూపాయలు.

పరిశ్రమలను ప్రోత్సహించే ఉద్దేశంతో ఆ పరిశ్రమలలో ఉత్పత్తి అయే వస్తువులకు అమ్మకం పన్ను మినహాయింపు విద్యుచ్ఛక్తిని సబ్సిడైజ్డ్ రేటుకు సప్లయ్ చేయడం. ఈ పథకం 1969 లో ప్రారంభించి 31-12-1975 నాటికి ఉత్పత్తి ప్రారంభించిన వాటికి వర్తించేలాచేశారు. తరవాత ఈ ప్రోత్సాహక పథకాన్ని 1976 జనవరి తరవాత ఉత్పత్తి ప్రారంభించిన వాటికి కూడా వర్తించేటట్లు విస్తరించినారు. దీనిలో భాగంగా వెనకబడిన ప్రాంతాలుగా గుర్తించినచోట్ల పరిశ్రమలను నెలకొల్పిన వారికి పెట్టుబడి మొత్తంలో 10% సబ్సిడీగా ఉన్నాయి. షెడ్యూల్డ్ ప్రాంతాలలో నెలకొల్పేవాటికి 20% సబ్సిడీని ఇచ్చి ప్రోత్స హించడం ప్రారంభించారు.

ఈ ప్రణాళికాకాలంలో (1974-78) 123 పెద్దపరిశ్రమలు, మధ్యరకం పరిశ్రమలను, 1091 చిన్న పరిశ్రమలను నెలకొల్పడం జరిగింది. వీటికి సబ్సిడీ రూపంలో 231.27 లక్షలు, 168.30 లక్షలు ఖర్చుచేశారు.

సత్వర పారిశ్రామికాభివృద్ధి సాధించడానికి ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్‌ను స్థాపించారు. దీని అధికృత మూలధనం రూ. 25.00 కోట్లు. చెల్లించిన మూలధనం రూ. 18.05 కోట్లు. ఈ కార్పొరేషన్ కింద 150 యూనిట్‌లు ఉన్నాయి. వీటిపై పెట్టిన పెట్టుబడి మొత్తం రూ. 50,000. ఈసంస్థ స్థాపించిన పరిశ్రమలు ప్రధానంగా వెనకబడిన ప్రాంతాలలో ఉన్నాయి. ఈ సంస్థలలో 52 వ్యవసాయ ప్రాతిపదికఉన్న పరిశ్రమలు. మిగిలినవాటిలో 26 ఇంజనీరింగ్ పరిశ్రమలు, 25 రసాయనాల పరిశ్రమలు, 17 ఎలక్ట్రానిక్ పరిశ్రమలు.

పారిశ్రామిక రంగంలో గణనీయంగా ఉన్న ప్రాజెక్టులుగా చెప్పుకోదగ్గవి (1) 41.00 కోట్ల పెట్టుబడితో నెలకొల్పిన శ్రీ రాయలసీమ పేపర్‌మిల్స్ (2) ఆంధ్రప్రదేశ్‌కార్బైడ్స్ (3)ఆంధ్రప్రదేశ్ రెయాన్స్,(4) ఫైబర్‌గ్లాస్, (5)మాంగో ప్రోసెసింగ్‌యూనిట్, నూజివీడు (6)సాల్ట్ కాంప్లెక్స్, నౌపాడ, శ్రీకాకుళం మొదలైనవి.

## స్వయం ఉద్యోగితా పథకాలు

ఈ పథకాన్ని 1971-72 లో ప్రారంభించారు. దీని ప్రధానోద్దేశం విద్యావంతులైన నిరుద్యోగులకు ఉపాధి కల్పించడం. వీరిని గ్రామీణ చిన్నతరహా పరిశ్రమలు నెలకొల్పడానికి ప్రోత్సహించడం, చిన్న చిన్న వ్యాపార సంస్థలను నెలకొల్పడం మొదలైన పనులు చేపట్టడంలో సహాయ సహకారాలు అందించడం జరుగుతుంది. ఈ పథకం కింద 11,000 యూనిట్‌లను 21.00 కోట్ల ఖర్చుతో ప్రారంభించారు. దీనివల్ల 42,000 మంది విద్యావంతులైన నిరుద్యోగులకు లాభం కలిగింది. 1974-78 లో 6243 యూనిట్‌లను నెలకొల్పారు. 29,000 మందికి స్వయం ఉపాధి అవకాశాలు లభించాయి.

## షెడ్యూల్డ్ కులాలు, తెగలు, వెనకబడిన వర్గాల వారి సంక్షేమం

పై వర్గాలవారి ఆర్థిక, విద్యాభివృద్ధికిగాను పథకాలు రూపొందించి అమలు జరపడం జరిగింది. విద్యాభివృద్ధి పథకాల వల్ల లాభంపొందిన వారిసంఖ్య 1500 - 2545 వరకు ఉంటుంది. మొదటి నాలుగేళ్లలో 133 హాస్టళ్ళు ప్రారంభించారు. వీటికోసం 141.38 లక్షలు ఖర్చుచేయాల్సి వచ్చింది. 67 ప్రభుత్వ హాస్టల్ భవనాల నిర్మాణం పూర్తి అయింది. మరో 80 భవనాల నిర్మాణాన్ని చేపట్టారు. దీనికిగాను 117.16 లక్షలు వ్యయమయింది.

హాస్టళ్లలో ఉన్న షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు బట్టలకుగాను 49.92 లక్షలు ఖర్చు చేశారు. దీనివల్ల లాభంపొందిన వారి సంఖ్య 30,000 నుంచి 40,000 వరకు ఉంటుంది. చదువుకొంటున్న విద్యార్థులకు జాతీయంచేసిన పాఠ్యపుస్తకాలు అందజేశారు. దీనికోసం 47.00 లక్షలు ఖర్చుచేయాల్సి వచ్చింది. ఆర్థికాభివృద్ధి పథకాలకుగాను 180.00 లక్షలుఖర్చు చేయడం జరిగింది.

గిరిజనాభివృద్ధికిగాను ప్రభుత్వం చేసిన వ్యయంతీరు కింది విధంగా ఉంది.

| అంశము | అభివృద్ధిస్థాయి నాలుగో ప్రణాళికాంతంలో | | ఐదో ప్రణాళికాంతంలో |
|---|---|---|---|
| 1. అక్షరాస్యత శాతం | 5.34 | (1971) | 8.01 |
| 2. విద్యుచ్ఛక్తి సౌకర్యం ఉన్న గ్రామాలు | 2.9 | | 7.28 |
| 3. ప్రతి లక్షప్రజలకు ఉన్న పడకల సంఖ్య | 14 | | 7.28 |
| 4. ప్రతి లక్షపశువులకుఉన్న పశువైద్యశాలలు | 5 | | 7 |
| 5. పంటఉన్న భూమిలోనీటిపారుదల ఉన్నభూవిస్తీర్ణం | | | |
| | 5.06 | | 25.01 |

ఐదో ప్రణాళికాకాలంలో ఆంధ్రప్రదేశ్ వివిధ రంగాలలో గణనీయమైన ప్రగతి సాధించింది. మొదటినుంచీ కూడా వ్యవసాయరంగానికి, దానికి అనుబంధంగా ఉన్న నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి రంగాలకు అత్యధిక ప్రాధాన్యం ఇవ్వడం గమనించవచ్చు. సమాజంలో వెనకబడిన వర్గ ప్రజల సాంఘిక, ఆర్థిక ప్రగతికి అనువైన ఎన్నో పథకాలను చేపట్టారు. పెద్దపెద్ద నీటిపారుదల ప్రాజెక్టుల వల్ల లభ్యమయ్యే సదుపాయాలను సరి అయిన విధంగా ఉపయోగించుకొని, పూర్తి ఫలితాలు పొందడానికి అనువుగా ఆయా ప్రాజెక్ట్ ప్రాంతాలలోని ఆయకట్టు భూముల అభివృద్ధికి ప్రత్యేక సంస్థలను స్థాపించి అనేక అభివృద్ధి కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించడం జరిగింది.

## 1978-79 నుంచి 1982-83 కాలానికి ప్రణాళిక

1978-79 1982-83 ప్రణాళికాకాలంలో భూమి అభివృద్ధిపట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరిచారు. ఈ విషయంలో చేపట్టదలచిన పథకాలు, చేయదలచిన పెట్టుబడి వివరాలు కింది విధంగా ఉన్నాయి.

భూమి అభివృద్ధి, ఇతరపనులకోసం ఏర్పరచిన లక్ష్యాలు—1978-79 నుంచి 1982-83 వరకు

( రూ. లక్షలలో )

| సంవత్సరం | భూమి అభివృద్ధి, ఆయకట్టు అభివృద్ధి | | బావులు | | పంపుసెట్లు | | ట్రాక్టర్లు, పవర్ టిల్లర్‌లు | | ఇతరపనులు | మొత్తం వ్యయం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఎకరాలు | మొత్తం | సంఖ్య | మొత్తం | సంఖ్య | మొత్తం | సంఖ్య | మొత్తం | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 1978-79 | 1,700.00 | 11.00 | 251.65 | 12.30 | 141.90 | 8.20 | 10.00 | 5.00 | 18.50 | 55.00 |
| 1979-80 | 1,450.00 | 10.00 | 275.95 | 13.50 | 163.60 | 9.00 | 12.00 | 6.00 | 16.50 | 55.00 |
| 1980-81 | 1,450.00 | 10.00 | 312.00 | 14.70 | 178.15 | 9.80 | 15.00 | 7.50 | 18.00 | 60.00 |
| 1981-82 | 1,500 | 10.00 | 312.00 | 14.70 | 178.15 | 9.80 | 15.00 | 7.50 | 18.00 | 60.00 |
| 1982-83 | 1,500 | 10.00 | 270.70 | 18.30 | 221.80 | 12.20 | 16.00 | 8.00 | 21.50 | 70.00 |

రాష్ట్ర ప్రణాళిక — 1978-79 నుంచి 1982-83 వరకు

## నీటిపారుదల ప్రాజెక్ట్‌లు — పెద్దతరహా, మధ్యతరహా ప్రాజెక్ట్‌లు

వ్యవసాయాభివృద్ధికి కీలకమైనది నీటి సౌకర్యం కల్పించడం అనే విషయం సర్వివాదాంశం. ఈ విషయంలో ఆరో ప్రణాళికకు సంబంధించిన విధానం కింది విధంగా ఉంటుంది.

1. ఇదివరకే ప్రారంభించి సాగుతున్న ప్రాజెక్ట్‌లను పూర్తి చేయడం
2. కొత్త కొత్త నీటి పారుదల పథకాలు చేపట్టడం
3. మామూలుగా అనావృష్టికి గురిఅయ్యే ప్రాంతాలు, వెనకబడిన ప్రాంతాల అభివృద్ధికి తోడ్పడే పథకాలకు ప్రాధాన్య మివ్వడం
4. ఆయకట్టు ప్రాంతాలలో మురుగునీటి పథకాలను చేపట్టడం.

పై లక్ష్యాలను దృష్టిలో పెట్టుకొని ఈ ప్రణాళికా కాలంలో వివిధ పథకాలకుగాను పెట్టదలచుకొన్న పెట్టుబడి మొత్తం రూ. 955 కోట్లు. దీనిలో ఇదివరకే ప్రారంభించి సాగుతున్న ప్రాజెక్టులకోసం 570.80 కోట్లు కేటాయించారు. ఈవిధమైన పథకాలు, వాటికి కేటాయించిన మొత్తాల వివరాలు కింది పట్టికలో చూడవచ్చు.

| పథకము | (రూ. కోట్లలో) |
|---|---|
| 1. నాగార్జునసాగర్ | 158.00 |
| 2. పోచంపాడు — స్టేజి I | 187.00 |
| 3. గోదావరి బారేజి | 26.00 |
| 4. వంశధార — స్టేజి I | 15.37 |
| 5. తుంగభద్ర ఎగువ కాలువ | 6.94 |
| 6. నిజాంసాగర్ అభివృద్ధి | 4.96 |
| 7. సోమశిల — స్టేజి I | 24.40 |
| 8. వంశధార — స్టేజి II | 26.00 |
| 9. మీడియమ్ ఇర్రిగేషన్ ప్రాజెక్టులు | 92.31 |
| 10. మురుగునీటి పథకాలు, వరదనిరోధక పథకాలు | 24.85 |
| 11. ఏకమొత్తంగా కేటాయించినవి | 4.97 |
| మొత్తం | 570.80 |

కొత్త నీటిపారుదల పథకాలకోసం 384.70 కోట్ల రూపాయలు కేటాయించాలనుకొన్నారు. దీనిలో పెద్ద నీటిపారుదల ప్రాజెక్టుల కోసం 252.26 కోట్లు, 84.44 కోట్లు మధ్యతరహా ప్రాజెక్టులకోసం, మిగిలినదాన్ని పంటకాలువలు, మురుగు కాలువలు ఏర్పాటుకోసం వినియోగించాలని ప్రణాళిక వేశారు. ఈ పథకాలకోసం కేటాయించిన మొత్తాల వివరాలు కిందిపట్టికలో చూడవచ్చు.

(రూ. కోట్లలో)

| ప్రాజెక్టులు | కేటాయించిన మొత్తం |
|---|---|
| **పెద్ద ప్రాజెక్టులు** | |
| 1. పోలవరం బారేజి | 50.00 |
| 2. శ్రీశైలం ఆర్. బి. కెనాల్ | 115.00 |
| 3. సింగూరు | 30.00 |
| 4. జురాల | 47.00 |
| **ఇతరాలు** | |
| 5. పోచంపాడు - స్టేజి - II | 10.26 |
| 6. మీడియం ఇర్రిగేషన్ ప్రాజెక్టులు [23] | 84.44 |
| 7. ఆధునికీకరణ కోసం | 16.00 |
| 8. పంట కాలవలు | 10.00 |
| 9. ఇన్వెస్టిగేషన్ | 10.00 |
| 10. పరిశోధన | 2.00 |
| 11. మురుగునీటి పథకాలు | 10.00 |
| మొత్తం | 384.70 |

మూలం : 1978-79 — 1983 కాలానికి ప్రణాళిక ప్రతిపాదనలు

## విద్యుచ్ఛక్తి

విద్యుచ్ఛక్తి ఉత్పాదనను పెంచవలసినఅవసరాన్ని గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 6 వ ప్రణాళికలో తగిన చర్యలు తీసుకోదలిచారు. విద్యుచ్ఛక్తిని 1977-78 లోని 968 మెగావాట్ల నుంచి 1982-83 నాటికి 1807 మెగావాట్లకు పెంచడానికి పథకాలు రూపొందించారు. విద్యుచ్ఛక్తి రంగంలో పెట్టదలుచుకొన్న మొత్తం పెట్టుబడి రూ. 1035.87 కోట్లు. దీనిలో 581.37 కోట్లు విద్యుదుత్పత్తి కోసం, రూ. 240 కోట్లు విద్యుత్ ప్రసారం కోసం, 173.00 కోట్లు గ్రామీణ విద్యుదీకరణకోసం కేటాయించారు. విద్యుదుత్పత్తికి కేటాయించిన 581.37 కోట్లలో నిర్వహణలో ఉన్న పనులకోసం 293.52 కోట్లు, మిగిలిన 287.85 కోట్లు కొత్త పథకాలకు వినియోగించడం జరుగుతుంది. ఈ పెట్టుబడి మొత్తం కింది విధంగా ఖర్చు చేయడం జరుగుతుంది.

| పనిజరుగుతున్న ప్రాజెక్టులు | కేటాయించదలచిన పెట్టుబడి మొత్తం (కోట్లు) | అంచనావేసిన ఉత్పత్తి మెగావాట్స్ |
|---|---|---|
| 1. కొత్తగూడెం - స్టేజ్ IV | 4.40 | .... |
| 2. విజయవాడ థర్మల్ స్టేజ్ I | 85.40 | 420 |

| | | |
|---|---|---|
| 3. శ్రీశైలం స్టేజ్ I | 84.00 | 440 |
| 4. దిగువ సీలేరు | 6.60 | 115 |
| 5. నాగార్జునసాగర్ హైడ్రో ఎలెక్ట్రిక్ పథకం I | 6.29 | .... |
| 6. నాగార్జునసాగర్ పంపుడు స్టోరేజ్ స్కీమ్ I | 65.'6 | 400 |
| 7. నాగార్జునసాగర్ కుడి కాలువ | 18.09 | 60 |
| 8. బలిమెల పవర్ హౌస్ | 16.33 | 60 |
| 9. దొనకారియా పవర్ హౌస్ | 7.25 | 25 |
| మొత్తం | 293.52 | 1,520 |
| కొత్తపథకాలు | | |
| 1. విజయవాడ థర్మల్ స్టేజి—II | 48.12 | — |
| 2. భద్రాచలం థర్మల్ స్టేజి - I | 120.00 | 210 |
| 3. భద్రాచలం థర్మల్ స్టేజి - II | 30.00 | — |
| 4. పోచంపాడు | 10.00 | — |
| 5. నాగార్జుసాగర్ | 33.73 | 100 |
| 6. శ్రీశైలం - II | 38.00 | 220 |
| ఎడమవైపు ఉన్న పవర్‌హౌస్ | 8.00 | .... |
| 7. శ్రీశైలం | 287.85 | 530 |
| మొత్తం ఉత్పత్తి | 581.37 | 20.50 |
| ప్రసారం | 240.00 | |
| గ్రామీణ విద్యుదీకరణ | 173.00 | |
| సిస్టం ఇంప్రూవ్ మెంట్ | 40.50 | |
| మొత్తం ఉత్పత్తి | 1,034.87 | |

మూలం : 1978 – 79 నుంచి 1983 కాలానికి ప్రణాళిక

**పరిశ్రమలు**

పరిశ్రమల అభివృద్ధికి సంబంధించి ప్రణాళికా సంఘాలు కొన్ని సూచనలు చేసింది వీటిలో ముఖ్యమైనది, పెట్టదలుచుకొన్న పెట్టుబడిని ప్రధానంగా వ్యవసాయంపై ఆధారపడిన పరిశ్రమలకోసం, చిన్న పరిశ్రమలకోసం, మధ్యతరహా పరిశ్రమలకోసం కేటాయించాలనేది పరిశ్రమల రంగానికి సంబంధించినంత వరకు ఆరో ప్రణాళికా కాలంలో పెట్టదలుచుకొన్న పెట్టుబడి మొత్తం 179 కోట్ల రూపాయలు. దీనిలో 84 కోట్లు పెద్ద, మధ్యతరహా పరిశ్రమల

కోసం, 95 కోట్లు చిన్నతరహా పరిశ్రమలకోసం, 32.65 కోట్లు గనులకోసం కేటాయించారు. ప్రభుత్వం పెట్టదలుచుకొన్న పెట్టుబడి మూలంగా ద్రవ్య సంస్థలు, ప్రయివేట్ వ్యక్తులు కలిసి 370.00 కోట్ల రూపాయలు పెద్ద మధ్యతరహా పరిశ్రమల రంగంలో పెట్టుబడి పెట్టవచ్చని అంచనా వేశారు. ఈప్రణాళికలో పరిశ్రమలు, గనుల అభివృద్ధికోసం 830.00 కోట్లు ఉంటుం దని అంచనా.

సాంఘిక సేవల రంగానికి తగిన ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. ఈ రంగంలో పెట్టి దలుచుకొన్న మొత్తం 986 కోట్లుంటుందని అంచనా. వెనకబడిన తరగతులు షెడ్యూల్డ్ కులాలు, తెగల అభివృద్ధికోసం గట్టి కృషి చెయ్యాలని నిర్ణయించడం జరిగింది. ఈ వర్గాల వారి ఆర్థిక సామాజిక అభివృద్ధికోసం 133.53 కోట్లు కేటాయించారు.

## వార్షిక ప్రణాళిక 1980-81

రాష్ట్ర ప్రణాళికకు సంబంధించి ప్రణాళికా సంఘంతో జరుగుతున్న చర్చలు తుదిరూపం దాల్చనందువల్ల, గత సంవత్సరం రాష్ట్ర బడ్జెట్ ప్రతిపాదిస్తూ రాష్ట్ర ఆర్థికమంత్రి తాత్కాలిక అంచనాలు మాత్రమే తెలియజేశారు. కింది పట్టిక తాత్కాలిక కేటాయింపులు తెలుపుతుంది.

(రూ. లక్షలలో)

| రంగం | 1979-80 (సవరించిన) | 1980-81 |
|---|---|---|
| వ్యవసాయం, అనుబంధ రంగాలు | 5,470 00 | 4,799.71 |
| సహకారము | | 381.00 |
| నీటిపారుదల | 13,656.00 | 13,656.00 |
| విద్యుచ్ఛక్తి | 15,183.00 | 29,682.00 |
| రవాణా, కమ్యూనికేషన్‌లు | 2,898.00 | 3,857.00 |
| సాంఘిక సేవ, కమ్యూనిటీసర్వీసులు | 6,547.00 | 6,285.00 |
| పరిశ్రమలు. ఖనిజాలు | 1,329.00 | 1,173.70 |
| ఆర్థిక సేవలు | | 22.00 |
| సాధారణసేవలు | | 125.00 |
| మొత్తం | 45,083.00 | 46,225.59 |

మూలం : పంచవర్ష ప్రణాళిక 1978-79 నుంచి 1983 వరకు

1978-79 సం॥లో ప్రణాళికాకాలంలో అంతటా మనరాష్ట్రంలో వ్యవసాయ, నీటి పారుదల, విద్యుచ్ఛక్తి రంగాలకు అత్యధిక ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా వ్యవసాయంపై ఆధారపడిన రాష్ట్రం కాబట్టి పై రంగాలకు అధిక ప్రాధాన్య మివ్వడంలో ఆశ్చర్యంలేదు. పారిశ్రామిక ప్రాతిపదిక ఏర్పరచడానికి గట్టి కృషి జరిగింది.

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల సంతులితాభివృద్ధికి, ప్రాంతాలమధ్య అభివృద్ధిలో వ్యత్యాసాలన తొలగించి సత్వరాభివృద్ధి సాధించడానికి మూడు ప్రాంతాలలో ప్రాంతీయాభివృద్ధి సంఘాలన ఏర్పాటుచేయడం గమనించవలసిన విషయం. వెనకబడిన ప్రాంతాలలో పరిశ్రమలు స్థాపిం పారిశ్రామిక వేత్తలకు వివిధ తరహాలైన రాయితీలను ప్రకటించి వెనకబడిన ప్రాంతా పారిశ్రామికీకరణకు అవసరమైన ప్రోత్సాహం అందచేయడం రాష్ట్ర ఆర్థికాభివృద్ధి కృషిలో ప్రముఖచర్యగా పరిగణించవచ్చు. రాజకీయ సుస్థిరత నెలకొన్న ఈ సమయంలో నిధులు తగిన పరిమాణంలో సమకూర్చుకోగలిగి, కేంద్రసహాయ సహకారాలు అందితే రాష్ట్ర సర్వతో ముఖాభివృద్ధి సాధించడం ఏమంత కష్టంకాదు. రాష్ట్రం ఏర్పడి ఈ ఏటికి 25 సంవత్సరాల గడిచాయి. పాతిక సంవత్సరాల సమైక్య కృషి ఫలితాలు ముందుముందు చేయబోయే కృషి మంచి ప్రోత్సాహమిస్తాయని ఆశించవచ్చు.

# 34

# రాష్ట్ర ప్రభుత్వం-ఆదాయ వ్యయాలు

ప్రణాళికాబద్ధమైన ఆర్థిక ప్రగతి సాధించడానికి ప్రయత్నించడంలోని ముఖ్యమైన ఉద్దేశం దేశ ప్రజలలో ఎక్కువమందికి ప్రగతి ఫలితాలు అందజేయడం సుకర మవుతుందని, ప్రాంతీయ వ్యత్యాలను తొలగించడం సాధ్యమవుతుందని మన ప్రభుత్వం భావించింది. దేశం ఆర్థికంగా పురోగమించిందని చెప్పడానికి జాతీయ స్థాయిలో ఉత్పత్తి పెరిగి, దేశ సంపద, ప్రభుత్వ ఆదాయం పెరగడం మనేవి సూచికలు. కేవలం ప్రభుత్వపు మొత్తం ఆదాయం పెరగడమనేది దేశ ప్రజల ఆర్థికాభ్యున్నతికి అంత చక్కని సూచికకాబోదు. మొత్తంఆదాయం పెరగడంతోపాటు ప్రజల తలసరి ఆదాయం కూడా పెరిగినప్పుడు ఆదాయం పంపిణీ న్యాయంగా సమానంగా జరిగిందని చెప్పవచ్చు. ప్రజల శ్రేయస్సు, స్తోమత, జీవనప్రమాణం పెరిగాయని భావించవచ్చు.

మన ప్రణాళికల ముఖ్య లక్ష్యం ప్రజల ఆదాయం పెంచి, వారి జీవనప్రమాణస్థాయి పెరిగేటట్లు చూడటమే. మొదటి మూడు ప్రణాళికల కాలంలో రాష్ట్ర ఆదాయం 1960-61 సంవత్సరపు ధరలను బట్టిచూస్తే రూ. 799 కోట్లనుంచి రూ. 1,278 కోట్లకు పెరిగింది. అంటే మూడు ప్రణాళికల అభివృద్ధి కార్యక్రమాల ఫలితంగా రాష్ట్ర ఆదాయం 59% పెరిగిందన్న మాట. కానీ ఇదేకాలంలో జాతీయాదాయం 74% పెరిగింది. మొదటి మూడు ప్రణాళికల కాలంలో మన రాష్ట్ర ప్రజల తలసరి ఆదాయం రూ. 256 నుంచి రూ. 321 లకు పెరిగింది. పెరుగుదల 25% ఉండేది. అదే కాలంలో జాతీయ తలసరి ఆదాయం రూ. 275 నుంచి రూ. 351 లకు పెరిగింది. అంటే రాష్ట్ర ప్రజల తలసరి ఆదాయం జాతీయి తలసరి ఆదాయాని కంటె ఎప్పుడూ తక్కువగానే ఉంటూ వస్తోందన్నమాట. అంతేకాక రాష్ట్ర తలసరి ఆదాయానికి, జాతీయ తలసరి ఆదాయానికి 1950-51 లో రు. 19 తేడా ఉంటే మూడో ప్రణాళికాంతానికి ఆ తేడా రు. 30 కు పెరిగింది. అంటే మన రాష్ట్ర ప్రజల తలసరి ఆదాయం, జాతీయ తలసరి ఆదాయంతో పోలిస్తే క్రమంగా తగ్గుతూ వస్తూందన్న విషయం స్పష్టమవుతుంది. మొదటి మూడు ప్రణాళికల కాలంలో జాతీయ, రాష్ట్ర ఆదాయాలు, జాతీయ రాష్ట్ర తలసరి ఆదాయాలు ఏ విధంగా పెరుగుతూ తగ్గుతూ వచ్చాయో కింది పట్టిక స్పష్టం చేస్తుంది.

## జాతీయాదాయం, రాష్ట్రాదాయం

| | భారతదేశం | | | | | ఆంధ్రప్రదేశ్ | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | జనాభా (మిలియన్లు) | జాతీయాదాయం (రూ. కోట్లు) | ప్రణాళికాకాలంలో జాతీయ ఆదాయం పెరుగుదల శాతం | తలసరి ఆదాయం | తలసరి ఆదాయంలో పెరుగుదల శాతం | జనాభా | రాష్ట్ర ఆదాయం (కోట్లు రూ.) | ప్రణాళికాకాలంలో రాష్ట్ర ఆదాయం పెరుగుదల శాతం | తలసరి ఆదాయం (రూ.) | ప్రణాళికా కాలంలో తలసరి ఆదాయం పెరుగుదల శాతం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 1950–51 అంతంలో | 361 | 9,850 | .... | 275 | .... | 31.12 | 799 | .... | 256 | .... |
| మొదటి ప్రణాళికాంతంలో | 397 | 11,670 | 18.5 | 299 | 8.7 | 33.62 | 946 | 18.4 | 281 | 9.8 |
| రెండో ప్రణాళికాంతానికి | 438 | 14,140 | 21.2 | 326 | 9.00 | 35.93 | 1,056 | 11.8 | 294 | 4.6 |
| మూడో ప్రణాళికాంతానికి | 495 | 17,180 | 21.5 | 351 | 7.7 | 39.05 | 1,273 | 20.3 | 321 | 9.2 |

మూలం : ఆర్థికాభివృద్ధి — ఆంధ్రప్రదేశ్, 1957–68

## రాష్ట్ర ఆదాయం తలసరి ఆదాయం

| | రాష్ట్ర ఆదాయం (రూ. కోట్లలో) | | తలసరి ఆదాయం | |
|---|---|---|---|---|
| | ప్రస్తుత ధరలలో | 1960-61 ధరలలో | ప్రస్తుతధరలలో | 1960-61 ధరలలో |
| 1 | 2 | 3 | 4 | 5 |
| 1960–61 | 983.2 | 983.2 | 275 2 | 275.2 |
| 1970_71 | 2,510 6 | 1,334.7 | 583.6 | 310.3 |
| 1971–72 | 2,747.6 | 1,383 2 | 625.2 | 314.8 |
| 1972_73 | 2,906.5 | 1,290.1 | 647.2 | 287.3 |
| 1973_74 | 3,804.2 | 1,506.9 | 828.6 | 328.2 |
| 1974_75 | 4,669.2 | 1,565.9 | 994.3 | 333.5 |
| 1975_76 | 4,341.5 | 1,601.4 | 903.4 | 333.2 |
| 1976_77 | 4,434.1 | 1,499.0 | 901.2 | 304.7 |
| 1977_78 | 5,032.1 | 1,672.3 | 998.5 | 331.9 |
| 1978_79 | 5,301.3 | 1,800.3 | 1,026.6 | 348.6 |

మూలం : అర్థగణాంకశాఖ, ఆం. ప్ర

రాష్ట్ర ఆదాయం నాలుగో ప్రణాళికాంతానికి రూ. 3804 కోట్లకు పెరిగింది. అంటే నాలుగో ప్రణాళికాంతానికి రాష్ట్రాదాయం నాలుగురెట్లు పెరిగిందన్నమాట. ఐదో ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలు పూర్తి అయ్యేప్పటికి 1974-75, రాష్ట్రాదాయం రూ. 4,669 కోట్లు పెరిగింది. ఐదో ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో ఆదాయం సాలుకు 23% చొప్పున పెరుగుతూ వచ్చింది. కాని తరవాత రెండు సంవత్సరాలలో 1975-76, 1976-77 లలో పెరుగుదల లేకపోగా తగ్గుదల కనిపించింది. రాష్ట్ర ఆదాయం ఈ కాలంలో రూ.4,342 రూ. 4,434 కోట్లు మాత్రమే. స్థిరమైన ధరలలో రాష్ట్రాదాయం 1960-61 లోని రూ. 983 కోట్లనుంచి 1972-73 నాటికి రూ. 1290 కోట్లకు 1973–74 లో రూ. 1507 కోట్లకు పెరిగింది. రాష్ట్రాదాయం 1975-76 నాటికి రూ. 1601 కోట్లకు చేరుకొంది. కానీ 1976–77 లో అది 1499 కోట్లకు పడిపోయింది. దీనికి ముఖ్యమైన కారణం ఆకాలంలో వ్యవసాయరంగంలో ఏర్పడిన తీవ్ర పరిస్థితులే అని చెప్పవచ్చు. కాని రాష్ట్ర ఆర్థికవ్యవస్థ 1977_78 నాటికి కొంత పుంజుకొంది. ఆదాయం తిరిగి 1,621 కోట్ల స్థాయికి చేరుకొంది.

1960—61 నుంచి 1977—78 వరకు గడిచిన 17 ఏండ్ల కాలంలో రాష్ట్రాదాయం (నిలకడైన ధరలలో) రమారమి 5 రెట్లు పెరిగిందనే విషయం స్పష్టమవుతుంది. ఈ కాలంలో (1960—61 నుంచి 1977—78) రాష్ట్రంలోని తలసరి ఆదాయంలో పెరుగుదలను గమనించినట్లయితే రాష్ట్రం ఎంతవరకు పురోగమించింది, ప్రజల ఆర్థిక స్తోమత ఎంత వరకు

క్రమంగా పెరిగిందో తెలుసుకోవచ్చు. రాష్ట్ర తలసరి ఆదాయం 1960 - 61లో రూ. 275 (ప్రస్తుత ధరలలో) ఉండగా అది 1977 - 78 నాటికి రూ. 1,002 రూపాయలకు పెరిగింది. దీనినే నిలకడైన ధరలలో రాష్ట్రాదాయం 1960—61 లోని రూ. 275 నుంచి 1977—78 నాటికి రూ. 322 కు పెరిగిందని చెప్పవచ్చు.

రాష్ట్రాదాయం ప్రధానంగా ప్రాథమిక రంగమైన వ్యవసాయరంగం నుంచే లభిస్తూ వచ్చింది. కానీ ప్రణాళికలలో తలపెట్టి నిర్వహించిన అనేక అభివృద్ధి పథకాల ఫలితంగా రాష్ట్రాదాయ మార్గంలో కొంతమార్పు కనిపిస్తుంది. ప్రాథమిక రంగమైన వ్యవసాయం మీదనే ఎంతోకాలంనుంచి ఆధార పడుతున్న ఆదాయం, రాను రాను అటువంటి పరిస్థితిలో మార్పు వచ్చి ఇతర రంగాలైన ద్వితీయ తృతీయ రంగాలపై కూడా ఆధారపడగల వీలు కల్పించ డంలో కొంతవరకు విజయం సాధించినట్లే చెప్పవచ్చు.

1960-61 వరకు రాష్ట్ర ప్రభుత్వ ఆదాయంలో (నిలకడైన ధరల ననుసరించి) 58.8% ప్రాథమిక రంగమైన వ్యవసాయరంగంనుంచి లభిస్తూ వచ్చింది. క్రమంగా అటు వంటి పరిస్థితి మారుతూవచ్చి1977-78 నాటికి వ్యవసాయ రంగంనుంచి లభించిన ఆదాయం శాతం 45.7% తగ్గింది. ప్రణాళికలో అమలుచేసిన అనేక అభివృద్ధి పథకాల ఫలితంగా అంత వరకు ప్రాముఖ్యం లేని ద్వితీయ, తృతీయ రంగాలు ప్రముఖపాత్రవహించడం మొదలెట్టాయి. 1960-61 లో ద్వితీయ తృతీయ రంగాలు వరుసగా 12.9, 28.4 శాతం ఆదాయం సమ కూరుస్తూ ఉండగా 1977-78 నాటికి అవి 20.2, 34 శాతం ఆదాయాన్ని సమకూర్చగల స్థాయికి ఎదిగాయి. దీనినిబట్టి వ్యవసాయరంగం నుంచి లభిస్తున్న ఆదాయంలో 13.1% తగ్గు దల ఏర్పడినట్లు, ద్వితీయ తృతీయ రంగాల వాటా 7.4%, 5.7% పెరిగినట్లు స్పష్టమవు తుంది. పై గణాంక వివరాలు, రాష్ట్ర ఆర్థికవ్యవస్థకు వ్యవసాయం ప్రాతిపదికగా ఉంటూ వచ్చినా అది క్రమంగా తగ్గుతూ వస్తూ ఉండటాన్ని తెలియజేస్తాయి. కానీ ఈ నాటికి కూడా రాష్ట్రఆదాయానికి వ్యవసాయరంగమే ప్రధానమైన మార్గంగా ఉంటూ ఉందనటానికి సందేహంలేదు.

రాష్ట్రంలో పారిశ్రామికీకరణ వేగం పుంజుకొని, తృతీయ రంగం మరింత వేగంగా పనిచేయగలిగితే వ్యవసాయ రంగంపై అంతగా ఆధారపడవలసిన అవసరం ఉండకపోవచ్చు. వ్యవసాయరంగం ప్రకృతి పరిణామాలకు ఎక్కువగా గురిఅవుతూ ఉంటుంది. ప్రకృతి వైప రీత్యాలు - వరదలు, తుఫాను, అనావృష్టి వల్ల వ్యవసాయం దెబ్బతిని ఆదాయం క్షీణించే అవకాశాలు ఎక్కువ. ద్వితీయ తృతీయరంగాలకు పై వైపరీత్యాల తాకిడిఉండదు, ఆదాయం దెబ్బతినదు.

మన రాష్ట్ర ఆదాయానికి ఉన్న వనరులు, ఆ యా వనరుల నుంచి రాష్ట్రానికి లభించిన ఆదాయ వివరాలను కింది పట్టికలో చూడవచ్చు.

| సంవత్సరం | వ్యవసాయం + అనుబంధ కార్యకలాపాలు | ఉత్పత్తి పరిశ్రమ, గనులు | నిర్మాణాలు | విద్యుచ్ఛక్తి పీరు,గ్యాస్ | ఇతర రంగాలు | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1960-61 | 572.0 | 82.91 | 43.84 | 5.11 | 279.33 | 983.19 |
| 1961-62 | 630.05 | 91.00 | 47.99 | 4.42 | 284.83 | 1,058 29 |
| 1962-63 | 616.79 | 93.51 | 46.43 | 4.49 | 294.25 | 1,055.47 |
| 1963-64 | 650.87 | 107.65 | 44.95 | 4.70 | 304.15 | 1,112.32 |
| 1964-75 | 700.28 | 116.59 | 54.88 | 5.53 | 313.56 | 1,190.84 |
| 1965-66 | 578.17 | 121.47 | 59.31 | 4.89 | 318.87 | 1,082.71 |
| 1966-77 | 620.36 | 121.56 | 51.71 | 4.53 | 326.77 | 1,124.98 |
| 1967-68 | 654.13 | 122.47 | 46.96 | 8.62 | 362.68 | 1,194.86 |
| 1968-69 | 585.32 | 130.38 | 51.56 | 11.62 | 362.41 | 1,141.29 |
| 1969-70 | 606 10 | 141.92 | 57.23 | 12.30 | 373.64 | 1,191.19 |
| 1970-71 | 703.84 | 139.65 | 69.12 | 14.99 | 407.14 | 1,334.22 |
| 1971-72 | 720.57 | 149.22 | 71.90 | 16.28 | 425.25 | 1,338.22 |
| 1972-73 | 629.71 | 162.41 | 66.36 | 15.21 | 416.45 | 1.290.14 |
| 1973-74 | 810.49 | 166.19 | 54.99 | 19.23 | 455.94 | 1,566.93 |
| 1974-75 | 813.75 | 187.66 | 65.83 | 19.56 | 479.13 | 1,565.93 |
| 1975-76 | 796.17 | 206.77 | 17.77 | 19.16 | 502.18 | 1,601.45 |
| 1976-77 | 655.99 | 224.33 | 81.88 | 23.51 | 513.25 | 1,498.96 |

మూలం : 1978-83 ప్రణాళిక – రాష్ట్రప్రభుత్వం

రాష్ట్ర ప్రభుత్వ ఆదాయ వ్యయాలు కింది విధంగా ఉంటున్నాయి. 1978–79 కి గాను రెవెన్యూ మిగులు 117.13 కోట్లు. కాని 1979–80 సంవత్సరపు సవరించిన బడ్జెట్ అంచనాల ప్రకారం రెవెన్యూఖాతాలో 56.47 కోట్లు మిగులు కనిపించింది. ఈ విధంగా మిగులు తగ్గిపోవడానికి పేర్కొన్న కారణాలలో ముఖ్యమైనవి – (1) భూమి పన్ను రూపంలో వస్తుందనుకొన్న ఆదాయం తగ్గిపోవడం (2) ఎన్నికలకోసం రెవెన్యూ వ్యయం కావడం, (3) వడ్డీ చెల్లింపులు, (4) జీతాల స్కేళ్ళను పెంచడం వల్ల అదనంగా ఏర్పడిన ఖర్చు, (5) రిటైర్‌మెంట్,పెన్షన్ సౌకర్యాలవల్ల కలిగినఖర్చు మొదలైనవి. 1979–80 సంవత్సరం 22.73 కోట్ల మైనెస్ బాలెన్స్‌తో ముగుస్తుందని అంచనా. 1980–81 సంవత్సరానికి రెవెన్యూ మిగులు 97.27 కోట్లుంటుందని అంచనా వేశారు. ఇది 1979-80 లో 56.47 కోట్లు ఉంది. మొత్తంమీద 1980–31 సంవత్సరంలో 30.90 కోట్ల వరకు లోటు ఉంటుందని అంచనా.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు 1980–81 సంవత్సరపు బడ్జెట్‌నుపరిశీలిస్తే రాష్ట్ర ఆదాయ వ్యయాల స్వరూప స్వభావాలు స్పష్టంగా తెలుస్తాయి. కింది పట్టిక 1980_81 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ స్థూలరూపాన్ని తెలియజేస్తుంది.

(రూ. లక్షలలో)

| వివరాలు | అకౌంట్స్ 1978–79 | బడ్జెట్ అంచనా 1979–80 | సవరించిన అంచనా 1979–80 | బడ్జెట్ అంచనా 1980–81 |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| A ఓపెనింగ్ బాలెన్స్ | (–) 11,28.50 | (–) 41,22.50 | (–) 11,00.09 | (–) 22,73,09 |
| B రెవెన్యూ అకౌంట్ పై రెవిన్యూ వ్యయము | | | | |
| 1. రెవెన్యూ | 944,34.76 | 1000,83.50 | 1067,14.56 | 1092,87.89 |
| 2. వ్యయం | 827,21.75 | 893,64.31 | 1010,67.50 | 995,60.63 |
| మిగులు (+) లేదా తరుగుదల (–) | 117,13.01 | 107,19.19 | 56,47.06 | 97,27.26 |
| C రెవిన్యూ అకౌంట్‌కాక ఇతర లావా దేవీలు | | | | |
| 1. రిసీట్స్ | | | | |
| a. ఓపన్ మార్కెట్ లోన్స్ | 21,65.86 | 24,05.00 | 23,92.00 | 26,44.00 |
| b. ఫ్లోటింగ్‌డెట్ | 57,73.38 | 30,00.00 | 50,00.00 | 50,00.00 |
| c. భారత ప్రభుత్వం నుంచి అప్పులు | 209,13.54 | 165,60.96 | 183,75.23 | 163,73.73 |
| d. ఇతర అప్పులు | 6,16.23 | 5,81.04 | 9,55.15 | 6,75.25 |
| e. డిపాజిట్ లావాదేవీలు | 42,99.92 | 49,52.45 | 102,45.80 | 33,63.70 |

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| f. అప్పులు, అడ్వాన్స్‌లు | 20,41.74 | 15,60.09 | 20,32.22 | 21,93.21 |
| g. ఇంటర్ స్టేట్ సెటల్ మెంట్స్ | (–) 10.15 | .... | 63.89 | 63.89 |
| h. కంటంజెన్సీఫండ్ | 2,35.06 | .... | .... | .... |
| మొత్తం రిసీట్స్ | 360,35.88 | 290,59.54 | 390,64.29 | 303,13.78 |
| 2. పంపిణీ చేసినది | | | | |
| a. మూలధనపువ్యయం (నికరం) | 241,45.12 | 247,16.46 | 240,44.74 | 228,32.56 |
| b. i. పబ్లిక్ డెట్ చెల్లింపు | 7,91.32 | 11,01.24 | 11,01.25 | 12,10 13 |
| ii. ఫ్లోటింగ్ డెట్ | 57,73.68 | 30,00.00 | 50,00.00 | 50,00.00 |
| iii. భారత ప్రభుత్వం ఋణాలు | 58,99.70 | 53,82.88 | 54,38.03 | 55,61.73 |
| iv. ఇతర ఋణాలు | 3,35.73 | 3,35.88 | 4,66.66 | 4,58.71 |
| c. ఋణాలు, అడ్వాన్సులు | 107,74.93 | 86,02.59 | 98,33.68 | 77,67.86 |
| మొత్తం | 477,20.48 | 431,42.05 | 458,84.35 | 431,31.04 |
| 3. మిగులు (+) లేదా లోటు (–) – రెవెన్యూ పద్దుకాక | –116,84.60 | (–) 140,82.51 | (–) 68,20.06 | (–) 128,17.26 |
| ముగింపు బాలెన్స్ | (–) 11,00.09 | (–) 74,85.82 | (–) 22,73.09 | (–) 53,63.09 |

మూలం : ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ 1980–81

రాష్ట్ర ఆదాయం తీరును పరిశీలిస్తే రెవెన్యూ రెసీట్స్‌లో పన్నులు, సుంకాలవల్ల లభించే మొత్తాలు 66.93 శాతం పెరిగినట్లు తెలుస్తుంది. రాష్ట్ర పన్నులు—43.08 కు పెరుగుతాయని కేంద్రం పన్నుల వాటా 23.85 నుంచి 24.78 శాతం వరకు పెరుగుతుందని 1980 - 81 రాష్ట్ర బడ్జెట్టు వల్ల తెలుస్తుంది.

రాష్ట్ర వ్యయం తీరును పరిశీలిస్తే 1980 - 81 బడ్జెట్ అంచనాలు కింది విషయం స్పష్టంచేస్తాయి. రాష్ట్రం మొత్తం వ్యయంలో అభివృద్ధి కార్యక్రమాలకు గాను చేసేది కొంత పెరిగినా, చెప్పుకో దగ్గంతగా పెరగలేదు. అభివృద్ధి వ్యయం 71.25 నుంచి 71.60% మాత్రమే పెరుగుతుంది. అభివృద్ధేతర వ్యయంలో తగ్గుదల కనిపిస్తుంది. అది 28.75% నుంచి 28.40% తగ్గింది. 1973 74, 1980—81 సంవత్సరాలలో అభివృద్ధి వ్యయం 66.83% నుంచి 71.50% కి పెరిగినట్లు అభివృద్ధేతర వ్యయం 33.17% నుంచి 28.40% తగ్గినట్లు తెలుస్తుంది. దీనిని బట్టి రాష్ట్రంలో అభివృద్ధి కార్య క్రమాలపై దృష్టిని, వనరులను కేంద్రీక రిస్తున్నట్లు అర్థంచేసుకోవచ్చు. మొత్తం మీద 1980 - 81 సంవత్సరంలో అభివృద్ధి వ్యయం రూ. 706.70 కోట్లుగాను, అభివృద్ధేతర వ్యయం 280.33 కోట్లుగాను ఉండవచ్చునని అంచనా.

# 35

# ప్రభుత్వం - పరిపాలన

పరిపాలనా సౌలభ్యంకోసం దేశం కొన్ని రాష్ట్రాలుగా విభజింపబడింది. రాష్ట్రాలకు స్వయం పరిపాలనా స్వాతంత్ర్యం ఉన్నా అవి కేంద్ర ప్రభుత్వానికి లోబడి పనిచేస్తాయి. ప్రజలు ఎనుకొన్న ప్రతినిధులు రాష్ట్ర ప్రభుత్వంలో ఉంటారు. ఈ ప్రతినిధులు గల సంఘాలే శాసన సభలు. ఆంధ్రరాష్ట్రంలో ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగిన తరవాత 1959, జూన్ 31 వరకు ఒకే సభగల శాసనసభ ఉండేది. 1959, జూలై 1 నుంచి రెండు సభలుగల శాసనసభ అయింది. అప్పటినుంచి విధానసభ (అసెంబ్లీ), విధాన పరిషత్ (కౌన్సిల్) అని రెండు సభలు ఏర్పడ్డాయి. విధాన సభను దిగువసభ లేదా ప్రజాసభ అనికూడా వ్యవహరిస్తారు. అట్లాగే విధాన పరిషత్‌ను ఎగువసభ లేదా శాసనమండలి అని వ్యవహరిస్తారు.

**విధానసభ**

ఈ సభ కాలపరిమితి ఆరు సంవత్సరాలు. ఆంధ్రప్రదేశ్ శాసనసభలోని సభ్యులసంఖ్య 295. సభ్యులు ఎన్నుకొన్న సభాపతి (స్పీకర్), ఉపసభాపతి ఈ సభను నిర్వహిస్తారు. ముఖ్యమంత్రి సలహా ననుసరించి నిర్ణీత కాలానికి పూర్వమే గవర్నరు దీనిని రద్దుచేయవచ్చు. విధానసభ సభ్యులను ప్రజలెన్నుకొంటారు. ఇందులో 294 మంది వయోజన ఓటు హక్కు ప్రాతిపదికపై ఎన్నికయ్యే సభ్యులు. ఒకరు ఆంగ్లో ఇండియన్ల ప్రతినిధిగా గవర్నరు నియమించిన వారు ఉంటారు. వారికి కేటాయించిన నియోజక వర్గాలనుంచి కొందరు హరిజనులు, గిరిజనులు ఎన్నికవుతారు. ఎన్నికలలో పోటీచేసే వ్యక్తి భారతీయ పౌరుడై 25 సంవత్సరాలు తక్కువకాని వయస్సు, మంచి శరీర, మానసిక ఆరోగ్యాలు కలిగి ఉండాలి. లాభదాయిక మయిన ప్రభుత్వ ఉద్యోగంలో ఉండరాదు. శాసనసభ కాలపరిమితి ప్రారంభ సమావేశం నుంచి అయిదేళ్ళు విధానసభ ఒక సమావేశానికి, మరో సమావేశానికి మధ్యకాలం ఆరు నెలలు దాట రాదు. అట్లా కాకుంటే మళ్ళీ ఎన్నికలు జరపాల్సి వస్తుంది. విధానసభ సమావేశ తేదీలు, స్థలం, గవర్నరు నిర్ణయించి ఆజ్ఞలు జారీ చేస్తాడు. ఆయన సభను నిరవధికంగా వాయిదా వేయవచ్చు. అవసరమని భావిస్తే రద్దు చేయవచ్చు. సభ సమావేశ కాలంలో సభాపతి (స్పీకర్) ఎప్పటికప్పుడు సభను వాయిదా వేయవచ్చు.

సభ్యులు తమ స్థానాల్ని స్వీకరించేముందు రాజ్యాంగం 188 వ నిబంధన ప్రకారం నిర్దిష్ట రూపంలో ప్రమాణం చేస్తారు. మొదట ముఖ్యమంత్రి తరవాత మంత్రులు, రాజకీయ పక్షాల నాయకులు వరసగా తక్కిన సభ్యులు అక్షర క్రమంలో ప్రమాణ స్వీకారం చేస్తారు. గవర్నరు నియమించిన తాత్కాలిక అధ్యక్షుని ఆధ్వర్యంలో సభాపతి ఎన్నిక జరుగుతుంది

విధానసభ సభ్యులు రహస్య ఓటువేసి సభాపతిని ఎన్నుకొంటారు. ఉపసభాపతిని కూడా ఇదే పద్ధతిలో ఎన్నుకొంటారు.

శాసనసభ ప్రథమ సమావేశంలోనూ, ప్రతిఏటా జరిగే మొదటి సభలోనూ రాష్ట్ర గవర్నరు ఉభయ శాసనసభల సంయుక్త సమావేశంలో సభ్యుల నుద్దేశించి ప్రసంగిస్తారు.

విధానసభ సమావేశానికి సభాపతి (స్పీకర్) అధ్యక్షత వహిస్తాడు. సభా కార్యక్రమాలను ఆయన నిర్వర్తిస్తాడు. స్పీకర్‌గా ఎన్నుకోబడిన వ్యక్తి అధికార, అనధికార పక్షాలలో దేనికైనా చెంది ఉండవచ్చు. కాని సభాపతిగా ఎన్నికైన తరవాత తన పక్షానికి రాజీనామా చేయడం ఒక ఆచారం. సభాపతి పూర్తి స్వతంత్ర ప్రతిపత్తి పక్షపాతంలేని అధికారి. ఆయన సభ్యుని సభనుంచి బహిష్కరించవచ్చు. ఆయన చేసినవే తిరుగులేని తుది నిర్ణయాలు.

మొత్తం సభ్యుల సంఖ్యలో పదింట ఒకవంతు కనీసం హాజరయితే, సభలో కోరం పూర్తిఅయినట్లే కోరం పూర్తికానప్పుడు సభాపతి సభను వాయిదా వెయ్యాలి. ప్రతి సంవత్సరం శాసనసభ సమావేశ కాలం సుమారు రెండు నెలలు ఉంటుంది. ప్రజా సమస్యల పరిష్కారిని అనేక తీర్మానాలు శాసన సభలు చేస్తాయి.

## విధానపరిషత్

ఈ సభ శాశ్వత సభ. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విధాన పరిషత్ సభలో 90 మంది సభ్యులు ఉన్నారు. విధాన పరిషత్ సభ్యులలో మూడోవంతు సభ్యులను విధానసభ సభ్యులెన్నుకొంటాము. స్థానిక సంస్థలు మూడోవంతు సభ్యులను, ఉపాధ్యాయులు 12 వ వంతుసభ్యులను పట్టభద్రులు 12 వ. వంతు సభ్యులను ఎన్నుకొంటారు. 6 వ వంతు సభ్యులను గవర్నరు నామనిర్దేశం చేస్తారు.

విధానపరిషత్ సభలో ఎన్నికకాగోరే వ్యక్తి 30 సంవత్సరాల వయస్సు కలవాడై ఉండాలి. తక్కిన అర్హతలన్నీ విధానసభకు ఎన్నిక కాగోరే వ్యక్తికి ఉండవలసినటువంటివే. విధాన పరిషత్తులో మూడో వంతు సభ్యులు ప్రతి రెండు సంవత్సరాలకు పదవీ విరమణ చేయాలి. విధానసభలాగా విధానపరిషత్తుకు విశేషాధికారాలు లేవు.

*ముఖ్యమంత్రి :* గవర్నరు ముఖ్యమంత్రిని నియమిస్తాడు. ముఖ్యమంత్రి సలహాప్రకారం ఇతర మంత్రులను నియమిస్తాడు. పరిపాలన గవర్నరు పేరుమీద జరిగినా, కీలక పాత్ర వహించేది ముఖ్యమంత్రి మాత్రమే. శాసనసభలో అధిక సంఖ్యాకుల విశ్వాసం కోల్పోయినప్పుడు ముఖ్యమంత్రిని పదవి నుంచి తొలగించవచ్చు. ఒకవేళ ముఖ్యమంత్రిగా ఎన్నుకొనబడిన వ్యక్తి శాసనసభ సభ్యుడు కాకపోయినట్లయితే, ఆ వ్యక్తి 6 నెలల లోగా శాసనసభకు ఎన్నిక కావాలి. అట్లా కాకపోతే అతనిని పదవినుంచి తొలగించవచ్చు.

*గవర్నరు :* రాష్ట్ర గవర్నరును రాష్ట్రపతి నియమిస్తారు. ఈయన నివాసాన్ని 'రాజభవన్' అంటారు. ఈయన జీతము రూ. 5,500. ఇదికాక ప్రయాణపు ఖర్చులు, ఉచిత వసతి మొదలయిన సౌకర్యాలు ఉంటాయి. అయిదు సంవత్సరాల కాలపరిమితి మించకుండా రాష్ట్రపతి విశ్వాసానికి పాత్రుడైనంత కాలం గవర్నరు పదవిలో ఉండవచ్చు.

భారతదేశపు పౌరుడుకాని వ్యక్తి, 24 సంవత్సరాలకు లోపుఉన్న వ్యక్తి గవర్నరుగా నియమితుడు కావడానికి అర్హుడు కాడు. సాధారణంగా ఒక రాష్ట్రానికి చెందిన వ్యక్తి అదే రాష్ట్రానికి గవర్నరుగా నియమితుడు కాడు. గవర్నరు పార్లమెంటు సభలోకాని, రాష్ట్ర శాసన సభలోకాని సభ్యుడిగా ఉండరాదు.

రాష్ట్ర పరిపాలనాధికారం అంతా గవర్నరు చేతిలోకాని, గవర్నరుకు లోబడి పనిచేసే అధికారుల చేతిలోకాని ఉంటుంది. రాష్ట్ర శాసన సభలు చట్టాలు చేసే అన్ని అంశాల విషయాలలో గవర్నరును కార్య నిర్వహణాధికారం ఉంది. ముఖ్యమంత్రిని, ముఖ్యమంత్రి సలహాపై ఇతర మంత్రులను గవర్నరు నియమిస్తాడు. అడ్వకేట్ జనరల్ ను గవర్నరు నియమిస్తాడు రాష్ట్ర పతిలాగా గవర్నరుకు క్షమించే అధికారం ఉంది.

శాసన రంగంలో గవర్నరు అధికారాలు గణనీయమైనవి. రాష్ట్ర శాసన సంస్థలలో ఆయన ఒక భాగం. శాసనసభలను సమావేశ పరచడం, శాసన సభలలో ప్రసంగించడం, సభను నిరవధికంగా వాయిదా వేయటం, రద్దు చేయటం గవర్నరు అధికారాలే. శాసన సభ చేసే ప్రతి బిల్లు గవర్నరు ఆమోదం పొందిన తరవాతే చట్టం అవుతుంది. తన సలహాలతో, సవరణలతో బిల్లును తిరిగి పంపవచ్చు. రాజ్యాంగ పరమయిన సమస్యలు ఉత్పన్నమవుతాయని భావించినప్పుడు రాష్ట్రపతి పరిశీలనకు పంపడానికి అటువంటి బిల్లులను ఆపవచ్చు. ద్రవ్య సంబంధ బిల్లులను అట్టిపెట్టుకుని తిరిగి పంపే అధికారం గవర్నరుకు లేదు. శాసనసభ సమావేశంలో లేనప్పుడు గవర్నరు ఆర్థిక ఆర్డినెన్సులు జారీ చేయవచ్చు. అత్యవసర పరిస్థితిలో నిజమయిన కార్యనిర్వహణాధికారి గవర్నరు మాత్రమే. రాష్ట్రపతి ప్రతినిధిగా రాష్ట్ర ప్రభుత్వ పాలనా యంత్రాంగానికి గవర్నరే స్వయంగా సారధ్యం వహిస్తాడు. తన స్వయం నిర్ణయాలతో వ్యవహరించవలసి వచ్చినప్పుడు తప్ప, తక్కిన అన్ని సందర్భాలలోనూ గవర్నరు ముఖ్యమంత్రి, మంత్రివర్గ సభ్యుల సలహా సంప్రదింపులతో తన పదవీ బాధ్యతలు నిర్వహిస్తాడు. పేరుకు మాత్రమే కార్య నిర్వహణ అధిపతి. నిజానికి అధికారం ముఖ్యమంత్రి మంత్రిమండలి చేతులలో ఉంటుంది. రాష్ట్రపతి ప్రతినిధిగా, రాష్ట్ర వ్యవహారాలలో రాష్ట్రపతి సలహాదారునిగా, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య వారధిగా గవర్నరు వ్యవహరించవలసి ఉంటుంది.

## ఆంధ్రప్రదేశ్ సచివాలయం

సచివాయలం ప్రధానాధికారి ప్రధాన కార్యదర్శి లేదా చీఫ్ సెక్రటరీ. వీరికి రాష్ట్ర పరిపాలనలో ప్రముఖ పాత్ర ఉంది. చాలా కాలం కార్య నిర్వాహక అనుభవం గల సీనియర్ ఐ. ఏ. ఎస్. అధికారి అయి ఉండాలి. ఆంధ్రప్రదేశ్‌లో ఆచార పూర్వకంగా రెవెన్యూబోర్డ్ సీనియర్ మెంబరు ప్రధాన కార్యదర్శిగా నియమితుడవుతాడు. ఈయన రాష్ట్ర సివిల్ సర్వీస్‌కు ఉన్నత అధికారి.

ప్రధాన కార్యదర్శి మంత్రి మండలికి కార్యదర్శిగా వ్యవహరిస్తాడు. కేంద్రంలో లాగ మంత్రిమండలి కార్యదర్శి ప్రత్యేకంగా ఉండడు. ఇతడు మంత్రి మండలి సమావేశాలలో

పాల్గొని, మంత్రులు చేసిన నిర్ణయాలను రికార్డు చేస్తాడు. ప్రధాన కార్యదర్శి రాష్ట్ర ప్రభుత్వానికి ప్రధాన సలహాదారుడుగా కూడా వ్యవహరిస్తాడు. సచివాలయంలోని మొత్తం కార్యక్రమాలు ఆయనే నిర్వహిస్తాడు. మొత్తం డిపార్టుమెంటుల బాధ్యత వహించేది సచివాలయ ప్రధాన కార్యదర్శి. చీఫ్ సెక్రటరీ రాష్ట్ర అభివృద్ధి కమీషనర్‌గా కూడా వ్యవహరిస్తాడు. అవినీతి నిరోధక శాఖ ఈయన ఆధ్వర్యంలోనే పనిచేస్తుంది. ప్రధాన కార్యదర్శి రిటైరైన తరవాత అయనను రాజ్యసభ సభ్యునిగా తీసుకోవాలని రాష్ట్ర ప్రభుత్వానికి సలహా ఇవ్వబడింది. ఆ సలహాను రాష్ట్రప్రభుత్వం ఆమోదించి లోక్‌సభకు టికెట్ ఇచ్చింది. కొన్ని సందర్భాలలో ఈయన యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్‌గా కూడా నియమితుడు కావచ్చు.

సచివాలయం కార్యదర్శి, ఆయన సిబ్బంది కలిసి సెక్రటేరియట్‌గా వ్యవహరింపబడతారు. తమవిధానాలను నిర్ణయించి రూపొందించడంలో మంత్రులకు సచివాలయ సహాయపడుతుంది, సలహా ఇస్తుంది. సచివాలయ అధీనంలోని కార్యాలయాలను నడపడం, అవిచేసే వ్యయంపైన నిఘా ఉంచడం, కార్య నిర్వాహకుల పనికి విలువ కట్టడం, తమ శాఖామాత్యులకు శాసనసభా కార్యక్రమాలతో సహాయ పడటం, శాసనసభలు పరిపాలనా విధానాలను నిర్ణయించేటట్లు చూడటం, వాటిని సక్రమంగా అమలుపరిచేటట్లు చేయడం సచివాలయంవిధులు.

పరిపాలన విభాగానికి అధిపతి కార్యదర్శి లేదా సెక్రటరీ. ఈయనకు సంయుక్త కార్యదర్శులు, సహాయ కార్యదర్శులు ముఖ్య విషయాలపైన సలహాలనిచ్చి సహాయ పడతారు. వీరి కింద డిప్యూటీ కార్యదర్శులు, సహాయ కార్యదర్శులు సెక్షన్ ఆఫీసర్లు ఉండారు.

*విధులు :* రాష్ట్ర రాజనీతి కార్యక్రమాలు నిర్వహించడానికి ఎప్పటికప్పుడు మంత్రులకు లెక్కలు, మూలసిద్ధాంతాలకు సంబంధించిన యథార్థవిషయాలు స్వీకరించి, వివరణలివ్వడంలో సహాయపడటం, ఖర్చు అయ్యే ప్రతి అంశానికి బడ్జెట్ ఆమోదం తీసుకోవడం, ఆమోదించిన అంచనాకు మించకుండ ఖర్చుచేయడం, సచివాలయం ముఖ్య బాధ్యతలు. ప్రతి డిపార్టుమెంటునకు సూక్ష్మంగా పరిశీలిస్తూ, శాసనసభలో ప్రతిపాదనలన్నీ పరీక్షించి, రాష్ట్రపరిపాలనా యంత్రాంగానికి ముఖ్యకేంద్రంగా సచివాలయం వ్యవహరిస్తుంది. ప్రతి అంశానికి అయిన ఖర్చు బడ్జెట్ అంచనాలను మించకుండా ఉండేటట్టు చూడడం కార్యదర్శి బాధ్యత.

***స్వరూపం :*** సచివాలయంలో అనేక డిపార్టుమెంటులు, విభాగాలు ఉంటాయి. ప్రతి ఒక్కటీ ఒక కార్యదర్శి అధీనంలో ఉంటుంది. కార్యదర్శికి సహాయపడటానికి అదనపు కార్యదర్శులు, సంయుక్త కార్యదర్శులు, డిప్యూటీ సహాయ కార్యదర్శులు ఉంటారు. డిపార్టుమెంటు లన్నిటి కార్యకలాపాలకు కార్యదర్శి బాధ్యత వహిస్తాడు. సచివాలయం ప్రధానాధికారి ప్రధానకార్యదర్శి సచివాలయానికి సంబంధించిన కార్యక్రమాలన్నింటినీ ఆయనే నిర్వహిస్తాడు.

*ప్రధాన కార్యదర్శి విధులు :* 1. సచివాలయ కార్యక్రమాలను క్రమబద్ధంగానడపడం.
2. సచివాలయంలో అన్ని విభాగాలనూ పర్యవేక్షించడం 3. మంత్రులవద్ద పనిచేసే అధికారులపై ఆధిపత్యం, పర్యవేక్షణ, చేయడం 4. మంత్రివర్గ సమావేశాలు ఏర్పరిచి, వాటికి తాను హాజరు కావడం.

సచివాలయం (సెక్రటేరియట్) లోని విభాగాలు :

1. సాధారణ పరిపాలన విభాగం, 2. ఆంతరంగిక శాఖ (హోం డిపార్టుమెంటు) 3. ఆహారం, వ్యవసాయం, 4. ఆడవులు గ్రామీణాభివృద్ధి, 5. రెవెన్యూశాఖ, 6. పరిశ్రమలు, వాణిజ్య శాఖ, 7. రవాణా రోడ్లు, భవనాల శాఖ, 8. నీటిపారుదల (ఇరిగేషన్), విద్యుచ్ఛక్తి 9. ఆర్థిక ప్రణాళికల శాఖ, 10. విద్యాశాఖ, 11. ఉద్యోగాలు, సాంఘికసంక్షేమం 12. గృహ నిర్మాణం, ఆరోగ్యం, మునిసిపాలిటీల నిర్వహణ, 13. నీటిపారుదల ప్రాంతఅభివృద్ధి (మేజర్ నీటిపారుదల ప్రాజెక్టులు), మైనర్ నీటిపారుదల ప్రాంతాభివృద్ధి, 14. న్యాయశాఖ.

ఒక్కొక్క శాఖ తనకు నిర్ణయించిన విధులను నెరవేరుస్తుంది. ఆ శాఖకు సంబంధించిన డైరెక్టరేట్‌లను, తదితర కార్యాలయాలను నడుపుతుంది. ప్రతి డిపార్టుమెంటు వివిధ శాఖలుగా విభజించపడి ఉంటుంది.

*ప్రతి డిపార్టుమెంటు నిర్వహించే విధులు*

కాబినెట్ మంత్రి (రాజకీయాధిపతి)



## గవర్నరులు :

| | | |
|---|---|---|
| శ్రీ సి. ఎమ్. త్రివేది | .... | 1-11-1956 నుంచి 31-7-1957 వరకు |
| శ్రీ భీమ్‌సేన్ సచార్ | .... | 1-8-1957 నుంచి 6-9-1962 వరకు |
| శ్రీ జనరల్ ఎస్. ఎమ్. శ్రీనగేష్ | .... | 7-9-1962 నుంచి 3-4-1964 వరకు |
| శ్రీ పట్టంథాను పిళ్ళై | .... | 4-4-1964 నుంచి 10-4-1968 వరకు |
| శ్రీ ఖండూభాయ్ దేశాయ్ | .... | 11-4-1968 నుంచి 24-1-1975 వరకు |
| శ్రీ ఎస్. ఓబులరెడ్డి (ఆక్టింగ్) | .... | 25-1-1975 నుంచి 1-1-1976 వరకు |
| శ్రీ మోహలాల్ సుఖాడియా | .... | 1-1-1977 నుంచి 15-6-1976 వరకు |
| శ్రీ ఆర్. డి. భండారె | .... | 16-6-1976 నుంచి 16-2-1977 వరకు |
| శ్రీ బి. జె. దివాన్ (ఆక్టింగ్) | ... | 16 2-1977 నుంచి 4-5-1977 వరకు |
| శ్రీమతి శారదముఖర్జి | | 5-5-1977 నుంచి 13-8-1978 వరకు |
| శ్రీ కె. సి. అబ్రహాం | | 14-8-1978 |

## ముఖ్యమంత్రులు :

| | |
|---|---|
| శ్రీ నీలం సంజీవరెడ్డి | 1.11.1956 నుంచి 10.1.1960 వరకు |
| శ్రీ దామోదరం సంజీవయ్య | 10.1.1960 నుంచి 11.3.1962 వరకు |
| శ్రీ నీలం సంజీవరెడ్డి | 12.3.1962 నుంచి 28.2.1964 వరకు |
| శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి | 29.2.1964 నుంచి 24.9.1971 వరకు |
| శ్రీ పి. వి. నరసింహారావు | 25.9.1971 నుంచి 18.1.1973 వరకు |
| రాష్ట్రపతి పాలన | 18.1.1973 నుంచి 9.12.1973 వరకు |
| శ్రీ జలగం వెంగళరావు | 10.12.1973 నుంచి 5.3.1978 వరకు |
| శ్రీ మర్రి చెన్నారెడ్డి | 6.3.1978 నుంచి 10.10.1980 వరకు |
| శ్రీ టంగుటూరి అంజయ్య | 11.10.1980 |

## శాసనసభల అధ్యక్షులు

ఆంధ్రప్రదేశ్ స్పీకర్లు :

1. ఎ. కాళేశ్వరరావు
2. శ్రీ బి. వి. సుబ్బారెడ్డి
3. శ్రీ కె. వి. వేమారెడ్డి
4. శ్రీ పి. రంగారెడ్డి
5. శ్రీ ఆర్.దశరథరామరెడ్డి
6. శ్రీ దివి కొండయ్యచౌదరి
7. శ్రీ సి.హెచ్.ఎన్.ఆర్.సి.హెచ్.వి.పి.మూర్తిరాజు (ఆక్టింగ్)

డిప్యూటీ స్పీకర్లు :
1. శ్రీ కొండా లక్ష్మణబాపూజీ
2. శ్రీమతి టి. ఎన్. సదాలక్ష్మి
3. శ్రీ వాసుదేవ్ నాయక్
4. శ్రీ పి. జగన్నాథరావు
5. శ్రీ రహమత్ అలీ
6. శ్రీ ప్రభాకర్ రెడ్డి

### విధానపరిషత్ అధ్యక్షులు

ఛైర్మన్లు :
1. శ్రీ మాడపాటి హనుమంతరావు
2. శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య
3. శ్రీ పి. రంగారెడ్డి
4. శ్రీ తోట రామస్వామి
5. శ్రీ ఎన్. వెంకట సుబ్బయ్య
6. శ్రీ సయద్ ముఖసిర్ షా
7. శ్రీ కె. కేశవ్ (ఆక్టింగ్)

డిప్యూటీ ఛైర్మన్లు :
1. శ్రీ జి. ఎస్. రాజు
2. శ్రీ ఎమ్. ఆనందమ్
3. శ్రీ ఎర్రం సత్యనారాయణ
4. శ్రీ సయద్ ముఖసిర్ షా

### ఆంధ్రప్రదేశ్ ఒకటో మంత్రి మండలి

| | | |
|---|---|---|
| 1. శ్రీ ఎన్. సంజీవరెడ్డి | .... | ముఖ్యమంత్రి |
| 2. శ్రీ కె. వి. రంగారెడ్డి | .... | హోం |
| 3. శ్రీ బి. గోపాలరెడ్డి | .... | ఆర్థిక |
| 4. శ్రీ కళా వెంకటరావు | ... | రెవెన్యూ |
| 5. జె. వి. నరసింగరావు | .... | నీటిపారుదల, విద్యుచ్ఛక్తి |
| 6. డి. సంజీవయ్య | .... | కార్మిక, సాంఘిక సంక్షేమం |
| 7. వి. బి. రాజు | .... | ప్రణాళిక, అభివృద్ధి |
| 8. పి. తిమ్మారెడ్డి | .... | ఆహారం, వ్యవసాయం |
| 9. ఎస్.బి.పి. పట్టాభిరామారావు | .... | విద్య |
| 10. మెహిదీ నవాజ్ జంగ్ | .... | సహకారం, గృహనిర్మాణం |
| 11. గ్రంధి వెంకటరెడ్డి నాయుడు | .... | న్యాయశాఖ |
| 12. కె. బ్రహ్మానందరెడ్డి | .... | స్థానిక పాలన |
| 13. మందుముల నరసింగరావు | .... | రోడ్లు, భవనాలు |

## ఆంధ్రప్రదేశ్ రెండో మంత్రి మండలి (1957)

1. శ్రీ ఎన్. సంజీవరెడ్డి .... ముఖ్యమంత్రి
2. శ్రీ కె. వి. రంగారెడ్డి .... హోం
3. శ్రీ బి. గోపాలరెడ్డి .... ఆర్థిక
4. శ్రీ కళా వెంటరావు ... రెవెన్యూ
5. శ్రీ జె. వి. నరసింగరావు .... నీటిపారుదల, విద్యుచ్ఛక్తి
6. శ్రీ డి. సంజీవయ్య .... కార్మిక, సాంఘిక సంక్షేమం
7. శ్రీ వి. బి. రాజు .... ప్రణాళిక, అభివృద్ధి
8. శ్రీ పి. తిమ్మారెడ్డి .... ఆహారం, వ్యవసాయం
9. శ్రీ ఎస్.బి.పి. పట్టాభిరామారావు.... విద్య
10. శ్రీ మెహిదీ నవాజ్ జంగ్ .... సహకారం, గృహనిర్మాణం
11. శ్రీ జి. వెంకటరెడ్డినాయుడు .... న్యాయశాఖ
12. శ్రీ కె. బ్రహ్మనందరెడ్డి .... స్థానిక పాలన
13. శ్రీ ఎమ్. నరసింగరావు .... రోడ్లు, భవనాలు
14. శ్రీ అనగాని భగవంతరావు .... దేవాదాయశాఖ

## ఆంధ్రప్రదేశ్ మూడో మంత్రిమండలి (1960–62)

1. శ్రీ డి. సంజీవయ్య ... ముఖ్యమంత్రి
2. శ్రీ కె. వి. రంగారెడ్డి .... ఉపముఖ్యమంత్రి
3. శ్రీఅల్లూరిసత్యనారాయణరాజు .... నీటిపారుదల
4. శ్రీఎస్.బి.పి.పట్టాభిరామారావు .... విద్య
5. శ్రీ పి. రంగారెడ్డి .... సమాచార, ప్రణాళిక, అభివృద్ధి
6. శ్రీ కల్లూరి చంద్రమౌళి .... దేవాదాయశాఖ
7. శ్రీ కె. బ్రహ్మనందరెడ్డి .... ఆర్థికశాఖ
8. శ్రీ ఎమ్. నరసింగరావు .... హోం
9. శ్రీ పి. వి. జి. రాజు .... ఆరోగ్యశాఖ
10. శ్రీమతి మాసుమాబేగం .... స్త్రీల సంక్షేమం
11. శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి .... కార్మిక శాఖ
12. శ్రీ కొండా లక్ష్మణ బాపూజీ ....చిన్నతరహాపరిశ్రమలు, హాండ్లూమ్స్
13. శ్రీ పల్లమరాజు .... అడవులు, పశుసంవర్థక శాఖలు
14. శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి ....

(రెండు నెలల తరవాత పదవీ విరమణ చేయడం జరిగింది)

## ఆంధ్రప్రదేశ్ నాలుగో మంత్రిమండలి (1962-64)

1. శ్రీ ఎన్. సంజీవ రెడ్డి .... ముఖ్యమంత్రి
2. శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి .... రెవెన్యూ
3. శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ... ఆర్థిక శాఖ
4. శ్రీ ఎమ్. పల్లమరాజు .... మత్స్య శాఖ
5. శ్రీ ఎమ్. చెన్నారెడ్డి .... ప్రణాళిక, పంచాయతీరాజ్
6. శ్రీ పి.వి.జి. రాజు .... విద్య
7. శ్రీ ఎ.సి. సుబ్బారెడ్డి .... నీటి పారుదల, విద్యుచ్ఛక్తి
8. శ్రీ మీర్. అహమ్మద్ ఆలీ ఖాన్ .... రహదారులు, భవనాలు
9. శ్రీ వై. శివరామ ప్రసాద్ .... ఆరోగ్యశాఖ
10. శ్రీ ఎమ్. ఎన్. లక్ష్మీనరసయ్య .... పరిశ్రమలు

మినిస్టర్స్ ఆఫ్ స్టేట్

11. శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు .... ఎక్సైజ్
12. శ్రీ పి.వి. నరసింహారావు .... న్యాయ, సమాచార శాఖలు
13. శ్రీ ఆలపాటి వెంకట్రామయ్య .... స్థానిక పాలన
14. శ్రీమతి టి. ఎన్. సదాలక్ష్మి .... దేవాదాయశాఖ
15. శ్రీ ఎ. బలరామరెడ్డి .... ఆహారం, వ్యవసాయం
16. శ్రీ బి.వి. గురుమూర్తి .... కార్మిక, రవాణా శాఖలు

## ఆంధ్రప్రదేశ్ ఐదో మంత్రిమండలి (1964-67)

1. శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి .... ముఖ్యమంత్రి
2. శ్రీ ఎన్. రామచంద్రా రెడ్డి .... రెవెన్యూ
3. శ్రీ ఎమ్. చెన్నారెడ్డి .... ఆర్థిక, ప్రణాళిక శాఖలు
4. శ్రీ పి. వి. జి. రాజు .... విద్య
5. శ్రీ ఎ.సి. సుబ్బారెడ్డి .... నీటి పారుదల విద్యుచ్ఛక్తి
6. శ్రీ మీర్ అహమద్ ఆలీ ఖాన్ .... హోం
7. శ్రీ వై. శివరాం ప్రసాద్ .... ఆరోగ్యశాఖ
8. శ్రీ ఎమ్. ఎన్. లక్ష్మీనరసయ్య .... పంచాయతీ రాజ్
9. శ్రీ తోట రామస్వామి .... సహకారశాఖ

మినిస్టర్స్ ఆఫ్ స్టేట్

10. శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు .... ఎక్సైజ్
11. శ్రీ పి.వి. నరసింహారావు .... న్యాయశాఖ
12. శ్రీ ఆలపాటి వెంకటరామయ్య .... స్థానిక పాలన

13. శ్రీమతి టి. ఎన్. సదాలక్ష్మి .... దేవాదాయ శాఖ

14. శ్రీ ఎ. బలరాం రెడ్డి .... ఆహారం, వ్యవసాయం

15. శ్రీ బి. వి. గురు మూర్తి .... కార్మిక, సమాచార, రవాణా శాఖలు

22.8.1966 న శ్రీ. టి. వీర రాఘవులు, శ్రీ.ఎన్.చెంచురామానాయుడు మంత్రులుగా నియమితులైనారు.

## ఆంధ్రప్రదేశ్ ఆరో మంత్రిమండలి (1967)

1. శ్రీ కె. బ్రహ్మానంద రెడ్డి .... ముఖ్యమంత్రి
2. శ్రీ ఎమ్. చెన్నారెడ్డి .... ఆర్థికశాఖ
3. శ్రీ పి. తిమ్మారెడ్డి .... వ్యవసాయం
4. శ్రీ వి. బి. రాజు .... రెవెన్యూ, పౌరసంబంధాల శాఖలు
5. శ్రీ. తోట రామస్వామి .... పంచాయతీ రాజ్
6. శ్రీ. జె. వి. నరసింగరావు .... పబ్లిక్ వర్క్స్
7. శ్రీ టి.వి. రాఘవులు .... విద్య
8. శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ .... కార్మిక, సమాచార శాఖలు

### మినిస్టర్స్ ఆఫ్ స్టేట్

9. శ్రీ పి. వి. నరసింహారావు .... న్యాయ, దేవాదాయ శాఖలు
10. శ్రీ బి.వి. గురుమూర్తి .... పరిశ్రమలు
11. శ్రీ ఎన్. చెంచురామా నాయుడు .... స్థానిక పాలన, గృహ నిర్మాణం
12. శ్రీ కె. విజయ భాస్కరరెడ్డి .... సహకారం
13. శ్రీ ఆర్. రామలింగా రెడ్డి .... సాంఘిక సంక్షేమం
14. శ్రీ ఎస్. సిద్దారెడ్డి .... నీటి పారుదల

డా. ఎమ్. చెన్నారెడ్డి కేంద్ర మంత్రిమండలిలో ఉక్కుపరిశ్రమ శాఖామాత్యులుగా నియమింపబడిన కారణాన ఆయన తన మంత్రిపదవికి 13-3-1967 తేదీన రాజీనామా చేశారు

ఐదుగురు కొత్త మంత్రులు నియమించ బడ్డారు

1. శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి .... హోం (20-9-1967 న మరణించారు)
2. శ్రీ కె. వి. నారాయణ రెడ్డి .... ప్రణాళిక
3. శ్రీ మహమద్ ఇబ్రహీం ఆలీ అన్సారీ .... కారాగారాలు, వక్ఫ్స్
4. శ్రీ అరిగె రామస్వామి .... సాంఘిక సంక్షేమం
5. శ్రీ వెనిగెళ్ళ సత్యనారాయణ రావు .... ఎక్సైజ్

## ఆంధ్రప్రదేశ్ ఏడో మంత్రిమండలి (జులై 1967 నుంచి 30-9-1971)

1. శ్రీ కె. బ్రహ్మానంద రెడ్డి .... ముఖ్యమంత్రి
2. శ్రీ జె. వి. నరసింగరావు .... ఉప ముఖ్యమంత్రి
3. శ్రీ పి. తిమ్మా రెడ్డి .... రెవెన్యూ
4. శ్రీ తోట రామస్వామి .... పంచాయతీరాజ్
5. శ్రీ పి. వి. నరసింహారావు .... విద్య
6. శ్రీ కాకాని వెంకటరత్నం .... ఆహారం, వ్యవసాయం
7. శ్రీ ఎమ్.ఎన్.లక్ష్మినరసయ్య .... రవాణా
8. శ్రీ ఎన్.చెంచురామానాయుడు .... స్థానిక పాలన
9. శ్రీ కె. విజయభాస్కర రెడ్డి .... ఆర్థికశాఖ
10. శ్రీ ఆర్. రామలింగరాజు .... దేవాదాయశాఖ
11. శ్రీ ఎస్. సిద్దారెడ్డి ....నీటిపారుదల,డ్రైనేజి,వరదనివారణ
12. శ్రీ మ॥ ఇబ్రహిం ఆలీ అన్సారీ.... ఆరోగ్యశాఖ
13. శ్రీ జె. వెంగళ రావు .... హోం
14. శ్రీ ఎ. భగవంతరావు .... హాండ్లూమ్స్, సుగర్‌ఫాక్టరీలు
15. శ్రీ వి. కృష్ణమూర్తినాయుడు .... విద్యుచ్ఛక్తి
16. శ్రీ జి. సంజీవరెడ్డి .... కార్మికశాఖ
17. శ్రీ డి. పెరుమాళ్ళు .... స్త్రీల, సాంఘిక సంక్షేమం

మినిస్టర్స్ ఆఫ్ స్టేట్

18. శ్రీ సాగిసూర్యనారాయణరాజు.... అడవులు
19. శ్రీ ఎ. వాసుదేవరావు .... సమాచారశాఖ
20. శ్రీ ఆనం సంజీవ రెడ్డి .... పౌర సంబంధాలు
21. శ్రీ రామచంద్రరావు కళ్యాణి .... మార్కెటింగ్ శాఖ
22. శ్రీ ఆర్. నారప రెడ్డి .... మధ్యతరహా నీటి పారుదల
23. శ్రీ జి. సి. వెంకన్న .... చిన్నతరహా పరిశ్రమలు
24. శ్రీమతి రోడా మిస్త్రీ .... టూరిజమ్
25. శ్రీ వి. పురుషోత్తమ రెడ్డి .... మైనర్ ఇరిగేషన్
26. శ్రీ సి. రాజనరసింహ .... గృహనిర్మాణం
27. శ్రీ పి. అంకినీడుప్రసాదరావు .... వాణిజ్యం
28. శ్రీఎస్.ఆర్.ఎ.ఎస్.అప్పలనాయుడు.. రేవులు, ఫిషరీస్

## ఆంధ్రప్రదేశ్ ఎనిమిదో మంత్రిమండలి (అక్టోబరు 1971)

సర్వశ్రీ

1. ,, పి. వి. నరసింహారావు .... ముఖ్యమంత్రి
2. ,, బి. వి. సుబ్బారెడ్డి .... ఉప ముఖ్యమంత్రి
3. ,, తోట రామస్వామి .... పంచాయతీరాజ్
4. ,, కాకాని వెంకటరత్నం .... వ్యవసాయం
5. ,, కె. అచ్యుతరెడ్డి ... రెవెన్యూ
6. ,, ఎన్. చెంచురామానాయుడు .... హోంశ్లూమ్స్
7. ,, జె. చొక్కారావు .... పరిశ్రమలు
8. ,, ఎస్. సిద్ధారెడ్డి .... నీటి పారుదల శాఖ
9. ,, ఇబ్రహిం ఆలీ అన్సారి .... ఆరోగ్యశాఖ
10. ,, రామలింగరాజు .... దేవాదాయశాఖ
11. ,, ఎ. భగవంతరావు ... ఆర్థికశాఖ
12. ,, వి. కృష్ణమూర్తి నాయుడు ... విద్యుచ్ఛక్తి
13. ,, ఎమ్. మాణిక్‌రావు ... స్థానికపాలన
14. ,, బత్తిన సుబ్బారావు ... సహకారశాఖ
15. ,, సి.హెచ్.ఎన్.ఆర్.సి.హెచ్.వి. పి. మూర్తిరాజు .... మార్కెటింగ్
16. ,, పి. బాసిరెడ్డి .... మీడియంఇరిగేషన్

మినిస్టర్స్ ఆఫ్ స్టేట్

17. ,, ఎ. వాసుదేవరావు .... సమాచారశాఖ
18. ,, సి. రాజనరసింహ .... గృహనిర్మాణం
19. ,, చల్లా సుబ్బారాయుడు .... పౌరసంబంధాలు
20. ,, పి. మహేంద్రనాథ్ .... అడవులు
21. ,, కె. గోపాలనాయుడు .... రవాణా
22. ,, కె. భీమరావు .... గిరిజన సంక్షేమం
23. ,, సి. హెచ్. దేవానందరావు .... టూరిజమ్
24. ,, ఎ. మదనమోహన్ .... సాంకేతిక విద్య
25. శ్రీమతి పద్మాభాస్కరరెడ్డి .... స్త్రీల సంక్షేమం

(శ్రీ కె. అచ్యుతరెడ్డి 21—3—1972 న మరణించారు).

## ఆంధ్రప్రదేశ్ తొమ్మిదో మంత్రిమండలి (1972)

1. శ్రీ పి. వి. నరసింహారావు .... ముఖ్యమంత్రి
2. శ్రీ బి. వి. సుబ్బారెడ్డి .... ఉపముఖ్యమంత్రి
3. శ్రీ కాకాని వెంకటరత్నం .... వ్యవసాయం
4. శ్రీ టి. హయగ్రీవాచారి .... పంచాయతీరాజ్
5. శ్రీ మహమద్ ఇబ్రహిం అలీ అన్సారీ .... ఆరోగ్యశాఖ
6. శ్రీ జె. వెంగళరావు .... పరిశ్రమలు
7. శ్రీ ఎ. భగవంతరావు .... ఆర్థికశాఖ
8. శ్రీ వి. కృష్ణమూర్తినాయుడు .... నీటిపారుదల
9. శ్రీ ఎమ్. మాణిక్‌రావు .... స్థానిక పాలన
10. శ్రీ బి. సుబ్బారావు .... సహకారశాఖ
11. శ్రీ మూర్తిరాజు .... దేవాదాయశాఖ
12. శ్రీ పి. బాసిరెడ్డి .... మీడియం ఇరిగేషన్
13. శ్రీ సాగి సూర్యనారాయణరాజు.... అడవులు
14. శ్రీ ఎల్. లక్ష్మణదాస్ .... గృహనిర్మాణం
15. శ్రీ పి. నర్సారెడ్డి .... రెవిన్యూ
16. శ్రీ టి. అంజయ్య .... కార్మికశాఖ
17. శ్రీ ఎమ్. వి. కృష్ణారావు .... సాంఘిక సంక్షేమం
18. శ్రీమతి బి. జయప్రద .... విద్యుచ్ఛక్తి
19. శ్రీ కె. ప్రభాకరరెడ్డి .... రవాణాశాఖ

మినిస్టర్స్ ఆఫ్ స్టేట్

20. శ్రీ చల్లాసుబ్బారాయుడు .... పౌరసంబంధాలు
21. శ్రీ జి. రాజారాం .... హేండ్లూమ్స్
22. శ్రీ పి. మహేంద్రనాథ్ .... ఎక్సైజ్
23. శ్రీ కె. గోపాలనాయుడు .... మైనర్ ఇరిగేషన్
24. శ్రీ భాట్టం శ్రీరామమూర్తి .... విద్య
25. శ్రీ కె. భీమరావు .... గిరిజన సంక్షేమం
26. శ్రీ సి.హెచ్. దేవానందరావు .... టూరిజమ్
27. శ్రీ ఎ.మదనమోహన్ ....సాంకేతికవిద్య,యువజనసంక్షేమం
28. శ్రీ ఎమ్. ఆర్. షామ్‌రావు .... క్రీడలు
29. శ్రీడి. మునుస్వామి .... మార్కెటింగ్

1973 జనవరిలో 12 ఆంధ్రప్రాంతపు మంత్రులు రాజీనామా చేసినతరవాత శ్రీ పి వి. నరసింహారావు తన మంత్రి మండలిలో 8 క్రొత్త మంత్రులను నియమించడమైంది. తర్వాత శ్రీ పి. వి. నరసింహారావు తన మంత్రి మండలిరాజీనామా చేయడం, 18—1—1973 న అధ్యక్షపాలన విధించడంవల్ల, ఈ ఎనిమిది మంత్రులు స్వల్పకాలం పదవుల్లో ఉండడం జరిగింది.

1. శ్రీ మద్దూరి సుబ్బారెడ్డి
2. శ్రీ ఆనం వెంకటరెడ్డి
3. శ్రీ పి. వి. చౌదరి
4. శ్రీ అమరనాధరెడ్డి
5. శ్రీ జి. సోమశేఖర్
6. శ్రీ సి. దాస్
7. శ్రీ వడ్డే నాగేశ్వరరావు
8. శ్రీ ఆర్ రాజగోపాలరెడ్డి

## *ఆంధ్రప్రదేశ్ పదో మంత్రిమండలి (డిసెంబరు 1973)*

సర్వశ్రీ

| | | | |
|---|---|---|---|
| 1. | ,, జె. వెంగళరావు | .... | ముఖ్యమంత్రి |
| 2. | ,, బి. వి. సుబ్బారెడ్డి | .... | ఉపముఖ్యమంత్రి |
| 3. | ,, ఎన్. రామచంద్రారెడ్డి | .... | ఆర్థికశాఖ |
| 4. | ,, పి. బాసిరెడ్డి | .... | పరిశ్రమలు |
| 5. | ,, జె. చొక్కారావు | ... | రవాణా |
| 6. | ,, కె. రాజమల్లు | ... | ఆరోగ్య |
| 7. | ,, సాగి సూర్యనారాయణరాజు | ... | దేవాదాయశాఖ |
| 8. | ,, మహ్మద్ఇబ్రహీం అలీ అన్సారీ | ... | సమాచార, పౌరసంబంధాలు |
| 9. | ,, వి. కృష్ణమూర్తి నాయుడు | ... | మధ్యతరహా, నీటిపారుదల |
| 10. | ,, బి. సుబ్బారావు | .... | సహకారం |
| 11. | ,, ఎల్. లక్ష్మణదాస్ | .... | కార్మిక |
| 12. | ,, జి. రాజారాం | .... | విద్యుచ్ఛక్తి |
| 13. | ,, చల్లా సుబ్బారాయుడు | .... | మునిసిపాలిటీపాలన |
| 14. | ,, సి. హెచ్. దేవానంద రావు | .... | టూరిజమ్ |
| 15. | శ్రీమతి ఎమ్. లక్ష్మిదేవి | ... | స్త్రీ సంక్షేమం |

12—1—1974 ని ముగ్గురు మంత్రులు నియమించ బడ్డారు

16. సర్వశ్రీ మండలి వెంకటకృష్ణారావు
17. " ఖాట్టంశ్రీరామమూర్తి
18. " చనుమోలు వెంకటరావు

శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి గార్లు స్వర్గస్తులైనందువల్ల శ్రీ పిడతల రంగారెడ్డి మంత్రి మండలిలో చేరారు. ఉపముఖ్య మంత్రి పదవి రద్దుఅయింది.

## ఆంధ్రప్రదేశ్ పదకొండో మంత్రిమండలి (సెప్టెంబరు 1974)

సర్వశ్రీ

1. ,, జె. వెంగళరావు ... ముఖ్యమంత్రి
2. ,, పి. రంగారెడ్డి ... ఆర్థిక, సమాచార, పౌరసంబంధాలు
3. ,, పి. బాసిరెడ్డి ... పరిశ్రమలు
4. ,, జె. చొక్కారావు ... రవాణా, వ్యవసాయం
5. ,, కె. రాజమల్లు ... ఆరోగ్యశాఖ
6. ,, సాగి సూర్యనారాయణరాజు ... దేవాదాయశాఖ
7. ,, మహ్మద్ ఇబ్రహిం అలీ అన్సారీ... అడవులు
8. ,, వి. క్రిష్ణమూర్తినాయుడు ... మీడియం ఇరిగేషన్
9. ,, టి. అంజయ్య .... కార్మికశాఖ
10. ,, వి. నరసారెడ్డి .... రెవెన్యూ
11. ,, బి. సుబ్బారావు .... సహకారం
12. ,, ఎల్. లక్ష్మణదాస్ .... పంచాయతీరాజ్
13. ,, జి. రాజారాం .... విద్యుచ్ఛక్తి
14. ,, చల్లా సుబ్బారాయుడు .... మున్సిపల్‌పాలన
15. ,, ఎమ్. వి. కృష్ణారావు .... విద్య
16. ,, చనుమోలు వెంకటరావు .... రహదారులు, భవనాలు
17. ,, భాట్టం శ్రీరామమూర్తి .... సాంఘిక, గిరిజన సంక్షేమం
18. ,, ఆనం వెంకటరెడ్డి .... మైనర్ ఇరిగేషన్
19. ,, సి. హెచ్. దేవానందరావు .... టూరిజమ్
20. శ్రీమతి ఎమ్. లక్ష్మీదేవి .... స్త్రీ సంక్షేమం
21. సర్వశ్రీ వి. పురుషోత్తమరెడ్డి .... ఎక్సైజ్, గనులు
22. ,, పి. మహేంద్రనాథ్ .... మార్కెటింగ్
23. ,, డి. మునుస్వామి .... ఫిషరీస్
24. ,, ఎస్. వెంకటరెడ్డి .... పశుసంరక్షణశాఖ
25. ,, ఆసిఫ్ పాషా .... న్యాయ, కారాగారాలు న్యాయస్థాన శాఖలు
26. ,, కె. వి. కేశవులు ... హాండ్లూమ్స్, శౌళిశాఖలు

12-8-1976 న శ్రీ బాసిరెడ్డిగారు రాజీనామా చేసిన తరువాత 16-8-1976 న ఆరుగురు మంత్రులు నియమించబడ్డారు. మంత్రుల శాఖలలో మార్పులు జరిగాయి.

సర్వశ్రీ

1. ,, చేబ్రోలు హనుమయ్య ... రవాణాశాఖ
2. ,, పి. శేషావతారం ... గ్రామీణాభివృద్ధి
3. ,, ధర్మారెడ్డి ... ఆగ్రో ఇండస్ట్రీస్, గృహనిర్మాణం
4. ,, వై. నారాయణస్వామి .... చిన్నతరహా పరిశ్రమలు
5. ,, కె. బి నరసప్ప .... చక్కెర పరిశ్రమ
6. శ్రీమతి డి.కృష్ణవేణి సంజీవయ్య ... స్త్రీ సంక్షేమం

శ్రీ. బి. శ్రీరామమూర్తిగారికి కేటాయించిన సాంఘిక సంక్షేమశాఖ శ్రీ. మహేంద్ర నాథ్ గారికి ఇవ్వడం జరిగింది. 1-11-1976 నాటికి మంత్రి మండలి మొత్తం సంఖ్య 30.

***ఆంధ్రప్రదేశ్ పన్నెండవ మంత్రిమండలి (6-3-1978 నుంచి 10-10-1980)***

సర్వశ్రీ

1. ,, డా॥ ఎమ్. చెన్నారెడ్డి .... ముఖ్యమంత్రి
2. ,, అహ్మద్ షెరీఫ్ .... సహాయక పునరావాసం
3. ,, ఎన్. అమర్‌నాథరెడ్డి .... సహకారం
4. ,, ఎమ్. బాగారెడ్డి .... పంచాయతీరాజ్
5. ,, ఎన్. భాస్కరరావు .... రేవులు
6. ,, పి. వి. చౌదరి .... దేవాదాయశాఖ
7. ,, సి. దాస్ .... ఎన్నికలు, జౌళి
8. ,, పి. గంగారెడ్డి .... పౌరసంబంధాలు
9. ,, ఎమ్. ఎమ్. హాషిం .... హోం
10. ,, టి. హయగ్రీవాచారి .... సాంకేతిక విద్య
11. ,, సి. జనార్ధనరెడ్డి ... రెవెన్యూ
12. ,, ఎ. మదనమోహన్ .... వైద్య, ఆరోగ్య
13. ,, నిజాంవలీ .... కారాగారాలు, గనులు
14. ,, కె. ఓబులరెడ్డి ... మధ్యతరహా నీటిపారుదల
15. ,, కె.వి.ఆర్.ఎస్. పద్మనాభరాజు ... గిరిజనసంక్షేమం, వాణిజ్యం, ఎగుమతులు
16. ,, జి. రాజారాం ... ఆర్థికశాఖ
17. ,, బి. రాందేవ్ ... పశుగణాభివృద్ధి, డైరీ డెవలప్‌మెంట్ కార్పొరేషన్, పాలసరఫరా
18. ,, కె. రంగారావు ... గృహనిర్మాణం, సాంఘిక సంక్షేమం హరిజన సంక్షేమం
19. ,, కె. రోశయ్య ... రహదారులు, భవనాలు

20. శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి ... మునిసిపాలిటీ పాలన
21. సర్వశ్రీ పి. శేషావతారం ... గ్రామీణాభివృద్ధి, గ్రామీణ పరిశ్రమలు
22. ,, జి. శ్రీరాములు నాయుడు ... మైనర్ ఇరిగేషన్, వెనుకబడినతరగతుల సంక్షేమం
23. ,, ఎ. వీరప్ప ... ఫిషరీస్, చిన్నతరహా పరిశ్రమలు
24. ,, ఎ. వెంగళరెడ్డి ... రవాణాశాఖ
25. ,, బి. వెంకట్రామరెడ్డి ... విద్య
26. ,, వై. వెంకటరావు ... వ్యవసాయం
27. ,, జి. వెంకటస్వామి ... కార్మిక, ఉపాధికల్పన

## ఆంధ్రప్రదేశ్ పదమూడో మంత్రిమండలి

| రాష్ట్రమంత్రులు | శాఖలు |
|---|---|
| శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి) | శాంతిభద్రతల వ్యవహారాలు, భారీపరిశ్రమలు, మేజర్ ఇరిగేషన్, పట్టణ గరిష్ట పరిమితి, జనరల్ ఎడ్మినిస్ట్రేషన్ డిపార్ట్‌మెంట్ సర్వీసులు, షెడ్యూల్డ్ కులాలు, షెడూల్డ్ తెగలవిభాగం, వసతి, భూ సంస్కరణలు, కేటాయించని ఇతరశాఖలు |
| శ్రీ అహ్మద్ షెరీఫ్ | సహాయం, పునరావాసం, చిన్నపొదుపు మొత్తాలు, సైనిక్ బోర్డ్ (ఆంధ్రప్రదేశ్ రాజ్య), వక్ఫ్స్, ఓడరేవులు |
| శ్రీ ఎన్. అమరనాథ రెడ్డి | సహకార రంగం |
| శ్రీ ఎమ్. బాగారెడ్డి | పంచాయతీరాజ్, గ్రామీణ నీటిసరఫరాలతోసహా. |
| శ్రీ ఎన్. భాస్కరరావు | లఘుపరిశ్రమలు, స్వయంఉపాధి కల్పన, సాంకేతిక విభాగ ప్రణాళికలు, ప్రత్యేక ఉపాధికల్పన కార్యక్రమం, మత్స్యశాఖ మత్స్యాభివద్ధి కార్పొరేషన్‌తో సహా, మార్కెటింగ్, గిండ్డగి సంస్థలు |
| శ్రీ పి.వి. చౌదరి | దేవాదాయశాఖ, ఆంధ్రప్రదేశ్ స్వాతంత్రోద్యమ చరిత్ర, పురాతత్వ, రాష్ట్ర పురాతత్వ విభాగం |
| శ్రీ సి. దాస్ | ఎన్నికలు, జౌళి, స్టేషనరీ, ముద్రణ |
| శ్రీ టి. హయగ్రీవాచారి | సాంకేతిక విద్య, బాలల అకాడమి, దేశీయ వైద్య |
| శ్రీ దివి కొండయ్య చౌదరి | రహదార్లు, రోడ్లు, భవనాలు, పి.డబ్ల్యు.డి. వర్క్‌షాపులు, రైల్వేలకుసంబంధించిన ప్రస్తుతవిషయాలు, తంతి, తపాల |
| శ్రీ ఎ. మదన్ మోహన్ | వైద్య ఆరోగ్య శాఖలు |
| శ్రీ కె. ఓబుల రెడ్డి | మధ్యతరహా నీటిపారుదల శాఖ, వరదనివారణ డ్రైనేజ్, ఇరిగేషన్, డెవలెప్‌మెంట్ కార్పొరేషన్ |

శ్రీ కె. ప్రభాకర రెడ్డి — హోం, పోలీసు, పాస్‌పోర్టులు, ఆయుధాలచట్టం, అడవులు, అటవీ అభివృద్ధి కార్పొరేషన్

శ్రీ జి. రాజారాం — ఆర్థిక, ప్రణాళిక శాఖలు, వాణిజ్యపన్నులు, క్రీడా శాఖలు, అర్థగణాంకశాఖ, చక్కెర పరిశ్రమ (నిజాం సుగర్ ఫాక్టరీ, ఖండసారి సుగర్ ఫాక్టరీలు), చెఱకు అభివృద్ధి

శ్రీ రాం భూపాల్ రెడ్డి — భూమిశిస్తు, రెజిస్ట్రేషన్, స్టాంపులు, నిర్వాసితుల ఆస్తి, ఆయకట్టు, జాగీర్ నిర్వహణ, ఋణ పరిష్కారం బోర్డ్, ఎస్టేట్స్ రద్దుతో సహా సర్వే, సెటిల్‌మెంట్ శాఖలు

శ్రీ బి. రామ్‌దేవ్ — పశు సంవర్థక శాఖ, పాడి పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్, మాంసం, కోళ్ళఅభివృద్ధి కార్పొరేషన్, పాలసరఫరాపథకం

శ్రీ కె. రంగారావు — గృహనిర్మాణం, రాష్ట్ర హౌసింగ్ కార్పొరేషన్, హరిజన సంక్షేమం, సాంఘిక సంక్షేమం, రాష్ట్ర షెడ్యూల్డ్ కాస్ట్స్ ఫైనాన్స్ కార్పొరేషన్‌తో సహా

శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి — మునిసిపల్‌వ్యవహారాలు, హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌తో సహా, నగర అభివృద్ధి సంస్థ, టౌన్ ప్లానింగ్ ట్రస్ట్, హైదరాబాద్ నగర నీటి సరఫరాతో సహా, నగర నీటి సరఫరా, మురుగు కాల్వలు, వాతావరణ కాలుష్యం, వాతావరణ పారిశుద్ధ్యం, (నీరు, బొగ్గు, ఇంధనం, మొ॥) సమాచార పౌర సంబంధాల శాఖ, చలన చిత్ర పరిశ్రమల శాఖ

శ్రీ పి. శేషావతారం — ఆర్. టి. సి., రవాణా శాఖ

శ్రీ జి. శ్రీరాములు నాయుడు — చిన్నతరహా నీటిపారుదల శాఖ, వెనుకబడిన తరగతుల సంక్షేమం, రాష్ట్ర బ్యాక్‌వర్డ్‌క్లాస్ ఫైనాన్స్‌కార్పొరేషన్‌తోసహా

శ్రీ ఎ. వీరప్ప — విద్యుచ్ఛక్తి

శ్రీ బి. వెంకట్రాం రెడ్డి — ప్రాథమిక, సెకండరీ, కాలేజీవిద్య, సాహిత్య, వైజ్ఞానిక సంఘాలు, అకాడమీలు, సాంస్కృతిక వ్యవహారాలు, రాష్ట్ర విద్యా పరిశోధన, శిక్షణమండలి, రెషిడెన్షియల్ స్కూల్స్, ఆధునిక అధికార భాషాభివృద్ధి

శ్రీ వై. వెంకట రావు — వ్యవసాయం, ఆహారోత్పత్తి, భూగర్భజలాల వనరులు, ఆగ్రో ఇండస్ట్రీస్ కార్పొరేషన్, దాని అనుబంధాలు, ఆయకట్టు ప్రాంతం అభివృద్ధి, న్యాయశాఖ, న్యాయస్థానాలు

శ్రీ జి. వెంకట స్వామి — పౌర సరఫరాలశాఖ, కార్మిక, ఉపాధిశాఖలు, పారిశ్రామిక శిక్షణ సంస్థలు, ఇ.ఎస్.ఐ, లెదర్ ఇండస్ట్రీస్ డెవలెప్‌మెంట్ కార్పొరేషన్

## ప్రతిపక్షనాయకులు

1978, మార్చివరకు శ్రీ గౌతులచ్చన్నగారు ప్రతిపక్షనాయకులుగా వ్యవహరించారు.

1980 ఆగష్టునాటికి ప్రతిపక్ష పార్టీ నాయకులు

| | | |
|---|---|---|
| సి. పి. ఐ. (ఎమ్) | ... | శ్రీ పి. సుందరయ్య |
| లోక్ దళ్ | ... | శ్రీ జి. లచ్చన్న |
| సి. పి. ఐ. | ... | శ్రీ సి. హెచ్. రాజేశ్వరరావు |
| జనతా | ... | శ్రీ ఎస్. జయపాల్ రెడ్డి |
| కాంగ్రెస్ (అ) | ... | శ్రీ పి. రామచంద్రయ్య |
| భారతీయ జనతాపార్టీ | ... | శ్రీ ఎమ్. వెంకయ్యనాయుడు |
| మజ్లీస్,ఇత్తెహాద్,ఉల్,ముస్లిమాన్ | ... | శ్రీ సుల్తాన్ సలాఉద్దీన్ ఒవాసి |

*విధానసభ పార్టీ సభ్యుల సంఖ్య 28-10-1980 నాటికి*

| పార్టీ | సంఖ్య |
|---|---|
| ఐ. ఎన్. సి. (ఇం) | 256 |
| సి. పి. ఐ. (ఎమ్) | 8 |
| లోక్ దళ్ (జనతా ఎస్) | 7 |
| సి. పి. ఐ. | 6 |
| జనతా | 4 |
| ఐ. ఎన్. సి. (అ) | 3 |
| భారతీయ జనతా పార్టీ | 3 |
| మజ్లీస్ - ఇత్తెహాద్ - ఉల్ - ముస్లిమీన్ | 3 |
| ఇండిపెండెంట్స్ | 4 |
| ఖాళీ | 1 |
| మొత్తం | 295 |

*ఆంధ్రప్రదేశ్ విధానసభ సభ్యులు* (అక్టోబర్ 1980)

*శ్రీకాకుళం జిల్లా* (18)

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 1. | ,, బెండలం వెంకటేశం శర్మ | ఇచ్ఛాపురం |
| 2. | ,, గౌతు లచ్చన్న | సోంపేట |
| 3. | ,, బమ్మిడి నారాయణ స్వామి | టెక్కలి |
| 4. | ,, కన్నేపల్లి అప్పల నరసింహభక్త | హరిశ్చంద్రపురం |

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 5. ,, | డోలా సీతారాములు | నరసన్నపేట |
| 6. ,, | కలమట మోహనరావు | పాతపట్నం |
| 7. ,, | విశ్వాసరాయి నరసింహారావు | కొత్తూరు |
| 8. ,, | సత్తుచెర్ల విజయరామరాజు | నాగూరు |
| 9. ,, | చీకటి పరుశురామా నాయుడు | పార్వతీపురం |
| 10. ,, | ఎస్.ఆర్.టి.పి.ఎస్. వీరపరాజు | సాలూరు |
| 11. ,, | కొల్లి వెంకటకూర్మి నాయుడు | బొబ్బిలి |
| 12. ,, | వాసిరెడ్డి వరదరామారావు | థెర్లామ్ |
| 13. ,, | ఎమ్. బి. పరాంకుశం | వునుకూరు |
| 14. ,, | కంబాల రాజరత్నం | పాలకొండ |
| 15. ,, | పైడి శ్రీరామ మూర్తి | ఆముదాల వలస |
| 16. ,, | చల్లా లక్ష్మినారాయణ | శ్రీకాకుళం |
| 17. ,, | కొత్తపల్లి నరసయ్య | ఎచ్చెర్ల |
| 18. ,, | చిగిలిపల్లి శ్యామలరావు | చీపురుపల్లి |

*విశాఖపట్నం జిల్లా (19)*

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 19. ,, | వంగపండు నారాయణప్పల నాయుడు | గజపతినగర |
| 20. ,, | పూసపాటి అశోక గజపతిరాజు | విజయనగరం |
| 21. ,, | పెనుమత్స సాంబశివరాజు | సత్తివాడ |
| 22. ,, | కొమ్మూరు అప్పడుదొర | భోగాపురం |
| 23. ,, | దాట్ల జగన్నాథరాజు | భీమునిపట్నం |
| 24. ,, | సుంకరి ఆళ్వార్ దాస్ | విశాఖపట్నం—1 |
| 25. ,, | ఎన్. ఎస్. ఎన్. రెడ్డి | విశాఖపట్నం—2 |
| 26. ,, | ద్రోణంరాజు సత్యనారాయణ | పెందుర్తి |
| 27. ,, | కాకర్లమూడి విజయరాఘవ సత్యనారాయణ పద్మనాభరాజు | ఉత్తరపల్లి |
| 28. ,, | దూరు సన్యాసిదొర | శృంగవరపుకోట |
| 29. ,, | గిడ్డి అప్పలనాయుడు | పాడేరు |
| 30. ,, | కుర్చా రామునాయుడు | మాడుగుల |
| 31. ,, | ఈమని సీతారామశాస్త్రి | చోడవరం |
| 32. ,, | కోడుగంటి గోవిందరావు | అనకాపల్లి |

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 33. | భాట్టం శ్రీరామమూర్తి | పరవాడ |
| 34. | పీసను సన్యాసినాయుడు | ఎలమంచిలి |
| 35. | మారుతి ఆదెయ్య | పాయకరావుపేట |
| 36. | గోళం గోపాత్రుడు | నరసీపట్నం |
| 37. | దేవూరు కొండలరావు | చింతపల్లి |

*తూర్పుగోదావరి జిల్లా* (21)

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 38. | గొర్రెల ప్రకాశరావు | ఎల్లవరం |
| 39. | వర్రె పద్మరాజు | బూరుగుపల్లి |
| 40. | శ్రీమతి తడపర్తి సత్యవతి | రాజమండ్రి |

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 41. | పాటంసెట్టి అమ్మిరాజు | కడియం |
| 42. | పంతం పద్మనాభం | జగ్గంపేట |
| 43. | ఉండవల్లి నారాయణమూర్తి | పెద్దాపురం |
| 44. | ముద్రగడ్డ పద్మనాభం | పత్తిపాడు |
| 45. | శ్రీమతి మీర్జా నల్లపరాజు విజయలక్ష్మీదేవి | తుని |

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 46. | కొప్పన వేంకట చంద్రమోహనరావు | పిఠాపురం |
| 47. | మట్టా వేంకటరమణ | సంపర |
| 48. | మల్లాది స్వామి | కాకినాడ |
| 49. | బిరుద సూర్యనారాయణ | తాళ్ళరేవు |
| 50. | పడాల అమ్మిరెడ్డి | అనపర్తి |
| 51. | పిల్లి అప్పారావు | రామచంద్రపురం |
| 52. | ఎస్. వెంకటరెడ్డి | ఆలమూరు |
| 53. | మోకా శ్రీవిష్ణుప్రసాదరావు | ముమ్మిడివరం |
| 54. | దేవరపల్లి వెంకటపతి | అల్లవరం |
| 55. | పాలచోళ్ళ వేంకట శ్రీరామారావు | అమలాపురం |
| 56. | మంథెన వెంకట సూర్యసుబ్బరాజు | కొత్తపేట |
| 57. | నీతిపూడి గణపతిరావు | నగరం |
| 58. | రుద్రరాజు రామలింగరాజు | రాజోలు |

*పశ్చిమ గోదావరి జిల్లా* (16)

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 59. | పరకాల శేషావతారం | నరసపూర్ |

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 60. | వార్థినీడి సత్యనారాయణ | పాలకొల్లు |
| 61. | కోట ధనరాజు | ఆచంట |
| 62. | కలిదిండి విజయ నరసింహరాజు | భీమవరం |
| 63. | గొట్టుముక్కల రామచంద్రరాజు | ఉండి |
| 64. | జక్కంసెట్టి వెంకటేశ్వరరావు | పెనుగొండ |
| 65. | కంటిపూడి అప్పారావు | తణుకు |
| 66. | ఇందుకూరి రామకృష్ణంరాజు | అత్తిలి |
| 67. | చింతలపాటి సీతారామచంద్ర పరప్రసాద మూర్తిరాజు | తాడేపల్లిగూడెం |
| 68. | కడియాల సత్యనారాయణ | ఉంగుటూరు |
| 69. | నీలం చార్లెస్ | దెందులూరు |
| 70. | నలబాటి సూర్యప్రకాశరావు | ఏలూరు |
| 71. | శ్రీమతి దాసరి సరోజినీదేవి | గోపాలపురం |

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 72. | మున్షీ అబ్దుల్ అజీజ్ | కొవ్వూరు |
| 73. | రసపుత్ర నాగభూషణం | పోలవరం |
| 74. | గద్దె వెంకటేశ్వరరావు | చింతలపూడి |

## కృష్ణాజిల్లా (17)

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 75. | బొద్దులూరు రామారావు | జగ్గయ్యపేట |
| 76. | ముక్కపాటి వెంకటేశ్వరరావు | నందిగామ |
| 77. | పోతిన చిన్న | విజయవాడ (ప) |
| 78. | నాదెండ్ల భాస్కరరావు | విజయవాడ (తూ) |
| 79. | కోనేరు రంగారావు | కంకిపాడు |
| 80. | చనమోలు వెంకటరావు | మైలవరం |
| 81. | వక్కలగడ్డ ఆదం | తిరువూరు |
| 82. | పాలడుగు వెంకటరావు | నూజివీడు |
| 83. | పుచ్చలపల్లి సుందరయ్య | గన్నవరం |
| 84. | వడ్డె శోభనాద్రేశ్వరరావు | వుయ్యూరు |
| 85. | కటారి సత్యనారాయణరావు | గుడివాడ |
| 86. | పిన్నమనేని కోటేశ్వరరావు | ముదినేపల్లి |
| 87. | కనుమూరు బాపిరాజు | కైకలూరు |
| 88. | బూరగడ్డ నిరంజనరావు | మల్లేశ్వరం |
| 89. | వడ్డే రంగారావు | బందరు |
| 90. | శ్రీమతి ధన సౌమ్యవతి | నిడుమోలు |

91. సర్వశ్రీ మండలి వెంకట కృష్ణారావు అవనిగడ్డ

## గుంటూరు జిల్లా (19)

సర్వశ్రీ

92. ఏపూరు సుబ్బారావు కూచినపూడి
93. కొరటాల సత్యనారాయణ రేపల్లె
94. యడ్లపాటి వెంకటరావు వేమూరు
95. జి. వేదాంతరావు దుగ్గిరాల
96. శ్రీమతి దొడ్డపనేని ఇందిర తెనాలి

సర్వశ్రీ

97. గోగినేని నాగేశ్వరరావు పొన్నూరు
98. కోన ప్రభాకరరావు బాపట్ల
99. కారుమూరు లక్ష్మీనారాయణరెడ్డి ప్రత్తిపాడు
100. లింగంశెట్టి ఈశ్వరరావు గుంటూరు-1
101. గాదె వీరాంజనేయశర్మ గుంటూరు-2
102. జి. వి. రత్తయ్య మంగళగిరి
103. టి. అమృతరావు తాడికొండ
104. రావెల వెంకటరావు సత్తెనపల్లి
105. గణప రామస్వామిరెడ్డి పెద్దకూరపాడు
106. గడిపూడి మల్లికార్జునరావు గురజాల
107. చల్లా నారపరెడ్డి మాచెర్ల
108. అవుదరి వెంకటేశ్వర్లు వినుకొండ
109. కాసు వెంకటకృష్ణారెడ్డి నరసారావుపేట
110. సోమేపల్లి సాంబయ్య చిలకలూరిపేట

## ప్రకాశం జిల్లా (13)

సర్వశ్రీ

111. — చీరాల
112. మద్దుకూరి నారాయణరావు పర్చూరు
113. జాగర్లమూడి చంద్రమౌళి మారుటూరు
114. కర్ణం బలరామ కృష్ణమూర్తి అద్దంకి
115. డా॥ శ్రీమతి శృంగారపు జీవరత్నంనాయుడు ఒంగోలు

సర్వశ్రీ

116. వేమా యల్లయ్య సంత నూతలపాడు
117. దివి కొండయ్యచౌదరి కందుకూరు
118. బత్తలపల్లి రామసుబ్బారెడ్డి కనిగిరి

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 119. | గుండపనేని పట్టాభిరామస్వామి చౌదరి | కొండపి |
| 120. | కందుల ఓబులరెడ్డి | కంబం |
| 121. | బర్రె జ్ఞానప్రకాశం | దర్శి |
| 122. | పూల సుబ్బయ్య | మార్కాపురం |
| 123. | పిడతల రంగారెడ్డి | గిద్దలూరు |

**నెల్లూరుజిల్లా (11)**

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 124. | ముప్పవరపు వెంకయ్యనాయుడు | ఉదయగిరి |
| 125. | కలికి యానాదిరెడ్డి | కావలి |
| 126. | గిద్దలూరు సుందరరామయ్య | అల్లూరు |
| 127. | పెళ్ళకూరు రామచంద్రారెడ్డి | కోవూరు |
| 128. | డా. బొమ్మిరెడ్డి సుందర రామిరెడ్డి | ఆత్మకూరు |
| 129. | నువ్వుల వెంకటరత్నం నాయుడు | రాపూరు |
| 130. | కూనం వెంకట సుబ్బారెడ్డి | నెల్లూరు |
| 131. | చిత్తూరు వెంకట శేషారెడ్డి | సర్వేపల్లి |
| 132. | పత్ర ప్రకాశరావు | గూడూరు |
| 133. | పిట్ల వెంకటసుబ్బయ్య | సూళ్ళూరుపేట |
| 134. | నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి | వెంకటగిరి |

**చిత్తూరుజిల్లా (15)**

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 135. | వి.సుబ్రహ్మణ్యం నాయుడు | శ్రీకాళహస్తి |
| 136. | సి. దాస్ | సత్యవేడు |
| 137. | రెడ్డివారి చెంగారెడ్డి | నగరి |
| 138. | కె. బి. సిద్దయ్య | పుత్తూరు |
| 139. | బంగల ఆరుముగం | వేపంజేరి |
| 140. | ఎన్. పి. వెంకటేశ్వరచౌదరి | చిత్తూరు |
| 141. | ఏ. రత్నం | పలమనేరు |
| 142. | బి. ఆర్. దొరస్వామినాయుడు | కుప్పం |
| 143. | కె. వి. పతి | పుంగనూరు |
| 144. | గంగారపు వేంకటనారాయణరెడ్డి | మదనపల్లి |

| | |
|---|---|
| సర్వశ్రీ | |
| 145. ఏ. మోహనరెడ్డి | తంబళ్ళపల్లి |
| 146. నల్లేరి అమరనాథరెడ్డి | వాయల్పాడు |
| 147. మొఘల్ సైపుల్లాబేగ్ | పీలేరు |
| 148. నారా చంద్రబాబునాయుడు | చంద్రగిరి |
| 149. అగరాల ఈశ్వరరెడ్డి | తిరుపతి |

## కడపజిల్లా (11)

| | |
|---|---|
| 150. శ్రీ నిడిగింటి వేంకటసుబ్బయ్య | కోడూరు |
| 151. శ్రీమతి కొండూరు ప్రభావతమ్మ | రాజంపేట |
| సర్వశ్రీ | |
| 152. సుగవాసి పాలకొండ్రాయడు | రాయచోటి |
| 153. గడికోట రామసుబ్బారెడ్డి | లక్కిరెడ్డిపల్లి |
| 154. గజ్జల రంగారెడ్డి | కడప |
| 155. వడ్డమాని శివరామకృష్ణారావు | బద్వేలు |
| 156. డి. ఎల్. రవీంద్రరెడ్డి | మైదుకూరు |
| 157. చంద్ర ఓబులరెడ్డి రామిరెడ్డి | ప్రొద్దుటూరు |
| 158. చవ్వా మొరమ్మగారి రామనాథరెడ్డి | జమ్మలమడుగు |
| 159. పేర్ల శివారెడ్డి | కమలాపురం |
| 160. వై. ఎస్. రాజశేఖరరెడ్డి | పులివెందుల |

## అనంతపురంజిల్లా (14)

| | |
|---|---|
| సర్వశ్రీ | |
| 161. నిజాంవలీ | కదిరి |
| 162. అగిశం వీరప్ప | నల్లమడ |
| 163. పి. బయ్యపరెడ్డి | గోరంట్ల |
| 164. కె. తిప్పేస్వామి | హిందూపురం |
| 165. వై. తిమ్మారెడ్డి | మడకశిర |
| 166. సోమందపల్లి నారాయణరెడ్డి | పెనుగొండ |
| 167. హిందీ నరసప్ప | కళ్యాణదుర్గం |
| 168. కె. బి. చెన్నమల్లప్ప | రాయదుర్గం |
| 169. ఆర్. వేమన్న | ఉరవకొండ |
| 170. కె. వెంకట్రామయ్య | గుత్తి |

| | |
|---|---|
| 171. శ్రీమతి బి.రుక్మిణీదేవి | సింగనమల |
| సర్వశ్రీ | |
| 172. బి. టి. ఎల్.ఎన్. చౌదరి | అనంతపురం |
| 173. గోనుగుంట్ల అనంతరెడ్డి | ధర్మవరం |
| 174. దిడ్డెకుంట వెంకటరెడ్డి | తాడిపత్రి |

### కర్నూలుజిల్లా (13)

| | |
|---|---|
| సర్వశ్రీ | |
| 175. ఎం. వీరన్న | ఆలూరు |
| 176. హెచ్. సత్యనారాయణ | ఆదోని |
| 177. కె. ఆర్. హనుమంతరెడ్డి | ఎమ్మిగనూరు |
| 178. దామోదరం మునిస్వామి | కోడుమూరు |
| 179. మహమ్మద్ ఇబ్రహింఖాన్ | కర్నూలు |
| 180. కె. బి. నరసప్ప | పత్తికొండ |
| 181. కె. ఇ. కృష్ణమూర్తి | ద్రోణాచలం |
| 182. ఎం. కె. వి. రెడ్డి | కోయిలకుంట్ల |
| 183. ప్రతాపరెడ్డి | ఆళ్ళగడ్డ |
| 184. ఏరాసు అయ్యపురెడ్డి | పాణ్యం |
| 185. బైరెడ్డి శేషశయనారెడ్డి | నందికొట్కూరు |
| 186. బొజ్జా వెంకటరెడ్డి | నంద్యాల |
| 187. ఏ. వెంగళరెడ్డి | ఆత్మకూరు |

### మహబూబ్ నగర్ జిల్లా (13)

| | |
|---|---|
| సర్వశ్రీ | |
| 188. ఆర్. ఎం. మనోహర్ | అచ్చంపేట |
| 189. శ్రీనివాసరావు | నాగర కర్నూలు |
| 190. ఎస్. జయపాల్ రెడ్డి | కల్వకుర్తి |
| 191. ఖీష్వాకిష్టయ్య | షాద్‌నగర్ |
| 192. ఎన్. నరసప్ప | జడ్చెర్ల |
| 193. హెచ్. ఆంజనేయులు | మహబూబ్‌నగర్ |
| 194. జయరాములు | వనపర్తి |
| 195. కొత్త వెంకటేశ్వరరావు | కొల్లాపూర్ |
| 196. సి.రామభూపాల్ రెడ్డి | అలంపూర్ |

సర్వశ్రీ

| | |
|---|---|
| 197. సమరసింహారెడ్డి | గద్వాల |
| 198. వీరారెడ్డి | అమర్‌చింత |
| 199. నరసింహులు నాయుడు | మఖ్తల్ |
| 200. గురునాథరెడ్డి | కొడంగల్ |

## హైదరాబాదు జిల్లా (19)

సర్వశ్రీ

| | |
|---|---|
| 201. ఎం. మాణిక్యరావు | తాండూరు |
| 202. వి. బి. తిరుమలయ్య | వికారాబాదు |
| 203. అహమద్‌షరీఫ్ | పర్గి |
| 204. చిలాగ్ ప్రతాపలింగం | చేవెళ్ళ |
| 205. శ్రీమతి సుమిత్రాదేవి | ఇబ్రహీంపట్నం |
| 206. శ్రీ నరసింహారెడ్డి | ముషీరాబాదు |
| 207. శ్రీమతి లక్ష్మీకాంతమ్మ | హిమాయత్‌నగర్ |

సర్వశ్రీ

| | |
|---|---|
| 208. రామదాసు | సనత్‌నగర్ |
| 209. ఎల్. నారాయణ | సికింద్రాబాదు |
| 210. జనార్ధనరెడ్డి | ఖైరతాబాదు |
| 211. బి. మచ్చీందర్‌రావు | సికింద్రాబాదు(కంటోన్మెంటు) |
| 212. కొండల ప్రభాకరరెడ్డి | మలక్‌పేట |
| 213. బి. కృష్ణ | ఆసిఫ్‌నగర్ |
| 214. శివప్రసాద్ | మహరాజ్‌గంజ్ |
| 215. శివలాల్ | కార్వాన్ |
| 216. బాకర్‌ఆఘా | యాకుత్‌పురా |
| 217. మహమ్మద్ అమానుల్లాఖాన్ | చాంద్రాయణగుట్ట |
| 218. సుల్తాన్ సలాఉద్దీన్ ఓవైసి | చార్‌మినార్ |
| 219. డా. మర్రి చెన్నారెడ్డి | మెడ్చెల్ |

## మెదక్ జిల్లా (10)

సర్వశ్రీ

| | |
|---|---|
| 220. అనంతుల మదన్‌మోహన్ | సిద్దిపేట |
| 221. ఐరేనిలింగయ్య | దొమ్మట్ |
| 222. గజ్వేలుసైదయ్య | గజ్వేల్ |

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 223. | చిలుముల విఠల్ రెడ్డి | నరసపూర్ |
| 224. | నరసింహారెడ్డి | సంగారెడ్డి |
| 225. | ఎం. బాగారెడ్డి | జహీరాబాదు |
| 226. | శివరావుషేట్కర్ | నారాయణఖేడ్ |
| 227. | సేరి లక్ష్మారెడ్డి | మెదక్ |
| 228. | రాజయ్యగారి ముత్యంరెడ్డి | రామాయంపేట |
| 229. | సి. రాజనరసింహ | ఆందోల్ |

### నిజామాబాద్ జిల్లా (9)

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 230. | గడ్డం రాజారామ్ | బాల్కొండ |
| 231. | సంతోష్‌రెడ్డి | ఆర్మూరు |
| 232. | బి. బాలయ్య | కామారెడ్డి |
| 233. | తాడూరుబాలగౌడ్ | యెల్లారెడ్డి |
| 234. | గంగారామ్ | జుక్కల్ |
| 235. | ఎం. శ్రీనివాసరావు | బన్స్‌వాడ |
| 236. | గులామ్ సమ్‌దానీ | బోధన్ |
| 237. | ఎ. కిషన్‌దాస్ | నిజామాబాద్ |
| 238. | అంతరెడ్డి బాల్‌రెడ్డి | డిచ్‌పల్లి |

### అదిలాబాదుజిల్లా (9)

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 239. | గడ్డన్న | మథోల్ |
| 240. | పి. గంగారెడ్డి | నిర్మల్ |
| 241. | టి. అమర్‌సింగ్ | బోథ్ |
| 242. | అంబాజీ | ఖానాపూర్ |
| 243. | చిలుకూరి రామచందర్‌రెడ్డి | ఆదిలాబాదు |
| 244. | దాసరి నరసయ్య | ఆసిఫాబాదు |
| 245. | చుంచులక్ష్మయ్య | లక్సెట్టిపేట |
| 246. | కె. వి. కేశవులు | సిర్‌పూర్ |
| 247. | సి. నారాయణ | చిన్నూరు |

## కరీంనగర్ జిల్లా (13)

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 248. | సి. నారాయణరెడ్డి | మంథని |
| 249. | జి. రాజిరెడ్డి | పెద్దపల్లి |
| 250. | జి. ఈశ్వర్ | మేడారం |
| 251. | దుగ్గిరాల వేంకటరావు | హుజూరాబాద్ |
| 252. | పి. జనార్దనరెడ్డి | కమలాపూర్ |
| 253. | దేశిని చిన్నమల్లయ్య | ఇందుర్తి |
| 254. | నలుమాచు కొండయ్య | కరీంనగర్ |
| 255. | న్యాలకొండ శ్రీపతిరావు | చొప్పదండి |
| 256. | దేవకొండ సురేంద్రరావు | జగిత్యాల్ |
| 257. | అంబళ్ళ రాజారామ్ | బుగ్గారం |
| 258. | వి. వెంకటేశ్వరరావు | మెట్పల్లి |
| 259. | చెన్నమేని రాజేశ్వరరావు | సిరిసిల్లా |
| 260. | పాటిరాజం | నేరెళ్ళ |

## వరంగల్ జిల్లా (13)

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 261. | జి. సిద్దయ్య | చేర్యాల |
| 262. | కోడూర్ వర్ధారెడ్డి | జనగాం |
| 263. | నేమరుగోముల యతిరాజారావు | చెన్నూరు |
| 264. | రామసహాయం సురేందర్‌రెడ్డి | డోర్నకల్ |
| 265. | జెన్నారెడ్డి జనార్దనరెడ్డి | మహబూబాబాద్ |
| 266. | మద్దికాయల ఓంకార్ | నరసంపేట |
| 267. | మాచెర్ల జగన్నాథం | వర్ధన్నపేట |
| 268. | గోకారామస్వామి | ఘన్‌పూర్ |
| 269. | ఆరెల్లిబుచ్చయ్య | వరంగల్ |
| 270. | టి. హయగ్రీవాచారి | హన్మకొండ |
| 271. | చెందుపట్ల జంగారెడ్డి | శ్యాంపేట |
| 272. | బొచ్చుసమ్మయ్య | పర్కాల్ |
| 273. | పి. జగన్‌నాయక్ | ములుగు |

## ఖమ్మం జిల్లా (9)

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 274. | ముర్లా ఎర్రయ్యరెడ్డి | భద్రాచలం |
| 275. | పూనెం రామచంద్రయ్య | బూర్గంపాడు |
| 276. | చేకూరు కాశయ్య | కొత్తగూడెం |
| 277. | జె. వెంకటేశ్వరరావు | సత్తుపల్లి |
| 278. | బండారు ప్రసాద రావు | మధిర |
| 279. | హుసేను పొట్టపింజారా (మరణించారు) | పాలేరు |
| 280. | కేసర అనంత రెడ్డి | ఖమ్మం |
| 281. | బొగ్గారపు సీతారామయ్య | సుజాతానగర్ |
| 282. | చాపల ఎర్రయ్య | ఎల్లందు |

## నల్గొండ జిల్లా (12)

| | | |
|---|---|---|
| 283. | శ్రీమతి మల్లు స్వరాజ్యం | తుంగతుర్తి |
| | సర్వశ్రీ | |
| 284. | అనుమలపురి పరంధాములు | సూర్యాపేట |
| 285. | అక్కిరాజు వాసుదేవ రావు | కోదాడ |
| 286. | అరిబండి లక్ష్మీనారాయణ | మిర్యాలగూడ |
| 287. | నిమ్మల రాములు | చలకుర్తి |
| 288. | నర్రా రాఘవ రెడ్డి | నక్రేకల్ |
| 289. | గుత్తా మోహనరెడ్డి | నల్గొండ |
| 290. | కొమ్ము పాపయ్య | రామన్నపేట |
| 291. | సాలూరి పోచయ్య | ఆలేరు |
| 292. | కొమ్మిడి నరసింహా రెడ్డి | భువనగిరి |
| 293. | పాల్వాయి గోవర్ధన రెడ్డి | మునుగోడు |
| 294. | డి. రవీంద్ర నాయిక్ | దేవరకొండ |
| 295. | ఆస్వాల్డ్ హెచ్. పెడ్రో | నామినేటెడ్ |

## ఆంధ్రప్రదేశ్ విధానపరిషత్ సభ్యులు (ఆగస్టు 1980)

(1982 సంవత్సరంలో పదవీకాలం ముగిసే సభ్యుల జాబితా)

| క్ర. సం. | సభ్యుని పేరు | అనుబంధ పార్టీ | నియోజకవర్గం |
|---|---|---|---|
| I ఈ దిగువ సభ్యుల పదవీకాలం 8, జూలై, 1982 నాటికి పూర్తి అవుతుంది | | | |
| 1. | శ్రీ హఫీజ్ అబూ యూసఫ్ | కాం. ఇం. | నామినేటెడ్ |
| 2. | శ్రీ ఎ. చక్రపాణి (చీఫ్ విప్) | కాం. ఇం. | నామినేటెడ్ |

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 3. పాయం మీనయ్య | కాం. అ. | నామినేటెడ్ |
| 4. కె. వెంకటేశ్వర రావు | కాం. ఇం. | నామినేటెడ్ |

II ఈ దిగువ సభ్యుల పదవీకాలం 14, జూలై 1982 నాటికి పూర్తి అవుతుంది

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 5. భుజంగరావు | ఎన్.డి.ఎఫ్ | రాయలసీమ (పశ్చిమ) ఉపాధ్యాయ నియోజకవర్గం |
| 6. ఎమ్. మాధవరావు | లోక్‌దళ్ | రాయలసీమ (తూర్పు) ఉపాధ్యాయ నియోజకవర్గం |
| 7. ఎ. సంజీవ రెడ్డి | కాం. ఇం. | రాయలసీమ (తూర్పు) పట్టభద్రుల నియోజకవర్గం |
| 8. డి. సూర్యప్రకాశ రెడ్డి | జనతా | రాయలసీమ (పశ్చిమ) పట్టభద్రుల నియోజకవర్గం |

III ఈ దిగువ సభ్యుల పదవీకాలం 27, జూలై 1982 నాటికి పూర్తి అవుతుంది

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 9. అల్లూరి బాపినీడు | కాం. ఇం. | శాసనసభ |
| 10. చేబ్రోలు హనుమయ్య | కాం. ఇం. | శాసనసభ |
| 11. కె. ఎల్. మహేంద్ర | సి.పి.ఐ | శాసనసభ |
| 12. యాతమ్ మహానంది రెడ్డి | కాం. ఇం | శాసనసభ |
| 13. వడ్డే నాగేశ్వర రావు | కాం. ఇం. | శాసనసభ |
| 14. గుణపాటి రామచంద్రా రెడ్డి | కాం. ఇం. | శాసనసభ |
| 15. శ్రీమతి జె.ఎమ్. రాజమణీదేవి | కాం. ఇం. | శాసనసభ |

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 16. రొండా నారప రెడ్డి | కాం. అ. | శాసనసభ |
| 17. తోటకూర వెంకటప్పయ్య | కాం. ఇం. | శాసనసభ |
| 18. టి. ముసలయ్య | కాం. ఇం. | శాసనసభ |

(*) 31 స్థానాలు ఖాళీగా ఉన్నాయి

(1984 సంవత్సరంలో పదవీకాలం ముగిసే సభ్యుల జాబితా)

I ఈ దిగువ సభ్యులపదవీకాలం 30, జూన్ 1984 నాటికి పూర్తి అవుతుంది

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 1. భవనం వెంకట్రామ రెడ్డి | కాం. ఇం. | శాసనసభ |
| 2. ఎమ్. ఎమ్ హాషిం. | కాం. ఇం. | శాసనసభ |
| 3. ఎన్. జనార్దన రెడ్డి | కాం. ఇం. | శాసనసభ |
| 4. కె. సత్యనారాయణ రాజు | కాం. ఇం. | శాసనసభ |
| 5. జి. వి. సుధాకర రావు | కాం. ఇం. | శాసనసభ |

6. శ్రీమతి పి. వి. చౌదరి | కాం. ఇం. | శాసనసభ
సర్వశ్రీ
7. శ్రీమతి సి. హెచ్. సంతోషం | కాం. ఇం. | శాసనసభ
సర్వశ్రీ
8. జి. వెంకటస్వామి | కాం. ఇం. | శాసనసభ
9. మోటూరి హనుమంతరావు | సి.పి.ఐ(ఎమ్) | శాసనసభ
10. శ్రీమతి కుముద్ బి. నాయక్ | జనతా | శాసనసభ
11. సర్వశ్రీ టి. పాంచజన్యమ్ | కాం. ఇం. | శాసనసభ

II ఈ దిగువ సభ్యుల పదవీకాలం 12, జూలై, 1984 నాటికి పూర్తి అవుతుంది
సర్వశ్రీ
12. ఎ. శ్యామ సుందర రావ్ | పి.డి.ఎఫ్. | తెలంగాణా(పశ్చిమ) ఉపాధ్యాయ నియోజకవర్గం
13. సామినేని హిమవంతరావు | పి.డి.ఎఫ్. | తెలంగాణా (తూర్పు) ఉపాధ్యాయ నియోజకవర్గం
14. వి. రామారావు | జనతా | హైదరాబాద్ పట్టభద్రులు
15. కేశవరావు | కాం. ఇం. | హైదరాబాద్ పట్టభద్రులు
16. వి. జగపతిరావు | కాం. ఇం. | తెలంగాణా పట్టభద్రులు

III ఈ దిగువ సభ్యుల పదవీకాలం 16, జూలై, 1984 నాటికి పూర్తి అవుతుంది
17. శ్రీమతి ఉమాదేవీ వెంకట్రామ్ రెడ్డి | కాం. ఇం. | నామినేటెడ్
18. శ్రీమతి సంయుక్తా బుల్లయ్య | కాం. ఇం. | నామినేటెడ్
19. శ్రీ బోయి భీమన్న | కాం. ఇం. | నామినేటెడ్
20. శ్రీ ఎన్. శ్రీరామ మూర్తి | కాం. ఇం. | నామినేటెడ్

(1986 సంవత్సరంలో పదవీకాలం ముగిసే సభ్యులజాబితా)

I ఈ దిగువ సభ్యుల పదవీకాలం 30, జూన్, 1986 నాటికి పూర్తి అవుతుంది
సర్వశ్రీ
1. కె.వి.ఆర్.ఎస్.బాలసుబ్బారావు | కాం. ఇం. | శాసనసభ
2. భూపతివెంకటనరసయ్య | సి.పి.ఐ. | శాసనసభ
3. వి. హనుమంతరావు | కాం. ఇం. | శాసనసభ
4. సి. జగన్నాధరావు | కాం. ఇం. | శాసనసభ
5. తరిమెల రామ చంద్రా రెడ్డి | కాం. ఇం. | శాసనసభ
6. బి. రాందేవ్ | కాం. ఇం. | శాసనసభ
7. కె. రోశయ్య | కాం. ఇం. | శాసనసభ
8. శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి | కాం. ఇం. | శాసనసభ
9. సర్వశ్రీ జి. శ్రీరాములు నాయుడు | కాం. ఇం. | శాసనసభ
10. సర్వశ్రీ ఎమ్. తులసీదాసు | కాం. ఇం. | శాసనసభ

| | |
|---|---|
| 11. సిస్టర్ ఎథెల్ ఫెర్రీ | ఇండిపెండెంట్ నామినేటెడ్ |
| సర్వశ్రీ | |
| 12. సయద్ ముఖస్సిర్‌షా | ఇండిపెండెంట్ నామినేటెడ్ |
| 13. వి. రాజేశ్వర రావు | ఇండిపెండెంట్ నామినేటెడ్ |
| 14. ఎమ్. యల్లప్ప | ఇండిపెండెంట్ నామినేటెడ్ |

II ఈ దిగువ సభ్యుల పదవీకాలం 10, జూలై, 1986 నాటికి పూర్తిఅవుతుంది..

| | |
|---|---|
| సర్వశ్రీ | |
| 16. మరుపు బాలక్రిష్ణమ్మ | పి.డి.ఎఫ్ ఉపాధ్యాయ,సర్కార్స్(నార్త్) |
| 16. పి. వి. చలపతిరావు | జనతా పట్టభద్రులు,సర్కార్స్(నార్త్) |
| 17. కొల్లూరి కోటేశ్వరరావు | ఎన్.డి.ఎఫ్ ఉపాధ్యాయ, క్రిష్ణా |
| 18. ఎమ్. జె. మాణిక్యరావు | పి.డి.ఎఫ్ ఉపా॥, గుంటూరు,సెంట్రల్ |
| 19. ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావు | ఇండిపెండెంట్ పట్టభద్రులు,సర్కార్స్ సెంట్రల్ |
| 20. దండు శివరామరాజు | ఇండిపెండెంట్ ఉపాధ్యాయ సర్కార్స్ (సౌత్) |
| 21. జూపూడి యజ్ఞనారాయణ | జనతా పట్టభద్రులు, సర్కార్స్ |

ఆంధ్రప్రదేశ్ నుంచి ఏడోలోక్‌సభకు ఎన్నికయిన ప్రతినిధులు. పార్వతీపురానికి చెందిన ప్రతినిధి ఐ. ఎన్. సి. (అ) మినహా, మిగతా అందరు సభ్యులు ఐ. ఎన్. సి. (ఇం) కు చెందినవారు.

| | |
|---|---|
| 1. శ్రీకాకుళం | .... శ్రీ బొడ్డేపల్లి రాజగోపాలరావు |
| 2. పార్వతీపురం (ఎస్. టి.) | .... శ్రీ వైరిచర్ల కిషోర్‌చంద్ర సూర్యనారాయణదేః |
| 3. బొబ్బిలి | .... శ్రీ పూసపాటి విజయరామ గజపతిరాజు |
| 4. విశాఖపట్నం | .... శ్రీ కొమ్మూరు అప్పలస్వామి |
| 5. భద్రాచలం (ఎస్. టి.) | .... శ్రీమతి బి. రాధాబాయి ఆనందరావు |
| 6. అనకాపల్లి | .... శ్రీ ఎస్. ఆర్. ఎ. ఎస్. అప్పలనాయుడు |
| 7. కాకినాడ | .... శ్రీ ఎమ్. ఎస్. సంజీవరావు |
| 8. రాజమండ్రి | .... శ్రీ ఎస్. బి. పి. పట్టాభి రామారావు |
| 9. అమలాపురం (ఎస్. సి.) | .... శ్రీ కుసుమ కృష్ణమూర్తి |
| 10. నర్సపూరు | .... శ్రీ అల్లూరి సుబాస్‌చంద్రబోస్ |
| 11. ఏలూరు | .... శ్రీ చిత్తూరి సుబ్బారావు చౌదరి |
| 12. మచిలీపట్నం | .... శ్రీ మాగంటి అంకినీడు |
| 13. విజయవాడ | .... శ్రీమతి చెన్నుపాటి విద్య |

| | |
|---|---|
| 14. తెనాలి | .... శ్రీ మేడూరి నాగేశ్వరరావు |
| 15. గుంటూరు | .... ఆచార్య ఎన్. జి. రంగా |
| 16. బాపట్ల | .... శ్రీ పాములపాటి అంకినీడు ప్రసాదరావు |
| 17. నరసారావుపేట | .... శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి |
| 18. ఒంగోలు | .... శ్రీ పులి వెంకటరెడ్డి |
| 19. నెల్లూరు (ఎస్. సి ) | .... శ్రీ దొడ్డవరపు కామాక్షయ్య |
| 20. తిరుపతి (ఎస్. సి.) | .... శ్రీ పసల పెంచలయ్య |
| 21. చిత్తూరు | .... శ్రీ పి. రాజగోపాలనాయుడు |
| 22. రాజంపేట | .... శ్రీ పి. పార్థసారథి |
| 23. కడప | .... శ్రీ కందుల ఓబులరెడ్డి |
| 24. హిందూపురం | .... శ్రీ పామదుర్తి బయ్యపరెడ్డి |
| 25. అనంతపురం | .... శ్రీ దారూరు పుల్లయ్య |
| 26. కర్నూలు | .... శ్రీ కె. విజయభాస్కరరెడ్డి |
| 27. నంద్యాల | .... శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య |
| 28. నాగర కర్నూలు | .... శ్రీ మల్లు అనంతరాములు |
| 29. మహబూబ్‌నగర్ | .... శ్రీ మల్లికార్జున్ |
| 30. హైదరాబాద్ | .... శ్రీ కె. ఎస్. నారాయణ |
| 31. సికిందరాబాద్ | .... శ్రీ పి. శివశంకర్ |
| 32. సిద్దిపేట (ఎస్.సి.) | .... శ్రీ నంది యల్లయ్య |
| 33. మెదక్ | .... శ్రీమతి ఇందిరాగాంధీ |
| 34. నిజామాబాద్ | .... శ్రీ ఎమ్. రామ్‌గోపాల్‌రెడ్డి |
| 35. ఆదిలాబాద్ | .... శ్రీ జి. నరసింహారెడ్డి |
| 36. పెద్దపల్లి (ఎస్.సి.) | .... శ్రీ కె. రాజమల్లు |
| 37. కరీంనగర్ | .... శ్రీ ఎమ్. సత్యనారాయణ రావు |
| 38. హనుమకొండ | .... శ్రీ పి. వి. నరసింహారావు |
| 39. వరంగల్ | .... శ్రీ ఎమ్. కమాలుద్దీన్ అహ్మద్ |
| 40. ఖమ్మం | .... శ్రీ జలగం కొండలరావు |
| 41. నల్గొండ | .... శ్రీ తుమ్మలపల్లి దామోదరరెడ్డి |
| 42. మిర్యాలగూడ | .... శ్రీ జి. ఎస్. రెడ్డి |

## ఆంధ్రప్రదేశ్ నుంచి రాజ్యసభ సభ్యులు (1, మార్చి, 1980)

1. శ్రీ అల్లూరి సర్వారాయుడు చౌదరి
2. శ్రీ భమిడిపాటి కృష్ణమోహన్
3. శ్రీమతి రోడామిస్త్రీ
4. శ్రీ వేముల చెన్నకేశవరావు
5. సయద్ రహమత్ అలి
6. శ్రీ జి. స్వామి
7. శ్రీ వి. బి. రాజు
8. వెనిగెళ్ళ సత్యనారాయణ (మరణించారు. ఖాళీగాఉన్నది.)
9. మహమ్మద్ రహమతుల్లా
10. శ్రీ కె. ఎల్. ఎన్. ప్రసాద్
11. శ్రీ పాలవలస రాజశేఖరం
12. శ్రీ ఎం. ఆర్. కృష్ణ
13. శ్రీ టి. అంజయ్య
14. శ్రీ హౌస్ మొహియుద్దీన్ షేక్
15. శ్రీ ఎన్. పి. వెంగళ్రాయ నాయుడు
16. శ్రీ బుద్ధప్రియమౌర్య
17. శ్రీ చెదలవాడ వెంకటరావు
18. శ్రీ బి. సత్యనారాయణరెడ్డి

# 36

# జిల్లాల సమాచారం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మొత్తం 23 జిల్లాలు ఉన్నాయి. అందులో రంగారెడ్డి 1978 లోనూ, విజయనగరం 1979 లోనూ కొత్తగాఏర్పడ్డాయి. రాష్ట్రంలోని జిల్లాలలో శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరుజిల్లాలు సముద్రతీరాన ఉన్నాయి. వీటినికోస్తాఆంధ్రాగా వ్యవహరిస్తారు. ఇటీవలి కాలంలో ఈ ప్రాంతానికి సాగరసీమ అనే పేరుకూడా వ్యవహారంలోకి వచ్చింది. చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలు రాయలసీమగా వ్యవహారంలో ఉన్నాయి. మహబూబ్‌నగర్, నల్గొండ, వరంగల్లు, ఖమ్మం, హైదరాబాదు, రంగారెడ్డి, మెదక్, నిజామాబాదు, కరీంనగర్, ఆదిలాబాదు జిల్లాలను తెలంగాణా ప్రాంతంగా వ్యవహరిస్తారు.

జిల్లాలవారీ సమాచారాన్ని ముందు పేజీలలో వివరించాం. వీటిలో రంగారెడ్డి, విజయనగరం జిల్లాలు ఈమధ్యనే ఏర్పడినవి. వీటిని గురించిన సమగ్రమైన సమాచారం లభించక పోవడం వల్ల ప్రత్యేకంగా తెలియ జేయడం లేదు.

## అనంతపురం జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 19,125 చ.కి.మీ. లు |
| జనాభా | : | 21.15 లక్షలు (1971) |
| | | పురుషులు 10.86 లక్షలు, స్త్రీలు 10.29 లక్షలు |
| జన సాంద్రత | : | చ.కి. మీ కు 111 మంది |
| ముఖ్య కేంద్రం | : | అనంతపురం |

మౌర్యులు, పల్లవులు, చాళక్యులు, రాష్ట్రకూటులు, చోళులు, విజయనగర రాజులు, మొగలాయీలు బ్రిటిష్‌వారు మొదలైన వారు పాలించిన ఈ ప్రాంతం చారిత్రకంగానే కాకుండా వజ్రాలకు, శిల్పాలకు పేరెన్నిక గన్నది. 1882 లో ఈ ప్రాంతం అనంతపురం జిల్లాగా అవతరించింది.

***భౌగోళిక స్వరూపం :*** ఈ జిల్లా దత్త మండల జిల్లాలలో దక్షిణ భాగాన చిట్టచివరిది. ఉత్తరాన కర్నూలు జిల్లా,కర్ణాటకరాష్ట్రం దక్షిణాన కర్నాటకరాష్ట్రం,తూర్పున చిత్తూరు,కడప జిల్లాలు, పశ్చిమాన కర్నాటక రాష్ట్రం దీని సరిహద్దులు. జిల్లా స్వరూపాన్నిబట్టి దీనిని ఉత్తర ప్రాంతం మధ్యప్రాంతం,పీఠభూమిప్రాంతం అని మూడుభాగాలుచేయవచ్చు. రాష్ట్రంలోని అనా

వృష్టి ప్రాంతాలలో ఇది మొదటి జిల్లా. దీనికి కారణం దక్షిణ భారత ద్వీపకల్పంలో దీని భౌగోళికస్థితే. జిల్లా ఉత్తర ప్రాంతమైన గుత్తి, తాడిపత్రి తాలూకాలలో ఎక్కువభాగం నల్ల రేగడి నేలలు. దక్షిణ భాగమైన హిందూపూరు, మడకశిర తాలూకాలు మైసూరు పీఠభూమిలో భాగాలు. జిల్లాలో ఎర్ర ఇసుక, ఎర్రనేల, ఎర్రరేగడి, నల్లనేల, నల్లరేగడి, నల్ల ఇసుక నేలలు అని ఆరు విధాలయిన నేలలు ఉన్నాయి. జిల్లాలో పేర్కొనదగిన కొండలు ముచ్చు కోట, నాగ సముద్రం, మల్లప్ప కొండలు.

***శీతోష్ణస్థితి, వర్షపాతం :*** వేసవిలో వేడి ఎక్కువ. పీఠభూమి ప్రాంతం తక్కిన ప్రాంతం కన్నా చల్లగాఉంటుంది. గాలిలో తేమతక్కువ. దైనిక గరిష్ఠ ఉష్ణోగ్రత 12.5°C, కనిష్ఠ ఉష్ణోగ్రత 21.5°C. సంత్సరంలో అత్యధిక ఉష్ణోగ్రత 40.6° `, అత్యల్పఉష్ణోగ్రత 12.2°C. రాష్ట్రమంతటిలోను అత్యల్ప వర్షపాతం గల జిల్లా ఇదే. సంవత్సరంలో వర్షంపడే సగటు రోజులు 39.9. సగటు వర్షపాతం 545 మి.మీ. పెనుగొండలో అత్యధిక వర్షపాతం, కళ్యాణ దుర్గంలో అత్యల్ప వర్షపాతం ఉంటాయి.

***నదులు :*** ముఖ్యమైన నది పెన్నా నది. ఇతర నదులు చిత్రావతి, దాని ఉపనది కుశావతి, స్వర్ణముఖి, తడికలేరు, ఎండెమేరు, మద్దులేరు, పాపాఘ్ని మొదలైనవి.

***అడవులు :*** అడవుల విస్తీర్ణం 1,93,690 హెక్టార్లు, అంటే జిల్లా విస్తీర్ణంలో 10.1 శాతం అడవి ప్రాంతం. రాష్ట్రమంతటిలో తక్కువ అడవులున్న జిల్లా ఇదే. ఉన్న అడవులు ఆర్థికంగా విలువైనవి కావు. జిల్లా అడవులలో చాలాభాగంలో చెట్లు లేవు. కదిరి, పెనుగొండ తాలూకాలలో మాత్రం దట్టమైన అడవులున్నాయి. కలప, వెదురు, వంట చెరకు ఈ అడవుల నుంచి లభిస్తాయి.

***ఖనిజ సంపద :*** ధర్మవరం తాలూకా రామగిరివద్ద బంగారుగని ఉంది. వజ్రకరూర్, లత్తవరం వద్ద వజ్రాలు లభిస్తాయని ప్రతీతి. తాడిపత్రి - అనంతపురం రోడ్డు సమీపంలో మేలురకం ముగ్గురాయి లభిస్తుంది. తాడిపత్రి తాలూకాలో సున్నపురాయి లభిస్తుంది.

***వ్యవసాయం, పంటలు :*** మెట్టభూమి ఎక్కువ కాబట్టి ప్రధానమైన పంట జొన్న, ఇతర పంటలు వరి, సజ్జ, కొర్ర, వ్యాపార పంటలు వేరుశెనగ, ప్రత్తి, ఆముదాలు, మిరప, ధనియాలు; పప్పు ధాన్యాలలో ఉలవలు ముఖ్యమైనవి. తోటలలో దానిమ్మ, ద్రాక్ష, జామ ముఖ్యమైనవి. మొత్తం పంటభూమి 5,59,000 హెక్టార్లు. ఆహార పంటల భూమి 3,90,000 హెక్టార్లు. వరిప్రాంతం 61,000, హెక్టార్లు. శాశ్వతమైన పచ్చికబయలు 26,000 హెక్టార్లు వ్యవసాయేతర ప్రయోజనాలకు 1,57,000 హెక్టార్లు ఉంది. ఆహార ధాన్యాల ఉత్పత్తి 36' లక్షల టన్నులు. వరి ఉత్పత్తి 1,12,000 టన్నులు. హెక్టారుకు ఉత్పాదక శక్తి 1,86 కి. గ్రా. మొత్తం కమతాలు 2,80,576.

***నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :*** జిల్లాలో నదులు వర్షాధారమైనవి. చెప్పుకోదగిన నీ వనరులు లేవు. జిల్లామొత్తంలో 1,94,228 హెక్టార్లకు నీటిపారుదల సౌకర్యం ఉంది. కా

పల ద్వారా 38,596; చెరువుల ద్వారా 59,783: బావుల ద్వారా 88,014; ఆయిల్ ఎల క్ట్రిక్ ఇంజన్ల ద్వారా 11,835 హెక్టార్ల భూమి సాగవుతున్నది. మొత్తం పంట భూమిలో నీటి పారుదల సౌకర్యం గల భూమి 19.6 శాతం.

1980 మార్చినాటికి 736 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యముంది.

*పరిశ్రమలు :* అనంతపురం, గుంతకల్లు, హిందుపూరు పారిశ్రామిక కేంద్రాలు. ఆహా రోత్పత్తుల మిల్లులు, కాటన్ టెక్స్‌టైల్స్ ప్రధాన పరిశ్రమలు. ఈ జిల్లాలో ఒక ఆయిల్ టెక్నలాజికల్ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్ ఉంది. పరిశ్రమల వార్షిక నివేదిక ప్రకారం ఈ జిల్లాలో 227 పరిశ్రమలు, వాటిలో 7,113 ఉద్యోగులు ఉన్నారు. ఉత్పాదక మూలధనం రూ.660.16 లక్షలు. ఉత్పత్తి విలువ రూ. 3,088.92 లక్షలు.

చేనేత తయారీలకు ఈ జిల్లా ప్రసిద్ధి చెందంది. ముఖ్యంగా ధర్మవరం పట్టు చీరలు, కళ్యాణదుర్గం కంబళ్ళు ఈ జిల్లా ఉత్పత్తులే. ఈ జిల్లాలో చిన్న తరహా పరిశ్రమల కింద 10.15 కోట్లరూపాయల పెట్టుబడితో 1,428 యూనిట్లున్నాయి.

*మున్సిపాలిటీలు :* 7 — అనంతపురం, ధర్మవరం, గుంతకల్లు, హిందూపురం, కదిరి, రాయదుర్గం, తాడిపత్రి.

*రెవెన్యూ డివిజన్లు :* 3— అనంతపురం, ధర్మవరం, పెనుగొండ

*తాలూకాలు :* 11 - అనంతపురం, తాడిపత్రి, గుత్తి, ఉరవకొండ, ధర్మవరం, కళ్యాణదుర్గం, రాయదుర్గం, హిందూపురం, కదిరి, మడకసిర, పెనుగొండ.

*నగరాలు :* 11 — అనంతపురం, ధర్మవరం, గుత్తి, గుంతకల్లు, హిందుపురం, కదిరి, కళ్యాణదుర్గం, పెనుగొండ, రాయదుర్గం, తాడిపత్రి, ఉవరకొండ.

*పంచాయతీసమితులు* 16; *గ్రామాలు* 958; *గ్రామ పంచాయతీలు* 736.

*రవాణా :* పి. డబ్ల్యు. డి. నిర్వహణలో 1,620 కి. మీ; జిల్లాపరిషత్, పంచాయతీల నిర్వహణలో 6,130 కి. మీ. పొడవురోడ్లు ఉన్నాయి. 413 కి. మి.ల నిడివి రైల్వేమార్గా లున్నాయి.

*సహకార సంఘాలు :* జిల్లాలోని మొత్తం సహకార సంఘాలు 1,181. వీటిలో సహ కార సంఘాలు 1,005, చేనేత సహకార సంఘాలు 90, పారిశ్రామిక సహకార సంఘాలు 49, మత్స్యకార్ల సహకార సంఘాలు 11, పాలసరఫరా సహకార సంఘాలు 26.

*విద్య :* జిల్లాలో 2,193 ప్రాథమిక పాఠశాలలు, 135 అప్పర్ ప్రైమరీ పాఠశాలు, 152 సెకండరీ పాఠశాలలు, 14 జూనియర్ కళాశాలలు, 9 డిగ్రీ కళాశాలలు ఉన్నాయి. ఇవికాక పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటర్, ఒక ఇంజనీరింగ్ కళాశాల, ఒక పాలిటెక్నిక్ కళాశాల కూడా ఉన్నాయి. అక్షరాస్యుల శాతం 23.84.

*వైద్యం :* 15 అల్లోపతి వైద్యశాలలు, 34 డిస్పెన్సరీలు, 59 ఆయుర్వేద వైద్యశాలలు 3 యునాని వైద్యశాలలు, 1 హోమియోపతి వైద్యశాల ఉన్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* ధర్మవరం, పెనుకొండ, లేపాక్షి, గుత్తి, రాయదుర్గం, పెన్న హోబిలం, కదిరి, తాడిపత్రి, ఆలూరుకోన.

*శాసనసభ నియోజక వర్గాలు :* 14 — కదిరి, నల్లమడ, గోరంట్ల, హిందూపురం, మడకసిర, పెనుకొండ, కళ్యాణదుర్గం, రాయదుర్గం, ఉరవకొండ, గుత్తి, సింగనమల, అనంతపురం, ధర్మవరం, తాడిపత్రి.

*లోక్‌సభ నియోజకవర్గాలు :* 2— హిందూపురం, అనంతపురం.

*ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న :*

| | | |
|---|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | : | 17 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | : | 73 |
| బ్యాంక్ ఆఫీసులు | : | 92 |
| షెడ్యూల్డ్ కులాలు, వెనకబడి వర్గాలవారికి ఇళ్ళ స్థలాల పంపకం | : | 5,246 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | : | 63 |
| " తెగల " " | ; | 5 |
| మార్కెట్ కమిటీలు | : | 11 |
| పోస్టాఫీసులు | : | 940 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | : | 92 |
| టెలిఫోన్ ఎక్స్ ఛేంజీలు | : | 30 |
| పబ్లిక్ కాల్ ఆఫీసులు | : | 34 |
| నివాస గృహాలు | : | 3,78,371 |
| షెడ్యూల్డ్ కులాలవారి జనాభా (1971) | : | 2.78 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగల వారి జనాభా (1971) | : | 0.65 లక్షలు |

## ఆదిలాబాద్ జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 16,133 చ. కి. మీలు |
| జనాభా | : | 1971 నాటికి 12.88 లక్షలు |
| | : | పురుషులు 6.52 లక్షలు |
| | : | స్త్రీలు 6.36 లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి. మీ కు 80 మంది. |
| ముఖ్య కేంద్రం | : | ఆదిలాబాదు |

చరిత్రలో ఎద్లాబాద్ అనే పేరుతో చెలామణిలో ఉండిన ఈ ప్రాంతాన్ని గోండులు, వెలమరాజులు, మహమ్మదీయులు పరిపాలించారు. దక్కను బీరారు చరిత్రలో పేరుగాంచిన మాహూర్ ఈ ప్రాంతంలోనే ఉంది. ఇంకా ఈప్రాంతంలోని నిర్మల్ మానిక్ ఘడ్, తిముర్ని గ్రామాలు కూడా చారిత్రకంగా ప్రసిద్ధి కెక్కినవి. 1905 లో ఆదిలాబాదు జిల్లా ఏర్పడింది.

**భౌగోళిక స్వరూపం :** తూర్పు, పడమర, ఉత్తర దిశలలో మహారాష్ట్ర, దక్షిణాన నిజామాబాద్, కరీంనగరుజిల్లాలు సరిహద్దులు. ఈ జిల్లా రాష్ట్రానికి ఉత్తర సరిహద్దులలో ఉంది. ఈ జిల్లాలో సహ్యాద్రి పర్వత పంక్తి 280 కి. మీ దూరం వ్యాపించి ఉంది. తక్కిన ప్రదేశమంతా అక్కడక్కడ చిన్న కొండలు, గుట్టలతో కూడిన పీఠభూమి. ఈ జిల్లాలోని 72 శాతం గ్రామాలలో నల్లరేగడి నేలలు, 19 శాతం గ్రామాలలో చెలకనేలలు, తక్కిన గ్రామాలలో దుబ్బనేలలు ఉన్నాయి.

**శీతోష్ణస్థితి, వర్షపాతం :** వేసవి కాలంలో వేడిఎక్కువ. గరిష్ఠ ఉష్ణోగ్రత 40.6° సెంటి గ్రేడ్. కనిష్ఠ ఉష్ణోగ్రత 15.6° సెంటి గ్రేడ్. సాధారణవర్షపాతం సాలుకు 995.1 మి.మీలు. ఈ జిల్లా తూర్పుభాగంలో వర్షపాత మెక్కువ.

**నదులు :** ఈ జిల్లాలో ముఖ్యమైనది గోదావరి. తక్కినవి వార్ధా, ప్రాణహిత, పెన్ గంగ, పెద్దవాగు మొదలైనవి.

**అడవులు :** అడవుల విస్తీర్ణం 6,42,985 హెక్టార్లు అంటే ఈ జిల్లా విస్తీర్ణంలో 40 శాతం అడవులు. ఎక్కువభాగం అడవులుగల జిల్లాలలో ఇది రెండవస్థానం వహిస్తుంది. ప్రభుత్వానికి సాలుకు నాలుగున్నర కోట్ల రూపాయలు ఆదాయం ఈ అడవులవల్ల లభ్యమవు తున్నది. ముఖ్యమైన ఉత్పత్తులు మంచిరకం కలప, వెదురు, బీడీఆకు, టేకు, వంటచెరకు కట్టెబొగ్గు, చారపప్పు, ఇప్పపువ్వు, యూకలిప్టస్ మొదలైనవి. నలభై సంవత్సరాల క్రితం ఈ అడవులలో గిరిజనులు పోడు వ్యవసాయం ప్రారంభించారు. అడవులలో 54 శాతం టేకు అడవులు, 27 శాతం వెదురు అడవులు ఉన్నాయి.

**ఖనిజసంపద :** ఇక్కడ లభించే ముఖ్యమైన ఖనిజాలు బొగ్గు, ముద్దబంకమన్ను. సున్నపురాయి, మాంగనీసు, ఇనుప ఖనిజం, భవన నిర్మాణంలో ఉపయోగించే రాళ్ళు. ప్రాణహిత-గోదావరి లోయలో బొగ్గు నిలవలు ఉన్నాయి. ఫైర్‌క్లే నిక్షేపాలు ఆసిఫాబాదు తాలూకాలో ఉన్నాయి. సున్నపురాతి నిలువలు సుమారు 50 మిలియన్ టన్నులు కూడా ఆసిఫాబాదు ప్రాంతంలో ఉన్నాయి. ఇవికాక 600 మిలియన్ టన్నుల సున్నపురాతి నిక్షేపాలు రిజర్వు అడవులలో ఉన్నాయి.

**వ్యవసాయము, పంటలు :** ఈ జిల్లాలో ప్రధానమైన పంటలు జొన్న, అపరాలు, పత్తి నువ్వులు ఆహారపు పంటల కింద 4,27,000 హెక్టార్ల భూమి, ఆహారేతర పంటల కింద 1,44,000 హెక్టార్లభూమి ఉంది. శాశ్వతమైన పచ్చికబీడు 46,000. రకరకాల పంటలకింద 6,000 హెక్టార్లు, వ్యవసాయేతర ప్రయోజనాలలో 65,000 హెక్టార్లభూమి ఉన్నది.

**నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :** లక్సెట్టి పేటలోని కడెం ప్రాజెక్టు ఈ జిల్లాలో చెప్పుకో దగిన నీటి వనరు. ఈ జిల్లాలో నీటి పారుదల సౌకర్యం తక్కువ. మొత్తం నీటి పారుదల సౌకర్యంగల భూమి 2,38,000 హెక్టార్లు. కాలువల కింద 13,000 హెక్టార్ల చెరువుల కింద 22,000 హెక్టార్లు, బావుల కింద 3,000 హెక్టార్లు. ఇతర వనరుల కింద 1000 హెక్టార్లు సాగు అవుతున్నది. 1980 మార్చి నాటికి విద్యుచ్ఛక్తి సౌకర్యమొందిన గ్రామాలసంఖ్య771.

*పరిశ్రమలు :* అపారమైన అటవీ సంపద, ఖనిజ సంపద ఉన్నా కూడా ఈ జిల్లా అన్ని రంగాలలోను వెనకబడి ఉంది. ఈ జిల్లాలోని ప్రధాన పరిశ్రమలు సిర్పూర్ కాగజ్ నగర్‌లోని సిర్పూర్ పేపరుమిల్లు, మంచిర్యాలలో ఎ.సి.సి వారి సిమెంటు ఫ్యాక్టరీ. బెల్లంపల్లి పరిసరాలలో బొగ్గుగనుల తవ్వకం జరుగుతున్నది. 1976-77 వార్షిక సర్వే ప్రకారం ఈ జిల్లాలో రూ. 1,161 లక్షల నికర పెట్టుబడితో 16,914 మంది కార్మికులతో 58 పరిశ్రమలు రూ. 3,776 లక్షల ఉత్పత్తి విలువతో పనిచేస్తున్నాయి. ఈ జిల్లాలో రూ. 0.98 కోట్ల పెట్టుబడితో పనిచేస్తున్న చిన్నతరహా పరిశ్రమలు 151 ఉన్నాయి.

నిర్మల్ బొమ్మలు, పెయింటింగ్స్ ఈ జిల్లాలలోని చెప్పుకోదగ్గ చేతివృత్తులు. వీటికి ప్రపంచమంతటా ప్రాచుర్యముంది. ఇవికాక, జిల్లాలో చెన్నూరు తాలూకాలో టస్సర్ సిల్కు పరిశ్రమలు కూడా ఉన్నాయి.

*మునిసిపాలిటీలు :* 5 – ఆదిలాబాదు, భైన్సా, కాగజ్‌నగర్, మంచిర్యాల, నిర్మల్.

*రెవిన్యూ డివిజన్‌లు :* 3 - ఆదిలాబాదు, నిర్మల్, అసిఫాబాదు

*తాలూకాలు :* 10 – ఆదిలాబాదు, బోథ్, ఉట్నూరు, నిర్మల్, మధోల్, ఖానాపూర్, లక్సెట్టిపేట, ఆసిఫాబాదు, సిర్పూర్, చిన్నూరు.

*నగరాలు :* 11 -- ఆదిలాబాదు, ఆసిఫాబాదు, బెల్లంపల్లి, భైన్సా, కాగజ్‌నగర్, కాగజ్‌నగర్ నాన్-మున్సిపల్ ప్రాంతం, మండమర్రి, మంచిర్యాల, నిర్మల్, పోచంపాడు ప్రాజెక్టు టౌన్‌షిప్, సిర్పూరు.

*పంచాయతీ సమితులు :* 11 *గ్రామాలు :* 1,609 *గ్రామపంచాయతీలు :* 587

*రవాణా :* ఈ జిల్లాలో పి. డబ్ల్యు. డి. ఆధ్వర్యం కింద 1,157 కి.మీ. లు, జిల్లా పరిషత్తు, పంచాయతీల ఆధ్వర్యం కింద 1,317 కి.మీ. లు నిడివి రోడ్లున్నాయి. ఉత్తర, దక్షిణ భారతదేశాన్ని కలిపే మద్రాసు - ఢిల్లీ రైలుమార్గం ఈ జిల్లా ద్వారా పోతున్నది. ఇదిగాక ఆదిలాబాదునుంచి ముద్‌కేడ్ (మహారాష్ట్ర)కు మరో రైలుమార్గముంది.

*సహకార సంఘాలు :* ఈ జిల్లాలోని మొత్తం సహకార సంఘాల సంఖ్య 1,535. వీటిలో 1,427 సహకార సొసైటీలు, 14 చేనేత సహకార సంఘాలు, 87 పారిశ్రామిక సహకార సొసైటీలు, 7 పాల సరఫరా సహకార సొసైటీలున్నాయి.

*విద్య :* ఈ జిల్లాలో 1,129 ప్రాథమికపాఠశాలలు, 115 అప్పర్ ప్రైమరీపాఠశాలలు 8 జూనియర్ కళాశాలలు, 3 డిగ్రీ కళాశాలలున్నాయి. ఒక ఉపాధ్యాయ శిక్షణసంస్థ కూడా ఉంది. జిల్లాలో అక్షరాస్యుల శాతం 14.15.

*వైద్యం :* 33 ప్రభుత్వ అల్లోపతి వైద్యశాలలు, 45 ఆయుర్వేద వైద్యశాలలు, 4 యునాని వైద్యశాలలున్నాయి.

*దర్శించతగ్గ ప్రదేశాలు :* నిర్మల్ తాలూకాలోని దుర్గాలు, కోటలు, చారిత్రకంగా అభిరుచి కలిగించే ప్రదేశాలు. ఇవికాక నిర్మల్ చేతివృత్తులకు చాలా ప్రసిద్ధి చెందింది.

*శాసనసభ నియోజక వర్గాలు :* 9. - ముదోల్, బోధ్, నిర్మల్, ఆదిలాబాదు, ఖానాపూర్, అసిఫాబాదు, లక్సెట్టిపేట, సిర్పూరు, చిన్నూరు

*లోక్‌సభ నియోజకవర్గం :* 1. — ఆదిలాబాదు.

**ఈజిల్లాలో 1977 - 78 నాటికి ఉన్న**

| | |
|---|---|
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 5 |
| బ్యాంక్ ఆఫీసులు | 41 |
| షెడ్యూల్డ్‌కులాలు, వెనకబడిన వర్గాలవారికి ఇళ్లస్థలాలపంపకం | 5,080 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 35 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 20 |
| మార్కెటింగ్ కమిటీలు | 10 |
| పోస్టాఫీసులు | 392 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 51 |
| టెలిఫోన్ ఎక్ఛేంజ్‌లు | 22 |
| పబ్లిక్‌కాల్ ఆఫీసులు | 24 |
| నివాసగృహాలు | 2,48,946 |
| షెడ్యూల్డ్‌కులాలవారి జనాభా ( 1971 ) | 2.27 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా ( 1971 ) | 1.69 లక్షలు |

## కడపజిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 15,356 చ. కి. మీ. లు |
| జనాభా | : | 1971నాటికి 15.77 లక్షలు పురుషులు 8.05 లక్షలు స్త్రీలు 7.72లక్షలు |
| జనసాంద్రత | : | చ కి. మీ. కు 103 మంది |
| ముఖ్య కేంద్రం | : | కడప |

ఒకప్పుడు హిరణ్య రాష్ట్ర మనే పేరుతో చలామణిలో ఉండిన ఈ జిల్లాకు ప్రాచీన చరిత్ర ఉంది. శాతవాహనులు ఆ తరవాత క్రీ. శ. 2 వ శతాబ్దిలో పల్లవులు ఈ ప్రాంతాన్ని పరిపాలించినట్లు ఆధారాలున్నాయి. చాళక్యుల జన్మస్థలం ఇది. తరవాతి కాలంలో తెలుగు చోళులు, కాకతీయులు, విజయనగర రాజులు, గోల్కొండ నవాబులు, నైజాం నవాబులు, బ్రిటిష్‌వారు ఈ ప్రాంతాన్ని పాలించారు.

*భౌగోళిక స్వరూపం :* తూర్పున నెల్లూరుజిల్లా, పశ్చిమాన అనంతపురంజిల్లా, దక్షిణాన చిత్తూరుజిల్లా, ఉత్తరాన కర్నూలు, ప్రకాశం జిల్లాలు ఈ జిల్లా సరిహద్దులు. నైసర్గి

కంగా ఈ జిల్లాను కొండప్రాంతం, పీఠభూమి, నల్లనేల ప్రాంతమని మూడు భాగాలుగా చెప్పవచ్చు.

వెలిగొండలు, పాలకొండలు మొదలైన కొండలున్నాయి. జిల్లాలో నల్లరేగడి, ఎర్ర రేగడి, ఇసుక పొర నేలలున్నాయి.

**శీతోష్ణస్థితి, వర్షపాతం :** జిల్లా మొత్తంమీద ఫిబ్రవరి నుంచి మే వరకు వేడిగా ఉంటుంది. జిల్లా తూర్పు భాగాన ఉష్ణోగ్రత తక్కువ. జిల్లాలో సగటు గరిష్ఠ ఉష్ణోగ్రత 35.1°C. కనిష్ఠ ఉష్ణోగ్రత 24.2°C. సంవత్సరంలో వర్షం కురిసే సగటు రోజులు 41. వర్షపాతం సాలుకు 685.5 మి. మీ. జమ్మలమడుగు తాలూకాలో అత్యల్ప వర్షపాతం, సిద్ధవటం తాలూకాలో అత్యధిక వర్షపాతం ఉంటాయి.

**నదులు :** ప్రధానమైన నది పెన్న. దీనికి ఉపనదులు చిత్రావతి, పాపాఘ్ని, కుందు, చెయ్యేరు, సగిలేరు.

**అడవులు :** అడవుల విస్తీర్ణము 4,96,672 హెక్టార్లు. అంటే జిల్లా విస్తీర్ణంలో 32.3 శాతం అడవులు. పులివెందుల తాలూకాలోవి తప్ప తక్కినవన్నీ ఆర్థికంగా విలువైనవి. నల్లచేవ, ఎర్రచేవ, ఏపి మొదలైన విలువైన కలప జాతులు ఈ అడవులలో లభిస్తాయి. ఎర్రచందనం విదేశీ మారక ద్రవ్యం ఆర్జిస్తున్నది.

**ఖనిజసంపద :** ఆస్ బెస్టాస్, ముగ్గురాయి, సున్నపురాయి, క్లే, ముడి ఇనుము ఇక్కడ లభించే ప్రధాన ఖనిజాలు. రాతినార, బ్రాహ్మణపల్లి, లింగాల గ్రామాల మధ్య సుమారు 14,400 టన్నులు లభిస్తుందని అంచనా. మేలు రకం పింగాణీ పరిశ్రమలకు పారిశుధ్య సామాగ్రి తయారీకి అవసరమయ్యే తెల్ల బంకమన్ను, ముద్ద బంకమన్ను పెద్ద మొత్తాలలో ఈ జిల్లాలో లభిస్తుంది.

**వ్యవసాయం, పంటలు :** జొన్న, వరి, రాగి, సజ్జ, పత్తి, వేరుశెనగ, నారింజ, అరటి తియ్యదోస, నిమ్మ ప్రధాన పంటలు. ఆహార ధాన్యాలను ఇతర ప్రాంతాల నుంచి ఈ జిల్లా ఎప్పుడూ దిగుమతి చేసుకొంటుంది. పండ్లు ఇతర ప్రాంతాలకు ఎగుమతి చేస్తుంది. ఈ జిల్లాలో మొత్తం పంటల ప్రాంతం 4,33,000, ఆహార పంటల ప్రాంతం 3,09,000 ఆహారేతర పంటలు 1,24,000, శాశ్వతమైన పచ్చిక బయలు 27,000 వ్యవసాయేతర ప్రయోజనాల కింద 138000, సాగుకు యోగ్యమైన బంజరు 42000 హెక్టార్లు ఉంది. మొత్తం ఆహార ధాన్యాల ఉత్పత్తి 3.13 లక్షల టన్నులు. వరి పండిచే భూమి 74000 హెక్టార్లు. వరి ఉత్పత్తి 1.12 లక్షల టన్నులు. హెక్టారుకు ఉత్పాదకశక్తి 1869 కి. గ్రా. కమతాలు 2,80,576.

కోడూరు సమీపంలోని అనంతరాజుపేట వద్ద సుప్రసిద్ధ ఫల పరిశోధన కేంద్రముంది.

**నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :** ఈ జిల్లాలో పెన్నానది, కె.సి. కాలువ ప్రధానమైన నీటి వనరులు. జిల్లాలో 8 తాలూకాలు తరచుగా కరువుకు గురవుతుంటాయి. జిల్లా మొత్తం మీద కాలువల కింద 24 వేల హెక్టార్లు, చెరువుల కింద 22 వేల హెక్టార్లు, బావుల కింద 66 వేల

హెక్టార్లు తక్కిన వనరుల కింద 11 వేల హెక్టార్లు సాగుబడిలో ఉన్నాయి. 1980 మార్చి నాటికి 564 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించడం జరిగింది.

*పరిశ్రమలు :* ఈ జిల్లాలో ఖనిజసంపద, అటవీ సంపద అపారంగా ఉన్నా, పారిశ్రామికీకరణ కొరత బాగా ఉంది. పరిశ్రమల వార్షిక నివేదిక ప్రకారం ఈ జిల్లాలో 148 పరిశ్రమలున్నాయి. వాటిలో 5,720 కార్మికులు పనిచేస్తున్నారు. ఉత్పత్తి మూలధనం రూ. 620.8 లక్షలు. ఉత్పత్తి విలువ రూ. 39,52.83 లక్షలు

కడప, ప్రొద్దుటూరులలో ఇండస్ట్రియల్ ఎస్టేట్లున్నాయి. రాయలసీమ అభివృద్ధిపథకం కింద కడపలో చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్ నెలకొల్పడం జరిగింది. మొత్తంమీద ఈ జిల్లాలో 863 యూనిట్లున్నాయి. వీటి పెట్టుబడి రూ. 9.05 కోట్లు.

జిల్లాలో ముఖ్యమైన చేతి వృత్తి నేత పరిశ్రమ. పుల్లంపేట జరీ అంచు చీరలు సుప్రసిద్ధాలు. ఇవి కాక మాధవరం వంటి స్థలాలలో సన్ననూలు నేత విరివిగా ఉంది.

*మునిసిపాలిటీలు :* 2 — కడప, ప్రొద్దుటూరు.

*రెవిన్యూ డివిజన్లు :* 3 — కడప, రాజంపేట, జమ్మలమడుగు

*తాలూకాలు :* 9 - కడప, కమలాపురం, రాయచోటి, రాజంపేట, సిద్ధవటం, బద్వేలు, జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, పులివెందుల

*పంచాయ సమితులు :* 12 ; *గ్రామాలు :* 972 ; *గ్రామపంచాయతీలు :* 644

*రవాణా :* పి. డబ్ల్యు. డి. నిర్వహణలో 1,331 కి.మీ, జిల్లాపరిషత్తు, పంచాయతీల నిర్వహణలో 2,776 కి.మీ. ల పొడవు రోడ్లున్నాయి. ఈ జిల్లాలో 195 కి.మీ. ల పొడవు రైల్వే మార్గముంది.

*సహకార సంఘాలు :* 1975-76 నాటికి జిల్లాలో మొత్తం 1,212 సహకారసొసైటీ లున్నాయి. వాటిలో 1,017 సహకార సొసైటీలు, 96 చేనేత సహకార సొసైటీలు, 79 పారిశ్రామిక సహకార సొసైటీలు, 3 మత్స్య సహకార సొసైటీలు, 17 పాల సరఫరా సహకార సొసైటీలు ఉన్నాయి.

*విద్య :* జిల్లాలో 2,151 ప్రాథమిక పాఠశాలలు, 159 అప్పర్ ప్రైమరీ పాఠశాలలు, 123 సెకండరీ పాఠశాలలు, 14 జూనియర్ కళాశాలలు, 5 డిగ్రీ కళాశాలలు ఉన్నాయి. రాయచోటిలో ఒక ఉపాధ్యాయ శిక్షణ సంస్థ ఉంది. జిల్లాలోని అక్షరాస్యుల శాతం 24.73.

*వైద్యం :* 9 అల్లోపతి ఆస్పత్రులు, 101 డిస్పెన్సరీలు, 83 ఆయుర్వేద వైద్యశాలలు 5 యునాని వైద్యశాలలు, 3 హోమియోపతి వైద్యశాలలు ఉన్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* పుష్పగిరి, వేంపల్లె, గండికోట, ఒంటిమిట్ట.

*శాసనసభ నియోజక వర్గాలు :* 11 - కోడూరు, రాజంపేట, రాయచోటి, లక్కిరెడ్డి పల్లి, కడప, బద్వేలు, మైదుకూరు, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు, కమలాపురం, పులివెందుల

*లోక్‌సభ నియోజక వర్గాలు :* 2 - రాజంపేట, కడప.

### ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | 14 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 102 |
| బ్యాంక్ ఆఫీసులు | 84 |
| షెడ్యూల్డ్‌కులాలు, వెనకబడిన వార్గాలవారికి ఇళ్ళస్థలాలపంపకం | 2,081 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 84 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 7 |
| మార్కెటింగ్ కమిటీలు | 9 |
| పోస్టాఫీసులు | 623 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 72 |
| టెలిఫోన్ ఎక్ఛేంజ్‌లు | 29 |
| పబ్లిక్‌కాల్ ఆఫీసులు | 89 |
| నివాసగృహాలు | 3,08,677 |
| షెడ్యూల్డ్ కులాలవారిజనాభా ( 1971 ) | 1.72 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా (1971) | 0.27 లక్షలు |

## కరీంనగర్ జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 11,824 చ.కి.మీటర్లు |
| జనాభా | : | 1971 నాటికి 19.63 లక్షలు<br>పురుషులు 9.89 లక్షలు<br>స్త్రీలు 9.74 లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి. మీటర్లకు 166 |
| ముఖ్యకేంద్రం | : | కరీంనగర్ |

చారిత్రక వివరాలు పూర్తిగా లభించనప్పటికీ తెలిసినంత వరకు ఈ ప్రాంతాన్ని కాకతీయరాజులు, బహమనీ సుల్తానులు, గోల్కొండ నవాబులు, మొగలాయీలు, నైజాం నవాబులు పాలించారని చెప్పటానికి తగిన ఆధారాలున్నాయి. జమ్మికుంట, మలంగూరు, ధర్మ పురి, జగిత్యాల, సోనిపేట మొదలైన గ్రామాలు చారిత్రకంగా చెప్పుకోదగ్గవి. ఒకప్పుడు ఎల్లందల జిల్లా పేరుతో ఉన్న ఈ ప్రాంతం 1906 లో జరిగిన జిల్లాల పునర్‌వ్యవస్థీకర ణలో భాగంగా ఈ ప్రాంతం కరీంనగర్ జిల్లాగా అవతరించింది.

***భౌగోళిక స్వరూపం :*** తూర్పున మధ్యప్రదేశ్, పశ్చిమాన నిజామాబాద్ జిల్లా, ఉత్త రాన ఆదిలాబాదు జిల్లా దక్షిణాన వరంగల్లు, మెదక్ జిల్లాలు ఈ జిల్లా సరిహద్దులు బాలా ఘాట్ పర్వత శ్రేణికి చెందిన మూడు పర్వత పంక్తులు, ఇవిగాక కందకల్లు కొండలు, రాఖీ

కొండలు, అక్కడక్కడ కొండలు, గుట్టలుఉన్నాయి. తక్కినభాగం పీఠభూమి. ఈ జిల్లాలో ముఖ్యంగా అంటే 65 శాతం గ్రామాలలో దుబ్బనేలలు, 27 శాతం రేగడి నేలలు, 5 శాతం చెలకనేలలు ఉన్నాయి.

***శీతోష్ణస్థితి, వర్షపాతం :*** వేసవికాలంలో ఎండలు తీవ్రంగా ఉంటాయి. జిల్లాలో మొత్తం శీతోష్ణస్థితి ఒకేమాదిరిగా ఉంటుంది. రామగుండంలోమాత్రం హెచ్చుతగ్గులుంటాయి. నవంబరు నుంచి ఫిబ్రవరి వరకు చల్లగా పొడిగా ఉంటుంది. రామగుండంలో ఉష్ణోగ్రత తీవ్రంగా ఉంటుంది. జిల్లాలో గరిష్ఠ ఉష్ణోగ్రత 43.3 సెంటిగ్రేడ్, కనిష్ఠ ఉష్ణోగ్రత 25° సెంటిగ్రేడు. సగటు వర్షపాతం సాలుకు 914.3 మిల్లీమీటర్లు.

***నదులు :*** ముఖ్యమైనవి గోదావరి, మానేరు, పెద్దవాగు.

***అడవులు :*** అడవుల విస్తీర్ణం 2,71,822 హెక్టార్లు అంటే జిల్లా విస్తీర్ణంలో 21.7 శాతం అడవులు మేలురకం కలప ఈ ప్రాంతంలో లభిస్తుంది.

***ఖనిజసంపద :*** నేలబొగ్గు నిక్షేపాలు ఈ జిల్లాలో ఉన్నాయి. 40 శాతం యినుముగల యినప ఖనిజం ఈ జిల్లాలో లభిస్తుంది సున్నపురాయి, సబ్బురాయి కూడా లభ్యమవుతున్నాయి.

***వ్యవసాయం, పంటలు :*** ఈ జిల్లాలోని నికర పంటభూమి 4,74,288 హెక్టార్లు రాష్ట్రంలో మొక్కజొన్న పంట అధికంగా ఈ జిల్లాలో పండుతుంది. ఇదికాక వరి, జొన్న, పెసర, ఉలవ, కంది, శనగ, వేరుశనగ, నువ్వులు, మిరప, పొగాకు, పత్తి, పసుపు పండుతున్నాయి. కొంతమేరకు చెరకు, ధనియాలు, ఆముదాలు పండుతున్నాయి. ఆహారపంటలు 385 వేల హెక్టార్లలోను, ఇతర పంటలు 41 వేల హెక్టార్లలోను పండుతున్నాయి. ఆహార ధాన్యాల ఉత్పత్తి 5. 87 లక్షల టన్నులు.

***నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :*** నీటి వనరులలో ప్రధానమైనవి బావులు, చెరువులు. కాలువల కింద 25 వేల హెక్టార్లు చెరువుల కింద 71 వేల హెక్టార్ల బావుల కింద 58 వేల హెక్టార్లు, ఇతర వనరుల కింద 7 వేల హెక్టార్లభూమి సాగవుతున్నది. మొత్తం నీటిపారుదల సౌకర్యంగల భూమి 161 వేల హెక్టార్లు. పోచంపాడు ప్రాజెక్టు పూర్తి అయితే జగిత్యాల, సుల్తానాబాద్... ట్టిపల్లి, పెద్దపల్లి, కరీంనగర్ తాలూకాలకు నీటిపారుదల సౌకర్యం కలుగుతుంది. మునేరు ...న్నపాడు, రాళ్ళవాగు అనే మధ్యతరహా చిన్నతరహా ప్రాజెక్టులు ఉన్నాయి.

1980 మార్చి నాటికి విద్యుచ్ఛక్తి సౌకర్యమున్న గ్రామాల సంఖ్య 855.

***పరిశ్రమలు :*** బొగ్గు, సున్నపురాయి నిక్షేపాలవల్ల పారిశ్రామికాభివృద్ధికి అవకాశాలెక్కువ ఉన్నాయి. ముఖ్యమైన పరిశ్రమలు రామగుండం థర్మల్ విద్యుత్ కేంద్రం, సింగరేణి బొగ్గుగనులు, ఎరువుల కర్మాగారం, కేశోరామ్ సిమెంటు ఫ్యాక్టరీ, స్పిన్నింగుమిల్లు మొదలవి. ఈ జిల్లాలో మొత్తం 108 ఫ్యాక్టరీలు ఉన్నాయి. 2,604 మంది కార్మికులు పని చేస్తున్నారు. ఉత్పత్తి రూ. 1693.95 లక్షలు. ఈ జిల్లాలో 683 చిన్నతరహా పరిశ్రమలున్నాయి. వీటి మొత్తం పెట్టుబడి రూ. 3.73 కోట్లు, చేనేత, బీడీ, ఫిలిగ్రీ మొదలైన చేతి

ప్రవృత్తులు ఈ జిల్లాలో చెప్పుకోదగినంతగా ఉన్నాయి. సంతనాల ప్రాజెక్టు, మంతెన తాలూకా రుద్రవరంపద్ద బుగ్గలవాగు ప్రాజెక్టు, సంగంపల్లి వద్ద పెద్దవాగు ప్రాజెక్టు, కృష్ణాజీరావుపేట వద్ద గంధం చెక్కుల ప్రాజెక్టు సిరిసిల్ల తాలూకా నిమ్మపల్లివద్ద మాలవాగు ప్రాజెక్టు ఈజిల్లా అభివృద్ధి పథకాలు.

*మునిసిపాలిటీలు :* 2 కరీంనగర్, జగిత్యాల

*రెవెన్యూ డివిజనులు :* 3 కరీంనగర్, పెదపల్లి, జగిత్యాల

*తాలూకాలు :* 7 హుజూరాబాద్, జగిత్యాల, కరీంనగర్, మంతెన, మెట్‌పల్లి, పెద్దపల్లి, సిరిసిల్ల.

*నగరాలు :* 10 జగిత్యాల, జనగాం, కరీంనగర్, కోరట్ల, కొత్తపల్లి, హవేలి, మంతెన, మెట్‌పల్లి, రామగుండం, సిరిసిల్ల, వేములవాడ.

*పంచాయతీ సమితులు :* 14

*గ్రామాలు :* 1087; గ్రామపంచాయతీలు 725.

*రవాణా :* పి. డబ్ల్యు. డి. ఆధ్వర్యంలో 991 కి.మీ పొడవుగల రోడ్లు, జిల్లా పరిషత్ పంచాయతీల ఆధ్వర్యంలో 2,616 కి.మీ పొడవుగల రోడ్లు ఉన్నాయి. కాజీపేట-బల్లార్షా రైలుమార్గం ఈ జిల్లాద్వారా పోతున్నది. మొత్తంమీద ఈ జిల్లాలోని రైలుమార్గం నిడివి దాదాపు 85 కి మీ. లు

*సహకార సంఘాలు:* జిల్లాలోని మొత్తం సహకారసంఘాల సంఖ్య 2,441 వీటిలో 117 సహకార సంఘాలు, 83 చేనేత సహకార సంఘాలు, 120 పారిశ్రామిక సహకార సంఘాలు, 22 మత్స్యకార్ల సహకార సంఘాలు, 9 సహకార పాలసరఫరా సహకార సంఘాలున్నాయి.

*విద్య :* ఈ జిల్లాలో అక్షరాస్యులు 15.31 శాతం. డిగ్రీ కళాశాలలు 5, జూనియర్ కళాశాలలు 11, ఉన్నత పాఠశాలలు 145, ప్రాథమిక పాఠశాలలు 1,320, అప్పర్ ప్రైమరీ స్కూళ్లు 267.

*వైద్యం :* ఈ జిల్లాలో అల్లోపతి వైద్య శాలలు 44, యునాని 12, ఆయుర్వేద వైద్య శాలలు 45, రెండు హోమియో వైద్యశాలలున్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* నాగునూరు, వేములవాడ, కాళేశ్వరం, ధర్మపురి.

*శాసనసభ నియోజకవర్గాలు :* 13 - పెద్దపల్లి, మైదారం, కమలాపూర్, హుజూరాబాద్, మంథని, ఇందుర్తి, కరీంనగర్, చొప్పదండి, బుగ్గారం, జగిత్యాల, సిరిసిల్ల, నేరెళ్ళ, మెట్‌పల్లి.

*లోక్‌సభ నియోజక వర్గాలు :* (2) కరీంనగర్, పెద్దపల్లి.

### ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న

| | |
|---|---|
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 8 |
| బ్యాంక్ ఆఫీసులు | 70 |

| | |
|---|---|
| షెడ్యూల్డ్ కులాలు,వెనకబడిన వర్గాలవారికి ఇళ్లస్థలాలపంపకం | 1,982 |
| షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 36 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 9 |
| మార్కెటింగ్ కమిటీలు | 8 |
| పోస్టాఫీసులు | 680 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 111 |
| టెలిఫోన్ ఎక్ఛేంజ్‌లు | 36 |
| పబ్లిక్ కాల్ఆఫీసులు | 55 |
| నివాసగృహాలు | 3,79,179 |
| షెడ్యూల్డ్ కులాలవారి జనాభా (1971) | 3.7 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా (1971) | 0.16 లక్షలు |

## కర్నూలుజిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 18,799 చ.కి మీ లు |
| జనాభా | : | 1971 నాటికి 19.83 లక్షలు, పురుషులు 10.07 లక్షలు, స్త్రీలు 9.76లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి.మీ.కు 105 |
| ముఖ్యకేంద్రం | : | కర్నూలు |

చారిత్రకంగా ప్రాముఖ్యమున్న జిల్లా ఇది. ఒకప్పుడు కందెనవోలు కాలక్రమేణా కర్నూలుగా మారిందని ప్రతీతి. మదరాసునుంచి మొదట్లో ఆంధ్రరాష్ట్రం విడివడినప్పుడు కర్నూలు దానికి రాజధాని. ఈ ప్రాంతాన్ని తెలుగుచోళులు, పశ్చిమ చాళక్యులు, కాకతీయులు ఢిల్లీసుల్తానులు, విజయనగరరాజులు, రెడ్డిరాజులు, గోల్కొండ బీజపూరు నవాబులు, నైజామ్ నవాబులు, బ్రిటిష్‌వారు పరిపాలించారు.

**భౌగోళిక స్వరూపం :** తూర్పున గుంటూరు, నెల్లూరు జిల్లాలు, పశ్చిమాన బళ్ళారిజిల్లా ఉత్తరాన మహబూబ్‌నగర్ జిల్లా, తుంగభద్రా కృష్ణానదులు, దక్షిణాన కడప, అనంతపురం జిల్లాలు ఈ జిల్లా సరిహద్దులు. నైసర్గికంగా ఇది కొండలు, గుట్టలు ఉన్న జిల్లా. నల్లమల, ఎర్రమల, వెలిగొండలు ఈ జిల్లాలో ఉన్నాయి. జిల్లాలోని భూమిని ప్రధానంగా రేగడినేల, ఎర్రనేలలున్నదని చెప్పవచ్చు.

**శీతోష్ణస్థితి, వర్షపాతం :** వేసవిలో ఎండలు ఎక్కువ. సరాసరి గరిష్ఠ ఉష్ణోగ్రత 39° కనిష్ఠ ఉష్ణోగ్రత 21.7° సెంటిగ్రేడ్. ప్రధానంగా నైరుతి ఋతుపవనాలవల్ల వర్షం పడుతుంది. ఈశాన్య ఋతుపవనం ప్రభావం కూడా ఈ జిల్లామీద ఉంది. సగటు వర్షపాతం సాలుకు 675 మి.మీ.లు.

*నదులు :* కృష్ణా, తుంగభద్రా, కుందు, హంద్రి ముఖ్యమైన నదులు.

*అడవులు :* అడవుల విస్తీర్ణం 3,21,765 హెక్టార్లు అంటే జిల్లా విస్తీర్ణంలో దాదాపు 18.3 శాతం అడవిప్రాంతం. వంటచెరుకు, బీడి ఆకులు, చందనం ఎక్కువగా లభ్యమవుతున్నది.

*ఖనిజసంపద :* రాగి, ముడిఇనుము, బలపరాయి ఈ జిల్లాలో దొరికే ప్రధాన ఖనిజాలు. ఇవికాక ముగ్గురాయి, సున్నపురాయి, నాపరాయి, బంకమన్ను కూడా లభిస్తాయి. బనగానపల్లి తాలూకాలో వజ్రాలుకూడా లభించవచ్చని పరిశోధకుల అభిప్రాయం.

*వ్యవసాయం, పంటలు :* పంటభూమి 9.95 లక్షల హెక్టార్లు వరి, జొన్న, కర్ర, వేరుసెనగ, పత్తి, ప్రధాన పంటలు. బంగినపల్లి మామిడిపళ్ళకు ఈ జిల్లా ప్రసిద్ధి చెందింది. మొత్తం పంట భూమిలో $\frac{1}{3}$ వంతు ఆహార పంటలు $\frac{2}{3}$ వంతు ఆహారేతర పంటలు పండుతాయి. నంద్యాలలో మెట్టసాగు పరిశోధన కేంద్రముంది.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* తుంగభద్రానదికి సుంకేశులవద్ద నిర్మించిన ఆనకట్టనుంచి వచ్చే కర్నూలు-కడప కాలువ ప్రధానమైన నీటి సౌకర్యం. ఇదికాక చెరువుల కింద, బావుల కింద సాగు ఉంది. తక్కువ నీటిపారుదల సౌకర్యమున్న జిల్లాలలో కర్నూలు ఒకటి. పంటభూమిలో కాలువ కింద 82 వేల, చెరువుల కింద 14 వేల, బావులకి 13 వేల, ఇతర వనరుల కింద 4 వేల హెక్టార్లు సాగుబడిలో ఉన్నాయి. 1980 నాటికి విద్యుచ్ఛక్తి సౌకర్యమున్న గ్రామాల సంఖ్య 704.

*పరిశ్రమలు :* వేరుసెనగ నూనె మిల్లులు వనస్పతి ఫ్యాక్టరీ, బట్టల స్పిన్నింగ్ మిల్లులు, సిమెంటు ఫ్యాక్టరీ ఈ జిల్లాలో ఉన్నాయి. ఇవికాక ఖనిజాధార పరిశ్రమలు, భారీ పేపరుమిల్ కూడా ఉన్నాయి. మొత్తం 367 పరిశ్రమలు ఉన్నాయి. దాదాపు 22150 మంది కార్మికులున్నారు. స్థిరమూలధనం 1704 లక్షల రూపాయలు. ఉత్పత్తి విలువ 6585.8 లక్షలు. ఈ జిల్లాలో చిన్నతరహా పరిశ్రమల కింద 632 యూనిట్లున్నాయి. వీటి పెట్టుబడి రూ.6.01 కోట్లు.

చేనేత పరిశ్రమ, బీడీ పరిశ్రమ, ఇక్కడ ఎక్కువ. ఎమ్మిగనూరు చేనేత బట్టలు ప్రసిద్ధి చెందినవి.

*మునిసిపాలిటీలు :* 4 ఆదోని, కర్నూలు, నంద్యాల, ఎమ్మిగనూరు.

*రెవిన్యూ డివిజన్లు :* 3 ఆదోని, కర్నూలు, నంద్యాల.

*తాలూకాలు :* 12 ఆదోని, ఆత్మకూరు, ద్రోణాచలం, ఆలూరు, పత్తికొండ, కర్నూలు నందికొట్కూరు, నంద్యాల, ఆళ్లగడ్డ యిలకుంట్ల, బనగానపల్లి, కొడుమూరు.

*పంచాయతీ సమితులు :* 13

*గ్రామాలు :*918 గ్రామపంచాయతీలు784.

*రవాణా :* 1978-79 నాటికి పి. డబ్ల్యుడి కింద 1648 కి.మీ జిల్లా పరిషత్తు పంచాయతీల కింద 1985 కి.మీ.ల రోడ్లు ఈ జిల్లాలో ఉన్నాయి. నందికొట్కూరు, ఆళ్లగడ్డ, బనగానపల్లి తాలూకాలలో తప్ప మిగిలిన జిల్లాలలో రైల్వే మార్గాలున్నాయి.

*సహకార సంఘాలు :* మొత్తం సహకార సంఘాల సంఖ్య 1038, సభ్యుల సంఖ్య 2.13 లక్షలు. వీటిలో 849 సహకార సంఘాలు, 44 చేనేత సహకార సంఘాలు, 87 పారిశ్రామిక సహకార సొసైటీలు, 48 పాలసరఫరా సహకార సొసైటీలు, 10 మత్స్యకారుల సహకార సొసైటీలు ఉన్నాయి.

*విద్య :* జిల్లాలోని ప్రాథమిక పాఠశాలల సంఖ్య 1671, అప్పర్ ప్రైమరీ పాఠశాలల సంఖ్య 129, సెకండరీ పాఠశాలల సంఖ్య 156, జూనియర్ కళాశాలలు 15, డిగ్రీ కళాశాలలు 12, ఇవికాక ఒక పాలిటెక్నిక్ కళాశాల, ఒక వైద్య కళాశాల, ఒక విద్యా కళాశాల కూడా ఉన్నాయి. ప్రతిష్ఠాకరమైన సిల్వర్ జూబిలీ కళాశాల కర్నూలులో ఉంది. జిల్లాలో అక్షరాస్యుల శాతం 23.57.

*వైద్యం :* అల్లోపతి వైద్యశాలలు 78, ఆయుర్వేద వైద్యశాలలు 52, యునాని వైద్యశాలలు 6, హోమియోపతి వైద్యశాలలు 3.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* మల్లికార్జునస్వామి దేవాలయం శ్రీశైలం ప్రధానమైనది. ఇంకా ఈ జిల్లాలో చూడదగ్గవి కర్నూలు, ఓంకారం. కాల్వబుగ్గ, మార్కాపురం, అహోబిలం మహానంది మొదలైనవి.

*శాసనసభ నియోజకవర్గాలు :* 13 ఆలూరు, ఆదోని, కోడుమూరు, ఎమ్మిగనూరు, కర్నూలు, పత్తికొండ, డోన్ (ద్రోణాచలం) కోయిలకుంట్ల, ఆళ్ళగడ్డ, పాణ్యం, నందికొట్కూరు, నంద్యాల ఆత్మకూరు.

*లోక్‌సభ నియోజకవర్గాలు :* 2 కర్నూలు, నంద్యాల

***ఈ జిల్లాలో 1977–78 నాటికి ఉన్న***

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | 21 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 95 |
| బ్యాంక్ ఆఫీసులు | 117 |
| షెడ్యూల్డ్‌కులాలు, వెనకబడినవారికి ఇళ్ళస్థలాల పంపకం | 14,413 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్లు | 72 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్లు | 6 |
| మార్కెట్ కమిటీలు | 12 |
| పోస్టాఫీసులు | 1,019 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 185 |
| టెలిఫోన్ ఎక్స్‌చేంజీలు | 32 |
| పబ్లిక్‌కాల్ ఆఫీసులు | 123 |
| నివాసగృహాలు | 3,61,909 |
| షెడ్యూల్డ్‌కులాలవారి జనాభా (1971 నాటికి) | 2.23 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా (1971) | 0.32 లక్షలు |

# కృష్ణా జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 8,834 చ. కి. మీ. |
| ముఖ్యకేంద్రం | : | మచిలీపట్నం |
| జనాభా | : | 24.93 లక్షలు |
| | | పురుషులు 12.69 లక్షలు; స్త్రీలు 12.24 లక్షలు |
| జనసాంద్రత | : | చ కి.మీ. కు 250 |

ఈ జిల్లా ప్రాంతాన్ని శాతవాహనులు, బృహత్పలాయనులు, శాలంకాయనులు, వేంగి చాళుక్యులు, రెడ్డి రాజులు, గోల్కొండనవాబులు పరిపాలించారు. 1611 లో తూర్పుఇండియా కంపెనీవారు బందరులో ప్రథమంగా ఫాక్టరీ స్థాపించారు ఇది మనదేశంలోస్థాపించిన రెండో ఫాక్టరీ. కృష్ణాజిల్లా మిక్కిలి సారవంతమైనది. 1950 సం॥లో ఈ జిల్లా సరిహద్దుల్లో స్వల్ప మార్పులు జరిగాయి.

***భౌగోళిక స్వరూపం :*** ఈ జిల్లా డెల్టా, పీఠభూమి అని రెండు భాగాలు. తూర్పున పశ్చిమ గోదావరి జిల్లా, బంగాళాఖాతం, ఉత్తరాన ఖమ్మం జిల్లా, దక్షిణాన బంగాళాఖాతం, పశ్చిమాన గుంటూరు. నల్గొండ, జిల్లాలు ఈ జిల్లా సరిహద్దులు. జిల్లాలో ఎక్కువభాగం నల్లరేగడి నేల (57 6%). ఇదిగాక, ఇసుకతోకూడిన ఒండునేల, ఎర్రరేగడినేల (19.4%) కూడా ఎక్కువగానే ఉన్నాయి. సముద్రప్రాంతంలో యిసుకనేల, కొంత బురదనేలఉన్నాయి.

***శీతోష్ణస్థితి, వర్షపాతం :*** ఏప్రియల్ నుంచి జూన్‌వరకు ఎక్కువవేడి. దైనిక సగటు గరిష్ఠ ఉష్ణోగ్రత 32°C; కనిష్ఠఉష్ణోగ్రత 24°C. సంవత్సరంలో అత్యధికఉష్ణోగ్రత 40°C అత్యల్ప ఉష్ణోగ్రత 16.7 C. కొన్నిసార్లు 51°C. సగటు వర్షపాతం కురిసే రోజులు 50. వర్షపాతం 958 మి.మీ. వర్షపాతం ఎక్కువగా ఈశాన్య ఋతుపవనాలవల్ల ఆ తరవాత నైరుతీ ఋతుపవనాల వల్ల కలుగుతుంది.

***నదులు :*** ప్రధానమైనది కృష్ణానది. ఈ నది హంసలదీవి వద్ద సముద్రంలో కలియ డానికి ముందు రెండు పాయలుగా చీలి ప్రవహించడంతో ఒక ద్వీపం ఏర్పడింది. అదే దివిసీమ. కృష్ణానదికి అడ్డంగా విజయవాడ వద్ద "బారేజ్" నిర్మించడంతో డెల్టా ప్రాంతం సస్యశ్యామలమైంది. ఇతర ముఖ్యనదులు మునేరు, వైరానది, బుడమేరు, తమ్మిలేరు.

***ఖనిజసంపద :*** కొండపల్లిమైదానాలలో క్రోమైట్, జగ్గయ్యపేట సమీపంలో ఇనుపఖనిజం, సున్నపురాయి లభిస్తాయి. సున్నపురాతి నిక్షేపాలు దాదాపు 270 మె. టన్నులని అంచనా. లోకప్రసిద్ధమైన పిట్టు వజ్రం ఈ జిల్లాలోలభించిందనీ, పూర్వం ఇక్కడ వజ్రపు గనులుండే వనీ అంటారు.

***అడవులు :*** ఈ జిల్లాలో 60,440 హెక్టార్లమేరకు అడవులున్నాయి. ఇది జిల్లావిస్తీర్ణంలో 8.8 శాతం. ఇవి పశువుల మేతకు ఉపయోగపడే అడవులు. కొండపల్లి అడవులలో లభ్య మయ్యే పొణుకు కలపతో ప్రసిద్ధిచెందిన కొండపల్లి బొమ్మలు తయారు చేస్తారు.

*వ్యవసాయం: పంటలు :* ముఖ్యమైనది వరిపంట. మెట్టప్రాంతాలలో జొన్న, పప్పు ధాన్యాలలో పెసర, వాణిజ్య పంటలలో వేరుశనగ, పొగాకు, చెరకు, పత్తి ప్రధానమైనవి. జిల్లా మెట్ట తాలూకాలలో పంటల విధానంలో విప్లవాత్మకమైన మార్పు అధిక దిగుబడి వంగడాలతో తెచ్చారు. పంటలకింద భూమి 7,01,000 హెక్టార్లు, ఆహారపు పంటలు 6,27,000 హెక్టార్లు, ఆహారేతరపంటలు 74,000 హెక్టార్లు, శాశ్వతమైన పచ్చిక బయలు 22,000 హెక్టార్లు, వ్యవసాయేతర ప్రయోజనాలకు 1,00,000 హెక్టార్లు, వ్యవసాయ యోగ్యం కానిది 62,000 హెక్టార్లు, వరిసాగు 3,71,000 హెక్టార్లు. వరి ఉత్పత్తి 7 07 లక్షల టన్నులు. హెక్టారుకు ఉత్పత్తి శక్తి 1,955 కి. గ్రా. కమతాలు 3,46,956.

మచిలీపట్నంలో ముంపు తట్టుకొనే వరి విత్తనాల పరిశోధనా కేంద్రం, చల్లపల్లిలో అధిక దిగుబడి చెరుకు విత్తనాల పరిశోధనా కేంద్రం. ఉయ్యూరు షుగర్స్ లిమిటెడ్ వారి ఆధ్వర్యంలో ఒక పరిశోధనా కేంద్రం ఉన్నాయి.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* ముఖ్యంగా జలాధారం కృష్ణానది. విజయవాడ ఆనకట్ట నుంచి డెల్టా అంతటా కాలువలు నీటి సదుపాయం సమకూరుస్తాయి. నాగార్జునసాగర్ ఎడమ కాలువద్వారా మెట్ట ప్రాంతాలకు, మునేరు, వైరా నదులతో నందిగామ తాలూకాలో లిఫ్ట్ ఇరిగేషన్ పథకాలతో నీటి సదుపాయం. నూజివీడు తాలూకాలోని కొన్ని పంట చెరువులకు తమ్మిలేరు నీరు అందుతోంది. కైకలూరు తాలూకాలో ఉప్పుటేరుతో రెండో పంట పండుతుంది. నీటిపారుదల సౌకర్యంగల మొత్తం భూమి 40,000 హెక్టార్లు, కాలువల కింద 320,000 హెక్టార్లు, చెరువుల కింద 45,000 హెక్టార్లు, బావుల కింద 22,000, తక్కిన వనరుల కింద 13,000 హెక్టార్లు. 1980 జనవరి నాటికి ఈ జిల్లాలో 618 గ్రామాలకు విద్యుద్దీకరణ చేయడం జరిగింది.

*పరిశ్రమలు :* పారిశ్రామికంగా ఇది ముందంజ వేసినజిల్లా. చిన్నపరిశ్రమలు హైదరాబాదు తరవాత ఈ జిల్లాలోనే కేంద్రీకృతమైనాయి. విజయవాడలో ఆంధ్ర సిమెంటుకంపెనీ, బందరులో ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ, సిరీన్ కంపెనీ, పాలపొడి కంపెనీ, గంగూరులో విజయా స్పిన్నింగ్‌మిల్, కౌతాస్టీల్ ప్రాడక్ట్స్, ఉయ్యూరు, చల్ల పల్లిలలో పంచదార ఫ్యాక్టరీలు మొదలైనవి ఇక్కడి పెద్ద పరిశ్రమలు. ప్రింటింగ్ ప్రెస్‌లకు రాష్ట్రంలో ముఖ్య కేంద్రం విజయవాడ. పరిశ్రమల వార్షిక నివేదిక ప్రకారం ఈ జిల్లాలో 495 ఫ్యాక్టరీలు, 24,547 మంది కార్మికులు ఉన్నారు. ఉత్పత్తి మూలధనం 62,83 57 లక్షలు. ఉత్పత్తి విలువ 8,610.04 లక్షలు. రూ. 300 కోట్లతో ఇబ్రహీం పట్నంవద్ద థర్మల్ పవర్ స్టేషన్ మచిలీపట్నం ఓడరేవు అభివృద్ధి రూ. 48 లక్షలతో కొల్లేటి చేపల పెంపకం, విజయవాడలో భారీ ఇంజనీరింగ్ పరిశ్రమ, ప్రభుత్వ ప్రింటింగ్ ప్రెస్ మొదలైనవి అభివృద్ధి పథకాలు. ఈ జిల్లాలో చిన్నతరహా పరిశ్రమలకింద 2,243 యూనిట్లున్నాయి. వీటి పెట్టుబడి రూ. 22.1 కోట్లు.

**రెవిన్యూ డివిజన్లు :** (4) బందరు, నూజివీడు, గుడివాడ, విజయవాడ
**మునిసిపాలిటీలు :** (3) గుడివాడ, మచిలీపట్నం, విజయవాడ.

*తాలూకాలు* : బందరు, దివి, గన్నవరం, గుడివాడ, కైకలూరు, నూజివీడు, తిరువూరు విజయవాడ, నందిగామ, జగ్గయ్యపేట.

*నగరాలు* : 16 అవనిగడ్డ, చల్లపల్లి, గన్నవరం, గుడివాడ, గుణదల, జగ్గయ్యపేట, కైకలూరు, కంకిపాడు, మచిలీపట్నం, నందిగామ, నూజివీడు, పెడన, పటమట, తిరువూరు విజయవాడ, వుయ్యూరు.

*పంచాయతీ సమితులు* : 17

*గ్రామాలు*: 939 *గ్రామపంచాయితీలు* : 870

*రవాణా* : పి. డబ్ల్యు. డి. ఆధ్వర్యంలో 1,608 కి. మీ జిల్లా పరిషత్ ఆధ్వర్యంలో 2,309 కి. మీ. రోడ్లున్నాయి. ఈ జిల్లాలో 212 కి. మీ. రైలు మార్గముంది. విజయవాడ సుప్రసిద్ధమైన రైల్వే కూడలిస్థానము. బందరు, ఏలూరు, కాల్వలు రవాణాకు అనుకూలంగా ఉంటాయి. గన్నవరంలో విమానాశ్రయముంది. మచిలీపట్నంలో ఓడరేవుంది.

*సహకార సంఘాలు* : మొత్తం జిల్లాలో 2,645 సహకారసొసైటీలున్నాయి. వీటిలోసహకార సొసైటీలు 2,025, చేనేత సహకార సొసైటీలు 87, పారిశ్రామిక సహకార సొసైటీలు 239, మత్స్యకార్ల సహకార సొసైటిలు 60,సహకార పాలసరఫరా సొసైటీలు 234 ఉన్నాయి. సహకార సొసైటీల సభ్యత్వం 4,70,000.

*విద్య* : ఈ విషయంలో ఈ జిల్లాది రాష్ట్రంలో రెండవ స్థానం. అక్షరాస్యులు 35.17 శాతం. పురుషులు 41.72 శాతం, స్త్రీలు 23.28 శాతం. జూనియర్ కళాశాలలు 17. డిగ్రీ కళాశాలలు 21. ప్రాథమిక పాఠశాలలు 2,289, అప్పర్ ప్రైమరీ పాఠశాలలు 3,301, హైస్కూళ్ళు 211 ఉన్నాయి. ఒక పాలిటెక్నిక్, ఒక ఐ. టి. ఐ ఒక సంస్కృత కళాశాల, ఒక కూచిపూడి భరతనాట్య శిక్షణ పాఠశాల. సంగీత కళాశాల, ఒక ఆయుర్వేద కళాశాల, ఒక హోమియోపతి కళాశాల, ఒక ఇంజనీరింగ్ కాలేజి ఉన్నాయి.

*వైద్యం* : 13 అల్లోపతి ఆసుప్రతులు, 30 డిస్పెన్సరీలు, 130 ఆయుర్వేద ఆసుపత్రులు, డిస్పెన్సరీలు, 4, యునాని ఆస్పత్రులు, 15 హోమియో వైద్యశాలలున్నాయి.

*శాసనసభ నియోజకవర్గాలు* : 17 జగ్గయ్యపేట, నందిగామ, విజయవాడ-I, విజయవాడ-II, కంకిపాడు, మైలవరం, తిరువూరు, నూజివీడు, గన్నవరం, ఉయ్యూరు, గుడివాడ ముదినేపల్లి, కైకలూరు, మల్లేశ్వరం, బందరు, నిడుమోలు, అవనిగడ్డ.

*పార్లమెంటు నియోజకవర్గాలు* : మచిలీపట్నం, విజయవాడ.

**చేతివృత్తులు** : కొండపల్లి బొమ్మలు, బందరులోని కలంకారీ అద్దకం ప్రసిద్ధిచెంది విదేశీ మారకం సంపాదించి పెడుతున్నాయి. చిలకలపూడి రోల్డ్‌గోల్డ్ వస్తువులకు బాగా గిరాకి ఉంది.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* విజయవాడ, కొండపల్లి, చిలకలపూడి, శ్రీకాకుళం (చల్లపల్లి దగ్గర) కస్లేపల్లి, ఘంటసాల, మొవ్వ, మచిలీపట్నం

***ఈ జిల్లాలో 1977-78*** నాటికి ఉన్న

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | 20 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 210 |
| బ్యాంకు ఆఫీసులు | 175 |
| షెడ్యూల్డ్‌కులాల వెనకబడిన జాతులవారికి ఇళ్ళస్థలాల పంపిణీ | 4,415 |
| షెడ్యూల్డ్ కులాల విద్యార్థుల హాస్టళ్లు | 126 |
| షెడ్యూల్డ్ తెగల విద్యార్థుల హాస్టళ్లు | 17 |
| మార్కెటింగ్ కమిటీలు | 10 |
| పోస్టాఫీసులు | 797 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 195 |
| టెలిఫోన్ ఎక్స్చేంజ్‌లు | 57 |
| పబ్లిక్ కాల్ ఆఫీసులు | 184 |
| నివాసగృహాలు | 4,32,969 |
| షెడ్యూల్డ్ కులాల వారు | 2.51 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారు | 05.1 లక్షలు |

## ఖమ్మంజిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 15,866 చ.కి.మీలు |
| జనాభా | : | 1971 నాటికి 13,69,792 |
| | : | పురుషులు 7 లక్షలు |
| | : | స్త్రీలు 6.67 లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి.మీ కు 86 మంది |
| ముఖ్యకేంద్రం | : | ఖమ్మం |

క్రీ. శ. 11 వ శతాబ్దిలో ఖమ్మంమెట్టు రాజ్య మేర్పడింది. ఆ తరవాత ఈప్రాంతాన్ని రెడ్డిరాజులు, గజపతులు, సుల్తానులు, విజయనగరరాజులు, గోల్కొండ నవాబులు, చివరగా నైజాం నవాబులు ఈ ప్రాంతాన్ని పాలించారు. ఖమ్మంజిల్లా 1953 లో ఏర్పడింది.

***భౌగోళిక స్వరూపం :*** తూర్పున తూర్పుగోదావరి జిల్లా, పశ్చిమాన నల్గొండ, వరంగల్ జిల్లాలు, ఉత్తరాన మధ్యప్రదేశ్ ఒరిస్సా రాష్ట్రాలు, దక్షిణాన కృష్ణాజిల్లా సరిహద్దులు.మధిర, గోదావారి పక్క ప్రాంతాలు బాగా సారవంతమైనవి. 43 శాతం గ్రామాలలో చలకనేల 29

శాతంలో నల్లనేల, 28 శాతం గ్రామాలలో దుబ్బనేల ఉంది. జిల్లాలో తూర్పుభాగం, మధ్య భాగం కొండలతోను, గుట్టలతోను నిండి ఉంది. వీటిలో పేర్కొనదగినవి మర్రిగుట్ట, రాజ గుట్ట, ఎర్రగుట్ట అడవిభాగాల మధ్య కొన్నిచోట్ల సారవంతమైన భూములున్నాయి.

*శీతోష్ణస్థితి వర్షపాతం* : చలికాలంలో చలి ఎక్కువ. ఎండాకాలంలో వేడి ఎక్కువ గరిష్ఠ ఉష్ణోగ్రత 48.9° సెంటిగ్రేడ్ కనిష్ఠ ఉష్ణోగ్రత 13° సెంటిగ్రేడ్. సగటు వర్షపాతం సాలుకు 1027. 3 మి.మీ.లు.

*నదులు* : గోదావరి, శబరి, కిన్నెరసాని, మునేరు, పాలేరు, ఆలేరు, వైరా ఈ జిల్లా లోని నదులు.

*అడవులు* : రాష్ట్రంలో అత్యధిక భాగం అడవులున్న జిల్లా ఇది. అడవుల విస్తీర్ణం 8.08 లక్షల హెక్టార్లు అంటే జిల్లా విస్తీర్ణంలో 51 1 శాతం అడవిప్రాంత మన్నమాట. ఇక్కడ ప్రధానంగా టేకు, నల్లమద్ది, చంద్ర, వెదురు, బీడిఆకు, చింత మొదలైనవి విస్తారంగా లభి స్తాయి. అనేకరకాల వన్యమృగాలు, పక్షులు ఈ అడవులలో ఉన్నాయి.

*ఖనిజసంపద* : ఈ జిల్లాలో విలువైన ఖనిజ సంపద ఉంది. బొగ్గు, ముడిఇనుము, బెరై టిస్, రాగి, క్రోమైట్, స్టేట్రిట్, కోరంగమ్, గ్రాఫైట్, గాల్సైట్, అభ్రకం కాయెనైట్, సున్నపురాయి, పాలరాయి, డోలమైట్ అధికంగా లభ్యమవుతున్నాయి. ఎల్లందు తాలూకా పాలరాతికి ప్రసిద్ధి. సిరిపురం, పోలవరం ముగ్గురాయి దొరికే స్థలాలు.

*వ్యవసాయం, పంటలు* : రాష్ట్రంలోని తక్కువ వ్యవసాయ భూమిగల జిల్లాలలో ఒకటి వరి, జొన్న. పప్పుధాన్యాలు, వేరుశనగ, పొగాకు ప్రధానమైన పంటలు. ఆహారపు పంటలు 627 వేల హెక్టార్లలోను, యితరపంటలు 74 వేల హెక్టార్లలోను పండుతున్నాయి. మొత్తం ఆహారధాన్యాల ఉత్పత్తి 8.18 లక్షల టన్నులు. ఈ జిల్లాలో మామిడి, జీడిమామిడి తోట లెక్కువగా ఉన్నాయి. అధిక దిగుబడినిచ్చే వరి, జొన్న, మొక్కజొన్న, ప్రత్తిపంటలపై ఎక్కువగా కేంద్రీకరణ జరుగుతున్నది. అశ్వారావుపేట సమీపంలో విత్తనాల క్షేత్రంఒకటి నెలకొల్పినారు.

*నీటిపారుదల విద్యుచ్ఛక్తి* : నీటి పారుదల సౌకర్యాలున్న భూమి 85,083 హెక్టార్లు. కాల్వలవల్ల సాగయ్యే భూమి తక్కువ. 270 వేల హెక్టార్ల కాల్వల కింద, 43 వేల హెక్టార్లు చెరువుల కింద, 7 వేల హెక్టార్లు బావుల కింద, 15 వేల హెక్టారులు గొట్టపు బావుల కింద సాగవుతున్నది, ఇతర వనరుల ద్వారా దాదాపు 10 వేల హెక్టారులు సాగవుతున్నది. 1980 మార్చి నాటికి విద్యుచ్ఛక్తి సౌకర్యమున్న గ్రామాలసంఖ్య 840.

*పరిశ్రమలు* : ఈ జిల్లాలో సింగరేణి బొగ్గు గనులేగాక బేరియమ్ రసాయనాల ఫ్యాక్టరీ ఫెర్రో సిలికాన్ ప్లాంటు, ఇంకా అనేక ఇతర భారీ పరిశ్రమలున్నాయి. ఇవి కాక 506 చిన్నతరహా పరిశ్రమలున్నాయి. వీటి పెట్టుబడి రూ. 4.79 కోట్ల రూపాయలు.

*మునిసిపాలిటీలు* : (2) కొత్తగూడెం, ఖమ్మం.

*రెవెన్యూ డివిజన్లు :* కొత్తగూడెం, ఖమ్మం, భద్రాచలం

*తాలూకాలు :* 7 – మధిర, ఖమ్మం, కొత్తగూడెం, ఎల్లందు, భద్రాచలం, నూగూరు, బూర్గంపాడు.

*పంచాయతీ సమితులు :* 13 *గ్రామాలు :* 1226 ; గ్రామపంచాయతీలు 442.

*రవాణా :* పి.డబ్ల్యు డి. ఆధ్వర్యంలో 1,705కి.మీ. రోడ్లు, జిల్లా పరిషత్ పంచాయతీల ఆధ్వర్యంలో 2,217 కి. మీ. పొడవుగల రోడ్లు ఉన్నాయి. మద్రాసు-ఢిల్లీ రైలుమార్గం ఈ జిల్లా ద్వారా పోతున్నది. ఇదికాక మరో రెండు రైలు మార్గాలున్నాయి. ఈ జిల్లాలో రైలు మార్గాల మొత్తం నిడివి 235 కి. మీ లు.

*సహకార సంఘాలు:* మొత్తం సహకార సంఘాల సంఖ్య 1,005. వీటిలో సహకార సంఘాలు 917 చేనేత సహకార సంఘాలు 4, పారిశ్రామిక సహకార సంఘాలు 62, మత్స్య కారుల సహకార సంఘాలు 11, పాలసరఫరా సంఘాలు 11.

*విద్య :* అక్షరాస్యులు 18 51 శాతం స్త్రీలు 11.57 శాతం. పురుషులు 25.11 శాతం కళాశాలలు జూనియర్ కళాశాలలు 18, హైస్కూళ్ళు 136, అప్పర్ ప్రైమిరీ పాఠశాలలు 164, ప్రాథమిక పాఠశాలలు 1045. ఇంకా ఒక ఉపాధ్యాయ శిక్షణ సంస్థ, ఒక పాలిటెక్నిక్ ఒక ఐ.టి.ఐ. కూడా ఉన్నాయి.

*వైద్యం :* జిల్లాలో మొత్తం అల్లోపతి వైద్యశాలలు 38, ఆయుర్వేద వైద్యశాలలు 23, యునానీ వైద్యశాలలు 7, హోమియోపతి వైద్యశాల 1 ఉన్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు:* ముఖ్యమైనవి భద్రాచలం, ఇంకా కోరొగొండ,పర్ణశాల,కొత్త గూడెం, పాల్వంచ, కిన్నెరసాని మొదలైనవి.

*శాసనసభ నియోజకవర్గాలు :* 9 - భద్రాచలం, కొత్తగూడెం, ఖమ్మం, బూర్గంపాడు, మధిర, సత్తుపల్లి, పాలేరు, సుజాతనగర్, ఎల్లందు.

*లోక్‌సభ నియోజక వర్గాలు :* 2 - ఖమ్మం, భద్రాచలం.

**ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న**

| | | |
|---|---|---|
| ప్రింటింగ్ ప్రెస్‌లు | : | 14 |
| బ్యాంకు ఆఫీసులు | : | 86 |
| షెడ్యూల్డ్ కులాల, వెనకబడిన వర్గాలవారికి ఇళ్ళ స్థలాల పంపకం | : | 4213 |
| షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు హాస్టళ్లు | : | 54 |
| షెడ్యూల్డ్ తెగల వారికి హాస్టళ్లు | : | 28 |
| మార్కెట్ కమిటీలు | : | 8 |

| | | |
|---|---|---|
| పోస్టాఫీసులు | : | 455 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | : | 58 |
| టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లు | : | 22 |
| పబ్లిక్‌కాల్ ఆఫీసులు | : | 23 |
| నివాస గృహాలు | : | 2,48,765 |
| షెడ్యూల్డ్ కులాలవారి జనాభా (1971) | : | 1.68 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా (1971) | : | 2.02 లక్షలు |

## గుంటూరు జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 11,377 చ. కి.మీ. |
| ముఖ్యకేంద్రం | : | గుంటూరు |
| జనాభా | : | 28.44 లక్షలు (1971) |
| | | పురుషులు : 14.41 లక్షలు |
| | | స్త్రీలు : 14.03 లక్షలు |
| జనసాంద్రత | : | చ. కి. మీ. 250 మంది. |

ఈ జిల్లాకు అతి పురాతన చరిత్ర ఉంది. ఈ ప్రాంతాన్ని మౌర్యులు, శాతవాహనులు, పల్లవులు, చాళక్యులు, కాకతీయులు, విజయనగరరాజులు పాలించారు. పల్నాటియుద్ధం ఈ జిల్లాలో జరిగింది. జాతీయ పోరాటాలకు ఈ జిల్లా పెట్టింది పేరు. 1921 లో మొట్టమొదటి సారిగా ఈ జిల్లాలో పన్నుల నిరాకరణ ఉద్యమం ప్రారంభమైంది. పల్నాటి వీర హనుమంతును బ్రిటిష్ ప్రభుత్వం కాల్చి చంపింది. 1970 లో ఈ జిల్లానుంచి కొన్ని ప్రాంతాలు ప్రకాశం జిల్లాలో కలిశాయి.

*భౌగోళిక స్వరూపం :* ఉత్తరాన నల్గొండ, కృష్ణాజిల్లాలు, దక్షిణాన ప్రకాశంజిల్లా, పశ్చిమాన ప్రకాశం, మహబూబ్‌నగర్ జిల్లాలు, తూర్పున కృష్ణాజిల్లా, బంగాళాఖాతాలు, ఈ జిల్లా సరిహద్దులు. తెనాలి, రేపల్లె తాలూకాలు, గుంటూరు, బాపట్ల తాలూకాలలో కొంతభాగం డెల్టాభూమి. పల్నాడు, సత్తెనపల్లి, గుంటూరు, నరసరావుపేట, వినుకొండ తాలూకాలలోని భాగాలు పర్వతమయ పీఠభూములు. తక్కిన భాగం నల్లరేగడి మైదానం. జిల్లాలో సుమారు 69.1 శాతం భూమి నల్లరేగడి నేల. ఎర్ర ఒండ్రునేల (22.4%), ఇసుకతో కూడిన బంక మట్టినేల (6.4%) మొదలైనది.

*శీతోష్ణస్థితి వర్షపాతం :* వేసవిలో తీవ్రమైన ఎండలుంటాయి. పల్నాడు తాలూకాలోని రెంటచింతల రాష్ట్రంలో అత్యధిక ఉష్ణోగ్రత గల ప్రదేశం (42.9°C). జిల్లాలో దైనిక సగటు ఉష్ణోగ్రత 35°C. కనిష్ఠ ఉష్ణోగ్రత 23.3°C. వర్షం కురిసే సగటిరోజులు సంవత్సరంలో 52. సగటు వర్షపాతం 815.8 మి.మీ. వినుకొండ, నరసరావుపేట, పల్నాడుతాలూకాలలో తరచు వర్షాలు లేకపోవడంవల్ల కరువు ప్రాంతాలుగా ప్రకటిస్తుంటారు.

*నదులు :* కృష్ణ, గుండ్లకమ్మ, నాగులేరు, చంద్రవంక.

*అడవులు :* 1,62,020 హెక్టార్లభూమి అడవుల కింద ఉంది. అడవులు ఎక్కువగా పల్నాడు తాలూకాలో ఉన్నాయి. ఈ జిల్లా ప్రముఖలక్షణాలలో ఒకటి కోస్తాపొడుగునా చిన్న చిన్న అడవులుండటం. ఈ అడవులలో కొన్ని శతాబ్దాలుగా సరుగుడు చెట్లునాటు తున్నారు. కోస్తా యిసకనేల జీడి మామిడి వంటి మొక్కలకు అనుకూలమైనది. ఇవి విదేశీ మారకద్రవ్యం సముపార్జించి పెడతాయి. ఈజిల్లా అడవులలో అంతగా ఎదగని కలప అడవులు, వంట చెరకు అడవులు, తుప్పలు ఉన్నాయి.

*ఖనిజసంపద :* పల్నాడు తాలూకాలో సిమెంటు తయారీకి పనికివచ్చే సున్నపురాతి నిక్షేపాలు అపారంగా ఉన్నాయి. సీసం, రాగి నిక్షేపాలలో వినుకొండ తాలూకా, అగ్ని గుండాలలో తవ్వుతున్నారు. రెంటచింతలలో భవననిర్మాణంలో అలంకరణగా పనికివచ్చే రంగు రంగుల పాలరాయి లభ్యమవుతుంది. వజ్రాలు సత్తెనపల్లి తాలూకాలో లభ్యమయ్యేవి. 1656 లో మొగలాయీ చక్రవర్తి షాజహాన్‌కు మీర్ జుమ్లా 787½ క్యారట్ల వజ్రాన్ని బహుమతి యిచ్చారట. దీనిని కొల్లూరులో తయారు చేశారట.

*వ్యవసాయం, పంటలు :* డెల్టా ప్రాంతంలో వరి, మెట్టప్రాంతంలో జొన్న, సజ్జ, కొర్ర ఆహారపంటలు. వాణిజ్య పంటలలో పొగాకు, మిరప, ప్రత్తి, తోటలలో వేరుశనగ, తమల పాకు, పసుపు, బత్తాయి, నిమ్మ ముఖ్యమైనవి. పొగాకు విదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. తెనాలి తాలూకా ఆహార పంటలకు ప్రసిద్ధిచెంది గుంటూరుజిల్లాధాన్యాగారంగా పేరుపొందింది. లాం వద్ద మిరపపైరు వరి పరిశోధనా కేంద్రముంది. పెదపాలెంలో పసుపు పరిశోధనా కేంద్ర ముంది. జిల్లా వ్యవసాయభూమిలో ఆహార పంటల కింద 5,66,009 హెక్టార్లు ఆహారేతర పంటల కింద 1,64,000 హెక్టార్ల శాశ్వతమైన పచ్చిక బయళ్ళు, 23,000 హెక్టార్ల వ్యవసాయేతర ప్రయోజనాలకు, 1,47,000 హెక్టార్లు సాగుకు పనికివచ్చే బంజరు 28,000 హెక్టార్లభూమి ఉంది. వరి పండించే ప్రాంతం 3,04,000 హెక్టా . వరి ఉత్పత్తి 5.77 లక్షల టన్నులు. హెక్టారుకు ఉత్పాదకశక్తి 1953 కి. గ్రా. కమతాలు 4,50,543.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* నాగార్జునసాగర్ ప్రాజెక్టు వల్ల పెద్ద ఎత్తున లాభాలు పొందుతున్న జిల్లాలలో ఇది ఒకటి. జిల్లా పంట భూమిలో 46 శాతం భూమికి నీటిపారుదల సౌకర్యముంది. మిగతా 5.4 శాతం మెట్ట సాగుకింద ఉంది. కాలువలద్వారా 4,20,095 గొట్టపు బావులద్వారా 3,195 ఆయిల్ ఎలక్ట్రిక్ ఇంజన్లు మొదలైన వాటిద్వారా 3,262 హెక్టార్ల భూమి సాగు అవుతున్నది. 593 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలున్నాయి.

*పరిశ్రమలు :* ఈ జిల్లా పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన జిల్లాలలో ఒకటి. పొగాకు పరిశ్రమ అతి ముఖ్యమైనది. టెక్స్‌టైల్స్, జూట్, సిమెంట్, కెమికల్స్, కాటన్ జిన్నింగ్ మొదలైనవి ముఖ్యమైన ఇతర పరిశ్రమలు. పొగాకు క్యూరింగ్ పరిశ్రమలో ఈ జిల్లాలో సుమారు 10 వేల మంది స్త్రీలు పనిచేస్తున్నట్లు అంచనా. పరిశ్రమల వార్షిక సర్వే ప్రకారం జిల్లాలో 723 పరిశ్రమలు 58,339 మంది కార్మికులు ఉన్నట్లు అంచనా. వీటి ఉత్పాదక

మూలధనం రూ. 3248.41 లక్షలు, ఉత్పత్తి విలువ రూ. 19591.95 లక్షలు. వడ్లమూడి వద్ద పాలపొడి ఫ్యాక్టరీ ఉంది. మంగళగిరి వద్ద రూ. 30 కోట్లతో టైర్లఫ్యాక్టరీ గురజాలలోను తెనాలి తాలూకాలోను కో ఆపరేటివ్ చక్కెర ఫ్యాక్టరీలు సత్తెనపల్లివద్ద కో ఆపరేటివ్ స్పిన్నింగు మిల్లులు మంగళగిరిలో పారిశ్రామికవాడ, వినుకొండ తాలూకాలో రక్షిత నీటి పథకం మొదలైన అభివృద్ధి పథకాలు అమలులో ఉన్నాయి. జిల్లాలో 1973 చిన్నతరహా పరిశ్రమలున్నాయి. వీటి పెట్టుబడి రూ. 15 82. లక్షలు.

*రెవిన్యూ డివిజనులు* : 3 తెనాలి, గుంటూరు, నరసరావుపేట

***మునిసిపాలిటీలు*** 8 గుంటూరు, తెనాలి, బాపట్ల, నరసరావుపేట, రేపల్లె, చిలకలూరిపేట పొన్నూరు, మంగళగిరి.

**తాలూకాలు** : 8 బాపట్ల, తెనాలి, రేపల్లె, గుంటూరు, సత్తెనపల్లి, నరసరావుపేట, వినుకొండ, పల్నాడు.

***నగరాలు*** : 16 బాపట్ల, భట్టిప్రోలు, చిలకలూరిపేట, గుంటూరు, మాచెర్ల, పిడుగురాళ్ళ, పొన్నూరు.

*పంచాయతీ* ***సమితులు*** : 21

***గ్రామాలు*** : 1201, గ్రామపంచాయతీలు. 824

***రవాణా*** : పిడబ్లుడి ఆధ్వర్యంలో 1835 కి.మీ. జిలా పరిషత్ ఆధ్వర్యంలో 1181 కి.మీ. రోడ్లున్నాయి. తాలూకా ముఖ్యనగరాలన్నింటికీ రైలు మార్గాలున్నాయి. కొమ్మమూరు బకింగ్‌హామ్ కాలువల ద్వారా పడవల మీద మద్రాసుకు సరుకులు రవాణా అవుతాయి.

***విద్య*** : అక్షరాస్యులు 30 73 శాతం గుంటూరులో నాగార్జున విశ్వవిద్యాలయముంది. ఇదిగాక ఒక వైద్యకళాశాల, ఒకపాలిటెక్నిక్ కళాశాల, రెండు బి.యి.డి కళాశాలలున్నాయి ఇంకా జిల్లాలో 49 కళాశాలలున్నాయి. వీటిలో 24 డిగ్రీ కళాశాలలు, 25 జూనియర్ కళాశాలలు. జిలాలో 2,393 ప్రాథమిక పాఠశాలలు, 203 హైస్కూళ్ళున్నాయి. అంధ విద్యార్థులకు పాఠశాలలున్నాయి.

***వైద్యం*** : అలోపతి వైద్యశాలలు 11, డిస్పెన్సరీలు. 46, ఆయుర్వేద వైదశాలలు 90, యునాని వైద్యశాల ఒకటి.

***శాసనసభ నియోజక*** *వర్గాలు* : 19 కూచినపూడి, రేపల్లె, వేమూరు, దుగ్గిరాల, తెనాలి, పొన్నూరు, బాపట్ల, ప్రత్తిపాడు, గుంటూరు-1, గుంటూరు-2, మంగళగిరి, తాడికొండ, సత్తెనపల్లి, పెదకూరపాడు, గురజాడ, మాచెర్ల, వినుకొండ, నరసరావుపేట, చిలకలూరిపేట.

**చేతివృత్తు లు**: చేనేత పరిశ్రమ, మంగళగిరి, భట్టిప్రోలు, తెనాలి, రేపల్లెలలోను, యిటుకుల తయారీ పరిశ్రమ, గుంటూరు, కొల్లూరు, తెనాలి, బాపట్ల, రేపల్లె తాలూకాలలోను ఉన్నాయి.

***సహకార సంఘాలు*** : ఈ జిల్లాలో మొత్తం 1,836 సహకార సంఘాలున్నాయి. వాటి సభ్యుల సంఖ్య 3.55 లక్షలు. వీటిలో 1475 సహకార సంఘాలు 70 చేనేత సహకార

సంఘాలు, 68 పారిశ్రామిక సహకార సంఘాలు, 52 మత్స్యకారుల సహకార సంఘాల 112 పాలసరఫరా సహకార సంఘాలున్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* కొండవీడు, వినుకొండ, అమరావతి, నాగార్జునకొండ, నాగార్జునసాగర్, బెల్లంకొండ, ఎత్తిపోతల, దుర్గి, తెనాలి, సంగం జాగర్లమూడి, చేబ్రోలు పెదకాకాని, కోటప్పకొండ, మంగళగిరి, మాచెర్ల, జేచెర్ల.

*ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న*

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | 15 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 233 |
| బ్యాంకు ఆఫీసులు | 162 |
| షెడ్యూల్డ్ కులాలకు వెనకబడిన వర్గాలవారికి ఇళ్ళస్థలాల పంపకం | 5,010 |
| షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 59 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 24 |
| మార్కెటింగ్ కమిటీలు | 8 |
| పోస్టాఫీసులు | 851 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 180 |
| టెలిఫోన్ ఎక్ఛేంజీలు | 60 |
| పబ్లిక్ కాల్ ఆఫీసులు | 203 |
| నివాసగృహాలు | 5,47,216 |
| షెడ్యూల్డ్ కులాలవారి జనాభా | 1.36 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా | 1.05 లక్షలు |

## చిత్తూరు జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 15,763 చ.కి.మీటర్లు |
| జనాభా | : | 1971 నాటికి 22.86 లక్షలు<br>పురుషులు 11.67 లక్షలు<br>స్త్రీలు 11.19 లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి. మీటర్లకు 145 |
| ముఖ్యకేంద్రం | : | చిత్తూరు |

ఈ జిల్లాకు అతి పురాతన చరిత్ర ఉంది. నవీన శిలాయుగం నుంచీ ఈ ప్రాంతం జనావాసమైనట్లు ఆధారాలున్నాయి. ఈ ప్రాంతాన్ని పల్లవులు, చోళులు, యాదవులు, విజయ నగర రాజులు, గోల్కొండ నవాబులు, బ్రిటిష్‌వారు పరిపాలించారు. 1911 లో ఈ జిల్లా అవతరించింది.

*భౌగోళిక స్వరూపం :* తూర్పున దక్షిణాన తమిళనాడు రాష్ట్రం, పశ్చిమాన కర్ణాటక రాష్ట్రం, ఉత్తరాన కడప, అనంతపురం జిల్లాలు ఈ జిల్లా సరిహద్దులు. జిల్లాను పర్వతమయ పీఠభూమి, మైదానం అని రెండు భాగాలుగా చెప్పవచ్చు. లోయలు, కొండలు, మైదానాలు, పీఠభూమితో ఈ జిల్లా రమణీయంగా ఉంటుంది. కొండలు నైరుతి భాగాన కరిగుండి నుంచి తిరుపతి వరకు ఉన్నాయి. తిరుపతి తరవాత ఇవి రెండు శాఖలై మామండూరు లోయను ఏర్పరచాయి. తూర్పుకనుమలకు పశ్చిమంగాఉన్నది పీఠభూమి. తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర స్వామి దేవాలయం వల్ల ఆ ప్రదేశం జగత్ప్రసిద్ధమవడమే కాక దేశంలోని అత్యంత సుందర ప్రదేశాలలో ఒకటయింది. జిల్లాలో అత్యధిక భాగం ఎర్రనేలలు. ఆ తరవాత నల్లరేగడినేలలు.

*శీతోష్ణస్థితి, వర్షపాతం:* జిల్లాసమశీతోష్ణంగా ఉంటుంది. సగటుదైనిక ఉష్ణోగ్రత 31° సెంటీగ్రేడ్, కనిష్ఠ ఉష్ణోగ్రత 20 సెంటిగ్రేడ్. అత్యధిక ఉష్ణోగ్రత 37.8°, అత్యల్ప ఉష్ణోగ్రత 11.7° సెంటిగ్రేడ్. వర్షం కురిసే సగటు రోజులు సంవత్సరానికి 52. సగటు వర్షపాతం 825 మి. మీ. లు.

*నదులు:* బాహుదా, పించస్, కౌండిన్య, పాలారు, పాపాఘ్ని, స్వర్ణముఖి, పోనీ, పెద్దేరు చిన్నేరు, అరణి, నగరి నదులున్నాయి. అయితే ఇవి వర్షాకాలంలో మాత్రమే ప్రవహించే నదులు.

*అడవులు :* అడవుల విస్తీర్ణం 4.54 లక్షల హెక్టార్లు, అంటే జిల్లా విస్తీర్ణంలో 30 శాతం అడవులు. ఈ జిల్లాలోని అడవులు మదనపల్లి వైపు దట్టంగాను, కాళహస్తి వైపు చిట్టడవులుగాను ఉన్నాయి. మంచి టేకు, వంట చెరకు, ఫలాలు, చందనం వంటివి అడవుల నుంచి లభిస్తున్నాయి.

*ఖనిజసంపద :* ఇనుము, బలపరాయి, బంగారం, గ్రానైట్, మైకా ఈ జిల్లాలో లభించే ఖనిజాలు.

*వ్యవసాయం, పంటలు :* వరి, పప్పుధాన్యాలు, చెరుకు, వేరుసెనగ ముఖ్యమైనపంటలు చింత, మామిడి తోటలు విస్తారంగా ఉన్నాయి. భూమి వినియోగం దృష్ట్యా చూస్తే పచ్చిక బయళ్లు 47 వేలు, ఆహారపంటల కింద 341 వేలు, ఆహారేతరపంటలకింద 139 వేల హెక్టార్ల భూమి ఉంది. మొత్తం ఆహార ధాన్యాల ఉత్పత్తి 435 లక్షల టన్నులు. ఉత్పాదకశక్తి హెక్టారుకు 2,003 కి. గ్రా. లు. కమతాలు 3,35,214.

కాళహస్తిలో అధిక దిగుబడినిచ్చే వరివంగడాల, కూరగాయల విత్తనాల తయారీ వ్యవసాయ పరిశోధనా కేంద్రముంది. పలమనేరులో పట్టుపురుగుల పరిశోధనా కేంద్రముంది.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* బావులు ప్రధాన నీటి వనరులు. కాళంగి, మల్లిమడుగు ప్రాజెక్ట్‌లు కొంతమేరకు నీటిపారుదల సౌకర్యం కలిగిస్తున్నాయి. మొత్తంమీద కాలువలకింద 7 వేలు చెరువులకింద 70 వేలు, బావులకింద 86 వేలు, ఇతర నీటి వనరులకింద 6 వేల హెక్టార్లు సాగులో ఉన్నాయి. 1980 నాటికి విద్యుచ్ఛక్తి సౌకర్యమేర్పడిన గ్రామాల సంఖ్య 899.

*పరిశ్రమలు :* చక్కెర, స్ట్రాబోర్డ్లు, టెక్స్టైల్స్, సర్జికల్ కాటన్, ఆల్కహాల్, మోపెడ్లు, స్కూటర్లు, రాగి, ఇత్తడి, లోహపు పాత్రలు తయారుచేసే పరిశ్రమలు ఈజిల్లాలో ఉన్నాయి. పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న జిల్లాఇది. మంచిగంధం నూనె, పాలపొడి, గ్రానైట్ ఫాక్టరీలు ఇప్పుడిప్పుడే రూపుదిద్దుకొంటున్నాయి. వీటివల్ల విదేశీ మారక ద్రవ్యం లభించగలదు. మొత్తంమీద ఈ జిల్లాలో 219 పరిశ్రమలున్నట్లు అంచనా. 8,415 మంది కార్మికులు పనిచేస్తున్న వీటి మూలధనం 9.78 కోట్ల రూపాయలు, ఉత్పత్తి విలువ 61.21 కోట్లు. చిన్నతరహా పరిశ్రమలు 680 వీటి పెట్టుబడి రూ. 5 కోట్లు. కలంకారీ అద్దకం, లక్కబొమ్మల తయారీ, విగ్గుల తయారీ మొదలైనవి ఈ జిల్లాలోని ప్రధాన చేతివృత్తులు. చేనేత పరిశ్రమలు కూడా ఉన్నాయి.

*మునిసిపాలిటీలు :* 4 - శ్రీ కాళహస్తి, తిరుపతి, చిత్తూరు, మదనపల్లె.

*రెవిన్యూ డివిజన్లు :* 3 - చంద్రగిరి, చిత్తూరు, మదనపల్లె.

*తాలూకాలు :* 11 - శ్రీ కాళహస్తి, పుత్తూరు, సత్యవేడు, చంద్రగిరి, చిత్తూరు,బంగారు పాలెం, పలమనేరు, కుప్పం, పుంగనూరు, వాయల్పాడు, మదనపల్లె.

*పంచాయి సమితులు :* 19

*గ్రామాలు :* 1,316 ; *గ్రామపంచాయతీలు :* 1,066

*రవాణా :* 1978-79 నాటికి ఈ జిల్లాలో పి.డబ్ల్యు.డి. ఆధ్వర్యంలో 1,684 కి.మీ.లు, జిల్లా పంచాయతీల అధ్వర్యంలో 4,022 కి. మీ. లు నిడివిగల రోడ్లున్నాయి. జిల్లాలో బ్రాడ్ గేజ్, మీటర్గేజ్, రైల్వే మార్గాలున్నాయి. వీటి మొత్తం పొడవు 380 కి.మీ. లు తిరుపతి వద్ద మధ్యతరహా విమానాశ్రయం కూడా ఉంది.

*సహకార సంఘాలు :* 1975-76 నాటికి జిల్లాలో మొత్తం 1,696 సహకార సంఘాలున్నాయి. వీటిలో 1,157 సహకార సంఘాలు, 17 చేనేత సహకార సంఘాలు, 125 పారిశ్రామిక సహకార సంఘాలు, 3 మత్స్యకార్ల సహకార సంఘాలు, 70 పాలసరఫరా సహకార సంఘాలు మొదలైనవి ఉన్నాయి.

*విద్య :* జిల్లాలోని ప్రాథమిక పాఠశాలలు 2,603, అప్పర్ ప్రైమరీ పాఠశాలలు 160, సెకండరీ పాఠశాలలు 160, జూనియర్ కళాశాలలు 18, డిగ్రీ కళాశాలలు 11, ఈజిల్లాలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతిలో ఉంది. ఈ జిల్లాలో సంగీత నాట్య కళాశాల, సంస్కృత కళాశాల, పాలిటెక్నిక్ కళాశాలలు, ఇంజనీరింగ్ కళాశాల, వైద్య కళాశాల, పశువైద్య కళాశాల, వ్యవసాయ కళాశాల, ఉపాధ్యాయ శిక్షణ సంస్థ మొదలైనవి ఉన్నాయి. జిల్లా అక్షరాస్యత శాతం 25.4.

*వైద్యం :* జిల్లాలో 12 అల్లోపతి వైద్యశాలలు, 42 డిస్పెన్సరీలు, 4 ఆయుర్వేద వైద్యశాలలు. ఒక యునాని వైద్యశాల, 3 హోమియోపతి వైద్యశాలలున్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* జిల్లాలో ప్రధానంగా దర్శించదగిన స్థలం తిరుపతి. తిరుమలలో శ్రీ వేంకటేశ్వర దేవాలయం, పాప వినాశం, ఆకాశగంగ, గోగర్భతీర్థం, తిరుపతి

వద్ద కపిలతీర్థం, తిరుచానూరు శ్రీ పద్మావతీ దేవాలయం మొదలైనవి ఇక్కడ చూడదగ్గవి. ఇంకా శ్రీకాళహస్తి, చంద్రగిరి, హార్స్‌లీ కొండలు, టి.బి.సానిటోరియం మొదలైన ఇతర చూడదగ్గ ప్రదేశాలుకూడా ఈ జిల్లాలో ఉన్నాయి.

*శాసనసభ నియోజకవర్గాలు* : 15-శ్రీ కాళహస్తి, సత్యవేడు, నగరి, పుత్తూరు, వేపంజేరి, చిత్తూరు, పలమనేరు, కుప్పం, పుంగనూరు, మదనపల్లె, తంబళ్ళపల్లె, వాయల్పాడు, పీలేరు, చంద్రగిరి, తిరుపతి.

*లోక్‌సభ నియోజక వర్గాలు* : 2 — చిత్తూరు, తిరుపతి.

### ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | 16 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 83 |
| బ్యాంక్ ఆఫీసులు | 102 |
| షెడ్యూల్డ్‌కులాలు, వెనుకబడిన వార్గాలవారికి ఇళ్ళస్థలాలపంపకం | 4,569 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 55 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 10 |
| మార్కెటింగ్ కమిటీలు | 13 |
| పోస్టాఫీసులు | 895 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 168 |
| టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లు | 53 |
| పబ్లిక్‌కాల్ ఆఫీసులు | 197 |
| నివాసగృహాలు | 4,29,922 |
| షెడ్యూల్డ్ కులాలవారిజనాభా ( 1971 ) | 3.99 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా (1971) | 0.67 లక్షలు |

## తూర్పుగోదావరిజిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 10,900 చ.కి మీ లు |
| జనాభా | : | 30.8 లక్షలు (1971) |
| పురుషులు | : | 15.4 లక్షలు |
| స్త్రీలు | : | 15.4 లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి మీ.కు 282 మంది |
| ముఖ్యకేంద్రం | : | కాకినాడ |

పూర్వం ఇది కళింగ రాజ్యానికి సరిహద్దు. ఈప్రాంతానికి ప్రాచీన కాలంలో మౌర్యులు శాతవాహనులు, వాశిష్ఠ వంశజులు, చాళక్యులు, శ్రీకృష్ణ దేవరాయలు, గోల్కొండ నవా

బులు మొదలైనవారు పరిపాలించారు. 1904 లో ఈ జిల్లా ఏర్పడింది. అల్లూరి సీతారామ రాజు నాయకత్వంలో 1922 లో చారిత్రాత్మకమైన మన్యం తిరుగుబాటు ఈ జిల్లాలోనే జరిగింది.

*భౌగోళికస్వరూపం :* ఈ జిల్లాని నైసర్గిక స్వరూపాన్ని బట్టి ఏజన్సీ, మీఠభూమి. డెల్టా అని మూడు భాగాలుగా విభజించవచ్చు. తుని, పిఠాపురం, పెద్దాపురం తాలూకాలు, రాజమండ్రి, కాకినాడ, రామచంద్రపురం తాలూకాలలోని కొన్ని భాగాలు పీఠభూమి కిందకు వస్తాయి. ఏజన్సీ ప్రాంతమంతా జిల్లా ఉత్తర భాగానగల కొండ ప్రాంతంలో ఉంది. అమలాపురం, రాజోలు, కొత్తపేట తాలూకాలు, కాకినాడ, రామచంద్రపురం, రాజమండ్రి తాలూకాలలో కొంతభాగం డెల్టా ప్రాంతంలో ఉన్నాయి. ఉత్తరాన విశాఖపట్నంజిల్లా, తూర్పున, దక్షిణాన బంగాళాతం, పశ్చిమాన ఖమ్మం, పశ్చిమ గోదావరిజిల్లాలు ఈ జిల్లాకు సరిహద్దు. ఈ జిల్లాలోని ప్రాంతాలలో 52 శాతం ఎర్ర ఇసుకనేల, 29 శాతం నల్లరేగడి నేలలు, 14 శాతం ఇసుక రేగడి నేలలున్నాయి.

*శీతోష్ణస్థితి, వర్షపాతం :* సముద్ర ప్రభావంవల్ల, సతతహరిత వృక్షాలు, తోటలవల్ల జిల్లా సమశీతోష్ణమైనది. సరాసరి గరిష్ఠ ఉష్ణోగ్రత 32° సెంటిగ్రేడ్, కనిష్ఠ ఉష్ణోగ్రత 24° సెంటిగ్రేడ్. సంవత్సరంలో అత్యధిక ఉష్ణోగ్రత 40°, అత్యల్ప ఉష్ణోగ్రత 16° సెంటిగ్రేడ్. సగటు వర్షపాతం సాలుకు 1,133 మి. మీ. లు.

*నదులు :* ఈ జిల్లాలో ప్రవహించే ప్రధానమైన నది గోదావరి. ధవళేశ్వరం వద్ద ఈ నదికి ఆనకట్ట ఉంది. ఇక్కడే ఇది గౌతమి గోదావరి, వశిష్ఠ గోదావరి అని రెండు పాయలుగా చీలుతున్నది. గౌతమి గోదావరి తూర్పుగా ప్రవహించి గోదావరి పాయింట్‌వద్ద అనేక పాయలుగా చీలి సముద్రంలో కలుస్తున్నది. వశిష్ఠ గోదావరి రాజోలు తాలూకాలో సముద్రం చేరుతున్నది. గోదావరి కాకుండా ఈ జిల్లాలోని ముఖ్యమైన నదులు శబరి, పలేరులు.

*అడవులు :* జిల్లాలోని అడవుల విస్తీర్ణం 3.15 లక్షల హెక్టార్లు అంటే జిల్లా విస్తీర్ణంలో దాదాపు 29.2 శాతం అడవి ప్రాంతం. ఈ అడవుల నుంచి వెదురు, తాడి, జీడి, కుంకుడు కాయలు, చింతపండు, తేనె, టేకు మొదలైనవి లభిస్తాయి.

*ఖనిజ సంపద :* ఈ జిల్లాలోని పుణ్యక్షేత్రం, పెద్దాపురం, ధవళేశ్వరం, ద్వారపూడి, మొదలైన చోట్ల క్లే లభిస్తున్నది. దోమకొండ, రామవరం, చిడిపాలెం, మారేడుమిల్లి, కాటరాజు కొండ ప్రాంతాలలో బాక్సైట్ దొరుకుతున్నది. ఇవికాక సున్నపురాయి, గ్రాఫైట్, ఓర్ మొదలైన ఖనిజాలు కూడా ఈ జిల్లాలో స్వల్పంగా దొరుకుతున్నాయి.

*వ్యవసాయం, పంటలు :* ఆహార పంటల కింద 4.18 లక్షలు, ఆహారేతర పంటలకింద 0.69 లక్షల హెక్టార్ల భూమి సాగులో ఉంది. ఇంకా శాశ్వతమైన పచ్చికబీడు 32 వేలు, సాగు కాదగిన బంజరు కింద 25 వేలు, వ్యవసాయేతర ప్రయోగాల కింద 93 వేలు, వ్యవసాయానికి యోగ్యం కానిది 1.45 లక్షల హెక్టార్ల భూమి ఉంది. పంటలలో ప్రధానమైనది వరి. వరి ఉత్పత్తి 806 లక్షల టన్నులు. తరవాత పేర్కొనదగినది చెరుకు. ఇవి కాక

ఇంకా రాగులు, వేరుశనగ, నువ్వులు, పత్తి, పొగాకు మొదలైన వాణిజ్య పంటలు కూడా పండిస్తుంటారు. మామిడి, జీడిమామిడి, కొబ్బరి, పోక తోటలు ఈ జిల్లాలో ఎక్కువగానే ఉన్నాయి. సామర్లకోట వద్ద వ్యవసాయ పరిశోధనా కేంద్రం ఉంది. అధిక దిగుబడినిచ్చే వరి వంగడాలు, చెరుకు ఉత్పత్తి వంటివాటికి సంబంధించిన పరిశోధన లిక్కడ సాగుతుంటాయి. ఇదికాక రాజమండ్రిలో కేంద్ర పొగాకు పరిశోధనా సంస్థ, రాజోలు అంబాజీపేటలలో కొబ్బరికి సంబంధించిన పరిశోధనా కేంద్రాలు ఉన్నాయి.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* నీటి పారుదల సౌకర్యాలున్న మొత్తం భూమి 2.69 లక్షల హెక్టార్లు. వీటిలో కాలువల కింద 2.19 హెక్టార్ల భూమి ఉంది. మిగిలినది బావుల కింద చెరువుల కింద తదితర వనరుల కింద సాగుబడిలో ఉంది. ధవళేశ్వరం వద్ద గోదావరి మీద 1852 లో సర్ ఆర్థర్ కాటన్ కట్టించిన ఆనకట్ట ఈ జిల్లాకు వర ప్రసాదము. ఈ ఆనకట్ట నుంచి అనేక కాలువలు తవ్వబడినాయి. 1980 మార్చినాటికి జిల్లాలో 822 గ్రామాలకు విద్యుత్ సౌకర్యాలు కలిగించడం జరిగింది.

*పరిశ్రమలు :* జిల్లాలో పెద్ద పెద్ద పరిశ్రమలు 10 దాకా ఉన్నాయి. రాజమండ్రిలోని పేపర్‌మిల్ సామర్లకోట, చెల్లూరు, పిఠాపురాలలో పంచదార ఫ్యాక్టరీలున్నాయి. ఇంకా 14 ఖండసారి మిల్లులు, 3 స్పిన్నింగ్ మిల్లులు, 6 పట్టు పరిశ్రమలు, రెండు పొగాకు క్యూరింగ్ కేంద్రాలు, 14 నగ్గు బియ్యం ఉత్పత్తి మిల్లులు, యంత్ర పరికరాల ఉత్పత్తి ఫ్యాక్టరీ 1, మోటారు బోట్ల తయారీ కేంద్రం 1, ఉన్నాయి. ఇవికాక జిల్లాలో జీడిపప్పు పరిశ్రమలు, నూనె మిల్లులు, కొబ్బరితాళ్లు తాయారుచేసే ఫ్యాక్టరీలు, కోత రంపపు కర్మాగారం మొదలైనవికూడా ఉన్నాయి. జిల్లాలో 554 ఫ్యాక్టరీలున్నాయి. ఉత్పాదక మూలధనం 35.57 కోట్ల రూపాయలు, ఉత్పత్తి 83.59 కోట్లు. కార్మికుల సంఖ్య 29 వేలు. జిల్లాలో రూ. 17.75 కోట్ల పెట్టుబడితో 1,598 చిన్నతరహా పరిశ్రమ యూనిట్లున్నాయి. చేతి వృత్తుల తయారీలలో ఈ జిల్లా పట్టు వస్త్రాలకు పేరెన్నిక గన్నది ముఖ్యంగా పెద్దాపురం పట్టు వస్త్రాలు సుప్రసిద్ధాలు. అమలాపురం, కాకినాడలు చేపలు పట్టడానికనువైన ప్రధాన కేంద్రాలు. బలభద్రపురంలో స్వదేశీ చేపల అభివృద్ధి కేంద్రం ఉంది.

**మునిసిపాలిటీలు :** 9 – కాకినాడ, రాజమండ్రి, అమలాపురం, పెద్దాపురం, సామర్లకోట, పిఠాపురం, మండపేట, రామచంద్రపురం, తుని.

*రెవిన్యూ డివిజన్లు :* 4 – కాకినాడ, రాజమండ్రి, పెద్దాపురం, అమలాపురం.

తాలూకాలు : 14 – కాకినాడ, పిఠాపురం, పెద్దాపురం, పత్తిపాడు, తుని, యల్లవరం, రాజమండ్రి, రామచంద్రపురం, రంపచోడవరం, ఆలమూరు, అమలాపురం, రాజోలు, కొత్తపేట, ముమ్మిడివరం, కోరుకొండ, రంగపేట, తల్లేరు, రాయవరం.

*పంచాయతీ సమితులు :* 20

*గ్రామాలు :* 1,513 *గ్రామపంచాయతీలు :* 918

*రవాణా :* 1978 – 79 నాటికి జిల్లాలో పి. డబ్ల్యు. డి. ఆధ్వర్యంలో 1,822 కి.మీ.లు జిల్లాపరిషత్తు, పంచాయతీల ఆధ్వరంలో 2,294 కి. మీ.లు నిడివి రోడ్లున్నాయి.

జిల్లాలో 127 కి మీ. ల బ్రాడ్ గేజ్ రైల్వే మార్గముంది. గోదావరినదీ కాలువలద్వారా సరుకుల ఎగుమతి దిగుమతులకు ప్రయాణీకుల రాకపోకలకు అనువైన మార్గాలున్నాయి. రాష్ట్రంలోని ముఖ్యమైన ఓడరేవులలో రెండోది కాకినాడలో ఉంది.

*సహకార సంఘాలు :* మొత్తం సహకార సంఘాల సంఖ్య 2,526 (1975 76). సభ్యుల సంఖ్య 6.49 లక్షలు. సహకార సంఘాలు 2,081, చేనేత సహకార సంఘాలు 87, పారిశ్రామిక సహకార సంఘాలు 164, మత్స్యకార్ల సహకార సంఘాలు 105, పాలసరఫరా సహకార సంఘాలు 89.

*విద్య :* జిల్లాలోని ప్రైమరీ పాఠశాలలు 2,468, అప్పర్ ప్రైమరీ పాఠశాలలు 252, సెకండరీ పాఠశాలలు 184, జూనియర్ కళాశాలలు 25, డిగ్రీ కళాశాలలు 13 రెండు పాలిటెక్నిక్ కాళాశాలలు, ఒక ఇంజనీరింగ్ కళాశాల, ఒక వైద్య శాస్త్ర కళాశాల ఉన్నాయి. అక్షరాస్యుల శాతం 30.84.

*వైద్యం :* అల్లోపతి వైద్యశాలలు 17, డిస్పెన్సరీలు 109; ఆయుర్వేద వైద్యశాలలు 66; యునానీ వైద్యశాలలు 2; హోమియోపతి వైద్యశాలలు 11 ఉన్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* ర్యాలి - జగన్మోహిని చెన్నకేశవస్వామి దేవాలయం, ద్రాక్షారామం - భీమేశ్వరాలయం; పాపికొండలు; పిఠాపురం కుక్కుటేశ్వరస్వామి దేవాలయం; వెంకటాపురం – వన్యమృగాలు; రాజమండ్రి - కోటిలింగేశ్వరస్వామి దేవాలయం; అన్నవరం- శ్రీ సత్యనారాయణస్వామి దేవాలయం.

*శాసనసభ నియోజక వర్గాలు :* 21—ఎల్లవరం, బూరుగుపూడి, రాజమండ్రి, కడియం, జగ్గయ్యపేట, పెద్దాపురం, తుని, పత్తిపాడు, పిఠాపురం, సంపర, కాకినాడ, తాళ్ళరేవు, రామచంద్రపురం, ఆలమూరు, ముమ్మిడివరం, అమలాపురం, అల్లవరం, కొత్తపేట, నగరం, రాజోలు.

*లోక్ సభ నియోజకవర్గాలు :* 3 కాకినాడ, రాజమండ్రి, అమలాపురం.

*ఈ జిల్లాలో 1977–78 నాటికి ఉన్న*

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | 23 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 210 |
| బ్యాంకు ఆఫీసులు | 165 |
| షెడ్యూల్డ్‌కులాల వెనకబడినవర్గాలవారికి ఇళ్ళస్థలాపంపకం | 7,597 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 74 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 18 |
| మార్కెట్ కమిటీలు | 11 |
| పోస్టాఫీసులు | 756 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 207 |

| | |
|---|---|
| టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లు | 74 |
| పబ్లిక్ కాల్ ఆఫీసులు | 241 |
| నివాస గృహాలు | 5,32,693 |
| షెడ్యూల్డ్ కులాలవారి జనాభా (1971) | 5.18 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా (1971) | 1.19 లక్షలు |

## నల్గొండ జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 14,242 చ.కి.మీ. లు |
| జనాభా | : | 1971 నాటికి 18.2 లక్షలు |
| | | పురుషులు 9.26 లక్షలు, స్త్రీలు 8.94 లక్షలు |
| జన సాంద్రత | : | చ.కి. మీ కు 128 మంది |
| ముఖ్య కేంద్రం | : | నల్గొండ |

దీని ఒకప్పటి పేరు నీలగిరి. శాతవాహనులు, ఆంధ్రరాజులు, చాళుక్యులు, గోల్కొండ నవాబులు, మొగలాయీలూ, నైజాంనవాబులు ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. ఒకప్పుడు జలాల్‌గాన్ పాలించిన రోజులలో నల్లగొండ రాజధానిగా కూడా ఉండేది.

***భౌగోళిక స్వరూపం :*** తూర్పున కృష్ణా, ఖమ్మం జిల్లాలు, పశ్చిమానమహబూబ్‌నగర్ హైదరాబాద్ జిల్లాలు, ఉత్తరాన మెదక్, వరంగల్ జిల్లాలు, దక్షిణాన గుంటూరు, మహబూబ్‌నగర్ జిల్లాలు ఈ జిల్లా సరిహద్దులు. ఈ జిల్లాను ముఖ్యంగా కొండప్రాంతం, పీఠభూమి ప్రాంతంగా విభజించవచ్చు. జిల్లాలో నేలలు సారవంతంకావు. 47 శాతం గ్రామాలలో దుబ్బనేల, 44 శాతం ఇసుకనేల, 9 శాతం నల్లరేగడి నేల ఉన్నాయి.

***శీతోష్ణస్థితి, వర్షపాతం :*** వేసవిలో వేడి ఎక్కువ. గరిష్ఠ ఉష్ణోగ్రత 41.7° సెంటిగ్రేడ్. కనిష్ఠ ఉష్ణోగ్రత 10° సెంటిగ్రేడ్ జిల్లాలో వర్షపాతం అన్నిప్రాంతాలలో సమానంగా ఉండదు. సూర్యాపేట, భువనగిరి, మిర్యాలగూడెం, హుజూర్‌నగర్, రామన్నపేట, దేవరకొండ, నల్గొండ తాలూకాలలో అనావృష్టివల్ల కరువు ఏర్పడుతూ ఉంటుంది. సగటు వర్షపాతం సాలుకు 1126 మి.మీ.

***నదులు :*** ముఖ్యమైనవి కృష్ణా, మూసి, ఆలేరు దిండి, పెద్దవాగు, అహల్య నదులు.

***అడవులు :*** ఆగవుల విస్తీర్ణం 97,343 హెక్టార్లు. అంటే జిల్లా విస్తీర్ణంలో 6.9 శాతం అడవులు. వంట చెరకుకు ఉపయోగపడే కలప, వెదురు అడవులనుంచి లభిస్తాయి.

***ఖనిజసంపద :*** అంతగాలేదు. సున్నపురాయి, బంకమట్టి, క్వార్ట్జ్ నిధులు కొద్దిగా ఉన్నాయి. ఇనుపఖనిజం, కోరండం కూడా కొద్దిగా లభిస్తాయి.

***వ్యవసాయము, పంటలు :*** పంటభూమి 6,89,268 హెక్టార్లు. ముఖ్యమైన పంటలు వరి, జొన్న, మొక్కజొన్న, తెలంగాణా ప్రాంతంలో ఈ పంటలకు ఈ జిల్లా ప్రసిద్ధి. ఆముదాలు

వేరుశెనగ, పొగాకు, పప్పుధాన్యాలు కూడా పండుతున్నాయి. మొత్తం ఆహార పంటలు 660 వేల హెక్టార్లలోను, ఇతర పంటలు 168 వేల హెక్టార్లలోను పండుతున్నాయి. ఆహారధాన్యాల ఉత్పత్తి 6.41 లక్షల టన్నులు. ఈ జిల్లాలో దిండివద్ద ఒక వ్యవసాయ పరిశోధనా కేంద్రం ఉంది. సన్నకారు రైతుల అభివృద్ధి నిమిత్తం ఈ జిల్లాలో 1970 లో ఒక పథకం ప్రారంభించడం జరిగింది. ఈ పథకం ద్వారా బావులు తవ్వడానికి, ఎద్దులను కొనడానికి ఆర్థిక సహాయం ఈ జిల్లా ప్రజలకు అందుతున్నది.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* ఈ జిల్లాలోనే ఉన్న నాగార్జునసాగర్ డామ్ ప్రధాన నీటి పారుదల సౌకర్యం. ఇదికాక డిండి ప్రాజెక్టు, మూసీప్రాజెక్టు ఇతర నీటి పారుదల సౌకర్యాలు కాల్వల కింద 101 వేల హెక్టార్లు చెరువుల కింద 59 వేల హెక్టార్లు బావులకింద 45 వేల హెక్టార్లు భూమి సాగవుతున్నది. ఇతర వసరుల కింద మూడు వేల హెక్టార్ల భూమి సాగవుతున్నది.

1980 మార్చి నాటికి విద్యుచ్ఛక్తి సౌకర్యం పొందిన గ్రామాల సంఖ్య 868.

*పరిశ్రమలు :* మిర్యాలగూడాలోని నిజాం చక్కెర పరిశ్రమ భారీ పరిశ్రమ, మిగిలినవి నూనె, రంపం, ఇంజనీరింగ్ పరిశ్రమల వంటి చిన్నతరహా పరిశ్రమలు. రూ. 82 లక్షల ఫిక్సెడ్ పెట్టుబడితో 99 యూనిట్లు ఈ జిల్లాలో పనిచేస్తున్నాయి. కార్మికులు 2,761 మంది పనిచేస్తున్నారు. ఉత్పత్తి విలువ రూ. 9.67 లక్షలు. నాగార్జునసాగర్‌వద్ద రూ. 10 కోట్ల పెట్టుబడితో ఆముదం నూనెఫ్యాక్టరీ, మిర్యాలగూడావద్ద చక్కెర ఫ్యాక్టరీ, సాల్వెంట్‌ఆయిల్ యూనిట్, పేపరుబోర్డ్ మొదలైన పరిశ్రమలు. ఇన్‌ఫ్రాస్ట్రక్చరు కార్పొరేషన్ పథకాలు. వాడేపల్లిలో సిమెంటుఫ్యాక్టరీ మొదలైనవి అభివృద్ధి పథకాలు. చేతి వృత్తులలో పోచంపాడు చేనేత పరిశ్రమ ముఖ్యమైనది. పోచంపల్లి చీరలకు మంచి పేరుంది. ఈ జిల్లా చిన్నతరహా పరిశ్రమ యూనిట్లు 556 వీటి పెట్టుబడి రూ. 4.74 కోట్ల రూపాయలు.

*మునిసిపాలిటీలు :* 3 నల్గొండ, భువనగిరి సూర్యాపేట

*రెవిన్యూ డివిజన్లు :* 3 నల్గొండ, మిర్యాలగూడా, భువనగిరి.

*తాలూకాలు :* 7 సూర్యాపేట, నల్గొండ, రామన్నపేట, భువనగిరి, మిరియాలగూడా, హుజూర్‌నగర్, దేవరకొండ.

*నగరాలు :* 6 భువనగిరి, కోదాడ, మిర్యాలగూడా, నల్గొండ, సూర్యాపేట, విజయపురి నార్త్.

*పంచాయతీ సమితులు :* 15

*గ్రామాలు :* 1165; గ్రామపంచాయతులు : 687.

*రవాణా :* 1978-79 నాటికి పి.డబ్ల్యుడి ఆధ్వర్యంలో 1,488 కి.మీలు జిల్లా పరిషత్తు పంచాయతీల ఆధ్వర్యంలో 2,540 కి.మీ పొడవుగల రోడ్లున్నాయి. భువనగిరి తాలూకాలో తప్ప ఈ జిల్లాలో మరే ప్రాంతానికి రైలుసౌకర్యంలేదు.

*సహకార సంఘాలు :* ఈ జిల్లాలోని మొత్తం సహకార సంఘాల సంఖ్య 2,348. వీటిలో 2,056 సహకార సంఘాలు, 30 చేనేత సహకార సంఘాలు, 140 పారిశ్రామిక సహకార సంఘాలు, 36 మత్స్యకార్ల సహకార సంఘాలు, 86 పాలసరఫరా సహకార సంఘాలున్నాయి.

*విద్య :* ఈ జిల్లాలో అక్షరాస్యులు 17.05 శాతం. పురుషులు 25.05 శాతం, స్త్రీలు 8.76 శాతం. డిగ్రీ కళాశాలలు 4, జూనియర్ కళాశాలలు 9, హైస్కూళ్ళు 181, ప్రాథమిక పాఠశాలలు 1,523 అప్పర్ ప్రైమరీస్కూళ్ళు 228.

*వైద్యం ·* ఈ జిల్లాలో 72 అల్లోపతి వైద్యశాలలున్నాయి. 50 ఆయుర్వేద, 6 యునాని వైద్యశాలలున్నాయి. రెండు 2 హోమియోపతి వైద్యశాలలున్నాయి.

*దర్శించతగ్గ ప్రదేశాలు :* ఆకొండ, పోచంపల్లి, భువనగిరి, యాదగిరిగుట్ట, కొలనుపాక, పానగల్లు.

*శాసనసభ నియోజక వర్గాలు :* (12). సూర్యాపేట, తుంగతుర్తి, మిర్యాలగూడా, నక్రేకల్, కోదాడ, చలకుర్తి, దేవరకొండ, మునుగోడు, నల్గొండ, ఆలేరు, భువనగిరి, రామన్నపేట.

*లోక్‌సభ నియోజకవర్గాలు :* (2) నల్గొండ, మిర్యాలగూడా.

*ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న*

| | |
|---|---|
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 14 |
| బ్యాంక్ ఆఫీసులు | 91 |
| షెడ్యూల్డ్ కులాలు, వెనుకబడిన వర్గాలవారికి ఇళ్లస్థలాలపంపకం | 3,962 |
| షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 62 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 17 |
| మార్కెటింగ్ కమిటీలు | 11 |
| పోస్టాఫీసులు | 664 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 52 |
| టెలిఫోన్ ఎక్చేంజ్‌లు | 34 |
| పబ్లిక్ కాల్ ఆఫీసులు | 38 |
| నివాసగృహాలు | 3,42,256 |
| షెడ్యూల్డ్ కులాలవారి జనాభా (1971) | 2.89 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా (1971) | 0.01 లక్షలు |

## నిజామాబాదు జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 7,969 చ.కి.మీ. లు |
| జనాభా | : | 1971 నాటికి 13.13 లక్షలు |
| | | పురుషులు 6.57 లక్షలు ; స్త్రీలు 6.56 లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి.మీ.కు 165 |
| ముఖ్యకేంద్రం | : | నిజామాబాదు |

చరిత్రలో ఇంద్రపురి, ఇందూరుగా చెలామణిలో ఉండిన ఈప్రాంతాన్ని రాష్ట్రకూటులు, చాళుక్యులు, కాకతీయులు, ఖిల్జీ వంశస్థులు, తుగ్లక్‌లు, బహమనీరాజులు, గోల్కొండనవాబులు, నైజాం నవాబులు పాలించినట్లు తెలుస్తున్నది. బోధన్, కోసలాపురం పేర్లు చరిత్రప్రసిద్ధాలు. ఈ ప్రాంతం నిజామాబాద్ జిల్లాగా 1905 లో ఏర్పడింది.

***భౌగోళిక స్వరూపం :*** తూర్పున కరీంనగరు, పశ్చిమాన నాందేడు జిల్లాలు, ఉత్తరాన ఆదిలాబాదు, దక్షిణాన మెదక్ జిల్లాలు దీని సరిహద్దులు. కొండలు ఎక్కువగాలేవు. ఎక్కువ భాగం మైదానపీఠభూమి. 55 శాతం గ్రామాలలో నల్లరేగడిభూములు, 45 శాతం గ్రామాలలో చలకనేలలు ఉన్నాయి.

***శీతోష్ణస్థితి, వర్షపాతం :*** సముద్రమట్టానికి 2,000 అడుగుల ఎత్తున ఉండి సముద్రనికి దూరంగా ఉండటం వల్ల ఫిబ్రవరి నుండి మే వరకు వేడి ఎక్కువ. వర్షాకాలంలోను శీతాకాలంలోను గాలిలో తేమ ఎక్కువగా ఉంటుంది. వర్షపాతం ఎక్కువే. సగటు వర్షపాతం సాలుకు 1,014 మి. మీ. గరిష్ఠ ఉష్ణోగ్రత 43.3 సెంటిగ్రేడ్, కనిష్ఠ ఉష్ణోగ్రత 7.2° సెంటిగ్రేడ్.

***నదులు :*** ఈ జిల్లాలో ముఖ్యమైన నదులు గోదావరి, దాని ఉపనది మంజీర. ఇవికాక ఎడ్లకట్టువాగు, పులాంగు, ఆలేరు ఉన్నాయి.

***అడవులు :*** అడవుల విస్తీర్ణం 1,72,355 హెక్టార్లు-అంటే జిల్లా విస్తీర్ణంలో 21.8 శాతం అడవులన్నమాట. టేకు, నల్లమద్ది, తక్కిన కలపమానులు దొరుకుతాయి. బీడీఆకులు, వెదురు కూడా లభ్యమవుతాయి.

***ఖనిజసంపద :*** రోడ్లు, భవన నిర్మాణానికి ఉపయోగపడే గ్రానైట్ ఎన్నో రంగులలో లభిస్తుంది. కొద్దిగా ఇనుము దొరుకుతుంది. కాని ఈ జిల్లాలో చెప్పుకోదగిన ఖనిజసంపదలేదు.

***వ్యవసాయం, పంటలు :*** నికర వ్యవసాయ పంటభూమి 3,13,353 హెక్టార్లు. ఆహారపు పంటలు 350 వేల హెక్టార్లలోను, ఇతరపంటలు 22 వేల హెక్టార్లలోను పండిస్తారు. ముఖ్యమైనపంటలు వరి, జొన్న, వేరుశనగ, మిరప, చెరకు, పసుపు. ఇవిగాక పప్పుధాన్యాలు పత్తి, నువ్వులు, రాగి, ఆరిక, కొర్రలు కూడా పండిస్తారు, మొత్తం ఆహారధాన్యాల ఉత్పత్తి 5.29 లక్షల టన్నులు. రుద్రూరులో ఒక వ్యవసాయ పరిశోధనా కేంద్రం ఉంది.

***నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :*** ఈ జిల్లాలో ముఖ్యమైన నీటిసౌకర్యం కలిగించేది బన్స్వాడ తాలూకా అచ్చంపేట వద్ద మంజీరానదిపై నిర్మించిన నిజాంసాగర్ ప్రాజెక్టు. ఆర్మూర్

తాలూకా దూద్‌గావ్ వద్ద గోదావరిపై నిర్మిస్తున్న పోచంపాడు ప్రాజెక్టు. ఎల్లారెడ్డి తాలూకా ఆలేరుపై నిర్మించిన పోచారం ప్రాజెక్టు, కామారెడ్డి జిల్లాలో రామడుగు ప్రాజెక్టు. తెలంగాణా జిల్లాలలో అధిక నీటిపారుదల సౌకర్యం గల జిల్లా ఇదే. 1,83,317 హెక్టార్ల భూమికి నీటి పారుదల సౌకర్యం ఉంది. కాల్వల ద్వారా 68 వేల హెక్టార్లు, చెరువుల ద్వారా 54 వేల హెక్టార్లు, బావులద్వారా 19 వేల హెక్టార్లు, తక్కిన వనరుల ద్వారా 6 వేల హెక్టార్ల భూమి సాగవుతున్నది. 1979 మార్చినాటికి 794 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించడం జరిగింది.

*పరిశ్రమలు* : దేశంలోని పెద్ద చక్కెర ఫాక్టరీ అయిన నిజాం షుగర్ ఫాక్టరీ బోదన్‌లో ఉంది. నిజామాబాదు, బోదన్ ఈ జిల్లా ప్రధాన పారిశ్రామిక నగరాలు. ఈ జిల్లాలో 9 రసాయనిక ఎరువుల మిశ్రమ పరిశ్రమలు, బట్టల సబ్బుల పరిశ్రమలు, బీడీ పరిశ్రమ, సైకిళ్ళ పరిశ్రమ, రైస్‌మిల్లులు, ఆటోమొబైల్ పార్టులు చేసే పరిశ్రమ మొదలైనవి ఎన్నో ఉన్నాయి. 1971 వార్షిక సర్వే ప్రకారం 30 పారిశామిక సంస్థలలో రూ. 6.51కోట్ల ఉత్పాదక పెట్టుబడులతో 5,739 పనివారితో రూ. 9.91 కోట్ల విలువగల ఉత్పత్తి జరుగుతున్నట్లు తెలుస్తున్నది. ఆర్మూరులో పట్టుపరిశ్రమ, చీనుగల్లులో కొయ్యబొమ్మల తయారీ, నిజామాబాదులో అద్దకం పరిశ్రమ మొదలైనవి చెప్పుకోదగ్గ చేతిపరిశ్రమలు. ఈ జిల్లాలో చిన్నతరహా పరిశ్రమలకింద 615 యూనిట్లున్నాయి. వీటి పెట్టుబడి రూ. 4.64 కోట్లు.

*మునిసిపాలిటీలు* : 2 - నిజామాబాదు, బోధన్.

*రెవిన్యూ డివిజన్‌లు* : 3 - నిజామాబాదు, కామారెడ్డి, బోధన్

*తాలూకాలు* : 7 - ఆర్మూరు, బన్‌స్వాడ, బోధన్, కామారెడ్డి, మద్నూరు, నిజామాబాదు, ఎల్లారెడ్డి.

*నగరాలు* : 6 - ఆర్మూరు, బన్‌స్వాడ, బోధన్, కామారెడ్డి, నిజామాబాదు, పోచంపాడు ప్రాజెక్టు టౌన్‌షిప్పు.

*గ్రామాలు*: 915 ; *గ్రామ పంచాయతీలు*: 408 ; *పంచాయతీసమితులు* : 9.

*రవాణా* : పి.డబ్ల్యు.డి. ఆధ్వర్యంలో 998 కి.మీ. లు. జిల్లాపరిషత్ పంచాయతీల ఆధ్వర్యంలో 2,178 కి. మీ. ల పొడవు రోడ్లున్నాయి. కామారెడ్డి , నిజామాబాదు, బోధన్ తాలూకాల్లో రైలుమార్గాలున్నాయి. జిల్లాలోని మొత్తం రైలు మార్గం నిడివి 139 కి.మీ.లు.

*సహకార సంఘాలు* : జిల్లాలోని మొత్తం సహకార సంఘాల సంఖ్య 1,528. సభ్యుల సంఖ్య 2.07 లక్షలు. వీటిలో 1,401 సహకార సంఘాలు, 18 చేనేత సహకార సంఘాలు, 52 పారిశ్రామిక సహకార సంఘాలు, 29 మత్స్యకారుల సహకార సంఘాలు, 20 పాల సరఫరా సహకార సంఘాలున్నాయి.

*విద్య* : అక్షరాస్యులు 17.19 శాతం. పురుషులు 26.14 శాతం. స్త్రీలు 8.23శాతం. డిగ్రీ కాలేజీలు 7, జూనియర్ కాలేజీలు 7, ఉన్నత పాఠశాలలు 108, ప్రాథమికపాఠశాలలు 785, అప్పర్ ప్రైమరీ పాఠశాలలు 155 ఉన్నాయి.

*వైద్యం :* అల్లోపతి ఆసుపత్రులు 35, ఆయుర్వేద వైద్యశాలలు 16, యునానీ వైద్యశాలలు 19 ఉన్నాయి. 9 హోమియోపతి వైద్యశాలలు కూడా ఉన్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* నిజాంసాగర్ ప్రాజెక్టు, రుద్రూరు, నిజామాబాదు, బోధన్.

*శాసనసభ నియోజక వర్గాలు :* 9-ఆర్మూరు, జుక్కల్, బాల్గొండ, బన్స్వాడ, నిజామాబాదు, బోధన్, డిచ్‌పల్లి, కామారెడ్డి, ఎల్లారెడ్డి.

*లోక్‌సభ నియోజకవర్గాలు :* 1 - నిజామాబాదు.

**ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న**

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | 27 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 14 |
| బ్యాంక్ ఆఫీసులు | 54 |
| షెడ్యూల్డ్‌కులాలు, వెనకబడిన వర్గాలవారికి ఇళ్లస్థలాలపంపకం | 4,427 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 40 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 7 |
| మార్కెటింగ్ కమిటీలు | 7 |
| పోస్టాఫీసులు | 444 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 47 |
| టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లు | 31 |
| పబ్లిక్‌కాల్ ఆఫీసులు | 13 |
| నివాసగృహాలు | 2,38,796 |
| షెడ్యూల్డ్‌కులాలవారి జనాభా ( 1971 ) | 2.00 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా ( 1971 ) | 0.01 లక్షలు |

## నెల్లూరు జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 3,058 చ.కి.మీ. లు |
| జనాభా | : | 1971 నాటికి 16.09 లక్షలు |
| | | పురుషులు 8.1 లక్షలు, స్త్రీలు 7.99 లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి.మీ కు 123 |
| ముఖ్యకేంద్రం | : | నెల్లూరు |

విక్రమ సింహపురమనే నామాంతరమున్న నెల్లూరుకు ప్రాచీన చరిత్ర ఉంది. పల్లవులు, పశ్చిమ చాళక్యులు, తెలుగుచోడులు, రెడ్డిరాజులు, విజయనగరరాజులు, గోల్కొండ నవాబులు, బ్రిటిష్‌వారు ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. కవిత్రయంలోని తిక్కనసోమయాజి ఈ ప్రాంతం వాడు.

**భౌగోళిక స్వరూపం :** తూర్పున బంగాళాఖాతం, ఉత్తరాన ప్రకాశంజిల్లా, దక్షిణాన తమిళనాడు, చిత్తూరు జిల్లాలు; పడమట కడపజిల్లా, ఈ జిల్లా సరిహద్దులు. వెలిగొండలు ఈ జిల్లాను కడపజిల్లానుంచి వేరుచేస్తున్నాయి. ఈ జిల్లాను కొండప్రాంత, సమతలభాగం, తీరప్రాంతంగా విభజించవచ్చు. జిల్లాలో నల్లరేగడి నేలలు, ఎర్రనేలలు, ఇసుకనేలలు ఉన్నాయి. నల్లరేగడి నేలలు, రేగడినేలలు గల గ్రామాలు, 254, ఎర్రనేలలు గలవి 473, ఇసుక రేగడి గల గ్రామాలు 389.

**శీతోష్ణస్థితి, వర్షపాతం :** శీతోష్ణస్థితి పొడిగా ఉంటుంది. వేసవిలో ఎండలు తీవ్రంగా ఉంటాయి. సరాసరి దైనికఉష్ణోగ్రత 34.4°C; కనిష్ఠ ఉష్ణోగ్రత 24°C. రాష్ట్రంలో అత్యధిక వర్షపాతం గల ఐదు జిల్లాలలో ఇదిఒకటి. హెచ్చు వర్షపాతం ఈశాన్య ఋతుపవనాల వల్ల కలుగుతుంది. సంవత్సరానికి వర్షం కురిసే సగటు రోజులు 41.5 సగటు వర్షం పాతం 1,042 6 మి. మీ.

**నదులు :** ముఖ్యమైనది పెన్నానది. ఇంకా కండ్లేరు, స్వర్ణముఖి, మానేరు, నదులుకూడా ఉన్నాయి. ఇతర నదులు బొగ్గేరు, పిల్లమేరు, ఉప్పుటేరు.

**అడవులు :** అడవుల విస్తీర్ణం 2,41,606 హెక్టార్లు. అంటే జిల్లా విస్తీర్ణంలో 18.6 శాతం అడవులన్నమాట. వెలిగొండలలోనిఅడవులలో విలువైన చెట్లు, మంచి గడ్డి బీళ్ళు ఉన్నాయి. అటవీ ఉత్పత్తులలో జీడిపప్పు, వెదురు, కుంకుళ్ళు ముఖ్యమైనవి. చింతపండు, కుంకుడుకాయలు, పేము, సరసపరిల్లా (సుగంధపాల) తక్కిన ఉత్పత్తులు.

**ఖనిజసంపద :** రాష్ట్రంలో అభ్రకం (మైకా) ఉత్పత్తి చేసే జిల్లా ఇదిఒక్కటే. ఈ విషయంలో ఈ జిల్లాకు దేశంలో మూడోస్థానం లభిస్తుంది. ఇక్కడ లభించే ఇతర ఖనిజాలు పింగాణిమన్ను, ముడిఇనుము, జిప్సం, రాగి, సున్నపురాయి, గృహనిర్మాణంలో వాడే నల్లరాయి.

**వ్యవసాయం, పంటలు :** ముఖ్యమైనది వరిపంట, మెట్ట ప్రాంతాలలో జొన్న, వ్యాపార పంటలలో ఉలవలు, మిరప ముఖ్యమైనవి. ఇటీవలి కాలంలో పొగాకును కూడా పండిస్తున్నారు. నెల్లూరు మొల గొలుకులు వరి పంటలో ప్రసిద్ధి చెందినాయి. పంట భూమి 3,93,000 హెక్టార్లు, ఆహార పంటల కింద 3,34,000 హెక్టార్లు, ఆహారేతర పంటలకింది 59,000 హెక్టార్లు, శాశ్వతమైన పచ్చికబీడు 1,12,000 హెక్టార్లు, వ్యవసాయేతర ప్రయోజనాలకు 1,94,000 హెక్టార్లు, సాగుకు లాయకైన బంజరు 73,000 హెక్టార్లు ఉంది. అధిక దిగుబడినిచ్చే వరివంగడాలు, పత్తి, నూనెగింజలు, పప్పుధాన్యాలపై వ్యవసాయ పరిశోధనా కేంద్ర మొకటి బుచ్చిరెడ్డిపాలెం వద్ద ఉంది.

**నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :** పెన్నానది మీద నెల్లూరు సంగంలో ఆనకట్టలున్నాయి. పంటభూమిలో 64.6 శాతం భూమికి సౌకర్యం ఉంది. మొత్తం నీటిపారుదల సౌకర్యం గల భూమి 2,25,000 హెక్టార్లు. కాలువల కింద 82,000 హెక్టార్లు, చెరువుల కింద 89,000 హెక్టార్లు, గొట్టపు బావులకింద 24,000హెక్టార్లు, ఇతర బావులకింద 26,000 హెక్టార్లు,

ఇతర వనరుల కింద 4,000 హెక్టార్లు సాగవుతున్నది. 1979 మార్చినాటికి 591 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కల్పించడం జరిగింది.

*పరిశ్రమలు :* ఈ జిల్లాలో ముఖ్యమైనది అభ్రకం పరిశ్రమ. ఇది ముఖ్యంగా రాపూరు, గూడూరు తాలూకాలలో ఉంది. కాని అభ్రకాధార పరిశ్రమ పడలేదు. అభ్రకం పరిశ్రమ కాక జిల్లాలో డ్రైబ్యాటరీ ప్లాంటు (నెల్లూరు వద్ద) పింగాణీ ఫ్యాక్టరీ, ఎనామిల్ వర్క్సు, మంగుళూరు పెంకుల ఫ్యాక్టరీ, గాజుపలక ఫ్యాక్టరీ, ఎముకల పొడి ఫ్యాక్టరీ, నూనెమిల్లులు రైస్‌మిల్లులు, మొదలైన వున్నాయి. పరిశ్రమల వార్షిక నివేది ననుసరించి జిల్లాలో 176 ఫ్యాక్టరీలు, 3,693 మంది కార్మికులున్నారు. ఉత్పాదక మూలధనం రూ. 536.54 లక్షలు. ఉత్పత్తి రూ. 1,268.3 లక్షలు. చేతి వృత్తులలో చేనేత పరిశ్రమకు ఈ జిల్లా ప్రసిద్ధమని చెప్పవచ్చు. వెంకటగిరి చీరలకు దేశమంతటా గిరాకిఉంది. ఇదిగాక పేము, బీడి పరిశ్రమలు కూడా ఉన్నాయి. ఈ జిల్లాలో చిన్న తరహా పరిశ్రమల యూనిట్లు 636 ఉన్నాయి. వీటి పెట్టుబడి రూ. 6.24 కోట్లరూపాయలు.

*మున్సిపాలిటీలు :* 3 నెల్లూరు, గూడూరు, కావలి.

*రెవెన్యూ డివిజన్లు :* 3 నెల్లూరు, కావలి, గూడూరు.

*తాలూకాలు :* 9 నెల్లూరు, రాపూరు, ఆత్మకూరు, కావలి, ఉదయగిరి, కోవూరు, గూడూరు, వెంకటగిరి, సూళ్ళూరుపేట.

*గ్రామాలు :* 1,099 *గ్రామపంచాయతీలు :* 698. *పంచాయతీసమితులు :* 14

*రవాణా :* పి. డబ్ల్యు. డి వారి నిర్వహణ్య 1,530 కి.మీలు, జిల్లాపరిషత్తు పంచాయతీల నిర్వహణలో 1,218 కి. మీలు,పొడవు రోడ్లున్నాయి. ఇవి కాక రైల్వే మార్గాలుకూడా వున్నాయి. బకింగ్‌హోమ్ కాలువ ఈ జిల్లాద్వారా ప్రవహిస్తున్నందువల్ల జలమార్గ రవాణా కూడా ఈ జిల్లాలో సాగుతున్నది.

*సహకార సంఘాలు :* 1975-76 నాటికి జిల్లాలోని సహకార సంఘాలు 987. వీటిలో సహకార సంఘాలు 731, చేనేత సహకార సంఘాలు 45, పారిశ్రామిక సహకార సంఘాలు 95, మత్స్యకార్ల సహకార సంఘాలు 56, పాలసరఫరా సహకార సంఘాలు 50 ఉన్నాయి.

*విద్య :* ఈ జిల్లాలో 2,116 ప్రాథమిక పాఠశాలలు. 194 అప్పర్ ప్రైమరీ పాఠశాలలు 131 సెకండరీ పాఠశాలలు, 13 జూనియర్ కళాశాలలు, 10 డిగ్రీ కళాశాలలు ఉన్నాయి. ఇవి కాక సంస్కృత కళాశాలలు, విద్యాకళాశాలలు, న్యాయశాస్త్ర (లా) కళాశాల ఉన్నాయి. జిల్లాలోని అక్షరాస్యుల సంఖ్య 26.83.

*వైద్యం :* అల్లోపతి వైద్యశాలలు 10, డిస్పెన్సరీలు 102, ఆయుర్వేద వైద్యశాలలు డిస్పెన్సరీలు 10, యునాని వైద్యశాలలు 2, హోమియోపతి వైద్యశాలలు 3.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* శ్రీ తల్పగిరి రంగస్వామి దేవాలయం, నెల్లూరు, ఉదయగిరి, జొన్నవాడ, మన్నార్ పోలూరు, వేదగిరి, సంగం మొదలైనవి.

*శాసనసభ నియోజకవర్గాలు :* 11- ఉదయగిరి, కావలి, ఆలూరు, కోవూరు, ఆత్మకూరు రాపూరు, నెల్లూరు, సర్వేపల్లి, గూడూరు, సూళ్ళూరిపేట, వెంకటగిరి.

*లోక్‌సభ నియోజకవర్గం :* 1 నెల్లూరు.

***ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న :***

| | | |
|---|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | : | 14 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | : | 83 |
| బ్యాంక్ ఆఫీసులు | : | 80 |
| షెడ్యూల్డ్ కులాలు, వెనకబడి వర్గాలవారికి ఇళ్ళ స్థలాల పంపకం | : | 7,689 |
| షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | : | 98 |
| " తెగల " " | ; | 15 |
| మార్కెట్ కమిటీలు | : | 9 |
| పోస్టాఫీసులు | : | 867 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | : | 83 |
| టెలిఫోన్ ఎక్స్ ఛేంజీలు | : | 43 |
| పబ్లిక్ కాల్ ఆఫీసులు | : | 121 |
| నివాస గృహాలు | : | 3,30,935 |
| షెడ్యూల్డ్ కులాలవారి జనాభా (1971) | : | 3.18 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగల వారి జనాభా (1971) | : | 1.3 లక్షలు |

## పశ్చిమగోదావరి జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 7,780 చ. కి. మీలు |
| జనాభా | : | 1971 నాటికి 23.74 లక్షలు |
| | : | పురుషులు 11.91 లక్షలు స్త్రీలు 11.83లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి. మీకు 305 మంది. |
| ముఖ్య కేంద్రం | : | ఏలూరు |

ఈ జిల్లా 1925లో ఏర్పడింది. ఈ ప్రాంతాన్ని మౌర్యులు, ఆంధ్రశాతవాహనులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, చాళుక్యులు, కొండవీటిరెడ్లు, విజయనగరరాజులు, గోల్గొండ నవాబులు, ఢిల్లీ మొగలాయీలు. ఫ్రెంచ్‌వారు, బ్రిటిష్‌వారు పరిపాలించారు. ఒకప్పుడు ఇది వేంగిదేశంలో భాగం. ఏలూరు సమీపంలో ఉన్న పెదవేగి గ్రామమే ఒకప్పుడు వేంగిదేశం రాజధాని వేంగినగరమని అంటారు.

***భౌగోళిక స్వరూపం :*** దక్షిణాన కృష్ణాజిల్లా, బంగాళాఖాతం, పశ్చిమాన కృష్ణా. ఖమ్మం జిల్లాలు, తూర్పు ఉత్తరదిశలలో తూర్పుగోదావరి జిల్లా ఈ జిల్లా సరిహద్దులు. నైసర్గికంగా ఈ జిల్లాను కొండప్రాంతం, మెట్టప్రాంతం, డెల్టా ప్రాంతమని మూడు భాగాలుగా విభజించవచ్చు. ఈ జిల్లాలో ముఖ్యంగా ఒండ్రుసేల, నల్లరేగడి, ఎర్రనేలలు ఉన్నాయి. ఇవికాక బురదనేలలు, చిట్టడవులు కూడా ఉన్నాయి.

***శీతోష్ణస్థితి, వర్షపాతం :*** వేసవిలో చాలా వేడిగా ఉంటుంది. కోస్తాప్రాంతంలో కంటె ఏజెన్సీ ప్రాంతంలో చలి ఎక్కువ. సరాసరి గరిష్ఠ ఉష్ణోగ్రత 35° సెంటిగ్రేడ్, కనిష్ఠ ఉష్ణోగ్రత 17° సెంటిగ్రేడ్ జూన్-సెప్టెంబరు నెలలలో నైరుతీ ఋతుపవనాలవల్ల, అక్టోబరు నవంబరు నెలలలో ఈశాన్య ఋతుపవనాలవల్ల వర్షాలు పడుతుంటాయి. సగటు వర్షపాతం సాలుకు 1081.7 మి.మీ.లు.

***నదులు :*** జిల్లా తూర్పుసరిహద్దును చుట్టి గోదావరినది ప్రవహిస్తున్నది. మిగిలినవి చిన్న నదులు. వాటిలో తమ్మిలేరు. ఎర్రకాలవ, బైనేరునది, కొవ్వాడ కాలువ, రాళ్ళ మడుగు గుండేరు ముఖ్యమైనవి. గోదావరి, కృష్ణా, డెల్టాల మధ్య ఉన్న సుప్రసిద్ధ కొల్లేరు సరస్సు ఏలూరు తాల్లూకా దక్షిణ ప్రాంతంలో ఉంది.

***అడవులు :*** అడవుల విస్తీర్ణం 89,276 హెక్టార్లు-అంటే జిల్లా విస్తీర్ణంలో దాదాపు 11.4 శాతం అడవి ప్రాంతం. వెదురు, కలప, ఈ అడవులలో ఎక్కువగా లభిస్తున్నది. ఇట్లాంటి అడవులు పోలవరం ఏజెన్సీ ప్రాంతంలో ఉన్నాయి. ఇంకా చింతలపూడి, కొవ్వూరు, ఏలూరు తాలూకాలలో చిట్టడవులున్నాయి.

***ఖనిజసంపద :*** రాఘవపురం, కొత్తపల్లి, ద్వారకా తిరుమల గ్రామాలవద్ద ప్లాష్టిక్ గోండ్వానా బంకమట్టి దొరుకుతున్నది. కొవ్వూరు తాలూకాలో దొరికే సున్నపురాయి, పోలవరంవద్ద దొరికే అభ్రకం, కామవరపుకోట, జంగారెడ్డి గూడెం జీలుగుమల్లి గ్రామాలలో దొరికే బొగ్గు ఈ జిల్లా ఖనిజసంపద. ఇవికాక నరసాపురంవద్ద సహజవాయు నిక్షేపాలున్నట్లు తెలుస్తున్నది.

***వ్యవసాయం, పంటలు :*** ఈ జిల్లా వ్యవసాయరంగంలో సుప్రసిద్ధమైనది. జిల్లాలోని మొత్తంభూమి 7.8 లక్షల హెక్టార్లు, నికర పంటభూమి 4.2 లక్షల హెక్టార్లు. ప్రధానమైన పంట వరి. ఇంకా ఈ జిల్లాలో పండించే వాణిజ్య పంటలలో చెరుకు, అరటి, వేరుసెనగ, నువ్వులు, పొగాకు, మిరప, కర్రపెండలం, ప్రత్తి మొదలైనవి ముఖ్యమైనవి. ఇవికాక నారింజ, నిమ్మ, బత్తాయి, కొబ్బరితోటలు కూడా ఈ జిల్లాలో ఎక్కువగానే ఉన్నాయి. 1961 లో ఫోర్డ్ ఫౌండేషన్ సహకారంతో ఈ జిల్లాలో సాంద్రవ్యవసాయ పద్ధతి ప్రవేశపెట్టడం జరిగింది. ఆహారధాన్యాల ఉత్పత్తి 10 లక్షల టన్నులు. ఈ జిల్లాలో మారుటేరు వద్ద ఒక వ్యవసాయ పరిశోధన కేంద్రం, పుల్లావద్ద మరొక కేంద్రం ఉన్నాయి. ఇవి వరికి సంబంధించినవి. ఇవికాక తాడేపల్లిగూడెంవద్ద నేలల స్వభావ పరిశోధనశాల, కొవ్వూరువద్ద తోటల పరిశోధన, తణుకువద్ద చెరుకు పరిశోధన, కేంద్రాలు కూడాఉన్నాయి.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* నీటిపారుదల సౌకర్యమున్న మొత్తం భూమి 3.32 లక్షల హెక్టార్లు. వీటిలో 21.9 లక్షల హెక్టార్లు కాలువల కింద 4.9 లక్షల హెక్టార్లు చెరువుల కింద, బావులకింద 5.8 లక్షల హెక్టార్లు ఇతర వనరులకింద ఆరువేల హెక్టార్లు సాగులో ఉన్నాయి, జిల్లేరు మీడియం ఇరిగేషన్ ప్రాజెక్టు ఈ జిల్లాలో ఉంది.

1980 మార్చి నాటికి 694 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కలిగించడం జరిగింది.

*పరిశ్రమలు :* చక్కెర ఫ్యాక్టరీలు తణుకు, చాగల్లు, పాలకొల్లు, భీమడోలులలో ఉన్నాయి. రోజుకు 13.6 వేల లీటర్ల ఆల్కహాల్ ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీ తణుకులో ఉంది. ఇవికాక తణుకులో రెండు నూలు మిల్లులు, కొబ్బరి పరిశ్రమలు, ఏలూరులో జనపనార మిల్లు, సిమెంటు ఫ్యాక్టరీ ఉన్నాయి. తాడేపల్లి గూడెంలో బియ్యపు తవుడునుంచి నూనెతీసే ఫ్యాక్టరీ ఓవోమాల్ట్ ఫ్యాక్టరీ, సిమెంటుఫ్యాక్టరీ ఆధునిక రైసుమిల్లులు ఉన్నాయి. ఇవికాక భీమవరంలో బియ్యపునూనె పరిశ్రమ, కొవ్వూరులో రసాయన పరిశ్రమలు, భీమడోలులో ఇటుకలు, ద్వారకా తిరుమలలో తెల్లసుద్ద పరిశ్రమ, నిడదవోలు పాలకొల్లులలో సిమెంటు ఫ్యాక్టరీలు, నరసాపురం పాలకొల్లులలో కొబ్బరిపీచు పరిశ్రమలు, కొల్లేటి ప్రాంతంలో చేపల పెంపకం కేంద్రాలు ఉన్నాయి. మొత్తం జిల్లాలో 495 ఫ్యాక్టరీలున్నాయి, దాదాపు 31,600 మంది కార్మికులున్నారు. ఉత్పాదక మూలధనం 34.87 కోట్ల రూపాయలు, ఉత్పత్తి 10.34 కోట్ల రూపాయలు. నూలు వడకటం, అద్దకము, ఉన్ని, లేసులు తయారుచేయడం, తివాసీనేత, బీడీల తయారీ ఈ జిల్లాలోని ప్రధాన చేతివృత్తులు. లేసు అల్లికలు విదేశాలకు ఎగుమతి అవుతున్నాయి కూడా.

*మునిసిపాలిటీలు :* 7-భీమవరం, ఏలూరు, నరసాపురం, నిడదవోలు, కొవ్వూరు, పాలకొల్లు, తాడేపల్లిగూడెం.

రెవిన్యూ *డివిజన్లు :* 3-ఏలూరు, కొవ్వూరు, నరసాపురం.

తాలూకాలు *:* 12-ఏలూరు, తాడేపల్లిగూడెం, చింతలపూడి, కొవ్వూరు, తణుకు, పోలవరం, నరసాపురం, భీమవరం, భీమడోలు, కోడూరు, ఆకివీడు, గోపాలపురం.

*పంచాయతీ సమితులు :* 16: *గ్రామాలు :* 880; గ్రామపంచాయతీలు: 636

*రవాణా :* 1977-78 నాటికి పి.డబ్ల్యు.డి, ఆధ్వర్యంలో 1667 కి.మీ.లు, జిల్లాపరిషత్తు, పంచాయతీ సమితుల ఆధ్వర్యంలో 2,889 కి.మీ. ల రోడ్లున్నాయి. జిల్లాలో దాదాపు 195 కి.మీ. బ్రాడ్‌గేజ్ రైల్వే మార్గం ఉంది. గోదావరి, కృష్ణా నదుల కాలువలు సరుకుల రవాణాకూ ప్రయాణీకులకు ఉపయోగపడుతున్నాయి. నరసాపురాన్ని చిన్నతరహా ఓడరేవుగా అభివృద్ధిపరచడానికి ప్రయత్నాలు సాగుతున్నాయి.

*సహకార సంఘాలు :* 1975-76 నాటికి మొత్తం 1,504 సహకార సంఘాలున్నాయి. వీటిలో సహకార సంఘాలు 1,206. చేనేత సహకార సంఘాలు 56, పారిశ్రామిక సహకార సంఘాలు 98, మత్స్యకార్ల సహకారసంఘాలు 99, పాలసరఫరా సహకార సంఘాలు 45.

*విద్య :* 1977-78 నాటికి జిల్లాలోని ప్రాథమిక పాఠశాలల సంఖ్య 2,166. అప్పర్ ప్రైమరీ పాఠశాలలు 193. హైస్కూళ్ళు 183. జూనియర్ కళాశాలలు 18, డిగ్రీకళాశాలలు 19. ఒక పాలిటెక్నిక్ కళాశాల, వ్యాయామవిద్యాకళాశాల ఒకటి, ఒక ఉపాధ్యాయ శిక్షణసంస్థ ఉన్నాయి. అక్షరాస్యత శాతం 34.14.

*వైద్యం :* అల్లోపతి వైద్యశాలలు 11, డిస్పెన్సరీలు 86; ఆయుర్వేద వైద్యశాలలు. డిస్పెన్సరీలు 76, యునానీ వైద్యశాలలు 6, హోమియోపతి వైద్యశాలలు, డిస్పెన్సరీలు 5 ఉన్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* ద్వారకా తిరుమల-శ్రీవేంకటేశ్వర దేవాలయం, పాలకొల్లు శ్రీ క్షీరా రామలింగేశ్వర స్వామి దేవాలయం, గుంటుపల్లి-బౌద్ధ స్మృతి చిహ్నాలు. పెనుగొండ-శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయం.

*శాసనసభ నియోజక వర్గాలు :* 16 - నరసాపురం, పాలకొల్లు, ఆచంట, భీమవరం, ఉండి, పెనుగొండ, తణుకు, అత్తిలి, తాడేపల్లిగూడెం, ఉంగుటూరు, దెందులూరు, ఏలూరు, గోపాలపురం, కొవ్వూరు, పోలవరం, చింతలపూడి.

*పార్లమెంటు నియోజకవర్గాలు :* 2 - ఏలూరు. నరసాపురం.

**ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న**

| | | |
|---|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | : | 20 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | : | 195 |
| బ్యాంకు ఆఫీసులు | : | 136 |
| షెడ్యూల్డ్ కులాల, వెనకబడిన వర్గాలవారికి ఇళ్ళ స్థలాల పంపకం | : | 3185 |
| షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు హాస్టళ్లు | : | 121 |
| షెడ్యూల్డ్ తెగల వారికి హాస్టళ్లు | : | 16 |
| మార్కెట్ కమిటీలు | : | 8 |
| పోస్టాఫీసులు | : | 683 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | : | 174 |
| టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లు | : | 71 |
| పబ్లిక్‌కాల్ ఆఫీసులు | : | 118 |
| నివాస గృహాలు | : | 4,17,155 |
| షెడ్యూల్డ్ కులాలవారి జనాభా(1971) | : | 3.40 లక్షలు |
| షెడ్యూల్ తెగలవారి జనాభా (1971) | : | 0 52 లక్షలు |

# ప్రకాశం జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 17,620 చ. కి. మీ. లు |
| జనాభా | : | 1971నాటికి 19.19 లక్షలు పురుషులు 9.66 లక్షలు స్త్రీలు 9.53లక్షలు |
| జనసాంద్రత | : | చ కి. మీ. కు 109 మంది |
| ముఖ్య కేంద్రం | : | ఒంగోలు |

ఈ జిల్లా నెల్లూరు, కర్నూలు, గుంటూరు జిల్లాల నుంచి కొన్ని తాలూకాలను విడదీయగా 1970 లో ప్రత్యేకంగా ఏర్పడింది. ఈ జిల్లా ప్రాచీన చరిత్రకు పై మూడు జిల్లాల ప్రాచీన చరిత్రే ఆధారం. ఈ ప్రాంతాన్ని ఇక్ష్వాకులు, పల్లవులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగరరాజులు గోల్కొండ, కర్ణాటక నవాబులు పరిపాలించారు. ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు ఈ జిల్లాకు చెందిన వారవటంతో 1972లో ఆయన స్మృత్యర్థం ప్రకాశం జిల్లాగా పేరు పెట్టడం జరిగింది.

*భౌగోళిక స్వరూపం :* ఈ జిల్లాకు ఉత్తరాన గుంటూరుజిల్లా, దక్షిణాన కడప, నెల్లూరు జిల్లాలు, పడమట కర్నూలు జిల్లా, తూర్పునబంగాళాఖాతం సరిహద్దులు. ప్రధానంగా ఈ జిల్లాలో ఎర్రయిసుక రేగడి (54 శాతం) నల్లరేగడి (34శాతం) ఇసుకనేలలు ఉన్నాయి.

*శీతోష్ణస్థితి, వర్షపాతం:* ఈ జిల్లాకు నైరుతి, ఈశాన్య ఋతుపవనాలవల్ల వర్షపాతం సంభవిస్తుంది. ఈ జిల్లా సగటు వర్షపాతం 764 మి.మీ. ఈ జిల్లాలో పడమర ప్రాంతంలో వేసవికాలంలో ఎండలు తీవ్రంగా ఉంటాయి. కోస్తా ప్రాంతంలో ఎండలు అంత హెచ్చుగా ఉండవు. దర్శి, పొదిలి, కనిగిరి, కందుకూరు, మార్కాపురం తాలూకాలు హెచ్చుగా వర్షాభావానికి గురవుతూ ఉంటాయి.

*నదులు :* ఈ జిల్లాలో పెద్ద నదులు ఏమీ లేవు. గుండ్లకమ్మ, మూసీ, పాలేరు, ఓగేరు, వంటి చిన్న నదులు, వాగులు. ఉన్నాయి.

**అడవులు :** ఈ జిల్లాలో 4,47,169 హెక్టార్ల విస్తీర్ణంలో అడవులున్నాయి. గిద్దలూరు, మార్కాపురం తాలూకాలలో కొంతమేరకు నల్లమల అడవులు విస్తరించి ఉన్నాయి. ఈ అడవులనుంచి టేకు, చందనం, నల్లమద్ది, తదితర కలప లభిస్తుంది.

**వ్యవసాయం, పంటలు :** జిల్లా విస్తీర్ణంలో 37 శాతం భూమి మాత్రమే - అంటే 5,80,822 హెక్టార్ల భూమి-మాత్రమే. నికర వ్యవసాయ భూమి. ఈ జిల్లాలో గల మొత్తం పంటభూమిలో 72 శాతం ఆహార పంటలు. 28 శాతం ఆహారేతర పంటలు పండుతున్నాయి. ఆహార పంటలలో జొన్న, సజ్జ, రాగి, వరిగ ముఖ్యమైనవి. వాణిజ్య పంటలలో పొగాకు, వేరుశనగ, ఆముదాలు, మిర్చి, పత్తి ప్రధానమైనవి. ఆహారధాన్యాల పంటలకింద 4,34,258 హెక్టార్ల భూమి, ఆహారేతర పంటలకింద 1,90,220 హెక్టార్ల భూమి వున్నది. ఈ జిల్లాలో వరిధాన్యం 96 వేల టన్నులు, జొన్నలు. 61 వేల టన్నులు. సజ్జలు 48 వేల టన్నులు. రాగి

50 వేల టన్నులు. ఇతర ధాన్యాలు 59 వేల టన్నులు పండుతాయి. శనగలు 300 టన్నులు కందులు 1,2ు0 టన్నులు పెసలు 588 టన్నులు, ఉలవలు 5 వేల టన్నులు పండుతాయి. ఈ జిల్లాలో కమతాల సంఖ్య 3,10,433.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* మొత్తం సాగుభూమిలో 24 శాతం నికర భూమికి నీటి పారుదల సౌకర్యాలున్నాయి. కాలువల ద్వారా 71,000 హెక్టార్లు, చెరువుల ద్వారా 34,000 హెక్టార్లు, గొట్టపు బావుల ద్వారా 65,000 హెక్టార్లు భూమి సాగవుతున్నది. ఈ జిల్లాలో 622 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం ఉన్నది.

*ఖనిజసంపద :* ఈ జిల్లాలో పలకలు, బలపాలకు పనికివచ్చే రాయి హెచ్చుగా లభిస్తుంది. యింకా ఈ జిల్లాలో మాగ్నెటైట్ క్వార్ట్జ్ నిక్షేపాలు, ముడిఇనుము, జిప్సం,సున్నపురాయి, రాగి ఖనిజాలు, లభ్యమవుతాయి. కంభం, మార్కాపురం తాలూకాల సరిహద్దులలో పలకరాయి సున్నపురాయి హెచ్చుగా లభిస్తాయి.

*పరిశ్రమలు :* ఈ జిల్లాలో చెప్పుకోదగిన భారీపరిశ్రమలు ఏమీలేవు. కాటన్,జిన్నింగ్, పొగాకు, డ్రైయింగ్, మంగుళూరుటైల్స్, పలకలతయారీ, జీడిపప్పు మొదలైన పరిశ్రమలున్నాయి. పరిశ్రమల వార్షిక సర్వే ప్రకారం ఈ జిల్లాలో మొత్తం 370 పరిశ్రమలున్నాయి. వాటిలో 50,387 మంది కార్మికులు పనిచేస్తున్నారు. ఈ పరిశ్రమల ఉత్పాదక మూలధనం 681.33 లక్షల రూపాయలు. ఉత్పత్తి విలువ రూ. 7032.27 లక్షలు.

*సహకార సంఘాలు :* ఈ జిల్లాలో 1,275 సహకార సంఘాలున్నాయి. వాటిసభ్యత్వం 2,62,000, ఈ సహకార సంఘాలలో 1,086 సాధారణ సహకార సంఘాలు, 69 చేనేత సహకార సంఘాలు, 68 పారిశ్రామిక సహకారసంఘాలు, 31 మత్స్యకాల సహకారసంఘాలు, 21 పాలసలఫరా సహకార సంఘాలున్నాయి.

*విద్య :* ఈ జిల్లాలో 1971 నాటికి అక్షరాస్యుల శాతం 23.16 పురుషులలో 33.6 శాతం అక్షరాస్యులుండగా స్త్రీలలో 13 శాతం మాత్రమే అక్షరాస్యులున్నారు. ఈ జిల్లాలో 75 డిగ్రీ కళాశాలలు 19 జూనియర్ కళాశాలలు ఉన్నాయి. ఈ జిల్లాలో 1978 నాటికి 2,220 ప్రాథమిక పాఠశాలలు 137 అప్పర్ ప్రైమరీ పాఠశాలలు, 144 హైస్కూళ్ళు ఉన్నాయి. ఒంగోల్‌లో ఐ.టి.ఐ ఉన్నది.

*వైద్యం :* ఈ జిల్లాలో 9 అల్లోపతి వైద్యశాలలు, 46డిస్పెన్సరీలు, 90 ఆయుర్వేద వైద్యశాలలు, ఒకటి యునానీ వైద్యశాల ఉన్నాయి.

*రవాణా :* ఈ జిల్లా బ్రాడ్‌గేజ్, మీటర్‌గేజ్, రైల్వేమార్గాలున్నాయి. ఒంగోలు, చీరాల కందుకూరు తాలూకాల మీదుగా మద్రాసు, ఢిల్లీ రైలుమార్గము, గిద్దలూరు, పొదిలి, మార్కాపురం, దర్శి తాలూకాల మీదుగా గుంతకల్, గుంటూరు రైలుమార్గాలున్నాయి. పి.డబ్ల్యుడి నిర్వహణలో 1856 కి.మీ. రోడ్లు, జిల్లాపరిషత్ పంచాయతీ సమితులరోడ్లు 1378 కి.మీ. ఉన్నాయి. అయితే గ్రామీణ ప్రాంతాలలో రవాణా సౌకర్యాలంతగా లేవు.

*రెవిన్యూ డివిజన్‌లు :* 3-ఒంగోలు, కందుకూరు, మార్కాపురం

*గ్రామాలు :* 1,005; గ్రామపంచాయతీలు 775

*పంచాయతీ సమితులు :* 14

*మునిసిపాలిటీలు :* మూడు 3 ఒంగోలు, చీరాల, మార్కాపురం

*తాలూకాలు :* 9 అద్దంకి, చీరాల దర్శి, గిద్దలూరు, కందుకూరు, కనిగిరి, మార్కాపురం, ఒంగోలు, పొదిలి.

*శాసనసభ నియోజక వర్గాలు :* 13-చీరాల, పరుచూరు, కందుకూరు, అద్దంకి, ఒంగోలు, సంతనూతలపాడు, కందుకూరు, కనిగిరి, కొండపి, కంభం, దర్శి, మార్కాపురం గిద్దలూరు

*లోక్‌సభ నియోజకవర్గం :* ఒంగోలు

*దర్శించదగ్గ ప్రదేశాలు :* చీరాల, పేరాల, అద్దంకి, ఒంగోలు

### *ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న*

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | 13 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 31 |
| బ్యాంక్ ఆఫీసులు | 93 |
| షెడ్యూల్డ్ కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 58 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 18 |
| మార్కెటింగ్ కమిటీలు | 9 |
| పోస్టాఫీసులు | 620 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 115 |
| టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లు | 42 |
| పబ్లిక్‌కాల్ ఆఫీసులు | 101 |
| నివాసగృహాలు | 3,77,434 |
| షెడ్యూల్డ్ కులాలవారిజనాభా (1971) | 1.78 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా (1971) | 0.55 లక్షలు |

## మహబూబ్‌నగర్ జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 18,419 చ. కి. మీ. |
| జనాభా | : | 19.32 లక్షలు (1971) |
| | | పురుషులు 9.72 లక్షలు; స్త్రీలు 9.60 లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి.మీ. కు 105 మంది |
| ముఖ్యకేంద్రం | : | మహబూబ్‌నగర్ |

ఈ ప్రాంతాన్ని పరిపాలించిన వారిలో చోళులు, కాకతీయులు, బహమనీ సుల్తానులు, నైజాం నవాబులు ముఖ్యులు. 18 వ శతాబ్దారంభంలో హైదరాబాదు సంస్థానం స్థాపించ డంతో ఈ జిల్లా నిజాం నవాబుల పాలనలోకి వచ్చింది.

*భౌగోళిక స్వరూపం :* ఈ జిల్లాకు ఉత్తరాన హైదరాబాదు, నల్లగొండ జిల్లాలో తూర్పున నల్గొండ, గుంటూరు, ప్రకాశం జిల్లాలు, దక్షిణాన కర్నూలు జిల్లా, పడమర కర్నాటక రాష్ట్రానికి చెందిన రాయచూరు, గుల్బర్గా జిల్లాలు సరిహద్దులు. ఈ జిల్లాలో చెలక భూములు ఎక్కువ. మహబూబ్‌నగర్, అలంపూర్, గద్వాల్ తాలూకాలోని భూములు సార వంతమైన నల్లరేగడి నేలలు. అచ్చంపేట ప్రాంతపు నేలలు యిసుకతో కూడి ఉంటాయి. కొన్ని ప్రాంతాలలో దుబ్బనేలలు కూడా ఉన్నాయి.

*శీతోష్ణస్థితి,వర్షపాతం :* ఈ జిల్లాలో సాధారణంగా ఉష్ణోగ్రత ఎక్కువగానే ఉంటుంది. గరిష్ఠ ఉష్ణోగ్రత 32.8° C కనిష్ఠ ఉష్ణోగ్రత 23.3 C. ఈ జిల్లాలో వర్షపాతం అతి స్వల్పం సాధారణవర్షపాతం 674.2 మి.మీ. ఈ వర్షపాతం ఎక్కువగా నైరుతి ఋతుపవనాల ద్వారానే లభిస్తుంది, ఈశాన్య ఋతుపవనాల ద్వారా లభించే వర్షపాతం చాలా తక్కువ. జిల్లాలో ఎక్కువ తాలూకాలు అనావృష్టికి గురవుతూ ఉంటాయి. మహబూబ్‌నగర్, కొడంగల్ తాలూకాలు మాత్రం అనావృష్టి ప్రాంతాలు కావు.

*నదులు :* ఈ జిల్లాలో ముఖ్యమైన నదులు కృష్ణ, తుంగభద్ర, దిండి, భీమానది మొదలైనవి.

*అడవులు :* ఈ జిల్లాలో 3,00,710 హెక్టార్ల భూమి అడవుల కింద ఉంది. ఇది మొత్తం విస్తీర్ణంలో 16.5 శాతం. రాష్ట్రంలోని మొత్తం అటవీ విస్తీర్ణంలో 8.7 శాతం ఈ జిల్లాలోనే ఉందని చెప్పవచ్చు. కృష్ణానదీతీర ప్రాంతంలో దట్టమైన అడవులున్నాయి. ఈ అడవులలో టేకు, ఏపి, నల్లమద్ది, వెదురు, మామిడి మొదలైనచెట్లు విస్తారంగా ఉన్నాయి. కోయిలకొండ అడవులలో వన్యమృగాలు కూడా ఉన్నాయి.

*వ్యవసాయం, పంటలు :* జిల్లాలో నికర వ్యవసాయ భూమి 10.33 లక్షల హెక్టార్లు ఈ జిల్లాలో ప్రధానంగా జొన్న, వరి, సజ్జ, రాగివంటి ఆహారధాన్యాలు, వేరుసెనగ ఆము దాలు వంటి నూనెగింజలు పండుతాయి. పత్తి, పొగాకువంటి వాణిజ్యపంటలు కూడా కొంత వరకు పండుతాయి. ఆహారపంటల కింద 7.98 లక్షల హెక్టార్లభూమి, ఆహారేతర పంటల కింద 1.75 లక్షల హెక్టార్ల భూమి ఉన్నది. ఈ జిల్లాలో 1.3 లక్షల టన్నుల వరిధాన్యం 1.84 లక్షల టన్నుల జొన్నలు 32 వేల టన్నుల సజ్జలు 35 వేల టన్నుల రాగి పండుతాయి మొత్తం ఆహారధాన్యాలు ఈ జిల్లాలో 4.96 లక్షల టన్నులు (1977-78) పండుతాయి. ఈ జిల్లాలో వేరుశనగ అత్యధికంగా పండుతుంది.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* ఈ జిల్లాలోమొత్తం నీటిపారుదల కింద ఉన్నభూమి 1,06,420 హెక్టార్లు. ఈ నీటిపారుదల సౌకర్యంగల భూమి ఎక్కువభాగం చెరువుల నీటి ద్వారానే సాగవుతున్నది. కాలువలు, బావులు, యితర మార్గాల ద్వారాకూడా నీటి వసతులు

కల్పించడం జరిగింది. రాజోలిబండవద్ద మళ్ళింపుపథకం, కోయలసాగరు, సరళాసాగరు, ప్రాజెక్టులు, వూకచెట్టివాగు ప్రాజెక్టు, జీల్ ధర్ తిప్పప్రాజెక్టు మొదలైనవాటివల్ల ఈ జిల్లాలో నీటిపారుదల సౌకర్యాలు హెచ్చే అవకాశమున్నది. 1980 జనవరినాటికి ఈ జిల్లాలో 1,103 గ్రామాలకు విద్యుచ్ఛక్తి లభించినట్లు తెలియవస్తున్నది.

***ఖనిజసంపద :*** ఈ జిల్లాలో ముఖ్యంగా క్వార్ట్ (పలుగురాయి) ఖనిజం ఎక్కువగా లభ్యమవుతుంది. ఇది షాద్‌నగర్, బాలానగర్, తిమ్మాపూర్ ప్రాంతాలలో దొరుకుతుంది. దీనిని గాజుల పరిశ్రమలో ఉపయోగిస్తారు. కొల్హాపూర్ ప్రాంతంలో సున్నపురాయి లభిస్తుంది ముక్తల్ ఆత్మకూరు ప్రాంతాలలో కొన్ని ప్రాంతాలలో స్వల్పంగా రాగిఖనిజం లభిస్తుంది.

***పరిశ్రమలు :*** ఈ జిల్లాలో భారీపరిశ్రమలేవీ లేవు. మధ్యతరహా చిన్నతరహా పరిశ్రములు కొన్నిఉన్నాయి. వీటి నిర్వహణ మూలధనం రూ. 23.61 లక్షలు. ఉత్పత్తి మూలధనం రూ. 165.32 లక్షలు. 1,895 మంది కార్మికులు ఈఫ్యాక్టరీలో పనిచేస్తున్నారు. ఉత్పత్తుల విలువ రూ. 697.28 లక్షలు. ఈ జిల్లాలో స్పిన్నింగు మిల్లులు, రంపమిల్లులు, నూనెమిల్లులు, రైసుమిల్లులు, ఇంజనీరింగు యూనిట్లున్నాయి. ఈ జిల్లాలో ఉన్ని పరిశ్రమ ప్రాముఖ్యం వహించివున్నది. నల్లకంబళ్ళ తయారీకి జడ్చర్ల సుప్రసిద్ధమైనది. షాద్‌నగర్ ప్రాంతంలో పట్టుపరిశ్రమ, గద్వాల్ ప్రాంతంలో చేనేత పరిశ్రమ పెంపొందుతున్నాయి. ఈ జిల్లాలో రూ. 2.93 కోట్ల పెట్టుబడిలో 388 చిన్నతరహా పారిశ్రామిక యూనిట్లున్నాయి.

***సహకార సంఘాలు :*** ఈ జిల్లాలో మొత్తం 2,392 సహకార సంఘాలున్నాయి. వాటిలో 1.94 లక్షలమంది సభ్యులున్నారు. వాటిలో 2,081 సాధారణ సహకార సంఘాలు, 132 పారిశ్రామిక సహకార సంఘాలు, 75 పాలసరఫరా సహకార సంఘాలున్నాయి.

***మునిసిపాలిటీలు :*** 3-గద్వాల్, మహబూబ్‌నగర్, నారాయణపేట.

***రెవెన్యూ డివిజన్‌లు:*** 4-మహబూబ్‌నగర్, నాగర్‌కర్నూలు,కొడంగల్, (నారాయణపేట) గద్వాల.

**తాలూకాలు :** 12-మహబూబ్‌నగర్, కల్వకుర్తి, షాద్‌నగర్, నాగర్‌కర్నూల్. అచ్చంపేట, కొల్హాపూర్, కొండగల్లు, ఆత్మకూరు, మక్తల్, అలంపూర్, గద్వాల, వనపర్తి.

***గ్రామాలు:*** 1,529 : ***గ్రామపంచాయితీలు :*** 754 : ***పంచాయతీ సమితులు :*** 16

***రవాణా :*** ఈ జిల్లాలో 1,637 కి. మీ. పొడవు. రోడ్లు పి. డబ్ల్యు. డి కిందను, అందులో 1,460 కి.మీ. రోడ్లు పంచాయతీ సమితుల కింద ఉన్నాయి. కర్నూల్ హైదరాబాదు మీటర్‌గేజ్ రైలుమార్గం ఈ జిల్లాగుండా పోతున్నది.

***విద్య :*** ఈ జిల్లాలో 16 జూనియర్ కళాశాలలు, 6 డిగ్రీ కళాశాలలు, 1,548 ప్రాథమిక పాఠశాలలు, 230 అప్పర్ ప్రైమరీ పాఠశాలలు, 173 హైస్కూళ్ళు ఉన్నాయి. ఒక ఉపాధ్యాయ శిక్షణ సంస్థ ఉన్నది. 1971 జనాభాలెక్కల ప్రకారం ఈ జిల్లాలో అక్షరాస్యుల శాతం 15.55 అక్షరాస్యులు పురుషులలో 23.29 శాతం స్త్రీలలో 7.72 శాతం.

*వైద్యం :* ఈ జిల్లాలో 72 అల్లోపతి ఆస్పత్రులు, 26 ఆయుర్వేద అస్పత్రులు, 1 యునాని ఆస్పత్రి, 4 హోమియోపతి ఆస్పత్రులున్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* ఆలంపురం, ఫరహాబాద్, కొయ్యరకొండ, పానగల్లు, ఉమామహేశ్వరం, చంద్రగుప్తనగరు.

*శాసనసభ నియోజకవర్గాలు :* 13- అచ్చంపేట, నాగర్‌కర్నూల్, కల్వకుర్తి, షాద్‌నగర్, జడ్‌చర్ల, మహబూబ్‌నగర్, వనపర్తి, కొల్హాపూర్, ఆలంపూర్, గద్వాల్, అమర్‌చింత, మక్తాల్, కొండగల్లు.

*లోక్‌సభ నియోజకవర్గాలు :* 2-నాగర్‌కర్నూల్, మహబూబ్‌నగర్.

*ఈ జిల్లాలో* ***1977-78*** నాటికి ఉన్న

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | — |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 1 |
| బ్యాంకు ఆఫీసులు | 59 |
| షెడ్యూల్డ్‌కులాల వెనకబడిన జాతులవారికి ఇళ్ళస్థలాలపంపిణీ | 10,266 |
| షెడ్యూల్డ్ కులాల విద్యార్థుల హాస్టళ్లు | 72 |
| షెడ్యూల్డ్ తెగల విద్యార్థుల హాస్టళ్లు | 9 |
| మార్కెటింగ్ కమిటీలు | 14 |
| పోస్టాఫీసులు | 792 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 74 |
| టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లు | 30 |
| పబ్లిక్ కాల్ ఆఫీసులు | 36 |
| నివాసగృహాలు | 3,58,754 |
| షెడ్యూల్డ్ కులాల వారు (1971) | 3.25 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారు (1971) | 0.06 లక్షలు |

## మెదక్ జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | · | 9,685 చ.కి.మీలు |
| జనాభా | : | 1971 నాటికి 14.68 లక్షలు |
| | : | పురుషులు 7.39 లక్షలు |
| | : | స్త్రీలు 7.29 లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి.మీ కు 123 మంది |
| ముఖ్యకేంద్రం | : | సంగారెడ్డి |

శాతవాహనులు, రాష్ట్రకూటులు, దేవగిరి యాదవులు, హోయసలులు, కాకతీయరాజులు రెడ్డిరాజులు, గోల్కొండ, నైజాం నవాబులు పాలించిన ఈ ప్రాంతం చారిత్రకంగా ప్రసిద్ధి కెక్కిన ప్రాంతం. క్రీస్తు పూర్వమే రోమనులతో వర్తకవాణిజ్య సంబంధాలుండేవనే అభిప్రాయాన్ని బలపరిచే ఆధారాలిక్కడ లభించినాయి. మెదక్, సంగారెడ్డి, కొండాపురం మొదలైనవి చారిత్రకంగా వన్నెకెక్కినస్థలాలు. మెదక్ పూర్వం రాచపీడు, గొల్లారాబాదు అనేపేర్లతో చెలామణిలో ఉండేది.

*భౌగోళికస్వరూపం:* తూర్పున వరంగల్, నల్గొండ జిల్లాలు, పడమర కర్నాటక రాష్ట్రం, ఉత్తరాన నిజామాబాదు, కరీంనగరు, జిల్లాలు, దక్షిణాన హైదరాబాదుజిల్లా ఈ జిల్లాకు సరిహద్దులు. ఈ జిల్లాలోని 48 శాతం గ్రామాలలో చెలకనేల, 45 శాతం గ్రామాలలో నల్లనేల, 11 శాతం గ్రామాలలో దుబ్బనేల ఉన్నాయి.

*శీతోష్ణస్థితి, వర్షపాతం :* సెప్టెంబర్‌నుంచి జూన్ వరకు వాతావరణం ఆరోగ్యకరంగా అహ్లాదకరంగా ఉంటుంది. వర్షాకాలంలో గాలిలో తేమ ఎక్కువ. వాతావరణం అనారోగ్యకరణంగా ఉంటుంది. కనిష్ఠ ఉష్ణోగ్రత 4.4° సెంటిగ్రేడ్. గరిష్ఠ ఉష్ణోగ్రత 37.8° సెంటిగ్రేడ్. వర్షపాతం సాధారణంగా నైరుతి రుతుపవనాల వల్లనే కలుగుతుంది. సగటు వర్షపాతం సాలుకు 903.7 మి.మీ. లు.

*నదులు :* ఈ జిల్లాలో నదులు తక్కువ. ముఖ్యనది గోదావరి నదికి ఉపనదియైన మంజీరా నది. ఇది ఈ జిల్లాలో 96 కి.మీ. దూరం ప్రవహిస్తుంది. ఇదికాక, మంజీరా నదికి ఉపనది అయిన పసుపులేరు, కడలేరు చెప్పుకోదగినవి.

*అడవులు :* అడవుల విస్తీర్ణం 89,449 హెక్టార్లు. అంటే జిల్లా విస్తీర్ణంలో 9.8 శాతం అడవులన్నమాట. ఆర్థికంగా ఎక్కువ విలువలేని టేకు రకాలు, మద్ది, చింత, బీడీఆకులు లభిస్తాయి. టేకుస్థానంలో తక్కినచెట్లు నాటుతున్నారు.

*ఖనిజసంపద :* ఈ జిల్లాలో ముఖ్యంగా లభించే ఖనిజాలు శిలాస్ఫటికాలు, స్వర్ణగైరికం ముద్ద బంకమన్ను, గృహనిర్మాణ శిలలు.

*వ్యవసాయం, పంటలు :* ఈజిల్లాలో ముఖ్యమైన పంటలు జొన్న, వరి, చెరకు, మిరప, వేరుశనగ, నువ్వులు, ఆముదాలు, ప్రత్తి, పొగాకు. మొత్తం పంటభూమి 4,98,000 హెక్టార్లు. ఆహారపు పంటలు 4,74,000 హెక్టార్లలోను. ఆహారేతర పంటలు 24,000 హెక్టార్లలోను పండుతాయి. శాశ్వతమైన పచ్చికబయలు 70,000 హెక్టార్లు. సాగుకు లాయకీ అయినబంజరు 34,000 హెక్టార్లు. వ్యవసాయేతరప్రయోజనాలకింద 58,000 హెక్టార్లు. ఆహారధాన్యాలఉత్పత్తి 3.8 లక్షల టన్నులు, వరి సాగుచేసే భూమి 1,26,000 హెక్టార్లు. హెక్టారుకు ఉత్పత్తి శక్తి 2,038 కి.గ్రా. కమతాలు 25,260. ఈ జిల్లాలో ఒకఇంతర్జాతీయ వ్యవసాయ పరిశోధనా కేంద్రముంది.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి* : పెద్దనదులు లేకపోవడంవల్ల పెద్ద ప్రాజెక్టులు లేవు. ప్రధానమైన నీటి వనరులు చెరువులు. వీటిలో మహాత్కాపురం చెరువు ముఖ్యమైనది. జిల్లాలో నీటిపారుదల సౌకర్యం ఉన్న భూమి 1,21,000 హెక్టార్లు. దీనిలో కాలువల కింద 8,000, చెరువుల కింద 79,000, బావులకింద 31,000. ఇతరవనరులకింద 3,000 హెక్టార్లు సాగవుతున్నది. అంతర్జాతీయ అర్ధశుష్క, ఉష్ణమండల ప్రాంత సస్య పరిశోధన సంస్థ ఈ జిల్లాలోని పటాన్ చెరువువద్ద వుంది. 1979 మార్చి నాటికి విద్యుచ్ఛక్తి సౌకర్యాలున్న గ్రామాల సంఖ్య 663.

*పరిశ్రమలు* : పటాన్ చెరువు హైదరాబాదు సమీపంలో ఉన్నందువల్ల పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందుతున్నది. ఇది వెనుకబడిన ప్రాంతంగా పరిగణించబడటం, అందుకు ప్రభుత్వం ఇచ్చే కన్సెషన్స్ మూలంగా ఇది అనేక పరిశ్రమలను ఆకర్షిస్తున్నది. సంగారెడ్డి తాలూకాలోని రామచంద్రపురంలో భారత బారీ విద్యుత్ పరికరాల ఫాక్టరీ (*BHEL*) కేంద్ర రంగానికి చెందినది ఉంది. జహీరాబాదు నిజాం చక్కెర ఫాక్టరీ ఉంది. ఇవిగాక ఈజిల్లాలో విజయ్ స్కూటర్ ఫాక్టరీ, ఇటుకల ఫాక్టరీ ఉన్నాయి. వార్షిక సర్వే ప్రకారం ఇక్కడ 124 పరిశ్రమలు, 18,775 మంది కార్మికులతో పనిచేస్తున్నాయి. ఉత్పాదక మూలధనం రూ. 5341.13 లక్షలు. ఉత్పత్తి విలువ రూ. 9918.67 లక్షలు. చిన్నతరహా పరిశ్రమల కింద 468 యూనిట్లున్నాయి. వీటి పెట్టుబడి 7.73 కోట్లు, జహీరాబాదులో కొమ్ముల పరిశ్రమ. రామాయంపేట వద్ద కంచు విగ్రహాలతయారీ, సంగారెడ్డి, సిద్దిపేటలో చేనేత పరిశ్రమలు ఈ జిల్లాలో చెప్పుకోదగిన చేతి వృత్తులు.

*మునిసిపాలిటీలు* : 5 - మెదక్, సదాశివపేట, సంగారెడ్డి, సిద్దిపేట, జహీరాబాదు.

*రెవిన్యూ డివిజన్లు* : 3 - మెదక్, సంగారెడ్డి, సిద్దిపేట.

*తాలూకాలు* : 8 - మెదక్, ఆంధోల్, నర్సాపూర్. సంగారెడ్డి, జహీరాబాదు, నారాయణఖేడ్, సిద్దిపేట, గజ్వేల్.

*నగరాలు* : 8 - ఆంధోల్; మెదక్, సంగారెడ్డి, సదాశివపేట, రామచంద్రాపురం బి.హెచ్.ఇ.ఎల్. టౌన్‌షిప్పు. సిద్దిపేట, జహీరాబాదు, శంకరంపేట.

*గ్రామాలు* : 1,266 ; *గ్రామపంచాయతీలు* : 617; *పంచాయతీ సమితులు* : 10.

*రవాణా* : పి.డబ్ల్యు.డి, నిర్వహణలో 967 కి.మీ., జిల్లాపరిషత్తు, పంచాయతీల నిర్వహణలో 2,491 కి.మీ. పొడవు రోడ్లున్నాయి. సంగారెడ్డి, జహీరాబాదు, గజ్వేల్, మెదక్ తాలూకాలలో రైల్వే మార్గాలున్నాయి.

*సహకార సంఘాలు* : జిల్లాలో మొత్తం 1,873 సహకార సంఘాలున్నాయి. వీటిలో సహకార సంఘాలు 1,604, చేనేత సహకార సంఘాలు 29.

*విద్య* : జిల్లాలో 1,258 ప్రాథమిక పాఠశాలలు, 127 అప్పర్ ప్రైమరీ పాఠశాలలు, 139 సెకండరీ పాఠశాలలు, 7 జూనియర్ కళాశాలలు, 3 డిగ్రీ కళాశాలలున్నాయి. ఇవిగాక ఒక ఉపాధ్యాయ శిక్షణసంస్థ, ఒక ఐ.టి.ఐ.కూడా ఉన్నాయి. అక్షరాస్యులశాతం16.1. వీరిలో పురుషులశాతం 25.2, స్త్రీలశాతం 6.68.

*వైద్యం :* అల్లోపతి వైద్యశాలలు 10, డిస్పెన్సరీలు 36, ఆయుర్వేద వైద్యశాలలు 45, యునాని వైద్యశాలలు 7, హోమియోపతి వైద్యశాలలు 4 ఉన్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* కొండాపురం, మెదక్, సంగారెడ్డి, ఏడుపాయలు.

*శాసనసభ నియోజక వర్గాలు :* 10 – సిద్దిపేట, దొమ్మట్, గజ్వేల్, నర్సాపూర్, సంగారెడ్డి, జహీరాబాదు, నారాయణఖేడ్, మెదక్, రామాయంపేట, ఆంథోల్.

*లోక్‌సభ నియోజకవర్గాలు :* 2 – సిద్దిపేట, మెదక్.

***ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న***

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 1 |
| బ్యాంక్ ఆఫీసులు | 44 |
| షెడ్యూల్డ్‌కులాలు, వెనకబడినవారికి ఇళ్ళస్థలాల పంపకం | 4,162 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్లు | 59 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్లు | 8 |
| మార్కెట్ కమిటీలు | 7 |
| పోస్టాఫీసులు | 504 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 44 |
| టెలిఫోన్ ఎక్స్ఛేంజీలు | 20 |
| పబ్లిక్ కాల్ ఆఫీసులు | 20 |
| నివాసగృహాలు | 2,47,849 |
| షెడ్యూల్డ్‌కులాలవారి జనాభా (1971 నాటికి) | 2.33 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా (1971) | |

## వరంగల్లుజిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 12,875 చ.కి.మీ. లు |
| జనాభా | : | 1971 నాటికి 18.71 లక్షలు |
| | | పురుషులు 9.57 లక్షలు, స్త్రీలు 9.14 లక్షలు |
| జన సాంద్రత | : | చ.కి.మీ. కు 210 మంది |
| ముఖ్య కేంద్రం | : | వరంగల్లు |

శిధిలావస్థలో ఉన్న కోటలు, పెద్దపెద్ద తటాకాలు, ఆంధ్రుల శిల్పకళనుచాటే గుళ్లు గోపురాలు, మంటపాలు విరివిగా కనిపించే వరంగలు జిల్లా ఒకనాడు ఓరుగల్లు సామ్రాజ్యంగా విశిష్టత నార్జించుకొన్న ప్రాంతం. అయితే ఈప్రాంతం చరిత్ర కాకతీయులనుంచే ప్రారంభం

కాలేదు. వారికాలం ఈ ప్రాంతానికి స్వర్ణయుగం వంటిది. కాకతీయులకంటె ముందు ఆంధ్ర శాతవాహనులు, తుళువ ఆంధ్ర యాదవరాజులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు మొదలైనవారు ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. కాకతీయుల తరవాత ముస్లింలు, బహుమనీసుల్తానులు, గోల్కొండ నవాబులు, మొగలాయీలు, నైజాం నవాబులు ఈ ప్రాంతాన్ని పాలించారు.

*భౌగోళిక స్వరూపం* : ఉత్తరానకరీంనగర్ జిల్లా, దక్షిణాన నల్గొండ, ఖమ్మం జిల్లాలు, పశ్చిమాన మెదక్, నల్గొండ కరీంనగర్ జిల్లాలు, తూర్పున ఖమ్మంజిల్లా సరిహద్దులు. ఈ జిల్లాలో 64 గ్రామాలలో చెలకనేల, 21 శాతం గ్రామాలలో నల్లరేగడినేల, 14 శాతం గ్రామాలలో దుబ్బనేల ఉన్నాయి.

*శీతోష్ణస్థితి, వర్షపాతం* : సముద్రానికి ఈ జిల్లా బాగాదూరంగా ఉండటంవల్ల వాతావరణం పొడిగా ఉంటుంది, సగటు వర్షపాతం సాలుకు 1,016 మి.మీ.లు దీనిలో 82 శాతం నైరుతి ఋతుపవనాలవల్ల కలుగుతుంది. ఉష్ణోగ్రతలో ఎక్కువ హెచ్చుతగ్గులు ఉంటాయి.

*నదులు* : ముఖ్యమైన నదులు గోదావరి, మున్నేరు, పాలేరు, కిన్నెరసాని.

*అడవులు* : ఈ జిల్లాలో అడవుల కింద ఉన్న భూభాగం 3,42,474 హెక్టార్లు అంటే జిల్లా విస్తీర్ణంలో 26.7 శాతం అడవులన్నమాట. టేకు, గంధంచెక్క, ఇప్ప, బండారు, నల్లమద్ది, చంద్ర, వెదురు మొదలైనవి ఈ అడవులలో లభిస్తాయి.

*ఖనిజసంపద* : ముఖ్యమైనవి బొగ్గు, ముడిఇనుము, కట్టడాలకు పనికివచ్చేరాయి, కాజీపేట సమీపంలో యెర్రబల్లివద్ద లోగ్రేడ్ ముడిఇనుము, పాకాల చెరువుకు దక్షిణాన ఉన్న నలంబాలోనూ, పరకాల తాలూకా నవాబుపేటలోను సుమారు 24 మిలియన్ టన్నుల లోగ్రేడ్, హైగ్రేడ్ ముడిఇనుము లభిస్తుంది. జీబ్రా చారలున్న రంగుల రాళ్లు ములుగు తాలూకాలో లభిస్తాయి.

*వ్యవసాయం, పంటలు* : ముఖ్యమైన పంటలు వరి, జొన్న, వేరుశెనగ, మొక్కజొన్న, పప్పుధాన్యాలు. ఇది వ్యవసాయం ప్రధానంగాగల జిల్లా. రాష్ట్రంలో మొక్కజొన్న అధికంగా పండించే జిల్లాలలో ఇది ఒకటి. మొత్తం పంటభూమి 6,65,000 హెక్టార్లు, ఆహారపు పంటలు 5,44,000 హెక్టార్లు, ఆహారేతర పంటలు 58,000, వ్యవసాయేతర ప్రయోజనాలకు 68,000 హెక్టార్లు, శాశ్వతమైన పచ్చికబీడు 50,000 హెక్టార్లు సాగుకు లాయకైనబీడు 10,000 హెక్టార్లు, వరి పండించే భూమి 1,63,000 హెక్టార్లు ఉంది. వరి వుత్పత్తి 3.1 లక్షల టన్నులు. హెక్టారుకుఉత్పాదకశక్తి 1903కి.గ్రా. కమతాలు 3,09,594.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి* : జిల్లాలో వర్షపాతం నికరంగా ఉంటుంది. కనుక వర్షాధారమైన చెరువులు ప్రధానమైన నీటి వనరులు. అవి రామప్ప,పాకాల, లక్నవరం,చలవాగు, నీటి పారుదల సౌకర్యం ఉన్నభూమి 1,47,000 హెక్టార్లు చెరువుల కింద 1,01,000, కాలువల కింద, 1,000, గొట్టపుబావులకింద 1,040,తక్కినబావులకింద 38,000, ఇతర వనరుల కింద 6,000 హెక్టార్లు సాగవుతున్నవి.

1979 మార్చి నాటికి జిల్లాలో విద్యుచ్ఛక్తి సౌకర్యమున్న గ్రామాల సంఖ్య 779.

*పరిశ్రమలు :* తెలంగాణా జిల్లాలో వరంగల్లు రెండవ పెద్ద వాణిజ్య కేంద్రం. సాధారణ పరిశ్రమలేగాక, పెద్ద టెక్స్‌టైల్ మిలు, బేరియమ్ స్టాల్ పరిశ్రమ ఉన్నాయి. ఆజంజాహి టెక్స్‌టైల్ మిల్లు 5000 మందికి ఉపాధి కల్పిస్తోంది. పరిశ్రమల వార్షిక నివేదికల ప్రకారం ఈ జిల్లాలో 139 పరిశ్రమలు 7,896 కార్మికులతో ఉన్నాయి. ఉత్పాదక మూలధనం రూ. 422.35 లక్షలు. ఉత్పత్తి విలువ రూ. 2202.09 లక్షలు. ఈ జిల్లాలో చిన్నతరహా పరిశ్రమల కింద 702 యూనిట్లున్నాయి. వీటి పెట్టుబడి రూ. 5,07 కోట్లు. ఉన్ని బట్టలు, జంఖానాలు, కంచుపాత్రలు, పట్టువస్త్రాలు మొదలైనవి ఈ జిల్లాలో చేతివృత్తుల తయారీలు.

***మునిసిపాలిటీలు*** : 2-వరంగల్, జనగామ.

*రెవిన్యూ డివిజన్లు* : 2-వరంగల్, మహబూబాబాదు.

***తాలూకాలు*** *:* 6-వరంగల్, జనగామ, పరకాల, ములుగు, మహబూబాబాదు, నర్సంపేట

*నగరాలు* : 4-వరంగల్, జనగామ, మహబూబాబాద్, డోర్నకల్.

*గ్రామాలు :* 1,085 *గ్రామపంచాయతీలు :* 630; *పంచాయతీ సమితులు :* 14

*రవాణా :* ఈ జిల్లాలో పి.డబ్ల్యు.డి. ఆధ్వర్యంకింద 1,142 కి.మీలు, జిల్లా పరిషత్తు పంచాయతీల ఆధ్వర్యంలో 3,113 కి.మీ.ల రోడ్లున్నాయి. పరకాల, ములుగు తాలూకాలలో తప్ప మిగిలిన తాలూకాలలో రైల్వేమార్గాలున్నాయి. ఉత్తర, దక్షిణ, భారత దేశాలను కలిపే రైలుమార్గాలు ఈ జిల్లాలో ఉన్నాయి. కాజీపేట ప్రధాన రైల్వేకూడలి.

*సహకార సంఘాలు :* జిల్లాలోని మొత్తం సహకార సంఘాలు 1489. వీటిలో 1257 సహకార సంఘాలు, 47 చేనేత సహకార సంఘాలు, 111 పారిశ్రామిక సహకార సంఘాలు, 32 మత్స్యకారుల సహకార సంఘాలు, 42 పాలసరఫరా సహకార సంఘాలున్నాయి. వీటిలోని సభ్యుల సంఖ్య 2.33 లక్షలు.

*విద్య :* ఈ జిల్లాలో 1,198 ప్రాథమిక పాఠశాలలు, 207 అప్పర్ ప్రైమరీ పాఠశాలలు, 168 సెకండరీ పాఠశాలలు. 12 జూనియర్ కళాశాలలు, 9 డిగ్రీ కళాశాలలు ఉన్నాయి. కాకతీయ విశ్వవిద్యాలయం వరంగల్‌లో ఉంది. ఇంకా ఒక ఇంజనీరింగ్ కళాశాల, ఒక మెడికల్ కళాశాల, ఒక పాలిటెక్నిక్ కళాశాల, ఒక విద్యా కళాశాల, ఒక ఉపాధ్యాయ శిక్షణసంస్థ కూడా ఉన్నాయి. జిల్లా అక్షరాస్యత శాతం 18.11 దీనిలో పురుషుల **శాతం** 26.37 స్త్రీల శాతం 9.47.

*వైద్యం :* అల్లోపతి వైద్యశాలలు 8, డిస్పెన్సరీలు 25, ఆయుర్వేద వైద్యశాలలు 45 యునాని వైద్యశాలలు 6, హోమియోపతి వైద్యశాలలు 1 ఉన్నాయి.

*దర్శించతగ్గ ప్రదేశాలు :* వరంగల్లు, జీడికల్లు, కొలనుపాక, ఐనవోలు, పాలంపేట హన్మకొండ, పాకాల, హసన్‌పర్తి, కాజీపేట.

*శాసనసభ నియోజకవర్గాలు :* 13-మహబూబాబాదు, నర్సంపేట, వనపర్తి, ఘనాపూర్ వరంగల్, హన్మకొండ, శ్యాంపేట, చెరియాల్, జనగామ, చెన్నూరు, డోర్నకల్, పరకాల ములుగు

*లోక్‌సభ నియోజక వర్గాలు :* 2 హన్మకొండ, వరంగల్

*ఈ జిల్లాలో 1977-78 నాటికి ఉన్న*

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | 26 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 42 |
| బ్యాంకు ఆఫీసులు | 73 |
| షెడ్యూల్డ్‌కులాలకు వెనకబడిన వర్గాలవారికి ఇళ్ళస్థలాల పంపకం | 2,445 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 59 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 17 |
| మార్కెటింగ్ కమిటీలు | 9 |
| పోస్టాఫీసులు | 641 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 76 |
| టెలిఫోన్ ఎక్ఛేంజీలు | 22 |
| పబ్లిక్‌కాల్ ఆఫీసులు | 48 |
| నివాసగృహాలు | 3,42,639 |
| షెడ్యూల్డ్‌కులాలవారి జనాభా (1971) | 2.97 లక్షలు |
| షెడ్యూల్డ్‌తెగలవారి జనాభా (1971) | 0.43 లక్షలు |

## హైదరాబాదు జిల్లా

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | : | 7,707 చ.కి.మీటర్లు |
| జనాభా | : | 1971 నాటికి 27.91 లక్షలు |
| | | పురుషులు 14.42 లక్షలు |
| | | స్త్రీలు 13.49 లక్షలు |
| జనసాంద్రత | : | చ.కి. మీటర్లకు 362 మంది |
| ముఖ్యకేంద్రం | : | హైదరాబాదు |

శాతవాహనులు, బాదామి చాళుక్యులు, రాష్ట్రకూటులు, కళ్యాణిచాళుక్యులు, కాకతీయులు, ముస్లింలు, బహమనీ సుల్తానులు, గోల్కొండ నవాబులు, నైజాంనవాబులు, ఈ ప్రాంతాన్ని పాలించారు. సుల్తాన్ మహమ్మద్ కులీ కుతుబ్ షా 1589 లో భాగ్యనగరాన్ని నిర్మించాడు. ఇదే తరవాత కాలంలో హైదరాబాదుగా చెలామణిలోకి వచ్చింది. హైదరాబాదు నగరంలో సనాతన, ఆధునికతల సమ్మేళనం గోచరిస్తుంది. చార్మినార్ వంటి చారిత్రకకట్టడాలు యిప్పుడిప్పుడే ఆకాశానికి నిచ్చెనల వలె మింటికెగబాకుతున్న భవనాలు కలగాపులగంగా ఈ నగరంలో కనిపిస్తాయి.

***భౌగోళిక స్వరూపం :*** ఉత్తరాన మెదక్ జిల్లా, తూర్పున నల్గొండ జిల్లా, దక్షిణాన మహబూబ్‌నగర్ జిల్లా, పశ్చిమాన కర్నాటక రాష్ట్రం ఈ జిల్లా సరిహద్దులు. ఈ జిల్లా ప్రధానంగా కొండమయంగా ఉంటుంది. హైదరాబాదు నగరంచుట్టూ కొండలు, గుట్టలు ఉన్నాయి. వాటిలో పేర్కొనదగినవి తిరుమలగిరి, గోల్కొండ, మౌలాలి. ఈజిల్లాలో 40 శాతం గ్రామాలలో నల్లనేల, 51 శాతంలో చెలకనేల, 9 శాతంలో దుబ్బనేల ఉన్నాయి.

***శీతోష్ణస్థితి, వర్షపాతం :*** సమశీతోష్ణస్థితి అక్టోబరు నుంచి మార్చి వరకు వాతావరణం చాలా ఆరోగ్యకరంగా, అహ్లాదకరంగా ఉంటుంది. సగటు వర్షపాతం సాలుకు 779మి.మీ.లు. సంవత్సరంలో గరిష్ఠ ఉష్ణోగ్రత 41°. కనిష్ఠ ఉష్ణోగ్రత 9° సెంటిగ్రేడు.

***నదులు :*** ఈ జిల్లాలో ముఖ్యమైనది మూసీనది. ఇది అనంతగిరి కొండలవద్ద పుట్టి, తూర్పుకు హైదరాబాదు పట్టణం గుండా ప్రయాణిస్తుంది.

***అడవులు :*** అడవుల విస్తీర్ణం 69,832 హెక్టార్లు. అంటే ఈజిల్లా విస్తీర్ణంలో 9శాతం అడవులన్నమాట. సాధారణంగా కలప మాత్రమే ఈ అడవులనుంచి లభ్యమవుతున్నది.

***ఖనిజ సంపద :*** ఈ జిల్లాలో లాభసాటిగా లభించే ఖనిజాలు బంకమన్ను, ఎరుపు, తెలుపు స్ఫటికాలు, జేగురుమన్ను ముఖ్యమైనవి. గృహనిర్మాణంలో ఉపయోగపడే నల్ల సీసం జిల్లాలోని అనేక ప్రాంతాలలో తవ్వి తీస్తున్నారు. తాండూరులో షాబాద్ రాతి పలకలు లభిస్తాయి. తాండూరు సమీపంలో 172 మిలియన్ టన్నుల సున్నపురాతి నిక్షేపాలు ఉన్నట్లు భారత సిమెంటు కార్పొరేషన్ అంచనా.

***వ్యవసాయము, పంటలు :*** ముఖ్యమైన పంటలు జొన్న, అపరాలు, వరి. వీటిలోజొన్నను విస్తారంగా అంటే పంటభూమిలో 3 వ వంతు భూమిలో పండిస్తారు. ఆహారేతర పంటలు ఆముదాలు, వేరుశనగ, నువ్వులు. ఆహారపు పంటలు 2.97 లక్షల హెక్టార్లలో ఆహారేతర పంటలు 51,281 హెక్టార్లలో పండిస్తారు. మొత్తం ఆహార ధాన్యాల ఉత్పత్తి 2.16 లక్షల టన్నులు. దీనిలో వరి 1.02 లక్షల టన్నులు, జొన్న 69,306 టన్నులు, అపరాలు 12,033 టన్నులు, నూనెగింజలు 43,329 టన్నులు. హెక్టారుకు వరిదిగుబడి 656 కి.గ్రా. ఆముదాలు 145 కి.గ్రా. కమతాలు 118. వాటిలో ఒక హెక్టారుకు లోపు కమతాలు 26.3 శాతం. రాష్ట్రంలోకెల్లా ఎక్కువ ద్రాక్ష తోటలు ఈ జిల్లాలోనే ఉన్నాయి.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* ఈ జిల్లాలో నాలుగు తాలూకాలు అనావృష్టికి గురి అవుతాయి. ఈ జిల్లాలోని ప్రాజెక్టులలో పేర్కొనదగినవి జట్‌పల్లి, లఖన్‌పూర్, చిన్నముని, కోటిపల్లివాగు ప్రాజెక్టులు. నీటి పారుదల సౌకర్యం గల మొత్తం భూమి 51,387 హెక్టార్లు. దీనిలో బావుల కింద 27,931, చెరువులకింద 17,365, కాలువల కింద 2,063, గొట్టపు బావులకింద 4, ఇతర వనరుల కింద 4,024 హెక్టార్లు సాగవుతుంది. 1980 మార్చి నాటికి విద్యుచ్ఛక్తి సౌకర్యాలున్న గ్రామాల సంఖ్య 708.

*పరిశ్రమలు :* పారిశ్రామికీకరణలో రాష్ట్రమంతటిలోను హైదరాబాదుపట్టణానికి ప్రథమ స్థానం. ఈజిల్లాలో 100 భారీ, మధ్యతరహా పరిశ్రమలున్నాయి. అనేక ఇండస్ట్రియల్ ఎస్టేటులున్నాయి. వాటిలో ఒకటి ఎలక్ట్రానిక్స్‌కి, ఒకటి స్వయం ఉపాధికల్పన చేసుకొనేవారికి ఏర్పాటు చేయబడినాయి. 1975-76 సంవత్సరం నాటికి ఫ్యాక్టరీల ఆక్టు నిర్వచనం కిందికి వచ్చే పరిశ్రమలు 973. వీటి ఉత్పత్తి మూలధనం రూ. 52,968 లక్షలు. కార్మికులు 93,224 మంది; ఉత్పత్తి విలువ రూ.60,978 లక్షలు. చిన్నతరహా పరిశ్రమలకింద 3,750 యూనిట్లున్నాయి. వీటి మొత్తం పెట్టుబడి రూ 37.15 కోట్లు. లక్క బొమ్మలపైన, గాజులపైన, అద్దాలు, పూసలు అద్దకం, గాజుల తయారీ మొదలైనవి ఈ జిల్లాలో సాగుతున్న ప్రధానమైన చేతివృత్తులు.

***మునిసిపాలిటీలు :*** ఒక కార్పొరేషను (హైదరాబాదు) ఒకమునిసిపాలిటీ(తాండూరు).

***రెవిన్యూ డివిజన్లు :*** 3 - హైదరాబాదు తూర్పు, హైదరాబాదు పడమర, వికారాబాదు.

***తాలూకాలు :*** 9 - చేవెళ్ళ, హైదరాబాదు(తూర్పు), హైదరాబాదు(పడమర), హైదరాబాదు (అర్బన్), ఇబ్రహీంపట్నం, మేడ్‌చల్, పర్గి, తాండూరు, వికారాబాదు.

***నగరాలు :*** 17

***గ్రామాలు :*** 1035; గ్రామపంచాయతీలు 762. ***పంచాయతీ సమితులు :*** 7

***రవాణా :*** పి.డబ్ల్యు.డి ఆధ్వర్యంలో 1197 కి.మీ. జిల్లాపరిషత్ పంచాయతీల ఆధ్వర్యంలో 2198 కి.మీ. పొడవు రోడ్లు ఉన్నాయి. దక్షిణమధ్య రైల్వే కేంద్ర కార్యాలయం సికిందరాబాదులో ఉంది. జంటనగరాలనుంచి బొంబాయి, కలకత్తా, మద్రాసు, ఢిల్లీ, బెంగుళూరు వంటి ప్రధాన నగరాలకు రైలుమార్గాలున్నాయి. అట్లాగే రాష్ట్రంలోని, ఇతర రాష్ట్రాలలోని అనేక నగరాలకు బస్సుసర్వీసులున్నాయి. బేగంపేటలో విమానాశ్రయం కూడాఉంది.

***సహకార సంఘాలు :*** మొత్తం సహకార సంఘాలు 2,265. వీటిలో 1813 సహకార సంఘాలు, 15 చేనేత సహకార సంఘాలు, 292 పారిశ్రామిక సహకార సంఘాలు, 28 మత్స్యకారుల సహకార సంఘాలు, 117 పాలసరఫరా సహకార సంఘాలు ఉన్నాయి. వీటిలోని సభ్యుల సంఖ్య 3.16 లక్షలు.

*విద్య :* అక్షరాస్యులు 40.37 శాతం హైదరాబాదు నగరంతో బాటు మొత్తంమీద జిల్లాలో 1259 ప్రాథమిక పాఠశాలలు. 352 అప్పర్ ప్రైమరీ పాఠశాలలు, 324 సెకండరీ పాఠశాలలు, 43 జూనియర్ కళాశాలలు, 36 డిగ్రీ కళాశాలలు ఉన్నాయి. హైదరాబాదు నగరంలో నాలుగు విశ్వవిద్యాలయాలున్నాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయం, జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం, కేంద్ర ప్రభుత్వం నిర్వహణలో ఉన్న హైదరాబాదు విశ్వవిద్యాలయం, ఇవికాక రెండు మెడికల్ కాలేజీలు, మూడు ఇంజనీరింగ్ కాలేజీలు, మూడు పాలిటెక్నిక్ కాలేజీలు 5 విద్యాకళాశాలలు, ఒక వ్యాయామ విద్యాకళాశాల, ఒక ఉపాధ్యాయ శిక్షణాసంస్థ, ఒక హోమియోపతి కళాశాల మొదలైన విద్యాసంస్థలెన్నో ఉన్నాయి. కేంద్రప్రభుత్వం అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజికూడా ఉంది.

*వైద్యం :* 84 అల్లోపతి ఆస్పత్రులు, డిస్పెన్సరీలు, 33 అయుర్వేద వైద్యశాలలు, 24 యునానీ వైద్యశాలలు, 4 హోమియోపతి వైద్యశాలలు ఉన్నాయి.

***శాసనసభ నియోజకవర్గాలు :*** 19 యాకుత్‌పురా, చాంద్రాయణగుట్ట, చార్మినార్, మేడ్చల్, ముషీరాబాదు, హిమాయత్‌నగర్, సనత్‌నగర్, సికింద్రాబాదు, ఖైరతాబాదు, తాండూరు, వికారాబాదు, పర్గి, చేవెళ్ల, ఇబ్రహీంపట్నం,సికింద్రాబాదు, కంటోన్మెంట్, మలక్ పేట, అసిఫ్‌నగరు మహారాజ్‌గంజ్, కారవాన్

***పార్లమెంటు నియోజకవర్గాలు :*** 2 హైదరాబాదు, సికింద్రాబాద్

***ఈ జిల్లాలో 1977—78 నాటికి ఉన్న***

| | |
|---|---|
| రిజిస్ట్రేషన్ ఆఫీసులు | 20 |
| ప్రింటింగ్ ప్రెస్‌లు | 235 |
| బ్యాంకు ఆఫీసులు | 335 |
| షెడ్యూల్డ్‌కులాల వెనకబడినవర్గాలవారికి ఇళ్ళస్థలాలపంపకం | 3,065 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | 49 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | 11 |
| మార్కెట్ కమిటీలు | 9 |
| పోస్టాఫీసులు | 555 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | 81 |
| టెలిఫోన్ ఎక్స్చేంజ్‌లు | 32 |
| పబ్లిక్‌కాల్ ఆఫీసులు | 363 |
| నివాస గృహాలు | 4,20,276 |
| షెడ్యూల్డ్ కులాల వారి జనాభా (1971) | 3.93 లక్షలు |
| షెడ్యూల్డ్ తెగలవారి జనాభా (1971) | 0.05 లక్షలు |

# 37

# పాతికేళ్ళ ఆంధ్రప్రదేశ్ ప్రగతికి ప్రత్యక్ష సాక్ష్యాలు

| | ఆనాడు [1965] | ఈనాడు [1980] |
|---|---|---|
| జనాభా (కోట్లు) | 3.24 | 5 11(అంచనా) |
| రాష్ట్ర ప్రభుత్వ ఆదాయం (1960-61 ధరలలో) (రూ.కోట్లు) | 873 | 1,840 |
| తలసరిఆదాయం (1960-61 ధరలలో) (రూ.) | 260 | 349 |
| నీటిపారుదలకింద ఉన్న భూమి (లక్షల హెక్టార్లు) | 33.9 | 47 |
| విద్యుచ్ఛక్తి ఉత్పాదకశక్తి (మెగావాట్లు) | 100 | 1,838 |
| విద్యుచ్ఛక్తి అమ్మకం (MK WH) | 354 | 4,624 |
| విద్యుచ్ఛక్తికి అయ్యేవ్యయం (కోట్ల రూ. లలో) | 9.12 | 139.84 |
| విద్యుత్ వినియోగదార్లసంఖ్య (లక్షలు) | 1.5 | 21 |
| విద్యుదీకరణ అయిన గ్రామాలు | 700 | 16,063 |
| విద్యుచ్ఛక్తి ఉత్పత్తి (మి.కిలోవాట్ గంటలు) | 277 | 6,337 |
| రోడ్లు (కి.మీ) | 35,266 | 91.991 |
| భారీ, మధ్యతరహా పారిశ్రామిక పెట్టుబడి (రూ.కోట్లు) | 63 | 1,525 |
| భారీ, మధ్యతరహా పరిశ్రమల సంఖ్య | 45 | 329 |
| లఘుపరిశ్రమల పెట్టుబడి (రూ. కోట్లు) | 5 | 228 |
| లఘుపరిశ్రమల సంఖ్య | 1,229 | 24,523 |
| పారిశ్రామిక సంస్థలు | 1,274 | 23,803 |
| కేంద్రప్రభుత్వరంగ సంస్థలు | 13 | 15 |

| | | |
|---|---|---|
| పారిశ్రామిక కార్మికులు | 1,13,000 | 4,96,993 |
| సిమెంటు ఉత్పత్తి (లక్షల టన్నులు) | 4.39 | 26.75 |
| కాగితంఉత్పత్తి (వేలటన్నులు) | 63 | 272 |
| ప్రభుత్వడాక్టర్లు | 1,094 | 4,192 |
| ప్రభుత్వ ఆస్పత్రులు | 401 | 1,376 |
| ప్రభుత్వ ఆస్పత్రులలో పడకలు | 13,905 | 23,392 |
| టెలిఫోన్లు | 9,380 | 1,39,139 |
| పబ్లిక్ టెలిఫోన్లు | 75 | 3,405 |
| పోలీసులు | 40,776 | 48,208 |
| పోస్టాఫీసులు | 6.969 | 15,063 |
| ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లు | 13 | 34 |
| ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌ల ద్వారా ఉద్యోగాలు సంపాయించినవారు | 14,160 | 33,485 |
| రైల్వేలైన్లు (కి. మీ.) | 4,541 | 4,741 |
| రైల్వేస్టేషన్లు | 517 | 661 |
| బియ్యం ఉత్పత్తి (మె. టన్నులు) | 34,06,954 | 74,52,000 |
| ప్రైమరీ పాఠశాలలు | 25,409 | 36,696 |
| అప్పర్ ప్రైమరీపాఠశాలలు | 764 | 4,382 |
| సెకండరీ పాఠశాలలు | 999 | 3,567 |
| ప్రైమరీపాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య (లక్షల్లో) | 31.68 | 49.25 |
| అప్పర్ ప్రైమరీ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య (లక్షల్లో) | 2.01 | 7.71 |
| సెకండరీ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య [లక్షల్లో] | 4.52 | 6.59 |
| ఉపాధ్యాయుల సంఖ్య : | | |
| ప్రైమరీ పాఠశాలలు | 66,021 | 79,565 |
| అప్పర్ ప్రైమరీపాఠశాలలు | 7,277 | 33,801 |
| సెకండరీపాఠశాలలు | 20,015 | 55,997 |
| విశ్వవిద్యాలయాలు | 3 | 8 |
| కళాశాలలు | 67 | 235 |

| | | |
|---|---|---|
| రాష్ట్రంలో గ్రంథాలయాలు | 1,434 | 3,741 |
| అక్షరాస్యతశాతం | 21.1 [1961] | 24.6 [1971] |
| విద్యకోసంపెట్టిన ఖర్చు [రూ. కోట్లలో] | 7.09 | 164.24 |
| ఆహారధాన్యాల ఉత్పత్తి [లక్షల టన్నులు] | 56.2 | 108 |
| నూనెగింజల ఉత్పత్తి [లక్షలటన్నులు] | 12.0 | 12.5 |
| పత్తిఉత్పత్తి [170 కిలోల లింట్‌గల 1000 బేళ్ళు] | 134 | 351 |
| పంచదార ఉత్పత్తి [లక్షలటన్నులు] | 5.3 | 9.5 |
| బొగ్గు ఉత్పత్తి | 16.4 | 91.5 |
| రిజిష్టరైన మోటారువాహనాలు [వేలల్లో] | 25 | 241 |
| ఆర్. టి. సి. బస్సులు | 486 | 6,994 |
| వ్యవసాయపరపతి సంఘాల సభ్యత్వం | 8,70,156 | 46,26,000 |
| సహకార పరిధిలోకివచ్చిన గ్రామాలు | 61% | 100% |
| సహకార పరిధిలోకి వచ్చిన కుటుంబాలు | 17% | 50% |
| వ్యవసాయాభివృద్ధి బ్యాంకులు | 83 | 205 |
| మార్కెటింగ్ సహకార సంఘాలు | 148 | 317 |
| చేనేత సహకార సంఘాలు | 600 | 1,833 |
| పోలీసులు | 40,775 | 48,208 |
| షెడ్యూల్డ్‌కులాల జనాభా [లక్షలలో] | 44.4 | 57.75[1971] |
| షెడ్యూల్డ్ జాతుల జనాభా [లక్షలలో] | 8.0 | 16.58[1971] |
| గ్రామీణజనాభా[లక్షలలో] | 270 | 351(1971) |
| పట్టణజనాభా [లక్షలలో] | 56.90 | 84.03(1971) |
| జిల్లాలు | 20 | 23 |
| తాలూకాలు | 183 | 215(1-10-79) |
| గ్రామాలు | 26,743 | 27,221(1971) |
| పంచాయతీలు | 15,789 | 16,003 |
| బాంకులు | 264 | 2,304 |
| కంపెనీలు | 324 | 1,529 |

# 1980 లో ఆంధ్రప్రదేశ్ లో జరిగిన ముఖ్య సంఘటనలు

1-1-1980 ప్రపంచంలో అతిపెద్దదైన రామగుండం ఎరువుల ఫ్యాక్టరీలో అమోనియా ఉత్పత్తి ప్రారంభమైంది.

6-1-1980 ఏడవలోక్‌సభ ఎన్నికకు ఆంధ్రప్రదేశ్‌లో పోలింగ్

7-1-1980 కాంగ్రెస్(ఐ) అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధీ మెదక్ నియోజకవర్గం నుండి పార్లమెంట్‌కు ఎన్నికయ్యారు.

30-1-1980 గుంటూరులో అఖిలభారత గ్రామీణ క్రీడలపోటీలు జనవరి 30 వ తేదీ నుండి ఫిబ్రవరి 3 వ తేదీ వరకు 5 రోజులు జరిగాయి.

4-2-1980 1980—81 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రణాళిక రూ. 521 కోట్లు 1979—80 సం॥ రాష్ట్ర ప్రణాళికా పెట్టుబడులు మొత్తం రూ. 450 కోట్లు.

16-2-1980 సంపూర్ణ సూర్యగ్రహణం. మహబూబ్‌నగర్ జిల్లా పాలెంగ్రామంలో పరిశోధనా కేంద్రంగా ప్రపంచ శాస్త్రవేత్తల పరిశోధన.

20-2-1980 రైతులకు పాస్‌బుక్‌ల సరఫరాకు నిర్ణయం.

24-2-1980 ప్రముఖ తెలుగుకవి, సినీగేయరచయిత శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రి మద్రాసులో తమ 82 వ ఏట మరణించారు.

15-4-1980 ఆరు వాణిజ్య బ్యాంకుల జాతీయం. అందులో ఆంధ్రా బ్యాంకు ఒకటి.

6-5-1980 రాష్ట్రంలో మూడు పేపరుమిల్లుల స్థాపనకు నిర్ణయించారు. వాటిని కడప, ఖమ్మం, నెల్లూరు జిల్లాలలో సంయుక్త రంగంలో ఏర్పాటు చేస్తారు.

12-6-1980 హైదరాబాదులో సెక్యూరిటీ ప్రింటింగ్ ప్రెస్ స్థాపనకు నిర్ణయించారు.

24-6-1980 భారతమాజీ రాష్ట్రపతి వరాహగిరి వెంకటగిరి దక్షిణ మద్రాసులో మరణించారు

26-6-1980 బంగాళాఖాతంలోని కృష్ణా-గోదావరి బేసిన్‌లో నూనె నిక్షేపాలు కనుగొన్నట్లు ప్రకటన.

27-6-1980 జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక యూనివర్సిటీకి యు. జి. సి. గుర్తింపు లభించింది,

18-7-1980 ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీహరికోటనుండి ఉదయం 8 గం॥ 04 ని॥లకు "రోహిణి" ఉపగ్రహం విజయవంతంగా ప్రయోగం జరిగింది.

15-8-1980 హైదరాబాదు వనస్థలిపురంలో సంజయ్ స్మారక ఆటోమొబైల్ అకాడమికి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ మర్రిచెన్నారెడ్డిగారు ప్రారంభోత్సవంచేశారు.

15-8-1980 విజయవాడ గుంటూరు జాతీయరహదారిపై గల మంగళగిరి వద్ద వంతెనకు ప్రారంభోత్సవం జరిగింది.

17-8-80 ప్రసిద్ధ తెలుగు రచయిత శ్రీ కొడవటిగంటి కుటుంబరావు మరణించారు.

19-8-80 నల్లగొండలో పి.జి. సెంటర్, పాలిటెక్నిక్‌లను మంజూరు చేశారు.

17-9-80 శ్రీకాకుళం జిల్లా వంశధార వరదలు అపారనష్టం కలుగజేశాయి.

10-10-80 ముఖ్యమంత్రిపదవికి డా॥ మర్రి చెన్నారెడ్డి రాజీనామా చేశారు.

10-10-80 విజయవాడలో ప్రైవేట్ మెడికల్ కాలేజి నెలకొల్పడానికి "అకాడమి ఆఫ్ జనరల్ అండ్ టెక్నికల్ ఎడ్యుకేషన్"సంస్థకు అనుమతి మంజూరు చేశారు.

11-10-80 ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా శ్రీ టి. అంజయ్యగారి పదవీ స్వీకారం.

16-10-80 ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం ప్రమాణస్వీకారం, 22 మంది క్యాబినెట్ మంత్రులు

28-10-80 ఆంధ్రప్రదేశ్ పబ్లిక్‌సర్వీసు కమీషన్‌లో భాగంగా కాలేజీ సర్వీసు కమీషన్ ను నెలకొల్పడానికి ప్రభుత్వం నిర్ణయం.

1-11-80 ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ రజతోత్సవ కార్యక్రమాల ప్రారంభం-నవంబరు 1 నుంచి 25 వరకు ఈ కార్యక్రమాలు జరిగాయి.

7-11-80 ఐదెకరాల మాగాణి, పదెకరాల మెట్ట కమతాలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భూమిశిస్తు రద్దుచేసింది

23-11-80 ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా శ్రీ ఇల్లాని కుప్పుస్వామి ప్రమాణ స్వీకారం.

2-12-80 ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గవిస్తరణ-16 మంది క్యాబినెట్ మంత్రులు, 22 మంది స్టేట్ మంత్రుల ప్రమాణ స్వీకారం.

3-12-80 ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గంలోని 61 మంత్రులకు శాఖలపంపిణీ - వివరాలు.

ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య:- సాధారణ పరిపాలన, సర్వీసులు, శాంతిభద్రతలు షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగల సెల్, రైతుల సంక్షేమం, 25 సూత్రాల ఆర్థిక కార్యక్రమం, సమాచార ప్రసారాలశాఖ, మైనారిటీ కమిషన్, ఎన్నికలు, జాతీయ సమగ్రతపై రాష్ట్ర కమిటీశాఖలు కలిగిఉంటారు.

శ్రీ జి. రాజారామ్ - ఆర్థికశాఖ, ప్రణాళిక చిన్నమొత్తాల పొదుపు, ఆర్థిక గణాంక బ్యూరో, క్రీడలు, క్రీడామండలి.

శ్రీ ఎన్. అమరనాథరెడ్డి:-సహకారం,రాష్ట్ర సహకారబ్యాంకు, రాష్ట్ర వ్యవసాయ అభివృద్ధి బ్యాంకు, వినియోగ మార్కెటింగ్ సహకారసంస్థలు బలహీనవర్గాల సహకారసంస్థలు యువజన సర్వీసులు

శ్రీ ఎం. బాగారెడ్డి, సహాయమంత్రి శ్రీ పాలడుగు వెంకట్రావు:- పంచాయతీరాజ్ జాతీయగ్రామీణ ఉపాధికార్యక్రమం (పనికి ఆహారం పథకం) స్థానిక అభివృద్ధి పనులు, గ్రామీణ నీటిసరఫరా, గ్రామాల ప్రణాళికలు, రోడ్లు.

శ్రీ సి. జగన్నాథరావు, సహాయమంత్రి శ్రీ కె. ఇ. కృష్ణమూర్తి:-ఎక్సైజ్, ప్రభుత్వ డిస్టిలరీలు, మొలాసిస్ కంట్రోలు.

శ్రీ పి. వి. చౌదరి:-దేవాదాయశాఖ, ప్రాచీన శిల్పకళ, మ్యూజియంలు.

శ్రీ సి. దాస్, సహాయమంత్రి శ్రీ ఎన్. నరసప్ప:-జౌళి, చేనేత పట్టుపరిశ్రమ అభివృద్ధి, అద్దకం స్టేషనరీ.

శ్రీ కె. ప్రభాకరరెడ్డి, సహాయమంత్రి శ్రీ పి. జనార్దనరెడ్డి:- హోం పోలీసులు, జైళ్లు, పాస్‌పోర్టులు, ఆయుధాలచట్టం, సినిమాటోగ్రఫీ, చలనచిత్ర అభివృద్ధి.

శ్రీ ఎం. ఏ. అజీజ్, సహాయమంత్రి శ్రీ జి. ప్రకాశరావు:-అడవులు, జూలాజికల్ పార్కు, కాఫీతోటల అభివృద్ధి అటవీ అభివృద్ధి సంస్థ.

శ్రీ ఎ. మదన్‌మోహన్, సహాయమంత్రి శ్రీ వై. ఎస్. రాజశేఖరరెడ్డి:- వైద్య, ఆరోగ్యశాఖ, వైద్య విద్య, ఆహారం, ఔషధాల కల్తీనివారణ.

శ్రీ భాట్టం వెంకటరామిరెడ్డి, సహాయమంత్రి శ్రీ ఎం. శ్రీనివాసరావు:- ప్రాథమిక సెకండరీ కళాశాల విద్య, సాహిత్య వైజ్ఞానిక వ్యవహారాలు ఎస్. సి. ఆర్. టి రెసిడెన్షియల్ పాఠశాలలు, అధికారభాష అభివృద్ధి.

శ్రీ సి. రామభూపాల్‌రెడ్డి, సహాయమంత్రి శ్రీ వి వెంకటేశ్వరరావు:- భూమిశిస్తు, రిజిస్ట్రేషన్ స్టాంపులు, అబ్కారీ, జాగీర్ అడ్మినిస్ట్రేషన్ రుణాల సర్దుబాటుబోర్డు, సర్వే, సెటిల్మెంట్.

శ్రీ ఎస్. జనార్దనరెడ్డి:- భారీ పరిశ్రమలు, సిమెంటు, కాగితం అభివృద్ధి.

శ్రీ జి. సుధాకరరావు, సహాయమంత్రి శ్రీ కె. సత్యనారాయణరాజు: భారీ నీటిపారుదల.

శ్రీ జి. శ్రీరాములునాయుడు: చిన్న నీటిపారుదల.

శ్రీ కె. ఓబుల్‌రెడ్డి, సహాయమంత్రి శ్రీ మజ్జి తులసీదాస్:-మధ్యతరహా నీటిపారుదల వరదనివారణ, మురుగుకాల్వలు, నిర్మాణాల సంస్థ

శ్రీ భాట్టం శ్రీరామమూర్తి, సహాయమంత్రి శ్రీ రవీంద్రనాయక్:-గిరిజన సంక్షేమం (రాష్ట్ర గిరిజన ఆర్థిక సహాయసంస్థ, గిరిజన కార్పొరేషన్‌తోసహా) ప్రభుత్వ గ్రంథాలయాలు సాంస్కృతిక వ్యవహారాలు, రవీంద్రభారతి.

శ్రీ కోనేరు రంగారావు, సహాయమంత్రి శ్రీమతి బి. రుక్మిణీదేవి -సాంఘిక సంక్షేమం హరిజన సంక్షేమం (షెడ్యూల్డ్ కులాల ఆర్థిక సహాయసంస్థతోసహా) తోళ్లఅభివృద్ధి, లిడ్‌క్యాప్, బలహీనవర్గాల వారికి ఇళ్లస్థలాల కల్పన.

శ్రీ ఎం. మాణిక్‌రావు :- వాణిజ్య పన్నులు, ఖాదీ గ్రామీణ పరిశ్రమలు, ఎన్. భాస్కరరావు. సహాయమంత్రిశ్రీసి హెచ్ పరుశురామనాయుడు:-మత్స్యపరిశ్రమ, మత్స్య పరిశ్రమాభివృద్ధి సంస్థ, సముద్ర మత్స్యసంపద, చిన్నతరహా పరిశ్రమలు, సెట్విన్ స్వయం ఉపాధి పథకాలు, ప్రత్యేక ఉపాధి కార్యక్రమం.

శ్రీ టి. హయగ్రీవాచారి:-సాంకేతిక విద్య, ఐ టి ఐ యి అప్రెంటిస్ పథకం భారతీయ ఔషధాలు, స్వాతంత్రోద్యమ చరిత్ర, స్వాతంత్రయోధుల సంక్షేమం.

శ్రీ బి. రామ్‌దేవ్, సహాయమంత్రి శ్రీ ఎన్. చంద్రబాబునాయుడు, పశుసంవర్థకశాఖ కోళ్లు, గొర్రెలు, పందుల పెంపకం అభివృద్ధి. పాడిపరిశ్రమ (పాడిపరిశ్రమాభివృద్ధి సంస్థతో సహా) మాంసం, కోళ్ల అభివృద్ధిసంస్థ, పాలసరఫరా పథకం.

శ్రీ డిపి కొండయ్యచౌదరి, సహాయమంత్రి శ్రీ బాలగౌడ్:-ముఖ్యరహదారులు, రోడ్లు, భవనాలు, ప్రభుత్వ పనులు, డిపార్ట్‌మెంట్ వర్క్‌షాపు, రైల్వేలు, పి అండ్ టి లకు సంబంధించిన వ్యవహారాలు

శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి, సహాయమంత్రి శ్రీ ఆళ్వార్‌దాస్, మున్సిపల్ పరిపాలన హైదరాబాదు మున్సిపల్ కార్పొరేషన్, పట్టణాభివృద్ధి అథారిటీలు, పట్టణ ప్రణాళికాట్రస్టు, పారిశుద్ధ్యం, పట్టణ నీటిపారుదల, మురుగుకాలువలు, హైదరాబాద్ వాటర్‌వర్క్స్, వాతావరణ కాలుష్యం.

శ్రీ పి. శేషావతారం, సహాయమంత్రి గోకారామస్వామి:-రవాణా ఆర్.టి.సి సంస్థ.

శ్రీ యడ్లపాటి వెంకట్రావు, సహాయమంత్రి శ్రీ జి. నాగేశ్వరరావు:- వ్యవసాయం ఆహారోత్పత్తి, ఆగ్రో పరిశ్రమలసంస్థ అనుబంధ సంస్థలు, ఆయకట్టుప్రాంతం అభివృద్ధి, నూనెగింజలు, పప్పుధాన్యాలు జీడిపప్పుతోసహా వాణిజ్యపంటల అభివృద్ధి.

శ్రీ జి. వెంకటస్వామి:-కార్మికశాఖ ఇ.ఎస్.ఐ పౌరసరఫరాలు, పౌరసరఫరాల సంస్థ ప్రజా క్యాంటీనులు, వినియోగవస్తువుల సరఫరా అత్యవసర వస్తువుల ధరల అదుపు.

శ్రీ ఆగిశం వీరప్ప, సహాయమంత్రి శ్రీ కె.పాపయ్య:- విద్యుచ్ఛక్తి, విద్యుచ్ఛక్తిబోర్డు వెనుకబడిన తరగతుల అభివృద్ధి, రాష్ట్ర వెనుకబడిన తరగతుల ఆర్థికసహాయసంస్థ, సౌరశక్తి అభివృద్ధి.

శ్రీ ఇ. అయ్యపురెడ్డి:-న్యాయశాఖ, కోర్టులు, శాసనసభ వ్యవహారాలు, శాసన సభ్యుల హాస్టళ్లు, శాసనసభ్యుల గృహవసతి పథకం.

శ్రీ చేబ్రోలు హనుమయ్య:-మార్కెటింగ్, వేర్ హౌసింగ్ కార్పొరేషన్, తూకాలు కొలతలు, సొసైటీల రిజిస్ట్రేషన్ చట్టం, భారతీయ భాగస్వామ్యపు చట్టం.

శ్రీ దామోదరం మునిస్వామి:-టూరిజం, టూరిజం కార్పొరేషన్, హోటళ్ల అభివృద్ధి హోటల్ పరిశ్రమ, పౌరవిమానయానం, ఫ్లయింగ్ క్లబ్‌లు, గ్లయిడింగ్‌క్లబ్‌లు, సాంస్కృతిక ప్రతినిధుల పర్యటన.

శ్రీ జి. వేదాంతరావు:-గ్రామీణ అభివృద్ధి, దుర్భిక్ష నివారణ ఇతర పథకాలు, సన్నకారు రైతుల అభివృద్ధి పథకాలు, వడ్డీవ్యాపారం, గ్రామీణ రుణభారం, వ్యవసాయ రుణభారం నిర్మూలనకు సహాయకచర్యలు.

శ్రీ ఎస్. వెంకటరెడ్డి:-గనులు భూగర్భవ్యవహారాలు బెరైటీస్ అభివృద్ధి, సున్నపురాయి గ్రైనైటు, రాష్ట్ర మైనింగ్ కార్పొరేషన్.

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ,సహాయమంత్రి శ్రీమతి విజయలక్ష్మి:- స్త్రీ శిశుసంక్షేమం మహిళల స్వయంఉపాధి కార్యక్రమం, ఉద్యోగులైన మహిళల సంక్షేమ హాస్టళ్ళు, రాష్ట్ర మహిళా ఆర్థిక సహాయసంస్థ, రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా బోర్డు, సమగ్ర శిశుసంక్షేమ ప్రాజక్టులు, బాలవాడీలు, బాలవిహార్‌లు, జవహర్ బాలభవన్, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, పౌష్టికాహార కార్యక్రమం వ్యవహారాలు.

శ్రీ ఎన్. శ్రీనివాసులురెడ్డి:-చక్కెర పరిశ్రమలు, నిజాం చక్కెర ఫ్యాక్టరీ, ఖండసారి ఫ్యాక్టరీలు, బెల్లం తయారీ.

శ్రీ అహ్మద్‌షరీఫ్:-సహాయ, పునరావాస కార్యక్రమాలు ఆంధ్రప్రదేశ్ సైనికబోర్డు, వక్ఫ్, సాలార్‌జంగ్ మ్యూజియం, ఉర్దూ అకాడమి, అరబిక్, పర్షియన్ అధ్యయనం.

శ్రీ ఎం. ఎం. హాషిం:-వాణిజ్యం, ఎగుమతుల ప్రోత్సాహం, స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్, ప్రభుత్వ ఉద్యానవనాలు.

శ్రీ రుద్రరాజు రామలింగరాజు, సహాయమంత్రి కాసు వెంకటకృష్ణారెడ్డి : రేవులు భూగర్భ నీటి వనరులు, రాష్ట్ర నీటిపారుదల అభివృద్ధి సంస్థ.

శ్రీ కె. రోశయ్య, సహాయమంత్రి శ్రీరాజనరసింహ:-గృహనిర్మాణం రాష్ట్ర హౌసింగ్ బోర్డు బలహీనవర్గాల గృహవసతి పథకం హుడా, ఆంధ్రప్రదేశ్ గృహనిర్మాణ సంస్థ.

8-12-80 ప్రభుత్వసిబ్బందికి పాత పనివేళలు ప్రారంభం - ఉదయం 10.30 గంటల నుంచి సాయంత్రం 5 గంటల వరకు, వారానికి ఆరు రోజులు పనిదినాలు.

10-12-1980 ఆరోగ్యప్రణాళికా కాలంలో ఆంధ్రప్రదేశ్ ప్రణాళికా పెట్టుబడి రూ. 3,100 కోట్లు.

# 38

# ప్రముఖ వ్యక్తులు

అసంఖ్యాకమైన తెలుగు వెలుగులకు మన తెలుగునాడు నిలయం. జాతీయ, అంతర్జాతీయ రంగాలలో పేరు ప్రఖ్యాతులు గడించిన ప్రముఖవ్యక్తులు ఎందరో ఆంధ్రప్రదేశ్‌లో పుట్టి పెరిగారు. అందరిని పేర్కొనడం అసాధ్యం. స్థలాభావం, లభ్యమయ్యే సమాచారం మొదలైన పరిమితులదృష్ట్యా కొంతమందినిగురించి మాత్రమే సంక్షిప్త లేఖినీ చిత్రాలను కింద పొందుపర్చడం జరిగింది. ఈ శీర్షికలో చేరని ఎందరో మహానుభావులకు వందనాలర్పిస్తూ, మలి ముద్రణలో మరింతమందిని చేర్చడానికి ప్రయత్నిస్తామని మనవి చేస్తున్నాం. ఇందులో తెలుగుజాతి వికాసానికి పాటుబడిన వైతాళికులను; రాజకీయ నాయకులను; చరిత్ర, సాంస్కృతిక పరిశోధకులను; సామాజిక సేవకులను; విద్యావేత్తలను; సాంకేతిక, శాస్త్రవేత్తలను; పారిశ్రామిక వేత్తలను; కవులు, కథకులు, నవలాకారులు, నాటక కర్తలు, విమర్శకులు, పండితులను; నృత్య, సంగీత విద్వాంసులను; నటీనటులను; పాత్రికేయులను; చిత్ర, శిల్పకారులను; క్రీడాకారులను; తదితర రంగాలలో ప్రసిద్ధులైన కొంతమందిని గురించి సంగ్రహంగా తెలియజేయడమైంది.

***అంజయ్య టంగుటూరి*** : జననం: 1929 మెదక్ జిల్లా, భానూరులో. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, కార్మికనేత. హైదరాబాద్, సుల్తాన్‌బజారు హైస్కూల్లో విద్యాభ్యాసం. ట్రేడ్ యూనియన్ నాయకులుగా పేరు ప్రఖ్యాతులు గడించారు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. 1957-78 మధ్య వీరు రాష్ట్ర విధానసభ సభ్యులుగా ఉంటూ రాష్ట్ర కార్మిక మంత్రిగా రెండుసార్లు పదవి స్వీకరించారు. 1978 ఏప్రిల్‌లో రాజ్యసభకు ఎన్నికై, కొద్దికాలంపాటు కేంద్ర కార్మికశాఖ సహాయ మంత్రిగా ఉండి, ఆంధ్రప్రదేశ్

ముఖ్యమంత్రిగా అక్టోబరు 11, 1980 న పదవీస్వీకారం చేశారు. ఆల్విన్ ఫ్యాక్టరీలో ఆర ణాల వేతనంమీద కార్మికునిగా పనిచేసి, ప్రజల్లోంచి పైకి వచ్చిన శ్రీ అంజయ్యగారికి కార్మి కులూ, కర్షకులూ రెండు కళ్ళవంటి వారు ఆంధ్రప్రదేశ్ ప్రజల శ్రేయస్సు తనలక్ష్యంగా, నిష్కళంకమైన, సామర్థ్యంగల, నిష్పాక్షికమైన పరిపాలనను ప్రజల కందించడమే తన ధ్యేయంగా వీరు అవిరళకృషి చేస్తున్నారు.

*అంబాప్రసాదు, సమ్మెట* : జననం : 1905 తణుకులో. హార్మోనియం వాద్యంలో అపూర్వసాధన చేసిన నిపుణులు. కొంతకాలం విద్యాశాఖలో పనిచేశారు. ఉస్తాద్ కరీంఖాన్, బడే ఘులామలీఖాన్ మొదలైన మహా గాయకులకు పక్కవాద్యంగా హార్మోనియం వాయిం చారు. పెక్కు యోగ్యతాపత్రాలు, బంగారుపతకాలు పొందారు. బొంబాయి గాంధర్వ మహా విద్యాలయంలో సంగీత పట్టభద్రులైన వీరిని 1975లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలో సన్మానించడం జరిగింది. హార్మోనియం గురించి ఒక గ్రంథం వ్రాశారు.

***అచ్యుతరామయ్య, నండూరి*** : చక్కెర నాణ్యతను పెంచడంలో విధానాలను, చక్కెర రంగును కొలిచే విధానాలను కనుగొన్న శాస్త్రవేత్త. వీరు బెనారస్ విశ్వవిద్యాలయంలో ఎమ్. ఎస్‌సి, పిహెచ్. డి. డిగ్రీలు పొందారు. ఆతరవాత బనారస్ హిందూ విశ్వవిద్యాల యంలోను, ఢిల్లీ విశ్వవిద్యాలయంలోనూ పనిచేశారు. కాన్పూర్‌లోని జాతీయ చక్కెర సంస్థలో 1955 లో పరిశోధనచేశారు. 1961 లండనులోని రాయల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కెమిస్ట్రీలో ఫెలోషిప్ పొందారు. 1970 లో ఇండియన్ నేషనల్ సైన్స్ అకాడమీలో ఫెలో షిప్‌కు ఎన్నికఅయ్యారు. 1970 లో కెమిస్ట్రీకి భట్నాగర్ అవార్డు పొందారు.

***అచ్చమాంబ, భండారు*** : జననం: 1874 కృష్ణాజిల్లా నందిగామలో. స్త్రీజనాభ్యుదయానికి పాటుబడిన తొలిమహిళ. ఆంధ్రదేశంలో మహిళా సమాజాలు స్థాపించి, ఉపన్యాసాలిచ్చి, పత్రికల్లో వ్యాసాలువ్రాసి, మహిళల అభివృద్ధికి పాటుబడ్డారు. 'అబలాసచ్చరిత్రమాల' అనే గ్రంథాన్ని వ్రాసిన వీరు 1905 లో కీర్తిశేషులయ్యారు.

***అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి*** : గానకళాప్రపూర్ణ, గానకళాసింధు బిరుదాంకితులు; సంస్కృత, ప్రాకృత, ఆంధ్ర భాషలలో గొప్ప పరిజ్ఞానం గల వీరు 1893 లో రాళ్లపల్లిలో జన్మించారు. సంగీత, సాహిత్యాలలో సమాన ప్రతిభావంతులు. ముప్పై మూడేండ్లు మైసూరు మహారాజా కళాశాలలో ఆంధ్ర పండితులుగా ఉన్నారు. యోగివేమన, అన్నమాచార్యులపైన అమూల్యమైన పరిశోధనలు చేశారు. సంగీత, సారస్వత, విమర్శనా గ్రంథాలు ఎన్నో వ్రాశారు. గాథాసప్తశతిని, నృత్యరత్నావళిని తెనిగించారు. నాటకోపన్యాసాలు, వేమన, సారస్వతోపన్యాసాలు మొదలైన గ్రంథాలు ప్రచురితమయ్యాయి.

***అనంతశయనం అయ్యంగారు, మాడభూషి*** : సంస్కృత భాషాకోవిదులు, పరిణతి చెందిన రాజకీయవేత్త. జననం : 1891 ఫిబ్రవరి 4 వ తేదీన తిరుచానూరులో. న్యాయశాస్త్ర

పట్టభద్రులు. 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో, వ్యక్తి సత్యాగ్రహంలో, 1942 ఆగస్టు ఉద్యమంలో పాల్గొన్నారు. రాష్ట్ర అఖిలభారత కాంగ్రెసు సంఘ సభ్యులు. రాజ్యాంగ నిర్మాణసభలోను, కాన్‌స్టిట్యూషన్‌క్లబ్ కార్యదర్శిగాను పనిచేశారు. 1952 లో లోక్‌సభకు ఎన్నికై, ఉపాధ్యక్షులుగా కొంతకాలం ఉన్నారు. చిత్తూరు మున్సిపాలిటీ, బార్ ఎసోసియేషన్ ప్రెసిడెంటుగా, జిల్లా సహకార బ్యాంకు డైరెక్టర్‌గా, హరిజనసేవ సంఘ అధ్యక్షులుగా, కేంద్రవిద్యా సలహాసంఘ సభ్యులుగా, ఎస్టిమేట్స్ కమిటీ, రైల్వే కన్వెన్షన్ కమిటీ చైర్మన్‌గా పనిచేశారు. లోక్‌సభ మాజీస్పీకరు. బీహారు మాజీగవర్నరు. చైనా సందర్శించారు. ఇప్పుడు మన మధ్యలేరు.

**అన్నపూర్ణయ్య, మద్దూరి** : జననం : 1900లో పిఠాపురంలో. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్న స్వాతంత్ర్య యోధులు. జైలుకువెళ్ళారు. 'కాంగ్రెస్' అనే పత్రికను స్థాపించి, దానికి పదకొండు సంవత్సరాలపాటు సంపాదకులుగా ఉన్నారు. నవశక్తి, జయ భారత్ అనే పత్రికలను కూడా నిర్వహించారు. హరిజనోద్ధరణకు పాటుపడినవీరు 1958లో మరణించారు.

**అప్పలస్వామి, పురిపండా** : గేయరచనలో సిద్ధహస్తుడు; సాహిత్యోపాసకుడు; బహు భాషలతో విశేషపరిచయంగలవాడు. వీరు శ్రీకాకుళం జిల్లా సాలూరులో జన్మించారు. 1925 నుంచీ వచన కవితలు వ్రాస్తున్నారు. పలురచయితల సంఘంతో వీరికి పరిచయముంది. మురళీధ్వని, సౌదామిని, ఆకాశవీధులు, నవ్యసాహిత్యం, వ్యావహారిక మహాభారతం మొదలైన రచనలు చేశారు.

**అప్పారావు** : 'ఆంధ్రశ్రీ' బిరుదాంకితులు; అంగసౌష్ఠవ ప్రదర్శనలో ఆరితేరినవారు; రాష్ట్ర వెయిట్ లిఫ్టింగ్ ఛాంపియన్. రాష్ట్ర జాతీయ పోటీలలో ఎన్నో బహుమతులు పొందారు. కుస్తీ పోటీలలో, శరీరసౌష్ఠవ ప్రదర్శనలో, వెయిట్‌లిఫ్టింగ్‌లో బహుమతులు పొందటమే కాకుండా మిస్టర్‌సదరన్, కృష్ణశ్రీ మొదలైన బహుమతులు పొందారు. జాతీయ క్రీడాకారులు.

**అప్పారావు, గురజాడ** : ఆధునిక తెలుగు సాహిత్యంలో నాటకానికి, కవిత్వానికీ, చిన్న కథకు శంకుస్థాపన చేసిన యుగపురుషుడు. జననం : 1861 నవంబరు 30, విశాఖపట్నం జిల్లా రాయవరంలో. విజయనగరం కళాశాలలో చదివి, కొంతకాలం అక్కడ అధ్యాపకునిగా పనిచేశారు. వ్యావహారిక భాషావాది. సంఘసంస్కర్త. సామాజిక ప్రయోజనాన్ని ఆశించి రచనలుచేశారు. " దేశమంటే మట్టికాదోయ్ — దేశమంటే మనుషులోయ్ " అని తెలుగు వారిని మేల్కొల్పిన వైతాళికులు. వ్యాసచంద్రిక, ముత్యాలసరాలు, కన్యాశుల్కం, అణిముత్యాలు, లేఖలు, డైరీలు మొదలైన రచనలు చేశారు. "కావ్యేషు నాటకం రమ్యం " అనే దానికి వీరి "కన్యాశుల్కం" నాటకం ప్రత్యక్ష సాక్ష్యమని చెప్పవచ్చు. కొన్ని వేల ప్రదర్శనలద్వారా ఇప్పటికీ ప్రజాదరణలో ఉన్న గొప్ప నాటకం. మానవతావాదిగా కాలాతీతంగా పురోగమించిన అప్పారావుగారు 1915 నవంబరు 30 న అస్తమించారు.

*అప్పారావు, ఎం ఆర్.* విద్యావేత్త; సాహిత్యకళాపోషకుడు; క్రీడాకారుడు; రచయిత. జననం : 1914 లో కృష్ణాజిల్లా నూజివీడులో ఎం. ఏ. పట్టభద్రులు. విధానసభకు నూజివీడు నుంచి ఎన్నికయ్యారు. రాష్ట్ర మంత్రిపదవి, ఆంధ్రనాటక కళాపరిషత్తుకు సభ అధ్యక్షపదవీ, సాహిత్య, సంగీత, లలితకళా అకాడమిసభ్యత్వం, యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ సలహాసంఘ సభ్యత్వం మొదలైన పదవులూ,హోదాలూ నిర్వహించారు. జయదేవుని గీత గోవిందం, ఉమర్ఖయ్యాం రుబాయలత్లు తెలుగులోకి అనువదించారు. ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు ఉపాధ్యక్షులుగా చేశారు.

*అప్పారావు, పోణంగి శ్రీరామ* : సంగీత, నృత్య. నాట్య శాస్త్రాలలో పరిజ్ఞానంగలవాడు; గ్రంథకర్త; ఉపన్యాసకుడు; పరిపాలనాదక్షుడు. ఆంధ్రా, ఉస్మానియాలలో ఎం. ఏ; పిహెచ్.డిచేసి కొంతకాలం అధ్యాపకులు:గాఉండి, తెలుగుఅకాడమి, అంతర్జాతీయ తెలుగుసంస్థల వికాసానికి కృషిచేశారు. 1961 లో వీరి 'నాట్యశాస్త్రం' గ్రంథానికి జాతీయ అవార్డువచ్చింది. కొంతకాల ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి గౌరవకార్యదర్శిగా, సాంస్కృతిక వ్యవహా రాలకు అధికారిగా ఉన్నారు. విశ్వభారతి, వేణువు, తాజ్ హమల్, నాట్యశాస్త్రం మొదలైన గ్రంథాలువ్రాశారు. జననం : 21-7-1923.

*అప్పారావు, విస్సా* : విద్యావేత్త; భౌతికశాస్త్ర ఆచార్యుడు. సంగీత, నృత్య సాంప్ర దాయాలపై విశేషమైన కృషిచేశారు. జననం : 1884 మే 1న రాజమండ్రిలో. గానకళా పరిషత్తు స్థాపించి విశిష్టమైన సంగీత, సాహిత్య గ్రంథాలు ప్రకటించారు. క్షేత్రయ్యపదాలను, త్యాగరాజ కృతులను స్వరపరచి ప్రచురించారు.

*అమరేశ్వరి, కె. జస్టిస్* : ఆంధ్రప్రదేశ్ హైకోర్టుకు మొట్ట మొదటి స్త్రీ న్యాయమూర్తి. సాహిత్యాభిమాని; వక్త. జననం : 1929 అక్టోబరు 11న. వీరు ఎం. ఏ. చేసి 1951 లో న్యాయశాస్త్ర పట్టభద్రురాలయ్యారు. 1952 మద్రాసు హైకోర్టులో ఎన్‌రోల్ అయ్యారు. ఆ తరవాత గుంటూరులో హైకోర్టు ఆఫ్ ఆంధ్రాలోను, హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు లోను న్యాయవాదిగా ఉండి, 1974 లో గవర్నమెంటు ప్లీడరు అయ్యారు. 1977 లో వీరు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు జడ్జిగా నియమితులయ్యారు. న్యాయవాదిగా ఉన్నప్పుడు ఉమన్స్ లాయర్స్ ఫెడరేషన్, అడ్వకేట్స్ అసోసియేషన్‌లకు వైస్ ప్రెసిడెంటుగాను, బార్‌కౌన్సిల్ సభ్యులుగాను ఉన్నారు. అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో వీరు సికింద్రాబాదు, హైద్రా బాదు లయన్స్‌క్లబ్ వారుచేసిన సన్మానం పొందారు. వీరు అనేక సాంస్కృతిక కార్యకలా పాలలో పాల్గొంటూ ఉంటారు.

*అళ్వారుస్వామి, వట్టికోట* : 1905 నవంబరు 1 న నల్గొండ జిల్లా మాధవరంలో జన్మించారు. విప్లవాన్ని విశ్వసించిన జాతీయవాది: సుప్రసిద్ధ కథా, నవలా రచయిత. అనేక ఉద్యమాలలో పాల్గొని జైలు జీతాన్ని గడిపారు. దేశోద్ధారక గ్రంథమాల స్థాపించి

దాదాపు 30 గ్రంథాలను ప్రచురించారు. నిజాం రాష్ట్రంలో అనేక గ్రామాలలో గ్రంథాలయాలు నెలకొల్పడానికి కృషిచేశారు. జైలులోపల, ప్రజలమనిషి, గంగు మొదలైన పుస్తకాలు వ్రాసిన వీరు 1961 ఫిబ్రవరి 5 న కాలధర్మం చెందారు.

*ఆంజనేయులు, కుందుర్తి :* కవితాద్యుమణి. జననం : 1922 డిసెంబరు 16 న నర్సరావుపేట తాలూకా కోటవారిపాలెంలో. సమకాలీన ప్రజాఉద్యమాలను, సామాన్యప్రజల ఆశలను, ఆశయాలను, ఆందోళనలను, ఆవేశాలను వీరి కవితలు ప్రస్ఫుటంగా, ప్రయోజ నాత్మకంగా, రమణీయంగా, రసాత్మకంగా ప్రతిబింబిస్తాయి. సయాగరా, తెలంగాణ, ఆశ, యుగే యుగే, నగరంలోవాన, నాలోని నాదాలు, మాతృగీతం, ఇదేనాదేశం, సాహసయాత్ర, భగవంతునికి బహిరంగలేఖ, వేకువ వెలుగులు, దండియాత్ర మొదలైన కావ్యాలన్నీకలిపి కుందుర్తి కృతులుగా వెలువరించారు. సమాచారశాఖలో పనిచేసి రిటైర్ అయ్యారు.

*ఆంజనేయులు, డి. :* పాత్రికేయుడు; ఆంగ్లాంధ్ర భాషలలో వ్యాసకర్త; గ్రంథకర్త. జననం : 1923 ఫిబ్రవరి 10 బి. ఏ. (ఆనర్స్) బి. ఎల్ చదివారు. ఇండియన్ ఎక్స్ ప్రెస్, హిందూ, వాణి పత్రికలలో పనిచేశారు. కొంతకాలం హైద్రాబాదులో సమాచార అధి కారిగా ఉన్నారు. రష్యా, ఇంగ్లాండ్, ఇతర యూరప్ దేశాలు పర్యటించి వచ్చారు. గ్రంథ విమర్శలకు వీరు పెట్టింది పేరు. డాక్టర్ సి. ఆర్. రెడ్డి, కందుకూరి వీరేశలింగంగార్ల జీవిత చరిత్రలూ, ఇంగ్లీషులో కొన్ని గ్రంథాలు వ్రాశారు.

*ఆత్రేయ, ఆచార్య :* సుప్రసిద్ధ నాటకకర్త; సినిమా రచయిత. నెల్లూరుజిల్లాలో జన్మించారు. సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యం సంపాదించారు. ఈనాడు, ఎన్.జి.వో, విశ్వశాంతి, కప్పలు మొదలైన నాటకాలద్వారా పేరుప్రఖ్యాతులు తెచ్చుకొన్నారు. అనేక చలన చిత్రాలకు మాటలు, పాటలు వ్రాశారు. ఇంకా వ్రాస్తున్నారు. సెంటిమెంటల్ దృశ్యాలకు మాటలు వ్రాయడంలోదిట్ట. బరువైన సంభాషణద్వారా ప్రేక్షకులచేత కన్నీరుకార్పించగలరు.

*ఆరుద్ర :* సుప్రసిద్ధకవి, రచయిత, అసలుపేరు భాగవతుల శివశంకరశాస్త్రి, జననం 1925 ఆగస్టు 31న విశాఖపట్నంలో. 'క్విట్ఇండియా' ఉద్యమంలో పాల్గొనడానికి తమ చదువుకు స్వస్తిచెప్పారు. స్వాతంత్రోద్యమ యోధునిగా 1942-43 మధ్య జైలుకు వెళ్ళారు. భావాలలోనేకాక, ఛందస్సులో, శైలిలో ఆధునికత్వం గల కవి. త్వమేవాహం, గాయాలు - గేయాలు, సినీవాలి, కూనలమ్మపదాలు మొదలైన కవిత్వ గ్రంథాలేకాక, చిన్నకథలు, నవ లలు వ్రాశారు. అనేక చలనచిత్రాలకు పాటలు వ్రాశారు. ఆంధ్ర సాహిత్యాన్ని 'సమగ్రాంధ్ర సాహిత్యం' పేరుతో ఇప్పటికి 13 సంపుటాలు వెలువరించారు. మరో రెండు సంపుటాలు త్వరలో వెలువరించనున్నారు.

*ఈశ్వరరావు, కామినేని :* కృష్ణాజిల్లాలో జన్మించిన వీరు బరువు ఎత్తడంలో అంతర్జా తీయ ఖ్యాతిని ఆర్జించారు. బరువు ఎత్తడంలో ఆసియాలోనూ, భారతదేశంలోనూ ప్రథము డుగా నిలిచారు. అర్జున్ అవార్డు పుచ్చుకొన్నారు.

*ఎల్లారెడ్డి, బద్దం :* కమ్యూనిస్టుపార్టీ అగ్రనాయకులలో ఒకరు. సహజ దేశభక్తులు. వీరు అనుభవించని కారాగారశిక్ష, పాల్గొనని జాతీయ ప్రజా ఉద్యమాలులేవు. తెలంగాణా ఆంధ్రులలో సాంఘిక, రాజకీయచైతన్యం పెంపొందించటానికి కృషిచేసిన ఆంధ్ర మహాసభ నిర్మాతలలో ప్రముఖులు. విశాలాంధ్ర నిర్మాణంకోసం కృషిచేశారు. 1952 లో లోక్‌సభకు, 1957 లో శాసనసభకు ఎన్నికయ్యారు. 1964 నుంచి 70 వరకూ రాజ్యసభ సభ్యులు.

*కనకలింగేశ్వరరావు, బందా :* ప్రముఖ రంగస్థల నటుడు, సినీనటుడు. వీరిపేరు వినగానే 'గుత్తివంకాయకూర' పాట స్ఫురిస్తుంది. కూచిపూడి నృత్యానికి కొత్తరూపాన్ని చేకూర్చడంలో విశేషంగా కృషిచేసిన వీరు 1907 లో కృష్ణాజిల్లా కైకలూరు తాలూకా ఆటపాకలో జన్మించారు. రాముడు, సారంగధరుడు, బిల్వమంగళుడు, కాళిదాసు మొదలైన పాత్రలద్వారా కీర్తిగడించారు. ఉత్తమ నటనకు రాష్ట్రపతి అవార్డు పొందారు. కొంతకాలం విజయవాడ ఆకాశవాణి నాటకశాఖలో ప్రొడ్యూసర్‌గా పనిచేశారు.

*కమలాబాయి, సురభి :* తొలి తెలుగుసినిమా హీరోయిన్. జననం : హైదరాబాదులో. సురభి నాటకాలద్వారా పైకివచ్చి, 130 సినిమాలలో నటించారు. తొలి తెలుగు సినిమా 'భక్తప్రహ్లాద'లో లీలావతి పాత్ర ధరించారు. 'పాతాళభైరవి'లోని ఆమె పాత్ర మరువ రానిది. సినీ, నాటక రంగాలకు ఆమె చేసిన సేవకు గుర్తింపుగా 1957, 1966, 1969 సంవత్సరాలలో ఘనమైన సన్మానాలు పొంది, 1971 ఫిబ్రవరి 13 న స్వర్గస్తురాలయ్యారు.

*కామేశ్వరరావు, గాడేపల్లి :* కార్మికనిర్వహణ, న్యాయశాస్త్రాలలో నిపుణుడు; స్వాతంత్ర్య యోధుడు. జననం : 1931 లో హైదరాబాదులో. వీరు సోషల్‌వర్క్‌లో ఎం.ఏ. చదివారు. పారిశ్రామిక సంబంధాల క్షేత్రంలో ఎంతోకృషిచేసి, అంతర్జాతీయఖ్యాతిని పొందారు. పి జి. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లేబర్ లా మేనేజ్‌మెంట్ సంస్థకు స్థాపనడైరక్టరు. అంతర్జాతీయ కార్మిక సంస్థలో సభ్యులు. 'ఫ్రీమేసన్స్ లాడ్జి' సీనియర్ ఆఫీసరు. విదేశాల్లోజరిగిన ఎన్నోసదస్సుల్లో సమావేశాల్లో భారతప్రభుత్వపు ప్రతినిధిగా పాల్గొన్నారు. కార్మికాభ్యుదయాన్ని గురించి పుస్తకాలు, వ్యాసాలు వ్రాశారు. ఈ మధ్యనే ప్లానింగ్ కమీషన్‌యొక్క భారతదేశంలో బాండెడ్ లేబర్‌కు సంబంధించి సాంకేతిక సలహాబోర్డ్‌లో సభ్యులుగా నియమితులయ్యారు.

*కామేశ్వరరావు, భమిడిపాటి :* హాస్యనాటక రచయిత. జననం : 1897లో పశ్చిమ గోదావరిజిల్లా ఆకివీడు గ్రామంలో. బి.ఏ; ఎల్. టి. చదివి ఉపాధ్యాయవృత్తి స్వీకరించారు. కాలక్షేపం, ఇప్పుడు-అప్పుడు, అన్నీతగాదాలే, పెళ్ళిట్రైనింగ్, ఈడూ—జోడూ, అవును, నిజం, మాటవరస, గుసగుసపెళ్ళి, త్యాగరాజు ఆత్మవిచారం మొదలైన గ్రంథాలు ఎన్నో వ్రాసి సున్నితమైన, సంఘటనాత్మక హాస్యానికి పేరు గడించిన కీర్తిశేషులు.

*కామేశ్వరి, న్యాయపతి :* బాల అక్కయ్యగా, రేడియో అక్కయ్యగా ప్రసిద్ధికెక్కిన, ఆంధ్రదేశంలోని బాల బాలికల విజ్ఞానాభివృద్ధికి దాదాపు అర్థ శతాబ్దం అవిరళ కృషి సల్పిన వీరు 1908 లో విజయనగరంలో జన్మించారు. బి. ఏ; ఎల్. టి. చదివి కొంతకాలం మద్రాసులో ఉపాధ్యాయినిగా పనిచేశారు. 1930 లో బాలల ఉద్యమాన్ని ప్రారంభించి,

అక్టోబరు, 1960 న కన్నుమూసే వరకూ బాల బాలికల శ్రేయస్సుకోసం పాటుబడ్డారు. తెలుగులో మొట్ట మొదటిసారిగా 1945 లో 'బాల' పత్రికను భర్త రాఘవరావుగారితో కలిసి స్థాపించారు. 1939 నుంచీ రిటైర్ అయ్యేదాకా ఆకాశవాణిలో పిల్లల కార్యక్రమాన్ని వినోద విజ్ఞాన దాయకంగా, బాలల మనోరంజకంగా నిర్వహించారు. రేడియోలో మహిళా మండలుల స్థాపనకూ, ఆంధ్రప్రదేశ్‌లో బాలానంద సంఘాల స్థాపనకూ వీరు ముఖ్యకారకులు. నిజజీవితంలో పిల్లలు లేకపోయినా, అందరిపిల్లల్ని తన పిల్లలుగా భావించి, వారి మనో వైజ్ఞానిక వికాసానికి వేలకొద్దీ రచనలు చేశారు.

***కాశీపతి, కపిల :*** పత్రికా రచయిత; హాస్యచతురుడు. జననం : సెప్టెంబరు 14. 1908 లో బి. ఏ. ఎల్ ఎల్. బి దాకా చదివారు. దిమెయిల్, స్వరాజ్య పత్రికలలో సంపాదక సభ్యులుగా పనిచేసి, కొంతకాలం ఆలిండియా రేడియోలో న్యూస్ ఎడిటర్‌గా ఉన్నారు. ఆంధ్ర ప్రభుత్వపు ప్రజాసంబంధాల శాఖకు డైరెక్టర్ చేసి, సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఫిలింసెన్సార్స్ (మద్రాసు) కు చాలాకాలం రీజినల్ ఆఫీసరుగా పనిచేశారు. యూరోప్ దేశాలను పర్యటించిన వీరు తెలుగులో కథలూ, కవితలూ నాటికలూ, వ్యాసాలూ, నవలలూ వ్రాశారు

***కాశేశ్వరరావు, అయ్యదేవర :*** అకళంక దేశభక్తుడు; కాకలుతీరిన స్వాతంత్ర్య యోధుడు; హరిజనోద్ధరణోద్యమ కర్త; విశాలాంధ్ర మహాసభ స్థాపకుడు. జననం : 1881 కృష్ణాజిల్లా నందిగామలో. విద్యార్థి దశనుంచీ రాజకీయాల్లో పాల్గొంటూ, న్యాయశాస్త్ర పట్టభద్రులై కొంతకాలం న్యాయవాద వృత్తి స్వీకరించారు. అనేక ఉద్యమాల్లో పాల్గొని, అనేక సార్లు జైళ్లకు వెళ్ళారు. విజయవాడ మున్సిపల్ కౌన్సిల్‌కు 1925లో ఎన్నికయ్యారు. 1956 నుంచి 1962 వరకూ ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీకి స్పీకరుగా ఉన్నారు. పారిభాషిక పదకోశ నిర్మాతలలో ప్రముఖులు. వీరు 1962 లో పరమపదించారు.

***కుటుంబరావు, కొడవగంటి :*** రష్యన్ కథకులలో చెకోవ్‌కు ఉన్నస్థానం తెలుగు కథకులలో వీరికున్నది. నవలాకారులు; నాటక కర్త; వ్యాసరచయిత. మధ్య తరగతి ప్రజల ఆచారాలను, ఆలోచనలను, అలవాట్లను, మనస్తత్వాలను, సమస్యలను సమగ్రంగా అవగాహన చేసుకొని, వారిమీద కొన్ని వందల కథలు వ్రాశారు. 1909 అక్టోబరు 28న వీరు తెనాలిలో జన్మించారు. ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, కినిమా, చందమామ పత్రికలలో పని చేశారు. సామాజిక సమస్యలు, శాస్త్రీయవిజ్ఞానం, సాహిత్యం మొదలైన అంశాల మీద ఎన్నో వ్యాసాలు వ్రాశారు. కొన్ని వందల చిన్నకథలు వ్రాసి, ఎంతోమంది కథా రచయితలకు మార్గదర్శకులయ్యారు. రచనలు : తార, చదువు, కొత్తకోడలు, కొత్త అల్లుడు, అరుణోదయం, కులంలేని మనిషి, అనుభవం మొదలైన నవలలు, నీలవనీరు, మొండివాడు, కుటుంబరావు కథలు మొదలైన కథల సంపుటాలు వచ్చాయి. సాహిత్యానికి సామాజిక ప్రయోజనం ఉండాలని విశ్వసించి రచనలు చేసిన వీరు ఆగష్టు 1980 లో కీర్తిశేషులయ్యారు.

*కుప్పుస్వామి, అల్లాడి :* హైకోర్టు ప్రధానన్యాయమూర్తి. బ్రిడ్జి ఆటలో నైపుణ్యం గలవాడు. జననం మార్చి 23, 1920. 1942 సం॥లో న్యాయవాదిగా మద్రాసులో ప్రాక్టీసు మొదలుపెట్టి 1954 లో గుంటూరుకు, 1956 లో హైదరాబాదుకు మారారు. 1967 లో హైకోర్టు న్యాయమూర్తిగా నియమితులయ్యారు. 1980 నవంబరు 30 వ తేదీనుంచి ప్రధాన న్యాయమూర్తిగా వ్యవహరిస్తున్నారు. అనేక కమీషన్ల చైర్మన్‌గా ఉన్నారు. అనేక సాంఘిక సాంస్కృతిక సంస్థలతో వీరికి సంబంధం ఉంది. సంస్కృతంలో బాగా పరిచయముంది. సంస్కృత భాషావికాసానికి తోడ్పడే సురభారతి అనేసంస్థకు వీరు అధ్యక్షులు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సంస్కృత భాషావిభాగానికి అధ్యక్షులు.

*కృష్ణ, వి. యస్ :* అర్థశాస్త్రజ్ఞుడు; విద్యావేత్త; పరిపాలనాదక్షుడు. తెనాలి తాలూకా పెదపాలెంలో జన్మించిన వీరు ఆక్స్‌ఫర్డ్‌లో బి.ఏ. చదివి, వియత్నాంలో పిహెచ్.డి. చేసి ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో ఆచార్యులుగాచేరి, ప్రిన్సిపాల్‌అయి,రిజిస్ట్రార్‌చేసి,వైస్-ఛాన్సలర్ ఆయ్యారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో ఎన్నో కొత్త కోర్సులను ప్రవేశపెట్టడానికి కారకులయ్యారు. 1948-59 మధ్య ఆ విశ్వవిద్యాలయ బహుముఖ వికాసానికి ఎంతో కృషిచేశారు. యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ చైర్మన్‌గా ఉంటూ స్వర్గస్థులయ్యారు.

*కృష్ణమాచార్యులు, కాశీ :* అవధానశిరోమణి, పౌరాణికరత్న, తర్క విద్వదుభయ కవిమిత్రులు మొదలైన బిరుదులుగల వీరు బందరులో జన్మించారు. తర్కం, వేదాంతం, గణితం మొదలైన శాస్త్రాలు, సంస్కృతం, ఆంగ్లం మొదలైన అనేకభాషలు, సేద్యం, సంగీతం, వీణ, వేణువు, వాయులీనం, మృదంగం,జంత్రవాద్యాలు, నేత, ఈత, వ్యాయామం, కుస్తీ, గరిడీ మొదలైనవి మొత్తం ప్రాచీనులు పేర్కొన్న చతుష్షష్టి కళలలోనే కాక, ఆధునిక విద్యలలోకూడా వీరు నైపుణ్యం సాధించారు. ప్రకృతి చికిత్సాభ్యాసం, యోగాభ్యాసం ఆచరణలో పెట్టారు. అమరవాణి ప్రచారానికి జీవితం అంకితం చేశారు. వీరిని రాష్ట్రపతి సంస్కృత విద్వన్మూర్ధన్యులుగా సన్మానించారు.

*కృష్ణమాచార్యులు, దాశరథి :* సుప్రసిద్ధ అభ్యుదయకవి, ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి, వక్త, మానవతావాది. జననం : 1927 జనవరి మహబూబాబాద్ దగ్గరున్న గూడూరులో. జాగీర్దారీ వ్యవస్థ రద్దుకై కృషిచేయడమేగాక స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని 1947 లో స్వాతంత్ర్య సమరయోధునిగా జైలుకు వెళ్ళారు. అగ్నిధార, రుద్రవీణ, గాలిబ్‌గీతాలు, తిమిరంలో సమరం, కవితాపుష్పకం మొదలైన కావ్యాలేకాక, నాటికలు, చిన్నకథలు అనేకం వ్రాశారు. ఎన్నో తెలుగు చిత్రాలకు పాటలు వ్రాశారు. 1974లో వీరి "తిమిరంతో సమరం" గ్రంథానికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి లభించింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం "కళాప్రపూర్ణను", ఆగ్రా విశ్వవిద్యాలయం గౌరవ డి. లిట్‌ను ఇచ్చి సత్కరించాయి. అధికార భాషాకమిషన్ సభ్యులు.

**కృష్ణమూర్తి, జిడ్డు** : ప్రపంచవిఖ్యాత తత్వశాస్త్రపారంగతుడు, దార్శనికుడు, మౌలిక తాత్వికవేత్తలలో అగ్రగణ్యులు. మదనపల్లిలో పుట్టిన మాణిక్యం. జననం : 1895. శంకరాచార్యులకు, నాగార్జునాచార్యులకు మేధోవారసుడు. ఫ్రెంచి, ఇంగ్లీషు, సంస్కృత భాషలలో పండితుడు. నానా దేశాలు పర్యటిస్తూ ప్రసంగాలద్వారా, పుస్తకాలద్వారా తన విజ్ఞానాన్ని జగత్తుకు వెదజల్లుతున్న మేధావి.

**కృష్ణమూర్తి, భద్రిరాజు** : అంతర్జాతీయ ఖ్యాతిగల భాషా శాస్త్రజ్ఞుడు, వక్త, విద్యావేత్త, గ్రంథకర్త, ఆచార్యుడు. జననం : 1928 జూన్ 19, ఒంగోలుతాలూకాలో. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో బి. ఏ. (ఆనర్స్) చదివి, పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో భాషా శాస్త్రంలో ఎం. ఏ; పిహెచ్.డిలు చేశారు. భాషాశాస్త్రం, భాషా ప్రణాళికకు సంబంధించి ఎన్నో అంతర్జాతీయ సదస్సులలో పాల్గొని, ప్రామాణిక పత్రాలను సమర్పించారు. విజిటింగ్ ప్రొఫెసర్‌గా విదేశాలను తరచూ సందర్శిస్తూ ఉంటారు. తెలుగులో, ఇంగ్లీషులో ఎన్నో గ్రంథాలు వ్రాశారు.

**కృష్ణమూర్తి, యామిని** : సుప్రసిద్ధ నృత్యకారిణి, భరతనాట్యం, కూచిపూడి, ఒడిస్సీ నృత్యాలలో అంతర్జాతీయ ఖ్యాతిని పొందారు. రకరకాల నృత్యాలను వీరు శ్రీలక్ష్మీనారాయణ శాస్త్రి, శ్రీ గోపాలశర్మ, శ్రీ శకచరణ్‌దాస్ మొదలైన వారివద్ద నేర్చుకొన్నారు. నృత్య సాధనలో, ఒడుపులో ఒక విశిష్ట బాణిని ప్రదర్శిస్తూ ప్రేక్షకులను మంత్రముగ్ధుల్ని చేయడం వీరి ప్రత్యేకత. భారతీయ నృత్యకళకు విదేశాల్లోకూడా కీర్తిప్రతిష్టలు చేకూర్చారు. భారత ప్రభుత్వం వీరికి పద్మశ్రీని, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు డాక్టరేటును ఇచ్చి గౌరవించడం జరిగింది.

**కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీపాద** : కవి, పండితుడు, పత్రికా సంపాదకుడు. జననం : 1866 లో దేవరపల్లిలో. గౌతమి, వజ్రాయుధం, మానవసేవ, వందేమాతరం అనే పత్రికలకు సంపాదకత్వం వహించారు. కొంతకాలం ప్రభుత్వ ఆస్థాన కవులుగా ఉన్నారు. రచనలు : వేణీసంహారం, కలభాషిణి, బొబ్బిలియుద్ధం, శ్రీనాథకవి మొదలైనవి. వీరు చాలకాలం క్రితం కాలధర్మం చెందారు.

**కృష్ణారావు, జి. వి**: విమర్శకుడు, నవలాకారుడు, నాటకకర్త. మద్రాసు విశ్వవిద్యాలయం వారి పిహెచ్. డి పట్టం పొంది కొంతకాలం లెక్చరర్‌గా, మరికొంతకాలం ఆకాశవాణి విజయవాడ కేంద్రంతో పనిచేశారు. సంస్కృతాంధ్రాంగ్ల సాహిత్య సముద్రాలను పుక్కిట పట్టిన అగస్త్యులు. ప్రాచ్య పాశ్చాత్య దర్శన గ్రంథాలను అవలోకనం చేసిన తాత్వికులు. విశేషించి సమాజశాస్త్ర విషయాలను కూలంకషంగా ఆకళించుకున్న మేధావి. మానవజీవితాన్ని శాసించే వివిధాంశాలను హేతుబద్ధంగా చర్చించి, కార్య కారణాలను దర్శించి ప్రతిభావంతమైన అనేక రచనలు చేశారు. రచలు : కీలుబొమ్మలు, రాగరేఖలు, పాపికొండలు మొదలైన నవలలు,

జేగంటలు, ప్లేటో ఆదర్శరాజ్యం,కావ్యజగత్తు, ఉదబిందువులు, చైత్రరథం, ఆదర్శ శిఖరాలు స్టడీస్ ఇన్ కళాపూర్ణోదయం మొదలైన సాహిత్య గ్రంథాలు. వీరు 1914లో తెనాలి తాలూకా కూచిపూడిలో జన్మించి, 1979 లో తెనాలిలో మరణించారు.

*కృష్ణారావు, ముట్నూరి* : ప్రముఖ పత్రికా సంపాదకుడు. జననం: 1879లో బందరులో. ఆంగ్లభాషలో మంచివక్త. నలభై సంవత్సరాలు 'కృష్ణాపత్రిక' సంపాదకులుగా ఉండి, తన సంపాదకీయాలతో, విమర్శలతో, వ్యాసాలతో ఆంధ్రులలో చైతన్యం కలిగించారు. ఆంధ్ర భారతి అనే సాహిత్య మాస పత్రికను కొంతకాలం నడిపారు. బందరులో 'ఆంధ్ర జాతీయ కళాశాల' స్థాపనలో కృషిచేశారు. తివాచీ, కలంకారీ, చేనేత పరిశ్రమల పునరుద్ధరణకు అస్పృశ్యతనిర్మూలనకు కృషి చేశారు. 1949లో చనిపోయారు.

*కృష్ణస్వామి అయ్యర్, అల్లాడి* : సుప్రసిద్ధ న్యాయవాది, భారతరాజ్యాంగ కర్తలలో ప్రముఖులు. జననం: 1883 సం. మే 14 న నాయుడుపేట తాలూకాలో పూదూర్ గ్రామంలో. మద్రాసులో విద్యాభ్యాసం. 1905 లో న్యాయశాస్త్రంలో డిగ్రీ పొందారు. 1907 లో న్యాయ వాదిగా నమోదై కొద్ది కాలంలోనే న్యాయవాదిగా పేరు ప్రఖ్యాతలు గడించారు. మద్రాసులో అడ్వకేట్ జనరల్‌గా 1929 నుంచి 15 సంవత్సరాలుగా ఉన్నారు. అనేక ధర్మ సంస్థలకు విరాళాలిచ్చారు. వీరు స్వర్గస్థులై చాలాకాలమైంది.

*కేశవరావు, ఉమ్మెత్తల* : తెలంగాణా జాతీయోద్యమ నాయకుడు, గాంధేయవాది. జననం : ఫిబ్రవరి 9, 1910 న నల్గొండజిల్లా పిల్లలమర్రిలో. నిజాం ఆస్థానంలో రాజ కీయ నాయకుడు. కె. వి. రంగారెడ్డికారితో కలిసి వీరు జాగీర్ ప్రజల సంఘం స్థాపించారు. నల్గొండజిల్లా కాంగ్రెస్ అధ్యక్షులుగా ఉన్నారు. 1951 లో శివరాంపల్లెలో జరిగిన సర్వో దయ సమ్మేళనంలో పాల్గొన్న ముఖ్యుడు. చాలాకాలం భూదానబోర్డు ఉపాధ్యక్షులుగాను, మద్యపాన నిషేధసంఘం అధ్యక్షులుగాను ఉన్నారు. సర్వోదయ నాయకులు.

*కేశవరావు, జమలాపురం సర్దార్* : తెలంగాణా జాతీయోద్యమ నాయకుడు. నిరాడంబర నిస్వార్థ దేశభక్తుడు. జననం : 1908లో మధిర తాలూకా యెర్రిపాలెంలో. సత్యాగ్రహ సమరంలో పాల్గొని జైలుకెళ్ళారు. 1945 ఆంధ్ర మహాసభలో ప్రముఖపాత్ర వహించారు. హైద్రాబాదు సంస్థానంలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగా ఉన్నారు. అజాత శత్రు వుగా పేరు పొందిన వీరు 1953 మార్చి 30న హఠాత్తుగా కన్నుమూశారు.

కూచిపూడి నాట్య ప్రదర్శనలు అనే గ్రంథాన్ని వ్రాసిన వీరు కొన్ని సినిమాలకు నృత్య దర్శకత్వం వహించారు.

*గిరి, వరాహగిరి వేంకట* : ప్రపంచ విఖ్యాత కార్మికోద్యమ కార్యకర్త; భారత రత్న బిరుదాంకితుడు; మాజీరాష్ట్ర పతి. బారిష్టర్. జననం: 1894 ఆగస్టు 10 న బరంపురంలో. ఐర్లండ్ లో బారిష్టరు చదివి, మద్రాసులో కొంతకాలం న్యాయవాద వృత్తి అవలంబించారు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని జైలు కెళ్లారు. ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు, ఆల్ ఇండియా రైల్వే మెన్స్ ఫెడరేషన్‌కు అధ్యక్షులుగా ఉన్నారు. కార్మికుల ప్రతినిధిగా రెండో రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొన్నారు. రాష్ట. కేంద్ర మంత్రి వర్గాలలో కార్మిక మంత్రిగా ఉన్నారు. అంతేకాకుండా సిలోనులో ఇండియాప్రభుత్వ హైకమీషనర్, ఉత్తర ప్రదేశ్, కేరళ, మైసూరు రాష్ట్రాలకు గవర్నరు పదవులు నిర్వహించారు. 1967 మేలో భారత ఉపరాష్ట్ర పతి అయి, 1969 ఆగస్టు 24 నుంచి 1974 ఆగస్టు 23 వరకూ భారత రాష్ట్రపతిగా ఉన్నారు. ఇటీవల కాలధర్మం చెందారు.

*గోపాల కృష్ణ, ఎం. డాక్టర్* : పెట్రోలియం టెక్నాలజీ నిపుణుడు. భారత పెట్రోలియం సంస్థకు (డెహ్రాడూన్) డైరక్టర్. వీరు బొగ్గుపై విశేషపరిశోధనలు చేశారు. గృహోపకరణ యోగ్యమైన పొగలేని ఇంధనాన్ని రూపొందించారు. బొగ్గుపొడిని ఇటుకలుగా మార్చే పద్ధతిని కనుక్కొన్నారు. అస్సాం క్రూడ్ఆయిల్ నుంచి ఉత్పత్తి అవుతూన్న కిరసనాయిల్ నాణ్యతను మెరుగు పర్చారు. వీరిసేవలను ప్రభుత్వం గుర్తించి, 1973 లో "పద్మశ్రీ" బిరుదునిచ్చి గౌరవించింది.

*గోపాలకృష్ణ గోఖలే, మాధవపెద్ది* : మా. గోఖలేగా సుప్రసిద్ధి చెందిన చిత్రకారుడు, కథారచయిత. గుంటూరు జిల్లా బ్రాహ్మణ కోడూరులో 1917 మార్చి 7న జన్మించారు. కొన్ని చలన చిత్రాలకు కళాదర్శకులుగా పని చేసారు. ఆంధ్రజ్యోతి మానపత్రిక, చందమామ. అభ్యుదయ మొదలైన పత్రికలలో బొమ్మలు వేసారు. అట్టడుగు ప్రజల భాషలో, మాండలికంలో ఎన్నోకథలు వ్రాశారు. మూగజీవాలు, బల్లకట్టుపాపయ్య కథల సంపుటాలు వెలువడ్డాయి. పాశురాల జంట, బ్రహ్మన్న, మల్లమ్మదేవి మొదలైన వీరి చిత్రాలు కలకాలం జ్ఞాపక ముండేవి. ఉప్పు, వ్యక్తి సత్యాగ్రహాలలో పాల్గొన్నందుకు జైలు శిక్ష అనుభవించారు.

*గోపాల కృష్ణయ్య, దుగ్గిరాల* : కవి, పండితుడు, విమర్శకుడు, నాయకుడు, రాజకీయ వేత్త, మహావక్త. జననం 1889 జూన్ 17న కృష్ణాజిల్లా నందిగామ తాలూకా పెనుగంచి ప్రోలులో. స్కాట్లండ్‌లోని ఎడింబరో విశ్వవిద్యాలయంలో ఎం.ఎ. పట్టభద్రులు. 1920లో చీరాల-పేరాల సత్యాగ్రహం చేశారు. అప్పుడే అక్కడ ఈయనకు ఖ్యాతితెచ్చిన రామదండు శాంతి సైన్యం రూపొందింది. పన్నుల నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు.

"ఆంధ్రరత్న"గా ప్రసిద్ధులయ్యారు. 'సాధన' అనే ఆంగ్లపత్రిక స్థాపించారు. 1928 జూన్ 10 న మరణించారు. హిందూధర్మం ప్రపంచమతాల సారమని చాటిన మేధావి.

***గోపాలకృష్ణయ్య, వావిలాల :*** జననం 1906, సత్తెనపల్లిలో, వీరిదేశభక్తి, ప్రజాసేవాసక్తి నిస్వార్ధమైనవి. ఎన్నోసార్లు జైలుకువెళ్లారు-ఎన్నోఉద్యమాల్లో పాల్గొన్నారు. రాష్ట్ర రైతుజన ఉద్యమంతో, సహకారోద్యమంతో. గ్రంథాలయోద్యమంతో వీరికి సంబంధముంది. పత్రికా సంపాదకత్వం నిర్వహించారు. తరుచూ పత్రికలలో ప్రజా సమస్యలమీద వ్యాసాలు వ్రాస్తూ ఉంటారు. రాష్ట్ర శాసనసభకు సత్తెనపల్లినుంచి వరసగా నాలుగుసార్లు ఎన్నికైన స్వతంత్ర సభ్యులు. ఆంధ్రరాష్ట్రం. పరిపాలనా సంస్కరణలు, ఆంధ్రప్రదేశ్ ద్రవ్యస్థితి, విశాలాంధ్రం మొదలైన 40 రచనలు చేశారు.

***గోపాలరెడ్డి, బెజవాడ :*** కళాభిమాని, సాహిత్యవేత్త, కవి, రాజకీయ నాయకుడు. జననం 1907లో నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డిపాలెంలో. శాంతినికేతన్ పట్టభద్రులు, అనేక ఉద్యమాల్లో పాల్గొని అనేకసార్లు జైలుకి వెళ్ళారు. 1931 నుంచి అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా ఉన్నారు. 1937లో మద్రాసులో రాజగోపాలాచారి మంత్రిమండలిలో స్థానిక పరిపాలనా మంత్రిగా చేసారు. ఆర్థికమంత్రిగా 1947-52 వరకు ఉన్నారు. 1955-56 లో ఆంధ్రరాష్ట్రముఖ్యమంత్రిగా ఉన్నారు. 1958—63 వరకు కేంద్రంలో రెవెన్యూమంత్రిగా, గృహ సరఫరా మంత్రిగా. సమాచార ప్రసార శాఖలమంత్రిగా ఉన్నారు. 1967 లో ఉత్తర ప్రదేశ్ గవర్నరుగా నియమితులై అయిదేళ్ళు ఆ పదవిలో ఉన్నారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు 1950లో వీరికి ''డి.లిట్" గౌరవ పట్టాఇచ్చి గౌరవించింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమికి చాలకాలం అధ్యక్షులుగా ఉంటున్నారు. రవీంద్రుని సాహిత్యాన్ని అనువదించారు.

***గోపాలస్వామి, కె.వి :*** ఆధునికాంధ్ర నాటక ప్రయోగ విధాత, రచయిత; విమర్శకుడు ఆక్స్ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఎం. ఏ పట్టం పుచ్చుకున్నవీరు చరిత్రాధ్యాపకులుగా, న్యాయశాస్త్రాచార్యులుగా, ప్రిన్సిపాల్‌గా, రిజిస్ట్రార్‌గా పని చేసి పరిపాలనా దక్షులుగా పేరు గడించారు. నూరుకు పైగా నాటకాలకు ప్రయోక్తగా వ్యవహరించి, నాటకకళ అభివృద్ధికి ఎంతో కృషిచేశారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వీరికి గౌరవ డి.లిట్ ఇచ్చింది. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి అధ్యక్షులు.

పీలునామా మొదలైన నవలలు, తత్వవేత్తలు, చీకటికోణాలు మొదలైన గ్రంథాలు వ్రాసిన వీరు 1962 లో కాలధర్మం చెందారు.

*గోరా :* అసలుపేరు గోపరాజు రామచంద్రరావు. జననం 1902. గంజాం జిల్లా చంద్రాపురంలో. ఆంధ్రప్రదేశ్‌లో నాస్తిక ప్రచారానికి, కులమత భేద నిర్మూలనకు విశేష కృషి సల్పిన నాస్తికతత్వవ్యక్తి. 1942 లో కుటుంబసమేతంగా జాతీయోద్యమంలో పాల్గొన్నారు. 1947లో విజయవాడలో ఒకకేంద్రాన్ని స్థాపించి, తన సిద్ధాంతాలను ప్రచారం చేశారు. వర్ణాంతర వివాహాలను తమ కుటుంబ సభ్యులకు జరిపి, ఆదర్శమూర్తులయ్యారు. మరణం : 1975.

*చక్రపాణి :* అసలుపేరు ఆలూరి వెంకటసుబ్బారావు. జననం : 1908 తెనాలి అయితానగర్‌లో. ప్రఖ్యాత చలనచిత్ర దర్శకులు, నిర్మాతలు. 'చందమామ' 'యువ' పత్రికల సంస్థాపకులు, సంపాదకులు. రచన అనువాదమైనా, మౌలికమైనా సమస్థాయిలో నిర్వహించ గల సమర్థులు. శరత్ సాహిత్యాన్ని తెలుగువారికందించిన వంగభాషా కోవిదులు. సమాజం లోని అపసత్యాలూ, మారుతూన్న కాలంతోపాటు మారే విలువలూ వీరి కథావస్తువులు. కొంతకాలంపాటు ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తు సభ్యులుగా ఉన్నారు. సమకాలీన సమాజంలో ఒక సంస్థగా బ్రతికి, పత్రికా రంగానికీ, సినిమారంగానికీ సేవలు అందించిన వీరు 1975లో పరమపదించారు.

**చలం :** అసలుపేరు గుడిపాటి వెంకటచలం. స్త్రీకి జరిగే అన్యాయాన్ని, అక్రమాన్నీ, సహించలేక కలం పట్టిన సంస్కర్త; కవి; సౌందర్యోపాసకులు; నాటకకర్త; నవలా రచయిత; తత్త్వవేత్త; వ్యాసకర్త. జననం : 1894 లో మద్రాసులో. ఆధునిక తెలుగు కథా సాహిత్య సీమలో చలంగారు బ్రహ్మాండమైన ఉప్పెన. కథానికాయుగ నిర్మాతలలో ప్రముఖులు. వజ్రాయుధంలాంటి వ్యావహారికభాషా, జలపాతంలాంటిశైలీ, సానుభూతితోకూడిన మనస్తత్వ పరిశీలనా, శక్తియుత భావ ప్రకటనా-వీరి సొమ్ము. చివరిదశలో తిరువణ్ణామలై రమణాశ్రమంలో గడిపారు. కొంతకాలం ఉపాధ్యాయులుగా, మరికొంతకాలం ప్రభుత్వ విద్యాశాఖలో పనిచేశారు. స్త్రీ, దైవమిచ్చిన భార్య, అమీనా, జీతాదర్శం, హంపీకన్యలు, పురూరవ, శశాంక, మ్యూజింగ్స్, కొన్ని వందల కథలు వ్రాసిన వీరు ఈమధ్యనే కీర్తిశేషులయ్యారు.

**చలపతిరావు, ఎం. :** భారత రాజకీయ పత్రికారంగంలో విశిష్టవ్యక్తి. ప్రముఖ ఇంగ్లీషు జర్నలిస్టు. ఎం. ఏ డిగ్రీపొంది, "లా" చేశారు. పండిత జవహర్‌లాల్‌నెహ్రూ స్థాపించిన "నేషనల్‌హెరాల్డ్" లో 1938లో చేరారు. కొంతకాలంపాటు "హిందూస్తాన్‌టైమ్స్"లో పనిచేశారు. "ఆలిండియా కన్వెన్షన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్స్"ను స్థాపించి, దానికి ప్రెసిడెంటుఅయ్యారు. పత్రికా రచయితగా ఎన్నో సంఘాలకు సభ్యులుగా, అధ్యక్షులుగా ఉండి

పలుమార్లు విదేశాలను సందర్శించారు. "ఇండియన్ ప్రెస్" "గాంధీ-నెహ్రూ" మొదలైన గ్రంథాలు రచించారు.

*చి. తామణి, చిర్రావూరి యజ్ఞేశ్వరరావు* : ప్రముఖ ఆంగ్ల పాత్రికేయుడు, సంపాదకుడు, దేశభక్తుడు. జననం : 1880 విజయనగరంలో. తెలుగుసీమలో పుట్టి, ఉత్తరభారత దేశంలో కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించారు. ఇండియన్ పీపుల్, ఇండియన్ డైలీమెయిల్, లీడర్ మొదలైన పత్రికలకు సంపాదకులుగా వ్యవహరించారు. లండన్‌తో మొదటి రౌండ్‌టేబుల్ సమావేశానికి హాజరయ్యారు. 1927-36లో సంయుక్తరాష్ట్రాల శాసనమండలి సభ్యులు. 1941 లో వీరు అసువులు కోల్పోయారు.

*చినమౌలాసాహేబ్ షేక్ :* సుప్రసిద్ధ నాదస్వర విద్వాంసుడు. సాంప్రదాయ నాదస్వర వాయిద్యంలో నిష్ణాతులైన వీరు ప్రకాశంజిల్లా కరవదిలోజన్మించారు. వీరు ఆలిండియా రేడియో సంగీతసమ్మేళన కార్యక్రమాల్లో, జాతీయ సంగీత కార్యక్రమాల్లో, అనేక వార్షిక సంగీతోత్సవాల్లో పాల్గొన్నారు. బర్మా, మలేషియా, శ్రీలంక మొదలైన విదేశాల్లో పర్యటించి ఎన్నో ప్రోగ్రాములిచ్చి అంతర్జాతీయకీర్తిని గడించారు.

*చిరంజీవి, నార్ల :* ఆధునిక బాలవాఙ్మయంలో ప్రత్యేకస్థానం పొందినకవి. కథకుడు, సినీరచయిత, నాటకకర్త. జననం 1925 న కృష్ణాజిల్లా కోడూరులో. సంస్కృతాంధ్ర భాషలను అభ్యసించారు. భాగ్యనగరం, తెలుగుపూలు, గేయకథలు, కీలుబొమ్మ, గోరంతదీపం మొదలైన రచనలు చేసిన వీరు 1971 అక్టోబరులో కీర్తిశేషులయ్యారు.

*చెంచయ్య, దర్శి :* జననం 1890 లో కనిగిరిలో. గదర్‌పార్టీ విప్లవకారుల్లో ఒకరు. 1920 లో కాంగ్రెస్‌పార్టీలోచేరి 1935 వరకు ఉన్నారు. 'స్వరాజ్య' పత్రికకు ఆర్థికసహాయం చేశారు. కార్మికసంఘాలకు అధ్యక్షులుగా పనిచేశారు. అనేక స్వాతంత్ర్యోద్యమాల్లో పాల్గొని జైళ్లకెళ్ళారు. వీరికి 'మార్షల్‌చెక్' బిరుదు లభించింది. వీరు గత కొన్నిసంవత్సరాల క్రితం చనిపోయారు.

*చెన్నారెడ్డి మర్రి, డాక్టర్ :* స్వాతంత్ర్యోద్యమ వీరుడు, కాకలుతీరిన కార్యసాధకుడు. శస్త్రాన్ని అస్త్రంగా ప్రయోగించిన పజ్ఞాశాలి,స్వయంనిర్మితవ్యక్తి, పట్టువిడవని విక్రమార్కుడు. సమష్టి మనిషి. జననం : 1919 జనవరి, రంగారెడ్డిజిల్లా సిరిపురంలో. 1941లో వైద్య

భక్తి మెండు. ఆవేశాన్ని మించిన ఆలోచనగలవారు. తన ఆలోచనలను ఆచరణలో పెట్టే ధైర్యశాలి.

*జగన్మోహనరెడ్డి, పింగళి* : న్యాయమూర్తి; పరిపాలనాదక్షులు, విద్యావేత్త. జననం ; 1910 జనవరి 23. బారిస్టరు. కొంతకాలం న్యాయవాదిగా ఉండి, 1948 నుంచి హైదరాబాదు హైకోర్టు జడ్జి అయ్యారు. 1966 నుంచి ప్రధాన న్యాయమూర్తి. 1969-75 వరకు సుప్రీం కోర్టు జడ్జిగా పనిచేశారు. 1975-77లో ఉస్మానియా యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్‌గా ఉన్నారు. కొన్ని కమీషన్‌లకు ఛైర్మన్‌గా ఉన్నారు.

*జాషువ, గుర్రం* : కవికోకిల, కవితావిశారద, కవిదిగ్గజ, నవయుగ కవిచక్రవర్తి మొదలైన బిరుదులుగల వీరు 1895 అక్టోబర్ 28న గుంటూరుజిల్లా వినుకొండలో జన్మించారు. ప్రాథమికోపాధ్యాయునిగా ప్రారంభించి, కావ్యజగత్తులో స్థిరపడ్డారు. కొంత కాలం ఆకాశవాణిలో ప్రొడ్యూసరుగా ఉన్నారు. వీరు అనేక ఖండకావ్యాలు, నాటకాలు వ్రాశారు. ఫిరదౌసి, గబ్బిలం, స్వప్నకథ, స్వయంవరం, కాందిశీకుడు, ముంతాజ్‌మహల్, మొదలైనవి వ్రాశారు. గండపెండేరం ధరించి, కనకాభిషేకాలు పొంది, గజారోహణం చేసి, పగటి దివిటీల పల్లకిలో ఊరేగి, అశేషప్రజానీకంచేత వెయ్యికిపైగా సన్మానాలు పొందారు. ఆంధ్ర ప్రదేశ్ శాసనమండలి సభ్యులు. కళాప్రపూర్ణ, పద్మభూషణ్ బిరుదులతో సత్కరింపబడ్డ వీరు 1971 జులై 24న కీర్తిశేషులయ్యారు.

*జ్వాలాపతి లింగశాస్త్రి, ముదిగొండ* : అవధాన శిరోమణి; సంస్కృతాంధ్రపండితుడు త్రివిధజ్యోతిశ్శాస్త్రజ్ఞుడు; సంఘసంస్కరణకర్త; దేశభక్తుడు. జననం: 1902 లో తెనాలి తాలూకా ఈమనిలో. వేదాధ్యయనం, సంస్కృత కావ్యనాటకాలఅధ్యయనం, వ్యాకరణ శైవాగమ శాస్త్రాధ్యయనం, ముహూర్త జాతక సిద్ధాంతాధ్యయనం చేసిన వీరు దాదాపు నూరు సంస్కృతాంధ్ర గ్రంథాలు రచించారు. ఆంధ్రభాషామర్యాదలను ధైర్యంగా గీర్వాణకవితలో ప్రవేశపెట్టిన వీరికి కవిభూషణ, కవితాప్రవీణ, ఉభయకవితా సమ్రాట్ బిరుదులతో సన్మానించడం జరిగింది. గండపెండేరాలు, సువర్ణపతకాలు పొందారు.

*జిలానీ, ఘులాం* : కాంస్యవిగ్రహాల పోతలో నిష్ణాతుడు. అంతర్జాతీయ ఖ్యాతిపొందిన చిత్రశిల్పి. జననం : 1919లో హైదరాబాదులో. నేషనల్ డిప్లొమా ఆఫ్ డిజైన్స్ అండ్ స్కల్ప్చర్ పొంది పెక్కు విదేశాలు పర్యటించి, లలితకళల్లో అత్యున్నత శిక్షణ పొందారు. హైదరాబాద్‌లోని కాలేజీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్‌లో శిల్పశాఖాధ్యక్షులుగా పనిచేశారు. ఎన్నో శిల్పాలను, కాంస్య విగ్రహాలను తయారుచేసి కళాకారుల మన్ననలు పొందారు.

*జోగి సోమయాజులు, గంటి* : భాషాతత్వవేత్త, బహుభాషా పండితుడు. జననం : 1900 లో అనకాపల్లిలో. 1933-53ల మధ్య ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో లెక్చరర్‌గా,

రీడర్‌గా, ప్రొఫెసర్‌గా తెలుగుశాఖకు ఉన్నారు. కమీషన్ ఫర్ సైంటిఫిక్ అండ్ టెక్నికల్ టర్మినాలజీకి చైర్మన్‌గా పనిచేశారు. సంస్కృతం, ఇంగ్లీషు, తమిళం, కన్నడం, హిందీ భాషలలో మంచి పరిచయముంది. ముఖ్యరచనలు : ద్రావిడభాషలు–వాని స్వభావం, ఆంధ్ర భాషావికాసం.

*జోసెఫ్ గుమ్మడి, డాక్టరు :* ప్రముఖ వైద్యశాస్త్రజ్ఞుడు. మానవశరీర ధర్మశాస్త్రంలో ప్రఖ్యాతిగాంచిన ప్రొఫెసరు. ఆంధ్రవిశ్వవిద్యాలయం నుంచి ఎం.డి. పి.హెచ్.డి. డిగ్రీలు తీసుకున్నారు. న్యూరో ఎండోక్రినాలజీ, కార్డియోవస్క్యులర్ ఫిజియాలజీలో ఉన్నతస్థాయి పరిశోధనలు జరిపారు. నేషనల్ అకాడమి ఆఫ్ మెడికల్ సైన్స్‌లో సభ్యులు. ఇటీవలే వీరిని ఆంధ్రప్రదేశ్ పబ్లిక్‌సర్వీస్ కమిషన్ సభ్యులుగా ప్రభుత్వం నియమించింది.

**తాతారావు, నార్ల :** సుప్రసిద్ధ విద్యుత్తు ఇంజనీరు, సాంకేతిక నిపుణుడు. జననం 1917 లో కృష్ణాజిల్లా కౌతారంలో. చికాగోలోని ఇల్లినాయిస్ సాంకేతికసంస్థ నుంచి ఇంజనీరింగ్‌లో పోస్ట్‌గ్రాడ్యుయేట్ డిగ్రీని పొందారు. ఐదు సంవత్సరాలపాటు ప్రభుత్వ విద్యుచ్ఛక్తి బోర్డులో డివిజనల్ ఇంజనీరుగా పనిచేశారు. మధ్యప్రదేశ్ విద్యుచ్ఛక్తి బోర్డులో 1958-72 సం॥మధ్య వివిధ ఉన్నతపదవులను నిర్వహించారు. విద్యుచ్ఛక్తి ఇంజనీరింగులో ప్రత్యేక ప్రావీణ్యం గడించిన వీరు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తిబోర్డుకు చైర్మన్‌గా ఉంటున్నారు.

*తిరుపతి వేంకట కవులు :* వీరిద్దరూ తెలుగు కవిత్వాన్ని పునరుజ్జీవింపజేసి, అష్టావధాన, శతావధాన కవితా ప్రక్రియలను మళ్ళీ వెలుగులోకి తెచ్చారు. అసలు పేర్లు దివాకర్ల తిరుపతి శాస్త్రి - జననం : పశ్చిమగోదావరిజిల్లా భీమవరం తాలూకా ఎండగండిలో 1872 లో. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి - జననం : తూర్పుగోదావరి జిల్లా కడియంలో 1870లో. వీరిద్దరూ సహాధ్యాయులు. ఆంధ్రదేశమంతటా కవితా చైతన్యం కలిగించిన జంటకవులు. వీరు శతాధిక గ్రంథకర్తలు. ఉభయభాషా ప్రవీణులు. శ్రవణానందం, దేవీభాగవతం, బుద్ధచరిత్ర, శ్రీనివాసవిలాసం, పాండవోద్యోగం, పాండవవిజయం మొదలైనవి వీరు రచించిన గ్రంథాలలోకొన్ని. 1900 నుంచి తిరుపతి శాస్త్రిగారు ఒక జమీందారీ ఆస్థాన పండితులుగా ఉండి, 1920లో మరణించారు. వేంకటశాస్త్రిగారు బందరులో తెలుగు పండితులుగా ఉండి, 1938లో 'కళాప్రపూర్ణ' పొంది, 1949లో మద్రాసులో ఆస్థాన కవులైనారు. 1950 లో వేంకటశాస్త్రి గారు మరణించారు.

*దాసు, బి. ఆర్.* : మానవతావాది, సాంకేతిక విద్యాబోధనలో, సాధనలో, అభివృద్ధిలో ప్రణాళికా కల్పనలో అసమాన ప్రజ్ఞగలవాడు. జననం : 1919లో, నెల్లూరుజిల్లా వెంకటగిరిలో. చదువుకొనే రోజుల్లోనే వీరు జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. గిండీ ఇంజనీరింగ్ కాలేజీలో బి. ఇ. డిగ్రీతీసుకొని, ప్రభుత్వ సర్వీసులో జేరి, సాంకేతిక విద్యాశాఖకు ఎనిమిదేళ్లపాటు డైరక్టరుగా ఉన్నారు. హైదరాబాదులో జవహర్‌లాల్‌నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయానికి రూపకల్పనచేసి, దానికి వైస్—ఛాన్సలర్ పదవిని నిర్వహించారు. సంగీతం, లలితకళలు, సాంస్కృతిక విద్యల అభివృద్ధికి ఎంతో కృషిచేశారు. సాంకేతిక విద్యపరంగా పెక్కు విదేశాలను సందర్శించారు. 1979 లో ఘనంగా, గౌరవంగా షష్ఠి పూర్తి చేసుకొన్న రామేశ్వరదాసుగారు, ఇప్పటికీ దక్షిణాది రాష్ట్రాలలో పెక్కు ఇంజనీరింగ్ విద్య కమిటీలలో సభ్యులుగా,అధ్యక్షులుగా ఉండి, సాంకేతిక విద్యాభివృద్ధే తనజీవితధ్యేయంగా పాటుబడుతున్నారు.

*దీక్షితులు, చింతా* : కథకులలో ఆదిగురువులుగా అంగీకరింపబడిన వారు. చిన్నకథకు రూపురేఖలుదిద్ది, పెక్కు పోకడలుపోయి, తెలుగు సాహిత్యంలో ఈ ప్రక్రియకు విశిష్టమైన ప్రాముఖ్యాన్ని కల్పించారు. వీరు 1891 లో తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా దంగేరులో జన్మించారు. డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ ఉద్యోగం చేశారు. మిసెస్ వటేరావు కథలు, ఏకాదశి, శర్మిష్ఠ, లక్కపిడతలు మొదలైన గ్రంథాలనువ్రాశారు. 1960లో పరమపదించారు.

*దుర్గాబాయ్ దేశ్‌ముఖ్* : మహిళాభ్యుదయానికి పాటుబడిన ప్రముఖ సంఘసేవిక, జాతీయవాది. జననం : 1909 జూలై 15వ తేదీన. ఉప్పుసత్యాగ్రహంలోనూ, 1942 ఉద్యమంలోను పాల్గొని కొంతకాలం సుప్రీంకోర్టులో న్యాయవాదిగా ఉన్నారు. 1947—52లో రాజ్యాంగసభ సభ్యులు. 1952—62 మధ్య కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు అధ్యక్షురాలు. ఎన్నో కమిటీలలో, సంస్థలలో సభ్యురాలు. ఆంధ్ర మహిళాసభను స్థాపించి మహిళా పురోగతికి గర్వించదగిన కృషి చేశారు. ఈసభ తరపున స్త్రీలకు కళాశాల, వైద్యశాలలు నిర్మింపజేశారు. అక్షరాస్యత నిర్మూలనకు అవిరళకృషిచేశారు. 1968 లో ఈమెకు ఆంధ్ర విశ్వకళాపరిషత్తు గౌరవ డాక్టరేట్ ఇచ్చింది. వీరు శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూ అక్షరాస్యత బహుమతి గ్రహీత.

*ధర్మారావు, తాపీ* : పరిశోధకుడు, రచయిత, సినీకవి, వ్యాఖ్యాత, పత్రికా సంపాదకుడు. జననం : గంజాంజిల్లా బరంపురంలో 1887లో. కొంతకాలం అధ్యాపకవృత్తి స్వీకరించి, 1936 లో సినిమారంగంలో ప్రవేశించి, చాలా సినిమాలకు పాటలు, మాటలు వ్రాశారు. ఇంటింటా విజ్ఞాన జ్యోతుల ఉద్యమకారులలో ఒకరు. కొత్తపాళి, ఉషఃకాలం, విలాసార్జునీయం,

పెళ్ళి-దానిపుట్టుపూర్వోత్తరాలు,దేవాలయాలమీద బూతు బొమ్మలెందుకు మొదలైన గ్రంథాలెన్నో వ్రాశారు. గత కొద్ది సంవత్సరాల క్రితం మరణించారు.

*నరసింహశాస్త్రి, నోరి* : కవి, విమర్శకుడు, చారిత్రక నవలా రచయిత. జననం: 1900 లో గుంటూరులో. బి. ఏ. బి. ఎల్. చదివి కొంతకాలం ఉపాధ్యాయులుగా ఉండి, ఆ తర్వాత న్యాయవాదవృత్తి చేపట్టారు. రుద్రమదేవి, నారాయణభట్టు మొదలైన చారిత్రక నవలలు, దేవీభాగవతం అనువాదం, కొన్ని ఏకాంకికలు, కథలు, వ్యాసాలు, ఖండకావ్యాలు వ్రాశారు. వీరు రెండుమూడు సంవత్సరాలక్రితం స్వర్గస్థులైనారు.

*నరసింహశాస్త్రి, మొక్కపాటి* : కథకులు, నవలాకారులు, నాటకకర్త, వ్యాసరచయిత హాస్యరచనలో అందెవేసిన చేయి. పువ్వుకు తావి సహజంగా అబ్బినట్లు, వీరి రచనలో హాస్యం సహజంగా దొర్లుతుంది. సంఘటనా ప్రధానమైన ఉత్తమ హాస్యాన్ని సృష్టించడం వీరి ప్రత్యేకత. జననం: 1892 అక్టోబరు 9న, తూర్పుగోదావరిజిల్లా గంగ్రేడులో. రచనలు: బారిస్టరు పార్వతీశం, ఏకోదరులు మొదలైన నవలలు, ప్రతిబింబాలు, విన్నవి-కన్నవి కథా సంపుటాలు, మ్రొక్కుబడ నాటికలు మొదలైనవి.

*నరసింహారావు, కోరాడ* : జననం: 1936 జూన్ 4న, ఏలూరులో. ఆధునిక పద్ధతిలో కూచిపూడి నాట్యకళను విస్తృతంగా ప్రచారంచేస్తున్న కళాకారులు, నాట్యాచార్యులు. 1957 లో ఢిల్లీలో జరిగిన అఖిలభారత నాట్యమండలి సభలో కూచిపూడి నృత్యం ప్రదర్శించి ప్రథమ బహుమతిని పొందారు. 1965లో వీరు కూచిపూడి నాట్యంలో రాష్ట్రపతి అవార్డు పొందారు. విదేశ పర్యటనలు చేశారు.

*నరసింహారావు, పి. వి* : రాజకీయవేత్త, బహుభాషా పండితుడు, మేధావి, ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి, వక్త, గ్రంథకర్త. జననం: 1921 లో కరీంనగర్‌లో. బి. ఎస్‌సి., ఎల్.ఎల్.బి.చదివారు. వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నారు. కాంగ్రెస్ సంస్థలో అనేక పదవులను నిర్వహించారు. తెలుగు అకాడమి, దక్షిణభారత హిందీప్రచారసభ మొదలైన సంస్థల అభివృద్ధికి కృషిచేశారు. ఆంధ్రప్రదేశ్ మంత్రి వర్గంలో న్యాయశాఖకు, ఆరోగ్య శాఖకు, విద్యాశాఖకు వివిధ సంవత్సరాలలో మంత్రిగా ఉన్నారు. 1971-73 మధ్య ముఖ్య మంత్రిగా వ్యవహరించారు. ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వంలో విదేశ వ్యవహారాల మంత్రి. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి నవలను వీరు హిందీలోకి అనువదించారు. కొన్ని మరాఠీ గ్రంథాలను వీరు తెలుగులోకి అనువదించారు. విదేశాలు పర్యటించి వైజ్ఞానికోపన్యాసాలు ఇచ్చారు.

*నరసింహారావు, మునిమాణిక్యం* : జననం: 1898లో. మధ్యతరగతి తెలుగుఇల్లాలు "కాంతం" నాయికగా అనేక కథలు వ్రాసి తెలుగు సాహిత్యంలో సజీవపాత్రను సృష్టించారు

సాంసారిక జీవితంలోని రమణీయఘట్టాలను మనోహరంగా చిత్రించారు. బి. ఏ., ఎల్. టి డిగ్రీని పొందిన వీరు ఉపాధ్యాయవృత్తిని స్వీకరించారు. రచనలు: కాంతం, కాంతం—కైఫీయత్, కాంతం కాపురం మొదలైన 24 కథల సంపుటాలు, రుక్కుతిల్లి, శరద్రాత్రులు మొదలైన నవలలు వ్రాశారు. కొద్ది సంవత్సరాల క్రితం పరమపదించారు

*నరసింహారావు, స్థానం* : స్త్రీల పాత్రలను స్త్రీలకంటెమిన్నగా నటించగల మహానటుడు, రంగస్థల నటులలో పద్మశ్రీ బిరుదు పొందిన గణనీయుడు. జననం : 1902 సెప్టెంబర్ 23 న గుంటూరుజిల్లా బాపట్లలో. స్త్రీ పాత్రపోషణలో సహజత్వాన్ని ప్రదర్శించి, తన నటనా కౌశలంతో తెలుగు నాటక రంగంలో సుమారు నాలుగు దశాబ్దాలు వెలుగొందిన గణనీయులు. అనేక పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలు రాష్ట్రేతర ప్రాంతాలలో సైతం వేసి, అశేష కీర్తినార్జించారు. 1956లో హైదరాబాదు ఆకాశవాణిలో నాటక ప్రయోక్త. వీరికి నటశేఖర ఆంధ్ర గంధర్వ, నటకావతంస బిరుదులున్నాయి. ముఖ్యంగా మధురవాణి, సత్యభామ చిత్రాంగి, రోషనార పాత్రల పోషణలో వీరు చిరస్మరణీయులు. ఆంధ్ర విశ్వవిద్యాలయం "కళాప్రపూర్ణ" బిరుదునిచ్చి గౌరవించింది.

*నాగభూషణం, సి.* : నాటక కళాప్రపూర్ణ బిరుదాంకితుడు, సుప్రసిద్ధ సినిమానటుడు జననం : 1922 మార్చి22న ప్రకాశంజిల్లా అనకర్లపూడి గ్రామంలో. కొంతకాలం రైల్వేలో పనిచేశారు. సినిమారంగంలో ప్రవేశించిన కొద్ది కాలానికే అగ్రశ్రేణి నటవర్గంలోకి చేరారు. 1956లో రవి ఆర్ట్ థియేటర్స్ స్థాపించి 'రక్తకన్నీరు' అనే నాటకాన్ని చేపట్టి దేశమంతటా దాదాపు 2,500 సార్లకుపైగా ప్రదర్శించారు. దాదాపు 200 చలన చిత్రాలలో నటించారు. ప్రజానాట్య మండలి అధ్యక్షులు. ఇంకా సినిమాల్లో నటిస్తున్నారు.

*నాగయ్య, చిత్తూరు, వి.* : నటుడు, గాయకుడు, సంగీత దర్శకుడు, సినీ నిర్మాత. జననం : గుంటూరుజిల్లా రేపల్లెలో. చంద్రగిరిలో విద్యాభ్యాసం, సంగీతాభ్యాసం. హార్మోనిస్టుగా, గాయకుడుగా, నటుడుగా, కళారంగంలో ప్రవేశించి, చిత్తూరు రామ విలాససభలో నాటకాలకు సంగీతదర్శకుడుగా, గాయకుడుగా, పాత్రధారిగా ఉన్నారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. బెంగుళూరులో హిజ్ మాస్టర్స్ వాయిస్‌లో కొంతకాలం సంగీత దర్శకులు. మొట్ట మొదట వాహినీ సంస్థద్వారా చలన చిత్ర రంగంలో ప్రవేశించి వేమన, పోతన వంటి చిరస్మరణీయమైన పాత్రలు ధరించారు. రేణుకా ఫిలిమ్స్ అనే సంస్థను స్థాపించి కొన్ని చిత్రాలు నిర్మించి, దర్శకత్వం వహించడమేకాక, నటించి కీర్తిని ఆర్జించారు. మైసూరు తిరువాన్కూరు మహారాజుల దర్బారులలో ఘంటా కంకణాలతో సన్మానాలు పొందారు. తెలుగు, తమిళ, కన్నడ మొదలైన భాషలలో సుమారు 200 చిత్రాలు నటించారు. ప్రభుత్వం ఈయనకు పద్మశ్రీనిచ్చి గౌరవించింది. 1973లో స్వర్గస్థులయ్యారు.

*నాగిరెడ్డి, బి.* : ప్రముఖ చలనచిత్ర నిర్మాత; పత్రికా వ్యవస్థాపకుడు, ముద్రణాధిపతి, పారిశ్రామికవేత్త. జననం : 1912 డిశంబరు 2. 1948లో వాహిని ప్రొడక్షన్ మేనే

క్టింగ్ డైరక్టరు. విజయా సంస్థ పేరిట చక్రపాణిగారితో కలిసి షావుకారు, పాతాళభైరవి, పెళ్ళిచేసిచూడు, మిస్సమ్మ, మాయాబజార్, గుండమ్మకథ మొదలైన చిత్రాలు నిర్మించారు. హిందీ తమిళంలోకూడా చిత్రాలు నిర్మించారు. ఆసియాలోకెల్లా పెద్దదైన విజయా స్టూడియోకి అధిపతి. చందమామ, విజయచిత్ర, వనిత వంటి వివిధరకాల మాసపత్రికలు వివిధభాషలలో ప్రచురిస్తున్నారు. తిరుపతి దేవస్థానం బోర్డుకు కొంతకాలం సభ్యులుగాఉండి, ఇటీవల చైర్మన్ అయ్యారు

*నాగేశ్వరరావు, అక్కినేని* : నటసామ్రాట్ బిరుదాంకితుడు; ప్రముఖ చలన చిత్ర నిర్మాత, పారిశ్రామిక వేత్త. జననం : సెప్టెంబర్ 20, 1924లో కృష్ణాజిల్లా రామవ పురంలో. 1944లో సినిమారంగంలో శ్రీసీతారామ జననంలో రాముని పాత్రతో ప్రవేశిం చారు. కొన్ని వందల చిత్రాలలో నటించారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు రూ. 25,000 విరాళమిచ్చి యావజ్జీవ సెనేట్ సభ్యులయ్యారు. వీరు తెలుగు చిత్ర పరిశ్రమను మద్రాసు నుంచి హైదరాబాదుకు తరలించేందుకు కృషి చేసిన వారిలో ప్రముఖులు. "అన్నపూర్ణ" సంస్థ పేరిట చిత్రాలు నిర్మించడమేకాక, స్టూడియోను, కొన్ని పరిశ్రమలను నెలకొల్పారు. 1968 లో వీరికి "పద్మశ్రీ" బిరుదునిచ్చి ప్రభుత్వం గౌరవించింది. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు "కళాప్రపూర్ణ"నిచ్చింది. తెలుగు చలనచిత్ర పరిశ్రమాభి వృద్ధికి విశేషంగా కృషి చేసిన వారిలో ఒకరు.

*నాగేశ్వరరావు, కాశీనాధుని* : దేశోద్ధారకునిగా, విశ్వదాతగా వినుతికెక్కిన సంస్కృ తాంధ్ర పండితుడు, స్వాతంత్ర్యయోధుడు, పత్రికా సంపాదకుడు, వ్యాపారవేత్త. జననం : 1876 మే 1, కృష్ణాజిల్లా ఎలమర్రులో. 1898 లో 'అమృతాంజనం' తయారుచేసి లక్షలార్జిం చారు. స్వాతంత్ర్యసమరంలో పత్రిక ప్రాముఖ్యాన్ని గుర్తించి, 1908 లో "ఆంధ్రపత్రిక" స్థాపించి, తెలుగు భాషావికాసానికి, దేశభక్తి ప్రబోధానికి ఇతోధికంగా తోడ్పడ్డారు. 1924లో 'భారతి' అనే మేలైన సాహిత్య పత్రికను ప్రారంభించారు. ఆంధ్రాభిమానాన్ని, జాతీయాభి మానాన్ని, దేశభక్తిని పురికొల్పడంలో, తెలుగుభాషా సాహిత్యవ్యాప్తిని పెంపొందించడంలో వీరు నిర్వహించిన పాత్ర చిరస్మరణీయమైంది. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారు 'కళాప్రపూర్ణ' బిరుదునిచ్చి సన్మానించారు. విజయవాడలోని 'దుర్గాకళామందిరం' వీరి కళాభిమానానికి నిద ర్శనం. ఆంధ్రదేశంలో జరిగిన అనేక ఉద్యమాల్లో పాల్గొని, జైలుకుకూడా వెళ్ళారు. 1938 ఏప్రిల్ 11న వీరు కీర్తిశేషులయ్యారు.

*నాయుడమ్మ, యలవర్తి* : చర్మపరిశోధనలో అంతర్జాతీయ ఖ్యాతి గడించిన వీరు 1922లో తెనాలితాలూకా యలవర్రులో జన్మించారు. ఇంగ్లండ్, అమెరికాలలో ఎం. ఎస్‌సి., పిహెచ్.డి. డిగ్రీలు సంపాదించారు. ఆ తరవాత అమెరికాలోనే చర్మం శుభ్రంచేసే పరి శ్రమలో పనిచేశారు. భారతదేశానికి 1952లో వచ్చి మద్రాసులో కేంద్రచర్మపరిశోధనాసంస్థలో చేరి 1956 లో ఆ సంస్థకు డైరెక్టర్ అయ్యారు. చర్మసాంకేతిక శాస్త్రంపై అనేక గ్రంథాలు

రచించారు. 1971 లో భారతప్రభుత్వం పద్మశ్రీ ఇచ్చి గౌరవించింది. కొంతకాలం సి.యస్.ఐ.ఆర్ కు డైరెక్టర్ జనరల్‌గా ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సలహాదారుగా ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ సైన్స్ అకాడమీకి అధ్యక్షులు.

**నాయుడు, సి. కె. :** ప్రముఖ క్రికెట్ క్రీడాకారుడు. జననం : 1895 అక్టోబర్ 31న మచిలీపట్నంలో. పూర్తి పేరు కొటారి కనకయ్య నాయుడు. రెండు అనధికార టెస్టులతో సహా మొత్తం తొమ్మిది టెస్టు మ్యాచ్‌లలో మాత్రమే ఆడినా, భారత క్రికెట్ చరిత్రలో చిర స్మరణీయులు. 1927 లో యం. సి. సి. జట్టుతో బొంబాయిలో టెస్టుమ్యాచ్ ఆడినప్పుడు 11 సిక్సర్‌లు, 13 బౌండరీలతో 133 పరుగులుచేసి ప్రశంసలు పొందారు. 1932 లో భారతదేశపు జట్టు మొదటిసారి ఇంగ్లండ్ పర్యటించి ఆడిన టెస్టు మ్యాచ్‌కి వీరు నాయకులు. వీరు ఆపర్యటనలో 1618 పరుగులు చేశారు. 1936 ఇంగ్లండు పర్యటనలో కూడా పాల్గొన్నారు. 1953-54లో మొదటి ఆంధ్ర జట్టుకు రంజీట్రాఫీకి నాయకత్వంవహించారు. 1963లో భారత ప్రభుత్వం వీరికి "పద్మభూషణ్" బిరుదిచ్చి సత్కరించింది. 1967లో మరణించారు.

**నారాయణదాసు, ఆదిభట్ల :** హరికథా పితామహుడు, వాగ్గేయకారుడు, సంగీతజ్ఞుడు, సంస్కృతాంధ్ర పారసీక భాషలలో పండితుడు, అచ్చ తెలుగు హరికథా కావ్య రచనలో సిద్ధహస్తుడు. జననం : 1864 ఆగస్టు 31 న, శ్రీకాకుళంజిల్లా అజ్జాడలో. వీణా వాయిద్యంలోనూ, గాత్ర గీతంలోనూ దిట్ట. హరికథలు చెప్పడంలో వీరికి వీరేసాటి. విజయనగరం సంగీత కళాశాలలో 1919 నుంచి 1936 వరకు ప్రధానాచార్యులుగా పనిచేశారు. వీరి గ్రంథాలలో యథార్థరామాయణం, గజేంద్రమోక్షం, ప్రహ్లాదచరిత్ర, భీష్మచరిత్ర, జానకి శపథం మొదలైనవి ముఖ్యమైనవి. వీరు 1945 జనవరి 3న దేహయాత్ర చాలించారు.

**నారాయణరావు, కాళోజీ :** ప్రఖ్యాతకవి, స్వాతంత్ర్యయోధులు, వక్త. జననం : 1914లో వరంగల్ దగ్గర మదికొండలో. పెక్కు స్వాతంత్రోద్యమాలలో పాల్గొని అనేక సార్లు కారాగార శిక్ష అనుభవించారు. వీరికి బహుభాషలలో పరిచయముంది. కలంబలంమీద విశ్వాసమున్న వీరు నాగొడవ, జీవనగీత మొదలైన వచన కవితాగ్రంథాలను వ్రాసారు, మరాఠీ నుంచి కూడా కొన్ని పుస్తకాలను తెలుగులోకి అనువాదం చేశారు.

**నారాయణరావు, కోదాటి :** గ్రంథాలయోద్యమ నిర్మాత, గాంధీమార్గగామి, న్యాయవాది, వక్త, సర్వోదయకార్యకర్త. తెలంగాణాలో గ్రంథాలయోద్యమానికి విశేషంగా కృషిచేసి అనేక గ్రంథాలయాలకు కారకులయ్యారు. గాంధీజీ నిర్వచనాలను అమలులో పెట్టడానికి కృషిచేశారు.

**నారాయణరావు, చిలుకూరి :** కవి, పండితుడు, విమర్శకుడు, పరిశోధకుడు. జననం: 1980, విశాఖజిల్లా అనంతపురంలో. వివిధ సారస్వత సంస్థలను స్థాపించి, సారస్వత

సభలలో పాల్గొని తెలుగు భాషా వికాసానికి ఎంతో సేవచేశారు కాశీవిద్యాపీఠం నుంచి 'మహోపాధ్యాయ' బిరుదును పొందారు. సిద్ధాంతకౌముది, తర్కసంగ్రహం, ఆంధ్రభాషా చరిత్ర, ఆంధ్రవాఙ్మయచరిత్ర, సంస్కృత నిఘంటువు మొదలైన గ్రంథాలు వ్రాసిన వీరు 1945 లో మరణించారు.

*నారాయణరెడ్డి, రావి :* కమ్యూనిస్టుపార్టీ నాయకుడు, అకళంక దేశభక్తుడు. జూన్ 4 1908న నల్గొండజిల్లా బోచంపాడు గ్రామంలో. విద్యార్థిదశలోనే ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. నిజాం రాష్ట్ర కాంగ్రెస్ నిర్మాతలలో ఒకరు. ఆంధ్రమహాసభకు 1941-44లలో అధ్యక్షులుగా ఉన్నారు. 1939 నుంచి కమ్యూనిస్టుపార్టీలో చేరి నాయకులైనారు. తెలంగాణా సాయుధపోరాటానికి నాయకుడుగా ఉన్నారు. 1952 లో పార్లమెంటుకు అత్యధిక మెజారిటీ వోట్లతో ఎన్నికయ్యారు. 1957 లో రాష్ట్రశాసనసభకు ఎన్నికయ్యారు

*నారాయణరెడ్డి, సి. డాక్టర్ :* జనరంజక కవి. తెలుగునాడు నలుమూలలా నిత్యమూ ప్రజలకు వినిపించే పేరు ప్రఖ్యాతులుగల సుప్రసిద్ధ సినిపాటలరచయిత, సభను సమ్మోహన పర్చే వక్త. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్. జననం : 1931 లో కరీంనగర్ జిల్లా హనుమాజీపేటలో. పందలలో వచనకవితలు, వేయికిపైగా సినిమాపాటలు, కొన్ని సంగీత రూపకాలు వ్రాసిన వీరు 'ఆధునికాంధ్ర కవిత్వం' అనే ప్రామాణిక గ్రంథం రచించారు. వీరి కవితలు ఎన్నో సంకలనాలుగా వెలువడ్డాయి. స్వార్జితమైన డాక్టరేట్ కాకుండా, పద్మశ్రీ, డి.లిట్, కళాప్రపూర్ణ మొదలైన బిరుదులు గౌరవంగా లభించాయి. పలు అకాడమీలలో సభ్యులు. విదేశపర్యటన చేశారు. సి.నా.రె. గా అందరికీ తెలిసిన వీరు వచనరచనలో కూడా సొంతబాణీని ఏర్పర్చుకొన్న ప్రవీణులు.

*నారాయణాచార్యులు, పుట్టపర్తి :* కవి, పండితుడు, విమర్శకుడు, బహుభాషా సంపన్నుడు. జననం : 1915 లో. ప్రొద్దుటూరు, అనంతపురం కళాశాలల్లో కొంతకాలం అధ్యాపకవృత్తి నిర్వహించారు. వీరి రచనలలో ప్రముఖమైనవి- సాక్షాత్కారం, పెనుగొండ లక్ష్మి, గాండీవాలా మొదలైనవి.

*పట్టాభిరామారావు, ఎస్.బి.పి. :* విద్యావేత్త, పారిశ్రామికవేత్త.జననం 1911 డిసెంబరు 30. 1941 నాటికి బి.ఎ.,బి.ఎల్ పూర్తిచేశారు. 1952 లో రాష్ట్రశాసనసభకు ఎన్నికై 1953 అక్టోబరు వరకు మద్రాసు రాష్ట్రప్రభుత్వ గ్రామసంక్షేమ, వాణిజ్యపన్నుల శాఖ మంత్రిగా పనిచేశారు. ఆంధ్రరాష్ట్రంలోనూ, ఆంధ్రప్రదేశ్ లోనూ విద్యామంత్రిగా పనిచేశారు. 1971 నుంచి లోక్‌సభ సభ్యులు. 1972 నుంచి 1974 వరకు భారత షిప్పింగ్‌బోర్డుచైర్మన్. సర్వరాయ టెక్స్‌టైల్స్ మొదలైనపరిశ్రమలుస్థాపించారు. 1962 వీరికి ఆంధ్రాయూనివర్సిటీ డాక్టర్ ఆఫ్ లెటర్స్‌ను, శ్రీవేంకటేశ్వర యూనివర్సిటీ డాక్టర్ ఆఫ్ లాస్‌ను ఇచ్చి సత్కరించాయి ప్రస్తుతం లోక్‌సభ సభ్యులుగా ఉంటూ పబ్లిక్ అండర్‌టేకింగ్స్ కమిటీ చైర్మన్‌గా ఉన్నారు.

*పట్టాభి సీతారామయ్య, భోగరాజు, డాక్టర్ :* మేధావి, రాజకీయ చతురుడు, పత్రికా సంపాదకుడు. స్వాతంత్ర్య ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన వీరు పశ్చిమ గోదావరి జిల్లా గుండుగొలనులో 1880 నవంబరు 24 న జన్మించారు. వైద్యశాస్త్రంలో పట్టభద్రులై, కొంతకాలం వైద్యవృత్తి స్వీకరించారు. 'జన్మభూమి' వంటి పత్రికలకు సంపాదకత్వం నిర్వహించి సహకార బ్యాంకింగ్, వాణిజ్యరంగాలలో ఆసక్తి ప్రదర్శించి, జాతీయోద్యమంలో అగ్రగామిగా ఉంటూ ఎన్నో ఉద్యమాలలో పాల్గొంటూ, 1937-39 మధ్య అఖిలభారత జాతీయ కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించారు. కొంతకాలం మధ్యప్రదేశ్ గవర్నర్‌గా ఉన్నారు. భారత జాతీయకాంగ్రెస్ చరిత్రను, స్వాతంత్ర్యోద్యమ చరిత్రను గ్రంథరూపంలో వీరు అందించారు. మచిలీపట్నంలో జాతీయకళాశాల స్థాపనకు. ఆంధ్రాబ్యాంకు, ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీలను నెలకొల్పడానికి వీరు కృషిచేశారు. వీరు 1959 డిసెంబరు 17న పరమ పదించారు.

*పద్మరాజు, పాలగుమ్మి :* జననం : 1915 లో. అంతర్జాతీయఖ్యాతి పొందిన కథా రచయిత, కవిగా, నవలాకారునిగా, నాటక రచయితగా, వ్యాసకర్తగా, సినీ రచయితగా విశేష కీర్తిప్రతిష్ఠలు పొందారు. వీరి 'గాలివాన' అనేకథ ప్రపంచ కథానికల పోటీలో ద్వితీయ బహుమతి పొందింది. మానవ మనస్తత్వాన్ని తరచిచూసి, వ్యక్తుల ప్రవర్తనలను నిబంధించే అనేక ప్రభావాలను పరిశీలించి, నిశితమైన వాస్తవిక దృష్టితో, హృదయాంగమమైన శిల్పంతో ఉత్తమ రచనలు చేశారు. బ్రతికినకాలేజీ, నల్లరేగడి, అశోకుని మూన్నాళ్ళ పాలన, మరోరాజ్యానికి రహదారి మొదలయిన నవలలు, హత్య, ఆత్మహననం మొదలయిన నాటికలు, కూలిజనం, కథావాహిని మొదలయిన కథాసంపుటాలు వెలువరించారు.

*పాపయ్య, వడ్డాది :* సుప్రసిద్ధ చిత్రకారులు. జననం శ్రీకాకుళంలో. చిత్రలేఖనంలో తనదైన సొంతబాణీని ఏర్పరచుకొని, వ.పా. గా చందమామ, యువ పత్రికలలో వర్ణచిత్రాలలో అసమాన ప్రావీణ్యంద్వారా కీర్తిప్రతిష్ఠలను ఆర్జించారు. వీరి వర్ణచిత్రాలలో నవ్యత్వం, భావనాబలం, అమూర్తత్వం, ఆలోచనాపటిమ ద్యోతకమవుతాయి. వీరు చిత్రకారులే కాకుండా రచయిత కూడాను.

***పాపయ్యశాస్త్రి, జంధ్యాల:*** కవి, కమ్మని గద్యరచయిత. రాష్ట్రభాషావిశారద, హిందీ భాషాప్రవీణ, ఉభయభాషాప్రవీణ మొదలయిన ఓరియంటల్ డిగ్రీలుకల వీరు 1912 న గుంటూరు జిల్లా కొమ్మూరులో జన్మించారు. హిందీ పండితునిగా తెలుగు పండితునిగా, కళాశాల అధ్యాపకునిగాపనిచేశారు. సుభాషిణి పత్రికక్కు కొంతకాలంసంపాదకత్వం నిర్వహించారు. ఘంటసాల మధురకంఠం ద్వారా వీరి పద్యాలు ప్రజాభిమానాన్ని చూరగొన్నాయి. ఉదయశ్రీ, కరుణశ్రీ, విజయశ్రీ, కళ్యాణ కాదంబరి, తెలుగుసీమ మొదలయిన గ్రంథాలు వ్రాశారు.

***పార్థసారథి, జి:*** గ్రామీణ వ్యావసాయిక అర్థశాస్త్రవేత్త, మంచివక్త, మానవతావాది, సంఘ సంస్కర్త. జననం: కావలిలో, 1928లో. నెల్లూరు, వి. ఆర్. కాలేజి.

మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో, విద్యాభ్యాసం చేసి ఎం. ఏ. మొదటి తరగతిలో ఉత్తీర్ణు లయ్యారు. పూనా దక్కన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ నుంచి పిహెచ్.డి పట్టా పొందారు. అమెరికాలో కూడా పిహెచ్.డి సంపాదించి మద్రాసు విశ్వవిద్యాలయంలో డైరెక్టర్‌గా పని చేసి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అప్లైడ్ ఎకనామిక్స్ ప్రొఫెసర్‌గా ఉంటున్నారు. వీరు గ్రామీణ వ్యావసాయిక అర్థశాస్త్రంలో దిట్ట. అంతర్జాతీయ ఖ్యాతిపొందారు. చాలా అంత ర్జాతీయ వ్యావసాయిక అర్థశాస్త్ర సమావేశాలకు ప్రతినిధిగా హాజరయి అనేక పత్రాలను సమ ర్పించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆర్థిక సంబంధ కమిటీలలో సభ్యులుగాను, చైర్మన్‌గాను వ్యవహరించారు. ప్రస్తుతం ఆహార వ్యావసాయిక సంస్థ (ఎఫ్. ఏ. ఓ.)కు సలహాదారుగా రోమ్‌లో పనిచేస్తున్నారు.

*ప్రకాశం, టంగుటూరి :* ఆంధ్రకేసరి, అభ్యుదయ పథగామి, ఆధునికాంధ్ర ప్రజా నాయకుల్లో అగ్రగణ్యుడు, దేశాభివృద్ధే జీవితధ్యేయంగా సర్వస్వాన్ని దేశానికి అర్పించిన ధీరుడు, జాతీయనాయకుడు. జననం : 1869 ఆగస్టు 8న, ఒంగోలు తాలూకా వల్లూరులో. 1901లో మున్సిపల్ చైర్మన్. 1903 లో ఇంగ్లాండ్‌లో బార్-ఎట్-లా చేశారు. కొంత కాలం న్యాయవృత్తి చేపట్టి, ఆ తర్వాత స్వాతంత్ర్య ఉద్యమంలో ప్రవేశించారు. 1921 లో 'స్వరాజ్య' పత్రిక నెలకొల్పారు. ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షత, కేంద్ర శాసనసభ సభ్యత్వం, అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గ సభ్యత్వం స్వీకరించారు. సైమన్ కమిషన్ వ్యతిరేక ఉద్య మంలో ప్రముఖపాత్ర వహించి "ఆంధ్రకేసరిగా" ప్రసిద్ధులయ్యారు. అనేక ఉద్యమాల్లో పాల్గొన్నారు. 1946 లో మద్రాసు రాష్ట్రానికి, 1953 లో ఆంధ్రరాష్ట్రానికి ముఖ్య మంత్రి అయ్యారు. "నాజీవితయాత్ర" అనే గ్రంథాన్ని వ్రాశారు. "ప్రజలే ప్రకాశం, ప్రకాశమే ప్రజలు" అనిపించుకొన్న వీరు 1957 మే 20న అస్తమించారు.

*ప్రతాపరెడ్డి, సురవరం :* తెలంగాణా వైతాళికులలో అగ్రగణ్యుడు. కవి, పండితుడు రచయిత, విమర్శకుడు, పత్రికాసంపాదకుడు, గ్రంథాలయోద్యమదారు, మహాపరిశోధకుడు. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వీరు పాల్గొనని ప్రజాహితోద్యమం తెలంగాణాలో లేదని చెప్పవచ్చు. జననం : 1896 మే 28న, అలంపూర్ తాలూకా బోరవెల్లిలో. 24 సంవత్స రాలు "గోల్కొండ" పత్రికకు సంపాదకత్వం వహించి, తెలంగాణా ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించారు. నిజాం నిరంకుశత్వానికి నిర్భయంగా ప్రజలపక్షాన నిలిచారు. 1930 లో ప్రథమ ఆంధ్ర మహాసభకు అధ్యక్షత వహించారు. బి.ఏ, బి. ఎల్. చదివి కొంత కాలం న్యాయవాద వృత్తిని స్వీకరించారు. 1952 లో హైదరాబాద్ శాసనసభకు ఎన్ని కయ్యారు. హిందువుల పండుగలు, రామాయణ విశేషాలు, ఆంధ్రుల సాంఘిక చరిత్ర మొదలైన గ్రంథాలు వ్రాసిన వీరు 1953 ఆగస్టు 25న స్వర్గస్థులయ్యారు.

*ప్రసాద్, కె. ఎల్. ఎన్. :* ప్రముఖ వాణిజ్యవేత్త, పారిశ్రామికవేత్త, పత్రికాధిపతి, చలనచిత్ర పంపిణీదారుడు. జననం : 1928 జనవరి 1న కృష్ణాజిల్లా కౌతవరంలో. మద్రాసు

ఎనామెల్‌వర్క్స్, ఆంధ్ర ప్రింటర్స్ మొదలైన సంస్థలకు మేనేజింగ్ డైరక్టర్‌గా ఉన్నారు. 1980 ఏప్రిల్ వరకు ఆంధ్రా బ్యాంక్ డైరెక్టరు. హిందుస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్స్ కంపెనీ చైర్మన్; నేషనల్ స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్ మొదలైన సంస్థలకు కూడా డైరెక్టర్‌గా వ్యవహరించారు. ప్రస్తుతం రాజ్యసభ సభ్యులు. ఆంధ్రజ్యోతి దిన, వార పత్రికలు; జ్యోతిచిత్ర, వనితాజ్యోతి, బాలజ్యోతి పత్రికల ప్రచురణ కర్త. ఆంధ్రప్రదేశ్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ చైర్మన్‌గా ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో బ్యాంకింగ్, చలన చిత్ర పరిశ్రమ అభివృద్ధికి ఇతోధికంగా తోడ్పడ్డారు.

*పైడిరాజు, ఎ :* సుప్రసిద్ధ చిత్రకారుడు జననం: శ్రీకాకుళంజిల్లా బొబ్బిలిలో, 1920లో. 1941 లో మద్రాసు ఆంధ్ర మహాసభ ఏర్పాటు చేసిన చిత్రకళా ప్రదర్శనలో బంగారు పతకాన్ని, 1971 లో లలితకళా అకాడమీ అవార్డు పొందారు. ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడమీ సభ్యులు. వీరి చిత్రాలు మనదేశంలోనే కాకుండా రష్యా, ఆఫ్ఘనిస్తాన్ మొదలైన విదేశాలలోని చిత్రాల్లో కూడా ఉన్నాయి.

*బలరామమూర్తి, ఏటుకూరి :* భారతీయచరిత్ర, తత్వశాస్త్రాలను మార్క్సిస్టు దృక్కోణంలో అధ్యయనం చేసినవారు. గుంటూరుజిల్లా ఏటుకూరులో 1918 లో జన్మించారు. పత్రికా సంపాదకులు. ఎం.ఏ డిగ్రీ పొందిన వీరు ఆంధ్రులసంక్షిప్తచరిత్ర, భారతీయతత్వశాస్త్రం, మనచరిత్ర మొదలైన గ్రంథాలను వ్రాసి, 'ఆంధ్రప్రదేశ్ దర్శిని' కి సంపాదకులుగా ఉన్నారు. దాదాపు ఇరవై యేళ్ల 'విశాలాంధ్ర' పత్రికకు సంపాదక బాధ్యతను నిర్వహించారు.

*బసవరాజు, వల్లూరి :* రాజకీయ దురంధరుడు, వక్త, పత్రికా సంపాదకుడు జననం 1914 లో బాపట్ల తాలూకాలో. 1944 వరకు హైద్రాబాదు ఆంధ్రమహాసభకు సభ్యులు. 1950 లో హైదరాబాదులో మంత్రిగా ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరవాత పరిశ్రమల శాఖ మంత్రిగా, రెవెన్యూమంత్రిగా కొంతకాలం ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ రోడ్ కార్పొరేషన్‌కు చైర్మన్‌గా కూడా ఉన్నారు. ప్రస్తుతం రాజ్యసభ సభ్యులు.

*బాపిరాజు, అడవి :* లలిత కళల్లో చైతన్యమూర్తి, ప్రముఖ చిత్రకారుడు; నవలాకారుడు, కవి, కథారచయిత. భీమవరంలో 1895 లో జననం. సత్యాగ్రహోద్యమంలో జైలుకువెళ్లారు కొన్నాళ్ళు వకీలుగానూ. ఇంకొన్నాళ్లు ప్రధానాచార్యులుగానూ, మరికొన్నాళ్లు పత్రికా సంపాదకులుగానూ పనిచేశారు. వీరి కుంచె కల్పించిన శశిబాల, సంధ్యానృత్యం, ఖడ్గతిక్కన చిత్రాలు చిరస్మరణీయాలు. తొలకరి, గోధూళి, నారాయణరావు, హిమబిందు, గోనగన్నారెడ్డి, జాజిమల్లె మొదలైన గ్రంథాలను వ్రాసిన వీరు 1952 లో కీర్తిశేషులయ్యారు.

*బాపు :* సుప్రసిద్ధ చిత్రకారుడు. కడుపుబ్బ నవ్వించే కార్టూనిస్టు. విశిష్ట సినీదర్శకుడు, అసలుపేరు సత్తిరాజు లక్ష్మీనారాయణ. జననం 1933 లో. న్యాయశాస్త్ర పట్టభద్రులు.

ప్రెస్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరోలో కొంతకాలం పనిచేశారు. సదరన్ లాంగ్వేజస్ బుక్‌ట్రస్టుకు ఆర్ట్ కన్సల్‌టెంట్‌గా పనిచేశారు. చలనచిత్రరంగంలో ప్రవేశించి ఎన్నో ఉత్తమ చిత్రాలను నిర్మించి, దర్శకత్వం వహించారు. తన కార్టూనులద్వారా, చిత్రాలద్వారా తెలుగు సాహిత్యంలోనూ, చిత్రకళారంగంలోను నూతన వరవడి సృష్టించి, ఎందరికో మార్గదర్శకులయ్యారు. బాపు బొమ్మలంటే, బాపు అక్షరాకృతి అంటే తెలుగు పాఠకులు మంత్రముగ్ధులవుతారు. చిత్రకళాప్రదర్శనలు 25కు పైనే జరిగాయి. అటు చిత్రరచనలోనూ, ఇటు చిత్రాల దర్శకత్వంలోనూ ప్రత్యేకత పొందిన ప్రముఖులు.

*బాలకృష్ణ, సూరి* : ప్రముఖ భూవిజ్ఞాన శాస్త్రవేత్త. జననం : 1931లో. హైదరాబాదులోని నేషనల్ జియోఫిజికల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌కు డైరక్టర్‌గా ఉన్న వీరు 1952 నుంచీ భూవిజ్ఞాన, భూభౌతికశాస్త్రాలలో పరిశోధనలు జరుపుతున్నారు. శిలల భౌతిక ధర్మాలు, వాటి భూ విజ్ఞాన లక్షణాలు, భూజలాన్వేషణ మొదలైన అంశాలపై వీరు తమ పరిశోధనలను కేంద్రీకరించడం జరిగింది. వీరు విదేశాలను పర్యటించి ఎన్నో అంతర్జాతీయ సదస్సులలో పాల్గొని, ప్రామాణిక పత్రాలను సమర్పించారు. దాదాపు 125 పత్రాలను ప్రచురించారు. వీరికి పరిపాలనాదక్షత, సమన్వయనైపుణ్యం, నాయకత్వ పటిమ ఉండటం ప్రత్యేకతలుగా పేర్కొనవచ్చు.

*బాలగంగాధర తిలక్* : కథ, నాటిక, కవిత, వ్యాసం—ఏ సాహిత్య ప్రక్రియ అయినా వీరి చేతిలో సానపట్టిన వజ్రంవలె రాణించింది. జననం : 1921 లో తణుకులో. వచన కవిత్వం ద్వారా సాహిత్య జగత్తులో ప్రవేశించి, కథలు, నాటికల రచనలద్వారా త్వరగా వెలుగులోకి వచ్చారు. ప్రభాతం-సంధ్య, కఠినోపనిషత్, గోరువంకలు మొదలైన కవితలు, సుందరీ-సుబ్బారావు, ఊరిచివరఇల్లు, తిలక్ కథలు మొదలయిన కథా సంపుటాలు వెలువరించిన వీరు కొద్ది సంవత్సరాల క్రితం కాలధర్మం చెందారు.

*బాలమురళీకృష్ణ, మంగళంపల్లి, డాక్టర్* : గానకళా కోవిదుడు, వాగ్గేకారుడు, కళాప్రపూర్ణ బిరుదాంకితుడు. పదేళ్ళ పిన్నవయస్సులో త్యాగరాజ సమాధివద్ద తలలు పండిన పండితులను పరవశింపజేసిన గాయక వతంసులు. జననం : 1930 జూలై 6న, తూర్పు గోదావరిజిల్లా రాజోలులో. కర్నాటక శాస్త్రీయ గానంలో, గాత్రసంగీతంలో, వాయులీన వాద్యంలో దాక్షిణాత్య విద్వత్పరిషత్తులలో గౌరవస్థానాన్ని దక్కించుకొన్న కొద్దిమందిలో వీరు ఒకరు. 1963 లో ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో లలితసంగీత ప్రయోక్తగాచేరి, కొంతకాలం పనిచేశారు. తరవాత ఆ పదవికి 'రాజనామాచేసి, విదేశాలు పర్యటించి గాన కచేరీలలో పాల్గొన్నారు. కర్నాటక సంగీతంలో నూతన ప్రయోగాలుచేసి, నూతన రాగాలు, రీతులు ప్రవేశపెట్టిన ఈ గాయక సార్వభౌమునికి 1980 శ్రీరాజాలక్ష్మి అవార్డు (రూ. పది వేలు) లభించింది. వీరిని భారత ప్రభుత్వం 1973 లో పద్మశ్రీ బిరుదును, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు 1974 లో కళాప్రపూర్ణ బిరుదును ఇచ్చి గౌరవించాయి. 1980 డిశంబరులో ఆంధ్రప్రదేశ్ ఆస్థాన సంగీత విద్వాంసులుగా నియమితులయ్యారు

*బీనాదేవి :* రావిశాస్త్రి రచనాపోకడలను పుణికిపుచ్చుకొని కథా, నవలా ప్రక్రియల్లో నూతన ధోరణులను అనుసరించి తక్కువకాలంలో ఎక్కువ పేరు తెచ్చుకొన్న రచయిత్రి. అసలుపేరు భాగవతుల త్రిపురసుందరమ్మ. జననం: 1935 లో విశాఖపట్టణంజిల్లా చోడవరంలో. బి. ఏ. ఉత్తీర్ణులైన వీరు 1965 నుంచి రచనలు చేస్తున్నారు. లోకవృత్తానికి భూతద్దంపట్టే గాఢ వాస్తవితకను కన్నీరు కురిపించే హాస్యంతో, కమ్మని కవిత్వపువాక్యవిన్యాసాలతో ఎన్నో కథలు, నవలలు వ్రాశారు. రాధమ్మపెళ్ళి ఆగిపోయింది, హరిశ్చంద్రమతి, హాంగ్‌మిక్విక్ మొదలయిన గ్రంథాలు వ్రాశారు.

*బుచ్చిబాబు :* విశిష్టమైన సాహితీ వ్యక్తిత్వం గల కథకుడు, నవలాకారుడు, నాటకకర్త. అసలుపేరు వెంకట సుబ్బారావు. జననం : 1916లో. ఆలిండియా రేడియోలో వివిధ హోదాలలో ఎక్కువకాలం పనిచేశారు. రచనలో చైతన్య స్రవంతి ప్రక్రియను తెలుగులో ప్రథమంగా పరిచయం చేశారు. వస్తుస్వీకరణలోనూ, కళాత్మక చిత్రణలోనూ, లౌక్య ప్రధానమైన హాస్యాన్ని మేళవించడంలోనూ, సమస్యలను తర్కించడంలోనూ అసామాన్య ప్రజ్ఞ కనపరుస్తూ రచనలు చేశారు. రచనలు : నాలుగు కథల సంపుటాలు, చివరకు మిగిలేది నవల, ఆత్మవంచన, దారినబోయే దానయ్య నాటకాలు మొదలయినవి. 1972 వ సంవత్సరంలో కాలధర్మం చెందారు.

*బుచ్చిరామయ్య, చేకూరి :* సుప్రసిద్ధ వాలీబాల్ క్రీడాకారులు. 1919 లో గుంటూరు జిల్లా తెనాలి తాలూకా అమృతలూరులో జన్మించారు. 1950 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ అథ్లెటిక్స్ ఛాంపియన్‌షిప్ పొందారు. 1955 లో చైనా పర్యటించిన భారతీయ జట్టులో సభ్యులు. 1969 లో జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌లో అడ్వాన్స్ శిక్షణ పొందారు. ఎన్నో వాలీబాల్ పోటీలలో పాల్గొని విజయాన్నిసాధించారు. పాటియాలాలోని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్స్‌లో వాలీబాల్ ఛీఫ్‌కోచ్‌గా ఉన్నారు.

*బుల్లెయ్య, ఎల్ :* విద్యావేత్త, పరిపాలనాదక్షుడు, పరిపాలనా సంస్కరణాభిలాషి. మానవతావాది. సంఘసంస్కరణకర్త, జననం 1918 లో తెనాలితాలూకా పెరవలిలో. అర్థశాస్త్రంలో ఎం.ఏ. పుచ్చుకొని, బి.ఎడ్ చదివి విద్యారంగంలో తానుచేసిన సేవలకు డి.లిట్ గౌరవపట్టాను పొందారు. వీరు జిల్లా విద్యాశాఖాధికారిగా 1944 లో ప్రవేశించి 1964 లో ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ డైరెక్టరు అయ్యారు. 1968నుంచి ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకు ఆరేళ్ళపాటు ఉపాధ్యక్షులుగా ఉన్నారు. వీరి హయాంలో ఎన్నో కొత్త సబ్జెక్ట్‌లను ప్రవేశపెట్టి, పరీక్షవిధానంలో నూతన సంస్కరణలు అమలు పరచడం జరిగింది. ఉపాధ్యక్షుల హోదాలో వీరు అనేక విదేశాలను సందర్శించారు. వీరు అనేక విద్యా, పారిశ్రామిక, ఆర్థిక, సామాజిక సంస్థలలో సభ్యులు. కేంద్రప్రభుత్వ అల్పసంఖ్యాకవర్గ సంఘంలో సభ్యులు.

*బ్రహ్మయ్య, గొట్టిపాటి :* గాంధేయవాది, కాకలుతీరిన స్వాతంత్ర్య యోధుడు, వక్త, రైతుబిడ్డ బిరుదాంకితుడు. జననం 1898 లో కృష్ణాజిల్లా ఘంటసాలలో. వీరు విద్యార్థిగా ఉన్నప్పుడే మహాత్మా గాంధీ ఆశయాలతో ప్రభావితులై సహాయనిరాకరణోద్యమంలో చేరి చదువుకు స్వస్తి చెప్పారు. 1921-22 లో కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులు. 1948-49 లో ఆంధ్రరాష్ట్ర ఉపాధ్యక్షులుగా ఉన్నారు. 1962 లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. ఖాదీసంస్థ అధ్యక్షులుగా కొంతకాలం ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తుకు కొంతకాలం చైర్మన్‌గా ఉన్నారు. 1930, 32, 42 సంవత్సరాలలో దాదాపు అయిదున్నర సంవత్సరాలపాటు జైలులో గడిపారు. ఆంధ్రరాష్ట్రోద్యమంలో వీరు క్రియాశీలక పాత్ర వహించారు. సంఘ సంస్కరణకు నడుంకట్టి అనేక కార్యక్రమాలను చేపట్టారు.

*బ్రహ్మానందరెడ్డి, కాసు :* మాజీ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, పరిపాలనా దక్షుడు. జననం 1909 జూలై 28న గుంటూరు జిల్లా నరసరావుపేటలో. కొంతకాలం న్యాయవాది. 1946 లో గుంటూరుజిల్లా బోర్డు ప్రెసిడెంటు. 1946-62 లో మద్రాసు అసెంబ్లీ సభ్యులు. 1956-58 లలో ఆంధ్రప్రదేశ్ హోంశాఖ మంత్రి. 1971-74 ల మధ్య ఫైనాన్స్ కమీషన్ చైర్మన్‌గా ఉన్నారు. 1974-77 లలో దేశీయవ్యవహారాల శాఖ మంత్రిగాఉన్నారు. తరవాత కొంతకాలం అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులుగా ఉన్నారు. ప్రస్తుతం లోక్‌సభ సభ్యులు.

*భగవంతం, సూరి, డాక్టర్ :* ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్త, అనేక ఉన్నత పదవులను అలంకరించిన మేధావి. జననం 1909 అక్టోబరు 14 న కృష్ణాజిల్లా గుడివాడలో. శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక రంగాలమీద దాదాపు 200 వ్యాసాలు వ్రాసి, జాతీయ, అంతర్జాతీయ పత్రికలలో ప్రకటించారు. 1949లో లండన్‌లో భారత హై కమీషనర్‌కు లైజన్‌ఆఫీసర్‌గా, 1950 లో ఉస్మానియా విశ్వవిద్యాలయ భౌతికశాస్త్ర పరిశోధనశాఖకు డైరెక్టర్‌గా, ఆ తరవాత ఉస్మానియా విశ్వవిద్యాలయానికి వైస్‌ఛాన్సలర్‌గా, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్‌కు డైరెక్టర్‌గా, కేంద్ర రక్షణ మంత్రిత్వశాఖకు శాస్త్రీయ సలహాదారుగా పనిచేశారు. 1961 లో "క్రిస్టల్ సిమెట్రీ అండ్ ఫిజికల్ ప్రాపర్టీస్" అనే అమూల్య గ్రంథాన్ని వ్రాసిన వీరు ప్రస్తుతం "కమిటీ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీ ఫర్ ది డెవలపింగ్ కంట్రీస్ " ప్రెసిడెంట్‌గా ఉన్నారు.

*భరద్వాజ, రావూరి :* బహుముఖ ప్రజ్ఞాశాలి, నిత్య ప్రయోగశీలి, కథ, నవల, నాటిక వ్యాసం, కవితా మొదలయిన సాహిత్య ప్రక్రియల్లో విశేషంగా కృషి చేసిన శతాధిక గ్రంథకర్త. జననం : గుంటూరు జిల్లా తాడికొండలో. మొదట్లో చలానికి సాహిత్య వారసుడుగా వెలుగులోకి వచ్చిన భరద్వాజగారి సాహితీ ప్రస్థానం పరిశీలిస్తే, జీవితంలో పైకి రావడానికి పడిన కష్టాలూ, పొందిన అనుభవాలూ గొప్ప రచయితగా తయారుచేశాయనవచ్చు. అధికారిక విద్య అట్టే లేకపోయినా, స్వయంకృషితో వీరు అటు జీవితంలోనూ, ఇటు రచనా వ్యాసాంగంలోనూ ఉన్నతస్థాయిని అందుకొన్నారు. కాదంబరి, పాకుడురాళ్ళు

మొదలయిన నవలలే కాకుండా వందల సంఖ్యలో కథలు వ్రాశారు. ఆలిండియా రేడియోలో హైదరాబాదులో ఉద్యోగం.

*భానుప్రసాద్, మాతకి* : ప్రఖ్యాత అణుశాస్త్రవేత్త, భారతదేశపు అణుయుగ కర్తలలో ఒకరు. మెకానికల్, కెమికల్, ఇండస్ట్రియల్ ఇంజనీరింగ్ శాస్త్రాంలో డిగ్రీలు గల వీరు సైరస్ రియాక్టర్ ఇంజనీరింగ్ ఆపరేషన్‌లలో పనిచేశారు. 1964 లో వీరు ఆయిల్ అండ్ నేచురల్‌గాస్ కమీషన్‌కి ఆధ్వర్యం వహించి ఎంతో సమర్థవంతంగా పనిచేశారు. అప్పుడే డెహరాడూన్‌లో ఒక ట్రైనింగ్‌స్కూల్ స్థాపించారు. వీరు 'కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చ్'లో సభ్యులు. 1960 లో ప్రభుత్వం పద్మశ్రీ బిరుదు ఇచ్చింది. 1976 లో జవహర్‌లాల్‌నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్సిటీ వీరికి డాక్టర్ ఆఫ్ సైన్స్ గౌరవ డిగ్రీ ఇచ్చి గౌరవించింది. ప్రస్తుతం వీరు భారతప్రభుత్వంలో సైన్సు విభాగంలో కార్యదర్శిగా ఉన్నారు.

*భానుమతీ రామకృష్ణ, వి* : రచయిత్రి, దర్శకురాలు, సంగీత, నృత్య, నటనలలో ప్రతిభా సంపన్నురాలు. జననం : 1925, ఒంగోలు తాలూకా కేతవరంలో. "వరవిక్రయం" ద్వారా సినీరంగ ప్రవేశం చేసిన వీరు తెలుగు, తమిళ, హిందీ భాషలలో కొన్ని వందల చిత్రాలలో నటించారు. తెలుగు చిత్రరంగంలో దర్శకత్వం వహించిన తొలి మహిళ. పద్మశ్రీ గ్రహీత.కథా రచనలో స్వంతబాణీని ఏర్పర్చుకొన్న రచయిత్రి. అత్తగారి కథలు, భానుమతి కథలు ముద్రితాలు. భరణీపిక్చర్స్ పేరుతో ఎన్నో చిత్రాలు నిర్మించారు.భరణీ స్టూడియోను స్థాపించారు. అనుకరణకు లొంగని గొప్ప గాయని.

*భీమన్న, బోయి* : ప్రాచీన, ఆధునిక, ఆంధ్ర, ఆంగ్ల, గ్రాంథిక, వ్యవహారిక, రచనా సంప్రదాయ సవ్యసాచి. జననం రాజోలుతాలూకా మామిడికుదురులో 19, సెప్టెంబరు 1911 న. స్వయంప్రతిభతో, కృషితో పాలేరునుంచి పద్మశ్రీ వరకు కీర్తినిగడించారు. జనవాణి, ప్రజామిత్ర, ఆంధ్రప్రభ, పత్రికలసంపాదకవర్గంలో పనిచేసిన తరవాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అనువాదశాఖకు డైరెక్టరుగా ఉన్నారు. రాగవాశిష్ఠం, గుడిసెలు కాలిపోతున్నాయి, అశోకవనంలో రాముడు, పిల్లి, బొమ్మ, రాధీయ మొదలైన కావ్యాలువ్రాశారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు 'కళాప్రపూర్ణ' పట్టాను ఇచ్చి వీరిని గౌరవించింది. కొంతకాలం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ఉపాధ్యక్షులుగా ఉన్నారు. ప్రస్తుతం రాష్ట్ర విధానపరిషత్తు సభ్యులుగా ఉన్నారు.

*మాలతీచందూర్* : సుప్రసిద్ధ కథా, నవలా, వ్యాస రచయిత్రి. ప్రమదావనం ద్వారా ప్రమదలకు పరిచయమై ప్రసిద్ధికెక్కారు. జననం : 1929లో నూజివీడులో. స్వయంకృషితో చదివిన చదువే వీరి రాణింపుకు ఆలంబనం. 1948 నుంచి రచనలు చేస్తున్నారు. ఇంగ్లీషు నవలలను తెలుగువారికి పరిచయం చేయడంలో సిద్ధహస్తురాలు. చాలా కథలు, నవలలు

వ్రాశారు. కలల వెలుగు, మంకెన పువ్వు, ఉద్యోగం, వంటలు పిండివంటలు, నవలలు నారీ మణులు మొదలైన పుస్తకాలు వ్రాశారు.

*మూలినీరెడ్డి, జి* : వాలీబాల్ క్రీడాకారిణి : ఆంధ్రప్రదేశ్‌లో అర్జున అవార్డు పొందిన తొలివనిత. జననం· 1945లో వరంగల్‌జిల్లా పోసానిపల్లిలో. 1964 ఇంటర్ యూనివర్సిటీస్థాయి పోటీలోపాల్గొని అప్పటి నుంచి ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ వాలీల్‌లో ఆంధ్ర జాతికి వన్నెతెచ్చిన మహిళ. 1963లో ప్రి ఒలింపిక్స్ పోటీకి భారతజట్టులో స్థానం సంపాదించి 1964 నుంచి చాలాసార్లు ఉస్మానియా విశ్వవిద్యాలయం తరపున ఇంటర్ యూనివర్శిటీ వాలీబాల్ పోటీలలో పాల్గొన్నారు. రాష్ట్రం తరపున 1963-64 నుంచి పాల్గొంటూ 1964-65, 1966-67, 1968-69, 1970-71 సంవత్సరాలలో మన రాష్ట్రానికి ఛాంపియన్‌షిప్ సాధించారు. 1970 లో పారిస్ విశ్వవిద్యాలయం జట్టుతో ఆడిన భారతజట్టుకు నాయకత్వం వహించారు. 1974 లో అర్జునఅవార్డు పొందారు. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదులో పనిచేస్తున్న వీరు ప్రస్తుతం వాలీబాల్ కోచ్‌గాకూడా ఈక్రీడకు సేవ చేస్తున్నారు.

*మొహియుద్దీన్, ముఖ్దూం* : ఉర్దూకవి, ప్రజాహితజీవి, ప్రముఖ ట్రేడ్ యూనియన్ నాయకుడు. జననం : 1908 ఫిబ్రవరి 4. ఉస్మానియా విశ్వ విద్యాలయం నుంచి ఎం. ఏ. డిగ్రీపుచ్చుకొని, కొంతకాలం అధ్యాపకవృత్తి కొనసాగించి, ఆపైన రాజకీయాలలోకి దిగారు. తెలంగాణా సాయుధ పోరాటంలో ప్రముఖ పాత్ర వహించారు. 1952లో హైదరాబాదు నుంచి శాసనసభకు ఎన్నికయ్యారు. కార్మికులకు అండగానిల్చి, కార్మిక సంఘాలను స్థాపించారు. విప్లవపూరిత గేయ రచనద్వారా ఉర్దూ సాహిత్యంలో ఉన్నత స్థానాన్ని అలంకరించిన వీరు 1969 ఆగస్టు 24న కీర్తి శేషులయ్యారు.

*రంగనాయకమ్మ* : విప్లవాత్మక భావాలుగల రచనలద్వారా స్త్రీలలో ప్రత్యేకత సంపాదించుకొన్న రచయిత్రి, నవలాకారిణి. జననం : 1939లో పశ్చిమగోదావరిజిల్లా బొమ్మిడి గ్రామంలో. స్త్రీల మనస్సులను, మనోభావాలను, మనఃప్రవృత్తులను, స్త్రీలకుజరిగే అన్యాయాలను, అక్రమాలను, స్త్రీలకు సమాజంలో ఉండాల్సిన స్థానాన్ని మార్క్సిస్టు దృక్పథంలో ఆలోచించి మహిళల్లో సంచలనం కలిగించే రీతిలో కథలు, నవలలు ఎన్నో వ్రాశారు. వీరి నవలలు సినిమాలుగా కూడా వచ్చాయి. వీరి రచనల్లో బలిపీఠం, పేకమేడలు, స్త్రీ, రచయిత్రి, ఇదేనా న్యాయం, స్వీట్‌హోమ్, రామాయణ విషవృక్షం మొదలైనవి చెప్పుకోదగినవి.

*రంగా, ఎన్. జి. ఆచార్య* : విదేశాలలో ఉన్నత విద్య నభ్యసించి ఉన్నత ప్రమాణాలతో దేశసేవ చేసిన నాయకుడు. రైతుబాంధవుడు. బహు గ్రంథకర్త. జననం : గుంటూరు జిల్లా నిడుబ్రోలులో 1900 సంవత్సరం నవంబర్ 7న. ఇంగ్లండ్‌లో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రంలో పిహెచ్.డి పట్టంపొందారు. మద్రాసులో కొంతకాలం ప్రొఫెసరుగా

ఉన్నారు. జాతీయోద్యమంలో పాల్గొన్నారు. 1930-45 లలో కేంద్ర శాసనసభకు, 1952 లో రాజ్యసభకు, 1957-67 లలో లోక్ సభకు ఎన్నుకోబడ్డారు. కేంద్ర శాసనసభ కార్యదర్శిగా పనిచేశారు "స్వతంత్రపార్టీ" స్థాపించి అధ్యక్షులుగా ఉన్నారు. అనేక పత్రికలు స్థాపించారు. ఇటీవల స్వతంత్ర పార్టీనుంచి కాంగ్రెస్‌లో చేరారు. లోక్‌సభ సభ్యులు.

*రఘురామయ్య కొత్త* : బార్-ఎట్-లా. ప్రభుత్వయంత్రాంగంలో ఉన్నతాధికారియై తన దక్షతను నిరూపించి, రాజకీయాల్లోకి రంగప్రవేశం చేసి కేంద్రప్రభుత్వ మంత్రిగా పేరు ప్రఖ్యాతులు గడించిన వ్యక్తి. జననం 1912లో తెనాలితాలూకా సంగంజాగర్లమూడిలో. వీరు కొంతకాలం న్యాయవాద వృత్తి స్వీకరించి ఆ తరవాత ప్రభుత్వ న్యాయశాఖలో సెక్రటరీగా వ్యవహరించారు. 1952 లో ఆ పదవికి రాజీనామా చేసి రాజకీయాల్లో ప్రవేశించి లోక్‌సభకు ఎన్నికయ్యారు. కేంద్రప్రభుత్వంలో రక్షణశాఖకు, సప్లయ్‌శాఖకు, పెట్రోలియమ్, కెమికల్స్ శాఖకు, పార్లమెంటరీవ్యవహారాలకు వివిధసంవత్సరాలలో మంత్రి పదవులను నిర్వహించారు. వీరు వరసగాఆరుసారు లోక్‌సభకు సభ్యులుగా ఎన్నికయ్యారు. వీరు ఇటీవలస్వర్గస్తులైనారు.

***రమణయ్య రాజా, వి.వి. :*** ఆధునిక అభినవ ఆంధ్రభోజుడు. వ్యాపారవేత్త, రాజా-లక్ష్మీఫౌండేషన్ స్థాపకుడు. జననం : 1927 లో విజయనగరంలో. వ్యాపారరీత్యా మద్రాసులో స్థిరపడి, ఇరురాష్ట్రాల సాహిత్య, సాంస్కృతిక, వ్యాపార వ్యవహారాలకు వారధిగా నిల్చి, వితరణశీలురుగా, సాహిత్య పోషకులుగా మంచి పేరు తెచ్చుకొన్నారు. శ్రీ రాజా - లక్ష్మీ ఫౌండేషన్‌ను స్థాపించి సాహిత్య, సంగీత, లలితకళల రంగంలో నిష్ణాతులైనవారికి ఒకరు లేదా అంతకన్న ఎక్కువమందికి ప్రతిసంవత్సరం పదివేలరూపాయల అవార్డును ఇస్తున్నారు. 1979 లో మహాకవి శ్రీశ్రీ కి, 1980 లో సంగీతకళా కోవిదులు శ్రీ బాలమురళీకృష్ణకు ఇవ్వడం జరిగింది ఈ అవార్డులు. సామాజిక బాధ్యతను గుర్తించిన వాణిజ్యవేత్త.

*రాఘవ, బళ్ళారి* : నాట్యకళాప్రపూర్ణుడు, నటనావతంసుడు. జననం : 1880 ఆగస్టు 2, అనంతపురంజిల్లా తాడిపత్రిలో. మద్రాసు క్రిస్టియన్ కాలేజీ నుంచి న్యాయశాస్త్రంలో డిగ్రీ తీసుకొని న్యాయవాదిగా, ప్రభుత్వ న్యాయవాదిగా పనిచేసిన వీరు మంచివక్త, బహుభాషా విద్వాంసులు, రచయిత. యుగంధరుడు, కబీర్, చాణుక్యుడు, కీచకుడు, దుర్యోధనుడు, దశరథుడు, రామదాసు, హిరణ్యకశిపుడు మొదలైన చారిత్రక, పౌరాణిక, సాంఘిక పాత్రలద్వారా తమ నటనతో యావదాంధ్ర దేశాన్ని ఉర్రూతలూగించారు. బెంగుళూరులోని డ్రెమెటిక్ అసోషియేషన్‌లో 25 సం॥ వివిధరకాల పాత్రలు వేశారు. పండిట్ తారానాథ్‌తో కలిసి హిందీ నాటకాలు వేశారు. షేక్స్‌పియర్ నాటకపాత్రల పోషణలో వీరు సాటిలేని మేటి. 1927లో ఇంగ్లండులో ఆంగ్ల నాటకాలు ప్రదర్శించారు. స్త్రీ పాత్రలు స్త్రీలే వేయాలన్న ఉద్యమం నడిపి, సాఫల్యం సాధించారు. 1935లో రెండు తెలుగు చిత్రాలలో నటించిన వీరు 1946 లో పరమపదించారు.

*రాజగోపాలరావు, చండమూడి :* శరీర సౌష్ఠవం, బల ప్రదర్శనలో సుప్రసిద్ధులు. కృష్ణాజిల్లాలో జన్మించిన వీరు ఇండియన్ హెర్క్యులెస్, భారత భీమ, మిస్టర్ ఏషియా మొదలయిన బిరుదులను పొందారు బరువు ఎత్తడంలో వీరు అనేక స్వర్ణపతకాలను పొందారు. 1948, 1952, 1956 సంవత్సరాలలో అంతర్జాతీయ ఒలింపిక్స్‌లో భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. వ్యాయామశాలలు స్థాపించి యువకులకు శిక్షణఇవ్వడం,పోటీలు నిర్వహించడం ద్వారా వ్యాయామ విద్యాభివృద్ధికి వీరు ఎంతో కృషి చేశారు.

*రాజమన్నార్, పి. వి. :* ప్రముఖ న్యాయమూర్తి, రచయిత. జననం: 1901 మే 10వ తేదీన న్యాయశాస్త్ర పట్టభద్రులు. మద్రాసు హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి. నాటక రచయిత. 1964-66లో ఫైనాన్స్ కమీషన్ చైర్మన్. కేంద్ర నాటక సంగీత అకాడమీకి తొలి చైర్మన్. మద్రాసులో అనేక గౌరవ పదవులు నిర్వహించారు. అభ్యుదయ రచయితల నాల్గవ సభలకు అధ్యక్షులు. "ఏంమగవాళ్ళు?" "తప్పెవరిది ?", దెయ్యాల లంక, మాతృప్రేమ మొదలయిన గ్రంథాలు వ్రాశారు. ఇటీవలే దివంగతు లయినారు.

*రాజేశ్వరరావు, చండ్ర :* భారతకమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి. మెడికల్ కాలేజీలో చదువు పూర్తిచేయకుండానే రాజకీయ రంగంలో ప్రవేశించి, కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి కృషి చేశారు. తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటంలో ప్రముఖపాత్ర వహించారు. కమ్యూనిస్టు పార్టీలో ఎన్నో ఉన్నత పదవులను నిర్వహించారు. 1974 జూన్ 6న సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నుంచి అత్యున్నత గౌరవమైన 'ఆర్డర్ ఆఫ్ లెనిన్' స్వీకరించారు.

*రాధాకృష్ణన్, సర్వేపల్లి, డాక్టర్ :* విశ్వవిఖ్యాతతత్వవేత్త; పండితుడు; విద్యావేత్త విజ్ఞాననిధి; రాజనీతిజ్ఞుడు; ఆంధ్రాంగ్లభాషల్లో అపారవైదుష్యంగల అగ్రగశ వక్త. జననం : 1888 సెప్టెంబరు 5, తిరుత్తణిలో. మద్రాసు, మైసూరు, ఆంధ్ర, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాల్లో ఆచార్యులుగా పనిచేశారు. 1949-52 మధ్య సోవియట్ యూనియన్‌లో భారత రాయబారిగా ఉండి, స్టాలిన్‌తో ఒకసమావేశంలో సంభాషించే అసాధారణ గౌరవంపొందారు. 1942-62 మధ్య భారత ఉపరాష్ట్రపతిగా, 1962-67 లో రాష్ట్రపతిగా ఉన్నారు. అనేక అంతర్జాతీయ విద్యా సాంస్కృతిక సంస్థలతో సంబంధాలు కలిగి, అనేకదేశాల విశ్వవిద్యాలయాల నుంచి గౌరవ డాక్టరేట్లు పొందారు. "భారతరత్న" బిరుదుతో సన్మానించబడ్డారు. భారతీయ తాత్త్విక, ఆధ్యాత్మిక విషయాలమీద పెక్కు గ్రంథాలు వ్రాసిన వీరు 1975 ఏప్రిల్ 17 వ తేదీన దివంగతులయ్యారు.

*రామకృష్ణ, బి. యస్ :* హైదరాబాద్ యూనివర్సిటీ ఉపాధ్యక్షులు. శబ్దశాస్త్రజ్ఞులు. వీరు విజయనగరంలో 1921 సం॥లో జన్మించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలోను, కాశీ విశ్వవిద్యాలయంలోనువిద్యాభ్యాసంచేసి ఎమ్.యస్‌సి.డిగ్రీపొందారు. ప్రభుత్వ విద్యావేతనంపై

మెరికాకు వెళ్ళి ఇల్లినాయిస్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజి, చికాగో నుంచి పిహెచ్.డి. డిగ్రీని విద్యుచ్ఛక్తి సమాచార ఇంజనీరింగ్ శాస్త్రంలో సంపాదించారు. బెంగుళూరులో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సులో 1949 నుంచి 30 సంవత్సరాలు అధ్యాపక వర్గంలో వివిధహోదాల్లో పనిచేసి, 1980 ఆగస్టు నెలలో హైదరాబాదు విశ్వవిద్యాలయంలో ఉపాధ్యక్ష పదవిని చేపట్టారు. వీరు శబ్దశాస్త్రంలో గొప్పప్రవీణులు. మృదంగం, తబలా, తంబూర మొదలయిన భారతీయ సంగీత వాద్య పరికరాలపై పరిశోధనలు చేశారు; భారతీయ అకాడమి, భారతీయశబ్దశాస్త్ర సంఘాలలో ఫెలోగాను, అంతర్జాతీయ శబ్దశాస్త్రకమీషన్‌లో సభ్యులుగాను ఉన్నారు

***రామకృష్ణ, నటరాజ*** **:** నాట్యాచార్యుడు; భారత కళాప్రపూర్ణ బిరుదాంకితుడు; బహు గ్రంథకర్త. జననం : 1936 లో. రకరకాల నాట్య కళారీతులలో నిష్ణాతులు. అటుశాస్త్రం, ఇటు ఆచరణ క్షుణ్ణంగా తెలిసినవారు. నాట్య శాస్త్రానికి సంబంధించి నర్తనబాల, నాటక కళా చరిత్ర, ఆంధ్ర నాట్యకళ మొదలైన ముప్పై గ్రంథాలువ్రాశారు. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల బహుమతులు పొందారు. కొన్ని నృత్య నాటికలను ప్రత్యేకంగా రూపొందించారు. నృత్యకళా నికేతన్‌ను హైదరాబాదులో స్థాపించి నాట్య కళలో శిక్షణ ఇస్తున్నారు.

***రామకృష్ణ, వెలగపూడి*** **:** జననం : 1896 రేపల్లె తాలూకా బెల్లంవారి పాలెంలో. చెప్పుకోదగిన పారిశ్రామిక వేత్త. ఎడింబరో, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాల్లో విద్యాభ్యాసంచేసి, 1922లో ఐ. సి. ఎస్. ప్యాసై, సబ్ కలెక్టరు అయ్యారు. ఆ తరవాత పరిశ్రమల శాఖ డైరెక్టరు, లేబర్ కమీషనర్ మొదలైన బాధ్యతాయుత ఉద్యోగాలు నిర్వహించి 1947 లో రిటైర్ అయ్యారు. కొంతకాలం పార్లమెంట్‌కు నామినేటెడ్ సభ్యులుగా ఉన్నారు. కావేరి షుగర్ అండ్ కెమికల్స్, జయపూర్ షుగర్ సిండికేట్, కె. సి. పి. లిమిటెడ్, ఆంధ్ర సిమెంట్ కంపెనీ మొదలైనవాటికి చైర్మన్‌గా ఉంటూ పరిశ్రమల పెంపుదలకు కృషిచేశారు.

***రామకృష్ణమాచార్యులు, ధర్మవరం*** **:** నటుడు; నాటక రచయిత; ఆంధ్ర నాటక పితామహుడు. 1853 లో అనంతపురంజిల్లా ధర్మవరంలో జన్మించారు న్యాయశాస్త్ర పట్టభద్రులై, కొంతకాలం న్యాయవాదవృత్తి చేపట్టారు. వీరు వ్రాసిన 28 నాటకాలలో చిత్రనళీయం, విషాద సారంగధర నాటకాలు ప్రసిద్ధాలు. తెలుగు నాటకాలలో పాటలను మొట్టమొదటగా ప్రవేశపెట్టిన ఖ్యాతి వీరిదే. ఇంకా వీరి ఇతర నాటకాలలో కొన్ని—వరూధిని, బృహన్నల, ప్రమీలార్జునీయం, ముక్తావళి. వీరు 1912లో దివంగతులయ్యారు.

***రామకృష్ణయ్య, కోరాడ*** **:** భాషా శాస్త్రజ్ఞుడు; సంస్కృతాంధ్ర పండితుడు; పరిశోధకుడు; విమర్శకుడు. జననం : 1891లో మచిలీపట్నంలో. కొంతకాలం విజయనగర కళాశాలలో అధ్యాపకవృత్తి చేశారు. వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నారు. రచనలు :

ఆంధ్ర భారత కవితా విమర్శన, కాళిదాసుని కళాప్రతిభ, సారస్వత వ్యాసాలు, భాషోత్పత్తి క్రమం, సంధి మొదలైన గ్రంథాలు.

*రామకృష్ణారావు, అబ్బూరి* : మొదటితరం భావకవుల్లో ఒకడు. మహోదాత్త వ్యక్తిత్వంగల మేధావి; సంభాషణా చతురుడు; గ్రంథాలయ నిర్వాహకుడు; స్వాతంత్ర్య యోధుడు, పదశిల్పి. వీరు 1896 మే 20 న తెనాలితాలూకా చెముడుపాడు గ్రామంలో జన్మించారు. భారతదేశంలో తలెత్తిన ప్రతి రాజకీయోద్యమంలోను, సామాజికోద్యమంలోను వీరికి అంతో ఇంతో ప్రత్యక్ష సంబంధ ముంది. ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ముప్పై నాలుగేండ్లు గ్రంథాలయ నిర్వాహకులుగా పనిచేసి, తాము చదివి, ఎందరినో చదివించి, వృద్ధికి తెచ్చారు. ఎన్నో పత్రికల్లో సాహిత్య శీర్షికలు పెట్టించారు. ఊహాగానం, నదీసుందరి, మల్లికాంబ, జగాంజలి మొదలైన గ్రంథాలు వ్రాశారు. లోకాన్నీ, లోకులనూ నిర్మోహ సమ్యక్ దృష్టితో చూసిన వీరు ఏప్రిల్ 30, 1979 న పరమ పదించారు.

*రామకృష్ణారావు, బూర్గుల* : తెలంగాణా వైతాళికులలో ప్రముఖుడు, నిజాం వ్యతిరేక పోరాటంలో యోధుడు, రాజనీతి దురంధరుడు, బహుభాషా పండితుడు, న్యాయవాది. జననం 1901 మహబూబ్‌నగర్ జిల్లా వడకల్లులో. వీరు కొంతకాలం న్యాయవాదవృత్తి చేపట్టి, తెలంగాణా గ్రంథాలయోద్యమం, సారస్వతోద్యమం, ఆంధ్రోద్యమం మొదలైన ఉద్యమాలలో పాల్గొన్నారు. 1950 నుంచి 1956 నవంబరు వరకు హైదరాబాదు రాష్ట్రంలో మంత్రిపదవిని, ముఖ్యమంత్రి పదవిని నిర్వహించారు. కేరళ, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలకు గవర్నరుగా ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ నిర్మాణంలో అతి కీలక పాత్రను నిర్వహించిన, అనేక గ్రంథాలు రచించిన వీరు 1967లో పరమ పదించారు.

*రామకృష్ణశాస్త్రి, మల్లాది* : సుప్రసిద్ధ కథకుడు, బహుభాషాకోవిదుడు. 1905 లో మచిలీపట్నంలో జన్మించారు. వీరిబాణీ అనుకరణకు లొంగనిది. జానుతెలుగు వీరిసొమ్ము. భావ ప్రకటనలో, వాక్యనిర్మాణంలో గడుసు పోకడలు పోయి, రసాత్మకమైన శైలిని సృష్టించి, ప్రాచీన, ఆధునిక, జానపదపాత్రలలో రసవత్తరమైన కథలు 200 దాకా వ్రాశారు. కొన్ని చలన చిత్రాలకు మాటలు, పాటలు వ్రాశారు. రచనలు : మునిగోరింట, రంగవల్లి, చిత్రశాల, అల్లోనేరేడు, మత్తకోకిల మొదలైన కథల సంపుటాలు; కృష్ణాతీరం నవల. 1965 లో ఇహలోక యాత్ర చాలించారు.

*రామకోటేశ్వరరావు, కోలవెన్ను* : జననం: 1894 అక్టోబరు22న, నర్సరావుపేటలో. కొంతకాలం న్యాయవాదవృత్తి స్వీకరించి, ఆ తరవాత అనేక ఉద్యమాలలో పాల్గొని జైలుకు కూడా వెళ్ళారు. 'త్రివేణి' పత్రికను స్థాపించి, నిర్వహించారు. 'స్వరాజ్య' పత్రికకు ఉప సంపాదకులుగా పనిచేశారు. సాంఘిక సంస్కరణకు కృషిచేశారు. రాజనీతి భావాలకన్నా

సాహిత్యవేత్తలే భారత సమైక్యం సాధించగలరని వీరి విశ్వాసం. వీరు 1970 లో పరమ పదించారు.

*రామచంద్ర. తిరుమల :* సుప్రసిద్ధ భాషాలిపిశాస్త్రవేత్త, భాషాసేవకుడు, గ్రంథకర్త, పత్రికా రచయిత : జననం : 1913 లో అనంతపురంజిల్లా రాఘవంపల్లెలో. వీరు స్వాతంత్ర్య సమరంలో పాల్గొని కారాగారశిక్ష అనుభవించారు. వీరికి తెలుగు, సంస్కృతం, ప్రాకృతం, హిందీ, కన్నడం, తమిళం, ఆంగ్లభాషలలో పరిచయముంది. విద్వాన్, శిరోమణి, హిందీ ప్రభాకర్, ఆయుర్వేదభూషణ్ పరీక్షలలో ఉత్తీర్ణులయ్యారు. మీజాన్, ఆంధ్రప్రభ, భారతి, ఆంధ్ర పత్రికలలో సంపాదకవర్గంతో పనిచేశారు. పత్రికా శిరోమణి, మహా మహోపాధ్యాయ బిరుదులున్నాయి వీరికి మనలిపి పుట్టుపూర్వోత్తరాలు, హిందువుల పండుగలు, నుడి-నానుడి, మరపురానిమనీషి, లలితవిస్తరం మొదలైన గ్రంథాలు వ్రాశారు.

*రామచంద్రరావు, బి :* సుప్రసిద్ధ భౌతికశాస్త్రవేత్త, మానవతావాది, విద్యావేత్త. జననం : 1922 నవంబరు 23 ఎం ఎస్‌సి. డి.ఎస్.సి డిగ్రీలు పొందారు. ఆంధ్రాయూనివర్సిటీలో 1950 లో లెక్చరర్‌గా చేరి, 1953 లో రీడర్ అయి, 1959 లో ప్రొఫెసరు, హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ అయ్యారు. 1976 జూన్ 2 న యు.జి.సి. వైస్ ఛైర్మన్ అయ్యారు. ఇండియన్ నేషనల్ సైన్సు అకాడమి, ఇండియన్ అకాడమి ఆఫ్ సైన్సెస్, ఆంధ్రప్రదేశ్ అకాడమి ఆఫ్ సైన్సెస్ లో సభ్యులు. 'ఫిజిక్స్ ఆఫ్ సాలిడ్ స్టేట్' మొదలైన గ్రంథాలు రచించారు. 1965 లో శాంతిస్వరూప్ భట్నాగర్ అవార్డు, 1960 లో ఆంధ్రాయూనివర్సిటీలో గౌరవ డాక్టరేటు పొందారు. అనేక విదేశాలు పర్యటించారు.

*రామచంద్రరావు, వందేమాతరం :* ప్రముఖ జాతీయవాది, స్వాతంత్ర్య యోధుడు, సాహిత్య ప్రియుడు, అధికారభాషా కమీషన్ అధ్యక్షుడు వీరు మహబూబ్‌నగర్ జిల్లా గద్వాల్‌లో జన్మించారు. సత్యాగ్రహ సమరంలో పాల్గొన్నారు. జైలులో పోలీస్ అధికారులను ధిక్కరించి వందేమాతరం గీతం పాడినందుకు వందేమాతరం రామచంద్రరావుగా ప్రసిద్ధి కెక్కారు. పెక్కు గ్రంథాలు రచించారు. అధికారభాషా కమీషన్ అధ్యక్షులుగా ఉండి ఆంధ్ర ప్రదేశ్ అంతా పర్యటిస్తూ తెలుగును అధికారభాషగా చేయడానికి అవిరళ కృషి జరుపుతున్నారు.

***రామదాస్, వి.యస్ :*** ప్రఖ్యాత వృక్షశాస్త్రజ్ఞుడు. జననం 1933 లో. 1953 లో. ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి ఎమ్.ఎస్‌సి డిగ్రీ తీసుకొన్న తరవాత, స్వీడన్‌లోని ఉప్సలా యూనివర్సిటీలోను, ఇంగ్లండ్‌లోని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలోను వృక్షశరీరధర్మశాస్త్రంలో పరిశోధనలు జరిపి, 1957 లో డాక్టరేట్ డిగ్రీ తీసుకొన్నారు. హరితరేణువులను మొట్టమొదటిసారిగా వేరుచేసినవారు వీరే అని చెప్పవచ్చు. 1969 నుంచి 1978 వరకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో వృక్షశాస్త్ర విభాగానికి అధిపతిగా పనిచేసి కొంతకాలం హైదరాబాదు

విశ్వవిద్యాలయంలో స్కూల్ ఆఫ్ లైఫ్ సైన్సెస్‌లో ఆచార్యులై తిరిగి వేంకటేశ్వర విద్యాలయానికి వచ్చారు. భారతీయ వృక్షశరీర ధర్మశాస్త్ర సంఘానికి అధ్యక్షులుగా పనిచేశారు. అనేక శాస్త్రీయ సంఘాలలో సభ్యులుగా ఉన్నారు.

*రామబ్రహ్మం, గూడవల్లి :* సుప్రసిద్ధ సినీ నిర్మాత, దర్శకుడు. జననం 1898 లో కృష్ణాజిల్లా నందమూరులో. చల్లపల్లి జమీందారు సహకారంతో సారథీ ఫిలిమ్స్ స్థాపించారు. ఈ సంస్థపేరిట కులవ్యవస్థను నిరసించే 'మాలపిల్ల', విప్లవాత్మకమైన ఇతివృత్తంతో 'రైతు బిడ్డ' చిత్రాలనుతీసి విజయవంతం చేశారు. చలనచిత్రాల ద్వారా ప్రజలను చైతన్యవంతులను చేసిన గొప్పవ్యక్తి. 1944 లో దక్షిణభారత ఫిలింస్ వాణిజ్య సంఘానికి అధ్యక్షులు. శారదా ఫిలింస్ స్థాపించి పంతులమ్మ, పల్నాటియుద్ధం చిత్రాలు తీశారు. కొన్ని చిత్రాలకు దర్శకులు. సమదర్శిని, ప్రజామిత్ర పత్రికలకుసంపాదకులు. వీరు చాలాకాలంక్రితం దివంగతులయ్యారు.

*రామమూర్తి, అళ్వార్ భాటి :* గొప్ప మార్దంగికులు. జననం : 1876. సుకుమార, సుమధుర వాద్య నైపుణ్యంగలవారు. గొప్ప సంగీత విద్వాంసులకు పక్క వాద్యంవాయించి, పేరు ప్రఖ్యాతులు గడించారు. 1932 లో సరస్వతీ గానసభవారు వీరికి సువర్ణఘంటాకంకణం బహూకరించారు. 'మార్దంగికాచార్య' బిరుదు పొందిన వీరు 1944 లో చనిపోయారు.

*రామమూర్తి, కోడి :* జననం 1885 లో, శ్రీకాకుళం జిల్లా వీరఘట్టంలో. తెలుగు పహిల్వాన్, కలియుగభీముడు, మల్లయుద్ధ మార్తాండుడు, జయవీరహనుమాన్, యూత్ ఇండియన్ హెర్క్యులస్ అని అందరిచేతా మన్ననలు పొందిన వ్యాయామ వీరుడు. 1901 లో మద్రాసులో వ్యాయామ శిక్షణపొంది, 1903 లో తుని మహారాజు సహాయంతో సర్కస్ కంపెనీ స్థాపించి, దేశమంతటా పర్యటనలు చేశారు. డ్రిల్లు మాస్టరుగా జీవితాన్ని ప్రారంభించిన వీరు,విదేశాల్లో కూడా తన శారీరకబల విన్యాసాన్ని ప్రదర్శించి, అందర్నీ ఆశ్చర్యపర్చి, మింటో, జార్జి ప్రభువుల సత్కారం పొందారు. 1928 లో బెనారస్ హిందూ విశ్వవిద్యాలయ వ్యాయామవిభాగానికి అధిపతిగా ఉన్నారు. మూడున్నరటన్నుల బరువు మోసిన ఈ వీరుడు 1938 లో అస్తమించడం జరిగింది.

*రామమూర్తి, గిడుగు :* మహా పండితుడు, బహుభాషా శాస్త్రవేత్త, వ్యావహారికాంధ్రభాషోద్యమ పితామహుడు. ఛాందస పండిత భిషక్కులకు, పటాటోప డిండిమభట్టులకు గుండె బెదురు పుట్టించిన మేధావి, గిడుగు పిడుగుగా పేరొందిన రామమూర్తిగారు 1863 లో శ్రీకాకుళంజిల్లా పర్వతాలపేటలో పుట్టారు. సవరలకు,సవరభాషకువీరు చేసిన సేవ అసాధారణం. మద్రాసు ప్రభుత్వం వీరిని 'రావుసాహెబ్' బిరుదుతో, 'కైజర్‌హింద్' బంగారు పతకంతో సత్కరించింది. వీరిని ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు 'కళాప్రపూర్ణ' బిరుదుతో గౌరవించింది. తెలుగు-సవర నిఘంటువు, బాలకవిశరణ్యం, గద్య చింతామణి, ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజం అనే గ్రంథాలు వీరు రచించారు. వీరు 1940 జనవరి 24 న దేహయాత్ర చాలించారు.

*రామమోహనరావు, నండూరి :* ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకుడు, సామాజిక, శాస్త్రగ్రంథ రచయిత, చేవగల అనువాదకుడు, వక్త, జననం : కృష్ణాజిల్లా ఆరుగొలనులో 1926 లో. ఆంధ్రసచిత్రవార పత్రికలో సహాయ సంపాదకులుగా ఉన్నప్పుడు తెలుగువారికి మార్కెట్వేన్. జూల్స్‌వెర్న్ మొదలైనవారి రచనలను అద్భుతంగా అనువాదంచేసి అనువాద రచనలపట్ల పాఠకుల మోజును పెంచారు. విశ్వరూపం, నరావతారం మొదలైన గ్రంథాలను ఎంతో పరిశోధనచేసి, వ్రాసి, ప్రాచ్య, ఆధునిక విజ్ఞానాన్ని అరటిపండు వొలిచి అరచేతిలో పెట్టినట్లుగా అందించారు. పత్రికారచనలో, సంపాదకత్వంలో సిద్ధహస్తులు.

*రామయ్యాపంతులు, జయంతి :* జననం : కోనసీమలోని ముక్తేశ్వరంలో 1861 లో. సంస్కృతాంధ్ర, ఆంగ్లభాషలలో వీరికి విశేష పరిచయముంది. 1911 లో రాష్ట్ర న్యాయాధీశులయ్యారు. రామవాచకం, కవిజనాశ్రయం వ్రాసి, ఉత్తరరామచరిత్ర, చంపూరామాయణం మొదలైనవాటిని తెనిగించారు. ఇంగ్లీషులో కొన్ని గ్రంథాలు వ్రాశారు. 1941 లో స్వర్గస్థులయ్యారు.

*రామలక్ష్మి, కె :* సుప్రసిద్ధ నవలా, కథానికా రచయిత్రి. ఆంధ్రాంగ్లభాషల్లో విశేష పరిచయంగల వీరు 1930 లో కోటనందూరులో జన్మించారు. మద్రాసు విశ్వవిద్యాలయంలో బి.ఏ. పట్టభద్రులై 1951 నుంచి రచనలు సాగిస్తున్నారు. అవతలిగట్టు, తొణకిన స్వర్గం, జీవనజ్యోతి, కోటిగాడు, ఆణిముత్యం, నీదేనాహృదయం మొదలయిన గ్రంథాలు వ్రాశారు. గృహలక్ష్మి స్వర్ణ కంకణం అందుకొన్నారు. వీరు వ్రాసిన కొన్ని నవలలు సినిమాలుగా వచ్చాయి.

*రామలింగారెడ్డి, కట్టమంచి :* మహామేధావి, మహావక్త, బహుముఖప్రజ్ఞాశాలి, అగ్రశ్రేణి సాహిత్యవేత్త, కవి, విమర్శకుడు. జననం : 1880 డిసెంబరు 10 న, చిత్తూరుజిల్లా కట్టమంచిలిలో. కేంబ్రిడ్జిలోనూ, అమెరికాలోనూ విద్యాభ్యాసం చేశారు. 1922 లో మద్రాసు శాసనసభ సభ్యులు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు స్థాపనకు ముఖ్య కారకులు. 1926 లో దానికి తొలి వైస్‌ఛాన్సలరుగానూ, తిరిగి 1936లో మరల మరోసారి వైస్‌ఛాన్సలరుగానూ ఉన్నారు. 1949 లో మైసూరు విశ్వవిద్యాలయానికి ప్రోఛాన్సలర్‌గా పనిచేశారు. 1937 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు 'కళాప్రపూర్ణ' బిరుదునిచ్చారు. కవిత్వతత్త్వవిచారం, ముసలమ్మమరణం, ఆర్థికశాస్త్రం మొదలయిన గ్రంథాలు వ్రాసినవీరు 1951 ఫిబ్రవరి 24 న ఇహలోక యాత్ర చాలించారు. వీరి శతజయంతి దినోత్సవం ఈ మధ్యనే జరిగింది.

*రామస్వామిచౌదరి, త్రిపురనేని :* కవి, బహు భాషా పండితుడు, ద్రావిడవాదాన్ని తెలుగునాట నిలిపిన ప్రథమాంధ్రుడు, పురాణవ్యతిరేకి అయిన గొప్ప రచయిత. జననం : 1887 లో కృష్ణాజిల్లా అంగలూరులో. ఇంగ్లండులో బారిష్టరు పట్టా పొందారు. కొంతకాలం న్యాయవాద వృత్తి చేశారు. వీరు తెలుగుదేశంలో హేతువాదానికి మూలపురుషులు. తెలుగు

వారితో భావవిప్లవానికి కృషిచేశారు. శతావధాని. కవి, పండితులకు, న్యాయవాదులకు, మరెందరో ప్రముఖులకు వారి ఇల్లు ఆలోచనాకేంద్రంగా ఉండేది. కులాధికారాలను, మూఢ విశ్వాసాలను కూల్చి వేయడానికి, ప్రజల జీవనవిధానంలో మార్పు రావడానికి భావవిప్లవం అవశ్యకమని తన ఉపన్యాసాలద్వారా, రచనలద్వారాచాటి చెప్పిన విప్లవవాది. సూతపురాణం, భగవద్గీత, ఖూని, ధూర్త మానవశతకం, శంబుకవధ, వివాహవిధి మొదలయిన గ్రంథాలు ఆయన హేతువాదశక్తికీ, ఆలోచనాబలానికి ప్రతీకలు. హరిజనాభివృద్ధికి పాటుబడ్డారు. కవి రాజు బిరుదాంకితులు. 1943 లో స్వర్గస్థులయ్యారు.

*రామానుజరావు, దేవులపల్లి :* సాహితీవేత్త; గ్రంథాలయోద్యమకర్త, పత్రికాసంపాదకుడు, గ్రంథకర్త. జననం : 1917 ఆగస్టు 24 న ఓరుగల్లులో. అనేక ఉద్యమాలతో, సారస్వత సభలతో, సంస్థలతో, పరిషత్తులతోవీరికి సన్నిహిత సంబంధముంది. చాలాకాలం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి కార్యదర్శిగా ఉన్నారు. కొంతకాలం న్యాయవాద వృత్తిచేపట్టారు. రచనలు నవ్యకవిత, నీరాజనం, సారస్వత నవనీతం, వ్యాసమంజూష, మనదేశం, తెలుగుదేశం, జవహర్‌లాల్‌నెహ్రూ మొదలైనవి కొంతకాలం రాజ్యసభలో సభ్యులు.

*రామారావు, కోటంరాజు :* పత్రికాసంపాదకుడు, రచయిత. లీడర్, టైమ్స్ ఆఫ్ ఇండియా, స్వరాజ్య, నేషనల్ హెరాల్డ్ మొదలయిన 26 పత్రికలలో పనిచేసి మంచి పాత్రికేయునిగా కీర్తిగడించారు. జననం : ప్రకాశంజిల్లా చీరాలలో. రాజ్యసభ సభ్యులుగాఉన్నారు. 1961 లో స్వర్గస్థులయ్యారు.

*రామారావు, దామెర్ల :* పాశ్చాత్యుల ప్రకృతి ఆరాధననూ, ప్రాచ్యుల భావస్ఫోరకతను జీర్ణించుకొన్న ప్రఖ్యాత చిత్రకారుడు. జననం : 1896 లో. ఆంధ్ర అకాడమీ ఆఫ్ ఆర్ట్స్‌ను రాజమండ్రిలో నెలకొల్పారు. వీరు గీసిన చిత్రాలు కెనడా, టోరాంట్ మొదలయిన చిత్రకళా ప్రదర్శనలలో పేరు తెచ్చుకొన్నాయి. రూపకల్పనలో సజీవతను చేకూర్చడం వీరి ప్రత్యేకత. చిత్రకళలో ఎన్నో 'యిజమ్' లను ప్రవేశపెట్టారు. 1925 లో స్వర్గస్థులయ్యారు.

*రామారావు, ఎన్. టి.* సుప్రసిద్ధ సినీనటుడు, నిర్మాత, నటతర్న బిరుదాంకితుడు, దర్శకుడు, చిత్రకల్పనకర్త. జననం : 1923 మే 23 న కృష్ణాజిల్లా నిమ్మకూరులో. పూర్తి పేరు నందమూరి తారకరామారావు. 1947లో బి. ఏ. డిగ్రీ పొందారు. 1948 లో సినిమారంగంలో ప్రవేశించి వందలాది చిత్రాలలో నటించి అగ్రశ్రేణి నటులయ్యారు. చిత్ర పరిశ్రమను హైదరాబాదులో స్థిరపరచడానికి కృషిచేశారు. రామకృష్ణాస్టూడియోస్‌నే కాక మూడు సినిమాహాళ్ళు నిర్మించారు. అనేక చిత్రాలు నిర్మించడమే కాక దర్శకత్వ బాధ్యత వహించారు. రాయలసీమ క్షామనివారణనిధికి, గోదావరి వరదబాధితులసహాయనిధికి, దేశరక్షణ నిధికి, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నిధికి విరాళాలు ఇవ్వడమే కాక ప్రజలనుంచి విరాళాలు పోగుచేసి అందించారు. వీరికి 1968లో పద్మశ్రీ బిరుదునిచ్చి ప్రభుత్వం గౌరవించింది. ఆంధ్ర విశ్వకళాపరిత్తు "కళాప్రపూర్ణ" నిచ్చింది.

***రామారావు, మారేమండ :*** కాకతీయ రాజవంశంపై ప్రత్యేక పరిశోధనలు కొనసాగించిన వీరు నవంబరు 28, 1906 లో రాజమండ్రిలో జన్మించారు. తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు భాషలు చదివిన వీరు ఆగ్నేయ ఆసియాలోని తెలుగు సామ్రాజ్యాలను గురించి ప్రపంచానికి తెలియజేశారు. కాకతీయ సామ్రాజ్యం, తెలుగు-వెలుగు, శాతవాహన సామ్రాజ్యం మొదలైన గ్రంథాలు తెలుగులోగాని, ఇంగ్లీషులోగాని 200 దాకా వ్రాశారు. నిజాంకాలేజీ, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా పనిచేశారు. ఇటీవల పరమపదించారు.

*రామారావు, ఎస్. వి. :* అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన ఆధునిక చిత్రకారుడు. జననం: కృష్ణాజిల్లా గుడివాడలో. మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లోను, తరవాత 1962-68లో లండన్ యూనివర్సిటీలోను చిత్రకళను అభ్యసించారు. ఆపైన అమెరికాలో ఓహైయో రాష్ట్రంలో సిన్సినాటి యూనివర్శిటీలో కొంతకాలం కళాభ్యాసం చేశారు. 1970 నుంచి కేంటరి యూనివర్శిటీలో చిత్రలేఖనం బోధించారు. తరవాత నేష్విల్‌లోని షిలడి కాలేశికో లైబ్రరీ సైన్సులో డాక్టరేట్ కోసం కృషిచేశారు.

***రాంరెడ్డి, జి. :*** ప్రభుత్వ పరిపాలనా శాస్త్రవేత్త, ప్రముఖ విద్యావేత్త, గ్రంథకర్త, పరిపాలనాదక్షుడు, ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు. జననం : 1929లో. కరీంనగర్ జిల్లా మైలారంలో. లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో ఎం.ఎస్‌సి చదివారు. పంచాయతీరాజ్ మీద ఎన్నో గ్రంధాలు ఆంగ్లంలో వ్రాశారు, ఉన్నత బోధనలో తెలుగు మాధ్యం పట్ల అభిమానంగల వీరు, పోస్టుగ్రాడ్యుయేట్ స్థాయిలోకూడా ప్రాంతీయభాషల్లో ప్రశ్నలకు జవాబులువ్రాసే అవకాశాన్నికల్పించారు. తెలుగులోనూ ఎన్నో గ్రంథాలువ్రాశారు.

***రామిరెడ్డి, దువ్వూరి :*** కవి, నాటకకర్త. జననం : 1879లో నెల్లూరు జిల్లా దువ్వూరులో. 'కవికోకిల' బిరుదాంకితులు. పానశాల, నీలుడు, వనకుమారి, జలదాంగన, యువకస్వప్నం, కడపటి వీడ్కోలు మొదలైన ఖండకావ్యాలు, సీతావనవాసం, మాధవ విజయం, కాంగ్రెసువాలా నాటకాలు వ్రాశారు. 1947 లో స్వర్గస్తులయ్యారు.

***రామోజీరావు, సి. హెచ్ :*** పేరెన్నికగన్న పత్రికాధిపతి, వ్యాపారనిర్వహణ నైపుణ్యాలుగల వ్యాపారవేత్త. వ్యాపారవిజయానికి పబ్లిసిటీ ప్రాణంవంటిదని విశ్వసించే బిజినెస్ మాగ్నెట్. జననం : 1936. మార్గదర్శి చిట్‌ఫండ్స్; మార్గదర్శి ఫైనాన్షియర్స్, ప్రియ పచ్చళ్ళు మొదలైన సంస్థలకు చైర్మన్. డాల్ఫిన్ హోటల్‌కు మేనేజింగ్ డైరెక్టరు. ఈనాడు, సితార, అన్నదాత, విపుల, చతుర అనే దిన, వార, మాసపత్రికలకు సంపాదకులు. 1979లో అమెరికాప్రభుత్వం ఆహ్వానంపై అమెరికా వెళ్ళి, యూరప్‌ను కూడా పర్యటించి వచ్చారు. సామాజిక బాధ్యతలను గుర్తెరిగిన, సాహిత్యంపట్ల అభిరుచిగల, 'ధైర్యే సాహసే లక్ష్మి'

అనే సిద్ధాంతంపై నమ్మకంగల ప్రముఖ వాణిజ్యవేత్త. ఏ పత్రిక ప్రారంభించినా, ఏవస్తువు ప్రవేశపెట్టినా మార్కెటింగ్‌పై దృష్టిని కేంద్రీకరించి, ప్రణాళికా బద్ధంగా నిర్వహించి, లక్ష్యాలమేరకు విజయాన్ని సాధించగల మేనేజ్‌మెంట్ నిపుణులు.

*రావు, సి. ఆర్ :* విఖ్యాత గణాంక శాస్త్రజ్ఞుడు. అంతర్జాతీయ గణాంకసంస్థ చైర్మన్ పదవిని అలంకరించిన వీరు గణాంక శాస్త్రానికి సంబంధించి విశేష పరిశోధనలు చేశారు. ఉన్నత సాంఖ్యా విధానాలు, రేఖా సంఖ్యాను పరిమితిపై ప్రామాణిక గ్రంథాలు రచించారు. వీరికృషికి 1963లో భట్నాగర్ అవార్డు లభించింది. భారతీయ గణాంక పత్రిక 'సాంఖ్య' కు సంపాదకులుగా ఉన్నారు. కలకత్తాలోని గణాంక పరిశోధనా శిక్షణ సంస్థకు డైరక్టరుగా చాలాకాలం నుంచి ఉన్నారు. యఫ్ ఆర్.ఎస్. పొందిన ఏకైక ఆంధ్రులు.

*రావు, కె. ఎల్. డాక్టర్ :* జననం : 1902 జులై 15 న కృష్ణాజిల్లాలో. సుప్రసిద్ధ ఇంజనీరు, మాజీ కేంద్రమంత్రి. బర్మింగ్‌హామ్ విశ్వవిద్యాలయం నుంచి ఇంజనీరింగ్ డాక్టరేట్ పొందినవీరు ఇంటర్‌నేషనల్ సొసైటీ ఆఫ్ సాయిల్ మెకానిక్స్ అండ్ ఫౌండేషన్ ఇంజనీరింగ్‌కు కొంతకాలం ఉపాధ్యక్షులుగా ఉన్నారు. హీరాకుడ్, కోసి, తుంగభద్ర, చంబల్, నాగార్జునసాగర్ ప్రాజెక్టుల నిర్మాణంలో ప్రముఖపాత్ర వహించారు. 1962 లో విజయవాడ నుంచి లోక్‌సభకు ఎన్నికై, కొంతకాలం కేంద్రమంత్రిగా ఉన్నారు. 1963 లో ప్రభుత్వం 'పద్మవిభూషణ్' బిరుదునిచ్చింది. కేంద్ర జలవిద్యుత్ కమీషన్ సభ్యులు. అసలు పేరు కానూరు లక్ష్మణరావు.

*రుక్మిణీనాథశాస్త్రి, జలసూత్రం :* కవి, విమర్శకుడు, కథారచయిత, నాటక కర్త, పేరడీ కావ్యరచనలో సిద్ధహస్తుడు, సంస్కృతాంధ్ర భాషావేత్త. జననం : 1914 లో మచిలీపట్నంలో. కొంతకాలం ఆంధ్రసచిత్రవారపత్రికలో, మరికొంతకాలం ఆలిండియా రేడియోలో పనిచేశారు. రచనలు : అక్షింతలు (పేరడీలు), ఎర్రటిచీకటి, శరత్‌పూర్ణిమ (కథా సంపుటాలు), శబరి (నాటకం), సుమారు 450 రేడియో నాటికలు. జరుక్‌శాస్త్రిగా అందరికీ తెలిసినవారు. కొద్ది సంవత్సరాలక్రితం వీరు కాలధర్మం చెందారు.

*రెడ్డి, డి. యస్ :* విద్యావేత్త, పరిపాలనాదక్షుడు జననం : ఏప్రిల్ 28, 1897, కడపజిల్లాలో. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఏ పట్టాపొంది మద్రాసు ప్రభుత్వ విద్యాశాఖలో అధికారిగా ప్రవేశించి 1948 లో విద్యాశాఖ డైరెక్టరు అయ్యారు. లెబనాన్ దేశానికి కొంతకాలం సలహాదారుగా పనిచేశారు. ఆంధ్రరాష్ట్రానికి విద్యాశాఖ డైరెక్టరుగా 1957 వరకు ఉన్నారు. 1957 లో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా 11 సంవత్సరాలు ఉన్నారు. ఇటీవలే వీరు స్వర్గస్థులయ్యారు.

*రెడ్డి, పి. టి. :* ప్రఖ్యాత చిత్రకారులు. జననం : జనవరి 4, 1915 న కరీంనగర్ జిల్లా అన్నపరంలో. బొంబాయిలో సర్ జె.జె.స్కూల్ ఆఫ్ ఆర్ట్స్, కళను అభ్యసించి ప్రప్రథ

ములుగా డిప్లొమా సంపాదించారు. వ్యక్తిగత చిత్రకళా ప్రదర్శనలు ఏర్పాటు చేశారు. వీరు తమ చిత్రాలను ఎన్నో జాతీయ, అంతర్జాతీయ ప్రదర్శనలలో ప్రదర్శించి అనేక బహుమతులను, బంగారు పతకాలను పొందారు.

***రెడ్డి, బి. ఎన్ :*** కళనూ, వాస్తవికతనూ మేళవించి సినిమాను కళగా రూపొందించిన ఆదర్శ దర్శకుడు. పూర్తి పేరు బొమ్మిరెడ్డి నరసింహారెడ్డి. జననం : 1908 నవంబరు 6. సినిమా నిర్మాత, దర్శకులు. 1937 లో చిత్ర పరిశ్రమలో ప్రవేశించారు. 1938లో వాహినీ పిక్చర్స్ స్థాపించారు. వందేమాతరం, సుమంగళి, స్వర్గసీమ, మల్లీశ్వరి, బంగారుపాప, భాగ్యరేఖ, రంగులరాట్నం, బంగారు పంజరం మొదలయిన చిత్రాలు డైరెక్టు చేశారు. వీరికి భారత ప్రభుత్వం పద్మభూషణ్ అవార్డునిచ్చి సత్కరించింది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు డాక్టరేట్ నిచ్చి గౌరవించారు. కొద్ది సంవత్సరాల క్రితం మరణించారు.

***రెడ్డి, హెచ్. ఎమ్ :*** ఆంధ్ర చలనచిత్ర పితామహుడు, దర్శకుడు, నిర్మాత, స్టూడియో అధిపతి. తెలుగులో తొలిచిత్రం 'భక్తప్రహ్లాద' ను 1931లో తీసిన ఖ్యాతి వీరికి దక్కుతుంది. ఆ తర్వాత మరికొన్ని చిత్రాలు తీసి తెలుగు చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి గట్టి పునాది వేశారు. చాల సంవత్సరాల క్రితం స్వర్గస్తులైన వీరు చిరస్మరణీయులు.

***లక్ష్మణరావు, కొమర్రాజు :*** పరిశోధకాగ్రణి. బహుభాషా పండితుడు. సంఘ సంస్కరణవాది. జననం : కృష్ణాజిల్లా పెనుగంచి ప్రోలులో 1874 మే 18న. 1901 లో హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయల గ్రంథాలయంఅనే మొట్టమొదటి ఆధునికగ్రంథాలయాన్ని స్థాపించారు. 'విజ్ఞాన చంద్రికా గ్రంథమాల'ను స్థాపించి దేశ చరిత్రలు, మహాపురుషుల చరిత్రలు, శాస్త్ర వైజ్ఞానిక గ్రంథాలు ప్రచురించి తెలుగు దేశమంతటా వ్యాప్తి చేశారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాన్ని మూడు సంపుటాలుగా ప్రచురించారు. ఆంధ్ర పరిశోధన సంఘం స్థాపించారు. అదేవీరి మరణానంతరం లక్ష్మణరావు పరిశోధన మండలి అయింది. విజ్ఞానవ్యాప్తికి, పరిశోధనకు జీవితమంతా కృషిచేశారు. 1923 లో పరమపదించారు.

***లక్ష్మీకాంతం, పింగళి :*** కాటూరి వెంకటేశ్వరరావు గారితో జంటకవి, పండితుడు. 1894 లో కృష్ణాజిల్లా దివితాలూకా చిట్టూర్పులో జన్మించారు. ఎం.ఏ పట్టభద్రులు.1931లో ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగుశాఖకు ఆచార్యులుగా, ఆలిండియా రేడియో సాహిత్యసలహాదారుగా ఉద్యోగాలుచేశారు. రచనలు: మధురపండితరాజం, ద్విపదభారతం, సౌందరనందం పౌలస్త్య హృదయం. వీరు 1971 లో కాలధర్మం చెందారు.

***లక్ష్మీకాంతం, బలిజేపల్లి :*** ప్రసిద్ధ నాటక, సినీరచయిత, నటుడు, 1881లో గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా ఇటికంపాడులో జన్మించిన వీరు సంస్కృతాంధ్ర భాషలు చదివారు.

శతకాలు, పద్యాలు, నవలలు, నాటకాలు రచించారు. హరిశ్చంద్ర, బుద్ధిమతీ విలాసం, సాత్రాజితీయం, ఉత్తర రాఘవం వీరి నాటకాలు. అవధానాలు చేయడంలో అందెవేసినచేయి. 1953 లో కీర్తిశేషులయ్యారు.

*లక్ష్మీకాంతమ్మ, ఊటుకూరి* : కవయిత్రి. జననం : 1917. ఉభయభాషాప్రవీణఅయిన వీరికి ఎన్నో సాహిత్యసంస్థలతో ప్రత్యేక,పరోక్ష సంబంధాలున్నాయి. స్వర్ణకంకణగ్రహీతలు. ఆంధ్రకవయిత్రులు, యుగపురుషుడు, కన్యకాపరమేశ్వరి సుప్రభాతం మొదలైన గ్రంథాలు వ్రాసిన వీరికి సంస్కృతాంధ్రాలతో విశేష పరిజ్ఞానమున్నది.

*లక్ష్మీనరసింహం, చిలకమర్తి* : బహుముఖ రచయిత, కవి, వ్యాసకర్త, నాటక కర్త, నవలాకారుడు. జననం : 1867 సెప్టెంబరు 26న తణుకు తాలూకా ఖండవల్లిలో. సౌందర్య తిలకం, కృష్ణవేణి, మణిమంజరి, గణపతి, రాజరత్నం, రామచంద్రవిజయం, అహల్యాబాయి హేమలత మొదలైన నవలలు, కీచకవధ, గయోపాఖ్యానం, శ్రీరామజననం, సీతాకళ్యాణం, రఘుకులచరిత్ర, సిద్ధార్థచరిత్ర, ప్రసన్నయాదవ మొదలైన నాటకాలు, అనేక ప్రహసనాలు, వ్యాసాలు వ్రాశారు. వీరి గయోపాఖ్యాన నాటకం లక్ష ప్రతులు అమ్ముడు పోయింది. కొంత కాలం రాజమండ్రిలో ఉపాధ్యాయులు. 1899లో హిందూ లోయర్ సెకండరీ స్కూలు, 1909 లో నిమ్నజాతుల పాఠశాల స్థాపించారు. సంఘసేవకులు. బ్రహ్మసమాజ, హితకారిణి సమాజాల ద్వారా సంఘసేవచేశారు. 1943లో 'కళాప్రపూర్ణ' నిచ్చి ఆంధ్రవిశ్వవిద్యాలయం గౌరవించింది. 1947 లో స్వర్గస్థులయ్యారు.

*లక్ష్మీనరసింహారావు, పానుగంటి* : సుప్రసిద్ధ 'సాక్షి' వ్యాస సంపుటాల రచయిత. నాటక కర్త. జననం : 1865 లో రాజమండ్రివద్దనున్న సీతానగరంలో. బి.ఏ. పట్టభద్రులు. గోదావరిజిల్లాలోని లక్ష్మీనరసాపురం ఎస్టేటుకు కొంతకాలం దివాను. పిఠాపురం జమీందారు ఆస్థానంలో నాటక కవి. వీరిపేరు చెప్పగానే మొదట స్ఫురించేవి సాక్షి వ్యాసాలు. ఇవి ఆరు సంపుటాలు. సుమారు 30 నాటకాలు రచించారు. వాటిలో 'కంఠాభరణం' అత్యంత ప్రసిద్ధమైనది. వీరి రచనలు హాస్యరస ప్రధానాలు. వీరు 'ఆంధ్ర ఎడిసన్' గా ప్రఖ్యాతి చెందారు. 1940 లో అసువులు కోల్పోయారు.

*లక్ష్మీనారాయణ, ఉన్నవ* : ఉత్తమరచయిత, జాతీయనాయకుడు, సంఘసంస్కర్త. జననం: 1873 లో గుంటూరుజిల్లా వేములూరుపాడులో. న్యాయశాస్త్రం చదివి, న్యాయవాద వృత్తిస్వీకరించారు. 1920 నుంచి స్వాతంత్ర్యోద్యమాలలో పాల్గొని జైలుకు వెళ్ళారు. 1922 1922 లో శారదానికేతనం స్థాపించి, స్త్రీ విద్యను ప్రోత్సాహించారు. 1910-11 లలో విశాలాంధ్ర నిర్మాణం కోసం కృషిచేసి, ప్రచారం చేశారు. నాయకురాలు, బుడబుక్కల జోస్యం, భావతరంగాలు, మాలపల్లి మొదలైనవి వీరి రచనలు. మాలపల్లి నవల తెలుగు నవలాసాహిత్యంలో మణిపూసవంటిది. వీరు 1958 లో మరణించారు.

**లక్ష్మీపతి, ఆచంట :** ఆయుర్వేదాన్ని పునరుద్ధరించిన మహాశయులలో ఒకరు. అకళంక దేశభక్తుడు, సంస్కర్త. జననం: 1880 మార్చి 3న పశ్చిమ గోదావరిజిల్లా మాధవరంలో. మద్రాసు ఆయుర్వేద కళాశాల ప్రధానాధ్యాపకులుగా పనిచేశారు. 1921 లో మద్రాసులో "ఆంధ్ర ఆయుర్వేద ఫార్మసీ" ని ప్రారంభించారు. ఆవడిలో 'ఆరోగ్య ఆశ్రమం' అనే ఆయుర్వేద క్లినిక్ స్థాపించారు. 1921-28లో 'ధన్వంతరి' అనే ఆయుర్వేద మాసపత్రికను ప్రచురించారు. 1925-30 లో ఆంధ్ర మెడికల్ జర్నల్ సంపాదకులుగాపనిచేశారు.'భిషగ్రత్న' "ఆయుర్వేదోద్ధారక" మొదలయిన బిరుదులు పొందారు. 1962 జూన్ 4న స్వర్గస్తులయ్యారు.

**లచ్చన్న, గౌతు :** రాజకీయ నాయకుడు, మాజీమంత్రి, పత్రికా సంపాదకుడు. జననం: 1909లో. ఉప్పుసత్యాగ్రహంలోనూ, సహాయనిరాకరణోద్యమంలోనూ పాల్గొన్నారు. ప్రకాశం మంత్రివర్గంలోనూ, గోపాలరెడ్డి మంత్రివర్గంలోనూ కొంతకాలం సభ్యులుగాఉన్నారు. సోంపేట, మందసా పంచాయతీ సమితులకు, శ్రీకాకుళంజిల్లాపరిషత్‌కు అధ్యక్షులుగాఉన్నారు. సింధియా షిప్‌యార్డ్ కార్మికసంఘానికి,ఐ యన్ టి యు సి. ఆంధ్రశాఖకు అధ్యక్షులయ్యారు. "బహుజన" పత్రికకు సంపాదకులుగా వ్యవహరించారు. ఆంధ్రప్రదేశ్ విధానసభలో కొంత కాలం జనతా ప్రతిపక్షనాయకులు ఆంధ్రప్రదేశ్ స్వతంత్రపార్టీ అధ్యక్షులుగా కూడాఉన్నారు. గత లోక్‌సభ ఎన్నికల సమయంలో భారతీయ లోక్‌దళ్ నాయకులు.

**లత :** అసలుపేరు తెన్నేటి హేమలత. జననం : విజయవాడలో. కళాప్రపూర్ణ బిరుదాంకితులు. నవలా రచనలో సిద్ధహస్తులు. దాదాపు 50 నవలలు దాకా వ్రాశారు. మోహన వంశి, వారిజ, పిచ్చివాళ్లస్వర్గం, తిరగబడ్డదేవతలు, పథవిహీన, మహానగరంలో స్త్రీ మొదలయిన నవలలు, అంతేకాకుండా "ఊహాగానం" నాలుగు సంపుటాలు వెలువరించారు.

**వరదాచార్యులు, వానమామలై :** అభినవ పోతన బిరుదాంకితుడు, ప్రాచీనశైలిలో పద్యాన్ని పరమ సుందరంగా పలికించగల ప్రౌఢకవి. జననం : 1912 ఆగస్టు 16న. కొన్నాళ్లు ఉపాధ్యాయ వృత్తి స్వీకరించారు. మహాపండితులైన వీరు-పోతనచరిత్ర,మణిమాల, ఆహ్వానం, వైశాలిని మొదలైన గ్రంథాలు వ్రాశారు.

**వరలక్ష్మమ్మ, కనుపర్తి :** కథారచయిత్రి, నవలలూ, నాటకాలూ, వ్యాసాలూ, వ్రాశారు. స్త్రీ జనాభ్యుదయం, సాంఘిక సంక్షేమంకోసం మత జీవితాన్ని అంకితంచేసి, అవిరళంగా కృషిచేశారు. గృహలక్ష్మి, స్వర్ణ కంకణ గ్రహీతలు. బహుముఖ ప్రజ్ఞతో రచనలు చేశారు. జననం : 1896 లో. రచనలు : వసుమతి, శారదలేఖలు, బాలసేతి కథావళి, జ్యోతి మొదలయినవి. ఇటీవల స్వర్గస్తులయ్యారు.

**వల్లూరి, ఎన్. ఆర్. :** బెంగుళూరులోని నేషనల్ ఏరోనాటిక్స్ లాబొరేటరీ డైరెక్టర్ పద్మశ్రీ డాక్టర్ ఎన్.ఆర్. వల్లూరి దాదాపు 14 సంవత్సరాలపాటు అమెరికాలో కాల్ టెక్స్‌లో

ఉన్నారు. జననం : కాకినాడలో 1924లో. వీరు లోహగ్లాని (మెటల్ ఫెటీగ్)ని గురించి రూపొందించిన సమగ్రసిద్ధాంతం విమానాలు తయారుచేసే కంపెనీలవారికి చాలా మేలుచేసింది. ఆవ్రో విమానం తయారీలో కూడా ఈ సిద్ధాంతం ఉపయోగించారు. వీరు ఇండియన్ ఏరో నాటికల్ సొసైటీకి అధ్యక్షులు. అనేక సంఘాలలో సభ్యత్వం, చైర్మన్‌హోదా వారికిఉన్నాయి. కాల్‌టెక్స్‌లో ఎమ్. ఎస్; పిహెచ్. డి. డిగ్రీలు తీసుకొన్నారు.

*విజయరాఘవరావు* : సంగీతకళా శిరోమణి, సంగీత దర్శకుడు, సర్తకుడు, గ్రంథ కర్త. నర్సరావుపేటలో జన్మించారు బి. ఏ. (ఆనర్స్) చదువుతూ, భరతనాట్యం నేర్చు కొని, విదేశాలలో భరతనాట్య ప్రదర్శనలిచ్చారు. రవిశంకర్ శిష్యరికంలో గొప్ప సంగీత విద్వాంసులై, ఫిలిం డివిజన్‌లో సంగీత దర్శకునిగా చాలకాలం పనిచేశారు. 1970 లో వీరికి ప్రభుత్వం 'పద్మశ్రీ' బిరుదునిచ్చింది. ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమి 1967లో వీరికి గాన కళా ప్రపూర్ణ బిరుద ఇచ్చింది. వీరి వార్తా చిత్ర సంగీతానికి చాల అవార్డులు, సువర్ణపతకాలు లభించాయి. 'నిర్వాణ' అనే ఆంగ్ల కవితా సంకలనాన్ని వెలువరించారు.

*విశ్వం, విద్వాన్* : కవి, పండితుడు, విమర్శకుడు, సమీక్షకుడు, చిక్కని అనువాద కుడు, కళా ప్రపూర్ణ బిరుద గ్రహీత అయిన విశ్వంగారు 1915న అనంతపురంజిల్లా తరి మెలలో జన్మించారు. కాకలు తీరిన స్వాతంత్ర్య సమరయోధులలో ఒకరుగా కారాగార వాసాన్ని అనుభవించారు. బహుముఖ ప్రవీణులైన వీరు మీజాన్, ప్రజాశక్తి, ఆంధ్రపత్రిక. ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ మొదలయిన పత్రికలకు అసిస్టెంట్ ఎడిటర్‌గా, ఎడిటర్‌గా పని చేశారు. మాణిక్యవీణ, తెలుపు-నలుపు, అవి-ఇవి మొదలయిన శీర్షికలద్వారా లక్షలాది పాఠ కుల్ని ఆకట్టుకొన్నారు. ఒకనాడు, పెన్నేటిపాట, నా హృదయం మొదలయిన కావ్యాలు వ్రాశారు.

*విశ్వనాథం, తెన్నేటి* : గాంధేయవాది, స్వాతంత్ర్య యోధుడు. మంచివక్త. జననం: 1896 లో విశాఖపట్నంజిల్లా పీరవల్లిలో. ఎం. ఏ. బి. ఎల్. పట్టభద్రులు. గాంధీజీ పిలుపు మీద కోర్టులను బహిష్కరించి స్వాతంత్ర్యోద్యమంలోకి దిగారు. 1925 నుంచి విశాఖపట్నం జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు. 1937 లో మొదటి మద్రాసు గవర్నమెంట్‌లో రాజగోపాలాచారి నాయకత్వంలో మంత్రి అయ్యారు. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంతో కలసి కొన్నాళ్ళు పనిచేసి 1950 లో ఆయనతో విడిపోయి, ప్రజాపార్టీ స్థాపనకు కృషిచేశారు, 1951-53లలో అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకులు. ఉప్పుసత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాల్లో ప్రముఖ పాత్ర వహించారు. 1957 లో ఇండిపెండెటు అభ్యర్థిగా లోక్‌సభకు ఎన్నికయ్యారు. తన పొలాన్ని భూదానోద్యమానికిచ్చిన వీరు 1979 లో కాలధర్మం చెందారు.

*విశ్వనాథశాస్త్రి, రాచకొండ* : నవల, నాటకం, కథానిక-ఈ సాహిత్య ప్రక్రియల్లో కొత్త బాటను తొక్కి, సాహితీక్షేత్రంలో అద్భుతమైన పంటల్ని పండించిన రచయిత.

జననం : 1922 లో. వీరి రచనల్లో ఉత్తమ పాత్ర చిత్రణా, ఉత్కృష్టమైన శిల్పమూ, ఊహా పుష్టి, కమ్మని కవిత్వమూ, నిండైన నాటకీయత, నిశితమైన జీవిత పరిశీలనా, పదునైన వ్యాఖ్యానమూ, కఠోరమైన వాస్తవికతా ఉన్నాయి ఉపచేతనాన్ని మథించి, పాత్రోచితభాషలో విలక్షణ వాక్య విన్యాసంతో జీవితంలోని ఒక అంశం ఆధారంగా జీవితం మొత్తాన్నిఆవరించిన విషాదాన్ని చిత్రించడం వీరి ప్రతిభావిశేషం. వస్తువులోకూడా వీరు విప్లవాన్ని సాధించారు. విశాఖపట్నంలో అడ్వకేట్‌గా ఉంటున్నారు. రచనలు : అల్పజీవి, రత్తాలు-రాంబాబు, గోవు లొస్తున్నాయ్ జాగ్రత్త, సొమ్ములుపోనాయండి, రాజు-మహిషి మొదలయిన నవలలు, నిజం నాటకం, ఆరు సారాకధలు, ఆరు సారోకథలు, మరో ఆరు చిత్రాలు, ఋుక్కులు మొద లయిన కధాసంపుటాలు.

*విశ్వేశ్వరయ్య, మోక్షగుండం :* విశ్వవిఖ్యాత ఇంజనీరు. నీటిపారుదల, జల విద్యుత్ విషయాలలో సాటిలేనిమేటి. జననం : 1861 సెప్టెంబరు 15న కర్నాటక రాష్ట్రంలోని యద్దహళ్ళిలో. ఇంజనీరింగు పట్టభద్రులు. కొంతకాలం పబ్లిక్‌వర్క్స్ డిపార్ట్‌మెంటులో ఇంజ నీరుగాచేసి, 1909 లో హైదరాబాదు ప్రభుత్వ ప్రత్యేక ఇంజనీరింగ్ సలహాదారుగా ఉండి, మూసీవరదల శాశ్వతనివారణకు తోడ్పడ్డారు. 1909-12 లలో మైసూర్ ప్రభుత్వ చీఫ్‌ఇంజ నీరు. 1918 లో మైసూరుదివాన్. కావేరి ఆనకట్ట, కృష్ణరాజసాగర్ జలాశయ నిర్మాణాలలో ప్రముఖపాత్ర వహించారు. మైసూరు విశ్వవిద్యాలయం, వాణిజ్యమండలి స్థాపకులు. భద్రావతి స్టీల్ ఫాక్టరీ, లక్కవల్లి ప్రాజెక్టు నిర్మాణం, ఖడకోహస్లా బృహత్పథకం మొదలయిన వాటిలో కృషిచేసి, కీర్తి గడించారు. బొంబాయి, గ్వాలియర్, హైదరాబాదు, నాగపూర్, పూనా, సూరత్ మొదలయిన నగరాలలో నీటిపథకాలను, ప్రాజెక్టులనునిర్మించారు. ప్రభుత్వం 1955 లో "భారతరత్న" బిరుదునిచ్చి గౌరవించింది. వీరు 'భారతదేశపు పునర్నిర్మాణం' మొదలయిన గ్రంథాలు రచించారు. 1961 లో స్వర్గస్థులైనారు.

*వీరభద్రరావు, ఆదిరాజు :* సుప్రసిద్ధ సాహిత్య పరిశోధకుడు. తెలంగాణాలో విద్యా విజ్ఞాన చైతన్యానికి కృషిచేసిన వీరు 1887 లో ఖమ్మంజిల్లా మధిరతాలూకా నెందుకూరులో జన్మించారు. కొంతకాలం ఉపాధ్యాయవృత్తి స్వీకరించి, శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిల యానికి అనేక హోదాలలోసేవలు అందించారు. షితాబ్‌ఖాన్ శాసనాలను పరిశోధించి తెలుగులో ప్రకటించారు. జీవిత చరిత్రలకు, బాలవాఙ్మయానికి సంబంధించి ఎన్నో రచనలు చేసినవీరు ఇటీవలే మరణించారు.

*వీరభద్రరావు, కొత్తపల్లి :* బహు భాషావేత్త, పండితుడు, పేరుపొందినవక్త, విమ ర్శకుడు. జననం : 1924 లో రాజమండ్రిలో ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ఎం. ఏ., పిహెచ్. డి. పొందారు. కొంతకాలం విజయనగరం కళాశాలలోను, మరికొంతకాలం ఢిల్లీ విశ్వవిద్యాలయంలోను అధ్యాపకులుగా పనిచేశారు. అమెరికా, రష్యా మొదలయిన దేశాలను దర్శించారు. తెలుగు అకాడమీలో కొంతకాలం డిప్యూటీ డైరెక్టరుగా పనిచేసి ప్రస్తుతం

హైదరాబాదు విశ్వవిద్యాలయంలో స్కూల్ ఆఫ్ సోషల్ సైన్సెస్‌కు డీన్‌గాను, సెంటర్ ఆఫ్ రీజనల్ స్టడీస్‌కు డైరెక్టరుగాను ఉన్నారు వీరు సి. పి. బ్రౌన్ జీవితచరిత్ర, తెలుగుసాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం, వంగసాహిత్య చరిత్ర, గురునానక్ జీవితచరిత్ర మొదలయిన గ్రంథాలు వ్రాశారు.

*వీరభద్రరావు, చిలుకూరి :* పండితుడు, విమర్శకుడు, సంఘసేవకుడు. పశ్చిమగోదావరిజిల్లా నర్సాపురం తాలూకా పెదమదంలో జన్మించిన వీరు ఆంధ్రుల చరిత్ర రచనకు జీవితాన్ని అంకితం చేశారు. అంతేకాకుండా భారత వీరుల చరిత్ర, నాయకురాలిదర్పం, తిమ్మరుసు, తిక్కన సోమయాజి మొదలయిన గ్రంథాలు వ్రాశారు. చారిత్రాత్మక నవలా రచనలో వీరు సిద్ధహస్తులు. 1940 లో మరణించారు.

*వీరేశలింగం, కందుకూరి :* కవి, పండితుడు. పత్రికా సంపాదకుడు, నాటక కర్త, సంఘ సంస్కర్త, విప్లవశీలి, నవయుగానికి వైతాళికుడు. జననం : 1848 ఏప్రిల్ 16 న, రాజమండ్రిలో. తెలుగులో నవల, ప్రహసనం, నాటకం, వ్యాసం, స్వీయ చరిత్ర వంటి ఆధునిక సాహిత్య ప్రక్రియలకు ఆద్యులు. బాల్య వివాహం లాంటి సామాజిక దురాచారాలకు, మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా సాహిత్యాన్ని ఒక మహాస్త్రంగా ప్రయోగించి, స్త్రీవిద్యను, వితంతు వివాహాలను ప్రోత్సహించారు. వివేకవర్ధని, హాస్యసంజీవిని, సతీహిత బోధిని మొదలయిన పత్రికలను నిర్వహించారు. బ్రహ్మసమాజ వ్యాప్తికి కృషిచేశారు. బాలికా పాఠశాల, వితంతు శరణాలయం, పతితయువతీ రక్షణశాల వంటి సంస్థలను స్థాపించారు. సంస్కృత,ఆంగ్ల భాషలనుంచి గ్రంథాలను అనువదించారు. అభిజ్ఞానశాకుంతలం, ఆంధ్ర కవుల చరిత్ర, రాజశేఖరచరిత్ర మొదలయిన గ్రంథాలు వీరి భాషాసేవకు ప్రతీకలు. తనదేహం, గేహం, సర్వస్వం తెలుగుజాతి శ్రేయస్సుకు, సాహిత్య తేజస్సుకు ధారబోసిన ఈ పుణ్యచరితులు 1919 మే 27 న పరమపదించారు.

*వెంకట అప్పారావు, బసవరాజు :* జననం : 1894 లో విజయవాడ సమీపాన పడమటలో. కొంతకాలం "భారతి", "ఆంధ్రపత్రిక" లకు సహాయ సంపాదకులుగా పనిచేశారు. గేయ, పద్యరచనలో పేరుప్రఖ్యాతులు తెచ్చుకొన్నారు. సెలయేటిగానం, వాయుసందేశం, ఆంధ్రకవిత్వ చరిత్ర, ఆంధ్రరత్నచరిత్ర మొదలయిన గ్రంథాలు వ్రాశారు సాహిత్య విమర్శలు చేశారు.

*వెంకటకృష్ణశాస్త్రి, దేవులపల్లి :* కవితలో సంగీతాన్ని, సంగీతంలో కవితను మేళవించిన సవ్యసాచి, భావకవితా పరమేష్ఠి అయిన వీరు 1897లో తూర్పుగోదావరిజిల్లా పిఠాపురం వద్దనున్న చంద్రమపాలెంలో జన్మించారు. బి.ఏ. పట్టభద్రులు. కొంతకాలం అధ్యాపకులుగా ఆ తరవాత హైదరాబాదు ఆకాశవాణి సంచాలకులుగా ఉన్నారు. నవ్య సాహిత్యపరిషత్తు కార్యక్రమాలతో సన్నిహిత సంబంధం పెట్టుకొన్నారు. ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభకు

1946 అధ్యక్షత వహించారు. కన్నీరు, కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, పల్లకి ఖండ కావ్య సంపుటాలు, కొన్ని రేడియోనాటికలు, అనేక సాహిత్య వ్యాసాలు, మల్లీశ్వరి వంటి చలనచిత్రాలలోని మరపురాని గీతాలు వీరి అమృతలేఖిని నుంచి వెలువడ్డాయి. వీరు భావ కవితోద్యమానికి, ఆధునిక సాహిత్య ఉద్యమానికి గురుతుల్యులు, పట్టుగొమ్మ, ప్రవక్త. ఆంధ్రవిశ్వవిద్యాలయం కళాప్రపూర్ణను. ప్రభుత్వం "పద్మభూషణ్"ను ఇచ్చి వీరిని సత్కరించాయి. వీరు 1980 లో స్వర్గస్తులైనారు

*వెంకటకృష్ణారావు, యార్లగడ్డ* : రైతు ఉద్యమకర్త. సంపాదకుడు. జననం 1916లో కృష్ణాజిల్లా పెదఅవుటపల్లిలో. ఖాదీ, ఉప్పు సత్యాగ్రహాలలో పాల్గొని రాజకీయకర్తగా పని చేస్తూ, ఆంధ్రరాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ రైతుసంఘ ప్రధాన కార్యదర్శిగాను, అధ్యక్షులుగాను వ్యవహరించారు. "రైతులోకం" మాసపత్రికకు ప్రధాన సంపాదకులు. ఆంధ్రప్రదేశ్ శాసన మండలి సభ్యులుగా ఉన్నారు. సోవియట్ యూనియన్, హంగేరి, జెకోస్లోవేకియా మొదలైన దేశాలు సందర్శించారు. రైతుల సమస్యలపై ఎన్నో వ్యాసాలు, కొన్ని పుస్తకాలు వ్రాశారు. 'ఆంధ్రప్రదేశ్ దర్శిని' సంపాదకులలో ఒకరు.

*వెంకటనరసింహం, చెరుకువాడ* : జననం : 1887 కృష్ణాజిల్లా ఘంటసాలలో. మంచి వక్త. పెక్కు జాతీయోద్యమాలలో పాల్గొని అనేకసార్లు జైలుకు వెళ్ళారు. బందరుజాతీయ కళాశాల వ్యవస్థాపకులలో ఒకరు. వీరు ఒక హరిజన బాలుని దత్తత చేసుకొని తన పిల్లలతో పాటు పెంచి పెద్దవాడిని చేశారు. అనర్గళంగా ఉపన్యాసాలు ఇచ్చిన, అనేకపుస్తకాలు వ్రాసిన వీరు 1964 లో కాలధర్మం చెందారు.

*వెంకటప్పయ్య, కొండా* : కవి, దేశభక్త బిరుదాంకితుడు, వక్త, స్వాతంత్ర్యోద్యమ నాయకుడు ఆంధ్రోద్యమ నాయకుడు. జననం 1866 లో గుంటూరులో. 1913 లో ప్రథమాంధ్రమహాసభ కార్యదర్శిగా వ్యవహరించి. 1923లో అఖిలభారత కాంగ్రెసుకు అధ్యక్షులుగా ఉన్నారు. కుల సంప్రదాయ నిర్మూలనకోసం, స్త్రీ సంక్షేమంకోసం పాటుపడ్డారు, "శారదా నికేతన్" (గుంటూరు) కి అధ్యక్షులుగా కొంతకాలం గడిపారు. అనేక ఉద్యమాలలో పాల్గొని జైలుకువెళ్ళారు. 1949 లో కాలధర్మం చెందారు.

*వెంకటప్పయ్య, బుర్రా* : ఆర్థికవేత్త, పరిపాలనాదక్షుడు. జననం : 1907 లో కాకినాడలో. ఎం.ఏ, ఐ.సి.యస్. అయిన వీరు దేశంలో ఎన్నో ఉన్నతపదవులను స్వీకరించారు, ఆర్థికశాఖ కార్యదర్శి, రిజర్వుబాంకు గవర్నర్, ప్రణాళికాసంఘ సభ్యులు మొదలైన అత్యున్నత పదవులను అలంకరించిన వీరు గ్రామీణ విద్యుదీకరణ చైర్మన్. అనేక ప్రభుత్వ, ప్రభుత్వేతర సంఘాలకు అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు. ప్రపంచమంతా పర్యటించారు.

*వెంకటరంగయ్య, మామిడిపూడి* : ఆదర్శప్రాయమైన బోధనతో, వర్తనతో అనేక మంది శిష్యులను ఆకట్టుకొన్న అమోఘ ఆచార్యవర్యుడు, చరిత్ర, రాజనీతి శాస్త్రాలలో అందె

వేసిన చేశారు. జననం : 1889 లో నెల్లూరుజిల్లా పురిణిలో. మొదట కాకినాడలో, ఆ తరవాత విజయనగరంలో లెక్చరరుగా చేశారు. 1931 నుంచి 44 వరకు ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో చరిత్ర ప్రొఫెసరు. 1949 లో బొంబాయి విశ్వవిద్యాలయంలో రాజనీతిశాస్త్రంలో ఆచార్యులు. ఇండియన్ పొలిటికల్ అసోసియేషన్ ప్రెసిడెంటు. విద్యార్థులకు పాఠ్యపుస్తకాలు మొదలు రాజ్యాంగ విషయాల వరకు అనేక గ్రంథాలు తెలుగు, ఇంగ్లీషులో వ్రాశారు. విజ్ఞానసర్వస్వానికి సంపాదకులు. గ్రంథాలయోద్యమం, సహకారోద్యమం, బ్యాంకింగ్ ఉద్యమాలలో ఉత్సాహంగా పాల్గొన్నారు. ప్రస్తుతం భారత స్వాతంత్రోద్యమచరిత్ర సంపుటాలు వెలువరిస్తున్నారు. 'పద్మభూషణ్' బిరుదుతో వీరిని కేంద్రప్రభుత్వం సత్కరించింది.

*వెంకటరంగారెడ్డి, కొండా* : తెలంగాణా పితామహుడు, ప్రముఖ న్యాయవాది. ఆంధ్రప్రదేశ్ మాజీ ఉపముఖ్యమంత్రి. వీరు హైదరాబాదు జిల్లా మంగళారం గ్రామంలో 1890 వ సంవత్సరంలో జన్మించారు. తెలంగాణా ఆంధ్రమహాసభను నిర్వహించిన ప్రథమ నాయకులలో ఒకరు. తెలంగాణా ప్రజల హక్కులకోసం, తెలంగాణా ప్రజల శ్రేయస్సు కోసం వీరు చేసిన కృషి అనిర్వచనీయమైంది. హైదరాబాదులో అనేక ప్రజోపయోగ సంస్కరణలు, ముఖ్యంగా స్త్రీలకు రైతులకు, ప్రవేశపెట్టారు. రెడ్డిహాస్టలు ప్రారంభకులలో ఒకరు. హైదరాబాదులో ఆంధ్రవిద్యాలయాలన్నింటిలో వీరిపాత్ర ముఖ్యమైనది. 1952 సం॥ నుంచి 1962 వరకు మంత్రిగాను, ఉపముఖ్యమంత్రి గాను ఉన్నారు. 1970 సం. జూలై 24 వ తేదీన వీరు స్వర్గస్థులైనారు.

*వెంకటరత్నంనాయుడు, రఘుపతి* : బ్రహ్మర్షి, మహావక్త, సంఘసంస్కర్త, బహుపత్రికా సంపాదకుడు, కులపతి. జననం 1862 లో కృష్ణాజిల్లా మచిలీపట్నంలో. ఎం. ఏ. ఎల్ టి. చదివిన వీరికి ఎన్నోభాషలతో పరిచయముంది. అధ్యాపక వృత్తిని పవిత్రంగా భావించి కొన్నాళ్ళు చేపట్టారు మద్రాసు విశ్వవిద్యాలయానికి వీరు మొదటగా ఎన్నికైన వైస్‌ఛాన్సలర్ (1926 - 28). అక్కడ అనేక కొత్తశాఖలు పరిశోధనలో, అధ్యాపనలో ప్రారంభింపజేశారు. విద్యారంగంలో వలె సాంఘిక, మత సంబంధ రంగాలలో కూడా అనేక సంస్కరణలకు వీరు కారకులు. దేవదాసిగా కన్యను దేవాలయానికి అంకితం చేసే దురాచారాన్ని నివారించడంలో, మద్యపాన నిషేధంలో, స్త్రీవిద్యలో, కుల నిర్మూలనలో, హరిజనోద్ధరణలో, అస్పృశ్యతానివారణలో, స్త్రీజనోద్ధరణలో వీరు ఎంతోకృషిచేశారు. వీరికి ప్రభుత్వం కేసర్-ఇ-హింద్ బిరుదును, నైట్‌హుడ్‌ను ఇచ్చింది. ఆంధ్ర, మద్రాసు విశ్వవిద్యాలయాలు గౌరవ డి-లిట్, ఎల్.ఎల్.డి. డిగ్రీలు ఇచ్చాయి.

*వెంకటరమణ, ముళ్ళపూడి* : నవ్వుతోబాటు రెండు కన్నీటిబొట్లు కూడా రాల్పించే నిజమైన హాస్యరచయిత, ఎక్కువగావ్రాయని భాస్కరుడు, సినీమాటలశిల్పి. జననం :1932 జూన్ 28 న. ఆంధ్రపత్రికలో కొంతకాలం పనిచేశారు. డబ్బుచుట్టూ తిరుగుతున్న, రాజకీయాలచుట్టూ తిరుగుతున్న మనుషులతో నిండిన లోకాన్ని అక్షరాల్లో కిదించి, కాలంతో పోటీ

పడుతున్న మనిషికందకుండా పరిగిడుతూన్న కాలాన్ని క్షణాల్లో కుదించి రచనలు చేసిన ముళ్లపూడి వ్యంగ్యంటరమణగారు రచయితగా, చిత్రనిర్మాతగా పేరూ పలుకుబడీ గడించుకున్నారు. ఋణానందలహరి, రాజకీయ బేతాళపంచవింశతిక, విక్రమార్కుడి మార్కుసింహాసనం, గిరీశంలెక్చర్లు, ఇద్దరమ్మాయిలూ - ముగ్గురబ్బాయిలూ, జనతా ఎక్స్‌ప్రెస్, రాధాగోపాలం మొదలయిన గ్రంథాలు వ్రాసినవీరు ఆధునిక సాహిత్యంలో తనకోస్థానం సుస్థిరం చేసుకున్నారు.

*వెంకటరమణదాసు, వీణ :* వైణికశిఖామణి. వీరు వీణాగానంలో నాదసంపద, అనుకరణసాధ్యంకాని వేగం, కల్పనానైపుణ్యం అనే మూడు విశేషాలతో పేరు పొందారు. జననం: 1866 లో. సితారు, రుద్రవీణ వాయించడంలో ఆరితేరినవారు కర్బను ప్రభువునుంచి నవరత్నఖచిత కంకణ బహుమతిని పొందారు. 'వీణారహస్యప్రకాశిక' అనే గ్రంథాన్ని వ్రాశారు. 1948 లో కాలధర్మం చెందారు.

*వెంకటరమణయ్య, నేలటూరి :* శాసనపరిశీలనలో నిపుణుడు, చరిత్ర పరిశోధకుడు, పురావస్తుశాస్త్రాచార్యుడు. జననం : 1893 లో నెలూరుజిల్లా నేలటూరులో. చరిత్ర, వాఙ్మయ చరిత్రలపై ఎన్నో ప్రామాణిక గ్రంథాలను తెలుగు, ఇంగ్లీషు భాషలో వ్రాశారు. వీరు ఆంధ్ర దేశచరిత్రకు సంబంధించిన పెక్కు శాసనాలను "ఎపిగ్రాఫియో ఆంధ్రికా" అనే పేరుతో సంపాదించి ఆంధ్రదేశ చరిత్రరచనకు అమూల్యమైన ఆధారగ్రంథాన్ని సమకూర్చారు. కృష్ణదేవరాయలు, విజయనగర సామ్రాజ్యం, విష్ణుకుండినులు, తూర్పుచాళుక్యుల శాసనాలు అనే గ్రంథాలు వ్రాశారు. 1977 లో స్వర్గస్థులయ్యారు.

*వెంకట్రామారెడ్డి, రాజా బహద్దూర్ :* అసమాన రాజకీయ చతురుడు, విజ్ఞతా సంపన్నుడు, ప్రతిభావంతుడు. నిజాంవద్ద కొత్వాల్‌గా ఉంటూ స్వాతంత్ర్యసమరానికి, తెలుగువారికి, భాషకు దోహదం చేసినవీరు ఆగస్టు 21, 1869 లో గద్వాల్‌తాలూకా రాయణిపేటలో జన్మించారు. హైదరాబాదు చరిత్రలో మహమ్మదీయరాజుల పరిపాలనలో నగర కొత్వాలుగా (పోలీస్‌కమీషనర్) నియమితులైన మొట్టమొదటి హిందువు వీరే. ఆపదవి నిర్వహిస్తున్నప్పుడు వీరు అనేక ప్రభుత్వేతర సంస్థలలో సభ్యులుగా ఉండి ఎన్నో ప్రజోపకారాలకు తోడ్పడ్డారు. హైదరాబాదులో రెడ్డివసతిగృహం, నారాయణగూడ బాలికోన్నత పాఠశాల, మహిళా కళాశాలల స్థాపనకు దోహదం చేశారు.

*వెంకటరావు, కళా:* రాజకీయచతురుడు, స్వాతంత్ర్యయోధుడు, సమాజవిద్యా విశారద బిరుదాంకితుడు. జననం 1900 లో పశ్చిమగోదావరి జిల్లా ముక్కామలలో. విద్యార్థిగా ఉన్నప్పుడే విద్యకు స్వస్తిచెప్పి సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 1923 నుంచి 1946 వరకు మూడుసార్లు ఆంధ్ర కాంగ్రెసు కమిటీలకు కార్యదర్శిగా ఉన్నారు. 1950 లో అఖిల

భారత కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా ఉన్నారు. 1950 లో పార్లమెంటు సభ్యులుగా ఎన్నికయ్యారు. ఉప్పుసత్యాగ్రహం, సహాయనిరాకరణోద్యమం, సైమన్‌కమిషన్ వ్యతిరేకోద్యమం, క్విట్ ఇండియా ఉద్యమాలలో పాల్గొనడం వల్ల ఎనిమిదిసార్లు జైలుకి వెళ్ళారు. 1937-1949 వరకు మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులుగా ఉన్నారు. మద్రాసు మంత్రివర్గంలో 1947-49 కాలంలో రెవెన్యూమంత్రిగా ఉన్నారు. 1955 లో ఆంధ్రరాష్ట్ర మంత్రివర్గంలో ప్రణాళికా మంత్రిగా ఉన్నారు. 1956 లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక మంత్రిగాచేరి మరణించే వరకు ఆ పదవిలోనే ఉన్నారు 1959 లో స్వర్గస్థులయ్యారు.

*వెంకటరావు, నిడదవోలు :* పండితుడు, పరిశోధన పరమేశ్వరుడు, కళాప్రపూర్ణ బిరుదాంకితుడు. జననం : 1903 లో విజయనగరంలో. ఎం ఏ.లో సర్వ ప్రథములై సువర్ణ పతకం పొందారు. మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధ్యక్షులుగా పనిచేశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయాలలో యు. జి. సి. ప్రొఫెసరుగా కొంతకాలమున్నారు. వీరు తెలుగు సాహిత్యంలో చదివి మరిచిందిలేదు. ఒడలు మరిచి చదవంది లేదు. రచనలు : ఉదాహరణ వాఙ్మయం, తెలుగు కవుల చరిత్ర, ఆంధ్ర వచనవాఙ్మయం, దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయం పోతన మొదలైనవి.

*వెంకటశేషశాస్త్రి, గడియారం :* 1901 ఫిబ్రవరి 15 న కడపజిల్లా జమ్ములమడుగు తాలూకా నెమిళ్లదిన్నెలో జననం. కొంతకాలం ఉపాధ్యాయులుగా పనిచేశారు. అనేక పద్యకావ్యాలు, గద్యగ్రంథాలు, విమర్శలు, అనువాద గ్రంథాలు వెలువరించారు. వాటిల్లో శివభారతం, కిరాతార్జునీయం, మల్లికామారుతం, శరన్నవరాత్రి, పద్యావళి, నా భారతభూమి, వాల్మీకిచరిత్ర మొదలయినవి పేర్కొనదగినవి.

*వెంకటసత్యనారాయణరావు, రావూరు :* జీవితం కన్నీటికోనంకాదు - ఆనందమందిరం అనిచాటే సాహితీవేత్త, నవలాకారుడు, సినీరచయిత. జననం 1913 లో. చాలా పత్రికలలో పనిచేశారు. దాదాపు ఇరవై సినిమాలకు పాటల, మాటల రచయిత. సాంఘిక జీవితంలో దైనందిన సంఘటనల్లో తొంగిచూసే జాతీయమైన హాస్యంతో, సున్నితమైన చమత్కారంతో చదువరులకు చక్కలిగింతలు పెట్టగలరు. హైదరాబాదులో భాషాకుటీరం స్థాపించి, తెలుగు భాషకు సేవ చేస్తున్నారు. కళాప్రపూర్ణ బిరుదాంకితులు. నెలవంక. బాటసారి, ఏరువాక, ఆషామాషీ అనే వీరి గ్రంథాలు వెలువడినాయి.

*వెంకటస్వామినాయుడు, ద్వారం :* ఫిడేలు నాయుడని ప్రసిద్ధి. వాయులీనాన్ని కర్ణాటకబాణీల్లో కమనీయంగా మలచి నాదబ్రహ్మ సాక్షాత్కృతిని చేసుకొన్న కారణజన్ముడు. జననం 1893 లో విజయనగరంలో. సంగీతకళాశాలకు చాలాకాలం ప్రిన్సిపాల్‌గా ఉన్నారు. 1926 లో "గాంధర్వవిభూషణ" బిరుదు పొందారు. జయపురం, తిరువాన్కూరు, మైసూరు మహారాజులచేత సత్కరింపబడ్డారు. 1949 లో మద్రాసులో పౌరసన్మానం పొందారు. వీరిని 1953 లో రాష్ట్రపతి సన్మానించారు. వీరు అంధులు.

*వెంకటసీతాపతి, గిడుగు :* విమర్శకుడు, నటుడు, సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషా పండితుడు. జననం : 1885 లో భీమునిపట్నంలో. బి.ఏ.ఎల్.టి. చదివి కొంతకాలం ఉపాధ్యాయవృత్తి స్వీకరించారు. డాక్టరేట్ పొందారు. తండ్రి వేంకటరామమూర్తిగారి అడుగు జాడల్లో వ్యావహారిక భాషావాదాన్ని ప్రచారం చేశారు. భారతీశతకం, బాలానందం, కవితో దయచంద్రిక మొదలయిన గ్రంథాలు వ్రాసిన వీరు గత కొద్ది సంవత్సరాల క్రితం కాలధర్మం చెందారు.

*వెంకటసుబ్బరత్నం, చలువాది :* ఇంధన సాంకేతిక శాస్త్రజ్ఞుడు, రసాయనిక ఇంజనీరింగ్ నిపుణుడు. జననం : 1928 లో ప్రకాశంజిల్లా కంభంలో. 1951 నుంచీ వీరు మాగ్నెట్‌మీద విశేష పరిశోధనలు కొనసాగిస్తున్నారు. అమెరికాలో ఎం.ఎస్‌సి,పి.హెచ్.డి. చేశారు. ఇనుపఖనిజ వాడకాన్ని తగ్గించి, లిగ్నైట్ వాడకాన్ని అధికం చేయవచ్చునని వీరు నిర్ధారణ చేశారు. నైవేలీ లిగ్నైట్ ప్రాజెక్టులో తయారయ్యే 'పీకో' ఇంధనం వీరి పరిశోధనా ఫలితమే. వీరికి 'సిమాక్స్' అవార్డును ఉత్తర డకోటా (అమెరికా) యూనివర్శిటీ బహూకరించింది. నైవేలీ లిగ్నైట్ కార్పొరేషన్‌లో పనిచేస్తున్నారు.

*వెంకటసుబ్బారావు, నండూరి :* ఎంకి పాటలద్వారా సుప్రసిద్ధి చెందిన కవి. జననం: 1895 లో. బి.ఎల్. డిగ్రీపొంది న్యాయవాదవృత్తి చేపట్టారు. కొంతకాలం కాకినాడ కళాశాలలో అధ్యాపకులుగా పనిచేశారు. సొంత శైలిని సృజించుకొని ఎంకిపాటల రచనద్వారా ప్రత్యేకతను పొందారు.

*వెంకటాచారి, ప్రతివాదిభయంకర :* జననం : 1910 లో, తూర్పు గోదావరి జిల్లా సామర్లకోటలో. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు జైలుకెళ్ళారు. తరవాత కాకినాడ బాంబుకేసులో 14 సంవత్సరాల జైలుశిక్షపడింది. 1937 లో వీరిని అండమాన్ దీవులకు పంపడం జరిగింది. వీరు కొన్ని పత్రికలకు సంపాదకత్వం వహించారు."అండమాన్‌జీవితం" అనే గ్రంథాన్ని రచించారు. జైలు అక్రమాలనెదిరిస్తూ 48 రోజులు నిరాహారదీక్ష బూనిన విప్లవవాది. 1956 నుంచి ప్రభుత్వ ఫీల్డ్‌పబ్లిసిటీ ఆఫీసరుగాఉండి, పంచవర్ష ప్రణాళికలను గురించి ప్రజలకు తెలియజేయడంలో కృషిచేశారు.

***వేంకటావధాని, దివాకర్ల :*** కవి, పండితుల్లు, వక్త, విమర్శకుడు. జననం : 1913 జూన్ 29 న భీమవరం తాలూకా ఎండగండి గ్రామంలో. ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో చదువుకున్న వీరు 1951 నుంచి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖకు శాఖాధిపతిగా చాలకాలంఉన్నారు. సాహిత్యసభల్లో లెక్కకుమించి ఉపన్యాసాలిచ్చారు. ఆంగ్లాంధ్ర సంస్కృత నాటక విమర్శనం, వ్యాసావళి, ఆంధ్ర మహాభారతం మొదటి మూడు పర్వాలకు సంపూర్ణ వ్యాఖ్య, కొన్ని కావ్యాలు మొదలైనవి వీరు వ్రాసిన గ్రంథాలు.

*వేంకటేశ్వరరావు, కాటూరి :* పింగళి లక్ష్మీకాంతం గారితో జంటకవి. జాతీయవాది. జననం : 1895 అక్టోబరు 15 న కృష్ణాజిల్లా కాటూరులో. 1921 లో సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. రచనలు : పింగళి - కాటూరి కవుల రచనలు, భాస నాటకానువాదాలు, తొలకరి మరికొన్ని సాహిత్య విమర్శలు. 1960 లో స్వర్గస్థులయ్యారు.

*వెంకటేశ్వరరావు, ఘంటసాల :* గానంలోని మధురిమను, మధురిమలోని దివ్యత్వాన్ని మనకు మిగిల్చిన అమర గాయకుడు, సంగీత దర్శకుడు, స్వాతంత్ర్య యోధుడు, నేపథ్యగాన యుగకర్త. జననం : కృష్ణాజిల్లా చౌటపల్లిలో 1922 డిసెంబరు 4న. విజయనగరం సంగీత కళాశాలలో సంగీతవిద్య అభ్యసించారు. అనేక గాన కచేరీలు చేశారు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 18 మాసాలు జైలుశిక్ష అనుభవించారు. 1944లో సుమంగళి చిత్రంద్వారా బి. ఎన్. రెడ్డిగారి ప్రోద్బలంతో చిత్రసీమలో ప్రవేశించి అనేక చిత్రాలలో నేపథ్యగానం చేసి, కొన్నింటికి సంగీత దర్శకత్వం వహించారు. సుమారు పదివేల పాటలు పాడారు. భారత ప్రభుత్వం 1970 లో పద్మశ్రీ నిచ్చి గౌరవించింది. చివరి ఊపిరికూడ చిరుపాటగా చేసి, కంఠశాల అమృతాన్ని అందించిన ఘంటసాల 1974 లో అసువులు కోల్పోయారు.

*వెంకటేశ్వరరావు, నార్ల :* నవమేధావి. మానవతావాది, రచయిత. తాను నమ్మిన సత్యాన్ని ప్రకటించడంలో భీతిచెందని ధైర్యశాలి. జననం : కృష్ణాజిల్లా కొతవరంలో 1908 డిసెంబరు 1వ తేదీన. అద్వితీయమైన ప్రతిభగల పత్రికా సంపాదకులుగా ప్రసిద్ధివహించారు. స్వరాజ్య, జనవాణి, ప్రజామిత్ర, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి పత్రికలలో పనిచేశారు. 1958లో రాజ్యసభ సభ్యులు. ప్రముఖ నాటక రచయిత. తెలుగు సాహిత్యంలో ఏకాంకికల రచనల ఆద్యులలో ఒకరు. పురాతన, ఆధునిక, చిత్రపటాలను, శిల్పాలను, బొమ్మలను, పుస్తకాలను దేశదేశాలనుంచి సేకరించి తమ యింటిని ఒక మ్యూజియంగా తయారుచేశారు. అనేకసార్లు విదేశాలు ప్రయాణించారు. చెప్పుకోతగిన స్వంత గ్రంథాలయం ఉంది.రచనలు: మాటామంతి, పిచ్చాపాటి, జాబాలి, కొత్త పాత, కొత్తగడ్డ అనే ఏకాంకికల సంపుటి, నార్లవారి మాట అనే పద్యాలసంపుటి మొదలయినవి.

*వెంకటేశ్వర్లు, పులిపాటి :* గజారోహణ, సువర్ణఘంటా కంకణాది సత్కారం పొందిన నటుడు. జననం : 1900 లో తెనాలిలో. వీరు కొన్ని చిత్రాలలో, ఎక్కువభాగం నాటకాలలో నటించారు. వీరు నటించిన పాత్రలలో రామదాసు, చెకుముకిశాస్త్రి, కరటకశాస్త్రి, బిల్వమంగళుడు, కృష్ణుడు, అర్జునుడు, నక్షత్రకుడు చెప్పుకోదగినవి. కొన్ని స్త్రీ పాత్రలుకూడా ధరించి మెప్పించారు.

*వెంకయ్య, ర పతి :* ఛాయాచిత్ర గ్రహణంలోనూ, చలనచిత్ర రంగంలోను తెలుగు వారిలో ప్రథముడు. ఉ తమఛాయాగ్రాహకుడు. జననం: 1869 లో మచిలీపట్నంలో. తెలుగు

చిత్రపరిశ్రమకు పితామహుడు. గెయిటీ థియేటర్‌ను 1912లోను, క్రౌన్‌టాకీస్, గ్లోబ్ థియేటర్‌లను 1914-17 లోను నిర్మించారు. స్టార్ ఆఫ్ ఈస్ట్ ఫిలిమ్స్ అనే స్టూడియో నిర్మించి భీష్మ, మత్స్యావతారం, ప్రతిజ్ఞ, గజేంద్రమోక్షం, నందనార్ వంటి మూకీచిత్రాలు నిర్మించారు. వీరు స్వర్గస్థులై చాలాకాలమైంది.

*వెంకయ్య, పింగళి :* దేశభక్తుడు; స్వాతంత్ర్య యోధుడు. జననం : 2-8-1878. వీరు ఆంధ్ర జాతీయ కళాశాలలో పనిచేశారు. 1921 లో మహాత్మగాంధీగారి కోర్కెమేరకు మూడు గంటల్లో చరఖాతో జాతీయ పతాకాన్ని రూపొందించి అఖిలభారత ఖ్యాతినార్జించారు. 4-7-1963 న స్వర్గస్థులయ్యారు.

*వెంగళరావు, జలగం :* ప్రజాస్వామ్య సామ్యవాద ప్రపంచంపట్ల ప్రగాఢ విశ్వాసం గల ప్రజానాయకుడు. స్వయంకృషితో, నిర్భయమైన వ్యక్తిత్వంతో, మితభాషియై మాటల కన్న చేతలలో మిన్న అని పేరొందిన ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి. పరిపాలనా దక్షునిగా ప్రజల మన్ననలు పొందినవీరు 1922 మే 22 న కృష్ణాజిల్లాలో జన్మించి, 1943 లో ఖమ్మం జిల్లా బయన్నగూడెంలో స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు. 1949 లో ఖమ్మం జిల్లా కాంగ్రెసు అధ్యక్షత, 1962-78మధ్య శాసనసభా సభ్యత్వం, 1962-68 మధ్య ఆంధ్రప్రదేశ్ పంచాయతీపరిషత్ అధ్యక్షత, 1969-72 రాష్ట్రహోంమంత్రి, 1972పరిశ్రమలమంత్రి, 1973-78 మధ్య రాష్ట్ర ముఖ్యమంత్రి పదవులను నిర్వహించారు. కార్యవాది, ఆశావాది, సామ్యవాది అయిన వీరి హయాంలో నక్సలైట్ల అణచివేత, ప్రపంచ తొలి తెలుగు మహాసభలు జరిగాయి.

*వేణుమాధవ్, నేరెళ్ళ :* ధ్వన్యనుకరణప్రవీణుడు. జననం: 1932 లో వరంగల్‌లో. ఉస్మానియా యూనివర్సిటీ పట్టభద్రులు. వెంట్రిలాక్విజం అనే ప్రత్యేక కళను తొలిసారిగా ఆంధ్రప్రదేశ్‌లో వీరు ప్రవేశపెట్టారు. మిమిక్రీ, ధ్వన్యనుకరణలలో నిష్ణాతులై దేశంలోనూ, విదేశాల్లోనూ మూడువేలకుపైగా ప్రదర్శనలిచ్చి విశేషఖ్యాతి నార్జించారు. ధ్వన్యనుకరణ చక్రవర్తి, ధ్వన్యనుకరణసామ్రాట్టు, కళాప్రవీణ మొదలయిన బిరుదులుగలవీరు ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యులుగా నియమితులయ్యారు.

*శంకరశాస్త్రి, ఈమని :* సరసమధుర వీణావాద్యకర్త, వేదపన్నాలను వీణపై పలికించిన వీణాతత్త్వవేత్త. వీణగొప్పతనాన్ని ప్రపంచానికి చాటిన వ్యక్తి. జననం 1922 లో తూర్పుగోదావరిజిల్లా ద్రాక్షారామంలో అక్టోబరు 23న. బి. ఏ. పట్టభద్రులు. హిందూస్తానీ, పాశ్చాత్యగాన రీతులను కూడా అభ్యసించారు. ఆకాశవాణిలో 1959 లో మ్యూజిక్ ప్రొడ్యూసర్‌గా చేరారు. ప్రఖ్యాత సితార్‌వాద్యకారులు, రవిశంకర్‌తో కలిసి కచేరీ చేశారు. ఆదర్శ "శిఖరారోహణం" గీతానికి 6 వీణలపైన, 4 పిల్లనగ్రోవులపైన సంగీతాన్నిచ్చి 'హిట్' చేశారు. ఢిల్లీలోని 'అఖిలభారత గంధర్వ మహావిద్యాలయం' వారిచేత 'మహామహోపాధ్యాయ' బిరుదు పొంది సత్కరింపబడ్డ మొదటి దక్షిణ భారతీయులువీరే.

*శంభుప్రసాద్, శివలెంక :* ప్రముఖ పత్రికాధిపతి, జర్నలిస్టు. జననం 1911 జనవరి 25న. మచిలీపట్నం, మద్రాసు, శాంతినికేతన్‌లలో విద్యాభ్యాసం చేశారు. కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు స్థాపించిన 'ఆంధ్రపత్రిక గ్రూప్ ఆఫ్ న్యూస్ పేపర్స్, పీరియాడికల్స్'ను వృద్ధిచేసి చీఫ్ ఎడిటర్‌గా ఉన్నారు. రాజ్యసభ సభ్యులుగా 1952-56 మధ్య ఉన్నారు. 1958 లో ఆంధ్రప్రదేశ్ విధానపరిషత్తు సభ్యులయ్యారు.

*శాంతప్ప, ఎమ్ :* సుప్రసిద్ధ భౌతిక, రసాయన శాస్త్రవేత్త. జననం : 1923 లో కర్నూలుజిల్లా జొన్నగిరిగ్రామంలో. బనారస్‌లో ఎం. ఎసి. డిగ్రీ తీసుకొని లండన్‌లో కర్బన రసాయనశాస్త్రంలో పిహెచ్.డి, ఆ తరవాత భౌతిక రసాయన శాస్త్రంలో మాంచెస్టర్‌లో పిహెచ్.డి. తీసుకొన్నారు. మద్రాసు విశ్వవిద్యాలయంలో భౌతిక రసాయనశాస్త్ర శాఖకు దాదాపు 25 సంవత్సరాలపాటు అధిపతిగా ఉన్నారు. కొంతకాలంపాటు శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా ఉండి, ప్రస్తుతం మద్రాసులోని కేంద్ర చర్మ పరిశోధనా సంస్థకు డైరెక్టరుగా ఉంటున్నారు. భట్నాగర్ అవార్డు పొందిన వీరివద్ద 64మంది డాక్టరేటు డిగ్రీలు తీసుకొన్నారు. వీరు దాదాపు 225 పరిశోధనా పత్రాలు ప్రచురించారు.

*శివరామశాస్త్రి, వేలూరి :* గొప్ప విద్వాంసుడు, బహుభాషాకోవిదుడు, శతావధాని, సంగీత, నాటక కళానిపుణుడు, కథారచనలో సిద్ధహస్తుడు. కృష్ణాజిల్లా చిరివాడలో 1895లో జన్మించారు. శిష్ట వచన రచనకు శాస్త్రిగారు పెట్టిన ఒరవడి విశిష్టమైనది. తెలుగు నుడికారపు ఇంపుసొంపులకు వీరిశైలి పుట్టిల్లు. వంగభాషనుంచి రవీంద్రుని, శరశ్చంద్రుని నవలలు అనేకం ఆంధ్రీకరించారు. రచనలు: కథాషట్కం, కథాసప్తకం మొదలైన కథాసంపుటాలు, గాంధీజీ ఆత్మకథ, ఏకావళి మొదలయినవి.

*శివశంకరశాస్త్రి, తల్లావజ్ఝుల :* బహుభాషా పండితుడు, జాతీయవాది, నవ్య సాహితీ రీతులలో గేయనాటికా పితామహుడు. జననం : గుంటూరుజిల్లా కాజ గ్రామంలో 1892 లో. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. పాళీ, బెంగాల్, మరాఠీ, హిందీ, కన్నడ, సంస్కృత భాషలలో పాండిత్యంగల వీరు విజ్ఞాన సర్వస్వం వంటివారు. రచనలు : హృదయేశ్వరి, నోణకజాయ, పద్మావతీ చరణ చారణ చక్రవర్తి మొదలయిన కావ్యాలు, బెంగాల్ నవలలకు అనువాదాలూ, వకుళమాల, దీక్షిత దుహిత, కవిప్రియ మొద__నవి.

*శివారెడ్డి, వి. డాక్టర్ :* దృష్టిదాత; అంతర్జాతీయఖ్యాతిపొందిన నేత్రవైద్యుడు; పద్మభూషణ్ బిరుదాంకితుడు. జననం : 1920 లో కర్నూలుజిల్లా దిన్నెదేవరపాడులో. ఎం.బి. బి.ఎస్. ఎం.ఎస్. తర్వాత అసిస్టెంట్ సర్జన్‌గాచేరి, అనేక పదవులు నిర్వహించి, సరోజినీ దేవి కంటిఆస్పత్రికి చాలాకాలంగా సూపరింటెండెంట్‌గా సేవచేసి, ఆపరేషన్ కేటరాక్ట్ ప్రాజెక్టుకు డైరక్టరుగా ఉంటున్నారు. నేత్ర శస్త్రచికిత్సలో అసమాన నైపుణ్యాన్ని గడించిన వీరికి 1970 లో పద్మశ్రీ, 1977 లో పద్మభూషణ్ బిరుదులనిచ్చి ప్రభుత్వం గౌరవించింది. అంధత్వాన్ని అరికట్టడంలో వీరి కృషికి గుర్తింపుగా అంతర్జాతీయ అవార్డు లభించింది.

దేశీయ, విదేశీయ పత్రికలలో వీరు 120 పరిశోధనా వ్యాసాలను ప్రచురించారు. పశ్చిమ జర్మనీ, ఆస్ట్రేలియా, స్విట్జర్లాండ్, ఇండోనేషియా, ఇంగ్లాండ్, అమెరికా మొదలయిన దేశాలలో జరిగిన శాస్త్రీయ సమావేశాలకు హాజరయ్యారు.

*శ్రీనివాసన్, ఎన్. ఎస్. :* జననం 1932 జూలై 5, నెల్లూరులో. చిత్తూరులో హైస్కూలు విద్యాభ్యాసం, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో గ్రాడ్యుయేషన్ చేశారు. ప్రముఖ వేణునాద విద్వాంసులు. 21 సంవత్సరాలనుంచి ఆకాశవాణిలో పనిచేస్తున్నారు. టి.ఆర్.మహాలింగంగారి శిష్యులు. పెక్కుభాషల్లో, విద్యల్లో పరిజ్ఞానముంది. "సంగీతవిశ్వజనీనత" అనే అంశంమీద సంగీత వ్యవస్థలనుచిత్రించే అఖిలభారతపోటీలో 1979లో ఆకాశవాణి అవార్డును పొందారు. ఈ ఘనతను మొదటిసారిగా హైదరాబాదు రేడియో స్టేషనుకు తెచ్చింది వీరేనని చెప్పవచ్చు.

*శ్రీనివాసరావు, కోలాచలం :* నాటకకర్త, విద్వాంసుడు. జననం : 1854. కొంతకాలం న్యాయవాదవృత్తి చేపట్టారు. ఆంధ్రనాటక చరిత్రలో వీరికి ప్రముఖ స్థానముంది. 'ది డ్రమటిక్ హిస్టరీ ఆఫ్ ది వరల్డ్' అనే గ్రంథాన్ని ఆంగ్లంలో వ్రాయడమే కాకుండా, తెలుగులో తొలి చారిత్రక నాటకాన్ని వ్రాశారు. వీరి నాటకాల్లో ప్రసిద్ధమైనవి : సునందినీ పరిణయం, సుఖమంజరి, రామరాజు మొదలైనవి. భగవద్గీత 18 అధ్యాయాలు వచనంగా వ్రాసిన వీరు 1919 లో కాలధర్మం చెందారు.

*శ్రీనివాసరావు, శ్రీరంగం :* మహాకవి, యుగకర్త, తెలుగునాట కవితావిప్లవానికి, విప్లవ కవిత్వానికి ప్రతినిధి, పెన్నిధి, మార్గనిర్దేశకుడు. జననం: 1910లో విశాఖపట్నంలో. తన పద్దెనిమిదవ ఏటనే కవిగా ప్రభవించి, 1933 లో తాను సైతం భువనభవనపు బావుటాగా పైకిలేస్తూ జయభేరి మ్రోగించారు. 1934 లో కదంతొక్కుతూ పదంపాడుతూ హృదాంతరాళం గర్జిస్తూ మరోప్రపంచం వైపు ప్రస్థానించారు. ఈనాటి తెలుగు కవిత శ్రీశ్రీ నడిచిన దారిలోనే నడుస్తోంది. వీరిచేతిలో తెలుగు కవిత్వం వస్తువు, భాష, నడక మారిపోయింది. కవిత్వంలోను, వచనంలోను, వాస్తవికతను, అధివాస్తవికతను మేళవించి - కవిత, కథ, నాటిక, వ్యాసం - ఏదివ్రాసినా అనర్గళం, అసాధారణం తనమార్గం అనిపించుకున్న వీరు కర్షకుల, కార్మికుల ఘర్మజలానికి మొదటిసారిగా ఖరీదుకట్టిన షరాబు. ఎన్నో సన్మానాలు, బహుమతులు పొందిన వీరు 1979 లో శ్రీరాజా-లక్ష్మి అవార్డు రూ. పదివేల నగదును స్వీకరించారు. శ్రీని స్క్వేర్ చేస్తే ఎన్ని అర్థాలో అన్ని వీరికీ, వీరి కవిత్వానికీ వర్తిస్తాయి. అరుదైన శాబ్దికులు, బిరుదైన భావుకులు. మహాప్రస్థానం, చరమరాత్రి, శ్రీశ్రీ సంపుటులు మొదలైనవి వీరి ముఖ్య గ్రంథాలు.

*శ్రీరామమూర్తి అద్దంకి :* దాదాపు నాలుగు దశాబ్దాలపాటు నటనరంగంలో కరుణారస ప్రవాహాలు పారించి, పద్యానికో రాగాన్ని ఎన్నుకొని, పద్య రాగ భావాలను అనుసరించి

నటించిన నట సార్వభౌముడు. వీరి ధర్మరాజు, దశరథ పాత్రలు సుప్రసిద్ధాలు. జననం : 1897 లో. 1924 లో వీరికి మద్రాసులో కాశీనాధుని నాగేశ్వరరావుగారు బంగారు పతకాన్ని బహూకరించారు. 1934 లో హరిశ్చంద్ర వేషంతో సినిమాలలో ప్రవేశించి కొన్ని సినిమాల్లో నటించారు.

*శ్రీరాములు, పొట్టి* : ఆంధ్రరాష్ట్ర అవతరణకోసం కారణ జన్ముడుగా అవతరించిన నిష్కామయోగి, స్వాతంత్ర్యయోధుడు, స్వార్థరహిత దేశభక్తుడు, చిరస్మరణీయుడు. జననం 1901, మార్చి 16, మద్రాసులో. స్వస్థలం నెల్లూరుజిల్లా జువ్వలదిన్నెపాలెం. ఇంజనీరింగ్ కోర్సు తరవాత నాలుగేళ్ళు రైల్వేలో పనిచేశారు. గాంధేయవాది. ఉద్యోగానికి రాజీనామాచేసి, సబర్మతి ఆశ్రమంలో ప్రవేశించి గాంధీగారి సాన్నిధ్యంలో 11 సంవత్సరాలు నియమబద్ధ జీవితం గడిపారు. 1927 సహాయ నిరాకరణోద్యమంలో, 1930 ఉప్పుసత్యాగ్రహంలో, 1940 వ్యక్తి సత్యాగ్రహంలో, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, మూడుసార్లు జైలుకెళ్ళారు. స్త్రీజనోద్ధరణ, ఖద్దరు ప్రచార రంగాలలో అపారమైన సేవలు చేశారు. 1948 లో హరిజనోద్ధరణ నిమిత్తం 29 రోజులు నిరాహారదీక్ష బూనారు. 1952 అక్టోబరు 19న ఆంధ్రరాష్ట్ర సాధనకోసం మద్రాసులో ఆమరణ నిరాహారదీక్ష వహించి, 58 రోజుల తరవాత డిసెంబరు 15 వ తేదీ అర్ధరాత్రి అమరజీవి అయ్యారు. వీరి తపస్సు, త్యాగాల ఫలితంగా 1953 అక్టోబరు 1 న ఆంధ్రరాష్ట్రం సిద్ధించింది. ఆంధ్రుల చరిత్రలో వీరి పాత్ర అజరామరమైంది.

*శేషగిరిరావు, కొండపల్లి* : జననం 1924 లో వరంగల్ జిల్లా పెనుగొండలో. వీరు శాంతినికేతన్‌లో చిత్రకళను అభ్యసించారు. కుడ్యచిత్రకళలో కూడా శిక్షణ పొందారు. కళా రచనలో ప్రావీణ్యం గల వీరు పెక్కు ప్రదర్శనలను నిర్వహించి అనేక బహుమతులు పొందారు. వీరి చిత్రాలు దేశంలోనే కాకుండా విదేశాల్లోకూడా పలుచిత్రశాలల్లో ఉన్నాయి. జవహర్ లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయంలో లలితకళల్లో ఉపన్యాసకులుగాఉన్నారు. కళలపై చాలా వ్యాసాలు, గ్రంథాలు వ్రాశారు.

*సంగమేశ్వరశాస్త్రి, తుమరాడ* : వీణాచార్యునిగా దేశప్రసిద్ధి చెందిన సంగీత స్రష్ట. మైసూరు మహారాజా సభలో వీణవాయించి, రాగరాగిణీ దేవతలను రూపుకట్టించిన అపర తుంబురుడు. వీరు 1874 లో బొబ్బిలిదగ్గర బలివాడ అగ్రహారంలో జన్మించారు. ఎన్నో వీణ కచేరీలుచేసి విద్వాంసుల మన్ననలను పొందారు. రోజుకు వేయిసార్లు చొప్పున ఏకబిగిన వందరోజులు వరస పీటకుండా వీణానాదాన్ని సాధనచేసిన వీరు కొన్ని సంస్థానాలలో ఆస్థాన వైణికులుగా ఉన్నారు. వయొలిన్, నాదస్వర వాద్యాలను మనోహరంగా వాయించగల వీరు 1931 లో పరమపదించారు.

*సంజీవదేవ్* : సుప్రసిద్ధ కళా విమర్శకుడు, కవి, బహుభాషలలో పరిచయంగలవారు, వ్యాసకర్త, ప్రకృతిదృశ్య చిత్రకారుడు, ఉత్తరాలు వ్రాయడంలో సిద్ధహస్తుడు. జననం :

1918 లో వీరి ప్రపంచం ఒక పరిశోధనా కేంద్రం వంటిది. అందులో వీరు నిరంతరమూ రసం, రూపం, భావం, కళలూ, తత్వం, రామణీయకతా మొదలయిన విషయాలపై పరిశోధన సాగిస్తూనే ఉంటారు. ఈ సాంస్కృతిక జీవి రచనలూ, రేఖలూ, ఉపన్యాసాలూ మానసిక వికాసానికి తేజోరేఖంటివి. రచనలు : రసరేఖలు, రూపారూపాలు, తేజోరేఖలు, తెగిన జ్ఞాపకాలు మొదలైనవి. తుమ్మపూడిలో నివసిస్తున్నారు.

*సంజీవరెడ్డి, నీలం :* భారతరాష్ట్రపతి, అఖిలభారతఖ్యాతి గాంచిన నాయకుడు, వ్యవహారదక్షుడు. జననం 1913 మే 19 న అనంతపురం జిల్లా ఇల్లూరులో. కళాశాల విద్యార్థిగా ఉన్నప్పుడే జాతీయోద్యమంలో పాల్గొని చదువు మానివేశారు. వివిధ జాతీయోద్యమాలలో పాల్గొన్నారు. 1938-40 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి. 1946 లో మద్రాసుఅసెంబ్లీ సభ్యులుగా ఎన్నికైనారు. 1949-51 లో మద్రాసు ప్రభుత్వ మద్యనిషేధ శాఖ మంత్రిగాను, 1951-52 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగాను, 1952-53 లో కౌన్సిల్ మెంబరుగాను, 1953-56 మధ్య ఆంధ్రరాష్ట్ర ఉపముఖ్యమంత్రిగాను, 1956-60 లో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగాను, 1960-62 లో అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులుగాను, 1962-64 ల మధ్య ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగాను, 1964-66 లో కేంద్రంలో ఉక్కుగనుల మంత్రిగాను, 1966-67లో రవాణా-నౌకా,విమానశాఖలమంత్రిగాను, 1967-69లోను, 1977లోను లోక్‌సభ స్పీకర్‌గాను ఉన్నారు. వీరికి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం "డాక్టరేట్" ఇచ్చి గౌరవించింది.

*సంజీవయ్య, దామోదరం :* కార్మికనేత, భారతనాయకుడు, మహామనీషి. జననం : 1921 ఫిబ్రవరి 14 న కర్నూలుజిల్లా పెదపాడులో. రాజాజీ, ప్రకాశం, గోపాలరెడ్డి, సంజీవరెడ్డిగార్ల మంత్రివర్గాలలో మంత్రిగాఉండి, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పదవి నిర్వహించారు. కేంద్రంలో కార్మిక మంత్రిత్వశాఖను, అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షతను సమర్థవంతంగా నిర్వహించారు. దళితజాతిలో జన్మించి, స్వశక్తిచేత ఉన్నత శిఖరాలకు చేరుకొని, ధీరగంభీర స్వరంతో, కవితాహృదయంతో కమనీయంగా ఉపన్యాసాలు చేసిన చిరస్మరణీయులు. పరిశ్రమల అభివృద్ధి, కార్మికసంక్షేమాల మీద తెలుగు, ఇంగ్లీషు భాషలలో కొన్ని గ్రంథాలువ్రాశారు. 1972 మే 7 న స్వర్గస్థులయ్యారు.

*సంపత్‌కుమార్ :* ప్రసిద్ధ నృత్యకారుడు. జననం : విజయనగరంలో. 1949 లో మద్రాసులో "గీతాంజలి-నృత్యాంజలి" సంస్థను, 1955లో విజయనగరంలో 'శ్రీగీతా నృత్య కళామందిర్'ను స్థాపించి, శాస్త్రీయ, జానపద నృత్యరీతులను వెలుగులోకి తీసుకొనివచ్చారు. 1964 లో బెర్లిన్‌లో జరిగిన అంతర్జాతీయ యువజనోత్సవాలలో అంతర్జాతీయ బంగారు పతకాన్ని అందుకున్నారు. సోవియట్ రష్యాలో కూడా 1974 లో నృత్య ప్రదర్శనలిచ్చి, పేరు గడించారు.

*సచ్చిదానందమూర్తి, కొత్త :* జననం : 1924 సెప్టెంబరు 24, తెనాలి తాలూకా సంగంజాగర్లమూడిలో. ప్రముఖ విద్యావేత్త, తత్త్వశాస్త్రజ్ఞుడు. 1956 లో పిహెచ్.డి .ని పొంది, ఆంధ్ర విశ్వవిద్యాలయ తత్త్వశాస్త్రవిభాగానికి అధిపతి అయ్యారు ఇటలీ, స్విట్జర్లాండ్, మొదలయిన పాశ్చాత్య దేశాలు పర్యటించి బోధనాపద్ధతులను అధ్యయనం చేశారు. గుంటూరు లోని పోస్టుగ్రాడ్యుయేట్ సెంటరుకు ప్రత్యేకాధికారిగా, ప్రిన్సిపాల్‌గా వ్యవహరించి, కొంత కాలం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా ఉన్నారు. తెలుగులోను, ఆంగ్లం లోనూ పెక్కు గ్రంధాలు వ్రాశారు.

*సత్యనారాయణ, కప్పగంతుల :* ఆంధ్రాంగ్ల భాషలలో సుప్రసిద్ధ పత్రికా రచయిత, కథకుడు, వ్యాసకర్త, చీకట్లో తుపాకీపేల్చిన కొసమెరుపుతో వీరి కథలు ముగుస్తాయి. ఆంగ్ల దినపత్రిక 'మెయిల్' లో కొంతకాలం పనిచేశారు. రచనలు : ప్రపంచదర్శిని, మాణిక్యం, ఎవరికివారేనా?, ఋణవిముక్తి, తెల్లవారుఝాము పాటలు, మనమతాలు-ప్రవకలు. జననం : 1916 లో.

*సత్యనారాయణ, చిట్టూరి , డాక్టరు ;* కవి, కళాకారుడు, నాటకకర్త, అంతర్జాతీయ ఖ్యాతిగడించిన ఇ.ఎన్.టి. సర్జన్, కత్తినీ, కలాన్నీ, కుంచెనూ, సమర్థవంతంగా వాడగలిగిన సిద్ధహస్తుడు. వీరు తూర్పుగోదావరిజిల్లా పామర్రులో నవంబరు 5, 1914 న జన్మించారు. వీరు భారత స్వాతంత్ర్యోద్యమంలో కూడా పాల్గొన్నారు. చెవి, ముక్కు, గొంతు వ్యాధుల చికిత్సకు సంబంధించి దేశదేశాలలో జరిగిన అనేక సమావేశాలలో, సదస్సుల్లో పాల్గొని, ప్రామాణికమైన పరిశోధనా వ్యాసాల్ని సమర్పించారు. ఎన్నో అంతర్జాతీయ సైంటిఫిక్ సొసైటీలతో వీరికి సంబంధముంది. వీరిరచనల్లో 'జీవితమధురిమ' నాటకం చెప్పుకోదగింది.

*సత్యనారాయణ, మోటూరి :* మేధావి, భాషావేత్త, గాంధేయవాది, హిందీ భాషా ప్రచారకుడు, సంస్కృతిని సాహిత్యంలో మేళవించిన ప్రతిభాశాలి. జననం 1902లో, కృష్ణా జిల్లా, దొండపాడులో. 1920 నుంచి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. దక్షిణ భారత దేశంలో హిందీభాషను ప్రచారం చేసిన వారిలో ప్రముఖులు. దక్షిణభారత్, హిందీ ప్రచార్ సమాచార్ పత్రికలకు సంపాదకులుగాఉన్నారు. తెలుగు భాషాసమితికి వ్యవస్థాపక కార్యదర్శి. కాన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ ఆఫ్ ఇండియాకు 1948-50 లో సభ్యులు. 1952-66 లో రాజ్య సభ సభ్యులు. కేంద్రీయ హిందీ సంస్థకు చైర్మన్‌గా ఉన్నారు. మద్రాసులో 1952-54లో విధానపరిషత్తు సభ్యులు. కేంద్ర ఫిల్మ్ సెన్సార్ బోర్డుకు 1952-62 లో సభ్యులు. అధికార భాషా కమిషన్ సభ్యులు. 1958 లో పద్మశ్రీ, 1962 లో పద్మభూషణ్ ఇచ్చి ప్రభుత్వం వీరిని సన్మానించింది.

*సత్యనారాయణ, విశ్వనాథ :* కవిసామ్రాట్టు, శతాధిక గ్రంథకర్త, విమర్శకుడు, సంస్కృతాంధ్ర భాషలలో పండితుడు, జ్ఞానపీఠ బహుమతిగ్రహీత, ఆంధ్రప్రదేశ్ ఆస్థాన

కవి. జననం 1895 లో, కృష్ణాజిల్లా నందమూరులో. తిక్కన తరవాత గణంలోను, గుణం లోను, శైలిలోను. శిల్పంలోను కవితను తెలుగుతోటగా మలిచిన కవితాకృషీవలులు. కథ, నవల, కావ్యం, నాటకం, సాహిత్య విమర్శ మొదలయిన సాహిత్య ప్రక్రియల ద్వారా తెలుగు సాహిత్యానికి ఎనలేని సాహిత్యసేవలు అందించారు. కొంతకాలం కళాశాల అధ్యాపకులుగానూ, మరికొంతకాలం ప్రిన్సిపాల్‌గానూ పనిచేశారు. వీరి రచనలలో శ్రీమద్రామాయణ కల్పవృక్షం, ఆంధ్రప్రశస్తి, శృంగారవీధి, భ్రమరగీతం, కిన్నెరసానిపాటలు, వేయిపడగలు, ఏకవీర, చెలియలికట్ట, మాబాబు, పునర్జన్మ, స్వర్గానికి నిచ్చెనలు, సముద్రపుదిబ్బ, చిన్నకథలు మొద లయినవి మరువరానివి. 1976 అక్టోబరు 18 న వీరు మరణించారు.

*సరస్వతీదేవి, ఇల్లిందల :* సాంఘిక రాజకీయ రంగాలలో పనిచేస్తూ సాహితీక్షేత్రంలో విశిష్ట స్థానాన్ని ఆక్రమించుకున్న విదుషీమణి, లోక స్వరూప స్వభావాలను గ్రహించిన రచ యిత్రి. మానవత్వమే జీవిత మాధుర్యానికి ప్రధానమనే దృష్టితో ఎన్నో నవలలు, కథలు, వ్యాసాలు వ్రాశారు. జననం : 1915 లో. ఆంధ్రయువతీమండలి స్థాపకుల్లో ఒకరు. అక్క రకు వచ్చిన చుట్టం, ముత్యాలమనస్సు, పండుగ బహుమానం, స్వర్ణకమలాలు మొదలయిన గ్రంథాలు వెలువరించి, పత్రికలలో ఎన్నో వ్యాసాలు వ్రాశారు.

*సర్వేశ్వరరావు, బి. :* సుప్రసిద్ధ అర్థశాస్త్రజ్ఞుడు, విద్యావేత్త, వక్త, గ్రంథకర్త. జననం : 1915 లో పెద్దాపురంలో. అర్థశాస్త్రంలో కేంబ్రిడ్జిలో పిహెచ్. డి. చేసి, చాలా కాలం ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో ఆచార్యులుగా ఉన్నారు. యు. ఎన్. వో నిపుణులుగా బాంకాక్‌లో, ఆర్థిక సలహాదారుగా నైజీరియాలో కొంత కాలం ఉన్నారు. అంతర్జాతీయ సద స్సుల్లో పాల్గొని ఎన్నో ప్రామాణిక పత్రాలను సమర్పించారు. తెలుగులో, ఇంగ్లీషులో పెక్కు గ్రంథాలు వ్రాశారు. ఎన్నో కమిటీలలో సభ్యులుగా ఉన్నవీరు అంతర్జాతీయ ఖ్యాతిని గడిం చారు. నాగార్జున విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా ఉంటున్నారు.

*సాంబమూర్తి, బులుసు :* గాంధీగారి చేత "మహర్షి" బిరుదును పొందిన మహనీయుడు, త్యాగశీలి. జననం : 1886 లో తూర్పుగోదావరిజిల్లా దూళ్లలో. కొంతకాలం న్యాయవాద వృత్తి అవలంబించి,జాతీయోద్యమంలో పాల్గొని, అనిబిసెంట్ హోంరూల్‌లీగ్‌లో పనిచేశారు. అనేక ఉద్యమాలలో పాల్గొన్నారు. 1927 లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్‌సంస్థ అధ్యక్షులుగా ఉన్నారు. 1923 లో నాగపూర్ జండా సత్యాగ్రహంలో పాల్గొని నాయకత్వం వహించారు. హిందూస్తానీ సేవాదళం అధ్యక్షులుగా 1928లో నియమితులయ్యారు. సైమన్ కమిషన్ వ్యతి రేక ఉద్యమంలో పాల్గొని జైలుకెళ్ళారు. 1937 ఎన్నికల్లో కాకినాడ నుంచి మద్రాసు అసెం బ్లీకి ఎన్నికై స్పీకర్‌గా పనిచేశారు. 1958 లో వీరు పరమపదించారు.

*సాంబశివరావు, ఆవుల :* రచయిత, వక్త, మానవతావాది, కళాప్రియుడు, వ్యక్తి న్యాయాన్ని, న్యాయవ్యక్తీకరణను తనవ్యక్తిత్వంలో మలచుకొన్న మాజీప్రధానన్యాయమూర్తి.

జననం 1917 మార్చి 18, తెనాలితాలూకా మూల్పూరులో. ప్రముఖ న్యాయవాది. న్యాయమూర్తి. 1941 లో న్యాయవాదవృత్తి స్వీకరించి, మద్రాసు, ఆంధ్ర, ఆంధ్రప్రదేశ్ హైకోర్టులలో న్యాయవాదిగా ఉన్నారు. 1976-67 లో ప్రభుత్వ న్యాయవాదిగా పనిచేశారు. 1967లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి బాధ్యత చేపట్టి ప్రధాన న్యాయమూర్తిగా పదవీవిరమణ చేశారు. ఆల్ ఇండియా రేషనలిస్ట్స్ అసోసియేషన్ సెక్రటరీగా ఉండి, "రేషనలిస్ట్" అనే పత్రిక ప్రచురించారు. నేషనల్ అసోసియేషన్ ఫర్ ది వెల్ ఫేర్ ఆఫ్ ది బ్లైండ్,ఆంధ్రప్రదేశ్ శాఖకు, ఆలిండియా తెలుగు రైటర్స్ కాన్ఫరెన్స్‌కు ప్రెసిడెంటు. ఆలిండియా సిటిజెన్స్ ఫర్ డెమోక్రసీకి వైస్‌ప్రెసిడెంటు. ఇటీవలఆలిండియాహ్యూమనిస్ట్స్ అసోసియేషన్ ప్రెసిడెంటుగా ఎన్నికయ్యారు. ప్రస్తుతం ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షులు.

**సావిత్రి :** తెలుగు, తమిళ చలనచిత్ర రంగాలలో జ్వాజ్వల్యమానంగా ప్రకాశించిన సాటిలేని మేటి నటీమణి. అశేషాంధ్రులకు, తమిళులకు అభిమానతార. జననం 1937 సెప్టెంబరులో విజయవాడలో. 1950 మే నెలలో చిత్రరంగంలో ప్రవేశించి శతాధిక చిత్రాలలో నటించారు. కేంద్రప్రభుత్వం ఇండోనేషియాకు పంపిన ఫిలిం సుహృద్భావ సంఘంలో వీరు ఒక ప్రతినిధి. వీరు నడిగయేర్ తిలకం, నటీశిరోమణి మొదలైన బిరుదులేగాక, స్వర్ణకంకణం, గజారోహణం, పౌర సన్మానాలవంటి ఎన్నో సన్మానాలు పొందారు.

**సీతాదేవి, వాసిరెడ్డి :** కథా, నవలా ప్రక్రియల్లో బొమ్మా-బొరుసు భేదం లేకుండారాణించి అన్నిరకాల పాఠకుల అభిమానాన్ని పొందిన రచయిత్రి. సాహిత్యానికి ప్రయోజనంఉండాలనీ, తాను వ్రాసే ప్రతిరచనా ఆ ప్రయోజనానికి సాధనంగా ఉండాలనీ, కాల్పనిక సాహిత్య రచన కుటీర పరిశ్రమ కాదనీ విశ్వసించే వీరు 1933 డిసెంబరు 15 న తెనాలితాలూకా చేబ్రోలులో జన్మించారు. ఎం.ఏ. పట్టభద్రులు. అలహాబాదు విశ్వవిద్యాలయం నుంచి సాహిత్యరత్న డిగ్రీ పొంది 1951 నుంచీ రచనలు చేస్తున్నారు. సమత, వైతరణి, మృగతృష్ణ, మట్టిమనిషి, అర్చన మొదలయిన నవలలే కాక, సీతాదేవికథలు, ఆమెలోకం, మిసెస్ కైలాసంమొదలైన కథాసంపుటాలు వీరివి వచ్చాయి. మంచికథలు వ్రాసే అతికొద్దిమంది రచయిత్రులలో వీరిని పేర్కొనవచ్చు. వీరికి రచనావ్యాసంగం పూర్తికాలపుఉద్యోగం కాదు. వేరేప్రభుత్వోద్యోగం ఉంది.

**సీతారామమూర్తి, తుమ్మల :** అభినవ తిక్కన. తెనుగునుడికారపు సొంపువెరిగినకవి. జననం : గుంటూరుజిల్లా కావూరులో 1901 లో. కొంతకాలం వ్యవసాయం, మరికొంతకాలం ఉపాధ్యాయ వృత్తి స్వీకరించారు. జీవితానికి, రచనకు సంబంధముంటేనే, వ్యక్తిత్వం, రచన రాణిస్తాయని వీరి విశ్వాసం. రచనలు : ఆత్మార్పణం, పెద్దకాపు, పరిగపంట, రాష్ట్రగానం, ధర్మజ్యోతి, బాపూజి ఆత్మకథ మొదలైనవి.

**సీతారామరాజు, అల్లూరి :** బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా వీరోచిత పోరాటం సాగించిన అమరవీరుడు, ప్రజాసేవపరాయణుడు, నిష్కామయోగి. జననం : 1897 మే 15, పశ్చిమ

గోదావరిజిల్లా మోగల్లులో. 18 వ ఏట సన్యాసం పుచ్చుకొని, యోగాభ్యాసంచేసి, ఆధ్యాత్మిక శక్తులు సంపాదించారు. అసలుపేరు రామరాజు. అయితే ప్రేమించిన సీత అకాలమరణం కారణంగా ఆమె సంస్మరణార్థం తనపేరును సీతారామరాజుగా మార్చుకోవడం జరిగింది. మన్యం ప్రాంతాలలో గిరిజనుల, సవరుల మధ్య సంచారం చేసి, వారిని ఉత్తేజపరచి, నాయకత్వం వహించి 1922 నుంచీ బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటం సాగించారు. వీరు ప్రదర్శించిన నాయకత్వ లక్షణాలు, ధైర్యసాహసాలు, యుద్ధనైపుణ్యం బ్రిటిష్ అధికారులను దిగ్భ్రాంతులను చేశాయి. ప్రజల పూజలందుకొన్న ఈ విప్లవయోధుడు చివరకు 1924 మే 8 న బ్రిటిష్ వారి తుపాకి గుళ్లకు వీరమరణం పొందారు.

***సీతారామశాస్త్రి, గొల్లపూడి :*** జననం : 1885 లో, గుంటూరుజిల్లా రేపల్లెలో. వందేమాతరం ఉద్యమంలో 1906లో వీరి రాజకీయ జీవితం ప్రారంభమైంది. 1920 లో సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నారు. ఉప్పుసత్యాగ్రహంలో ఒక సంవత్సరం పాటు జైలు కెళ్ళారు. 1952లో ఆంధ్రరాష్ట్రం కోసం 36 రోజులు నిరాహారదీక్ష వహించారు. గుంటూరు జిల్లా కావూరువద్ద వినయాశ్రమాన్ని నెలకొల్పారు. గ్రంథరచయిత. పత్రికారచయిత, హరిజనుల, మహిళల సంక్షేమంకోసం పాటుబడిన వీరు 1960 లో మరణించారు.

*సుందరయ్య, పుచ్చలపల్లి :* మార్క్సిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి. జననం: 1913లో నెల్లూరుజిల్లా, అలగానిపాడులో. ఇంటర్మీడియట్ చదివే రోజుల్లోనే రాజకీయ రంగప్రవేశం చేశారు. సైమన్ కమీషన్ బహిష్కరణోద్యమంలోనూ, ఉప్పుసత్యాగ్రహంలోనూ పాల్గొన్నారు. 1932 లో కమ్యూనిస్టుపార్టీలో చేరి, ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ స్థాపకులలో ఒకరయ్యారు. తెలంగాణా సాయుధ పోరాటంలో పాల్గొన్నారు. 1951 లో రాజ్యసభ సభ్యులై, పార్లమెంటరీ కమ్యూనిస్టు పక్షానికి నాయకత్వం వహించారు. 1955 నుంచి 1967 వరకు ఆంధ్రప్రదేశ్ శాసనసభలో ప్రతిపక్ష నాయకులు. "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అనే గ్రంథాన్ని 1946 లో వ్రాశారు. ఆంధ్రప్రదేశ్ శాసనసభలో మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ వర్గానికి నాయకులు.

***సుబ్బరాయశాస్త్రి, తాతా :*** సంస్కృత పండితుడు, వ్యాకరణాలంకార శాస్త్రజ్ఞుడు, తార్కికుడు, పంతచక్రవర్తి బిరుదాంకితుడు. జననం : 1862లో విజయనగరం దగ్గర ఒంటితాడు అగ్రహారంలో. విజయనగర మహారాజా సంస్కృత కళాశాలలో 40 సంవత్సరాలు ప్రధానాచార్యులుగా పనిచేశారు. అనేక సభలలో, పండిత చర్చలలో పాల్గొని మహామహోపాధ్యాయ బిరుదుపొంది, 'ప్రిన్స్ అఫ్ వేల్స్' సువర్ణకంకణం బహుమతి పొందిన వీరు 1941లో కీర్తిశేషులయ్యారు.

***సుబ్బారావు, కల్లూరి :*** స్వాతంత్ర్యయోధుడు, అకళంక దేశభక్తుడు, రచయిత, వక్త. జననం : 1897 మే 25 న అనంతపురంజిల్లా కల్లూరులో. 1917 నుంచి జాతీయోద్యమంలో

పాల్గొన్నారు. 1919 నుంచి కాంగ్రెస్ పార్టీలో సభ్యులుగా ఉన్నారు దేశ స్వాతంత్ర్యంకోసం ఎంతో సేవచేసి ఎన్నోమార్లు జైలుకి వెళ్ళారు. ఉప్పుసత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాలలో పాల్గొన్నారు. భారతరాజ్యాంగ సభ్యులుగా ఉన్నారు మత సామరస్యంకోసం, కుల నిర్మూలనకోసం పాటుబడ్డారు. 1935 వరకు ఆంధ్రరాష్ట్ర హరిజన సేవక సమాజం సభ్యులుగా ఉన్నారు. రాయలసీమ భారతసేవక సమాజం అధ్యక్షులుగా, మద్రాసు, ఆంధ్రరాష్ట్ర శాసన సభ్యులుగాఉన్నారు. 1967లో "పద్మశ్రీ" వచ్చింది. 1973లో కాలధర్మంచెందారు.

**సుబ్బారావు, కోకా** : ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి, సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి అయిన మొదటి తెలుగు వారు జననం : 1902 జూలై 15 తేదీన. ప్రముఖ న్యాయవాది. 1948-54 సం.లలో మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి. 54-56లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి. 1966-67లో భారతదేశ ప్రధాన న్యాయమూర్తి. 1976 లో కీర్తి శేషులయ్యారు.

**సుబ్బారావు, ఖాసా** : ప్రపంచ ప్రఖ్యాత పత్రికా రచయిత. వ్యక్తియేఒక సంస్థగా జీవించిన మహనీయుడు. జననం : 1896 జనవరి 22న, నెల్లూరులో. ఫిలాసఫీ పట్టభద్రులు. 1918 లో ఉపాధ్యాయులుగా పనిచేశారు. ప్రముఖ పత్రికా సంపాదకులు. స్వాతంత్ర్య సమర యోధులు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 1946 లో 'స్వతంత్ర' అనే స్వంత పత్రిక స్థాపించారు 1956లో 'స్వరాజ్య'ను ప్రారంభించి, జీవితాంతం సంపాదకులుగా ఉన్నారు. 1961 లో కీర్తిశేషులయ్యారు.

**సుబ్బారావు, నాయని** : ఆత్మాశ్రయకవితా నూతన ప్రవాహంలో ఉవ్వెత్తుగాలేచిన మహాతరంగమైన వీరు పొదిలి తాలూకాలో 1899లో జన్మించారు. చాలకాలం ఉపాధ్యాయులుగా పనిచేశారు. వలపు, వేదన, మాతృప్రేమ ఆలంబనగా ఎన్నో కృతులు వ్రాశారు. హైదరాబాద్ రేడియో కేంద్రంలో రచనా ప్రయోక్తలుగా ఉండి కొన్ని రేడియో నాటికలు వ్రాశారు. రచనలు : సౌభద్రుని ప్రణయయాత్ర, ఫలశ్రుతి, మాతృగీతాలు, నాయనిసుబ్బారావు కృతులు మొదలైనవి.

**సుబ్బారావు, రాయప్రోలు** : సాహిత్యకురువృద్ధు, ఆంధ్రాచార్యుడు, కవితాస్రష్ట. 1892 బాపట్లతాలూకా గార్లపాడులో. శాంతినికేతన్‌లో విద్యాభ్యాసం. తెలుగు లెక్చరర్‌గా, కళాశాల ప్రిన్సిపాల్‌గాచేసి, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖకు తొలి అధ్యక్షపదవిని నిర్వహించారు. ఆంధ్ర సారస్వతంలో భావకవిత్వ ఉద్యమప్రారంభకులుగా పేరెన్నికగన్నారు. జడకుచ్చులు, ఆంధ్రావళి తృణకంకణం మొదలైన కావ్యాలు వ్రాశారు. వీరికి కవిభూషణ, సాహిత్య స్థాపక అనే బిరుదులున్నాయి. బహుగ్రంథకర్త.

**సుబ్బారావు, యల్లాప్రగడ** : డాక్టరు. జీవరసాయన శాస్త్రంలో ప్రపంచ ప్రఖ్యాతిచెందిన మహాపురుషుడు. జననం : గోదావరిజిల్లా. మద్రాసు విశ్వ విద్యాలయం నుంచి వైద్యశాస్త్ర

పట్టభద్రులు. లండన్ ట్రాపికల్ స్కూల్ ఆఫ్ మెడిసిన్‌లో డిప్లొమాచేసుకొన్నారు. తరువాత అమెరికావెళ్ళి హార్వర్డ్ యూనివర్సిటీ జీవరసాయన శాస్త్రంలో పి హెచ్. డి. తీసుకొన్నారు. అక్కడే ఫిస్కేగారి వద్ద వీరు చేసిన జీవరసాయన పరిశోధనవల్ల జగత్ప్రసిద్ధులయ్యారు. 1940లో లెడర్లీ కంపెనీలోచేరి 1942లో దానికి డైరెక్టరయ్యారు. ఇక్కడే వీరు రక్తవిజ్ఞానంలో నిష్ణాతులయ్యారు. వీరు కనిపెట్టిన మందులు ఆరియోమైసిన్, ఫోలిక్ ఆసిడ్, ఐసోనికోటినిక్ ఆసిడ్ హైడ్రోజైడ్‌లు. ఇవి బోదకాలు, టైఫాయిడ్, క్షయ, పాండు రోగాలలో వాడబడుతున్నాయి. ఈ మందులు వైద్య శాస్త్రంలో వీరిని చిరస్మరణీయులుగా చేశాయి. వీరు ఆధ్యాత్మిక నిష్ఠగలవారు. వీరు చాలాకాలం క్రితం స్వర్గస్థులయ్యారు.

*సుబ్రహ్మణ్యం, బ్రహ్మజోస్యుల :* జననం : 1895 లో గుంటూరుజిల్లా ఫిరంగిపురంలో. వైద్యశాస్త్రంలో పట్టభద్రులై, రాజమండ్రిలో కొంతకాలం వైద్యవృత్తిని చేపట్టి, ఆ తర్వాత పూర్తిగా రాజకీయాలలో దిగారు 1930 లో ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. తూర్పుగోదావరిజిల్లాలో సీతానగరం వద్ద 1920 లో గౌతమి సత్యాగ్రహ ఆశ్రమాన్ని స్థాపించారు, స్వాతంత్ర్యయోధునిగా జైలుకెళ్ళిన వీరు 1936 లో మరణించారు.

*సుబ్రహ్మణ్యశర్మ, పురాణం :* పత్రికారచనలో, సంపాదకత్వంలో పాఠకులను విశేషంగా ఆకట్టుకొన్న ప్రముఖ కథా, నవలా రచయిత. రచనలోని హాస్యాన్ని జనరంజకంగా మాటల్లో వర్ణించగలవక్త. జననం : 1929లో జన్మించారు. ఎన్నో ఉద్యోగాలుచేసి జీవితంలో చేదును, తీపిని సమపాళ్లలో అనుభవించి ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదకత్వం వహించి అశేషపాఠకులకు విశేషమైన అనుభూతుల్ని అందిస్తున్నారు. ఇల్లుకట్టిచూడు, ఇడియట్, నీలి, సుబ్రహ్మణ్యం కథలు మొదలైన గ్రంథాలు వెలువరించారు.

*సుబ్రహ్మణ్యం, ఎస్.పి.బాల :* తనగానమాధుర్యంతో నిత్యమూ అసంఖ్యాకమైనశ్రోతల్ని ఆనందపరస్తూన్న అపూర్వగానకళా శిరోమణి. అన్ని తరగతులవారినీ, అన్ని వయస్సులవారినీ కమనీయమైన కంఠంతో సర్వజనప్రియంగా రంజింపజేయగల బహుముఖ సంగీత ప్రజ్ఞాశాలి. జననం : 1946 లో నెల్లూరులో. చిన్నతనంలోనే సినిమాలోకంలో ప్రవేశించి, అచిరకాలంలో అమోఘమైన కీర్తిప్రతిష్ఠలను గడించారు. దక్షిణాది భాషలన్నింటిలో కొన్ని వేల పాటలు పాడారు. కొన్నివందల గానకచేరీలు చేశారు. కొన్ని సినిమాలకు సంగీతదర్శకత్వాన్ని వహించారు. విదేశాలను సందర్శించారు. పాత్రధారుల గొంతుకు సరిపడేటటు పాటలు పాడటంలో వీరి ప్రజ్ఞావిశేషం శ్లాఘనీయం.

*సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీపాద :* కవి, నాటకకర్త, నవలాకారుడు, కథారచయిత, పత్రికాధిపతి, భాషాసేవకుడు, సంస్కృతాంధ్రభాషాకోవిదుడు. జననం : 1891 లో తూర్పు గోదావరిజిల్లా పోలమూరులో. మధ్యతరగతి బ్రాహ్మణ, క్షత్రియ కుటుంబాల వ్యవహారాలూ, స్థితిగతులు వీరి రచనల్లో ప్రతిబింబిస్తాయి. రచనలు : రక్షాబంధనం, ఆత్మబలి మొదలైన

నవలలు, ప్రేమపాశం, రాజరాజు మొదలైన నాటకాలు, 13సంపుటాల కథలూ, అనుభవాలూ-జ్ఞాపకాలూ. వీరు 1961 లో స్వర్గస్థులయ్యారు.

*సులోచన, మాదిరెడ్డి :* తెలుగుపాఠలోకం అభిమానాన్ని చూరగొన్న రచయిత్రి. 1936 మార్చి 15 న షంషాబాదులో జన్మించారు. బి. ఎస్సీ., ఎం. ఎడ్ చదివిన వీరు ఉపాధ్యాయ వృత్తి ద్వారా మూడేళ్ళు ఇథియోపియాలో, మూడేళ్ళు జాంబియాలో ఉన్నారు 1965 నుంచి కథలూ, నవలలూ వ్రాస్తున్నారు. దాదాపు ఇప్పటికి యాభై నవలలు వ్రాశారు. తరచూ వార, మాసపత్రికలలో వీరి నవలలు ధారావాహికంగా వస్తుంటాయి; వీరు వ్రాసిన కొన్ని నవలలు సినిమాలుగా వచ్చాయి; రాబోతున్నాయి. సభలూ, సమావేశాల్లో పాల్గొంటూ ఉంటారు. రచనలు : సంధ్య, తరంగాలు, శ్రీమంతులు, నవతరం, సజీవస్మృతులు, తప్పెవరిది ?, అందగాడు మొదలైన నవలలు.

*సులోచనారాణి, యద్దనపూడి :* నేటి పాఠకుల మనస్సుల్ని విశేషంగా ఆకట్టుకొని, తన రచనలకోసం పాఠకులు వేచి ఉండే ఉత్కంఠను కలిగించే నవలారాణి. పాఠకుల ప్రభంజనాన్ని తన వైపుకు తిప్పుకొన్న సుప్రసిద్ధ రచయిత్రి. వీరు ఏప్రిల్ 2, 1940 న కృష్ణా జిల్లా కాజలో జన్మించారు. 1957 నుంచీ రచనలు చేస్తున్నారు. సెక్రటరీ, జీవనతరంగాలు, మీనా, శ్వేతగులాబి, నీరాజనం, ప్రేమలేఖలు, పార్థు మొదలైన నవలలూ, జ్యోతి, ఐలవ్‌యూ సంయుక్త, తెలిసిన విలువలు మొదలైన కథలూ వ్రాసి తెలుగు పాఠకలోకం పరిధిని విస్తృతం చేసి, కాల్పనిక సాహిత్యంద్వారా కనక వర్షాన్ని కురిపించవచ్చుననే సత్యాన్ని నిరూపించారు. ఆంధ్రుల అత్యంతాభిమాన, రచయిత్రి, హెచ్చు డిమాండ్ గల నవలాకారిణి. వీరి నవలలు ఎన్నో వెండితెరపైకి ఎక్కాయి. ఆధునిక నవలాజగత్తులో " కీర్తి కిరీటాలు " ధరించిన నవలా శిరోమణి. వాస్తవంకాని వాస్తవం ద్వారా సామాన్య పాఠకలోకాన్ని ఉర్రూతలూగించి విహరింపజేసే వీరి నవలలు ఏటా వేలకు వేలు అమ్ముడు పోతుంటాయి.

*సుశీల, పి: :* అపూర్వ గాన కళారత్న, సకల జనరంజక భావప్రకటన ద్వారా శ్రోతల్ని మంత్రముగ్ధుల్ని చేయగల సంగీత విదుషీమణి. సంగీత, సాహిత్య, లలితకళలకు నిలయమైన విజయనగరంలో పుట్టిన వీరు పలుభాషల్లో కొన్ని వందల చిత్రాలకు కొన్ని వేల సినిమా పాటల్ని పాడారు. ఎన్నో పాటకచేరీల్లో పాల్గొన్నారు. విదేశ పర్యటన చేశారు. పాటకు పల్లవి ప్రాణమైతే పాటకూ, పల్లవికీ నిలువెల్ల ప్రాణంగా, నవరసాల కలశంగా అద్భుతగాన మాధుర్యాన్ని అందిస్తున్నారు.

*సోమయాజులు, వై. వి. డాక్టరు :* రోదసీ పరిశోధక నిపుణుడు. వీరు 1927 మే లో తూర్పుగోదావరిజిల్లా కాట్రావులపల్లెలో జన్మించారు. 1953 లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు నుంచి డి. ఎస్సీని పొంది, భౌతిక శాస్త్ర శాఖలో కొంతకాలం పనిచేశారు, 1950లో అమెరికా

క్రమాలు నిర్వహిస్తున్నారు. తుంబ, శ్రీహరి కోటనుంచి వీరు అనేక రాకెట్ ప్రయోగాల్లో పాల్గొన్నారు. రెండేళ్ళపాటు "ఆధునిక విజ్ఞానం" అనే శాస్త్రీయ మాసపత్రికను తెలుగులో నడిపారు. అంతరిక్ష పరిశోధన, రాకెట్ ప్రయోగాలు మొదలయినవాటిపై యాభై కి పైచిలుకు ప్రామాణిక పరిశోధన వ్యాసాలు ప్రచురించారు. ప్రస్తుతం వీరు జాతీయ భౌతికప్రయోగశాల న్యూఢిల్లీలో పనిచేస్తున్నారు.

*సోమశేఖరశర్మ, మల్లంపల్లి* : 1891 లో పశ్చిమగోదావరిజిల్లా మినమంచలిపాడు అగ్రహారంలో జన్మించిన వీరు సుప్రసిద్ధ చరిత్ర, సాంస్కృతిక, సాహిత్యపరిశోధకులు. నిరంతర పరిశోధనాజిజ్ఞాసత్ విజ్ఞానాన్ని సముపార్జించుకొని ఎన్నో చారిత్రకగ్రంథాలూ. వ్యాసాలూ వ్రాశారు. 1940-46 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు చరిత్ర పరిశోధక పండిత పదవిని పొందారు. ఆంధ్ర వీరులు, అమరావతీస్తూపం, ఆంధ్ర చరిత్ర సంగ్రహం మొదలయిన గ్రంథాలే కాకుండా కొన్ని నవలలూ, కథలూ, నాటికలూ వ్రాశారు. 1963 లో కీర్తిశేషులయ్యారు.

*హనుమంతరావు, కోపల్లె* : జననం : 1880 లో కృష్ణాజిల్లా చల్లపల్లిలో. మచిలీపట్నంలో న్యాయవాదిగా ప్రాక్టీస్ పెట్టి ఒక సంవత్సరం తరవాత రాజకీయాలలో ప్రవేశించారు. 1907 లో మచిలీపట్నంలో జాతీయ విద్యాసంస్థను ప్రారంభించారు. అదే తరవాత "ఆంధ్ర జతీయ కళాశాల" అయింది. మొదటి ప్రిన్సిపాల్ వీరే. సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 1922 లో మరణించారు.

*హనుమంతరావు, ధనికొండ* : తెలుగు సాహిత్యం, సర్వతోముఖంగా వికసించటానికి దోహదమిచ్చిన ప్రతిభావంతులైన రచయితల్లో వీరు ముఖ్యులు. జననం : 1919లో. పాఠకుల మనస్సు తెలిసిన సుప్రసిద్ధ పత్రికా సంపాదకులు. అభిసారిక, ప్రమోద మొదలయిన పత్రికలకు స్థాపించి, నిర్వహించారు. ప్రింటింగ్ రంగంలో విశేషమైన అనుభవమూ, విజ్ఞానమూ గడించారు. రచనలు : ఇలవేల్పు, లోకచరిత్ర, మగువమనసు, గుడ్డివాడు మొదలయిన నవలలూ, అనాథ, శీలవతి, పున్నాగం మొదలయిన ఓ డజను కథా సంపుటాలూ.

*హనుమంతరావు, మాడపాటి* : తెలంగాణా ఆంధ్రోద్యమ నిర్మాతలలో అగ్రగణ్యులు ఆంధ్రపితామహ బిరుదాంకితులు, రచయిత. జననం : 1885 జనవరి 22 న కృష్ణాజిల్లా పొక్కునూరులో. 1904 నుంచి నిజాం విద్యాశాఖలో గుమాస్తాగా 8 సం॥ పనిచేసి, కొమర్రాజు గ్రంథాలయోద్యమంతో ప్రభావితులై, హనుమకొండలో 1905 లో రాజరాజనరేంద్ర గ్రంథాలయ స్థాపనకు పూనుకొన్నారు. తరువాత న్యాయశాస్త్ర పట్టభద్రులయ్యారు. 1914లో

కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయానికి కార్యదర్శి అయి, దాన్ని అభివృద్ధి చేశారు. హైదరాబాదులో మొట్టమొదట ఒక తెలుగు పాఠశాలను నారాయణగూడాలో స్థాపించారు. రావు బహద్దూర్ వెంకట రామారెడ్డిగారి సహాయంతో మహిళాకళాశాల స్థాపించారు. ఆంధ్ర జన సంఘం నెలకొల్పారు. వెనుకబడిన తరగతుల సంఘాలు ఏర్పరచడమేకాక, నిజాం నిరంకుశత్వాన్ని ఎదుర్కొన్నారు. 1958-64 లో శాసనమండలి చైర్మన్. ప్రభుత్వం 'పద్మభూషణ్' బిరుదునిచ్చి గౌరవించింది. ఉదాహరణ ప్రాయమైన ఆచరణగల వ్యక్తి. ఎన్నో గ్రంథాలు రచించారు. వీరు 1970 లో నవంబరు 11న హైదరాబాదులో స్వర్గస్థులయ్యారు.

*హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి* : కవి, కథకుడు, వ్యాసకర్త, విమర్శకుడు, సంస్కృతాంధ్ర పండితుడు. జననం : 1911లో విశాఖజిల్లా మాడుగులలో. హైస్కూలులో చాలా కాలం ఉపాధ్యాయులుగా పనిచేస్తూ రచన కొనసాగించారు. ఆధునిక కవిత్వం మీదఎన్నో వ్యాసాలు వ్రాశారు. ద్రాక్షారామం, పాటలమంజరి, హనుమచ్ఛాస్త్రికథలు, విజయదశమి మొదలైన గ్రంథాలు వెలువరించారు.

*హరిసర్వోత్తమరావు, గాడిచెర్ల* : గ్రంథాలయోద్యమ నిర్మాతలలో ఒకరు, పత్రికా రచయిత. జననం : 1883 సెప్టెంబర్ 14 న కర్నూలులో. 1907 నుంచి రాజకీయాలలో ఉన్నారు. అనేక స్వాతంత్ర్యోద్యమాలలో చురుగ్గా పాల్గొన్నారు. 1923 లో కాకినాడ కాంగ్రెస్‌కు సహాయ కార్యదర్శిగా పనిచేశారు. 1934 లో భారత హిందూస్తాన్ సేవాదళ్ నాయకుడుగా ఉన్నారు. స్త్రీ సంక్షేమంకోసం "సౌందర్యవల్లి" అనే పత్రికను ప్రారంభించారు. ఆంధ్రపత్రిక, ఆంధ్రగ్రంథమాల, తెలుగు స్వరాజ్య మొదలైన పత్రికలకు సంపాదకత్వం వహించారు. వయోజన విద్యాకేంద్రాలు నడిపారు. ఆంధ్రగ్రంథాలయ ఉద్యమ నాయకుడు. ఎన్నో గ్రంథాలయాల స్థాపనకు విశేషకృషిచేసిన వీరు 1960 లో స్వర్గస్థులయ్యారు.

*హరిశ్చంద్రప్రసాద్, ముళ్ళపూడి* : ప్రముఖపారిశ్రామిక వేత్త. జననం : 1921 లో పశ్చిమగోదావరిజిల్లా తణుకులో. వ్యావసాయిక కుటుంబంలో జన్మించిన వీరు ఇరవైఆరేళ్లకే ఆంధ్రాసుగర్స్ లిమిటెడ్ అనే కంపెనీని స్థాపించారు. స్వాతంత్ర్యోద్యమ సమరంలో పాల్గొన్నారు. మద్రాసురాష్ట్ర శాసనసభ్యులుగా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ్యులుగా ఉన్నారు. శ్రీ అక్కమాంబ టెక్స్‌టైల్స్, శ్రీ సత్యనారాయణ స్పిన్నింగ్ మిల్స్ మొదలైన సంస్థలను స్థాపించారు. కొన్నిసంస్థలకు చైర్మన్‌గా, మరికొన్నిసంస్థలకు మేనేజింగ్‌డైరెక్టరుగా ఉన్నారు. విద్య, వైద్య సంస్థల స్థాపనలో, నిర్వహణలో కూడా వీరు గణనీయమైన పాత్రను నిర్వహించారు. "బెస్ట్‌మేనేజర్" అవార్డు అందుకున్న వీరు, ఆంధ్రప్రదేశ్ వాణిజ్య, పారిశ్రామిక మండలి సమాఖ్యకు అధ్యక్షులుగా 1978-79 లో ఉన్నారు. పారిశ్రామిక, వాణిజ్య పరంగా పెక్కు దేశాలను సందర్శించిన వీరు ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికీకరణకు ఎంతోకృషిచేశారు.

# ఉపయుక్త గ్రంథాలు


ఆంధ్రప్రదేశ్ దర్శిని .... సంపాదకులు శ్రీ ఏటుకూరి బలరామమూర్తి, శ్రీ వై.వి. కృష్ణారావు సంకలన కర్తలు

నూటపదహార్లు .... శ్రీ తాళ్ళూరి నాగేశ్వరరావు, హితశ్రీ

తెలుగు వెలుగు .... ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పంచాయతీ రాజ్య పరిషత్తు, హైదరాబాదు.

తరతరాల తెలుగుజాతి .... శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు, చైర్మన్ ఎగ్జిబిషన్‌కమిటీ, ప్రపంచ తెలుగు మహాసభలు.

ఆంధ్రప్రదేశ్ యువజనసంక్షేమ కార్యకలాపాలు-రెండు దశాబ్దాల ప్రగతి 1956-76 .... యువజన సంక్షేమశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాదు.

ప్రపంచదర్శిని .... శ్రీ కప్పగంతుల సత్యనారాయణ

ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ భూగోళశాస్త్రము .... మల్లపరాజు

విజ్ఞానసర్వస్వము .... తెలుగు భాషాసమితి, హైదరాబాదు.

ఆంధ్రప్రదేశ్-1980 .... డాటా న్యూస్ ఫీచర్స్, హైదరాబాదు.

ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి .... ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందు శేఖరం.

ఆధునికాంధ్ర కవిత్వము, .... సి. నారాయణరెడ్డి.

మరపురాని మనీషి .... తిరుమల రామచంద్ర

ఆంధ్ర వాఙ్మయ చరిత్రము .... దివాకర్ల వేంకటావధాని

ప్రాచీన దక్షిణదేశ చరిత్ర .... నండూరి వేంకట రామకృష్ణమాచార్య.

Data Andhra Pradesh ... Fortnightly. Data News Features. Hyderabad.

A.P. Year Book 1980 .. Data News Features, Hyderabad.

Hand Book of Statistics on Cooperative Movement in Andhra Pradesh: 1975-76. ... Registrar of Co-op Societies Govt. of A.P., Hyderabad.

Third Annual Report 1979-80 .. A.P. State Meat And Poultry Development Corporation Ltd Hyderabad.

Irrigation in Andhra Pradesh Present Status And Future Strategy, October, 1979. ... J.Raja Rao, Chief Engineer, Major Irrigation And General. Govt. of A.P.,Hyderabad.

Brief Note on youth welfare Porgrammes of Directorate of Youth Services ... The Director of Sports And Youth Services.

20 years of Andhra Pradesh Women And Child Welfare (A Profile) ... Department of Woman And Child Welfare. Govt,. of A.P. Hyderabad.

| | | |
|---|---|---|
| Policy Note on Demand No. XXIX Women And Child Welfare 1980-81 | .. | Minister for Tourism, Women And Child Welfare. |
| Welfare of Backward Classes | .. | The Department of Backward Classes, Govt. ofA.P. |
| Note on Demand No. XXVII Social Welfare 1980–81 | ... | Minister for Housing And Harijan Welfare |
| Performance Budget 1980-81 Department of Harijan Welfare- | ... | - do - |
| Note on Demand No XXVIII Tribal Welfare 1980-81 | ... | Minister for Tribal Welfare, Commerce And Export Promotion. |
| Tribal Welfare Activittes | .. | Tribal Welfare Department Govt of A.P. Hyderabad. |
| Tribal Welfare Activitics, March 1978 | ... | - do - |
| Note on A.P. State Trading Corporation Ltd, Hyd., & Administrative Report | .. | A.P. State Trading Corporation Ltd, Hyderabad. |
| Annual Administrative Report of Marketing Department for 1978–79. | ... | Marketing Department, Govt of A.P. Hyderabad. |
| Report of the Second EducationalSurvey in Andhra Pradesh 1978-1979 | ... | G. Manohar Rao, State Educational Survey officer, A.P. |
| Report of the Special Committee For Basic Education, Andhra Pradesh-1961 | ... | The Education Department, A.P. Hyderabad. |
| Andhra Pradesh State Electricity Board Administration Report 1977-78 | ... | the APSE Board, Hyderabad. |
| Note on A.P. Minor Ports – March Ahead. | ... | Director of State Ports, Andhra Pradesh, Kakinada. |
| Five Year Plan 1978–83 Andhra Pradesh Draft outline Vol I | ... | Finance And Planning Depart ment. Govt of A.P. Hyd., |
| INDIA — 1979 A Refeience Annual 1979 | ... | Complied by The Research And Reference Divisions, Ministry of Information And Broadcasting. Govt. of India |
| Govt of A. P. Labour Department Administrative Report For the Financial year 1978–79 Labour Bulletin A.P. Jan-March 1978, April-June '78 July-Sept 1978, Oct-Dec '78 | ... | Commissioner of Labour Andhra Pradesh Hyderabad. |
| Andhra Pradesh State Administration Report 1973-74 | ... | General Administration Dept. Govt. of A.P. |
| Andhra Pradesh Changing Horizons | ... | Data News Features, Hyd., A.T.A. Learmonth |

# అనుబంధము

## శ్రీకాకుళం జిల్లా

విస్తీర్ణం : 9,743 చ.కి.మీ.
జనాభా : 1971 నాటికి 25.9 లక్షలు
పురుషులు 12.8 లక్షలు, స్త్రీలు 13.1 లక్షలు
జనసాంద్రత : చ. కి. మీ కి. 266 మంది.
ముఖ్యకేంద్రం : శ్రీకాకుళం

పూర్వం ఈ జిల్లా కళింగరాజ్యంలో అంతర్భాగం. ఆ తరవాత శాతవాహనుల పరిపాలన కిందికి వచ్చింది. శాతవాహనులతరవాత అనేకవంశాల వారిపాలనలో ఉంది. 1753 లో ఫ్రెంచివారికి దక్కింది. 1758వందువ్రి పోరాటంలో ఇది ఇంగ్లీషువారి పరిపాలన కిందికి వచ్చింది.

*భౌగోళిక స్వరూపం :* ఈ జిల్లా ఏజెన్సీ ప్రాంతం, తీరమైదానం అని రెండు భాగాలుగా విభజింపబడింది. పాలకొండ, సాలూరు, పాతపట్నం, సోంపేట తాలూకాలలో కొండప్రాంతాలు ఏజెన్సీప్రాంతాలు. ఇచ్ఛాపురం, సోంపేట, శ్రీకాకుళం మొదలైన తాలూకాలు తీరప్రాంతాలు.

*శీతోష్ణస్థితి, వర్షపాతం :* వేసవిలో ఎండలు ఎక్కువ; శీతాకాలంలో చలిఎక్కువ. శ్రీకాకుళం, సోంపేట, ఇచ్ఛాపురం తాలూకాలలో సమశీతోష్ణస్థితి. దైనిక సరాసరి ఉష్ణోగ్రత 31° ; కనిష్ఠ ఉష్ణోగ్రత 23.3°C. సంవత్సరంలో అత్యధిక ఉష్ణోగ్రత 38 3°C.

నైరుతి, ఈశాన్యఋతుపవనాలవల్ల వర్షాలుపడతాయి. సగటువర్షపాతం 1,106.7మి.మీ.

*నదులు :* ముఖ్యమైనవి వంశధార, నాగావళి. ఇవికాక స్వర్ణముఖి, మహేంద్రతనయ, బాహుద, వేదవతి ఉన్నాయి.

*అడవులు :* జిల్లాలో 15.6 శాతం, అంటే 1,50,941 హెక్టార్లు అడవులు. సాలూరు అడవులలో కలప, టెక్కలి అడవులలో వంటచెరుకు, సోంపేట తాలూకా సముద్ర తీరాన కొబ్బరి, జీడిమామిడి లభిస్తాయి.

*ఖనిజసంపద :* చీపురుపల్లి తాలూకాలో మాంగనీసు, వంశధార, నాగావళి తీరాన ఇల్మనైట్-మోనజైట్ ఇసక ఉన్నాయి. ఇవికాక ఈ జిల్లాలో క్లే, గ్రాఫైట్ లభిస్తాయి.

*వ్యవసాయం, పంటలు :* 1974-75 లో నికరపంటభూమి 46.4% (4,48,866 హెక్టార్లు.) దీనిలో సేటిపారుదల గల భూమి 45.2 శాతం. ఆహారపంటలు జిల్లాలో సాగయ్యే భూమిలో 72.2 శాతంలోను, ఆహారేతర పంటలు 27.8 శాతంలోను పండిస్తున్నారు. ఆహార పంటలలో వరి, వ్యాపారపంటలలో వేరుసెనగ, నువ్వులు, పండ్లతోటలలో మామిడి, అరటి, జీడిమామిడి ముఖ్యమైనవి.

వెన్నెలవలసలలో విత్తనాల తయారీ కేంద్రాలు ఉన్నాయి. ఆముదాలవలసలో మెస్తా పరిశోధన

కేంద్రం, బొబ్బిలిలో చెరుకు ఉత్పత్తి పరిశోధనా కేంద్రం ఉన్నాయి.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* కాలువలద్వారా 68,100 హెక్టార్లు, గొట్టపు బావుల ద్వారా 909 హెక్టార్లు, చెరువులద్వారా 1,34,506 హెక్టార్లు, ఇతర బావుల ద్వారా 10,543 హెక్టార్లు, ఇంజన్లద్వారా 6,086 హెక్టార్ల భూమి సాగవుతున్నది. (1974-75 లెక్కల ప్రకారం) వంశధారనదిపై నేరడివద్ద మేజర్ ఇరిగేషన్ ప్రాజెక్టు వల్ల 12,000 హెక్టార్లను నీటివసతి కలుగుతుందని అంచనా. 1975 నాటికి విద్యుచ్ఛక్తి సౌకర్యంగల గ్రామాలు 615, నగరాలు 16.

*పరిశ్రమలు :* పారిశ్రామికంగా వెనకబడిన జిల్లా. గరివిడి వద్ద ఫెర్రో మాంగనీస్ ఫాక్టరీ ఉంది. జిల్లాలో 3 పంచదార మిల్లులు ఆముదాలవలస, సీతానగరం, బొబ్బిలిలో ఉన్నాయి. బొబ్బిలిలో పురికొస తయారు చేసే పరిశ్రమ, బారువలో కొబ్బరితాళ్ళ పరిశ్రమ ఉన్నాయి. ఆం. ప్ర. తోళ్ళపరిశ్రమ అభివృద్ధి సంస్థ ఆధ్వర్యంలో తోళ్ళవస్తువులు తయారు చేసే పరిశ్రమలు, పలాసలో 13 జీడిపప్పు పరిశ్రమలు, నౌపడలో ఉప్పుకొటారులు ఉన్నాయి. ఇవికాక ధాన్యం, నూనె, రంపకోత మిల్లులు జిల్లాలోని నగరాలలో ఉన్నాయి. శ్రీకాకుళంలో కంచు, రాగి పాత్రలు తయారవుతాయి. 1971 సర్వే ప్రకారం జిల్లాలో 44 పరిశ్రమలు 10.15 కోట్ల మూలధనంతో, 5,491 మంది పనివారితో ఉన్నాయి. చేతివృత్తులలో చెప్ప దగినది చేనేత పరిశ్రమ. పొందూరు ఖద్దరు వస్త్రాలు ప్రసిద్ధి చెందినవి.

*మునిసిపాలిటీలు :* 4-బొబ్బిలి, పార్వతీపురం, సాలూరు, శ్రీకాకుళం.

*రెవిన్యూ డివిజన్లు :* 3-టెక్కలి, శ్రీకాకుళం, పార్వతీపురం.

*తాలూకాలు :* 11-బొబ్బిలి, చీపురుపల్లి, ఇచ్ఛాపురం, నరసన్నపేట, పాలకొండ, పార్వతీపురం, పాతపట్నం, సాలూరు, సోంపేట, శ్రీకాకుళం, టెక్కలి.

*పంచాయతీ సమితులు:* 24; *గ్రామాలు:* 3080; *గ్రామపంచాయతీలు :* 1,444.

*రవాణా :* 1975 నాటికి పి.డబ్ల్యు.డి. ఆధ్వర్యంలో 1,113 కి. మీ. పొడవు రోడ్లు ఉన్నాయి. జిల్లాలో ఆగ్నేయరైల్వే వారికి చెందిన 236 కి. మీ. బ్రాడ్‌గేజ్, 33 కి. మీ. నారోగేజ్ రైలు మార్గాలు ఉన్నాయి.

*సహకారసంఘాలు :* 1975 నాటికి మొత్తం సహకారసంఘాలు 1,833. వీటిలో సహకార పరపతి సంఘాలు 1,561, చేనేత సంఘాలు 72, పారిశ్రామిక సంఘాలు 107, బెస్తలసంఘాలు 72, పాలసరఫరా సంఘాలు 21.

*విద్య :* అక్షరాస్యులు 18.5 శాతం. జిల్లాలో 1977-78 నాటికి 3,043 ప్రాథమిక పాఠశాలలు, 196 మాధ్యమిక పాఠశాలలు, 146 ఉన్నత పాఠశాలలు ఉన్నాయి. 1975-76 నాటికి జిల్లాలో 15 జూనియర్ కళాశాలలు, 3 డిగ్రీ కళాశాలలు ఉన్నాయి.

*వైద్యం :* 1977-78 నాటికి జిల్లాలో 671 పడకలు గల 76 ఆస్పత్రులు ఉన్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* శ్రీకూర్మం, అరసవల్లి సూర్యనారాయణదేవాలయం, బొబ్బిలి, మహేంద్రగిరి మొదలైనవి.

*శాసనసభ నియోజకవర్గాలు :* 18-ఇచ్ఛాపురం, సోంపేట, టెక్కలి, హరిశ్చంద్రపురం, నరసన్నపేట, పాతపట్నం, కొత్తూరు, నాగూరు, పార్వతీపురం, సాలూరు, బొబ్బిలి, తెర్లామ్, ఉణుకూరు, పాలకొండ, ఆముదాలవలస, శ్రీకాకుళం, ఎచ్చెర్ల, చీపురుపల్లి.

*లోక్‌సభ నియోజకవర్గాలు :* 3-శ్రీకాకుళం, పార్వతీపురం, బొబ్బిలి.

*ఈ జిల్లాలో 1977–78 నాటికి ఉన్న*

| | | |
|---|---|---|
| ప్రింటింగ్ ప్రెస్‌లు | : | 30 |
| బ్యాంక్ ఆఫీసులు (1-1-80) | : | 68 |
| షెడ్యూల్డ్‌కులాల, వెనకబడినవర్గాలవారికి ఇళ్లస్థలాలపంపకం | : | 4246 |
| షెడ్యూల్డ్‌కులాల విద్యార్థులకు హాస్టళ్ళు | : | 54 |
| షెడ్యూల్డ్ తెగలవారికి హాస్టళ్ళు | : | 16 |
| మార్కెట్ కమిటీలు | : | 10 |
| పోస్టాఫీసులు (31-3-79) | : | 757 |
| టెలిగ్రాఫ్ ఆఫీసులు | : | 46 |
| టెలిఫోన్ ఎక్ఛేంజ్‌లు | : | 36 |
| పబ్లిక్ కాల్ ఆఫీసులు | : | 175 |

## విశాఖపట్నం జిల్లా

విస్తీర్ణం : 13,739 చ. కి. మీ.
జనాభా : 1971 లో 28 లక్షలు
పురుషులు 14 లక్షల మంది, స్త్రీలు 14 లక్షల మంది.
జనసాంద్రత : చ. కి. మీ. కి 204 మంది.
ముఖ్యకేంద్రం : విశాఖపట్నం.

పూర్వపు విశాఖపట్నం జిల్లాను 1950 ఆగస్టు 15 న శ్రీకాకుళం, విశాఖపట్నం అనే రెండు జిల్లాలుగా విభజించారు. స్వాతంత్ర్య పోరాట చరిత్రలో ఈ జిల్లా ప్రసిద్ధి పొందింది. 1845 లో గోల్కొండ ఏజన్సీ ప్రజలు ఇంగ్లీషువారికి వ్యతిరేకంగాజరిపిన గెరిల్లాపోరాటాలు, 1879 లో జరిపిన రంప తిరుగుబాటు, 1922 లో జరిగిన సవర్ణవిప్లవం, 1922 లో అల్లూరి సీతారామరాజు నాయకత్వంలో జరిగిన మన్యం ప్రజల తిరుగుబాటు సుప్రసిద్ధమైనవి.

*భౌగోళిక స్వరూపం :* జిల్లాలో ఏజన్సీప్రాంతం, మైదానప్రాంతం అని రెండు భాగాలున్నాయి. పాడేరు, నర్సీపట్నం, శృంగవరపు కోట, చింతపల్లె తాలూకాలలో కొంతభాగం తూర్పుకనుమలతో, కొండలతో, గుట్టలతో నిండి ఏజన్సీప్రాంతంగా పరిగణించబడుతోంది. తక్కిన ప్రాంతం ఉప్పుమళ్ళతో, రొంపిమళ్ళతోను ఉన్న మైదాన ప్రాంతం. ఉత్తరాన ఒరిస్సారాష్ట్రం, శ్రీకాకుళం జిల్లా, దక్షిణాన తూర్పుగోదావరి జిల్లా, పడమట

ఒరిస్సారాష్ట్రం, తూర్పున బంగాళాఖాతం ఈ జిల్లా సరిహద్దులు.

*శీతోష్ణస్థితి, వర్షపాతం :* కొండలపైన చల్లగా ఉంటుంది. వేసవిలో ఎండలు ఎక్కువ. దైనిక సగటు ఉష్ణోగ్రత 24°C. సంవత్సరంలో గరిష్ఠ ఉష్ణోగ్రత 44°C. కనిష్ఠ ఉష్ణోగ్రత 14.4°C. నైరుతీ ఋతుపవనాలవల్ల ఏజన్సీ ప్రాంతంలో ఎక్కువ వర్షపాతం. వర్షం కురిసే సగటు రోజులు 65. సగటు వర్షపాతం 1,048.6 మి. మీ.

*నదులు :* ముఖ్యమైనవి మాచ్‌ఖండ్, శారద, చంపావతి, వరాహ, గోస్థని, మహేంద్రగడ్డ, సరుగుడుగడ్డ, తాండవ నదులు. మాచ్‌ఖండ్‌నదికి 'డుడుమా' అనేచోట జలపాతం ఉంది. దీనినుంచి జలవిద్యుత్తు ఉత్పత్తి చేస్తారు.

*అడవులు :* 1974-75 లెక్కలప్రకారం జిల్లాలో 36 4 శాతం, అంటే 5,02,630 హెక్టార్లు. మేలురకం కలప, వెదురు లభ్యమవుతాయి. చిరుత పులులకు ప్రసిద్ధి.

*ఖనిజసంపద :* గ్రాఫైట్, సున్నపురాయి, మాంగనీస్, బాక్సైట్ మినరల్‌శాండ్, ఇనుప ఖనిజం, వెర్మిక్యులైట్ ముఖ్యమైనవి.

*వ్యవసాయం :* 1974-75 లెక్కల ప్రకారం నికర పంటభూమి 27.8 శాతం (3,84,047 హెక్టార్లు). ఆహారపంటలలో వరి, సజ్జ, వ్యాపారపంటలలో వేరుసెనగ, నూనెగింజలు, చెరుకు, తోటలలో మామిడి, జీడి ముఖ్యమైనవి. పంటభూమిలో 77.5 శాతంలో ఆహారపంటలు, 22.5 శాతంలో ఆహారేతర పంటలు పండిస్తున్నారు. అనకాపల్లిలో చెరుకు, వరి పంటల పరిశోధన కేంద్రం, గ్రామసేవకులకు వ్యవసాయంలో శిక్షణనిచ్చే ప్రాథమిక వ్యవసాయ పాఠశాల ఉన్నాయి.

*నీటిపారుదల, విద్యుచ్ఛక్తి :* 1974–75 లెక్కల ప్రకారం కాలువల ద్వారా 43,824 హెక్టార్లు, గొట్టపు బావుల ద్వారా 3,842 హెక్టార్లు, చెరువుల ద్వారా 95,439 హెక్టార్లు, ఇతర బావుల ద్వారా 19,671 హెక్టార్లు, ఇంజన్లద్వారా 12,452 హెక్టార్ల భూమి ఈ జిల్లాలో సాగవుతున్నది. మొత్తం నీటిపారుదలసౌకర్యం గలభూమి 1,75,228 హెక్టార్లు. ఇది మొత్తం పంటభూమిలో 36.4 శాతం. 1975 మార్చి నాటికి విద్యుత్ సౌకర్యం గల గ్రామాలు 447, నగరాలు 15.

*పరిశ్రమలు :* హైదరాబాదు తరవాత విశాఖపట్నమే కేంద్రరంగ పరిశ్రమలకు నిలయం. హిందూస్థాన్ షిప్‌యార్డ్, భారత్ హెవీ ప్లేట్స్ అండ్ వెసల్స్, కాల్‌టెక్స్‌ఆయిల్ రిఫైనరీ, రోలింగ్ స్టీల్ మిల్లు, ఆక్సిజన్, స్విచ్ గేర్లు, ట్రాన్స్‌ఫార్మర్ల తయారీ పరిశ్రమలు, కోరమాండల్ ఎరువుల కర్మాగారం, 4 చక్కెర ఫాక్టరీలు, సర్వారాయ టెక్స్‌టైల్స్ లిమిటెడ్ ఈ జిల్లాలోని భారీపరిశ్రమలు. ఇవి కాక రెండు జనపనార మిల్లులు, 3 నేతమిల్లులు, 6 టానరీలు, తీరప్రాంతంలో 6 ఉప్పుఫాక్టరీలు, జిల్లా అంతటా రైస్ మిల్లులు, రంపకోత మిల్లులు, అనేక చిన్న తరహా పరిశ్రమలు ఉన్నాయి, పెద్ద ఉక్కు ఫాక్టరి నిర్మాణంలో ఉంది. పవర్ ఆల్కహాల్ తయారవుతుంది. జనపనార పరిశ్రమలో రాష్ట్రంలో ఈ జిల్లాది ప్రథమ స్థానం. బెల్లం ఉత్పత్తిలో దేశంలో అనకాపల్లిది 3 వ స్థానం. 1971 సర్వేప్రకారం 55 యూనిట్లు 90.02 కోట్ల ఉత్పత్తి మూలధనంతో, 1,58,965 మంది

ఉద్యోగులతో ఉన్నాయి. ఈ జిల్లాలో అనేక భారీ, మధ్యతరహా, చిన్నతరహా పరిశ్రమలు నెలకొల్పే పథకాలున్నాయి 600 ఎకరాలలో ఇందిరాగాంధీ జూలాజికల్ పార్కులో దేశంలోని తొలి మెరీన్ లాండ్ కాంప్లెక్సు ఏర్పాటు చేస్తున్నారు. ఇరిగేషన్ మాస్టర్ ప్లాన్, రాయవాడ రిజర్వాయర్ ప్రాజెక్టు పథకాలున్నాయి.

ఈజిల్లా చేతివృత్తులలో దంతాలు, కొమ్ములతో చేసే వస్తువుల తయారీ ముఖ్యమైనది.

*సహకార సంఘాలు :* మొత్తం 1,200. వీటిలో సహకారసంఘాల సొసైటీలు960, చేనేత 39, పారిశ్రామికసంఘాలు 112, బెస్తల సంఘాలు 39, పాలసరఫరా సంఘాలు 50.

*రవాణా :* విమానాశ్రయం విశాఖపట్నంలో ఉంది. ఆగ్నేయరైల్వే కింద 110 కి. మీ., దక్షిణమధ్య రైల్వే కింద 84 కి మీ పొడవుగల రైలుమార్గం ఈ జిల్లాలో ఉంది. కొత్తగా వేసిన డి. బి కె. రైలుమార్గం ఓడరేవుతో కలుపబడింది. జపాను దేశానికి ఎగుమతి అయ్యే ముడి ఇనుము దీనిద్వారా చేరవేయబడుతుంది. విశాఖపట్నం ఓడరేవు ఔటర్ హార్బర్‌తో దేశమంతటి ఆధునికమైన ఓడ రేవు అయి, దేశం ఎగుమతి, దిగుమతులలో ప్రాధాన్యం వహిస్తోంది.

*మునిసిపాలిటీలు :* 4-అనకాపల్లి, భీమునిపట్నం, విజయనగరం, విశాఖపట్నం.

*రెవిన్యూ డివిజన్లు :* 3-నర్సీపట్నం, విశాఖపట్నం, విజయనగరం.

*తాలూకాలు :* 11-అనకాపల్లి, భీమునిపట్నం, చింతపల్లి, చోడవరం, గజపతినగరం, నర్సీపట్నం, పాడేరు, శృంగవరపుకోట, విశాఖపట్నం, విజయనగరం, యలమంచిలి.

*గ్రామాలు*: 4,888; *గ్రామపంచాయతీలు*: 1,258 (1972-73 లెక్కల ప్రకారం)
*పంచాయతీసమితులు* : 25.

*విద్య :* అక్షరాస్యుల శాతం 21.33. ఈ జిల్లాలో 2,400 ప్రాథమికపాఠశాలలు, 190 మాధ్యమిక పాఠశాలలు, 107 ఉన్నత పాఠశాలలు, ఇవికాక, 11 బాలికల ఉన్నత పాఠశాలలు ఉన్నాయి. విశాఖపట్నంలో ఆంధ్రవిశ్వవిద్యాలయం ఉంది. గవర్నమెంటు పాలిటెక్నిక్, ఇండస్ట్రియల్ ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూట్ ఉన్నాయి, ఈ జిల్లాలో 12 జూనియర్ కళాశాలలు, 6 డిగ్రీ కళాశాలలు, ఒక ఉపాధ్యాయ శిక్షణ సంస్థ ఉన్నాయి.

*వైద్యం :* 1977-78 లెక్కల ప్రకారం 129 ఆస్పత్రులు ఈజిల్లాలో ఉన్నాయి.

*దర్శించదగ్గ ప్రదేశాలు :* విశాఖపట్నం, భీమునిపట్నం, అరకులోయ, సింహాచలం వరాహనరసింహస్వామి దేవాలయం, మాచ్‌ఖండ్ ప్రాజెక్ట్, హిందూస్థాన్ షిప్‌యార్డ్ కాంప్లెక్స్ మొదలైనవి.

*శాసనసభ నియోజకవర్గాలు :* 19–గజపతినగరం, విజయనగరం, సత్తివేడు, భోగాపురం, భీమునిపట్నం, విశాఖపట్నం-I, విశాఖపట్నం-II, పెందుర్తి, ఉత్తరాపల్లి శృంగవరపుకోట, పాడేరు, మాడుగుల, చోడవరం, అనకాపల్లి, పరవాడ, యలమంచిలి పాయకరావుపేట, నర్సీపట్నం. చింతపల్లి.

*లోక్‌సభ నియోజకవర్గాలు :* 2-విశాఖపట్నం, అనకాపల్లి.

